ప్రపంచ కార్మికులారా, ఏకముకండి!

# వి. ఐ. లెనిన్

# మార్క్స
# ఎంగెల్స
# మార్క్సిజం



"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

## ప్రకాశకుని వివరణ

ఈ కూర్పులో పొందుపరచబడిన లెనిన్ రచనల సంకలనం "మార్క్స్—ఎంగెల్స్—మార్క్సిజం" చిట్టచివరి రష్యన్ కూర్పును (గోస్‌పొలిట్‌ఇజ్‌దాత్, మాస్కో 1946) అనుసరించింది. సి.పి.ఎస్.యు. సెంట్రల్ కమిటీవారి మార్క్సిజం-లెనినిజం ఇన్‌స్టిట్యూట్‌చే తయారు చేయబడిన లెనిన్ రచనలు, నాల్గవ రష్యన్ కూర్పుతో ఈ అనువాదం సరిచూడబడింది.

**В. И. ЛЕНИН**

МАРКС ЭНГЕЛЬС МАРКСИЗМ

*На языке телугу*

D

# విషయసూచిక



1*

# కారల్ మార్క్స

## (మార్క్సిజం వివరణ సహితమైన మార్క్స్ సంక్షిప్త జీవిత సంగ్రహం)

కారల్ మార్క్స 1818 మే 5వ తేదీన ప్రష్యాదేశానికి చెందిన రైన్‌రాష్ట్రంలోని ట్రీయర్ పట్నంలో జన్మించాడు. అతని తండ్రి న్యాయవాది; పుట్టుకతో యూదు మతస్థుడైనా 1824 లో అతడు ప్రొటస్టెంటు మతం పుచ్చుకున్నాడు. సంస్కృతి కలిగిన సంపన్న కుటుంబం, కాగా విప్లవంపట్ల ఏమాత్రమూ అభిమానం వున్న కుటుంబం కాదు. ట్రీయర్ పట్నంలో ఉన్నత పాఠశాలలో చదువు పూర్తిచేసుకుని మార్క్స మొదట బొన్న్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించి, ఆతరువాత బెర్లిన్ విశ్వవిద్యాలయానికి మార్చుకొని, అక్కడ న్యాయశాస్త్రాన్నీ, అయినప్పటికీ ముఖ్యంగా చరిత్రనీ తత్వశాస్త్రాన్నీ అధ్యయనం చేశాడు. అతడు 1841 లో తన అధ్యయనాన్ని ముగించి, ఎపిక్యూరస్ తత్వసిద్ధాంతంపైన స్నాతక వ్యాసాన్ని విశ్వవిద్యాలయానికి సమర్పించాడు. తన అభిప్రాయాలనుబట్టి ఆ రోజుల్లో అతను హేగెల్ భావవాది. అతడు బెర్లిన్‌లో వున్నప్పుడు, హేగెల్ తత్వశాస్త్రంనుండి నాస్తిక విప్లవభావ సారాంశాలను గ్రహించడానికి ప్రయత్నించిన "వామపక్షపు హేగెల్‌వాదుల" (బ్రూనో బౌవర్, తదితరులు) సర్కిల్‌లో చేరాడు.

విశ్వవిద్యాలయాన్ని పూర్తిచేసిన తరువాత, ఉత్తరోత్తర తనకు ప్రొఫెసర్ ఉద్యోగం దొరుకుతుందనే ఆశతో మార్క్స తన నివాసాన్ని బొన్న్ పట్టణానికి మార్చుకున్నాడు. కాని ప్రభుత్వం అవలంబించుతూన్న అభివృద్ధి నిరోధక విధానాలను — 1832 లో లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్‌ను ప్రధానాచార్య పదవినుండి తొలగించి, 1836 లో అతనిని ఏకంగా విశ్వవిద్యాలయం నుండే బర్తరఫు చేసినట్టిన్నీ, 1841 లో యువక ప్రొఫెసర్ బ్రూనో బౌవర్‌ను బొన్న్ విశ్వవిద్యాలయంలో ఉపన్యాసాలనివ్వకుండా ఉత్తరవు జారీచేసినట్టిన్నీ విధానాలను — గమనించి విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా తన జీవితాన్ని గడుపుదామనే ఉద్దేశాన్ని అతడు వదులుకోవలసి వచ్చింది. ఆ రోజుల్లో జర్మనీలో వామపక్షపు హేగెల్‌వాదుల అభిప్రాయాలు అతిత్వరిత గతిని అభివృద్ధి పొందాయి. లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్, ముఖ్యంగా 1836 తరువాత, మీమాంస

శాస్త్రాన్ని విమర్శించడం ప్రారంభించి, ఇక భౌతికవాదాన్ని సమర్థించడం మొదలుపెట్టాడు, 1841 నాటికల్లా అతని తత్వసిద్ధాంతంలో భౌతికవాదానిదే పూర్తిగా పైచేయి అయింది ("క్రిస్టియను మతసారం" అనే అతని గ్రంథం); అతను రచించిన "భవిష్యత్ తత్వశాస్త్ర సూత్రాలు" అనే గ్రంథం 1843 లో వెలువడింది. ఈ గ్రంథాలు "మనస్సుపై కలిగించే స్వేచ్ఛా ప్రభావాన్ని ఎవరి మటుకు వారు స్వయంగా అనుభవించాల్సిందే" అని ఆ గ్రంథాల గురించి తరువాత రాశాడు ఎంగెల్స్. "మేము" (అనగా, మార్క్సుతో సహా వామపక్షపు హెగెల్ వాదులు) "తక్షణమే ఫాయెర్‌బాఖ్ వాదులం అయిపోయాం" అని రాశాడు ఎంగెల్స్. ఆ రోజుల్లోనే, వామపక్షపు హెగెల్ వాదులతో కొన్ని విషయాలలో ఏకీభవించే రైన్‌రాష్ట్రపు బూర్జువా వర్గంలో అతివాద భావాలను కలిగిన కొందరు వ్యక్తులు కొలోన్ పట్నంలో "రైనిషె సైటుంగ్" అనే పేరుతో ప్రతిపక్షపు పత్రిక నొకదానిని స్థాపించారు (పత్రిక మొదటి సంచిక 1842 జనవరి 1 వ తేదీన వెలువడింది). పత్రికకు ప్రధానరచయితలుగా వుండమని మార్క్సునూ బ్రూనో బౌవర్‌నూ పత్రికవారు ఆహ్వానించారు; 1842 అక్టోబరులో ఆ పత్రికకు మార్క్స ప్రధాన సంపాదకుడుగా నియమితుడవడం కారణంగా అతను తన నివాసాన్ని బొన్నునుండి కలోన్‌కు మార్చుకున్నాడు. మార్క్స సంపాదకత్వంకింద ఆ పత్రిక విప్లవ ప్రజాస్వామ్య ధోరణి నానాటికి మరింత ప్రస్ఫుటంగా ద్యోతకం కాజొచ్చింది; దానితో ప్రభుత్వం ఆ పత్రికను మొదట, రెండు స్థాయిలలో సెన్సారు పరిశీలనకూ, తరువాత మూడు స్థాయిలలో సెన్సారు పరిశీలనకూ లోనుగావించి, ఆతరువాత, 1843 జనవరి 1 వ తేదీన ఏకంగా పత్రికను నిషేధించడానికే ప్రభుత్వం నిశ్చయించుకుంది. ఆ తేదీకి ముందే తన సంపాదకత్వానికి మార్క్స రాజీనామా ఇచ్చినప్పటికీ, పత్రికను అదేమీ రక్షించలేకపోయింది. చివరకు 1843 మార్చిలో పత్రిక ఆగిపోయింది. "రైనిషె సైటుంగ్" పత్రికకు మార్క్స రాసిన ప్రధాన వ్యాసాల్లో దిగువ (చూ. గ్రంథ వివరణ పట్టిక[1]) వివరించినవే కాకుండా, మొస్సెల్ లోయలో ద్రాక్ష పంట పండించుతూన్న రైతుల గురించి ఒక వ్యాసం[2] కూడా ఉందని ఎంగెల్స రాశాడు. అర్థశాస్త్రంలో తనకున్న జ్ఞానం ఇంకా చాలదని తన పత్రికారచనా వ్యాసంగంవల్ల తెలుసుకొని, అర్థశాస్త్ర అధ్యయనాన్ని మార్క్స దీక్షతో ప్రారంభించాడు.

1843 లో క్రాయిజ్‌నాఖ్ పట్నంలో, తన బాల్యస్నేహితురాలూ, తాను విద్యార్థిగా వున్న రోజుల్లోనే ప్రదానం చేసుకొన్నట్టీ, జెన్నీ ఫన్ వెస్ట్‌ఫాలెన్‌ను మార్క్స పెళ్లిచేసుకున్నాడు. అతని భార్య కుటుంబం అభివృద్ధి నిరోధక భావాలను కలిగిన ప్రష్యన్ కులీన కుటుంబం. అత్యంత అభివృద్ధి నిరోధక శకమైన 1850–1858 కాలంలో ఆమె జ్యేష్ఠ సోదరుడు ప్రష్యాదేశపు ప్రభుత్వంలో ఆంతరంగికశాఖా మంత్రిగా వుండేవాడు. 1843 శరత్తులో ఆర్నాల్డ్ రూగెతో కలసి (రూగె జననం 1802, మరణం 1880; వామపక్షపు

హెగెల్‌వాది; 1825–1830 లో కారాగృహవాసం; 1848 తదుపరి విదేశ ప్రవాస జీవితం; 1866–1870 బిస్మార్క్ అనుచరుడు), అతివాదపక్షపు మాసపత్రిక నొకదానిని విదేశాలలో ప్రచురించే నిమిత్తం మార్క్స్ పారిస్ వెళ్లాడు. ఈ మాసపత్రిక – "దోయిచ్-ఫ్రాన్ జోజిషె యార్‌బ్యూఖర్" ["జర్మన్ ఫ్రెంచి ఇతిహాస వార్షిక సంచికలు"] – మొదటి సంచిక ఒక్కటే వెలువడింది. ఆ పత్రికను జర్మనీలో రహస్యంగా పంచిపెట్టడంలో కలిగిన చిక్కుల మూలంగానూ, రూగెతో మార్క్స్‌కు కలిగిన అభిప్రాయభేదాల కారణంగానూ పత్రికను ఆపివేయాల్సొచ్చింది. "అస్తిత్వంగల ప్రతి విషయాన్నీ నిర్దాక్షిణ్యంగా విమర్శించడము" నూ, ప్రత్యేకంగా "ఆయుధాల విమర్శ"[3] నూ ప్రకటించుతూన్నట్టి, ప్రజారాసులకూ శ్రామికవర్గానికీ విజ్ఞప్తిచేస్తూన్నట్టి విప్లవకారునిగా, ఈ పత్రికలో తాను రాసిన వ్యాసాలలో మార్క్స్ అప్పటికే ముందుకొచ్చాడు.

1844 సెప్టెంబరులో కొద్ది రోజులు పారిస్‌లో గడపడానికని ఫ్రెడరిక్ ఎంగెల్స్ పారిస్ వచ్చాడు; అప్పటినుండి మార్క్స్‌కు అతను అత్యంత సన్నిహిత మిత్రుడయాడు. పారిస్‌లో వుంటూన్న విప్లవ గ్రూపుల ఉద్రేకపూరితమైన జీవితంలో (1847 లో మార్క్స్ రచించిన "తత్వశాస్త్ర దారిద్ర్యం" లో కృతనిశ్చయంతో నాశనం చేయబడినట్టి ప్రూడన్ సిద్ధాంతానికి ప్రత్యేకమైన ప్రాముఖ్యత వుంది) వీరిద్దరూ అతి ఉత్సాహంతో పాల్గొని వివిధ రకాల పెట్టీబూర్జువా సోషలిస్టు సిద్ధాంతాలను శక్తివంతంగా ప్రతిఘటిస్తూ, విప్లవాత్మక శ్రామికవర్గ సోషలిజం, లేక కమ్యూనిజం (మార్క్సిజం)యొక్క సిద్ధాంతాన్నీ ఎత్తుగడలనూ రూపొందించారు. 1844–1848 మధ్యను మార్క్స్ రచనలను గురించి దిగువ ఇచ్చిన "గ్రంథవివరణ"ను చూడండి. ప్రష్యన్ ప్రభుత్వం అతిపట్టుదలతో కోరడంచేత, ప్రమాదకరమైన విప్లవకారుడని చెప్పి, మార్క్స్‌ని 1845 లో పారిస్‌నుండి వెళ్లగొట్టారు. అప్పుడతను బ్రస్సెల్స్ వెళ్లిపోయి అక్కడ నివాసం ఏర్పరచుకున్నాడు. 1847 వసంతకాలంలో మార్క్స్ ఎంగెల్సులు "కమ్యూనిస్టు లీగ్"[4] అనే ఒక రహస్య ప్రచారసంఘంలో చేరారు; ఈ లీగ్‌యొక్క రెండవ కాంగ్రెస్‌లో (లండన్ 1847 నవంబరు) వీరిద్దరూ ప్రముఖ పాత్రను వహించి, కాంగ్రెస్ కోరికపైన ప్రఖ్యాతివడసిన "కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక"ను రచించారు. ఈ ప్రణాళిక 1848 ఫిబ్రవరిలో ప్రచురింపబడింది. ఒక నూతన ప్రపంచ దృక్పథాన్ని – సామాజిక జీవితక్షేత్రాన్ని కూడా పరివేష్టించుతూన్నట్టి సుసంగతమైన భౌతిక వాదాన్ని, అభివృద్ధిని గురించి అత్యంత సమగ్రమూ ప్రగాఢమూ అయిన ఉపదేశంగా గతి తర్కాన్ని, వర్గపోరాటంయొక్కా, నూతన కమ్యూనిస్టు సమాజ సృష్టికర్త అయినట్టి శ్రామిక వర్గపు విశ్వచారిత్రక విప్లవ పాత్రయొక్కా సిద్ధాంతాన్ని – ఈ గ్రంథం ప్రతిభాన్వితమైన సుస్పష్టతా దీప్తులతో ప్రదర్శించుతూంది.

1848 ఫిబ్రవరి విప్లవం[5] ఆరంభంకాగానే బెల్జియం ప్రభుత్వం మార్క్స్‌ను ఆ దేశంనుండి వెళ్లగొట్టింది. అతనప్పుడు పారిస్ తిరిగి వెళ్లి, అక్కడ కొన్నాళ్లుండి, మార్చి విప్లవానంతరం[6] జర్మనీకి వెళ్లిపోయి కొలోన్ పట్నంలో నివాసం ఏర్పరచుకున్నాడు. మార్క్స్ ప్రధాన సంపాదకత్వంకింద "నోయె రైనిషె సైటుంగ్" అనే పత్రిక కొలోన్‌లో 1848 జూను 1 వ తేదీనుండి 1849 మే 19 వ తేదీవరకూ వెలువడింది. ప్రపంచంలో వున్న అన్ని దేశాల శ్రామికవర్గ, ప్రజాతంత్రోద్యమాలు తదుపరి నిర్ధారణ పరచినట్టే, 1848–1849 విప్లవఘటనల చరిత్ర నూతన సిద్ధాంతాన్ని ప్రతిభావంతంగా స్థిరపరిచింది. విజయాన్ని సాధించిన విప్లవప్రతిఘాతం మార్క్స్‌పై మొదట కోర్టుచర్యను ప్రారంభించి (1849 ఫిబ్రవరి 9 వ తేదీన కోర్టు అతను నిర్దోషి అని తీర్పు చెప్పి విడుదలచేసింది), తరువాత (1849 మే 16 వ తేదీన) అతనిని జర్మనీనుండి వెళ్లగొట్టింది. తదుపరి మార్క్స్ మొదట పారిస్ వెళ్లాడు; కాని, 1849 జూను 13 వ తేదీన ప్రదర్శన జరిగిన తరువాత[7] అతనిని మళ్లీ మరొకసారి ఫ్రెంచి ప్రభుత్వం పారిస్‌నుండి వెళ్లగొట్టింది. అప్పుడు అతను లండన్ వెళ్లి తన జీవితాంతంవరకూ లండన్‌లోనే నివసించాడు.

విదేశప్రవాసిగా అతను ఎంతో నికృష్టమైన జీవితాన్ని గడిపాడు. ఈ విషయం, మార్క్స్ ఎంగెల్స్‌ల ఉత్తరప్రత్యుత్తరాలవల్ల (ఇవి 1913 లో ప్రచురించబడ్డాయి) మనకు స్పష్టంగా తెలుస్తూంది. మార్క్స్ అతని కుటుంబమూ దుర్భరదారిద్ర్యాన్ని అనుభవించారు. ఎంతో స్వార్థత్యాగంతో ఎంగెల్స్ నిరంతరమూ ధనసహాయం చేయబట్టిగాని, లేకుంటే మార్క్స్ తన "పెట్టుబడి" గ్రంథాన్ని పూర్తి చేయలేకపోవడమే కాకుండా, అత్యంత లేమితో బాధపడి రోజులు గడవడమే దుర్భరమై చనిపోయి ఉండేవాడు. ఇంతే కాకుండా, అప్పుడు చలామణీలో వున్న పెట్టీబూర్జువా, శ్రామికవర్గేతర, సోషలిస్టు సాధారణ సిద్ధాంతాలకూ ధోరణులకూ వ్యతిరేకంగా, మార్క్స్ విధివిరామంలేకుండా నిర్దాక్షిణ్యమైన సమరాన్ని సాగించవలసి వుండడమేకాకుండా, ఒక్కొక్కప్పుడు కర్కోటకమూ అమానుషమైనట్టి వ్యక్తిగత దూషణలను కూడా ("హెర్ ఫోగ్ట్"[8]) అతనికి ఎదుర్కొనక తప్పిందికాదు. ప్రవాసుల సర్కిల్స్‌తో కలవకుండా వాటికి దూరంగానే వుంటూ, ప్రధానంగా అర్థశాస్త్ర అధ్యయనమందే తన శక్తిసామర్థ్యాలను వినియోగించుతూ, అనేక చారిత్రాత్మక గ్రంథాలరూపంలో (చూ. గ్రంథవివరణ పట్టిక) అతడు తన భౌతికవాద సిద్ధాంతాన్ని వివరించాడు. తాను రచించిన "అర్థశాస్త్ర విమర్శనపై వ్యాసాలు" (1859), "పెట్టుబడి" (1 వ సంపుటం, 1867), గ్రంథాలలో ఈ శాస్త్రాన్ని అతడు విప్లవాత్మకంగా రూపొందించాడు (చూ. ఈ వ్యాసంలో దిగువ, "మార్క్స్ సిద్ధాంతం" అనే ప్రకరణం).

పందొమ్మిదవ శతాబ్ది ఆరవ దశాబ్ది చరమూ, ఏడవ దశాబ్దిలోనూ జరిగిన ప్రజా

తంత్రోద్యమాల పునరుద్ధరణ కాలంయొక్క పిలుపునందుకొని మార్క్స్ ఆచరణీయ కార్య రంగంలోకి దిగాడు. 1864 లో (సెప్టెంబరు 28 వ తేదీన) ''అంతర్జాతీయ కార్మికుల సంఘం'' (''ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్'') — ప్రఖ్యాతిపొందిన మొదటి ఇంటర్నేషనల్—లండన్‌లో స్థాపించబడింది. ఈ సంఘానికి ఆయువుపట్టూ ప్రాణమూ మార్క్స్; ఇది ప్రకటించిన మొదటి ''విజ్ఞప్తి''నీ[9], అనేక తీర్మానాలనూ ప్రకటనలనూ ప్రణాళికలనూ అతనే రచించాడు. వివిధ దేశాల కార్మికోద్యమాలను సమైక్యపరుస్తూ, శ్రామికవర్గేతర మార్క్సీయ పూర్వయుగపు సోషలిజం (మజ్జీనీ, ప్రూడన్, బకూనిన్, ఇంగ్లీషు లిబరల్ ట్రేడ్‌యూని యనిజం, జర్మనీలో లాసాల్ పక్షపు కుడివైపు ఊగిసలాటలూ, వగైరాలు) ధరించిన వివిధ రూపాలను ఒక సంయుక్త కార్యాచరణ మార్గంలో సమన్వయ పరచడానికి పాటుపడుతూ, ఈ మతాలయొక్కా, చిల్లరచిల్లర పంథాలయొక్కా సిద్ధాంతాలనన్నింటినీ ప్రతిఘటించుతూ, వివిధ దేశాలలో వున్న కార్మికవర్గంయొక్క శ్రామికవర్గీయ పోరాటం యావత్తూ అవలం బించదగిన ఏకైక ఎత్తుగడను మార్క్స్ రూపొందించాడు. తాను రచించిన ''ఫ్రాన్సులో అంత ర్యుద్ధం'' (1871) అనే గ్రంథంలో ప్రగాఢమూ నిర్దిష్టమూ ప్రతిభావంతమూ అయి నట్టీ, అంతేకాకుండా, కార్యాచరణకు ఉపయోగపడేటట్టు విప్లవాత్మకంగా పరిశీలించినట్టీ పారిస్ కమ్యూన్ పతనం (1871) తరువాతనూ, బకూనిన్ అనుచరుల చర్యల ఫలితంగా ''ఇంటర్నేషనల్''లో చీలికలు ఏర్పడిన తరువాతనూ, యూరప్‌లో ఇక ఆ సంస్థ నిలబడి వుండడానికే అవకాశం లేకపోయింది. హేగ్ ఇంటర్నేషనల్ కాంగ్రెస్ (1872) తరువాత, ఇంటర్నేషనల్‌యొక్క సాధారణ కార్యాలోచన సమితిని మార్క్స్ న్యూయార్కుకు బదిలీ చేయించేశాడు. మొదటి ఇంటర్నేషనల్ తన చారిత్రక పాత్రను పూర్తిచేసి, ప్రపంచం అన్ని దేశాల్లోనూ వున్న కార్మికోద్యమంయొక్క విస్తృతాభివృద్ధి దశకు — నిజానికి ఉద్యమం సవిస్తరంగా అభివృద్ధిచెంది, వ్యక్తిగతంగా వివిధ జాతీయ రాజ్యాల్లో రాశి సోషలిస్టు కార్మిక పార్టీల స్థాపన జరిగిన చారిత్రకకానికి — తావిచ్చి కార్యరంగంనుండి నిష్క్రమించింది.

ఇంటర్నేషనల్‌యొక్క కార్యకలాపాలు అతనికి విశేష శ్రమదమాదులను కలిగించడం కారణంగానూ, అతని సైద్ధాంతిక వ్యాసంగాలు వీటికంటెనూ ఎన్నో రెట్లు అధికమైన ప్రయాసమును కలిగించడం కారణంగానూ, మార్క్స్ ఆరోగ్యం మొదలంటా క్షీణించి పోయింది. అయినప్పటికీ, అర్థశాస్త్రాన్ని పునః రూపొందించాలనీ, ''పెట్టుబడి'' గ్రంథాన్ని పూర్తిచెయ్యాలనీ తాను పూనుకొన్న కార్యాన్ని అతడు సాగించుతూనే వచ్చాడు. ఇందుకోస మని అతడు అనేక నూతన విషయాలను సేకరించి, ఎన్నో భాషలను (ఉదాహరణకు, రష్యన్ భాషను) నేర్చుకున్నాడు. కాని అస్వస్థత కారణంగా ''పెట్టుబడి'' గ్రంథాన్ని ఆయన పూర్తి చేయలేకపోయాడు.

1881 డిసెంబరు 2 వ తేదీన ఆయన భార్య చనిపోయింది. 1883 మార్చి 14 వ తేదీన తన పడకకుర్చీలో కూర్చునివుండగా ఆయనకు అనాయాసమరణం సంభవించింది. లండను హైగేట్ శ్మశానంలో ఆయన భార్య సమాధిపక్కనే ఆయన భౌతికకాయాన్ని భూస్థాపితం చేశారు. మార్క్సు కుటుంబం నికృష్టదారిద్ర్యాన్ని అనుభవించుతూన్న రోజుల్లో ఆయన పిల్లల్లో కొందరు లండనులో శైశవంలోనే చనిపోయారు. ముగ్గురు కుమార్తెలు — ఎలియొనోర ఎవెలింగ్, లౌరా లాఫార్గ్, జెన్నీ లాంగ్వే — ఇంగ్లీషు, ఫ్రెంచి సోషలిస్టులను పెళ్లిచేసుకున్నారు. జెన్నీ లాంగ్వే కుమారుడు ఇప్పుడు ఫ్రెంచి సోషలిస్టు పార్టీలో సభ్యుడు.

## మార్క్సు సిద్ధాంతం

మార్క్సుయొక్క అభిప్రాయాల, ఉపదేశాల వ్యవస్థ మార్క్సిజం. మానవజాతి అన్ని దేశాలలోకంటెను అత్యంత పురోగమనాన్ని సాధించిన మూడు దేశాలలోనూ పంధొమ్మిదవ శతాబ్దంలోని ప్రధాన సైద్ధాంతిక ప్రవంతులు మూడింటినీ — సాంప్రదాయసిద్ధమైన జర్మన్ తత్వశాస్త్రాన్నీ, సాంప్రదాయసిద్ధమైన ఇంగ్లీషు అర్థశాస్త్రాన్నీ, సాధారణంగా పచారంలో వున్న ఫ్రెంచి విప్లవ సిద్ధాంతాలతోసహా ఫ్రెంచి సోషలిజాన్నీ — ఇంకా అభివృద్ధిచేసి పరిణతికి తీసుకువచ్చిన మహాప్రతిభాశాలి మార్క్సు. మార్క్సుయొక్క, అతని ప్రత్యర్థులు సహితమూ మెచ్చుకొన్నట్టి అద్భుతమైన సుసంగతమునూ సమైక్యతనూ కలిగిన అభిప్రాయాలను — వాటి సంపూర్ణ రూపంలో ఆధునిక భౌతికవాదము, ఆధునిక సోషలిజముగానూ, ప్రపంచంలోని నాగరిక దేశాలన్నింటిలోనూ ఉన్న కార్మికోద్యమంయొక్క సిద్ధాంతంగానూ కార్యక్రమంగానూ పరిఢవిల్లినట్టి అభిప్రాయాలను — వివరించాలంటే, మార్క్సిజంయొక్క ప్రధాన విషయాన్ని, అనగా మార్క్సు ఆర్థిక సిద్ధాంతాన్ని, వివరించేముందు మొట్టమొదట ఆయన సాధారణ ప్రపంచ దృక్పథాన్ని క్లుప్తంగా ప్రదర్శించడం మనకెంతేనా అవసరం.

## తాత్విక భౌతికవాదం

1844–1845 లో అతని అభిప్రాయాలు ఒక రూపాన్ని తాల్చిననాటినుండి, మార్క్సు భౌతికవాదాన్నే అనుసరించాడు; అందులోనూ ముఖ్యంగా అతడు ఎల్. ఫాయెర్‌బాఖ్ అనుచరుడు. ఫాయెర్‌బాఖ్‌లో వున్న లోపాలకు, అతని భౌతికవాదం ఉండవలసినంత సుసంగత

ముగానూ సమగ్రంగానూ ఉండకపోవడమేతప్ప మరొక కారణమేమీ లేదని తరువాత రోజుల్లో సహితం మార్క్స తన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూండేవాడు. హెగెల్ ప్రతిపాదించిన భావ వాదంయొక్క శృంఖలాలను ధైర్యంగా తెంచేసుకొని వాటిని విసర్జించడంలోనూ, అదివరకే "పద్దెనిమిదవ శతాబ్దంలో, ముఖ్యంగా ఫ్రాన్సులో, అప్పటికి నిలదొక్కుకొని ఉన్నటువంటి రాజకీయ సంస్థలతోనేకాకుండా మతంతోనూ మీమాంసశాస్త్రంతోనే కాకుండా ("హేతు బద్ధమైన తత్వశాస్త్రం" బదులు తత్భిన్నంగా "మైకంతో కూడిన ఊహాగానం" అనే అర్థం లో)... అతిభౌతికవాదం అంతటితోనూ" పోరాటాన్ని సాగించుతూన్నట్టి భౌతికవాదాన్ని ప్రపంచానికి చాటిచెప్పడంలోనూ ఫాయెర్‌బాఖ్‌యొక్క చారిత్రక, "శక స్థాపన" ప్రాముఖ్యత వుందని మార్క్స అభిప్రాయం ("సారస్వత వారసత్వం"లో "పవిత్ర కుటుంబం" అనే గ్రంథం). "దేనినైతే హెగెల్ 'భావం' అని నామకరణంచేసి, దానిని ఏకంగా ఒక స్వతంత్ర ప్రమాతగా తయారు చేసేశాడో, అట్టి ఆలోచనా విధానమే హెగెల్ ఉద్దేశంలో వాస్తవిక ప్రపంచానికి డెమియూర్గొస్ (సృష్టికర్త, విశ్వకర్మ)... తత్‌విరుద్ధంగా 'భావన' అనేది మానవుని శిరస్సులో మార్పుచేయబడి, పరివర్తనపొందిన పదార్థం తప్ప మరొకటి కాదనే నా అభిప్రాయం" అని మార్క్స రాశాడు ("పెట్టుబడి" 1 వ సంపుటం, రెండవ కూర్పుకు చివరమాట). మార్క్సయొక్క ఈ భౌతికతాత్విక విధానంతో సంపూర్ణంగా ఏకీభవించుతూ, దానికి వివరణ చెపుతూ, తాను రచించిన "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన"లో (ఈ గ్రంథాన్ని చూడండి) — ఈ గ్రంథాన్ని లిఖితప్రతి రూపంలో మార్క్స చదివాడు — ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఇలా రాశాడు: "... ప్రపంచంయొక్క ఐక్యత దాని అస్తిత్వంలో లేదు... దాని వస్తూత్వంలోనే వుంది ప్రపంచంయొక్క వాస్తవ ఐక్యత; కాగా తత్వశాస్త్ర ప్రకృతిశాస్త్రాలయొక్క ప్రయాసభరితమై దీర్ఘకాలంగా సాగుతూన్నట్టి క్రమాభివృద్ధి... దీనిని రుజువు పరుస్తూంది..." "ద్రవ్యం యొక్క అస్తిత్వ విధమే చలనం. చలనంలేని ద్రవ్యంకాని, ద్రవ్యంలేని చలనంకాని ఎన్నడూ తటస్థించి ఉండలేదు సరికదా, ఇక తటస్థించబోదు కూడాను... కాగా, ఇక ఆలోచన అంటే ఏమిటి? చైతన్యం అంటే ఏమిటి? ఇవి ఎక్కడనుండి పుట్టుకొస్తున్నాయి?... అని ఎవరేనా ప్రశ్నిస్తే, అవి మానవ మస్తిష్కంయొక్క ఉత్పత్తులే అనీ, దాని పరిసరాలనుండే, దాని పరిసరాలతోపాటుగానే క్రమాభివృద్ధిని చెందినట్టి ప్రకృతి ఉత్పాదితమే మానవుడు అనీ స్పష్టంగానే తెలుస్తూంది; ఇక ఆఖరి విభజన దృష్ట్యా, మానవ మస్తిష్క జన్యములు కూడా ప్రకృతి ఉత్పాదితములే అవడంవల్ల, తతిమ్మా ప్రకృతికి ఎంతమాత్రమూ విరుద్ధంగా వుండకపోవడమే కాకుండా, ప్రకృతితో అనుగుణ్యంగానే వుంటాయన్న విషయం స్వయంవ్యక్తమే." "హెగెల్ భావవాది, అనగా, అతని మనస్సులో వుండే ఆలోచనలు, వాస్తవములైన వస్తువుల యొక్క, విధానాలయొక్క, కొద్దో గొప్పో అనిర్దిష్టములైన బింబాలు (ఎంగెల్స Abbilder,

అనగా ప్రతిబింబాలు అనే పదాన్ని వాడాడు; అప్పుడప్పుడు అతను "ముద్రలు" అని కూడా అంటూంటాడు) కాకపోవడమే కాకుండా, తత్‌భిన్నంగా, ఇటుంచి అటు, ప్రపంచం పుట్టు కకు పూర్వమే ఎక్కడో ఏ చోటనో ఉనికి కలిగి వుంటూన్నట్టి 'భావం'యొక్క వాస్తవ రూపాన్ని ధరించిన బింబాలే ఈ వస్తువులూ, ఈ వస్తువులయొక్క క్రమాభివృద్ధీ అని అతను నమ్ముతాడు." తాను రచించిన "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్" అనే గ్రంథంలో – ఈ గ్రంథంలో ఎంగెల్స్, ఫాయెర్‌బాఖ్‌యొక్క సిద్ధాంతాలపై తన అభిప్రాయాలనూ మార్క్స్ అభిప్రాయా లనూ వివరించుతాడు; అంతకు పూర్వం 1844–1845 లో మార్క్సూ తానూ కలిసి హేగెల్, ఫాయెర్‌బాఖ్‌ల గూర్చి, చరిత్రయొక్క భౌతిక భావనను గూర్చి రాసిన పాత లిఖిత ప్రతిని మరొకసారి చదివినమీదటే ఆ గ్రంథాన్ని అచ్చుకు పంపించాడు – ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఈ విధంగా రాస్తాడు: "తత్వశాస్త్రం అంతటియొక్క, అందులోకీ ఇటీవలి ఆధునిక తత్వశాస్త్రంయొక్క, మౌలికమైన ప్రశ్న ఆలోచనకీ ఉనికికీ, ఆత్మకీ ప్రకృతికీ, ఉన్న సంబం ధం గురించే... ఏది ముందు: ఆత్మా, ప్రకృతా? అన్న ప్రశ్నే... తత్వవేత్తలు ఈ ప్రశ్నకు ఇచ్చిన సమాధానాలనుబట్టి వారు రెండు ప్రధానమైన తెగలుగా చీలిపోయారు. ప్రకృతికంటె ఆత్మే ముందు అని ఘోషించి, దానిని అనుసరించి తుది విభజనలో, ప్రపంచం ఏదో ఒక విధంగా సృష్టించబడిందని ఊహించినవారు భావవాదపక్షానికి చెందినవారు. ప్రకృతే ముందు అని భావించేవారు, భౌతికవాదంయొక్క వివిధ కోవలకు చెందినవారు." (తాత్విక) భావవాద, భౌతికవాద భావనలను మరే ఇతర అర్థాలతో వాడినా, అది గందరగోళానికే దారితీస్తుంది. ఏదోవిధంగా మతంతో ఎల్లప్పుడూ సంబంధాన్ని పెట్టుకున్న భావవాదాన్ని నిష్కర్షగా తిర స్కరించడమే కాకుండా, ఈనాడు విశేషంగా ప్రచారంలో వుంటూన్న హ్యూమ్, కాంట్ అభిప్రాయాలను, వివిధ రూపాల్లో వున్న అనిశ్చయవాద (ఎగ్నాస్టిసిజం), విమర్శావాద (క్రిటి సిజం), నిశ్చయవాదాలను (పోసిటివిజం) – ఇట్టి తత్వశాస్త్రాన్ని కూడా, భావవాదానికి "అభివృద్ధి నిరోధ" సూచకమగు రాయితీయేననీ, ఎంత న్యాయదృష్టితో చెప్పదలచినా, "సిగ్గుబిడియాలతో దొడ్డిదారిని భౌతికవాదాన్ని ప్రవేశపెట్టుతూ నలుగురి ముందు మాత్రం భౌతికవాదాన్ని తోసిపుచ్చడమే" నని మార్క్స్ నిష్కర్షగా తిరస్కరించాడు. ఈ ప్రశ్న విష యమై పైన పేర్కొన్న మార్క్స్ ఎంగెల్సుల గ్రంథాలనుండే కాకుండా, 1866 డిసెంబరు 12 వ తేదీన మార్క్స్ ఎంగెల్స్ పేర రాసిన వుత్తరం కూడా గమనార్హం. అందులో సుప్ర సిద్ధ ప్రకృతిశాస్త్రవేత్త తామస్ హక్స్లీ చెప్పిన వాక్యాలను గూర్చి ప్రస్తావించుతూ ఆ వాక్యా లలో, హక్స్లీ మామూలు కంటె "హెచ్చుగానే భౌతికవాద ధోరణిలో" మాట్లాడాడనీ, "మనం వాస్తవంగా అవేక్షించి మరియు ఆలోచించినంత కాలమూ భౌతికవాదంనుండి బయటపడలేం" అని హక్స్లీ అన్నప్పటికీ, ఈ మాటలవల్ల అనిశ్చయవాదానికీ, హ్యూమ్‌వాదానికీ అతడు "పెరటి

తలుపు" తెరిచేవుంచుతున్నాడని హక్స్లీని మార్క్స్ తీవ్రంగా ఆక్షేపించాడు. అవసరానికీ స్వేచ్ఛకీ వున్న సంబంధాన్ని గురించి మార్క్స్‌యొక్క అభిప్రాయాన్ని తెలుసుకోవడం మనకు ప్రత్యేకంగా అవసరం: "అవసరాన్ని తెలుసుకుని దానిని తీర్చడమే స్వేచ్ఛ. అవసరాన్ని మనం అర్థంచేసుకోలేని మేరకే అది గుడ్డిగా వున్నట్టు మనకి అగుపిస్తుంది" (ఎంగెల్స్: "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన"). ప్రకృతిలో స్వతస్సిద్ధ నియమం వుందని గుర్తించడం, (ఏ విధంగానైతే తెలియకపోయినప్పటికీ తెలుసుకోబడగలిగిన "స్వయం పదార్థం" "మన కోసమైన పదార్థంగా"నూ, "పదార్థాల సారం" "సంఘటన" గానూ, పరివర్తన చెందుతూన్నాయో సరిగా ఆ విధంగానే) అవసరం స్వేచ్ఛలోకి గతితార్కిక పరివర్తన చెందుతూందనే విషయాన్ని గుర్తించడం అన్నమాట. ఫాయెర్‌బాఖ్‌యొక్క భౌతికవాదంతో సహా "పూర్వకాలపు" భౌతిక వాదాల్లో వున్న మౌలికమైన లోపాలను (బ్యూఖ్నర్, ఫోగ్ట్, మొలెషోట్, వీరి "అపభ్రంశపు" భౌతికవాదాలలో వున్న లోపాల గురించి ఇక చెప్పనే అవసరం లేదు) మార్క్స్ ఎంగెల్స్‌లు ఈ విధంగా వివరించారు: (1) ఈ భౌతికవాదం "ప్రధానంగా యాంత్రికంగా" వుండిపోయి, రసాయనశాస్త్ర జీవశాస్త్రాలలో జరిగిన అధునాతనాభివృద్ధిని (ద్రవ్యంయొక్క విద్యుత్ సంఘట్టన సిద్ధాంతాన్ని, అని కూడా మనమీనాడు చేర్చాల్సి వుంటుంది) లెక్కలోకి తీసుకోవడం లేదు; (2) పూర్వకాలపు భౌతికవాదం చారిత్రక విరుద్ధంగానూ, గతితార్కిక విరుద్ధంగానూ (గతితార్కిక వ్యతిరేకం అనే అర్థంలో అతిభౌతికంగానూ) వుంటూ, క్రమాభివృద్ధి దృక్పథాన్ని సుసంగతంగాగాని సవిస్తరంగాగాని అనుసరించడం లేదు; (3) "మానవ సారాన్ని" నిరుపాధికంగా భావించిందేకాని, దానిని (చరిత్రలో నిర్దిష్టంగా నిర్వచింపబడిన) అన్ని "సామాజిక సంబంధాలయొక్క" "సమవాయమని" చెప్పకపోవడంచేత, ప్రపంచానికి "అర్థం" మాత్రమే "చెప్పింది"; ప్రపంచానికి అర్థం చెప్పడం కాదు అసలు విషయం; ప్రపంచాన్ని "మార్పుచేయడం" అసలు విషయం; అనగా "విప్లవాత్మకమైన ఆచరణసాధ్య క్రియాశీల శక్తి" యొక్క ప్రాముఖ్యతను అది అర్థం చేసుకోలేదన్నమాట.

## గతితర్కం

హెగెల్ గతితార్కిక సిద్ధాంతమే అత్యంత సమగ్రమైన, అత్యంత విషయగర్భితమైన, అత్యంత ప్రగాఢమైన, క్రమాభివృద్ధి సిద్ధాంతమనీ ఆ కారణంచేతనే హెగెల్ గతితర్కంలో సాంప్రదాయసిద్ధమైన జర్మను తత్వశాస్త్రం పరాకాష్ఠను అందుకొన్నదనీ మార్క్స్ ఎంగెల్స్‌లు భావించారు. క్రమాభివృద్ధి, పరిణామ నియమాలను నిర్వచించే కడమ అన్ని సూత్రీ

కరణాలూ పాక్షిక దృష్టినీ విషయ దారిద్ర్యాన్నీ ప్రదర్శిస్తున్నాయనీ, ప్రకృతిలోనూ సమాజం లోనూ వాస్తవంగా జరిగే క్రమాభివృద్ధి గమనానికి (దాట్లూ, మహావిపత్తులూ, విప్లవాలూ — గమనం తరుచు ఈ రూపాల్లో సాగుతూంటుంది) అపార్థాలు కల్పించి వికృత రూపాల్లో ప్రదర్శిస్తున్నాయనీ వారు భావించారు. "చైతన్యవంతమైన గతితర్కాన్ని" (హెగెల్ వాదంతో సహా అన్నిరకాల భావవాదాల వినాశకరమైన దాడినుండి) "కాపాడి ప్రకృతి యొక్క భౌతిక భావనలో దానిని వినియోగించినవారం బహుశ మార్క్సూ నేను మేమిద్దరమే అయివుంటాం... గతితర్కాన్ని పరీక్షించేది ప్రకృతే. ఈ పరీక్షకుకావలసిన అత్యంత సంపన్నవంతమైన సామగ్రిని" (రేడియం, ఎలక్ట్రానులు, మూలద్రవ్యాల పరివర్తనలో, వగైరాలు కనుక్కోకముందే ఇది రాయడం జరిగింది సుమండీ!) "ఆధునిక ప్రకృతిశాస్త్రం రోజుకు రోజూ మరింత అధికంగా సమకూర్చుతూందనీ, ఆఖరి విభజనలో ప్రకృతి విధానం గతితార్కికమే, కాని అతిభౌతికం కాదనీ రుజువుచేసిందనే చెప్పాల్సి వుంది."[10]

ఎంగెల్స్ ఇలా రాస్తాడు: "మహత్తర మౌలిక చింతన — ప్రపంచం సంపూర్ణంగా తయారైపోయినట్టి వస్తువుల క్లిష్ట సముదాయమనేది కాదనీ, విధానాల క్లిష్టసముదాయమే ప్రపంచమనీ, ఈ విధానాల సముదాయంలో స్థిరంగా వున్నట్టే మనకు కనపడే వస్తువులే కాకుండా వాటితోసహా ఆలోచనా రూపంలో మెదడులో వున్న వాటి ప్రతిబింబాలు, అనగా భావనలు కూడా పుట్టుతూ అంతరించి పోతూ, ఈ విధంగా నిరంతరమైన మార్పులను పొందుతూనే వుంటాయి అనే మౌలికమైన ఈ మహత్తర చింతన, సాధారణ చైతన్యంలోకి ఎంతగా చొచ్చుకొని పోయిందంటే, ఈ స్థూలరూపంలో దీనినిప్పుడు, అందులోనూ ముఖ్యంగా హెగెల్ కాలంనుండి, ఎవ్వరూ సందేహించనైనా సందేహించరు. కాని మౌలికమైన ఈ అభిప్రాయాన్ని నోటితో అంగీకరించడమూ, దాన్ని వాస్తవంగా ప్రతి పరిశోధనా రంగంలోనూ సవివరంగా వినియుక్తం చేయడమూ, ఈ రెండూ పూర్తిగా వేర్వేరు విషయాలు." "గతితార్కిక తత్వశాస్త్రానికి ఏదీ శాశ్వతం కాదు, ఏదీ అఖండం కాదు, ఏదీ పవిత్రం కాదు. ప్రతి వస్తువుయొక్క, ప్రతి వస్తువులో వున్న క్షణభంగుర స్వభావాన్ని అది బైటపెడుతుంది; స్థితిలయముల అవిచ్ఛిన్న క్రమవిధానం తప్ప, నీచదశనుండి ఉచ్చదశకు నిరంతరమూ ఆరోహించే క్రమవిధానంతప్ప, దాని ముందు మరేదీ నిలబడజాలదు. కాగా మానవ మస్తిష్కంలో ఏర్పడిన ఈ విధానంయొక్క కేవల ప్రతిబింబంతప్ప గతితార్కిక తత్వశాస్త్రం అంటే మరొకటేమీ కాదు." ఈ రీతిగా, మార్క్స్ ప్రకారం, "బాహ్య ప్రపంచం, మానవ చింతన — ఈ రెండింటి చలనంయొక్క సాధారణ నియమాలను వివరించే శాస్త్రమే"[11] గతితర్కం.

హెగెల్ తత్వశాస్త్రంలో వున్న ఈ విప్లవాత్మక అంశాన్ని మార్క్స్ స్వీకరించి దానినింకా అభివృద్ధి చేశాడు. "కడమ విజ్ఞానశాస్త్రాలన్నింటిపైనా అధికారాన్ని చలాయించే తత్వశాస్త్ర

మేదీ ఇక ముందు'' గతితార్కిక భౌతికవాదానికి అవసరం లేదు. వెనుకటి తత్వశాస్త్రాల న్నింటిలోనూ ఇక మిగిలినదంతా ''ఆలోచనా విధానశాస్త్రమూ దాని నియమాలూ, అనగా: వ్యావహారిక తర్కమూ, గతితర్కమూ.''[12] మార్క్స్ కూడా హేగెల్‌ను అనుసరించుతూ గతి తర్కంలో, ఈనాడు జ్ఞానసిద్ధాంతం, లేక విజ్ఞానవాదం, ''గ్నోసియాలజీ''* అని చెప్పబడేది కూడా ఇమిడే వుంది అన్నాడు. ఈ విజ్ఞానవాదం కూడా తన ఇతివృత్త విషయంపట్ల, జ్ఞానం యొక్క ఆవిర్భావాన్నీ క్రమాభివృద్ధినీ, అజ్ఞానం జ్ఞానంలోకి పరివర్తననూ అధ్యయనం చేసి సామాన్యధర్మాలను చెప్పడంలో, చారిత్రకదృష్టిని పాటించాలి.

ఈనాడు క్రమాభివృద్ధి భావం, పరిణమభావం సామాజిక చైతన్యంలో సంపూర్ణంగా నాటుకొనిపోయింది; అయితే ఈ నాటుకొనిపోవడం హేగెల్ తత్వశాస్త్రంద్వారా కాకుండా అందుకు భిన్నమైన మార్గాల్లో జరిగింది. కాని హేగెల్ ప్రాతిపదికను తీసుకొని మార్క్స్ ఎంగెల్స్‌లు చేసిన సూత్రీకరణను పరిశీలించుతే, మామూలుగా చలామణీ అవుతూవున్న పరి ణామ భావంకంటె, ఈ భావం ఎంతో సమగ్రంగానూ ఎంతో విషయగర్భితంగానూ ఉంది. ఇదివరలో గడచిపోయిన దశలన్నింటినీ పునరుక్తం చేస్తూన్నట్టే పైకి కనపడినా, మరొక రీతిలో ఉచ్చస్థాయిలో పునరుక్తంచేసే పరిణామాభివృద్ధి (''విరోధ వైరుధ్యం''), ఒక విధంగా చెప్పాలంటే, రుజురేఖలో కాకుండా సర్పిలాకృతులలో సంభవించే పరిణామాభివృద్ధి; — దాట్లు, మహావిపత్తులు, విప్లవాలు, ఈ రూపంలో వుండే పరిణామాభివృద్ధి — ''అవిరతంలో విరు పులు''; పరిమాణం గుణంలోకి పరివర్తన చెందడం; — ఒక నిర్దిష్ట వస్తువుపైనగానీ, ఒక నిర్దిష్ట సంఘటన లోపలినుండిగానీ, లేక ఒక నిర్దిష్ట సమాజం లోపలినుండిగానీ వివిధ శక్తులు వివిధ ధోరణులు పనిచేసేటప్పుడు, ఆ శక్తులయొక్క, ధోరణులయొక్క వైరుధ్యముల ఫలితంగా ఘర్షణల ఫలితంగా, ఆ వస్తువులోనూ ఆ సంఘటనలోనూ ఆ సమాజంలోనూ అంతర్గర్భితంగా ఉత్పన్నమయే అభివృద్ధి కారకములైన ప్రేరేపణలు — ప్రతి సంఘటనలోను అంతర్భాగాలుగా వున్న అన్ని అంశాల మధ్యనూ వున్న (ఆ సంఘటనలో వుండే కొత్త అంశా లను ఎప్పటికప్పుడు చరిత్ర బహిర్గతం చేస్తూనే వుంటుంది), పరస్పరాశ్రయమైన, అత్యంత సన్నిహితమూ అభేద్యమూ అయిన సంబంధమూ, ఏకరూపాన్ని కలిగినట్టి నియమబద్ధ మైనట్టి సర్వసామాన్యమైనట్టి చలనవిధానాన్ని సమకూర్చేటట్టి సంబంధం (మామూలు క్రమాభివృద్ధి సిద్ధాంతంకంటె) అత్యంత సంపన్నవంతమైన క్రమాభివృద్ధి సిద్ధాంతమైన గతితర్కంయొక్క స్వభావ లక్షణాలలో ఇవి కొన్ని మాత్రమే. (1868 జనవరి 8 వ తేదీని

---

*గ్రీకుభాషనుండి: 'గ్నోసిస్' అనగా జ్ఞానం, 'లోగాస్' అనగా హేతువాదశాస్త్రం — అనువాదకుడు.

మార్క్స్ ఎంగెల్స్ పేర రాసిన వుత్తరాన్ని చదివితే, ఎంత అసందర్భంగా భ్రమపడినప్పటికీ భౌతిక గతితర్కం అని ఏవిధంగానూ పొరపాటునైనా అనుకోవడానికి వీలులేనట్టి, స్టయిన్ ప్రతిపాదించిన ''కాష్మత్రిశాఖవిభాగ'' సిద్ధాంతాన్ని మార్క్స్ ఎలా పరిహాసం చేశాడో తెలుస్తుంది.)

## చరిత్రయొక్క భౌతిక భావన

పాతకాలపు భౌతికవాదంలో వున్న అసంగతమును, అసంపూర్ణతను, పాక్షిక దృష్టినీ తెలుసుకొని, ''సామాజాన్ని గురించిన శాస్త్రాన్ని భౌతికవాద పునాదులతో మేళవింపజేసి, ఈ శాస్త్రాన్ని ఈ పునాదులపైన పునర్నిర్మించడం''[13] అవసరమని మార్క్స్ నిశ్చయించుకొన్నాడు. అస్తిత్వంలోనుండే చైతన్యం పుట్టుతూందేకాని, అటుంచి ఇటు మాత్రం కాదని భౌతికవాదం స్థూలంగా వివరించుతూండడంచేత, సామాజిక అస్తిత్వంనుండే సామాజిక చైతన్యం పుట్టిందని మానవ సామాజిక జీవితానికి భౌతికవాదాన్ని వర్తింపజేసి నిరూపించాలి. ''ప్రకృతిపట్ల మానవుడు క్రియాశీలంగా వ్యవహరించే విధాన్ని, తన జీవితంలోని నూటి ఉత్పత్తి విధానాన్ని సాంకేతికశాస్త్రం బహిర్గతంచేస్తూ, తద్వారా మానవుని సామాజిక సంబంధాలు రూపొందే విధానాన్నీ, ఆ సంబంధాలనుండి ఉత్పన్నమయే మానసిక భావనలనూ బహిర్గతం చేస్తుంది'' అని మార్క్స్ రాశాడు (''పెట్టుబడి'' గ్రంథం, 1 వ సంపుటం.) ''అర్థశాస్త్ర విమర్శనపై వ్యాసాలు'' అనే తన గ్రంథానికి తాను రాసిన పీఠికలో, మానవ సమాజానికీ మానవసమాజ చరిత్రకూ వర్తింపజేయబడిన భౌతికవాదంయొక్క మూలసిద్ధాంతాలకు ఈ కింది విధంగా ఒక సమగ్ర సూత్రీకరణను ఇచ్చాడు:

''మానవులు తమకు జీవితావసరములైన వస్తువులను సామాజికంగా ఉత్పత్తి చేసుకోవడంలో పరస్పరంగా తమలో తమకు అగత్యములూ, తమ సంకల్పంతో నిమిత్తంలేకుండా స్వతంత్రములూ అయినట్టి నిర్దిష్టములైన సంబంధాలను, భౌతికంగా తమకున్న ఉత్పాదక శక్తులయొక్క అభివృద్ధిలో నిర్దిష్టమైన దశకు అనుగుణ్యంగా వుండే ఉత్పత్తి సంబంధాలను ఏర్పరచుకుంటారు.

''ఈ ఉత్పత్తి సంబంధాల మొత్తమే సమాజంయొక్క ఆర్థిక నిర్మాణంగా ఏర్పడుతుంది; ఈ ఆర్థిక నిర్మాణమే సమాజంయొక్క వాస్తవమైన పునాది; ఈ పునాది పైనే న్యాయశాస్త్ర, రాజకీయ పైకట్టడముల నిర్మాణం జరుగుతుంది; సామాజిక చైతన్యంయొక్క నిర్దిష్ట రూపాలు ఈ పునాదికి అనుగుణ్యంగా వుంటాయి. భౌతిక జీవితావసరాల ఉత్పత్తి

విధానమే సామాజిక రాజకీయ వైజ్ఞానిక జీవితవిధానాలను స్థూలంగా నిర్ణయిస్తుంది. మానవుల అస్తిత్వాన్ని నిర్ణయించేది వారి చైతన్యం కాదు; తద్విరుద్ధంగా వారి సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. వాటి క్రమాభివృద్ధిలో ఒకానొక నిర్దిష్ట దశలో సమాజంయొక్క భౌతిక ఉత్పాదక శక్తులు, ఆ దశలో అప్పటికి స్థిరపడిపోయిన ఉత్పత్తి సంబంధాలతో — దీనినే న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే అప్పటికి స్థిరపడిపోయి, ఆ సమాజంలోనే అమలు జరుగుతూన్నట్టి ఆస్తి సంబంధాలతో — ఘర్షణ పడతాయి. ఇంతకు ముందల్లా ఉత్పాదక శక్తుల అభివృద్ధి రూపాలను ధరించిన ఈ సంబంధాలు, ఈ దశలో ఉత్పాదక శక్తులకు సంకెళ్ళుగా తయారవుతాయి. ఈ తరుణంలోనే సామాజిక విప్లవ శకం ఆరంభమవుతుంది. ఆర్థిక పునాదులలో మార్పుకలగడంతో, పునాదులపైన నిర్మితమైన బ్రహ్మాండమైన పైకట్టడము యావత్తూ ఇంతో అంతో త్వరితగతిని పరివర్తన చెందుతుంది. ఇటువంటి పరివర్తనలను పరిశీలించడంలో, ప్రకృతిశాస్త్రాలకు స్వాభావికమైన యథార్థతతో నిర్దేశించడానికి వీలైన ఆర్థిక ఉత్పత్తి పరిస్థితుల పరివర్తనకూ, న్యాయ, రాజకీయ, రసజ్ఞాన, తత్వశాస్త్రీయ — ఒక్క మాటలో చెప్పాలంటే, ఏ రూపాల్లో ప్రజలు ఈ సంఘర్షణను గుర్తెరిగి దానిని ఇటో అటో తేల్చుకుందామని పోరాటాన్ని సాగించుతారో అట్టి — భావశాస్త్రీయ రూపాలకూ వున్న తారతమ్యాన్ని ఎల్లప్పుడూ గమనిస్తూనే వుండాలి.

"ఒక వ్యక్తిపైన మనకుండే అభిప్రాయం అతనికి తన పట్లవుండే స్వాభిప్రాయం పైన ఏలా ఆధారపడివుండదో, అదే విధంగా ఒక పరివర్తన దశను మనం విశదపరచేటప్పుడు, కేవలం దానియొక్క చైతన్య స్థితినే ఆధారంచేసుకొని మనం విశదపరచం. తద్వ్యతిరేకంగా, భౌతిక జీవితంలో వున్న వైరుధ్యాలనుబట్టి సామాజిక ఉత్పాదక శక్తులకూ ఉత్పత్తి సంబంధాలకూ మధ్యనున్న వైరుధ్యాలనుబట్టే ఈ చైతన్యస్థితిని మనం విశదపరచాల్సి వుంటుంది... స్థూలంగా మనం సింహావలోకనం చేసి చూసినట్టయితే, సమాజంయొక్క ఆర్థిక నిర్మాణంలో ఆసియాఖండ, పురాతనకాల, ఫ్యూడల్, ఆధునిక బూర్జువా ఉత్పత్తి విధానాలను అభ్యుదయకరములైన ఆర్గనైజేషను శకములుగానే మనం భావించవచ్చు." (మార్క్స్ ఎంగెల్స్ పేర 1866 జూలై 7 వ తేదీన రాసిన వుత్తరంలో: "ఉత్పత్తి సాధనాలవల్లనే శ్రమ నిర్ధరించబడుతుందని మన సిద్ధాంతం" అనే సంక్షిప్త సూత్రీకరణ గమనార్హం.)

చరిత్రయొక్క భౌతికభావనావిష్కరణ, అదే ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే, భౌతికవాదాన్ని సామాజిక సంఘటనా క్షేత్రంలో సుసంగతంగా విస్తరింపజేయడము, వెనుకటి చారిత్రక సిద్ధాంతాలలో ప్రధానంగా వున్న రెండు దోషాలను తొలగించి వేసింది. మొదటి దోషం: అసలు ఆ సిద్ధాంతాలు చేసినది ఏదైనా వున్నదీ అంటే, భావశాస్త్రానికి సంబంధించిన ప్రేరక హేతువులను, ఏ కారణాలు ఈ ప్రేరకహేతువులను ఉత్పత్తిచేస్తున్నాయన్న విషయాన్ని పరిశో

ధించకుండానే, సామాజిక సంబంధాల క్రమాభివృద్ధియొక్క స్వతస్సిద్ధమైన నియమాలను గ్రహించకుండానే, భౌతిక వస్తూత్పత్తి అభివృద్ధి స్థాయిలోనే ఈ సంబంధాలయొక్క అంకు రాలు నాటుకొని ఉన్నాయన్న సంగతి గుర్తించకుండానే, మహా అవుతే మానవుల చారిత్రక కార్యశీలత భావశాస్త్రీయ ప్రేరకహేతువులను, పరిశీలించడం; రెండవ దోషం ఏమిటంటే: వెనుకటి సిద్ధాంతాలు ప్రజారాసుల చర్యలను లెక్కలోకి తీసుకొనేవికావు; కాని అలాగు కాకుండా, ప్రజారాసుల సామాజిక జీవిత పరిస్థితులనూ, ఈ పరిస్థితులలో మార్పులనూ, ప్రకృతి శాస్త్రాలకు స్వాభావికమైన యథార్థతతో అధ్యయనం చేయడానికి చారిత్రక భౌతికవాదం తొలి సారిగా అవకాశం కలిగించింది. మార్క్సుకు పూర్వమున్న "సాంఘికశాస్త్రమూ," చరిత్ర రచనా శాస్త్రమూ, ఎంత హెచ్చించి చెప్పినప్పటికీ, ఏదో ఉత్త పోడి విషయాలనే, ఒక్కటొ క్కటిగా సంభవించే విషయాలనే ఏరి పోగుచేసిపెట్టి, చారిత్రక విధానంయొక్క కొన్ని పక్షాలను మాత్రమే ప్రదర్శించాయి. అన్ని పరస్పర వ్యతిరేక ధోరణుల సాంగోపాంగమును పరిశీలించడం వల్లనూ, ఈధోరణులను సమాజంలోవున్న వివిధ వర్గాల జీవన, ఉత్పత్తి పరిస్థితుల రూపంలో నిర్దిష్టంగా నిర్వచింపగల్గడం వల్లనూ, వేర్వేరు "ప్రధాన" భావాలను ఎంచి చూపించడంలో గానీ, లేదా వాటిని వ్యాఖ్యానించడంలోగానీ స్వకీయగతాత్మవాదాన్నీ వ్యక్తిగత ఇష్టానిష్టాన్నీ విసర్జించడంవల్లనూ, ఎట్టి మినహాయింపులు లేకుండా అన్ని భావాలూ అన్ని రకాల ధోరణులూ భౌతిక ఉత్పాదక శక్తులయొక్క స్థితిలోనే తమ అంకురాలను కలిగివున్నాయని నిరూపించ డంతో సామాజికార్థిక రచనల ప్రాదుర్భావ, క్రమాభివృద్ధి, పతన విధానాలను సర్వతో ముఖంగానూ సమగ్రంగానూ అధ్యయనం చేయడానికి మార్క్సిజం దారి చూపింది. ప్రజలే తమ చరిత్రను సృష్టించుకొంటారు. కాని ప్రజలయొక్క — ప్రజారాశియొక్క ప్రేరక హేతువులను ఏది నిర్ణయించుతుంది? — అనగా, పరస్పర విరుద్ధములైన భావాల, ఆశయాల సంఘర్షణలకు మూలకారణం ఏమిటి? మానవసమాజాల సంపూర్ణ రాసిలో ఈ సంఘర్షణ లన్నిటినీ మొత్తంగా కూడికలిపితే వచ్చిన ఫలితార్థం దేనిని నిరూపించుతూంది? చరిత్ర అంతటిలోనూ ప్రదర్శితమవుతూన్న మానవ క్రియాశీలశక్తి అంతటికీ ప్రాతిపదికగా ఏర్ప డుతూన్న భౌతిక జీవితావసరాల ఉత్పత్తికి అవసరమైన బాహ్యగతాత్మక పరిస్థితులు ఏవి? ఈ పరిస్థితుల క్రమాభివృద్ధియొక్క నియమం ఏమిటి? — వీటన్నిటి ప్రాముఖ్యతవైపూ మన దృష్టిని సారింపజేసి, అపరిమిత వైవిధ్య వైరుధ్యాలను కలిగిన విధానమే అయినప్పటికీ, తత్రాపి ఏక రూపము కల్గి నియమబద్ధమైనట్టి విధానంగా చరిత్రను శాస్త్రీయ పద్ధతు లలో అధ్యయనం చేసే మార్గాన్ని మార్క్స్ మనకు చూపించాడు.

# వర్గ పోరాటం

మనం ఏ సమాజాన్ని తీసుకొన్నా సరే, ఆ సమాజ సభ్యులలో కొందరి ఆశయ సాఫల్య యత్నంతో మరికొందరి ఆశయ సాఫల్య యత్నాలు విరోధించుతాయనీ, సామాజిక జీవితం పరస్పర వైరుధ్యాలతో నిండివుందనీ, జాతులకు వ్యతిరేకంగా సమాజాలకూ, అంతే కాకుండా, జాతులలోనూ సమాజాలలోనూ అంతర్గతంగా కూడా పోరాటం వుంటూoదనీ, దీనికి తోడు ఒకదాని వెంట ఒకటి విప్లవ అభివృద్ధి నిరోధక దశలూ, శాంతి, యుద్ధ దశలూ, స్తంభన, త్వరితగతి పురోగమన, క్షీణ దశలూ, సంభవిస్తాయని చరిత్ర బహిర్గతం చేస్తూందనీ అందరకూ సర్వసాధారణంగా తెలిసినదే. పద్మవ్యూహంలాగు కనబడు తూన్న ఈ అవ్యక్త వ్యవస్థను పాలించుతూన్న నియమాలను బైటపెట్టేందుకు అవసరమై నట్టి వర్గపోరాట సిద్ధాంతమనే కిటుకును మార్క్సిజం మనకి అందిచ్చింది. మనం తీసు కొన్న ఒక నిర్దిష్ట సమాజంలో గానీ, సమాజాల సమూహం ఒకదానిలో గానీ వున్న అందరి సభ్యుల మొత్తం ఆశయాల సముదాయాన్నంతటినీ అధ్యయనం చేసిన తరువాతనే ఈ ఆశయ సాఫల్య యత్నాలయొక్క ఫలితానికి శాస్త్రయుక్తమైన నిర్వచనం మనం ఇవ్వగలుగుతాం. కాగా ఈ పరస్పర విరుద్ధములైన సాఫల్య యత్నాలకుండే మూలకారణం, ఆ యా సమాజాలు ఏయే వర్గాలకింద విభజింపబడుతున్నాయో ఆ విభిన్న వర్గాలయొక్క స్థాన, జీవితరీతుల విభేదంలోనూ వుంటుంది. ''కమ్యూనిస్టు ప్రణాళిక''లో మార్క్స్ ఇలా రాశాడు: ''ఇంతవరకూ మనుతూన్న సమాజంయొక్క చరిత్ర అంతా'' (ఆదిమ సమాజ చరిత్రమినహా — అని ఎంగెల్స్ చేర్చాడు తరువాత) ''వర్గ పోరాటల చరిత్ర అనే చెప్పాలి. స్వతంత్రుడూ బానిసా, కులీనుడూ సామాన్యుడూ, ప్రభువూ భూదాసుడూ, శ్రేణిపౌరుడూ చేతిపనివాడూ, ఒక్క ముక్కలో చెప్పా లంటే పీడకుడూ పీడితుడూ నిరంతరం ఒకరికొకరు ప్రత్యర్థిగా నిలబడి, ఎడతెగకుండా ఒకప్పుడు ప్రచ్ఛన్నంగానూ మరొకప్పుడు బహిరంగంగానూ, ప్రతిసారీ కూడా మొత్తం సమాజంయొక్క విప్లవకరమైన పునర్నిర్మాణంతోనో లేదా, యీ కలహవర్గాల సమిష్టి నాశనంతోనో పరి సమాప్తమొందే పోరాటాన్ని సాగిస్తూ వచ్చారు... ఫ్యూడల్ సమాజపు శిథిలాలనుండి మొలకెత్తిన ఆధునిక బూర్జువా సమాజం వర్గ వైషమ్యాలని అంతమొదించలేదు. పైగా పాతవాటి స్థానే కొత్త వర్గాలనూ, కొత్త హింస పరిస్థితులను పోరాటంయొక్క కొత్త రూపులనూ స్థాపిం చింది. ఐనప్పటికి మన శకానికి, అంటే మన బూర్జువా శకానికి, యీ కింది విశిష్టలక్షణం వుంది: అది వర్గ వైషమ్యాలను సరళంచేసింది. మొత్తం సమాజం రెండు మహత్తర శత్రు శిబిరాలుగా, సూటిగా ఒకదాని అభిముఖంగా మరొకటి నిలిచివున్న రెండు గొప్ప వర్గా

లుగా అంతకంతకు మరింతగా చీలిపోతూ వుంది. ఆ వర్గాలే బూర్జువావర్గం, శ్రామికవర్గం."
ఫ్రెంచి మహావిప్లవం జరిగిన నాటినుండీ, ఘటనలయొక్క ఈ వాస్తవిక పూర్వరంగమైన వర్గపోరాటమే అనేక దేశాల్లో ఉంటూన్నట్లు యూరప్ చరిత్ర విస్పష్టంగా బయట పెట్టింది. ఫ్రాన్సులో రాజత్వపునరుద్ధరణ కాలంనాటికే,[14] చారిత్రఘటనల గమనాన్నుండి సాధారణీకరణాన్ని చేసిన మీదట ఫ్రెంచి చరిత్ర అంతకూ వర్గపోరాటమే మూలకారణమని ఒప్పుకొనక తప్పదని పలువురు ఫ్రెంచి చరిత్రకారులు (తియెర్రీ, గిజో, మిన్యే, త్యేర్) రాశారు. ఇక ఆధునిక శకం — బూర్జువావర్గ పరిపూర్ణ విజయం, ప్రజాప్రతినిధి సంస్థలు, విస్తృతమైన (ఇంచుమించు సార్వజనీనమైన) ఎన్నిక హక్కు, ప్రజలకోసం చవక దినపత్రికలూ వగైరాలూ, బలోపేతములై నిరంతరాయంగా విస్తృతి గాంచుతూన్నట్టి కార్మిక సంఘాలు, యజమానుల సంఘాలు, ఇత్యాదులు నెలకొనిన శకం — చారిత్ర ఘటనలకు వర్గపోరాటమే ప్రధానమైన చోదకశక్తి అని వెనుకటికంటె మరింత ప్రత్యక్షంగా (అప్పుడప్పుడు అత్యంత పాక్షికంగానూ, "శాంతియుతంగానూ," "రాజ్యాంగబద్ధంగానూ" జరిగినప్పటికీ) బైట పెట్టింది. ప్రతి వర్గంయొక్క క్రమాభివృద్ధి పరిస్థితులను విశ్లేషించే సందర్భంలో, ఆధునిక సమాజంలోని ప్రతి వర్గంయొక్క స్థానాన్నీ స్వతస్సిద్ధమైన విశ్లేషణకు లోనుగావించడానికిగాను సాంఘికశాస్త్రంనుండి మార్క్స్ ఏమి కోరాడో, మార్క్స్ విరచితమైన "కమ్యూనిస్టు ప్రణాళిక"లోని ఈ కింది ఖండం వివరించుతూంది: "ఈనాడు బూర్జువావర్గాన్ని ముఖాముఖీ ఎదిరించి నిలబడే వర్గాలన్నిటిలోనూ ఒక్క శ్రామికవర్గం మాత్రమే అసలైన విప్లవ వర్గం. ఇతర వర్గాలు ఆధునిక పరిశ్రమ సమక్షంలో క్షీణించిపోయి చిట్టచివరికి అదృశ్యమైపోతాయి; దానియొక్క ప్రత్యేకమైనట్టీ ముఖ్యమైనట్టీ ఉత్పన్నము శ్రామికవర్గమే. మధ్యతరగతిలోని క్రిందిశ్రేణులు, చిన్న కార్ఖానా ఉత్పత్తిదారుడు, దుకాణదారుడు, చేతిపనివాడు, రైతు, ఈ శ్రేణులన్నీ మధ్యతరగతిలో చిన్న భాగాలుగా తమ అస్తిత్వం అంతరించిపోకుండా కాపాడుకొనేందుకు బూర్జువావర్గంతో పోరాడుతాయి. కాబట్టి ఇవి విప్లవాత్మకములుకావు, సనాతనాభిమానములు. అంతేకాదు అభివృద్ధి నిరోధకములు కూడానూ, ఎందువల్లనంటే అవి చరిత్ర రథచక్రాన్ని వెనక్కి త్రిప్పడానికి ప్రయత్నం చేస్తాయి. ఒక వేళ ఇవి ఎప్పుడైనా యాదృచ్ఛికంగా విప్లవాత్మకములుగా మారాయంటే అది కేవలం ముస్ముందు అవి శ్రామికవర్గంలోకి బదిలీచేయబడే విషయాన్ని దృష్టిలో వుంచుకొనే ఆ విధంగా చేస్తాయన్నమాట. ఈ విధంగా అవి తమ ప్రస్తుత ప్రయోజనాలను కాపాడుకోకుండా భవిష్యత్ ప్రయోజనాలను కాపాడుకుంటాయి. శ్రామిక వర్గంయొక్క దృక్పథానికి తాము ఉపయోగపడాలని అవి తమ దృక్పథాన్ని పరిత్యజించుతాయి." అనేక చారిత్రగ్రంథాల్లో (గ్రంథవివరణ పట్టికను చూడండి), వ్యక్తిగతంగా ప్రతి వర్గంయొక్క స్థానాన్నీ, ఒక్కొక్కప్పుడు ఒక వర్గంలోనే వున్న వివిధ

గ్రూపులు లేక స్తరములయొక్క స్థానాన్నీ పరిశీలించుతూ, ఏ కారణంచేత ఏ విధంగా "ప్రతి వర్గపోరాటమూ ఒక రాజకీయ పోరాటమే" అవుతూందో చూపుతూ, భౌతికవాదతత్వ చరిత్ర రచనా శాస్త్రానికి ఉజ్వలములూ గంభీరములూ అయినట్టి ఉదాహరణలను మార్క్సు మనకు చూపుతాడు. చారిత్రక క్రమాభివృద్ధియొక్క ఫలితప్రేరణను నిర్ణయించేందుకు గాను, ఒక వర్గం మరొక వర్గంలోకీ, గతం భవిష్యత్తులోకీ మారేటప్పుడు సామాజిక సంబంధాలలో ఎట్టి క్లిష్ట పరిస్థితుల సంచయము, పరివర్తన స్థాయిలు ఏర్పడుతాయో నిరూపించుతూ మార్క్సు పరిశీలించుతాడో అందుకు పైన ఉల్లేఖించిన వాక్యాలే చక్కని తార్కాణం.

మార్క్సు వాదాన్ని అత్యంత ప్రగాఢంగానూ సమగ్రంగానూ సవిస్తరంగానూ ధ్రువీకరించుతూ దాన్ని వినియుక్తం చేస్తూన్నది ఆయన ఆర్థిక సిద్ధాంతమే.

# మార్క్సు ఆర్థిక సిద్ధాంతం

"ఆధునిక సమాజంయొక్క (అనగా, పెట్టుబడిదారీ, బూర్జువా సమాజంయొక్క) ఆర్థిక చలన నియమాలను బైటపెట్టడమే ఈ గ్రంథంయొక్క కడపటి ఉద్దేశం" అని "పెట్టుబడి" గ్రంథం పీఠికలో అంటాడు మార్క్సు. చారిత్రకంగా నిర్వచించబడగలిగిన నిర్దిష్టమైన ఒక సమాజాన్ని తీసుకొన్నట్టయితే, ఆ సమాజంయొక్క ఉత్పత్తి సంబంధాల పుట్టుక, క్రమాభివృద్ధి, క్షయమూ వీటి పరిశోధన—ఇదీ మార్క్సు ఆర్థిక సిద్ధాంతంయొక్క విషయం. పెట్టుబడిదారీ సమాజాల్లో సరుకుల ఉత్పత్తే ప్రాబల్యాన్ని కలిగి వుంటుంది; అందుచేత మార్క్సుయొక్క విశ్లేషణ సరుకుయొక్క విశ్లేషణతో ఆరంభమవుతుంది.

## విలువ

మానవుని అవసరాన్ని ఏదైతే తీరుస్తుందో అదే సరుకు; ఇది మొదటి విషయం. ఒక సరుకును మరొక సరుకుతో మారకం చేసుకోవచ్చు: ఇది రెండవ విషయం. ఒక వస్తువుకుండే ఉపయోగమే దాని ఉపయోగపు విలువను నిర్ణయిస్తుంది. ఒక రకపు ఉపయోగపు విలువల సంఖ్యను మరొక రకపు ఉపయోగపు విలువల సంఖ్యతో మార్పిడిచేసుకొనేటప్పుడు, ఆ ఉత్పత్తి విలువ సంఖ్యలకు ఉండే సామ్యం, అనగా ఈ నిష్పత్తి రూపంలో వున్న మారకపు విలువ (సూక్ష్మంగా చెప్పాలంటే, విలువ) మనకి మొదట తారసిల్లుతుంది. లక్షలాది కోట్లాది ఇలాంటి మార్పిళ్ళు, ఒక ఉపయోగపు విలువతో మరొక ఉపయోగపు విలువను నిరంతరం సమీకరణ సంబంధాన్ని ఏర్పరచి మారకం చేసుకోవడం, ఒక దానితో ఒకటి అత్యంత

వైరుధ్యాన్ని కలిగి వుండి ఎట్టి సమానతనూ ఏ మాత్రమూలేనట్టి ఉపయోగపు విలువల మారకాలు సహితమూ ఎడతెగకుండా జరుగుతూనే వుంటాయని దైనందినానుభవంవల్ల మనకు తెలుస్తూనే వుంది. ఇట్టి సందర్భంలో, ఇట్టి రకరకాల వస్తువులలో, ఒక దానితో ఒకటి నిరంతరమూ నిర్దిష్టమైన ఒక సామాజిక సంబంధ విధానమనే ఒక సమీకరణ ఏర్పడు తూన్న వస్తువులలో వున్నట్టి సామాన్య గుణం ఏమిటి? అవన్నీకూడా శ్రమయొక్క ఉత్పత్తి వస్తువులు అవడమే వాటన్నిటికీ వున్న సామాన్య గుణం. ఈ ఉత్పత్తి వస్తువులను మారకం చేసుకోవడంలో మనుష్యులు వివిధ రకాల శ్రమకు ఒక దానితో మరొక దానికున్న సామాన్యతను నిర్ణయించుకుంటారు. సరుకుల ఉత్పత్తే సామాజిక సంబంధాల వ్యవస్థ; ఈ వ్యవస్థలో వ్యక్తి గత ఉత్పత్తిదారులు అత్యంత వైవిధ్యములైన ఉత్పత్తివస్తువులను (శ్రమయొక్క సామాజిక విభజన) తయారుచేస్తూంటారు; ఉత్పత్తి చేయబడిన వస్తువులన్నీ మారకం చేసుకోవడంలో, ఒక దానితో ఒక దానికి సమానత ఏర్పడుతుంది. తదానుషంగికంగా, ఉత్పత్తిలో ఏ ఒక ప్రత్యేక శాఖకోసం వినియోగించిన శ్రమకాకుండా, ఏ ఒక్క రకమైన శ్రమకాకుండా, నిర పేక్షమైన మానవ శ్రమే—సాధారణమైన మానవ శ్రమే — సరుకులన్నిటికీ వున్న సామాన్య గుణం. ఏ సమాజంలో నైనాసరే, ఆ సమాజంలో వున్న అన్ని సరుకులయొక్క మొత్తపు విలువ రూపంలో వున్నటువంటి శ్రమశక్తి అంతా మానవ శ్రమశక్తే: కోటానకోట్ల మార కపు క్రియలు దీనిని రుజువు చేస్తున్నాయి. తత్ఫలితంగా వ్యక్తిగతంగా ప్రతి సరుకూ సామా జికంగా అవసరమైన శ్రమకాలం అంతటిలోనూ కొంత భాగాన్నే సూచిస్తుంది. విలువయొక్క పరిమాణాన్ని, సామాజికంగా అవసరమైన శ్రమ, లేక ప్రత్యేకమైన ఉపయోగపు విలువనే కలిగిన ఆ ప్రత్యేకపు సరుకును, ఆ ప్రత్యేకమైన ఉపయోగపు విలువను, ఉత్పత్తి చేయడానికి అవసరమైన శ్రమకాలం నిర్ణయిస్తుంది. ''మనచే శ్రమశక్తి వలన ఉత్పత్తి చేయబడిన పలు రకాల ఉత్పత్తివస్తువులను ఒక దానితో ఒకటి మార్చుకోవడం వల్లనే, వాటి విలువలకు ఒక సమానతను మనం ఏర్పరచడమే కాకుండా, అట్టి మారకం క్రియవల్లనే, వాటిని ఉత్పత్తి చేయడంలో వినియోగపరచబడిన వివిధ రకాల శ్రమను మానవ శ్రమ రూపంలో వాటికొక సామ్యాన్ని కూడా నిర్ణయిస్తున్నాం. ఇలా చేస్తూన్నామని మనం ఎరగనే ఎరగం; అయినప్ప టికీ మనం అలా చేస్తూనే వుంటాం.''[15] ఇద్దరు వ్యక్తుల మధ్యవుండే సంబంధమే విలువ అని వెనుకటి అర్థశాస్త్రవేత్త ఒకడు అన్నాడు; ''వస్తువుల మధ్యవుండే సంబంధంగా పైకి ముసుగు వేసి చూపించబడిన సంబంధం'' అనే మాటలను అతగాడు తన మాటలకు చేర్చి వుండాల్సింది. ఒక నిర్దిష్టమైన చారిత్రక సామాజిక పద్ధతిలో వున్న సామాజిక ఉత్పత్తి సంబంధాలయొక్క, అంతేకాకుండా సర్వవ్యాప్తమైన మారకపు సంఘటన, కోటానకోట్ల పర్యాయాలు పునరావృత్త మవుతూన్న మారకపు సంఘటన రూపంలో ప్రత్యక్షమవుతూ

వున్న సంబంధాలయొక్క దృక్పథంనుండి పరిశీలించినప్పుడే విలువ అంటే ఏమిటో మనం అర్థం చేసుకోగలుగుతాం. ''విలువలుగా పరిగణించేటప్పుడు, అన్ని సరుకులూ కూడా పేరుకొని పోయినట్టి నిర్దిష్ట శ్రమకాలపు రాసులే అన్నమాట.''[16] సరుకులలో ఇమిడివున్న శ్రమయొక్క ద్వంద్వ స్వభావాన్ని సవివరంగా పరిశీలించిన తరువాత, విలువయొక్క, ధనంయొక్క వివిధ రూపాలను పరిశీలించడానికి మార్క్స్ పూనుకుంటాడు. ఇలా అధ్యయనం చేయడంలో, విలువ యొక్క ధనరూపం ఏలా ఉత్పత్తి అయిందో అధ్యయనం చెయ్యడమే, మార్పిడియొక్క చారిత్రక క్రమాభివృద్ధి విధానాన్ని అధ్యయనం చేయడమే, కాకతాళీయంగా వ్యక్తిగతంగా జరిగిన మార్పిడిక్రియలు (ఒక నిర్దిష్ట పరిమాణంలో వున్న ఒక సరుకును నిర్దిష్ట పరిమాణంలో వున్న మరొక సరుకుతో మారకం చేసుకొన్నప్పుడు సంభవించే ''ప్రాథమిక, ఒక్కొక్క లేక యాదృచ్ఛిక విలువ రూపం''), ఒక నిర్దిష్టమైన సరుకుకోసమే వివిధములైన రకరకాల సరుకులను మారకం చేసుకునే సర్వసాధారణమైన విలువ రూపంకింద ఎలా మార్పుచెందిందో, ఈ ప్రత్యేకమైన సరుకు బంగారం రూపాన్ని వహించి, బంగారమే సర్వసాధారణమైన తుల్యం కింద ఏర్పడేటట్టి పరిస్థితుల్లో, విలువయొక్క ధనరూపం ఏలా ఏర్పడుతూందో తెలుసుకోవడమే మార్క్స్‌యొక్క ఉద్దేశం. మారకంయొక్క అభివృద్ధి క్రమంలోనూ సరుకుల ఉత్పత్తిలోనూ ఉద్భవించే ఉచ్చదశే ధనం కాబట్టి, వ్యక్తిగత రూపంలో వున్న అంతటి శ్రమయొక్క సామాజిక స్వభావాన్నీ, మార్కెట్టుద్వారా వ్యక్తిగత ఉత్పత్తిదారులను పరస్పరంగా ఐక్యపరచే సామాజిక బంధనాన్ని ధనం కప్పిపుచ్చేస్తుంది. ధనంయొక్క వ్యాపారాలను సవిస్తరమైన వివరాలతో విశ్లేషణపరచి వివరించాడు మార్క్స్; ఈ సందర్భంలో, ఒక్కొక్కప్పుడు (సాధారణంగా ''పెట్టుబడి'' గ్రంథంలో మొదటి ప్రకరణాల్లో వున్నట్టు) మార్క్స్ యొక్క నిరపేక్షమైన వివరణ విధానం కేవలం నిగమతార్కిక పద్ధతుల్లో నడుస్తూన్నట్టు కనబడినా, ఆ విధానం మారకంయొక్క అభివృద్ధి చరిత్రనూ సరుకుల ఉత్పత్తి చరిత్రనూ వివరించేటట్టి వాస్తవికాంశాల బ్రహ్మాండ సముదాయాన్నే నిజంగా పునరుత్పత్తి చేస్తూందన్న విషయాన్ని మనం ప్రత్యేకంగా గమనించవలసిన అవసరం ఎంతేనా వుంది. ''ధనం అనే విషయాన్ని మనం పరిశీలించేటప్పుడు, సరుకుల మారకపు విధానంలో ఒక నిర్దిష్టమైన ఉన్నత దశను తెలియజేస్తుంది. కేవలం సరుకులయొక్క తుల్యతనే తెలియజేసేదైతేనేమి, నిల్వచేసుకొనేందుకైతేనేమి, చెల్లింపు సాధనంగా నైతేనేమి, చలామణీ సాధనంగా నైతేనేమి, సర్వసాధారణమైన డబ్బు రూపంలో నైతేనేమి, ధనం నిర్వర్తించే ప్రత్యేకపు వ్యాపారాలు, ఆ యా వ్యాపారాలయొక్క సాపేక్ష విస్తృతాన్నీ ప్రాబల్యాన్నీ అనుసరించి, సామాజిక ఉత్పత్తి క్రమాభివృద్ధిలో ఒక దానితో ఒకటి విభేదించే వివిధ దశలలో ఒక్కొక్క దానినీ సూచిస్తాయి.'' (''పెట్టుబడి,'' 1 వ సంపుటం).

# అదనపు విలువ

సరుకుల ఉత్పత్తియొక్క క్రమాభివృద్ధి ఒక నిర్దిష్ట దశ చేరుకొనేటప్పటికల్లా, ధనం పెట్టుబడిలోకి మారిపోతుంది. సరుకుల చలనప్రసారంయొక్క సాంకేతికం స — ధ — స (సరుకు — ధనం — సరుకు), అనగా ఒక సరుకు కొనడంకోసం ఒక సరుకు అమ్మడం, రూపంలో వుండేది. కాని ఇప్పుడు తద్విరుద్ధంగా పెట్టుబడియొక్క సాధారణ సాంకేతికం ధ — స — ధ, అనగా అమ్మకంకోసమే (లాభం వచ్చేటట్లుగా అమ్మకంకోసమే) కొనడం రూపంలో వుంటూంది. చలనంలో వినియోగించిన ధనంయొక్క అసలు విలువకంటె మించిన విలువకు అదనపు విలువ అని మార్క్స్ పేరుపెట్టాడు. పెట్టుబడిదారీ విధానపు చలనప్రసారంలో ధనం ఈ విధంగా "పెరుగుతూందనే" విషయం అందరకూ తెలిసిందే. ఈ విధమైన "పెరుగుదలే" ధనాన్ని ఒక ప్రత్యేకమైనట్టి, చారిత్రకంగా నిర్దేశింపబడినట్టి, సామాజిక ఉత్పత్తి సంబంధమైనట్టి పెట్టుబడి కింద రూపొందించుతూంది. సరుకుల ప్రసారంలో నుంచి అదనపు విలువ పుట్టనేరదు, ఎందుచేతంటే దానికి తెలిసిందని తుల్యముల మారకమే; ధరలు పెంచడంవల్ల కూడా అదనపు విలువ పుట్టడానికి వీల్లేదు, ఎందుచేతనంటే కొనేవారియొక్కా అమ్మేవారియొక్కా లాభాలూ నష్టాలూ సరిపోతూనే వుండగా, ఇక్కడ మనకు తటస్థపడుతూన్నది ఒక వ్యక్తిగతమైన సంఘటన కాకుండా, అందుకు మారుగా, సర్వవ్యాప్తంగా, సగటున జరిగే, సామాజిక సంఘటన. అదనపు విలువ లభించాలంటే ధనాన్ని కలిగినవాడు "ఏ సరుకుయొక్క ఉపయోగపు విలువకు, విలువను సృష్టించగలిగే విశిష్ట గుణం ఉందో అట్టి సరుకును మార్కెట్టులో... వెతికి... పట్టుకోవాలి"[17] — ఆ సరుకు ఎటువంటిదై వుండాలంటే, దాని వినిమయ విధానమే విలువను సృష్టించే విధానం కూడా అయివుండాలి. అటువంటి సరుకు ఉంది. అదే మానవ శ్రమశక్తి; దాని వినిమయమే శ్రమ; విలువను సృష్టిస్తుంది శ్రమ. ధనం వున్న వ్యక్తి శ్రమశక్తిని దాని విలువను చెల్లించి కొంటాడు; అన్ని సరుకుల విలువలాగే శ్రమశక్తియొక్క విలువ కూడా దానిని ఉత్పత్తి చేయడానికి అవసరమయే సామాజిక శ్రమకాలాన్ని పట్టి నిర్దేశించబడుతుంది (అనగా, కార్మికుడికీ అతని కుటుంబానికీ జీవించడానికయే వ్యయం అన్నమాట). ధనం వున్న వ్యక్తి శ్రమశక్తిని కొన్న తరువాత, దానిని వినియోగించే అధికారం, అనగా రోజంతా — మాటవరసకి పన్నెండు గంటలు అనుకుందాం — వినియోగించే అధికారం అతనికి దఖలు పడుతుంది. అయితే, శ్రామికుడు తన జీవన భృతికి అవసరమైన ఖర్చుకు సమానమైన విలువను కలిగిన వస్తువును ఆరు గంటలలోనే ("అవసరమైన" శ్రమకాలంలోనే) సృష్టించేస్తాడు; ఇక మిగిలిన ఆరుగంటల్లోనూ ("అద

నపు'' (శ్రమకాలం) ''అదనపు'' వస్తువును, లేక అదనపు విలువను సృష్టిస్తాడు; ఈ అదనపు విలువకు పెట్టుబడిదారుడు కార్మికునికి ఏమీ చెల్లించడు. కాబట్టి దీనికి అనుగుణ్యంగా ఉత్పత్తి విధాన దృష్ట్యా, పెట్టుబడిలో రెండు వేర్వేరు భాగాలను మనం గుర్తించాల్సి వుంటుంది: ఉత్పత్తి సాధనాలకోసం (యంత్రాలూ, పనిముట్లూ, ముడిపదార్థాలూ వగైరాలు) వినియోగించబడిన స్థిరపెట్టుబడి; ఈ ఉత్పత్తి సాధనాల విలువ ఏ విధమైన మార్పునూ చెందకుండానే, (అంతా ఒకే సమయంలో కాని, అప్పుడప్పుడు కొన్నికొన్ని భాగాలలో కాని) తయారైన వస్తువులోకి మారిపోతుంది. ఇక రెండో భాగం శ్రమశక్తికోసం వినియోగించ బడిన అస్థిర పెట్టుబడి. పెట్టుబడిలోని ఈ భాగంయొక్క విలువ స్థిరమైనది కాదు, కాగా శ్రమ విధానంలోనే అదనపు విలువను సృష్టించుతూ, పెరుగుతూనే వుంటుంది. ఈ కారణంవల్ల, పెట్టుబడి ఏవిధంగా శ్రమశక్తిని దోపిడీ చేస్తూందో స్పష్టంగా చూపించాలంటే, అదనపు విలువను, మొత్తం పెట్టుబడితో పోల్చకుండా, అస్థిర పెట్టుబడి ఒక్క దానితో మాత్రమే పోల్చిచూడాలి. ఈ విధంగా పైన పేర్కొన్న ఉదాహరణలో, అదనపు విలువ రేటు, ఈ నిష్పత్తికి మార్క్స్ పెట్టిన పేరు, 6:6, అనగా 100 శాతం.

చారిత్రకంగా చూచినట్టయితే, పెట్టుబడి ఉద్భవించడానికి రెండు ముఖ్యమైన పరిస్థితులు ఉండితీరాలి: మొదటిది, కొందరు వ్యక్తుల దగ్గర కొంతవరకూ ధనం పోగుపడి వుండాలి; దీనికి తోడు మొత్తంమీద సరుకుల ఉత్పత్తి సాపేక్షంగా ఉన్నతస్థాయిలోనే జరుగుతూ వుండాలి. ఇక రెండో పరిస్థితి: ద్వివిధ ''స్వేచ్ఛను'' అనుభవిస్తూన్న శ్రామికుడు వుండాలి, అనగా ఎట్టి నిర్బంధమూ, ఎట్టి ప్రతిబంధకమూ లేకుండా తన శ్రమశక్తిని స్వేచ్ఛగా అమ్ముకోడానికి వీలును కలిగివున్న శ్రామికుడుగా వుండాలి; దీనికి తోడు భూమితోనూ, సాధారణంగా సరుకుల ఉత్పత్తి సాధనాలతోనూ ఏ సంబంధమూ లేకుండా స్వేచ్ఛగా వుంటూన్నట్టి, ఏ యజమానితోనూ ముడిపడి వుండనట్టి, తన శ్రమశక్తిని అమ్ముకొనడం వల్లనే తప్ప ఇతరత్రా మరే విధంగానూ తన జీవనోపాధిని సాగించుకోవడానికి పూర్తిగా అశక్తుడైనట్టి కార్మికుడు, ''శ్రామికుడు'' అయివుండాలి.

అదనపు విలువను వృద్ధిచేయడానికి ప్రధానంగా రెండు విధానాలున్నాయి: రోజూ పని చేయవలసిన కాలాన్ని అధికం చెయ్యడం (''అఖండ అదనపు విలువ'') ఒక విధానం; రోజుకు ''అవసరమైన'' పనికాలాన్ని తగ్గించడం (''సాపేక్ష అదనపు విలువ'') రెండో విధానం. మొదటి విధానాన్ని విశ్లేషించి, రోజూ పనిచేయవలసిన కాలాన్ని తగ్గించడానికి కార్మికవర్గం ఏ విధంగా పోరాడినదీ, ఈ పనికాలాన్ని పొడిగించడానికి (పధ్నాలుగో శతాబ్దంనుండి పదిహేడో శతాబ్దంవరకూ), పనికాలాన్ని తగ్గించడానికి ప్రభుత్వాలు (పందొమ్మిదవ శతాబ్దంలో ఫ్యాక్టరీ చట్టాలు) ఏ విధంగా జోక్యం కలుగజేసుకొన్నదీ మనస్సుకు నాటేటట్టు మార్క్స్

చూపించాడు. ''పెట్టుబడి'' గ్రంథం వెలువడిన తరువాత ప్రపంచంలోని అన్ని నాగరిక దేశాల్లోనూ ఉద్భవించిన కార్మికోద్యమ చరిత్ర ఈ పరిస్థితులను రుజువు చేస్తూ వేలాదివేల నూతన విషయాలను ప్రదర్శిస్తూంది.

సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి విధానాన్ని విశ్లేషిస్తూ, ఏ ప్రధాన చారిత్రక దశల వల్లనైతే ఉత్పాదక శక్తిని పెట్టుబడి అధికం చేసిందో అట్టి ప్రధాన చారిత్రక దశలను మూడింటినీ మార్క్స్ పరిశోధించాడు: 1) సాధారణ సహకారం; 2) శ్రమ విభాగమూ, కార్ఖానా ఉత్పత్తి విభాగమూ; 3) యంత్రాలూ, బృహత్ స్థాయి పరిశ్రమ. పెట్టుబడియొక్క అభివృద్ధిని మార్క్స్ ఎంత నిశితంగా పరిశీలించి, దాని మౌలిక స్వభావాలను ఎంత నగ్నంగా బట్టబయలు చేశాడో రుజువు చేసేందుకు, రష్యాలో ''కుస్తార్'' [కుటీర పరిశ్రమ] అని చెప్పబడుతూన్న ఉత్పత్తి విధానంపై గావించబడిన వివిధ అంశాలతో కూడిన విస్తృత పరిశోధనలే పైన పేర్కొన్న మొదటి రెండు దశలకూ, కావలసినన్ని ఉదాహరణలను అకస్మాత్తుగా సమకూర్చుతున్నాయి. 1867 లోనే మార్క్స్ వర్ణించినట్టి యంత్రసాధనా బృహత్ స్థాయి విధానంయొక్క విప్లవకర ఫలితాలు, తరువాతి అర్ధశతాబ్ది కాలంలోనూ ''కొత్త'' (రష్యా, జపాను మొదలైన) దేశాలలో జరిగిన విషయాలే బైటపెట్టుతున్నాయి.

ఇక ముందుకు సాగుదాం. పెట్టుబడి సంచయాన్ని అనగా అదనపు విలువలో కొంత భాగాన్ని పెట్టుబడికింద మార్చి, ఈ భాగాన్ని తన సొంత అవసరాలనుగానీ ఆశయాలనుగానీ తీర్చుకొనేందుకు వినియోగించకుండా, కేవలం కొత్త ఉత్పత్తికోసమే వినియోగించడం అనే విషయానికి మార్క్స్ ఇచ్చిన విశ్లేషణ నవీనమైనదీ, అత్యంత ముఖ్యమైనదీనూ. ఈ సందర్భంలో, (ఆడమ్ స్మిత్ మొదలు) పూర్వపు సాంప్రదాయ ఆర్థిక శాస్త్రవేత్తలందరి పొరపాటునూ మార్క్స్ బైటపెట్టాడు. వీరందరూ కూడా పెట్టుబడిగా పరివర్తనం చెందుతూందన్న మొత్తపు అదనపు విలువ యావత్తూ అస్థిర పెట్టుబడిగా ఏర్పడుతూంది అని చెప్పినది పొరపాటని మార్క్స్ చూపెట్టాడు. వాస్తవానికి, ఈ అదనపు విలువ ఉత్పత్తి సాధనాలు, అస్థిర పెట్టుబడి అనే రెండు భాగాల మధ్య విభజింపబడుతూంది. మొత్తం పెట్టుబడిలో అస్థిర పెట్టుబడి భాగంకంటే స్థిర పెట్టుబడి భాగం అత్యధికతరంగా పెరుగుతూండడం పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క క్రమాభివృద్ధి విధానంలోనూ, పెట్టుబడిదారీ విధానం సోషలిజంలోకి పరివర్తన చెందే విధానంలోనూ అత్యంత ప్రాముఖ్యతను కలిగి వుందనే విషయాన్ని మనం గమనించాలి.

పెట్టుబడి సంచయం కార్మికుల స్థానే యంత్రాలనే ఉపయోగించడం త్వరితం చేయడం ఫలితంగానూ, ఒక వైపు ధనం సృష్టించడం, రెండో వైపు దారిద్ర్యం సృష్టించడం ఫలితంగానూ, ''శ్రమజీవుల నిలవసైన్యం'' అనే కార్మికుల ''సాపేక్ష అధిక సంఖ్య,'' లేక

"పెట్టుబడిదారీ విధానపు అధిక జనాభా"ను కూడా సృష్టించుతూంది. ఇది అత్యంత వైవిధ్యములైన రూపాలు ధరించి, ఉత్పత్తి అత్యధిక పరిమాణంలో అధికమయే అవకాశాన్ని కలుగజేస్తుంది. ఉత్పత్తి అధికం కావడమూ, దీనితోపాటు పరపతి అవకాశాలు అధికం కావడమూ, ఉత్పత్తి సాధనాల రూపంలో పెట్టుబడి సంచయమూ, మొదట సగటున పది సంవత్సరాలకొకసారి, తర్వాత అంతకంతకు సుదీర్ఘమూ, అనిర్దిష్టమూ అయే వ్యవధికాలంలో అపరిమితోత్పత్తి కారణంగా సంభవించుతూన్న ఆర్థిక సంక్షోభాలకూ ఇవన్నీ కలిసి కారణాలుగా ఏర్పడుతున్నాయని మనకిప్పుడు తెలుస్తూంది. పెట్టుబడిదారీ విధానంలో జరుగుతూన్న పెట్టుబడి సంచయానికీ, ప్రథమ దశ అని చెప్పబడుతూన్న దశలో జరిగిన పెట్టుబడి సంచయానికీ వున్న వ్యత్యాసాన్ని మనం తెలుసుకోవాలి: ఉత్పత్తి సాధనాలనుండి కార్మికుని బలాత్కారంగా వేరుచెయ్యడమూ, రైతుని భూమినుండి తరిమి వేయడమూ, సాముదాయక భూములను కాజేయడమూ, వలసలూ జాతీయ రుణాల వ్యవస్థలూ, రక్షణ సుంకాలూ, ఇట్టి పద్ధతుల్లో ప్రథమ పెట్టుబడి సంచయం జరిగింది. "ప్రథమ సంచయం" ఒక ధ్రువాన "స్వేచ్ఛను అనుభవించుతూన్న" శ్రామికుడినీ, రెండో ధ్రువాన ధనం, స్వంతదారుడినీ, అనగా పెట్టుబడిదారుడినీ, సృష్టించింది.

"పెట్టుబడిదారీ విధానపు సంచయంయొక్క చారిత్రక ధోరణి" గురించి మార్క్స తన సుప్రసిద్ధ వచనాల్లో ఈవిధంగా వర్ణించాడు: "సరుకులను ఎవరైతే వాస్తవంగా ఉత్పత్తి చేస్తారో అట్టి ఉత్పత్తిదారులనే, అతి తుచ్ఛమైనట్టీ, నీచాతినీచమైనట్టీ, అతి స్వల్పమైనట్టీ, అతి క్షుద్రమూ అసహ్యకరమూ అయినట్టీ భావాలను రెచ్చగొట్టడంద్వారా, నిర్దాక్షిణ్యమైన మూర్ఖకర్కోటక పద్ధతులలో ఆస్తి హక్కులు లాక్కోవడమూ జరుగుతూంది. కష్టపడి ఆర్జించుకున్న సొంత ఆస్తి" (రైతూ చేతిపనివాడూ), "అనగా ఏకాకిగా స్వతంత్రంగా తనమట్టుకుతాను కష్టించుతూన్న శ్రమజీవి తన శ్రమ పరిస్థితులతో, ఒక విధంగా చెప్పాలంటే, మిళితమైపోయి ఏకమైపోయిన ఫలితంగా సంభవించిన ఆస్తి అంతరించిపోయి దాని స్థానే ఇతరులయొక్క నామకః స్వేచ్ఛాయుతమైన శ్రమను దోచుకోవడంపైన ఆధారపడినట్టి పెట్టుబడిదారీ విధానపు సొంత ఆస్తి అవతరించుతూంది... కాయకష్టంచేసి తనంతటతాను ఆర్జించుకున్న శ్రామికుని ఆస్తి కాదు ఇప్పుడిక కాజేయవలసినది; అనేకమంది శ్రామికులను దోచుకుంటూన్న పెట్టుబడిదారుని ఆస్తినే ఇప్పుడు కాజేయ్యాలి. పెట్టుబడిదారీ విధానపు ఉత్పత్తిలో అంతర్గర్భితంగా వుండే నియమాలయొక్క క్రియాశక్తివల్లే, పెట్టుబడి కేంద్రీకరణంవల్లే ఈ ఆస్తి హక్కులు లాక్కోవడం జరుగుతుంది. ఒక పెట్టుబడిదారుడు తన తోటి పెట్టుబడిదారులను ఎంతమందినో నాశనం చేస్తాడు. ఈ కేంద్రీకరణతోపాటే, అనగా కొద్దిమంది పెట్టుబడిదారుల చేతుల్లో అనేకులు పెట్టుబడిదారులు

నాశనమైపోవడంతో పాటుగానే, శ్రమ విధానంయొక్క సహకార రూపమూ, సాంకేతిక పద్ధతులలో భౌతిక విజ్ఞానశాస్త్రాలను లక్ష్యసాధనకోసం చైతన్యవంతంగా వినియుక్తం చేయడమూ, క్రమవిధానంలో భూమిని సాగుచేయడమూ, శ్రమ పరికరాలను ఇక ఏ యితర పరికరాలవల్లనూ కాకుండా సమిష్టిగానే ఉపయోగించడానికి మాత్రమే వీలయే శ్రమ పరికరాలుగా మార్పు చేయడమూ, ఉత్పత్తి సాధనాలనూ సమిష్టి సామాజిక శ్రమయొక్క సాధనాలుగా ఉపయోగించ డంద్వారా అన్ని ఉత్పత్తి సాధనాలను పొదిమి చేయడమూ, ప్రపంచ మార్కెట్టు వలలో అందరు ప్రజలూ చిక్కుకొని పోవడమూ, ఇదంతా రానురాను మరింత విస్తృత స్థాయిలో అభివృద్ధి పొందడమూ, వీటన్నిటితోపాటూ పెట్టుబడిదారీ విధానంయొక్క అంతర్జాతీయ స్వభావం కూడా అభివృద్ధి చెందడమూ సంభవించుతుంది. ఈ పరివర్తనా విధాన ఫలితంగా చేకూరిన లాభాలన్నింటినీ గుత్తాధికారంగా తమ గుప్పెట్లోనే గుంజుకున్నట్టి బడాపెట్టు బడిదారుల సంఖ్య క్రమేణా తగ్గుతూండడంతోపాటు దారిద్ర్యమూ, బాధలూ, బానిసత్వమూ, నైచ్యమూ, దోపిడీ రాశి కూడా పెరిగి పోతూనే వుంటుంది, కాగా దీనితోనే దినేదినే అధిక సంఖ్యలో పెరుగుతూ, మరే ఇతర కారణాలూ లేకుండానే కేవలం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధాన యంత్రం ఫలితంగానే క్రమశిక్షణను అలవరచుకొని, ఐక్యతను కలిగి, అగ్గనైజైన కార్మిక వర్గంయొక్క విప్లవం కూడా అభివృద్ధి పొందుతూనే వుంటుంది. ఉత్పత్తి విధానంతో పాటే పుట్టి పెరిగి, దీనితోపాటే, దీని కిందనే పరిఢవిల్లిన పెట్టుబడియొక్క గుత్తాధిపత్యం ఆ ఉత్పత్తి విధానికే ఇప్పుడు సంకెళ్లుగా తయారవుతుంది. ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణమూ, శ్రమను సామాజికపరం చేయడమూ ఎంత ఉచ్చస్థాయిని అందుకున్నాయంటే, వాటిపై పెరుగుతూన్న ఆ పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క అండకవచంలో అవి ఇక ఇమడ లేకపోతాయి. ఈ కవచమే తప్పనిసరిగా బద్దలైపోయి పటాపంచలైపోతుంది. పెట్టుబడిదారీ విధానపు ప్రైవేటు ఆస్తియొక్క మరణాన్ని చాటిస్తూ చావుబాజా వినబడుతుంది. ఆస్తి హక్కులు లాక్కొన్నవారి ఆస్తి హక్కులే లాక్కొనబడతాయి.'' (''పెట్టుబడి'', 1 వ సంపుటం.)

మొత్తం సామాజిక పెట్టుబడియొక్క పునరుత్పత్తిని, ''పెట్టుబడి'' గ్రంథం రెండవ సంపుటంలో, నూతన పద్ధతులలో విశ్లేషించి పరిశీలించాడు మార్క్స్. ఈ విశ్లేషణ అత్యంత ముఖ్యమైనది. వెనుకటిలాగునే ఈ విషయాన్ని కూడా దానిమట్టున అది వ్యక్తిగతంగా సంభవించిన సంఘటనలాగు కాకుండా, సర్వవ్యాప్త స్వరూపంలో వున్న సంఘటనగానూ, ఆర్థిక సమాజంలో ఏ స్వల్పభాగానికో సంబంధించిన సంఘటన కాకుండా ఆర్థిక వ్యవస్థ అంతటికీ సంబంధించిన సంఘటనగా తీసుకున్నాడు మార్క్స్. పైన పేర్కొన్న సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తలు చేసిన పొరపాటును దిద్దుతూ, మొత్తం సామాజిక ఉత్పత్తి

నంతనూ రెండు పెద్ద విభాగాలకింద మార్క్స్ విభజించాడు: I) ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి, II) వినిమయ వస్తువుల ఉత్పత్తి; ఇలా విభజించిన తరువాత మొత్తం సామాజిక పెట్టుబడి ప్రసరణాన్ని — వెనుకటి పరిమాణంలో జరిగే పునరుత్పత్తి, పెట్టుబడి సంచయమూ, ఈ రెండు రూపాల్లోనూ కూడా — సోదాహరణంగా లెక్కలనిస్తూ సవివరంగా పరిశీలించాడు. విలువ నియమాన్ని ప్రాతిపదికగా తీసుకుని, లాభంయొక్క సగటురేటు ఏ విధంగా నిర్దేశించ బడుతుందో ఆ సమస్యను "పెట్టుబడి" గ్రంథం మూడవ సంపుటంలో మార్క్స్ పరిష్కరించాడు. అర్థశాస్త్రంలో మార్క్స్ తీసుకొచ్చినట్టి బ్రహ్మాండమైన పురోగమనం దేనిలో వుందంటే, అపభ్రంశ అర్థశాస్త్రమూ, ఆధునిక "సీమాంత ఉపయోగపు విలువ సిద్ధాంతము"[18] తరుచుగా పరిమితం చేయబడుతూన్నట్టి వ్యక్తిగత దృష్టాంతాల దృక్పథంనుండీ, బహ్యగతాత్మకంగానూ పైపైనా కనపడే పోటీ విధానంయొక్క అంశాల దృక్పథంనుండీ తన పరిశీలనను జరుపకుండా, రాశి ఆర్థిక సంఘటనల దృక్పథంనుండే, మొత్తం సమగ్ర సామాజిక ఆర్థిక వ్యవస్థ దృక్పథంనుండే తన పరిశీలనను జరుపుతాడు మార్క్స్. అదనపు విలువ ఎలా ఆరంభవుతుందో మార్క్స్ మొదట విశ్లేషించి, దానిని తరువాత లాభం, వడ్డీ, భూమిశిస్తు కింద అది విభజింపబడడమూ పరిశీలిస్తాడు. ఒక వ్యాపారంలో ఆ వ్యాపార ఫలితంగా వచ్చిన అదనపు విలువకూ, ఆ వ్యాపారంలో మదుపుగా పెట్టిన మొత్తం పెట్టుబడికీ వుండే నిష్పత్తే ఆ వ్యాపారంలో వచ్చిన లాభం. "ఘనమైన అంగక్రమ సంఘట్టనగల" పెట్టుబడి (అనగా అస్థిర పెట్టుబడి కంటె స్థిరపెట్టుబడే అతి ప్రబలంగా, సామాజిక సగటుకుమించి హెచ్చుగా వుండడం అన్నమాట), సగటు లాభం రేటుకంటె తక్కువ లాభాన్నే సమకూర్చుతుంది; "లఘువైన అంగక్రమ సంఘట్టనగల" పెట్టుబడి సగటు లాభం రేటుకంటె హెచ్చు లాభాన్నే సమకూర్చుతుంది. పెట్టుబడుల పరస్పర పోటీవల్ల పరిశ్రమలో ఒక భాగంనుండి మరో భాగానికి పెట్టుబడులు స్వేచ్ఛగా మారేందుకుండే వీలువల్లనూ, రెండు సందర్భాల్లోనూ లాభాలరేటు సగటు లాభంరేటుతో సరిగానే వుంటుంది. ఒక నిర్దిష్ట సమాజంలో సరుకులన్నింటి విలువలయొక్క మొత్తము ఆ సరుకుల వివిధ ధరల మొత్తంతో సరిపోతూనే వుంటుంది; కాని ఒకే తరహాకు చెందిన వ్యాపారాల్లో వ్యక్తిగతంగా వ్యాపార సంస్థల పరస్పర పోటీవల్లనూ, ఉత్పత్తియొక్క వివిధ భాగాల పరస్పర పోటీవల్లనూ, సరుకులను వాటి విలువలతో సమానంగా వున్న అమ్మకం ధరలకు అమ్మకుండా, వినియుక్తమైన పెట్టుబడికి సగటు లాభంరేటును కలుపుతే వచ్చిన మొత్తానికి సమానమైనట్టి ఉత్పత్తియొక్క ధరలకు (లేక ఉత్పత్తి ధరలకు) అమ్ముతూ వుంటారు.

ఈ విధంగా సర్వవిదితమూ నిర్వివాదమూ అయినట్టి ధరలకూ విలువలకూ వుండే అంతరమూ, లాభాలు సమస్థాయిలో వుంటూండడమూ, ఈ విషయాన్ని మార్క్స్ తన విలువ

నియమానికి ఆధారంగా తీసుకుని కూలంకషంగా విశదీకరించాడు; అన్ని సరుకుల మొత్తం విలువ అన్ని ధరల మొత్తానికి సమానంగా సరిపోతూండడమే దీనికి కారణం. అయినప్పటికీ, (సామాజికమైన) విలువ, (వ్యక్తిగతమైన) ధరతో సరిపడడం సుళువుగానూ ప్రత్యక్షం గానూ కాకుండా, అతిక్లిష్టమైన మార్గంలో జరుగుతుంది. కేవలం మార్కెట్టు సంబంధం వల్లనే పరస్పర సంబంధం ఏర్పడినట్టి, ఒకరి నుండి ఒకరు వేరుపడిపోయి ఎవరిమట్టుకు వారే ఉత్పత్తిచేసేటట్టి ఉత్పత్తిదారులను కలిగిన సమాజంలో, నియమం అనేది, సామాజికమూ సర్వవ్యాప్తమూ అయిన ఒక సగటు నియమంగానే బహిర్గతమవుతుంది; ఇట్టి సందర్భంలో ఒక సారి ఇటూ ఒక సారి అటూ మధ్యమ స్థానానికి రెండు వైపులా ఊగిసలాడుతున్న తేడాలు మొత్తంమీద ఒక దానినొకటి తుడిచిపెట్టేస్తూంటాయి.

శ్రామిక ఉత్పాదక శీలత అధికమైందీ అంటే, అస్థిర పెట్టుబడికంటె స్థిర పెట్టుబడి హెచ్చుత్వరగా అభివృద్ధి పొందుతూందన్నమాటే. అదనపు విలువ, కేవలం ఒక్క అస్థిర పెట్టుబడి యొక్క వ్యాపారం అవడమే కారణంగా, లాభంరేటు (అనగా, అదనపు విలువకూ పెట్టుబడిలో వున్న అస్థిర భాగాని కొక్కదానికే కాకుండా, మొత్తం పెట్టుబడి అంతకీ వుండే నిష్పత్తి) పడిపోయే స్వభావాన్ని సూచించడం సహజమే. ఈ స్వభావాన్నీ, ఈ స్వభావాన్ని కప్పిపుచ్చుతూనట్టిగానీ, లేక ప్రతిఘటించుతూన్నట్టిగానీ అనేక విషయాలను, మార్క్స్ సవివరంగా విశ్లేషణ చేసి చూపిస్తాడు. ''పెట్టుబడి'' గ్రంథం మూడవ సంపుటంలో, వడ్డీ వ్యాపారపు పెట్టుబడులూ, వర్తకపు పెట్టుబడులూ, ధన పెట్టుబడులూ, వీటన్నిటినీ సవివరంగానూ ఎంతో ఔత్సుకంగానూ చెప్పిన ప్రకరణాలను గూర్చి ప్రస్తావించడం మానేసి, ఆ గ్రంథంలో భూమిశిస్తు సిద్ధాంతాన్ని వివరించే ముఖ్యమైన భాగాన్ని మనమిప్పుడు పరిశీలించాల్సి వుంది. భూమియొక్క విస్తీర్ణం పరిమితమైనది కాబట్టీ, దానికితోడు పెట్టుబడిదారీ దేశాల్లో భూమి యావత్తూ ప్రత్యేకంగా వ్యక్తుల అధీనంలో వుంది కాబట్టీ, వ్యవసాయ దినుసుల ఉత్పత్తి ధరలు, సగటు రకం భూమిలో ఉత్పత్తి చేయడానికయే ఖరీదులనుబట్టి కాకుండా, నాసితరగతి భూమిలో ఉత్పత్తి చేయడానికయే ఖరీదులనుబట్టీ, భూమినుండి మార్కెట్టుకు దినుసులను విడుదలచేసే సగటు స్థితిగతులపైన కాకుండా, భూమినుండి మార్కెట్టుకు విడుదల చేయడానికుండే నాసిరకం స్థితిగతులనుబట్టే వుంటాయి. ఈ ఖరీదులకూ మంచి రకం భూమిలో (లేక మంచి పరిస్థితులలో) ఉత్పత్తికయే ఖరీదులకూ వుండే వ్యత్యాసమే తేడాశిస్తు రూపంలో ప్రత్యక్షమవుతుంది. ఈ విషయాన్నే సవివరంగా పరిశీలించి, వివిధ భూఖండాల భూసారంలో వుండే వ్యత్యాసాలవల్లనూ, భూమిమీద పెట్టిన పెట్టుబడుల వ్యత్యాసాలవల్లనూ ఈ తేడాశిస్తు ఏలా ఏర్పడుతూందో నిరూపించుతూ, మేలు రకం భూములు రానురాను నాసిరకంకింద మారిపోతూండడమే ఈ తేడాశిస్తు సంభవించడానికి

కారణమనే రికార్డోయొక్క పొరపాటును (''అదనపు విలువ సిద్ధాంతాలు'' అనే ప్రకరణంలో రాడ్‌బెర్‌టుస్‌పై మార్క్స్ చేసిన విమర్శ ముఖ్యంగా గమనార్హం) ప్రస్ఫుటంగా మార్క్స్ సంపూర్ణంగా బైటపెట్టాడు. తత్‌వ్యతిరేకంగా, ఈ మార్పు అటుంచి ఇటు జరగవచ్చు; నాసిరకం భూములు మంచిరకం భూములుగా (వ్యవసాయ సాంకేతిక పద్ధతుల పురోగమనమూ, పట్టణాల అభివృద్ధీ, ఇంకా ఇతర కారణాల ఫలితంగా) మారిపోవచ్చు. కాగా ''భూమి క్రమంగా నిస్సారమవడంవల్ల ప్రతిఫలం క్రమేణా తగ్గిపోక తప్పదు అనే అప్రతిష్ఠపాలైన నియమం'' పూర్తిగా పొరపాటే కాకుండా, ఈ తప్పుడు సిద్ధాంతమే పెట్టుబడిదారీ విధానంయొక్క లోపాలనూ పరిమితులనూ వైరుధ్యాలనూ ప్రకృతికే అంటగట్టుతూంది. ఇంతే కాకుండా, పరిశ్రమ అన్ని విభాగాలలోనూ, సాధారణంగా జాతీయ ఆర్థిక వ్యవస్థలోనూ వచ్చే లాభం, మొత్తంమీద సరిసమానంగానే వుండడము సంపూర్ణ స్వేచ్ఛాయుతమైన పోటీనీ, పరిశ్రమ ఒక విభాగంలోనుండి మరో విభాగంలోకి పెట్టుబడిని స్వేచ్ఛగా తరలించుకొనే అవకాశాన్నీ సూచిస్తూంది. అయితే భూమిపై ప్రైవేటు స్వామ్యం భూమిమీద గుత్తాధిపత్యాన్ని సృష్టిస్తుంది. ఈ గుత్తాధిపత్యం ఫలితంగా పెట్టుబడి స్వేచ్ఛగా మారడానికి ప్రతిబంధకం ఏర్పడుతూంది. వ్యవసాయంలో పెట్టిన పెట్టుబడియొక్క తక్కువ స్థాయి అంగక్రమ సంఘట్టనే వ్యవసాయంయొక్క విశిష్ట స్వభావం; తత్ఫలితంగా వ్యక్తిగతమైన హెచ్చు రేటున లాభాలు గిట్టుతూంటాయి. లాభంరేటు అంతటా స్వేచ్ఛగా సరిసమానమయే విధానంలో, ఈ గుత్తాధిపత్యం ఫలితంగా వ్యవసాయ దినుసులు పాల్గొనవు; భూఖామందు గుత్తాధికారి అవడంచేత, వ్యవసాయపు దినుసుల ధరను సగటు ధరకు మించిన స్థాయిలో వుంచగల్గుతాడు; ఈ గుత్తాధికారపు ధరే అఖండ శిస్తును పుట్టించుతూంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో తేడా శిస్తును రద్దుచేయడానికి వీలులేదు. కాని — ఉదాహరణకు భూమిని జాతీయడం చేయడం వల్లనూ, ప్రభుత్వపు ఆస్తిగా చేయడంవల్లనూ — అఖండ శిస్తును ఎత్తివేయడానికి అవకాశం వుంది. భూమిని రాజ్యాంగయంత్రపు ఆస్తిగా చేయడమంటే ప్రైవేటు భూఖామందుల గుత్తాధిపత్యాన్ని క్రుంగదీయడమే; వ్యవసాయ రంగంలో మరింత వ్యవస్థాబద్ధమూ మరింత సంపూర్ణ స్వేచ్ఛాయుతమైన పోటీకి దారితీస్తుంది. కాబట్టే బూర్జువా వర్గంలోని రాడికల్ వాదులు భూమిని జాతీయం చెయ్యాలనేటట్టి ప్రగతిశీలమైన కోర్కెను పదేపదే వెలిబుచ్చుతూ వచ్చారని మార్క్స్ నిరూపించాడు; కాని నేటి పరిస్థితులలో అతి ముఖ్యమైనట్టీ, ''అతి సున్నితమైనట్టీ'' సాధారణంగా ఉత్పత్తి సాధనాల్లో వున్న గుత్తాధికారం అనే మరొక గుత్తాధిపత్యానికే ఎక్కడ ''దెబ్బతగులుతుందో'' అనే భయంతో, ''భూమిని జాతీయం చేయడం'' అనేమాట చెవిని పడేసరికే బూర్జువా వర్గంలో అధిక సంఖ్యాకులు హడలిపోతారు. (ఎంగెల్స్ పేర మార్క్స్ 1862 ఆగస్టు 2 వ తేదీన రాసిన వుత్తరంలో, పెట్టుబడిపై వచ్చే సగటు

లాభంరేటు గురించీ, అఖండ శిస్తుపైన తాను చేసిన సిద్ధాంతాన్ని గురించీ అత్యంత సుబోధకంగానూ స్పష్టంగానూ వివరిస్తాడు. ''మార్క్స్ ఎంగెల్స్ ఉత్తరప్రత్యుత్తరాలు,'' 3 వ సంపుటం, 77–81 పుటలు, అదే గ్రంథంలో 86–87 పుటలలో వున్న 1862 ఆగస్టు 9 వ తేదీ వుత్తరమూ చూడండి.) — భూమిశిస్తుయొక్క చరిత్రను తెలుసుకోవాలంటే మార్క్స్ చేసిన విశ్లేషణను మనం గమనించాలి. శ్రమ రూపంలో వున్నట్టి శిస్తు (ఖామందు యొక్క భూమిమీద కష్టపడుతూ తత్ఫలితంగా ఎప్పుడైతే అదనపు ఫలితాన్ని రైతు సృష్టిస్తాడో అప్పుడు) ఏ విధంగా (రైతు తన సొంత భూమిలో అదనపు దినుసును సృష్టించుకొని, ''ఆర్థికేతర బలాత్కారాల'' కారణంగా దానిని ఖామందుకు సమర్పించుకొంటాడో అప్పుడు) దినుసు రూపంలో వున్న శిస్తుగా గానీ, ఇతర వస్తురూపంలో వున్న శిస్తుగా గానీ మారిపోతుందో, తరువాత నగదు శిస్తులోకి (దినుసు రూపంలో వున్న శిస్తే, నగదులోకి మార్చిన శిస్తు, పూర్వం రష్యాలో సరుకు ఉత్పత్తి హెచ్చుగా అభివృద్ధి కావడం కారణంగా, ''ఒబ్రోక్'' [క్విట్‌రెంట్] రూపంగా వసూలు చేసిన శిస్తు) మారిపోతుందో, ఇక చిట్ట చివరకు రైతు బదులు, రైతు స్థానే కూలికి పనివాళ్లని పెట్టి వ్యవసాయం చేయించే వ్యవసాయపు ముస్తాజరీ వ్యాపారస్థులు బయలుదేరారో అప్పుడు ఈ నగదుశిస్తు పెట్టుబడిదారీ విధానపు శిస్తుకింద ఎలా మారిందో మార్క్స్ విశ్లేషణచేసి చూపించుతాడు. ''పెట్టుబడిదారీ విధానపు శిస్తుయొక్క పుట్టుకను'' పరిశీలించిన సందర్భంలో, వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధాన పరిణామం గురించి మార్క్స్ వివరించిన ప్రధానములైన అనేక అభిప్రాయాలు (రష్యాలాంటి వెనుకబడిన దేశాలకు ఎంతో ముఖ్యమైనట్టి అభిప్రాయాలు) అత్యంత గమనార్హములు. ''వస్తురూపంలో వున్న శిస్తు, నగదు రూపంలో వున్న శిస్తుకింద మారిపోయేటప్పుడు, ఈ మార్పుతో కూడా రోజువారీ కూలికోసం కిరాయికి కుదురుకొనే నిరాస్తిపరులైన శ్రామికుల వర్గం ఒకటి విధిగా ఏర్పడడమే కాకుండా, నగదుశిస్తు విధానం ఏర్పడక ముందే అందుకు సూత్రధారులుగా వీరు ఏర్పడుతారు. ఈ వర్గం ఇంకా ఏర్పడుతూండే కాలంలోనే, అక్కడా అక్కడా ఈ నూతన వర్గం బయలుదేరుతూండగానే, వెనుకటి ఫ్యూడల్ వ్యవస్థ రోజుల్లో కాస్త ధనికులైన బానిస రైతులే తమవద్ద ఊడిగం చేయడానికి ఇతర పేద బానిసరైతులను ఏలాగైతే పెట్టుకునే వారో సరిగా అలాగే, ప్రభుత్వానికి శిస్తు చెల్లించుతూ కాస్త స్థితిపరులైన రైతులు వ్యవసాయకూలీల శ్రమను దోచుకొనే రివాజు తప్పనిసరిగా బయలుదేరుతుంది. ఈ విధంగా మోతుబరి రైతులే కొంత ధనాన్ని కూడబెట్టుకొనే సామర్థ్యాన్ని సంపాదించుకొని, భవిష్యత్తులో తామే పెట్టుబడిదారులుగా మారిపోయే అవకాశం కలుగుతుంది. ఈ విధంగా వృద్ధ భూఖామందుల, తమంతట తామే కష్టించి వ్యవసాయం చేసుకొనే రైతుల మధ్య నుంచే, వ్యవసాయ వ్యవస్థకు

వెలుపలనే వున్న పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క సాధారణ అభివృద్ధి కారణంవల్ల పెట్టుబడి పెట్టగల్గిన రైతులను భవిష్యత్తులో సృష్టించే నారుమడి ఒకటి తయారవుతుంది." ("పెట్టుబడి," 3 వ సంపుటం, 332 వ పుట.) "వ్యవసాయక ప్రజానీకంలో ఈవిధంగా కొందరినుండి ఆస్తి హక్కులు లాక్కొనబడి భూములనుండి బేదఖలు చేయబడడం ఫలితంగా, పరిశ్రమ పెట్టుబడికి అవసరమైన శ్రామికులు 'విడుదలకాబడడమే' కాకుండా వారి జీవన భృతీ, వారు వినియోగించవలసిన శ్రమసరుకూ తయారై, దానితోపాటు దేశీయ మార్కెట్టు కూడా ఒకటి ఏర్పడుతూంది." ("పెట్టుబడి," 1 వ సంపుటం, 778 వ పుట.) మొదట వ్యవసాయక ప్రజానీకం దరిద్రులైపోయి నాశనమైపోయి, తత్ఫలితంగా తరువాత పెట్టుబడికి అవసరమైన నిరుద్యోగపు నిలవసైన్యంకింద తయారవుతారు. ప్రతి పెట్టుబడిదారీ దేశంలోనూ, "వ్యవసాయపు ప్రజలో కొంత భాగం ఎల్లప్పుడూ పట్నవాసపు, లేక కార్ఖానా (పరిశ్రమలో) అనగా, వ్యవసాయేతర కష్టించే శ్రామికవర్గంలోకి మారిపోతూన్న దశలో వుంటూంటారు... సాపేక్షమైన అదనపు జనాభాయొక్క ఈ మూలాధారం నిరంతరం నిరవధికంగా అలాగు ప్రవహిస్తూనే వుంటుంది... ఈ పరిస్థితుల ఫలితంగా వ్యవసాయకూలీకి కనిష్ఠ పరిమాణపు కూలిడబ్బులే ముట్టుతూ, ఒక కాలు ఎల్లప్పుడూ దుర్భరదారిద్ర్యం అనే ఊబిలో దిగబడుతూనే నిలబడి వుంటాడు." ("పెట్టుబడి," 1 వ సంపుటం, 668 వ పుట.) తాను సాగుచేస్తూన్న భూమికి రైతు తానే సొంత ఖామందుగా వుండడమే స్వల్ప స్థాయిలో జరిగే ఉత్పత్తికి పునాదిగా ఏర్పడుతూ, అది వర్ధిల్లడానికీ సాంప్రదాయక రూపాన్ని వహించడానికి మూలకారణంగా పరిణమించుతూంది. కాని ఈ విధమైన స్వల్ప స్థాయి ఉత్పత్తి, సంకుచితమైన ఆదిమ ఉత్పత్తి వ్యవస్థకూ, ఆదిమ సమాజానికీ మాత్రమే సరిపడుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో, "రైతాంగాన్ని దోచుకొనే పద్ధతీ, పారిశ్రామిక శ్రామికవర్గాన్ని దోచుకొనే పద్ధతీ, రెండూ ఒక్కటే; ఎటొచ్చీ రూపంలోనే తేడా. ఇద్దరిని దోచుకుంటూన్నదీ ఒక్కటే: పెట్టుబడే. వ్యక్తిగత పెట్టుబడిదారులు వ్యక్తిగత రైతులను తనఖాల్లూ అధిక వడ్డీల ద్వారా దోచుకుంటారు; పెట్టుబడిదారీ వర్గం అంతా ఏకమై ప్రభుత్వపు పన్నుల రూపంలో రైతువర్గాన్ని దోచుకుంటూంది." ("ఫ్రాన్సులో వర్గపోరాటాలు" అనే గ్రంథం.) "రైతుకు సాగుచేసుకొనేందుకు కొద్దిగా పొలాన్ని ఉండనివ్వడం, భూమినుండి పెట్టుబడిదారుడు లాభాలనూ వడ్డీనీ శిస్తునీ పిండడానికి ఒక సాకుగా ఏర్పడుతూంది తప్ప మరేమీ కాదు; ఇదంతా జరుగుతూండగా ఇక భూమిని సాగుచేసుకునే రైతు తన జీవన భృతిని ఎలాగు సంపాదించుకో గల్గుతాడా అనే విషయం వాడి ఖర్మం అనేశారు." ("పద్దెనిమిదవ బ్రూమేర్" అనే గ్రంథం.) పెట్టుబడిదారీ సమాజానికి, అనగా పెట్టుబడిదారీ వర్గానికి, రైతు తన జీవనభృతికి ఆర్జించుకునే డబ్బులో కొంత భాగాన్నే తప్పనిసరిగా ధారపోస్తూ,

''తన భూమికి తానే ఖామందుని అని ఒక నటన నటిస్తూ, ఐర్లాండు దేశపు కౌలుదారీ రైతు స్థాయికి'' దిగజారి పోతూన్నాడు (''ఫ్రాన్సులో వర్గపోరాటాలు''). ''పెట్టుబడిదారీ పద్ధతిలో ఉత్పత్తి విధానాన్ని సాగిస్తూన్న దేశాల్లో కంటె, చిన్న రైతుల సంఖ్యే ప్రబలంగా వున్న దేశాల్లోనే ధాన్యపు ధరలు తక్కువగా వుండడానికి గల కారణాలలో'' ఒక కారణం ఏది? (''పెట్టుబడి,'' 3 వ సంపుటం, 340 వ పుట.) ఈ కారణాల్లో ఒక కారణం ఏమిటంటే: తన అదనపు ఉత్పత్తిలో కొంత భాగాన్ని ఎట్టి ప్రతిఫలమూ లేకుండానే సమాజానికి (అనగా, పెట్టుబడిదారీ వర్గానికి) రైతు ధారపోస్తున్నాడు. ''(ధాన్యంయొక్క, ఇతర వ్యవసాయ దినుసులయొక్క) తక్కువ ధరలు, ఉత్పత్తిదారులయొక్క బీదతనం ఫలితమే కాని, వారి శ్రామిక ఉత్పాదకశీలత అధికం కావడంవల్ల ఎంత మాత్రమూ కాదు.'' (''పెట్టుబడి,'' 3 వ సంపుటం, 340 వ పుట.) చిన్న తరహా ఉత్పత్తి విధానంయొక్క సర్వసాధారణ రూపాన్ని కలిగిన పద్ధతి అయిన చిన్న కమతాల సాగుబడి విధానం, పెట్టుబడిదారీ విధానంలో రానురాను క్షీణించిపోయి, పతనమైపోయి, నశించిపోతుంది. ''వస్తుతః చిన్న కమతాల సాగుబడి విధానంలో, సామాజిక శ్రమయొక్క ఉత్పాదక శక్తులు అభివృద్ధి పొందేందుకు, శ్రమయొక్క సామాజిక రూపాలకూ, పెట్టుబడులయొక్క సామాజిక సాంద్రీకరణానికీ, ఉచ్చస్థాయిలో పశువుల పెంపకానికీ, వ్యవసాయంలో క్రమేణా ఉన్నతస్థాయిలో విజ్ఞానశాస్త్ర వినియోగానికీ, ఏమాత్రమూ తావుండదు. అధిక వడ్డీలూ, పన్నుల విధానమూ, దానిని సర్వేసర్వత్రా తప్పనిసరిగా దారిద్ర్యంలో ముంచివేసి తీరుతాయి. భూమిని కొనడానికే పెట్టుబడి వినియోగం అయిపోవడంవల్ల, వ్యవసాయంమీద పెట్టవలసిన పెట్టుబడికి లోటు కల్గుతుంది. ఉత్పత్తి సాధనాలు అంతులేకుండా ఎక్కడికక్కడే చెదిరిపోయి, ఉత్పత్తిదారులు ఎవరిమట్టుకు వారు వేరు పడిపోతారు.'' (కోఆపరేటివ్‌లు, అనగా సన్నకారు రైతుల సంఘాలు, అత్యంత ప్రగతిశీలమైన బూర్జువా పాత్రనే నిర్వర్తించుతూన్నప్పటికీ, ఈ పోకడను పూర్తిగా బలహీన పరచేస్తున్నప్పటికీ దానిని పూర్తిగా రూపుమాపలేకపోయాయి. కాగా ఈ సహకార సంఘాలు మోతుబరి రైతులకే అధికంగా ఉపయోగకరంగా వుంటాయి కాని, గ్రామీణ పేదరైతుల రాసికి, ఏ కొద్దిగానో తప్ప, ఇంచుమించు ఏ మాత్రమూ ఉపయోగపడడం లేదనే విషయాన్ని కూడా మనం మర్చిపోకూడదు; అంతేకాకుండా ఈ సంఘాలే కూలిశ్రామికులను దోచుకోవడానికి తయారవుతాయి.) ''మానవ శక్తులు బ్రహ్మాండంగా వృధా అయిపోతున్నాయి. ఉత్పత్తి పరిస్థితులు అంతకంతకు మరింతగా క్షీణించిపోవడమూ, ఉత్పత్తి సాధనాల ధరలు పెరగడమూ చిన్న కమతాల ఆస్తివిధానంలో ఇవి తప్పనిసరిగా సంభవించి తీరవలసిన నియమం.'' పరిశ్రమలోలాగే వ్యవసాయంలో కూడా ''ఉత్పత్తిదారుడిని బలిపెడితేనేగాని'' పెట్టుబడిదారీ విధానం ఉత్పత్తి పద్ధతులలో మార్పు తీసుకురాదు. ''ఒక్క చోటే సాంద్రీకృతం కావడం

ఫలితంగా పట్నవాసపు కార్మికుల ప్రతిఘటనశక్తి అధికమవుతూండగా, విస్తృతమైన దేశం మీద గ్రామీణ శ్రామిక జనం నాలుగు మూలలా చెదిరిపోవడంవల్ల, వారి ప్రతిఘటనశక్తి తగ్గిపోతూంటుంది. పట్టణ పరిశ్రమలలోలాగానే ఆధునిక వ్యవసాయంలో కూడా, శ్రమ యొక్క ఉత్పాదకశీలత అంతకంతకు అధికమవుతూందంటేనూ, చలనంలోకి తీసుకొని రాబడిన శ్రమయొక్క పరిమాణము హెచ్చించబడుతూందంటేనూ, కేవలం శ్రమశక్తినే వృథా చేసి, రోగాలు పాల్జేయడంద్వారానే ఇది సాధించబడుతూంది. అంతేకాకుండా పెట్టుబడిదారీ విధానపు వ్యవసాయంలో జరిగిన అభ్యుదయం అంతా, శ్రామికుని కొల్లగొట్టడమనే కళలోనే కాకుండా, భూమిని కొల్లగొట్టడమనే కళలో కూడా సాధించిన అభ్యుదయమే... అందుచేత పెట్టుబడిదారీ ఉత్పత్తి సాంకేతికశాస్త్రాన్ని అభివృద్ధి పరచి, వివిధ విధానాలను సమ్మేళనం చేసి సామాజికంగా సమైక్యం చేస్తూందీ అంటే సంపద అంతటికీ మూలాధారమైనట్టి భూమినీ, శ్రామికుడినీ మాత్రం క్షీణింపజేసి నాశనం చేయడంవల్లనే సమైక్యం చేస్తూంది.''
(''పెట్టుబడి,'' 1 వ సంపుటం, 13 వ ప్రకరణం చివరి భాగం.)

## సోషలిజం

ఆధునిక సమాజపు ఆర్థికచలన నియమం ఒక్కదానిని మాత్రమే సంపూర్ణంగా అన్వయించడం ద్వారానే పెట్టుబడిదారీ సమాజం సోషలిస్టు సమాజంలోకి పరివర్తన చెందక తప్పదని మార్క్సు కేవలం ఒక్క తార్కిక పద్ధతులను అన్వయించే పర్యవసానం తేల్చాడని పైన వివరించిన దానినుండి స్పష్టంగా తెలుస్తూంది. బృహత్ స్థాయి ఉత్పత్తీ, పెట్టుబడిదారీ విధానపు కార్టెల్సూ, సిండికేట్లూ, ట్రస్టులూ, వీటన్నిటి అభివృద్ధీ, ఇవేకాక ఆర్థిక పెట్టుబడి పరిమాణంయొక్క, శక్తియొక్క బ్రహ్మాండమైన విజృంభణా, ఈ రూపాలలో అత్యంత ఆశ్చర్యాన్ని కొల్పేటట్టుగా ప్రత్యక్షంగా సాక్షాత్కారమవుతూన్నట్టిన్నీ, మార్క్సు మరణానంతరం ఈ అర్ధశతాబ్దిలోనూ అత్యంత త్వరితగతిని నిరవధికంగా లెక్కకు మించిన రూపాల్లో పురోగమించుతూన్నట్టిన్నీ శ్రమ సామాజికీకరణమే, విధిగా రానున్న సోషలిజం అవతరణకు భౌతిక పునాదిగా ఏర్పడుతూంది. ఈ పరివర్తనాన్ని ముందుకు నడిపే నైతిక మేధాశక్తీ, ఈ పరివర్తనాన్ని అమలుపరచే భౌతికబలమూ, పెట్టుబడిదారీ విధానంచేతనే స్వయంగా తర్ఫీదు చేయబడిన శ్రామికవర్గమే. బూర్జువావర్గానికి వ్యతిరేకంగా, వివిధ రూపాలనూ నానాటికి అత్యంత విభిన్న స్వరూపాలను దాల్చుతూన్న విషయ వైవిధ్యంతోనూ ప్రత్యక్షమవుతూన్నట్టి శ్రామికవర్గ పోరాటం, రాజకీయ శక్తిని శ్రామికవర్గం హస్తగతం చేసుకునే (''శ్రామికవర్గ

నియంతృత్వ") లక్ష్యాన్ని కలిగిన రాజకీయ పోరాట రూపాన్ని విధిగా ధరించి తీరుతుంది. ఉత్పత్తియొక్క సామాజికీకరణం ఉత్పత్తి సాధనాలు సమాజంయొక్క ఆస్తిగా మారడానికే, అనగా "ఆస్తి హక్కులు లాక్కొన్నవారి ఆస్తి హక్కులే లాక్కొనబడానికే" విధిగా దారితీసి తీరుతుంది. ఈ మార్పుయొక్క ప్రత్యక్ష ఫలితంగా, శ్రామిక ఉత్పాదకశీలత బ్రహ్మాండగా పెరిగిపోవడమూ, పనిగంటలు తగ్గడమూ, వీటితోసహా ఆదిమ పద్ధతులలో వ్యష్టిగా సాగుతూన్న స్వల్ప స్థాయి ఉత్పత్తియొక్క శిథిలాలూ అవశేషాలూ అంతరించిపోయి, వాటి స్థానాన్ని అభివృద్ధి పొందినట్టి సమిష్టిశ్రమ ఆక్రమించుతుంది. వ్యవసాయానికీ పరిశ్రమకీ వున్న బంధాన్ని పెట్టుబడిదారీ విధానం తుట్టతుదకు ఛేదించేస్తూంది; అయితే అదేసమయంలో, విజ్ఞాన శాస్త్రాలను చైతన్యవంతంగా వినియుక్తం చేయడం పైననూ, సమిష్టిశ్రమను సమ్మేళన చేయడం పైననూ, (ఏ మారుమూలలోనో వుండిపోయి గ్రామసీమలు సాగిస్తూన్న ఏకాంత జీవితాన్నీ, సంకుచితతత్వాన్నీ, అనాగరికమైన మొరటుతనాన్నీ రూపుమాపుతూ, దీనితోపాటు కృత్రిమరీతుల్లో పెద్దపట్నాలలో బ్రహ్మాండమైన ప్రజారాసుల విపరీత సాంద్రీకరణాన్నీ అంతమొందించుతూ) ప్రజాసంఖ్యను ప్రపంచంమీద పునః సర్దుబాటు చేయడంపైననూ ఆధారపడిన వ్యవసాయ, పరిశ్రమల పరస్పరాశ్రయంయొక్క నూతన సంబంధ విశేషాలను పెట్టుబడిదారీ వ్యవస్థ తన అభివృద్ధియొక్క అత్యున్నత దశలో స్థాపించుతుంది. నూతన రూపాన్ని ధరించిన కుటుంబాన్నీ, స్త్రీల ప్రతిపత్తిలోనూ భావి తరంవారిని పెంచడంలోనూ నూతన పద్ధతులనూ, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క ఉన్నతోన్నత దశలే స్థాపించుతాయి: స్త్రీలను పిల్లలనూ కూలీలుగా వినియోగించడమూ, పెట్టుబడిదారీ విధాన ఫలితంగా పితృస్వామిక కుటుంబ విచ్ఛిత్తీ, ఇవి ఆధునిక సమాజంలో అతి భయంకరమూ విపత్కరమూ ఏహ్యమూ అయినట్టి రూపాలను ధరించుతాయి. ఇన్ని జరుగుతూన్నప్పటికీ "...నూతన పారిశ్రామిక వ్యవస్థే కుటుంబ పరిధులకు ఆవలనున్న ఉత్పత్తి విధానంలో స్త్రీలకు, యువకులకు, ఆడ మగ అనే వివక్షత లేకుండా పిల్లలకు, ముఖ్యపాత్రను కలుగజేస్తూ, ఉచ్చస్థాయిలో వున్న కుటుంబ జీవితమునకూ స్త్రీ పురుష సంబంధాలకూ నూతన ఆర్థిక పునాదులను సృష్టిస్తూంది. పూరతనకాలపు రోమ్, గ్రీస్, లేదా ప్రాచ్య దేశాల కుటుంబ వ్యవస్థ రూపాలే శాశ్వతములైనవీ పరిపూర్ణ పరిణతిని చెందినవనీ భావించడం ఎంత అసందర్భంగా వుంటుందో, ఆవిధంగానే ట్యూటన్-క్రిస్టియన్ రూపాన్ని వహించిన కుటుంబ వ్యవస్థే శాశ్వతమైనదీ పరిపూర్ణ పరిణతిని చెందినదనీ భావించడం అంత అసందర్భంగానూ వుంటుంది; ఆమాటకొస్తే, ఈరూపాలన్నీ మొత్తంమీద చారిత్రకాభివృద్ధిలో దశలవారీగా సంభవించిన ఒక క్రమానుగతిని సూచిస్తున్నాయి. అంతేకాక, కార్మికుల జట్లలో స్త్రీ పురుష విభేదంగానీ, వయస్సు విభేదంగానీ పాటించకుండా సమిష్టిగా పని

చేయడమనే విషయం, సరైన పరిస్థితులలో గనుక జరిగితే, కారుణ్యంతో కూడిన అభివృద్ధికే అది తప్పనిసరిగా మూలకారణం కాగలదని స్పష్టంగా కనబడుతునే వుంది. అయితే, మానవ క్రమాభివృద్ధిలో అయత్నకృతంగా పెరిగినట్టి ఉత్పత్తి విధానం, శ్రామికుని కోసమే ఉనికి కలిగివుండడం బదులు, ఉత్పత్తి విధానం కోసమే శ్రామికుడు ఉనికి కలిగి వున్నాడనే స్వభావాన్ని కలిగినట్టి, పెట్టుబడిదారీ వ్యవస్థకింద అమానుష రూపాన్ని ధరించిన ఈ విషయమే, దుర్నీతికీ బానిసత్వానికీ చీడపురుగుల పుట్టగా తయారవుతూంది." ("పెట్టుబడి," 1 వ సంపుటం, 13 వ అధ్యాయం చివరి భాగం.) ఫ్యాక్టరీ పద్ధతిలో, "ఒక నిర్దిష్ట వయస్సు దాటిన ప్రతి శిశువుకూ ఉత్పత్తిదక్షతను దోహదం చేసేందుకై అవలంబించబడుతూన్న బోధనా పద్ధతులలో, ఉత్పత్తిదాయకమైన శ్రమను విద్యతోనూ వ్యాయామంతోనూ మేళవించేటట్టి విద్యావిధానం కూడా ఒక బోధనా పద్ధతిగానే కాకుండా, సంపూర్ణాభివృద్ధిని చెందిన మానవులను సృష్టించే ఏకైక విధానంగా రూపొందగలిగే బోధనా పద్ధతులను కలిగిన భావివిద్యా విధానపు విత్తులు" కూడా ఇమిడే వుంటాయి (అదే గ్రంథంలో అదే చోట). భూత కాలంలో జరిగిపోయిన చరిత్రను వివరించి చెప్పడానికి ఉపయోగపడేందుకే కాకుండా, భవిష్యత్తును గూర్చి నిర్భయంగా నిర్ణయాలను చేయడానికిన్నీ, ఆ నిర్ణయాల లక్ష్యసాధనకు ధైర్యమైన కార్యాచరణను నిర్ణయించుకోడానికిన్నీ ఉపయోగపడేట్టుగా, జాతీయత, రాజ్యాంగ యంత్ర సమస్యలను రెంటినీ ఒక చారిత్రక ప్రాతిపదికను కలిగిన విషయాలుగా మార్క్సీయ సోషలిజం పరిగణించుతుంది. సాంఘికాభివృద్ధియొక్క బూర్జువా శకంలో జాతులు ఒక అనివార్యమైన ఉద్భవం, ఒక అనివార్యమైన రూపం. "జాతిలోనే తానొక అంతర్భాగంగా ఏర్పడితేనే తప్ప," "జాతీయత" ("ఆ పదానికి బూర్జువావర్గం ఇచ్చే అర్థంలో మాత్రం కాకుండానే") కలిగి వుంటేనే తప్ప, బలీయమైన అభివృద్ధిని గాని, ఒక నిర్దిష్ట రూపాన్ని గాని కార్మికవర్గం పొందగల్గేది కాదు. కాని పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందినకొలదీ, పెట్టుబడిదారీ విధానమే జాతీయ అడ్డంకులను అంతకంతకు మరింత తీవ్రంగా భగ్నంచేసి, జాతీయ ఏకాకిత్వాన్ని నాశనం చేసి, జాతీయ వైషమ్యాలస్థానే వర్గవైషమ్యాలను స్థాపిస్తుంది. అందుచేతనే బాగా అభివృద్ధి పొందిన దేశాల్లో, "కార్మికులకు మాతృదేశం లేదు" అనే విషయమూ, అన్ని దేశాల్లోనూ కాకపోయినా, అధమపక్షం నాగరిక దేశాల్లోనైనా వున్న కార్మికుల "ఐక్యకార్యాచరణ" శ్రామికవర్గంయొక్క విముక్తికి ముఖ్యమైన షరతులలో ఒకటి" ("కమ్యూనిస్టు ప్రణాళిక") అనే విషయమూ అక్షరాలా నిజం అనడంలో ఎంత మాత్రమూ సందేహం లేదు. సమాజం పరస్పరమూ శుద్ధవిరుద్ధములైన వర్గాలుగా చీలిపోయి, ప్రత్యక్షంగా సమాజానికి అతీతంగా వున్న "అధికార శక్తి" లేనిదే సమాజం మనడానికే వీల్లేని పరిస్థితుల్లో, కట్టుదిట్టమొనర్చబడిన పశుబలప్రయోగ రూపాన్ని ధరించిన రాజ్యాంగ

యంత్రం అనే రాజ్యవ్యవస్థ, సమాజ అభివృద్ధి ఒక నిర్దిష్ట దశ అందుకోగానే ప్రాదుర్భ విస్తుంది. వర్గవైరుధ్యాల్లోనుండి పుట్టిన రాజ్యాంగయంత్రం, "...వర్గాలన్నింటిలోనూ మిక్కిలి బలోపేతమై ఆర్థికంగా బలవత్తరమైన వర్గంయొక్క రాజ్యాంగయంత్రంగా తయార వుతుంది. తన చేతిలో చిక్కిన రాజ్యాంగయంత్రంయొక్క సహాయంతో ఈ వర్గం రాజ కీయంగా ప్రాబల్యం వహించి, తద్వారా అణగారిపోయున్న వర్గాలను మరింత అణగదొక్కి దోచు కోవడానికి నూతన సాధనాలను సంపాదిస్తుంది. ఈ ప్రకారంగా, పూర్వకాలపు రాజ్యాంగ యంత్రం, బానిస యజమానుల చేతుల్లో బానిసలను అణగదొక్కి వుంచడానికి ఉపయోగ పడిన రాజ్యాంగయంత్రంగా ఏలా ఏర్పడిందో, తరువాతికాలంలో ప్రభువర్గాల చేతుల్లో రైతుబానిసలనూ బానిస సేవకులనూ మట్టిపెట్టి వుంచడానికి ఉపయోగపడినట్టి ఫ్యూడల్ రాజ్యాంగయంత్రంగా ఏలా ఏర్పడిందో, ఆ విధంగానే ఆధునిక ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వపు రాజ్యాంగయంత్రం కూలిశ్రమను దోచుకోవడానికి పెట్టుబడి చేతిలో ఒక సాధనంగా ఏర్ప డింది." ("కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుపూర్వోత్తరాలు" అనే గ్రంథంలో తన అభిప్రాయాలనూ మార్క్స్ అభిప్రాయాలనూ ఎంగెల్స్ వివరిస్తూ రాశాడు.) బూర్జువా రాజ్యాంగయంత్రాలన్నింటిలో అత్యంత స్వేచ్ఛాయుతమూ అభ్యుదయకరమూ అయినట్టి ప్రజాస్వామ్య ప్రజాసత్తాకము కూడా ఏవిధంగానూ ఈ వాస్తవవిషయాన్ని తొల గించకుండా, దీని రూపాన్ని మాత్రమే మార్చింది (ప్రభుత్వానికీ షేరుమార్కెట్టుకీ వున్న సంబంధమూ, ఉద్యోగస్థులూ వార్తాపత్రికావ్యవస్థా, మొదలైన శ్రేణులలో — ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ — వున్న దుర్నీతి దీనికి తార్కాణం). వర్గాలనే అంతమొందించడానికి దారి తీయడంవల్ల, తత్ఫలితంగా రాజ్యాంగయంత్రమే అంతమొందేటట్టు చేస్తుంది సోషలిజం. "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" అనే గ్రంథంలో ఎంగెల్స్ ఇలా రాస్తాడు: "సమాజ మొత్తాని కంతటికీ ప్రాతినిధ్యం వహించి రాజ్యాంగయంత్రం చేయబూనే మొదటి కార్యమే — సమాజం పేరిట ఉత్పత్తిసాధనాలను తన కైవసం చేసుకోవడమే — రాజ్యాంగయంత్రంగా తాను నిర్వ ర్తించే కడపటి స్వతంత్ర కార్యం కూడాను. రాజ్యాంగయంత్ర శక్తి సామాజిక సంబంధాల్లో ఒక రంగం తరువాత ఒక రంగంలో జోక్యం ఇక అనావశ్యకమైపోయి, ఈ జోక్యం కలుగజేసు కోవడం తుట్టతుదకు దానంతటదే ఆగిపోతుంది. వ్యక్తులపైన పరిపాలన పోయి, దాని స్థానే వ్యవహారాల నిర్వహణ, ఉత్పత్తి విధానాల నిర్వహణము సంభవించుతుంది. రాజ్యాంగయంత్రాన్ని 'ఎత్తివేయడం' అంటూ జరగదు; దానంతట అదే క్షీణించి పోతుంది." "స్వతంత్రులూ సమానులూ అయినట్టి ఉత్పత్తిదారుల సంఘపు ప్రాతిపదికపైన ఉత్పత్తిని అగ్గనైజుచేసి తదుపరి, సమాజం యావత్తూ రాజ్యాంగయంత్రాన్నీ పురాతన వస్తుప్రదర్శనశాలలో, వడుకు

రాట్నమూ కంచుగొడ్డలీ, వీటి సరసనే దాని నిజస్థానంలో భద్రంగా వుంచుతుంది.'' (ఎంగెల్స్: ''కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుపూర్వోత్తరాలు.'')

చిట్టచివరకు ఒక విషయం చెప్పవలసి వుంది: ఆస్తి హక్కులు లాక్కొన్నవారి ఆస్తి హక్కులు లాక్కొనబడుతూన్న కాలంలో కూడా తమ మనుగడను సాగించుకుంటూన్న సన్నకారురైతులపట్ల మార్క్సీయ సోషలిజం అవలంబించే వైఖరిని వివరించవలసిన సందర్భంలో, మార్క్సుయొక్క అభిప్రాయాలను వెల్లడించుతూ ఎంగెల్సు చేసిన ప్రకటనను మనం ఉదాహరించాల్సి వుంది: ''రాజ్యాంగయంత్రశక్తిని మనం హస్తగతం చేసుకొన్న తరువాత, బడా భూస్వాములనుండి వారి భూములను బలాత్కారంగా లాగుకొనేటట్టు, సన్నకారురైతుల నుండి భూములను (పరిహారం చెల్లించా, చెల్లించకుండానా అనే ప్రశ్నతో ఎట్టి నిమిత్తమూ లేకుండానే) బాలాత్కారంగా లాగుకోవడమనే విషయాన్నే మనం తలపెట్టం. సన్నకారురైతు విషయంలో మన కర్తవ్యం ఏమిటంటే: మొదట, అతని సొంత వ్యాపారాన్నీ అతని సొంత ఆస్తినీ, బలాత్కారంగా కాకుండా ఉదాహరణపూర్వకంగా అతనికి నమ్మకం కలిగించి, ఇందుకు అతనికి సామాజిక సహాయాన్ని అందజేసి, వాటిని సహకార సంస్థలుగా పరివర్తనకు దారి తీయడం. ఇక అటుతరువాత సన్నకారురైతుకి అనేక లాభాలను ముందుముందు చూపించ డానికి కావలసిన వనరులు మన చేతిలో వుంటాయి; ఈ లాభాలు జరుగబోతాయని అతనికి నేడే స్వయం వ్యక్తంగానే కనబడుతూంది కూడాను.''[19] (ఎంగెల్స్ ''ఫ్రాన్సు జర్మనీలలో రైతు సమస్య'' అనే గ్రంథం, అలెక్సేయెవా కూర్పు, 17 వ పుట; రష్యను అనువాదంలో పొర పాట్లున్నాయి. మూలం "Neue Zeit" లో[20] వెలువడింది).

# శ్రామిక వర్గ పోరాటంలోని ఎత్తుగడలు

వెనుకటి కాలంనాటి భౌతికవాదంలో వుండే ప్రధాన లోపాల్లో ఆచరణయోగ్యమైన విప్లవ క్రియాశీలశక్తికి అవసరమైన పరిస్థితులనుగానీ దాని ప్రాముఖ్యతనుగానీ గుర్తించ లేకపోవడం ముఖ్యమైనదని 1844–1845 నాటికే మార్క్సు పరిశీలించి తెలుసుకొని, తన సిద్ధాంత గ్రంథాల రచనతోపాటు, శ్రామికవర్గం సాగించే పోరాటంలో ఆ వర్గం అవలంబించ వలసిన ఎత్తుగడలను గురించి తదేకదీక్షతో తన జీవితకాలాన్నంతనూ వినియోగించాడు. ఈ విషయానికి సంబంధించిన అనేక సంగతులు మార్క్సు రాసిన అన్ని గ్రంథాల్లోనూ, అందు లోనూ ముఖ్యంగా 1913 లో నాలుగు సంపుటాలుగా ప్రచురింపబడిన ఎంగెల్సుతో ఆయన జరిపిన ఉత్తరప్రత్యుత్తరాల్లోనూ మనకు లభించుతాయి. ఈ సంగతులన్నింటినీ సంగ్రహించి

సంకలనంచేసి అధ్యయనంచేసి పరిశీలించవలసిన కార్యం ఇంకా ఎంతేనా వుంది. ఈ కారణం వల్ల ఈ విషయాన్ని గురించి ఇప్పుడు క్లుప్తంగా సాధారణ సూత్రాలను మాత్రమే వివరించ వలసి వుంటుంది; ఈ భాగాన్ని వివరించనట్టి భౌతికవాదం దృఢమైన కార్యదీక్ష లేకుండా, ముందుకూ వెనుకకూ ఊగిసలాడుతూ, సంకుచితంగా వుండి జీవచ్ఛవంలాగు తయారవుతుందని మార్క్సు న్యాయంగానే అభిప్రాయపడ్డాడని మనం గట్టిగా నొక్కిచెప్పాల్సి వుంది. తన భౌతిక గతితార్కిక భావనా ప్రమేయాలన్నింటితోనూ తు.చ తప్పకుండా అనుగుణ్యంగా వుంటూవున్నట్టి శ్రామికవర్గపు ఎత్తుగడ సాధించవలసిన మౌలిక కర్తవ్యాన్ని మార్క్సు స్పష్టంగా నిర్వచించాడు. ఒక నిర్దిష్ట సమాజంలో వున్న అన్ని — ఒక్కటైనా తప్పకుండా అన్ని — వర్గాలయొక్క పరస్పరా శ్రయ సంబంధాలన్నింటి మొత్తాన్నీ స్వతస్సిద్ధంగా పరిశీలించడం, తదానుషంగికంగా ఆ సమాజంయొక్క బాహ్యగతాత్మకమైన అభివృద్ధిక్రమ దశనూ, ఆ సమాజానికీ తదితర సమా జాలకూ వున్న పరస్పరాశ్రయ సంబంధాలనూ పరిశీలించడం, ఇదొక్కటే పురోగామివర్గం అవలంబించవలసిన సరైన ఎత్తుగడలకు పునాదిగా ఏర్పడగలుగుతుంది. ఇదే సమయంలో, అన్ని వర్గాలూ అన్ని దేశాలూ స్థిరపడిపోయినట్టివే అని భావించకుండా, అవి గమనశీలములు అనే దృక్పథాన్ని, అనగా చలనరహిత స్థితిలో వున్నట్టుకాకుండా చలన స్థితిలో వున్నట్టు (ఈ చల నంయొక్క నియమాలు ఆ యా వర్గాల ఉనికియొక్క ఆర్థిక పరిస్థితులనుబట్టి నిర్ణయ మవుతూంటాయి), మనం భావించాలి. ఇక చలనాన్ని కూడా, గతకాలపు దృష్ట్యానే కాకుండా, భావికాలపు దృష్ట్యా పరిశీలిస్తూ, అదే సమయంలో మిక్కిలి మెల్లగా జరుగుతూవున్న మార్పులను మాత్రమే గమనించేటట్టి "పరిణామవాదుల" అపభ్రంశపు భావనల ప్రకారం కాకుండా, ఎంగెల్సు పేర మార్క్సు రాసినట్టు, "ఇరవై సంవత్సరాల కాలంలో జరిగిన క్రమాభి వృద్ధినంతటినీ ఒక్క దినంలోనే సంభవించిందా అనిపించేటంతటి ప్రమాణంలో, ఉత్తరో త్తరా ఇరవై సంవత్సరాలూ ఒక్క దినంలో సంక్షిప్త పరచబడే దినాలు సంభవించవచ్చు కూడా," అని చూడగలిగినట్టి గతితార్కిక దృక్పథంతో చూడగలగాలి. ("ఉత్తరప్రత్యుత్తరాలు," 3 వ సంపుటం, 127 వ పుట.) అభివృద్ధిలోని ప్రతి దశలోనూ, ప్రతి క్షణంలోనూ మానవ చరిత్రలో స్వతస్సిద్ధంగా, అనివార్యమైన, ఈ గతితర్కాన్ని శ్రామికవర్గపు ఎత్తుగడలు లెక్క లోకి తీసుకొంటూ, ఇటు రాజకీయంగా నిస్తబ్ధతగా వున్న కాలాన్ని, "శాంతియుతంగా" అని సాధారణంగా చెప్పబడే నత్తనడకతో మందగతిని సాగుతూవున్న క్రమాభివృద్ధి కాలాన్ని పురోగామి వర్గంయొక్క వర్గచైతన్యాన్నీ, బలాన్నీ, సంఘర్షణ సామర్థ్యాన్నీ పెంపొందించుకోవడానికి వినియోగించుకుంటూ, అటు ఈ వినియుక్త కార్యాన్నంతనూ ఈ వర్గం తలపెట్టిన ఉద్య మంయొక్క "అంతిమ లక్ష్య సాధన" దిశగా నడిపించడం కోసమూ, "ఇరవై సంవత్సరాలు ఒక్క దినంలోనే సంక్షిప్త పరచబడే" రోజులలో నిర్వర్తించవలసిన బృహత్తర కార్యాలను

ఆచరణలో సాధించగలిగే శక్తిని ఈ వర్గంలో సృష్టించడంకోసమూ వినియోగించుకుంటూం డాలి. ఈ సందర్భంలో మార్క్స్ ప్రతిపాదించిన రెండు వాదనలను ప్రత్యేకంగా అత్యంత ప్రాముఖ్యతను కలిగి వున్నాయి: వీటిలో ఒక వాదన "తత్వశాస్త్ర దారిద్ర్యం" అనే గ్రంథంలో మార్క్స్ వివరించాడు: ఆ వాదన శ్రామికవర్గంయొక్క ఆర్థిక పోరాటానికీ, ఆర్థిక సంస్థ లకూ చెందినది. రెండవ వాదన "కమ్యూనిస్టు ప్రణాళిక"లో వివరించి వుంది: శ్రామికవర్గం యొక్క రాజకీయ కర్తవ్యాలను గురించినది. మొదటి వాదన ఈవిధంగా వుంటుంది: "ఒక రితో ఒకరికి పరిచయం లేనట్టి అనేకమంది ప్రజల సమూహాన్ని, బృహత్‌స్థాయిలో ఉత్పత్తి చేసే పరిశ్రమ ఒక్కచోట సాంద్రీకరిస్తుంది. పోటీవల్ల వారి స్వప్రయోజనాల్లో భేదాలు ఏర్పడుతాయి. కాని కూలిస్థాయి పడిపోకుండా నిలబెట్టుకోవాల్సిన అవసరంవల్లనూ, యజ మానిపట్ల వారందరికీ సామాన్యంగా వుండే వ్యతిరేక భావంవల్లనూ వాళ్లలో వున్న ప్రతి ఘటనా భావం వారిలో ఐక్యతను — కలయికను పురికొల్పితుంది... మొదటలో వేర్వేరుగానే వుండి తరువాత గ్రూపులుగా ఏర్పడిన ఈ కలయికలుగా ఇక నిరంతరమూ ఐక్యతతో నిల బడే పెట్టుబడిని ఎదుర్కొనవలసి వచ్చేటప్పటికల్లా, కూలిస్థాయిని నిలబెట్టుకొనడం కం టెనూ ఈ కలయికలను నిలబెట్టుకోవడమే వారికి (అనగా కార్మికులకు) అంతకంతకు మరింత అవసరమవుతుంది... ఈ పోరాటంలో — వాస్తవమైన అంతర్యుద్ధంలో — రానున్న యుద్ధా నికి అవసరమయే శక్తులన్నీ ఐక్యమయి అభివృద్ధి చెందుతూంటాయి. పరిస్థితులు ఒకసారి ఈ స్థానానికి వచ్చేసరికి, ఈ కలయిక రాజకీయ స్వభావం వహించుతుంది." అనేక దశాబ్దాల వరకూ ఆర్థిక పోరాటమూ, ట్రేడ్‌యూనియన్ ఉద్యమమూ అవలంబించ వలసినట్టి, "రానున్న యుద్ధానికి" తన శక్తులనన్నిటినీ సమీకరించుకొనేందుకు అత్యంత దీర్ఘకాల వ్యవ ధిలో శ్రామికవర్గం అవలంబించవలసినట్టి కార్యక్రమమూ, ఎత్తుగడయూ, అన్నీ ఇందులో ఇమిడివున్నాయి. దీనితోపాటు, బ్రిటిష్ కార్మికోద్యమ దృష్టాంతంనుండి మార్క్స్ ఎంగె ల్సులు అనేక ఉదాహరణలను — పారిశ్రామిక "సౌభాగ్యం" కార్మికుల దృష్టిని పోరాటంనుండి మరలించడానికి, "కార్మికులను కొనివేయడానికి" ఏలాగు దారితీస్తుందో ("ఉత్తరప్రత్యు త్తరాలు," 1 వ సంపుటం, 136 వ పుట), ఈ సౌభాగ్యం కార్మికులను సాధారణంగా ఏలా "దుర్నీతిపాలు చేస్తూందో" (2 వ సంపుటం, 218 వ పుట); ఏవిధంగా బ్రిటిష్ శ్రామిక వర్గం "బూర్జువా"గా తయారయిందో — "అన్ని జాతుల కంటే బూర్జువా జాతైన ఈ జాతి చిట్టచివరకు బూర్జువావర్గపు సరసనే బూర్జువా ప్రభువర్గాన్నీ, బూర్జువా శ్రామికవర్గాన్నీ కల్గే లక్ష్యాన్ని పెట్టుకున్నట్టే కనబడుతూంది" (2 వ సంపుటం, 290 వ పుట); బ్రిటిష్ కార్మికోద్యమంయొక్క "విప్లవశక్తి" ఏలాగైతే నీళ్లుకారిపోతూందో (3 వ సంపుటం, 124 వ పుట); "స్పష్టంగా కనబడుతూన్న ఈ బూర్జువా అంటుజాడ్యాన్ని వదిలించుకోవాలంటే"

ఏ విధంగా ఇంగ్లీషు కార్మికులు బహుశ చాలాకాలమే వేచివుండవలసి వస్తుందో (3 వ సంపుటం, 127 వ పుట); ఏ విధంగా బ్రిటిష్ కార్మికోద్యమంలో ''చార్టిస్ట్ సత్తువ'' లోపించిందో (1866; 3 వ సంపుటం, 305 వ పుట); బ్రిటిష్ కార్మికుల నాయకులు ''రాడికల్ బూర్జువా వర్గానికీ కార్మికునికీ మధ్యస్థంగా వున్న రకం''గా ఏ విధంగా తయారవుతున్నారో (హోలీయోక్ దృష్టాంతాన్ని పేర్కొంటూ రాసినది, 4 వ సంపుటం, 209 వ పుట); బ్రిటిష్ గుత్తాధిపత్యంవల్లనూ, ఈ గుత్తాధిపత్యం సాగినంత కాలమూ ఏవిధంగానైతే బ్రిటిష్ కార్మికుడు ''ముందుకు కదలడో'' (4 వ సంపుటం, 433 వ పుట) – పేర్కొన్నారు. కార్మికోద్యమంయొక్క (ఫలితంతో సహా) మొత్తం గతి సందర్భంలో, ఆర్థిక పోరాటంయొక్క ఎత్తుగడలు, ఆశ్చర్యాన్ని పురిగొల్పే వైశాల్యమును గల్గినట్టి, సమగ్రమైనట్టి, గతితార్కికమైనట్టీ, యథార్థంగా విప్లవాత్మకమైనట్టి అద్భుతమైన దృక్పథంనుండి పరిశీలించబడ్డాయి.

రాజకీయ పోరాటంలో అవలంబించవలసిన ఎత్తుగడలను గురించి మౌలికమైన మార్క్సీయ సూత్రాన్ని ''కమ్యూనిస్టు ప్రణాళిక'' ఈవిధంగా నిర్వచిస్తోంది: ''కమ్యూనిస్టులు కార్మిక వర్గంయొక్క తక్షణ కోర్కెలకోసమూ, కార్మికవర్గంయొక్క తాత్కాలిక ప్రయోజనాలను అమలులోకి వచ్చేందుకు పోరాడుతారు; కాని ప్రస్తుత ఉద్యమంలో భవిష్యత్ వుద్యమాన్ని పరిరక్షింప పూనుకుంటారు.'' ఈ కారణంచేతనే ''1846 లో ఏ పార్టీ ఐతే క్రాకౌవ్‌లో పితూరీని[21] లేవదీసినదో ఆ పార్టీనే'' పోలెండులోని ఆ ''వ్యవసాయ విప్లవ'' పార్టీనే 1848 లో మార్క్స్ బలపరచాడు. జర్మనీలో కూడా 1848 – 1849 లలోనూ తీవ్ర అతివాద విప్లవాత్మక ప్రజాస్వామ్యాన్ని మార్క్స్ బలపరచి, ఎత్తుగడలను గురించి తాను అనాడు చెప్పిన మాటలను తదుపరి ఎన్నడూ కూడా అతడు ఉపసంహరించుకోలేదు. జర్మన్ బూర్జువా వర్గం ''మొదటినుండీ కూడా ప్రజలకు ద్రోహంచేసే ధోరణిని'' కలిగి వుందనీ (రైతాంగంతో మిత్రత్వాన్ని నెరపుకుని వుండినట్టయితే మాత్రం బూర్జువావర్గం తన కర్తవ్యాలను సంపూర్ణంగా నెరవేర్చగలిగి వుండేది), ''పురాతన సమాజంయొక్క కిరీటధారులైన ప్రతినిధులతో రాజీపడి తీరుతుందనీ'' మార్క్స్ అభిప్రాయపడ్డాడు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవ యుగంలో జర్మన్ బూర్జువా వర్గంయొక్క స్థానాన్ని మార్క్స్ విశ్లేషించి వివరించాడు – ఆ విశ్లేషణ ఎటువంటిదంటే, చలనస్థితిలో వున్న సమాజాన్ని పరిశీలించడం, అదైనా కేవలం ప్రతీప చలనదిశనుండే దృక్స్థానాన్ని తీసుకుని పరిశీలించనట్టి, భౌతికవాద పద్ధతికి దృష్టాంతమైన విశ్లేషణ, అని సందర్భవశాత్తూ మనమిక్కడ చెప్పాల్సి వుంది – ఆ విశ్లేషణ సారాంశాన్ని ఈవిధంగా వివరించాడు: ''...తనలో తనకే విశ్వాసం లేకుండా, ప్రజలమీద విశ్వాసం లేకుండా, పై స్థానాల్లో వున్న వారిమీద అసంతృప్తితో మూలుగుతూ, అడుగునున్న వాళ్ళని

చూసి వణకిపోతూ... ప్రపంచ ఝూంఝూమారుతానికి హడలిపోతూ... ఏ సందర్భంలోనూ శక్తిలేక, అన్ని సందర్భాల్లోనూ అభిప్రాయచౌర్యం కావించుతూ... చొరవ అనేది లేకుండా... నడివయస్సులో వున్న ప్రజల నూతన యవ్వనోత్సాహపు ఆవేగాలకు ఖర్మంచాలక విధివశాత్తూ నాయకత్వం వహించవలసి వచ్చి, వాటిని తన వార్ధక్యపు ప్రయోజనాలకోసం మళ్లింపజూస్తూన్న పాపాలపుట్ట అయిన ముసలితుక్కు..." ("నోయెరైనిషె సైటుంగ్," 1848; "సారస్వత వారసత్వం," 3 వ సంపుటం, 212 వ పుట.)[22] ఇరవైయేళ్ల తరువాత ఎంగెల్స్ పేర రాసిన వుత్తరంలో ("ఉత్తరప్రత్యుత్తరాలు," 3 వ సంపుటం, 224 వ పుట), స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం మున్ముందు పోరాడవలసిన అవసరంకంటె ఇప్పుడు బానిసతనంతో కూడిన శాంతే మంచిదని బూర్జువావర్గం నిశ్చయించుకోవడమే 1848 విప్లవంయొక్క ఓటమికి కారణమని మార్క్స్ రాశాడు. 1848–1849 నాటి విప్లవ తరుణం అంతమొందిన తరువాత, మాటి మాటికి విప్లవం విప్లవం అంటూ ఆటలాడుకొనే ధోరణిని మార్క్స్ ప్రతిసారీ వ్యతిరేకించుతూ వచ్చి, (షాప్పెర్, విల్లిఖ్ వీరిద్దరికీ వ్యతిరేకంగా అతడు సలిపిన ప్రతిఘటన), నూతన దశలో పైకి "శాంతియుతంగా" కనబడుతూనే, నూతన విప్లవాలకోసం సన్నద్ధంకాగలిగే సామర్థ్యాన్ని అలవరచుకోవాలని అతడు ఖండితంగా చెబుతూవచ్చాడు. ఎట్టి భావంతోనైతే ఈ కార్యకలాపాలను సాగించాలని మార్క్స్ అభిప్రాయపడ్డాడో, 1856 లో అభివృద్ధి నిరోధక శక్తులు జర్మనీలో రాజ్యమేలుతూన్న అంధకారయుగంలో వున్న పరిస్థితులను గురించి అతడు వేసిన అంచనాయే తెలుపుతూంది: "జర్మనీలో వున్న సంగతి అంతా, శ్రామిక విప్లవాన్ని రైతు సంగ్రామంయొక్క రెండవ కూర్పులాంటిదేదైనా ఒక దానితో బలపర్చగలిగే అవకాశం పైనే ఆధారపడివుంటుంది." (2 వ సంపుటి, 108 వ పుట.) జర్మనీలో ప్రజాతంత్ర (బూర్జువా) విప్లవం పూర్తికానంతవరకూ, రైతాంగంయొక్క ప్రజాతంత్ర శక్తిని అభివృద్ధి చేయడానికై అవలంబించవలసిన ఎత్తుగడల పైనే సోషలిస్టు శ్రామికవర్గంయొక్క దృష్టినంతనూ మార్క్స్ కేంద్రీకరించాడు. లాసాల్ ముఖ్యంగా జర్మన్ యుంకర్ల[23] యొక్క, ప్రష్యను జాతీయతయొక్క కృత్యాలను లాసాల్ చూసీచూడకుండా వుండడంవల్ల వాటికి పరోక్షంగా వత్తాసు ఇస్తూండడం కారణంగానూ, లాసాల్ వైఖరి, "బాహ్యగతాత్మకంగా పరిశీలించి చూస్తే... కార్మికోద్యమాన్ని ప్రష్యాకి అప్పగించివేసి ద్రోహంచేయడమే" అని మార్క్స్ సందర్భాల ననుసరించి అభిప్రాయ పడ్డాడు. (3 వ సంపుటం, 210 వ పుట.) 1865 లో మార్క్స్ తానూ కలిసి పత్రికలలో ఒక సంయుక్త ప్రకటన చేద్దామనే ఉద్దేశంతో ఒండొరులూ తమ అభిప్రాయాలను ఉత్తరాలద్వారా ముచ్చటించుకుంటూ, ఎంగెల్స్ ఈలా రాశాడు: "...వ్యవసాయమే ప్రధాన వృత్తిగాగల దేశంలో... ఫ్యూడల్ వర్గపు మహాప్రభువులు 'కొరడా దెబ్బలతో' గ్రామీణ శ్రామికవర్గంపై కావించుతూన్న పితృస్వామిక 'దోపిడీని'

గురించి పల్లెత్తుమాటైనా అనకుండానే, పరిశ్రమలలో పాటుపడుతూన్న కార్మికవర్గం పేరిట బూర్జువావర్గం పైనే దాడి సలపడం కేవలం దుర్మార్గం తప్పమరొకటి కాదు." (3 వ సంపుటం, 217 వ పుట.) 1864 నుండి 1870 వరకూ, జర్మనీలో బూర్జువా ప్రజా తంత్ర విప్లవాన్ని సమాప్తి గావించే కాలావధివరకూ, ప్రష్యా ఆస్ట్రియాదేశాల దోపిడీ వర్గాలు ఈ విప్లవాన్ని ఏదో ఒక విధంగా పైనుంచే నడిపించి పూర్తి చేయడానికి ప్రయత్నించిన శకం చరమదశలో, బిస్మార్క్‌తో వగలాడి చేష్టలు జరుపుతూన్న లాసాల్‌ని ఖండించడమే కాకుండా, "ఆస్ట్రియన్ అభిమానం" కనబరుస్తూ, ప్రత్యేకతాతత్త్వవాదం వైపు మొగ్గుతూ వున్న లీబ్‌క్నెఖ్ట్‌ను మందలించి సరిదిద్దడమేకాకుండా, బిస్మార్క్‌నూ ఆస్ట్రియన్ అభిమా నులనూ ఒకే విధమైన నిర్దాక్షిణ్యంతో ఎదుర్కొనే విప్లవాత్మకమైన ఎత్తుగడలను, "విజేత" అయిన ప్రష్యను యుంకర్‌కు సమ్మతముకాకుండా, అతనికి వ్యతిరేకంగా కూడా, ప్రష్యన్ సైనిక విజయాలవల్ల స్పష్టింపబడిన పునాదులను ప్రాతిపదికగా ఏర్పరచుకొన్న విప్లవాత్మక పోరాటాన్ని పునఃప్రారంభించగలిగే ఎత్తుగడలను అవలంబించాల్సిందని మార్క్స్ గట్టిగా కోరాడు ("ఉత్తరప్రత్యుత్తరాలు," 3 వ సంపుటం, 134, 136, 147, 179, 204, 210, 215, 418, 437, 440–441 వ పుటలు). 1870 సెప్టెంబరు 9 వ తేదీన మార్క్స్ గావించిన ప్రఖ్యాత ఇంటర్నేషనల్ విజ్ఞప్తిలో, తరుణం ఆసన్నం కాకముందే తిరుగబాటు ప్రారంభించకూడదని ఫ్రెంచి శ్రామికవర్గాన్ని మార్క్స్ హెచ్చ రించాడు; కాని ఆ తిరుగబాటు వాస్తవంగా (1871) ప్రారంభంకాగానే "స్వర్గాన్నే ముట్ట డిస్తున్నారు" అని (కూగెల్‌మన్ పేర మార్క్స్ రాసిన ఉత్తరం)[24] యొక్క విప్లవాత్మక చొర వను అత్యంత ఉత్సాహంతో ఆహ్వానించాడు. ఇదివరకు ఆక్రమించుకొన్న స్థానాన్ని వదలుకో వడంకంటెనూ, యుద్ధం చేయకుండానే అస్త్రసన్యాసం చేయడంకంటెనూ, అనేక ఇతర పరిస్థితులలోలాగే ఈ పరిస్థితిలో కూడా సంభవించిన విప్లవాత్మక చర్యయొక్క ఓటమే, మార్క్సీయ గతితార్కిక భౌతిక వాదదృష్ట్యా, శ్రామికవర్గ పోరాటంయొక్క సాధారణ గతి లోనూ, ఫలితంలోనూ తక్కువ ఘోరకలి. యుద్ధం చేయకుండానే అస్త్రసన్యాసం చేసి వుంటే శ్రామికవర్గంలో నిరాశానిస్పృహను పుట్టించి, దాని యుద్ధ సామర్థ్యాన్ని నాశనం చేసేసి వుండేది. రాజకీయంగా స్తబ్దత అలముకొని, బూర్జువా న్యాయమే ప్రబలి వున్న కాలంలో, చట్ట సమ్మతమైన పద్ధతులనవలంబించే పోరాటాన్ని సాగించాల్సి వుంటుందనే విషయాన్ని పూర్తిగా గుర్తెరిగినందువల్లనే, సోషలిస్టు వ్యతిరేక చట్టం[25] అమలులోకి వచ్చిన తరువాత మోస్ట్‌యొక్క "విప్లవకర పదజాలాన్ని" 1877 లోనూ, 1878 లోనూ మార్క్స్ నిశితంగా ఖండించాడు; అంతేకాకుండా, అధికారయుతమైన సోషల్-డెమొక్రాటిక్ పార్టీలో తాత్కాలికంగా అధికారాన్ని చలాయించినట్టి, సోషలిస్టు వ్యతిరేక చట్టాన్ని ప్రతిఘటించ

డానికిగాను చట్టవిరుధమైన పద్ధతుల్లో పోరాటాన్ని లేవదీయడానికి తక్షణమే దృఢచిత్తాన్నీ పట్టుదలనూ విప్లవాత్మక ఉద్రేకాన్నీ ప్రదర్శించనట్టి అవకాశవాదాన్ని అతడు దృఢంగానూ, అంతకంటె ఇంకా మరింత ఎక్కువ నిశితంగానూ ఖండించాడు. ("ఉత్తరప్రత్యుత్తరాలు," 4 వ సంపుటం, 397, 404, 418, 422, 424 వ పుటలు; సోర్గె పేర మార్క్స్ రాసిన వుత్తరాలు కూడా గమనార్హం.)

జూలై – నవంబరు, 1914.

# ఫ్రెడరిక్ ఎంగెల్స్

ఎంతటి వివేచనా జ్యోతి అస్తమించెనోహో,
ఎంతటి హృదయము పరిస్పందన విరమించెనోహో![26]

1895 ఆగస్టు 5 వ తేదీన (నూతన పంచాంగం) ఫ్రెడరిక్ ఎంగెల్స్ లండన్‌లో చనిపోయాడు. ప్రఖ్యాతి వడసిన మహాపండితులలోనూ, నాగరిక ప్రపంచమంతటనున్న యావ దాధునిక శ్రామికవర్గానికి గురువర్యులైన వారిలోనూ, తన మిత్రుని కారల్ మార్క్స్ (మరణం 1883) తరువాత ఎంగెల్సే ద్వితీయస్థానాన్ని అలంకరిస్తున్నాడు. విధికృతంగా కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్సూ ఒకరితో ఒకరికి పరిచయం కలిగిన నాటినుండి, ఈ మిత్రులిద్దరుల జీవితకార్యమూ సమిష్టి కర్తవ్యంగా పరిణమించింది. ఈ కారణంవల్ల ఫ్రెడరిక్ ఎంగెల్స్ శ్రామికవర్గానికి చేసిన సేవను తెలుసుకోవాలంటే, సమకాలిక కార్మికోద్యమాభివృద్ధికిగాను మార్క్స్ గావించిన కృషియొక్క, ఉపదేశాలయొక్క ప్రాముఖ్యతను గూర్చి స్పష్టంగా తెలుసుకోవాల్సి వుంటుంది. బూర్జువావర్గంతో కలసి శ్రామికవర్గాన్ని సృష్టించి, నిర్మాణయుతం గావించుతూన్నట్టి నేటి ఆర్థిక విధానంయొక్క తప్పని సరైన ఫలితమే కార్మిక వర్గమూ, దాని కోర్కెలూ, అని మార్క్స్ ఎంగెల్సులే ప్రప్రథమంగా నిరూపించారు. కేవలం ఉదాత్తమనస్కులైన ఎవరోకొందరి వ్యక్తులు సదుద్దేశంతో సలిపిన ప్రయత్న ఫలితం కాకుండా, ఆర్గనైజైన శ్రామికవర్గం సాగించే వర్గపోరాటమే మానవాళినిప్పుడు దోపిడీ చేస్తున్న దుర్మార్గంనుండి విముక్తి చేయగలుగుతుందని వారు నిరూపించారు. తాము రచించిన శాస్త్రీయ గ్రంథాల్లో, సోషలిజం స్వాప్నికుల ఆవిష్కరణ కాదనీ, ఆధునిక సమాజంలో వున్న ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధియొక్క అంతిమ ఆశయమే, అనివార్యమైన ఫలితమేననీ మొట్టమొదటిసారిగా మార్క్స్ ఎంగెల్సులే వివరించి చెప్పారు. లిఖితపూర్వమైన మానవ చరిత్ర అంతా కూడా వర్గపోరాటంయొక్క, నిర్దిష్టములైన కొన్ని సామాజిక వర్గాలపై విజయాన్ని సాధించి వారిపై సాగించిన పరిపాలనా పరంపరయొక్క చరిత్రే తప్ప మరొకటి కాదు. వర్గపోరాటానికీ వర్గపరిపాలనకీ పునాదులైనట్టి ప్రైవేటు ఆస్తీ, అరాచక సామాజిక ఉత్పత్తీ అదృశ్యం కానంత వరకూ ఇది ఇలా సాగుతూనే వుంటుంది. శ్రామికవర్గ ప్రయోజనాలు క్షేమంగా వుండా

లంటే ఈ పునాదులు నిర్మూలమై తీరవలిసిందే; కాబట్టి వీటి నిర్మూలనకై అర్గనైజైన కార్మికులయొక్క చైతన్యవంతమైన వర్గపోరాటం సాగితీరాలి. అంతేకాకుండా, ప్రతి వర్గ పోరాటమూ రాజకీయ పోరాటమే.

తమ విముక్తికై పోరాడుతూన్న శ్రామికులందరూ మార్క్స్ ఎంగెల్స్‌ల అభిప్రాయా లను నేడు అవలంబించి ఆచరణలో పెట్టుతున్నారు. కాని 1840 లలో ఈ మిత్రులిద్దరూ ఆనాటి సోషలిస్టు వాఙ్మయ సృష్టిలోనూ సామాజికోద్యమాలలోనూ పాల్గొన్న కాలంలో, అట్టి అభిప్రాయాలు కేవలం నూతనంగా వుండేవి. ఆ రోజుల్లో తెలివి తేటలుగలవారూ తెలివి తక్కువ వారూ, నిజయాతీపరులూ, దగాకోరులూ, అనేకులు రాజకీయ స్వేచ్ఛా పోరాటం లోనూ, ఏకఛత్రాధిపతులయొక్క, పోలీసులయొక్క, మతగురువులయొక్క నిరంకుశత్వాన్ని ప్రతిఘటించుతూ సలిపిన పోరాటంలో నిమగ్నులై ఉన్నప్పటికీ, వారెవ్వరూ కూడా బూర్జువా వర్గ ప్రయోజనాలకూ శ్రామికవర్గ ప్రయోజనాలకూ వున్న బద్ధవిరోధాన్ని గ్రహించలేక పోయారు. ఒక స్వతంత్రమైన సామాజికశక్తిగా కార్మికులు వ్యవహరించగల్గుతారనే తలంపునే ఈ వ్యక్తులు సుతరామూ సహించలేకపోయేవారు. మరొక వైపున ఆ కాలంలో అమలులో వున్న సామాజిక వ్యవస్థయొక్క అధర్మాన్ని గురించి రాజులకీ పాలకవర్గాలవారికీ నచ్చజెప్పి వారిని ఒప్పించితే చాలు, ఇక ఆపైన ప్రపంచంలో శాంతినీ సర్వమానవ శ్రేయస్సునూ సులువుగా స్థాపించవచ్చునని కలలుగన్న స్వాప్నికులు అనేకులు, వీరిలో మహామేధావులు కూడా, వుండే వారు. ఎట్టి పోరాటమూ అవసరంలేకుండానే సోషలిజాన్ని సాధించవచ్చునని వీరు కలలు గన్నారు. వీరందరూకాక, ఆ కాలపు సోషలిస్టులూ కార్మికవర్గపు శ్రేయోభిలాషులూ ఇంచు మించు అందరూ కూడా, శ్రామికవర్గాన్ని ఒక వ్రణంలాగున చూస్తూ, పారిశ్రామికా భివృద్ధితో పాటుగానే ఈ వ్రణం కూడా పెరుగుతూండడం చూసి భయంతో హడలెత్తి పోయేవారు. ఈ కారణంచేత, పారిశ్రామికాభివృద్ధినీ, శ్రామికవర్గాభివృద్ధినీ ఏ విధంగా నిలిపి వేయడమా అనీ, "చరిత్ర రథచక్రాలను" ఏవిధంగా ఆపివేయడమా అనీ వీరందరూ యోచించ సాగారు. శ్రామికవర్గంయొక్క దినదినాభివృద్ధిని చూసి, అందరితోపాటు తాము కూడా భయపడడానికి మారుగా, శ్రామికవర్గంయొక్క నిరంతరాభివృద్ధిపైనే మార్క్స్ ఎంగెల్స్‌లు తమ ఆశలనన్నింటినీ పెట్టుకున్నారు. శ్రామికుల సంఖ్య ఎంత పెరుగుతే విప్లవవర్గంగా వారి శక్తి అంత అభివృద్ధి పొందుతుందనీ, సోషలిజం అవతరణ అంత దగ్గరపడుతుందనీ, అందుకు అంత సదవకాశం ఏర్పడుతుందనీ వారు విశ్వసించారు. కార్మికవర్గానికి మార్క్స్ ఎంగెల్స్‌లు చేసిన సేవను నాలుగు మాటల్లో చెప్పాలంటే ఈ విధంగా చెప్పవచ్చు: కార్మికవర్గం తన్ను తాను తెలుసుకొని, తన శక్తిని చైతన్యవంతంగా తెలుసుకోవడం ఏలాగో వారు బోధించారు; ఇక, కలలు స్థానే విజ్ఞానశాస్త్రాన్ని నెలకొల్పారు.

ఈ కారణంవల్లనే ప్రతి కార్మికునికీ ఎంగెల్స్ పేరూ అతని జీవితచరిత్రా తెలిసివుండడం ఎంతేనా అవసరం. రష్యను కార్మికులలో వర్గచైతన్యాన్ని కలిగించడమే మన ప్రచురణల లక్ష్యంకాబట్టి, ఈ వ్యాససంపుటిలో, ఆధునిక శ్రామికవర్గంయొక్క ఇద్దరు ఆచార్యులలోనూ ఒకడైన ఫ్రెడరిక్ ఎంగెల్స్ జీవితచరిత్రనూ కృషినీ తెలియజేయడం మన విధ్యుక్తధర్మం.

ఎంగెల్స్ 1820 లో ప్రష్యారాజ్యానికి చెందిన రైన్‌రాష్ట్రంలోని బార్మెన్ నగరంలో జన్మించాడు. అతని తండ్రి ఒక కార్ఖానా స్వంతదారుడు. కుటుంబ పరిస్థితులమూలాన్ని హైస్కూలు చదువు పూర్తిచేయకుండానే ఎంగెల్స్ 1838 లో బ్రేమెన్ పట్నంలో ఒక వర్తక కంపెనీలో గుమాస్తాగా చేరవలసి వచ్చింది. వర్తకవ్యాపారానికి చెందిన కార్యకలాపాలలో అతడు నిమగ్నుడై ఉండినప్పటికీ విజ్ఞానశాస్త్ర రాజకీయ అధ్యయనానికి ఏ విధంగానూ వాటిని అడ్డు పడనివ్వాడుకాడు ఎంగెల్స్. హైస్కూలులో చదువుతుండే రోజుల్లోనే ప్రభుత్వ నిరంకుశపరిపాలన పట్లా, అధికారుల ప్రజాపీడన పట్లా అతనికి ద్వేషం ఏర్పడింది. తత్వశాస్త్రాధ్యయనం అతనిని మరింత ముందుకు తీసుకునిపోయింది. ఆ రోజుల్లో జర్మను తత్వశాస్త్రంలో హేగెల్ ఉపదేశాలకే అత్యంత ప్రాబల్యం వుండేది. కాగా ఎంగెల్స్ కూడా హేగెల్ అనుచరులలో చేరాడు. బెర్లిన్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరు ఉద్యోగంచేస్తూ ప్రష్యను కొలువులో వున్న హేగెల్ నిరంకుశపరిపాలనను సాగించుతూన్న ప్రష్యను రాజ్యాన్ని చూచి తన మటకుతాను మెచ్చుకొన్నప్పటికీ, హేగెల్ బోధనలు మాత్రం విప్లవాత్మకములైనవే. మానవ హేతువాదనా సామర్థ్యం పైనా, దాని హక్కులపైనా హేగెల్‌కి వున్న పరిపూర్ణ విశ్వాసమూ, నిరంతరం జరుగుతూండే మార్పుకూ క్రమాభివృద్ధికీ జగత్తులోనవుతూ వుంటుందనే అతని తత్వశాస్త్రాని కంతకూ మూలసిద్ధాంతమైన సూత్రమూ, ఈ రెండు విషయాలూ, ఆ బెర్లిన్ ప్రొఫెసరుయొక్క నాటి పరిస్థితులతో రాజీపడనొల్లని శిష్యవర్గంలో కొందరికి, ఈ పరిస్థితులకి వ్యతిరేకంగా పోరాడడం, నాడు ప్రబలివున్న అన్యాయానికీ, చలామణీ అవుతూన్న దుర్మార్గానికీ వ్యతిరేకంగా పోరాడడం, శాశ్వతాభివృద్ధి అనే విశ్వవ్యాప్త నియమంలోనే ఒక భాగమై ఇమిడి వుంది అన్న అభిప్రాయం కలగ జొచ్చింది. జగత్తులో వున్న అన్ని వస్తువులూ కూడా క్రమాభివృద్ధినే పొందవలసి వుండే పక్షంలో, పాత సంస్థలు మార్పుచెంది వాటిస్థానే ఇతర సంస్థలు బయలుదేరే పక్షంలో, ప్రష్యా రాజుయొక్కగానీ, రష్యను జారుయొక్కగానీ నిరంకుశపరిపాలనే కలకాలమూ ఎందుకు శాశ్వతంగా వుండాలి? అత్యధిక సంఖ్యలో వున్నవారి పొట్టలుకొట్టి అత్యల్ప సంఖ్యలో వున్న ఏపట్టెడు వ్యక్తులో భోగభాగ్యాలను అనుభవించడం కలకాలమూ ఎందుకు శాశ్వతంగా జరగాలి? ప్రజపై బూర్జువావర్గంయొక్క ఆధిపత్యం కలకాలమూ ఎందుకు శాశ్వతంగా సాగాలి? మనస్సుయొక్క, భావాలయొక్క క్రమాభివృద్ధిని గురించి చెప్పింది హేగెల్ తత్వశాస్త్రం; అది భావవాద పంథాలో వుంది. మనస్సు

క్రమాభివృద్ధిని పొందుతుందనే సూత్రంనుండి, ప్రకృతి, మానవుడు, మానవ, సామాజిక సంబంధాలు, వీటన్నిటి క్రమాభివృద్ధినీ హేగెల్ తత్వశాస్త్రం తార్కిక పద్ధతుల్లో ఊహించింది. హేగెల్‌యొక్క శాశ్వత క్రమాభివృద్ధి అభిప్రాయాన్ని మార్క్స్ ఎంగెల్స్‌లు అంగీకరించి*, అతను అకారణంగా ఊహించుకొన్న భావవాదపు అభిప్రాయాలను మాత్రం వారు తిరస్కరించారు; మానవ జీవిత విషయాలవైపు వారు తమ దృష్టిని సారించగా, ప్రకృతి క్రమాభివృద్ధిని వివరణచేసి చెప్పేది మనస్సుయొక్క క్రమాభివృద్ధి కాదనీ, తద్భిన్నంగా మనస్సుయొక్క వివరణను ప్రకృతినుండే, పదార్థంనుండే, ఉత్పన్నం చేయాల్సి వుంటుందని వారికి స్పష్టంగా కనబడింది... హేగెల్ లాగాకాకుండా, ఇతర హేగెల్‌వాదులలాగా కాకుండా, మార్క్స్ ఎంగెల్స్‌లు భౌతికవాదులు. ప్రపంచాన్నీ మానవాళినీ భౌతికవాద దృష్టితో పరిశీలించి చూడగా, ప్రకృతిలోవున్న సంఘటనల నన్నింటికీ భౌతిక కారణాలే ఏ విధంగానైతే మూలాధారాలుగా ఏర్పడి వున్నాయో, సరిగా ఆ విధంగానే మానవసామాజిక క్రమాభివృద్ధి కూడా భౌతిక ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధివల్లనే పరిమితమై నిర్దేశించబడుతూంది. మానవ అవసరాలను తీర్చుకోడానికి అవశ్యములైన వస్తువులను ఉత్పత్తి చేసుకొనేందుకు మనుష్యులు ఒకరితో ఒకరు ఏర్పరచుకొనే పరస్పర సంబంధాలు, ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధిపైనే ఆధారపడి వుంటాయి. ఇక ఈ సంబంధాలలోనే, అన్ని సామాజికజీవిత సంఘటనలూ, అన్ని మానవ ఆశయాలూ అభిప్రాయాలూ ధర్మాలూ వీటన్నిటి వివరణా కూడా ఇమిడి వుంది. ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధే, సొంత ఆస్తి ప్రాతిపదికపైన ఏర్పడిన సామాజిక సంబంధాలను సృష్టిస్తుంది; కాని అచ్చంగా ఈ ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధే, అధిక సంఖ్యాకవర్గీయులనుండి వారి ఆస్తిని లాగేసి, దానిని అల్పాతి అల్పసంఖ్యాకవర్గీయులైన బహుకొద్దిమంది చేతుల్లో సాంద్రీకృతం చేస్తూంది, కాని ఈ ఉత్పాదక శక్తుల క్రమాభివృద్ధే ఆధునిక సామాజిక వ్యవస్థకు మూలమైన ఆస్తిని నాశనంచేసి, సోషలిస్టులందరూ తమ ఆశయసిద్ధికి ఏ గమ్యాన్నయితే ఏర్పరచుకున్నారో, అచ్చంగా ఆ గమ్యపు దిశగానే ఇది కూడా పాటుపడుతూంది. సామాజిక శక్తులలో ఏ శక్తి ఐతే ఆధునిక సమాజంలో దానికున్న స్థానాన్ని బట్టి సోషలిజం అవతరణ పట్ల అభిలాషను కనబరుస్తూందో, ఆ శక్తిని గుర్తెరిగి, ఆ శక్తికి దాని ప్రయోజనాలనూ దాని చారిత్రక కర్తవ్యాన్నీ గుర్తెరిగేటట్టి చైతన్యాన్ని దానికి కలుగజేయడంలోనే వుంది సోష

* తమ వైజ్ఞానికాభివృద్ధికి ప్రఖ్యాతివహించిన జర్మన్ తత్వశాస్త్రజ్ఞులకు — అందులోనూ ప్రత్యేకంగా హేగెల్‌కి — తాము ఎంతో రుణపడి వున్నామని మార్క్స్ ఎంగెల్స్‌లు తరుచు చెపుతూండేవారు. "జర్మను తత్వశాస్త్రం పుట్టివుండక పోయివుంటే శాస్త్రయుక్తమైన సోషలిజం అంటూ వుండేదే కాదు,"[27] అన్నాడు ఎంగెల్స్.

లిస్టులయొక్క కర్తవ్యం అంతా. ఈ శక్తే శ్రామికవర్గం. తన తండ్రి భాగస్వామిగా వున్న ఒక వ్యాపారసంస్థలో 1842 లో అతడు ఉద్యోగిగా ప్రవేశించి స్థిరనివాసం ఏర్పరచుకున్నట్టీ, బ్రిటిష్ పరిశ్రమకు నడిబొడ్డు అయినట్టి మాంచెస్టర్‌లో వున్నప్పుడు, ఇంగ్లండులో ఎంగెల్స్ ఈ శక్తితో పరిచయం కలుగ జేసుకొన్నాడు. మాంచెస్టర్‌లో ఎంగెల్స్ తాను పనిచేస్తూన్న ఫ్యాక్టరీ ఆఫీసులోనే కూచుని ఉండిపోకుండా, కోళ్ల గూళ్లల్లా వున్న ఇళ్లల్లో కార్మికులు నివసిస్తూన్న మురికిపేటల్లో అతడు తిరుగుతూ, వారి పరిస్థితులనూ, వారి దారిద్ర్యాన్నీ, వారి దౌర్భాగ్యపు జీవితాన్నీ కళ్లారా చూశాడు. తన సొంత అవేక్షణలతోనే తృప్తిపడక, బ్రిటిష్ కార్మికుల దురవస్థను గురించి తాను స్వయంగా చూసిన దానినంతా పుస్తకాల్లో చదివి, తనకు దొరికిన ప్రభుత్వ ప్రచురణలనన్నింటినీ అధ్యయనం చేశాడు ఎంగెల్స్. ఈ అధ్యయన అవేక్షణల ఫలితమే 1845 లో "ఇంగ్లండులో కార్మికవర్గంయొక్క స్థితి" అనే పేరుతో వెలువడిన గ్రంథం. "ఇంగ్లండులో కార్మిక వర్గంయొక్క స్థితి" అనే గ్రంథాన్ని రచించడంలో ఎంగెల్స్ కావించిన గొప్ప సేవను గురించి మనం ఇదివరకే పేర్కొన్నాం. ఎంగెల్స్‌కు ముందే అనేకులు శ్రామికవర్గం అనుభవించుతూన్న బాధలను వర్ణించి, కార్మికవర్గానికి సహాయం చేయవలసిన అవసరాన్ని గూర్చి రాశారు. అయితే శ్రామికవర్గం బాధలను అనుభవించుతూన్న వర్గమవడమే కాకుండా, అవమానకరమైన ఈ ఆర్థిక దుస్థితే శ్రామికవర్గాన్ని నిరాఘాటంగా ముందుకు తీసుకొనిపోతూ, ఇక విధిలేక తన అంతిమ విముక్తికోసం యుద్ధంచేసేటట్లు వాస్తవంగా అది నిర్బంధంచేయబడే తీరుతుందని అందరికంటే ముందు ఎంగెల్సే చెప్పాడు. అంతేకాదు, యుద్ధంచేయడానికి భయపడని ఈ శ్రామికవర్గం తన స్వయం సహాయంపైనే ఆధారపడుతుంది. కార్మికవర్గంయొక్క రాజకీయోద్యమం ఫలితంగా సోషలిజం ఒక్కటే తమకు మోక్షాన్ని చేకూర్చగలదని కార్మికులు తప్పనిసరిగా గ్రహించి తీరుతారు. ఇక రెండో వైపున, ఎప్పుడైతే సోషలిజమే కార్మిక వర్గ రాజకీయ పోరాటంయొక్క లక్ష్యం అవుతుందో, అప్పుడే సోషలిజం ఒక శక్తిగా రూపొందగలుగుతుంది. ఇంగ్లండులోని కార్మికవర్గపు స్థితిని గురించి ఎంగెల్స్ రచించిన గ్రంథంలో వెల్లడించబడిన అభిప్రాయాల్లో ఇవి ముఖ్యమైనవి. వివేచనా శక్తిని కలిగినట్టి పోరాటాన్ని సాగించుతూన్నట్టి శ్రామికులందరూ నేడీ అభిప్రాయాలను స్వీకరించారు; కాని ఆ రోజుల్లో అవి కొత్తగా వుండేవి. ఈ భావాలన్నీ మనస్సులో నాటుకొని పోయేటట్టి శైలిలో రచించబడి, ఇంగ్లండులోని శ్రామికవర్గంయొక్క దుస్థితిని ప్రామాణికంగానూ హృదయవిదారకంగానూ చిత్రింపబడినట్టి ఈ గ్రంథంలో విపులంగా వివరించబడ్డాయి. పెట్టుబడిదారీ విధానంపైనా బూర్జువావర్గం పైనా ఒక ఘోరమైన నేరారోపణపత్రమే ఈ గ్రంథం. ఈ గ్రంథం గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఆధునిక శ్రామికవర్గపు స్థితిగతులను యథార్థంగా చిత్రించిన గ్రంథం ఇదొక్కటేనంటూ సర్వే

సర్వత్రా ఈ గ్రంథాన్నే అందరూ ఉదాహరించుతూండేవారు. వాస్తవానికి 1845 ముందు గానీ, ఆతరువాతగానీ కార్మికవర్గంయొక్క దౌర్భాగ్యస్థితిని ఇంత అద్భుతంగానూ ఇంత యథార్థంగానూ ప్రదర్శించే చిత్తరవు మరేదీ కూడా నాటికీ నేటికీ వెలువడలేదు.

ఎంగెల్స్ సోషలిస్టు అవడం, అతడు ఇంగ్లండుకు వచ్చిన తరువాతనే. మాంచెస్టర్‌లో ఆ రోజుల్లో బ్రిటిష్ కార్మికోద్యమంలో చురుకుగా పనిచేస్తూన్న వ్యక్తులతో అతను సంబంధాలు పెట్టుకుని, ఇంగ్లీషు సోషలిస్టు పత్రికలకు వ్యాసాలు రాయడం మొదలుపెట్టాడు. 1844 లో అతను జర్మనీకి తిరిగి ప్రయాణం చేస్తూండేటప్పుడు పారిస్‌లో అతనికి మార్క్సు పరిచయం కలిగింది; అంతకు ముందే అతను మార్క్సుతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూండేవాడు. మార్క్సు పారిస్‌లో వుండేటప్పుడు, ఫ్రెంచి సోషలిస్టులూ ఫ్రెంచి జీవితమూ, వీటి ప్రభావ ఫలితంగా అతడు సోషలిస్టు అయాడు. పారిస్‌లోనే మిత్రులిద్దరూ కలిసి సమిష్టిగా "పవిత్ర కుటుంబం, లేక విమర్శనాత్మక విమర్శనకు విమర్శ" అనే గ్రంథాన్ని రచించారు. "ఇంగ్లండులో కార్మిక వర్గంయొక్క స్థితి" వెలువడడానికి ఒక ఏడాదిముందే వెలువడినట్టీ, అత్యధికభాగం మార్క్సు రచించినట్టీ ఈ పుస్తకంలో, పైన మనం దేని ప్రధానాభిప్రాయాలనైతే వ్యాఖ్యానించామో ఆ విప్లవాత్మక సోషలిజంయొక్క పునాదులు వివరించబడ్డాయి. "పవిత్ర కుటుంబం" అన్నది తత్వశాస్త్రజ్ఞులైన బౌవర్ సోదరులకూ వారి అనుచరులకూ మార్క్సు ఎంగెల్సులు వేళాకోళానికి పెట్టిన మారుపేరు. యావత్తు వాస్తవికతకూ రాజకీయాలకూ, పార్టీలకూ అతీతమైనట్టిన్నీ, ఎట్టి క్రియాశీలమైన కార్యాచరణనైనా నిరాకరించేటట్టిన్నీ, చుట్టుపట్లనున్న ప్రపంచాన్నీ ప్రపంచంలో జరుగుతూన్న ఉదంతాలనూ కేవలం "విమర్శనాత్మకంగా" నిర్వికల్పంగా ధ్యానిస్తూ వుండాలనే తత్వాన్ని ఈ పెద్ద మనుషులు బోధించారు. ఈ పెద్దమనుషులు, బౌవర్ సోదరులు, శ్రామికవర్గాన్ని అహంకారంతో చూస్తూ, దానిని విమర్శనాజ్ఞానంలేని ముక్కుడిమూకకింద కట్టేశారు. అసందర్భమైనట్టిన్నీ హానికరమైనట్టిన్నీ ఈ పోకడను మార్క్సు ఎంగెల్సులు అతి తీవ్రంగా ఎదిరించారు. వాస్తవమైన ఒక మానవవ్యక్తి తరపున — పరిపాలనాధికారాన్ని చలాయించుతూన్న వర్గాలయొక్క, రాజ్యాంగయంత్రంయొక్క పాదాలకింద పడి నలిగిపోతూన్న కార్మికుని తరపున — నిలబడి, నిర్వికల్పధ్యానం కాదు చేయవలసినది; చేయవలసినదల్లా ఉత్తమ సామాజికవ్యవస్థాపనార్థం పోరాటమేనని ఎలుగెత్తి చాటారు మార్క్సు ఎంగెల్సులు. ఈ పోరాటాన్ని సాగించడానికి స్తోమతను కలిగిన శక్తీ, ఈ పోరాటంలో శ్రద్ధాసక్తులను కలిగినదీ, శ్రామికవర్గమే అని వారు సహజంగానే గుర్తించారు. "పవిత్ర కుటుంబం" వెలువడక ముందే, మార్క్సు, రూగె, వీరిద్దరి సంపాదకత్వకింద ప్రచురింపబడిన "జర్మన్ ఫ్రెంచి ఇతిహాస వార్షిక సంచికలు" అనే పత్రికలో, "అర్థశాస్త్ర విమర్శనా వ్యాసాలు"[28] అనే శీర్షికతో ఎంగెల్సు కొన్ని వ్యాసాలు

రాశాడు. ఈ వ్యాసాల్లో, సోషలిస్టు దృక్పథంనుండి సమకాలిక ఆర్థిక వ్యవస్థయందు ప్రత్యక్షంగా కనబడుతూన్న ప్రధానమైన సంఘటనలను పరిశీలించి, ప్రైవేటు ఆస్తి చలా యించుతూన్న రాజ్యాధికారంయొక్క అనివార్యములైన ఫలితాలే ఇవి అని అతడు పర్యవసానం తేల్చాడు. ఏ శాస్త్రంలోనైతే మార్క్స్ రచించిన గ్రంథాలు వాస్తవమైన ఒక విప్లవాన్నే తీసు కొచ్చాయో, అట్టి అర్థశాస్త్రాన్ని అధ్యయనం చేయాలని మార్క్స్ కృతినిశ్చయుడవడానికి ఎంగెల్స్ సహవాసమే ఒక ప్రబల కారణమని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు.

1845 నుండి 1847 వరకూ ఎంగెల్స్ బ్రస్సెల్స్‌లోనూ పారిస్‌లోనూ నివ సించుతూ, తన విజ్ఞానశాస్త్ర అధ్యయనాన్ని బ్రస్సెల్స్‌లోనూ పారిస్‌లోనూ వున్న జర్మన్ కార్మికులమధ్య ఆచరణాత్మక కార్యకలాపంతో మిళితంచేస్తూ జీవించాడు. ఈ పట్నాల్లో వున్న ప్పుడే, రహస్యంగా పనిచేస్తూన్న జర్మన్ "కమ్యూనిస్టు లీగ్"తో మార్క్స్ ఎంగెల్స్‌లు సం బంధాలు ఏర్పరచుకొన్నారు. మార్క్స్ ఎంగెల్స్‌లు అప్పటికే రూపొందించినట్టి సోషలిజం యొక్క ముఖ్యసూత్రాలకు వ్యాఖ్యాన మొకదానిని రాయవలసిందని వారిని ఈ సమితి కోరింది. 1848 లో ప్రచురింపబడి మార్క్స్ ఎంగెల్స్‌లచే విరచితమై ప్రఖ్యాతివడసిన "కమ్యూ నిస్టు పార్టీ ప్రణాళిక" ఈ విధంగా అవతరించింది. ఈ చిన్న పుస్తకం ఎన్నో గ్రంథాలకు సరిసమానమైనది: దీని భావమే మొత్తం నాగరికతా ప్రపంచ మంతటా ఆర్గనైజై పోరా డుతూ వున్న శ్రామిక వర్గాన్ని యీనాటికీ కూడా ఉత్తేజపరుస్తూ నడుపుతూంది.

ఫ్రాన్సులో మొదట ఆరంభమై తరువాత పశ్చిమ యూరప్ దేశాలకు వ్యాపించిన 1848 విప్లవం మూలాన, మార్క్స్ ఎంగెల్స్‌లు తమ స్వదేశానికి తిరిగి వెళ్లిపోయారు. స్వదేశానికి వెళ్లిపోయిన తరువాత, ప్రష్యారాజ్యపు రైన్ రాష్ట్రంలో వున్న కలోన్ పట్నంలో అప్పుడు ఆ పట్నంలో ప్రచురితమవుతూన్న ప్రజాస్వామ్య పత్రిక అయిన "నోయె రైనిషె సైటుంగ్"ను నడపడానికి పూనుకున్నారు. ఆనాడు ప్రష్యాదేశపు రైన్ రాష్ట్రంలో విజృం భించినట్టి విప్లవాత్మక ప్రజాస్వామిక ఆశయాలన్నింటికీ ఈ మిత్రులిద్దరూ ఆయువు పట్టు గానూ గుండెకాయగానూ వుంటూ పనిచేశారు. ప్రజాప్రయోజనాలనూ ప్రజాస్వేచ్ఛనూ అభివృద్ధి నిరోధక శక్తుల బారినుండి అడుగడుగునా చిట్టచివరకూ వీరు రక్షించుతూ వచ్చారు. ఆ పోరాటంలో అభివృద్ధి నిరోధక శక్తులదే పైచేయి అవడం మనకు తెలిసిన విషయమే. "నోయె రైనిషె సైటుంగ్"ను ప్రభుత్వం నిషేధించింది. వెనుక ప్రవాసంలో వున్న కాలంలో మార్క్స్ తన పౌరసత్వాన్ని కోల్పోయి వుండడంచేత, అతనిని ఇప్పుడు దేశాన్నుండి వెళ్ల గొట్టేశారు. ఎంగెల్స్ ప్రజాతిరుగుబాటులో పాల్గొని, మూడు యుద్ధాల్లో పోరాడి, తిరుగు బాటు ఓడిపోయిన తరువాత స్విట్జర్లెండ్‌కు తప్పించుకుని, అక్కడనుండి లండన్ చేరు కున్నాడు.

అప్పటికే మార్క్స్ లండన్‌లో నివాసం ఏర్పరచుకొని అక్కడ స్థిరపడిపోయాడు. ఎంగెల్స్ మాంచెస్టర్ వెళ్లి, వెనుక తాను 1840 లలో పనిచేసిన వర్తకపు కంపెనీ లోనే మళ్లీ గుమాస్తాగా ప్రవేశించి, ఆ కంపెనీలోనే తరువాత భాగస్థుడైయాడు. మార్క్స్ లండన్‌లోనూ, 1870 వరకూ ఎంగెల్స్ మాంచెస్టర్‌లోనూ నివసించినప్పటికీ, అత్యంత ఉల్లాసకరమూ మేధాసంపన్నమూ అయిన వారిద్దరి ఉత్తరప్రత్యుత్తరాల సాంగత్యానికి ఇదేమీ ప్రతిబంధకంగా ఏర్పడలేదు: వారిద్దరూ ఒకరిపేర ఒకరు ఇంచుమించు ప్రతిరోజూ ఉత్తరాలు రాసుకుంటూండేవారు. ఈ ఉత్తరప్రత్యుత్తరాలలో వారిద్దరూ ఒండొరుల అభి ప్రాయాలనూ విజ్ఞానాన్నీ తెలుసుకుంటూ, శాస్త్రీయ సోషలిజాన్ని స్థాపించే కృషిలో ఒకరి కొకరు సహాయపడుతూ తమ కార్యాన్ని సాగిస్తూవచ్చారు. 1870 లో ఎంగెల్స్ తన నివాసాన్ని లండన్‌కు మార్చుకున్నాడు. అత్యంత శ్రమోత్సాహాలతో కూడిన వారిద్దరి ఉమ్మడి వైజ్ఞానిక జీవితమూ 1883 లో మార్క్స్ నిర్యాణంవరకూ నిరాఘాటంగా సాగింది. మార్క్స్ వంతు, మన యుగంలో అర్థశాస్త్రంపై అద్వితీయమై మహోత్కృష్టమైన "పెట్టుబడి" అనే గ్రంథమూ, ఎంగెల్స్ వంతు చిన్నపుస్తకాలు మొదలుకొని ఉద్గ్రంథాల వరకూ అనేక రచనల రూపంలోనూ ఈ సమిష్టిశ్రమ ఫలించింది. పెట్టుబడిదారి విధానపు ఆర్థికవ్యవస్థ యొక్క క్లిష్టసంఘటనల విశ్లేషణా పరిశీలనపై మార్క్స్ కృషి చేశాడు. ఎంగెల్స్ తరుచు వాదోపవాదపూరితములైన గ్రంథాలనూ, సర్వసాధారణ శాస్త్రీయ సమస్యలపైననూ, భౌతిక చారిత్రక భావనా దృక్పథంనుండి మార్క్సీయ ఆర్థిక సిద్ధాంత దృక్పథంనుండి, భూత వర్తమానకాలాల వివిధ సంఘటలను పరిశీలించి సులభశైలిలో గ్రంథాలను రచించాడు. ఎంగెల్స్ రచనలలో ఈ కింది వాటిని మనం పేర్కొనాల్సి వుంది: డ్యూరింగ్‌ను ఖండించుతూ రాసిన వాదోపవాద పూరితమైన గ్రంథం (తత్వశాస్త్ర ప్రకృతిశాస్త్ర సాంఘికశాస్త్రాలలో అత్యంత ప్రధానములైన అనేక సమస్యలు ఈ గ్రంథంలో పరిశీలించబడ్డాయి),* "కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుపూర్వోత్తరాలు" (రష్యను భాషలో అనువదించబడి సెంట్ పీటర్స్‌బర్గ్‌లో ప్రచురింపబడింది, మూడవ కూర్పు, 1895), "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్"[31] (జి. ప్లెహనొవ్‌చే వివరణ సహితమైన రష్యను అనువాదం, జినీవా, 1892), రష్యన్ ప్రభుత్వంయొక్క వైదేశిక విధానంపై ఒక వ్యాసం (జినీవాలో "సోత్సియాల్ డెమొక్రాట్"

---

* అద్భుతమైన విషయ వైవిధ్యాన్ని కలిగి, అత్యంతోపయుక్తమైన గ్రంథమిది.[29] దుర దృష్టవశాత్తూ, సోషలిజంయొక్క చారిత్రకాభివృద్ధిని సంగ్రహంగా ప్రదర్శింపబడిన ఒక చిన్న భాగం మాత్రమే రష్యన్ భాషలోకి అనువదించబడింది ("శాస్త్రీయ సోషలిజంయొక్క క్రమాభివృద్ధి," రెండవ కూర్పు, జినీవా, 1892).[30]

పత్రికలో 1,2 సంచికలలో రష్యను అనువాదం ప్రచురింపబడింది),[32] గృహవసతి సమస్యపై అద్భుతమైన వ్యాసపరంపర;[33] ఇక ఆఖరున పేర్కొనవలసినది: రష్యా ఆర్థికాభివృద్ధి గురించి, చిన్నవైనప్పటికీ అత్యంత విలువైన రెండు వ్యాసాలు (''రష్యానుగూర్చి ఫ్రెడరిక్ ఎంగెల్స్ రచనలు'' వేర జసూలిచ్‌చే రష్యనులోకి అనువాదం, జినీవా, 1894).[34] పెట్టుబడిపై తాను రచించిన బ్రహ్మాండమైన గ్రంథాన్ని పూర్తిచేసే లోపలనే మార్క్స్ చనిపోయాడు. చిత్తు ముసాయిదా రూపంలో మాత్రం గ్రంథరచన పూర్తి చేశాడు మార్క్స్. తన మిత్రుని మరణానంతరం ''పెట్టుబడి'' గ్రంథంయొక్క రెండవ సంపుటాన్నీ మూడవ సంపుటాన్నీ ముద్రణకు సిద్ధంచేసి ప్రచురించడమనే అత్యంత ప్రయాసకరమైన కార్యాన్ని ఎంగెల్స్ స్వీకరించి, రెండవ సంపుటాన్ని 1885 లోనూ, మూడవ సంపుటాన్ని 1894 లోనూ ప్రచురించాడు. (నాల్గవ సంపుటం ప్రచురణానార్థం సిద్ధం చేయగలిగే లోపునే ఎంగెల్స్ చనిపోయాడు[35]) ఈ రెండు సంపుటాలనూ ప్రచురించడానికి అతడు బ్రహ్మాండమైన కృషి చేయవలసి వచ్చింది. ఆస్ట్రియాదేశపు సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సభ్యుడు అడ్లర్ ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ, ''పెట్టుబడి'' గ్రంథంయొక్క రెండవ సంపుటాన్నీ మూడవ సంపుటాన్నీ ప్రచురించడంలో తన మిత్రుడైన ప్రతిభాశాలి జ్ఞాపకార్థం మహనీయమైన చిహ్నాన్ని అతడు నిర్మించి, ఆ చిహ్నంపైన అప్రయత్నంగా తన పేరునే శాశ్వతంగా మలచుకొన్నాడు ఎంగెల్స్ అని అన్నాడు. వాస్తవానికి ''పెట్టుబడి'' గ్రంథంయొక్క ఈ రెండు సంపుటాలూ ఇద్దరు వ్యక్తుల — మార్క్స్ ఎంగెల్స్‌ల — రచన. పురాతన గాథలలో ఇద్దరు స్నేహితులను గురించి మనను కరిగించేటట్టి అనేక దృష్టాంతాలున్నాయి. మానవ మైత్రిని కీర్తిస్తూ రచించబడి హృదయాన్ని ద్రవింపజేసే వివిధ కథల నన్నింటినీ మించి పోయినట్టి స్నేహపాశాలతో బంధింపబడిన పండితులూ యోధులూ ఇరువురు తన శాస్త్రాన్ని సృష్టించారని యూరప్ ఖండపు శ్రామికవర్గం సగర్వంగా చెప్పుకోవచ్చు. ఎంగెల్స్ ఎల్లప్పుడూ కూడా — మొత్తంమీద సబబుగానే — మార్క్స్ పేరు ముందు చెప్పి తరువాత తన పేరు చెప్పుకునేవాడు. పాతస్నేహితుడు ఒకతని పేర రాస్తూ: ''మార్క్స్ జీవించిన రోజుల్లో నేను వెనకపాట పాడేవాణ్ణి''[36] అని రాశాడు ఎంగెల్స్. మార్క్స్ బతికున్నప్పుడు మార్క్స్‌మీద అతనికున్న ప్రేమ, మార్క్స్ చనిపోయిన తరువాత ఆయనను తల్చుకుని అతను చూపిన భక్తిగౌరవాలు అపారములు. సాహసుడైన ఈ యోధునిలో, కచ్చితమైన ఈ తత్వజ్ఞానిలో ప్రేమ పూరితమైన హృదయం స్పందించుతూండేది.

1848–1849 ఉద్యమం అనంతరం ప్రవాసంలో వున్న రోజుల్లో మార్క్స్ ఎంగెల్స్‌లు శాస్త్రీయ పఠనా వ్యాసంగంలోనే కాలం గడపలేదు. 1864 లో మార్క్స్ ''అంత ర్జాతీయ కార్మికులు సంఘం'' అనే సంస్థను స్థాపించి, ఒక దాశాబ్దిపాటు దానిని నడి

పాడు. ఈ సంఘ కార్యకలాపాల్లో ఎంగెల్స్ చాలా చురుకైన పాత్రనే వహించాడు. మార్క్స్ ఉద్దేశాల ప్రకారం అన్ని దేశాలలో వున్న శ్రామికులనూ సంఘటిత పరచడానికి స్థాపించబడినట్టి ఈ అంతర్జాతీయ సంఘం, కార్మికవర్గంయొక్క క్రమాభివృద్ధిలో బృహత్తర ప్రాధాన్యత వహించింది. 1870 సంవత్సరాల్లో ఈ అంతర్జాతీయ సంఘం అంతమొందినప్పటికీ, ఐక్యతాసాధనలో మార్క్స్ ఎంగెల్స్‌ల పాత్ర అంతటితో ఎంత మాత్రమూ ముగియలేదు. తత్‌భిన్నంగా కార్మికోద్యమమే నిరవధికంగా అభివృద్ధి పొందుతూండడం కారణంగా, కార్మికోద్యమంయొక్క ఆధ్యాత్మిక నాయకులుగా వారి ప్రాముఖ్యత నానాటికి మరింత ఇనుమడింపజొచ్చిందనే చెప్పాలి. మార్క్స్ మరణానంతరం ఎంగెల్స్ ఒక్కడే యూరప్‌లోని సోషలిస్టులకు ఆచార్యత్వాన్నీ నాయకత్వాన్నీ వహించుతూ వచ్చాడు. ప్రభుత్వం క్రూరవిధానాన్ని సాగించినప్పటికీ, నిరంతరాయంగా దినదినాభివృద్ధి నొందుతూ పటిష్ఠమవుతూన్నట్టి జర్మన్ సోషలిస్టులేకాకుండా, స్పెయిన్, రుమేనియా, రష్యా మొదలైన వెనుకపడిన దేశాలయొక్క — తాము తీసుకొనే ప్రాథమిక చర్యల ముందు వెనుకలు పర్యాలోచించి ఆచి తూచి తీవ్రంగా ఆలోచించిన పిమ్మటే కార్యాచరణలోకి దిగవలసినట్టి — సోషలిస్టు ప్రతినిధులు కూడా సలహాకొరకూ ఆదేశాలకొరకూ అతని వద్దకు వస్తూండేవారు. వయోవృద్ధుడైన ఎంగెల్స్‌యొక్క విజ్ఞానానుభవ భాండారాన్ని వారందరూ స్వేచ్ఛగా వినియోగపరచుకునేవారు.

రష్యన్ భాషను పఠించి, రష్యన్ గ్రంథాలను చదవగలిగిన మార్క్స్ ఎంగెల్స్‌లు, ఆ దేశం పట్ల ఔత్సుక్యమైన ఆసక్తిని చూపుతూ, రష్యను విప్లవోద్యమ గమనాన్ని సానుభూతితో గమనించుతూ, రష్యన్ విప్లవకారులతో సంబంధాలను నెలకొల్పుకుంటూండేవారు. సోషలిస్టులు కాకముందు వారిద్దరూ కూడా ప్రజాతంత్రవాదులు; ఆ కారణంచేత రాజకీయ నిరంకుశత్వం పట్ల ప్రజాస్వామ్యప్రియులకుండే ద్వేషం వారి హృదయాల్లో గాఢంగా నాటుకుపోయింది. ప్రత్యక్షమైన ఈ రాజకీయానుభవంతో మేళవించిన ప్రగాఢమైన సిద్ధాంత పరిజ్ఞానంవల్ల రాజకీయ నిరంకుశత్వానికీ ఆర్థిక దోపిడీకీగల అవినాభావ సంబంధాన్ని గుర్తెరిగిన వారవడంచేతనూ, అపారమైన జీవితానుభవాన్ని సముపార్జించడంచేతనూ, కచ్చితంగా రాజకీయ దృక్పథాన్ని అవలంబించుతూనే అతిసున్నితమైన సహృదయానుభూతిని మార్క్స్ ఎంగెల్స్‌లు ప్రదర్శింపగలిగేవారు. అచ్చంగా ఈ కారణంవల్లనే, అత్యంత బలోపేతమైనట్టి జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పట్టెడుమంది రష్యన్ విప్లవకారులు సలుపుతూన్న వీరోచిత ప్రతిఘటన, ఎన్నో అగ్నిపరీక్షలకు నిలిచిన ఈ విప్లవకారుల హృదయాల్లో గాఢమైన సానుభూతిని రేకెత్తించింది. ఇక రెండో వైపున, కేవలం భ్రమమాత్రమైనట్టి ఆర్థిక ప్రయోజనాలకోసం ఆశపడి, రష్యను సోషలిస్టుల ప్రధాన కర్తవ్యమూ తక్షణ కర్తవ్యమూ అయిన రాజకీయస్వేచ్ఛా సముపార్జన లక్ష్యంపట్ల పెడముఖంపెట్టే వైఖరి సహజంగానే వారికి

అనుమానాస్పదంగా కనపడడమే కాకుండా, మహత్తరమైన సోషలిస్టు విప్లవోద్యమానికే ప్రత్యక్ష ద్రోహాన్ని తలపెట్టడమని వారు భావించారు. "శ్రామికవర్గ విమోచనను శ్రామికవర్గమే సాధించాలి"[37] అని మార్క్సు ఎంగెల్సులు నిరంతరమూ బోధించుతూండేవారు. కాగా తన ఆర్థిక విమోచన సాధనకై పోరాడాలంటే, శ్రామికవర్గం కొన్ని రాజకీయ హక్కులను తన కోసం సంపాదించుకోవాల్సి వుంటుంది. అంతేకాకుండా, రష్యాలో రాజకీయ విప్లవం సంభవించే పక్షంలో పాశ్చాత్య యూరప్ దేశాల కార్మికోద్యమానికి కూడా అది మహత్తర ప్రాముఖ్యతను కలిగివుంటుందని వారు స్పష్టంగా గ్రహించారు. నిరంకుశ పరిపాలనను సాగించుతూన్న రష్యా సర్వసాధారణంగా యూరప్‌లోని అభివృద్ధి నిరోధకాన్నంతనూ నిరంతరమూ పరిరక్షించుతూన్న ఒక అభేద్యమైన బురుజులాగు వుంటూంది. అనేక సంవత్సరాలుగా జర్మనీ ఫ్రాన్సుల మధ్య వైషమ్యబీజాలను నాటినట్టి 1870 యుద్ధం ఫలితంగా, అంతర్జాతీయ రంగంలో రష్యా ఆక్రమించుతూన్న అత్యంతాశ్చర్యాన్ని గొలిపే అనుకూలమైన స్థానం, అభివృద్ధి నిరోధక శక్తిగా నిరంకుశ రష్యాయొక్క ప్రాముఖ్యతను సహజంగా మరింత ఇనుమడింపజేసింది. స్వేచ్ఛాయుతమైన రష్యా మాత్రమే, పోలెండ్, ఫిన్‌లాండ్, జర్మనీ, ఆర్మీనియా దేశస్థులనే కాకుండా మరేయితర చిన్నజాతులనైనాసరే పీడించడానికిగానీ, ఫ్రాన్సునీ జర్మనీనీ ఒకదానిపై ఒకదానిని నిరంతరమూ ఉసికొల్పడానికిగానీ అవసరంలేని రష్యా మాత్రమే, ఆధునిక యూరప్ ఖండాన్ని యుద్ధభారంనుండి తప్పించి, యూరప్‌లో వున్న అభివృద్ధి నిరోధక శక్తులనన్నింటినీ బలహీనపరచి, యూరప్ దేశాలలోని కార్మికవర్గాల శక్తిని వృద్ధిపరచగలుగుతుంది. ఈ కారణంవల్లనూ, పాశ్చాత్యదేశాలలో వున్న కార్మికోద్యమ అభ్యుదయానికి సహితమూ, రష్యాలో రాజకీయస్వేచ్ఛ స్థాపనను ఎంగెల్సు ప్రగాఢంగా వాంఛించాడు. ఎంగెల్సు నిర్యాణంతో రష్యను విప్లవకారులు తమ ముఖ్యస్నేహితుని కోల్పోయారు.

శ్రామికవర్గ యోధుడూ, శ్రామికవర్గ ప్రవక్త అయిన ఎంగెల్సు కీర్తి చిరస్మరణీయమై శాశ్వతంగా వర్ధిల్లుగాక!

1895 శరత్తు.

# మార్క్స్ ఎంగెల్స్ ఉత్తరప్రత్యుత్తరాలు

ఎన్నాళ్లనుండో వాగ్దానం చేయబడినట్టి శాస్త్రీయ సోషలిజమ్ సుప్రసిద్ధ స్థాపకుల ఉత్తరప్రత్యుత్తరాల కూర్పు చిట్టచివరకు ఇప్పుడు వెలువడింది. ఈ ప్రచురణ బేబెల్, బెర్న్‌స్టయిన్‌లు నిర్వహించ వలసిందనే కోర్కెను ఎంగెల్స్ తన మరణశాసనంలో వెలిబుచ్చాడు. బేబెల్ తానింకా కొద్ది రోజులకు చనిపోతాననగా తన వంతు సంపాదకీయ కార్యాన్ని పూర్తి చేయగల్గాడు.

స్టుట్‌గార్ట్ పట్నంలో డీట్జ్ ప్రచురణాలయంచే కొద్ది వారాల్రకితం ప్రచురితమయిన మార్క్స్-ఎంగెల్స్ ఉత్తరప్రత్యుత్తరాలు నాల్గు బృహత్ సంపుటాల రూపంలో వున్నాయి. ఈ నాల్గు బృహత్ సంపుటాల్లోనూ, 1844 నుండి 1883 వరకూ వున్న విస్తృత కాలంలో మార్క్స్ ఎంగెల్స్‌ల మధ్య నడచిన 1,386 వుత్తరాలు క్రోడీకరించబడ్డాయి.

సంపాదకీయ కార్యం, అనగా వివిధ కాలావధులకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్త రాలకు పీఠికల రచన, ఎడువార్డ్ బెర్న్‌స్టయిన్ నిర్వహించాడు. సాంకేతిక, భావశాస్త్రీయ దృక్ స్థానాలు రెంటి నుండీ చూచినట్టయితే ఈ కార్యం అనుకున్నట్టుగానే అసంతృప్తికరంగానే వుంది. అమిత అవకాశవాదిగా "పరిణామం" చెందినట్టి అప్రతిష్ఠను ఆర్జించుకున్న తరువాత బెర్న్‌స్టయిన్, విప్లవభావంతో సంపూర్ణంగా గర్భితమైనట్టి ఈ వుత్తరాలకు ఎంత మాత్రమూ సంపాదకత్వం వహించి వుండకూడదు. బెర్న్‌స్టయిన్ రాసిన ఉపోద్ఘాతాలలో కొంత భాగం అర్థరహితమూ, కొంత భాగం కేవలం సత్యదూరమూనూ; అందుకు ఈ ఉదాహరణ చూడండి: మార్క్స్, ఎంగెల్స్‌లు బయటపెట్టిన లాసాల్, ష్వైట్జర్‌ల అవకాశవాద స్ఖాలిత్యాలను కచ్చితంగానూ స్పష్టంగానూ, నిర్మొగమాటంగానూ స్వాభావికీకరణం చేయడం బదులు, "లాసాల్ విధానాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు ఎల్లప్పుడూ సరిగా విలువకట్టారా అని న్యాయంగానే శంకించవచ్చు" అనీ (3 వ సంపుటం, XVIII వ పుట), వారి ఎత్తుగడలలో లీబ్‌క్నెఖ్ట్‌కు కంటె ష్వైట్జర్‌కే వారు "ఎంతో దగ్గరగా వుంటారనీ" (IV వ సంపుటం,

X వ పుట), ఇలాంటి వరణతత్వపు పదజాలాలూ విసుర్లూ మనకు తారసపడూంటాయి. కేవలం అవకాశవాదానికి తెరమరుగు కల్పించడమూ మెరుగులు దిద్దడమూ తప్ప ఈ దాడులకు మరే అర్థమూ లేదు. తన ప్రత్యర్థులు పలువురితో మార్క్స్ సలిపిన సైద్ధాంతిక పోరాటం పట్ల ప్రదర్శిత మవుతూన్న ఈ వరణతత్వపు వైఖరి దురదృష్టవశాత్తూ నేటి జర్మన్ సోషల్-డెమోక్రాట్లలో అంతకంతకు మరింతగా విస్తృతవ్యాప్తి పొందుతూంది.

సాంకేతిక దృక్స్థానం నుండి పరిశీలించిన యెడల సూచిక అసంతృప్తికరంగా వుంది — నాల్గు సంపుటాలకూ ఒకే ఒక సూచిక (ఉదాహరణకు: అందులో కౌట్స్కీ, స్టర్లింగ్‌ల పేర్లే వదలివేయబడ్డాయి); ఒక్కొక్క వుత్తరానికీ ఇచ్చిన వివరణలు అతిసంగ్రహంగా వుండి, సోర్గె అనుసరించినట్టు ఆ వివరణలు ఏ వుత్తరానికైతే వర్తిస్తాయో ఆ వుత్తరాలకు చేరువగా వుంచడం బదులు, సంపాదకుని ఉపోద్ఘాతాలలో ఏ మూలో విసరేసి వున్నాయి; ఇలాంటి లోపాలు ఇంకా వున్నాయి.

ప్రచురణ వెల కూడా అనుచితంగా హెచ్చుగా వుంది — నాల్గు సంపుటాలూ 20 రూబుళ్లు. మొత్తం ఉత్తరప్రత్యుత్తరాలు ఇంతటి అందమైన కూర్పులో కాకుండా కాస్త సాదా కూర్పులో జనసామాన్యానికి అందుబాటులో వుండే వెలకు ప్రచురించడానికి నిస్సందేహంగా వీలుండేది, ప్రచురించాల్సే వుండేది కూడా. దీనికి అదనంగా, కార్మికులలో విస్తృత ప్రచారానికి వీలుండేటందుకు, మూలసూత్రం దృష్ట్యా అత్యంత ముఖ్యమైన ఖండాలు ఎంచి ప్రచురించడానికి వీలుండేది, ప్రచురించాల్సే వుండేది కూడా.

ఈ లోపాలన్నీ ఉత్తరప్రత్యుత్తరాల అధ్యయనానికి సహజంగానే ప్రతిబంధకాలుగా ఏర్పడుతున్నాయి. ఇది శోచనీయం. ఎందుచేతనంటే, శాస్త్రీయంగానూ, రాజకీయంగానూ ఉత్తరప్రత్యుత్తరాలకున్న విలువ అపారం. ఈ లేఖలలో మార్క్స్ ఎంగెల్స్‌లు, తమ బోధనలలో వినూత్నమైనట్టి (వారి తొలి అభిప్రాయాలకు సంబంధించినంత వరకు), అత్యంత ముఖ్యమైనట్టి, అత్యంత కష్టతమములైనట్టి విషయాలను ఒత్తిచెప్పి వివరించుతూ, వాటి వివిధాంశాలను పదేపదే మన దృష్టికి తెస్తూంటారు కాబట్టి, వారి అనన్యసామాన్య ప్రతిభ పాఠకునికి స్పష్టంగా సాక్షాత్కార మవడమే కాకుండా, మార్క్సిజంయొక్క అత్యంత ఘనమైన సైద్ధాంతిక విషయం ఎంతో అంత సచిత్రభూయిష్ఠమైన రీతిని ఆవిష్కృత మవుతూంది.

ఈ లేఖలు చదువుతూన్నప్పుడు, సర్వప్రపంచ కార్మికోద్యమ చరిత్రయొక్క — ఆ చరిత్రలోని అతిముఖ్యమైన తరుణాలయొక్క, అత్యంత ప్రధానములైన అంశాలయొక్క — అద్భుత పరిస్ఫుట చిత్రణ, ముకుళిత పుష్పం వికసించినట్టుగా పాఠకుని కట్టెదుట ఆవిష్కృత మవుతుంది. ఇంతకంటెనూ అమూల్యమైనది కార్మికవర్గ రాజకీయాల చరిత్ర.

పురాతన, నూతన ప్రపంచాలలోని వివిధ దేశాలలో, అత్యంత వైవిధ్యములైన సమయాలలో, భిన్నభిన్న చారిత్రాత్మక గడియలలో కార్మికవర్గంయొక్క రాజకీయ కర్తవ్యాల ప్రదర్శనలోని ముఖ్యసూత్రాలను మార్క్స్, ఎంగెల్స్‌లు చర్చిస్తారు. కాగా ఈ ఉత్తరప్రత్యుత్తరాలు నడచిన శకం — బూర్జువా ప్రజాస్వామ్యం నుండి కార్మికవర్గం సరిగ్గా అప్పుడే తెగతెంపులు చేసుకున్న శకం; స్వతంత్ర కార్మికోద్యమం అవతరించిన శ్రామికవర్గపు ఎత్తుగడల విధానాల మౌలికసూత్రాలు నిర్వచించబడిన శకం; నేటి మన కాలంలో, బూర్జువా వర్గంయొక్క విస్తృత, శిథిలావస్థలకు అనుషంగికంగానూ, దినదినమూ సంభవించే అల్పవిషయాలపై కార్మిక నాయకులు తమ దృష్టిని లగ్నం చేయడమునకూ తదితరములకూ అనుషంగికంగానూ సంభవించినట్టి అవకాశవాదంతో వివిధ దేశాలలోని కార్మికోద్యమం ఏ విధంగా బాధపడుతూందో చూచేందుకు మనకు అవకాశం కల్గుతూన్నకొద్దీ — శ్రామికవర్గంయొక్క మౌలికములైన పరివర్తనకర లక్ష్యాల ప్రగాఢ అవగాహనను ప్రదర్శించుతూ, అవకాశవాదానికి గాని, విప్లవాత్మక పదజాల వ్యాపారానికి గాని ఈషత్తు సదుపాయం సహితమూ కల్పించకుండానే ఈ విప్లవాత్మక లక్ష్యాల దృక్స్థానం నుండి ఎత్తుగడలయొక్క ఆ యా కర్తవ్యాలకు అసాధారణమైన ఉలుసుబాటు కల్గిన నిర్వచనాలను రూపొందించుతూన్నట్టి ఈ ఉత్తరప్రత్యుత్తరాలలో అంతగర్భితమైన విషయసంపత్తి మరింత అమూల్య మవుతూంది.

యావత్తు ఉత్తరప్రత్యుత్తరాలయొక్క, ఒక విధంగా చెప్పాలంటే, సంగమ బిందువును, వాటిలో వ్యక్తీకరించబడినట్టీ చర్చించబడినట్టీ సంపూర్ణ భావజాలం అభిసరించుతూన్న కేంద్రస్థానాన్ని, ఒక్క పదంలో నిర్వచించ ప్రయత్నించిన యెడల, ఆ పదం గతితర్కం. మార్క్స్ ఎంగెల్స్‌లకు అన్నిటికంటే ఎక్కువ అభిలాష కల్గించిన విషయం, ఏ విషయంయొక్క అత్యంత ప్రధానమూ, వినూత్నమూ అయిన అంశాన్ని వారు సమర్పించారో ఆ విషయం, విప్లవాత్మక చింతనాచరిత్రకు వారు దోహదం చేసిన గురుతర పురోగమనమని ఎంచబడిన విషయం, దాని పునాది నుండీ కూడా యావత్తు ఆర్థికశాస్త్ర పునస్స్వరూప కల్పనకూ, చరిత్రకూ, ప్రకృతిశాస్త్రానికీ, తత్వశాస్త్రాలకూ, కార్మికవర్గంయొక్క ఎత్తుగడలకూ, రాజనీతికీ భౌతిక గతితర్కాన్ని వినియుక్త పరచడమే.

---

ఈ కింది వివరణలో, ఉత్తరప్రత్యుత్తరాలను స్థూలంగా సమీక్షించిన తర్వాత, లేఖలలోని విషయాలను ఆమూలాగ్రంగా వివరించే కపటయత్నం చేయకుండానే, వాటిలో మార్క్స్ ఎంగెల్స్‌లు కావించిన వాదనలలోనూ సూచనలలోనూ అత్యంత మనోరంజకములైన వాటిని రేఖా మాత్రంగా సూచించ నుద్దేశిస్తున్నాం.

# I. స్థూల సమీక్ష

ఇరవైనాలుగేళ్ల ప్రాయంలో వున్న ఎంగెల్స్ 1844 లో మార్క్స్ పేర రాసిన లేఖతో ఈ ఉత్తరప్రత్యుత్తరాలు ఆరంభమవుతాయి. ఈ లేఖలు చదివితే ఆనాటి జర్మనీలోని పరిస్థితులు కళ్లకు కట్టినట్టుగా వ్యక్తమవుతాయి. మొదటి వుత్తరం తేదీ 1844 సెప్టెంబరు ఆఖరి దినాలు. ఆ వుత్తరాన్ని తన జన్మస్థానమూ, తన తల్లితండ్రుల నివాసస్థానమూ అయిన బార్మెన్ నగరం నుండి ఎంగెల్స్ రాశాడు. అప్పటికింకా ఎంగెల్స్‌కి 24 ఏళ్ళు పూర్తిగా నిండనేలేదు. తన తల్లితండ్రుల అండను వుండడంతో ఎంగెల్స్ విసుగెత్తిపోయి, కుటుంబం నుండి విడిపోవడానికి ఆత్రపడ్డాడు. అతని తండ్రి చండశాసనుడు. నిష్కాపరుడైన కార్ఖానా యజమాని. వేళా పాళా లేకుండా కొడుకు అదేపనిగా ఈ రాజకీయ సమావేశం నుండి ఆ రాజకీయ సమావేశానికి పరుగెత్తుతూండడమూ, అతని కమ్యూనిస్టు అభిప్రాయాలూ చూసి తండ్రికి వొళ్లు మండిపోయింది. తల్లిమీద ఎంగెల్స్‌కి ఎంతో ప్రేమ వుండబట్టిగాని, లేకపోయుంటే తాను ఇంటినుండి బయలుదేరడానికి ఇంకా గడువుపెట్టుకున్న ఆ కొద్ది రోజులు గడపడమే తన కెంతో కంటకంగా వుంటూాందని అతడు తన వుత్తరంలో రాశాడు. తాను బయలుదేరకుండా వుండాలని తన కుటుంబంవారు ఏమేమి చిల్లర మల్లర కారణాలూ మూఢనమ్మికల ఫలితమైన భయాలూ చూపించేవారో తన వుత్తరాల్లో అతడు మార్క్సతో చెప్పుకునేవాడు.

తానింకా బార్మెన్‌లో వుండగానే — ఒక ప్రణయ ఉదంతం కారణంగా మరికొంత కాలం ఆ నగరంలోనే ఎంగెల్స్ వుండిపోగా — తన తండ్రి మాటను ఆయన ఔదలదాల్చి ఆఫీసులో అతడు సుమారు రెండు వారాలపాటు పనిచేశాడు (ఆ ఫ్యాక్టరీ తండ్రిదే). "తుచ్ఛమైన ఈ బేరసారాలు సాగించడమంటే అసహ్యం వేస్తూాంది. బార్మెన్ అంటే అసహ్యంవేస్తూాంది, వీళ్ళు కాలం ఏలా వెళ్లబుచ్చుతున్నారో చూస్తూాంటే అసహ్యంవేస్తూాంది; అన్నిటికంటే పరమ అసహ్యం వేస్తూాన్నది: ఇంకా ఈలా బూర్జువాగానే వుండడమే కాకుండా, పైపెచ్చు శ్రామికవర్గాన్ని క్రియాశీలంగా నిరోధించుతూాన్న ఫ్యాక్టరీ యజమానిగా వుండడం," అంటూ అతడు మార్క్స పేర రాస్తాడు. కార్మికవర్గ స్థితిగతులను గురించి తాను రాస్తూాన్న పుస్తకంపై చాలా కృషిచేస్తున్నానని (మనం ఎరిగినట్టూ ఈ పుస్తకం 1845 లో వెలువడి, ప్రపంచ సోషలిస్టు సారస్వతంలోని అత్యుత్తమ కృతులలో ఒకటిగా పేరు గడించుకుంది), తన్ను తానే ఓదార్చుకుంటున్నానని ఆ వుత్తరంలోనే ఇంకా అంటాడు ఎంగెల్స్. "తాను రచనా వ్యాసంగం సాగించనంత వరకూ, కమ్యూనిస్టుగా వుంటూానే, పైకి మాత్రం బూర్జువాగానూ, బేరసారాలు సాగించుతూాన్న క్షుద్రమృగంగానూ వుండొచ్చు; కాని విస్తృత

మైన కమ్యూనిస్టు ప్రచారం సాగించుతూ, అదే సమయంలో తుచ్ఛమైన లావాదేవీలలోనూ పరిశ్రమలోనూ పాల్గొంటూండడానికి ఏమాత్రమూ పొసగదు. నేనిక్కడనుండి వెళ్ళిపోతున్నాను. దీనికి తోడు నూటికి నూరు పాళ్ళా క్రిస్టియన్-ప్రష్యన్ కుటుంబపు నిద్దరమత్తు జీవితం కూడా కలిపితే — ఇక నాకు అట్టే కాలం భరించ శక్యం కాదు. ఇలా వుంటే ఇక చివరికి ఒక జర్మన్ ఫిలిస్టైన్ కింద నేను తయారై, కమ్యూనిజంలోకి ఫిలిస్టైన్‌తత్వం ప్రవేశపెడతానేమో కూడా.'' ఈ విధంగా రాశాడు యువకుడు ఎంగెల్స్. 1848 విప్లవం తర్వాత జీవిత పరిస్థితుల వొత్తిడి ననుసరించి ఎంగెల్స్‌కి తన తండ్రి ఆఫీసులో తిరిగి చేరి, కొన్ని సుదీర్ఘ సంవత్సరాల పాటు ''బేరసారాలు సాగించుతూన్న క్షుద్రమృగం''గా వుంటేనే తప్ప గత్యంతరం లేకపోయింది. అయినప్పటికీ తాను స్థిరంగా నిలబడి, తన చుట్టూ క్రిస్టియన్-ప్రష్యన్ పరిస్థితులనుగాక, కేవలం తద్భిన్న పరిస్థితులను, క్రామేడ్లీ పరిస్థితులను సృష్టించుకోడానికీ, తన జీవితాంతం వరకూ ''కమ్యూనిజమ్‌లోకి ఫిలిస్టైన్‌తత్వ ప్రవేశానికి'' బద్ధశత్రువుగా మూర్తీభవించడానికీ అతనికి వీలుపడింది.

1844 లో జర్మన్ రాజధాన్యేతర రాష్ట్రాలలోని సామాజిక జీవితం, ఇరవయ్యో శతాబ్దారంభంలో 1905 విప్లవానికి ముందు రష్యాలో సామాజిక జీవితాన్ని పోలి వుండేది. రాజకీయ జీవితానికి ఒక ప్రేరేపణ, సాధారణంగా ప్రభుత్వానికి ప్రతికూలంగా పెల్లుబుకుతూన్న ఒక ఆగ్రహం సర్వత్రా ప్రజ్వరిల్లింది; నాస్తికులైపోతూన్నారని యువకుల మీద మతగురువులు నిప్పులు చెరుగుతూండేవారు, ''సేవకుల పట్ల, లేక కార్మికుల పట్ల రాజసగర్వం ప్రదర్శిస్తూన్నందుకు'' బూర్జువావర్గ కుటుంబాల పిల్లలు తమ తల్లితండ్రులపై పోట్లాడుతూండేవారు.

ఈ సాధారణ ప్రతికూల భావం ఎలా వ్యక్త మవుతూండేదంటే, ప్రతివాడూ తాను కమ్యూనిస్టుననే ప్రకటించుకునేవాడు. ''బార్మెన్ నగరపు పోలీసు కమీషనరు కమ్యూనిస్టు,'' అని మార్క్స్‌కు వుత్తరం రాస్తూ ఎంగెల్స్ అంటాడు. ''నేను కొలోన్ వెళ్ళాను... డ్యూస్సెల్‌డార్ఫ్ వెళ్ళాను... ఎల్బర్‌ఫెల్డ్ వెళ్ళాను — ఈ వూళ్ళలో ఎటుచూసినా కమ్యూనిస్టులే ఎదురవుతారు! సేల్ అనే ఒక ఉగ్రుడైన కమ్యూనిస్టు, చిత్రలేఖకుడు, వ్యంగ్యచిత్రకారుడు రెండు నెలల్లో పారిస్ వెళ్ళుతున్నాడు. అతనికి మీ చిరునామా ఇస్తాను; అతని ఔత్సాహిక స్వభావానికీ, సంగీతమంటే అతనికున్న అభిమానానికీ అతనంటే మీకందరికీ తప్పకుండా ఇష్టం కలుగుతుంది; అంతేకాదు వ్యంగ్యచిత్రకారునిగా అతనిని మీరు ఉపయోగించుకోవచ్చు కూడా,'' అని ఎంగెల్స్ రాస్తాడు.

''ఇక్కడ ఎల్బర్‌ఫెల్డ్‌లో అద్భుతాలు జరుగుతున్నాయి. నిన్నటి రోజు'' (ఈ వుత్తరం రాసినది 1845 ఫిబ్రవరి 22 న) ''ఈ పట్నంలోకల్లా పేరెన్నిక గన్న రెస్టారెంటూ పట్నంలో

కల్లా పెద్దసభామందిరంలో మా మూడవ కమ్యూనిస్టు సమావేశం జరుపుకున్నాం. మొదటి సమావేశానికి 40 మంది, రెండవ సమావేశానికి 130 మంది, మూడవ సమావేశానికి కనీసం 200 ల మంది హాజరయారు. మొత్తం ఎల్బర్‌ఫెల్డ్, బార్మెన్ రెండు నగరాల తర పునా ధనిక ప్రభువర్గం మొదలుకొని చిన్న దుకాణదార్ల వరకూ, ఒక్క శ్రామికవర్గం మినహా, ప్రతినిధులందరూ వచ్చారు."

ఇది అక్షరాలా ఏంగెల్స్ రాసినది. ఆ రోజుల్లో జర్మనీలో అందరూ కమ్యూనిస్టులే — ఒక్క శ్రామికవర్గం మినహా. అందరిలోనూ, అందులోనూ ముఖ్యంగా బూర్జువా వర్గంలో, వుండిన ప్రభుత్వప్రతికూల భావాలను వ్యక్తీకరించే రూపాలలో ఒకటి కమ్యూనిజంగా పరిణమించింది. "అందరిలోనూ శుద్ధ మందబుద్ధులూ, అందరిలోనూ అత్యంత బద్ధకస్థులూ, అందరిలోనూ అగ్రగణ్యులైన ఫిలిస్టైన్‌లూ — ప్రపంచంలో దేనిమీదా ఆసక్తి కనబరచని వీరందరూ కమ్యూనిజం అంటే ఇంచుమించు ఉత్సాహమే ప్రదర్శించడం ప్రారంభిస్తున్నారు." ఆ కాలంలో కమ్యూనిజాన్ని బోధించిన వారిలో ముఖ్యులు మన నరోద్నిక్కులూ, "సోషలిస్టు-రివల్యూషనరీలూ,"[38] "పాప్యులర్ సోషలిస్టులూ," వగైరా రకపు మనుషులు, అనగా ప్రభుత్వమంటే అంతో ఇంతో ఆగ్రహించినట్టి సద్భావులైన బూర్జువా వర్గంవారు అన్నమాట.

కాగా ఇట్టి పరిస్థితులలో, అసంఖ్యాకములైన కుహనా సోషలిస్టు ధోరణులూ గ్రూపులూ నడుమ వుంటూ, సదుద్దేశాలు కల్గిన బహుళసంఖ్యాకులతో, ఉత్సాహవంతులైన విప్లవకారులే అయినప్పటికీ చెడ్డ కమ్యూనిస్టులతో తెగతెంపులు చేసుకోడానికి భయపడ కుండానే, శ్రామికవర్గ సోషలిజానికి తన బాట కనుగొన గల్గాడు ఏంగెల్స్.

అది 1846. ఏంగెల్స్ పారిస్‌లో వున్నాడు. ఆ రోజుల్లో రాజకీయాలతోనూ రకరకాల సోషలిస్టు సిద్ధాంతాలతోనూ అట్టుడికినట్టు ఉడికిపోతూంది పారిస్. సోషలిజాన్ని ఏంగెల్స్ ఆత్రంతో అధ్యయనం చేశాడు; కాబె, లూయి బ్లాంక్ తదితర ప్రముఖ సోషలిస్టులతో పరి చయం చేసుకున్నాడు; ఈ పత్రికా సంపాదకీయ కార్యాలయంనుండి ఆ పత్రికా సంపాదకీయ కార్యాలయానికీ, ఈ రాజకీయ సర్కిల్ నుండి ఆ రాజకీయ సర్కిల్‌కీ చాంద్రాయణం చేసేవాడు.

సోషలిస్టు సిద్ధాంతాలన్నిటిలోనూ ఆనాడు అత్యంత ప్రాధాన్యత వహించినట్టి, అత్యంత విస్తృతప్రచారం పొందినట్టి ప్రూడనిజంపై ఏంగెల్స్ తనదృష్టి ప్రధానంగా కేంద్రీకరించాడు. కాగా ప్రూడన్ గ్రంథం, "దారిద్ర్యంయొక్క తత్వశాస్త్రం" ప్రచురణకు (అక్టోబరు 1846; దీనికి మార్క్స్ ప్రత్యుత్తరం — సుప్రసిద్ధ గ్రంథం, "తత్వశాస్త్ర దారిద్ర్యం" — 1847 లో వెలుబడింది) ఇంకా ముందే, అప్పట్లో ప్రత్యేకంగా జర్మన్ సోషలిస్టు గ్రూప్‌చే

సమర్థించబడుతూండినట్టి నిర్దాక్షిణ్యమైన అపహాస్యంతోనూ అద్భుతమైన ప్రగాఢ విజ్ఞానంతోనూ, ప్రూడన్‌యొక్క మూలభావాలను ఎంగెల్స్ విమర్శించాడు. అప్రతిష్ఠ పాలైనప్పటికీ ప్రూడన్‌చే తెలియక గొప్పగా పేర్కొనబడినట్టి "శ్రమ-మారకం బజార్లు" ఇంగ్లండులో ఏ విధంగా దివాళా తీశాయో ఆ దృష్టాంతాన్ని ఎంగెల్స్ ఇంగ్లీషు భాషలో అతనికుండిన ఉత్కృష్ట విజ్ఞానమూ (కొన్నేళ్ల తరువాతే ఈ భాషలో మార్క్స్ పాండిత్యం సంపాదించాడు), ఇంగ్లీషు సారస్వతంతో అతనికుండిన చక్కని పరిచయమూ ఫలితంగా వెంటనే (సెప్టెంబరు 16, 1846) చూపగలిగాడు. ఎంత డబ్బిచ్చేనా సరే కార్మికులు పెట్టుబడిని కొనిపారెయ్యాలని ప్రూడన్ బోధించడం మూలంగా సోషలిజానికి అతడు తలవంపులు తెస్తున్నాడని ఎంగెల్స్ ఆగ్రహంతో ఆశ్చర్యపడతాడు.

ఇరవైయ్యారేళ్ల ప్రాయంగల ఎంగెల్స్ "యథార్థ సోషలిజం"ను దుంపనాశనం చేసి పారేస్తాడు. "కమ్యూనిస్టు ప్రణాళిక"కు ఎంతో కాలం ముందుగానే, 1846 అక్టోబరు 23 న రాసిన వుత్తరంలో మనకీ ఉక్తి తారసిల్లుతుంది; దాని ప్రధాన సమర్థుడు గ్ర్యూన్ అని కూడా పేర్కొనబడింది. "శ్రామికవర్గ వ్యతిరేకత, పెట్టీబూర్జువా, ఫిలిస్టైన్" సిద్ధాంతం, "కేవల పదజాల వ్యాపారం, నానా రకాల "మానవతావాద ఆశయాలు," '"మొరటు' కమ్యూనిజం (Löffel-Kommunismus, శబ్దార్థ ప్రకారం "చెమ్చా కమ్యూనిజం," లేక పొట్ట నింపుకునేందుకు కమ్యూనిజం) పట్ల మూఢభక్తి జనితమైన భయవిభ్రాంతి," మానవాళి "సుఖం కొరకు శాంతియుత ప్రణాళికలు" — మార్క్స్‌కు పూర్వముండిన సోషలిజం యొక్క అన్ని రకాలకూ ఎంగెల్స్ ప్రయోగించిన విశేషణాల్లో ఇవి కొన్ని.

"మూడు సాయంకాలాల పాటు ప్రూడన్ సంఘాల పథకం చర్చించాం. గ్ర్యూన్ నాయకత్వంకింద ఇంచుమించు అందరూ నాకు వ్యతిరేకంగానే వున్నారు... నేను నిరూపించాల్సిన ప్రధాన విషయం: బలప్రయోగం వల్ల విప్లవం తీసుకురావలసిన ఆవశ్యకత" (అక్టోబరు 23, 1846). "చివరకు నాకు వాళ్ళ మండి, కమ్యూనిజంపై బహిరంగంగా దాడిచేయక ఇక వారికి గత్యంతరం లేకుండా వారికి ఇరుకున పెట్టాను. మనం కమ్యూనిస్టులమా, కామా? అనే విషయంపై వోటు తీసుకోవాల్సిందని నేను పట్టుపట్టాను. దానితో గ్ర్యూన్ అనుచరులు హడలిపోయి, 'మానవాళి శ్రేయస్సు' గూర్చి చర్చించడానికి తామందరమూ సమావేశమయ్యామనీ, కమ్యూనిజం అంటే ఏమిటో అసలు తాము తెల్సుకోవాల్సి వుందనీ వాదించడం మొదలెట్టారు. అందుపై, డొంక తిరిగుళ్లకూ దాటవేయడాలకూ అవకాశం కలుగజేయకుండా ఉండేలాగా నేను అతి సరళమైన నిర్వచన ఇచ్చాను." ఎంగెల్స్ ఇలా రాస్తాడు: "కమ్యూనిస్టుల ఆశయాలను నేను ఈ విధంగా నిర్వచించాను: 1) బూర్జువావర్గ ప్రయోజనాలకు ప్రతికూలంగా శ్రామికవర్గ ప్రయోజనాల సమర్థన; 2) దీనిని నెరవేర్చడానికి ప్రైవేటు ఆస్తిని

రద్దుచేయడం, దాని స్థానే సామాజిక వస్తు స్వామ్యం నెలకొల్పడం; 3) ఈ లక్ష్యాలను సాధించేందుకై బలప్రయోగం ద్వారా ప్రజాస్వామ్య విప్లవం తప్ప వేరొక సాధనం లేదని గుర్తించడం" (1848 విప్లవానికి సంవత్సరం ఆరునెలలు ముందు రాసినది).

ఎంగెల్స్ నిర్వచనానికి అనుకూలంగా పదమూడు వోట్లూ, ప్రతికూలంగా గ్ర్యూన్ అనుచరుల రెండు వోట్లూ పడడంతో సమావేశంచే అతని నిర్వచనం అంగీకరించబడి అంత టితో చర్చ ముగిసింది. ఈ సమావేశాలకు సుమారు ఇరవైమంది వడ్రంగి శిల్పులు హాజర య్యారు. ఈ విధంగా అరవైయ్యేడేళ్ల కిందట పారిస్‌లో జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ కార్మి కుల పార్టీ శంఖుస్థాపన జరిగింది.

ఇది జరిగిన ఒక యేడాది తర్వాత, ఎంగెల్స్ 1847 నవంబరు 24 తేదీగల వుత్త రంలో, "కమ్యూనిస్టు ప్రణాళిక" ముసాయిదా నొకదానిని తాను తయారు చేశాననీ మార్క్స్‌కు తెలియజేస్తూ, మొదట ప్రతిపాదించబడిన ప్రశ్నోత్తర రూపానికి తాను వ్యతిరేకినని ప్రాసంగి కంగా తెల్పాడు. "కమ్యూనిజం అంటే ఏమిటి? అనే ప్రశ్నతో ప్రారంభించాను. ఆలా ప్రారంభించిన తర్వాత సరాసరి శ్రామికవర్గం ప్రస్తావన — దాని ప్రాదుర్భావ చరిత్ర, దానికీ మునుపటి కార్మికులకూ వుండే వ్యత్యాసం, శ్రామికవర్గానికీ బూర్జువా వర్గానికీ వుండే వైరుధ్యంయొక్క అభివృద్ధి సంక్షోభాలు, పర్యవసానం." "ముగించుతూ కమ్యూనిస్టుల పార్టీ విధానం."

ఆధునిక సోషలిజం స్థాపకులుగా మార్క్స్, ఎంగెల్స్‌లను ఒకరి సరసను ఒకరిని పేర్కొనడం న్యాయసమ్మతమేనని, సర్వప్రపంచ యాత్ర సాగించినట్టీ, దాని మూలసూత్రాలలో నేటికి సహితమూ యథార్థమై నిన్ననే రాసినట్టుగా వాస్తవమై నేటి దేశ కాల పాత్రాలకు సంబంధించినదై నిలిచినట్టీ రచనయొక్క మొట్టమొదటి ముసాయిదాను గూర్చి ఎంగెల్స్ రాసిన ఈ చారిత్రాత్మక లేఖ సుస్పష్టంగా రుజువు పరుస్తూంది.*

1913 సంవత్సరాంతం.

---

* ఇంతటితో వ్యాసం ఆగిపోతూంది. — సం.

# మార్క్సు ఎంగెల్సుల స్మృతిచిహ్నా ఆవిష్కరణ సమయమందిచ్చిన ఉపన్యాసం

## నవంబరు 7, 1918

ప్రపంచ కార్మిక విప్లవ నాయకులు మార్క్సు, ఎంగెల్సుల స్మృతిచిహ్నాన్ని మనం ఆవిష్కరించుతున్నాం.

కోటానుకోట్ల శ్రమజీవులను పీడించినట్టి స్వల్ప సంఖ్యాకులై పట్టుమని పదిమంది దోపిడికాండ్రు మోపిన గాటికింద యుగయుగాలుగా మానవాళి బాధలననుభవించి, కృశించింది. గతశకపు దోపిడికాండ్రు — భూస్వాములు — ఐకమత్యంలేనట్టి, చెల్లాచెదరైనట్టి, అజ్ఞానులైనట్టి రైతు బానిసలను కొల్లపెట్టి పీడించి వుండగా, నూతనకాలపు దోపిడికాండ్రు, పెట్టుబడిదార్లు, తమచే పీడించబడినట్టి ప్రజారాసులమధ్యనుండి ఆ ప్రజారాసుల అగ్రగామిదళం, పట్నవాస, ఫ్యాక్టరీ, పారిశ్రామిక కార్మికులు, తమ ఎదుట ముఖాముఖీ నిలిచి వున్నట్టు గమనించారు. ఈ కార్మికులు ఫ్యాక్టరీవల్ల ఐక్యమయారు, పట్నవాస జీవితంవల్ల విజ్ఞానవంతులయారు, సమిష్టి సమ్మె పోరాటంవల్లనూ విప్లవాత్మక కార్యాచరణవల్లనూ వజ్రసంకల్పులయారు.

శాస్త్రీయ విశ్లేషణవల్ల పెట్టుబడిదారీ విధాన పతనమూ, ఏ విధానం కిందనైతే మానవునిచే మానవుని దోపిడీ ఇక జరగనేరదో అట్టి కమ్యూనిజంలోకి పెట్టుబడిదారీ విధానం యొక్క పరివర్తనా తప్పనిసరి అని నిరూపించిన మహత్తర చారిత్రక కీర్తి మార్క్సు ఎంగెల్సులకే దక్కింది.

పెట్టుబడికి వ్యతిరేకంగా విప్లవాత్మక పోరాటానికై ప్రప్రథమంగా లేచి నిలబడడమూ, ఈ పోరాటంలో అందరి శ్రమజీవులనూ పీడితులనూ తమ చుట్టూ సమీకరించుకోవడమూ — ఇదే వారి పాత్ర, ఇదే వారి కర్తవ్యం, ఇదే వారి విధ్యుక్తధర్మమూ అని అన్ని దేశాల శ్రామికవర్గీయులకూ తెలియజెప్పడంలోనే వుంది మార్క్సు, ఎంగెల్సులు కావించినట్టి ప్రపంచ చారిత్రకమైన మహత్తర సేవ.

మహనీయులైన ఈ సోషలిస్టులు చెప్పిన జోశ్యం యథార్థమవుతూన్నట్టి శుభకాలంలో మనం జీవిస్తున్నాం. అనేక దేశాల్లో శ్రామికవర్గ అంతర్జాతీయ సోషలిస్టు విప్లవ భానూదయం మనం చూస్తున్నాం. జాతులను బలిగొంటూన్న సామ్రాజ్యవాదుల కసాయి కత్తి నెరపుతూన్నట్టి చెప్పనలవికాని ఘోరాతిఘోరాలు ప్రజారాసుల వీరోచిత విద్రోహాన్ని సర్వేసర్వత్రా పురికొల్పుతూ విముక్తి పోరాటంలో వాటికి పదింతల బలం సమకూర్చుతూంది.

మన పోరాటంలో మనం ఒంటరులం కామని కోటానుకోటి కార్మికులకూ కర్షకులకూ మార్క్స్ ఎంగెల్స్‌ల స్మృతిచిహ్నాలు పునః పునః స్మరణకు తెచ్చుగాక. అధికతర పురోగామి దేశాల కార్మికులు కూడా మనతో మన సరసనే లేస్తున్నారు. వారికీ మనకీ కఠిన యుద్ధాలు ఎదురుకానున్నాయి. పెట్టుబడి మోపిన కాడిమాను సమిష్టి పోరాటంలో తునాతునుకలుగా విరిగి తీరుతుంది, సోషలిజం అంతిమ విజయాన్ని సాధించి తీరుతుంది!

# మార్క్సిజంయొక్క మూడు మూలాధారాలూ, అంశీభూతములైన మూడు భాగాలు

నాగరిక ప్రపంచం సర్వత్రా మార్క్సిజాన్ని ఒక విధమైన ''వినాశకరమగు కూటమి''గా పరిగణించుతూన్నట్టి బూర్జువా విజ్ఞానశాస్త్రం (అధికారయుత విజ్ఞానశాస్త్రమూ, ఉదారభావ విజ్ఞానశాస్త్రమూ, ఈ రెండున్నూ), మార్క్స్ ఉపదేశాలపట్ల అత్యధికమైన శత్రుత్వాన్నీ ద్వేషాన్నీ ప్రదర్శిస్తున్నాయి. కాగా వేరొక విధమైన ధోరణిని అవి ప్రదర్శిస్తాయని ఆశించడానికి కూడా వీల్లేదు; ఎందుచేతనంటే వర్గపోరాట ప్రాతిపదికపైన ఏర్పడిన సమాజంలో, ''నిష్పాక్షికమైన'' సాంఘిక విజ్ఞానశాస్త్రం అంటూ వుండడానికి అవకాశమే లేదు. అధికారయుతమైతేనేమి ఉదారస్వభావము గలదైతేనేమి, విజ్ఞానశాస్త్రం సర్వమూ కూడా, ఏదో ఒక విధంగా కూలిబానిసత్వాన్ని సమర్థించుతునే వుండగా, కూలిబానిసత్వానికి వ్యతిరేకంగా మార్క్సిజం ఒక్కటే దయదాక్షిణ్యం ఎరుగని యుద్ధాన్ని ప్రకటించింది. పెట్టుబడి తన లాభాలను తగ్గించేసుకొని కార్మికుల కూలిని హెచ్చించాలి అనే సమస్యపైన ఫ్యాక్టరీ యజమానులు నిష్పాక్షికంగా వుంటారని అనుకోవడం ఎంత జడ్డితనమూ సత్యకాలమూ అవుతుందో, కూలిబానిసత్వంపైనే ఏర్పడి మనుగడను సాగించుతూన్న సమాజంలో వున్న విజ్ఞానశాస్త్రం నిష్పాక్షికంగా వుంటుందని ఆశించడం అంత జడ్డితనమే అంత సత్యకాలమే అవుతుంది.

ఇంత మాత్రంతో సరిపోవడం లేదు. ప్రపంచ నాగరికత క్రమాభివృద్ధియొక్క రాజమార్గాన్ని వదిలిపెట్టి ఏ సందుగొందుల్లోనో పుట్టి పెరిగి, ప్రపంచంతో సంబంధం లేనట్టి, కరడుకట్టిపోయిందన్న అర్థంతో మార్క్సిజం గురించి మాట్లాడినట్టయితే, ''ఒంటెత్తుతనాన్ని'' పోలిన గుణం మార్క్సిజంలో లవలేశమూ లేదని తత్వశాస్త్ర, సాంఘికశాస్త్ర చరిత్రలు విస్పష్టంగా తెలుపుతున్నాయి. తత్భిన్నంగా, మానవజాతిలో ప్రప్రథమ స్థానాన్ని అలంకరించిన భావుకులు ఇదివరకే లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానాల నివ్వడంలోనే అచ్చంగా వుంది మార్క్స్ ప్రతిభ అంతా. తత్వశాస్త్రం, అర్థశాస్త్రం, సోషలిజం, వీటిలో మహాపండితుల ఉపదేశాలయొక్క ప్రత్యక్షమూ తక్షణమూ అయినట్టి కొనసాగింపుగానే మార్క్స్ ఉపదేశాలు ఆవిర్భూతమయ్యాయి.

మార్క్సు సిద్ధాంతం సత్యమైనది కాబట్టే అది సర్వశక్తివంతంగా విలసిల్లుతూంది. అది సంపూర్ణంగానూ సర్వోపాంగ సమ్మేళనంగానూ ఉండి, ఎవ్విధమైన మూఢవిశ్వాసంతో గానీ, అభివృద్ధి నిరోధక తత్వంతో గానీ, బూర్జువా హింస సమర్థనతో గానీ, పొత్తు కుదుర్చుకొన నొల్లని సమ్యగ్ ప్రపంచ దృక్పథాన్ని మానవులలో కలిగిస్తుంది. పంథొమ్మిదవ శతాబ్దంలో జర్మన్ తత్వశాస్త్రం, ఇంగ్లీషు అర్థశాస్త్రం, ఫ్రెంచి సోషలిజం రూపాలలో మానవజాతి సృష్టించిన విజ్ఞానమంతటిలోనూ ఉత్తమమైనదానికంతటికీ అది ఔరస వారసత్వాన్ని పొందుతూంది.

మార్క్సిజంయొక్క ఈ మూడు మూలాధారాల గురించీ, దాని అంశీభూతములైన మూడు భాగాలను గురించీ మనమిప్పుడు క్లుప్తంగా ప్రస్తావించబోతున్నాం.

## I

మార్క్సిజం బోధించే తత్వశాస్త్రం భౌతికవాదం. యూరప్ ఖండంయొక్క ఆధునిక చరిత్ర అంతటిలోనూ, అందులోనూ పద్దెనిమిదవ శతాబ్ది చరమదశలోనూ, ముఖ్యంగా, అన్నిరకాల మధ్యయుగాలనాటి చెత్తకు వ్యతిరేకంగానూ, సంస్థలలోనూ భావాలలోనూ ఇంకా నిలదొక్కుకొని ఉండిపోయిన ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగానూ, నిష్కర్షగా జరిగిన సమరంలో యుద్ధభూమిగా పరిణమించిన ఫ్రాన్సులో, తత్వశాస్త్రాలన్నిటిలోనూ దృఢంగా, ప్రకృతి శాస్త్ర బోధనలకు సుముఖంగా, మూఢనమ్మకాలు కుటిలత్వాలు ఇత్యాదులకు శత్రువుగా నిలబడగలిగిన తత్వశాస్త్రమల్లా ఒక్క భౌతికవాదమే అని స్పష్టంగా రుజువైంది. అందుచేత ప్రజాతంత్ర వ్యవస్థకు శత్రువులైనవారు భౌతికవాదం "శుద్ధ అబద్ధమని నిరూపించడానికీ" దానిని కూలదోసి, అప్రతిష్ఠపాల్జేయడానికీ తమ శక్తినంతనూ వినియోగించుతూ, ఎల్లప్పుడూ ఏదో ఒకవిధంగా మతాన్నే సమర్థించే, లేక మతానికే సహాయంచేసే పక్షాన్ని వహించే తాత్విక భావవాద రూపాలన్నింటినీ ప్రోత్సహిస్తూనే వచ్చారు.

మార్క్సు ఎంగెల్సులు తాత్విక భౌతికవాదాన్ని అత్యంత పట్టుదలతో సమర్థించి, ఈ ప్రాతిపదికనుండి తలవెంట్రుకవాసి వైదొలగినప్పటికీ కూడా ఈ వైదొలగుట ప్రతీదీ ఎంతటి మహాపరాధానికి కారణమవుతుందో పదేపదే వివరించుతూ వచ్చారు. వారి అభిప్రాయాలు ఎంగెల్సు రచించిన "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్," "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" అనే గ్రంథాలలో విస్పష్టంగానూ సాంగోపాంగంగానూ వివరించబడ్డాయి. ఈ గ్రంథాలు కూడా "కమ్యూనిస్టు ప్రణాళిక"లాగే వర్గచైతన్యవంతుడైన ప్రతి కార్మికునికీ ప్రమాణిక గ్రంథాలు.

కాగా, పద్దెనిమిదవ శతాబ్దపు భౌతికవాదంతో మార్క్స్ ఆగిపోలేదు: తత్వశాస్త్రాన్ని ఇంకా ముందుకు తీసుకొనిపోయాడు. జర్మన్ సాంప్రదాయిక తత్వశాస్త్రమూ, ప్రధానంగా హేగెల్ పద్ధతీ, దాని తరువాత అది దారితీసిన ఫాయెర్‌బాఖ్‌యొక్క భౌతికవాదమూ, సేకరించిన సముపార్జనలతో మరింత భాగ్యవంతం చేశాడు. ఈ సముపార్జనలలో ప్రధానమైనది గతితర్కం, అనగా ఏ అంశంపట్ల కూడా ఎట్టి పక్షపాతమూ వహించకుండా కూలంకషమూ ప్రగాఢమూ అయిన రూపంలో అభివృద్ధిక్రమాన్ని వివరించే సిద్ధాంతం, శాశ్వతంగా క్రమాభివృద్ధిని పొందుతూన్న పదార్థంయొక్క ప్రతిబింబాన్ని మనకు ప్రదర్శించేటట్టి మానవ విజ్ఞాన సాపేక్ష సిద్ధాంతం. పురుగుపట్టి పుచ్చిపోయిన పాతకాలంనాటి భావవాదంయొక్క ఆదిమావస్థను పునస్థాపన చేయడానికి "నూతన" ప్రయత్నాలను కావించుతూన్న బూర్జువా వర్గపు తత్వశాస్త్రజ్ఞులు బోధించిన బోధనలన్నీ నిష్ఫలితములైపోగా, రేడియం, ఎలక్ట్రానులు, మూలద్రవ్యాల పరివర్తనము, ఇత్యాది ప్రకృతిశాస్త్రపు అధునాతన ఆవిష్కరణలు మార్క్స్ యొక్క గతితార్కిక భౌతికవాదాన్ని అత్యద్భుత రీతిని ధ్రువపరచాయి.

భౌతికవాదాన్ని మరింత లోతుగా పరిశీలించి అభివృద్ధి పరచడమే కాకుండా, ప్రకృతిని గురించి భౌతికవాదానికున్న జ్ఞానాన్ని, మానవ సమాజాన్ని గురించిన జ్ఞానానికి అన్వయింపజేసి, మార్క్స్ భౌతికవాదాన్ని సమగ్రం చేశాడు. విజ్ఞాన శాస్త్రీయ చింతన సాధించిన బృహత్తర విజయమే మార్క్స్‌యొక్క చారిత్రక భౌతికవాదం. చరిత్రపైన, రాజకీయాలపైన అంతవరకూ సర్వవ్యాప్తంగా వున్న అభిప్రాయాల అవ్యక్తస్థితీ విశృంఖలతా అంతరించిపోయి, వాటి స్థానాన్ని, సామాజిక జీవితంయొక్క ఒక వ్యవస్థనుండి అంతకంటె మరింత ఉచ్చస్థాయిని కలిగిన వ్యవస్థ ఉత్పాదక శక్తుల అభివృద్ధి ఫలితంగా ఏ విధంగా క్రమాభివృద్ధిని పొందుతుందో — ఉదాహరణకు ఫ్యూడల్ వ్యవస్థనుండి పెట్టుబడిదారీ వ్యవస్థ ఏ విధంగా ఉత్పన్నమయిందో — నిరూపించేటట్టి ఆశ్చర్యాన్ని గొలిపే సర్వోపాంగ సమ్మేళనా సమ్యగ్ ధోరణి కలిగిన శాస్త్రయుక్తమైన సిద్ధాంతం ఆక్రమించుకొంది.

ఏ విధంగానైతే మానవుని ఇష్టానిష్టాలతో నిమిత్తంలేకుండానే స్వతంత్రంగా ఉనికి గలిగినట్టి ప్రకృతిని (అనగా, క్రమాభివృద్ధిని పొందుతూన్న పదార్థాన్ని), మానవునియొక్క విజ్ఞానం ప్రతిబింబించుతూందో సరిగా అదే విధంగా, సమాజంయొక్క ఆర్థిక వ్యవస్థను మానవుని సామాజికవిజ్ఞానం (అనగా, తత్వశాస్త్రం, మతం, రాజకీయాలు, ఇంకా ఇతర విషయాలపైన మానవునికున్న అభిప్రాయాలూ సిద్ధాంతాలూ వగైరాలు) ప్రతిబింబిస్తుంది. ఆర్థిక పునాదిపై నిర్మించబడిన పైకట్టడమే రాజకీయ సంస్థలు. ఉదాహరణకు, యూరప్‌లో వున్న ఆధునిక రాజ్యాంగయంత్రాలయొక్క వివిధ రూపాలు శ్రామిక వర్గంపై బూర్జువా వర్గం

యొక్క పరిపాలనను పటిష్ఠం చేసేందుకు ఉపయోగపడుతూండడం మనం ఇప్పుడు తెలుసు కుంటున్నాం.

మానవజాతికి, అందులోనూ ముఖ్యంగా శ్రామికవర్గానికి, శక్తివంతములైన జ్ఞాన సాధనాలను సమకూర్చినట్టి సంపూర్ణ పరిణతిని చెందిన తాత్విక భౌతికవాదమే మార్క్స్ ప్రవచించిన తత్వశాస్త్రం.

## II

ఆర్థిక పునాదిపైనే రాజకీయ వ్యవస్థ పైకట్టడం నిర్మింపబడుతుందనే విషయాన్ని మార్క్స్ గుర్తించిన తరువాత, ఈ ఆర్థిక వ్యవస్థను అధ్యయనం చేయడానికే ఇంచుమించు తన శ్రద్ధనంతనూ అతను వినియోగించాడు. ''పెట్టుబడి'' అనే తన ప్రధాన గ్రంథంలో ఆధునిక, అనగా పెట్టుబడిదారీ, సామాజిక ఆర్థిక వ్యవస్థను మార్క్స్ కూలంకషంగా అధ్య యనం చేశాడు.

మార్క్స్‌కు ముందరి కాలంలో, పెట్టుబడిదారీ దేశాలన్నింటిలోనూ అత్యంత అభి వృద్ధిచెందిన ఇంగ్లండులోనే సంప్రదాయసిద్ధమైన అర్థశాస్త్రం ఏర్పడింది. ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డో — వీరిద్దరూ ఆర్థిక వ్యవస్థపై తాము గావించిన పరిశోధనల ఫలితంగా శ్రమను బట్టి విలువ అనే సిద్ధాంతానికి శంఖుస్థాపన చేశారు. వీరి కృషిని మార్క్స్ ఇంకా ముందుకు సాగించాడు. ఈ సిద్ధాంతాన్ని మార్క్స్ నిష్కర్షగా రుజువుపరుస్తూ, దానిని సుసంగతంగా అభివృద్ధిపరచాడు. ప్రతి సరుకుయొక్క విలువ, దానిని ఉత్పత్తిచేయడానికి సామాజికంగా అవసరమైన శ్రమకాల పరిమితినిబట్టే నిర్ణయమవుతుందని అతను నిరూపించాడు.

వస్తువులకూ వస్తువులకూ మధ్యనుండే (ఒక సరుకుతో ఇంకొక సరుకును మారకం చేసుకోవడమనే) సంబంధాన్నే బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు గుర్తించగా, మనుష్యులకీ మను ష్యులకీ మధ్యనుండే సంబంధాన్ని బైటబెట్టాడు మార్క్స్. మార్కెట్టుద్వారా వ్యక్తిగతంగా ఒక ఉత్పత్తిదారునికీ మరొక ఉత్పత్తిదారునికీ ఏర్పడుతూన్న లంకెను సరుకుల మారకం తెలియజేస్తుంది. ఈ లంకె అంతకంతకు మరింత దగ్గిరపడుతూ, వ్యక్తిగత ఉత్పత్తిదారుని ఆర్థిక జీవితాన్నంతటినీ అవిభాజ్యమూ సమగ్రమూ చేస్తూ ప్రపంచవ్యాప్తమైనట్టి ఏకైక ఆర్థిక జీవితంతో ముడిపెట్టేస్తుందన్న సంగతిని ధనం తెలియజేస్తూంది. ఈ లంకె అంత కంతకు మరింత అభివృద్ధి పొందుతూందని, మనిషియొక్క శ్రమశక్తే ఒక సరుకుగా మారి పోయిందని, పెట్టుబడి తెలియజేస్తూంది. భూమినీ ఫ్యాక్టరీలనూ పనిముట్లనూ కలిగినటువంటి యజమానికి కూలికి ఉడిగంచేసే కార్మికుడు తన శ్రమశక్తిని అమ్ముకుంటాడు. తాను పని చేసే రోజు అంతటిలోనూ ఒక భాగాన్ని తననూ తన కుటుంబాన్నీ పోషించుకోడానికి లవసర

మైన వ్యయాన్ని (కూలిని) సంపాదించుకోడానికి వినియోగిస్తాడు; రెండవ భాగం, ఎట్టి ప్రతిఫలమూ లేకుండానే కష్టపడుతూ, పెట్టుబడిదారునియొక్క లాభానికి మూలాధారమైనట్టి, పెట్టుబడిదారీ వర్గంయొక్క భోగభాగ్యాలంతటికీ మూలాధారమైనట్టి అదనపు విలువను సృష్టించుతాడు.

మార్క్సుయొక్క ఆర్థిక సిద్ధాంతానికంతటికీ అదనపు విలువ సూత్రమే మూలస్తంభం.

కార్మికుని శ్రమచే సృష్టించబడిన పెట్టుబడి, చిన్న ఉత్పత్తిదారులను నాశనం చేయడంవల్లనూ, నిరుద్యోగుల సైన్యాన్ని సృష్టించడంవల్లనూ, కార్మికుడినే అణచివేస్తుంది. పారిశ్రామిక రంగంలో బృహత్‌స్థాయి ఉత్పత్తి వ్యవస్థయొక్క విజయం మనకళ్లకి ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది; కాగా, వ్యవసాయ రంగంలో కూడా ఈ సంఘటనే మనకు తటస్థపడుతూంది. పెట్టుబడిదారీ పద్ధతులలో జరుగుతూన్న బృహత్‌స్థాయి వ్యవసాయం యొక్క శ్రేష్ఠత అధికమవుతూంది; యంత్రాల వినియోగం హెచ్చు అవుతూంది; ధనపెట్టుబడి గుప్పెట్లో రైతాంగ ఆర్థిక వ్యవస్థ చితికిపోతూంది; అది క్షీణించిపోతూ, బడుగు ఉత్పాదక పద్ధతుల భారానికే అది క్రుంగి శిథిలమైపోతూంది. వ్యవసాయంలో, స్వల్పస్థాయి ఉత్పత్తి యొక్క క్షీణదశ వివిధ రూపాలను ధరించుతూంది; ఎన్ని రూపాలను ధరించుతూన్నప్పటికీ, అది క్షీణించిపోవడం మాత్రం నిర్వివాదం.

చిన్నస్థాయి ఉత్పత్తిని పెట్టుబడి నాశనం చేయడంవల్ల, శ్రామిక ఉత్పాదకశీలత అధికమవడానికీ, బడాపెట్టుబడిదారుల సంఘాలు గుత్తాధిపత్య స్థితిని సృష్టించుకోగలిగే అవకాశానికీ దారితీస్తుంది. రానురాను ఉత్పత్తే మరింత, మరింత సామాజికంగా మారిపోతూంది — లక్షాది కోట్లాది కార్మికులు ఒక ఆర్థిక ఆర్గనైజేషనులో ఒకరితో ఒకరు ముడిపడిపోతారు; కాని సమిష్టిశ్రమ లబ్ధిని మాత్రం ఏ పట్టెడుమంది పెట్టుబడిదారులో భుక్తం చేసుకొంటారు. ఉత్పత్తిలో అరాచకం హెచ్చుపెరిగిపోతుంది, దానితోపాటు సంక్షోభాలూ వృద్ధి అవుతాయి, మార్కెట్లకోసం ఉగ్రమైన వేట, జనరాశి ఉనికీ, అస్థిరతలూ పెరిగిపోతాయి. కార్మికులు పెట్టుబడిపైనే ఆధారపడివుండవలసిన అవస్థ నానాటికి అధికమైపోతూండగా, పెట్టుబడిదారీ విధానమే సంఘటిత శ్రమయొక్క బృహత్తరశక్తిని సృష్టించుతుంది.

సరుకుల ఉత్పత్తిపైనే ఆధారపడిన ఆర్థికవ్యవస్థయొక్క అంకురాలనుండి, సాధారణ మారకంనుండి, దాని ఉచ్చదశ అయిన బృహత్‌స్థాయి ఉత్పత్తివరకూ, పెట్టుబడిదారీ విధానం యొక్క క్రమాభివృద్ధిని మార్క్సు వివరంగా తెలియజేశాడు.

ఈ మార్క్సియ సిద్ధాంతంయొక్క సత్యాన్ని పెట్టుబడిదారీ విదానపు దేశాలు —

పాతవీ కొత్తవీ — అన్నింటి అనుభవమే కార్మికులలో ఆ యేటికాయేడు అధికసంఖ్యాకులకు స్పష్టంగా రుజువుపరుస్తూంది.

పెట్టుబడిదారీ విధానం ప్రపంచాన్నంతటినీ జయించేసింది, కాగా పెట్టుబడిపైన శ్రమ సాధించనున్న విజయానికి ఈ విజయమే నాందీప్రస్తావన.

## III

ఫ్యూడల్ విధానం కూలదోయబడిన తరువాత, దేవుని ఈ భూప్రపంచంపై ''స్వేచ్ఛాయుతమైన'' పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భవించగానే, ఈ స్వేచ్ఛ అంటే శ్రామికులను అణగదొక్కి దోపిడీచేయడానికి ఒక కొత్తపద్ధతి అని వెంటనే స్పష్టపడిపోయింది. ఈ దోపిడీకి ప్రతిబింబంగానూ, ఈ దోపిడీకి ఆక్షేపణ తెల్పుతూ రకరకాల సోషలిస్టు సిద్ధాంతాలు వెంటనే తెలయెత్త నారంభించాయి. కాని ఆదిలో ఈ సోషలిజం ఊహాజనితమైన సోషలిజం రూపాన్నే ధరించింది. పెట్టుబడిదారీ సమాజాన్ని ఈ ఊహాజనిత సోషలిజం విమర్శించింది; దానిని ఖండించి దానికి శాపనార్థాలు పెట్టింది; దాని వినాశనాన్ని గురించి కలలు గంది; ఉత్తమ సమాజం గురించి అదే పనిగా ఊహాగానంచేస్తూ తన ఊహాగానంలో తానే తన్మయమైపోయింది; దోపిడీయొక్క అవినీతిగురించి ధనికులకు నచ్చజెప్పడానికి పాటుపడింది.

కాని ఈ పరిస్థితినుండి నిజంగా బైటపడే మార్గాన్ని మాత్రం చూపలేక పోయింది ఊహాజనిత సోషలిజం. పెట్టుబడిదారీ విధానంకింద అమలులో వుండే కూలి బానిసత్వంయొక్క అంతస్సారాన్ని వివరించడానికిగానీ, పెట్టుబడిదారీ విధానంయొక్క క్రమాభివృద్ధి నియమాలను ఆవిష్కరించడానికిగానీ, నూతన సమాజాన్ని సృష్టించగలిగిన సామాజిక శక్తిని వేలు పెట్టి చూపగలిగేటట్టి సామర్థ్యంగానీ దానికి సాధ్యంకాకపోయింది.

ఇదీలాగుండగా, ఫ్యూడల్ వ్యవస్థ, భూదాస్య వ్యవస్థల పతనంతోపాటుగా, యూరప్ అంతటా, అందులో ముఖ్యంగా ఫ్రాన్సులో సంభవించిన ఝంఝానిలయ విప్లవాలు, క్రమాభివృద్ధికి వర్గపోరాటమే ప్రాతిపదిక, చోదకశక్తి అనీ, రోజుకురోజూ మరింత స్పష్టంగా బైటబెట్టజొచ్చాయి.

భూస్వామ్య వర్గంపైన రాజకీయ స్వేచ్ఛ సాధించిన విజయాలలో ఏ ఒక్క విజయమూ కూడా, ప్రాణాలకు సహితం తెగించి పోరాటాన్ని సాగించినట్టి ప్రతిఘటనను ఎదుర్కొననిదే సాధ్యమయింది కాదు. పెట్టుబడిదారీ సమాజపు వివిధవర్గాల మధ్యను జీవన్మరణ యుద్ధం సాగితేనే తప్ప, ఏ ఒక్క పెట్టుబడిదారీ దేశమూ కూడా, కాస్తోకూస్తో స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్య ప్రాతిపదికపై అభివృద్ధి చెందడం సంభవించలేదు.

ఈ విషయాన్నుండి ప్రపంచ చరిత్ర బోధించే పర్యావసానాన్ని అందరికంటె ముందుగా తెలుసుకొని, దానిని సుసంగతముగా అన్వయం చేయగల్గడంలోనే మార్క్స్ ప్రతిభ ద్యోతకమవుతూంది. వర్గపోరాట సిద్ధాంతమే ఈ పర్యవసానం.

నైతిక, మత, రాజకీయ, సాంఘిక పదజాలమూ, ప్రకటనలూ, వాగ్దానాలూ, వీటన్నిటి వెనుక ఏదో ఒక వర్గంయొక్క ప్రయోజనాలే దాగివున్నాయనే విషయాన్ని ప్రజలు తెలుసుకోగలిగేటంతవరకూ, రాజకీయాల్లో వారెల్లప్పుడూ ఇతరుల వంచనకూ, ఆత్మవంచనకూ ఇదివరకల్లా పాల్పడుతూనే వచ్చారు, ఇకముందు కూడా పాల్పడుతూనే వుంటారు. ఎట్టి పురాతన సంస్థ అయినా సరే, ఎంత క్రూరంగానూ పురుగుపట్టి పుచ్చిపోయినట్టూ కనపడినప్పటికీ, అట్టిది ప్రతిదీ కూడా, రాజ్యాధికారాన్ని చలాయిస్తూన్న ఏదో ఒక వర్గంయొక్క శక్తుల చేతనే నిలబెట్టబడుతూందనే విషయాన్ని సంస్కరణాభిలాషులూ అభివృద్ధికాముకులూ గ్రహించకుండా వున్నంతవరకూ, ఆ పురాతన వ్యవస్థను సమర్థించే వారిచేత వంచింపబడుతూనే వుంటారు. ఇక ఇట్టివర్గాల ప్రతిఘటనను పటాపంచం చేయడానికి ఒక్కటే మార్గం వుంది; ఆ మార్గం ఏదంటే, మన చుట్టుపక్కలవున్న సమాజంలోనే, పాతని తుడిచిపెట్టేసి కొత్తని సృష్టించే సామర్థ్యాన్ని కలిగిన శక్తులుగా వ్యవహరించ గల్గిన — సమాజంలో వాటికున్నస్థానాన్నిబట్టి ఆ విధంగా వ్యవహరించి తీరవలసిన — శక్తులను వెతికి వెలికి తెచ్చి, పోరాటాన్ని సలపడంకోసం వాటికి ప్రబోధాన్ని కల్గించి, వాటిని ఆర్గనైజు చేయడమే.

ఆనాటివరకూ క్రుంగి కృశించిపోయిన అన్ని పీడితవర్గాలూ మానసిక బానిసత్వంలో నుండి బైటపడేందుకు మార్క్స్ ప్రవచించిన తాత్విక భౌతికవాదం ఒక్కటే శ్రామిక వర్గానికి దారిచూపెట్టింది. పెట్టుబడిదారీ విధానపు సాధారణ వ్యవస్థలో శ్రామిక వర్గంయొక్క నిజస్థానాన్ని మార్క్స్ ఆర్థిక సిద్ధాంతం ఒక్కటే వివరించగల్గింది.

అమెరికా మొదలు జపానువరకూ, స్వీడన్ మొదలు దక్షిణ ఆఫ్రికావరకూ, ప్రపంచం సర్వత్రా శ్రామికవర్గపు స్వతంత్ర ఆర్గనైజేషన్ల సంఖ్య దినదినాభివృద్ధిని పొందుతూంది. తన వర్గపోరాటాన్ని సాగించడం ఫలితంగా శ్రామికవర్గం విజ్ఞానాభివృద్ధినీ ప్రబోధాన్నీ పొందుతూంది; బూర్జువావర్గ సామాజిక దురభిమానాలను అది వదలించుకుంటూంది, తన శ్రేణులను మరింత సన్నిహితంగా సంఘటిత పరచుకొని, తన విజయాల పరిమితులను విలువ కట్టకలిగే సామర్థ్యాన్ని అలవరచుకుంటూంది; తన శక్తులను పటిష్ఠం చేసుకొని నిరాఘాటంగా అభివృద్ధి పొందుతూంది.

మార్చి, 1913.

# కారల్ మార్క్సు సిద్ధాంతంయొక్క చారిత్రక విధి

మార్క్సుయొక్క సిద్ధాంతంలో ప్రధానవిషయం ఏమిటంటే, సోషలిస్టు సమాజ నిర్మాతగా శ్రామికవర్గంయొక్క చారిత్రక పాత్రను అది ప్రస్ఫుటంచేస్తుంది. మార్క్సు తన సిద్ధాంతాన్ని ప్రవచించిన నాటినుండి నేటివరకూ జరిగిన ప్రపంచ చరిత్ర సంఘటనల పురోగమనం ఈ సిద్ధాంతాన్ని ధ్రువపరచిందా?

మార్క్సు తన సిద్ధాంతాన్ని తొలిసారిగా 1844 లో ప్రతిపాదించాడు. 1848 లో ప్రచురింపబడిన మార్క్సు ఎంగెల్సుల "కమ్యూనిస్టు ప్రణాళిక" ఈ సిద్ధాంతానికి క్రమ విధాన సహితమైన సమ్యగ్ వివరణ నొకదానిని అప్పటికే పొందుపరచింది. అన్ని వివరణలలోనూ ఈ వివరణే నాటికీ నేటికీ ఉత్తమమైనదని అనిపించుకుంటూంది. మార్క్సు తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన తదుపరి జరిగిన ప్రపంచ చరిత్ర ప్రధానములైన మూడు దశలకింద ఏర్పడుతూంది: 1) 1848 విప్లవంనుండి పారిస్ కమ్యూన్ (1871) వరకు; 2) పారిస్ కమ్యూన్‌నుండి రష్యను విప్లవం (1905) వరకు; 3) రష్యన్ విప్లవంనుండి నేటివరకు.

ఈ మూడు దశలలో ప్రతి దశలోనూ మార్క్సుయొక్క సిద్ధాంతం ఎటువంటి విధిని ఎదుర్కొందో మనం పరిశీలించుదాం.

## I

మొదట దశ ప్రారంభంలో మార్క్సు సిద్ధాంతానికి ఏ మాత్రమూ ప్రాబల్యం లేకపోయింది. ఆనాడు సోషలిజం లెక్కకుమించి వుండిన అనేక శాఖలలోనూ, లేక ధోరణులలోనూ ఇదొకటి. చరిత్ర చలనంయొక్క భౌతిక ప్రాతిపదికను గ్రహించకపోవడం,

పెట్టుబడిదారీ సమాజంలో వున్న ప్రతి వర్గంయొక్క పాత్రనూ ఆంతర్యాన్నీ వేర్వేరుగా విడదీసి వివరించి బయల్పర్చలేకపోవడం, "ప్రజ," "ధర్మం," "హక్కు" వగైరా రకరకాల కుహనాసోషలిస్టు పదజాలంకింద చలామణీ అవుతూన్న ప్రజాస్వామ్య సంస్కరణల యొక్క బూర్జువా అంతస్సారాన్ని కప్పిపుచ్చడమూ — వీటన్నిటిలోనూ అప్పుడు నిజంగా ప్రబలంగా వున్న సోషలిజంయొక్క రూపాలకీ మన నరోదిజానికీ మొత్తంమీద దగ్గర సంబంధమే వుంది.

గొంతుక చించుకుని అరిచి ప్రగల్భాలు పలుకుతూ మార్క్సిజానికి పూర్వమున్న సోష లిజంయొక్క ఈ నానాగోత్ర రూపాలపై 1848 విప్లవం చావుదెబ్బతీసింది. సమా జంలో వున్న వివిధ వర్గాలు కార్యాచరణలో యే యే రూపాలను ధరించుతాయో ఈ విప్లవం అన్ని దేశాల్లోనూ బహిర్గతం చేసింది. 1848 జూన్ నెలలో పారిస్‌లో రిపబ్లికన్ బూర్జువా వర్గమే శ్రామికులను తుపాకులతో కాల్చివేయడంతో, శ్రామికవర్గం ఒక్కటే సోషలిస్టు స్వభావాన్ని కలిగివుందన్న విషయం తుట్టతుదకు స్పష్టంగా నిర్ధారణైంది. అభివృద్ధి నిరోధ కంయొక్క వివిధ రూపాల్లో ఏ రూపంపట్లనూ చూపిన భయంకంటె, నూరురెట్లు అధిక మైన భయాన్నే ఈ వర్గంయొక్క స్వాతంత్ర్యంపట్ల లిబరల్ బూర్జువావర్గం చూపింది. పిరికిపందలైన లిబరల్‌పక్షంవారు అభివృద్ధి నిరోధకం ఎదుట దాసోహమంటూ నేలమీదపడి సాష్టాంగప్రణామాలు ఆచరించారు. ఫ్యూడలిజంయొక్క అవశేషాలు రద్దు కాబడడంతో రైతాంగం తృప్తిపడిపోయి కార్మిక ప్రజాస్వామ్యం, బూర్జువా లిబరలిజం, ఈ రెండింటి మధ్యనూ అప్పుడప్పుడు ఊగిసలాడుతూండినా, మొత్తంమీద శాంతిభద్రతలను నెలకొల్పేవారి పక్షాన్నే చేరిపోయింది. వర్గరహితమైన సోషలిజం సిద్ధాంతాలూ, వర్గరహితమైన రాజకీయ సిద్ధాంతాలూ, ఇవన్నీ కూడా అర్థంలేని అసందర్భాలని రుజువైపోయింది.

ఈ బూర్జువా పరివర్తనలను 1871 పారిస్ కమ్యూన్ పూర్తిచేసింది; రిపబ్లిక్ (అనగా, అత్యంత నగ్నస్వరూపంలో వర్గసంబంధాలు బైటపడే రాజ్యాంగయంత్ర నిర్మాణం) దృఢపడగలిగిందీ అంటే, కేవలం శ్రామికవర్గంయొక్క పరాక్రమం ధర్మమా అంటూనే దృఢపడగల్గింది.

ఇంతకంటె చిక్కులుకలిగి ఇంతకంటె అసంపూర్ణమైన క్రమాభివృద్ధే యూరప్ లోని మిగతా అన్నిదేశాల్లోనూ కూడా నిర్దిష్టస్వరూపాన్ని కలిగిన బూర్జువా సమాజానికే దారితీసింది. అల్లకల్లోలాలతోనూ విప్లవాలతోనూ నిండిన ప్రథమ దశ (1848–1871) చరమకాలానికి మార్క్సిజానికి పూర్వమున్న సోషలిజం అంతరించిపోయింది. స్వతంత్ర శ్రామిక వర్గ పక్షాలు: ప్రథమ ఇంటర్నేషనల్ (1864–1872), జర్మన్ సోషల్-డెమోక్రా టిక్ పార్టీ ఆవిర్భవించాయి.

## II

మొదటి దశకంటె రెండవదశ (1872–1904) ''శాంతియుత'' స్వభావం కలిగివుండడం, విప్లవాలు లేకుండా వుండడం కారణంగా, మొదటి దశకూ రెండవ దశకూ విభేదం ఏర్పడింది. పశ్చిమ దేశాలు బూర్జువా విప్లవాలను పూర్తిచేసేశాయి. తూర్పు దేశాలు ఇంకా ఆ దశను అందుకోలేదు.

ముందురానున్న పరివర్తన శకావతరణకు సిద్ధమయే నిమిత్తం, పశ్చిమ దేశాలు ''శాంతి యుత''మైన అవస్థలో అడుగుపెట్టాయి. మౌలికంగా శ్రామికవర్గానికి చెందినట్టి సోషలిస్టు పార్టీలు సర్వత్రా స్థాపితమై, బూర్జువా పార్లమెంటరీ విధానాన్ని ఉపయోగించుకోవ డమూ, తమ సొంత దినపత్రికలనూ ప్రబోధక సంస్థలనూ సొంత కార్మిక సంఘాలనూ సొంత సహకార సంఘాలనూ సృష్టించుకోవడమూ నేర్చుకొన్నాయి. మార్క్సిస్టు సిద్ధాంతం సంపూర్ణ విజయాన్ని సాధించి వ్యాపింపజొచ్చింది. శ్రామికవర్గశక్తుల వరణ, సమీకరణ విధానమూ, రానున్న యుద్ధాలకోసం శ్రామికవర్గాన్ని సన్నద్ధం చేసే విధానమూ, మెల్లగానూ అయినప్పటికీ నిలకడగానూ అభివృద్ధి పొందుతూ వచ్చాయి.

చరిత్రయొక్క గతితర్కం ఎలాంటిదంటే, సిద్ధాంతరంగంలో మార్క్సిజం విజయాన్ని సాధించే సరికి, దాని శత్రువులకు కూడా మార్క్సిస్టు వేషం వేసుకొనక విధిలేక పోయింది. ఎముకలతో సహా పుచ్చి పురుగుపట్టిపోయిన లిబరలిజం, సోషలిస్టు అవకాశవాద రూపంతో నూతన యవ్వనం పొంద ప్రయత్నించింది. మహాయుద్ధాలకోసం శక్తులను సంసిద్ధం చేసుకోవడానికి అవసరమైన వ్యవధిని చూసి, ఈ యుద్ధాలను విస్మరించే తత్త్వమే ఇది అని దీనిని వ్యాఖ్యానించారు అవకాశవాదులు. కూలిబానిసంపై పోరాటాన్ని సాగించే లక్ష్యంతో బానిసపరిస్థితులు మెరుగుపడడం చూసి, బానిసలు తమ స్వేచ్ఛా హక్కును పప్పేటుడు కూడుకోసం తెగనమ్ముకోవడమేనని దీనిని వారు వ్యాఖ్యానించారు. ''సాంఘిక శాంతి'' (అనగా, బానిసయజమానులతో సంధి చేసుకోవడం) అవసరమనీ, వర్గపోరాటాన్ని పరిత్యజించాలనీ, ఇంకా ఇటువంటివే ఇతర విషయాలనూ వీరు పిరికిపందలై బోధించారు. పార్లమెంటు సోషలిస్టు సభ్యుల్లో చాలామందీ, కార్మికోద్యమ సంస్థల్లో ఉద్యోగస్థులు అనేకులూ, ''సానుభూతి పరులైన'' మేధావులలో బహుళసంఖ్యాకులూ, వీరి అనుచరవర్గంలో చేరారు.

## III

కాని ''సాంఘిక శాంతి'' అవతరించిందనీ, ''ప్రజాస్వామ్య వ్యవస్థ''లో అల్లకల్లోలాలు అనవసరమనీ, తమ్ముతామే అవకాశవాదులు అభినందించుకోవడం మొదలుపెట్టారో లేసే లేదో, ఇంతలోనే బ్రహ్మాండమైన ప్రపంచవ్యాప్త ఝంఝూనిలయ కేంద్రం ఒకటి ఆసియాఖం

డంలో ఆరంభమైంది. రష్యన్ విప్లవం వెనువెంటనే టర్కీ, పర్షియా, చైనాదేశాలలో విప్లవాలు సంభవించాయి. యూరప్‌లోనే ఈ ఝంఝానిలయ సహితమైన యుగంలోనే, వీటి "ప్రతిఫలచర్యలు సంభవించుతూన్న" యుగంలోనే మనమిప్పుడు జీవిస్తున్నాం. నేడు చైనా మహారిపబ్లిక్కుపట్ల "నాగరికత చెందిన" దుమ్ములగొండ్లు పటపట కోరలు కొరుకుతున్నాయి. చైనా మహా రిపబ్లిక్కుయొక్క భవితవ్యం ఎలా వున్నప్పటికీ, ఆసియాలో పాతకాలపు భూదాస్యవ్యవస్థను పునరుద్ధరించడముగానీ ఆసియా, ఆసియా సరిహద్దుప్రాంతపు దేశాల ప్రజారాసులు సాధించుకొన్న వీరోచిత ప్రజాస్వామ్యాన్ని తుడిచిపెట్టేయడముగానీ ఈ భూప్రపంచంమీద వున్న ఏ శక్తికీ సాధ్యంకాదు.

యూరప్‌లోని పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా నిష్కర్షయైన పోరాటం తడవ తడవకూ వెనక్కి నెట్టబడుతూండడం చూసి, ప్రజాపోరాట సన్నాహాభివృద్ధి పరిస్థితులను ఏమాత్రము శ్రద్ధతోనూ గమనించని కొందరు వ్యక్తులు, నిస్పృహకూ అరాచకవాదానికీ దిగజారిపోయారు. ఈ అరాచకవాద నిస్పృహ ఎంత దూరదృష్టిలేనిదో ఎంత అధైర్యమైనదో ఇప్పుడు మనం అర్థంచేసుకోగలం.

యూరప్‌ఖండం ఏ ఆశయాలకోసం పోరాటాన్ని సాగించుతూందో సరిగ్గా ఆ ఆశయాలకోసమే సాగించే పోరాటంలోనికి ఎనభైకోట్ల జనసంఖ్యను కలిగిన ఆసియాఖండం కూడా దిగిందన్న విషయం మనలో ధైర్యాన్ని స్ఫురింపజేయాలేగాని నిస్పృహకు కారణం కాకూడదు.

లిబరలిజంయొక్క వెనకటి పిరికితనాన్నీ నీచగుణాన్నీ, ప్రజాస్వామ్య రాసులు స్వాతంత్ర్యంపట్ల వెనక వ్యక్తపరచిన అత్యధిక ప్రాముఖ్యతనూ, శ్రామికవర్గానికీ అన్నిరకాల బూర్జువావర్గాలకూ మధ్యనున్న నిశితమైన హద్దులనూ ఆసియాలోని విప్లవాలు బట్టబయలుచేశాయి. యూరప్, ఆసియాఖండాల రెండింటి అనుభవాలనూ చూచిన తరువాత ఇక ఇప్పుడెవరైనా వర్గరహితమైన రాజకీయాలను గురించి వర్గరహితమైన సోషలిజం గురించీ మాట్లాడారంటే మాత్రం, వారిని ఒక బోనులోపెట్టి ఆస్ట్రేలియా దేశపు కాంగరూతోపాటుగా కేవలం నలుగురిముందూ ప్రదర్శింపబడడానికే వారు అర్హులవుతారు.

ఆసియా తరువాత, ఆసియా పద్ధతిలో కాకపోయినా, యూరప్ కూడా కదలడం ప్రారంభించింది. 1872 నుండి 1904 వరకూ వున్న "శాంతియుత" కాలావధి సంపూర్ణంగా, మరి ఎన్నిటికీ కూడా తిరుగులేకుండా, అంతరించిపోయింది. పెరిగిపోతూన్న జీవన భృతి వ్యయమూ, ట్రస్టుల దోపిడీ ఆర్థిక పోరాటాన్ని ఇదివరకెన్నడూ కనివిని ఎరగనంత విపరీతంగా ఉధృతం చేస్తున్నాయంటే, లిబరలిజంయొక్క ప్రభావానికి లొంగిపోయి చెడిపోయిన బ్రిటిష్ కార్మికులు సహితమూ నిద్రలోంచి మేల్కొంటున్నారు. "శత మొండి

ఘటాలు," అయిన బూర్జువావర్గపు యుంకర్ల అధికారాన్ని చలాయిస్తూన్న జర్మనీలో సహితమూ రాజకీయ సంక్షోభం ఒకటి మనకళ్ళ ఎదుటే తయారవుతూంది. తీవ్రంగా సాగుతూన్న ఆయుధీకరణ, సామ్రాజ్యతత్వ రాజనీతి, ఆధునిక యూరప్‌ను మందుగుండ పీపాను తప్ప మరిదేనినీ పోలని "సాంఘిక శాంతి" స్థితికిందకి మార్చేస్తున్నాయి. ఇదే సమయంలో అన్ని బూర్జువాపక్షాల పతనమూ, శ్రామికవర్గంయొక్క అనుభవజ్ఞాన పరిణతీ నిలకడగా వృద్ధి పొందుతున్నాయి.

మార్క్సిజం ప్రాదుర్భావానంతరం ప్రపంచ చరిత్రయొక్క మూడు మహాదశలూ మార్క్సిజానికి నూతన నిదర్శనాలనూ నూతన విజయాలనూ సమకూర్చుతున్నాయి. అయినప్పటికీ, శ్రామికవర్గంయొక్క సిద్ధాంతంగా నేడు అవతరించబోతూన్న ప్రపంచ చరిత్ర దశలో ఇంతకంటె మహత్తరమైన విజయమే మార్క్సిజానికి లభించబోతూంది.

మార్చి, 1913.

# కమ్యూనిజంలో "వామపక్షతత్వపు" బాలారిష్టం

ఖండిక

## II. బోల్‌షెవిక్‌ల విజయానికి ఒక మౌలికమైన షరతు

మన పార్టీలో కఠినాతి కఠినమైనట్టి యథార్థమైన ఉక్కు క్రమశిక్షణే గనుక నెల కొల్పబడ కుండినట్టయితే, కార్మికవర్గపు యావత్తు రాశియొక్క, వెనకబడిన స్తరాలకు నాయకత్వం వహించ గల్గినట్టి, లేదా తమతో పాటు ముందుకు తీసుకువెళ్ళ గల్గినట్టి, అనగా చింతనా సామర్థ్యం గల్గి నిజాయతీపరులై నిస్స్వార్థులై పలుకుబడి గల్గినట్టి, మూలద్రవ్యాల యొక్క సంపూర్ణమై నిర్నిబంధమైన వత్తాసే గనుక మన పార్టీకి లభించకుండి నట్టయితే, బోల్‌షెవిక్‌లు రెండున్నరేళ్ల పాటు కాదుగదా, రెండున్నర నెలల పాటైనా అధికారంలో నిలదొక్కుకొనలేకుండెడివారని ఇప్పుడు ఇంచుమించు అందరూ గ్రహించుతున్నారన్న సంగతి నిశ్చయమే.

తనకంటె ఎన్నోరెట్లు అధికశక్తి కల్గిన శత్రువైనట్టి, ఏదైతే దాని కూలదోతవలనే (ఒకే ఒక దేశంలోనైనా సరే) దాని ప్రతిఘటన పదింతలు ఇనుమడించుతుందో, అంతర్జాతీయ పెట్టుబడియొక్క బలంలోనూ దాని అంతర్జాతీయ సంబంధాల బలస్థైర్యాలలోనే కాకుండా అలవాటుయొక్క బలంలోనూ, సన్నకారు ఉత్పత్తియొక్క బలంలోనూ దాని శక్తి ఇమిడి వుందో అట్టి బూర్జువావర్గానికి ప్రతికూలంగా నూతనవర్గం మొండి పట్టుదలతో సాగించుతూన్నట్టి దయదాక్షిణ్య రహితమైన సంగ్రామమే శ్రామికవర్గ నియంతృత్వం. ఎందువల్లనంటే, దురదృష్టవశాత్తూ ప్రపంచంలో సన్నకారు ఉత్పత్తి ఇంకా ఎంతగానో విస్తృత వ్యాప్తి కలిగి వుండడమే కాకుండా, సన్నకారు ఉత్పత్తి నిర్విరామంగానూ, దినదినమూ గడియ గడియకూ, అయత్నకృతంగానూ రాశిస్థాయిలోనూ పెట్టుబడిదారీ విధానాన్నీ బూర్జువా వర్గాన్నీ ఉద్భవింపజేస్తుంది. ఈ కారణాలన్నిటి వల్లనూ శ్రామికవర్గ నియంతృత్వం ఆవశ్యకం;

అంతేకాకుండా సుదీర్ఘమైనట్టి శత మొండిగా సాగించేటట్టి సర్వస్వము ఒడ్డినట్టి జీవన్మరణ సంగ్రామం, ఏకాగ్రతనూ క్రమశిక్షణనూ దృఢచిత్తాన్నీ అజేయమైన ధైర్యాన్నీ సంకల్ప సమైక్యతనూ కోరేటట్టి సంగ్రామం లేనిదే బూర్జువా వర్గంపై విజయం అసాధ్యం.

బూర్జువా వర్గంపై విజయ సాధనకు నిర్నిబంధమైన అధికార కేంద్రీకరణ, కతి నాతి కఠినమ్మైన శ్రామికవర్గ క్రమశిక్షణ మౌలికమైన షరతులలో ఒకటని, ఆలోచనా సామర్థ్యం లేనివారికి, లేదా ఇంతవరకూ ఈ సమస్యపై తలపోయ నవసరంకల్గని వారికి సహితమూ రష్యాలోని విజయవంతమైన శ్రామికవర్గ నియంతృత్వం స్పష్టంగా నిరూపించిందని నేను మళ్లీమళ్లీ చెబుతున్నాను.

దీనిని గూర్చి తరుచుగానే చర్చ జరుగుతూంది. అయినప్పటికీ దీని అంతరార్థ మేమిటో, ఏయే స్థితిగతులలో ఇది సాధ్యమో, దీనిని గురించి తగినంతగా యోచన జరగడంలేదు. సోవియట్ ప్రభుత్వాన్నీ బోల్షెవిక్‌లనూ అభినందించుతూ పంపే శుభాకాంక్షలతో, విప్లవాత్మక శ్రామికవర్గానికి ఆవశ్యకమైన క్రమశిక్షణను ఏ కారణాలవల్ల బోల్షెవిక్‌లు పెంపొందించగల్గారో ఆ కారణాల ప్రగాఢ విశ్లేషణ కూడా మరింత తరుచుగా జోడించబడినట్టయితే ఇంతకంటే ఉత్తమం కాదా?

రాజకీయ చింతనలో 1903 నుండీ బోల్షెవిజం ఒక ధోరణిగానూ ఒక రాజకీయ పార్టీగానూ మనుతూనే వుంది. శ్రామికవర్గ విజయానికి ఆవశ్యకమైన ఉక్కు క్రమశిక్షణను అత్యంత విషమ పరిస్థితులలో సహితమూ బోల్షెవిజం ఎందుకు నిర్మించగలిగి నిలబెట్టగలిగిందో దాని సంపూర్ణ అస్తిత్వకాలావధి చరిత్ర మాత్రమే సంతృప్తికరంగా వివరించగల్గుతుంది.

ఇక ప్రప్రథమంగా ఈ ప్రశ్న ఉదయించుతుంది: శ్రామికవర్గ విప్లవాత్మక పార్టీ క్రమశిక్షణ ఏ విధంగా నిలబెట్టబడుతూంది? అది ఏ విధంగా పరిక్షించబడుతూంది? అది ఏ విధంగా పటిష్ఠం చేయబడుతూంది? మొదటది, శ్రామికవర్గ అగ్రగామిదళంయొక్క చైతన్యం వల్లనూ, విప్లవం పట్ల దానికిగల భక్తి వల్లనూ, దాని వజ్రసంకల్పం, స్వార్థత్యాగం, శౌర్యముల వల్లనూ. రెండవది, కష్టజీవుల విస్తృత ప్రజారాశితో — ప్రప్రధానంగా శ్రామికవర్గంతోనే కాకుండా శ్రామికవర్గేతర కష్టజీవి ప్రజారాసులతో కూడా — సంబంధమేర్పరచుకోవడానికీ, వాటితో సన్నిహితంగా వుండడానికీ, కావాలంటే కొంత నిర్దిష్టమైన మేరవరకూ వాటితో విలీనమైపోవడానికీ కూడా, గల సామర్థ్యం వల్లనూ. మూడవది, ఈ అగ్రగామిదళం నిర్వహించే రాజకీయ నాయకత్వంయొక్క యథార్థత వల్లనూ, దాని రాజకీయ వ్యూహంయొక్క, ఎత్తుగడలయొక్క యథార్థత వల్లనూ — అయితే ఇవి యథార్థంగా వున్నాయని విస్తృత ప్రజారాసులకు తమ సొంత అనుభవం వల్లనే నమ్మకం కలగాలి. ఈ షరతులు

లేనిదే, బూర్జువా వర్గాన్ని కూలదోసి యావత్తు సమాజాన్నీ పరివర్తన పొందించే జీవితా శయం ఏర్పరచుకున్నట్టి పురోగామివర్గ పార్టీగా వుండుటకు నిజమైన సామర్థ్యం కలిగిన విప్లవాత్మక పార్టీలో క్రమశిక్షణ సాధించడం వీలుపడదు. ఈ షరతులు లేనిదే క్రమశిక్షణ నెలకొల్పడానికి కావించే అన్ని యత్నాలూ ఒక బొమ్మలాటగా, చివరకు పదజాల వ్యాపారంగా, తైతక్కలుగా తప్పకుండా దిగనాసిల్లుతాయి. అయితే మాత్రం ఈ షరతులన్నీ అమాంతంగా ఒక్కసారే ఏర్పడవు. సుదీర్ఘ యత్నంవల్లనూ కష్టార్జితమైన అనుభవం వల్లనూ అవి సృష్ట మవుతాయి. యథార్థమైన విప్లవాత్మక సిద్ధాంతం వల్ల ఈ సృష్టి సులభ మవుతుంది; అయితే దాని వంతు ఈ సిద్ధాంతం పిడిసూత్రం మాత్రం కాకుండా, నిజంగా ప్రజారాశీయమూ, నిజంగా విప్లవాత్మకమూ అయిన ఉద్యమంయొక్క ఆచరణతో సాన్నిహిత్యం కలిగి వుండడం లోనే అంతిమ రూపం ధరించుతుంది.

1917–1920 సంవత్సరాలలో అదివరకెన్నడు కనివిని ఎరుగని కష్ట పరిస్థితులలో, కఠినాతి కఠినమైన కేంద్రీకరణనూ ఉక్కు క్రమశిక్షణనూ బోల్షెవిజం నిలబెట్టుకో గలి గిందంటే, ఇందుకు కేవలం రష్యా యొక్క చారిత్రాత్మక ప్రత్యేకతలే కారణం.

ఇటు 1903 లో మార్క్సిస్ట్ సిద్ధాంతం యొక్క దృఢతరమైన పునాదిపై బోల్షె విజం ఉద్భవించింది. ఇక ఈ విప్లవాత్మక సిద్ధాంతంయొక్క — కేవలం దీనియొక్క — యథా ర్థత యావత్తు పంథొమ్మిదవ శతాబ్ది ప్రపంచానుభవం వల్లనే కాకుండా, మరీ ప్రత్యేకంగా రష్యాలోని విప్లవాత్మక చింతనయొక్క భ్రమణములూ డోలాయమానాలూ పొరపాట్లూ ఆశా భంగాల వల్లనూ రుజువైంది. ఇంచుమించు అర్ధశతాబ్ది కాలంలో — రమారమి ఐదవ దశాబ్ది నుండి పదవ దశాబ్ది వరకూ — రష్యాలోని పురోగమన శీలమైన చింతన, అనన్య సామాన్యమూ కిరాతకమూ అభివృద్ధినిరోధకమూ అయినట్టి జారిస్టు విధానంచే పీడించ బడినదై, యథార్థమైన విప్లవాత్మక సిద్ధాంతం కోసం ఆత్రంతో వెతుకుతూ, ఈ క్షేత్రంలో యూరప్ అమెరికాలనుండి వెలువడిన ప్రతి ఒక్క "తుది మాట"నూ ఆశ్చర్యాన్ని పురి కొల్పే ఉత్సాహంతోనూ జాగ్రతతోనూ అనుసరించుతూండేది. యథార్థమైన బాధలు అనుభవించడం ద్వారానూ, చరిత్ర ఎరుగనట్టి అర్ధశతాబ్దిపాటు సాగినట్టి హింసా పరిత్యా గాలు, కనివినియెరుగని విప్లవాత్మక శౌర్యం, నమ్మశక్యంకాని శక్తి, నిస్వార్థమైన అన్వేషణలు, అధ్యయనం, ఆచరణకోసమై యత్నం, ఆశాభంగములు, యూరప్ దేశాల అనుభవంతో సంప్రతింపులూ తారతమ్య పరిశీలనలూ ద్వారానూ ఏకైక యథార్థవిప్లవాత్మక సిద్ధాంత మైన మార్క్సిజాన్ని రష్యా సాధించుకుంది. జారిస్టు పరిపాలనా విధానం కారణంగా దాపు రించిన నిర్బంధపు దేశాంతరపు వలస పుణ్యమా అని, పంథొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రపంచంలో మరే ఇతర దేశానికీ లేనంత అంతర్జాతీయ సంబంధ భాగ్యమూ, సర్వప్రపంచ

విప్లవోద్యమంయొక్క వివిధ రూపాలనూ సిద్ధాంతాలనూ గురించి దివ్యమైన సమాచార సంపత్తి రష్యాకు లభించింది.

అటు, ఇట్టి శిలాసదృశమైన సైద్ధాంతిక ప్రాతిపదికపై ఉద్భవించి, అనుభవ భాగ్యంలో ప్రపంచంలో ఇతరత్ర సాటిలేనిట్టి పదిహేను సంవత్సరాల (1903–1917) ఆచరణ శీలమైన చరిత్రను బోల్షెవిజం అనుభవించింది. ఎందువల్లనంటే, ఈ పదిహేను సంవత్స రాలలోనూ ఈ విప్లవాత్మక అనుభవానికి, ఉద్యమంయొక్క—చట్టబద్ధమైనట్టీ చట్టవిరుద్ధ మైనట్టీ, శాంతియుతమైనట్టీ ఝంఝూవాతమైనట్టీ, అజ్ఞాతమైనట్టీ బహిరంగమై నట్టీ, సర్కిల్స్‌కు పరిమితమైనట్టీ రాశివ్యాప్తి కలిగినట్టీ, పార్లమెంటు విధాన సమ్మతమైనట్టీ టెరరిస్టు విధానసహితమైనట్టీ వేర్వేరు రూపాల సత్వరమూ, వైవిధ్యమూ క్రమపరంపర పరలకూ ఏ మాత్రము చేరువగా రాగల్గేది మరి ఏదీ మరి ఏ ఇతర దేశంలోనూ సంభవించి వుండలేదు. ఆధునిక సమాజంలోని అన్ని వర్గాల పోరాటంలోనూ ఇంతటి రూప, ఛాయ, విధానసంపత్తి మరే ఇతర దేశంలోనూ ఇంత స్వల్పకాలంలో సాంద్రీకృత మవలేదు; కాగా ఇంతే కాకుండా దేశం వెనకబడి వుండడం కారణంగానూ, జారిస్టువిధానపు దుర్భర కాఠిన్యత కార ణంగానూ ఈ పోరాటం ప్రత్యేకమైన త్వరితగతిని పరిపక్వం చెంది, అమెరికా యూరప్ ఖండాల రాజకీయ అనుభవానికి అనుగుణమైన ''తుది మాట''ను అత్యంత ఆత్రంతోనూ విజయవంతంగానూ ఒంటపట్టించుకుంది.

ఏప్రిల్ – మే 1920.

# "ప్రజా మిత్రుల" నిజస్వరూపం — సోషల్-డెమోక్రాట్లతో వారు పోరాడే విధం

## (మార్క్సిస్టులకు ప్రతికూలంగా "రూస్కొయె బొగాత్‌స్త్వో"[39] వ్యాసాలకు ప్రత్యుత్తరం)

ఖండిక

అసలు మొత్తంమీద మార్క్సిజాన్ని అవలంబించిన రష్యన్ కమ్యూనిస్టులే, మిగతా వారందరి కంటే ముఖ్యంగా, తమపేరు సోషల్-డెమోక్రాట్లు అని చెప్పుకోవాలి, తమ క్రియాకలాపాలలో డెమోక్రసీయొక్క బ్రహ్మాండమైన ప్రాముఖ్యతను వారు ఎన్నటికీ మరచిపోకూడదు కూడా.*

రష్యాలో మధ్యయుగపు, అర్ధ ఫ్యూడల్ సంస్థల శిథిలావశేషాలు (పశ్చిమ యూరప్‌తో సరిపోల్చి చూస్తే) ఇంకా ఎంతటి అపారమైన బలం కలిగి, అన్ని శ్రేణులలోనీ అన్ని వర్గాల లోనీ రాజకీయ చింతనాభివృద్ధిని అరికట్టేస్తూ సాధారణంగా శ్రామికవర్గపు మూపుల మీదనూ, ప్రజల మూపుల మీదనూ ఎంతటి పీడాకరమైన కాడిమానుగా తయారయాయంటే, అన్ని ఫ్యూడల్ సంస్థలకూ, నిరంకుశత్వానికీ, సామాజిక శ్రేణీ వ్యవస్థకూ, బ్యూరోక్రసీకీ** వ్యతిరేకంగా సాగించే పోరాటం కార్మికులకు ఎంతటి బ్రహ్మాండమైన ప్రాముఖ్యతను కల్గి వున్నదీ అదేపనిగా ఒత్తి చెబుతూనే వుండాలి. ఈ సంస్థలు ఎంతటి ఘోరమైన అభివృద్ధి నిరోధక శక్తో, పెట్టుబడి శ్రమను పెట్టే హింసను ఇవి ఎంతగా తీవ్రతరం చేస్తున్నాయో, శ్రమజీవులపై ఇవి ఎంతటి అవమానకరమైన ఒత్తిడిని తీసుకొస్తున్నాయో, శ్రమను దోపిడీ చేయడంలో పెట్టుబడియొక్క ఆధునిక పారిశ్రామిక రూపాలకు ఏవిధంగానూ తీసిపోనట్టి,

---

* ఇది చాలా ముఖ్యమైన విషయం. మన విప్లవకారులకు "ఇద్దరు శత్రువులున్నారు: ఇటు ఇంకా పూర్తిగా నిర్మూలించబడని పాత దురభిమానాలు, అటు కొత్త కార్యక్రమాన్ని సంకుచిత భావంతో అర్థం చేసుకోవడం," అని ప్లెహానొవ్ సరిగ్గానే అన్నాడు. చూ. అను బంధం III (ఈ సంపుటములోని 97 వ పుట. — సం.)

** ఉద్యోగస్థుల పరిపాలన — అనువాదకుడు.

అదే సమయంలో పోరాటానికి తీవ్ర ప్రతిబంధకాలను కల్గించడం ద్వారా ఈ దోపిడీని అధికం చేస్తూన్నట్టీ దాని మధ్యయుగపు రూపాలలోనే దానిని ఇవి ఎలా బంధించివేస్తున్నాయో అత్యంత వివరంగా కార్మికులకు విశదపర్చవలసి వుంది. అభివృద్ధి నిరోధకానికి మూలస్తంభాలైన* వీటిని కూలదోయక పోయినట్టయితే, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా విజయవంతమైన పోరాటం సాగించడానికి తమకు కేవలం అసాధ్య మవుతుందన్న విషయం కార్మికులు తెలుసుకుని తీరాలి; ఎందుచేతనంటే ఇవి వున్నంత కాలమూ, ఎవరి ఆసరా అయితే కార్మికవర్గ విజయానికి అత్యంతావసరమైన షరతుగా ఏర్పడుతూందో అట్టి రష్యన్ గ్రామీణ శ్రామికవర్గం అణగదొక్కబడినట్టీ, నిస్త్రాణచెందినట్టి స్థితినుండి బైటపడలేక, కేవలం మొండి నిరాశతో వుండడం తప్పితే తెలివితేటలతోకూడినట్టీ, పట్టువిడవనట్టీ ప్రతిఘటనూ పోరాటాన్నీ సాగించడానికి వారికి ఎన్నటికీ సామర్థ్యం వుండదు. కనుకనే రాడికల్ డెమోక్రసీ సరసను నిల్చి నిరంకుశత్వానికీ అభివృద్ధి నిరోధకములగు సామాజిక శ్రేణులకూ సంస్థలకూ వ్యతిరేకంగా పోరాడ

---

* మన విప్లవకారులు సాపేక్షంగా తక్కువ శ్రద్ధ వహించినట్టీ, రష్యన్ రాజ్యాంగ యంత్రాన్ని de facto [నిజంగా — అనువాదకుడు] పరిపాలించుతూన్నట్టీ ప్రత్యేకంగా అద్భుతావహమైనదిగా కనబడేటట్టిది మన దేశీయ బ్యూరోక్రసీ. ఇది ప్రధానంగా కులీన్యేతర శ్రేణులకు చెందినవారినుండే ఏర్పడడంచేత, దాని ఉద్భవమూ, దాని క్రియాకలాపాల ఉద్దేశ స్వభావాలూ, రెంటిలోనూ కూడా ఇది ప్రగాఢంగా బూర్జువాగానే వుంటూంది. కాని నిరంకుశత్వమూ కులీనవర్గ భూస్వాములకున్న అపారమైన రాజకీయ విశేషాధికారాలూ దీనికి మరింత హానికరములైన గుణాలను మప్పాయి. భూస్వామియొక్క, బూర్జువాయొక్క ప్రయోజనాలను సమన్వయం చేయడమే తన పరమావధి అని ఇది భావించడం చేత, ఏ ఎండకా గొడుగు పట్టేదిగా ఇది తయారయాయింది. యుదూష్క[40] లాగున ఇది కార్మికులనూ కర్షకులనూ మభ్యపరచడానికై తన ఫ్యూడల్ సానుభూతినీ సంబంధాలనూ వినియోగించి, "ఆర్థికంగా బలహీనులైన వారిని పరిరక్షించడమూ," అట్టివారిని కులాక్, షాహుకారుల బారినుండి కాపాడుతూ వారిపై "సంరక్షకత్వం" వహించే నెపంతో శ్రమజీవులను "నీచమైన అలగాజనపు" స్థితికి దిగజార్చి వేస్తూన్న పద్ధతులను అమలు పరచి, ధన మాన ప్రాణాలతో సహా వారిని ఫ్యూడల్ భూస్వాముల వశం చేసివేసి, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా వారిని మరింతగా నిరాయుధులను చేసివేస్తూంది. పశ్చిమ యూరప్‌లోని మేటి అభివృద్ధి నిరోధకుల అనుభవాన్ని ఆకళింపు చేసుకుని, తమ అరక్చేయెవ్[41] కుతంత్రాల నగ్నాన్ని ప్రజాప్రేమ పదజాలమనే కౌపీనంతో నేర్పుగా మరుగు పరచుతూన్నట్టి అత్యంత ప్రమాదకరమైన ఆషాఢభూతి ఈ బ్యూరోక్రసీ.

డం కార్మికవర్గపు ప్రత్యక్ష విధి — ఈ సంస్థలన్నిటితోనూ తలపడడం బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా సాగించ వలసిన పోరాటాన్ని సులభసాధ్యం కావించేందుకై కేవలం ఒక సాధనంగా మాత్రమే అవసరమనీ, కార్మికప్రజల ప్రధాన శత్రువైనట్టీ, స్వాభావికంగా స్వచ్ఛమైన ప్రజాస్వామ్య సంస్థ అయినట్టీ, ఇక్కడ మన రష్యాలో తన ప్రజాస్వామిక విధానానికి తిలోదకాలిచ్చేందుకే, కార్మికులను అణచివేసి, కార్మికవర్గ ఉద్యమం తలెత్తకుండా ఇంకనూ మరింతగా అరికట్టి వేయడానికై అభివృద్ధి నిరోధకులతో మిత్రత్వాన్ని నెరపుకుందుకే ప్రత్యేకంగా మొగ్గుతూన్నట్టీ పెట్టుబడిపై విజయ సాధనకు మార్గం సుగమం చేయడానికి మాత్రమే సాధారణ ప్రజాస్వామిక కోర్కెల సంపాదన కార్మికునికి అవసరమని కూడా, ఒక్క క్షణమాత్రమైనా విరామం లేకుండా సోషల్-డెమోక్రాట్లు కార్మికులకు నొక్కిచెబుతూ, దీనితోపాటు ఈ విధి గురించి కూడా వారు ఉద్ఘాటించుతూండాలి.

నిరంకుశత్వం పట్లనూ, రాజకీయస్వేచ్ఛ పట్లనూ, రాజకీయ స్వేచ్ఛ సాధించడానికై విప్లవకారుల గ్రూపులన్నిటి "ఐక్యత", "మిత్రత్వమూ" లక్ష్యంగా కలిగినట్టి, ఇటీవల ప్రత్యేకంగా బలంగా వృద్ధిపొందుతూన్నట్టి ధోరణి పట్ల[42] కూడానూ సోషల్-డెమోక్రాట్ల వైఖరిని నిర్వచించడానికి పైన చెప్పినది చాలు ననుకుంటాను.

ఈ ధోరణి కొంతవరకూ స్వకపోలకల్పితంగానూ స్వాభావికంగానూ వుంది.

ఏ ఒక నిర్దిష్టమైన గ్రూపు నుండిగాని, లేదా ఏ ఒక్క విషయంలోనైనా సరే ఒకదానితో ఒకటి పోలినట్టి నిర్దిష్టమైన కార్యక్రమాలను కల్గిన నిర్దిష్టములైన గ్రూపుల నుండిగాని "మిత్రత్వానికి" ప్రతిపాదనలు రాకపోవడం స్వకపోలకల్పితంగానే వుంది. ఈ విధంగా వచ్చివుంటే, మిత్రత్వం అనే ప్రశ్న ప్రతి ఒక్క సందర్భంలోనూ వేర్వేరుగా వుండి, ఒకదానితో ఒకటి ఐక్యమవుతూన్న గ్రూపుల ప్రతినిధులచే నిర్ణయించబడ వలసిన నిర్దిష్ట ప్రశ్న అవుతుంది. అలాంటప్పుడు ప్రత్యేకమైన "ఐక్యతా" ధోరణి అంటూ వుండడానికి వీలుండదు. అయితే ఇటువంటి ధోరణి నిజంగానే వుంది; అది కేవలమూ పాతతో తెగతెంపులు చేసుకుని కొత్తది దేనికీ కట్టుబడనివారి దగ్గరనుండే బయలుదేరుతూంది: నిరంకుశత్వానితో పోరాడినవారు ఇంతవరకు ప్రాతిపదికగా అంగీకరించినట్టి సిద్ధాంతం ప్రత్యక్షంగా శిథిలమైపోతూ, పోరాటానికి అత్యవసరమైనట్టి సంసక్తికీ ఆర్గనైజేషనుకూ వలయు షరతులను నాశనం చేసివేస్తూంది. కాగా ఇలాంటప్పుడు అన్ని ఇతర సోషలిస్టు, సోషలిస్టేతర సమస్యలనూ దాటవేస్తూ, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఒక నిరసనగానూ రాజకీయ స్వేచ్ఛకై ఒక డిమాండుగానూ ఈ సిద్ధాంతాన్ని కుంచించి వేయడమే అటువంటి సిద్ధాంతాన్ని సృష్టించడానికి అన్నిటికంటే సులువైన మార్గమని మహాశయులు ఈ పెద్దమనుషులు "ఐక్యతావాదులూ" "మిత్రత్వవాదులూ" ఆలోచించుతూన్నట్టు అగపడుతూంది. ఐక్యత కోసమని

తంటాలుపడే మొట్టమొదటి యత్నంలోనే ఈ సత్యకాలపు హేత్వాభాసానికి తప్పని సరిగా నిలువ నీడలేకుండా పోతుందని వేరే చెప్పనక్కరలేదు.

అయితే స్వాభావిక మేమిటంటే, ఈ ''ఐక్యతా'' ధోరణి, పోరాటశీలమైన విప్లవాత్మక నరోదిజం రాజకీయమైన రాడికల్ డెమోక్రసీలోకి పరివర్తించే విధానంలోని, పైన నేను రేఖా మాత్రంగా సూచించ ప్రయత్నించిన ప్రక్రియలోని, చివరి దశలలో ఒకదానిని వ్యక్తపరుస్తోంది. పైన పేర్కొన్న పతాకకింద అన్ని సోషల్-డెమోక్రాటేతర విప్లవాత్మక గ్రూపుల స్థిరఐక్యత ఎప్పుడు వీలుపడుతుందంటే, పాతకాలపు రష్యన్ విశిష్టతా తత్వపు దురభిమానాలకు స్వస్తి చెప్పేటట్టి ప్రజాస్వామిక కోర్కెల కార్యక్రమం ఎప్పుడైతే రూపొందించబడుతుందో అప్పుడే వీలుపడుతుంది. అయితే అట్టి ప్రజాస్వామిక పార్టీ ఒకటి రూపొందడం పురోగమన పథంలో ఉపయోగకరమైన ముందంజ అని సోషల్-డెమోక్రాట్లు నమ్మడం సహజమే; ఇకవారి నరోద్నిక్ వ్యతిరేక క్రియాకలాపం దీనికి మరింత సహాయకారి అవుతూ, అన్ని దురభిమానాలనూ పుక్కిటిపురాణాలనూ నిర్మూలించడానికీ మార్క్సిజం పతాక కింద సోషలిస్టులను సమీకరించడానికీ, ఇతర గ్రూపులన్నీ కలిసి ఒక ప్రజాస్వామిక పార్టీగా ఏర్పడడానికీ దోహదకారి కాగలుగుతుంది.

కార్మికులు స్వతంత్రమైన ఆర్గనైజేషనును కలిగిన ఒక ప్రత్యేక కార్మికుల పార్టీగా ఏర్పడడం అత్యావశ్యకమని సోషల్-డెమోక్రాట్లు భావించడంచేత, ఈ పార్టీతో వారు సహజంగానే ''ఐక్యం'' కాలేకపోయారు. అయినప్పటికీ అభివృద్ధి నిరోధక సంస్థలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యవాదులు సాగించే ఏ పోరాటాన్నయినా సరే కార్మికులు తమ యావచ్ఛక్తితోనూ బలపరుస్తారు.

నిరంకుశత్వంతో పోరాడాలనే భావాన్ని కార్మికులలో వ్యాపింపజేస్తూ, దేని ఆనుషంగికంగానైతే బూర్జువా భావశాస్త్రవేత్తలు కూడా రాజకీయ స్వేచ్ఛకు సుముఖులుగా వున్నారో అట్టి మన సామాజిక సంబంధాల వైషమ్యాన్నీ, సర్వ కార్మికజనాళి విముక్తికై పోరాటంలో యోధునిగా రష్యన్ కార్మికుని చారిత్రాత్మక పాత్రనూ కార్మికులకు అదే సమయంలో విశదీకరించనివారు ఎంతటి బ్రహ్మాండమైన పొరపాటు చేస్తున్నారో నిరూపించేందుకు అత్యంత సామాన్యాతి సామాన్యమైన పెట్టీబూర్జువా రాడికల్ సిద్ధాంతంగా నరోదిజం దిగనాసిల్లడమే — ఈ దిగనాసిల్లడానికి ''ప్రజా మిత్రులే'' ప్రత్యక్ష సాక్షులు — నిదర్శనం.

మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాన్ని సోషలిస్టులు అందరూ అంగీకరిస్తున్నారని వాదిస్తూ మార్క్స్ సిద్ధాంతాన్ని గుత్తకి తీసుకోవాలని సోషల్-డెమోక్రాట్లు కోరుతున్నారని వారిపై తరుచుగా ఒక నేరం మోపబడుతూంది. అయితే ఇక్కడ రష్యాలో కార్మిక ప్రజలు గురికాబడుతూన్న దోపిడీకి సామాజిక ఆర్థిక వ్యవస్థయొక్క బూర్జువా ఆర్గనైజేషనే కారణమని స్థూలం

గానూ సర్వేసర్వత్రానూ విశదీకరించకుండా, అందుకు బదులు భూదాహమనో, పరిహారపు చెల్లింపులనో, లేదా అధికార్ల పీడన అనో, అదీకాకపోతే ఇంకేదో అనో విశదీకరించుతూన్నప్పుడు, విలువయొక్క రూపం గురించీ, బూర్జువా వ్యవస్థ సారం గురించీ, శ్రామికవర్గం యొక్క విప్లవాత్మక పాత్ర గురించీ కార్మికులకు వివరించి చెప్పడంలో అర్థమేమిటుంది? — అనే ప్రశ్న తలెత్తుతుంది.

వర్గపోరాట సిద్ధాంతం యజమానులతో కార్మికులకు వున్న సంబంధాలనే (రష్యాలో పెట్టుబడిదారీ విధానం ప్రభుత్వంచే కృత్రిమంగా నాటి పెంచబడింది) వివరించలేనప్పుడు, దానిని కార్మికులకు, పూర్తిగానూ స్థిరంగానూ ఏర్పడినట్టి ఫ్యాక్టరీ కార్మికుల వర్గానికి చెందని "ప్రజా" రాశి మాట అటుండగా, విశదీకరించడంలో అర్థమేమిటుంది?

పెట్టుబడిదారీ విధాన మాధ్యమం ద్వారానూ, అది సృష్టించే శ్రామికవర్గ మాధ్యమం ద్వారానూ కాకుండా, ఇతర విధంగా కమ్యూనిజానికి మార్గాలను వెతకడానికై మన దేశంలో కొందరు ప్రయత్నించుతూన్నట్టయితే, మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాన్నీ, పెట్టుబడిదారీ విధాన మార్గం ద్వారా కమ్యూనిజం ఆర్గనైజరుగా శ్రామికవర్గంయొక్క విప్లవ పాత్రను నిర్వచించేటట్టి దాని ఉపసిద్ధాంతాన్నీ ఎవరైనా ఏలా అంగీకరించ గల్గుతారు?

ఇలాటి సందర్భంలో, రాజకీయ స్వేచ్ఛ కోసం పోరాడాలని కార్మికునికి పిలుపు ఇవ్వడం, అభ్యుదయకర బూర్జువావర్గం కోసం నిప్పుల్లోనుంచి జీడిపిక్కలు తీయడానికై కార్మికుడిని తన చేతులు కాల్చుకోమని చెప్పడంతో సమానమని ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది; ఎందు చేతనంటే, ప్రధానంగా రాజకీయ స్వేచ్ఛ బూర్జువావర్గ ప్రయోజనాల కోసమే ఉపయోగపడు తుందే గాని, కార్మికుల పరిస్థితులను మెరుగు పరచదనీ, గాని కేవలం... కేవలం... ఈ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగానే వారు సలిపే పోరాటానికి అవసరమైన పరిస్థితులను మాత్రమే అది సులభతరం చేస్తూందనే విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు (అందులోనూ దృష్టాంత సిద్ధంగా నరోద్నిక్కులూ నరోదావోల్త్సీ[43] సహితమూ దీనిని కాదనలేదు.) సోషల్-డెమోక్రాట్ల సిద్ధాంతాన్ని అంగీకరించకుండానే ఒక్క కార్మికులలో మాత్రమే విప్లవ మూలద్రవ్యాలు వున్నాయని అనుభవ పూర్వకంగా నమ్మినవారై కార్మికులలో ఆందోళన సాగించుతూన్నట్టి సోషలిస్టులకు వ్యతిరేకంగా నేనీ మాటలు అంటూన్నాను. ఈ సోషలిస్టుల సిద్ధాంతమే వారి ఆచరణకు విరుద్ధంగా వుంది; ఇక సోషలిస్టు కార్మికుల పార్టీని ఆర్గనైజుచేయడమనే ప్రధాన కర్తవ్యం నుండి కార్మికుల దృష్టిని మరల్చివేస్తూండడంలో వీరు అత్యంత ప్రమాదకరమైన పొరపాటే చేస్తున్నారు.*

* నిరంకుశత్వానితో పోరాడమని కార్మికుని మేల్కొల్పాల్సి వుంటుందనే పర్యవసానం తేల్చడానికి రెండు మార్గాలున్నాయి: ఒకటి, సోషలిస్టు వ్యవస్థ కోసమై కార్మికుడు మాత్రమే

బూర్జువా సమాజపు వర్గవైషమ్యాలు ఇంకా ఏ మాత్రమూ అభివృద్ధి చెందకుండా, భూదాస్యవిధానం వల్ల ఆ వైషమ్యాలు అణగదొక్కబడిన స్థితిలో వుండగా, యావత్తు మేధావి స్తరంయొక్క ఏకగ్రీవ ఆక్షేపణకూ భూదాస్య విధానం గురికాబడి, మన మేధావి స్తరంలో ప్రజాస్వామ్య స్వభావం అంటూ ప్రత్యేకంగా ఏదో ఒకటి వుందనే లిబరల్సు అభిప్రాయాలకూ సోషలిస్టుల అభిప్రాయాలకూ మధ్య ఏమంత పెద్ద అఖాతమేదీ లేదనే భ్రమ ఈ విధంగా సృష్టించబడింది. ఇప్పుడు ఆ ఆర్థికాభివృద్ధి ఎంత వరకూ పురోగమించిందంటే — పెట్టుబడిదారీ విధానానికి రష్యాలో ప్రాతిపదికే లేదని ఇదివరకల్లా వాదించినవారు సహితమూ పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధి పథాన మనం అడుగు పెట్టామని ఇప్పుడు ఒప్పుకుంటున్నారు — ఈ విషయంపై ఎట్టి భ్రమలుండడానికీ ఇక వీలులేదు. భౌతిక వస్తువుల ఉత్పత్తిలో పనిచేస్తూన్న సమాజ సంఘటనయొక్క రేఖాచిత్రం ఎంతటి స్పష్టత వహించుతూందో, ''మేధావిస్తర'' సంఘటనయొక్క రేఖాచిత్రం కూడా అంతటి స్పష్టత వహించుతూంది: మొదటిదానిపై అధికారాన్నీ పరిపాలననూ పెట్టుబడిదారుడు చలాయించుతూండగా రెండవదానికి, దానిలో వున్నట్టి ఉద్యోగవాంఛాపరులూ రోజుకు రోజూ పెరిగిపోతూన్నట్టి బూర్జువా కిరాయిమనుషుల మూకలు, కడుపులో చల్ల కదలకుండా హాయిగా తృప్తి పొందినట్టి ఉత్సాహోద్రేకమంటే ఏమిటో ఎరుగనట్టి తమకు కావాల్సినదేదో దాన్ని మాత్రం చక్కగా ఎరిగినట్టి ఈ ''మేధావులు'' అనుశాసకులుగా హుకూములు జారీచేస్తున్నారు. ఈ వాస్తవవిషయం ఏ మాత్రమూ కాదనకపోవడమే కాకుండా పైపెచ్చు మన రాడికల్సూ, లిబరల్సూ, దీనిని మరింత గట్టిగా నొక్కిచెబుతూ, దాని అవినీతిని రుజువు పరచేందుకు గొంతుక చించుకుని అరవడం ద్వారానూ దానిని దూషించి దానిని తబ్బిబ్బు పరచి, దానికి సిగ్గుతెప్పించడం ద్వారానూ... దానిని నాశనం చేయప్రయత్నిస్తున్నారు. మన బూర్జువా వర్గం (''జ్యేష్ఠుల'' అనుభవం అనే సాకు చెబుతూ) ప్రజల వినాశానికీ ప్రజరాసుల దారిద్ర్యానికీ నిరుద్యోగానికీ ఆకలిపస్తులకీ దారితీస్తూందనీ కాకమ్మ కథలు చెప్పి దానిని భయపెట్టడానికి మన

---

పోరాడుతాడని తల్చడమూ, అందుచేత అతని పోరాటానికి దోహదంచేసే ఒక షరతుగా రాజకీయ స్వేచ్ఛను పరిగణించడమూ; ఇది సోషల్-డెమోక్రాట్ల అభిప్రాయం; లేదా రెండవది, ప్రస్తుత వ్యవస్థవల్ల అందరికంటె హెచ్చుగా బాధపడుతూన్న వారిలో కార్మికుడిని ఒకనిగానూ, అతడికి పోయేదేమీ లేదనిన్నీ నిరంకుశత్వంతో పోరాడడంలో అతడు మొండి ధైర్యం చూపుతాడనీ, కేవలం ఈ కారణాన్నే పోరాడమని అతనికి విజ్ఞాప్తి చేయడమూ. కాని దీని అర్థం మాత్రం నిరంకుశత్వానికి ప్రతికూలంగా యావత్తు ''ప్రజ''యొక్క సంసక్తి మరుగున బూర్జువావర్గానికి శ్రామికవర్గానికీ వున్న వైషమ్యాన్ని గుర్తింప నిరాకరించే బూర్జువా రాడికల్సు వెంట కాళ్లీడ్చుకుంటూ పొమ్మని కార్మికుని నిర్బంధించడమే అవుతుంది.

పెట్టీబూర్జువావర్గ అర్థశాస్త్రవేత్తలు కావించుతూన్న యత్నాలు ఎంత హాస్యాస్పదంగా వున్నాయో, బూర్జువా స్వభావం కలిగి వున్నందుకు బూర్జువా మేధావిస్తరానికి సిగ్గు తెప్పించాల నేటట్టి ఈ సత్యకాలపు యత్నాలు కూడా అంత హాస్యాస్పదంగానూ వున్నాయి: బూర్జువా వర్గాన్నీ, బూర్జువావర్గ భావశాస్త్రవేత్తలనూ విచారణకు నిలబెట్టి, ఆ వర్గానికి ఈ విధంగా శిక్షచెప్పడం బేడిసమీను చేసిన నేరాన్ని విచారణ చేసి దానిని తీసికెళ్లి ఏట్లో పారేయమని శిక్ష చెప్పడం గుర్తుకొస్తూంది. ఈ పరిధి ఆవల ప్రగతి, శాస్త్రం, సత్యం, ప్రజ, వగైరా లెక్క లేనన్ని పదాలను కుండపోతగా కురిపిస్తూ, విరోధం, పతనం, నిరాశ, ఉదాశీనతలు లేకుండా మానవహృదయాలన్నీ ప్రజాస్వామ్యంతో ఉజ్వలితమై వుండిన పద్దెనిమిది వందల అరవైల నాటి కాలం వెళ్లిపోయిందే, మరాకాలం ఇక రాదే అని వాపోవడమంటే చేవికోసుకునేటట్టి లిబరల్, రాడికల్ ''మేధావిస్తరం'' మొదలవుతుంది.

ఆనాడుండిన సంసక్తికి కారణం, అప్పటి భౌతిక పరిస్థితులేననీ, అవి మళ్లీ రమ్మన్నా రావనీ వారికి స్వాభావికమైన సత్యకాలపు సహృదయతతో ఈ మహాశయులు నమ్మ నిరాకరించుతారు. ఆనాటి భూదాస్య భారం అందరినీ ఒక్కలాగే క్రుంగదీసింది: నాలుగు డబ్బులు వెనకేసుకుని కాస్తహాయిగా కాలక్షేపం చేసుకుందామని ఆశ పెట్టుకుని భూదాసులపై పెత్తనం చలాయించు తూన్న మేనేజరూ, తన దగ్గరనుండి గోళ్లూడగొట్టి వసూళ్లు గుంజతూన్నందుకూ తన వ్యవసాయంలో జోక్యం కలుగజేసుకుని తన కమతంనుండి తనను బలవంతాన తరిమివేసినందుకూ తన ప్రభువును ద్వేషించినట్టి చౌరవగల ముజీక్కూ*; శ్రామికునిగా దిగజారిపోయిన దివాణపు భూదాసుడూ; షాహుకారికి భృత్యుడుగా అమ్మివేయబడినట్టి చితికి చెడిపోయిన ముజీక్కూ, వర్తకుడూ కార్ఖానా యజమానీ కార్మికుడూ, గృహపరిశ్రమ చేసుకునే శిల్పీ, శిల్పులచే పనిచేయించే మేస్త్రీ — వీరందరికీ అది బాధలు తెచ్చిపెట్టింది. వీరందినీ కూడ గట్టినది భూదాస్యవ్యవస్థపై వారికున్న ద్వేషమే; దీని ఆవల అత్యంత తీవ్రమైన ఆర్థిక వైష మ్యం ఆరంభమైంది. ఈనాడు ఈ వైషమ్యం ఇంత తీవ్రంగా వృద్ధి చెందినప్పటికి సహి తమూ దానిని చూడకపోవడానికీ, పోరాటం జరగక వీలులేని పరిస్థితులలో, స్వచ్ఛందంగా ఐతేనేమి నిర్బంధంగా ఐతేనేమి బూర్జువా వర్గపు కిరాయి ముఖ్యరునిగా వుండనిష్టపడని ప్రతి మనిషీ శ్రామికవర్గంతో బుజం బుజంకలిపి నిలబడాల్సిన పరిస్థితులలో, పాతకాలంనాటి సంసక్తి రోజులు మళ్లీరావాలని ప్రార్థించుతూ కూచోవడానికీ తీయని కలలు కంటూ ఎంతటి గాఢనిద్రలో మునిగి వుండాలో కదా మనిషి.

''ప్రజల ప్రయోజనాలు'' గురించి చెబుతూన్న పెద్ద కబుర్లు నమ్మడానికి మీరు

---

* ముజీక్ — విప్లవానికి పూర్వం రష్యాలో వ్యవసాయదారుడిని ఈలా పిలచేవారు. — అనువాదకుడు.

ఇష్టపడక, ఇంకా లోతుగా తరచి చూడడానికి మీరు ప్రయత్నించినట్టయితే, ప్రగతిశీలమైన రకరకాల సత్యకాలపు చర్యల ద్వారా తమ (వారి పరిభాషలో "ప్రజల") ఆర్థికవ్యవస్థను మెరుగు పరచుకుందామనీ, బలపరచుకుందామనీ, పునరుద్ధరించుకుందామనీ కలలు కంటూన్నట్టీ, ఈనాటి ఉత్పత్తి సంబంధాల పరిస్థితులలో ప్రజారాసులను ఇప్పటికంటె మరింతగా శ్రామిక వర్గీయులుగా చేసివేయడమే అట్టి ప్రగతిశీలమైన చర్యల ఫలితమని గ్రహించడానికి పూర్తిగా అసమర్థులైనట్టీ, పెట్టీబూర్జువా వర్గపు శ్వచ్ఛమైన భావశాస్త్రీయవేత్తలతో వ్యవహరి స్తూన్నట్టు మీరు తెలుసుకుంటారు. మన మేధావిస్తరంయొక్క వర్గస్వభావాన్ని బయట పెట్ట డానికీ, తద్వారా మన సన్నకారు ఉత్పత్తిదారులు పెట్టీబూర్జువాలే అన్న మార్క్సిస్టు సిద్ధాం తాన్ని పటిష్ఠం చేయడానికీ ఇతోధికంగా కృషిచేసినందుకు "ప్రజా మిత్రుల"కు మనమెం తైనా కృతజ్ఞత చూపాల్సి వుంది. రష్యన్ సోషలిస్టుల మనస్సును ఎంతకాలంగానో గందర గోళ పరచినట్టి పాత భ్రమల, పుక్కిటి పురాణాల అంతర్థానాన్ని వారు త్వరితంచేసి తీరడం అనివార్యమే. ఈ సిద్ధాంతాలను "ప్రజా మిత్రులు" ఎంతగా రాసి రాపాడి, అరగదీసి నల గ్గొట్టేశారంటే, వీటిని అవలంబించిన సోషలిస్టులు వీటిని సవరించడమో, లేదా వీటిని సాంతమూ వదలుకొని, ధనిక రైతులు మెరుగు పనిముట్లను కొంటున్నారని ఆత్మసంతృప్తికరమైన గంభీరతతో urbi et orti* చాటుతూన్నట్టీ, చీట్లపేక బల్లల దగ్గర కూచుని కూచుని విసుగెత్తిన వ్యక్తులకు మనం స్వాగతం చెప్పాలని తీవ్రంగా ఆలోచించుతూన్నట్టు ముఖాలు సాగదీసుకుని మనను నిమ్మింప జాచేటట్టి పెద్దమనుషుల ప్రత్యేకోపయోగానికే వదిలి పెట్టేయడమో — నిశ్చయించుకో వలసినట్టి ప్రాణాంతకమైన చిక్కులో వీరు పడిపోయారు. ఇక ఇదే ధోరణిలో "ప్రజా వ్యవస్థ" అనీ, "మేధావిస్తరం" అనీ మాట్లాడుతారు — ఆ మాట్లా డడం కూడా, విస్తృతమైన ఆశయాల గురించీ, జీవిత సమస్యల ఆదర్శప్రాయ పరిష్కారం గురించీ డాంబికమైనట్టి మూరెడు బారెడు పదాలు ప్రయోగిస్తూ మాట్లాడుతారు!...

తమ భ్రమలు వదలుకుని, తాము వాంఛించినట్టిది కాక, రష్యాయొక్క వాస్తవ అభి వృద్ధిలో, సాధ్యమైనట్టివి కాక వాస్తవమైనట్టి సాంఘిక — ఆర్థిక సంబంధాలలో సహాయం అన్వేషించినట్టయితేనే తాము ఫలప్రదమైన కృషి నెరవేర్చ గలమని సోషలిస్టు మేధావి స్తరం ఆశించవచ్చు. అంతేకాకుండా, వారు తమ సైద్ధాంతిక కృషిని, రష్యాలో వున్న ఆర్థిక వైషమ్య రూపాలన్నిటి నిర్దిష్టమైన అధ్యయనంవైపు, వాటి సంబంధాల యొక్క, తదాను షక్తమైన అభివృద్ధియొక్క అధ్యయనంవైపు సారించాలి; రాజకీయ చరిత్రచే గాని, న్యాయ శాస్త్ర వ్యవస్థచే గాని, పాతుకుపోయినట్టి సైద్ధాంతిక దురభిమానాలచే గాని ఈ వైషమ్యం

* సర్వప్రపంచం ఎదుట: — అనువాదకుడు.

మరుగు పరచబడి నప్పుడల్లా దానిని వారు బయట పెట్టాలి. మన వాస్తవ పరిస్థితుల సమ్యగ్ చిత్రాన్ని ఉత్పత్తి సంబంధాల స్పష్టమైన వ్యవస్థగా వారు ప్రదర్శించాలి, ఈ వ్యవస్థ కింద కార్మిక ప్రజలు దోపిడికి గురిచేయబడడమూ వారి ఆస్తి హక్కులు లాక్కొనబడడమూ ఆవశ్యకములనీ చూపించి, ఈ వ్యవస్థ నుండి బయట పడేటందుకు ఆర్థికాభివృద్ధి సూచించే మార్గాన్ని చూపించాలి.

రష్యన్ చరిత్ర, రష్యన్ వాస్తవ పరిస్థితుల సవివరమైన అధ్యయనంపై ఆధారపడి నట్టి ఈ సిద్ధాంతం, శ్రామికవర్గపు డిమాండ్లకు సమాధానం ఇవ్వాలి — అలా అది సమాధాన మిచ్చి, శాస్త్రీయ అవసరాలను తీర్చగల్గినట్టయితే, అప్పుడు శ్రామిక వర్గంయొక్క ప్రతీ ప్రతిఘటనా చింతన జాగృతి కూడా ఈ చింతనను సోషల్-డెమోక్రసీలోకే తప్పనిసరిగా ప్రవహింపజేస్తుంది. ఈ సిద్ధాంతాన్ని ఎంత సవివరంగా విశదీకరించుతే అంత సత్వరంగా సోషల్-డెమోక్రసీ అభివృద్ధి చెందుతుంది; ఎందుచేతంటే ప్రస్తుత వ్యవస్థ పరిరక్షకులలో ఎంతటి జిత్తులమారులు సహితమూ శ్రామికవర్గ చింతనా జాగృతిని అరికట్ట లేకపోతారు: కారణమేమనగా ఉత్పత్తిదార్ల ఆస్తి హక్కులను అతి నిర్దాక్షిణ్యంగా లాక్కొనడమునూ, శ్రామికవర్గంయొక్క, దాని నిలువ సైన్యంయొక్క ఎడతెగని పెరుగుదలనూ ఈ వ్యవస్థ అవశ్యంగానూ అనివార్యంగానూ తెచ్చిపెట్టి తీరుతుంది — దీనితో సమాంతరంగా సామాజిక సంపత్తియొక్క ప్రగతి, ఉత్పాదక శక్తుల బ్రహ్మాండమైన అభివృద్ధి, పెట్టుబడిదారీ విధానంచే శ్రమ సామాజికీకరణము, వీటిని కూడా అది తెచ్చిపెట్టి తీరుతుంది. అయిన ప్పటికీ ఈ సిద్ధాంతాన్ని సవివరంగా విపులీకరించడానికి ఇంకా చాలా పని చేయవలసి వుంది; సోషలిస్టులు ఆ పని చేస్తారు; ప్రతి కార్యక్రమమూ వాస్తవ విధానంయొక్క యథార్థ సూత్రీకరణ రూపంలో వుండి తీరాలనే షరతును మన్నించేటట్టయితే ఏకైక శాస్త్రీయ పద్ధతైన భౌతికవాదం వారిలో వ్యాప్తి చెందడమే ఇందుకు హామీ ఇస్తుంది: ఈ భావాలను అవలంబించినట్టి సోషల్-డెమోక్రసీ యొక్క విజయమే ఇందుకు హామీ ఇస్తుంది. ఈ విజయం లిబరల్సునూ ప్రజాస్వామ్య వాదులనూ ఎంతవరకు కదలించిందంటే, ఒకానొక మార్క్సిస్టు చెప్పినట్టుగా, వారి లావుపాటి మాసపత్రికలు మునపటిలాగా పేలవంగా వుండకుండా ఇప్పుడిక విసుగెత్తించడం లేదు.

సోషల్-డెమోక్రాట్లు నిర్వహించ వలసిన సైద్ధాంతిక కృషి అవసరాన్నీ, ప్రాముఖ్యతనూ, దీని బ్రహ్మాండ పరిమాణాన్నీ ఈ రీతిగా నొక్కిచెప్పడంలో ఆచరణీయ కృషి కంటె ఇదే అగ్రస్థానం ఆక్రమించాలని నేనెంత మాత్రమూ చెప్పడం లేదు* — ఇది పూర్తి

* తత్ విరుద్ధంగా, ప్రచార, ఆందోళనలు నిర్వర్తించే ఆచరణీయ కృషి ఎల్లప్పుడూ అగ్రస్థానమే ఆక్రమించాల్సి వుంటుంది; ఇందుకు రెండు కారణాలు: మొదటిది, ఆచరణీయ

అయేవరకూ ఆచరణీయ కృషిని నిలిపి వుంచాలని అంతకంటెనూ అనడం లేదు. ''సాంఘిక శాస్త్రంలో స్వకీయగతాత్మక పద్ధతి''ని ప్రవేశపెట్టేవారూ, లేదా ఊహాజనిత సోషలిజమ్ అనుచరులూ — వీరొక్కరే ఇట్టి పర్యవసానానికి రాగల్గుతారు. దేశంకోసం ''భిన్నమైన'' (వాస్తవంనుండి) ''అభివృద్ధి మార్గాలను'' అన్వేషించడం సోషలిస్టుల కర్తవ్యమని అనుకున్న పక్షంలో, సహజంగానే అప్పుడు తత్వశాస్త్ర ప్రతిభాశీలురు ఈ ''భిన్న మార్గాలు'' ఆవిష్కరించి సూచించినప్పుడే ఇది సాధ్యపడడం స్వతస్సిద్ధమే; కాగా ఇందుకు విపర్యగా, ఎప్పుడైతే ఈ మార్గాలు ఆవిష్కృతమై సూచించబడుతాయో, ఇక అప్పటితో సైద్ధాంతిక కృషి అంతమైపోయి, ''నూతనావిష్కృతములైన'' ''విభిన్న మార్గాల'' వెంట ''పితృదేశాన్ని'' నడిపించాల్సినట్టివారి కృషి ఆరంభ మవుతుంది. సామాజిక, ఆర్థికాభివృద్ధియొక్క వాస్తవ మార్గానికి అడ్డుగా నిలబడే వాస్తవమైనట్టి నిజమైనట్టి శత్రువులకు ప్రతికూలంగా శ్రామికవర్గం సాగించే వాస్తవ పోరాటంలో దానికి భావశాస్త్రీయమైన నాయకత్వం వహించడమే సోషలిస్టుల కర్తవ్యమైనప్పుడు, పరిస్థితి సొంతమూ వేరుగా వుంటుంది. ఇలాంటి సందర్భాల్లో, సైద్ధాంతిక కృషీ ఆచరణీయ కృషీ, బహుకాలానుభవజ్ఞుడు జర్మన్ సోషల్-డెమోక్రాట్ లీబ్‌క్నెఖ్ట్ సముచితంగా వర్ణించినట్టు:

Studieren, Propagandieren, Organisieren,* అనే ఏకైక కార్యంగా మిళితమవుతాయి.

ఉద్యమ అవసరాలకు సరిపడేటట్లు ఈ కార్యం నడిపించనివారూ, ఈ సిద్ధాంత ఫలితాలను కార్మికులలో ప్రచారం చేయనివారూ ఏ విధంగా నాయకులు కాలేరో, ఆవిధంగానే పైన పేర్కొన్న సైద్ధాంతిక కృషిలేనిదే ఎవ్వరూ భావశాస్త్రీయ నాయకులు కానేరరు.

సోషలిస్టు గ్రూపులు ఎంతో తరుచుగా గురి అవుతూన్నట్టి డాగ్మాటిజమూ** సెక్టేరియనిజమూ*** అనే రెండు లోపాలనుండీ ఈ విధమైన కర్తవ్యప్రదర్శన సోషల్-డెమోక్రసీని కాపాడుతుంది.

---

కృషి లేవదీసే సమస్యలకు సైద్ధాంతిక కృషి సమాధానాలు మాత్రమే యిస్తుంది; రెండవది, సోషల్-డెమోక్రాట్లు, తమ స్వాధీనంలో లేని హేతువుల కారణాన, తాము సైద్ధాంతిక కృషికే మిక్కిలి తరుచుగా పరితమై వుండాల్సి వచ్చుట చేత, ఆచరణీయ కృషి సాధ్యమయే ప్రతి క్షణమూ అమూల్యమైనదిగా వారు పరిగణించుతారు.

* అధ్యయనంచేయడం, ప్రచారం చేయడం, ఆర్గనైజు చేయడం. — అనువాదకుడు.

** పిడివాదము — అనువాదకుడు.

*** ఒంటెత్తుపోకడ — అనువాదకుడు.

సామాజిక-ఆర్థికాభివృద్ధియొక్క వాస్తవ విధానంతో ఒక సూత్రం సరిపోవడమే దాని సత్యాసత్యాలకు ఏకైక పరమోన్నత ప్రమాణమైనప్పుడు, డాగ్మాటిజమే వుండదు; శ్రామికవర్గ ఆర్గనైజేషనును పెంపొందించడమే కర్తవ్యమైనప్పుడూ, తత్ కారణంగా మేధావి స్తరంనుండే ప్రత్యేక నాయకులను తయారుచేసే "మేధావిస్తరం" పాత్ర అనవసరమైనప్పుడూ సెక్టేరియనిజమే వుండదు.

ఇందువల్ల మార్క్సిస్టులలో వివిధములైన సైద్ధాంతిక ప్రశ్నలపై అభిప్రాయ భేదాలు వున్నప్పటికీ, మార్క్సిస్టు గ్రూపు ఆవిర్భవించినప్పటినుండీ వారి రాజకీయ క్రియాకలాప పద్ధతులు మాత్రం ఎట్టి మార్పూ లేకుండా ఆలాగునే వున్నాయి.

రష్యాలోని కార్మికవర్గ ఉద్యమం అభివృద్ధినీ, ఆర్గనైజేషనునీ పెంపొందించడమూ, ఈ ఉద్యమాన్ని చోదక భావ రహితంగానూ చెదురు మదురుగానూ జరుగుతూన్న నిరసనలూ, "దొమ్మీలూ" సమ్మెలూ యత్నాల ప్రస్తుత స్థితినుండి, బూర్జువా వ్యవస్థకు వ్యతిరేకంగా నడుపబడుతూన్నట్టి, ఆస్తి హక్కులు లాక్కొన్నవారి ఆస్తి హక్కులనే లాక్కొనేందుకూ కార్మికప్రజను అణగదొక్కి వుంచడంపైనే ఆధారపడినట్టి సామాజిక వ్యవస్థను అంతం చేయడానికీ కృషి చేస్తున్నట్టి యావత్తు రష్యన్ కార్మికవర్గం యొక్క ఆర్గనైజుకాబడిన పోరాటంగా రూపొందించడంలోనే వుంది సోషల్-డెమొక్రాట్ల రాజకీయ క్రియాకలాపం. ఈ క్రియాకలాపం అంతటికీ, రష్యాయొక్క యావత్తు శ్రమిక, పీడిత జనాళికీ ప్రకృతిసిద్ధమైన ఏకైక ప్రతినిధి రష్యన్ కార్మికుడే అనేటట్టి మార్క్సిస్టుల సామాన్య నమ్మికే మూలాధారం*.

భూదాస్య ఆర్థిక విధానంయొక్క చావసిద్ధంగా వున్న అవశేషాలను మనం లెక్కలోకి తీసుకోని పక్షముందు, రష్యాలో కార్మికప్రజా పీడన సర్వత్రా పెట్టుబడిదారీ స్వభావం కలిగి వుండడమే ప్రకృతిసిద్ధమైన కారణం; కాని ఉత్పత్తిదార్ల రాశి అనుభవించుతూన్న దోపిడీ, పీడన స్వల్పస్థాయిలోనూ, చెదురు మదురుగానూ, వృద్ధిచెందని స్థితిలోనూ వుండగా, ఫ్యాక్టరీ శ్రామికవర్గం అనుభవించుతూన్న దోపిడీ అధికస్థాయిలో, సామాజికపరమై సాంద్రీకృత మయింది. మొదటి దృష్టాంతంలోని దోపిడీ శ్రమజీవి ప్రజలను పీడించుతూన్న వ్యవస్థలోని ఆంతర్యాన్ని కనిపెట్టడానికీ, ఈ వ్యవస్థనుండి బయటపడే మార్గం ఏలా కనుగొనడమో కనిపెట్టడానికీ శ్రమజీవి ప్రజకూ వారి భావశాస్త్రీయవేత్తలకూ ఆటంకాలు కలిగిస్తూన్నట్టి

---

*వ్యవసాయదారుడే రష్యా భావి నిర్మాత — అని కర్షక సోషలిజం ప్రతినిధులూ, నరోదిజం పదం విస్తృతార్థంలో నరోద్నిక్కులూ భావించారు. కార్మికుడే రష్యా భావి నిర్మాత — అని సోషల్-డెమొక్రాట్లు భావించుతారు. ఈ విధంగా ఒకానొక అముద్రిత గ్రంథంలో మార్క్సిస్టు దృక్పథం సూత్రీకరించబడింది.

మధ్యయుగపు రూపాలలోనూ, భిన్నభిన్న రాజకీయ, న్యాయశాస్త్రీయ సాంప్రదాయికములైన హంగులూ, కుయుక్తులూ, కుహకాలతో ఈనాటికీ కప్పివేయబడుతూంది. తద్విరుద్ధంగా, రెండవ దృష్టాంతంలోని దోపిడీ సంపూర్ణంగా అభివృద్ధి చెంది, గందరగోళ పరచే ఏ వివరాలూ లేకుండా దాని స్వచ్ఛమైన రూపంలో ప్రాదుర్భవించుతూంది. పెట్టుబడిచే తాను పీడించబడుతున్నాననీ, బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా తన పోరాటం సాగించాల్సి వుంటుందనీ కార్మికుడు తెలుసుకోకుండా వుండలేడు. అతని తక్షణ ఆర్థిక అవసరాలను తీర్చడానికీ, అతని భౌతిక పరిస్థితులను మెరుగు పరచడానికీ ఉద్దేశించబడిన ఈ పోరాటం, కార్మికులు అర్గనైజకావాలని అనివార్యంగానే డిమాండుచేస్తూ, వ్యక్తులకు వ్యతిరేకంగా కాకుండా ఒక వర్గానికి వ్యతిరేకంగా, ఒక్క ఫ్యాక్టరీలలోనూ కర్మాగారాలలోనే కాకుండా సర్వే సర్వత్రా కార్మికులను హింసించుతూన్నట్టి, చితుకకొట్టేస్తూన్నట్టి వర్గానికి వ్యతిరేకంగా జరిగే సంగ్రామంగా అది అనివార్యంగానే రూపొందుతుంది. అందుచేతనే యావత్తు పీడిత జనాళికీ ఫ్యాక్టరీ కార్మికుడే పురోగామి ప్రతినిధి అవుతున్నాడు. అర్గనైజైనట్టీ నిర్విరామమైనట్టీ పోరాటంలో తన ప్రాతినిధ్యపు ధర్మాన్ని అతడు నిర్వర్తించాలంటే, ''భవిష్యత్ పరిస్థితుల''తో అతనిని ఉత్సాహ పరచడము ఎంత మాత్రమూ అవసరం లేదు; కేవలమూ అవసరమైన దంతా ఏమిటంటే, అతని పరిస్థితులను అతడు అర్థం చేసుకునేటట్టు చేయడమూ, అతనిని పీడించుతూన్న వ్యవస్థయొక్క రాజకీయ-ఆర్థిక రచననూ, ఈ వ్యవస్థ కింద వుండే వర్గ వైషమ్యాల ఆవశ్యకతనూ అనివార్యతనూ అతడు అర్థం చేసుకునేటట్టు చేయడమూ. పెట్టుబడిదారీ విధాన సంబంధాల సాధారణ వ్యవస్థలో ఫ్యాక్టరీ కార్మికునికి వున్న స్థానమే అతనిని కార్మికవర్గ విముక్తి కోసం పోరాడే ఏకైక యోధునిగా చేస్తూంది; ఎందుచేతనంటే, కేవలం పెట్టుబడిదారీ విధానాభివృద్ధిలోని ఉన్నత దశ మాత్రమే, అధికస్థాయి యంత్ర పరిశ్రమే ఈ పోరాటానికి అవసరమైన భౌతిక పరిస్థితులనూ సామాజిక శక్తులనూ సృష్టించుతుంది. ఇతరత్రా ఎక్కడైతే పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధి రూపాలు ఇంకా నీచదశలోనే ఉన్నాయో, అక్కడ మాత్రమే ఈ భౌతిక పరిస్థితులు వుండవు; కొన్ని వేల సంఖ్యలో వున్న చిన్నచిన్న వ్యాపారాలలో ఉత్పత్తి చెదిరిపోయి వుంటుంది (గ్రామ సాముదాయిక భూస్వామ్యం యొక్క రూపాలలో అత్యంత సమతాతత్వ రూపాలలో సహితమూ ఇవి చెదురు మదురుగా వున్న వ్యాపారాలు గానే వుంటాయి తప్ప, వేరొక విధంగా వుండవు), దోపిడీకి లోనవుతూన్నవారిలో అధికభాగం ఇంకా అతి చిన్న వ్యాపారాలనే కల్గి వుంటూ, ఇందువల్ల తాము పోరాడవలసిన ఆ బూర్జువా వ్యవస్థకే ఇంకా ముడిపడిపోయి వుంటుంది: పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోయడానికి సామర్థ్యం కల్గిన సామాజిక శక్తుల అభివృద్ధిని ఇది ఆలస్య పరచి ఆటంకపరుస్తుంది. చెల్లాచెదురుగా వున్నట్టీ వ్యక్తిగతమైనట్టీ స్వల్పస్థాయిలోవున్నట్టీ

దోపిడీ, కార్మికప్రజని స్థానికంగా ఒక చిన్న స్థలానికే ముడిపెట్టేసి, వారిని చీలదీసి, వర్గ సంసక్తిని గుర్తించే చైతన్యం వారికి లేకుండా చేసివేసి, ఏ ఒక్క వ్యక్తి చేతనో వారు హింసింప బడడం కాకుండా మొత్తంగా యావత్తు ఆర్థిక వ్యవస్థ చేతనూ హింసించబడుతున్నారనే విషయం వారు ఒకసారి గుర్తించినప్పటికీ ఒకరితో ఒకరు ఐక్యపడకుండా ఆటంక పరుస్తుంది. తద్విరుద్ధంగా అధికస్థాయి పెట్టుబడిదారీ విధానం, పాత సమాజంతోనూ ప్రత్యేకంగా ఒక స్థలంతోనూ ప్రత్యేకంగా ఒక దోపిడీదారునితోనూ కార్మికులకున్న సంబంధాలను తప్పని సరిగా తెంచివేస్తుంది; వారిని పరస్పరం ఏకీభవింపజేసి, ఆలోచనాపరులై వుండేటట్టు వారిని నిర్బంధించి, ఆర్గనైజుకాబడిన పోరాటాన్నొక దానిని ప్రారంభించేందుకు సామర్థ్యం కలుగ జేసేటట్టి పరిస్థితులలో వారిని వుంచుతుంది. ఇందుచేతనే సోషల్-డెమోక్రాట్లు తమ దృష్టి అంతటినీ తమ క్రియాకలాపాలు అన్నింటినీ కార్మికవర్గంవైపు మళ్లించుతున్నారు. శాస్త్రీయ సోషలిజం భావాలను, రష్యన్ కార్మికుని చారిత్రాత్మక పాత్ర అనే భావాన్ని కార్మిక వర్గపు పురోగామి ప్రతినిధులు కుణ్ణంగా ఆకళింపు చేసుకున్న తరువాత, ఈ భావాలు విస్తృత వ్యాప్తి చెందిన తరువాత, కార్మికులు నేడు సాగించుతూన్న చెదురు మదురు ఆర్థిక సంగ్రామాన్ని చైతన్యవంతమైన వర్గపోరాటంగా రూపొందించేందుకు కార్మికులలోనుండి సుస్థిర మైన ఆర్గనైజేషన్లు ఎప్పుడైతే ఉద్భవించుతాయో — అప్పుడు రష్యన్ కార్మికుడు ప్రజా స్వామిక మూలద్రవ్యాలన్నిటినుండి పైకిలేచి అగ్రస్థానముందు నిలిచి, నిరంకుశత్వాన్ని కూలదోసి, బహిరంగ రాజకీయ పోరాటపు సూటి పథాన రష్యన్ శ్రామికవర్గాన్ని (అన్ని దేశాల శ్రామికవర్గంతోనూ బుజం బుజం కలిపి) జయప్రదమైన కమ్యూనిస్టు విప్లవం అభిముఖంగా నడిపించుతాడు.

సమాప్తి

1894.

# అనుబంధం III

మార్క్సిజాన్ని సంకుచిత బుద్ధితో అర్థం చేసుకోవడం అని నే నన్నప్పుడు, మార్క్సిస్టులను మనస్సులో పెట్టుకునే అంటున్నాను నేను. చట్టసమ్మతమైన పత్రికలలో మార్క్సిజాన్ని వ్యాఖ్యానించేందుకు మన లిబరల్సూ, రాడికల్సూ పూనుకున్నప్పుడు, మార్క్సిజం ఎంత ఘోరంగా కుంచించబడి కత్తిరింపులతోనూ కల్పితాలతోనూ అతుకుల బొంతగా తయార వుతుందో ఈ సందర్భంలో చెప్పకపోలేదు. ఎంతటి గొప్ప వ్యాఖ్యానం అది! రష్యన్ సెన్సార్ల ప్రాక్రస్టన్ మంచానికి సరిపడ్డట్టుగా ఈ విప్లవాత్మక సిద్ధాంతాన్ని ఎంత అంగవిచ్ఛేదం

చేయాల్సి వుంటుందో ఒకసారి మీరే ఆలోచించుకోండి! అయినప్పటికీ మన పత్రికా వ్యాస కర్తలు ఆడుతూ పాడుతూనే ఈ శస్త్రచికిత్స చేస్తున్నారు! వారు చేస్తున్న వ్యాఖ్యానం ప్రకారం స్వంతదారుని శ్రమను ప్రాతిపదికగా కలిగినట్టి వ్యక్తిగత ఆస్తి తన గతితార్కిక అభి వృద్ధిని పెట్టుబడిదారీ వ్యవస్థకింద ఏ విధంగా పొందుతూందో, అభావంగా మారుతుందో, అలా మారిన తరువాత ఏ విధంగా సామాజికీకృతం చేయబడుతుందో తెలియజేస్తున్నట్టి సిద్ధాంతం కింద మార్క్సిజం ఆచరణలో దిగజారిపోతూంది. కాగా, మార్క్సిజం అవలం బించే సాంఘిక శాస్త్ర విధానపు విశిష్టవైఖరుల నన్నింటినీ, వర్గపోరాట సూత్రాన్నీ, వైష మ్యమూ దోపిడీల అన్ని రూపాలనూ, వాటిని అంతమొందించేందుకు గాను శ్రామికవర్గా నికి సహాయం చేసేందుకై, బహిర్గతం చేయడమనే గవేషణయొక్క సూటి లక్ష్యాన్ని విస్మ రించుతూ, మార్క్సిజం సంపూర్ణ విషయం ఈ ''పథకం''లోనే వుందని వారు గంభీర ముద్రతో భావించుతున్నారు. దీని ఫలితం ఎంత పేలవం గానూ సంకుచితం గానూ వుందంటే, పాపం రష్యన్ మార్క్సిస్టుల భావదారిద్ర్యాన్ని చూసి మన రాడికల్సు ఏడుపులు ప్రారం భిస్తున్నారు కూడా. అవును మరి! రష్యన్ నిరంకుశత్వమూ రష్యన్ అభివృద్ధి నిరోధకమూ వున్నంతకాలమూ, ఎట్టి మినహాయింపులు లేకుండా మార్క్సిజానికి సమగ్ర, యథార్థ సంపూర్ణ వ్యాఖ్యానం ఇవ్వడానికే గనుక వీలుండినట్టయితే, అవి నిరంకుశత్వమూ అభివృద్ధి నిరోధకమూ కానే కావు! ఇక మన లిబరల్సూ, రాడికల్సూ మార్క్సిజాన్ని సరిగా అవగాహన చేసుకుని వుండి నట్టయితే (కేవలం జర్మన్ సారస్వతం నుండే), సెన్సారు చేయబడిన ప్రతికా వ్యాసాల ద్వారా మార్క్సిజాన్ని ఈ విధంగా వికృత పరచడానికి వారు సిగ్గుపడి వుండేవారు. ఏదైనా ఒక సిద్ధాం తాన్ని వ్యాఖ్యానించడానికి వీల్లేకపోయిన పక్షమందు — మాటాడకుండా వూరకే వుండండి. లేదంటారా, దానికి మీరు చేస్తున్న వ్యాఖ్యానం ఎంత మాత్రమూ సమగ్రమైనది కాదనీ, దాని ప్రధాన లక్షణాలను మీరు వదలిపెట్టేస్తున్నారనీ ఒక మినహాయింపు సూచించండి; అంతేకాని, దానిలో కొన్ని ఖండాలను మాత్రమే వ్యాఖ్యానించి, అది ఎంత సంకుచితంగా వుందో అని అప్పుడు గావు కేకలు పెట్టడం దేనికి?

వర్గపోరాట మంటేనూ, పెట్టుబడిదారీ సమాజంలో విధిగా అంతర్గర్భితమై వున్న వైషమ్యమంటేనూ ఏమిటో తెలియని వ్యక్తులూ, శ్రామికవర్గంయొక్క విప్లవాత్మక పాత్ర అంటే ఏమిటో లీలా మాత్రంగానైనా తెలియని వ్యక్తులూ మార్క్సిస్టులుగా పరిగణించబడ డమనేటట్టి అసంగతానికీ, మిస్టర్ మిహైలోవ్‌స్కి లాంటివారికున్న యావత్ ప్రగాఢ మేధా సంపత్తిని వినియోగింపనూ అవసర మయేటట్టి ''ధనార్థిక వ్యవస్థ,'' దాని ''ఆవశ్యకత,'' తదితర ఊతపదాలూ వున్నాయనిచెప్పి, స్వచ్ఛమైన బూర్జువావర్గ ప్రణాళికలతో ముందుకొచ్చే

వ్యక్తులు సహితమూ విశిష్టులైన మార్క్సిస్టులుగా పరిగణించబడడమనేది ఒక్క రష్యాలోనే సాధ్యమయే అసంగతానికీ నిజంగా ఇదొక్కటే వివరణ.

ఇందుకు భిన్నంగా, ''విమర్శనాత్మకంగానూ,* విప్లవాత్మకంగానూ వుండడమే దాని సారం''[44] అనే విషయంలోనే తన సిద్ధాంతం విలువ అంతా వుందని మార్క్స్ భావించాడు. నిజంగా మార్క్సిజంలో ఈ రెండవ లక్షణమే సంపూర్ణంగానూ నిర్నిబంధంగానూ అంతర్గర్భితమై వుంది; ఎందుచేతంటే, ఆధునిక సమాజంలో వున్నట్టి వైషమ్యాన్నీ, దోపిడీ రూపాలన్నింటినీ బహిర్గత పరుస్తూ, వాటి పరిణామాన్ని తెల్పుతూ, వాటి పరివర్తనాత్మక స్వభావాన్నీ, అవి మరొక భిన్న రూపంలోకి పరివర్తన చెందే అనివార్యతనూ రుజావు చేస్తూ ఈ విధంగా యావత్తు దోపిడీని వీలైనంత త్వరగానూ సుళువుగానూ అంత మొందించేందుకు శ్రామికవర్గానికి ఒక సాధనంగా ఉపయోగపడడమనే కర్తవ్య నిర్వహణకు ఈ సిద్ధాంతం సూటిగా పూనుకుంటూంది. ఖచ్చితంగానూ ప్రధానంగానూ (సామాజిక శాస్త్రంలో దీనిదే తుది మాట) శాస్త్రీయంగానూ వుండడమనే లక్షణంతో విప్లవాత్మకంగా వుండడమనే లక్షణాన్ని మిళితం చేస్తూండగా, వాటి మిళితం అకస్మాత్తుగా జరగకుండా, ఈ సూత్రస్థాపకుడు తన మూర్తిలోనే శాస్త్రవేత్త లక్షణాలనూ విప్లవకారుని లక్షణాలనూ మిళితం చేసుకోవడం వల్లనే కాకుండా, ఎంతో స్వాభావికంగానూ అవిభాజ్యంగానూ ఆలాగున మిళితం చేయడమనే వాస్తవ విషయంలోనే అన్నిదేశాల సోషలిస్టులనూ తనవైపు ఆకర్షించుతూన్నట్టి ఈ సిద్ధాంతంయొక్క అప్రతిహతమైన శక్తి వుంది. నిజానికి సిద్ధాంతంయొక్క కర్తవ్యం, శాస్త్రంయొక్క లక్ష్యం పీడిత వర్గానికి దాని వాస్తవ ఆర్థిక పోరాటంలో సహాయం చేయడమేనని ఇక్కడ సూటిగా నిర్వచించబడడం వాస్తవ విషయమే కదా.

---

* అన్ని విమర్శనలలోనూ ఏ ఒక్క విమర్శనైతే మార్క్స్ శాస్త్రీయమైనదిగా పరిగణించాడో అట్టి భౌతికవాదయుక్త విమర్శన — అనగా రాజకీయ-న్యాయశాస్త్రీయ, సాంఘిక, సాంప్రదాయిక, తదితర వాస్తవాంశాలను, అర్థశాస్త్రంతోనూ ఉత్పత్తి సంబంధాల వ్యవస్థతోనూ, పరస్పర విరుద్ధములైన సామాజిక సంబంధాలన్నిటి ప్రాతిపదికపైనా అనివార్యంగా రూపొందేటట్టి వర్గప్రయోజనాలతోనూ సరిపోల్చి చూచేటట్టి విమర్శ — గురించే అతడిక్కడ చెబుతున్నాడు. రష్యన్ సామాజిక సంబంధాలు పరస్పర వైరుధ్యం కలిగినవనే విషయం ఏ మాత్రమూ సందేహించ నవసరం లేదు. కాని ఇట్టి విమర్శనకు వాటిని ప్రాతిపదికగా తీసుకొనడానికి ఇంతవరకు ఎవ్వరూ ప్రయత్నించలేదు.

''నీ పోరాటంనుండి ఇక విరమించు, అది. అంతా అర్థంలేనిది — అని మేం ప్రపంచానికి చెప్పడం లేదు. పోరాటానికి యథార్థమైన నినాదం మాత్రమే మేం దానికి ఇస్తున్నాం.''[45]

కనుక మార్క్స్ ప్రకారం, పోరాటం కోసమై యథార్థమైన నినాదం ఇవ్వడమే శాస్త్రం యొక్క సూటి కర్తవ్యం — అనగా, ఉత్పత్తి సంబంధాల యథార్థ వ్యవస్థ ఫలితంగా ఈ పోరాటం ఆవశ్యకతనూ, దాని విషయాన్నీ గమనాన్నీ, అభివృద్ధి పరిస్థితులనూ గ్రహించ గల్గేటట్టుగానూ, ఈ పోరాటాన్ని బాహ్యగతాత్మకంగా ప్రదర్శించ గల్గడం. పోరాటంలోని ప్రతి చిన్న రూపాన్నీ మనం సూక్ష్మంగా అధ్యయనం చేస్తేనే తప్ప, పోరాటం స్థూల స్వభావాన్నీ దాని లక్ష్యాన్నీ — అనగా దోపిడీ అంతటినీ పీడన అంతటినీ సాంతమూ తుది సారిగా అంతం చేయడం — దృక్పథంలో నిల్పుకుంటూనే, ఏ నిర్ణీత క్షణమందున్న పరిస్థితినైనా సరే మనం నిర్వచించ గలిగేటట్టుగా, ఒక రూపం నుండి వేరొక రూపంలోకి పరివర్తన చెందుతూన్న సమయంలో పోరాటంయొక్క ప్రతిదశనూ మనం వేలుపెట్టి చూపించ గల్గితేనే తప్ప ''పోరాటానికి నినాదం'' ఇవ్వడం అసాధ్యం.

''సుప్రసిద్ధుడైన మన'' ఎన్.కె. మిఖైలోవ్స్కీ తన ''విమర్శన''లో వ్యాఖ్యానించి, తరువాత ఆ వ్యాఖ్యానంతో కుస్తీపట్టుతూ తాను ప్రయోగించినట్టి అర్థం పర్థం లేని చెత్తను, మార్క్స్ ఇచ్చిన ''విమర్శనాత్మకమూ, విప్లవాత్మకమూ అయిన'' సిద్ధాంతంతో సరిపోల్చడానికి ప్రయత్నించండి; ఆలా ప్రయత్నించినప్పుడు, తాము ''కార్మిక ప్రజల భావ శాస్త్రవేత్తలుగా'' తమ్మి తామే భావించుకుంటూ, మార్క్సిస్టు సిద్ధాంతంలోని ప్రాణతుల్యమైన దానినంతటినీ తుడిచి పెట్టేసి ఆ సిద్ధాంతాన్ని మన పత్రికావ్యాసకర్తలు రూపొందించినట్టి ఆ ''అరిగిపోయిన నాణెం'' తోనే... తృప్తి పడుతూన్నట్టి వ్యక్తులు నిజంగా వుంటారా అని మీరు ఎంతైనా విస్తుపోతారు.

ఈ సిద్ధాంతం చేసే డిమాండ్లతో మన నరోద్నిక్ సారస్వతాన్ని — ఏది ఏలా వున్నప్పటికీ కార్మికప్రజల భావశాస్త్రీయ ప్రతినిధిగా వుండాలనే కాంక్షే దానిని కూడా ప్రేరేపించింది కదా — స్థూలంగా మన ఆర్థికవ్యవస్థ నేటి స్థితియొక్క, సూక్ష్మంగా రైతాంగస్థితియొక్క, చరిత్రకే అంకితమైపోయినట్టి సారస్వతాన్ని సరిపోల్చడానికి ప్రయత్నించండి; ఆలా మీరు ప్రయత్నించినప్పుడు, దారిద్ర్యావస్థను అధ్యయనంచేసి దానిని వర్ణించి దానిని గురించి నీతులు చెప్పడమనే పరిమితులను జవదాటనట్టి సిద్ధాంతంతో సోషలిస్టులు సంతుష్టి చెంద గల్గుతున్నారే అని మీరు ఎంతైనా విస్తుపోతారు. ఫలానా ఫలానా దోపిడీనీ, ఫలానా ఫలానా వైషమ్య వర్గాలనూ, విశిష్టములైన రాజకీయ, న్యాయశాస్త్ర, తదితర వ్యవస్థలనూ ఉద్భ

వింప జేసినట్టి ఆర్థిక ఆర్గనైజేషనుయొక్క నిర్దిష్ట రూపమేనని భూదాస్యవ్యవస్థ ప్రదర్శించ బడకుండా, కేవలం భూస్వాముల దుష్కార్యాలుగానూ, రైతులకు అన్యాయాలుగానూ ఈ సారస్వతంలో ప్రదర్శించబడుతూంది. నిర్దిష్టమైన ఆర్థిక రూపాల, ఆర్థిక వర్గాల సంఘర్షణే రైతు సంస్కరణ అని కాకుండా, సదుద్దేశాలతోనే అయినప్పటికీ పొరపాటువల్ల ''తప్పుడు మార్గం'' ''ఎంచుకున్నట్టి'' అధికారవర్గంచే అవలంబించబడిన చర్యగా ఇది ప్రదర్శించ బడుతూంది. నిజమార్గంనుండి మళ్లినట్టి, కార్మికప్రజల దారిద్ర్యావస్థను అనుగామిగా కల్గినట్టి, పెడదారిగా సంస్కరణానంతర రష్యా ప్రదర్శించ బడిందే గాని, నిష్కర్ష అయిన అభివృద్ధిని కల్గినట్టి వైషమ్య ఉత్పత్తి సంబంధాల నిర్దిష్ట వ్యవస్థగా ప్రదర్శించబడ లేదు.

అయినప్పటికీ, ఇప్పుడు ఈ సిద్ధాంతం అప్రతిష్ఠ పాలైందనడంలో ఏ మాత్రమూ సందేహం లేదు; ఈనాడున్న విజ్ఞాన స్థాయిని అనుసరించి మార్క్సిజం మినహా మరి ఏ ఇతర విప్లవాత్మక సిద్ధాంతమూ వుండజాలదని ఎంత త్వరగా రష్యన్ సోషలిస్టులు గ్రహించితే, సిద్ధాంత రీత్యానూ ఆచరణ రీత్యానూ ఈ సిద్ధాంతాన్ని రష్యాకు వినియుక్తం చేయడానికై వారు తమ సర్వయత్నాలనూ ఎంత త్వరగా అంకితం చేస్తే — అంత నిశ్చయంగానూ అంత త్వరగానూ విప్లవాత్మక కృషి విజయవంత మవుతుంది.

1894:

వసంతం — గ్రీష్మం.

# రష్యన్ సోషల్-డెమోక్రాట్ల నిరసన

**పదిహేడుగురు సోషల్-డెమోక్రాట్లు ఒకానొక చోట (రష్యాలో) కలుసుకుని జరిపిన సమావేశంలో ఈ దిగువ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడి, దీనిని ప్రచురించడానికీ, దీనిని అందరి కామ్రేడ్లకూ పరిశీలనార్థం సమర్పించడానికీ నిశ్చయించబడింది.**

''శ్రమ విమోచన'' గ్రూపు[46] స్థాపకుల చేతనూ ఆ గ్రూపు అగ్రశ్రేణి సభ్యుల చేతనూ, పద్దెనిమిది వందల తొంభైలలోని రష్యన్ కార్మికుల ఆర్గనైజేషన్లు వెలువరించిన సోషల్-డెమోక్రాటిక్ ప్రచురణలలోనూ ప్రకటించబడిన రష్యన్ సోషల్-డెమోక్రసీ మూల సూత్రాలనుండి వైదొలగే ధోరణి ఒకటి ఇటీవల రష్యన్ సోషల్-డెమోక్రాట్లలో కనిపెట్ట బడింది. కొందరు (''యువ'') రష్యన్ సోషల్-డెమోక్రాట్ల మూలాభిప్రాయాలను వ్యక్త పరుస్తున్నట్లు పరిగణంపబడుతూన్నట్టి ''నూతన అభిప్రాయాల''ను వ్యవస్థాబద్ధంగానూ, నిర్దిష్టంగానూ వ్యాఖ్యానించే యత్నాన్ని ఈ దిగువ ప్రచురితమైన "credo"* ప్రదర్శి స్తూంది. ఈ "credo" పూర్తి పాఠం దిగువ ఇవ్వడమైంది.

''పాశ్చాత్య ప్రపంచంలో చేతిపనుల, కార్ఖానా ఉత్పత్తుల కాలము, తదుపరి జరిగిన యావత్తు చరిత్రపైన, ప్రత్యేకంగా సోషల్-డెమోక్రసీ చరిత్రపైన, తన విస్పష్టమైన ముద్రనువేసింది. స్వేచ్ఛా యుతములైన రూపాలకై బూర్జువా వర్గం గత్యంతరం లేక పోరాడడమూ, ఉత్పత్తిని బంధించి వేస్తూనట్టి శ్రేణీ నిబంధనల నుండి దానిని విముక్తి చేయడానికై బూర్జువావర్గం యత్నించడమూ, బూర్జువావర్గాన్ని ఒక విప్లవాత్మక మూలద్రవ్యంగా తయారుచేశాయి; పాశ్చా త్యంలో సర్వత్రా liberté, fraternité, égalité (స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, సమానత్వం) తోనూ, స్వేచ్ఛా యుతములైన రాజకీయ రూపాలను

*''క్రీడో'' — విశ్వాస ప్రకటన — అనువాదకుడు.

సాధించడం కోసమూ అది మొదలుపెట్టింది. అయినప్పటికీ ఈ విజయాలవల్ల, బిస్మార్క్ చెప్పినట్టూ, తన ప్రత్యర్థి — కార్మికవర్గం — పేర భవిష్యత్తుపై అది ఒక బరాతం పెట్టింది. పాశ్చాత్యంలో ఇంచుమించు సర్వత్రా, ఒక వర్గంగా కార్మిక వర్గం ప్రజాస్వామ్య సంస్థలను సాధించి వుండలేదు — వాటిని ఉపయోగించు కోవడం మాత్రం ఉపయోగించుకుంది. అది విప్లవాల్లో పాల్గొందని ఇందుకు ప్రతిగా వాదించొచ్చు. చరిత్రను మనం చూచినట్టయితే ఈ అభిప్రాయం తప్పు అని తేలిపోతుంది; ఎందుచేతనంటే సరిగ్గా 1848 లో, పాశ్చాత్యంలో రాజ్యాంగాలు దృఢతరం కావించబడినప్పుడు, కార్మికవర్గంలో పట్నవాస శిల్పుల మూలద్రవ్యం — పట్నవాస ప్రజాస్వామ్యం — ఒక్కటే వుండేది; ఫ్యాక్టరీ శ్రామికవర్గం ఇంచుమించు వుండేదే కాదు, ఇక అధికస్థాయి పరిశ్రమలో పనిచేస్తున్న శ్రామికవర్గం (జర్మన్ సాలెవారు — హౌప్ట్‌మన్, లియోన్ సాలెవారూ) క్రమశిక్షణ లేని ఒక అడవి మూక వలె వుంటూ, దొమ్మి చేయడం తప్ప మరేదీ చేతగాక, రాజకీయ డిమాండ్లను కోరే సామర్థ్యమే దానికుండేది కాదు. బూర్జువావర్గం చేతనే, కింది శ్రేణికి చెందిన పట్నవాస శిల్పుల చేతనే, 1848 రాజ్యాంగాలు సాధించబడ్డాయని నిష్కర్షగా చెప్పవచ్చు. ఇక అటు, కార్మికవర్గం (శిల్పులూ, కార్ఖానా కార్మికులూ, ముద్రాక్షరశాలల పని వారూ, సాలెవారూ, గడియారాలు తయారుచేసే పనివాళ్ల మేస్త్రీలూ) మధ్య యుగాలనుండీ ఆర్గనైజేషన్లలోనూ, పరస్పర సహాయక సమాజలలోనూ, మత సంఘాలలోనూ, తదితరములలోనూ సభ్యులుగా వుండడమునకే వారు అలవాటు పడ్డారు. పాశ్చాత్య యూరప్‌లోని కుశలులైన కార్మికులలో ఆర్గనైజేషను అనే ఈ భావం ఈనాటికి సహితమూ నిలిచే వుండి, ఆర్గనైజేషన్లకు లొంగివుండడమంటే విముఖత చూపుతూ దానిని ఆలస్యంగా అలవరచుకుంటూ lose Organisation (తాత్కాలికపు ఆర్గనైజేషన్లు) లోనే తప్ప నిబంధనలూ నియమాలూ వున్నట్టి శాశ్వతపు ఆర్గనైజేషన్లలో సభ్యులుగా వుండడానికి సామర్థ్యం లేని ఫ్యాక్టరీ శ్రామికవర్గం నుండి, వీరు విస్పష్టంగా వేరుపడుతున్నారు. అచ్చంగా ఈ కుశలులైన కార్ఖానా కార్మికులే సోషల్-డెమొక్రాటిక్ పార్టీలకు మూలవిరాట్టు లయారు. ఈ ప్రకారంగా దిగువ చిత్రణ లభించింది: ఇటు రాజకీయ పోరాటంకోసం సాపేక్షంగా సులు వైనట్టి, సంపూర్ణమైనట్టి అవకాశం; అటు కార్ఖానా ఉత్పత్తుల కాలంలో శిక్షణ పొందినట్టి కార్మికుల సహాయంతో ఈ పోరాటాన్ని ప్రణాళికాబద్ధంగా ఆర్గనైజుచేసే అవకాశం. సరిగా ఈ ప్రాతిపదికపైనే పాశ్చాత్యంలో సైద్ధాంతిక, ఆచ రణీయ మార్క్సిజం వృద్ధిపొందింది. ఇటు అధికారం హస్తగతం చేసుకోవడమూ,

అటు Zusammenbruch (సర్వనాశనం) అనే భావి ఆశయంతో—పైపైని మాత్రమే బ్లాంకీజంతో[47] పోలికలు కలిగి వుండి కేవలమూ విభిన్న ఉద్భవం కిలిగినట్టి భావి ఆశయంతో—పార్లమెంటరీ విధానపు రాజకీయ పోరాటం దీనికి ఆరంభస్థానంగా ఉంటూండేది. మార్క్సిజం ఆనాడు వ్యాప్తిలోవున్న ఆచరణయొక్క, అనగా ప్రాబల్యం వహించినట్టి రాజకీయ పోరాటంయొక్క, సైద్ధాంతిక వ్యక్తీకరణ: ఆర్థిక పోరాటంపై బెల్జియమ్‌లోనూ, ఫ్రాన్సులోనూ, ప్రత్యేకంగా జర్మనీలోనూ కార్మికులు అనూహ్యమైన సౌలభ్యంతో రాజకీయ పోరాటాన్ని ఆర్గనైజు చేశారు, కాని బ్రహ్మాండమైన కష్టంతోనూ ఉపద్రవకరమైన సంఘర్షణతోనూ మాత్రమే ఆర్థిక పోరాటాన్ని ఆర్గనైజు చేయగల్గారు. నేటికి సహితమూ రాజకీయ ఆర్గనైజేషన్లతో సరిపోల్చి చూస్తే, (ఇంగ్లండు మాట అటుంచి), ఆర్థిక ఆర్గనైజేషన్లు అసాధారణమైన బలహీనస్థితిలోనూ అస్థిరంగానూ వుంటున్నాయి; ఇక సర్వత్రా కూడా laissent à désirer quelque chose (ఇంతకంటే ఏ మాత్రం బాగుండినా నయమే అనిపించాయి). రాజకీయ పోరాటంలో వినియోగించిన శక్తి ఇంకా సొంతమూ బలహీనపడనంత కాలమూ Zusammenbruch [సర్వనాశనం], భవిష్యత్తులో అత్యంత ముఖ్యమైన చారిత్రాత్మక పాత్రను నిర్వహించే ఒక ప్రధానమైనట్టి ఆర్గనైజేషనల్ Schlagwort (ఊతపదం) గానే వుండేది. కార్మికోద్యమాన్ని అధ్యయనం చేయడం వల్ల తెలుసుకోగల్గే మౌలిక నియమం కనిష్ఠ నిరోధక పథం. పాశ్చాత్యంలో ఈ పథం రాజకీయ క్రియాకలాప రూపం ధరించింది; కాగా "కమ్యూనిస్టు ప్రణాళిక"లో సూత్రీకరించబడిన రూపంలో వున్న మార్క్సిజమే ఈ ఉద్యమం వహించగల్గినట్టి రూపాలన్నిటిలోనూ ఉత్తమోత్తమంగా సాధ్యమయేటట్టి రూపం. కాని శక్తి యావత్తూ రాజకీయ క్రియాకలాపంలోనే బలహీనపడిపోయినప్పుడూ, ఇంతకు మించి రాజకీయోద్యమం ఇక ముందుకు సాగిపోవడం ఇంచుమించు అసాధ్యమే అయినట్టి స్థానం (ఇటీవల కనబడినట్టుగా, ఇక వోట్ల సంఖ్య పెరగకపోవడము, సభలలో ప్రజ కనబరుస్తూన్న ఉదాసీనత, సారస్వతంలో నిరాశాసూచన) చేరుకున్నప్పుడూ, అటు పార్లమెంటరీ క్రియాకలాప నిష్ఫలత్వమూ, అజ్ఞానులైన ప్రజారాసులూ ఆర్గనైజు కాబడనట్టి ఆర్గనైజు కాబడడం ఇంచుమించుగా దుస్సాధ్యమైనట్టి ఫ్యాక్టరీ కార్మికవర్గమూ రంగం మీద దిగడమూ, బెర్న్‌స్టయినిజం[48] అని నేడు పిలువబడుతూన్నట్టి మార్క్సిజంలో సంక్షోభానికి పాశ్చాత్యంలో దారితీశాయి. "కమ్యూనిస్టు ప్రణాళిక" నుండి బెర్న్‌స్టయినిజం వరకూ కార్మికోద్యమాభివృద్ధి కాలం కంటె ఇంకనూ తర్కశాస్త్రబద్ధమైనట్టి విషయ

గతిని ఊహించడం దుస్సాధ్యమే అవుతుంది; ఈ విధానాన్నంతనీ జాగ్రత్తగా అధ్య యనం చేయడం వల్ల ఈ ''సంక్షోభం'' యొక్క పర్యవసానం ఏలా వుంటుందో ఖగోళశాస్త్రవు యథార్థతతో నిర్ణయించవచ్చు కూడా. ఇక్కడ చెప్పదల్చుకున్న విషయం బెర్న్‌స్టయినిజం ఓటమిగాని, విజయంగాని కాదు సహజంగానే — ఆసక్తి జనకమైనది దానిలో ఏమంతగా లేనే లేదు; ఆసక్తిజనకమైనదల్లా పార్టీలో చాలా కాలంగా ఆచరణీయ క్రియాకలాపంలో క్రమేణ సంభవించుతూన్న సమూలమైన మార్పే.

''ఆర్థిక పోరాటం మరింత శక్తివంతంగా సాగించాల్సినట్టే, ఆర్థిక ఆర్గనైజేషన్లను దృఢతరం చేయాల్సినట్టే, దిశలోనే కాకుండా, — ఇంతకంటె ఇంకా అత్యంత ముఖ్యమైన విషయం — ఇతర ప్రతిపక్ష పార్టీల పట్ల పార్టీవైఖరి దిశలో కూడా ఈ మార్పు సంభవించుతుంది. సహిష్ణుతా రహితమైన మార్క్సిజం రుణాత్మక మార్క్సిజం, ఆదిమ మార్క్సిజం (దేని ఊహ ప్రకారం సామాజిక వర్గవిభజన మరీ స్కీమాటిక్‌గా* వుందో అట్టి మార్క్సిజం) బదులు, ఆ స్థానంలో ప్రజాస్వామిక మార్క్సిజం వస్తుంది; ఆధునిక సమాజంలో పార్టీయొక్క సామాజిక స్థానం కూడా నిశితంగా మార్పు చెందే తీరాలి. పార్టీ సమాజాన్ని గుర్తించుతుంది; సామాజికంగా దాని సంకుచిత సాంఘిక కర్తవ్యాలు, వీటిలో అధికసంఖ్యాకవర్గం, సెక్టేరియన్ స్వభావం కల్గిన కర్తవ్యాలు, సామాజిక కర్తవ్యాలుగా విస్తృతమవుతాయి; కాగా అధికారం హస్తగతం చేసుకోవడానికై దాని యత్నం, మార్పు తీసుకొచ్చే యత్నంగా, కష్టజీవుల హక్కులను (వేర్వేరు హక్కులను) అత్యంత సమర్థవంతమూ సమగ్రమూ అయినట్టి మార్గంలో పరిరక్షించే లక్ష్యంతో ప్రస్తుత వ్యవహారాల స్థితిగతులకు సరిపడేటట్టి ప్రజాస్వామ్య దిశగా పరివర్తన చెందుతుంది. 'రాజకీయం' అనే భావన యొక్క పరిధులు విస్తరించబడి, నిజమైన సామాజిక తాత్పర్యం సంపాదించుకుంటుంది; కాగా ఆ యా క్షణములందలి ఆచరణీయమైన డిమాండ్లు మరింత ప్రాముఖ్యతను సంపాదించుకుని, ఇప్పుడు వాటి పట్ల చూపబడుతూన్న శ్రద్ధకంటె ఇంకా అధిక శ్రద్ధ చూపబడడం తథ్యమని పరిగణించాల్సి వుంటుంది.

''పాశ్చాత్యంలోని కార్మికోద్యమాభివృద్ధి గమనం యొక్క ఈ సంక్షిప్త వివరణ నుండి రష్యాకు అన్వయించే పర్యవసానాలు గ్రహించడం ఏమంత కష్టం కాదు. రష్యాలో కనిష్ఠ నిరోధక పథం రాజకీయ క్రియాకలాపం వైపు ఎన్నటికీ మొగ్గదు. భరింప దుస్సాధ్యమగు రాజకీయ పీడన తనను గురించే అందరూ హెచ్చుగా మాట్లాడేటట్టే చేసి, అచ్చంగా ఆ సమస్యపైనే దృష్టి అంతా సాంద్రీకృత మయేటట్టు

*పథకామాత్రంగా — అనువాదకుడు.

చేస్తుందే గాని, ఆచరణీయమైన క్రియాకలాపాన్ని ఎన్నటికీ ప్రోత్సహించదు. పాశ్చాత్యంలో కార్మికులు రాజకీయ క్రియాకలాపంలోకి ఆకర్షించబడడం ఫలితంగా వారిలో వుండిన బలహీన శక్తులు మరింత బలపడి దృఢపడగా, తద్విరుద్ధంగా రష్యాలో ఈ బలహీన శక్తులు రాజకీయ పీడన అనే రాతిగోడను ఎదుర్కోవాల్సి వుంటుంది. ఈ పీడనతో పోరాడేందుకై వారికి ఆచరణీయమైన సాధన సంపత్తి కొరవడడము, తత్ఫలితంగా వారి సొంత అభివృద్ధి సహితము కొరవడడమే కాకుండా, ఈ పీడన వారిని వ్యవస్థాబద్ధంగా అణగదొక్కేసి, ఎదుగు బొదుగులు లేకుండా అధః పాతాళంలోకి అణచి పారేస్తుంది. పాశ్చాత్యయూరపియన్ యోధులకు కీర్తి గడించిపెట్టిన ఆర్గనైజేషనల్ భావానికి మనదేశపు కార్మికవర్గం వారసులు కాలేదన్న విషయం కూడా దీనికి చేర్చితిమా, మనకు లభించే చిత్రణ ఎంతైనా నిరాశాజనకంగా వుంటుంది; ఆ చిత్రణ ఎంత నిరాశాజనకంగా వుంటుందంటే, అదనంగా మరొక్క ఫ్యాక్టరీ గొట్టం లేచిందన్నంత మాత్రాన ఇక అరచేతిలోకి మోక్షం వచ్చేసిందనే నమ్మేటట్టి ఆశావాది-మార్క్సిస్టులలోకల్లా అగ్రగణ్యుడైన అశావాది-మార్క్సిస్టుని సహితమూ నిస్పృహతో క్రుంగదీసేస్తుంది. ఆర్థిక పోరాటం ఇంతా అంతా కాదు, అంతులేనంత కష్టమైనదే అయినప్పటికీ, దానిని సాగించవచ్చు, అంతే కాదు వాస్తవంగా దానిని ప్రజారాసులు తమంతట తామే తమ ఆచరణలో సాగిస్తున్నారు కూడా. ఈ పోరాటంలో ఆర్గనైజకావడం ఎలాగో నేర్చుకోవడం ద్వారానూ, ఈ పోరాట గమనంలో నిరంతరమూ రాజకీయ పరిపాలనా వ్యవస్థతో పడుతూన్న సంఘర్షణను అర్థం చేసుకోవడం ద్వారానూ, కార్మికోద్యమం యొక్క — ఒక విధంగా చెప్పదగిన — ఒక రూపాన్ని రష్యన్ పరిస్థితులకు ఉత్తమంగా సరిపడేటట్టి ఆర్గనైజేషనును, లేదా ఆర్గనైజేషన్లను రష్యన్ కార్మికుడే చిట్టచివరకు రూపొందించుతాడు. ప్రస్తుతం, రష్యన్ కార్మికోద్యమం ఇంకా అమీబా దశలోనే వుండి, ఇంకా ఏ రూపాన్నీ పొందలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు. ఎట్టి ఆర్గనైజేషనల్ రూపమూ లేకుండానే సాగే సమ్మె ఉద్యమాన్ని రష్యన్ ఉద్యమంయొక్క స్ఫటికీకృత రూపంగా వర్ణించేందుకు వీల్లేక పోగా, చట్టవిరుద్ధమైన ఆర్గనైజేషన్లకు కేవలం పరిమాణాత్మక దృక్పథంనుండి సహితమూ (ప్రస్తుత పరిస్థితుల్లో వాటి ఉపయోగం మాట ప్రత్యేకంగా అటుండగా) పరిశీలనార్హమైన విలువ అసలే లేదు.

''పరిస్థితి ఈ విధంగా వుంది. ఈ పరిస్థితికి Streikbrecher*

*స్ట్రైక్‌బ్రెఖర్ — సమ్మెను భగ్నం చేసే. — సం.

తత్వాన్ని సులభతరం చేసేటట్టి కరువుకాటకాన్నీ, గ్రామీణ ప్రాంతపు శైథిల్య ప్రక్రియనూ తదానుషంగికంగా కార్మిక ప్రజారాసులను ఇప్పటికంటె మరికొంత సహింపదగిన సాంస్కృతిక స్థాయికి తీసుకు రావడంలో వున్నట్టి మరింత కష్టాన్నీ జోడించి నట్లయితే... ఇక ఇలాటప్పుడు రష్యన్ మార్క్సిస్టు చేసేదేమిటి?! కార్మికుల స్వతంత్ర రాజకీయ పార్టీ గురించి చెప్పే మాటలన్నీ కేవలం విదేశీయ లక్ష్యాలనూ విదేశీయ పర్యవసానాలనూ మన గడ్డను నాటే ప్రయత్నంనుండి ఉప్పతిల్లినవే తప్ప అంతకంటె మరేమీ కాదు. ఇంతవరకూ రష్యన్ మార్క్సిస్టును చూస్తే పాపం జాలేవేస్తుంది. ఆచరణకు సంబంధించినంత వరకూ అతని ఈనాటి లక్ష్యాలు వుత్త పనికిమాలినవి; ఇక అతని సైద్ధాంతిక విజ్ఞానానికి, దానినతడు పరిశోధనకు ఒక పరికరంగా కాకుండా కార్యాచరణకు ఒక పథకంగా వినియోగించుతూన్న మేరకు, ఈ పనికిమాలిన ఆచరణీయ లక్ష్యాల సాధనకైనా ఎట్టి విలువ సహితమూ లేకుండా వుంది. అంతే కాకుండా, ఈ ఎరవు తెచ్చుకున్న పథకాలు, ఆచరణ దృష్ట్యా హానికరం కూడా. పాశ్చాత్యంలో కార్మికవర్గం రాజకీయ కార్యరంగం మీద ప్రవేశించిననాటికి అప్పటికప్పుడే రంగమంతా తేటపడిందన్న సంగతి మన మార్క్సిస్టులు మర్చిపోయి, సమాజంలోని కడమ అన్ని కార్మికేతర స్తరాలకు చెందిన రాడికల్, లేదా లిబరల్ ప్రతిపక్ష క్రియాకలాపం పట్ల వారు మరీ తృణీకార భావం ప్రదర్శిస్తున్నారు. లిబరల్ స్వభావం కలిగినట్టి ఎట్టి బహిరంగ ప్రదర్శన పట్లనూ దృష్టిని సాంద్రీకరించడానికి జరిగే ఏ పిసరంత ప్రయత్నమైనా సరే సనాతన మార్క్సిస్టుల నిరసనను రేకెత్తించుతూంది. పాశ్చాత్య యూరపియన్ మార్క్సిస్టులం కావడానికి బహుళ సంఖ్యాకములైన చారిత్రాత్మక సందర్భాలు మనకి ఆటంకం కల్గిస్తున్నాయనీ, రష్యన్ పరిస్థితులకు ప్రయుక్తం కాగల్గేటట్టీ అవసరమయేటట్టీ విభిన్న మార్క్సిజాన్ని ఈ చారిత్రాత్మక సందర్భాలు మననుండి కోరుతున్నాయనీ ఈ సనాతన మార్క్సిస్టులు మర్చిపోతున్నారు. ప్రతి రష్యన్ పౌరునిలోనూ రాజకీయ అనుభూతీ, జ్ఞానమూ కొరవడుతూందనీ, రాజకీయాల గురించి ఎన్ని కబుర్లు చెప్పినప్పటికీ, అతనిలో అభావమైన శక్తికి ఎంత విజ్ఞప్తి చేసినప్పటికీ ఈ కొరతకు పరిహారం కాజాలదన్న విషయం ప్రత్యక్షమే. ఈ రాజకీయ జ్ఞానం కేవలం శిక్షణ వల్లనే, అనగా రష్యన్ పరిస్థితులవల్ల ఏర్పడుతూన్న జీవితంలో (ఇది ఎంత మార్క్సిస్టు వ్యతిరేకంగా వున్నప్పటికీ కూడా) పాల్గొనడం వల్లనే అలవడుతుంది. పాశ్చాత్యంలో 'అభావం' ఎంత (తాత్కాలికంగా) సమంజసమే అయి వుండినప్పటికీ, రష్యాలో మాత్రం ఇది హానికరం; కారణమేమంటే అర్గనైజుకాబడినట్టి, నిజమైన శక్తిని కలిగినట్టి ఏదైనా

ఒకదానినుండి బయలు వెడలే అభావం ఒకటీ, ఆర్గనైజేషను రహితమైనట్టీ చెల్లా చెదరై వున్నట్టీ వ్యక్తుల రాశినుండి బయలు వెడలే అభావం కేవలం వేరొకటీనీ.

''ఇందులోనుండి బయటపడడానికి రష్యన్ మార్క్సిస్టుకు కేవలం ఒకే ఒక మార్గం వుంది: శ్రామికవర్గ ఆర్థిక పోరాటంలో సహాయపడి, లిబరల్స్‌యొక్క ప్రతి పక్ష క్రియాకలాపంలో అతడు పాల్గొనడమే. 'అభావవాది'గా రష్యన్ మార్క్సిస్టు చాలా ముందుగానే రంగం మీద ప్రవేశించాడు, కాగా ఈ భావం అతని శక్తిలో రాజకీయ రాడికలిజమ్ దిశగా మరలి వుండవలసినట్టి భాగాన్ని బలహీనపరచేసింది. ప్రస్తుతానికి మాత్రం ఇదేమంత ఘోరమైనదేమీ కాదు: కాని వర్గ పథకం గనుక రష్యన్ మేధావిని జీవితంలో క్రియాశీలమైన పాలు తీసుకోకుండా ఆటంకపరచి, ప్రతిపక్షపు సర్కిల్స్ నుండి పూర్తిగా దూరం చేసినట్టయితే, చటబద్ధమైన రూపాలకొరకు రాజకీయ కర్తవ్యాలను ముందుకు తీసుకురానట్టి కార్మికవర్గం నుండి విడిగా పోరాడవలసిన వారందరికీ ఇది ప్రమాదభరితమైన నష్టంగా పరిణమించుతుంది. రాజకీయ విష యాలపై రష్యన్ మార్క్సిస్టు మేధావియొక్క మానసిక హేతువాదాల వెనుక దాగివున్న రాజకీయ నిష్కాపట్యం అతనిని ఎంతటి ప్రమాదంలోకైనా దించవచ్చు.''

ఈ అభిప్రాయలతో ఏకీభవించుతూన్నట్టి రష్యన్ సోషల్-డెమోక్రాట్లు చాలా మంది వున్నారో లేదో మాకు తెలియదు. కాని ఇటువంటి అభిప్రాయాలు అవలంబించేవారు వున్నారనడం నిస్సందేహమే. అందుచేత ఇట్టి అభిప్రాయాలకు ప్రతికూలంగా మా నిరసన రూఢిగా తెల్పడమూ, తానిదివరకే నిర్ణయించుకున్నట్టి మార్గం నుండి, అనగా శ్రామికవర్గ పోరాటంనుండి ప్రత్యేకింప దుస్సాధమైనట్టీ, రాజకీయ స్వేచ్ఛను జయించుకోవడమే తన తక్షణ కర్తవ్యంగా కల్గి వుండబోయేటట్టీ కార్మికుల స్వతంత్ర రాజకీయ పార్టీని ఆర్గనైజు చేసుకోవడమనే కార్యం నుండి, రష్యన్ సోషల్-డెమోక్రసీ మళ్లించబడే ప్రమాదం గురించి కామ్రేడ్లు నందరినీ హెచ్చరించడమూ మా కర్తవ్యమని భావిస్తున్నాం.

పైన ఉల్లేఖితమైన "credo" రెండు విషయాలు తెలియజెప్పతూంది: మొదటిది, ''పాశ్చాత్యంలోని కార్మికోద్యమాభివృద్ధి గమనం యొక్క సంక్షిప్త వివరణ''; రెండవది, ''రష్యాకు అన్వయించే పర్యవసానాలు.''

పాశ్చాత్య యూరప్‌లోని కార్మికోద్యమ చరిత్ర గురించి "credo" రచయితలు పూర్తిగా తప్పు భావన కలిగి వున్నారు. పాశ్చాత్య యూరప్‌లోని కార్మికవర్గం రాజకీయ స్వేచ్ఛకై పోరాటంలోనూ, రాజకీయ విప్లవాల్లోనూ పాల్గొనలేదనడం ఎంత మాత్రమూ సత్యం కాదు. చార్టిస్టు[49] ఉద్యమ చరిత్ర, 1848 లో ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియాలలో

జరిగిన విప్లవమూ తద్విరుద్ధాన్ని నిరూపిస్తున్నాయి. ''మార్క్సిజం ఆనాడు వ్యాప్తిలో వున్న ఆచరణయొక్క అనగా, ఆర్థిక పోరాటంపై ప్రాబల్యం వహించినట్టి రాజకీయ పోరాటంయొక్క సైద్ధాంతిక వ్యక్తీకరణ'' అని చెప్పడం కేవలం అసత్యమే అవుతుంది. తద్విరుద్ధంగా రాజకీయేతర సోషలిజం (ఓవెనిజమ్, ''ఫోరియరిజమ్'', ''వాస్తవిక సోషలిజం''[50]) వ్యాప్తిలో వున్నప్పుడే ''మార్క్సిజం'' ప్రాదుర్భవించింది; కాగా రాజకీయేతర సోషలిజముకు ప్రతికూలంగా ''కమ్యూనిస్టు ప్రణాళిక'' తక్షణమే ధ్వజమెత్తింది. సిద్ధాంతంతో సంపూర్ణంగా సాయుధమై (''పెట్టుబడి'' గ్రంథం) మార్క్సిజం రంగంపై ప్రవేశించి, ప్రసిద్ధిగాంచిన ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్‌ను [అంతర్జాతీయ కార్మికుల సంఘం] ఆర్గనైజు చేసినప్పుడు సహితమూ నాడు వ్యాప్తిలో వుండిన ఆచరణ రాజకీయ పోరాటం కానే కాదు (సంకుచితమైన ట్రేడ్‌యూనియనిజం ఇంగ్లండులోనూ, అరాజకవాదమూ, ప్రూడనిజం లాటిన్ దేశాలలోనూ). లిబరల్ బూర్జువా వర్గం తోకగా వుండినట్టి కార్మిక వర్గాన్ని స్వతంత్రమైన రాజకీయ పార్టీగా రూపొందించడంలోనే జర్మనీలో లాసాల్ కావించిన మహత్తర చారిత్రక సేవ వుంది. కార్మికవర్గంయొక్క ఆర్థిక, రాజకీయ పోరాటాలను అవిభాజ్యమైనట్టి ఏకత్వంగా ఒకదానితో ఒకటి మేళవించింది మార్క్సిజం; కాగా పోరాటం యొక్క విభిన్న రూపాలను ఒకదానినుండి ఒకటి విడదీసే "credo" రచయితల యత్నం, మార్క్సిజంనుండి వారి అత్యంత నిరర్థకమైనట్టి విచారకరమైనట్టి విడిపోవడములలో ఒకటి.

అదీ కాకుండా, పాశ్చాత్య యూరపియన్ కార్మికోద్యమం యొక్క ప్రస్తుత స్థితి గురించీ, ఏ పతాక కిందనైతే ఆ ఉద్యమం పురోగమించుతూందో అట్టి మార్క్సిజంయొక్క సిద్ధాంతం గురించీ ''credo'' రచయితలకు పూర్తిగా తప్పు భావన వుంది. ''మార్క్సిజంలో సంక్షోభం'' గురించి మాట్లాడడమంటే, సోషలిస్టులలో వుండే భేదాలు ప్రతిదానినీ గోరంతలు కొండంతలు చేసి ప్రతిదానిని పార్టీలో ఒక చీలికగా చిత్రించడానికే తమ శక్తివంచన లేకుండా పాటుపడుతూన్నట్టి కిరాయి రాతగాళ్ల అసందర్భాలను కేవలం పునశ్చరణ చేయడమన్న మాటే. అప్రతిష్ఠ పాలైన బెర్న్‌స్టయినిజం — సాధారణ ప్రజలూ, ప్రత్యేకంగా "credo" రచయితలూ మామూలుగా అర్థంచేసుకుంటూన్నదాని ప్రకారం — మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కుంచించడానికీ, విప్లవాత్మక కార్మిక పార్టీని ఒక రిఫార్మిస్టు* పార్టీగా మార్చివేయడానికీ చేసే యత్నమే. అనుకున్నట్టుగానే, ఈ యత్నం జర్మన్ సోషల్-డెమోక్రాట్లలో అధిక సంఖ్యాకులచే తీవ్రంగా ఖండించబడింది. జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సాధారణ సభ్యులలో అవకాశవాద ధోరణులు ఒకసారి కాదు,

---

* సంస్కరణతత్వపు — అనువాదకుడు.

అనేకసార్లే బయలుపడ్డాయి; కాగా విప్లవాత్మక అంతర్జాతీయ సోషల్-డెమో(క్రసీయొక్క నియమాలను భక్తితో కాపాడుతూన్నట్టి పార్టీచే ఈ ధోరణలు ప్రతిసారీ నిరాకరించబడ్డాయి కూడా. అవకాశవాద అభిప్రాయాలను రష్యాలో నాటడానికి చేసే ప్రయత్నాన్ని రష్యన్ సోషల్-డెమోక్రాట్లలోని బ్రహ్మాండమైన అత్యధిక సంఖ్యాకవర్గం కృతనిశ్చయంతో తిప్పికొడుతుందనే మేం నమ్ముతున్నాం.

ఇదే విధంగా, "credo" రచయితలు ఎంత చెప్పినప్పటికీ, పాశ్చాత్య యూరప్‌లోని కార్మికుల పార్టీల "ఆచరణీయ క్రియాకలాపాలలో సమూలమైన మార్పు" గురించి సూచనకైనా ఏమాత్రపు అవకాశమూ లేదు: ఆర్థిక పోరాటంయొక్క బృహత్తర ప్రాముఖ్యత, అట్టి పోరాటంయొక్క ఆవశ్యకత ఆదినుండీ కూడా మార్క్సిజంచే గుర్తించబడింది. అప్పటికప్పుడే 1840 లలోనే, ఈ పోరాట ప్రాముఖ్యతను నిరాకరించిన ఊహాజనిత సోషలిస్టులను మార్క్స్, ఎంగెల్స్‌లు వాదప్రతివాదాలతో[6] ప్రతిఘటించారు.[51]

ఇరవై సంవత్సరాల తరువాత ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్ [అంతర్జాతీయ కార్మికుల సంఘం] స్థాపించబడినప్పుడు, 1866 లో జినీవాలో జరిగిన ఈ సంఘం మొదటి కాంగ్రెస్‌లోనే, ట్రేడ్‌యూనియన్లయొక్క, ఆర్థిక పోరాటంయొక్క ప్రాముఖ్యతను గురించిన ప్రశ్న తీసుకురాబడింది. ఆ కాంగ్రెస్‌లో ఆమోదించిన తీర్మానం, ఆర్థిక పోరాట ప్రాముఖ్యతనూ కచ్చితంగా చెప్పి, ఇటు దాని ప్రాముఖ్యతను అతిశయోక్తులతో చెప్పకూడదనీ (అప్పట్లో ఇంగ్లీషు కార్మికుని వైఖరి దీనివైపు మొగ్గు చూపేదిగా వుండేది), అటు దాని ప్రాముఖ్యతను తక్కువ అంచనా కట్టకూడదనీ (ఫ్రెంచివాళ్ల వైఖరీ, జర్మన్ల, ప్రత్యేకంగా లాసాలియన్ల, వైఖరీ దీనివైపు మొగ్గు చూపేటట్టిదిగా వుండేది) సోషలిస్టులనూ కార్మికులనూ హెచ్చరించింది. పెట్టుబడిదారీ విధానంలో ట్రేడ్‌యూనియన్లు నియమబద్ధమైనవే కాకుండా ఒక అనివార్యమైన దృగ్విషయమేనని ఆ తీర్మానం ఉద్ఘాటిస్తూ, పెట్టుబడికి వ్యతిరేకంగా కార్మికవర్గం సాగించుతూన్న దైనందిన పోరాటంలో కార్మికవర్గాన్ని ఆర్గనైజు చేయడానికీ, వేతన శ్రమను అంతం చేయడానికీ అత్యంత ముఖ్యమైన సాధనంగా కూడా వీటిని పరిగణించింది. ట్రేడ్‌యూనియన్లు వాటి దృష్టిని ప్రత్యేకంగా "పెట్టుబడి వ్యతిరేకమైన తక్షణ పోరాటం" పైనే సారించకూడదనీ, కార్మికవర్గం యొక్క సాధారణ రాజకీయ, సాంఘిక ఉద్యమానికి దూరంగా వుండకూడదనీ, ఆ తీర్మానం ఉద్ఘాటించింది; ట్రేడ్‌యూనియన్లు "సంకుచిత" లక్ష్యాలను అనుసరించకూడదనీ, అంతేకాకుండా కోట్లాది పీడిత శ్రమజీవుల సార్వజనీన విముక్తికై పాటుపడాలనీ ఆ తీర్మానం ఉద్ఘాటించింది. ఆనాటి నుండి వివిధ దేశాలలోని కార్మికుల పార్టీలు ఫలానా నిర్దిష్ట తరుణమందు శ్రామికవర్గం యొక్క ఆర్థిక పోరాటానికి ఎక్కువ శ్రద్ధ వినియోగించాలా, లేక శ్రామికవర్గం యొక్క రాజకీయ

పోరాటానికి ఎక్కువ శ్రద్ధ వినియోగించాలా అనే ప్రశ్నను పలుసార్లు చర్చించాయి, సహజంగానే ఇంకా పదేపదే చర్చించుతాయి కూడానూ. కాని ఈ సాధారణ, లేదా సూత్రప్రాయమైన ప్రశ్న మార్క్సిజం ఏ విధంగా ప్రదర్శించిందో నేటికీ ఆలాగే వుంది. రాజకీయ, ఆర్థిక పోరాటాలను రెండింటినీ వర్గపోరాటం మిళితంచేసి తీరాలనే నమ్మకం అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీకి చీము రక్తంగా వొంటబట్టిపోయాయి. స్వేచ్ఛ లేకపోవడం వల్లనూ, లేదా శ్రామిక వర్గానికి రాజకీయ హక్కులు కుంచించి వేయడం వల్లనూ రాజకీయ పోరాటాన్నే రంగంలో అన్నిటికంటె ముందు వుంచవలసిన అవసరం ఎల్లప్పుడూ కలుగుతుందని చరిత్రానుభవం నిరాక్షేపణీయంగా రుజువు చేస్తూంది.

ఇతర ప్రతిపక్ష పార్టీల పట్ల కార్మికుల పార్టీ వైఖరిలో ప్రగాఢమైన మార్పు వుండాలనే సూచనకు అసలు అంతకంటేనూ తావులేదు. ఈ విషయంలో కూడా మార్క్సిజం రాజకీయాల ప్రాముఖ్యతను మరింతగా అతిశయోక్తులతో చెప్పడమునకూ, కుట్రతత్వానికీ (బ్లాంకీజమ్ వగైరాలకు), రాజకీయాలను నిర్దేశించుతూనో, లేదా వాటిని అవకాశవాదతత్వ, సంస్కరణవాదతత్వ, సామాజిక మరమ్మతు తత్వం (అరాచకవాద, ఊహాజనిత, పెట్టీబూర్జువా సోషలిజం, ప్రభుత్వ సోషలిజం, యూనివర్సిటీ ప్రొఫెసర్ల సోషలిజం, వగైరాలు) కింద దిగజార్చివేయడమునకూ ఆమడ దూరాన వున్నట్టి యథార్థమైన మార్గాన్నే సూచించింది. సోషలిస్టు సమాజాన్ని ఆర్గనైజుచేసే ఉద్దేశంతో రాజకీయాధికారాన్ని శ్రామికవర్గం హస్తగతం చేసుకోవడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవలసినట్టి కార్మికుల స్వతంత్ర రాజకీయ పార్టీలను ఏర్పరచుకోవడానికి శ్రామికవర్గం పాటుపడాలి. శ్రామికవర్గం కడమ వర్గాలనూ పార్టీలనూ ''ఏకంగా ఒక అభివృద్ధి నిరోధక రాశి''[52] కింద కట్టేయకూడదు. తద్విరుద్ధంగా యావత్తు రాజకీయ, సామాజిక జీవితంలోనూ అది పాల్గొనాలి, అభివృద్ధి నిరోధక వర్గాలనూ పార్టీలనూ ప్రతిఘటించుతూన్న అభ్యుదయ వర్గాలనూ పార్టీలనూ బలపర్చాలి, ప్రస్తుత వ్యవస్థను వ్యతిరేకించుతూన్న ప్రతి విప్లవోద్యమాన్నీ బలపర్చాలి, ప్రతి పీడిత జాతి, లేదా తెగయొక్క, హింసకులోనైన ప్రతి మతం యొక్క, హక్కులులేని స్త్రీజాతి వగైరాల యొక్క ప్రయోజనాల తరపున పోరాడాలి. ఈ విషయమై "credo" రచయితలు తెచ్చిన వాదనలు శ్రామికవర్గ పోరాటం యొక్క వర్గ స్వభావాన్ని మరుగు పరచాలనేటట్టి, అర్థంలేని ''సమాజాన్ని గుర్తించడం'' తో ఈ పోరాటాన్ని బలహీనపరచి విప్లవాత్మక మార్క్సిజాన్ని ఒక మామూలు సంస్కరణవాద ధోరణిగా దిగజార్చి వేసేటట్టి వాంఛనే కేవలం బయలుపెడుతున్నాయి. రష్యన్ సోషల్-డెమోక్రాట్లలో బ్రహ్మాండమైన అత్యధికసంఖ్యాకవర్గం సోషల్-డెమోక్రసీ మౌలిక సూత్రాలను ఈవిధంగా వక్రీకరించడమును నిస్సందేహంగా తిరస్కరించుతుందనే మేం విశ్వసిస్తున్నాం. పాశ్చాత్య యూరప్‌లోని కార్మికోద్యమం విషయమై "credo"

రచయితల పొరపాటు ఆధారవాక్యాలు, మరింత పొరపాటైన ''రష్యాకు అన్వయించే పర్యవసానాలు'' వారు సూచించడానికే దారితీశాయి.

రష్యన్ కార్మికవర్గం ''ఇంతవరకూ రాజకీయ కర్తవ్యాలను ముందుకు తీసుకురాలేదు'' అనే ఉద్ఘాటన, రష్యన్ విప్లవోద్యమం గురించి అజ్ఞానాన్నే కేవలమూ బయట పెట్టుతూంది. 1878 లో స్థాపించబడినట్టి ''ఉత్తర రష్యన్ కార్మిక సంఘమూ,''[53] 1875 లో స్థాపించబడినట్టి ''దక్షిణ రష్యన్ కార్మిక సంఘమూ''[54] వాటి కార్యక్రమాలలో రాజకీయ స్వేచ్ఛ డిమాండును ముందుకు తీసుకొచ్చాయి. 1880 లనాటి అభివృద్ధి నిరోధకం తరువాత, 1890 లలో ఇదే డిమాండును కార్మికవర్గం పదేపదే ముందుకు తీసుకొస్తూ వచ్చింది. ''కార్మికుల స్వతంత్ర రాజకీయ పార్టీ గురించి చెప్పే మాటలన్నీ కేవలం విదేశీయ లక్ష్యాలనూ విదేశీయ పర్యవసానాలనూ మన గడ్డను నాటే ప్రయత్నం నుండి ఉత్పత్తిల్లినవే తప్ప అంతకంటే మరేమీ కాదు'' అనే ఉద్ఘాటన, రష్యన్ కార్మిక వర్గ పాత్రనూ, రష్యన్ సోషల్-డెమోక్రసీ యొక్క అత్యంత ప్రాణాధారమైన కర్తవ్యాలనూ అర్థం చేసుకోవడంలో పూర్తి విఫలతనే బయటపెట్టుతూంది. మార్క్సిస్టులు ''పాల్గొనడం''తో సహా ''ప్రతిపక్ష లిబరల్ మూలద్రవ్యాలు'' ''చట్టబద్ధమైన రూపాల''కోసం పోరాడుతూండగా, కార్మికవర్గం ''కనిష్ఠ నిరోధక పథం'' అవలంబించుతూ, ఆర్థిక పోరాటానికే పరిమితమై వుండాల్సిందనే అభిప్రాయంవైపు "credo" రచయితల కార్యక్రమం మొగ్గుతూన్నట్టు ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. ఇటువంటి కార్యక్రమాన్ని అన్వయించడమంటే రష్యన్ సోషల్-డెమోక్రసీకి రాజకీయంగా ఆత్మహత్యాసదృశమే అయి, రష్యన్ కార్మికోద్యమాన్నీ రష్యన్ విప్లవోద్యమాన్నీ (ఈరెండు భావనలూ మనకి సారూప్యములే) అపరిమితంగా ఆలస్యపరచి నైచ్యపరచడమే అవుతుంది. ఈ దిగువ సూచించబడిన భవితవ్యం సాధ్యమే కావచ్చునని, రష్యన్ సోషల్-డెమోక్రసీ ప్రథమ యోధులలో ఒకడైన పి.బి. అక్సెల్‌రోడ్ 1897 అంత్యమందు వెలిబుచ్చిన భయాందోళన ఎంత సకారణమైనదో, ఇటువంటి కార్యక్రమం ఒకటి బయటకు వచ్చే అవకాశం కలిగిందన్న కేవల విషయమే తెలియజేస్తూంది:

> ''కార్మికులకూ యజమానులకూ మధ్య కలిగే కేవలం ఆర్థిక విరోధాల ఇరుకు గాడికే కార్మికవర్గ ఉద్యమం పరిమితమై సాగుతూంది; కాగా, రాజకీయ స్వేచ్ఛకై పోరాటంలో మేధావిస్తరం అని పిలువబడుతూన్న వారి విప్లవ సర్కిల్స్‌నూ, గ్రూపులనూ శ్రామికవర్గపు పురోగామి స్తరములు అనుసరిస్తూన్నప్పటికీ, మొత్తంగా తీసు

కుంటే ఈ ఉద్యమం రాజకీయ స్వభావం కల్గినది కాదు." (అక్సెల్‌రోడ్, "రష్యన్ సోషల్-డెమోక్రాట్ల ప్రస్తుతకర్తవ్యాలూ, ఎత్తుగడలూ," జినీవా, 1898, 19 వ పుట).

"Credo" లో ఉద్ఘాటించబడిన అభిప్రాయ సముచ్ఛయాని కంతటికీ ప్రతికూలంగా రష్యన్ సోషల్-డెమోక్రాట్లు నిష్కర్షయైన యుద్ధం ప్రకటించి తీరాలి; విందుచేతంటే ఈ భవితవ్య సిద్ధికే ఈ అభిప్రాయాలు సూటిగా దారితీస్తాయి. పి. బి. అక్సెల్‌రోడ్ ఈ దిగువ మాటలలో సూచించినట్టి వేరొక భవితవ్యాన్ని యథార్థం కావించేందుకై రష్యన్ సోషల్-డెమోక్రాట్లు తమ యావచ్ఛక్తినీ వినియోగించాల్సి వుంటుంది:

"రెండో భవితవ్యం: పాక్షికంగా బూర్జువావర్గపు విప్లవాత్మక గ్రూపులతో (అటువంటివి వుండే పక్షమందు) బుజాలు కలిపిన్నీ, మిత్రత్వంతోనూ పాక్షికంగా మేధావిస్తరంలోని అత్యంత ప్రజాతంత్ర స్వభావం కల్గిన విప్లవాత్మక మూలద్రవ్యాలను సూటిగా తన శ్రేణులలోకి ఆకర్షించడం ద్వారా గాని, లేదా వాటిని ఉత్సహించడం ద్వారా గాని, స్వేచ్ఛకోరకై పోరాడే స్వతంత్ర రాజకీయ పార్టీగా రష్యన్ శ్రామికవర్గాన్ని సోషల్-డెమోక్రసీ ఆర్గనైజు చేస్తుంది." (అదే గ్రంథం, 20 వ పుట).

పి.బి. అక్సెల్‌రోడ్ పైవాక్యాలను రాసిన కాలంనాటికే రష్యాలోని సోషల్-డెమోక్రాట్లలో బ్రహ్మాండమైన అత్యధికసంఖ్యాక వర్గం ఈ దృక్పథాన్నే అవలంబించిందని వారు చేసిన ఉద్ఘాటనలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి. "రబోచయ మీస్ల్" అనే ఒక సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మిక పత్రిక "credo" రచయితల అభిప్రాయాల వైపు మొగ్గుతూన్నట్టు కనబడిన మాట నిజమే. తన కార్యక్రమాన్ని వివరించుతూన్నట్టి ఒక ప్రధాన వ్యాసంలో (నెం. 1, అక్టోబరు 1897), "రాజకీయ ఆదర్శాన్నే నిరంతరం మనస్సులో వుంచుకుందుకు కావించే ప్రయత్నంవల్ల ఉద్యమంయొక్క ఆర్థిక ప్రాతిపదిక" మరుగున పడిపోవచ్చునటట్టి, సోషల్-డెమోక్రసీకి కేవలమూ విరుద్ధమైన పొరపాటు అభిప్రాయాన్ని దుర దృష్టవశాత్తూ ప్రకటించింది. అయినప్పటికీ అదే సమయంలో మరొక సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మిక పత్రిక "సెంట్ పీటర్స్‌బర్గ్ రబోచియ్ లిస్తోక్" (నెం. 2, సెప్టెంబరు 1897), "దృఢమైన ఆర్గనైజేషను కలిగినట్టిన్నీ సభ్యత్వసంఖ్యదృష్ట్యా బలోపేతమైనట్టిన్నీ కార్మిక వర్గ పార్టీ వల్లనే... నిరంకుశత్వాన్ని కూలదోయడం సాధ్యపడుతుంద"నీ, కాగా "పటిష్ఠమైన పార్టీలో ఆర్గనైజు కాబడినట్టి" కార్మికులు, "రాజకీయ, ఆర్థిక పీడన అంతటినుండి

వారినీ, రష్యానంతటినీ విముక్తి" చేయగల్గుతారనే అభిప్రాయాన్ని గట్టిగా వ్యక్తపరచింది. మూడవది, ఇంకొక పత్రిక "రబోచయ గజేత", తన నెం. 2 వ సంచికలోని (నవంబరు 1897) ప్రధానవ్యాసంలో ఈ విధంగా రాసింది: "రాజకీయ స్వేచ్ఛకై నిరంకుశ ప్రభుత్వంతో పోరాటమే రష్యన్ కార్మికోద్యమం యొక్క తక్షణ కర్తవ్యం." "ఒకేపేరు కల్గి, దృఢంగా మలచబడిన ఆర్గనైజేషను కల్గినట్టి ఒకే ఒక అవిభాజ్యమైన సముదాయంగా పైకి వచ్చినట్టయితే, రష్యన్ కార్మికోద్యమం తన శక్తులను పదింతలు ఇనుమడింప జేసుకుంటుంది..." "విడివిడిగా వుంటూన్న కార్మిక సర్కిల్స్ ఒక ఉమ్మడి పార్టీగా కలిసిపోవాలి." "రష్యన్ కార్మికుల పార్టీ ఒక సోషల్-డెమోక్రాటిక్ పార్టీ అవుతుంది." ఇంతేకాకుండా, "రబోచయ గజేత" అభిప్రాయాలతోనే సరిగ్గా రష్యన్ సోషల్-డెమోక్రాట్లలో బ్రహ్మాండమైన అధికసంఖ్యాక వర్గం ఏకీభవించినట్టు, 1898 వసంతంలో జరిగిన రష్యన్ సోషల్-డెమోక్రాట్ల కాంగ్రెస్, "రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీ"ని స్థాపించి, దాని ప్రణాళికను ప్రచురించి, "రబోచయ గజేత" పత్రికను అధికారయుత పార్టీ పత్రికగా గుర్తించిందన్న విషయం నుండి కూడా స్పష్టంగా వ్యక్తమవుతూంది. ఈ విధంగా రష్యన్ సోషల్-డెమోక్రసీ ఇప్పటికే సాధించినట్టీ, "రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీ ప్రణాళికలో" వ్యక్తపరచినట్టీ అభివృద్ధి దశనుండి "credo" రచయితలు ఒక బ్రహ్మాండమైన వెనకంజ వేస్తున్నారు. పార్టీ క్రియాకలాపం తాత్కాలికంగా తగ్గిపోయినట్టీ, దాని అధికారయుత పత్రిక ఆగిపోయినట్టీ ఈ ప్రస్తుతపు పరిస్థితికి, రష్యన్ ప్రభుత్వంయొక్క ఉన్మాదపూరిత హింసా విధానమే దారితీసింది కాబట్టే, యావచ్ఛక్తినీ వినియోగించి పార్టీని ఎంత పటిష్ఠవంతంగా దృఢపరచుటకు వీలుంటుందో అంత పటిష్ఠవంతంగా దృఢపరచడమూ, పార్టీ కార్యక్రమాన్ని తయారుచేసి, పార్టీ యొక్క అధికారయుత పత్రికను పునరుజ్జీవింప జేయడమూ అందరి సోషల్-డెమోక్రాట్ల కర్తవ్యం. పైన ఉదాహరించిన "credo" లాంటి కార్యక్రమాలు తలెత్తగల్గాయనే విషయం వల్ల రుజువు కాబడుతూన్నట్టి చింతనా డోలాయమానాల దృష్ట్యా, "ప్రణాళిక" లో వ్యక్తీకరించబడినట్టీ, రష్యన్ సోషల్-డెమోక్రసీకి బృహత్తర ప్రాముఖ్యతను కలిగివున్నట్టీ ఈ దిగువ పొందుపరచబడిన మౌలిక సూత్రాలను నొక్కిచెప్పడం ఎంతైనా అవసరమని మేం భావిస్తున్నాం: మొదటిది: "ఆర్గనైజు కాబడిన కార్మికప్రజారాసుల వర్గ ఉద్యమమై వుండి, ఆ విధంగానే ఎల్లప్పుడూ వుండాలనీ" రష్యన్ సోషల్-డెమోక్రసీ "ఆకాంక్షిస్తూంది." దీన్నిబట్టి సోషల్-డెమోక్రసీ యొక్క దీక్షావాక్యం ఈ విధంగా వుండాలని తేటతెల్లమవుతూంది: కార్మికులకు వారి ఆర్థిక పోరాటంలోనే కాకుండా, రాజకీయ పోరాటంలో కూడా సహాయం; తక్షణ ఆర్థికావసరాల సందర్భంలోనే కాకుండా, రాజకీయ పీడన అన్ని రూపాల సందర్భంలోనూ కూడా ఆందోళన; శాస్త్రీయ సోషలిస్టు భావాలకే

కాకుండా, ప్రజాస్వామ్య భావాలకుకూడా ప్రచారం. విప్లవాత్మక మార్క్సిజం ఒక్కటే కార్మిక వర్గోద్యమ పతాక కాగలదు; కాగా ఈ సిద్ధాంతంయొక్క తదుపరి అభివృద్ధి గురించీ, అను సరణ గురించీ రష్యన్ సోషల్-డెమోక్రసీ జాగ్రత్త తీసుకుని, ''ఫాషనబుల్ సిద్ధాంతాలు'' (రష్యాలో విప్లవాత్మక సోషలిజం సాధించిన విజయాలు మార్క్సిజాన్ని అప్పుడే ఒక ''ఫాషనబుల్'' సిద్ధాంతంగా చేసేశాయి) తరచుగా గురికాబడుతూన్నట్టి వికృతీకరణ, అపభ్రంశీకరణల నుండి దీనిని కాపాడాల్సి వుంటుంది. ఫ్యాక్టరీ, గని కార్మికుల మధ్య ఇప్పుడు సాగించుతూన్న క్రియాకలాపాలపైన తమ యత్నాల నన్నిటినీ సాంద్రీకరించుతూనే, ఉద్యమ విస్తరణతో పాటుగా, తాము ఆర్గనైజు చేస్తూన్న కార్మిక ప్రజా రాసుల శ్రేణులలోకి గృహ పరిశ్రమ కార్మికులనూ, చేతిపనివారినీ, వ్యవసాయ కార్మికులనూ, ఇంకా చితికిపోయి వస్తు లతో మాడిపోతూన్న లక్షలాది రైతులనూ తీసుకురావాల్సి వుంటుందన్న సంగతి సోషల్-డెమోక్రాట్లు మర్చిపోకూడదు.

రెండవది: ''రాజకీయ స్వేచ్ఛను విజయవంతంగా సాధించడమనే కర్తవ్య భారాన్ని రష్యన్ కార్మికుడు తన భుజస్కంధాలపై వహించాల్సి వుండడమే కాకుండా, వహించి తీరు తాడు కూడా.'' నిరంకుశత్వాన్ని కూలదోయడమే తన తక్షణ కర్తవ్యంగా పెట్టుకుంటుంది కాబట్టి, ప్రజాస్వామిక పోరాటంలో సోషల్-డెమోక్రసీ అగ్రగామిగా వుండేటట్టు పనిచేస్తూ, మరే ఇతర కారణంవల్ల కాకపోయినా తదానుషంగికంగానైనా, రష్యా జనసంఖ్యలోని అన్ని ప్రజాస్వామ్య మూలద్రవ్యాలకూ సర్వవిధాలా తన అండదండలు అందిచ్చి, వాటిని తన మిత్రు లుగా చేసుకోవాలి. నిరంకుశత్వంపై జరిపే ప్రతికూల పోరాటంలో స్వతంత్ర కార్మికవర్గ పార్టీ ఒక్కటే బలిష్ఠమైన కోటబురుజువలె నిలబడగలుగుతుంది; కాగా అటువంటి పార్టీతో మిత్రత్వం నెరపుకోడం వల్లనే, దానికి వత్తాసు ఇవ్వడం వల్లనే రాజకీయస్వేచ్ఛా సమరంలోని ఇతర యోధులందరూ క్రియాశీలమైన పాత్రను నిర్వర్తించగల్గుతారు.

మూడవదీ, కట్టకడపటిదీ: ''ఒక సోషలిస్టు ఉద్యమంగా, ఒక సోషలిస్టు ధోరణిగా, రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ, రష్యాలో ఇంతకుముందు జరిగిన యావత్తు విప్లవో ద్యమ కార్యాన్నీ, సంప్రదాయాన్నీ సాగించుతుంది; మొత్తం పార్టీయొక్క తక్షణ కర్తవ్యాలలోనూ రాజకీయ స్వేచ్ఛను సంపాదించడమే అత్యంత ముఖ్యమైన లక్ష్యమని భావించుతూ, ప్రఖ్యాతివహించిన పూర్వపు 'నరోద్నయ వోల్య' ప్రతినిధులచే అదివరకే విస్పష్టంగా సూచించ బడిన లక్ష్యాభిముఖంగా సోషల్-డెమోక్రసీ పురోగమించుతుంది.'' పార్టీని ఆర్గనైజు చేయడంలోనూ దాని ఆంతరంగిక క్రమశిక్షణను పటిష్ఠవంతం కావించడంలోనూ, కుట్ర విధాన కుశలతకు అవసరమైన సాంకేతికాన్ని అభివృద్ధి పరచడంలోనూ సోషల్-డెమోక్రాట్లు ప్రస్తుత సమయంలో తమ శక్తి నంతటినీ సాంద్రీకరించాల్సి వుంటుందని గతకాలపు యావత్తు

విప్లవోద్యమ సంప్రదాయం కోరుతూంది. స్వల్ప సంఖ్యాకులైన ఆ వీరులను కేవలం సన్నని సామాజిక స్తరాలే బలపరచినప్పటికీ, ఉద్యమ పతాకగా నిలచినట్టి సిద్ధాంతం విప్లవాత్మక సిద్ధాంతం ఏమాత్రమూ కాకపోయినప్పటికీ, గతకాలపు ''నరోద్నయ వోల్య'' ప్రతినిధులు రష్యా చరిత్రలో బృహత్తర పాత్రనే నిర్వర్తించగల్గినప్పుడు, శ్రామికవర్గం యొక్క వర్గ పోరాటంపై ఆధారపడుతూ సోషల్-డెమోక్రసీ కూడా అజేయ శక్తిగా రూపొందడంలో తప్ప కుండా విజయవంత మవుతుంది. ''పెట్టుబడికీ బూర్జువావర్గానికీ ప్రతికూలంగా సోషలిజం యొక్క సంపూర్ణ విజయ సాధనకై ఇంతకంటే అత్యధికమైన శక్తితో పోరాటం కొన సాగించేందుకు నిరంకుశపరిపాలన మోపిన గాటిని రష్యన్ శ్రామికవర్గం తన మూపునుండి తిరుగదోసేసుకుంటుంది.''

పైన ఉల్లేఖితమైన "credo"నూ మా తీర్మానాన్నీ చర్చించాల్సిందనీ, అన్ని అభిప్రాయ భేదాలూ తొలగించబడేందుకు గానూ రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీని ఆర్గనైజుచేసి, పటిష్ఠవంతం చేసే కృషిని త్వరితగతిని సాగించేందుకుగానూ పైన లేవదీయబడిన సమస్యపై నిర్దిష్టమైన అభిప్రాయం వెలిబుచ్చాల్సిందనీ రష్యాలో వున్న అన్ని సోషల్-డెమోక్రాట్ల గ్రూపులనూ, అన్ని కార్మిక సర్కిల్స్‌నూ మేం ఆహ్వానిస్తున్నాం.

గ్రూపులూ, సర్కిల్సూ తమ తీర్మానాలను 1898 రష్యన్ సోషల్-డెమోక్రాట్ల కాంగ్రెస్ నిర్ణయంలోని 10 వ అంశాన్ని అనుసరించి, రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ లోని విభాగమూ, దాని వైదేశిక ప్రతినిధీ అయిన ''దేశాంతర రష్యన్ సోషల్-డెమోక్రాట్ల సంఘానికి'' పంపవచ్చును.

ఆగస్టు – సెప్టెంబరు 1899.

# మన కార్యక్రమం

ఈనాడు అంతర్జాతీయ సోషల్-డెమొక్రసీ మానసికంగా డోలాయమానంలో పడి వుంది. విప్లవ సిద్ధాంతానికి మార్క్స్, ఎంగెల్స్‌ల బోధనలే స్థిరమైన పునాది అని ఇప్పటి వరకూ పరిగణించబడుతూంది; కాని ఈ బోధనలు చాలవనీ పాతబడిపోయాయనీ నాలుగు చెరగులనుండీ ఈనాడు గొంతుకలు వినవస్తున్నాయి. తాము సోషల్-డెమొక్రాట్లమని ఎవరైతే ప్రకటించుకున్నారో, సోషల్-డెమొక్రాటిక్ పత్రికను ప్రచురించాలని ఎవరైతే ఉద్దేశించు తున్నారో అట్టివారిలో ప్రతివ్యక్తీ, జర్మన్ సోషల్-డెమొక్రాట్లను ఒక్కరినే కలత పెట్టు తూందని అనుకోనవసరంలేని ఈ సమస్య పట్ల తన వైఖరిని నిర్దిష్టంగా నిర్వచించి తీరాలి.

మార్క్స్‌యి సిద్ధాంత ప్రాతిపదికపైనే పూర్తిగా మేము మా స్థానం తీసుకుంటున్నాం: ఊహాజగత్తునుండి ఒక శాస్త్రంగా సోషలిజాన్ని అదే మొట్టమొదట రూపొందించింది; ఈ శాస్త్రానికి సుస్థిరమైన పునాదిని అదే మొట్టమొదట నిర్మించింది, ఈ శాస్త్రాన్ని ఇంకా అభివృద్ధి పరచేందుకూ, దాని అన్ని విభాగాలనూ విపులీకరించేందుకూ అవలంబించ వలసిన మార్గాన్ని అదే మొట్టమొదట సూచించింది. పట్టుమని పదిమంది పెట్టుబడిదార్లచే — భూమి, ఫ్యాక్టరీలు, గనులు వగైరాల స్వంతదార్లచే — ఆస్తిలేని కోట్లాది ప్రజలు బానిసలు కావించబడడమును కూలివానికి కిరాయికి పెట్టుకోవడము, శ్రమశక్తిని కొనుగోలు చేయడము ఏ విధంగా మరుగుపరుస్తున్నదీ విశదపరచడం ద్వారా ఆధునిక పెట్టుబడిదారీ విధానపు సారాన్ని అది బట్టబయలు చేసింది. బృహత్ ఉత్పత్తి స్వల్ప ఉత్పత్తిని తరిమివేసే ధోరణిపైపే ఆధునిక పెట్టుబడిదారీ విధానపు యావత్తు అభివృద్ధి ఏ విధంగా మొగ్గుతూందో, సోషలిస్టు సామాజిక వ్యవస్థ సాధ్యమయేందుకు అవసరమగు పరిస్థితులను ఏలా సృష్టించుతుందో అది నిరూపించింది. వేళ్లు తన్ని పాతుకుపోయిన ఆచారాలూ, రాజకీయ కుహకాలూ, గూఢార్థం గల చట్టాలూ, చిక్కులతో కూడుకున్న సిద్ధాంతాలూ, వీటి అడుగున దాగుని వున్న వర్గ పోరాటాన్ని, అన్ని రకాల ఆస్తిపరులవర్గాలతో ఆస్తిలేని ప్రజారాశికి, ఆస్తిలేని వారందరికీ

అగ్రస్థానమందు నిలబడుతూన్న శ్రామికవర్గానికి, జరుగుతూన్న పోరాటాన్ని ఏ విధంగా కనుగొనడమో మనకి బోధించింది. విప్లవాత్మక సోషలిస్టు పార్టీ యొక్క వాస్తవ కర్తవ్యం — సమాజాన్ని పునర్నిర్మించేందుకు పథకాలను తయారు చేయడం గాక, కార్మికుల దుస్థితిని మెరుగు పరచ వలసిందని పెట్టుబడిదార్లకూ వారి ఆశ్రితులకూ బోధించడం గాక, కుట్రలు పన్నడం గాక, శ్రామిక వర్గం యొక్క వర్గ పోరాటాన్ని ఆర్గనైజు చేయడమూ, శ్రామికవర్గం రాజకీయాధికారాన్ని జయించడమే, సోషలిస్టు సమాజాన్ని ఆర్గనైజు చేయడమే అంతిమ లక్ష్యంగా గల్గిన ఈ పోరాటాన్ని నడిపించడమూ అని అది స్పష్టం చేసింది.

కాగా మనమిప్పుడు ఈ ప్రశ్న వేస్తున్నాం: ఈనాడు ఇంత రగడ లేవదీస్తూ జర్మన్ సోషలిస్టు బెర్న్‌స్టయిన్ చుట్టూ ఒక గ్రూపుగా చేరి గావుకేకలు పెడుతూన్న ఈ సిద్ధాంతపు "మరమ్మతుగాళ్లచే" దీనిలో ఏదైనా కొత్త విషయం ప్రవేశపెట్టబడిందా? ఈషత్తు కూడాలేదు. దేనినైతే అభివృద్ధి పరచవలసిందని మార్క్స్, ఎంగెల్స్‌లు మనను ఆదేశించారో ఆ శాస్త్రాన్ని వీరు ఒక్క అడుగైనా ముందుకు తీసుకొనిపోలేదు; ఏ నూతన పోరాట విధానాలనూ వీరు శ్రామికవర్గానికి బోధించలేదు; వెనకబడిపోయిన సిద్ధాంతాలలోని తునుకలను ఎరవు తెచ్చుకుంటూ, పోరాట సిద్ధాంతాన్ని గాకుండా, లొంగుబాటు సిద్ధాంతాన్ని, సోషలిస్టులను హింసించడానికి కొత్త సాధనాల అన్వేషణను ఎన్నడూ కట్టిపెట్టనట్టి శ్రామికవర్గానికి ఆగర్భ శత్రువులైనట్టి ప్రభుత్వాల పట్లా బూర్జువా పార్టీల పట్లా లొంగుబాటు ప్రదర్శించే సిద్ధాంతాన్ని — శ్రామికవర్గానికి బోధించుతూ వీరు తిరోగమించారు. బెర్న్‌స్టయిన్ సరికొత్తగా రాసిన "విమర్శ"ను రష్యన్ డెమోక్రసీ స్థాపకులలోనూ నాయకులలోనూ ఒకడైనట్టి ప్లెహానొవ్ నిర్దాక్షిణ్యంగా విమర్శించడం కేవలం సరిగానే వుంది; జర్మన్ కార్మికుల ప్రతినిధులు కూడా ఇప్పుడు (హన్నోవర్ కాంగ్రెస్‌లో[55]) బెర్న్‌స్టయిన్ అభిప్రాయాలను తోసివేశారు.

ఈ మాటలన్నందుకు ఒకపెద్ద నిందా ప్రవాహం వచ్చి మా మీద పడబోతుందని మాకు తెలుసు; "సిద్ధాంతాన్ని" వదిలిపెట్టి పెడదార్లు పట్టినందుకూ, అన్ని స్వతంత్ర అభిప్రాయాలూ వగైరాలు కల్గినందుకూ "మతభ్రష్టుల"ను హింసించేటట్టి "ఆర్షమతస్థుల" ఆశ్రమంగా సోషలిస్టు పార్టీని మార్చివేయడానికే మేం ఉద్దేశిస్తున్నామని కాకిగోల బయలు దేరుతుంది. ఈ ఫాషనబుల్ మాటలూ, ఈ నిష్ఠురోక్తులూ, వీటన్నిటినీ మేం ఎరుగుదుం. ఐతే వీటిలో అవగింజంతైనా నిజమూ లేదు, అర్థమూ లేదు. సోషలిస్టుల నందరినీ ఐక్యం చేసేటట్టి, వారందరి నమ్మకాలకూ మూలాధారమైనట్టి, వారి పోరాట విధానాలకూ క్రియా సాధనాలకూ వారు ప్రయుక్తం చేయగలిగేటట్టి విప్లవాత్మక సిద్ధాంతం ఒకటి లేనిదే బలీయమైన సోషలిస్టు పార్టీ వుండజాలదు. మీకు తెలిసినంత వరకూ దేనినైతే మీర సత్యమని భావించుతున్నారో అట్టి సిద్ధాంతాన్ని నిర్హేతుకములైనట్టి దాడులనుండీ, దానిని చెడగొట్టే ప్రయత్నా

ల నుండీ కాపాడడమంటే, విమర్శ అంతటి పట్లనూ మీరు శత్రుత్వం వహించాలని ఎంత మాత్రమూ అర్థం తీయకూడదు. మార్క్స్ సిద్ధాంతం సంపూర్ణతను చెందినట్టీ, అనుల్లంఘనీయమైనట్టీ సిద్ధాంతమని మేం భావించం. తద్విరుద్ధంగా, జీవితంతో తాము సమంగా అడుగు వేస్తూ పురోగమించాలీ అంటే, సోషలిస్టులు సర్వతోముఖంగా ఇంకా ముందుకు తీసుకువెళ్ల వలసినట్టి శాస్త్రానికి అది శంకుస్థాపన మాత్రమే చేసిందని మేం పూర్తిగా నమ్ముతున్నాం. మార్క్స్ సిద్ధాంతానికి స్వతంత్ర విపులీకరణ ఒకటి రష్యన్ సోషలిస్టులకు ప్రత్యేకంగా అవసరమని మేం భావిస్తున్నాం; ఎందుచేతనంటే, ప్రత్యేక సందర్భాల్లో ఇంగ్లండులో కంటె భిన్నంగా ఫ్రాన్సులోనూ, ఫ్రాన్సులో కంటె భిన్నంగా జర్మనీలోనూ, జర్మనీలోకంటె భిన్నంగా రష్యాలోనూ ప్రయుక్తం చేయబడుతున్నట్టి కేవలం స్థూలమైన మార్గదర్శక సూత్రాలనే ఈ సిద్ధాంతం అందజేస్తుంది. ఇందుచేత సైద్ధాంతిక సమస్యలపై వ్యాసాలకు మా పత్రికలో సంతోషంతో చోటు కల్పిస్తాం; కాబట్టి వివాదాస్పదములైన అంశాలను బహిరంగంగా చర్చించమని కామ్రేడ్ల నందరినీ మేం ఆహ్వానిస్తున్నాం.

సోషల్-డెమోక్రాట్లు అందరకూ సామాన్యమైనట్టి కార్యక్రమాన్ని రష్యాకు ప్రయుక్తం చేయడంలో ఉదయించే ప్రధాన సమస్యలేమిటి? శ్రామికవర్గ పోరాటాన్ని ఆర్గనైజు చేసి శ్రామికవర్గం రాజకీయాధికారాన్ని గెల్చుకోవడమూ, సోషలిస్టు సమాజ స్థాపనా అంతిమ లక్ష్యాలనుగా గలిగిన ఈ పోరాటానికి నాయకత్వం వహించడమూ ఈ కార్యక్రమ సారాంశమని వివరించాం. శ్రామికవర్గం యొక్క వర్గపోరాటంలో, ఆర్థిక పోరాటమూ (కార్మికుల పరిస్థితిని మెరుగు పరచేందుకై వ్యక్తిగత పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగానూ, లేదా పెట్టుబడిదార్ల వ్యక్తిగత గ్రూపులకు వ్యతిరేకంగానూ పోరాటం), రాజకీయ పోరాటమూ (ప్రజల హక్కులు విస్తృత పరచేందుకై ప్రభుత్వానికి ప్రతికూలంగా, అనగా ప్రజాస్వామ్యం కొరకూ, శ్రామికవర్గంయొక్క రాజకీయాధికారం విస్తృత పరచడం కొరకూ పోరాటం) అంతర్భాగాలు. రష్యన్ సోషల్-డెమోక్రాట్లు కొందరు (వీరిలో ''రబోచయ మీస్ల్''ను నడిపించుతూన్నవారు కూడా వున్నట్టే వుంది) ఆర్థిక పోరాటమే అనన్యసామాన్య ప్రాముఖ్యత వహించుతుందని అభిప్రాయపడుతూ, రాజకీయ పోరాటాన్ని ఇంతో అంతో సుదూర భవిష్యత్తుకే నెట్టివేస్తున్నారు. ఈ దృక్పథం శుద్ధ తప్పు. కార్మికవర్గం ఆర్థిక పోరాటాన్ని ఆర్గనైజు చేయడం అవసరమనీ, యజమానుల పీడన ప్రతి దృష్టాంతాన్నీ, ప్రతి రూపాన్నీ కార్మికుల దృష్టికి తీసుకువచ్చి, యజమానులకు వ్యతిరేకంగా కార్మికులకు వారి దైనందిన పోరాటంలో సహాయపడడమూ, వారు ఐక్యపడవలసిన అవసరాన్ని ఈ విధంగా వారికి స్పష్టం చేయడమనే ఈ ప్రాతిపదికపై కార్మికులలో ఆందోళన సాగించడ మవసరమనీ సోషల్-డెమోక్రాట్లు అందరూ అంగీకరిస్తున్నారు. కాని ఆర్థిక పోరాటంలో పడిపోయి రాజకీయ పోరాటం

మరచిపోవడమంటే అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీ మౌలిక సూత్రం నుండి వైదొలగడమే కాగలదు, కార్మికోద్యమ చరిత్ర యావత్తూ మనకు నేర్పుతూన్న గుణపాఠాన్ని విస్మరించడమే కాగలదు. బూర్జువావర్గాన్ని అంటకాగిన అనుయాయులూ, దానికి ఊడిగం చేస్తూన్న ప్రభుత్వపు అనుయాయులూ కార్మికులలో ఆర్థిక సంఘాలను మాత్రమే నెలకొల్పడానికీ, ఈ విధంగా ''రాజకీయాల'' నుండీ, సోషలిజం నుండీ కార్మికుల దృష్టిని మరలించడానికీ అనేక పర్యాయాలు ప్రయత్నించారు. రష్యన్ ప్రభుత్వం కూడా, ఇదివరకు ఎల్లప్పుడూ చేసినట్టుగానే ఇప్పుడు కూడా, ప్రజలకు, తాము పీడించబడుతున్నామనే విషయం నుండీ, తమకు హక్కులు లేనేలేవనే విషయం నుండీ వారి మనస్సులను మరల్చేందుకని, ఒక ముష్టి పైసా, అదేనా చెల్లనిపైసా, పారేసే ప్రయత్నం వంటి కార్యాన్ని దేనినైనా సమకట్టవచ్చు. జర్మనీలో, కడమ (టర్కీ, రష్యా మినహా) అన్ని యూరపియన్ దేశాలలో లాగానే కార్మికులకు సమావేశాలనూ సంఘాలనూ నిరాటంకంగా ఏర్పాటు చేసుకొనడానికీ, తమ వార్తాపత్రికలను తాము నడుపుకొనడానికీ, జాతీయ పరిషత్తులకు తమ ప్రతినిధులను పంపుకొనడానికీ హక్కు వుంటేనే తప్ప, ఆర్థిక పోరాటం ఏదీ కూడా వారికి స్థిరమైన సౌకర్యం కలిగించ జాలదు. కాగా ఈ హక్కులు సాధించుకొనడానికి రాజకీయ పోరాటం సాగించడం అవసరం. రష్యాలో హక్కులు లేనివారు ఒక్క కార్మికులే కారు, పౌరు లందరికీ హక్కులులేవు. విశృంఖలమైనట్టీ, మితిమేరలు లేనట్టీ ఏకరాజాధిపత్యం రష్యా. జార్ ఒక్కడే చట్టాలు శాసిస్తున్నాడు, ఉద్యోగులను నియమిస్తున్నాడు, ఉద్యోగులను ఖాయిదా పెట్టుతున్నాడు. ఈ హేతువును రష్యాలో జారూ, జార్ ప్రభుత్వమూ అన్ని వర్గాలకూ అతీతులై వుంటూన్నట్టే, అందరినీ ఒక్కలాగున చూస్తూన్నట్టే అవుపడుతుంది. కాని వాస్తవంగా కేవలం ఒక్క ఆస్తిపరుల వర్గాలనుండే అందరు ఉద్యోగులూ ఎంచబడుతున్నారు; కాగా తాము పాడే పాటకు మంత్రులచేత పక్కతాళం వేయించుకుంటూ తమకు కావలసిన కార్యాలన్నిటినీ సాధించుకునే బడా పెట్టుబడిదారుల కనుసన్నలో మెలగ వలసిన వారే వీరందరూనూ. రష్యన్ కార్మికవర్గం తన మూపులపై రెండు కాడిమానులు మోయవలసి వస్తూంది; పెట్టుబడిదార్లూ, భూస్వాములూ దానిని నిలువునా దోచుకుని కొల్లపెట్టుతున్నారు; కాగా వీరితో పోరాడకుండా చేసేందుకని దాని చేతులూ కాళ్లూ కలియ గట్టి నోట గుడ్డలు కుక్కుతున్నారు పోలీసులు; ఇక ప్రజల హక్కులను కాపాడ యత్నించే ప్రతీవారూ హింసలకు గురి అవుతున్నారు. ఏ పెట్టుబడిదారునికి వ్యతిరేకంగానైనా సరే సమ్మె చేసేసరికల్లా కార్మికులపై సైనికులనూ పోలీసులనూ ఎగదోల్తున్నారు. ప్రతి ఆర్థిక పోరాటమూ విధిగా రాజకీయ పోరాటంగా పరిణమించి తీరుతుంది, కాగా ఈ రెంటినీ ఒకదానితో ఒకటి అభేద్యంగా, శ్రామికవర్గంయొక్క ఒకే ఒక వర్గ పోరాటంగా సోషల్-డెమోక్రసీ మిళితం చేయాలి. రాజకీయ హక్కులు గెల్చుకోవడమూ, రాజ

కీయ స్వేచ్ఛ సాధించుకోవడమూ ఇటువంటి పోరాటంయొక్క ప్రధానమైనట్టి ముఖ్యమైనట్టి లక్ష్యమై వుండాలి. సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు ఒక్కరే, సోషలిస్టుల కొద్దిపాటి సహాయంతో, ప్రభుత్వం నుండి సత్వరంగా సౌకర్యాన్ని, రోజుకి పని గంటల కాలం తగ్గించే శాసనాన్ని[56] గంజుకొనడంలో విజయం పొందారంటే — ఇక అప్పుడు యావత్తు రష్యన్ కార్మిక వర్గమూ, ఒకే ఒక రష్యన్ సోషల్-డెమొక్రాటిక్ కార్మిక పార్టీ నాయకత్వం కింద, పట్టు విడవని పోరాటంలో ఇంతకంటెనూ నిరుపమానమైనట్టి ముఖ్యమైన సౌకర్యాలనే సాధించగల్గుతుంది.

మరే యితర వర్గమూ దానికి సహాయం చేయకపోయినప్పటికీ, రష్యన్ కార్మికవర్గం ఒక్కటే దానంతటదే తన ఆర్థిక, రాజకీయ పోరాటం సాగించగల్గుతుంది. కాని రాజకీయ పోరాటంలో కార్మికులు ఒంటరులుగా నిలువడంలేదు. ప్రజలకు ఏ మాత్రపు హక్కులూ లేకపోవడమూ, కిరాతకులైన ఉద్యోగుల పాశవిక స్వైరవిహారమూ, ఆలోచనా స్వాతంత్ర్యాన్నీ వాక్ స్వాతంత్ర్యాన్నీ మట్టిపెట్టడమును సహించలేని ఆమాత్రపు ఈమాత్రపు నిజాయతీపరులూ విద్యావంతులూ అయిన అందరి ప్రజల ఆగ్రహాన్నీ రేకెత్తించుతున్నాయి; హింసల పాలవుతూన్న పోలెండ్ జాతివారి, ఫిన్‌లండ్ జాతివారి, యూదు జాతివారి, రష్యన్ మత శాఖలవారి ఆగ్రహాన్నీ ఇవి రేకెత్తించుతున్నాయి; అధికార్ల, పోలీసుల దౌర్జన్యంనుండి ఎక్కడా రక్షణ పొందజాలనట్టి సన్నకారు వర్తకుల, పారిశ్రామికుల, రైతుల ఆగ్రహాన్నీ ఇవి రేకెత్తించుతున్నాయి. జనసంఖ్యలోని ఈ గ్రూపులన్నిటికీ విడివిడిగా ఎడతెగని రాజకీయ పోరాటం సాగించగలిగే సమర్థత లేదు. కాని ఎప్పుడైతే కార్మికవర్గం ఈ పోరాట పతాకను ఎగురవేస్తుందో, అప్పుడు దానికి అన్ని వైపులనుండీ సహాయం అందుతుంది. ప్రజా హక్కులకై పోరాడే యోధులందరకీ, ప్రజాస్వామ్యానికై పోరాడే యోధులందరికీ రష్యన్ సోషల్-డెమొక్రసీ నాయకత్వం వహించుతుంది; తాను అజేయమని అది రుజువు పరచుకుంటుంది!

ఇవి మా మౌలికాభిప్రాయాలు; వీటిని మా మాసపత్రికలో వ్యవస్థాబద్ధంగానూ అన్ని దృక్స్థానాలనుండీ అభివృద్ధి పరచుతాం. రష్యన్ సోషల్-డెమొక్రాటిక్ లేబర్ పార్టీ ప్రచురించినట్టి "ప్రణాళికలో" సూచించిన బాటను ఈ విధంగా మనం పయనించుతామని మేం విశ్వసిస్తున్నాం.

1899, అక్టోబరులోగాని, లేదా
అక్టోబరు తరువాత గాని.

# ఏమి చేయాలి?

## మన ఉద్యమంలో ఉదయించిన అత్యవసర ప్రశ్నలు

ఖండికలు

## I. డాగ్మాటిజమూ, "విమర్శనా స్వేచ్ఛ"

### ఎ) "విమర్శనా స్వేచ్ఛ" అంటే ఏమిటి?

"విమర్శనా స్వేచ్ఛ" నేడు అన్నిటికంటే హెచ్చు ఫాషనబుల్‌గా వున్న నినాదం; అన్ని దేశాల్లోనూ సోషలిస్టులకూ ప్రజాస్వామ్య వాదులకూ మధ్య జరుగుతూన్న వాదోప వాదాలలో మరీ తరుచుగా వాడుతూన్న నినాదాల్లో ఇదొకటి. తొలి చూపుకి మాత్రం వివాదంలో ఒక పక్షంవారు విమర్శనా స్వేచ్ఛ కోసం గంభీరంగా విజ్ఞప్తులు చేయడం గమనించుతే, ఇంత కంటె చిత్రమైనది మరేదీ వుండదనే అనిపిస్తుంది. శాస్త్రానికీ, శాస్త్రీయ పరిశోధనకూ హామీ యిస్తూన్నట్టి అధికసంఖ్యాకవర్గపు యూరపియన్ దేశాల రాజ్యాంగ చట్టాన్ని నిరసిస్తూ పురోగమన శీలమైన రాజకీయ పార్టీలలో గొంతుకలు వినబడుతున్నాయా? కక్షిదార్ల అభిప్రాయ భేదాల సారాన్ని తానింకా పూర్తిగా ఆకళింపు చేసుకోనప్పటికీ వూరూ వాడా ఈ ఫాషనబుల్ నినాద పునశ్చరణను విన్న పరాయివాడెవడైనా, "ఇక్కడేమిటో సరిగ్గా కుదరడంలేదు!" అనుకుంటాడు. "ఈ నినాదం స్పష్టంగా ఒక పడికట్టు పదంలాగున వాడుకలోకొచ్చేసి, ఇంచుమించు జాతివాచకం కింద చలామణీ అవుతూన్న సంప్రదాయక పదబంధాలలో ఒక దానిలా వుంది" అని అతడు తేల్చుకుంటాడు.

వాస్తవానికి, ఈనాటి అంతర్జాతీయ* సోషల్-డెమోక్రసీలో రెండు ధోరణులు తలె

---

*ప్రాసంగికంగా: సోషలిస్టు ఉద్యమంలోని భిన్నభిన్న ధోరణుల మధ్యనున్న వివాదాలు మొదట జాతీయ వివాదాలై, తరువాత అంతర్జాతీయ వివాదాలుగా పరిణమించిన సందర్భం ఆధునిక సోషలిజం చరిత్రలో బహుశ ఇదొక్కటే అయి వుండొచ్చు; కాగా ఒక విధంగా ఇది అసాధారణ సంతృప్తినే కలుగజేస్తూంది కూడా. వెనకటి రోజుల్లో లాసాలియన్లకూ ఐసెనాఖర్లకూ[57], గెడ్ అనుయాయులకూ పొసిబిలిస్టులకూ[58], ఫేబియన్లకూ సోషల్-డెమోక్రాట్లలకూ[59], నరోద్నయ వోల్య పక్షం వారికీ సోషల్-డెమోక్రాట్లకూ జరిగిన వివాదాలు కేవలం

త్తాయనే సంగతిలో రహస్యమేమీ లేదు. ఈ రెండు ధోరణుల మధ్య పోరాటం, ఒక మాటు ప్రకాశమానమైన జ్వాలగా వెలిగి, ఒకమాటు ఆరిపోయి, గంభీరమైన ''యుద్ధవిరమణ సంధి తీర్మానాల'' నుసి అడుగున నివురు గప్పిన నిప్పులాగా రాజుకుంటూ వుంటూంది. ''పాత డాగ్మాటిక్'' మార్క్సిజం పట్ల ''విమర్శనాత్మక'' వైఖరి అవలంబించుతూన్న ఈ ''నూతన'' ధోరణి దేనికైతే ప్రాతినిధ్యం వహించుతూందో దానిని కావలసినంత నిశితంగానే బెర్న్‌స్టయిన్ చెప్పాడు, మిలెరాన్ రుజువుపరచాడు.

సామాజిక విప్లవం యొక్క పార్టీగా వుండడం మానేసి, సామాజిక సంస్కరణలు కోరే ప్రజాస్వామిక పార్టీగా సోషల్-డెమోక్రసీ మారిపోవాలి. ఈ రాజకీయ డిమాండు చుట్టూ, ఇంచుమించు సౌష్ఠవంగానే అమర్చినట్టి ''నూతన'' వాదనల, హేతువాదనల సంపూర్ణ శతఘ్ని దళం ఒకదానిని బెర్న్‌స్టయిన్ మోహరించాడు. సోషలిజాన్ని ఒక శాస్త్రీయమైన ప్రాతిపదికపై నెలకొల్పేటట్టీ, చరిత్ర పట్ల భౌతికవాద భావనా దృక్పథంతో ఇది అవసరమూ అనివార్యమూ అని రుజువు చేయగల్గేటట్టీ సాధ్యత నిరాకరించబడింది; కాగా నానాటికి పెరిగిపోతూన్న పేదరికమూ, శ్రామికవర్గంగా దిగజారిపోవడమూ, పెట్టుబడిదారీ విధానపు వైరుధ్యాలూ కూడా దీనితో పాటే నిరాకరించబడ్డాయి. అసలు ''అంతిమ లక్ష్యం'' అనే భావనే హేతువాదానికి నిలబడదని ఉద్ఘాటించబడింది, శ్రామికవర్గ నియంతృత్వ భావం కేవలమూ నిరాకరించబడింది. లిబరలిజానికీ సోషలిజానికీ సూత్రప్రాయంగా ఎట్టి ప్రతిద్వంద్వమూ లేదని చెప్పబడింది. అధిక సంఖ్యాకవర్గపు అభీష్టం ప్రకారం పరిపాలించ బడుతూన్నట్టి ఖచ్చితమైన ప్రజాస్వామిక సమాజానికి ప్రయుక్తం చేయ వీలులేదనే కారణంపై వర్గ పోరాట సిద్ధాంతం, వగైరాలు నిరాకరించబడ్డాయి.

ఈ విధంగా విప్లవాత్మక సోషలిజం నుండి బూర్జువా సామాజిక సంస్కరణతత్వం

---

జాతీయ వివాదాలుగానే వుండిపోయి, కేవలం జాతీయ స్వభావాలనే ప్రతిబింబించి, ఒక విధంగా చూస్తే, వివిధ అంతరాలలో సాగాయి. ఈనాడు (ఇది ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది), ఇంగ్లీషు ఫేబియన్లూ, ఫ్రెంచి మంత్రివర్గ పక్షంవారూ[60], జర్మన్ బెర్న్‌స్టయిన్ అనుయాయులూ, రష్యన్ విమర్శకులూ[61] — వీరందరూ ఒక కుటుంబం వారే, ఒకరి నొకరు మెచ్చుకుంటూ, ఒకరి దగ్గరనుండి ఒకరు పాఠాలు నేర్చుకుంటూ, అందరూ కలిసి ''డాగ్మాటిక్'' మార్క్సిజమ్‌పై ధ్వజం యెత్తుతూన్నవారే. సోషలిస్టు అవకాశవాదంతో జరుగుతూన్నట్టి ఈ మొదటి వాస్తవ అంతర్జాతీయ సంఘర్షణలో, యూరవ్‌లో బహుకాలంగా రాజ్యం చేస్తూన్న రాజకీయ అభివృద్ధి నిరోధకాన్ని అంతమొందించ గలిగేటంతగా సోషల్-డెమోక్రసీ బహుశ బలపడుతుందేమో?

వైపుగా కృతనిశ్చయంతో మలుపు తిరగాలనే డిమాండును, మార్క్సిజం యొక్క మౌలిక భావాలపై సాగించబడుతూన్న బూర్జువాతత్వ విమర్శనవైపుగా ఇంతకు ఏ మాత్రమూ తీసిపోనట్టి కృతనిశ్చయంతో మలుపు తిరగాలనే డిమాండు కూడా అనుగమించింది. రాజకీయ వేదికనుండీ, విశ్వవిద్యాలయ పీఠాలనుండీ, లెక్కలేనన్ని పుస్తకాలలోనూ, అనేక శాస్త్రీయ గ్రంథాలలోనూ మార్క్సిజంపై ఈ విమర్శ ఇప్పటికి చాలా కాలమయే జరుగుతూండడం కారణంగా, విద్యాగంధం కల్గిన యువ తరం అంతా ఈ విమర్శలోనే దశాబ్దుల తరబడి వ్యవస్థాబద్ధంగా శిక్షణ పొంది వుండడంవల్ల, జ్యూపిటర్ శిరస్సునుండి మినర్వా ఏలా ఉద్భవించిందో, అలాగే ఈ ''నూతన, విమనర్శనాత్మక'' ధోరణి కూడా సోషల్-డెమోక్రసీలో నుండి అమాంతమూ సర్వసంపూర్ణమై ఉద్భవించడంలో ఏ మాత్రమూ ఆశ్చర్యంలేదు. ఈ కొత్త ధోరణిలోని విషయానికి పెరిగి పెద్దదై రూపు రేఖలు ఏర్పడ వలసిన అవసరమే లేకపోయింది; బూర్జువా సారస్వతం నుండి సోషలిస్టు సారస్వతంలోకి అది అమాంతమూ చొప్పించబడింది.

సరే, ఇక ముందుకు వెళదాం. బెర్న్‌స్టయిన్ సైద్ధాంతిక విమర్శన, రాజకీయ ఆశయాలు ఎవరికైనా ఇంకా స్పష్టం కాకపోతే, ''నూతన విధానాన్ని'' కళ్లకుకట్టినట్టూ నిరూపించేందుకు ఫ్రెంచివారు శ్రమతీసుకున్నారు. ''ఇతరత్రాకంటె నిర్ణాయాత్మకమైన అంతం తేలేవరకూ ప్రతీ సారీ చారిత్రాత్మక వర్గపోరాటాలను కొనసాగించిన'' దేశం అనే తన ప్రాచీన ఖ్యాతిని ఈ దృష్టాంతంలో కూడా ఫ్రాన్సు సమర్థించుకుంది (మార్క్స్ రచించిన "Der 18 Brumaire"*[62] అనే గ్రంథానికి తాను రాసిన ఉపోద్ఘాతంలో ఎంగెల్స్). సిద్ధాంతీకరించడం కాకుండా కార్యాచరణ ఆరంభించారు ఫ్రెంచి సోషలిస్టులు. ''ఆచరణీయమైన బెర్న్‌స్టయినిజాన్ని'' దానికున్న అన్ని ఫలితాలతో కూడా వెంటనే స్వీకరించడానికి ఫ్రాన్సులో ప్రజాస్వామికంగా అత్యున్నత దశకు అభివృద్ధి చెందిన రాజకీయ పరిస్థితులు వారికి అవకాశం కల్గించాయి. ఆచరణీయమైన బెర్న్‌స్టయినిజానికి ప్రశస్తమైన ఉదాహరణను సమకూర్చిపెట్టాడు మిలెరాన్; బెర్న్‌స్టయినూ, ఫోల్‌మారూ అతనిని రక్షించడానికై అంత దీక్షతో పరిగెత్తారంటేనూ, అతనిని శ్లాఘించుతున్నారంటేనూ, మరి వుత్త పుణ్యానికేనా! వాస్తవానికి సోషల్-డెమోక్రసీ అసలు దాని సారంలోనే ఒక సంస్కరణాత్మకమైన పార్టీయే అయి, ఈ విషయమే బహిరంగంగా ఒప్పుకునే ధైర్యం దానికి వుండాలంటే, అప్పుడు బూర్జువా మంత్రివర్గంలో చేరే హక్కు వుండడమే కాకుండా, అందుకు ఎల్లప్పుడూ పాటు పడుతూనే వుండాలి కూడా. ప్రజాస్వామ్యం అసలు సారమే గనుక వర్గపరిపాలనే అవుతే, అప్పుడు వర్గ సహకారంపై సోషలిస్టు పార్టీకి చెందిన మంత్రి తన మహోపన్యాసాలతో యావత్తు బూర్జువా

*''పద్దెనిమిదవ బ్రూమేర్''. — సం.

ప్రపంచాన్ని మంత్రముగ్ధులను ఏల చేయకూడదు? సాయుధ పోలీసులు తమ తుపాకులతో కార్మికులను బలిగొనడం ద్వారా, నూరోసారి కాదు వెయ్యోసారిగా ప్రజాస్వామిక వర్గసహకారం యొక్క అసలు స్వభావం బయటపడిన తరువాత సహితమూ, మంత్రివర్గంలో అతడు ఎందుకుండ కూడదు? ఉరికంబం, కొరడా, ప్రవాసశిక్షా విధానాల వీరాగ్రేసరుడు (knouteur, pendeur et déportateur) అనే తప్ప నేడు ఫ్రెంచి సోషలిస్టులు వేరొక పేరు పెట్టి పిలువని జార్‌ను అభినందించడంలో అతడెందుకు స్వయంగా పాల్గొనగూడదు? సర్వ ప్రపంచం ఎదుట సోషలిజాన్ని అనంతమైన అవమానానికీ స్వయంకృత నైచ్యానికీ ఈ విధంగా పాల్జేసినందుకు బహుమానం — మన విజయ సిద్ధికి హామీ ఈయగల్గే ఏకైక ప్రాతిపదిక అయిన కార్మిక ప్రజారాసుల సోషలిస్టు చైతన్యాన్ని చెడగొట్టినందుకు బహుమానం — ముష్టి సంస్కరణలకై ఆడంబరమైన పథకాలు, ఈ సంస్కరణలైనా ఎంత ముష్టిగా వున్నాయంటే బూర్జువా ప్రభుత్వాలనుండే ఇంతకంటె వాస్తవంగా ఎంతో హెచ్చే లభించుతుంది!

సోషలిజంలోని ఈ కొత్త "విమర్శనాత్మక" ధోరణి ఒక కొత్త రకం అవకాశవాదం తప్ప మరొకటేమీ కాదని కళ్లున్న ప్రతివాడికీ, కేవలం భీష్మించి కళ్ళు మూసుక్కూచున్నవాడికైతే తప్ప, స్పష్టంగా కనబడుతూనే వుంది. తాము తొడుక్కున్నట్టి ధగధగ మెరిసిపోయే యూనిఫారములను బట్టిగాక, తాము అలంకరించుకునే స్వప్రసాదితములైన డాంబిక బిరుదులను బట్టిగాక, వారు చేసే చేతల బట్టే, వాస్తవంగా వారు ప్రచారం చేసేదానిని బట్టే మనుష్యులను మనం విలువ కట్టినట్టయితే, "విమర్శనాస్వేచ్ఛ" అర్థం సోషల్-డెమోక్రసీలోని అవకాశవాద ధోరణికి స్వేచ్ఛ, సోషల్-డెమోక్రసీని ప్రజాస్వామిక సంస్కరణాత్మక పార్టీగా మార్చివేయడానికి స్వేచ్ఛ, సోషలిజంలోకి బూర్జువావర్గ భావాలనూ బూర్జువావర్గ మూలద్రవ్యాలనూ చొప్పించడానికి స్వేచ్ఛ అని స్పష్టమవుతుంది.

"స్వేచ్ఛ" అనే పదం దివ్యమైన పదం; కాని పారిశ్రామిక స్వేచ్ఛ అనే పతాక కిందే ఘోరాతి ఘోరమైనట్టి బందిపోటు యుద్ధాలు జరిగాయి; శ్రమ స్వేచ్ఛ అనే పతాకకింద శ్రమజీవుల నిలువు దోపిడి జరిగింది. "విమర్శనా స్వేచ్ఛ" అనే పదం యొక్క ఆర్వాచీన ప్రయోగంలో ఈ స్వాభావికమైన కపటమే అంతర్గర్భితమై వుంది. శాస్త్రాన్ని ముందుకు తీసుకు వెళ్లామని నిజంగా నమ్ముతూన్నవారు కోరేది పాత అభిప్రాయాల సరసనే కొత్త అభిప్రాయాలు మనడానికి స్వేచ్ఛ కాదు; వారు కోరేది పాత అభిప్రాయాల స్థానంలో కొత్త అభిప్రాయాలు రావాలనే. నేడు వినబడుతూన్న "విమర్శనా స్వేచ్ఛ వర్ధిల్లు గాక!" అనే పాలికేక ఖాళీ పీపా కథనే జ్ఞప్తికి తెస్తూంది.

ప్రయాసకరమైన, పక్కను ఒక అగాధం వున్న ఒక పర్వతమార్గాన చేతులూ చేతులూ పట్టుకుని ఒకరి వెంట ఒకరం ఒక జట్టుగా మనం నడుస్తున్నాం. శత్రువుల మనల్ని నాల్గు వైపుల నుండీ చుట్టుముట్టేస్తున్నారు, ఇంచుమించు నిర్విరామంగా వారు కురిపిస్తూన్న అగ్ని వర్షాన్ని ఎదుర్కొంటూనే మనం పురోగమించాల్సి వుంది. శత్రువుతో పోరాడాలనే ఏకైక లక్ష్యంతోనే మనం స్వచ్ఛందంగా ఏకమయాం గాని, చేరువనున్న చిత్తడి ప్రదేశంలోకి తిరోగమించడానికి కాదే. మనం వేరే ఒక ప్రత్యేక గ్రూపుగా ఏర్పడ్డామనీ, రాజీ మార్గం బదులు పోరాట మార్గం ఎన్నుకున్నామనీ ఆ చిత్తడి ప్రదేశవాసులు మనల్ని మొదటినుండీ దూషించు తున్నారు. ఇప్పుడు మనలోనే కొందరు, "ఈ చిత్తడి ప్రదేశంలోకి దిగుదాం!" అని బొబ్బలు పెడుతున్నారు. అందుకని వాళ్ళకి సిగ్గొచ్చేటట్టు బుద్ధిచెప్పేసరికల్లా, "ఎంత వెనకబడిన మనుషులయ్యా మీరు! ఇదుగో, మంచి రాజమార్గాన వెళ్ళండని మిమ్మల్ని ఆహ్వానించ డానికేనా మాకు స్వేచ్ఛలేకుండా చేయడానికి మీకు సిగ్గేనా లేదా?" అని వాళ్ళు బూకరిస్తున్నారు. "ఓ పెద్దమనుషుల్లారా! సరేనండీ, మమ్మల్ని ఆహ్వానించడానికే గాదు కదా, మీా చిత్తం వచ్చిన చోటకి వెళ్ళడానికి, కావలిస్తే ఈ చిత్తడి ప్రదేశంలోకే దిగడానికి, మీకు స్వేచ్ఛ వుందండీ; వాస్తవానికి ఈ చిత్తడి ప్రదేశమే మీకు తగిన చోటవి మా అభిప్రాయం కూడా. అందులోకి దిగడానికి మా చేతనైంత సహాయం చేస్తాం మీకు. మమ్మల్ని అందులోకి దింప కుండా మా చేతులు మాత్రం వదలండి, 'స్వేచ్ఛ' అనే ఆ దివ్యమైన పదాన్ని మట్టిపాల్జేయకండి. ఎందుచేతంటే మా చిత్తం వచ్చిన చోటకి వెళ్ళడానికి మాకూ 'స్వేచ్ఛ వుంది'; చిత్తడి ప్రదేశంతో పోరాడడానికే కాదు కదా, చిత్తడి ప్రదేశం దిశగా వెళ్ళే వారితో పోరాడ డానికీ మాకు స్వేచ్ఛ వుంది!"

## డి) సైద్ధాంతిక పోరాట ప్రాముఖ్యతపై ఎంగెల్స్

"డాగ్మాటిజము, సూత్రాన్ని పట్టుకు వేలాడే తత్వం," "పార్టీ అస్థికరణము — బలప్రయోగంతో చింతనను పీకనొక్కివేస్తే తప్పనిసరిగా అనుభవించవలసిన శిక్ష" — ఈ శత్రువులపై "రబోచెయె దేలొ" పత్రికలో "విమర్శనా స్వేచ్ఛ"ను పరిరక్షించే యోధాగ్రేసరులు కత్తులు దూస్తున్నారు. ఈ ప్రశ్నను నేటి కార్యావళిలో చేర్చినందుకు మేము చాలా సంతోషిస్తున్నాం; కాగా ఇందులో ఇంకొక ప్రశ్న కూడా చేర్చమని మా సూచన:

తీర్పు చెప్పే న్యాయమూర్తులు ఎవరు?

ఇద్దరు ప్రచురణకర్తలు చేసిన రెండు ప్రకటనలు మామ్ముందున్నాయి. మొదటిది, ''రష్యన్ సోషల్-డెమోక్రాట్ల సంఘం[63] ఆవర్తక్రమ పత్రిక'' – 'రబోచెయె దేలొ' – యొక్క కార్యక్రమం'' (''రబోచెయె దేలొ,'' 1 వ సంచిక నుండి పునర్ముద్రణ); రెండవది, ''శ్రమ విమోచన గ్రూపు'' ప్రచురణలను తిరిగి ప్రారంభించుతూనట్టు ప్రకటన. రెండింటి తేదీ 1899 వ సంవత్సరమే – ''మార్క్సిజంలో సంక్షోభం'' గురించి సుదీర్ఘమైన చర్చ జరుగుతూండిన కాలం. కాగా మనకి ఏమిటి కనబడుతూంది? ఈ దృగ్విషయం గురించి ఎట్టి సూచనైనా సరే, ఈ ప్రశ్నపై ఈ కొత్త పత్రిక తీసుకొన దల్చుకున్న స్థానం గురించి నిర్దిష్టమైన ఎట్టి వివరణనైనా సరే మొదటి ప్రకటనలో ఎక్కడైనా వున్నదా అని మీరు ఎంత వెదకినా దాని జాడైనా మీకు ఎక్కడా కనబడదు. సైద్ధాంతిక కృషి గురించి, ఈ ప్రత్యేక సమయంలో ఈ కృషి నిర్వర్తించాల్సిన తక్షణ కర్తవ్యాల గురించి ఈ కార్యక్రమంలో గాని, సంఘంయొక్క 1901 లో జరిగిన మూడవ కాంగ్రెస్ అంగీకరించినట్టి కార్యక్రమానుబంధంలోగాని (''రెండు కాంగ్రెస్‌లు,'' పుటలు 15–18) ఒక్క ముక్క అయినా లేదు కదా. సర్వప్రపంచంలోనూ వున్న అందరు సోషల్-డెమోక్రాట్లూ ఈ సమస్యలను గురించి నానాక్షోభ పడుతూన్నప్పటికీ, ఈ కాలమంతటిలోనూ ''రబోచెయె దేలొ'' సంపాదకవర్గం ఈ సమస్యలను పూర్తిగా వదలిపెట్టేసింది.

తద్విరుద్ధంగా ఇటీవలి సంవత్సరాలలో సిద్ధాంతం పట్ల ఆసక్తి తగ్గిపోయిందని మొదట చూపిస్తూ, ''శ్రామికవర్గ విప్లవోద్యమం యొక్క సైద్ధాంతిక దృశ్యం పట్ల తీవ్రమైన శ్రద్ధవహించాలని'' పట్టువిడవకుండా డిమాండుచేస్తూ, మన ఉద్యమంలోని ''బెర్న్‌స్టయినిజం, తదితర విప్లవప్రతిఘాతక ధోరణులపై నిర్దాక్షిణ్యమైన విమర్శన జరగాలని'' పిలుపు ఇస్తూంది. ఈ కార్యక్రమం ఎంత వరకూ కొనసాగించబడిందో ఇంతవరకూ వెలువడినట్టి ''జార్య''[64] పత్రిక సంచికలు తెల్పుతున్నాయి.

చింతనా అస్థికరణము వగైరాలకు వ్యతిరేకంగా ఉచ్చరించబడుతూన్నట్టి డాంబిక పదజాలం, సైద్ధాంతిక చింతనాభివృద్ధి పట్ల నిర్లక్ష్యాన్నీ నిస్సహాయతనూ కప్పిపుచ్చుతూన్నట్టు ఈ విధంగా మనకు తెలిసి పోతూనే వుంది. ప్రసిద్ధి వహించిన ఈ విమర్శనా స్వేచ్ఛ అంటే ఒక సిద్ధాంతం స్థానే ఇంకొక సిద్ధాంతాన్ని నెలకొల్పడం గాక, సమైక్యపరచబడినట్టి సమగ్రంగా పరిశీలించబడినట్టి ఎట్టి సిద్ధాంతమూ లేకుండా వుండడమే అని యూరప్ అంతటా సామాన్యంగా అవుపడే (చాలా కాలం కిందటే జర్మన్ మార్క్సిస్టులచే నిర్ధరించబడినట్టి) దృగ్విషయానికి, రష్యన్ సోషల్-డెమోక్రాట్లను గురించిన ఈ దృష్టాంతం అద్భుతమైన తార్కాణ మవుతూంది; సిద్ధాంత వరణతత్వమూ సూత్ర రాహిత్యములే దీని అర్థం. మార్క్సిజమ్ విస్తృతవ్యాప్తితోపాటు సిద్ధాంత స్థాయిలో కొంత

తగ్గుదల కూడా దానిని అనుగమించిందన్న విషయం, మన ఉద్యమం యొక్క నేటి వాస్తవ పరిస్థితితో ఏ మాత్రం పరిచయం గలవారికైనా కనబడక మానదు. ఆచరణలో మన ఉద్యమం యొక్క ప్రాముఖ్యత, ఆచరణలో అది సాధించిన విజయాలు వీటి ఫలితంగా, బహు స్వల్పమైనట్టి, లేదా అసలే మృగ్యమైనట్టి సైద్ధాంతిక శిక్షణ కల్గినవారు చాలామందే ఉద్యమంలో చేరారు. ''వాస్తవమైన ఉద్యమం వేసే ప్రతి అడుగుకూ ఒక డజను కార్యక్రమాలకు మించిన విలువ వుంటుంది,''[65] అని మార్క్స్ నుడివిన వాక్యాన్ని విజయగర్వంతో ''రబోచెయె దేలో'' ఉదహరించడమునుబట్టి అది ఎంతటి అవివేకాన్ని ప్రదర్శించుతూందో మనుకు తెలుస్తూంది. సైద్ధాంతికంగా అల్లకల్లోలం చెలరేగుతూన్న సమయంలో ఈ వాక్యం పునశ్చరణ చేయడం ఎలావుందంటే, తద్దినానికి భోక్తగా రమ్మని పిలిస్తే, ''రోజూ మీ ఇంట ఇల్లాగే జరగాలి!'' అని దీవించనట్టే వుంది. ఇంతే కాదు, గోతా కార్యక్రమంపై[66] మార్క్స్ రాసిన వుత్తరం నుండి ఈ వాక్యం ఉదహరించబడుతూంది; సూత్రాలను రూపొందించడంలో సిద్ధాంత వరణతత్వాన్ని అతడా వుత్తరంలో నిశితంగా ఖండించుతాడు; పార్టీ నాయకుల పేర రాస్తూ అతడీలా అంటాడు: ''మీరు పరస్పరం ఏకీభవించడం అవసరమైతే, ఉద్యమం యొక్క ఆచరణీయ ఆశయాలను సాధించేటట్టుగా ఒప్పందాలు చేసుకోండి, అంతేగాని సూత్రాలపై ఏ విధమైన బేరసారాలకూ ఒప్పుకోకండి, సైద్ధాంతిక సమస్యలపై ఎట్టి 'రాయితీలూ' చూపించకండి.'' ఇదీ మార్క్స్ అభిప్రాయం; అయినప్పటికీ సిద్ధాంత ప్రాముఖ్యతను తగ్గించివేయడానికి — ఆయన పేరుతోనే — ప్రయత్నించే మనుషులు మనలో కొందరు లేకపోలేదు!

విప్లవాత్మక సిద్ధాంతం లేనిదే విప్లవాత్మక ఉద్యమం ఉండేందుకే వీలుండదు. ఫాషనుగా రూపొందిన అవకాశవాద ఉపదేశమూ, ఆచరణీయ క్రియాకలాపం యొక్క అత్యంత సంకుచిత రూపాలకు వెర్రిగా ఎగబడడమూ — ఈ రెండూ చెట్టాపట్టాలు వేసుకుని తిరుగుతూన్న కాలంలో ఈ చింతన గురించి ఎంత ఒత్తి చెప్పినప్పటికీ ఇంకా చాలదు. రష్యన్ సోషల్-డెమోక్రాట్లకు, తరుచుగా విస్మరించబడుతూన్నట్టి మరి మూడు సందర్భాల కారణంగా, సిద్ధాంతంయొక్క ప్రాముఖ్యత మరింత అధికమవుతూంది; మొదటిది, మన పార్టీ ఇంకా రూపొందే ప్రక్రియలోనే వుంది, దాని ముఖాకృతి ఇంకా ఇప్పుడిప్పుడే రేఖామాత్రంగా ఏర్పడుతూంది, కాగా ఉద్యమాన్ని యథార్థమార్గం నుండి పెడదారులకు మళ్లించే ప్రమాదంలో పడవేసేటట్టి ఇతర విప్లవాత్మక చింతనా ధోరణులతో నిష్కర్షగా తేల్చుకునే స్థితికి అదింకా ఎంతో దూరంలో వుంది కూడా. తద్విరుద్ధంగా అచ్చంగా ఈ దరిమిలా నిన్నమొన్నటి కాలం, సోషల్-డెమోక్రాటిక్ విప్లవేతర ధోరణులను — ఈలా సంభవించుతుందని అక్సెల్‌రోడ్ ఎంత కాలం కిందటో ఆర్థికవాదులను హెచ్చరిక చేసినట్టి ధోరణులను — పునరుజ్జీవింప

జేసే స్వభావం కలిగి వుంది. ఈ సందర్భాల్లో, ''ప్రాముఖ్యత లేనట్టే'' తొలిచూపుకి అవుపడేటట్టి పొరపాటు అత్యంత శోచనీయములైన ఫలితాలకే దారితీయవచ్చు; కాగా గ్రూపు వివాదాలూ, భేదాభిప్రాయ ఛాయలను కఠినమైన విభేదాలుగా పరిగణించడమూ సమయోచితము కాదనీ, లేదా అనావశ్యకమనీ కేవలం హ్రస్వదృష్టిగలవారే భావించుతారు. అదో ఇదో, ఏదో ఒక ''ఛాయ''ను పటిష్ఠవంతం చేయడం పైనే రష్యన్ సోషల్-డెమోక్రసీ భవిష్యత్తు అనేక సంవత్సరాల వరకూ ఆధారపడి వుంటుంది.

రెండవది, అసలు దాని అంతస్సారంలో సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమం అంతర్జాతీయోద్యమం. జాతీయ దురహంకారంపై మనం పోరాడవలసి వుండడమే కాకుండా, బాల్య దశలోనే వున్న ఒక దేశంలో మొదలవుతూన్న ఉద్యమం, ఇతర దేశాల అనుభవాన్ని ప్రయుక్తం చేసుకున్నప్పుడే అది విజయవంతం కాగల్గుతుందని దీని అర్థం. కాగా ఈ అనుభవాన్ని ప్రయుక్తం చేసుకుందుకు, దానితో కేవలమూ పరిచయం వుండడంతోనే, లేదా దరిమిలా తీర్మానాలకు కేవలమూ నకళ్లు తయారు చేసుకోవంతోనే సరిపోదు. ఈ అనుభవాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించేందుకూ, దానిని స్వతంత్రంగా శోధించేందుకూ సామర్థ్యం కూడా అవసరమే. ఈ కర్తవ్యం నెరవేర్చడానికి, సైద్ధాంతిక శక్తులూ రాజకీయ (దీనితో పాటుగానే విప్లవాత్మక) అనుభవమూ అనే బ్రహ్మాండమైన నిధులు ఎంత అవసరమో, ఆధునిక కార్మిక వర్గ ఉద్యమం ఎంత విస్తారంగా వృద్ధిచెంది శాఖోపశాఖలుగా విస్తరిల్లిందో ఆకళింపు చేసుకున్న వాడెవడైనా సరే అర్థం చేసుకోగల్గుతాడు.

మూడవది, రష్యన్ సోషల్-డెమోక్రసీ జాతీయ కర్తవ్యాలు ఎటువంటివంటే, ప్రపంచంలోని మరేయితర సోషలిస్టు పార్టీ అట్టి వాటిని ఎదుర్కొని వుండలేదు. నిరంకుశ ప్రభుత్వం మోపిన గాటనుండి ప్రజలందరినీ విముక్తి చేయవలసిన కర్తవ్యం మనపై విధించినట్టి రాజకీయ, ఆర్గనైజేషనల్ విధులను గురించి ప్రస్తావించడానికి మనకు మీదటికి అవకాశం కల్గుతుంది. పురోగమన శీలమైన సిద్ధాంతంచే నడపబడిన పార్టీయే అగ్రగామి యోధుని పాత్రను నిర్వర్తించ గల్గుతుంది అనే విషయం మాత్రమే ఇక్కడ చెప్పదల్చుకున్నాం. దీని అర్థం ఏమిటో యేమాత్రం నిర్దిష్టంగానైనా తెలుసుకుందుకు, నేటి రష్యన్ సోషల్-డెమోక్రసీకి ముందుండినట్టి గేర్ త్సెన్, బెలిన్స్కి, చెర్నిషేవ్స్కిలనూ, 1870 లనాటి ఉజ్వల విప్లవ వీరుల నక్షత్రపుంజాన్ని పాఠకుడు జ్ఞప్తికి తెచ్చుకుంటే సరి; ఈనాడు రష్యన్ సారస్వతం సంపాదించుకుంటూన్నట్టి ప్రపంచ ప్రాముఖ్యతను గురించి ఆలోచించుకుంటే సరి; ఈ మాత్రం చాలు!

సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమంలో సిద్ధాంత ప్రాముఖ్యతను గురించి 1874 లో ఎంగెల్స్ చెప్పిన మాటలను ఉల్లేఖించుదాం. సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమంలో, మనలో

ఇప్పుడు ఫాషన్ అయినట్టు, రెండు (రాజకీయ, ఆర్థిక) రూపాలే కాకుండా, మూడింటిని ఎంగెల్స్ గుర్తించుతూ, సైద్ధాంతిక పోరాటం అనే మూడవ దానిని ఈ రెండింటి సరసనూ నిలబెట్టాడు. ఆచరణలోనూ రాజకీయంగానూ బలోపేతంగా అభివృద్ధి చెందినట్టి జర్మన్ కార్మికవర్గ ఉద్యమాన్ని సంబోధిస్తూ అతడు నుడివిన తుది హెచ్చరిక వచనాలు ఆధునిక సమస్యలు, వివాదాల దృష్ట్యా ఎంత జ్ఞానబోధకంగా వున్నాయంటే, నేడు అపురూప గ్రంథమైపోయినట్టి అతని "Der deutsche Bauernkrieg"* ఉపోద్ఘాతం నుండి సుదీర్ఘమైన ఖండాన్నే ఉల్లేఖించుతూన్నందుకు పాఠకుడు మమ్మల్ని తప్పుపట్టడనే ఆశిస్తున్నాం.

''యూరప్‌లోని కడమ కార్మికులందరి కంటెనూ, జర్మన్ కార్మికులకు ముఖ్యంగా అనుకూలమైన విషయాలు రెండున్నాయి. మొదటిది, వీరు యూరప్‌లో సైద్ధాంతిక మనస్కులందరిలోనూ అగ్రగణ్యుల కోవకు చెందినవారు; కాగా జర్మనీలో 'విద్యావంతు' లని చెప్పబడుతూన్నవారు ఇంచుమించు పూర్తిగా పోగొట్టుకున్నట్టి సైద్ధాంతిక జ్ఞానాన్ని వీరు నిలబెట్టుకున్నారు. జర్మన్ శాస్త్రీయ సోషలిజం — ఇంతవరకూ ఉనికి కల్గివుండినట్టి ఏకైక శాస్త్రీయ సోషలిజం — దానికి ముందుండినట్టి జర్మన్ తత్వశాస్త్రం, విశేషించి హెగెల్ తత్వశాస్త్రం, లేనిదే అది ప్రాదుర్భవించి వుండేదే కాదు. కార్మికులలో సైద్ధాంతిక జ్ఞానం లేనిదే ఈ శాస్త్రీయ సోషలిజం వారి చీము రక్తాల్లోకి ఎక్కి వారికి వాస్తవంగా ఒంటపట్టినట్టుగా ఒంటపట్టి వుండేదికాదు. కాగా ఇది ఎంతటి అపారమైన అనుకూల విషయమో, ఇటు ఇంగ్లండులోని వేర్వేరు వృత్తులు ఎంత భేష్మైన ఆర్గనైజేషను కలిగి వున్నప్పటికిన్నీ ఇంగ్లండులోని కార్మికవర్గోద్యమం కాళ్లీడ్చుకుంటూ నడవడానికి ముఖ్యకారణాల్లో ఒకటైనట్టి సైద్ధాంతిక ఉదాసీనతనూ, అటు ఫ్రెంచివాళ్లల్లోనూ బెల్జియన్లలోనూ ప్రూడనిజం తొలి రూపమూ, స్పానిష్‌వాళ్లల్లోనూ ఇటాలియన్లలోనూ బకూనిన్ దానిని వికృతపరచిన రూపమూ తీసుకొచ్చిన అల్లర, గందరగోళాన్నీ చూసినట్టయితే తెలుస్తుంది.

''రెండవ అనుకూల విషయం యేమిటంటే, కార్మికోద్యమంలోకి దిగినవారిలో, కాలక్రమానుసారంగా చూసినట్టయితే, జర్మన్లే ఇంచుమించు ఆఖరివారు. ఎవరి భావాలైతే ఎంత చోద్యములూ ఎంత ఊహాజగజ్జనితములూ అయినప్పటికీ, సర్వకాలాలకూ చెందినట్టి ఉన్నత భావుకులలో అగ్రస్థానం వహించుతున్నారో, ఈనాడు మనచే శాస్త్రీయంగా యథార్థములని రుజువు చేయబడుతూన్నట్టి అసంఖ్యాకములైన విషయాలను ఎవరి ప్రతిభ ముందుగానే

---

* Dritter Abdruck. Leipzig. 1875. Verlag der Genossenschafts buchdruckerei. (''జర్మనీలో రైతు సంగ్రామం.'' మూడవ కూర్పు. లైప్‌జిగ్, 1875. సహకారసంఘ ప్రచురణకర్తలు. — సం.)

తెలుసుకుందో అట్టి సెయింట్-సిమోన్, ఫోరియర్, ఓవెన్‌లు నిర్మించిన పునాదుల పైనే తాను నిల్చివున్నట్టు జర్మన్ సైద్ధాంతిక సోషలిజం ఏలాగైతే ఎన్నటికీ మరచిపోదో ఆలాగే ఇంగ్లీషు, ఫ్రెంచి ఉద్యమాలు నిర్మించిన పునాదులపై తాను అభివృద్ధి చెందిన విషయమూ, కేవలమూ వాటి కష్టార్జితానుభవాలనే తాను ఉపయోగించుకో గల్గాననీ, ఆనాడు వాటికి చాలా వరకూ అనివార్యములే అయి వుండినట్టి పొరపాట్లను నేడు తాను నివారించుకో వచ్చు ననీ జర్మనీలోని ఆచరణయుత కార్మికోద్యమం ఎన్నటికీ మరువ వీల్లేదు. ఇంగ్లీషు ట్రేడ్ యూనియన్ల, ఫ్రెంచి కార్మికుల రాజకీయ పోరాటాల ప్రమాణాలు లేనిదే, ముఖ్యంగా పారిస్ కమ్యూన్ ఇచ్చిన బ్రహ్మాండమైన ఉత్తేజం లేనిదే మనమిప్పుడు యెక్కడ వుండేవారమో కదా?

''తమకుండిన అనుకూల పరిస్థితులను అసమాన ప్రతిపత్తితో వినియోగించుకున్నందుకు జర్మన్ కార్మికులను మెచ్చుకోవడం న్యాయమే. కార్మికవర్గ ఉద్యమం మనుతూండిన ఇన్ని రోజుల్లోనూ తొలిసారిగా ప్రణాళికా బద్ధమైనట్టి పరస్పర సంబంధం కల్గినట్టి దాని మూడు దిక్కులనుండీ — సైద్ధాంతిక, రాజకీయ, ఆచరణయుత-ఆర్థిక (పెట్టుబడిదార్లతో ప్రతిఘటన) దిక్కులనుండీ — పోరాటం నడిపించబడుతూంది. జర్మన్ ఉద్యమం బలమూ అజేయ స్వభావమూ, ఒక విధంగా చెప్పదగినట్టి ఈ ఏకకేంద్రీయమైన దాడిలోనే సరిగా వుంది.

''ఇటు ఈ అనుకూల పరిస్థితి ఫలితంగానూ, అటు ఇంగ్లీషు ఉద్యమానికున్న ద్వీప స్థితిజనితమైన అసాధారణ స్వభావం వల్లనూ ఫ్రెంచి ఉద్యమాన్ని బలప్రయోగం చేసి అణచి వేయడం వల్లనూ, ఈ క్షణానికి జర్మన్ కార్మికులు శ్రామికవర్గ పోరాటం అగ్రస్థానమందు నిలబడాల్సి వచ్చింది. ఈ గౌరవ స్థానంలోనే వారింకా వుండేటట్టు చారిత్రాత్మక ఘటనలు వారికింకా ఎంత కాలం అవకాశం కల్పిస్తాయో ముందుగానే చెప్పలేం. అయినప్పటికీ వారు ఆ స్థానంలోనే వున్నంత కాలమూ దానిని ఉచితరీతిని నిర్వహిస్తారనే ఆశించుదాం. ఇందుకు పోరాట, ఆందోళనల ప్రతీ రంగంలోనూ ద్విగుణీకృత యత్నం అవసరం. విశేషించి అన్ని సమయాల్లోనూ అన్ని సైద్ధాంతిక సమస్యలనూ నిర్మలదృష్టితో పరిశీలనా, పాతకాలపు ప్రపంచదృక్పథం నుండి వారసత్వంగా సంక్రమించిన సంప్రదాయక పదజాల ప్రభావం నుండి అంతకంతకు మరింతగా తాము బయట పడడమూ, సోషలిజం ఇప్పుడొక శాస్త్రంగా మారిన కారణంగా దానినొక శాస్త్రంగా అభ్యసించడము, అనగా అధ్యయనం చేయడమూ నాయకుల విధ్యుక్తధర్మం. ఈ విధంగా సంపాదించుకున్నట్టి, నానాటికి అంతకు మరింతగా నిర్మల మవుతూన్నట్టి ప్రతిపత్తిని, అంతకు మరింత ఉత్సాహంతో కార్మికరాసులలో విస్తరింపజేయ డమే; పార్టీ, ట్రేడ్‌యూనియన్ల ఆర్గనైజేషనును నానాటికి అంతకు మరింత పటుతరంగా దృఢపర్చడమే. దీనికి మార్గం...

"...ఈ మార్గంలోనే గనుక జర్మన్ కార్మికులు ముందుకు పురోగమించుతే, సరిగ్గా ఉద్యమం అగ్రస్థానమందే వారు నడవరు — ఏ ఒక్క దేశపు కార్మికులు ఉద్యమం అగ్రస్థాన మందు నడవడమూ ఉద్యమానికి ఎంత మాత్రమూ మంచిది కాదు; అయినప్పటికీ వారు యుద్ధశ్రేణిలో గౌరవస్థానమే ఆక్రమించుకుంటారు; కాగా మరింత అధికమైన పరాక్రమమూ ఉన్నత సంకల్ప శక్తిసామర్థ్యములూ వారు ప్రదర్శించి ఎదుర్కొన వలసినట్టి ఎన్నడూ అనుకోనంతటి ప్రమాదభరితములైన ఘటనలు వారిమీద వచ్చిపడినప్పుడు, యుద్ధసన్నద్ధులై వారు రణరంగంలో నిలబడతారు."[67]

ఎంగెల్స్ వాక్యాలు జోస్యములే అయాయి. కొద్ది సంవత్సరాల లోపలనే, సోషలిస్టు వ్యతిరేక చట్టం రూపంలో ఎన్నడూ అనుకోనంతటి ప్రమాదభరితమైన అగ్నిపరీక్షలకు వారు గురికావలసి వచ్చింది. కాగా జర్మన్ కార్మికులు యుద్ధసన్నద్ధులై రణరంగంలో నిలబడి వాటిని ఎదుర్కొని వాటిపై విజయం సాధించారు.

రష్యన్ శ్రామికవర్గం ఇంతకంటె అమిత ప్రమాదభరితములైన అగ్నిపరీక్షలనే అనుభవించాల్సి వుంటుంది; అది పోరాడ వలసిన బ్రహ్మరాక్షసితో సరిపోల్చితే రాజ్యాంగబద్ధమైన దేశంలోని సోషలిస్టు వ్యతిరేక చట్టం ఒక మరుగుజ్జులాగానే కనబడుతుంది. ఏ దేశంలోని శ్రామికవర్గము యెదుటా నిలబడనట్టి తక్షణ కర్తవ్యాలన్నిటిలోనూ అత్యంత విప్లవాత్మకమైన తక్షణ కర్తవ్యాన్నే చరిత్ర మన యెదుట నిలబెట్టింది. ఒక్క యూరప్‌లో వున్న అభివృద్ధి నిరోధకం యొక్కే కాకుండా, ఆసియాలో వున్న అభివృద్ధి నిరోధకం యొక్క (అలాగని చెప్పడానికి ఇప్పుడు వీలుపడుతూంది) అత్యంత బలోపేతమైన కోటబురుజును విజయోపేతంగా విధ్వంస మొనరించడమనే ఈ కర్తవ్య నిర్వహణ, రష్యన్ శ్రామికవర్గాన్ని అంతర్జాతీయ విప్లవాత్మక శ్రామివర్గంయొక్క అగ్రగామి దళంగా రూపొందించుతుంది. కాగా మన ముందరివారు ప్రదర్శించిన భక్తిపూరిత సంకల్పమూ, క్రియాశీలశక్తితోనే వెయ్యిరెట్లు అధిక వైశాల్యమూ, నిమ్నమూ కలిగిన మన ఉద్యమాన్ని కూడా ఉత్తేజపరచడంలో మనం విజయం సాధించే పక్షమందు, మన ముందరివారు, 1870 ల విప్లవకారులు ఇదివరకే గడించిన ఈ గౌరవ బిరుదాన్ని సంపాదించుకుంటామని పరిగణించే హక్కు మనకూ వుంటుంది.

# II. ప్రజారాసుల అయత్నకృతమూ, సోషల్-డెమోక్రసీ చైతన్యమూ

## ఎ) అయత్నకృత వెల్లువ ఆరంభం

విద్యావంతులైన రష్యన్ యువకులు మార్క్సిజం సిద్ధాంతంపట్ల 1890 మధ్య సంవత్సరాల్లో ఎంతటి సర్వసామాన్యమైన ఉత్సాహాన్ని ప్రదర్శించారో పై ప్రకరణంలో వివరించాం. ప్రసిద్ధిగాంచిన 1896 సెయింట్ పీటర్స్‌బర్గ్ పారిశ్రామిక సమరం[68] అనంతరం జరిగిన సమ్మెలు కూడా ఇటువంటి సర్వసామాన్య స్వభావాన్నే ప్రదర్శించాయి. ఈ సమ్మెలు రష్యా అంతటా వ్యాపించాయన్న విషయం గమనించినట్టయితే ఈ నూతన జాగృతి ప్రజా ఉద్యమంలో ఎంత లోతుగా చొచ్చుకొనిపోయి వుండెనో మనకు స్పష్టంగా తెలుస్తుంది; కాగా "అయత్నకృత మూలద్రవ్యం" అని దేని గురించైనా మనం చెప్పదల్చుకుంటే, ప్రప్రథమంగా ఈ ఉద్యమమే అయత్నకృతమైనదని భావించడం సహజంగా వుంటుంది. అయితే మాత్రం, అయత్నకృతంలోనూ రకాలున్నాయి. 1870 లలోనూ 1860 లలోనూ (పంధొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధంలో కూడానూ) రష్యాలో సమ్మెలు జరిగాయి; సమ్మెలలో యంత్రాల "అయత్నకృత" విధ్వంసం, మొదలైన కార్యాలు కూడా జరిగాయి. ఈ "పితూరీల"తో సరిపోల్చి చూస్తే 1890 లలో జరిగిన సమ్మెలు, కార్మికవర్గోద్యమం ఆ కాలావధిలో సాధించిన ప్రగతి మేరకు, "చైతన్యవంతములే" అని చెప్పవచ్చు కూడా. అసలు దాని ఉనికిలో ఈ "అయత్నకృత మూలద్రవ్యం," అంతో యింతో అచ్చమైన చైతన్యం యొక్క అంకుర రూపం ప్రదర్శిస్తూందని మనకు తెలుస్తూంది. ఆదిమావస్థకు చెందిన ఈ పితూరీలు సహితమూ చైతన్య జాగృతిని కొంత వరకు వ్యక్తం చేస్తున్నాయి: తమ్ము హింసించుతూన్న వ్యవస్థ శాశ్వతమని యుగయుగాలనాటి తమ నమ్మిక ఇప్పుడు సడల నారంభించింది. సమిష్టి ప్రతిఘటన ఆవశ్యకతను వారు — అర్థం చేసుకున్నారని నేను చెప్పకపోయినా — లీలామాత్రంగా గ్రహించనారంభించి, తమపై పెత్తనం చలాయిస్తూన్న వారిపట్ల తమ దాస్యభావపు విధేయతను చూపించడం మాత్రం సుతరామూ మానేశారు. తత్రాపి దీని స్వభావం పోరాటం కంటె, నిరాశ ప్రతీకారములు వెల్లువికడం వంటిది. 1890 లనాటి సమ్మెలు ఇంతకంటె

ఏన్నో రెట్లు చైతన్య లక్షణాలనే ప్రదర్శించాయి: డిమాండ్లు ముందుకు తీసుకురాబడ్డాయి, సమ్మెకు అనుకూలమైన తేదీ జాగ్రత్తగా నిర్ణయించబడింది; వారికి తెలిసిన సమ్మె దృష్టాంతాలనూ ఇతరత్రా జరిగిన ఉదాహరణలనూ చర్చించడము వగైరాలు జరిగాయి. వెనకటి పితూరీలు కేవలము పీడితుల తిరుగబాట్లే అయివుండగా, వ్యవస్థాత్మకంగా నడిపించబడిన సమ్మెలు, అంకుర రూపంలో — తత్రాపి అంకుర రూపంలోనే — వున్న వర్గపోరాటాన్నే ప్రదర్శించాయి. వాటిమటుకవి ఈ సమ్మెలు కేవలం ట్రేడ్‌యూనియన్ పోరాటాలే; సోషల్-డెమోక్రాటిక్ పోరాటాలుగా అవి ఇంకా రూపొందలేదు. కార్మికులకూ యజమాన్లకూ మధ్యవుండే వైషమ్యాల జాగృతికి అవి నిదర్శనలై వుండేవి; కాని యావత్తు ఆధునిక రాజకీయ, సామాజిక వ్యవస్థ ప్రయోజనాలకూ తమ ప్రయోజనాలకూ మధ్య పరస్పర విరుద్ధమైన వైషమ్యం వుందన్న చైతన్యం వారికి అప్పట్లో లేదు, వుండడానికి వీలూ లేదు. ఈ అర్థంలో 1890 ల సమ్మెలను ''పితూరీల''తో సరిపోల్చి చూచినప్పుడు విస్తారమైన ప్రగతినే అవి ప్రదర్శించినప్పటికీ, స్వచ్ఛమైన అయత్నకృత ఉద్యమంగానే అవి వుండిపోయాయి.

కార్మికులకు సోషల్-డెమోక్రాటిక్ చైతన్యం కలగడానికి అప్పటికింకా వీల్లేకపోయింది అని చెప్పాం. దీనిని వారికి బాహ్యంనుండే తీసుకురావాల్సి వుండెను. కార్మికవర్గం తానంతట తానుగా స్వశక్తిపైనే ఆధారపడి, కేవలం ట్రేడ్‌యూనియన్ చైతన్యాన్నే, అనగా సంఘాలలో చేరి ఏకమవడం, యజమానులతో పోరాడడం, అవసరమైన శాసననిర్మాణం జరిగేటట్టు ప్రభుత్వాన్ని బలవంతపెట్టేందుకు పాటుపడడం వగైరాలు ఆవశ్యకమనే నమ్మికనే, అభివృద్ధిపరచుకోగల్గుతుందని అన్ని దేశాల చరిత్ర నిరూపించుతూంది.* ఏమైనప్పటికీ సోషలిజం సిద్ధాంతం మాత్రం ఆస్తిపరుల వర్గంలోని విద్యావంతులైన ప్రతినిధులచే, అనగా మేధావి స్తరంచే విపులీకరించబడిన తాత్విక, చారిత్రక, ఆర్థిక సిద్ధాంతాల నుండే అభివృద్ధి పొందింది. వారి సామాజిక హోదా ననుసరించి, ఆధునిక శాస్త్రీయ సోషలిజం స్థాపకులు మార్క్స్, ఎంగెల్స్‌లు కూడా బూర్జువా మేధావిస్తరానికి చెందినవారే. సరిగా అదే విధంగా, రష్యాలో కూడా సోషల్-డెమోక్రసీ సైద్ధాంతికోపదేశం కార్మికవర్గోద్యమం యొక్క అయత్నకృతమైన అభివృద్ధితో ఏమాత్రం సంబంధం లేకుండా స్వతంత్రంగానే ఉద్భవించింది; విప్లవా

---

*అప్పుడప్పుడు అనుకునేటట్టుగా కాకుండా, ట్రేడ్‌యూనియనిజం అన్ని ''రాజకీయాలనూ'' మినహాయించదు. ట్రేడ్‌యూనియన్లు యెల్లప్పుడూ యేదో వొక రాజకీయ (సోషల్-డెమోక్రాటిక్ రాజకీయం మాత్రం కాదు) ఆందోళననూ, పోరాటాన్నీ సాగిస్తూనే వుండేవి. ట్రేడ్‌యూనియన్ రాజకీయాలకీ సోషల్-డెమోక్రాటిక్ రాజకీయాలకీ వుండే తేడా గురించి వచ్చే ప్రకరణంలో ప్రస్తావిస్తాం.

త్మక సోషలిస్టు మేధావిస్తరంలో వుండిన భావాలయొక్క అనివార్యమైన, ప్రకృతిసిద్ధమైన అభివృద్ధినుండే అది ఉద్భవించింది. మనమిప్పుడు ఏ కాలం గురించైతే ప్రస్తావిస్తున్నామో ఆ కాలంలో, అనగా 1890 ల మధ్య సంవత్సరాలలో, "శ్రమ విమోచన" గ్రూపుయొక్క సమగ్రంగా సూత్రీకరించబడిన కార్యక్రమాన్నే ఈ ఉపదేశం సూచించి వుండడమే కాకుండా, రష్యాలో విప్లవాత్మకులైన యువకులలో అధికసంఖ్యాకవర్గాన్ని అప్పటికే తనవైపు ఆకర్షించుకుంది.

ఈ విధంగా కార్మికరాసులు అయత్నకృతమైన జాగృతి, చైతన్యవంతమైన జీవితానికీ చైతన్యవంతమైన పోరాటానికీ జాగృతి, సోషల్-డెమోక్రాటిక్ సైద్ధాంతిక ఆయుధాన్ని ధరించి కార్మికులతో సంబంధాలు ఏర్పరచుకోడానికి తీవ్రంగా ఆత్రపడుతూన్న విప్లవాత్మక యువజనమూ ఆనాడు మనకి తారసిల్లాయి. ఈ సందర్భంలో, ఆ కాలంనాటి (అప్పటికింకా లిఖితప్రతి రూపంలోనే వుండిన "ఆందోళన గురించి" అనే పాంఫ్లెట్‌లో వివరించబడి, నిజంగా యెంతో ఉపయోగకరమైన ఆదేశాలను అనుసరించినట్టి) తొలి సోషల్-డెమోక్రాట్లు ఆర్థికాందోళన పట్టుదలతో సాగించారన్నట్టి, తరుచుగా విస్మరించబడుతూన్నట్టి (కాగా సాపేక్షంగా చాలా కొద్దిమందికే తెలిసినట్టి), విషయాన్ని పేర్కొనడం ఎంతైనా ముఖ్యం; అయినప్పటికీ దీనినే తమ ఏకైక కర్తవ్యంగా వారు భావించలేదు. తద్విరుద్ధంగా మొట్టమొదట నుండీ కూడా స్థూలంగా రష్యన్ సోషల్-డెమోక్రసీ యొక్క అత్యంత విస్తృతమైన చారిత్రాత్మక కర్తవ్యాలనూ, సూక్ష్మంగా నిరంకుశ పరిపాలనను కూలదోయడమనే కర్తవ్యాన్నీ వారు ముందుకు తీసుకొచ్చారు. ఉదాహరణకు, అప్పటికప్పుడే 1895 ఆఖరికే, "రబోచెయె దేలొ" వార్తాపత్రిక మొదటి సంచికను "కార్మికవర్గ విముక్తి పోరాట సమితిని"[69] స్థాపించిన సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోని సోషల్-డెమోక్రాట్ల గ్రూపు సిద్ధంచేసి వుంచింది. ఈ సంచిక అచ్చుకు తయారుగా వుండగా, 1895 డిసెంబరు 8 రాత్రి ఆ గ్రూపు సభ్యులలో ఒకడైన అనతోలి అలెక్సేయెవిచ్ వనేయెవ్* ఇంటిపై సాయుధ పోలీసులు దాడి చేశారు; తత్ఫలితంగా "రబోచెయె దేలొ" తొలి సంచికకు వెలుగులోకి రాలేకపోయిన గతి పట్టింది. ఈ సంచికలోని

---

*ఎ. ఎ. వనేయెవ్ తనకు ప్రవాస శిక్ష విధించబడే ముందు జైలులో ఏకాంతవాస శిక్ష అనుభవించుతూన్నప్పుడు సోకిన క్షయవ్యాధి కారణంగా 1899 లో తూర్పు సైబీరియలో చనిపోయాడు. ఈ హేతువును ఎ. ఎ. వనేయెవ్‌తో ఆత్మీయంగా వుండి అతనితో సరాసరి పరిచయం కల్గిన వ్యక్తులనుండి ఈ సమాచారం అందడం కారణంగా దాని యథార్థతకు మేము పూచీపడుతూ దీనిని ప్రచురించడానికి సాధ్యపడుతూందని మేము భావించాం.

ప్రధానవ్యాసం (బహుశ ఏ ముప్ఫై య్యేళ్ల తరువాతో ఏ ''రూస్కయ స్తరినా''* మాసపత్రికో ఒకటి పోలిసు శాఖ పాత కవిలెల నుండి వెలికి తీస్తే తీయవచ్చునేమో), రష్యాలోని కార్మిక వర్గం యొక్క చారిత్రాత్మక కర్తవ్యాలను, ఏ కర్తవ్యాలలో నైతే రాజకీయస్వేచ్ఛా సాధన అతి ప్రధానమైనదిగా భావించబడుతూందో అట్టి కర్తవ్యాలను వివరించింది. అక్షరాస్యత సమితులను పోలీసులు భగ్నం చేయడమును చర్చించుతూ, ''మన మంత్రులు దేన్ని గురించి ఆలోచించుతున్నారు?'' అనే శీర్షికగల వ్యాసం కూడా ఈ సంచికలో వుండెను. ఈ వ్యాసాల తోపాటు, సెయింట్ పీటర్స్‌బర్గ్ నుండే కాకుండా, రష్యా ఇతర భాగాలనుండి కూడా (ఉదాహరణకు, యరొస్లావ్ల్ గుబేర్నియాలో కార్మికులపై జరిపిన దాడిగురించిన లేఖ[70]) ఉత్తర ప్రత్యుత్తరాలూ అందులో వుండెను. మేము పొరపాటు పడకపోయిన పక్షంలో, 1890 లలోని రష్యన్ సోషల్-డెమోక్రాట్ల ఈ ''ప్రథమ యత్నం'' సంకుచితమూ స్థానికమూ అయి, కేవలం ''ఆర్థికవిషయ'' వార్తాపత్రిక కాకుండా, నిరంకుశపరిపాలనా వ్యతిరేకమైన విప్ల వోద్యమంతో సమ్మె ఉద్యమాన్ని ఐక్యపరచడమునూ, అభ్యుదయ నిరోధకమైనట్టి అంధ కారాభిమాన విధానంచే హింసించబడినవారినందరినీ సోషల్-డెమోక్రసీ వైపు తిప్పుకొనే యత్నమునూ లక్షించిన వార్తాపత్రిక. ఇటువంటి వార్తాపత్రికకు రాజధాని కార్మికులయొక్క, విప్లవాత్మక మేధావిస్తరంయొక్క సంపూర్ణ సానుభూతిని సంపాదించివుండేదనీ, విస్తృత ప్రచారం కల్గివుండేదనీ, ఆ కాలపు ఉద్యమపరిస్థితులతో ఏ మాత్రం పరిచయం వున్నవారూ సందేహించి వుండరు. విప్లవానుభవమూ, ఆచరణలో శిక్షణా లేకపోవడం వల్లనే ఆ కాలపు అవసరాలను సోషల్-డెమోక్రాట్లు తీర్చలేకపోయారన్న విషయం మాత్రమే ఈ కార్య వైఫల్యం తెలియజేస్తుంది. ''సెయింట్ పీటర్స్‌బర్గ్ రబోచియ్ లిస్తోక్'' పత్రిక,[71] విశేషించి ''రబోచయ గజేత'' పత్రిక, 1898 లో రూపొందించబడిన రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ ''మానిఫెస్తో'' విషయంలోనూ ఇదే చెప్పాల్సివుంది. ఇట్టి అసంసిద్ధతకు ఆనాటి సోషల్-డెమోక్రాట్లను నిందించాల్సి వుంటుందనే ఉద్దేశం మనకెవ్వరకీ లవలేశమూ లేదని మనం వేరే చెప్పక్కరలేదు. కాని ఉద్యమం అనుభవం నుండి లాభం పొందాలంటేనూ, దాని నుండి ఆచరణీయమైన గుణపాఠాలు తెల్సాలంటేనూ, ఆ యా లోపాల కారణాలనూ, ఆంత ర్యాన్నీ మనం క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి. అందుచేత 1895–1898 కాలావధిలో పని చేస్తూండినట్టి సోషల్-డెమోక్రాట్లలో కొంత భాగం (బహుశా అధికసంఖ్యాకవర్గమే కూడా), అత్యంత విశాలమైన కార్యక్రమంతో, సమరశీలమైన ఎత్తుగడలతో ముందుకు రావడానికి ఆరోజుల్లోనే, ''అయత్నకృత'' ఉద్యమం మొట్టమొదటి రోజుల్లోనే, అవకాశం వుండినదని

* ''రూస్కయ స్తరినా'' (''రష్యన్ ప్రాచీనం'') – 1870 నుండి 1918 వరకూ సెయింట్ పీటర్స్‌బర్గ్ నుండి వెలువడిన చారిత్రవిషయక మాసపత్రిక. — అనువాదకుడు.

పూర్తిగా న్యాయంగానే భావించిందన్న విషయాన్ని స్థిరపరచడం ఎంతేనా ముఖ్యం.* విప్లవ కారులలో అధికసంఖ్యాకవర్గానికి శిక్షణ లోపించడం సహజమైన దృగ్విషయమే అయివుండడం వల్ల, ఇది ప్రత్యేకమైన భయాలను వేటినీ కల్గించి వుండేదికాదు. కర్తవ్యాలు యథార్థంగా నిర్వచించబడి వుండడం చేతనూ, ఈ కర్తవ్యాలను నెరవేర్చేందుకై మళ్ళీ మళ్ళీ ప్రయత్నాలు జరి పేందుకు శక్తి వుండడం చేతనూ తాత్కాలిక అపజయాలవల్ల సగం దురదృష్టమే కలుగుతుంది. విప్లవాత్మక అనుభవాలూ, ఆర్గనైజేషనల్ కౌశలమూ — వీటిని అలవర్చుకోవచ్చు. ఈ అవ సరమైన గుణాలను తనలో పెంపొందింపజేసుకునే ఇచ్ఛ వుండాలి మరి! లోపాలను గుర్తించే చైతన్యం వుండాలి మరి, విప్లవకార్యంలో ఇది వుంటే, సగంకంటె హెచ్చు లోపాలను దిద్దుకున్నట్టే!

కాని ఈ చైతన్యం (పైన పేర్కొన్న గ్రూపులోని కార్యకర్తలలో ఇది బాగా సజీ వంగానే వుండేది) సన్నగిల్లగానే, లోపాలను సుగుణాలుగా పొగడేటట్టి, అయత్నకృతం యెదుట దాసోహమంటూ సాష్టాంగపడడమునకూ వొక సైద్ధాంతిక ప్రాతిపదికను కల్పించడానికి సహి తమూ ప్రయత్నించినట్టి వ్యక్తులు — సోషల్-డెమోక్రాట్లలో సహితమూ — తలెత్తిన ప్పుడు, వెనకటి సగం దురదృష్టమల్లా ఇప్పుడు నిండు దురదృష్టమే అయి వూరుకుంటుంది. దేని విషయమైతే తప్పగానూ, మరీ సంకుచితంగానూ ''ఆర్థికవాదమ''ని వివరించబడు తూందో, అట్టి ఈ ధోరణినియొక్క సారాంశం తేల్చే తరుణమిప్పుడు ఆసన్నమైంది.

* ''1890 ఆఖరి సంవత్సరాల్లో సోషల్-డెమోక్రాట్ల క్రియాకలాపాల పట్ల శత్రు త్వం ప్రదర్శించడంలో, యేవో చిల్లర కోర్కెలకోసం పోరాటం తప్ప మరే యితరవిధమైన పని సాగించేందుకూ తగిన పరిస్థితులు ఆ రోజుల్లో లోపించిన విషయం 'ఇస్క్రా' విస్మరించు తూందని'', ''రష్య సోషల్-డెమోక్రాటిక్ పత్రికలకు లేఖ'' అనే తమ వ్యాసంలో ఆర్థిక వాదులు ఉద్ఘాటిస్తారు (''ఇస్క్రా,'' 12 వ సంచిక). పైన ఉదహరించిన వాస్తవ విష యాలనుబట్టి, ''లోపించిన పరిస్థితులు'' గురించిన ఉద్ఘాటన కేవలం సత్యవిరుద్ధమే అని తేల్తూంది. 1890 ల అంత్యంలోనే కాదుకదా, మధ్యలో సహితమూ, చిల్లర కోర్కెల కోసం పోరాడడానికే కాకుండా, ఇతర పనులకు అవసరమైన పరిస్థితులు — నాయ కులకు వలసినంత శిక్షణ మినహా — అన్నీ వుండేవి. మనకు, అనగా భావశాస్త్రవేత్తలకూ నాయ కులకూ వలసినంత శిక్షణ లోపించిందన్న విషయం చిత్తశుద్ధితో వొప్పుకోవడం బదులు — ''లోపించుతూన్న పరిస్థితుల'' పైనా, ఉద్యమాన్ని మళ్ళించడానికి ఏ భావశాస్త్రవేత్తకూ సాధ్యం కానట్టి మార్గాన్ని నిర్ణయించే భౌతిక పరిసరాల ప్రభావంపైనా నిందను తోసెయ్యా లని ''ఆర్థికవాదులు'' ఉద్దేశిస్తున్నారు. అయత్నకృతం యెదుట కేవలం బానిసమనస్తత్వంతో దాసోహం అనడమూ, ''భావశాస్త్రవత్తలకు'' తమ లోపాలపైనే వెర్రి వ్యామోహమూ కాక పోతే మరేమిటిది?

## బి) అయత్నకృతానికి సాష్టాంగం. "రబోచయ మీస్ల్"

ఈ సాష్టాంగం ధరించుతూన్న సారస్వత స్వరూపం గురించి ప్రస్తావించే ముందు, రష్యన్ సోషల్-డెమొక్రసీలోని భావి విరుద్ధ ధోరణులు రెండూ సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో పనిచేస్తూండిన కామ్రేడ్లలో తలెత్తి అభివృద్ధి పొందిన సందర్భాలను కొంతవరకూ బహిర్గతం చేయగలిగే ఈ దిగువ పేర్కొనబడినట్టి స్వాభావికమైన వాస్తవవిషయాన్ని (పైన చెప్పిన మూలాధారం నుండి మాకు తెలియజేయబడినట్టి), మేము వివరించాలనుకుంటున్నాం. 1897 ఆరంభమందూ, తాము ప్రవాసానికి పంపబడే ముందూ ఎ. ఎ. వనేయెవ్, అతనితో కలిసి పనిచేస్తూండిన కామ్రేడ్లు కొందరూ ఒక ప్రైవేటు సమావేశానికి[72] వెళ్లారు. ఆ సమావేశంలో "శ్రమ విముక్తి పోరాట సమితి" "వృద్ధ" సభ్యులూ, "యువ" సభ్యులూ పాల్గొన్నారు. ఆర్గనైజేషను పైనా, ముఖ్యంగా "లిస్తోక్ 'రబోత్నిక'"[73] 9–10 వ సంచిక 46 వ పుటలో అంతిమ రూపంలో ప్రచురించబడినట్టి "కార్మికుల ఉపకారనిధికి నిబంధనలు" పైనా సంభాషణ కేంద్రీకృత మయింది. "వృద్ధ" సభ్యులు (హాస్యానికి సెయింట్ పీటర్స్‌బర్గ్ సోషల్-డెమొక్రాట్లు వీరిని "డిసెంబ్రిస్టులు" అనేవారు), "యువ" సభ్యులలో చాలామంది (వీరు తరువాత "రబోచయ మీస్ల్" పనిలో క్రియాత్మకంగా సహకరించారు) మధ్య అతి ఉద్రిక్తమైన చర్చ బయల్దేరింది. ప్రచురితమైన రూపంలో వున్న నిబంధనల ముఖ్య సూత్రాలను "యువ" సభ్యులు సమర్థించారు. ముఖ్యంగా అవసరమైనది ఇది కాదనీ, భిన్నభిన్న కార్మికుల ఉపకార నిధులన్నిటినీ, విద్యార్థుల ప్రచార గ్రూపులు వగైరాల నన్నిటినీ ఒక విప్లవకారుల ఆర్గనైజేషనుగా రూపొందించి, "పోరాట సమితిని" దృఢపరచడమే ముఖ్యావసరమనీ "వృద్ధ" సభ్యులు అన్నారు. ఈ భిన్నాభిప్రాయాలు పరస్పరం చీలికకు నాంది మాత్రమేనని ఆనాటి వాదప్రతివాదం సాగించినవారికి అప్పట్లో ఈషణ్మాత్రమూ అనుమానం తట్టలేదని వేరే చెప్పనక్కరలేదు; తద్విరుద్ధంగా, అవి తరుచుగా సంభవించినవే అనిన్నీ, తాత్కాలికములే అనిన్నీ వారనుకున్నారు. కాని రష్యాలో కూడా "వృద్ధ"

సోషల్-డెమోక్రాట్లతో యుద్ధం చేయనిదే "ఆర్థికవాదం" పైకి వచ్చి, విస్తరించగల్గేది కాదని ఈ వాస్తవవిషయం తెలియజేస్తుంది (నేటి ఆర్థికవాదులు దీనిని తరుచుగా మర్చిపోవడం కద్దు). కాగా, ఈ పోరాటం ప్రధానంగా దాని వెనువెంట యెట్టి "లిఖితపూర్వమైన" జాడలనూ దిగవిడువక పోయినప్పటికీ, అనాడు పనిచేసిన సమితులలోని సభ్యత్వం నిరంతరం మారిపోతూ వుండడం హేతువును అవిరత ఏర్పడక, తత్ఫలితంగా అభిప్రాయభేదాలు ఏ పత్రం మీదనూ నమోదు కాకపోవడమే కేవలమూ ఇందుకు కారణం.

"రబోచయ మీస్ల్" ప్రచురణ ఆర్థికవాదాన్ని వెలికి తీసుకొచ్చింది; కాని ఇదంతా ఒక్కసారే జరగలేదు. ఆ యా వ్యాళ్లలో ఈ నూతన ధోరణి సాధించిన విజయాలూ అనుభవించిన అపజయాలూ ఎంతవరకు యాదృచ్ఛికములో, ఈ నూతన ధోరణి నిజంగా ఒక విస్పష్టమైన ధోరణో, లేక నిర్దిష్ట వ్యక్తులకొందరిలోని శిక్షణారాహిత్యం యొక్క కేవల చిహ్నమో, "నూతన" ధోరణిని సమర్థించినవారు గాని, దాని ప్రత్యర్థులు గాని ఒక నిశ్చయానికి రాలేకపోవడం — అలా ఒక నిశ్చయానికి వచ్చేందుకు వారికి అవకాశం లేకపోయింది కూడానూ — ఎంతకాలం పట్టిందో అర్థం చేసుకుందుకు ఆనాటి క్రియాకలాపాల పరిస్థితులనూ, రష్యన్ సర్కిల్స్‌లో అధికసంఖ్యయొక్క అల్పాయువు స్వభావాన్ని (దీనిని స్వానుభవం వల్ల తెలుసుకున్న వారికి మాత్రమే దీని భావమేమిటో నిశితంగా తెలుస్తుంది) మన మనస్సుల్లో నిర్దిష్టంగా చిత్రించుకోగల్గాలి. ఉదాహరణకు, "రబోచయ మీస్ల్" పత్రిక తొలి సైక్లోస్టైలు ప్రతులు సోషల్-డెమోక్రాట్లలో అధికసంఖ్యాకులకు అసలే అందలేదు, కాగా పైన ఉదహరించబడిన పత్రికలన్నిటి కంటెనూ, పత్రికల పథకాల కంటెనూ బాగా భిన్నంగా వున్నట్టి ఈ కొత్త పత్రికను సహజంగానే హేతువాదబలంతో కంటె అధికోత్సాహంతోనే పొగడడానికి వెనుదీయనట్టి వి. ఐ. రాసిన వ్యాసంలో ("లిస్తోక్ 'రబోత్నిక' ", 9—10 సంచిక, 47 వ, తరువాతి పుటలు), ఈ తొలిసంచిక ప్రధానవ్యాసం పునర్ముద్రితమవడం చేతనే మేము దీనిని గురించి ప్రస్తావించగల్గుతున్నాం.* "రబోచయ మీస్ల్" యొక్క భావాన్నీ,

* నవంబరు 1898 లో, ఆర్థికవాదం సంపూర్ణంగా, ముఖ్యంగా విదేశాలలో నిర్వచించబడిన తరువాత, "రబోచయ మీస్ల్" పత్రికను పొగడుతూన్న వ్యాసం, తరువాత మరి కొద్ది రోజులకే "రబోచెయె దేలొ" పత్రిక సంపాదకులలో ఒకడుగా పనిచేసిన ఆ వి.ఐ. కలం నుండే వెలువడిందని ప్రాసంగికంగా చెప్పాల్సి వుంది. అయినప్పటికీ రష్యన్ సోషల్-డెమోక్రసీలో రెండు ధోరణులున్నాయనీ "రబోచెయె దేలొ" అప్పుడూ అంగీకరించలేదు, ఇప్పుడూ అంగీకరించడంలేదు!

స్థూలంగా ఆర్థికవాదం యొక్క భావాన్ని ఈ ప్రధానవ్యాసం వ్యక్తపరుస్తున్న కారణాన, ఇది పరిశీలించ తగినది.

కార్మికవర్గోద్యమ ప్రగతిని నీలిరంగు దుస్తుల చేతులు[74] ఎన్నటికీ ఆపజాలవని చెప్పిన తరువాత, ఈ ప్రధానవ్యాసం ఇలా అంటుంది: "...కార్మికులు తమంతట తామే తమ విధిని నాయకుల చేతుల్లోనుండి గుంజుకుని, తుట్టతుదకు తమ చేతుల్లోకి తెచ్చుకుంటూన్న విషయమే కార్మికవర్గోద్యమ సజీవత్వానికి కారణం;" అని ఈలా చెప్పి ఈ మౌలికమైన వాదాన్ని ఇంకా మరింత సవివరంగా అభివృద్ధి చేసింది. వాస్తవానికి, ఒక విధంగా చెప్పాలంటే, కార్మికుల చేతుల్లోనుంచి నాయకులను (అనగా, సోషల్-డెమోక్రాట్లను, పోరాట సమితి ఆర్గనైజర్లను పోలీసులే లాగివేశారు*; అయినప్పటికీ నాయకులతో కార్మికులు పోట్లాడుతూన్నట్టూ, తమపై నాయకులు మోపిన గాటనుండి తమంతట తామే విముక్తి చేసుకున్నట్టు పైకి అవుపడేటట్టుగా విషయం చిత్రించబడింది! పురోగమనానికి పిలుపు ఇవ్వడం బదులు, విప్లవాత్మక ఆర్గనైజేషనుకీ రాజకీయ క్రియాకలాపాన్ని విస్తృత పరచడానికీ పిలుపు ఇవ్వడం బదులు, స్వచ్ఛమైన ట్రేడ్‌యూనియన్ పోరాట దిశగా తిరోగమనానికి పిలుపు ఇవ్వబడింది. రాజకీయ ఆదర్శాన్ని ఎన్నడూ విస్మరించకుండా వుండాలనే ప్రయత్నంవల్ల "ఉద్యమంయొక్క ఆర్థిక ప్రాతిపదిక మరుగున పడిపోయిందనీ," కాగా "ఆర్థిక పరిస్థితులకోసం పోరాటం"(!) అనేదే, ఇంకా మరొక మెట్టు ముందుకెళ్లి, "కార్మికులకోసం కార్మికులే" అనేదే కార్మికవర్గోద్యమ యుద్ధనినాదమనీ ప్రకటించబడింది. "ఇతర ఆర్గనైజేషన్లు నూరింటి కంటె, ఉద్యమానికై" సమ్మె నిధులే అత్యంత విలువైనవనీ (అక్టోబరు 1897 లో చేయబడిన ఈ ప్రకటనను, 1897 ఆరంభంలో "డిసెంబ్రిస్టుల" కూ యువసభ్యులకూ జరిగిన వాగ్వాదంతో సరిపోల్చి చూడండి), ఇంకా ఇలాగే ఉద్ఘాటించబడింది. కార్మికులలో "మెరికలు"పై కాదు, "సగటు' కార్మికుని పైనే మనం మన కృషిని సాంద్రీకరించాలి; "ఆర్థికాల వెంట అడుగు

---

* ఈ ఉపమానం యథార్థమేనని ఈ కింది స్వాభావిక వాస్తవవిషయం తెలియజేస్తోంది. "డిసెంబ్రిస్టులు" అరెస్టుచేయబడిన తరువాత, "డిసెంబ్రిస్టులతో" సంబంధం పెట్టుకున్నట్టి ఒక గ్రూపుతో పరిచయం ఏర్పరచుకున్న ఎన్. ఎన్. మిహైలొవ్ అనే వొక దంతవైద్యుడు, కప్పింపు చర్యచేసే పోలీసు ఏజెంటుగా పనిచేయడంవల్లనే వీరి ఆచూకీ పోలీసులకు తెలిసిపోయి, పోలీసులు వాళ్లను అరెస్టు చేయగల్గారన్న వార్త ష్ల్యుసెల్‌బుర్గ్ రోడ్డు కార్మికులలో వ్యాపించగానే వారు ఎంత ఉగ్రులైపోయారంటే, అతగాడిని చంపేయడానికే వారు నిర్ణయించుకున్నారు.

లకు మడుగులొత్తుతూ రాజకీయాలు ఎల్లప్పుడూ నడుస్తాయి''* వగైరా వగైరా ఊతపదాలు ఫాషను కాజొచ్చి, ఉద్యమంలోకి ఆకర్షించబడినట్టీ, అయినప్పటికీ అత్యధికసంఖ్యాకులకు మార్క్సిజం గురించి చట్టబద్ధంగా వెలువడుతూన్న ప్రచురణలలో వివరించబడుతూన్న ఆ నాలుగు ముక్కలే తప్ప ఇంకేమీ తెలియనట్టీ యువజన రాసులపై అప్రతిహత ప్రభావం కలిగించాయి.

దీనితో, చైతన్యం యొక్క స్థానాన్ని అయత్నకృతం — శ్రీ వి. వి. ''భావాలను'' పునశ్చరణ చేసిన సోషల్-డెమోక్రాట్ల అయత్నకృతం, సోషలిజమూ రాజకీయాలూ కంటె, ఆ వున్న రూబులుకు ఇంకొక కోపెక్కు చేర్చడమే ఉత్తమమూ, ''ఏ భావి తరం కోసమో కాకుండా తమకోసమూ తమ ఆలుబిడ్డల కోసమే పోరాడాలి'' (''రబోచయ మీస్ల్'', 1 వ సంచికలో ప్రధానవ్యాసం), అనే వాదనలవల్లనే వొళ్లెరగకుండా ఉత్సాహపరవశుల యేటట్టి కార్మికుల అయత్నకృతం — పూర్తిగా ఆక్రమించేసుకుంది. ఇటువంటి పదజాలమే, సోషలిజమ్‌పై తమకుండే ద్వేషంతో ఇంగ్లీషు ట్రేడ్‌యూనియనిజానికి తమ గడ్డపై పాదుకొల్పడానికి, స్వచ్ఛమైన ట్రేడ్‌యూనియను పోరాటంలో పాల్గొనడంవల్లనే** కార్మికులు తమ కోసం, తమ ఆలుబిడ్డల కోసం తాము పోరాడగల్గుతారని వారికి బోధచేయడానికీ (జర్మన్ ''సోషల్-పొలిటీషయన్'' హిర్ష్‌లాగా) పాటుపడే పాశ్చాత్య యూరపియన్ బూర్జువావర్గానికి యెల్లప్పుడూ అత్యంతప్రియమైన ఆయుధాలుగా వుంటు న్నాయి. కాగా ''రష్యన్ సోషల్-డెమోక్రసీలోని వి.వి.''లు ఈ బూర్జువా పదజాలాన్ని

---

* ఈ ఉల్లేఖనలు ఇదివరకే పైన పేర్కొనబడిన ''రబోచయ మీస్ల్'' తొలి సంచిక లోని ప్రధానవ్యాసం నుండి సంగ్రహించబడ్డాయి. రాజకీయాలకీ అర్థశాస్త్రానికీ వున్న సంబంధంపై ఇటువంటి అభిప్రాయాలనే కల్గివున్నందుకు ''అభ్యుదయ నిరోధక కృత్యాలలో అందెవేసిన చెయ్యి'' అనే బిరుదు చిరకాలం కిందటే ఆర్జించుకున్నట్టి అసలు శ్రీ వి.వి.కి వ్యతిరేకంగా మార్క్సిస్టులు ఒక సారస్వత యుద్ధం సాగించుతూండిన కాలంలో, ''ఆర్థిక భౌతికవాదం'' యొక్క మొరటు అపభ్రంశాన్ని పునశ్చరణ చేస్తూండినట్టి ''రష్యన్ సోషల్-డెమోక్రసీలోని వి.వి.ల''[75] కుండిన రాజకీయ శిక్షణా స్థాయిని దీన్నిబట్టి తెలుసుకోవచ్చు!

**"Nur-Gewerkschaftler" [''నూర్ గెవెర్క్‌షాఫ్ట్లర్''] అని జర్మన్లు ఒక ప్రత్యేక పదాన్ని వాడతారు; ''స్వచ్ఛమైన ట్రేడ్‌యూనియన్'' పోరాటాన్ని సమర్థించే వ్యక్తి అని దీని అర్థం.

ఇప్పుడు పునశ్చరణ చేయడం మొదలెట్టారు. సమకాలిక విభేదాలను* మరికొంత దూరం విశ్లేషించడంలో మనకి ఉపయోగకరంగా వుండేటట్టి సందర్భాలు మూడింటిని ప్రత్యేకించి చూపడం ఇక్కడ చాలా ముఖ్యం.

మొట్టమొదటిది, మేము పైన ఉదహరించినట్టి, చైతన్యాన్ని అయత్నకృతం అణచి వేయడం కూడా అయత్నకృత మార్గంలోనే జరిగింది. ఇది శ్లేషలాగా ధ్వనించవచ్చు, కాని — దురదృష్టవశాత్తూ! — ఇది తిక్త సత్యం. పరస్పరం పూర్తిగా వ్యతిరేకమైన రెండు దృక్పథాల బహిరంగపోరాటం ఫలితంగా ఇది జరగలేదు; "వృద్ధ" విప్లవకారులను నానాటికి అధిక సంఖ్యలో సాయుధ పోలీసులు "గుంజుకుని" తీసుకుపోవడమూ, "రష్యన్ సోషల్-డెమోక్రసీలోని వి.వి."ల రకం "యువ" సభ్యులు నానాటికి అధికసంఖ్యలో రంగం మీద దిగడమూ కారణంగా ఇది జరిగింది. సమకాలిక రష్యన్ — ఉద్యమంలో పాల్గొన్న ప్రతి వారికీ అని నేనడం లేదు — అధమం ఉద్యమం గాలి ఏ మాత్రమైనా సరే సోకిన ప్రతి వారికీ సందర్భం అచ్చంగా ఇదేనని బాగా తెలుసు. ఏమైనప్పటికీ అందరకూ తెలిసినట్టి ఈ వాస్తవ విషయం గురించి పాఠకుడు స్పష్టంగా తెల్సుకోవాలని మేమెందుకింత గట్టిగా నొక్కి చెబుతున్నామంటే, ఒక విధంగా చెప్పాలంటే, ఏ దాపరికమూ లేకుండా వుండేందుకని, "రబోచెయె దేలొ" మొట్టమొదట వెలువడినప్పటి సందర్భాలు గురించీ, 1897 ఆరంభంలో "వృద్ధులకూ" "యువకులకూ" జరిగిన వాగ్వాదం గురించీ ఎందుకింత వివరంగా చెబుతున్నామంటే — అందుకు కారణం, ఈ వాస్తవవిషయం గురించి ప్రజకి (అనగా, యువకుల్లో మరీ యువ తరానికి) ఏమీ తెలియదు కదా ఫరవా లేదులే, అనే ధైర్యంతో కొందరు మనుషులు తమ "ప్రజా స్వామ్యం" గురించి బడాయిలు కొడుతూండడమే. ఈ అంశంపై మళ్లీ తరువాత ప్రస్తావిస్తాం.

రెండవది, "స్వచ్ఛమైన కార్మికవర్గోద్యమ" అనుయాయియులూ, శ్రామికవర్గ పోరాటంతో అత్యంత సన్నిహిత "సేంద్రీయ" ("రబోచెయె దేలొ" ఉపయోగించిన పదం) సంబంధాల ఆరాధకులూ, కార్మికేతరమైన ఏ మేధావిస్తరానికైనా సరే (అది సోషలిస్టు మేధా

---

*"రబోచయ మీస్ల్" పత్రికను విమర్శించడం ఇప్పుడు సులభమే, కాని ఇదంతా పాత చరిత్ర కాదా! — అని పెదవి విరచి అడిగే ఆషాఢభూతులకు విశదమయేందుకు సమకాలిక అనే మాటను ఒత్తి చెబుతున్నాం. "రబోచయ మీస్ల్" భావాలకు పూర్తిగా లోబడి పోయినట్టుగా ఇటుతరువాతి పుటలలో రుజావు చేయబడేటట్టి ఇటువంటి ఆషాఢభూతులకు మా ప్రత్యుత్తరం: Mutato nomine de te fabula narratur (పేరు మార్చితే కథ మీకే వర్తిస్తుంది.—అనువాదకుడు).

విస్తరమే అయినా సరే) వ్యతిరేకులైన వారూ తమ స్థానం కాపాడుకునేందుకుగాను బూర్జువా వర్గపు ''స్వచ్ఛమైన ట్రేడ్‌యూనియనిస్టుల'' వాదనలకు దిగజారక ఇక గత్యంతరం లేనట్టి — సమకాలిక సోషల్-డెమొక్రాట్లలో వ్యాపించుతూండిన అన్ని అభిప్రాయభేదాలనూ అర్థం చేసుకునేందుకు అత్యంత స్వాభావికమైనట్టి — అత్యంత చిత్రమైన దృగ్విషయాన్ని ఆర్థికవాదం యొక్క తొలి సాహిత్య స్వరూపంలోనే అప్పటికే చూడగల్గుతున్నాం. "Credo" కార్యక్రమాన్ని సాధించడానికే ''రబోచయ మీస్ల్'' మొట్టమొదట నుండీ — అలాగని అది ఎరగకపోయినప్పటికీ — ఆరంభించిందని ఇది మనకి నిరూపించుతూంది. అయత్నకృతం ఎదుట కార్మికోద్యమం యొక్క ఎవ్విధమైన ఆరాధన, ''చైతన్యయుతమైన మూలద్రవ్యపు'' పాత్రను, సోషల్-డెమోక్రసీ పాత్రను, ఎవ్విధంగానైనా కించపరచడము — వీటి అర్థం (ఇది ''రబోచెయె దేలో''కి సుతరామూ అర్థం కాదు), ఆ కించపరచేవాడు ఆలా కాంక్షించాడా, లేదా అనే విషయంతో ఏ మాత్రమూ ప్రసక్తి లేకుండానే, కార్మికులపై బూర్జువా భావశాస్త్ర ప్రభావం బలపరచటడమే అని ఇది నిరూపించుతూంది. ''భావశాస్త్రంయొక్క ప్రభావాన్ని ఎక్కువ అంచనా వేయడమూ,''* చైతన్యయుతమైన మూలద్రవ్యపు పాత్రను అతిశయోక్తులలో చెప్పడమూ**, వగైరాలు జరుగుతున్నాయని ఘోషపెట్టేవారందరూ ఏమని ఊహించుతారంటే, కార్మికులు గనుక ''తమ విధిని నాయకుల చేతుల్లోనుండి గుంజుకున్నారంటే మాత్రం,'' స్వచ్ఛమైన కార్మికవర్గోద్యమం తన భావశాస్త్రాన్ని తనకుతానే తయారు చేసుకోగల్గుతుందనీ, తయారు చేసుకుని తీరుతుందనీ ఊహించుతారు. కాని ఇదొక తీవ్రమైన పొరపాటు. పైన చెప్పిన దానినే ఇంకా విపులీకరించడానికని, ఆస్ట్రియా దేశపు సోషల్-డెమోక్రాటిక్ పార్టీ కొత్త ముసాయిదా కార్యక్రమంపై కారల్ కౌట్‌స్కీ కావించిన అతి న్యాయమైనట్టీ, అతి ముఖ్యమైనట్టీ అభిభాషణలను దిగువ ఉల్లేఖిస్తున్నాం.***

''ఆర్థిక అభివృద్ధీ, వర్గపోరాటమూ సామాజిక ఉత్పత్తి కొరకు పరిస్థితులనే కాకుండా, అది అవసరమనేటట్టి చైతన్యాన్ని కూడా సూటిగానే సృష్టిస్తాయని మార్క్స్ ఉద్ఘాటించినట్లు మన రివిజనిస్టు విమర్శకులలో చాలా మంది సమ్మతున్నారు (ఒత్తు

* ''ఆర్థికవాదులకు'' లేఖ, ''ఇస్క్రా,'' 12 వ సంచికలో.

** ''రబోచెయె దేలో'', 10 వ సంచిక.

***"Neue Zeit" [''నోయె సైట్''], 1901–1902, XX, 1, నెం. 3 వ సంచిక, 79 వ పుట. సమితి చేసినట్టీ, కౌట్‌స్కీ పేర్కొన్నట్టీ ముసాయిదాను, స్వల్ప సవరణలతో కిందటేడు ఆఖరి రోజుల్లో జరిగిన వియన్నా కాంగ్రెస్ ఆమోదించింది.[76]

పెట్టినది కె.కె.). కాగా పెట్టుబడిదారీ విధానాత్మకంగా అత్యంత ఉన్నతదశకు అభివృద్ధి చెందిన దేశమైనట్టి ఇంగ్లండు, ఈ చైతన్యానికి అన్ని దేశాలకంటే ఎంతో దూరంగా వుందని ఈ విమర్శకులు ఘంటాపథంగా చెబుతారు. ఈ విధంగా పూర్వపక్షం చేయబడినట్టి, సనాతన మార్క్సిస్టు అభిప్రాయమని చెప్పబడుతూన్నట్టి ఈ అభిప్రాయంతో ఆస్ట్రియన్ ముసాయిదా కార్యక్రమాన్ని తయారు చేసిన కమిటీ ఏకీభవిస్తూందని ఈ ముసాయిదానుబట్టి ఎవరైనా భావించవచ్చు. ముసాయిదాలో ఈ విధంగా చెప్పబడింది: 'శ్రామికవర్గీయుల సంఖ్యను పెట్టుబడిదారీ విధానాభివృద్ధి అధికం చేస్తూన్నకొద్దీ, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా శ్రామిక వర్గం మరింత అధికంగా పోరాడవలసి వస్తుంది, పోరాడడానికి తగిన స్థితిలో వుంటుంది కూడానూ'. సోషలిజంయొక్క సాధ్యతను గురించీ, అవసరాన్ని గురించీ 'శ్రామికవర్గం చైతన్యవంత మవుతుంది.' ఈ సందర్భంలో సోషలిస్టు చైతన్యం, శ్రామికవర్గ పోరాటం యొక్క ఆవశ్యకమైనట్టి సూటి అయినట్టి ఫలితమైనట్టుగా అవుపడుతుంది. కాని ఇది ఎంతమాత్రమూ నిజం కాదు. సహజంగానే, శ్రామికవర్గ పోరాటం లాగానే, ఒక సిద్ధాంతంగా సోషలిజం మూలం కూడా ఆధునిక ఆర్థిక సంబంధాలలోనే వుంది; కాగా శ్రామికవర్గ పోరాటం లాగానే సోషలిజం కూడా పెట్టుబడిదారీ వ్యవస్థచే సృష్టమై, ప్రజారాసుల పేదరికమూ దారిద్ర్యాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటం నుండే ఉద్భవిస్తూంది. కాని సోషలిజమూ, వర్గపోరాటమూ ఒకదాని సరసను ఒకటి ఉద్భవిస్తున్నాయో గాని, ఒక దానినిలోనుంచి ఒకటి ఉద్భవించడం లేదు; ప్రత్యేక విభిన్న పరిస్థితులనుబట్టి ఒక్కొక్కటి ఉద్భవించుతూంది. ఆధునిక సోషలిస్టు చైతన్యం కేవలంగా ప్రగాఢమైన శాస్త్రీయ విజ్ఞాన ప్రాతిపదికపైనే ఉద్భవించ గల్గుతుంది. అసలు నిజంగా సోషలిస్టు విధాన ఉత్పత్తికి ఆధునిక ఆర్థిక శాస్త్రం ఎంతటి షరతో, మాటవరసకు ఆధునిక సాంకేతిక శాస్త్రం కూడా అంతటి షరతే; శ్రామికవర్గం ఎంత సంకల్పించు కున్నప్పటికైనా సరే దీనిని గాని, దానినిగాని అది సృష్టించ జాలదు; ఆధునిక సామాజిక ప్రక్రియలో నుండే అవి రెండూ ఉద్భవిస్తాయి. విజ్ఞానశాస్త్రంయొక్క వాహకం శ్రామికవర్గం కాదు, బూర్జువావర్గపు మేధావిస్తరమే (ఒత్తు పెట్టినది కె.కె.); ఈ స్తరంలోని వ్యక్తిగత సభ్యుల మేధస్సుల్లోనుంచి అది ఉద్భవించింది; దానిని వీరు శ్రామికవర్గీయులలో ఎక్కువగా ప్రగతిశీలురైన వారికి అందివ్వగా ఈ ప్రగతిశీలురైన శ్రామికవర్గీయులు, శ్రామికవర్గ పోరాటంలో పరిస్థితులనుబట్టి అనువైన చోట్లల్లా దానిని ప్రవేశపెట్టారు. ఈలాగున, సోషలిస్టు చైతన్యమనేది బాహ్యం నుండి శ్రామికవర్గ పోరాటంలో ప్రవేశపెట్టబడినదే (von Aussen Hineingetragenes), కాని లోపలినుండి అయత్నకృతంగా ఉద్భవించినది (urwüchsig) కాదు. ఈ ప్రకారంగా, శ్రామికవర్గాన్ని దాని స్థానం గురించిన చైతన్యంతో పరితప్తం చేయడమే (శ్రామిక వర్గాన్ని శాబ్దార్థతః నింపడం) సోషల్-డెమోక్రసీ కర్తవ్యమని హైన్‌ఫెల్డ్ కార్యక్రమం

పూర్తిగా సరిగానే చెప్పింది. చైతన్యం దానంతటదే వర్గపోరాటం నుండి ఉద్భవించినదే అయి వుంటే, ఇది అవసరముండేదే కాదు. ఈ వాక్యాన్ని కొత్త ముసాయిదా పాత కార్యక్రమంలో నుండి తీసుకొచ్చి, పైన పేర్కొనబడిన వాక్యంతో జతచేసింది. అలా చేయడంవల్ల ఆలోచనా గమనానికి భంగం వాటిల్లింది...''

కార్మికరాసులు తాముగా తమ ఉద్యమ గమనంలో స్వతంత్ర భావశాస్త్రం ఒకదానిని అభివృద్ధి చేయడమనే ప్రసక్తే లేదు* గనుక సమస్య ఈ విధంగా మాత్రమే వుంటుంది: ఏది మనం ఎంచుకోవాలి — బూర్జువా భావశాస్త్రమా, సోషలిస్టు భావశాస్త్రమా? మధ్యేమార్గం అంటూ ఏదీ లేదు (ఎందుచేతంటే, ''మూడవ'' భావశాస్త్రం అంటూ దేనినీ మానవాళి సృష్టించ లేదు, పైగా వర్గ వైషమ్యాలతో చిరిగి చీలికలైపోయిన సమాజంలో వర్గరహితమైనట్టి, లేదా వర్గాతీతమైనట్టి భావశాస్త్రం ఎన్నటికీ వుండజాలదు). దీన్నిబట్టి ఏ విధంగానైనా సరే సోషలిస్టు భావశాస్త్రాన్ని చులకన చేయడమూ, దానినుండి తలవెంట్రుక వాసైనా సరే వైదొల గడమూ అంటే బూర్జువా భావశాస్త్రాన్ని పటుతరం చేయడమే. అయత్నకృతం గురించి ప్రసంగాలు లావుగా జరుగుతున్నాయి. కాని కార్మికవర్గ ఉద్యమం యొక్క అయత్నకృత అభివృద్ధి, కార్మికవర్గాన్ని బూర్జువా భావశాస్త్రానికి లొంగిపోయేటట్టు చేయడానికే దారి తీస్తుంది, "credo" కార్యక్రమం ప్రకారమే అది అభివృద్ధి చెందడానికి దారి

---

*ఇటువంటి భావశాస్త్రాన్ని సృష్టించడంలో కార్మికులు ఎట్టి పాత్రనూ వహించ రని అర్థం కానేకాదు, సహజంగానే. కార్మికులుగా కాకుండా, ప్రూడన్‌లూ వైట్లింగ్‌యూ లాగా సోషలిస్టు సిద్ధాంతకర్తలుగానే వారు పాల్గొంటారు; వేరే మాటల్లో చెప్పాలంటే, తమ శతాబ్ది ప్రతిపత్తిని అలవర్చుకుందుకూ, దానిని పురోగమింప జేసేందుకూ వారికి అప్పుడే ఎంత వరకు వీలుంటుందో ఇంచుమించు ఆమేరకే, వారు పాల్గొంటారు. కాగా కార్మికవర్గం దీనిని మరింత తరుచుగా చేయగల్గేందుకు, కార్మికుల చైతన్య స్థాయిని స్థూలంగా లేవ నెత్తేందుకు అన్ని ప్రయత్నాలూ జరగాలి; ''కార్మికుల కొరకు సాహిత్యం'' అనే కృత్రిమమైన సంకుచిత పరిధులకు వారు పరిమితమై వుండకుండా, సాధారణ సారస్వతంలో ప్రావీణ్యతను ఉన్నత స్థాయికి పెంపొందించుకుందుకు వారు పాటుపడాలి. ''పరిమితమై వుండకుండా'' అనడంకంటె, ''పరిమితం కాబడేటట్టు కాకుండా'' అని వుంటే ఇంకా యథార్థంగా వుం టుంది; ఎందుకంటే మేధావిస్తరం కోసం రాసిన దానినంతటినీ కార్మికులకు తాము చదవాలనే వుంటుంది; కాగా ఫ్యాక్టరీ పరిస్థితులు గురించి ఎవో నాల్గు సంగతులు ''కార్మికుల కోసం'' సరిపోతాయనీ, ఎంతో కాలంగా తెలిసివున్నట్టి ఆ నాల్గు సంగతులనే రోకటి పాటగా చెబితే వారికి చాలుననీ మేధావులలో కొద్దిమంది (అల్పజ్ఞులు) మాత్రమే నమ్ముతారు.

తీస్తుంది; ఎందుచేతంటే అయత్నకృత కార్మికవర్గోద్యమం అంటే ట్రేడ్‌యూనియనిజమే, Nur-Gewerkschaftlerei యే; కాగా ట్రేడ్‌యూనియనిజం అంటే బూర్జువావర్గం కార్మికులను భావశాస్త్రీయరీత్యా బానిసలుగా చేయడమన్నమాటే. అందుచేత అయత్నకృతంతో పోరాడడమూ, బూర్జువావర్గ ప్రాపకం కిందకు వచ్చే ఈ అయత్నకృత, ట్రేడ్‌యూనియనిస్టు కృషినుండి కార్మికవర్గోద్యమాన్ని మళ్లించడమూ, కాగా విప్లవాత్మక సోషల్-డెమోక్రసీ ప్రాపకం కిందకు తీసుకురావడమూ మన కర్తవ్యం, సోషల్-డెమోక్రసీ కర్తవ్యం. అందుచేత అత్యంత ఉత్తేజితులైన భావశాస్త్రవేత్తల యత్నాలు సహితమూ భౌతిక మూలద్రవ్యాల భౌతిక పరిసరాల ప్రక్రియవల్ల నిర్ణయించబడినట్టి మార్గంనుండి కార్మిక వర్గోద్యమాన్ని మళ్లించ జాలవని చెబుతూ, అట్టి యత్నాలను గురించి "ఇస్క్రా," 12 వ సంచికలో "ఆర్థిక" లేఖ రచయితలు ప్రయోగించిన పదబంధం, కేవలమూ సోషలిజాన్ని వదలిపెట్టేయడంతో సమాన మవుతూంది; కాగా సాహిత్య పౌరజీవిత క్రియాకలాప రంగంలో ప్రవేశించిన ప్రతివారిలాగానే, ఈ లేఖ రయితలు కూడా నిర్భయంగా, సుసంగతంగా, సమగ్రంగా తాము చెప్పేదానిని గూర్చి కడవరకూ పరిశీలించడానికి సామర్థ్యం గలవారే గనుక అయి వుండి నట్టయితే, "తమ పొట్టి రొమ్ములపై కొరగాని తమ చేతులను ముడుచుకొని," ఇక... కార్మిక వర్గోద్యమాన్ని "కనిష్ఠ నిరోధక పథాన," అనగా బూర్జువా ట్రేడ్‌యూనియనిజం పథాన, ఈడ్చుకుపోతూన్న మహాశయులు స్త్రూవె, ప్రొకొపోవిచ్ ప్రభృతులకు, లేదా మతగురువుల, సాయుధ పోలీసుల "భావశాస్త్ర" పథాన ఈడ్చుకుపోతూన్న జుబాతొవ్‌లకు కార్యరంగాన్ని విడిచిపెట్టేయ్యాలి.

జర్మనీ ఉదాహరణను ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకోండి. జర్మన్ కార్మికవర్గానికి లాసాల్ చేసిన చారిత్రాత్మక సేవ ఏమిటి? ఆ ఉద్యమాన్ని, అంతవరకూ అది అయత్నకృతంగా పయనించుతూన్నట్టి (షుల్జె-డెలిట్ష్, ఇంకా అతని లాంటి వాళ్ల అనుగ్రహపూరితమైన సహాయంతో) ప్రాగ్రెసిస్టులు బోధించినట్టి ట్రేడ్‌యూనియనిజం, సహకారోద్యమాల పథం నుండి అతడు మళ్లించడమే. అటువంటి కర్తవ్యాన్ని సాధించాలంటే, అయత్నకృత మూలద్రవ్యాన్ని తక్కువ అంచనా కట్టడం గురించీ, ఒక విధానంగా ఎత్తుగడలను గురించీ, మూలద్రవ్యాల పరిసరాల అంతర్క్రియలు గురించీ, ఇంకా వగైరా వగైరాల గురించీ ఖబుర్లు చెప్పడం కంటె పూర్తిగా భిన్నమైన పనిని దేనినైనా చేయడం అవసరమైంది. అయత్నకృతానికి వ్యతిరేకంగా భయంకర పోరాటం ఒకటి అవసరమైంది; కాగా అటువంటి పోరాటం అనేక సంవత్సరాల పాటు జరిగిన తరువాతనే, ఉదాహరణకు, అంతవరకూ ప్రాగ్రెసివ్ పార్టీకి బురుజుగా వుండినట్టి బెర్లిన్ పట్నపు కార్మిక జనాన్ని సోషల్-డెమోక్రసీ యొక్క అజేయమైన దుర్గంగా మార్చివేయడానికి వీలైంది. ఈ పోరాటం (జర్మన్ ఉద్యమ చరిత్రను ప్రొకొ

పోవిచ్ నుండీ, దాని తత్వాన్ని (స్వావె నుండీ నేర్చుకున్నవారికి అవుపడేటట్టు కాకుండా) ఈనాటికీ కూడా ఇంకా సమాప్తి కాలేదు. ఇప్పటికి సహితమూ జర్మన్ కార్మికవర్గం, ఒక విధంగా చెప్పాలంటే, అనేక భావశాస్త్రాల మధ్య ముక్కముక్కలుగా ధ్వంసమైపోయింది. కార్మికులలో ఒక భాగం కేతలిక్ తత్వపు, రాచరిక తత్వపు కార్మికుల సంఘాలుగా ఆర్గనైజు చేయబడింది; ఇంకొక భాగం ఇంగ్లీషు ట్రేడ్‌యూనియనిజం యొక్క బూర్జువా ఆరాధకులచే హిర్ష్-డుంకెర్ కార్మికుల సంఘాలుగా[77] ఆర్గనైజు చేయబడింది; మూడో భాగం సోషల్-డెమోక్రాటిక్ ట్రేడ్‌యూనియన్లుగా ఆర్గనైజు చేయబడింది. సంఖ్య దృష్ట్యా కడమవాటన్నిటికంటె ఆఖరి భాగమే ఎన్నోరెట్లు పెద్దది, కాని అన్ని ఇతర భావశాస్త్రాలకు వ్యతిరేకంగా అచంచలమైన పోరాటం సాగించడంవల్ల మాత్రమే సోషల్-డెమోక్రసీ ఈ ఆధిక్యతను సంపాదించుకో గల్గింది, ఈ ఆధిక్యతను నిల్పుకో గల్గుతుంది.

ఈ అయత్నకృత ఉద్యమం, కనిష్ఠ నిరోధక పథాన నడుస్తూన్న ఉద్యమం, బూర్జువా భావశాస్త్రానికే ఎందుకు దారితీయాలి? — అని పాఠకుడు ప్రశ్నించవచ్చు. సోషలిస్టు భావశాస్త్రం కంటె బూర్జువా భావశాస్త్రం ఎంతకాలం నుండో ఉనికి గలిగి వుండడమే, అది మరింత పూర్తిగా అభివృద్ధి చెందడమే, దాని వ్యాప్తికి ఎంతో అపారమైన అవకాశాలు వుండడమే ఇందుకు కేవలం కారణం.* కాగా, ఏ దేశంలోనైనా సరే సోషలిస్టు ఉద్యమం ఎంత కొత్తగా వుంటే, సోషలిస్టేతర భావశాస్త్రం స్థిరంగా పాదుకునేటట్టు కావించబడే అన్ని యత్నాలకు వ్యతిరేకంగా అంత శక్తివంతంగానూ పోరాడాల్సి వుంటుంది; "చైతన్యయుతమైన మూలాంశాన్ని మరింత హెచ్చుగా అంచనా కట్టడము," వగైరాలకు వ్యతిరేకంగా గావుకేకలు వేస్తూ

---

* కార్మికవర్గం సోషలిజం వైపు అయత్నకృతంగా ఆకర్షించబడుతుందని తరుచు చెప్పడం కద్దు. మరే యితర సిద్ధాంతం కంటెనూ సోషలిజమే కార్మికవర్గ దారిద్ర్యానికి కారణాలను మరింత ప్రగాఢంగానూ మరింత నిశితంగానూ నిర్వచించుతూందన్న అర్థంలో ఇది పూర్తిగా నిజమే; కాగా ఆ కారణం వల్లనే, దానిని కార్మికులు అంత సులభంగా వొంటపట్టించుకోగలుగుతున్నారు కూడా. అయితే దీనికి రెండు షరతులున్నాయి: అయత్నకృతానికి మాత్రం అది లొంగిపోకుండా వుండడం ఒక షరతు; అది తన చేతికిందకి అయత్నకృతాన్ని లొంగదీసుకోవాలనేది రెండవ షరతు. మమూలుగా ఇది దానంతటదే అర్థమవుతుంది. కాని సరిగ్గా దీనినే "రబోచెయె దేలొ" మరచిపోతూంది, లేకుంటే వికృతపరచుతూంది. కార్మికవర్గం అయత్నకృతంగానే సోషలిజం వైపు ఆకర్షించబడుతూంది, కాని తత్రాపి దానికంటె విస్తృత వ్యాప్తి చెందినట్టి (కాగా భిన్నభిన్న రూపాలలో నిరంతరమూ పునరుద్ధరించబడుతూన్నట్టి) బూర్జువా భావశాస్త్రం కార్మికవర్గాన్ని మరింత అయత్నకృతంగా లోబర్చేసుకుంటుంది.

న్నట్టి చెడు సలహాదార్ల పట్ల మరింత గట్టిగా జాగ్రత్త పడాల్సి వుంటుంది. ఉద్యమ శైశవ దశకు స్వాభావికమైన అసహనంపై, "రబోచెయె దేలో"తో కలిసి ఆర్థిక లేఖ రచయితలు గర్జిస్తున్నారు. దీనికి మా సమాధానం ఇది: అవును, మా ఉద్యమం నిజంగానే ఇంకా శైశవ దశలోనే వుంది; కాగా అది మరింత త్వరగా ఎదిగేందుకు దాని ఎదుగు పొదుగులకు అయత్న కృతారాధన ద్వారా అవరోధాలు కల్గించుతూన్న వారిపట్ల అది అసహనాన్ని వొంటపట్టించుకో వాల్సే వుంటుంది. పోరాటంలో సంభవించే నిర్ణయాత్మకములైన ఉపాఖ్యానాలన్నిటినీ అప్పుడే అనుభవించేసినట్టి పాతకాపులం మేము అని నటించడం కంటె పరిహాసాస్పదమూ, హానికరమూ ఇంకొకటుండదు!

మూడోది, కొత్త ధోరణి నిజసారంశం "ఆర్థికవాదం" అనే పదం (ఏది ఏలా వున్న ప్పటికీ, ఈ పదం అప్పుడే స్థిరపడిపోవడం కారణాన దీనిని మేము సహజంగానే వదిలిపెట్టే దల్చుకో లేదు), చాలినంత నిరకుగా లేదని "రబోచయ మీస్ల్" తొలిసంచికనుబట్టి అవుపడు తుంది. "రబోచయ మీస్ల్" రాజకీయ పోరాటానికి పూర్తిగా తిలోదకాలు ఇచ్చేయడం లేదు: "రబోచయ మీస్ల్" 1వ సంచికలో ప్రచురించబడిన కార్మికుల ఉపకార నిధి నిబంధనలలో, ప్రభుత్వంతో పోరాడడం అనే విషయం గురించి వుంది. అయినప్పటికీ, "ఆర్థికాల వెంట అడుగులకు మడుగులొత్తుతూ రాజకీయాలు ఎల్లప్పుడూ నడుస్తాయి" అని "రబోచయ మీస్ల్" నమ్ముతూంది (కాగా "మరే ఇతర దేశంలోకంటెనూ రష్యాలోనే, రాజకీయ పోరాటంనుండి ఆర్థిక పోరాటం అవిభాజ్యం" అని తన కార్యక్రమంలో చెప్పడంలో, "రబోచెయె దేలో" ఈ సంగ్రహ సూత్రీకరణకు మరొక రూపం యిస్తూంది). రాజకీయాల అర్థం సోషల్-డెమో క్రాటిక్ రాజకీయాలే అయిన పక్షంలో, "రబోచయ మీస్ల్," "రబోచెయె దేలో" ప్రతి పాదించిన ప్రమేయాలు కేవలం తప్పు. మనం ఇదివరకే గమనించినట్టు, కార్మికుల ఆర్థిక పోరాటం అతి తరుచుగా బూర్జువా రాజకీయాలతోనూ, మతతత్వపు రాజకీయాలతోనూ, ఇతర ములతోనూ సంబంధం (నిర్భేద్యంగా కాకపోయినా) కలిగి వుంటుంది. రాజకీయాలు అనగా ట్రేడ్‌యూనియన్ రాజకీయాలు, అనగా తమ స్థితికి స్వాభావికమైన దురవస్థను మెరుగు పరచుకుందుకు ప్రభుత్వం నుండి చర్యలను, అనగా పెట్టుబడి కింద శ్రమ లొంగివుండడ మును తొలగించని చర్యలను, కార్మికులందరూ సాధించుకునే ఉమ్మడి యత్నమే అయినప్ప టికీ, ఆ స్థితిని మాత్రం అంతరింపజేయనట్టి రాజకీయాలు అనే అర్థమే గనుక అవుతే "రబోచెయె దేలో" ప్రమేయాలు యథార్థాలే. సోషలిజమ్ పట్ల శత్రుత్వం వహించుతూ న్నట్టి బ్రిటిష్ ట్రేడ్‌యూనియనిస్టులకూ, కేతలిక్ కార్మికులకూ, "జుబాతొవ్" కార్మికులూ వగైరాలకూ ఇవి ఉమ్మడి ఆశయాలే. రాజకీయాల్లోనూ వున్నాయి రకరకాల రాజకీయాలు. ఈ ప్రకారంగా "రబోచయ మీస్ల్" రాజకీయ పోరాటం వొద్దు అని అనకుండానే, రాజ

కియాల్లో అయత్నకృతం ఎదుట, రాజకీయాల్లో చైతన్య రాహిత్యం ఎదుట సాష్టాంగ పడుతూంది. కార్మికోద్యమం నుండే అయత్నకృతంగా ఉద్భవించేటట్టి రాజకీయ పోరాటాన్ని సంపూర్ణంగా గుర్తించుతూనే (గుర్తించడం అనడంకంటె, కార్మికుల రాజకీయ ఆశయాలనూ డిమాండ్లనూ అనడం ఇంతకంటె యథార్థంగా వుంటుంది), సోషలిజం సాధారణ కర్తవ్యాలకూ, రష్యాలోని సమకాలిక పరిస్థితులకూ సరిపడేటట్టి విశిష్టమైన ఒక సోషల్-డెమొక్రాటిక్ విధానాన్ని స్వతంత్రంగా రూపొందించడానికి ససేమిరా అది తిరస్కరిస్తూంది. ''రబోచెయె దేలొ'' కూడా ఇదే పొరపాటు చేస్తూందని మరొక ప్రకరణంలో నిరూపించుతాం.

శరత్తు 1901 – ఫిబ్రవరి 1902.

# ఒక అడుగు ముందు, రెండడుగులు వెనక్కి

## (మన పార్టీలో సంక్షోభం)

### ఖండిక

## ఆర్) గతితర్కంపై కొద్ది మాటలు. రెండు పరిభ్రమణములు

మన పార్టీలో సంక్షోభంయొక్క అభివృద్ధినీ స్థూలంగా గమనించినట్టయితే, ఈ కాలం అంతటిలోనూ ప్రతిపక్షాల రెండింటి మౌలిక సంఘట్టనము, కొద్దిపాటి మినహాయింపులతో తప్ప, మార్పేమీ లేకుండానే యథాప్రకారంగానే వుండిపోయినట్టు సుళువుగానే కనబడు తుంది. పార్టీలో వున్న విప్లవాత్మక పక్షానికీ అవకాశవాద పక్షానికీ జరిగిన పోరాటకాలం అది. కాని ఈ పోరాటం రకరకాల దశలను ఎన్నింటిని అనుభవించాలో అన్నింటినీ అనుభవించింది; కాగా ఇప్పటికే కుప్పతెప్పలుగా పేరుకుపోయినట్టి బ్రహ్మాండమైన సారస్వతమూ, అసంపూర్ణ ఆదేశాల రాసులూ, పూర్వోత్తర సందర్భంనుండి పీకిపెళ్లగించి వేసిన వాక్యకదంబాలూ, వేర్వేరుగా మోపిన నిందారోపణలూ, వగైరా వగైరాల మధ్యనుండి దారిచేసుకుని వెళ్లనుద్దే శించిన వ్యక్తి ఈ దశలలో ఒక్కొక్క దశయొక్క విశిష్టస్వభావాలను అవగాహన చేసుకోవాల్సి వుంటుంది.

ప్రధానమైనట్టి, విస్పష్టమై ప్రత్యేకంగా వున్నట్టి దశలను వరుసగా పేర్కొందాం: 1) నిబంధనావళి §1 పై వివాదం. ఆర్గనైజేషను యొక్క మౌలిక సూత్రాలపై స్వచ్ఛమైన భావశాస్త్రీయ పోరాటం. ప్లెహనోవ్, నేనూ అల్పసంఖ్యాకవర్గంలో వున్నాం. మార్తొవ్, అక్సెల్‌రోడ్ అవకాశవాద సూత్రీకరణను ప్రతిపాదించగా, వారిని అవకాశవాదులు వెంటనే తమ హృదయానికి హత్తుకున్నారు. 2) సెంట్రల్ కమిటీ సభ్యత్వానికి అభ్యర్థుల జాబితాపై ''ఇస్క్రా'' ఆర్గనైజేషనులో చీలిక: ఐదుగురు సభ్యుల కమిటీలో ఫోమీన్ వుండాలా, లేక వసీల్యెవ్ వుండాలా; ముగ్గురు సభ్యుల కమిటీలో ట్రాట్‌స్కి వుండాలా, లేక త్రవీన్‌స్కి వుం డాలా, అనే వివాదం. §1 పై మేమిద్దరం అల్పసంఖ్యాకవర్గంలో వుండడం కొంతవరకూ ఒక కారణమవడం ఫలితంగా ప్లెహనోవ్‌కూ నాకూ అధికసంఖ్యాకవర్గం లభించింది (ఇటు తొమ్మిదీ, అటు ఏడూ). అవకాశవాదులతో మార్తొవ్ చేరిపోగానే ఆర్గనైజేషన్ కమిటీ ఉదంతం మూలంగా నాకు తట్టిన అనుమానాలన్నీ స్థిరపడ్డాయి. 3) నిబంధనావళి వివరాలపై చర్చ

కొనసాగింపు. మళ్ళీ మరొకసారి మార్తొవ్‌ను అవకాశవాదులు రక్షించారు. మళ్ళీ మరొకసారి మాది అల్పసంఖ్యాకవర్గ మైపోయి, అల్పసంఖ్యాకవర్గానికి కేంద్ర సంస్థలలో ప్రాతినిధ్యపు హక్కుకోసం పోరాడాల్సి వచ్చింది. 4) తీవ్ర అవకాశవాదులు ఏడుగురూ కాంగ్రెస్‌నుండి వైదొలగారు. ఇప్పుడు మాది అధికసంఖ్యాకవర్గం కాగా, ఎన్నికలలో మిశ్రమపక్షాన్ని ("ఇస్క్రా" అల్పసంఖ్యాకవర్గమూ, "చిత్తడినేల ప్రదేశమూ," "ఇస్క్రా" వ్యతిరేకూలూ) మేము ఓడించాము. మా ముగ్గురుసభ్యుల కమిటీలో మార్తొవ్, పొపోవ్‌లు పనిచేయ నిరాకరించారు. 5) కాంగ్రెస్ అనంతరం కోఆప్షన్ పై కీచులాట. అరాచకవాద ప్రవర్తనా, అరాచకవాద పదజాల స్వైరవిహారం. "అల్పసంఖ్యాకవర్గం"లోని అత్యంత అసంగతమూ అస్థిరమూ అయిన మూలద్రవ్యాలదే పైచేయి అయింది. 6) చీలిక తప్పించేందుకని ప్లెహానొవ్ "kill with kindness"* విధానం అవలంబిస్తాడు. "అల్పకసంఖ్యాకవర్గం" కేంద్రపత్రిక సంపాదకవర్గాన్నీ, కౌన్సిల్నీ, అన్ని స్థానాలనూ ఆక్రమించుకుని, ఇక దాని బలం అంతటితోనూ కేంద్ర కమిటీపై దాడి చేసింది. ఈ కీచులాట సర్వేసర్వత్రా వ్యాపించింది. 7) కేంద్ర కమిటీపై మొదటి దాడి తిప్పికొట్టడమైంది. కీచులాట కాస్త తగ్గుతూన్నట్టు కన బడుతుంది. స్వచ్ఛంగా భావశాస్త్రీయమైన పార్టీని తీవ్రంగా కలత పెట్టుతూన్నట్టి ప్రశ్నలు రెండింటిపై సాపేక్షంగా స్థిమితపడిన వాతావరణంలో చర్చించడం సాధ్యపడింది: ఎ) రెండవ కాంగ్రెస్‌లో రూపొందినట్టీ, పాత విభేదాల స్థానాన్ని ఇప్పుడు ఆక్రమించుకున్నట్టీ "అధికసంఖ్యాకవర్గమూ", "అల్పసంఖ్యాకవర్గమూ" కింద పార్టీలో ఏర్పడిన విభేదానికి రాజకీయంగా అర్థమూ, వివరణా ఏమిటి? బి) సూత్ర దృష్ట్యా, ఆర్గనైజేషను సమస్యపై, కొత్త "ఇస్క్రా"[78] స్థానంలోవున్న అర్థం ఏమిటి?

ఈ దశలలో ప్రతి దశలలోనూ పోరాటానికిగల సంగతి సందర్భాలూ, దాడి తక్షణ లక్ష్యాలూ స్వాభావికంగా పూర్తిగా భిన్నములు; ఒక విధంగా చెప్పాలంటే, ఒక దండయాత్రలో ఒక్కొక్క దశ ఒక్కొక్క ప్రత్యేక యుద్ధం అన్నమాట. ఒకొక్క యుద్ధం యొక్క నిర్దిష్ట పరిస్థితులను అధ్యయనం చేస్తేనే తప్ప, మన పోరాటాన్ని అర్థం చేసుకోవడం దుస్సాధ్యమే అవుతుంది. కాని ఒకసారి ఆలా అధ్యయనం చేసినట్టయితే మాత్రం, అభివృద్ధి గతితార్కికంగా వైరుధ్యాల మార్గంలో వాస్తవంగా జరిగినట్టు మనకు స్పష్టంగా కనబడుతుంది: అల్ప సంఖ్యాకవర్గం అధికసంఖ్యాకవర్గ మవుతుంది, అధికసంఖ్యాకవర్గం అల్పసంఖ్యాకవర్గ మవుతుంది; ప్రతీ పక్షమూ దాడి కాచుకునే స్థితినుండి దాడితీసే స్థితిలోకీ, దాడితీసే స్థితినుండి దాడి కాచుకునే స్థితిలోకీ పరివర్తన చెందుతుంది; భావశాస్త్రీయ పోరాటంయొక్క ఆరంభస్థానం

---

* దయతో చంపడం — అనువాదకుడు.

(§1) ''విరుద్ధమవుతుంది;'' అలా విరుద్ధమై, ఆ స్థానాన్ని సర్వవ్యాప్తమైన కీచులాటకు వశపరిచేస్తుంది* కాని ''విరుద్ధ వైరుధ్యం'' ఇప్పుడు ఆరంభమై, దేవుడిచ్చిన భార్యతోనే నయాన భయాన సమాధానపడి జీవించే తత్వంతో మేము వివిధ కేంద్ర సంస్థలలో చేరిన తదుపరి, స్వచ్ఛమైన భావశాస్త్రీయ పోరాటానికే ఆరంభస్థానానికే తిరిగి చేరుకుంటాం; కాని ఈ పాటికి ''ప్రతివాదం''యొక్క ఫలితాలన్నింటి వల్లనూ ''వాదం'' భాగ్యవంతం కావించబడి, §1 కి సంబంధించినట్టి విడిగానూ, యాదృచ్ఛికంగానూ సంభవించిన పొరపాటే అర్గనైజేషనుకు సంబంధించిన విషయాలపై అవకాశవాద భావాలుగా పెరిగినట్టి quasi**-వ్యవస్థనూ, ఈ వాస్తవవిషయానికీ విప్లవాత్మక, అవకాశవాద పక్షాలు అనే రెండు పక్షాలుగా మన పార్టీ మౌలికంగా విభక్తమైపోవడానికీ గల సంబంధం అందరకూ అంతకంతకు మరింత స్పష్టంగా అవుపడడమునూ తనలోనే కలిగినట్టి ఒక ఉన్నత సంవాదంగా రూపొందింది. ఒక్కమాటలో చెప్పాలంటే, హేగెల్ వివరించిన ప్రకారం ఓట్స్ గింజలు పెరగడమే కాకుండా, హేగెల్ వివరించిన ప్రకారమే రష్యన్ సోషల్-డెమోక్రాట్లు కూడా తమలో తాము పోరాడుకుంటున్నారు.

కాని తల మీద నిలుచున్న దానిని కాళ్లమీద నిలబడేటట్టు చేసిన తరువాత మార్క్సిజం తనదిగా చేసివేసుకున్న మహనీయ హేగేలియన్ గతితర్కాన్ని, పార్టీలో విప్లవాత్మక పక్షం నుండి అవకాశవాద పక్షానికి ఒక్కసారిగా మొగ్గుచూపే రాజకీయవేత్తల వంకరటొంకర నడకలను సమర్థించే అపభ్రంశపు మాయోపాయాలతోనూ, ఏకైక ప్రక్రియలోని వివిధ దశల అభివృద్ధిలోని విస్పష్ట ప్రకటనలను విస్పష్ట ఘటలను ఒక్క గాటను కట్టే అపభ్రంశపు అలవాటుతోనూ ఎన్నడూ తారుమారు చేయకూడదు. అచ్చమైన గతితార్కికం వ్యక్తిగతమైన పొరపాట్లను సమర్థించదు, కాని అనివార్యములైన మలుపులను అధ్యయనం చేసి, అభివృద్ధి ప్రక్రియ నంతనూ దాని సమగ్ర నిర్దిష్ట రూపంలో పఠించడం ద్వారా ఈ మలుపులు అనివార్యమని రుజువు చేస్తుంది. గతితర్కం యొక్క మౌలికసూత్రం ఇదీ: అనిర్దిష్టమైనట్టి సత్యమంటూ ఏదీ లేదు, సత్యం ఎల్లప్పుడూ నిర్దిష్టమైనది... కాగా మరొక్క విషయం,

---

* కీచులాట, సూత్రప్రాయమైన అభిప్రాయ భేదం, ఈరెంటి మధ్యనూ సరిహద్దు గీత గీయడమనే క్లిష్టసమస్య ఇప్పుడు దానంతటదే పరిష్కారమైపోతుంది: కోఆప్షన్ గురించినదంతా కీచులాట; కాంగ్రెస్‌లో జరిగిన పోరాటంయొక్క విశ్లేషణ, §1 పై వివాదము, అవకాశవాద అరాచకవాదాల వైపు మొగ్గడము, వీటికి సంబంధించినదంతా సూత్రప్రాయమైన అభిప్రాయ భేదం.

** కుహనా — అనువాదకుడు.

meterre la coda dove non va il capo (తల దూర్చడానికి సందు లేకపోతే తోక దూర్చు) అనే ఇటాలియన్ సామెత ఎంత చక్కగానో వ్యక్తపరుస్తూన్నట్టి అల్పజ్ఞ ప్రాపంచిక జ్ఞానంతో మహనీయమైన హెగీలియన్ గతితార్కికాన్ని ఎన్నడూ తారు మారు చేయకూడదు.

మన పార్టీ పోరాటం యొక్క గతితార్కిక అభివృద్ధి ఫలితాలు రెండు పరిభ్రమణల కింద ఏర్పడుతున్నాయి. "మరొకసారి అల్పసంఖ్యాకవర్గీయులం" అనే శీర్షికతో తాను రాసిన పత్రికావ్యాసంలో కామ్రేడ్ మార్టొవ్ న్యాయంగానే అన్నట్టు, పార్టీ కాంగ్రెస్ నిజమైన పరిభ్రమణమే. "విప్లవాలవల్లనే ప్రపంచం తిరుగుతూంది; ఇక్కడ మనం కూడా ఒక విప్లవం చేశాం!" అని అల్పసంఖ్యాకవర్గంలోని మాటకారులు చెప్పినది కూడా సత్యమే. కాంగ్రెస్ జరిగిన తరువాత వారు నిజంగానే ఒక విప్లవం సాధించారు; విప్లవాలవల్లనే ప్రపంచం తిరుగుతూందన్న మాట కూడా స్థూలంగా సత్యమే. కాని స్థూలంగా చెప్పిన ఈ నీతివాక్యం నిర్దిష్టమైన ప్రతి విప్లవం యొక్క నిర్దిష్టమైన భావాన్ని నిర్వచించడం లేదు; మనమెన్నడూ మరువజాలని కామ్రేడ్ మాహొవ్ నుడివిన మనమెన్నడూ మరువజాలని సూక్తికి టిప్పణం చెప్పాలంటే ఇలా చెప్పవచ్చు: కొన్ని విప్లవాలు అభివృద్ధి నిరోధకాలను పోలివుంటాయి. పరిభ్రమణ సాధించిన శక్తి పార్టీలోని విప్లవాత్మక పక్షంలో వుందో, అవకాశవాద పక్షంలోవుందో మనం తెలుసుకోవాలి, ఏదైనా ఒక నిర్దిష్టమైన విప్లవం వల్ల "ప్రపంచం" (మన పార్టీ) ముందుకే సాగిందో వెనక్కే తగ్గిందో మనం నిర్ధారించ గలిగే ముందు సమర యోధులను ఉత్తేజపరచినవి విప్లవాత్మక సూత్రాలో, లేక అవకాశవాద సూత్రాలో మనం ముందు తెలుసుకోవాలి.

మన పార్టీ కాంగ్రెస్, దాని రీతిని అది, అద్వితీయమైనట్టి రష్యన్ విప్లవోద్యమం యావత్తు చరిత్రలోనూ అపూర్వమైనట్టి దృగ్విషయం. పార్టీలోని ఆంతరంగిక పోరాటం యొక్క యావత్తు గమనాన్నీ ఫలితాన్నీ, కార్యక్రమమూ ఎత్తుగడలూ ఆర్గనైజేషనూ ప్రశ్నల పట్ల మన పార్టీ యొక్క, మన పార్టీలో అంతో యింతో ప్రత్యేకంగా అవుపించుతూన్న భాగాలలో ప్రతి భాగంయొక్క పూర్తి స్వభావాన్నీ ప్రపంచానికి ప్రదర్శిస్తూ, ఒక రహస్యపు విప్లవ పార్టీ అజ్ఞాతవాస అంధకారంలోనుండి పట్టపగటి వెలుగులోకి మొట్ట మొదటి సారిగా విజయవంతంగా రాగల్గింది. సర్కిల్ క్రమశిక్షణారాహిత్య సంప్రదాయాలకూ, విప్లవాత్మక అల్పబుద్ధి సంప్రదాయాలకూ స్వస్తి చెప్పడంలోనూ, డజన్లకొద్దీ వుంటూన్నట్టి, అనేకములు పరస్పరం భయంకర యుద్ధం సాగించుతూ కేవలం ఒక భావం యొక్క శక్తివల్లనే అంటిపెట్టికుని వుంటూ తొలిసారిగా మనం సృష్టించుతూన్నట్టి సంపూర్ణతకోసమై — పార్టీ కోసమై — తమ గ్రూపు ప్రత్యేకతనంతనూ గ్రూపు స్వాతంత్ర్యాన్నీ

త్యాగం అనగా, స్వాతంత్ర్య ప్రాయంగా త్యాగం చేయడానికి సిద్ధంగా వుండినట్టి భిన్నభిన్న గ్రూపులను కూడదీసుకుని రావడంలో మొట్టమొదటి సారిగా మనం విజయం సాధించాం. కాని రాజకీయాల్లో త్యాగాలు చెయ్యడం వుత్త పుణ్యానికే జరగదు, వాటి కోసం యుద్ధాలు జరగాలి. ఆర్గనైజేషన్ల నాశనానికై జరిగే యుద్ధం అనివార్యంగా భయంకర బీభత్సంగానే సాగింది. స్వేచ్ఛగా సాగినట్టి బహిరంగమైనట్టి పోరాటపు చల్లని పిల్లగాలి సుడిగాలి కింద రేగింది. గ్రూపు ప్రయోజనాల, వ్యామోహాల, సంప్రదాయాల అవశేషాలు ఒక్కటైనా మిగలకుండా అన్నిటినీ ఈ సుడిగాలి ఎగరగొట్టేసింది — భేషైన పనే చేసింది కూడా! నిజమైన అధికారయుత పార్టీ కార్యనిర్వాహక వర్గాలను అది మొదటి సారిగా సృష్టించింది.

కాని, తాను ఒక పేరు పెట్టుకోవడం ఒక వంతూ, ఆ పేరు సార్థకపరచుకోవడం ఒక వంతూ. పార్టీ కోసమని గ్రూపువ్యవస్థను స్వాతంత్ర్య ప్రాయంగా త్యాగం చేయడం ఒక వంతూ, తన సొంత గ్రూపును వదులుకోవడం ఒక వంతూ. మిగల మగ్గిపోయిన అల్పబుద్ధితత్వానికి అలవాటుపడిన వారికి ఈ చల్లని పిల్లగాని మరీ జివ్వు మనిపించింది. ''మరొకసారి అల్పసంఖ్యావర్గీయులం'' అనే శీర్షకను కల్గిన తన వ్యాసంలో ''పార్టీ తన మొదటి కాంగ్రెస్‌నే భరించుకోలేకపోయింది'' అని కామ్రేడ్ మార్తొవ్ అనడంలో అతడు అజాగ్రత్తవల్లనే నిజం పల్కాడు. ఆర్గనైజేషన్లను నాశనంచేసివేయడం వల్ల తమకు కల్గిన దెబ్బధాక ఇంకా తగ్గనే లేదు. పార్టీ ప్రవాహం అడుగున మేటవేసిన బురద అంతటినీ ఆ వెర్రి సుడిగాలి పైకి తేలగొట్టింది; దానితో ఈ బురద తన కసి తీర్చుకుంది. కరడుబారిపోయిన ముసలి గ్రూపు తత్వం ఇంకా బాల్యంలోనే వున్న పార్టీ భావాన్ని అణిచేసింది. పార్టీలో వున్న అవకాశవాద పక్షం, అదివరకు పూర్తిగా పరాజయం పొందినప్పటికీ, అనుకోకుండా తనకు దొరికిన అకీమొవ్ కొల్లసొత్తు మూలంగా అదనపు బలం సంపాదించుకుని, విప్లవాత్మక పక్షం మీద, సహజంగా తాత్కాలికంగానే, పైచేయి సంపాదించగలిగింది.

దీని ఫలితమే కొత్త ''ఇస్క్రా''; పార్టీ కాంగ్రెస్‌లో ''ఇస్క్రా'' సంపాదకులు చేసిన పొరపాటును ఇది మరింత పెద్దదిగానూ, లోతుగానూ చేసి తీరుతుంది. విప్లవాత్మక పోరాట సత్యాలను పాత ''ఇస్క్రా''[79] బోధించింది. అందరికీ లొంగిపోయి అందరితోనూ సమాధాన పడుతూ జీవించడమనే ప్రాపంచికజ్ఞానాన్ని బోధించుతూంది కొత్త ''ఇస్క్రా''. పాత ''ఇస్క్రా'' సమరశీలమైన సనాతనతత్వ పత్రిక. అవకాశవాదపు ఎంగిలి మెతుకులతో — ముఖ్యంగా ఆర్గనైజేషను సమస్యలపై — మనకు విందుచేస్తూంది కొత్త ''ఇస్క్రా''. రష్యన్ అవకాశవాదులూ, పశ్చిమ యూరపియన్ అవకాశవాదులూ, వీరిద్దరిచే ద్వేషించబడేటంతటి గౌరవాన్ని సంపాదించుకుంది పాత ''ఇస్క్రా''. కొత్త ''ఇస్క్రా'' ''బుద్ధి నేర్చుకుంది''; ఇకమీదట తీవ్ర అవకాశవాదులు తన మీద కురిపించే పొగడ్తలను అది సిగ్గువిడిచి ఆనందించడం మొద

లెడుతూంది. రుజుమార్గాన్ని విడనాడకుండా తన లక్ష్యాభిముఖంగా సాగిపోయింది పాత ''ఇస్క్రా'', కాగా తన మాటలకూ చేతలకూ ఎట్టి భేదము వుండేదికాదు. కొత్త ''ఇస్క్రా'' తీసుకున్నట్టి స్వాభావికమైన తప్పుడు స్థానం దానిని అనివార్యంగా — ఇతరుల సంకల్పంతోనూ చైతన్యంతోనూ ఏ మాత్రమూ నిమిత్తం లేకుండానే — రాజకీయ వంచన దిశగా తీసుకుపోతుంది. పార్టీ భావంపై గ్రూపుభావం సాధించిన విజయాన్ని కప్పిపుచ్చేందుకని, గ్రూపుభావంపై కాకిగోల పెడుతూంది. ఆర్గనైజేషను అనే పేరును సార్థకపరచుకునే ఏ పార్టీ అయినా సరే చీలికలు రాకుండా చేసుకునేందుకు అధికసంఖ్యాకవర్గానికి అల్పసంఖ్యాకవర్గం లోబడిపోవడం తప్ప వేరొక విధాన్ని దేనినైనా ఎవరైనా అక్కడకు ఊహించుకోగల్గేటట్టు, కపటబుద్ధితో అది చీలికలను ఖండిస్తూంది. విప్లవాత్మక ప్రజాభిప్రాయాన్ని పాటించాలని అది ఒకవైపు చెబుతూనే, అకీమోవ్ లాంటివాళ్ల పొగడ్తలను కప్పిపుచ్చుతూ, పార్టీలోని విప్లవాత్మక పక్షపు కమిటీల గురించి చిల్లరమల్లర దూషణ ప్రచారానికి దిగజారుతుంది*. ఎంత సిగ్గుచేటు! మన పాత ''ఇస్క్రా''ను ఎంతగా అప్రతిష్ఠ పాల్జేశారో వీరు!

ఒక అడుగు ముందు రెండడుగులు వెనక్కి.... వ్యక్తుల జీవితాల్లోనూ, జాతుల చరిత్రలోనూ, పార్టీల అభివృద్ధిలోనూ ఇలా సంభవించుతుంది. విప్లవాత్మక సోషల్-డెమోక్రసీయొక్క, శ్రామికవర్గ ఆర్గనైజేషనుయొక్క, పార్టీ క్రమశిక్షణయొక్క సూత్రాలు అనివార్యంగానూ సంపూర్ణంగానూ విజయం పొందుతాయని క్షణమాత్రమైనా శంకించడం శిక్షణార్హమైన పిరికితనమే అవుతుంది. ఇప్పటికప్పుడే మనం చాలా మటుకు విజయం సాధించాం; కాగా మనమింకా పోరాటాన్ని సాగిస్తూనే వుండాలి. అపజయాలవల్ల నిరుత్సాహ పడకుండా వజ్రసంకల్పంతో పోరాడుతూ అల్పబుద్ధితత్వపు సర్కిల్ కీచులాట పద్ధతులను తిరస్కరించుతూ, సోషల్-డెమోక్రాట్లనుందరినీ ఐక్యపరచడానికై ఎంతో శ్రమ ధారపోసి స్థిరపరచినట్టి ఏకైకపార్టీ సంబంధాలను కాపాడేందుకు మన శక్తి నంతనూ వినియోగించుతూ, పార్టీ సభ్యుల విధులు గురించీ, రెండవ పార్టీ కాంగ్రెస్‌లో జరిగిన పోరాటం గురించీ, మనలో వున్న అభిప్రాయభేదాలకుగల కారణాలన్నిటి గురించీ, వాటి దశలన్నిటి గురించీ, ఆర్గనైజేషను రంగంలోనే కాకుండా మన కార్యక్రమ రంగంలోనూ ఎత్తుగడల రంగంలోనూ కూడా బూర్జువా మనస్తత్వాం ఎదుట నిస్సహాయతతో లొంగిపోయి బూర్జువా ప్రజాస్వామ్య దృక్పథాన్ని విమర్శనా

---

* ముచ్చటైన ఈ క్రీడావినోదం సాగించేందుకు, ''అల్పసంఖ్యాకవర్గానికి చెందిన కామ్రేడ్ 'Z' పట్ల 'Y' అనే అధికసంఖ్యాకవర్గపు కమిటీ చాలా చెడుగా ప్రవర్తించిందని మా ప్రత్యేక విలేకరి 'X' తెలియజేస్తున్నాడు'' అనే అచ్చుగుద్దిన సాంకేతికం సహితమూ ఒకటి తయారుచేయబడింది.

రహితంగా అవలంబించి శ్రామికవర్గ పోరాటమనే ఆయుధాన్ని తుప్పుపట్టించేటట్టి అవకాశ వాదంయొక్క వినాశకర ఫలితాలను గురించీ పట్టువిడుపులేనట్టి, వ్యవస్థాత్మకమైనట్టి కృషిద్వారా పార్టీసభ్యులందరూ, మరీ ముఖ్యంగా కార్మికులూ, తెలుసుకునేటట్టు చేయాలి.

పరిపాలనాధికారాన్ని సంపాదించేందుకు సాగించవలసిన పోరాటంలో శ్రామికవర్గానికి ఆర్గనైజేషను తప్ప వేరొక ఆయుధం లేదు. బూర్జువా ప్రపంచంలో వున్న అరాచకమైన పోటీ ప్రాబల్యం ఫలితంగా ఐక్యతలేనివారై, పెట్టుబడి కోసం నిర్బంధమైన వెట్టిచాకిరీ వల్ల క్రుంగి కృశించి, దిక్కుమాలిన దారిద్ర్యం, పశుత్వం, క్షీణదశల ''అగాధపు అట్టడుగుకు'' నిర్విరామంగా తొక్కివేయబడుతూన్నట్టి శ్రామికవర్గం, మార్క్సిజం సూత్రాలచే సాధించబడిన తన భావ శాస్త్రీయ సంఘీభావం కోటానుకోట్ల కష్టజీవులను కార్మికవర్గ సేనగా పటిష్ఠవంతం చేయగల్గినట్టి ఒక ఆర్గనైజేషను దృఢపడినప్పుడే ఒక అజేయమైన శక్తిగా రూపొందగల్గుతుంది, రూపొంది తీరుతుంది. జీర్ణించిపోయి శిథిలమైపోవడానికి సిద్ధంగా వున్న రష్యన్ జారిస్టు పరిపాలనగాని, వృద్ధాప్యంలో వున్న అంతర్జాతీయ పెట్టుబడిదారీ పరిపాలనగాని ఈ సైన్యం ఎదుట నిలబడజాలదు. నేటి సోషల్-డెమోక్రసీలోవున్న జిరోండిస్టులు ఎన్ని వంకరటొంకర దారులు పట్టినప్పటికీ, ఎన్ని వెనుకంజలు వేసినప్పటికీ, అవకాశ వాద పదజాల వ్యాపారాన్ని ఎంతగా సాగించినప్పటికీ కూడా, కాలం చెల్లిపోయిన గ్రూపుతత్వం ఎంత ఆత్మసంతృప్తికరమైన పొగడ్తలు కురిపించినప్పటికీ, మేధావిస్తరపు అరాచకవాదంయొక్క మాయబంగారాన్ని చూపుతూ ఎంత హడావిడి చేసినప్పటికీ కూడా శ్రామికవర్గపు శ్రేణులు అంతకంతకు మరింత ఎక్కువ దృఢంగా బారులు తీర్చి నిలబడతాయి.

ఫిబ్రవరి — మే 1904.

# అమెరికన్ "సాధారణ పునర్విభజన"పై మార్క్స్

వ్యవసాయభూమి సంబంధమైన సమస్యపై క్రీగెను విమర్శిస్తూ మార్క్స్ రాసిన ఒక పత్రికావ్యాసం గురించి "వ్పెర్యోద్" 12 వ సంచికలో పేర్కొనబడింది. ఈ వ్యాసం రాయడం, కామ్రేడ్ — పొరపాటుగా పేర్కొన్నట్టు 1848 లో గాక, 1846 లోనే. మార్క్స్‌తో కలిసి పనిచేసినట్టి, అప్పట్లో ఇంకా బాగా కుర్రవాడుగానే ఉండినట్టి హెర్మన్ క్రీగ 1845 లో అమెరికా వెళ్లి, కమ్యూనిజమ్ ప్రచారం చెయ్యడానికని అక్కడ "Volks-tribun" ("ప్రజాన్యాయమూర్తి") అనే పత్రికను స్థాపించాడు. కాని హెర్మన్ క్రీగె ఈ ప్రచారం ఎలా సాగించాడంటే, కమ్యూనిస్టు పార్టీని అతడు అప్రతిష్ఠ పాల్జేస్తున్న విధానం పట్ల జర్మన్ కమ్యూనిస్టుల తరపున అతి తీవ్రమైన నిరసన ప్రకటించక తప్పిందికాదు మార్క్స్‌కి. 1846 లో "Westfälisches Dampfboot" ["వెస్ట్‌ఫాలియా పొగ ఓడ"] ఆ వర్త్ర కమపత్రికలో వెలువడినట్టి, మేరింగ్ సంపాదకత్వం కింద ప్రచురించబడిన మార్క్స్ రచనల కూర్పు, 2 వ సంపుటంలో పునర్ముద్రితమైనట్టి క్రీగె ధోరణిపై విమర్శ నేటి రష్యన్ సోషల్-డెమోక్రాట్లకు అమిత ఆసక్తిదాయకంగా వుంటుంది.

అసలు విషయమేమిటంటే, ఈనాడు రష్యాలో వ్యవసాయభూమి సంబంధమైన సమస్య ఏలాగైతే ప్రధాన రంగంలోకి తీసుకురాబడుతూందో సరిగ్గా ఆనాడు కూడా కేవలం అమెరికన్ సామాజికోద్యమ గమనం చేతనే ఈ సమస్య ప్రధాన రంగంలోకి తీసుకురాబడింది; కాగా అచ్చంగా వివాదాస్పదమైన విషయం, అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ సమాజం గాక, పెట్టుబడిదారీ వ్యవస్థ సముచితంగా అభివృద్ధి చెందడానికి ప్రధానమూ అవసరమూ అయినట్టి పరిస్థితులు. "సాధారణ పునర్విభజన" గురించి అమెరికన్ అభిప్రాయాల పట్ల మార్క్స్ వైఖరికీ, నేటి రైతు ఉద్యమం పట్ల రష్యన్ సోషల్-డెమోక్రాట్ల వైఖరికీ సాదృశ్యం చూపడంలో ఈ రెండవ విషయం ప్రత్యేక ప్రాముఖ్యతను వహించుతూంది.

అమెరికన్ వ్యవస్థయొక్క నిర్దిష్ట సామాజిక ప్రత్యేకతలను అధ్యయనం చేయడానికి గాని, భూమిశిస్తును రద్దుపరచడానికి పాటుపడినట్టి ఆనాటి వ్యవసాయభూమి సంబంధమైన

సంస్కరణవాదుల ఉద్యమం నిజస్వభావాన్ని వ్యక్తపరచడానికిగాని, తన పత్రికలో క్రీగె ఎట్టి సాధనసామగ్రినీ ఇవ్వలేదు. అందుకు బదులు, (మన ''సోషలిస్టు-రివల్యూషనరీల'' శైలి లోనే) విప్లవకరమైన వ్యవసాయభూమి సంబంధమైన సమస్యను నిరర్థక శబ్దపుష్టి కలిగిన డాంబిక పదజాలం ప్రయోగించి క్రీగె వర్ణించాడు. ''ఉత్పాదకశీలమైన శ్రమకు అవకాశం కల్పించిన తక్షణమే పేదవాడు ప్రతివాడూ మానవ సమాజానికి ఉపయోగకారి అయే సభ్యునిగా రూపొందుతాడు. తననూ తన కుటుంబాన్నీ పోషించుకొన గలిగేందుకు సరిపడే భూఖండాన్ని సమాజం అతనికి ప్రసాదించిన మరుక్షణంలో ఇటువంటి సదవకాశం అతనికి కలకాలమూ నిశ్చయంగా లభించుతుంది. ఈ బ్రహ్మాండమైన భూవిస్తీర్ణాన్ని (ఉత్తర అమెరికాలో వున్న 140 కోట్ల ఎకరాల ప్రభుత్వభూములు) వాణిజ్య చలామణీ నుండి తప్పించివేసి, పరిమిత విస్తీర్ణాలలో శ్రమకు లభింపజేసిన పక్షంలో*, ఒక్కదెబ్బలో అమెరికాలోని దారిద్ర్యమంతా అంతమొందించబడుతుంది...''

దీనికి మార్క్స్ ఇలా సమాధానం ఇస్తున్నాడు: ''పితృస్వామ్య వ్యవస్థ తాను కోరినట్టి పారిశ్రామిక వ్యవస్థగా అభివృద్ధిచెందేందుకు అవరోధాలు కల్పించడముగాని, లేదా తూర్పుకోస్తా పారిశ్రామిక వాణిజ్య రాష్ట్రాలను తిరిగి పితృస్వామిక బర్బర వ్యవస్థలోకి నెట్టివేయడము గాని శాసనకర్తల శక్తిలో లేదన్న విషయం క్రీగె గ్రహించి వుంటాడనే ఎవరైనా అనుకుంటారు.''

ఈ విధంగా అమెరికన్ సాధారణ పునర్విభజన పథకం ఒకటి మన ఎదుట వుంది: భూమిలో అత్యధికభాగం వాణిజ్య చలామణి నుండి తప్పించి వేయడము, భూమిపై స్వామ్యానికి, లేక స్వామ్యానికి లోనైన భూమి విస్తీర్ణానికి, లేక సాగుచేస్తూన్న భూమి విస్తీర్ణానికి పరిమితి ఏర్పరచడము. ఈ ఊహాజగత్ వ్యవస్థను ఓం ప్రథమం నుండీ కూడా నెమ్మదైన విమర్శతో ఎదుర్కొందుకు మార్క్స్ ఉపక్రమించి, పితృస్వామ్య వ్యవస్థ పారిశ్రామిక వ్యవస్థగా పరివర్తన చెందడం అనివార్యమని, అనగా నేటి భాషలో, పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి అనివార్యమని చూపించాడు. అయితే ఈ ఉద్యమ సభ్యుల ఊహాజగన్నిర్మాణ స్వప్నాలు మార్క్స్‌లో ఈ ఉద్యమం పట్ల స్థూలంగా శత్రుత్వాన్ని రేకెత్తించాయని అనుకోవడం గొప్ప పొరపాటే

---

* భూమిని పెట్టుబడినుండి శ్రమకు బదలాయించడం గురించీ, రష్యాలో ప్రభుత్వ భూముల ప్రాముఖ్యత, సరిసమానమైన భూమి అమరకం గురించీ, భూమిని వాణిజ్యచలామణీలోకి తీసుకురావడమనే బూర్జువా భావన, వగైరాలను గురించీ ''రివల్యూత్సియోన్నయ రొస్సీయ'' పత్రిక, తన 8 వ సంచికతో ప్రారంభించి రాసిన దానిని జ్ఞప్తికి తెచ్చుకోండి. క్రీగె వ్యక్తంచేసిన భావాలే అచ్చంగా!

అవుతుంది. ఇలాంటిదేమీ జరగలేదు. అప్పటికప్పుడే తన సాహిత్య వ్యాసంగం ప్రప్రథమంలోనే, ఏదైనా ఒక ఉద్యమానికి తొడిగిన భావశాస్త్రీయ మాయబంగారపు వలువలను వొలిచివేసి, దాని వాస్తవమూ అయిన ప్రగతిశీలమూ అయిన అసలు విషయాన్ని బైటపెట్టడం ఎలాగో మార్క్స్ అవగాహన చేసుకున్నాడు. "'ప్రజాన్యాయమూర్తి' ఆర్థికాలు (అనగా అర్థశాస్త్రం), యువ అమెరికాపట్ల దాని వైఖరి" అనే శీర్షికతో తాను కావించిన విమర్శన రెండవ భాగంలో మార్క్స్ ఇలా రాస్తున్నాడు:

"అమెరికన్ జాతీయ సంస్కరణకర్తల ఉద్యమం చారిత్రాత్మకంగా సమర్థనీయమని మేము పూర్తిగా గుర్తిస్తున్నాం. ఆధునిక బూర్జువా సమాజ పారిశ్రామికీకరణాన్ని తాత్కాలికంగా ప్రోత్సహించే ఫలితాలను — యథార్థంగానే — సాధించేందుకు ఈ ఉద్యమం పాటు పడుతూందనీ, కాని శ్రామికవర్గ ఉద్యమ ఫలంగా, సాధారణంగా భూమి సంబంధమైన ఆస్తిపై దాడి రూపంగా అమెరికాలో నేడున్న పరిస్థితులలో ప్రత్యేకంగానూ, ఉద్యమం యొక్క సొంత అనుషంగికాల కారణంగానూ ఈ ఫలితాలు కమ్యూనిజానికి దారితీయగలవనీ మేము ఎరుగుదుం. న్యూయార్క్‌లో వున్న జర్మన్ కమ్యూనిస్టులతో సహా శిస్తువ్యతిరేకోద్యమంలో "Anti-Rent-Bewegung" చేరిన క్రీగె, ఉద్యమంయొక్క అసలు విషయం గురించి ఎట్టి శ్రమ తీసుకోకుండానే, నిరర్థక శబ్దపుష్టిగల పదజాలంతో ఈ వాస్తవ విషయాన్ని ముస్తాబు చేసి, యువ అమెరికాకూ అమెరికన్ పరిస్థితులకూ వున్న సంబంధాల గురించి తనకేమీ స్పష్టంగా తెలియదనే తద్వారా రుజువు పర్చుకుంటున్నాడు. వ్యవసాయభూమి సంస్కరణవాదులకు ఒప్పిదమైనట్టి అమెరికన్ స్థాయిలో భూమిని చిన్నచిన్న ఖండాలుగా విభజించి పంపిణీ చేయడం గురించి మానవాళిపై తనకున్న ఉత్సాహాన్ని అతడెలా ఒలకబోస్తున్నాడో చూపించేందుకు ఇంకొక ఉదాహరణను మేము ఉల్లేఖిస్తున్నాం.

" 'Volkstribun' 10 వ సంచికలో 'మేము కోరేది' అనే శీర్షికను కల్గిన వ్యాసంలో ఇలా వుంది: 'భూమి ప్రజలందరి వారసత్వమూ అని అమెరికన్ జాతీయ సంస్కరణ వాదులు పేర్కొంటారు; కాగా — భూమిని మింగేయజూస్తున్న చట్టావ్యాపారుల చేతులలో ఇంకా పడనట్టి 140 కోట్ల ఎకరాల భూమినీ సర్వమానవాళి యొక్క అవిభాజ్యమైన సామాన్య వారసత్వంగా పరిగణించి భద్రపరచేందుకై శాసనాలను ఆమోదించవలసిందని జాతీయ శాసననిర్మాణ సంస్థను వారు కోరుతున్నారు. ఈ 'అవిభాజ్యమైన సామాన్య వారసత్వాన్ని' సర్వమానవాళికీ భద్రపరచేందుకుగాను జాతీయ సంస్కరణవాదుల పథకాన్ని — 'ప్రతి రైతుకీ, అతడు ఏ దేశంలో పుట్టినవాడైనా సరే, అతడి భృతికోసం అమెరికాలో 160 ఎకరాల భూమి అతనికి ఇవ్వడమనే పథకాన్ని — దీనినే 14 వ సంచికలో 'కోన్జెకు సమాధానం' (Konze) అనే వ్యాసంలో, 'అందరూ కాజేయగా ఇంకా మిగిలివున్నట్టి ఈ ప్రజా వారసత్వంలో 160

ఎకరాలకు మించి ఎవ్వడూ ఆక్రమించుకొన కూడదనీ, ఇదైనా దీనిని తాను స్వయంగా దున్ను కునే షరతుపైనే' అని చెప్పబడిన పథకాన్ని, ఇతడు అంగీకరిస్తున్నాడు. ఈ విధంగా తక్ష ణమే భూమిని పంచడం ద్వారా భూమిని 'అవిభాజ్యమైన వారసత్వం కింద', అంతేకాదు 'సర్వమానవాళి'కీ కూడానూ భద్రపరచబడాల్సి వుంటుంది. ఈ విభజనయొక్క అనివార్య ప్రతిఫలాన్ని — సాంద్రీకరణము, పారిశ్రామిక ప్రగతి, వగైరాలను — శాసననిర్మాణం ద్వారా తాను నివారించ గల్గుతానని క్రీగె ఊహిస్తున్నాడు. ఈ 160 ఎకరాల భూమి ఏదో ఒక స్థిరపరిమాణమైనట్టూ, భూమి మంచి చెడ్డలనుబట్టి ఈ 160 ఎకరాల విలువ మారనట్టూ అతడు భావిస్తున్నాడు. ఈ భూమిని, ఈ భూమిని కాకపోతే దాని ఫలసాయాన్ని, 'రైతులు' తమలో తామో, లేక ఇతరులతోనో మార్పిడి చేసుకోవాల్సే వుంటుంది; కాగా ఇక ఒకసారి వారు అంతవరకూ వెళ్లారంటే, తన శ్రమ, తన 160 ఎకరాలయొక్క ప్రకృతి సిద్ధమైన సత్తువ పుణ్యమా అంటూ పెట్టుబడి లేకుండానే కూడా, ఒక రైతు తన పొలంలో ఇంకొక 'రైతు'ను కూలివానిగా దిగజార్చివేయగల స్థితికి చేరుకుని తీరుతాడు. ఇక అప్పుడు 'భూమి', లేదా భూమి ఫలసాయాలూ 'భూమిని దిగమింగుతూన్న చట్టావ్యాపారుల చేతిలో' పడితే యేమి, పడకపోతే యేమి? అదీ ఇదీ సమానమే కదా? క్రీగె మానవాళికి దయచేస్తూన్న ఈ బహుమానాన్ని గంభీరంగా పరిశీలించుదాం. 140 కోట్ల ఎకరాల భూమి 'సర్వమానవాళి యొక్క అవిభాజ్యమైన సామాన్య వారసత్వంగా' భద్రపరచబడాలి. ప్రతి 'రైతు'కీ 160 ఎకరాలు ముట్టాలి. దీన్నిబట్టి క్రీగె అంచనాలో మానవాళి సంఖ్య ఎంతో మనం లెక్కకట్ట వచ్చు: సరిగ్గా 87,50,000 'రైతులు'; ఒక్కొక్క రైతుకుటుంబానికీ ఐదుగురు చొప్పున 4,37,50,000 మనుషులు. అధమం అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని 'శ్రామిక వర్గం సర్వమానవాళి ప్రతినిధిగా అంత భూమీ' తనదేనని కోరగలిగే 'శాశ్వత కాలం'యొక్క పరిమితి ఎంత వుంటుందో మనం లెక్కకట్టవచ్చు కూడా. ఈనాటి వరకూ పెరిగిన రీతిలోనే అమెరికా సంయుక్త రాష్ట్రాల జనసంఖ్య ఇకమీదట కూడా పెరిగిందంటే, అనగా 25 ఏళ్లలో రెండింతలైందంటే, ఈ 'శాశ్వతకాలం' 40 ఏళ్లకు సహితమూ మించదు; అప్పటికి ఈ 140 కోట్ల ఎకరాలనూ జనం అప్పుడే ఆక్రమించేసుకునే వుంటారు, ఇక మీదటి తరాలవారికి 'నా' అనుకుందుకేనా భూమి అంటూ అసలు వుండనే వుండదు. కాని భూమిని పూరకనే దానం చేయడం కారణంగా వలసవచ్చే జనసంఖ్య విపరీతంగా పెరుగుతుంది కాబట్టీ, యూరప్‌లో వున్న జనంలో ప్రతి పదిమందిలో ఒకడు పాపరు అయివుండడమూ, ఒక్క బ్రిటిష్ ద్వీపాల్లోనే 70,00,000 పాపర్లు వుండడమూ కారణంగా, 4 కోట్ల 40 లక్షల ముందికే సరిపడిన భూమి ఈనాడు యూరప్‌లో వున్న దారిద్ర్యాన్ని ఏకముఖంగా మళ్లించడానికేనా ఎంత మాత్రమూ చాలదని విశేషించి మనం దృష్టిలో పెట్టుకున్నట్టయితే, క్రీగె

చెప్పిన 'శాశ్వత కాలం' ఇంతకంటె త్వరగానే అంతమైపోతుందేమో కూడానూ. అర్థశాస్త్రంలో సత్యకాలపుతనానికి ఇలాంటి దృష్టాంతమే మరొకటి 13 వ సంచికలో 'స్త్రీలకు' అనే వ్యాసంలో మనకి తారసిల్లుతూంది. లాంగ్ ఐలెండ్‌లో తనకున్న 52,000 ఎకరాల భూమినీ న్యూయార్క్ పట్నం విడుదలచేసిన పక్షంలో, న్యూయార్క్‌లో వున్న దారిద్ర్యం, దౌర్భాగ్యం, పాపపంకిలమంతటినీ 'ఒక దెబ్బలో' శాశ్వతంగా వదలగొట్టేయడానికి ఆ భూమి చాలు తుందని ఆ వ్యాసంలో క్రీగె అంటాడు.

''కొన్ని నిర్దిష్ట పరిస్థితులలో అవసరమైనట్టి శ్రామికవర్గోద్యమం యొక్క ప్రారంభ రూపంగా భూమి విడుదల ఉద్యమాన్ని క్రీగె భావించి వుండినట్టయితే, ఈ ఉద్యమం ఏ వర్గం నుండి బయలు వెడలుతూందో ఆ వర్గం, జీవితంలో ఆక్రమించుతూన్న స్థానం కారణంగా కమ్యూనిస్టు ఉద్యమంగా పరిణమించి తీరాల్సిన ఉద్యమంగా అతడు దీనిని భావించి వుండినట్టయితే, కమ్యూనిజం అంతటినీ ఖండించుతూన్నట్టుగా కనబడుతూన్నట్టి ఈ వ్యవసాయభూమి రూపంలో అమెరికాలోని కమ్యూనిస్టు ధోరణులు ప్రప్రథమంగా సాక్షాత్కరించాల్సి వచ్చిందో అతడు చూపివుండి నట్టయితే మనం అభ్యంతరం చెప్పదగ్గ విషయం అందులో ఈషత్తు కూడా వుండదు. కాని ఏది ఏమైనప్పటికీ, నిర్దిష్ట వ్యక్తులు కొందరిచే మాత్రమే లేవనెత్తబడిన ఉద్యమం యొక్క కేవలం అప్రధాన రూపమే అయిన విషయాన్ని సాధారణ మానవాళియొక్క విషయమని అతడు ఉద్ఘాటించుతున్నాడు; ప్రతి సాధారణ ఉద్యమంయొక్క అంతిమ, అత్యున్నత లక్ష్యంగా దీనిని అతడు చిత్రిస్తూ, ఈ విధంగా ఆ ఉద్యమం యొక్క నిర్దిష్ట లక్ష్యాలను నిరర్థక శబ్దపుష్టి సహితమైన అసందర్భం కింద మార్చివేస్తున్నాడు. 10 వ సంచికలో వున్న అదే శీర్షికగల వ్యాసంలో ఆ విజయ గీతాన్నే అతడింకా ఆలపించుతున్నాడు: 'పూర్వపు యూరపియన్లు కన్న కలలు చివరకు ఈ విధంగా నిజమవుతున్నాయి. మహా సముద్రం ఈ దరిని వారికొక స్థానం సిద్ధంగా ఏర్పడుతూంది. వారి వచ్చి ఆ స్థానం ఆక్రమించడమే తరువాయి, తమ రెక్కల కష్టంతో ఫలవంతం చేయడమే తరువాయి. వారాలా చేయగల్గినట్టయితే ప్రపంచంలో వున్న నిరంకుశ ప్రభువులందరి ఎదుట నిలబడి: 'ఇది నా గుడిసె, దీనిని మీరు కట్టించలేదు; ఏ ఇంటి దీపం చూచి మీకళ్లు కుట్టుతూన్నాయో అట్టి దీపం వెలుగుతూన్న ఈ ఇల్లూ వాకిలి నాది' అని వారు సగర్వంగా ఉద్ఘాటించగల్గుతారు.'

'' 'నేనూ, నా పెళ్లాం పిల్లలూ, నా కమతగాడూ, నా పశువులూ ఉత్పత్తిచేసిన ఈ పెంటకుప్ప నాది' అని కూడా అతను చేర్చి వుండొచ్చు. కాగా ఎవరి 'కలలు' ఈ విధంగా నిజమవుతూన్నాయి? కమ్యూనిస్టు కార్మికుల కలలు కానేకావు! అమెరికాలో పెట్టీబూర్జువాలు గానూ, వ్యవసాయదార్లుగానూ తలెత్తుకుని తిరిగే అదృష్టం తమకెప్పుడు పట్టుతుందా అని

ఆశలు పెట్టుకున్నట్టి దివాళాతీసిన దుకాణదార్లూ చేతిపనివాళ్ళూ, బతికిచెడ్డ రైతులూ, వీరి కలలే! ఈ 140 కోట్ల ఎకరాలనూ సాధనంగా ఉపయోగించి ఉద్ధరించబోయే 'కల' ఏమిటి? అందరు మనుషులనూ ప్రైవేటు ఆస్తిపరులుగా మార్చివేసే కల, అందరి మనుషులనూ చక్రవర్తులుగానూ, జగద్గురువులుగానూ మార్చివేయగలిగే కల ఎంత ఆచరణీయంగానూ ఎంత కమ్యూనిస్టు విధానాత్మకంగానూ వుంటుందో, అంత ఆచరణీయంగానూ అంత కమ్యూనిస్టు విధానాత్మకంగానూ వున్నట్టి కల తప్ప ఇది మరొకటికాదు.''

విషపూరితంగానూ అపహాస్యభరితంగానూ వుంది మార్క్స్ విమర్శ. క్రీగె అభిప్రాయాలలోని ఏ అంశాలలైతే మనకిప్పుడు మన ''సోషలిస్టు-రివల్యూషనరీల''లో కనబడుతున్నాయో సరిగ్గా ఆ అంశాలను కనబరుస్తున్నందుకే — పదజాల ప్రాబల్యమూ, పెట్టీ బూర్జువా ఊహాజగత్తులను అత్యంత విప్లవాత్మక ఊహాజగత్తత్వం కింద చలామణీ చెయ్యడమూ, ఆధునిక ఆర్థిక వ్యవస్థనూ దాని వాస్తవ పునాదులనూ దాని అభివృద్ధినీ అర్థం చేసుకోవడంలో వైఫల్యమూ కనబరుస్తున్నందుకే — అతనిని మార్క్స్ దుయ్యబట్టుతున్నాడు. అప్పటికింకా కేవలం భావి అర్థికశాస్త్రవేత్తగానే వున్నట్టి మార్క్స్, తన అద్భుత పరిశీలనాశక్తితో మార్పిడియొక్క, సరుకుల ఉత్పత్తి యొక్క పాత్రను విస్పష్టంగా చూపించుతున్నాడు. రైతులు భూమినైనా మార్పిడి చేసుకుంటారు, లేదా అధమం భూఫలసాయాన్నయినా మార్పిడి చేసుకుంటారు అని అతడు చెబుతున్నాడు — ఇక దాంతో అంతా చెప్పేసినట్టే! ఈ ప్రశ్న యొక్క సమగ్రప్రదర్శన అనేక విషయాల్లో రష్యన్ రైతు ఉద్యమానికీ, దాని పెట్టీబూర్జువా ''సోషలిస్టు'' భావశాస్త్రవేత్తలకు ప్రయుక్తం చేయవచ్చు.

అయితే ఈ పెట్టీబూర్జువా ఉద్యమాన్ని మార్క్స్ అదే సమయంలో కేవలం ''కాదనడం'' లేదు, విప్లవాత్మక పెట్టీబూర్జువా ప్రజాస్వామ్యాన్ని ముట్టుకుంటే మయలుపడిపోతామని భయపడేటట్టి పండిత ప్రకాండులు అనేకులకు సహజమైన పిడివాదధోరణిలో మార్క్స్ దీనిని దాటవేయడం లేదు. ఉద్యమాన్ని చుట్టివేసినట్టి భావ శాస్త్రీయ త్వక్కుయొక్క అసంగతాన్ని నిర్దాక్షిణ్యంగా అవహేళన చెస్తూనే, భిన్నభిన్న వ్యక్తుల సంకల్పాలూ చైతన్యాలతోనూ, వారి స్వప్నాలూ సిద్ధాంతాలతోనూ నిమిత్తం లేకుండానే, దాని బాహ్యగతాత్మక పరిస్థితుల కారణంగా దానిని అనివార్యంగా అనుగమించ వలసినట్టి ఫలితాలనూ, దాని యథార్థ చారిత్రాత్మక విషయాన్ని నిశ్చల భౌతికవాద మార్గంలో నిర్ధరించడానికి మార్క్స్ ప్రయత్నిస్తాడు. అందుచేత, ఈ ఉద్యమాన్ని కమ్యూనిస్టులు బలపరచడమును మార్క్స్ ఖండించడలేదు, దానిని కమ్యూనిస్టులు బలపరచడమునే అతడు పూర్తిగా అనుమతిస్తున్నాడు. గతితార్కిక దృక్పథాన్ని అవలంబించుతూ, అనగా గతాన్నీ భవిష్యత్తునీ లెక్కలోకి తీసుకుంటూ ఉద్యమాన్ని అన్ని వైపులనుండీ పరిశీలించుతూ, భూమిరూపమైన ప్రైవేటు ఆస్తిపై జరుపు

తూన్న ఈ దాడియొక్క విప్లవాత్మక ఆకృతిని మార్క్స్ గమనించాడు. శ్రామికవర్గీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క ఒకప్రత్యేక ప్రారంభరూపంగా ఈ పెట్టీబూర్జువా ఉద్యమాన్ని మార్క్స్ గుర్తించాడు. ఈ ఉద్యమం చేపట్టడం వల్ల నువ్వు కంటూన్న కలలు సార్థకం కావు అంటాడు. మార్క్స్, క్రీగెను ఉద్దేశించి: సౌభ్రాతృత్వం బదులు, నీకు లభించేది పెట్టీబూర్జువా వేర్పాటే; రైతులకు అవిభాజ్యపు కేటాయింపు భూములు లభించడం బదులు, భూమి వాణిజ్యపు సరుకుగా మారిపోతుంది; అంతా మింగేసే చట్టా వ్యాపారులపై దెబ్బతీయడం బదులు పెట్టుబడిదారీ విధానాభివృద్ధి ప్రాతిపదిక మరింత విస్తృత మవుతుంది. సామాజిక పరిణామాన్ని అది భీతావహంగా త్వరితపరచి, కమూనిస్టు ఉద్యమం యొక్క నూతన, ఉన్నత రూపాలను అంతకు మరింత చేరువుగా తీసుకువసు ంది కాబట్టి, నీవు నిరర్థ కంగా నివారింపజూస్తూన్నట్టి పెట్టుబడిదారీ విధానపు ఘోరకలి చారిత్రాత్మకంగా మంచిదే. భూమి ఆస్తిపై తీసేదెబ్బ, సాధారణపు ఆస్తిపై అనివార్యమైన ఇతర దెబ్బలు తీయడానికి మరింత వీలు కలుగజేస్తుంది. ఏదో కొద్దిపాటి భాగ్యాన్ని — అదైనా అందరికీ కాదు, ఏ కొద్ది మందికో — తాత్కాలికంగా కలుగజేసే మార్పుకోసమని అడుగు వర్గాల విప్లవాత్మక క్రియకు, కష్టజీవులందరికీ సంపూర్ణమైన మానవసంపదకు హామీ ఇచ్చే మార్పుకోసమై అట్టడుగు వర్గాల అనివార్యమగు తదుపరి విప్లవాత్మక క్రియకు మరింత వీలు కలుగజేస్తుంది.

క్రీగెకు వ్యతిరేకంగా మార్క్స్ కావించిన విమర్శనా ప్రదర్శన రష్యన్ సోషల్-డెమొక్రాట్లమైన మనకు ఒక నమూనాగా ఏర్పడాలి. రష్యాలో నేటి రైతు ఉద్యమంయొక్క పెట్టీబూర్జువా స్వభావంగురించి ఎట్టి అనుమానమూ వుండనక్కరలేదు. మన శక్తినంతనూ వినియోగించి దీనిని మనం వివరించి చెప్పాలి; కాగా ఈ విషయమై అందరి "సోషలిస్టు-రివల్యూషనరీల," అందరి ఆదిమ సోషలిస్టుల భ్రమలపై నిర్దాక్షిణ్యమైనట్టి అచంచల మైనట్టి పోరాటాన్ని మనం సాగించాలి. సమగ్రమైన సోషలిస్టు విప్లవం రావడం కోసమే ప్రజాస్వామిక మార్పులన్నింటిలో సహితమూ పాటుపడేటట్టి ప్రత్యేకమైన స్వతంత్ర శ్రామిక వర్గ పార్టీని ఆర్గనైజు చేయడమే మన లక్ష్యమై వుండాలి, దీనిని మనమెన్నడూ ఒక్క క్షణ మైనా విస్మరించకూడదు. కాని ఈ కారణం పేరుచెప్పి రైతు ఉద్యమం పట్ల పెడముఖం పెట్ట డం శుద్ధ అల్పబుద్ధితత్వమే, పండితప్రకాండుల బేడిజమే అవుతుంది. ఈ ఉద్యమంయొక్క విప్లవాత్మక ప్రజాస్వామ్య స్వభావం గురించి శంకించాల్సిన అసరం ఏ మాత్రమూ లేదు, ముమ్మాటికీ లేదు, కాగా సర్వశక్తులా మనం దీనిని బలపర్చి, అభివృద్ధిచేసి, రాజకీయంగా చైతన్యవంతమైనట్టి నిర్దిష్టంగా వర్గపోరాటశీలమైనట్టి ఉద్యమంగా రూపొందించి, దానిని ముందుకు తీసుకొచ్చి, చివర వరకూ దానితో చేతులు కలపాల్సి వుంటుంది — ఎందుచేతంటే ఎట్టి రైతు ఉద్యమ లక్ష్యాన్ని సహితమూ మించిపోయి, ఆపైకే మనం సాగిపోతున్నాం; సామా

జిక వర్గ విభేదం అంతిమ శిఖరానికే మనం సాగిపోతున్నాం. రష్యాలోలాగా రైతాంగం ఇంత బాధ, ఇంత హింస, ఇంత దైన్యమూ అనుభవిస్తూ నట్టి దేశం ప్రపంచంలో మరేదీలేదు. రైతాంగం అనుభవించుతూన్న ఈ హింస ఇదివరకు ఎంత అంధకారబంధురంగా వుండినదో, అంత శక్తివంతంగా వుంటుంది ఇప్పుడు దాని జాగృతి, అంత అజేయంగా వుంటుంది దాని విప్లవాత్మక విజృంభణ. పాతపడిపోయినట్టి పాపపంకిలమైనట్టి ఫ్యూడల్ నిరంకుశత్వపు బానిస రష్యాను పునాదిరాళ్లతో సహా ఇది పెకలించివేసేందుకు, ధైర్యవంతులైనట్టి స్వేచ్ఛాపరులైనట్టి ఒక నూతన తరం ప్రజలనూ, సోషలిజం కోసమై మన శ్రామికవర్గ పోరాట విస్తరణకు ప్రదేశం వుండే ఒక నూతన ప్రజాసత్తాక దేశాన్ని సృష్టించేందుకు ఈ విజృంభణకు తన సర్వశక్తులతో సహాయం చేయడమే చైతన్యవంతమైన విప్లవాత్మక శ్రామిక వర్గం యొక్క కర్తవ్యం.

ఏప్రిల్ 1905.

# ప్రజాస్వామ్య విప్లవంలో సోషల్-డెమోక్రసీయొక్క రెండు ఎత్తుగడలు

## ఖండిక

## మరి పలుకు

## మళ్లీ మరొకసారి "ఒస్వొబొజ్దేనియె" ధోరణి, మళ్లీ మరొకసారి కొత్త "ఇస్క్రా" ధోరణి

## III. నియంతృత్వంపై అపభ్రంశపు బూర్జువా వ్యక్తీకరణ, దీనిపై మార్క్స్ అభిప్రాయం

1848 లో "నోయె రైనిషె త్సైటుంగ్"లో మార్క్స్ రాసిన వ్యాసాలను మేరింగ్ ప్రచురించుతూ, వాటికి తాను చేర్చిన వివరణలో, ఆ పత్రిక పై బూర్జువా ప్రచురణలు ఆరోపించిన నిందలలో, "నియంతృత్వాన్ని తక్షణం ప్రవేశపెట్టడమే ప్రజాస్వామ్యాన్ని సాధించడానికి ఏకైక సాధనం" (Marx' Nachlass, 3 వ సంపుటం, 53 వ పుట) అని ఈ పత్రిక డిమాండు చేసిందన్నట్టుగా ఒక నిందను చేర్చాయని చెబుతాడు. అపభ్రంశపు బూర్జువా దృక్కోణం నుండి చూస్తే, నియంతృత్వం అనే భావమూ, ప్రజాస్వామ్యం అనే భావమూ పరస్పర విరుద్ధాలు. వర్గపోరాట సిద్ధాంతాన్ని అది అవగతం చేసుకొన జాలక పోవడమూ, రాజకీయ రంగంలో భిన్నభిన్న బూర్జువా గ్రూపుల, ముఠాల చిల్లరమల్లర కీచులాటలకు అది అలవాటు పడడమూ కారణంగా, నియంతృత్వమంటే అన్ని రకాల ప్రజాస్వామ్య స్వేచ్ఛలూ హామీలూ రద్దు అవడమనీ, అన్ని రకాల ప్రజాపీడన అనీ, తన వ్యక్తిగత ప్రయోజనాలకై ఒక నియంతచే అన్ని రకాల అధికార దుర్వినియోగము అని బూర్జువా వర్గం అర్థంచేసుకుంటుంది. లెనిన్‌కుగల "తన అదృష్టం కూడా ఎలా వుందో ఒకమాటు చూసుకుందామనే ప్రగాఢవాంఛే" ("ఇస్క్రా", 103 వ సంచిక, 3 వ పుట 2 వ కాలమ్)

నియంతృత్వ నినాదమంటే ''ప్రెర్యోద్,'' ''ప్రొలెతారియ్''[81] పత్రికలకు గల పక్షపాతానికి కారణమంటూ కొత్త ''ఇస్క్రా''లో తన ''కొత్త దండయాత్రను'' సమాప్తం చేస్తూ మన మర్తీనొవ్ తన రచనలలో వ్యక్తపరుస్తూన్నట్టి అచ్చమైన ఈ అపభ్రంశపు బూర్జువా అభిప్రాయంలోనే వుంది నిజంగా దీని సారమంతా. వ్యక్తి నియంతృత్వంతో విభేదించుతూన్న వర్గ నియంతృత్వం, అనే పదంయొక్క అర్థాన్నీ, సోషలిస్టు నియంతృత్వ కర్తవ్యాలనూ వివరించి చెప్పాలంటే, ''నోయె రైనిషె సైటుంగ్'' అభిప్రాయలపై కొంత ప్రస్తావించడం అనుపయోగకరం కాకపోవచ్చు.

''నోయె రైనిషె సైటుంగ్'' 1848 సెప్టెంబరు 14 న ఇలా రాసింది: ''విప్లవానంతరం ప్రతి తాత్కాలిక రాజ్యాంగయంత్ర నిర్మాణానికీ ఒక నియతృత్వం, అంతేకాదు ఒక శక్తివంతమైన నియంతృత్వం, కావలసి వస్తుంది. నియంతృత్వాత్మకంగా వ్యవహరించనందుకే పాత సంస్థల అవశేషాలను తక్షణమే బద్దలుకొట్టి నామరూపాలు లేకుండా నాశనం చేయనందుకే, కాంప్‌హౌసెన్‌ను (1848 మార్చి 18 తరువాత ప్రధానమంత్రి) మేము మొదలు దగ్గరనుండీ నిందించుతునే వున్నాం. రాజ్యాంగ బద్ధ భ్రమలతో హెర్ కాంప్‌హౌసెన్ స్వప్నావస్థలో వుండగా, వీగిపోయిన పార్టీ (అనగా, అభివృద్ధి నిరోధక పార్టీ), బ్యూరోక్రసీలోనూ సైన్యంలోనూ తనకుండిన స్థానాన్ని బలపరచుకోవడమే కాకుండా, అక్కడక్కడ బహిరంగ పోరాటంలో దిగడానికి సహితమూ సాహసించింది.''

కాంప్‌హౌసెన్ మంత్రివర్గంపై ''నోయె రైనిషె సైటుంగ్'' సుదీర్ఘమైన వ్యాసాల్లో సవివరంగా ప్రవచించిన దాన్నంతనూ కొద్ది సూత్రాల్లో ఈ వాక్యాలు సంగ్రహంగా వక్కాణించుతున్నాయని మేరింగ్ చెప్పడం ఎంతైనా సముచితంగా వుంది. మార్క్స్ నుడివిన ఈ వాక్యాలు మనకేమిటి తెలియజేస్తున్నాయి? తాత్కాలిక విప్లవాత్మక ప్రభుత్వం నియంతృత్వాత్మకంగా వ్యవహరించి తీరాలనీ (నియంతృత్వ నినాదమంటే బెదిరిపోయి వెనుకతీస్తున్న కారణంగా ఏ వాక్యాన్ని ''ఇస్క్రా'' ఏ మాత్రమూ గ్రహించలేకపోయిందో ఆ వాక్యం), పాత అవశేషాలను నాశనం చేయడమే ఇట్టి నియంతృత్వంయొక్క కర్తవ్యం (విప్లవ ప్రతీఘాతానికి వ్యతిరేకమైన పోరాటం గురించి రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీ మూడవ కాంగ్రెస్ తీర్మానంలో అచ్చంగా చెప్పబడినట్టే, కాగా పైన మేము నిరూపించినట్టుగా, కాన్ఫరెన్స్ తీర్మానంలో విడిచిపెట్టబడినట్టి కర్తవ్యం) అనీ తెలియజేస్తున్నాయి. ఇక మూడవ విషయమూ, ఈ వాక్యాలనుండి తేల్తూన్న చివరి విషయమూ ఏమిటంటే, విప్లవమూ, బహిరంగ అంతర్యుద్ధమూ జరిగే కాలావధిలో ''రాజ్యాంగబద్ధ భ్రమల''కు ఇంకా లోనై వుండినందుకు బూర్జువా ప్రజాస్వామ్యవాదులను మార్క్స్ దుయ్యబట్టాడు. 1848 జూన్ 6 వ తేదీ ''నోయె రైనిషె సైటుంగ్'' వ్యాసంవల్ల ఈ వాక్యాల అర్థం మరింత ప్రత్యక్షంగా విశద

మవుతూంది. మార్క్స్ ఇలా రాస్తాడు: ''రాజ్యాంగనిర్ణయ జాతీయ పరిషత్తు ప్రధానంగా క్రియాశీలమైనట్టి, విప్లవాత్మంగా క్రియాశీలమైనట్టి పరిషత్తు అయివుండాలి. కాని, ఫ్రాంక్‌ఫర్ట్ పరిషత్తు ప్రభుత్వాన్ని పనిచేయనిస్తూనే తాను మాత్రం పార్లమెంటరీ విధానంలో బడిపిల్లల అభ్యాసక్రియలతో కాలం గడుపుతూంది. ఈ పండిత పరిషత్తు సాంగోపాంగంగా పరిశీలించిన పిదప ఎంత ఉత్తమోత్తమ రాజ్యంగాన్ని రూపొందించడానికి వీలుంట్నుందో అంత ఉత్తమోత్తమ కార్యక్రమావళిని రూపొందించ గల్గుతుందనే అనుకున్నప్పటికీ, ఈ లోపునే జర్మన్ ప్రభుత్వాలు కత్తికఠార్లనే గనుక కార్యక్రమావళిలో చేర్చితే, ఉత్తమోత్తమ కార్యక్రమావళి వల్లా, ఉత్తమోత్తమ రాజ్యాంగంవల్లా ఉపయోగమేమిటి?''

ఈ వివాదం అర్థం నియంతృత్వం. ''రాజ్యాంగనిర్ణయ పరిషత్తును ఆర్గనైజు చేసేందుకు తీసుకున్న నిర్ణయాన్నే'' ఒక నిర్ణయాత్మకమైన విజయమని నామకరణం చేసేటట్టీ, లేదా ''అత్యంత విప్లవాత్మక ప్రతిపక్ష పార్టీగా వుండవల్సిందని'' మనను ఆహ్వానించుతూన్నట్టీ తీర్మానాల పట్ల మార్క్స్ వైఖరి ఎలా వుండేదో దీన్నిబట్టి మనం తెలుసుకోగలం!

జాతుల జీవితంలో బృహత్తర సమస్యలు కేవలం బలప్రయోగం వల్లనే పరిష్కారమవుతున్నాయి. దౌర్జన్య ప్రయోగానికి, అంతర్యుద్ధానికి ముందు దిగేవి మామూలుగా అభివృద్ధి నిరోధక వర్గాలే; జనవరి 9[82] నుండి ఎల్లవేళలా సర్వత్రా వ్యవస్థాత్మకంగానూ మొండిగానూ రష్యన్ నిరంకుశ పరిపాలన వ్యవహరించినట్లూ, ఇంకా ఆలాగే వ్యవహరిస్తున్నట్లూ ''కత్తికఠార్లను కార్యక్రమావళిలో చేర్చినది'' ఇవే. కాగా అటువంటి పరిస్థితి ఏర్పడింది గనుక, రాజకీయ కార్యక్రమావళిలో నిజంగా కత్తికఠార్లే ప్రధానాంశంగా తయారయాయి గనుక, ఉపప్లవమే అత్యావశ్యకమని, అత్యవసరమని రుజువైంది గనుక — రాజ్యాంగబద్ధ భ్రమలూ, పార్లమెంటరీ విధానంలో బడిపిల్లల అభ్యాస క్రియలూ బూర్జువా విప్లవఘాతుకానికి కేవలం ఒక తెరమరుగుగా, బూర్జువా వర్గం విప్లవంనుండి ''బెదరిపోయి తప్పుకుంటూంద''న్న విషయాన్ని కప్పిపుచ్చడానికి ఒక తెరమరుగుగా ఏర్పడతాయి. అందుచేత అచ్చమైన విప్లవాత్మక వర్గం లేవదీయాల్సిన వివాదం నియంతృత్వ వివాదమే.

ఈ నియంతృత్వం యొక్క కర్తవ్యాల ప్రశ్నపై మార్క్స్ ''నోయె రైనిషె సైటుంగ్''లో అప్పటికప్పుడే రాయనే రాశాడు: ''కాలంచెల్లిపోయిన ప్రభుత్వాలు చేసిన అభివృద్ధి నిరోధక యత్నాలకు వ్యతిరేకంగా జాతీయ పరిషత్తు అదివరకే నియంతృత్వాత్మకంగా క్రియాకలాపం సాగించి వుండాల్సింది; అప్పుడు ప్రజాభిప్రాయంలో అది ఎంతటి శక్తిని సంపాదించుకుని వుండేదంటే, ఆ శక్తి ధాకకు కత్తికఠార్లన్నీ తునాతునకలయేవి... కాని జర్మన్ ప్రజలను ఉత్సాహితులను చేయడం బదులు, లేదా ప్రజలవల్ల అది ఉత్సాహవంతమయేది బదులు ఈ

సమావేశం జర్మన్ ప్రజలకు విసుగుపుట్టిస్తూంది." మార్క్స్ అభిప్రాయం ప్రకారం జాతీయ పరిషత్తు "ప్రజా సార్వభౌమత్వ సూత్రాన్ని ఎదిరించే ప్రతిదానిని జర్మనీలో అప్పుడుండిన వాస్తవవ్యవస్థనుండి తొలగించివేయాల్సి వుండెను;" అలా తొలగించి వేసిన తరువాత, "విప్లవం సాధించినట్టి ప్రజా సార్వభౌమత్వాన్ని అన్ని దాడులనుండీ భద్రపరచేందుకుగాను తనకు ప్రాతిపదికగా ఏర్పడుతూన్న విప్లవాత్మక పునాదులను అది దృఢపరచుకోవాల్సి వుండెను."

ఈ ప్రకారంగా, విప్లవాత్మక ప్రభుత్వానికి, అనగా నియంతృత్వానికి, 1848 లో మార్క్స్ సూచించిన కర్తవ్యాల ప్రధాన సారాంశం ప్రజాస్వామ్య విప్లవంతో సమానమవుతున్నాయి: విప్లవప్రతీఘాతం నుండి పరిరక్షించుకోవడమూ, ప్రజా సార్వభౌమత్వాన్ని ఎదిరించే ప్రతిదానిని యథార్థంగా తొలగించి వేయడమూ. ఇది విప్లవాత్మక-ప్రజాస్వామ్య నియంతృత్వం తప్ప మరేదీ కాదు.

సరే ఇక ముందుకు వెళ్దాం: మార్క్స్ అభిప్రాయంలో, ఈ కర్తవ్యాన్ని (ప్రజా సార్వభౌమ సూత్రాన్ని సంపూర్ణంగా వాస్తవంగా అమలు పరచడమూ, విప్లవప్రతీఘాత దాడులను తిప్పికొట్టడమూ) సాధించగల్గి వుండినట్టీ, సాధించవలసి వుండినట్టీ వర్గాలు ఏవి? "ప్రజలను" గురించి మార్క్స్ మాట్లాడుతాడు. కాని "ప్రజల" ఐక్యత గూర్చీ, ప్రజల్లో వర్గపోరాట లేమిని గూర్చీ పెట్టీబూర్జువా భ్రమలకు వ్యతిరేకంగా అతడు ఎల్లప్పుడూ నిర్దాక్షిణ్యంగా పోరాడాడని మనకుతెలుసు. "ప్రజలు" అనే పదాన్ని వాడడంలో మార్క్స్ వర్గ భేదాలను కప్పిపుచ్చడం లేదు; ఇందుకు బదులు విప్లవాన్ని తుదముట్టా సమగ్రంగా సాగించ సామర్థ్యం కలిగిన నిర్దిష్ట మూలద్రవ్యాలను అతడు సమ్మిళితం చేశాడు.

బెర్లిన్ శ్రామికవర్గం మార్చి 18 న విజయం సాధించిన తరువాత, విప్లవఫలితాలు రెండు విధాలుగా వ్యక్తమయాయని చెబుతూ "నోయె రైనిషె సైటుంగ్" ఈ విధంగా రాసింది: "ఇటు ప్రజలను సాయుధులు చేయడమూ, సంఘాలను ఏర్పరచుకునే హక్కూ, వాస్తవంగా సాధించుకున్న ప్రజా సార్వభౌమత్వమూ; అటు రాజరిక వ్యవస్థనూ, కాంప్‌హౌసెన్-హాన్సెమన్ మంత్రివర్గాన్నీ అనగా బడా బుర్జువావర్గ ప్రతినిధుల ప్రభుత్వాన్నీ, భద్రపరచడమూ. ఈ ప్రకారంగా, పరస్పరంగా ఒక దానితో ఒకటి అంతకంతకు వేరైపోయి తీరాల్సినట్టి ఫలితాల పరంపరలు రెండింటిని విప్లవం తీసుకొచ్చింది. ప్రజలు విజయం సాధించారు; నిర్ణయాత్మకమైన ప్రజాస్వామ్య స్వభావం కల్గినట్టి స్వేచ్ఛలను వారు సంపాదించుకున్నారు, కాని సూటి రాజ్యాధికారం మాత్రం వారి చేతుల్లో పడకుండా, బడా బూర్జువావర్గం చేతుల్లోకి వెళ్లింది. ఒక్కమాటలో చెప్పాలంటే, విప్లవం ఇంకా అసంపూర్ణంగానే వుండిపోయింది. ప్రజలు బడా బూర్జువావర్గాన్ని మంత్రివర్గపు ఏర్పాట్లు చేయనిచ్చారు; దాంతో పాత ప్రష్యన్ కులీనవంశ

స్థులతోనూ బ్యూరో(క్రసీతోనూ ఏకమైపోయే తన యత్నాలను బడా బూర్జువా వర్గం వెంటనే బయటపెట్టింది. ఆర్నిమ్, కానిట్జ్, ష్వెరీన్‌లు మం(త్రివర్గంలో చేరారు.

"ఎల్లప్పుడూ విప్లవవ్యతిరేకి అయిన బడా బూర్జువా వర్గం (ప్రజ, అనగా కార్మికులూ (ప్రజాస్వామిక బూర్జువావర్గములు, ఎదుట హడలు కారణంగా అభివృద్ధి నిరోధకంతో రక్షణ, విజృంభణలపై మి(త్రత్వం నెరపుకుంది" (ఒత్తులు మేము పెట్టినవి).

ఇందుచేత, "రాజ్యాంగనిర్ణయ పరిషత్తును ఆర్గనైజు చేసేందుకు తీసుకున్న నిర్ణయం" ఒక్కటే కాకుండా, యథార్థంగా దాన్ని సమావేశ పరచడం సహితమూ విప్లవంయొక్క నిర్ణయాత్మక విజయాన్ని సాధించడానికి చాలనే చాలదు! సాయుధ పోరాటంలో పాక్షిక విజయం తరువాతనైనా (1848 మార్చి 18 న బెర్లిన్ కార్మికులు సాయుధ బలాలపై సాధించిన విజయం) "అసంపూర్ణమైన"విప్లవమే, "సమాప్తి వరకూ సాగించనట్టి" విప్లవమే సాధ్యమవుతుంది. అలాంటప్పుడు, దాని సమాప్తి దేనిపై ఆధారపడుతుంది? సూటి రాజ్యాధికారం ఎవరి చేతుల్లోకి, పె(త్రుంకేవిచ్‌ల, రోదిచెవ్‌ల చేతుల్లోకి అనగా కాంప్‌హౌసెన్‌ల, హాన్సెమన్‌ల చేతుల్లోకి వెళ్ళుతుందో, లేకుంటే (ప్రజ చేతుల్లోకి – అనగా కార్మికులూ, (ప్రజాస్వామిక బూర్జువా వర్గమూ చేతుల్లోకి వెళ్ళుంతుందో దానిపై ఆధారపడుతుంది. మొదటి పక్షంలో లాగానే అయితే అధికారం బూర్జువావర్గ పరమవుతుంది; "విమర్శనా స్వేచ్ఛ," "అత్యంత విప్లవాత్మక (ప్రతిపక్ష పార్టీగా వుండడానికి" స్వేచ్ఛ (శ్రామికవర్గ పరమవుతుంది. విజయం సాధించిన వెంటనే బూర్జువావర్గం అభివృద్ధి నిరోధకంతో మి(త్రత్వం నెరపుకుంటుంది (ఉదాహరణకు, వీధి పోరాటంలో సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు సాయుధ బలాలపై కేవలం పాక్షిక విజయమే సాధించితే (ప్రభుత్వ నిర్మాణ కార్యాన్ని పె(త్రుంకేవిచ్ (ప్రభృతులకే విడిచిపెట్టేసి రష్యాలో కూడా ఈ పరిస్థితే ఏర్పడివుండేది). రెండవ పక్షంలో విప్లవాత్మక-(ప్రజాస్వామ్య నియంతృత్వం, అనగా సంపూర్ణ విజయం సాధ్యమవుతుంది.

బడా బూర్జువావర్గంతో పూర్తిగా విభేదించుతూన్నట్టి, దేనినైతే అతడు కార్మికులతో కలిపి (ప్రజ అని పిలిచాడో అట్టి "(ప్రజాస్వామిక బూర్జువావర్గం" (demokratische Bürgerschaft) అంటే మార్క్స్ అభి(ప్రాయం ఏమిటో మరింత నిశితంగా మనమిప్పుడికి నిర్వచించాల్సి వుటుంది.

ఈ (ప్రశ్నకు స్పష్టమైన జబాబు, 1848 జూలై 29 వ తేదీగల "నోయె రైనిషె సైటుంగ్" లోని ఒక వ్యాసంలో మనకు దొరుకుతూంది: "...1848 జర్మన్ విప్లవం 1789 (ఫ్రెంచి విప్లవానికి వికటకవిత్వం తప్ప మరేమీకాదు.

"1789 ఆగస్టు 4 న, బాస్టీల్ ముట్టడి జరిగిన మూడువారాల తరువాత, (ఫ్రెంచి (ప్రజలు ఫ్యూడలిజమ్ తమపై మోపిన భారాన్నంతటినీ ఒక్క రోజులో వదలించేసుకున్నారు.

"1848 జూలై 11 న, మార్చి బారికేడ్లు జరిగిన నాలుగునెలల తరువాత ఫ్యూడల్ భారాలు జర్మన్ ప్రజలను ప్రకుంగదీశాయి. Teste Gierke cum Hansemanno*.

"1789 నాటి ఫ్రెంచి బూర్జువావర్గం తన మిత్రులైన రైతులను ఒక్క క్షణమా త్రమైనా విడిచిపెట్టలేదు. గ్రామీణ ప్రాంతంలో ఫ్యూడల్ విధాన నిర్మూలనమే, స్వేచ్ఛా యుతమైన, భూస్వామ్యం కలిగిన (grundbesitzenden) రైతువర్గాన్ని సృష్టించడమే తన అధికారానికి పునాదిగా ఏర్పడిందని అది తెలుసుకుంది.

"1848 నాటి జర్మన్ బూర్జువా వర్గం తనకు అత్యంత సహజమైన మిత్రులూ తన రక్తంలో రక్తమూ తన మాంసంలో మాసమూ అయినట్టి, ఎవరిని కోల్పోతే కులీన వర్గానికి వ్యతిరేకంగా తాను శక్తివిహీనమై వుంటుందో అట్టి రైతులకు ద్రోహంచేస్తూంది.

"ఫ్యూడల్ అధికారాలను కొనసాగించడమూ, (భ్రమభరితమైనట్టి) నష్టపరిహారమనే ముసుగుకింద వాటిని మంజూరు చెయ్యడమూ — ఇది 1848 జర్మన్ విప్లవంయొక్క ఫలితం. కొండను తవ్వి ఎలకను పట్టినట్టయింది."

గ్రంథంలోని ఈ భాగం ఎంతైనా విజ్ఞానదాయకంగా వుంది. ముఖ్యమైనట్టి నాలుగు వాక్యాలను ఇది మనకు అందించుతూంది: 1) జర్మన్ బూర్జువావర్గం సాధారణంగా ప్రజా స్వామ్యానికే కాకుండా, రైతాంగానికే ప్రత్యేకంగా ద్రోహం చేయడంలో అసమాప్త జర్మన్ విప్లవం, సమాప్తిచెందిన ఫ్రెంచి విప్లవంతో విభేదించుతూంది. 2) స్వేచ్ఛాయుతమైన రైతువర్గాన్ని సృష్టించడమే ప్రజాస్వామ్య విప్లవ పరిపూర్ణ సమాప్తికి పునాది. 3) ఇటువంటి వర్గాన్ని సృష్టించడమంటే దాని అర్థం ఫ్యూడల్ వ్యవస్థ మోపుతూన్న భారాలు రద్దుచేయడమూ, ఫ్యూడలిజాన్ని నాశనంచేయడమూ అన్నమాట, అయినప్పటికీ దాని అర్థం ఇంకా సోషలిస్టు

---

*"సాకులు: గీర్కె, హాన్సెమన్ గార్లు." బడా బూర్జువావర్గపు పార్టీ ప్రతినిధి హాన్సెమన్ (రష్యాలో ఇతనిని పోలినవాళ్లు: త్రుబెత్స్కోయ్, లేదా రోదిచెవ్‌ల వంటివాళ్లు) ఒక మంత్రి; హాన్సెమన్ మంత్రివర్గంలో గీర్కె వ్యవసాయ మంత్రి; "ఫ్యూడల్ భారాలను," బహిరంగంగా చెప్పకుండుకు మాత్రం "పరిహారాలు లేకుండానే" "రద్దుచేయడానికి" ఒక పథకం, ఒక "సాహసోపేతమైన" పథకం, తయారుచేసి వాస్తవానికి చిన్నచిన్న అప్రాముఖ్య మైన భారాలను రద్దుచేస్తూ, మరీ ముఖ్యమైన వాటిని ఆలాగే వుంచేసో, లేక వాటికి పరిహా రాలు సమర్పించుకుంటూనో పథకం తయారుచేశాడు ఇతడు. రష్యాలో "రైతు భూస్వామ్యాన్ని విస్తరింపజేయడం" ఇష్టపడుతూనే, భూస్వాములకు మాత్రం కష్టం కలుగజేయడానికి ఇష్ట పడనట్టి, శ్రీయుతులు కబ్లుకోవ్, మనుయీలోవ్, గేర్‌త్సెన్‌స్టయిన్‌లనూ, వారి లాంటి ఇతర బూర్జువా లిబరల్ రైతుమిత్రులనూ ఇంచుమించు పోలినట్టివాడు ఈ హెర్ గీర్కె.

విప్లవం మాత్రం కాదు. 4) రైతులే బూర్జువావర్గం యొక్క, అనగా రైతులు తనతో కూడా లేనిదే అభివృద్ధి నిరోధానికి వ్యతిరేకంగా ఏది "శక్తివిహీనమై" వుంటుందో అట్టి ప్రజాస్వామిక బూర్జువావర్గంయొక్క, "అత్యంత సహజమైన" మిత్రులు.

విశిష్టములైన జాతీయ ప్రత్యేక గుణాలకు సముచితమైన అంగీకారములను కల్పించుతూ, ఫ్యూడల్ వ్యవస్థ స్థానే భూదాస్య వ్యవస్థను ప్రత్యామ్నాయంగా తీసుకున్న పక్షమందు, 1905 నాటి రష్యాకు ఈ వాక్యాలను పూర్తిగా ప్రయుక్తం చేయవచ్చు. మార్క్స్ విశదపరచినట్టుగా, జర్మనీ అనుభవాలనుండి, గుణపాఠాలను నేర్చుకున్న పక్షంలో, విప్లవంయొక్క నిర్ణయాత్మక విజయానికై, శ్రామికవర్గ రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వ నినాదం ఒక్కటే తప్ప మరే ఇతర నినాదమూ లేదనే పర్యవసానానికి మనం చేరుకుంటామనడంలో ఎట్టి సందేహమూ లేదు. ప్రతిఘటన సల్పిన అభివృద్ధి నిరోధకులతోనూ, నమ్మక ద్రోహం కావించిన బూర్జువావర్గంతోనూ, 1848 లో మార్క్స్ వ్యత్యాసం చూపించినట్టి "ప్రజ"లోని ప్రధాన అంశీభూతములు శ్రామికవర్గమూ, రైతాంగమూ అనడంలో ఎట్టి సందేహమూ లేదు. రష్యాలో కూడా లిబరల్ బూర్జువావర్గమూ, "ఒస్వొబొజ్దేనియె" సమితి పెద్దమనుషులూ రైతాంగానికి ద్రోహం చేస్తున్నారనీ, ద్రోహం చేస్తారనీ, అనగా కుహనా సంస్కరణకే పరిమితమవుతూ భూస్వాములకూ రైతాంగానికీ మధ్య జరిగే నిర్ణయాత్మక సమరంలో భూస్వాముల పక్షం వహించుతారనడంలో ఎట్టి సందేహమూ లేదు. ఈ పోరాటంలో చివరివరకూ రైతాంగానికి సహాయపడగలిగేది శ్రామికవర్గం ఒక్కటే. రష్యాలో కూడా రైతుపోరాట విజయం, అనగా భూమి అంతా రైతాంగానికి బదిలీకావడం, సంపూర్ణమైన ప్రజాస్వామిక విప్లవాన్ని సూచించుతుందే గాని, పరిసమాప్త విప్లవానికి సామాజిక పట్టుగొమ్మగా ఏర్పడుతుందే గాని, పెట్టీబూర్జువావర్గంయొక్క భావశాస్త్రవేత్తలైన సోషలిస్టు-రివల్యూషనరీలు చెప్పే సోషలిస్టు విప్లవం, లేక "సామాజికీకరణ" ఎంత మాత్రమూ కాదని అనడంలో చిట్టచివరకు ఎట్టి సందేహమూ లేదు. రైతు ఉపప్లవ జయమూ, ప్రజాస్వామిక విప్లవం విజయమూ ప్రజాస్వామిక రిపబ్లిక్ ప్రాతిపదికపైన యేర్పడే సోషలిజం కోసం యథార్థమైనట్టి నిర్ణయాత్మకమైనట్టి పోరాటానికి మార్గాన్నే అవి కేవలం సుగమం చేస్తాయి. ప్రజాస్వామ్యం కోసం జరుగుతూన్నట్టి పోరాటంలో ఇప్పుడు బూర్జువావర్గం ఎట్టి పాత్ర వహించుతూందో, ఈ పోరాటంలో భూస్వామ్యాన్ని అనుభవించేటట్టి వర్గంగా రైతాంగం సరిగ్గా అట్టి విశ్వాసఘాతుకమైనట్టి, ఊగిసలాడుతూన్నట్టి పాత్రనే వహిస్తుంది. దీనిని విస్మరించడమంటే సోషలిజాన్ని విస్మరించడమన్న మాటే, శ్రామిక వర్గంయొక్క యథార్థ ప్రయోజనాలను గురించీ, కర్తవ్యాలను గురించీ తనను తాను వంచించుకోవడమూ, ఇతరులను వంచించడమూ అవుతుంది.

1848 లో మార్క్సుకు ఉండిన అభిప్రాయాలను ప్రదర్శించడంలో ఎట్టి లోపాలకూ తావులేకుండా వుండేందుకై, ఆనాటి జర్మన్ సోషల్-డెమోక్రసీకీ (ఆ కాలపు భాషలో చెప్పాలంటే, శ్రామికవర్గ కమ్యూనిస్టు పార్టీకీ) ఈనాటి రష్యన్ సోషల్-డెమోక్రసీకీ వున్న ఒక ప్రధాన భేదాన్ని గమనించడం ఎంతైనా ముఖ్యం. మేరింగ్ ఇలా అంటున్నాడు:

"'నోయె రైనిషె సైటుంగ్' 'ప్రజాస్వామ్య పత్రిక'గా రాజకీయ రంగంలో ప్రవేశించింది. దాని వ్యాసాలన్నిటిలోనూ తోడిన ఎర్రని పడుగు పోగు స్పష్టంగా కళ్లకి కనబడుతూనే వుంది. కాని బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గ ప్రయోజనాల పక్షం పోరాడడంకంటె, నిరంకుశతత్వ విధానానికీ ఫ్యూడలిజానికీ వ్యతిరేకంగా బూర్జువా విప్లవ ప్రయోజనాల పక్షమే అది పోరాడింది. ఈ పత్రికతోపాటుగా, మోల్, షాప్పెర్, వీరిద్దరి సంపాదకత్వానా కొలోన్ నగరపు కార్మికుల సంఘం యొక్క ప్రత్యేక పత్రిక[83] వారానికి రెండు సార్లు వెలువడుతూండినదన్న విషయం మనం నిస్మరించకూడనిదే అయినప్పటికీ విప్లవ సంవత్సరాలలో విడిగా కార్మికవర్గ ఉద్యమం గురించి దానిలో చాలా కొద్దిగా మాత్రమే పడుతూండేది. 'నోయె రైనిషె సైటుంగ్' ను నడుపుతూన్న వారందరిలోనూ సమర్థవంతుడైన స్టెఫాన్ బోర్న్ పారిస్‌లోనూ బ్రస్సెల్స్‌లోనూ మార్క్స్, ఎంగెల్స్‌ల శిష్యుడుగా వుండి, 1848 లో వారి వార్తాపత్రికకు బెర్లిన్ విలేకరిగా వుండినప్పటికీ, ఆనాటి జర్మన్ కార్మికవర్గ ఉద్యమం గురించి ఆ వార్తాపత్రిక ప్రదర్శించిన స్వల్పశ్రద్ధను చూచి నేటి పాఠకుడు ఏది ఏమైనప్పటికీ ఆశ్చర్యపడక మానడు. కార్మికులలో తాను సాగించుతూండిన ఆందోళన పట్ల తమ అసమ్మతిని తెల్పుతూ మార్క్స్, ఎంగెల్స్‌లు పల్లెతు మాటైనా తననెన్నడూ అనలేదని బోర్న్ తన "జీవిత స్మరణలు"లో చెబుతాడు. తత్రాపి ఎంగెల్స్ తదుపరి చేసిన ఉద్ఘాటనలను బట్టి, అధమం ఈ ఆందోళనా పద్ధతుల పట్ల వారు అసంతృప్తి చెందడం సంభవమేనని అవుపడుతుంది. జర్మనీ అత్యధికభాగంలోని ఇంకా యేమాత్రమూ అభివృద్ధిచెందని శ్రామికవర్గపు చైతన్యం పట్ల అనేక రాయితీలను, "కమ్యూనిస్టు ప్రణాళిక"యొక్క దృక్పథాన్ని అనుసరించిన విమర్శనా పరీక్షకు నిలబడని రాయితీలను, బోర్న్ చూపించక తప్పని కారణంగా వారి అసంతృప్తి సమర్థనీయమే. తాను నడిపించిన ఆందోళన సాపేక్షంగా ఉన్నతస్థాయినే అంటిపెట్టుకుని వుండేటట్లు ఏతావాతా బోర్న్ జాగ్రత్త పడిన కారణంగా వారి అసంతృప్తి సమర్థనీయంకాకుండెను... బూర్జువా విప్లవాన్ని ఎంత ముందుకు తీసుకుపోగల్గితే అంత ముందుకు తీసుకు పోవడమే కార్మికవర్గం యొక్క ప్రప్రథమ ప్రయోజనమని చారిత్రాత్మకంగానూ రాజకీయంగానూ మార్క్స్, ఎంగెల్స్‌లు సరిగానే భావించారనడంలో ఎట్టి సందేహమూ లేదు... తత్రాపి అనన్యసామాన్య ప్రతిభావంతములైన మేధస్సుల భావనలను

సహితమూ కార్మికవర్గం యొక్క మౌలికమైన సహజజ్ఞానం ఏ విధంగా సరిదిద్దగలదో అందుకు, ఒక విశిష్టమైన కార్మిక ఆర్గనైజేషనుకు తాము సుముఖులమని 1849 ఏప్రిల్‌లో వారు ప్రకటించి, ఈస్ట్ ఎల్బ (తూర్పు ప్రష్యా) శ్రామికవర్గంచే ముఖ్యంగా సమావేశ పరచబడుతూండిన కార్మికుల మహాసభలో వారు పాల్గొనడానికి నిశ్చయించుకోవడమనే ఈ వాస్తవవిషయం అద్భుతమైన రుజావునిస్తూంది."

ఈ ప్రకారంగా, కేవలం 1849 ఏప్రిల్‌లో మాత్రమే, ఇంచుమించు ఒక సంవత్సరం పాటు ఆ విప్లవాత్మక వార్తాపత్రిక వెలువడడం ఆరంభమైన తరువాత ("నోయె రైనిషె సైటుంగ్" ప్రచురణ 1848 జూన్ 1 వ తేదీని ఆరంభమైంది), ఒక ప్రత్యేకమైన కార్మికుల ఆర్గనైజేషనుకు తాము సుముఖులమని మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రకటించారు! అంత వరకు కూడా, స్వతంత్రమైన కార్మిక పార్టీతో ఎట్టి ఆర్గనైజేషనల్ సంబంధాలు సహితమూ కలిగి వుండనట్టి "ప్రజాస్వామిక పత్రిక" ఒకదానిని మాత్రమే నడుపుతూండేవారు! ఈనాటి మన దృక్‌స్థానంనుండి ఎంతో ఘోరంగానూ అసంభవంగానూ కనబడేటట్టి ఈ వాస్తవ విషయం ఆనాటి జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీకీ నేటి రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీకీ వున్న బ్రహ్మాండమైన భేదాన్ని మనకి స్పష్టంగా తెలియజేస్తుంది. జర్మన్ ప్రజాస్వామిక విప్లవంలో (ఆర్థిక స్థితీ, రాజకీయ స్థితీ — రాజ్యాంగయంత్రంగా అది ముక్కచెక్కలుగా వున్న స్థితి — పుణ్యమూ అంటూ) ఉద్యమం యొక్క శ్రామికవర్గ స్వభావాలు, ఉద్యమంలోని శ్రామికవర్గ ప్రవాహం ఎంత తక్కువగా బహిర్గతమై వుండెనో ఈ వాస్తవవిషయం తెలియజేస్తూంది. స్వతంత్ర శ్రామికవర్గ పార్టీ ఒకదానిని ఆర్గనైజు చేయడానికి గల ఆవశ్యకతను గురించి ఈ కాలావధిలోనూ, మరికొంత కాలం తరువాతనూ మార్క్స్ పదేపదే కావించిన ప్రకటనలపై ఒక తీర్పుకు రావడంలో ఈ విషయాన్ని మనం విస్మరించకూడదు. ఇంచుమించు ఒక సంవత్సరం తరువాత, ప్రజాస్వామిక విప్లవానుభవాల ఫలితంగా మాత్రమే ఈ ఆచరణీయమైన పర్యవసానానికి మార్క్స్ వచ్చాడు — ఆ కాలంలో జర్మనీలోని వాతావరణం యావత్తూ అంత అల్పబుద్ధి తత్వంతోనూ అంత పెట్టీబూర్జువా తత్వంతోనూ నిండి వుండెనన్నమాట. మనకీ పర్యవసానం అదివరకే చాలాకాలంగా వుండినట్టీ, దృఢపడినట్టిన్నీ, అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీ అర్ధశతాబ్ది కాలంలో గడించినట్టీ అనుభవ సంపాదన — ఈ అనుభవ సంపాదనతోనే మనం రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీని ఆర్గనైజు చేయడం ప్రారంభించాం. ఉదాహరణకు, మన విషయంలో, విప్లవాత్మక శ్రామికవర్గ వార్తాపత్రికలు శ్రామికవర్గపు సోషల్-డెమోక్రాటిక్ పార్టీకి బైటనే వుండడమూ, ఒక్క క్షణమాత్రానికైనా కేవలం "ప్రజాస్వామిక పత్రికలు"గా వెలువడడమూ అనే ప్రశ్నే వుండడానికి వీల్లేదు.

కాని మార్క్స్, స్టెఫాన్ బోర్న్‌ల నడుమ ఇంకా బయల్పడడానికి ప్రారంభించని విరుద్ధం మన విప్లవం యొక్క ప్రజాస్వామ్య ప్రవాహంలోని శ్రామికవర్గపు ఉరవడి మరింత శక్తివంతంగా సాక్షాత్కరించడం కారణంగా మరింత అభివృద్ధి చెందిన రూపంలో మన విషయంలో మనుతూంది. స్టెఫాన్ బోర్న్ నడిపిన ఆందోళన పట్ల మార్క్స్, ఎంగెల్స్‌లకు కలగడానికి సంభావ్యమైన అసంతృప్తిని గురించి ప్రస్తావించుతూ, తన అభిప్రాయాలను మేరింగ్ మరీ మెత్తగానూ మరీ సందిగ్ధంగానూ తెలియపరుస్తున్నాడు. బోర్న్ గురించి 1885 లో ఎంగెల్స్ ఈ విధంగా ("Enthüllungen über den Kommunistenprozess zu Köln". Zürich. 1885* అనే పుస్తకానికి తాను రాసిన పీఠికలో) రాశాడు:

"కమ్యూనిస్టు లీగ్" సభ్యులు అన్నిచోట్లా కూడా తీవ్ర ప్రజాస్వామ్య ఉద్యమం అగ్రస్థానమందు నిలబడి, తద్వారా లీగ్ విప్లవాత్మక కార్యాచరణకు చక్కని పాఠశాల అని రుజువు పరచారు. "బ్రస్సెల్స్‌లోనూ పారిస్‌లోనూ లీగ్‌లో చురుకైన సభ్యుడుగా వుండిన ముద్రాక్షరశాల కంపోజిటరు స్టెఫాన్ బోర్న్ ఒక మోస్తరుగా బాగానే వ్యాప్తిచెందినట్టి, 1850 వరకూ నిలిచినట్టి "కార్మిక భ్రాతృత్వం" ("Arbeiterverbrüderung") అనే సంస్థ ఒకదానిని బెర్లిన్‌లో స్థాపించాడు. బోర్న్ మంచి ఉపజ్ఞ కల్గిన యువకుడు, తత్రాపి పెద్ద రాజకీయ వ్యక్తిగా ముందుకు రావడానికి మరీ ఉబలాట పడుతూండినవాడు. కేవలం కొంత జనాన్ని పోగుచేసుకోవాలనే ఉద్దేశంతో అడుగు మడుగు చెత్తా కానా నానారకాల వారందరితోనూ (Kreti and Plethi) "భ్రాతృత్వం నెరపాడు," కాగా పరస్పరం ఘర్షణపడుతూన్న ధోరణుల మధ్య ఐక్యత సాధించడానికి గాని, అల్లకల్లోలంలో వెలుగు తీసుకురావడానికి గాని అతడే మాత్రమూ తగిన మనిషి కాదు. దీని ఫలితంగా, "కమ్యూనిస్టు ప్రణాళిక"లో వ్యక్తపరచబడినట్టి అభిప్రాయాలతో గిల్డు స్మృతులూ, గిల్డు ఆశయాలూ, లూయీ బ్లాంక్, ప్రూడన్, వీరిద్దరి అభిప్రాయాలనుండి కొన్ని తునుకలూ, వాణిజ్య సంరక్షణ వాదమూ, వగైరాలన్నిటినీ కలగాపులగంచేసి తయారు చేసిన పంచగోళకషాయం ఈ సంఘం యొక్క అధికార ప్రచురణలలో అవుపడుతూంది; అనగా అందరినీ సంతోషపరచడానికి వాళ్ళు ప్రయత్నించారు (allen alles sein). అందులోనూ ముఖ్యంగా సమ్మెలనూ, ట్రేడ్‌యూనియన్లనూ, ఉత్పత్తిదార్ల సహకార సంఘాలనూ, పనిలోపెట్టారు, కాగా ఏ రంగంలో మాత్రమే ఇట్టివాటిని శాశ్వత ప్రాతిపదికపై పనిచేయించేందుకు వీలు పడుతుందో అట్టి ఒక క్షేత్రాన్ని రాజకీయ విజయాల మూలంగా మాత్రమే మొట్టమొదట

* "కొలోన్‌లో జరిగిన కమ్యూనిస్టు అభియోగం గురించి బయల్పడిన విషయాలు," జ్యూరిచ్, 1885. – అనువాదకుడు.

సాధించడం అన్నిటికంటె ప్రధానమైన కర్తవ్యం అనే విషయాన్ని వాళ్ళు విస్మరించారు (ఒత్తులు మేము పెట్టినవి). ఇక తరువాత అభివృద్ధి నిరోధకం సాధించిన విజయాల కారణంగా, విప్లవాత్మక పోరాటంలో సూటిగా పాల్గొనాల్సిన ఆవశ్యకతను భ్రాతృత్వ నాయకులు ఎప్పుడైతే గుర్తించారో, అప్పుడు తమ చుట్టూ చేరదీసిన గందరగోళపు మూక సహజంగానే వాళ్లని వాళ్ల ఖర్మానికి వదిలిపెట్టేసి తాను పలాయనం చిత్తగించింది. 1849 మే లో జరిగిన డ్రెస్డెన్ తిరుగుబాటులో బోర్న్ పాల్గొని, అతని అదృష్టంకొద్దీ పట్టుబడకుండా తప్పించుకోగలిగాడు. కాని శ్రామికవర్గపు బృహత్తర రాజకీయ ఉద్యమానికి వ్యాత్యాసంగా, చాలామటుకు కాగితంమీదే అస్తిత్వం కలిగినట్టి, 1850 నాటివరకూ దానినీ, ఇంకా బతికి వున్నట్టి దాని శాఖలను అనేక సంవత్సరాల తరువాతనూ అణచివేయాల్సిన అగత్యం అభివృద్ధి నిరోధకానికి కల్గనంతటి అప్రధాన పాత్రను కల్గినట్టి, కార్మిక భ్రాతృత్వం స్వచ్ఛమైన ఒక విడి సంఘమేనని రుజువైంది. బోర్న్ (అతని నిజమైన పేరు Buttermilch* రాజకీయంగా పెద్ద పేరేమీ సంపాదించలేదు; కాగా ఇప్పుడతడు స్విట్జర్లెండ్‌లో ఒక చిన్న ప్రొఫెసర్‌గా వుంటూ, మార్క్స్‌ను గిల్డు భాషలోకి అనువదించడం ఇక ఇప్పుడు మానుకుని, సాధుపుంగవుడైన రేనాన్‌ను జర్మన్ భాషలోకి తన స్వంత తీపిశైలిలో అనువదిస్తున్నాడు.''

ప్రజాస్వామిక విప్లవంలో సోషల్-డెమోక్రసీ రెండు ఎత్తుగడలనూ ఎంగెల్స్ ఈ విధంగా విలువకట్టాడు!

---

* ఎంగెల్స్‌ను అనువదించడంలోమొదటి కూర్పులో, Buttermilch [మజ్జిగ–అనువాదకుడు] అనే మాటను నేను వ్యక్తివాచక విశేష్యంగా కాకుండా జాతివిశేష్యంగా పరిగణించడం వల్ల పొరపాటు చేశాను. ఈ పొరపాటు మెన్‌షెవిక్‌లకు సహజంగానే చక్కని ఆనందం కలుగజేసింది. నేను ''ఎంగెల్స్‌ను మరింత గంభీరంగా'' చేశానని కొల్‌త్సోవ్ (''రెండు సంవత్సరాలు'' అనే శీర్షికగల వ్యాససంకలనంలో పునర్ముద్రితం) రాశాడు, కాగా ''తొవారిశ్చ్'' దినపత్రికలో ప్లెహానొవ్ ఈనాటికీ ఈ పొరపాటును జ్ఞాపకం చేసుకుంటూనే వున్నాడు – ఒక్క మాటలో చెప్పాలంటే, దీనివల్ల వారికి జర్మనీలో 1848 లో కార్మికవర్గంలోని బోర్న్ ధోరణి (మన ఆర్థికవాదులను పోలినట్టి ధోరణి), మార్క్సిస్టు ధోరణి, రెండు ధోరణుల ప్రశ్న దాటవేయడానికి భేషైన నెపం దొరికింది. తమ ప్రత్యర్థి చేసిన పొరపాటును, బోర్న్ పేరు విషయంలో జరిగినట్టి పొరపాటును సహితమూ ఉపయోగించుకోవడము కేవలమూ అత్యంత సహజమే. కాని అనువాదంలో తటస్థించిన పొరపాటును దిద్దుతూ ఆ అవకాశాన్ని వినియోగించుకుని రెండు ఎత్తుగడల ప్రశ్నను మరుగుపర్చడం మాత్రం అసలు వివాదాంశాన్ని దాటవేయడమే అవుతుంది. (1907 కూర్పుకు గ్రంథకర్త వివరణ – సం.)

మన కొత్త ''ఇస్క్రా'' అనుచరులు కూడా ''అర్థికవాదం'' దిశగా, అదిన్నీ ఎంత ఉత్సాహంతో నంటే, వారు ''జ్ఞాన తేజస్సును చూడగల్గినందుకు'' రాచరికపక్షపు బూర్జువావర్గం పొగడ్తలను సంపాదించుకోగల్గిన ఉత్సాహంతో, జరుగుతున్నారు. ''అర్థికవాదులను'' శ్లాఘించుతూ ''చొరవ,'' ''ప్రజాస్వామ్యమూ,'' ''స్వపరిపాలన,'' వగైరా వగైరా నినాదాలతోనూ, అభివృద్ధి చెందని ప్రజారాసులను చౌకబారు పదజాలవ్యాపారంతోనూ ఆకర్షించుతూ, తమ చుట్టూ నానాగోత్రీకుల మూకనూ వీరు కూడా పోగుచేసుకుంటున్నారు. వీరి కార్మిక సంఘాలు కూడా ప్లెస్తకోవ్‌లాంటి[84] కొత్త ''ఇస్క్రా'' పుటలలోనే తమ అస్తిత్వం కలిగివుంటున్నాయి. ''శ్రామికవర్గం యొక్క మహత్తర రాజకీయోద్యమ'' కర్తవ్యాలను అర్థం చేసుకోలేనట్టి ఇలాంటి అసమర్థతనే వీరి నినాదాలూ తీర్మానాలూ బయిట పెట్టుకుంటున్నాయి.

జూన్ – జూలై 1905.

# గెరిల్లా యుద్ధం

మన పార్టీకీ కార్మిక ప్రజారాసులకీ అత్యంత ఆసక్తిని కలిగిస్తూన్న ప్రశ్నలలో ఒకటి గెరిల్లా కార్యాచరణ. ఈ ప్రశ్నను అనేకసార్లు మేము ప్రసంగవశాత్తూ చర్చించాము, కాగా మేము వాగ్దానం చేసిన ప్రకారం మా అభిప్రాయాలపై మరింత సమగ్రమైన వివరణను ఇప్పుడు ఇవ్వ నుద్దేశించుతున్నాం.

## I

ఓం ప్రథమం నుండీ మొదలెడదాం. పోరాట రూపాలను గురించిన ప్రశ్న పరిశీలనలో ప్రతి మార్క్సిస్టు ఎట్టి మౌలికమైన డిమాండ్లను కోరాలి? మొట్టమొదట, ఉద్యమాన్ని ఏ ఒక్క పోరాట రూపానికీ ముడిపెట్టకుండా వుండడంలోనే మార్క్సిజం, సోషలిజంయొక్క ఆదిమ రూపాలన్నిటితోనూ విభేదిస్తూంది. పోరాటంయొక్క అత్యంత విభిన్నములైన అనేక రూపాలను అది అంగీకరించుతుంది; కాగా వాటిని అది ''కల్పించదు.'' కాని, కేవలంగా ఉద్యమ గమనంలో వాటంతటవే తలెత్తేటట్టి విప్లవాత్మక వర్గాల పోరాట రూపాలను అది సాధారణీకరించి, ఆర్గనైజుచేసి, వాటికి చైతన్యం కల్గిస్తుంది. అనిర్దిష్టములైన సాంకేతికాలన్నిటికీ, సూత్రప్రమాణపు చిట్కాలన్నిటికీ అది బద్ధశత్రువై వుంటూ, ఉద్యమం అభివృద్ధి పొందుతూన్నకొద్దీ ప్రజారాసుల వర్గ చైతన్యం అధికమవుతూన్న కొద్దీ ఆర్థిక, రాజకీయ సంక్షోభాలు మరింత తీవ్రతమవుతూన్నకొద్దీ, దాడి కాచుకోవడమూ, ఎదురుదాడి చేయడమూ ఈ రెండింటిలోనూ సరికొత్తవీ మరింత భిన్నభిన్నములైనవీ విధానాలను నిరంతరం ఉత్పత్తిచేస్తూ పురోగమించుతూన్న రాశి పోరాటం పట్ల శ్రద్ధవహించే వైఖరిని మార్క్సిజం డిమాండు చేస్తుంది. ఇందుచేత, పోరాటంయొక్క ఆ యా ప్రత్యేక తరుణములందు మాత్రమే సాధ్యమైనట్టి అస్తిత్వాన్ని కలిగివుంటూన్నట్టి రూపాలకే మార్క్స

జం పరిమితమ్మై వుండకుండా, ఆ ప్రత్యేక కాలావధిలో పాల్గొంటున్నవారికి తెలియనట్టి నూతన పోరాట రూపాలు నిర్దిష్టమైన ఆ ప్రత్యేక సామాజిక పరిస్థితులు మారుతూన్నప్పుడు తప్పనిసరిగా ప్రభవించుతాయని అది గుర్తించుతూండడం కారణంగా, ఎట్టిపోరాట రూపాన్ని సహితము ఎట్టి సందర్భాల్లోనైనా సరే అది తిరస్కరించదు. ఒక విధంగా మనం వ్యక్తీకరించాలంటే, ఈ విషయంలో ప్రజారాసుల ఆచరణనుండి మార్క్సిజం నేర్చుకుంటుంది; కాగా "వ్యవస్థీకరణులు" తమ అధ్యయన మందిరాలలో ఏకాంతంగా కూచుని ఆవిష్కరించే పోరాట రూపాలను ప్రజారాసులకు అది బోధించదు, ఆలా బోధించే ఉద్దేశం దానికి లేనూలేదు. ఉదాహరణ ఇవ్వాలంటే, సామాజిక విప్లవ రూపాలను పరిశీలించుతూన్నప్పుడు, కౌట్స్కి చెప్పినట్టుగా, ఈనాడు మనం ముందుగానే తెలుసుకొనజాలనట్టి పోరాట రూపాలను రానున్న సంక్షోభం ప్రవేశపెట్టబోతుందన్న సంగతి మనకు తెలుసు.

రెండవ సంగతి: పోరాట రూపాల ప్రశ్నను కేవలం చారిత్రాత్మకంగా పరిశీలించాలని మార్క్సిజం డిమాండు చేస్తుంది. నిర్దిష్టమైన చారిత్రాత్మక పరిస్థితి నుండి విడదీసి ఈ ప్రశ్నను విశదీకరించడమంటే గతితార్కిక భౌతికవాదపు ప్రాథమిక సూత్రాలపట్ల అజ్ఞానాన్ని బయటపెట్టుకోవడ మన్నమాట. ఆర్థిక పరిణామపు వివిధ దశలలోని రాజకీయ, జాతీయ-సాంస్కృతిక, జీవిత, తదితర పరిస్థితులలో వుండే భేదాలననుసరించి, విభిన్న పోరాట రూపాలు ఉత్తరరంగంలోకి వచ్చి, పోరాటంయొక్క ప్రధాన రూపాలుగా ఏర్పడతాయి; కాగా ఈ సందర్భంలో పోరాటంయొక్క రూపాంతరాలూ, అప్రధాన అనుషంగిక రూపాలు కూడా, వాటి వంతుకి అవి మారిపోతాయి. ఫలానా నిర్దిష్ట అభివృద్ధిదశలో వున్నప్పుడు ఫలానా ఉద్యమంయొక్క నిర్దిష్ట పరిస్థితులను సవివరంగా పరిశీలించక ముందే, ఏదైనా ఫలానా పోరాట సాధనం ఉపయోగించవచ్చా, అనే ప్రశ్నకు అవునని గాని, కాదని గాని జబాబు చెప్పడానికి యత్నించడమంటే మార్క్సిస్టు స్థానాన్ని సంపూర్ణంగా వదలిపెట్టేయడ మన్నమాటే.

ఈ రెండు ప్రధాన సైద్ధాంతిక నియమాలను అనుసరించుతూ మనం నడచుకోవాలి. మనమిప్పుడు చెప్పిన దానిని స్థిరపరచుతూ పాశ్చాత్య యూరప్‌లోని మార్క్సిజం చరిత్ర లెక్కలేనన్ని ఉదాహరణలను ఇస్తూంది. నేటికాలంలో సోషల్-డెమోక్రసీ పార్లమెంటరీ విధానాన్నీ, ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్నీ ప్రధానమైన పోరాటరూపాలుగా పరిగణిస్తూంది; వెనకటి కాలంలో అది ఉపప్లవాన్ని గుర్తించింది; కాగా పరిస్థితులు మారిన పక్షంలో భవిష్యత్తులో కూడా — రష్యన్ కాడెట్లూ[85] బెజ్జగ్లావ్‌త్సి[86] లాంటి బూర్జువా లిబరల్సు అభిప్రాయం దీనిని ఒప్పుకోనప్పటికీ, సామాజిక సర్వరోగనివారిణిగానూ, రాజకీయేతర మార్గాలవల్ల ఒక్క దెబ్బలో బూర్జువావర్గాన్ని కూలదోయడానికి సాధనంగానూ సర్వవ్యాప్త సమ్మెను 1870

లలో సోషల్-డెమోక్రసీ తిరగ్గొట్టేసినప్పటికీ — కొన్ని నిర్దిష్ట పరిస్థితులలో పోరాట సాధనాలలో ఒకటిగా రాశి రాజకీయ సమ్మెను (1905 లో రష్యా అనుభవం తరువాత మరీ ముఖ్యంగా) సోషల్-డెమోక్రసీ పూర్తిగా అంగీకరించుతూంది. వీధి బారికేడ్ పోరాటాన్ని 1840 లలో సోషల్-డెమోక్రసీ అంగీకరించింది, నిర్దిష్టకారణాలవల్ల పంధొమ్మిదవ శతాబ్ది అంతంలో దానిని తిరస్కరించింది, కాగా ఈ ఆఖరి అభిప్రాయం సవరించుకోవడానికీ, కౌట్స్కీ మాటల్లో బారికేడ్ పోరాటంలో కొత్త ఎత్తుగడలను తనంతట తానై మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టినట్టి మాస్కో అనుభవం తరువాత బారికేడ్ పోరాట ఆవశ్యకతను అంగీకరించడానికీ తన పూర్తి సంసిద్ధతను అది వ్యక్తంచేసింది.

## II

సాధారణ మార్క్సిస్టు నియమాలను స్థాపించిన తరువాత, ఇప్పుడు మన దృష్టిని రష్యన్ విప్లవం వైపు మళ్లించుదాం. అది తనంతట తానై ప్రవేశపెట్టిన పోరాటరూపాల చారిత్రాత్మక అభివృద్ధిని ఒకసారి గుర్తుకు తెచ్చుకుందాం. మొదట కార్మికుల ఆర్థిక సమ్మెలు జరిగాయి (1896 – 1900), తరువాత కార్మికుల, విద్యార్థుల రాజకీయ ప్రదర్శనలు (1901–1902), రైతు పితూరీలు (1902), ప్రదర్శనలతో రకరకాల విధాలుగా కలిపి జరిపినట్టి రాశి రాజకీయ సమ్మెల ప్రారంభం (రొస్తోవ్ 1902, వేసవి 1903 సమ్మెలు, 9 వ జనవరి 1905), స్థానిక సందర్భాల్లో బారికేడ్ పోరాటంతో కూడా కలిపి జరిపినట్టి అఖిలరష్యా రాజకీయ సమ్మె (అక్టోబరు 1905), రాశి బారికేడ్ పోరాటమూ, సాయుధ ఉపప్లవమూ (డిసెంబరు 1905), శాంతియుతమైన పార్లమెంటరీ పోరాటం (ఏప్రిల్ – జూన్ 1906), పాక్షిక సైనిక తిరుగుబాట్లు (జూన్ 1905 – జూలై 1906), పాక్షిక రైతు తిరుగుబాట్లు (శరత్తు 1905 – శరత్తు 1906).

స్థూలంగా పోరాటరూపాలకు సంబంధించినంత వరకూ, 1906 శరత్తులో కార్యకలాపాల పరిస్థితి ఈ విధంగా వుంది. 1903 వసంతంలో కిషినెవ్ నగరం నుండి ప్రారంభించి 1906 శరత్తులో సెద్లేత్స్ నగరం వరకూ సాగినట్టి నల్లదండు ముఠాల మూకుమ్మడి హత్యాకాండలు[87] నిరంకుశ ప్రభుత్వం అవలంబించిన పోరాటంయొక్క "ప్రతీకార" రూపం. ఈ కాలావధి అంతటిలోనూ నల్లదండు మూఠాల మూకుమ్మడి హత్యాకాండలయొక్క ఆర్గనైజేషనూ యూదులనూ విద్యార్థులనూ విప్లవకారులనూ వర్గచైతన్యయుతులైన కార్మికులనూ చితుకబాదడమూ ఆనాటికానాడు అధికమవుతూ, నల్లదండు ముఠాల సైనికుల దౌర్జన్యంతో కిరాయి ముష్కరుల దౌర్జన్యం మిళితమై గ్రామాలలోనూ నగరాలలోనూ శత

ఘ్నులను సహితమూ ప్రయోగించేంత వరకూ దిగజారి, దండన విధాన యుద్ధకాండలూ, యుద్ధ సరంజామాతో సాయుధములైన రైళ్లూ, ఇత్యాదులతో విలీనమైంది.

ఇదీ చిత్తరువుయొక్క మౌలిక పూర్వరంగం. ఈ పూర్వరంగం ఇలా వుండగా, దేని అధ్యయనం గురించీ దేనిని విలువ కట్టడమును గురించీ ఈ వ్యాసం ఉద్దేశించబడిందో ఆ దృగ్విషయం — ఏదో పాక్షికంగానే, అప్రధానంగానే, ఆనుషంగికంగానే అనేది నిస్సంశయమే — అసలు రంగంలో ప్రధానంగా నిలబడుంది. ఏమిటీ దృగ్విషయం? ఏవేవి దాని రూపాలు? దానికి కారణాలేమిటి? అదెప్పుడు ప్రభవించి, ఎంతవరకు వ్యాపించింది? విప్లవంయొక్క సాధారణ గమనంలో దాని ప్రాముఖ్యత ఏమిటి? సోషల్-డెమోక్రసీచే ఆర్గనైజు చేయబడి, నడుపబడిన కార్మికవర్గ పోరాటంతో దానికున్న సంబంధం ఏమిటి? చిత్తరువుయొక్క సాధారణ పూర్వరంగం చిత్రించిన తరువాత ఈ ప్రశ్నల పరిశీలనలోకి మనమిప్పుడు దిగాలి.

మనకిప్పుడు ఆసక్తి కలిగిస్తూన్న దృగ్విషయం సాయుధ పోరాటం. దీనిని వ్యక్తులూ చిన్నదళాలూ నడుపుతాయి. దీనిలో కొన్ని విప్లవ ఆర్గనైజేషన్లకు చెందిన వ్యక్తులూ చిన్న దళాలూ వుంటాయి, ఏ విప్లవ ఆర్గనైజేషనుకీ చెందని వ్యక్తులూ చిన్న దళాలూ వుంటాయి (రష్యాలో కొన్ని భాగాలలో ఈ దృష్టాంతాలదే అధికసంఖ్య). సాయుధ పోరాటం రెండు విభిన్న లక్ష్యాలు పాటిస్తుంది, ఈ రెండింటిలో ఒకదానికి రెండవదానికీ వున్న భేదాన్ని నిశితంగా గుర్తించాలి: మొదటిది, సేనలోనూ పోలీసులోనూ వున్న విడి వ్యక్తులనూ, ప్రధానాధికార్లనూ, తాబేదార్లనూ హత్యచేయడం ఈ పోరాటంయొక్క లక్ష్యం; రెండవది, ఈ పోరాటంయొక్క లక్ష్యం ప్రభుత్వంనుండీ వ్యక్తులనుండీ ధననిధులను జప్తి చేసుకోవడం. జప్తి చేయబడిన ధననిధులలో కొంత పార్టీ ఖజానాలోకి వెళ్తుంది, ఉపప్లవానికై ఆయుధాలను సమకూర్చడానికీ తర్ఫీదు యివ్వడానికీ కొంత వెళ్తుంది. మనమిప్పుడు వివరించుతూన్నట్టి పోరాటంలో పాల్గొంటూన్న వ్యక్తుల పోషణకుగాను కొంత వెళ్తుంది. వాస్తవంగా దోపిడీ వల్ల లభించిన పెద్ద మొత్తాలు (ఉదాహరణకు, 2,00,000 రూబుళ్లకు పైగా కకేష్యాలో లభించినవీ, 8,75,000 రూబుళ్లు మాస్కోలో లభించినవీ) ప్రప్రధానంగానూ విప్లవాత్మక పార్టీలకి వెళ్లాయి — చిన్నచిన్న దోపిడీమొత్తాలు చాలామటుకూ ఇంచుమించు పూర్తిగానూ "దోపిడీదార్ల" పోషణకే వెళ్లాయి. ఈ పోరాటరూపం నిస్సందేహంగా 1906 తరువాతే, అనగా డిసెంబరు ఉపప్లవం తరువాతే, విస్తృతంగా అభివృద్ధి అయి, వ్యాప్తిచెందింది. సాయుధ పోరాట స్థాయి అందుకునేంత వరకూ రాజకీయ సంక్షోభం తీవ్రమవడమూ అందులోనూ ప్రత్యేకంగా పేదరికమూ ఆకలి బాధా నిరుద్యోగమూ పల్లెపట్టులలోనూ నగర ప్రాంతాల్లోనూ తీవ్రమవడమూ, మనమిప్పుడు వివరించుతూన్నట్టి పోరాటానికి ఒక ముఖ్య కారణం. ప్రజలోని దేశదిమ్మరి/దేశదిప్పకాయజట్లూ, అట్టడుగు రౌడీమూకలూ అరాజకవాద గ్రూపు

లూ — వీటిచే సామాజిక పోరాటరూపాల్లోని ఈ రూపమే ఉత్తమమూ, ప్రత్యేకమూ అయినదిగా అవలంబించబడింది. యుద్ధశాసన ప్రకటన, కొత్త సాయుధ బలాలను దేశంలోకి నడిపించడము, నల్లదండు ముఠాల హత్యాకాండలు (సెద్లేట్స్), యుద్ధశాసన న్యాయస్థానాలు — వీటిని నిరంకుశ పరిపాలన అవలంబించిన "ప్రతీకార" పోరాటరూపంగా భావించాల్సి వుంటుంది.

## III

మనమిప్పుడు వివరించుతూన్న పోరాటం అరాచకవాదమే, బ్లాంకిజమే, గతకాలపు టెరరిజమే, కార్మికులలో మనోనిబ్బరం చెడగొట్టి, జనసంఖ్యలో విస్తృత స్తరాలను విముఖలనుగా చేసి, ఉద్యమంయొక్క అర్గనైజేషనును నాశనంచేసి, విప్లవానికి హానితెచ్చేటట్టి ప్రజారాసులనుండి వేరైపోయినట్టి వ్యక్తుల క్రియలే, అనే సామాన్యపు అంచనా కద్దు. పతి రోజా వార్తాపత్రికల్లో పడుతూన్న ఉదంతాలలో ఈ అభిప్రాయాన్ని బలపరచే ఉదాహరణలు సులభంగా కనబడతాయి.

కాని ఇలాంటి ఉదాహరణలు నిజంగా విశ్వాసజనకమేనా? దీనిని సరిచూచేందుకు, మనం పరిశీలిస్తూన్న పోరాటరూపం అత్యధికంగా అభివృద్ధి చెందిన ప్రాంతాన్ని — లాత్వియా ప్రాంతాన్ని తీసుకుందాం. లాత్వియా సోషల్-డెమోక్రాట్ల క్రియాకలాపాల గురించి "నోవాయె వ్రేమ్య"[88] (సెప్టెంబరు 9 వ, 12 వ తేదీల సంచికలలో) ఈ విధంగా ఫిర్యాదు చేస్తూంది. లాత్వియా సోషల్-డెమోక్రాటిక్ లేబర్ పార్టీ (రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలో ఒక భాగం) ప్రతి రోజా తన పత్రికను 30,000 ప్రతులలో ప్రచురించుతూంది.[89] ప్రకటన కాలమ్‌లలో గూఢచారుల జాబితాలు పడుతూనే వుంటాయి. ఈ గూఢచారులను నిర్మూలించడం తన విధ్యుక్తధర్మమని మానాభిమానాలుగల ప్రతి మనిషీ భావించుతాడు. పోలీసులకు సహాయపడే మనుషులు "విప్లవానికి శత్రువులు" అనీ, వారు ఉరి శిక్ష అనుభవించాల్సి వస్తుందనీ, అంతే కాకుండా వారి ఆస్తి జప్తు చేయబడవచ్చుననీ కూడా ఈ పత్రికలో ప్రకటించబడుతూంది. స్టాంపు అంటించి దస్కత్తు చేసిన రశీదులు పొందే పద్ధతిపైనే సోషల్-డెమోక్రాటిక్ పార్టీకి విరాళాలు తప్పక ఇవ్వవలసిందనీ ఈ పత్రిక ప్రజలను ఆదేశిస్తూంది. పార్టీ గత నివేదికలో క్రితం సంవత్సరపు ఆదాయం 48,000 రూబుళ్లు అని చూపబడి, ఆ మొత్తంలో 5,600 రూబుళ్లు లిబావ్ నగర శాఖ నుండి ఆయుధాలు కొనుగోలు కోసం పంపబడినట్టూ, దోపిడీ ద్వారా ఈ మొత్తం సంపాదించబడినట్టూ ఒక పద్దు తెలియజేస్తూంది. "నోవాయె వ్రేమ్య" సహజంగానే ఈ "విప్లవ శాసనం" పైనా, ఈ "భయంకరమైన ప్రభుత్వం" పైనా, హాహాకారాలుచేస్తూ నిప్పుల కక్కుతూంది.

లాత్వియా సోషల్-డెమోక్రాట్లు ఈ క్రియాకలాపాలకు అరాచకవాదమనీ, బ్లాంకీజం టెరరిజమనీ పేరుపెట్ట సాహసించే వారెవ్వరూ వుండబోరు. అయితే ఎందుచేత? పోరాటం కొత్త రూపానికీ, డిసెంబరులో పెచ్చరిల్లినట్టీ తిరిగి పక్వానికి వస్తూన్నట్టీ ఉపప్లవానికీ స్పష్టమైన సంబంధం మనకిక్కడ లభించుతూండడమే ఇందుకు కారణం. రష్యాయావత్తునీ మొత్తంగా తీసుకున్నట్టయితే ఈ సంబంధం అంత స్పష్టంగా గోచరించడం లేదు; కాని అది వుండడం మాత్రం వుంది. సరిగా డిసెంబరు తరువాతే "గెరిల్లా" పోరాటం విస్తృతవ్యాప్తి చెందిందన్న విషయమూ, ఆర్థిక సంక్షోభమే కాకుండా, రాజకీయ సంక్షోభం కూడా ఉధృత మవుతూందన్న విషయంతో దీనికి సంబంధం వుండడమూ నిర్వివాదములే. గతకాలపు రష్యన్ టెరరిజం మేధావిస్తరానికి చెందిన కుట్రదారుని కార్యకలాపమే అయి వుండేది; ఈనాడు ఒక సర్వసాధారణ సూత్రంగా, గెరిల్లా పోరాటం సాయుధదళాలకు చెందిన కార్మికునిచే, లేదా కేవలం నిరుద్యోగిగానున్న కార్మికునిచే జరుపబడుతూంది. అనుకరణపై మోజు వున్న మతులకే ఇవి బ్లాంకీజమూ, అరాచకవాదమూ అని సులభంగా తట్టుతుంది; కాని లాత్వియా ప్రాంతంలో ప్రత్యక్షంగా కనబడుతూన్నట్టి ఉపప్లవ పరిస్థితులలో ఇటువంటి కంఠస్థంచేసి నేర్చుకున్న పేర్లు తగిలించడం ఎంత అసమంజసమో స్పష్టంగా అవుపడుతూనే వుంది.

ఉపప్లవ పరిస్థితులను లెక్కలోకి తీసుకోకుండానే గెరిల్లా యుద్ధాన్ని విశ్లేషించడమనే మనకందరకూ వున్న సామాన్యపు అలవాటు ఎంత తప్పు అయినదో, ఎంత అశాస్త్రీయమో, ఎంత చారిత్రాత్మక విరుద్ధమో లాత్వియా ఉదాహరణ స్పష్టంగా చూపిస్తూంది. పరిస్థితిని దృష్టిలో వుంచుకోవాలి, ఉపప్లవంలో ఒక బృహత్కార్యానికీ మరొక బృహత్కార్యానికీ మధ్య వుండే కాలావధులయొక్క ప్రత్యేక స్వభావాలను గురించి మనం ఆలోచించాలి, అటువంటి పరిస్థితులలో ఎట్టి పోరాటరూపాలు తప్పనిసరిగా తలెత్తుతాయో అర్థం చేసుకోవాలే గాని, కాడెట్లూ, "నోవొయె వ్రేమ్య" అనుచరులూ ఒకరితో ఒకరు సమానంగా వాదుతూన్నట్టీ, వాళ్లదగ్గర నుండి రోకటిపాట నేర్చుకున్నట్టీ అరాచకవాదమూ, బందిపోటూ, దిప్పకాయతనమూ అనే పదజాలం వాడుకచేసి, తద్వారా వివాదవిషయం దాటవేయ ప్రయత్నించకూడదు!

గెరిల్లా కార్యాలు మన కార్యకలాపాన్ని డిజార్గనైజు* చేస్తున్నాయని చెప్పడం కద్దు. 1905 డిసెంబరు తరువాత వుండిన పరిస్థితులకూ, నల్లదండు ముఠాల హత్యాకాండలూ యుద్ధ శాసనమూ నాటి పరిస్థితులకూ ఈ వాదాన్ని ప్రయుక్తం చేసి చూదాం. ఇటువంటి

---

* అర్గనైజేషన్ను చెడిపే విధంగా — అనువాదకుడు.

కాలంలో ఉద్యమాన్ని ఏది హెచ్చుగా డిజార్గనైజు చేస్తుంది: ప్రతిఘటన లేక పోవడమా, లేక ఆర్గనైజ్డుగా సాగిన గెరిల్లా పోరాటమా? రష్యా మధ్య ప్రాంతాన్ని రష్యా పశ్చిమ సరిహద్దు ప్రాంతాలతో, పోలెండ్, లాత్వియా ప్రాంతాలతో సరిపోల్చి చూడండి. గెరిల్లా పోరాటచర్య పశ్చిమ సరిహద్దు ప్రాంతాలలో మరింత విస్తృతంగా వ్యాప్తిచెందిందన్న విషయమూ మరింత హెచ్చుగా అభివృద్ధి చెందిందన్న విషయమూ నిర్వివాదం. కాగా పశ్చిమ సరిహద్దు ప్రాంతాలలో కంటె మధ్య రష్యాలో సాధారణంగా విప్లవోద్యమమూ, ప్రత్యేకంగా సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమమూ మరింత డిజార్గనైజ్డ్‌గా వున్నాయన్న విషయమూ అంత నిర్వివాదమే. గెరిల్లా యుద్ధం పుణ్యమా అంటూనే పోలెండ్, లాత్వియాలలోని సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమాలు తక్కువ డిజార్గనైజ్డ్‌గా వున్నాయని దీన్నిబట్టి పర్యవసానం తేల్చవచ్చునని మన మెన్నడూ అనుకోమన్నది సహజమే. అలా ఎన్నడూ అనుకోం. 1906 లో రష్యాలోని సోషల్-డెమోక్రాటిక్ కార్మికోద్యమంయొక్క డిజార్గనైజ్డ్ స్థితికి గెరిల్లా యుద్ధాన్ని నిందించ కూడదనే పర్యవసానం ఒక్కటే మనంతేల్చగల్గుతాం.

ఈ సందర్భంలో జాతీయ పరిస్థితులలో వుంటూన్న ప్రత్యేకతలను తరుచుగా సూచించడం కద్దు. కాని విస్తృతంగా చాలామణీలో వున్న వాదనలోని బలహీనతను ఈ సూచన అతి విస్పష్టంగా బట్టబయలు చేస్తూంది. ఇది జాతీయ పరిస్థితులకు సంబంధించిన విషయమే అయితే, అరాచకవాదమూ బ్లాంకీతత్వమూ, టెరరిజమూ — రష్యాకి సాధారణంగానే కాకుండా, రష్యాకి ప్రత్యేకంగానూ సామాన్యమైన పాపాలు — వీటికి సంబంధించినది గాక, మరిదేనికో సంబంధించిన విషయమన్నమాట! అయ్యా, ఈ మరేదో అనే విషయాన్ని నిర్దిష్టంగా విశ్లేషించండి! అలాంటప్పుడు జాతీయ పీడన, లేదా జాతీయ వైషమ్యమూ దేనినీ వివరించలేవన్న సంగతి మీరు తెలుసుకుంటారు; ఎందుచేతనంటే, పశ్చిమ సరిహద్దు ప్రాంతాల్లో అవి ఎప్పుడూ వుంటూనేవుండగా, గెరిల్లా పోరాటం ప్రస్తుత చారిత్రాత్మక కాలావధివల్ల మాత్రమే ఉత్పన్న మయింది. జాతీయ పీడన, జాతీయ వైషమ్యము వుంటూన్నప్పటికీ, జాతీయ పీడన యేమాత్రమూ లేనప్పుడు సహితమూ ఒకొక్కప్పుడు అభివృద్ధి చెందే గెరిల్లా యుద్ధచర్యలు లేని ప్రాంతాలు అనేకం వున్నాయి. ఈ ప్రశ్నను నిర్దిష్టంగా విశ్లేషించి నట్టయితే, ఇది జాతీయ పీడనకు సంబంధించిన విషయం కాదనీ, ఉపప్లవ పరిస్థితులకు సంబంధించిన విషయమనీ తెలుస్తుంది. రాశి ఉద్యమం వాస్తవంగా ఉపప్లవ స్థానానికి చేరుకున్న సమయంలోనూ, అంతర్యుద్ధంలో ''పెద్ద సాయుధ చర్యల'' మధ్య ఇంచుమించు సుదీర్ఘ కాలావధులు సంభవించేటప్పుడూ గెరిల్లా పోరాటం అనివార్యమైన పోరాటరూపమవుతుంది. ఉద్యమాన్ని డిజార్గనైజ్డ్‌గా చేసివేస్తున్నది గెరిల్లా కార్యాలు కావు, ఇటువంటి

కార్యాలను తన అదుపులో వుంచుకొనే సమర్థతలేని పార్టీయొక్క బలహీనతే. గెరిల్లా కార్యాలపై రష్యన్లం మనం మామూలుగా విసరే తిట్లు, నిజంగా పార్టీని డిజార్గనైజు చేసేటట్టి, రహస్యంగానూ అక్కడా అక్కడానూ వరసా వావీ లేకుండానూ అనార్గనైజ్డుగానూ* జరిగే గెరిల్లా కార్యాలతో జతగా వుంటాయి. ఈ పోరాటానికి కారణభూతము లవుతూన్న ఆ యా ప్రత్యేక చారిత్రాత్మక పరిస్థితులను అర్థం చేసుకునే సామర్థ్యం లేనివారమై, ప్రమాదకరములైన దాని రీతులను మనం రూపుమాప లేకపోతున్నాం. అయినప్పటికీ పోరాటం మాత్రం సాగుతూనే వుంది. శక్తివంతములైన ఆర్థిక, రాజకీయ కారణాలు దానిని ప్రభావితం చేస్తున్నాయి. ఈ కారణాలను గాని, ఈ పోరాటాన్ని గాని తొలగించడం మన శక్తిలో లేదు. గెరిల్లా పోరాటం మనంపై చేసే ఫిర్యాదులు, ఉపప్లవం విషయంలో మన పార్టీ బలహీనతపై మనం చేసే ఫిర్యాదులే.

డిజార్గనైజేషను గురించి మనం చెప్పినది మనోనిబ్బరం సడలింపుకు కూడా వర్తించుతుంది. మనోనిబ్బరాన్ని చెడగొట్టేది గెరిల్లా యుద్ధం కాదు, అనార్గనైజ్డు, వ్యవస్థాత్మక రహిత, పార్టీయేతర గెరిల్లా చర్యలే. గెరిల్లా కార్యాలను ఖండించినంత మాత్రాన, శపించినంత మాత్రాన, సంపూర్ణంగా నిర్వివాదమైన ఈ మనోనిబ్బరపు సడలింపును తలవెంట్రుకవాసి అయినా మనం తగ్గించలేము, ఎందుచేతనంటే ప్రగాఢమైన ఆర్థిక, రాజకీయ కారణాలచే ప్రభావితమవుతూన్న దృగ్విషయాన్ని ఖండనలూ, శాపాలూ ఆపుచేయజాలవు. అస్వాభావికమైనట్టి, మనోనిబ్బరాన్ని చెడగొట్టేటట్టి ఒక దృగ్విషయాన్ని ఆపుచేయడానికి మనం అశక్తులమైనప్పుడు, అసాధారణమైనట్టి మనోనిబ్బరాన్ని చెడగొట్టేటట్టి, పోరాట విధానాలను పార్టీ అవలంబించడానికి ఇదెందుకు కారణమవాలి, అని అభ్యంతరం చెప్పవచ్చు. కాని ఈ అభ్యంతరం కేవలం లిబరల్-బూర్జువా అభ్యంతరమే అవుతుంది గాని, మార్క్సిస్టు అభ్యంతరం కానేరదు, కారణమేమిటంటే అంతర్యుద్ధం, లేదా దాని రూపాల్లో ఒకటైన గెరిల్లా యుద్ధం సాధారణంగా అస్వాభావికమైనదనీ, మనోనిబ్బరానికి చెరుపు తెచ్చేదనీ మార్క్సిస్టు అన్నవాడు భావించజాలడు. మార్క్సిస్టు వర్గపోరాటం వైపే నిలబడుతాడు, గాని సామాజిక శాంతి వైపుకాదు. ఆర్థిక, రాజకీయ సంక్షోభాలు తీవ్రతరం చెందే నిర్దిష్ట కాలావధులలో వర్గపోరాటం తక్షణ అంతర్యుద్ధంగా, అనగా ప్రజలలో రెండు భాగాల మధ్య సాయుధ పోరాటంగా, పరిపక్వం చెందుతుంది. అటువంటి కాలావధులలో మార్క్సిస్టుకు అంతర్యుద్ధం వైపు నిలబడక తప్పదు. అంతర్యుద్ధాన్ని ఏవిధంగానూ నైతికంగా కూడానూ ఖండించడం మార్క్సిజం దృష్ట్యా కేవలం దుస్సహమైన విషయం.

---

* ఆర్గనైజేషనురహితంగానూ — అనువాదకుడు.

అంతర్యుద్ధ శకంలో శ్రామికవర్గానికి ఆదర్శప్రాయమైన పార్టీ సమరశీలమైన పార్టీయే. ఇది కేవలం నిర్వివాదం. అంతర్యుద్ధం దృక్స్థానంనుండి, ఒక ప్రత్యేక తరుణంలో అంతర్యుద్ధంయొక్క ఫలానా రూపం, లేదా ఫలానా రూపాలు అయుక్తమని వాదించడానికీ రుజువు చేయడానికీ సాధ్యమే కావచ్చునని ఒప్పుకోవడానికి మేము పూర్తిగా సంసిద్ధంగానే వున్నాం. మిలిటరీ ఆవశ్యకత దృక్స్థానంనుండి భిన్నభిన్న అంతర్యుద్ధ రూపాలను విమర్శించ వచ్చునని మేము సుతరామూ ఒప్పుకుంటాం, ఈ ప్రశ్నలో నిర్ణయాత్మకమైన పర్యవసానాన్ని తేల్చ వలసినవారు ఆ యా ప్రత్యేక స్థలాల్లో పనిచేస్తూవున్న సోషల్-డెమోక్రాటిక్ దైనందిన కార్య కర్తలేనని కూడా మేము బేషరతుగా అంగీకరిస్తాం. కాని అరాచకవాదం, బ్లాంకీజం, టెరరిజం అని ఊకదంపుడు కబుర్లవల్లా, పసలేని వుత్తుత్త మాటలవల్లా అంతర్యుద్ధ పరిస్థితుల విశ్లేషణను దాటవేయకూడదనీ, సాధారణంగా గెరిల్లాచర్యలో సోషల్-డెమోక్రాటిక్ పార్టీ పాల్గొనడనమనే ప్రశ్నను చర్చించేటప్పుడు, ఏదో పోలిష్ సోషలిస్టు పార్టీకి చెందిన ఆర్గనైజేషను[90] ఒకటి ఎప్పుడో ఒక ఫలానా తరుణమందు అవలంబించిన అసందర్భపు గెరిల్లా యుద్ధాన్ని ఒక బూచిగా ఉపయోగించ కూడదని మాత్రం మార్క్సిజం మూలసూత్రాల పేరిట మేము బేషరతుగా డిమాండు చేస్తున్నాం.

గెరిల్లా యుద్ధం ఉద్యమాన్ని డిజార్గనైజ్డ్‌గా చేసివేస్తుందనే వాదనను మనం విమర్శనాత్మకంగా పర్యాలోచించాలి. ప్రతికొత్త పోరాటరూపమూ, కొత్త ప్రమాదాలూ కొత్త త్యాగాలూ దానిని అనుగమించుతూనే వుండడంచేత, ఈ కొత్త పోరాటరూపానికి తయారుగాలేని ఆర్గనైజేషన్లను అది "డిజార్గనైజ్డ్‌గా" చేసివేయడం తప్పనిసరే అవుతుంది. మన పాత ప్రచార సర్కిల్స్, కొత్త ఆందోళనా విధానాలను అవలంబించాల్సి వచ్చినందువల్ల డిజార్గనైజయాయి. ప్రదర్శనలు అవలంబించడం వల్ల మన కమిటీలు తదుపరి డిజార్గనైజయాయి. ఏ యుద్ధంలోనైనా సరే, మిలిటరీ చర్య ప్రతీదీ సైనికశ్రేణులను కొంతవరకూ డిజార్గనైజు చేసివేస్తుంది. దీని అర్థం యుద్ధం చెయ్యకూడదని కాదే. యుద్ధం చేయడం ఎలాగో నేర్చుకోవాలి. ఇదే అంతానూ.

"అరాచవాదులం, దొంగలం, దారిదోపిడిగాండ్రం కాము మేం; వీటన్నిటికీ మేము అతీతులం; గెరిల్లా యుద్ధాన్ని మేము తిరస్కరిస్తాం" అని సోషల్-డెమోక్రాట్లు గర్వంగానూ ఆత్మసంతృప్తితోనూ ప్రకటించుకుంటూండడం నేను చూచినప్పుడు — తాము యేమంటూవున్నదీ ఈ మనుషులు అర్థం చేసుకుంటున్నారా? అని నాలో నేను ప్రశ్నించుకుంటాను. నల్లదండు ముఠాల ప్రభుత్వానికీ ప్రజలకీ మధ్య దేశమంతటా సాయుధ సంఘర్షణలూ, యుద్ధాలూ జరుగుతూనే వున్నాయి. ప్రస్తుత విప్లవాభివృద్ధి దశలో ఇది కేవలమూ అనివార్యమైన దృగ్విషయం. సాయుధ సంఘర్షణల, దాడుల ద్వారా అయత్నకృతంగానూ అనా

ర్గనైజ్డ మార్గంలోనూ — కాగా సరిగ్గా ఈ కారణం మూలాన్నే తరుచు దురదృష్టకరమూ, దుష మూ అయిన రూపాల్లో — ప్రజ ఈ దృగ్విషయానికి ప్రతిక్రియ సాగించుతూంది. మన ఆర్గనైజేషనుయొక్క బలహీనత, అసంసిద్ధత కారణంగా ఫలానా చోట ఫలానా తరుణ మప్పుడు ఈ అయత్నకృత పోరాటానికి మనం పార్టీ నాయకత్వాన్ని ఇవ్వకపోవడమును నేను అర్థం చేసుకోగలను. ఈ ప్రశ్న స్థానిక దైనందిన కార్యకర్తల చేతనే పరిష్కరించబడాలనీ, బలహీనంగానూ అనాయత్తంగానూ వున్న ఆర్గనైజేషన్లను తిరిగి మలచుకోవడం అంత సుల భమైన విషయం కాదనీ నేను అర్థం చేసుకోగలను. కాని ఈ అనాయత్తం పట్ల విచారం వెలి బుచ్చకుండా, అందుకు బదులు ఆత్మసంతృప్తితో గర్వపడుతూ, అరాచకము, బ్లాంకీజం, టెరరిజములను గురించి తొలి కౌమారంలో కంఠస్థం చేసిన పదజాలాన్నే పునశ్చరణచేసే ధోరణిని వెలిబుచ్చుతూన్న సోషల్-డెమోక్రాటిక్ సిద్ధాంతకర్తను గాని, పత్రికావ్యాసకర్తను గాని నేను చూసినప్పుడు మాత్రం, ప్రపంచంకల్లా ఉన్నతోన్నతమైన విప్లవ సిద్ధాంతానికి ఈ అధోగతి పట్టినందుకు నాకెంతో బాధగా వుంటుంది.

గెరిల్లా యుద్ధం వర్గచైతన్యవంతుడైన శ్రామికుడిని అధోగతిలో వున్నట్టి తాగు ముచ్చు, దేశదిప్పకాయ స్థానంతో సమానం చేస్తుందని చెప్పడం కద్దు. ఇది నిజమే. ఏకైక, లేదా ప్రధాన పోరాట సాధనంగా గెరిల్లా యుద్ధాన్ని శ్రామికవర్గ పార్టీ ఎన్నటికీ భావించదనే దీని అర్థం; ఈ సాధనం ఇతర సాధనాల చేతికింద వుండాలనీ, ప్రధాన పోరాట సాధనాలకు తగినట్టు వుండాలనీ, విజ్ఞానదాయకమైనట్టీ ఆర్గనైజు అయినట్టీ సోషలిజం యొక్క ప్రభా వంచే ఉదాత్తం కాబడాలనీ దీని అర్థం. కాగా ఈ చివరి షరతు లేనిదే, బూర్జువా సమాజం లోని అన్ని, నిశ్చయంగా అన్ని, పోరాట సాధనాలు శ్రామికవర్గాన్ని దానిపైనను, దాని కిందను వున్న భిన్నభిన్న శ్రామికవర్గేతర స్తరాలతో సమానం చేసివేస్తుంది; కాగా ఘటనలయొక్క అయత్నకృత గమనానికే వదలిపెట్టేసి నట్టయితే, బూర్జువా సమాజంలోని అన్ని పోరాట సాధనాలు మొద్దుబారిపోయి, అవినీతిపాలై దుష్ట వినియోగాలకు లోనవుతాయి. సమ్మెలను ఘటనలయొక్క అయత్నకృత గమనానికే వదలిపెట్టేసి నట్టయితే, అవి "Alliances"గా — వినిమయదార్లకు వ్యతిరేకంగా కార్మికులకూ యజమానులకూ మధ్య ఒప్పందాలుగా — చెడిపోతాయి. "జాతీయ స్వేచ్ఛ," "లిబరలిజం," "ప్రజాస్వామ్యం," "రిపబ్లిక్ విధానం," క్లెరికలిజంవ్యతిరేకతత్వం, సోషలిజం, ఇంకా అన్ని ఇతర అమ్మకపు సరుకులనూ టోకుగానూ చిల్లరగానూ బూర్జువావర్గపు రాజకీయవేత్తలు తమ తుచ్ఛ స్వార్థప్రయోజనాలకోసం తెగనమ్ముకొనే వ్యభిచార గృహం కిందకి పార్లమెంటు దిగజారిపోతుంది. వార్తాపత్రిక బహి రంగ తార్పుడుకత్తెగా ప్రజారాసులను చెడగొట్టేటట్టి, ముక్రడిమూకల నీచప్రవృత్తులు వగైరా వగైరాలను ప్రోత్సహించేటట్టి, సాధనం కింద భ్రష్టుపడుతుంది. శ్రామికవర్గాన్ని

తన కంటె కొద్దిగా పైన, కొద్దిగా దిగువనూ వున్నట్టి స్తరములనుండి చైనాగోడలాగున వేరుచేయగల్గేటట్టి సార్వజనీన పోరాట సాధనాలేవీ సోషల్-డెమోక్రసీకి తెలియవు. భిన్నభిన్న శకాలలో భిన్నభిన్న సాధనాలను, వాటిని ఎంచడంలో మాత్రం, ఎల్లప్పుడూ నిశితంగా నిర్వచించబడినట్టి భావశాస్త్రీయమైనట్టి అర్గనైజేషనాత్మకమైనట్టి షరతులచే వాటి యోగ్యతలను సోషల్-డెమోక్రసీ నిర్ణయించుతూ ప్రయుక్తం చేస్తూంటుంది.*

## IV

యూరప్‌లోని బూర్జువా విప్లవాలతో పోల్చిచూస్తే రష్యన్ విప్లవంలో పోరాట రూపాల విశిష్టత, వాటి బృహత్తర వైవిధ్యంలో ప్రస్ఫుటమవుతూంది. భవిష్యత్తు విప్లవం (బహుశ రష్యాను మినహాయించి మాత్రం, అని అతడు చేర్చాడు) అంతగా ప్రభుత్వానికీ ప్రజలకీ మధ్య పోరాటంగా కాకుండా, ప్రజల్లోనే రెండు భాగాల మధ్య పోరాటంగా వుంటుందని 1902 లోనే కౌట్స్కీ చెప్పడంలో అతడు పాక్షికంగా జోస్యమే చెప్పాడు. ఈ రెండవ పోరాటపు విస్తృతాభివృద్ధే పాశ్చాత్యంలో బూర్జువా విప్లవాలలో కంటె, రష్యాలోనే నిస్సందేహంగా మన కళ్లముందు జరుగుతూంది. ప్రజలలో మన విప్లవ శత్రువుల సంఖ్య అతి స్వల్పమే, కాని పోరాటం అంతకంతకు మరింత తీవ్రతర మవుతూన్నకొద్దీ, అంతకు మరిం

---

* గెరిల్లా కార్యాలంటే వుత్తపుణ్యానికే పడి చస్తారని బోల్షెవిక్ సోషల్-డెమోక్రాట్లను తరుచు నిందించుతూ వుంటారు. అందుచేత గెరిల్లా కార్యాలపై తీర్మానపు ముసాయిదాలో (''పార్తీయ్‌నియె ఇజ్వేస్తియ,'' 2 వ సంచిక; కాంగ్రెస్‌పై లెనిన్ ఇచ్చిన నివేదిక), బోల్షెవిక్‌లలో గెరిల్లా కార్యాలను సమర్థించే భాగం వాటి గుర్తింపుకై ఈ కింది షరతులు సూచించిందని ఇక్కడ జ్ఞప్తికి తీసుకురావడం అసమజసం కానేరదు: ఎట్టి సందర్భంలోనూ ప్రైవేటు ఆస్తి ''దోపిడీ''ని అనుమతించకూడదు; ప్రభుత్వ ఆస్తి ''దోపిడీ''ని అనుమతించవచ్చునని సిఫార్సు చేయకపోయినా, ఒప్పుకోవచ్చు, కాని ఇందుకు ఒక షరతు వుండాలి: ఇది పార్టీ ఖాయిదాకిందనే జరగాలి, కాగా వాటివల్ల వచ్చే ఆదాయం ఉపప్లవ అవసరాలకోసమే వినియోగించబడాలి. పాశవికులైన ప్రభుత్వోద్యోగులపైన, నల్లదండు ముఠాలలో క్రియాశీలురైన సభ్యులపైన టెరరిస్టు రూపంగల గెరిల్లాక్రియలు సిఫార్సు చేయబడవచ్చును, కాని ఇందుకు షరతులు ఏమిటంటే: 1) ప్రజారాసుల మనస్థితిని లెక్కలోకి తీసుకోవాలి; 2) ఫలానాస్థలంలోని కార్మికవర్గ ఉద్యమంయొక్క పరిస్థితులను పరిగణలోకి తీసుకోవాలి, కాగా 3) శ్రామికవర్గ శక్తులు వ్యర్థం కాకుండా జాగ్రత్త పడాలి. ఈ ముసాయిదాకీ ఐక్యతా

తగా వీరు ఆర్గనైజు అవుతూ బూర్జువావర్గంలోని అభివృద్ధి నిరోధక స్తరాలనుండి వత్తాసు అందుకుంటున్నారు. ఇందుచేత ఇటువంటి శకంలో, జాతివ్యాపితమైన రాజకీయ సమ్మెల శకంలో, బహుస్వల్ప కాలవ్యవధులకే, బహుస్వల్ప పరిధులుగల ప్రదేశాలకే పరిమితములైన గతకాలపు వ్యక్తిగత క్రియల రూపాల్ని ఉపప్లవం ధరించజాలక పోవడం కేవలం ప్రకృతి సిద్ధమూ అనివార్యమూ కూడానూ. యావత్తు దేశాన్నీ చుట్టివేస్తూతూన్నట్టి ఒక సుదీర్ఘ మైన అంతర్యుద్ధంయొక్క మరింత ఉన్నత, మరింత సంక్లిష్ట రూపాన్ని, అనగా ప్రజలలో రెండు విభాగాల మధ్య సాయుధ పోరాటరూపాన్ని, ఉపప్లవం ధరించడం కేవలం ప్రకృతి సిద్ధమే. సాపేక్షంగా దీర్ఘకాల వ్యవధులలో స్వల్పసంఖ్యలో జరిగే పెద్ద సాయుధ చర్యల పరం పరగా మాత్రమే, ఈ కాలవ్యవధులలో అధికసంఖ్యలో జరిగే చిన్నచిన్న సంఘర్షణలుగా మాత్రమే తప్ప సమరాన్ని ఇతర రూపంలో భావించుకోడానికి వీల్లేదు. ఇదీలా వున్నప్పుడు — ఇది నిస్సంశయంగా ఇలాగే వుంది కూడా — ఈపెద్దసాయుధ చర్యలలోనూ, సాధ్యమైనంత వరకూ ఈ చిన్న సంఘర్షణలలోనూ కూడా, ప్రజారాసులను నడిపించడానికి ఉత్తమోత్తమంగా అనుకూలించేటట్టి ఆర్గనైజేషన్లను సృష్టించడం తమ కర్తవ్యంగా సోషల్-డెమోక్రాట్లు తప్పనిసరిగా భావించాల్సి వుంటుంది. అంతర్యుద్ధ స్థాయిని చేరుకునేటంతగా వర్గపోరాటం తీవ్రతచెందిన శకంలో, ఈ అంతర్యుద్ధంలో పాల్గొనడమే కాకుండా, దానిలో నాయకత్వపు పాత్రను వహించడం కూడా తమ కర్తవ్యంగా సోషల్-డెమోక్రాట్లు తప్పనిసరిగా భావించాల్సి వుంటుంది. శత్రుబలాలకు నష్టం కల్గించడంలో ఒక్క అవకాశాన్నయినా జారవిడవని యుద్ధాన్ని సాగించుతూన్న ఒక పక్షంగా పనిచేసే వాస్తవ సామర్థ్యం కల్గినవిగా తమ ఆర్గనైజేషన్లను సోషల్-డెమోక్రాట్లు తర్ఫీదుచేసి సన్నద్ధం చేయాల్సి వుంటుంది.

ఇది కష్టమైన కర్తవ్యమే, కాదనడానికి ఎంత మాత్రమూ వీల్లేదు. దీనిని తక్షణమే సాధించ వీలుపడదు. ప్రజలు ఏలాగున పునః శిక్షణ పొందుతున్నారో, అంతర్యుద్ధ గమనంలోనే యుద్ధం చేయడం ఏలాగు నేర్చుకుంటున్నారో ఆలాగే ఈ కర్తవ్య నిర్వహణకై, అనుభవాల వల్ల నేర్చుకోవలసిన గుణపాఠాలకు అనుగుణ్యంగా మన ఆర్గనైజేషన్లు కూడా శిక్షణ పొందాలి, పునర్నిర్మితమవాలి.

ఏదో ఒక పోరాట రూపాన్ని కృత్రిమంగా సృష్టించి, దానిని దైనందిన ఆచరణ జరుపుతూన్న కార్యకర్తల నెత్తిపైరుద్దే ఉద్దేశముగాని, రష్యాలో అంతర్యుద్ధంయొక్క సాధా రణ గమనంలో ఒక ప్రత్యేక పాత్ర వహించాలని మా అధ్యయనం మందిరంనుండే మేము అసలు నిర్ణయించే ఉద్దేశముగాని మాకు ఈషణ్మాత్రమూ లేదు. సోషల్-డెమోక్రసీలో

---

కాంగ్రెస్‌లో అంగీకరించబడిన తీర్మానానికీ ఆచరణలో వున్న భేదమల్లా ప్రభుత్వ ఆస్తి "దోపిడీలు" అంగీకరించబడక పోవడంలో మాత్రమే వుంది, అంతకు తప్ప మరే భేదమూ లేదు.

ఒక ధోరణి సూచిస్తూన్నట్టు, ప్రత్యేకంగా ఏ గెరిల్లా కృత్యాలనూ నిర్దిష్టంగా విలువకట్టే ఉద్దేశం మాకు అసలు లేదు. కాని ఆచరణాత్మక జీవితం ప్రభవించుతూన్నట్టి కొత్త పోరాట రూపాలను యథార్థతతో సైద్ధాంతికంగా విలువకట్టడంలో సాధ్యమైనంత వరకు ఒక పర్యవసానానికి వచ్చేందుకు సాయపడడం మా కర్తవ్యంగా మేము భావించుతున్నాం. కొత్తదైనట్టీ, కష్టమైనట్టీ ఒక సమస్యను సరిగా సూత్రీకరించడంలోనూ వర్గచైతన్యవంతులైన కార్మికులకు ఆటంకాలుగా ఏర్పడుతూన్నట్టి మూసకట్టు భావాలతోనూ దురభిమానాలతోనూ నిర్దాక్షిణ్యంగా పోరాడడం మా కర్తవ్యమని మేము భావించుతున్నాం.

సెప్టెంబరు 1906.

# ఎల్. కూగెల్‌మన్ పేర కె. మార్క్స్ రాసిన లేఖల రష్యన్ అనువాదానికి పీఠిక

జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ వారపత్రిక “Neue Zeit” లో ప్రచురితమైనట్టి కూగెల్‌మన్ పేర మార్క్స్ రాసిన లేఖల పూర్తిసంకలనాన్ని ఒక ప్రత్యేక ప్రచురణగా వెలువరించడంలో, మార్క్స్‌తోనూ మార్క్సిజంతోనూ రష్యన్ ప్రజానీకాన్ని మరింత సన్నిహితంగా పరిచయం చేయడమే మా ఉద్దేశం. మార్క్స్ ఉత్తరప్రత్యుత్తరాల్లో విశేష స్థలం వ్యక్తిగత విషయాలకు వినియోగించబడడం సహజమే. జీవితచరిత్ర రచయితకు ఇవి అమూల్యమైన మూలాధారాలు. కాని సాధారణంగా విస్తృత ప్రజానీకానికీ, ప్రత్యేకంగా రష్యన్ కార్మికవర్గానికీ, ఉత్తరప్రత్యుత్తరాలలోని సైద్ధాంతిక, రాజకీయ విషయసామగ్రి వున్న ఖండాలే అపారమైన ప్రాధాన్యతను కలిగివున్నాయి. మనకు, విప్లవాత్మక శకంలో జీవించుతూన్న మనకు, కార్మికోద్యమంలోనీ, ప్రపంచ రాజకీయాలలోనీ అన్ని ప్రశ్నలకు సూటిగా ప్రతిక్రియ సల్పిన పురుషునిగా మార్క్స్‌ను సాక్షాత్కరింప జేస్తూన్నట్టి విషయసామగ్రిని అధ్యయనం చేయడం మరీ ప్రత్యేకంగా విజ్ఞానదాయకం. ‘‘మహా పరిభ్రమణ పరిస్థితులలో తమ భావాలనూ సంకల్పాలనూ రూపొందించుకున్న పురుషుల మూర్తిమత్వంతో పరిచయం చేసుకున్నప్పుడు మనం ఉదాత్తులం అవుతాం’’ అని “Neue Zeit” సంపాదకులు అనడం ఎంతైనా సముచితంగా వుంది. ఇటువంటి పరిచయం 1907 లో జీవించుతూన్న రష్యన్ సోషలిస్టుకు ద్విగుణీకృతంగా ఆవశ్యకం, ఎందుచేతనంటే తన దేశం అనుభవించిన ప్రతి విప్లవంలోనూ సోషలిస్టుల తక్షణ కర్తవ్యాలను గురించి మిక్కిలి విలువైన సూచనలు అనేకములను అతనికి ప్రసాదించుతూంది. సరిగా ఈ క్షణంలో ఒక ‘‘మహా పరిభ్రమణా’’న్ని రష్యా అనుభవించుతూంది. సాపేక్షంగా తుపాను సంవత్సరాలే అయిన 1860 లలో మార్క్స్ సూచించిన విధానం, ప్రస్తుత రష్యన్ విప్లవంలో సోషల్-డెమోక్రాట్ అవలంబించాల్సిన విధానానికి సరాసరి సమూనాగా మిక్కిలి తరుచుగా ఉపయోగపడాల్సి వుంటుంది.

ఇందువల్ల మార్క్స్ ఉత్తరప్రత్యుత్తరాల్లో సిద్ధాంత దృష్ట్యా ప్రత్యేక ప్రాముఖ్యతను వహిస్తున్నట్టి ఖండాలనే ఇక్కడ మనం సంగ్రహంగా సూచించి, శ్రామికవర్గ ప్రతినిధిగా ఆయన విప్లవాత్మక విధానం గురించి మరింత సవివరంగా ప్రస్తావించుతాం.

మార్క్సిజాన్ని మరింత సమగ్రంగానూ ప్రగాఢంగానూ అవగాహన చేసుకోడానికీ, 1868 జూలై 11 వ తేదీగల లేఖ (42 వ పుట, తరవాయి పుటలు) ప్రధానాసక్తిని కలిగి వుంది. అపభ్రంశ ఆర్థికవాదులకు వ్యతిరేకంగా వాగ్వాద వివరణల రూపంలో, "శ్రమ" విలువ సిద్ధాంతమని పిలువబడుతూన్న తన అవగాహనను మార్క్స్ అత్యంత భావగర్భితంగా విశదీకరిస్తున్నాడు. "పెట్టుబడి" గ్రంథం అధ్యయనంలో బహుస్వల్ప శిక్షణ మాత్రమే కల్గిన పాఠకుల మనస్సులలో మార్క్సీయ విలువ సిద్ధాంతంపై సహజంగానే ఏ ఆక్షేపణలైతే తలెత్తుతాయో, "ప్రొఫెసర్‌గిరీ" బూర్జువా "విజ్ఞానశాస్త్రం"యొక్క సామాన్య ప్రతిని ధులచే తదేకంగా పునశ్చరణ చేయబడుతున్నాయో, అచ్చంగా ఆ ఆక్షేపణలనే ఈ లేఖలో మార్క్స్ క్లుప్తంగానూ అద్భుతమైన తేటతనంతోనూ విశ్లేషించుతున్నాడు. విలువ నియమాన్ని విశదీకరించేందుకు తాను అవలంబించినట్టీ, అవలంబించ వలసినట్టీ మార్గాన్ని మార్క్స్ ఇక్కడ చూపుతున్నాడు. అత్యంత సామాన్యమైన ఆక్షేపణలను తార్కాణాలుగా తీసుకుంటూ ఆయన తన పద్ధతిని బోధిస్తాడు. "గందరగోళాన్ని శాశ్వతపరచడమే" లక్ష్యంగా పెట్టు కున్నట్టి "పాలకవర్గాల ప్రయోజనాలకూ", విలువ సిద్ధాంతంలాంటి స్వచ్ఛంగా (పైకి అలాగే కనబడుతూన్నట్టి) సైద్ధాంతికమైన, అనిర్దిష్టమైన ప్రశ్నకూ గల సంబంధాన్ని ఆయన స్పష్టంగా విప్పిచెబుతాడు. మార్క్సునూ "పెట్టుబడి" గ్రంథాన్నీ పఠించ నారంభించిన ప్రతివారూ, "పెట్టుబడి" గ్రంథం మొదటి ప్రకరణాన్నీ, అత్యంత జటిల ప్రకరణాలనూ తొలిసారిగా అధ్యయనం చేస్తూన్నప్పుడు ఈ లేఖను పునః పునః తప్పక చదువుతారనే ఆశించుదాం.

మార్క్స్ భిన్నభిన్న రచయితలపై తీర్పులు చెబుతూనట్టి ఖండాలు, సిద్ధాంత దృష్ట్యా అత్యంత ఆసక్తిదాయకములు. సజీవంగా ఉద్రేకపూరితంగా వర్ణించబడి, మహత్తర భావశాస్త్ర ప్రవాహాలలోనూ వాటి విశ్లేషణలలోనూ ప్రగాఢమైన ఉత్సుకతను ప్రదర్శించు తూన్నట్టి ఈ మార్క్సీయ అభిప్రాయాలను మనం చదువుతూన్నప్పుడు ప్రతిభాసమన్వి తుడై మహనీయ భావుకుని నోటిమాటలను మనం చెవులార వింటున్నామనే అనుకుంటాం. డీట్స్‌గెన్‌పై ఆయన ప్రాసంగికంగా చేసిన సూచనలు అటుండగా, ప్రూడనిస్టులపై ఆయన వ్యాఖ్యానాలు (17 వ పుట) పాఠకుడు శ్రద్ధగా గమనించతగినవి. సామాజిక వెల్లువల సమ యాలలో "శ్రామికవర్గం"లోకి గభాలున దూకేటట్టీ, కార్మికవర్గ దృక్పథాన్ని అలవర్చు కునే సామర్థ్యమూ, శ్రామికవర్గ ఆర్గనైజేషన్లలోని "సామాన్య శ్రేణి సభ్యులమధ్య" పట్టు

విడుపులులేనట్టీ గంభీరమైనట్టి కృషి సాగించగలిగే శక్తీ లేనట్టీ "ఉజ్వలమతులైన" యువక బూర్జువా మేధావులను కొద్దిమాటల్లో కళ్లకుకట్టేటట్టు ప్రస్ఫుటంగా ఆయన చిత్రించుతాడు.

తొమ్మిదేళ్ల తరువాత ఎంగెల్స్ (మార్క్సుతో కూడా కలిసి) రచించిన ప్రసిద్ధి గాంచిన "Anti-Dühring" ["డ్యూరింగ్ సిద్ధాంత ఖండన"] గ్రంథంలోని విషయాలను ముందుగానే ఎదురుచూచి చెబుతూందేమో అనిపించేటట్టుగా డ్యూరింగ్‌పై చేసిన వ్యాఖ్యానాన్ని (35 వ పుట) చూడండి. ఈ గ్రంథాన్ని త్సెదెర్‌బౌమ్ రష్యన్‌లోకి అనువదించాడు. కాని దురదృష్టవశాత్తూ ఈ అనువాదంలో అనేక వ్యవచ్ఛిన్నములే కాకుండా, తప్పులు కూడా వుంటూ కేవలం లోపభూయిష్ఠంగా వుంది. ఈ గ్రంథంలో కూడా రికార్డో గ్రంథంలో త్యూనెన్‌పై వ్యాఖ్య వుంది, ఈ వ్యాఖ్య రికార్డో అద్దె సిద్ధాంతాన్ని కూడా తడుముతూంది. 1894 లో ప్రచురించబడినట్టి "పెట్టుబడి" గ్రంథం 3 వ సంపుటంలో అంతిమంగా ఖండించబడినట్టి — అపర బూర్జువావర్గీయుడూ, "నల్లదండు" మనిషి కూడా అయినట్టీ శ్రీ బుల్గాకొవ్ మొదలుకొని, "ఇంచుమించు సనాతనుడు" మాస్లొవ్ వరకూ — రివిజనిస్టులచే అచ్చంగా ఈనాటికి సహితమూ పునశ్చరణ చేయబడుతూన్న "రికార్డో పొరబాట్ల"ను అప్పటికప్పుడే 1868 లోనే మార్క్సు నిష్కర్షగా నిరాకరించాడు.

అపభ్రంశపు భౌతికవాదంపైనా, లాంగె ("ప్రొఫెసర్‌గరీ" బూర్జువా తత్వశాస్త్రానికి మామూలు మూలాధారం!) నుండి నకలు తయారు చేయబడినట్టి "మిడిమిడి జ్ఞానపు వెర్రిమొర్రి ప్రేలుడు" పైనా చెప్పిన తీర్పుతో సహా, బ్యూఖ్నర్‌పై వ్యాఖ్య కూడా ఆసక్తి జనకమే. (48 వ పుట.)

ఇక మార్క్సు విప్లవాత్మక విధానాన్ని పరిశీలించుదాం. రష్యాలోని మన సోషల్-డెమోక్రాట్లలో మార్క్సిజం గురించి ఒక విధమైన పెట్టీబూర్జువా భావం ఒకటి ఆశ్చర్యం కల్గించేంతటి విస్తృత వ్యాప్తిలో వుంది. ఈ భావం ప్రకారం, విశిష్టపోరాట రూపాలనూ ప్రత్యేకమైన శ్రామికవర్గ కర్తవ్యాలనూ కలిగివున్నట్టి ఒక విప్లవాత్మక కాలావధి ఇంచుమించు ఒక వైపరీత్యమే అయివుండగా, "రాజ్యాంగమూ," "అత్యంతతీవ్ర ప్రతిపక్షమూ" సూత్రబద్ధములైనవట. రష్యాలో వున్నట్టుగా ఈ క్షణమందు ప్రపంచంలో ఇంతప్రగాఢమైన విప్లవాత్మక సంక్షోభం మరి ఏ ఇతర దేశంలోనూ లేదు — విప్లవం పట్ల ఇంతటి సంశయాత్మక అల్పబుద్ధితత్వ వైఖరి అవలంబించేటట్టి (మార్క్సిజాన్ని చులకనచేసి, అపభ్రంశపరిచేటట్టి) "మార్క్సిస్టులూ" మరి ఏ ఇతర దేశంలోనూ కనబడరు. విప్లవం విషయం బూర్జువాతత్వయుతమైనది అనే సంగతి వాస్తవమే అయివుండగా, ఈ సంగతి నుండి వీరు విప్లవం యొక్క చలనశక్తి బూర్జువావర్గమే, విప్లవంలో శ్రామికవర్గానివి సహాయకారి కర్త

వ్యాలే కాని స్వతంత్ర కర్తవ్యాలు కావు, ఈ విప్లవానికి శ్రామికవర్గ నాయకత్వం అసాధ్యం అనే మిడిమిడి జ్ఞానపు పర్యవసానం తేల్చుతున్నారు!

ఈ విధంగా మిడిమిడి జ్ఞానంతో మార్క్సిజానికి భాష్యం చెప్పడమును కూగెల్‌మన్‌కి రాసిన లేఖలో మార్క్స్ ఎంతో నిశితంగా బయటబెట్టుతున్నాడు! 1866 ఏప్రిల్ 6 వ తేదీ లేఖ చూడండి. అప్పటికి మార్క్స్ తన ఉద్గ్రంథం పూర్తిచేశాడు. ఈ లేఖ రాయ డానికి పూర్వం పద్నాలుగేళ్లకు ముందుగానే, 1848 జర్మన్ విప్లవంపై తన తుది తీర్పు అప్ప టికే చెప్పేశాడు. సోషలిస్టు విప్లవం 1848 లో ఆసన్నమవుతూండినదని తనకుండిన సోష లిస్టు భ్రాంతులు తప్పు అని 1850 లో తానే రుజుచేశాడు. కాగా 1866 లో, కొత్త రాజ కీయ సంక్షోభాలు పరిపక్వం చెందుతున్నాయని గమనించడం అతడు ప్రారంభించిన మొద ట్లోనే అతడు ఇలా రాస్తాడు:

''హాప్స్‌బుర్గ్‌ల వంశస్థులనూ హోహెన్‌జోలెర్న్‌ల వంశస్థులనూ తొలగించివేసే విప్లవం లేనిదే, మరొక ముప్ఫై సంవత్సరాల సంగ్రామం చిట్టచివరకు జరిగి తీరుతుందని మన అల్పబుద్ధులు'' (జర్మన్ బూర్జువా లిబరల్స్ గురించి అతడంటున్నాడు) ''ఎప్పుడు గ్రహి స్తారో కదా!..'' (13–14 పుటలు.)

రానున్న విప్లవం (మార్క్స్ అనుకున్నట్టు ఇది అడుగునుంచి కాకుండా, పైనుండే జరిగింది) బూర్జువావర్గాన్నీ పెట్టుబడిదారీ విధానాన్నీ తొలగించి వేస్తుందనే భ్రమయొక్క ఛాయ సహితమూ ఎక్కడా కనబడదు ఇందులో, అందుకు బదులు ఈ విప్లవం కేవలం ప్రష్యన్, ఆస్ట్రియన్ ఏకరాజాధిపత్యాలను మాత్రమే తొలగించుతుందని స్పష్టంగా వుంది. కాగా ఈ బూర్జువా విప్లవంలో అతనికి ఎంత నమ్మకమో కదా! సోషలిస్టు ఉద్యమ ప్రగతికి బూర్జువా విప్లవం ఎంతటి మహత్తర ప్రాముఖ్యతను కలిగివుంటుందో గ్రహించిన శ్రామికవర్గ యోధుని విప్లవోత్సాహం ఎంత ఉగ్రంగా వుందో కదా!

మూడేళ్ల తరువాత, ఫ్రాన్సులో నెపోలియన్ సామ్రాజ్య పతన సాయంతనమందు, ''ఒక అత్యంత ఆసక్తిజనకమైన'' సామాజికోద్యమంపై తన దృష్టి సారించుతూ, ''రానున్న నూతన విప్లవ కార్యకలాపానికి తాము తయారుకావడం కోసమని తమ ఇటీవలి విప్లవాత్మక గతాన్ని పారిస్ వాసులు యథావిధిగా అధ్యయనం చేస్తున్నారు,'' అని నిస్సంశయ మైన ఉత్సాహంతో అంటాడు మార్క్స్. కాగా గతాన్ని ఈ విధంగా అధ్యయనం చేయడంలో బయల్పడిన వర్గపోరాటాన్ని వర్ణించుతూ మార్క్స్ ఇలా పర్యవసానం తేల్చుతాడు (56 వ పుట): ''మంత్రకత్తెల యావత్ చారిత్రక భాండమూ కుతకుత మరుగుతూందన్నమాట! ఈ స్థితికి మన దేశం (జర్మనీ) ఎప్పుడొస్తుందో కదా!''

ఇలాంటి గుణపాఠాన్ని సంశయతత్వంతో నీర్సపడి, పాండిత్యప్రకాండపు బేడిజంతో మొక్కవోయి, పశ్చాత్తప్తపు సన్యాసాలపై మోజుకల్గి, విప్లవమంటే బహుత్వరితగతిని అలసట చెందేటట్టీ, విప్లవాన్ని ఎప్పుడు పూడ్చిపెట్టి దాని స్థానే రాజ్యాంగబద్ధమైన వచనకావ్యాన్ని ఎప్పుడు వెలయించుతామా అనే పండుగ ఉత్సాహంతో తహతహ పడుతూన్నట్టి రష్యన్ మేధావులు మార్క్స్ నుండి నేర్చుకోవాలి. విప్లవం మీద విశ్వాసం, తుదివరకూ తన తక్షణ విప్లవాత్మక కర్తవ్యాలకై స్థిరంగా నిలబడాల్సిందని కార్మికవర్గానికి పిలుపు ఇవ్వగల్గే సామర్థ్యం, తాత్కాలిక విప్లవ వైఫల్యాలకు రాగాలు పెట్టుతూ బేజారెత్తిపోని దృఢసంకల్పం — వీటిని శ్రామికవర్గ సిద్ధాంతకర్త నుండీ, శ్రామికవర్గ నాయకుడి నుండీ వారు నేర్చుకోవాలి.

ఇదంతా వుత్త నీతిశాస్త్రపు ఉకదంపు అనీ, కాల్పనికతత్వమనీ, వాస్తవికతాభావరహితమనీ మార్క్సిస్టు పండితప్రకాండులు అనుకుంటారు! అయ్యా, ఎంత మాత్రమూ కాదు! విప్లవాత్మక సిద్ధాంతమూ, విప్లవాత్మక విధానం — రెండింటి మిళితమూ ఇది, ఇది లేనిదే బ్రెంటానోతత్వం, స్ట్రూవెతత్వం, సోంబార్ట్‌తత్వమూ కిందకి మార్క్సిజం దిగజారిపోతుంది. వర్గపోరాటం యొక్క సిద్ధాంతాన్నీ ఆచరణనూ ఒక అవిభాజ్యమైన సమైక్యతగా మార్క్సిజం బంధించి వేసింది. బాహ్యగతాత్మక పరిస్థితిని స్థిరబుద్ధితో ప్రదర్శించుతూన్నట్టి సిద్ధాంతాన్ని, ఇప్పుడు అస్తిత్వాన్ని కలిగినట్టి వ్యవస్థను సమర్థించడం కింద వికృతపరిచేటట్టీ, ప్రతి తాత్కాలిక విప్లవక్షీణానికీ వీలైనంత త్వరగా సర్దుకుపోవడానికి సహా ప్రయత్నించుతూ, వీలైనంత త్వరగా "విప్లవాత్మక భ్రమలను" వదలించేసుకుని, "వాస్తవికత"కు తాసికమాసికలు వేసే వ్యవహారం వైపు తిరిగిపోయేటట్టీ మార్క్సిస్టు మార్క్సిస్టే కాదు.

అత్యంత శాంతియుతమైనట్టీ, మార్క్స్ చెప్పినట్టు పైకి "ప్రశాంతవ్యవస్థగా" కనబడేటట్టీ, ("Neue Zeit" చెప్పినట్లూ) "దౌర్భాగ్యపు నిస్తబ్ధతను" ప్రదర్శిస్తూన్నట్టీ కాలాల్లో, విప్లవం త్వరలో సమీపిస్తూందనే సంగతి పసికట్టి, శ్రామికవర్గాన్ని దాని పురోగామి విప్లవ కర్తవ్యాలపట్ల చైతన్యం కల్గేటట్టు పురికొల్పగల్గాడు మార్క్స్. మార్క్సిజాన్ని అల్పబుద్ధుల్లాగు అపభ్రంశ పరుస్తూన్న మన రష్యన్ మేధావులు, అత్యంత విప్లవాత్మక కాలాల్లో నిష్క్రియా విధానాన్నీ, "ప్రవాహానికి" లొంగిపోయి కొట్టుకొనిపోయే విధానాన్నీ, ఫాషనబుల్ లిబరల్ పార్టీలో వున్నట్టి ఏమాత్రమూ నిలకడలేని మూలద్రవ్యాలకు పిరికితనంతో వత్తాసు ఇచ్చే విధానాన్నీ శ్రామికవర్గానికి బోధిస్తున్నారు!

మార్క్స్ చేసిన కమ్యూన్ ప్రశస్తి కూగెల్‌మన్‌కి రాసిన లేఖలకు మకుటాయమానంగా వుంది. కుడి పక్షపు రష్యన్ సోషల్-డెమోక్రాట్ల విధానాలతో సరిపోల్చిచూస్తే, ఈ ప్రశస్తి ప్రత్యేకంగా ఎంతో అంత అమూల్యమైనది. "ఆయుధాలను చేపట్టి వుండకూడదు" అని 1905 డిసెంబరులో గుండె బేజారెత్తిపోయిన ప్లెహానొవ్, మార్క్స్‌తో

తన్నుతాను సరిపోల్చి చూచుకునే నిగర్వం ప్రదర్శించాడు. 1870 లో జరిగిన విప్లవానికి మార్క్స్ కూడా బ్రేకు వేశాడని అర్థమిచేటట్టి ధ్వని ఒకటి ప్లెహానొవ్ మాటలో వుంది.

అవును, ఆ విప్లవానికి మార్క్స్ కూడా బ్రేకువేశాడు. కాని ప్లెహానొవ్ తనంతట తానే తీసుకొచ్చిన ఈ సాదృశ్యంలో తనకీ మార్క్స్‌కీ మధ్య ఎంతటి బ్రహ్మాండమైన అగాథం వుందో కదా.

1905 నవంబరులో, మొదటి విప్లవ తరంగం తన శిఖరస్థాయి అందుకుంటుందనగా ఒక నెలరోజులకు ముందు, ప్లెహానొవ్ శ్రామికవర్గాన్ని నిష్కర్షగా హెచ్చరిక చేయకపోవడం అటుండగా, మీదుమిక్కిలి శ్రామికవర్గం ఆయుధాల ఉపయోగం నేర్చుకోవడమూ, ఆయుధాలను చేపట్టడమూ అవసరమని నిశ్చితంగా చెప్పాడు. అయినప్పటికీ, ఒక నెలరోజులు తరువాత విప్లవం ప్రజ్వరిల్లే సరికి, దాని ప్రాముఖ్యతనూ, చారిత్రక ఘటనల సాధారణ గమనంలో దాని పాత్రనూ, పోరాటంయొక్క గతరూపాలతో దానికున్న సంబంధాన్నీ విశ్లేషించేందుకు ఈషణ్మాత్రమూ ప్రయత్నించకుండానే, పశ్చాత్తప్తుడై క్షమాభిక్షకై వేడుకుంటూన్న మేధావి పాత్ర ధరించడానికి ఇతడు ఉబలాట పడుతూ: "ఆయుధాలను చేపట్టి వుండకూడదు," అని అన్నాడు.

1870 సెప్టెంబరులో, కమ్యూన్‌కు ఆరు నెలలు ముందు, మార్క్స్ ఫ్రెంచి కార్మికులను నిశ్చితంగా హెచ్చరిక చేశాడు. ప్రఖ్యాతిచెందిన ఇంటర్నేషనల్‌కి ప్రారంభ నివేదికలో ఉపప్లవం తెలివితక్కువ అవుతుంది అని అతడు చెప్పాడు. 1792 భావాలుగల్గిన ఒక ఉద్యమం సాధ్యతను గురించిన జాతీయతత్వపు భ్రమలను అతడు మున్ముందుగానే బయట పెట్టాడు. ఘటన జరిగిన తరువాత కాకుండా, అనేక నెలలు ముందుగానే "ఆయుధాలను చేపట్టడ కూడదు" అని చెప్పడం ఎలాగో అతడు తెలుసుకున్నాడు.

కాగా, తానిదివరకే సెప్టెంబరులో ఉద్ఘాటించినట్టి ఈ ఆశారహితమైన కార్యానికి 1871 మార్చిలో ఆచరణాత్మకమైన రూపురేఖలు ఏర్పడడం ఆరంభమైనప్పుడు అతడే విధంగా ప్రవర్తించాడు? కమ్యూన్‌కు నాయకత్వం వహించిన తన శత్రువులు ప్రూడన్ అనుచరులపైనా, బ్లాంకీ అనుచరులపైనా ఒక చరుపు చరచడానికి ఒక అవకాశం కింద దీనిని అతడు (డిసెంబరు ఘటనలను ప్లెహానొవ్ వినియోగించుకున్నట్లు) వినియోగించుకున్నాడా? "నేను ముందే మీతో చెప్పాను, ముందే మిమ్మల్ని హెచ్చరించాను; మీ కాల్పనిక తత్వానికీ, మీ విప్లవాత్మక ప్రలాపాలకీ ఫలితం ఇదే మరి!" అని బడిలో పంతులమ్మలాగ వాళ్లను చివాట్లు పెట్టడం మొదలెట్టాడా? "ఆయుధాలను చేపట్టి వుండకూడదు," అని ఆత్మసంతృప్తితో అల్పబుద్ధితో బోధించే ధర్మోపన్యాసంలాగ డిసెంబరు యోధులకు ప్లెహానొవ్ బోధించినట్టు, కమ్యూనార్డులకు ధర్మోపన్యాసం బోధించాడా?

లేదు. 1871 ఏప్రిల్ 12 న కూగెల్‌మన్ పేర ఉత్సాహపూరితమైన లేఖ — ప్రతి రష్యన్ సోషల్-డెమోక్రాట్ ఇంట్లోనూ, అక్షరాస్యుడైన ప్రతి రష్యన్ కార్మికుని ఇంట్లోనూ పటం కట్టించి వుంచాల్సిందని మేము కోరుతూన్న లేఖ — రాశాడు మార్క్స్.

1870 సెప్టెంబరులో మార్క్స్ ఆ ఉపప్లవాన్ని తెలివితక్కువ అని అన్నాడు, కాని 1871 ఏప్రిల్‌లో ప్రజల రాశి ఉద్యమాన్ని అతడు చూసిన తరువాత, చారిత్రక విప్లవోద్యమంలో ముందంజ సూచించుతూన్న మహత్తర ఘటనలలో తాను పాల్గొంటున్నట్టుగా అతడు దానిని నిశితదృష్టితో గమనించాడు.

ఉద్యోగిపారిపాలనా-సైనిక యంత్రాంగాన్ని కేవలం ఒకరి చేతిలో నుండి ఇంకొకరి చేతులోకి మార్చడం కాకుండా, దానిని ధ్వంసంచేయించేందుకు యత్నమే ఇది అని అతడంటాడు. కాగా ప్రూడన్ అనుచరుల, బ్లాంకీ అనుచరుల నాయకత్వాన నడిచినట్టి "వీరులైన" పారిస్ కార్మికులకు అతడు నిజమైన మంగళహారతులు గానంచేశాడు. అతడు ఇలా రాస్తాడు: "ఈ పారిస్ వాసులలో ఎంతటి ఉసులుబాటు, ఎంతటి చారిత్రాత్మకమైన చొరవ, ఎంతటి త్యాగనిరతి!" (88 వ పుట)... "ఇటువంటి మహనీయతతో సరితూగగల దృష్టాంతం ఇంకొకటి చరిత్రలో లేదు."

మార్క్స్ అన్నిటికంటె గొప్పగా భావించేది ప్రజారాసుల చారిత్రాత్మకమైన చొరవ. ఆహా, 1905 అక్టోబరు డిసెంబరులలో రష్యన్ కార్మికుల రైతుల చారిత్రాత్మకమైన చొరవను ఏలాగున ప్రస్తుతించడమో మార్క్స్‌నుండి మన రష్యన్ సోషల్-డెమోక్రాట్లు నేర్చుకుంటే ఎంత బాగుండునో కదా!

ఉద్యమ వైఫల్యాన్ని ఆరునెలలు ముందుగానే తెలుసుకొన గల్గినట్టి గంభీర భావుకుడు ప్రజారాసుల చారిత్రాత్మకమైన చొరవకు అర్పించిన జోహారు — ఇక ఇటువైపు నిర్జీవమైనట్టి జడమైనట్టి పాండిత్య బేడిజ పూరితమైనట్టి: "ఆయుధాలను చేపట్టి వుండ కూడదు," అనే మాటలు! ఆ మాటలకీ ఈ మాటలకీ స్వర్గానికీ భూమికీ వున్నంత వ్యత్యాసం లేదూ?

రాశి పోరాటంలో పాల్గొంటున్న వ్యక్తిగా, ఆ పోరాటం పట్ల తనకు స్వాభావికమైన ఉత్సాహోద్రేకంతో ప్రతిక్రియ సల్పిన మార్క్స్, "స్వర్గాన్నే జయించుకొనసంసిద్ధులై వుండి" "తెలివితక్కువ తెగువరులైన" పారిస్ వాసుల తక్షణ చర్యలను తాను లండన్‌లో ప్రవాస జీవితం గుడుపుతూ విమర్శించ పూనుకున్నాడు.

ఆహా, 1906–1907 లో రష్యాలోని మార్క్సిస్టులలో విప్లవాత్మక కాల్పనికతత్వాన్ని ఈసడించుతూన్నట్టి మనకాలపు "వాస్తవికతత్వపు" పండితమ్మన్యులు ఆనాడు ఉండినట్టయితే మార్క్స్‌ను వారు ఎలా వెక్కిరించి వుండేవారో కదా! స్వర్గాన్ని జయించే "యత్నానికి"

నివాళులెత్తే భౌతికవాది, ఆర్థికవేత్త, ఊహాజగత్తుల బద్ధవైరిని వాళ్లు ఎలా దూషించి వుండేవారో కదా! ఆయన తిరుగుబాటు ధోరణులకూ, ఆయన ఊహాజగన్నిర్మాణతత్వం వగైరా వగైరాలకూ, స్వర్గాన్ని జయించే ఉద్యమాన్ని అతడు ప్రస్తుతించినందుకూ, అతనిమీద ఈ మఫ్లర్ చుట్టుకున్న మనుష్యులు[91] ఎన్ని కన్నీళ్లు, ఎన్ని అభిజాతపు నవ్వులు, ఎంతటి జాలి ఒలకబోసేవారో కదా!

విప్లవాత్మక పోరాటం ఉన్నతరూపాల నిర్వహణ కౌశలాన్ని చర్చించడానికి భయపడే ఎరచేపలకున్న జ్ఞానతేజస్సుతో[92] మార్క్స్ విరాజిల్లలేదు. ఉపప్లవ సాంకేతిక సమస్యలను గురించే మార్క్స్ సరాసరి చర్చిస్తాడు. ఎదురుదాడికి పూనుకోవడమా, లేక దాడిని కాచుకోవడమా? — అని ప్రశ్నిస్తాడు, కేవలం లండన్ శివార్లలో సైనికచర్యలు జరుగుతూన్నట్టు. ఇక ముమ్మాటికీ ఎదురుదాడికి పూనుకోవడమే అని నిశ్చయించి, అంటాడు: "వెంటనే వెర్సెయిల్స్ మీదకి పురోగమించాలి..."

ఇలా రాసినది 1871 ఏప్రిల్‌లో, మహత్తరమైనట్టి ఆ రక్తమయమైన మే మాసానికి కొద్ది వారాలకు ముందు...

"వెంటనే వెర్సెయిల్స్ మీదకి పురోగమించాలి" — స్వర్గాన్నే జయించే "తెలివితక్కువను" (సెప్టెంబరు 1870 లో) ప్రారంభించిన ఉపప్లవకారులు.

తాము హస్తగతం చేసుకున్న స్వేచ్ఛలను లాగివేయడానికి జరిగిన ప్రథమ యత్నాలను వారు బలప్రయోగంచేసి ప్రతిఘటించేందుకు 1905 డిసెంబరులో వారు "ఆయుధాలను చేపట్టి వుండకూడదు..."

అవును, తనను మార్క్స్‌తో పూరికినే సరిపోల్చి చూచుకున్నాడా మరి ప్లెహానొవ్!

"రెండవ పొరపాటు," అంటాడు మార్క్స్, తన సాంకేతిక విమర్శను సాగించుతూ: "కేంద్రకమిటీ (సైనిక అధిష్ఠానవర్గం — బాగా గుర్తుపెట్టుకోండి — నేషనల్ గార్డ్ యొక్క కేంద్రకమిటీ అన్నమాట) తన అధికారాన్ని మరీ ముందుగా అప్పగించివేసింది..."

అకాలపు తిరుగుబాటు కూడదని నాయకులను హెచ్చరిక చేయడమేలాగో మార్క్స్‌కు తెలుసు. కాని స్వర్గాన్ని జయించడానికి యత్నిస్తూన్న శ్రామికవర్గం పట్ల అతని వైఖరి, కార్యాచరణలో సలహాదారుడు అవలంబించే వైఖరి, ప్రూడన్, బ్లాంకీల తప్పుడు సిద్ధాంతాలూ, పొరపాట్లూ ఎలా వున్నప్పటికీ, యావత్తు ఉద్యమాన్ని అంతకంటె మరొక ఉన్నత దశకు తీసుకొనిపోతూన్న ప్రజారాసుల పోరాటంలో పాల్గొంటూన్న వ్యక్తి అవలంబించే వైఖరి.

"తథాపి," అతనింకా ఇలా రాస్తాడు, "ప్రస్తుతపు పారిస్ తిరుగుబాటు — గతకాలపు సమాజంలోని తోడేళ్లూ, పందులూ, వూరకుక్కలూ దానిని అణగదొక్కేసి నప్పటికీ కూడా —జూన్ ఉపప్లవం నాటినుండి మన పార్టీ జరిపిన కార్యాలన్నిటిలోనూ మహోజ్జ్వలమైన కార్యం."

కాగా కమ్యూన్ చేసిన పొరపాట్లలో ఒక్క దానినైనా శ్రామికవర్గం నుండి దాచకుండా, ''స్వర్గం'' కోసం చేసే యుద్ధంలో ఈ రోజుకి సహితమూ ఉత్తమోత్తమ మార్గదర్శిగానూ లిబరల్, రాడికల్ ''పందులకు'' భయంకరమైన బూచిగానూ ఉపయోగపడుతూన్న రచనను ఈ మహత్కార్యానికి అంకితం చేశాడు మార్క్స్.[93]

కాడెట్లకు బైబిల్‌తో సమానమైన ''రచన''ను, డిసెంబరుకు అంకితం చేశాడు ప్లెహానొవ్.

అవును. తనను మార్క్స్‌తో పూరికినే సరిపోల్చి చూసుకున్నాడా మరి ప్లెహానొవ్.

కూగెల్‌మన్ మార్క్స్‌కి జబాబురాస్తూ ఈ విషయం నిరర్థకమైనదేమోననీ, కాల్పనికతత్వంకంటె వాస్తవికతత్వమే వాంఛనీయమనీ సూచించుతూ కొన్ని శంకలు వేసినట్టు కనబడుతుంది — ఏమైతేనేమి కమ్యూన్‌న్ని, ఒక ఉపప్లవాన్ని, 1849 జూన్ 13 న పారిస్‌లో జరిగిన శాంతియుత ప్రదర్శనతో సరిపోల్చుతాడు కూగెల్‌మన్ ఆ జబాబులో.

వెంటనే (1871 ఏప్రిల్ 17 న) కూగెల్‌మన్‌న్ని గట్టిగా చివాట్లు పెడతాడు మార్క్స్.

''అమోఘమూ అనుకూలమూ అయిన అవకాశాల షరతుపైనే పోరాటం చేపట్టినట్టయితే ప్రపంచ చరిత్రను నిర్మించడం అతి సులభమే,'' అని అతడు రాస్తాడు.

1870 సెప్టెంబరులో ఉపప్లవాన్ని తెలివితక్కువ అన్నాడు మార్క్స్. కాని ప్రజారాసులు లేవగానే, వారితో కలిసి తాను కూడా సాగిపోవాలనీ, పోరాట ప్రక్రియలోనే గుణపాఠాలు నేర్చుకుందామనీ మార్క్స్ వాంఛించాడే కాని, అధికారదర్పంతో ధర్మోపన్యాసాలు కావించడానికికాదు. సంపూర్ణమైన సునిశితతో విజయావకాశాలను ముందుగానే లెక్కకట్టడానికి యత్నించడం కేవలం కపటవైద్యమే, వట్టి పండిత భేషజమే అవుతుందని అతడు గ్రహించుతాడు. ప్రపంచ చరిత్ర నిర్మించడంలో వీరోచితంగానూ త్యాగనిరతితోనూ కార్మికవర్గం చొరవ తీసుకుంటూన్న విషయానికే అతడు అన్నిటికంటే హెచ్చువిలువ ఇచ్చాడు. అవకాశాలన్నిటినీ అమోఘంగా ముందుగానే లెక్కకట్టే స్థితిలో లేకపోయినప్పటికీ, ప్రపంచ చరిత్ర నిర్మాతల దృష్టితోనే ప్రపంచచరిత్రను మార్క్స్ వీక్షించాడే కాని, ''వారు... చేపట్టి వుండకూడదని... సులభంగానే ముందుగా తెలుసుకొని వుండొచ్చు,'' అని నీతులుచెప్పే అల్పబుద్ధి దృష్టితో కాదు.

ప్రజారాసులకు ఇంకా శిక్షణ ఇచ్చి, వెనువెంటనే రానున్న పోరాటానికై వారికి మరింత హెచ్చుగా తర్ఫీదివ్వడానికిగాను, ఆశారహితమైన ఉద్యమంలో సహితమూ ప్రజారాసుల నిరాశాజనితమైన పోరాటం ఆవశ్యకమయే ముహూర్తాలు చరిత్రలో వుంటాయని సహితమూ మార్క్స్ గ్రహించగల్గాడు.

భవిష్యత్తును సృష్టించడంలో అతని సామర్థ్యాన్ని కాకుండా, గతకాలంపై అతను చేసిన మదింపునే ఎరవు తెచ్చుకుందుకు మార్క్స్ నామోచ్చారణ కావించేటట్టి ఈనాటి కుహనా మార్క్సిస్టులకు ఈ విధంగా ప్రశ్నను ప్రదర్శించడం, వారి బుద్ధికి కేవలం అగ్రాహ్యంగానూ, సూత్రానికి అన్యంగా సహితమూ వుంటుంది. 1905 డిసెంబరు తరువాత "బేకువేయడానికి" ప్రయత్నించ పూనుకున్నప్పుడు సహితమూ ప్రశ్నను ఈ విధంగా ఆలోచించనే ఆలోచించలేదు ప్లెహానొవ్.

ఉపప్లవం తెలివితక్కువ పని అని 1870 సెప్టెంబరులో తానే భావించిన విషయం ఏ మాత్రమూ మరచిపోకుండానే, అచ్చంగా ఈ ప్రశ్నే వేస్తున్నాడు మార్క్స్.

"యుద్ధానికి దిగుతారా, లేక పోరాటం లేకుండానే నాశనమైపోతారా? — అనే సవాలును వెర్సెయిల్స్‌లోని బూర్జువా ముక్కిడిమూకలు పారిస్ ముందు ఉంచారు," అని అతడు రాస్తాడు. "రెండవ సందర్భమే జరిగివుంటే, నాయకులు ఎంతమందైనా నాశనమైపోవడం కంటె కార్మికవర్గపు మనోనిబ్బరం దెబ్బతినడమే మరింత గొప్ప దురదృష్టమే అయివుండేది."

కాగా దీనితో, శ్రామికవర్గ గౌరవానికి తగినట్టి, కూగెల్‌మన్ పేర రాసిన లేఖలలో మార్క్స్ బోధిస్తున్నట్టి విధానంపై సంక్షిప్త సమీక్షను మనం ముగించుదాం.

"స్వర్గాన్ని జయించ"గల సామర్థ్యం తవకుందని రష్యాలోని కార్మికవర్గం ఇదివరకే ఒకసారి రుజువు చేసింది, మళ్లీ మరొకసారే కాదు అనేకసార్లు రుజువుచేస్తుంది.

ఫిబ్రవరి 5, 1907.

# "జె. పిహెచ్. బెకెర్, జె. డీట్జ్గెన్, ఎఫ్. ఎంగెల్స్, కె. మార్క్స్ తదితరులు ఎఫ్. ఎ. సోర్గె తదితరుల పేర రాసిన లేఖలు" అనే గ్రంథం రష్యన్ అనువాదానికి పీఠిక

రష్యన్ ప్రజానీకానికి సమర్పించబడినట్టి మార్క్స్, ఎంగెల్స్, డీట్జ్గెన్, బెకెర్, తదితర గతశతాబ్ది అంతర్జాతీయ కార్మికోద్యమ నాయకుల లేఖల సంకలనం, మన పురోగామి మార్క్సిస్టు సారస్వతానికి అత్యావశ్యకమైన అనుబంధం.

సోషలిజం చరిత్రకూ మార్క్స్, ఎంగెల్స్ల క్రియాకలాపాలను సమగ్రంగా పరిశీలించేందుకూ ఈ లేఖల ప్రాముఖ్యతను గురించి మేము ఇక్కడ సవివరంగా ప్రస్తావించ దలచుకో లేదు. ఈ అంశం గురించి వివరణ అవసరమే లేదు. ఇప్పుడు ప్రచురితమయిన లేఖలను అవగాహన చేసుకుందుకు, ఇంటర్నేషనల్ యొక్క చరిత్రపై రచించబడిన ప్రధాన గ్రంథాలతోనూ (చూ. Jekk: "ది ఇంటర్నేషనల్," "జ్నానియె" ప్రచురణలో రష్యన్ అనువాదం), జర్మన్, అమెరికన్ కార్మికోద్యమాల చరిత్రలోనూ (చూ. ఎఫ్ ఆర్. మేరింగ్; "జర్మన్ సోషల్-డెమొక్రసీ చరిత్ర," మోరిస్ హిల్క్విట్: "యునైటెడ్ స్టేట్స్లోని సోషలిజం చరిత్ర"), ఇతర రచనలతోనూ పరిచయం అవసరమవుతుంది.

ఈ ఉత్తరప్రత్యుత్తరాలలోని విషయాలను స్థూలంగా రేఖామాత్రంగానైనా చిత్రించ ప్రయత్నించడం గాని, ఉత్తరప్రత్యుత్తరాలకు సంబంధించిన భిన్నభిన్న చారిత్రక కాలావధుల స్వభావాలను పరిశీలించడం గాని ఇక్కడ మా ఉద్దేశం కాదు. ఈ కార్యాన్ని "Der Sorgesche Briefwechsel" ("Neue Zeit", 25 Jahrg., Nr. 1 und 2*) అనే శీర్షికగల తన వ్యాసంలో మేరింగ్ చాలా చక్కగా నిర్వర్తించాడు; ఈ వ్యాసాన్ని, ప్రస్తుత గ్రంథం ప్రకాశకులు ఈ అనువాదానికి అనుబంధంగా గాని, లేదా ఒక విడి ప్రచురణగా గాని రష్యన్లో బహుశా వెలువరించవచ్చు.

---

* "సోర్గె ఉత్తరప్రత్యుత్తరాలు," "నోయె సైట్" 25 వ సాంవత్సరిక సంపుటం, 1,2 సంచికలు. — సం.

సుమారు ముప్పై య్యేళ్ళుగా (1867–1895) మార్క్స్, ఎంగెల్స్‌లు సాగించిన క్రియాకలాపాల సన్నిహితాంశాలతో పరిచయం చేసుకోవడం వల్ల, సమరశీలమైన శ్రామికవర్గం తెల్సుకోవలసిన గుణపాఠాలు ప్రస్తుత విప్లవాత్మక కాలావధిలో జీవించుతూన్న రష్యన్ సోషలిస్టులకు ప్రత్యేకమైన ఆసక్తిని కల్గించుతాయి. అందుచేత, సోర్గె పేర మార్క్స్, ఎంగెల్స్‌లు రాసిన లేఖలను పాఠకులకు పరిచయం చేసేందుకు మన సోషల్-డెమోక్రాటిక్ సారస్వతంలో కావించిన మొదటి యత్నాలు, రష్యన్ విప్లవంలోని సోషల్-డెమోక్రాటిక్ ఎత్తుగడల "అత్యవసర" వివాదాంశాలతో (ప్లెహానొవ్ "సొవ్రెమేన్నయ జీజ్న్,"[94] మెన్షెవిక్ "ఒత్క్లికి"[95]) ముడిపడివుండడంలో ఆశ్చర్యమేమీ లేదు. కనుకనే రష్యాలోని కార్మికుల పార్టీయొక్క ప్రస్తుత కర్తవ్యాల దృష్ట్యా ప్రత్యేక ప్రాముఖ్యతను కలిగివున్నట్టి ఇప్పుడు ప్రచురితమైన ఉత్తరప్రత్యుత్తరాలలోని ఖండాల విలువను మా పాఠకుల దృష్టికి తీసుకురావడం మా ఉద్దేశం.

బ్రిటిష్-అమెరికన్, జర్మన్ కార్మికోద్యమాల అత్యవసర సమస్యలను గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు వారి లేఖలలో అతి తరుచుగా ప్రస్తావించారు. ఇది సహజమే, ఎందుచేతనంటే ఆకాలంలో వారు ఇంగ్లండులో నివసిస్తున్న జర్మన్లు అవడంచేత, తమ అమెరికన్ కామ్రేడ్లతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూండేవారు. ఫ్రెంచి కార్మికోద్యమం పైనా, ముఖ్యంగా పారిస్ కమ్యూన్ పైనా మరీ తరుచుగానూ మరింత సవివరంగానూ, జర్మన్ సోషల్-డెమోక్రాట్ కూగెల్‌మన్‌కు రాసిన లేఖల్లో* మార్క్స్ తన అభిప్రాయాలు వ్యక్తపరుస్తూండేవాడు.

మార్క్స్, ఎంగెల్స్‌లు బ్రిటిష్-అమెరికన్ కార్మికోద్యమాల గురించి చెప్పిన దానితో వారు జర్మన్ కార్మికోద్యమంతో చెప్పినదానిని సరిపోల్చి చూడడం అత్యంత విజ్ఞానదాయకంగా వుంటుంది. ఇటు జర్మన్, అటు బ్రిటన్, అమెరికాల పెట్టుబడిదారీ విధానాల అభివృద్ధిలో వివిధ దశలనూ, ఈ దేశాల యావత్తు రాజకీయ జీవితం పైనా ఒక వర్గంగా బూర్జువా వర్గపు అధికార ప్రాబల్యం యొక్క వివిధ రూపాలనూ వ్యక్తపరుస్తున్నాయన్న విషయాన్ని మనం దృషి లో వుంచుకున్నట్టయితే, ఈ సాదృశ్యం మరింత ప్రాముఖ్యతను వహించుతుంది. భౌతికవాద గతితర్కానికి చక్కని మచ్చుతునకను విభిన్న రాజకీయ, ఆర్థిక పరిస్థితుల నిర్దిష్ట ప్రత్యేకతలతో ప్రయుక్తం చేసేందుకు సమస్యయొక్క వివిధ విషయాలనూ వివిధ ఆకృతులనూ ముందుకు తీసుకొచ్చి వొత్తిచూపే సామర్థ్యాన్ని మనమిక్కడ గమనిస్తున్నాం. కార్మికుల

---

* చూ. "డాక్టర్ కూగెల్‌మన్ పేర కె. మార్క్స్ రాసిన లేఖలు" ఎన్. లెనిన్ సంపాదకత్వాన సంపాదకుని పీఠిక, సెయింట్ పీటర్స్‌బర్గ్ 1907. (చూ. ఈ సంకలనం. పుట. 190 – సం.)

పార్టీయొక్క ఆచరణీయ విధానం, ఎత్తుగడల దృష్ట్యా, వివిధ దేశాలలోని జాతీయ కార్మికోద్యమాల వివిధ దశలను అనుసరించి సమరశీలమైన శ్రామికవర్గం అవలంబించాల్సిన కర్తవ్యాలను "కమ్యూనిస్టు ప్రణాళిక" సృష్టలు ఏలా నిర్వచించారో అందుకొక మచ్చుతును కను మనమిక్కడ గమనిస్తున్నాం.

మార్క్స్, ఎంగెల్స్‌లు బ్రిటిష్-అమెరికన్ సోషలిజాన్ని అత్యంత నిశితంగా విమర్శిస్తున్నది కార్మికోద్యమం నుండి అది విడిపోవడమే. మార్క్సిజాన్ని ఒక మతసూత్రంగా, "కరడుకట్టిన (starre) ప్రామాణిక మతం"గా దిగజార్చేశారనీ, అది ఒక మత చిహ్నం, అంతేగాని కార్యాచరణకు మార్గదర్శి కాదు" అని వారు దానిని పరిగణించుతున్నారనీ, వారి సరసనే ముందుకు సాగిపోతూన్నట్టి, సైద్ధాంతికంగా నిస్సహాయ స్థితిలో వున్నప్పటికీ సజీవమై శక్తివంతంగా వున్న రాశి కార్మికోద్యమంతో కలిసి పనిచేసేందుకు వారు అసమర్థులనీ వారిపై మోపేనిందే, బ్రిటన్‌లోని సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్ (Social-Democratic Federation)[96] పైనా అమెరికన్ సోషలిస్టులపైనా వారు చేసిన వ్యాఖ్యానాలన్నిటి సారాంశం. "మా కార్యక్రమాన్ని బహిరంగంగా అంగీకరించే వారితో మాత్రమే మేము కలిసి పనిచేస్తామని 1864 నుండి 1873 వరకు మనం భీష్మించుకుని కూచుండినట్టయితే మనం ఈనాడు ఎక్కడ వుండేవారమో?" అంటూ తాను 1887 జనవరి 27 న రాసిన లేఖలో ఎంగెల్స్ తన ఆశ్చర్యభావం వెలిబుచ్చుతాడు. ఇంతకు ముందు రాసిన మరొక లేఖలో (1886 డిసెంబరు 28న), అమెరికన్ కార్మికవర్గంపై హెన్రీ జార్జ్ భావాల ప్రభావం గురించి ప్రస్తావించుతూ, అతడిలా అంటాడు:

> "సిద్ధాంతరీత్యా ఆక్షేపణారహితమైన కార్యక్రమానికి ఒక లక్ష వోట్లకంటె, యథార్థమైన ("bona fide") కార్మికపార్టీకి రానున్న నవంబరులో ఇరవై ముప్పై లక్షల వోట్లు రావడం మనకీక్షణంలో ఎంతో అంత అమూల్యమైన విషయం."

ఇవి అమిత ఆసక్తిని కల్గించే ఖండాలు. "కార్మిక కాంగ్రెస్" అనే భావాన్నో, లేదా లారిన్ ప్రతిపాదించిన "విశాలమైన కార్మిక పార్టీ"[97] లాంటి స్వభావం కలిగిన మరిదేనినో సమర్థించేందుకు ఈ ఖండాలను ఉపయోగించుకుందుకు తహతహపడే సోషల్-డెమోక్రాట్లు మన దేశంలో వున్నారు. ఎంగెల్స్‌ను ఈవిధంగా ఆదరా బాదరా "ఉపయోగించుకునే వాళ్లను": "వామపక్షపు సంఘటనను సమర్థించడానికి ఎందుకు ఉపయోగించకూడదు?" అని మేము ప్రశ్నిస్తున్నాం. ఈ ఉల్లేఖనలను ఎత్తి ఉదహరించిన లేఖలు, ఎన్నికలప్పుడు హెన్రీ జార్జ్

కోసం అమెరికన్ కార్మికులు వోటుచేసిన కాలానికి సంబంధించినవి. హెన్రీ జార్జ్‌పై అమూలాగ్రమైన విమర్శ చేయమని ఎంగెల్స్‌ను మిసెస్ విష్నెవేత్స్కీయ — అమెరికన్ స్త్రీ, రష్యన్‌ని పెళ్లిచేసుకుంది, ఈమె ఎంగెల్స్ రచనలను అనువదించింది — అతనిని కోరినట్టు ఆమెకు అతడు రాసిన జబాబునుబట్టి తెలుస్తూంది. ఇందుకు సమయం ఇంకా ఆసన్నం కాలేదనీ, ఒక స్వచ్ఛమైన కార్యక్రమంపైన కాకపోయినప్పటికి సహితమూ, కార్యక్రమమంటూ ఒక దానిపైన కార్మికుల పార్టీని రూపొందించడమునకు ఉపక్రమించడమే ఉత్తమమనీ ఎంగెల్స్ (1886 డిసెంబరు 28 న) రాస్తాడు. కొంతకాలం తరువాత, అసలు లోపం ఏమిటో వాళ్లే తెలుసుకుని, "తమ పొరపాట్లనుండి తామే గుణపాఠాలు నేర్చుకుంటారు," కాని కార్మికుల పార్టీని జాతీయంగా దృఢపరచుకునే కార్యాన్ని — ఏ కార్యక్రమం పైనైనా సరే ఫరవా లేదు — ఆలస్యం చేయగల్గేటట్టిది, లేదా ఆ కార్యానికి అవరోధం కల్గించగల్గేటట్టిది, ఏదైనా సరే గొప్ప పొరపాటనే నేను భావిస్తాను..."

సోషలిస్టు దృక్స్థానంనుండి చూసినప్పుడు, హెన్రీ జార్జ్ భావాల కేవల అసంగతాన్నీ, అభివృద్ధి నిరోధక స్వభావాన్నీ ఎంగెల్స్ సహజంగానే సంపూర్ణంగా అర్థంచేసుకుని, పదే పదే ఎత్తిచూపించేవాడు. సోర్గె ఉత్తరప్రత్యుత్తరాల్లో, 1881 జూన్ 20 తేదీగల కారల్ మార్క్స్ రాసినట్టి లేఖ అత్యంత ఆసక్తిదాయకమైనది; హెన్రీ జార్జ్‌ని రాడికల్ బూర్జువా వర్గం యొక్క భావశాస్త్రవేత్తగా కారల్ మార్క్స్ ఈ వుత్తరంలో నిరూపిస్తాడు. "సిద్ధాంత రీత్యా ఈ మనిషి కేవలమూ వెనకబడిన మనిషి" (total arrière) అని రాస్తాడు మార్క్స్. అయినప్పటికీ, ప్రజారాసులను "తమ స్వయంకృతాపరాధాల ఫలితాలు" గురించి హెచ్చరించ గలిగే మనుషులు వున్నంత కాలమూ, ఎన్నికలలో ఈ అపర సోషలిస్టు అభివృద్ధి నిరోధకునితో కలవడానికి ఎఫ్. ఎంగెల్స్ భయపడ లేదు (ఎంగెల్స్, 1886 నవంబరు 29 తేదీగల లేఖ).

"శ్రమ వీరులు" (Knights of Labour), ఆనాటి అమెరికన్ కార్మికుల ఆర్గనైజేషన్లలో ఒకదానిగురించి అదే లేఖలో ఎంగెల్స్ ఇలా రాశాడు: "ఈ 'శ్రమ వీరుల'లో వున్న అత్యంత బలహీనమైన (మాతృకలో: కుళ్లి విచ్చిపోయినట్టి, faulste) అంశం వారి రాజకీయ తాటస్థ్యం..." "ఉద్యమంలోకి కొత్తగా ప్రవేశించే ప్రతి దేశమూ తీసుకోవాల్సిన గొప్ప మొదటంజ ఏమిటంటే, కార్మికులను ఒక స్వతంత్ర పార్టీగా, అది ఒక స్పష్టమైన కార్మికుల పార్టీగా, ఏవిధంగానైనా సరే, ఎల్లప్పుడూ నిర్మించడమే."

సోషల్-డెమోక్రసీ నుండి పార్టీరహితమైన కార్మిక కాంగ్రెస్ వగైరాలలోకి ఒక గంతు వేయడమును సమర్థించేది దేనినీ దీనినుండి పర్యవసానంగా తేల్చడానికి వీల్లేదని ప్రత్యక్షంగానే కనబడుతూంది. కాని, మార్క్సిజాన్ని ఒక "మత సూత్రం," "ప్రామాణిక మతం,"

''సెక్టేరియనిజం'', వగైరాలుగా దిగజార్చివేయడమనే ఎంగెల్స్ మోపిన నేరాన్నుండి తప్పించుకోజూచే ప్రతివ్యక్తీ, రాడికల్ ''సోషల్-అభివృద్ధి నిరోధకుల''తో కలిసి ఉమ్మడిగా ఎన్నిక సంగ్రామం సాగించడం ఒక్కొక్కప్పుడు అంగీకరించ వచ్చుననే దీనినినుండి పర్యవసానం తేల్చితీరాలి.

కాని ఈ అమెరికన్-రష్యన్ సారూప్యాలు (మన ప్రత్యర్థులకు జబాబు చెప్పడం కోసం వీటిని గురించి ప్రస్తావించాల్సి వచ్చింది) గురించిగాక, బ్రిటిష్-అమెరికన్ కార్మికోద్యమాల మౌలికమైన ఆకృతులు గురించి ప్రస్తావించడమే ఇంతకంటెనూ ఆసక్తిదాయకంగా వుంటుంది. ఈ ఆకృతులు ఏవంటే: శ్రామికవర్గాన్ని ఎదుర్కొంటూన్న గురుతర, జాతి వ్యాపిత ప్రజాస్వామిక కర్తవ్యాలు అనేవి అసలే లోపించడం: శ్రామికవర్గాన్ని బూర్జువా రాజకీయాలకు పూర్తిగా లోబరచివేయడం; శ్రామికవర్గం నుండి చిన్నచిన్న సోషలిస్టు గ్రూపులూ, బృందాలూ సెక్టేరియన్ పోకడతో వేరైపోవడం; ఎన్నికలలో సోషలిస్టులకు ప్రజారాసులలో ఈషణ్మాత్రపు విజయావకాశాలూ లేకపోవడం, వగైరాలు. ఈ మౌలిక స్థితిగతులను విస్మరించి, ''అమెరికన్-రష్యన్ సారూప్యాల'' నుండి విశాల పర్యవసానాలు తేల్చడానికి ఎవరైతే పూనుకుంటారో అట్టివారు అంతులేని తమ మిడిమిడి జ్ఞానాన్ని తామే బయటపెట్టుకుంటున్నారు.

ఇటువంటి స్థితిగతులలో కార్మికుల ఆర్థిక ఆర్గనైజేషన్ల గురించి ఎంగెల్స్ ఎందుకంతగా ఒత్తిచెబుతున్నాడంటే, అందుకు కారణం స్వచ్ఛమైన సోషలిస్టు కర్తవ్యాలను శ్రామికవర్గం ఎదుట వుంచుతూన్నట్టి అత్యంత దృఢతరంగా స్థిరపడిపోయిన ప్రజాస్వామిక వ్యవస్థల గురించే విషయం అంతా అయివుండడమే.

తప్పుడు కార్యక్రమంతోనైనా సరే స్వతంత్రమైన కార్మికుల పార్టీ యొక్క ప్రాముఖ్యత గురించి ఎంగెల్స్ ఎందుకు నొక్కిచెబుతున్నాడంటే, అందుకు కారణం ముఖ్యంగా రాజకీయాల్లో బూర్జువావర్గంచే దాని వెంటే లాగబడుతూండి, నేటికీ ఆలాగే లాగబడుతూన్న కార్మికవర్గాన్ని కలిగినట్టి, కార్మికుల రాజకీయ స్వాతంత్ర్య చిహ్నాల జాడలైనా ఇంతవరకూ లేనట్టి దేశాల గురించే ఎంగెల్స్ చెబుతూండడమే.

ఎక్కడైతే లిబరల్ భావాలుగల బూర్జువావర్గం తన సొంత పార్టీని నిర్మించుకొనక ముందే శ్రామికవర్గం తన సొంత పార్టీని నిర్మించుకుందో, ఎక్కడైతే శ్రామికవర్గం తన వోట్లను బూర్జువా రాజకీయవేత్తలకు ఇవ్వడమనే సంప్రదాయాన్ని అసలే ఎరగదో, ఏ దేశంలోనైతే తక్షణ కర్తవ్యాలు సోషలిస్టు కర్తవ్యాలు కాకుండా బూర్జువా-డెమోక్రాటిక్ కర్తవ్యాలే అయివుంటున్నాయో, అట్టి దేశాలకు, లేదా అట్టి చారిత్రాత్మక పరిస్థితులకు, ఇటు

వంటి వాదనలనుండి తేల్చిన పర్యవసానాలను ప్రయుక్తంచేసే యత్నం కేవలమూ మార్క్స్ యొక్క చారిత్రాత్మక విధానాన్ని అపహాస్యం చేయడమే అవుతుంది.

బ్రిటిష్-అమెరికన్ ఉద్యమాలపై ఎంగెల్స్ అభిప్రాయాలను జర్మన్ ఉద్యమంపై అతనికున్న అభిప్రాయాలతో సరిపోల్చిన యెడల పాఠకుడికి మా భావం మరింత స్పష్టమవుతుంది.

ఇప్పుడు ప్రచురితమైన ఉత్తరప్రత్యుత్తరాల్లో ఇటువంటి అభిప్రాయాలు, ఎంతో ఆసక్తిదాయకములైన అభిప్రాయాలు, కొల్లలుగా వున్నాయి. కాగా ఈ అభిప్రాయాలన్నిటి గుండా ఎర్రని పోగులా అవుపడుతూన్నట్టి కేవలం భిన్నమైన విషయం మరొకటి వుంది, అదేమిటంటే కార్మికుల పార్టీలో "కుడి పక్షానికి" వ్యతిరేకంగా ఒక హెచ్చరిక, సోషలిస్టు-డెమొక్రసీలోని అవకాశవాదంపై ఒక నిర్దాక్షిణ్యమైన (ఒక్కొక్కప్పుడు 1877–1879 లో మార్క్స్ సాగించినట్టి చండప్రచండ) యుద్ధం.

లేఖలనుండి ఉల్లేఖనలను ఎత్తిచూపడం ద్వారా మొదట దీనిని ధ్రువపరచి, తరువాత ఈ వాస్తవవిషయాన్ని మనం విలువకట్టుదాం.

మొట్టమొదటిది, హోయ్‌హెబెర్గ్ ప్రభృతులపై మార్క్స్ వ్యక్తపరచిన అభిప్రాయలను మనమిక్కడ గమనించాల్సి వుంది. అవకాశవాదులపై మార్క్స్ చేసిన దాడులనూ, ఎంగెల్స్ కూడా తరువాత చేసిన దాడుల జోరునూ తగ్గించివేయడానికి ఎఫ్. ఆర్. మేరింగ్ "Der Sorgesche Briefwechsel" ["సోర్గే ఉత్తరప్రత్యుత్తరాలు"] అనే శీర్షికగల తన వ్యాసంలో ప్రయత్నిస్తాడు – కాగా మా అభిప్రాయంలో, అతడు ఇంత తాపత్రయం ప్రదర్శించడం అనవసరం. ప్రత్యేకంగా హోయ్‌హెబెర్గ్ ప్రభృతుల విషయంలో, లాసాల్ పట్లా, లాసాల్ అనుయాయులు పట్లా మార్క్స్ అభిప్రాయం పొరపాటైనదని మేరింగ్ వాలాయించుతాడు. కాని, మనకిక్కడ ఆసక్తిదాయకమైనది ఫలానా ఫలానా సోషలిస్టులపై మార్క్స్ సాగించిన దాడులు సరైనవా, లేక అతిశయోక్తులతో కూడినవా అనే చరిత్రకు సంబంధించిన తీర్పుకాదు, మనకిక్కడ ఆసక్తిదాయకమైనది సాధారణంగా సోషలిజంలో నిష్కర్ష ధోరణులపై సూత్రదృష్ట్యా మార్క్స్ చేసిన తీర్పు.

జర్మన్ సోషల్-డెమొక్రాట్లు డ్యూరింగ్‌తోనూ లాసాల్ అనుచరులతోనూ చేసుకున్న రాజీల గురించి మార్క్స్ మెరపెట్టుకుంటూన్నప్పటికీ, (19 వ అక్టోబరు 1877 లేఖ) అదే సమయంలో, "సోషలిజానికి 'ఒక ఉన్నతమైన, ఆదర్శవంతమైన' రూపాన్ని ఇవ్వనుద్దేశించే, అనగా (దానిని ఉపయోగించేవారు అత్యంత శ్రమను వినియోగించి అధ్యయనం చేయాల్సినట్టి) దాని భౌతిక ప్రాతిపదిక స్థానే ధర్మం, స్వేచ్ఛ, సమానత్వం, fraternité (సౌభ్రాతృత్వం) అనే దేవతలతో నిండిన ఆధునిక పురాణాన్ని నెలకొల్ప నుద్దేశించే, సగం

ముదిరిన విద్యార్థుల, మిగల మగ్గిపోయిన డాక్టర్ పండితమ్మన్యుల'' (జర్మన్ భాషలో ''డాక్టర్'' పదం, మన ''కాండిడాత్'', లేక ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైన యూనివర్సిటీ పట్టభద్రుడితో సమానం) ''మూక అంతటితోనూ'' జర్మన్ సోషల్-డెమోక్రాట్లు చేసుకున్న రాజీని కూడా మార్క్స్ ఖండిస్తాడు. ఈ ధోరణికి 'Zukunft'* అనే మాసపత్రికను ప్రచురించుతూన్నట్టే, పార్టీలోకి తన ప్రవేశాన్ని 'కొనుక్కున్నట్టే,' – 'ఉదాత్తమైన ఉద్దేశాలతోనే' అని నేననుకుంటాను – కాని 'ఉద్దేశాలను' నేను చిల్లిగవ్వకిందైనా లెక్క చేయను – డాక్టర్ హ్యోహబెర్గ్ ప్రతినిధి. ఇతగాడి 'Zukunft' కార్యక్రమంలాంటి అధ్వాన్నమైన కార్యక్రమం ఇంతకు మించిన 'నిగర్వమైన విశ్వాసం'తో ప్రపంచంలో ఇంతవరకూ అవతరించి వుండలేదు'' (70 వ లేఖ).

ఇంచుమించు రెండేళ్ల తరువాత రాసినట్టి (1879 సెప్టెంబరు 19 న) మరొక లేఖలో ఎంగెల్సూ తానూ జె. మోస్ట్ వెనుక వున్నట్టుగా సాగుతూన్న ప్రచారాన్ని మార్క్స్ ప్రతిఘటించుతూ, జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలోని అవకాశవాదుల పట్ల తన వైఖరి గురించి సవివరమైన వృత్తాంతాన్ని సోర్గెకు తెలియజేస్తున్నాడు. "Zukunft" మాసపత్రికను హ్యోహబెర్గ్, శ్రామ్, ఎడువార్డ్ బెర్న్‌స్టయిన్‌లు నడుపుతూండేవారు. అటువంటి పత్రికతో ఎట్టి సంబంధం సహితమూ పెట్టుకొన నిరాకరించారు మార్క్స్, ఎంగెల్స్‌లు; కాగా ఈ హ్యోహబెర్గ్ యొక్క సహకారంతోనూ, ధనసహాయంతోనూ, ఒక కొత్త పార్టీ పత్రికను నెలకొల్పే ప్రశ్న బయల్దేరినప్పుడు, ఈ ''డాక్టర్ల, విద్యార్థుల, ప్రొఫెసర్‌గిరీ సోషలిస్టుల జట్టును'' ఖాయిదా పెట్టగల బాధ్యతాయుత సంపాదకుడుగా తమ ప్రతినిధి అయిన హిర్ష్ అంగీకరించబడాలని మార్క్స్, ఎంగెల్స్‌లు మొదట డిమాండుచేసి తరువాత హ్యోహబెర్గ్, శ్రామ్, బెర్న్‌స్టయిన్లు తమ ధోరణిని మార్చుకోని ''పక్షంలో, పార్టీనీ సిద్ధాంతాన్నీ ఈ విధంగా ఇంత నీచపరచడమును'' (Verluderung – జర్మన్ భాషలో ఇంతకంటెనూ ఘాటైన పదం) తాము బహిరంగంగా పోరాడుతామని వారిని హెచ్చరికచేస్తూ నేరుగా బెబెల్, లీబ్‌క్నెఖ్ట్, తదితర సోషల్-డెమోక్రాటిక్ పార్టీ నాయకులపేర ఒక సర్క్యులర్ లేఖను వారు పంపించారు.

తాను రచించిన ''చరిత్ర'' అనే శీర్షికనుగల గ్రంథంలో జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలోని ''గందరగోళపు సంవత్సరం'' ("Ein Jahr der Verwirrung") అని మేరింగ్ వర్ణించిన కాలావధి ఇది. ''అసాధారణ చట్టం'' అమలులోకి వచ్చిన తదుపరి, ఒకసారి మోస్ట్ యొక్క అరాచకవాదం వైపు, అటుతరువాత హ్యోహబెర్గ్ ప్రభృతుల అవకాశవాదం

---

* ''భవిష్యత్తు'' – అనువాదకుడు.

వైపు పార్టీ ఈ విధంగా ఊగుతూ సరైన మార్గాన్ని వెంటనే తెలుసుకొన లేకపోయింది. అఖరున పేర్కొన్న ఈ మనుషులను గురించి మార్క్స్ ఇలా రాస్తాడు: ''సిద్ధాంతంలో సున్నలూ, ఆచరణలో కొరగాములూ అయిన ఈ కుర్రకారులు అనామకులు సోషలిజానికున్న, ప్రత్యేకంగా సోషల్-డెమోక్రాటిక్ పార్టీకున్న, (యూనివర్సిటీలలో ఆవిష్కరించబడిన సూత్రాల ప్రకారం పుటంపెట్టి తయారుచేసి తాము తగిలించినట్టి) కోరలను రాలగొట్టాలనీ, కార్మికులకు జ్ఞానబోధ, అనగా తమకున్న మిడిమిడి జ్ఞానంతో, తమ పరిభాషలో నామకరణంచేయబడిన 'విద్యాప్రబోధాత్మక మూలద్రవ్యాల'ను కార్మికులకు ఎక్కించుదామని, అన్నిటికంటెనూ ప్రధానంగా పెట్టీబూర్జువా వర్గపు దృష్టిలో పార్టీకి మర్యాద సంపాదించాలనీ ఉద్దేశిస్తున్నారు. వీళ్లు వుత్త పనికిమాలిన విప్లవప్రతీఘాత వాచాలురు.''

మార్క్స్ చేసిన ఈ ''చండప్రచండ'' విజృంభణ ఫలితంగా, అవకాశవాదులు తిరోగమించి ఇక... కనబడకుండా జారుకున్నారు. 1879 నవంబరు 19 తేదీ లేఖలో హ్యోఖ్‌బెర్గ్ సంపాదకీయ సమితినుండి తొలగించివేయబడ్డాడనీ, పార్టీలో వున్న బాధ్యతగల సభ్యులందరూ — బేబెల్, లీబ్‌క్నెఖ్ట్, బ్రాకె, వగైరాలు — ఇతగాని భావాలను కాదన్నారనీ, మార్క్స్ తెలియజేస్తున్నాడు. సోషల్-డెమోక్రాటిక్ పార్టీ పత్రిక ''సోత్సియాల్ డెమోక్రాట్'' ఆనాడు పార్టీలో విప్లవాత్మక పక్షానికి చెందిన ఫోల్‌మార్ సంపాదకత్వంకింద వెలువడ నారంభించింది. ఇది జరిగిన ఒక ఏడాదికి (1880 నవంబరు 5 న), ఎంగెల్సూ తానూ ''సోత్సియాల్ డెమోక్రాట్'' నడుపబడుతూన్న ''దౌర్భాగ్యపు'' (miserabel) విధానంతో నిరంతరమూ పోరాడుతూనే వున్నామనీ, తమ అభిప్రాయాన్ని తరుచు నిశితంగానే ("wobei's oft scharf hergeht") తెలియజేస్తున్నామనీ మార్క్స్ రాస్తున్నాడు. 1880లో లీబ్‌క్నెఖ్ట్ మార్క్స్‌ను సందర్శించి, ఇకనుండి తప్పకుండా అన్ని విధాలా ''మెరుగుగా'' వుండబోతుందని ఖరారు చేశాడు.

శాంతి పునస్థాపిత మవుతుంది, యుద్ధం బహిరంగా ప్రజ్వరిల్లలేదు. హ్యోఖ్‌బెర్గ్ వైదొలగాడు, బెర్న్‌స్టయిన్ — 1895 లో ఎంగెల్స్ నిర్యాణం వరకూ కూడా — విప్లవాత్మక సోషల్-డెమోక్రాట్‌గానే వుంటూ వచ్చాడు.

1882 జూన్ 20 న, సోర్గె పేర ఎంగెల్స్ రాస్తూ, ఈ పోరాటం అప్పుడే ఏనాటి విషయమో అంటాడు: ''మొత్తంమీద జర్మనీలో సంగతులు భేషుగ్గా జరుగుతున్నాయి. పార్టీ రచయిత మహాశయులు అభివృద్ధి నిరోధక-బూర్జువా-మృదుత్వ-విద్యాధిక డోలన ఒకటి తీసుకురావడానికి ప్రయత్నించారు, నిజమే; కాని ప్రయత్నం గొప్పగా చెట్టెక్కింది. సోషల్-డెమోక్రాటిక్ కార్మికులు సర్వేసర్వత్రా తిన్న తిట్లు వీళ్లని, వెనకటి మూడేళ్లకంటే మరింత విప్లవాత్మకంగా సర్వేసర్వత్రా మార్చివేసింది. ...ఈ మహాశయులు'' (పార్టీ రచయితలు) ''ఎలాగైనా సరే సోషలిస్టు వ్యతిరేక చట్టం రద్దుచేయించడానికని

ప్రాధేయపడి, ఇచ్చకలాడి, అవమానాలు భరించి ప్రయత్నించారు, ఎందుచేతంటే తమ రచనా వ్యాసంగంవల్ల వాళ్ళు మునుపు చేసుకుంటూండిన నాలుగు రాళ్ళూ ఈ చట్టం మూలాన ఇప్పుడు చేసుకోడానికి వీల్లేకుండా పోతూంది. చట్టం రద్దు అయిపోయీ అయిపోవడంతో చీలిక బాహాటంగా పైకి పెచ్చరిల్లుతుంది, ఈ ఫీరెక్‌లూ, హ్యోహ్‌బెర్గ్‌లూ వేరే ఒక కుడి పక్షంగా ఏర్పడుతారు; ఇక వారితో వ్యవహారం ఆనాటికానాడు నడుపుకొస్తూంటే చివరికి వారే తమ పృష్ఠభాగంమీద ఒక్క తాపు తిని దాంతో నేలమీద కూలబడతారు. సోషలిస్టు వ్యతిరేక చట్టం ఆమోదించబడిన తక్షణం, పార్టీ అంతవరకూ సాగించిన క్రియాకలాపాలపై ఆనాటి పరిస్థితులలో పరమ లజ్జాకరమైన సమీక్షను హ్యోహ్‌బెర్గ్, ష్రామ్‌లు 'Jahrbuch' లో ప్రచురించి, పార్టీ వెనుకటికంటె మరింత నాగరికతతోనూ'' ("jebildetes" బదులు "gebildetes" అని జర్మన్ రచయితలు తెచ్చిపెట్టుకున్న బెర్లిన్ ఉచ్చారణను ఎంగెల్స్ సూచిస్తున్నాడు), ''నాజూకుతనంతోనూ, నీటుగానూ ప్రవర్తించాలని కోరినప్పుడు, మేమీసంగతి ప్రకటించాం.''

బెర్న్‌స్టయినిజం అంటూ ఒకటి తలెత్తబోతుందని 1882 చెప్పిన ఈ జోస్యం, 1898 లోనూ తరువాతి సంవత్సరాలలోనూ అద్భుతంగా ధ్రువపడింది.

కాగా అప్పటినుండీ, ప్రత్యేకంగా మార్క్స్ మరణానంతరమూ, జర్మన్ అవకాశ వాదులుచేసిన వంకరటొంకరలను సరిచేయడానికి తన శక్తివంచనలేకుండా ఎంగెల్స్ పాటుపడ్డా డని చెప్పడంలో ఏమాత్రము అతిశయోక్తిలేదు.

1884 అంత్యం. స్టీమర్లకు ధనసహాయం ("Dampfersubvention" చూ. మేరింగ్: ''చరిత్ర'') చేయడమునకు అనుకూలంగా వోటుచేసిన జర్మన్ సోషల్-డెమో క్రాటిక్ రైశ్చ్‌టాగ్ సభ్యుల ''పెట్టీబూర్జువా దురభిమానాలు'' ఖండించబడ్డాయి. ఈ విషయమై తాను పెద్ద యెత్తున ఉత్తరప్రత్యుత్తరాలు జరిపానని తెలియజేస్తూ ఎంగెల్స్ సోర్గె పేర రాస్తాడు (31 డిసెంబరు 1884).

1885 సంవత్సరం ఈ "Dampfersubvention" యావత్తు వ్యవహారంపై తన అభిప్రాయం చెబుతూ, ''ఇంచుమించు చీలికే యేర్పడుతూందేమో అన్నంత వరకూ పరిస్థితి సాగింది'' అని జూన్ 3 న ఎంగెల్స్ రాస్తాడు. సోషల్-డెమోక్రాట్ల ''అల్ప బుద్ధితత్వం'' ''బ్రహ్మాండం''గా ఉంది. ''జర్మనీలాంటి దేశంలో ఒక పెట్టీబూర్జువా సోషలిస్టు పార్లమెంటరీ గ్రూపు అనివార్యం'' అంటాడు ఎంగెల్స్.

1887 సంవత్సరం. ఫీరెక్ (హ్యోహ్‌బెర్గ్ రకం సోషల్-డెమోక్రాట్) లాంటి పార్ల మెంటు ప్రతినిధులను ఎన్నుకోవడం మూలంగా, తనకు తానే పార్టీ అప్రతిష్ఠ తెచ్చుకుం టూందని సోర్గె రాసిన లేఖకు ఎంగెల్స్ జబాబు రాస్తాడు. రైశ్చ్‌టాగ్‌కి మంచి ప్రతినిధు

లను కార్మికుల పార్టీ ఎన్నుకునే స్థితిలో లేనప్పుడు ఎవరూ ఏమీ చేయలేరు — అంటూ ఎంగెల్స్ తనకు తానే క్షమాపణ చెప్పుకుంటాడు. ''సోషలిస్టు వ్యతిరేక చట్టం పుణ్యమా అంటూ తమ కుడి పక్షపు మహాశయుల పట్ల సహనం వహించక వీల్లేకుండా వుందనీ, కాగా ఏనాడైతే పార్టీ తన కార్యాచరణ స్వేచ్ఛ తిరిగి సంపాదించుకుంటుందో ఆనాడే తమను పార్టీ నుండి వెళ్లగొట్టేస్తారనీ వాళ్లకీ తెలుసు.'' కాగా సాధారణంగా ''తన పార్లమెంటరీ వీరుల కంటె పార్టీ మెరుగ్గా వుండడమే — ఇటునుంచి అటుకంటె'' నయం (1887 మార్చి 3). లీబ్క్నెఖ్ట్ సామరస్యం కుదిర్చే మనిషి అనీ, పదప్రయోగం చేసి ఎల్లప్పుడూ విభేదాలను దాటవేయడానికి ప్రయత్నిస్తాడనీ ఎంగెల్స్ మెరపెట్టుతాడు. చీలికే గనుక ఏర్పడిందంటే మాత్రం, నిర్ణయాత్మక క్షణంలో అతడు మన పక్షాన్నే వుంటాడు, అని ఎంగెల్స్ అంటాడు.

1889 సంవత్సరం. పారిస్లో రెండు అంతర్జాతీయ సోషల్-డెమోక్రాటిక్ కాంగ్రెస్లు.[98] విప్లవాత్మక సోషల్-డెమోక్రాట్ల నుండి అవకాశవాదులు (ఫ్రెంచి పోసిబిలిస్టుల నాయకత్వాన) చీలిపోతారు. యువకుడిలాగ (అతనికప్పుడు అరవైయ్యెనిమిది) ఎంగెల్స్ సమరంలోకి విజృంభిస్తాడు. అవకాశవాదులకు వ్యతిరేకంగా పోరాటానికై అతడు అనేక లేఖలు (1889 జనవరి 12 నుండి జూలై 20 వరకు) వినియోగిస్తాడు. అవకాశవాదులు ఒక్కరే కాదు, తమ సామరస్యవైఖరికి జర్మన్లు కూడా — లీబ్క్నెఖ్ట్, బేబెల్, తదితరులు — అతని తడాఖాలు రుచిచూస్తారు.

పోసిబిలిస్టులు ప్రభుత్వానికి అమ్ముడుపోయారు, అని 1889 జనవరి 12 న ఎంగెల్స్ రాస్తాడు. కాగా పోసిబిలిస్టులతో చేతులు కలిపినందుకు బ్రిటిష్ ''సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్'' (S.D.F.) సభ్యులను అతడు బయటపెడతాడు. ''ఈ వెధవ కాంగ్రెస్ కోసమని ఇటూ అటూ తిరగడంతో నాకు సరిపోతూంది, మరి దేనికీ వేళలేకుండానూ'' (1889 మే 11). పోసిబిలిస్టులు మహా చురుగ్గా తిరుగుతున్నారు, మనవాళ్లు మాత్రం కుంభకర్ణుడి నిద్రలో వున్నారు, అని మండిపడుతూ రాస్తాడు ఎంగెల్స్. ఇప్పుడు ఔవర్, షిప్పెల్లు సహితం పోసిబిలిస్టుల కాంగ్రెస్కి మనం వెళ్లితీరాలంటున్నారు. ''చివరికి'' దీనితో లీబ్క్నెఖ్ట్ కళ్లుతెరిచాడు. ఎంగెల్స్, బెర్న్స్టయిన్తో కలిసి పాంప్లెట్లు (వాటిమీద బెర్న్స్టయిన్ పేరే వుంటుంది — ''మా పాంప్లెట్లు'' అంటాడు ఎంగెల్స్) రాస్తాడు.

''యూరప్ అంతటిలోనూ ఏ సోషలిస్టు ఆర్గనైజేషనూ, S.D.F. ఒక్కటి మినహా, పోసిబిలిస్టులతో చేరడంలేదు'' (1889 జూన్ 8). ''అందుచేత వాళ్లు సోషలిస్టేతర ట్రేడ్యూనియన్ల సహాయం అర్థిస్తున్నారు'' (మనదేశంలో విశాల కార్మిక పార్టీ, కార్మిక కాంగ్రెస్, వగైరాలను సమర్థిస్తూన్నవారు దీనిని గమనిస్తారు గాక!). ''వీళ్లకోసం అమెరికా నుండి ఒకే ఒక శ్రమ వీరుడు వస్తున్నాడు.'' బకూనినిస్టులతో జరిగిన పోరాటంలో

ఎదుర్కొనబడిన ప్రత్యర్థి ఇప్పుడూనూ: ''అప్పటి అరాజకవాదుల పతాక స్థానే ఇప్పుడు పోసిబిలిస్టుల పతాక, అంతకుతప్ప మరేమీ తేడా లేదు — చిన్నతరహా రాయితీల కోసం సూత్రాలనే అమ్ముకోవడం, అందులోనూ ప్రత్యేకంగా నాయకులకు గొప్పజీతాలు ముట్టే (పట్టణ సమితులు, లేబరు ఎక్స్ఛేంజిలు, వగైరాల్లో) ఉద్యోగాల కోసం.'' ''అధికారవిధేయతాతత్వపు మార్క్సిజం''పై బ్రుస్స్ (పోసిబిలిస్టుల నాయకుడు), హైండ్‌మన్ (పోసిబిలిస్టులతో చేరిన S.D.F. నాయకుడు) దాడికి బయల్దేరారు, వీళ్లు ''కొత్త ఇంటర్నేషనల్ కేంద్రకాన్ని'' స్థాపించాలనుకుంటున్నారు.''

''జర్మన్ల సత్యకాలపుతనం ఇక అంతా కాదు, నువ్వు చూసితీరాలి! దీని ఆంతర్యం అంతా ఏమిటో బేబెల్‌కి సహితమూ చెప్పేందుకు నా తాతలు దిగొచ్చారంటే నమ్ము'' (1889 జూన్ 8). ఇక రెండు కాంగ్రెసులూ సమావేశమయే సరికి (ట్రేడ్‌యూనియనిస్టులతోనూ, S.D.F. తోనూ, ఆస్ట్రియన్లలో ఒక భాగంతోనూ ఏకమైనట్టి) పోసిబిలిస్టుల కంటె విప్లవాత్మక సోషల్-డెమోక్రాట్లదే అత్యధికసంఖ్య ఎప్పుడైతే అయిందో, అప్పుడు ఎంగెల్స్ ఆనందపరవశుడైపోయాడు (1889 జూలై 17). లీబ్‌క్నెఖ్ట్, తదితరుల సామరస్య పథకాలూ తీర్మానాలూ నిష్ఫలములైనందుకు అతడు సంతోషించాడు. (1889 జూలై 20) ''మన సమరసస్వభావ సోదరులు కనబర్చిన కలుపుకోలుదన మంతటికీ ఫలితం పాపం వాళ్ల పృష్ఠభాగాలకు బలమైన దెబ్బలు తగలడమే.'' ''ఇక ఈ మందు వీళ్లకు చాలా కాలంవరకూ పనిచేస్తుంది.''

...మార్క్స్, ఎంగెల్స్‌లకు ''నాజూకూ, మర్యాదా'' అంటే ఏమిటో అంతబాగా తెలియదని మేరింగ్ ("Der Sorgesche Briefwechsel") న్యాయంగానే అన్నాడు: ''తాము తగిలించిన తడాఖాలకు వాళ్లు పశ్చాత్తాపపడనూ లేదు, తాము తిన్న దెబ్బలకు వాళ్లు నొచ్చుకోనూ లేదు.'' ఎంగెల్స్ ఒకసారి రాశాడు: ''దెబ్బలు తిని తిని కాయలు కాసిపోయిన నా చర్మం మీ ములుకులను లెక్కచేస్తుందనుకుంటే మీరు గొప్ప పొరపాటే పడుతున్నారు.''[99] తమకు అలవాటైపోయిన ఈ నిర్లక్ష్యభావం ఇతరులు కూడా అలవర్చుకున్నారనే మార్క్స్, ఎంగెల్స్‌లు భావించారని మేరింగ్ అంటాడు.

1893 సంవత్సరం. బెర్న్‌స్టయినియన్లపై తీర్పుచెప్పేటప్పుడు... ''ఫేబియన్లకు'' జరిగిన దేహశుద్ధి గురించి దానంతటదే మనకి తట్టుతుంది (ఎందుకంటే ఈ ''ఫేబియన్ల'' ఇంట్లోనే కదా బ్రిటన్‌లో బెర్న్‌స్టయిన్ తన అవకాశవాదాన్ని పాలుపోసి ''పెంచినది''). ''ఇక్కడ లండన్‌లో వున్న ఫేబియన్లు, అధికార పదవుల కోసం ఆశించే జట్టు; సామాజిక విప్లవం అనివార్యమని తెలుసుకోగల తెలివితేటలు కలవారే వీరు; కాని ఇంతటి బ్రహ్మాండమైన కర్తవ్యాన్ని పాపం మొరటు శ్రామికవర్గం ఒక్కదాని చేతుల్లోనే చూస్తూ చూస్తూ ఎలా వదలిపెట్టగలమని కనికరించి, ఇక విధిలేక తామే నాయకత్వం వహించారు. విప్లవంపట్ల

హడలే వాళ్ల మూలసూత్రం. వీళ్ళు par excellence* 'మేధావులు.' వీళ్ల సోషలిజం మ్యునిసిపల్ సోషలిజం; తాత్కాలికంగానైనా ఉత్పత్తి సాధనాల స్వామ్యం జాతికి చెందకుండా సంఘానికి చెందాలంటారు వీళ్ళు. తమ సోషలిజాన్ని, బూర్జువా లిబరలిజం యొక్క అనివార్యమైన ఆనుషంగికమే కాకుండా, పరాకాష్ఠ నందుకున్న ఆనుషంగికమని వాళ్లు చిత్రిస్తారు; ఈ కారణంచేత లిబరల్సును ప్రత్యర్థులుగా నిశ్చితంగా ప్రతిఘటించ కుండా, లిబరల్సును సోషలిజం దిశగా ముందుకు నెట్టుతూండడమూ, లిబరల్సుతో కలిసి కుహకాలు సాగించడమూ, లిబరలిజాన్ని సోషలిజంతో పరితప్తం చేయడమూ వీరి ఎత్తు గడలు — లిబరల్సుకి వ్యతిరేకంగా సోషలిస్టు అభ్యర్థులను నిలబెట్టకుండా, లిబరల్సుకు అంటింత కాయల్లా సోషలిస్టులను తగిలించడమూ, లిబరల్సు నెత్తిమీద బలవంతంగా సోషలిస్టులను రుద్దడమూ, లేదా లిబరల్సుని బుజ్జగించి సోషలిస్టులను తీసుకునేటట్టు చేయడమూ... ఈ విధంగా చేయడంవల్ల ఇతరులు తమతో చెప్పే అబద్ధాలను తాము నమ్ముతున్నామని గాని, ఆత్మవంచన చేసుకుంటున్నామని గాని, లేదా సోషలిజం గురించి తామే అబద్ధాలు చెబుతు న్నామని గాని వీరు సహజంగానే గ్రహించరు.

''ఎంతో పరిశ్రమచేసి వీరు ప్రచురించిన నానారకపు చెత్తలోనూ కొంత మంచి ప్రచార రచన లేకపోలేదు, నిజంగా చెప్పాలంటే ఈ రంగంలో ఇంగ్లీషువాళ్ళు ప్రచురించిన దానంతటి లోనూ ఉత్తమమైనది వీరిదే. కాని వర్గపోరాటాన్ని మరుగుపరచడమనే తమ విశిష్టపు ఎత్తుగడలకు వీరు దిగినప్పుడు మాత్రం ఇదంతా కుళ్ళుకంపు కొడుతుంది. కనుకనే — వర్గ పోరాటం కారణంవల్లనే — మార్క్సు అంటేనూ మనమందరం అంటేనూ వీళ్లకింత ఉన్మాద పూరితమైన ద్వేషం.

''వీళ్లకి బూర్జువా అనుచరులు చాలామంది వుండడం సహజమే, అందువల్లే వీళ్ల చేతిలో 'బోలెడంత డబ్బు ఆడుతూంది'...''[100]

## సోషల్-డెమోక్రసీలోని మేధావిస్తరపు అవకాశ వాదంపై సాంప్రదాయక అంచనా

1894 సంవత్సరం. రైతు సమస్య. ''యూరప్ భూభాగంలో, ఒకసారి జయం చవిచూడడంతో విజయతృష్ణ మరింత అధికమవుతూంది. ఇక రైతును అక్షరాలా వలవేసి పట్టుకోవడం ఒక ఫాషన్ అయిపోయింది'' అంటూ 1894 నవంబరు 10 న రాస్తాడు

* శ్రేష్ఠసూచకమైన — అనువాదకుడు.

ఎంగెల్స్. ''మనం చేసే కార్యాలచే సన్నకారు రైతుల నాశానాన్ని త్వరితపరచడం మన ఉద్దేశం కాదు, పెట్టుబడిదారీ విధానమే ఆ పనిని మనవంతు చేసిపెడుతూందనీ, తత్‌భిన్నంగా పన్నుల భారం నుండీ, అధికవడ్డీల నుండీ, భూస్వాముల నుండీ సన్నకారు రైతులను మనం సూటిగా కాపాడాలనీ, లాఫార్గ్‌ద్వారా నాంట్‌లో మొదట ఫ్రెంచివాళ్లు ప్రకటించారు. కాని ఈ కార్యంలో మనం సహకరించలేం; ఇందుకు మొదటి కారణం, ఇది తెలివిమాలిన పని; రెండవది, ఇది అసాధ్యమైన పని. ఇప్పుడేమో, ఫోల్‌మార్ ఫ్రాంక్‌ఫర్ట్‌లో ప్రత్యక్షమై, రైతు అనేవాడికల్లా లంచం ఇవ్వాలని కోరుతున్నాడు; నిజానికి తాను ఎగువ బవేరియాలో ఏ రైతుతో వ్యవహరించాల్సి వుందో ఆ రైతు, అప్పుల్లో మునిగిపోయున్న రైన్‌లాండ్ సన్నకారు రైతు కాదు, మీదుమిక్కిలి ఆడ, మగ కమతగాళ్లందరినీ దోపిడీ చేస్తూ, గొడ్లనూ గింజలనూ భారీయెత్తున అమ్ముతూన్నట్టి మధ్యతరగతి రైతే, ఆ మాటకొస్తే ధనిక రైతే; కాగా యావత్తు సూత్రానికీ తిలోదకం ఇవ్వనిదే ఇందుకు వీలుండదు.''

1894 డిసెంబరు 4. ''... మరీ మరీ అవకాశవాదు లైపోయి, ఇంచుమించు ఒక మామూలు రకం ప్రజాపక్షంగా తయారైన బవేరియన్లు (అనగా, నాయకులలో అధికసంఖ్యాకులూ, ఇటీవల పార్టీలో చేరినవారిలో చాలామందీనీ), బవేరియన్ రాష్ట్ర పార్లమెంటులో మొత్తం బడ్జెట్టుకి అనుకూలంగా వోటుచేశారు; కాగా ఎగువ బవేరియాలోని పెద్ద రైతులను, 25 నుండి 80 ఎకరాల వరకూ (10 నుండి 30 హెక్టార్ల వరకూ) వున్నట్టీ, అందుచేత కూలివాళ్లని పెట్టుకుంటేనేగాని జరగనట్టీ మనుషులను, వలవేసి పట్టేందుకు — వీరి కమతగాళ్లను పట్టేందుకు కాదు — రైతు ఆందోళన ఒకదానిని ప్రత్యేకమూ ఫోల్‌మార్ లేవదీశాడు.''

దీనినిబట్టి మార్క్స్, ఎంగెల్స్‌లు జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలోని అవకాశవాదాన్ని వ్యవస్థాబద్ధంగానూ, సరైనమార్గం నుండి తలవెంద్రుకవాసి అయినా వైదొలగకుండానూ పదేళ్లకుపైగా పోరాడి, సోషలిజంలోని మేధావిస్తరపు అల్పబుద్ధితత్వంపైనీ, పెట్టీబూర్జువా దృక్పథంపైనీ దాడి సాగించినట్లు మనం తెలుసుకుంటున్నాం. ఇది అత్యంత ప్రధానమైన విషయం. మార్క్సిస్టు శ్రామికవర్గ విధానానికీ ఎతు గడలకీ జర్మన్ సోషల్-డెమోక్రసీ ఒక ఆదర్శప్రాయమైన నమూనా అని భావించబడుతూందని సాధారణ ప్రజకి తెలుసు, కాని ఆ పార్టీలోని ''కుడి పక్షానికి'' (ఎంగెల్స్ పదం) వ్యతిరేకంగా మార్క్సిజం స్థాపకులు ఎంతటి నిర్విరామ సంగ్రామం సాగించారో సాధారణ ప్రజకి తెలియదు. కాగా ఎంగెల్స్ మరణించిన కొద్ది కాలానికే ఈ చాటుమాటు యుద్ధం బహిరంగ యుద్ధంగా మారిపోవడం యాదృచ్ఛికమేమీ కాదు. జర్మన్ సోషల్-డెమోక్రసీ యొక్క అనేక దశాబ్దుల చారిత్రాత్మకాభివృద్ధి అనివార్య ఫలితమే ఇది.

కాగా ఎంగెల్స్ (మార్క్స్ కూడా) చేసిన సలహాలూ, ఆదేశాలూ, దిద్దుబాట్లూ, బెదరింపులూ, ఉద్ఘాటనలూ — వీటి రెండు పంథాలూ మనకీనాడు విస్పష్టంగా కనబడు తున్నాయి. కార్మికోద్యమంతో విలీనమైపోతామనీ, తమ ఆర్గనైజేషన్లలో కుంచించుకు పోయినట్టి, కాయకాసిపోయినట్టి సెక్టేరియన్ ధోరణిని నిర్మూలించి వేయాల్సిందని బ్రిటిష్-అమెరికన్ సోషలిస్టులకు వారు మిక్కిలి పట్టుదలతో పిలుపు ఇచ్చారు. అల్పబుద్ధితత్వానికీ, "పార్లమెంటరీ పిచ్చి"కీ (1879 సెప్టెంబరు 19 న రాసిన లేఖలో మార్క్స్ ఉపయోగించిన పదం), పెట్టీబూర్జువా మేధావుల అవకాశవాదానికీ దిగజారిపోవద్దని జర్మన్ సోషల్-డెమోక్రాట్లకు మిక్కిలి పట్టుదలతో వారు బోధించారు.

మొదటి తరహా సలహాలను గురించి మన సోషల్-డెమోక్రాట్ వదరుబోతులు వాగుడు ప్రారంభించడమూ, రెండవ తరహా సలహాలను గురించి నోరు మెదపకుండా వుండడమూ వారి స్వభావాన్ని తెలియజేయడం లేదా? మార్క్స్, ఎంగెల్స్‌ల లేఖలను విలువకట్టడంలో ఇటువంటి పాక్షికతత్వం, ప్రత్యేకంగా మనదైనట్టి, రష్యన్ స్వభావం కల్గినట్టి, సోషల్-డెమోక్రాటిక్... "పాక్షికతత్వానికి" చక్కని తార్కాణం కాదా?

అంతర్జాతీయ కార్మికోద్యమం ప్రగాఢమైన అలజడి, ఊగిసలాట చిహ్నాలను ప్రదర్శించు తూన్నట్టి నేటి కాలంలో, అవకాశవాదం, "పార్లమెంటరీ పిచ్చి," అల్పబుద్ధితత్వపు రిఫార్మిజముల తీవ్రరూపాలు వీటికి పూర్తిగా వ్యతిరేకములైనట్టి విప్లవాత్మక సిండికలిజం యొక్క తీవ్రరూపాలను పెచ్చరిల్లజేసినట్టి నేటి కాలంలో బ్రిటిష్-అమెరికన్ సోషలిజానికీ, జర్మన్ సోషలిజానికీ మార్క్స్ చూపినట్టి, ఎంగెల్స్ చూపినట్టి "దిద్దుబాట్ల" సాధారణ ధోరణి అసాధారణ ప్రాముఖ్యతను కలిగివుంది.

సోషల్-డెమోక్రాటిక్ కార్మికుల పార్టీ లేనట్టి, పార్లమెంటులలో సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సభ్యులు లేనట్టి, ఎన్నికలూ పత్రికలూ వగైరాలలో వ్యవస్థాబద్ధమైనట్టి, సుసంగతమైనట్టి సోషల్-డెమోక్రాటిక్ విధానం లేనట్టి దేశాలలో — శ్రామికవర్గాన్ని రాజకీయంగా ఒక కుదుపు కుదిపేందుకుకై సంకుచితమైన సెక్టేరియనిజాన్ని ఏమైనా సరే వదలుకుని కార్మికోద్యమంలో చేరవలసిందని సోషలిస్టులకు మార్క్స్, ఎంగెల్స్‌లు బోధించారు. ఎందుచేతంటే పంధొమ్మిదో శతాబ్ది చివరి మూడో భాగంలో బ్రిటన్‌లోగాని, అమెరికాలోగాని శ్రామిక వర్గం ఇంచుమించు ఏమాత్రం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సహితమూ ప్రదర్శించలేదు. ఈ దేశాల్లో — బూర్జువా-ప్రజాస్వామిక చారిత్రాత్మక కర్తవ్యాలు ఇంచుమించు పూర్తిగా మృగ్యమైనట్టి దేశాల్లో — విజయగర్వపూరితమూ ఆత్మసంతృప్తిభరితమూ అయినట్టి, కార్మికులను వంచించడం, చెడగొట్టడం, లంచాలు తినిపించడమూ కళలో ప్రపంచంలో మరెక్కడా కూడా సాటిలేనట్టి బూర్జువావర్గం యావత్తు రాజకీయరంగాన్ని ఆక్రమించేసుకుంది.

బ్రిటిష్-అమెరికన్ కార్మికోద్యమాలకు మార్క్స్, ఎంగెల్స్‌లు చెప్పిన సలహాలను రష్యన్ పరిస్థితులకు యథాతథంగానూ సూటిగానూ ప్రయుక్తం చేయవచ్చునని అనుకోవడం, మార్క్సిజాన్ని దాని పద్ధతిలో స్పష్టతను సాధించడానికి కాకుండా, ఫలానా ఫలానా దేశాల కార్మికోద్యమం యొక్క నిర్దిష్ట చారిత్రాత్మక ప్రత్యేకతలను అధ్యయనం చేసేందుకు కాకుండా, కేవలం గ్రూపుతత్వంతో, మేధావితత్వంతో చిల్లరమల్లర పాతబాకీలు తీర్చుకుందుకు వినియోగించడమే అవుతుంది.

తత్‌భిన్నంగా, బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం ఇంకా పరిసమాప్తం కాకుండా వుండినట్టీ, "పార్లమెంటరీ రూపాలతో అలంకరించబడిన సైనిక నిరంకుశత్వం" ("గోతా కార్యక్రమ విమర్శ"లో మార్క్స్ ప్రయోగించిన పదం) సాగినట్టీ, ఇప్పటికీ ఇంకా సాగుతూనే వున్నట్టీ, శ్రామికవర్గం చాలాకాలంగా రాజకీయాల్లోకి దిగి సోషల్-డెమోక్రాటిక్ విధానం అవలంబించుతూనట్టీ దేశంలో, కార్మికోద్యమంయొక్క కర్తవ్యాలనూ పరిధినీ పార్లమెంటరీ రీతిలో అపభ్రంశపర్చడమునూ, అల్పబుద్ధితో చులకన చేయడమునూ మార్క్స్, ఎంగెల్స్‌లు అన్నిటికంటె ఎక్కువగా భయపడ్డారు.

రష్యాలో బూర్జువా-డెమోక్రాటిక్ విప్లవ శకంలో, మార్క్సిజంలోని ఈ విభాగాన్ని ఒత్తిచెప్పడమూ, దీనికి ప్రాధాన్యత ఇవ్వడమూ మరింతగా మన విధ్యుక్తధర్మ మవుతుంది, కారణమేమంటే మన దేశంలో వున్నట్టి విస్తృతవ్యాపితమూ, "ఉజ్వలమూ," ధనాఢ్యమూ అయిన పత్రికావ్యవస్థ, మన పొరుగునవున్న జర్మన్ కార్మికోద్యమం చూపుతూన్న "ఆదర్శవంతమైన" రాజభక్తి, పార్లమెంటరీ న్యాయశాస్త్రీయతను గురించీ, నమ్రత, మప్పితాలనూ గురించీ శ్రామికవర్గం చెవుల్లో వెయ్యినోళ్లతో బాకాలు వూదుతూంది.

రష్యన్ విప్లవ బూర్జువా ద్రోహుల ఈ స్వలాభకరమైన అబద్ధం యాదృచ్ఛిక ఘటనా ఫలితమూ కాదు, కాడెట్ శిబిరంలోని గతకాలపు, లేదా భావికాలపు మంత్రులు కొందరి వ్యక్తిగత దుర్నీతి ఫలితమూ కాదు. రష్యన్ లిబరల్ భూస్వాములయొక్క, లిబరల్ బూర్జువా వర్గంయొక్క ప్రగాఢమైన ఆర్థిక ప్రయోజనాల ఫలితమే యిది. కాగా ఈ అబద్ధాన్ని ప్రతిఘటించడానికీ, "ప్రజారాసులను మూకుమ్మడిగా మందమతులను చేయడమును" ("Massenverdummung" — 1886 నవంబరు 29 తేదీ లేఖలో ఎంగెల్స్ ఉపయోగించిన పదం) ప్రతిఘటించడానికీ మార్క్స్, ఎంగెల్స్‌ల లేఖలు రష్యన్ సోషలిస్టులందరికీ అపరిత్యాజ్యములైన ఆయుధాలుగా ఉపయోగపడుతాయి.

లిబరల్‌తత్వ బూర్జువావర్గపు స్వలాభకరమైన అబద్ధం జర్మన్ సోషల్-డెమోక్రాట్ల ఆదర్శవంతమైన "నమ్రత"ను ప్రజలకు పైకెత్తి చూపుతూంది. ఈ సోషల్-డెమోక్రాట్ల నాయకులూ మార్క్సిజం సిద్ధాంత స్థాపకులూ మనకిలా చెబుతున్నారు:

"ఫ్రెంచివాళ్ల విప్లవాత్మక భాష ఎదుట, వారి కార్యాచరణ ఎదుట, ఫీరెక్ ప్రభృతుల" (జర్మన్ రైశ్చ్‌టాగ్‌లో వున్న సోషల్-డెమొక్రాటిక్ గ్రూపులోని అవకాశవాద సోషల్-డెమొక్రాట్లు) "కుహనా గర్జనలు వుత్త బలహీన స్వరాలుగా వినబడతాయి" (ఫ్రెంచి పార్లమెంటులో కార్మిక పార్టీ ఏర్పడడం గురించీ, ఫ్రెంచి శ్రామికవర్గంనుండి ఫ్రెంచి రాడికల్సును చీలదీసిన డెకాజ్‌విల్ సమ్మె[101] గురించీ ఇక్కడ ప్రస్తావన), కాగా సోషలిస్టు చట్టంపై జరిగిన గత చర్చలో లీబ్‌క్నెఖ్ట్, బేబెల్ మాత్రమే మాట్లాడారు... కాగా ఇద్దరూ బాగా మాట్లాడారు. ఈ చర్చతో నిజాయితీగల ప్రజలు నలుగురిలోనూ మరొకసారి మనం మళ్లీ తలెత్తుకుని తిరగ్గలం, కడమ చర్చలన్నీ ఇలాగ లేనేలేవు. జర్మన్‌లు రైశ్చ్‌టాగ్‌కి అంతమంది అల్పబుద్ధులను సభ్యులుగా ఎన్నుకున్న తర్వాత మరీ ముఖ్యంగా (ఇది నిజంగా అనివార్యమే అయింది), జర్మన్‌ల నాయకత్వానికి (అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమంలో) కొంత సవాలు వచ్చివుండడం మొత్తంమీద మంచిదే. శాంతియుతమైన కాలంలో జర్మనీలో ప్రతి విషయమూ అల్పబుద్ధితత్వమయం అయిపోతూంది; కాబట్టే ఫ్రెంచి పోటీ కరచిన కాటు కేవలం అత్యావశ్యకమే అయింది..." (1886 ఏప్రిల్ 29 తేదీ లేఖ).

జర్మన్ సోషల్-డెమొక్రసీ యొక్క భావశాస్త్ర ప్రభావమే ప్రబలంగా పడినట్టి రష్యన్ సోషల్-డెమొక్రాటిక్ కార్మికుల పార్టీ కుణ్ణంగా వొంటపట్టించుకోవాల్సినట్టి గుణపాఠాలు ఇవి.

పందొమ్మిదవ శతాబ్దపు మహామహుల ఉత్తరప్రత్యుత్తరాలలో ఫలానా ఖండం అంటూ ఏదీ ఈ గుణపాఠాలను మనకు బోధించడం లేదు, కాని శ్రామికవర్గ అంతర్జాతీయ అనుభవంపై వారు సౌభ్రాతృత్వంతో నిష్కపటంగా చేసిన విమర్శన యొక్క, ఎట్టి మంత్రాంగాన్నీ చిల్లరమల్లర ప్రతిఫలాలనూ ఖాతరు చేయనట్టి విమర్శన యొక్క సంపూర్ణ సారాంశమూ తాత్పర్యములే మనకీ గుణపాఠాలను బోధిస్తున్నాయి.

మార్క్స్, ఎంగెల్స్‌ల లేఖలు అన్నీ కూడా ఈ భావంతో ఎంతవరకు పరితప్తమై వున్నాయో, సాపేక్షంగా విశిష్టమైనట్టీ, అయినప్పటికీ అత్యంత స్వాభావికమైనట్టీ ఈ దిగువ ఖండాలనుబట్టి తెలుస్తుంది.

శిక్షణపొందనట్టీ, ఇంకా నైపుణ్యం సంపాదించనట్టీ, ఎట్టి చదువూ లేనట్టీ కార్మికులు (గ్యాస్ కార్మికులు, రేవుపనివారు మొదలైనవారు) కేవలం సరికొత్త, విప్లవాత్మక భావం ప్రదర్శించుతూన్న ఒక వినూత్న యువకఉద్యమం 1889లో బ్రిటన్‌లో ప్రారంభించారు. ఇందుకు ఎంగెల్స్ ఆనందభరితుడయాడు. ఈ కార్మికులలో, మార్క్స్ కుమార్తె "టస్సీ" (Tussy) ప్రచారం సాగించగా ఆమె నిర్వహించిన పాత్రను అతడు సంతోషంతో ఉప్పొంగుతూ పేర్కొంటాడు. 1889 డిసెంబరు 7 న లండన్ నుండి రాస్తూ, అతడీలా

అంటాడు: "... ఇక్కడ అన్నిటికంటెనూ అసహ్యకరమైన దేమిటంటే, కార్మికుల చీము రక్తాల్లోకి ఎక్కిపోయినట్టి బూర్జువాతత్వపు 'గౌరవార్హత' భావం. లెక్కలేనన్ని అంతరాలుగా సమాజం విభాగమైపోయి, మారుమాటాడకుండా ప్రతి అంతరవూ గుర్తించబడడమూ, ప్రతి అంతరవూ స్వ'గర్వం' కలిగివుంటూనే తనకంటె 'శ్రేష్ఠుల పట్ల', తన 'అధికుల పట్ల' పుట్టుకతోనే వస్తూన్న గౌరవప్రదర్శనం, పురాతనం నుండీ ఎంతదృఢంగా పాతుకుని పోయిందంటే, ఎరచూపించి ఈ రాసులను పట్టేయడం బూర్జువావర్గానికి ఏమంతగా కష్టమనిపించడమేలేదు. ఉదాహరణకు, జాన్ బర్న్స్ (Burns) తన వర్గంతో తనకుగల జనాదరణ కంటెనూ కార్డినల్ మాన్నింగ్ తోనూ, లార్డ్ మేయర్‌తోనూ, సాధారణంగా బూర్జువా వర్గంతోనూ తనకుగల జనాదరణతోనే అతడు హెచ్చుగా పొంగిపోతున్నాడంటే అందులో సందేహించాల్సినది నాకేమీ అంతగా అవుపడదు. కాగా చాంపియన్ (Champion) — ఒక మాజీ లెఫ్టినెంటు — అనేక సంవత్సరాల కిందటే బూర్జువావర్గంతో, అందులోనూ కన్సర్వేటివ్ పార్టీ మనుషులతో కలిసి తంత్రంచేసి, మతగురువుల చర్చి కాంగ్రెస్‌లో సోషలిజం బోధించడం, వగైరాలు చేశాడు. కాగా ఈ జట్టు అంతటిలోనూ ఉత్తముడని నేను భావించే టామ్ మాన్ (Mann) సహితం, లార్డ్ మేయర్‌తో తాను భోజనానికి వెళ్లుతున్నానన్న సంగతి నలుగురితోనూ చెప్పుకుని మహా ఆనందపడేవాడు. దీనిని మనం ఫ్రెంచి వాళ్లతో సరిపోల్చిచూస్తే, ఏది ఎలావున్నప్పటికీ, విప్లవం ఎంత మంచిదో మనం అర్థం చేసుకోగల్గుతాం."

దీనికి వ్యాఖ్యానం అనవసరం.

ఇంకొక ఉదాహరణ. 1891 లో యూరప్‌లో యుద్ధప్రమాదం తటస్థించింది. ఈ విషయంపై బెబెల్‌తో ఎంగెల్స్ ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు, కాగా ఒకవేళ జర్మనీపై రష్యా గనక దాడిచేస్తే, అట్టి సందర్భంలో జర్మన్ సోషలిస్టులు రష్యన్లకి వ్యతిరేకంగానూ, రష్యన్లకి ఎవరైనా మిత్రులు సాయంచేస్తే వారికి వ్యతిరేకంగానూ అన్నిటికీ తెగించి యుద్ధం చెయ్యాల్సి వుంటుందనే ఇద్దరూ ఏకాభిప్రాయానికి వచ్చారు. "జర్మనీని గనుక అణగదొక్కేశారంటే, అప్పుడు మనకీ అదే గతిపడుతుంది, పోతే ఇక పరిస్థితులు అత్యంత అనుకూలంగా తిరిగే సందర్భంలో పోరాటం ఎంత జోరుగా వుంటుందంటే, విప్లవం వల్లనే తప్ప మరొక విధంగా జర్మనీ నిలబడలేక పోతుంది. ఇక అప్పుడు బహుశా మనం నిర్బంధంగా అధికారంలోకి వచ్చి, 1793 నాటకం ఆడవలసే వస్తుంది." (1891 అక్టోబరు 24 న రాసిన లేఖ.)

రష్యన్ కార్మికుల పార్టీకి 1905 లో వుండిన "జాకొబిన్" అవకాశాలు సోషల్-డెమొక్రాటిక్ అన్యములు అని గొంతుకు చించుకుని ప్రపంచానికి చాటిన అవకాశవాదులు

దీనిని గమనిస్తారు గాక! తాత్కాలిక ప్రభుత్వంలో సోషల్-డెమోక్రాట్లు పాల్గొనాల్సిన అవకాశం సాధ్యమే కావచ్చునని బేబెల్‌కి మూతిముప్పిడి లేకుండా సూటిగా సూచిస్తున్నాడు ఎంగెల్స్.

సోషల్-డెమోక్రాటిక్ కార్మికుల పార్టీల కర్తవ్యాలపై ఇటువంటి భావాలు కలిగివుండడం కారణాన, రష్యన్ విప్లవంలోనూ దాని ప్రపంచ ప్రాముఖ్యతలోనూ మార్క్స్, ఎంగెల్స్‌లకు అమితోత్సాహమైన విశ్వాసం వుండేది. ఇంచుమించు ఇరవై య్యేళ్లపాటు సాగించిన ఈ ఉత్తరప్రత్యుత్తరాల్లో రష్యాలో విప్లవం కోసం వారి ఉద్రేకపూరితమైన ఈ నిరీక్షణ మనకు అగుపడుతుంది.

1877 సెప్టెంబరు 27 న మార్క్స్ రాసిన ఈ లేఖ చూడండి. ప్రాచ్య సంక్షోభం[102] గురించి అతడు మంచి ఉత్సాహంతో వున్నాడు: "చాలా కాలంగా రష్యాలో ఒక బ్రహ్మాండమైన పరిభ్రమణం గడపలో నిలబడి వుంది. ఇందుకు అవసరమైన అన్ని మూలద్రవ్యాలు తయారై సిద్ధాంగా వున్నాయి. శూరులు టర్కీవాళ్లు చేసిన దేహశుద్ధి ఫలితంగా ఈ విదారణను వారు కొన్ని సంవత్సరాలు వేగిరపరచారు... ఈ పరిభ్రమణం secundum artem ("కళా నిబంధనల ననుసరించి") కొంత రాజ్యాంగనిర్మాణ కపటనాటకం తరువాత ఆరంభమై, అటు పిమ్మట అసలు గమ్మత్తు మొదలవుతుంది (il y aura un beau tapage). ప్రకృతిమాత ప్రత్యేకంగా మనమీద శీతకన్ను వేయకపోతే మాత్రం, మన జీవితాంతం లోపునే మనం ఈ తమాషా చూస్తాం!" (మార్క్స్ అప్పటికి యాభైతొమ్మిదేళ్లవాడు).

"ఈ తమాషా" చూసే వరకూ మార్క్స్‌ను జీవించి వుండడానికి అనుమతిచ్చింది కాదు ప్రకృతిమాత — అనుమతిచ్చేందుకు వీల్లేదు కూడాను. కాని, "రాజ్యాంగనిర్మాణ కపట నాటకం" జరుగుతుందని మాత్రం అతడు ముందుగానే జోస్యం చెప్పాడు. కాగా మొదటి, రెండవ రష్యన్ దూమల గురించి అతను రాసిన మాటలను చదువుతూంటే అతడు వాటిని నిన్న రాసినట్టు అనిపిస్తుంది. కాగా రాజ్యాంగనిర్మాణ కపటనాటకం" గురించి అతడు ప్రజలకు చేసిన హెచ్చరికే, లిబరల్సూ, అవకాశవాదులూ ఎంతగానో ద్వేషించినట్టి బహిష్కరణ ఎత్తుగడలకు "పంచప్రాణాలు" అని మనం ఎరుగుదుం...

1880 నవంబరు 5 న మార్క్స్ రాసిన ఈ లేఖ చూడండి. రష్యాలో "పెట్టుబడి" గ్రంథానికి లభించిన విజయం గురించి తెలుసుకుని అతడు ఆనందభరితుడై, కొత్తగా తలెత్తిన సాధారణ పునర్విభజన గ్రూపువాళ్లకు వ్యతిరేకంగా "ప్రజాభీష్టం" [నరోద్నయ వోల్య] సంఘం సభ్యుల పక్షం వహించాడు. ఈ కొత్త గ్రూపు యొక్క భావాల్లోని అరాచకవాద మూలద్రవ్యాలను మార్క్స్ సరిగా గమనించాడు. సోషల్-డెమోక్రాటుగా ఈ సాధారణ-పునర్విభజన-నరోద్నిక్కుల భావి పరిణామం అతనికి తెలియకపోబట్టి, అలా తెలుసుకునే అవకాశం అప్పట్లో అతనికి లేకపోబట్టి, తన వేళాకోళపు చురకలను తగిలిస్తూ సాధారణ పునర్విభజన వాళ్లమీద విరుచుకుపడతాడు.

''ఈ పెద్దమనుషులు రాజకీయ-విప్లవాత్మక కార్యాచరణ అంతటికీ వ్యతిరేకులు. రష్యా అంతర్ పల్లటీ ఒకటి కొట్టి అరాచకవాద-కమ్యూనిస్టు-నిరీశ్వరవాద సత్యయుగంలోకి దిగాలట. ఈలోపుగా దివంగతుడైన బకూనిన్ నాటినుండి వీధిలో పెట్టుకుని దొరంటపోయే వాళ్లందరికీ అమ్మజూపుతూన్న సూత్రాలంటూ ఏవో కలిగినట్టి వుత్త తలనొప్పి యెత్తించే ఛాందససిద్ధాంతతత్వంతో ఈ అంతర్ పల్లటీ కొట్టేందుకు వీళ్లు తయారవుతున్నారు.''

1905 లోనూ ఆ తరువాతి సంవత్సరాల్లోనూ రష్యాకి సోషల్-డెమోక్రసీ యొక్క ''రాజకీయ-విప్లవాత్మక కార్యాచరణ'' ప్రాముఖ్యతను మార్క్స్ ఎంతగా మెచ్చుకుని వుండేవాడో దీన్నిబట్టి మనకు తెలుస్తూంది.*

1887 ఏప్రిల్ 6 తేదీగల ఈ ఎంగెల్స్ లేఖ చూడండి: ''తత్ వ్యతిరేకంగా, రష్యాలో సంక్షోభం ఒకటి మీదపడడానికి సిద్ధంగా వుందేమో అన్నట్టు అవుపడుతూంది. ఇటీవలి హత్యా ప్రయత్నాలు అనుకున్నదాన్నంతా తలకిందులుచేసి పారేసినట్టే కనబడుతూంది....'' 1887 ఏప్రిల్ 9 లేఖ కూడా ఇలాగే చెబుతూంది... ''సేన అంతా అసంతుష్టి చెందినట్టీ, కుట్రలు పన్నుతూన్నట్టీ ఆఫీసర్లతో నిండివుంది.'' (''నరోద్నయ వోల్య'' [''ప్రజా భీష్టం''] వాళ్లు లేవదీసిన విప్లవాత్మక పోరాటం ఆనాడు ఎంగెల్స్‌పై గొప్ప ముద్ర వేసింది; ఆఫీసర్ల మీదే అతను ఆశపెట్టుకున్నాడు; కాగా పద్దెనిమిదేళ్ల తరువాత అంత దేదీప్యమానంగా సాక్షాత్కరించినట్టి రష్యన్ సైనికుల, నావికుల విప్లవాత్మక భావం అప్పటివరకూ అతనికి తెలియలేదు....) ''మరో సంవత్సరం వరకూ ఇలా సాగుతుందని నేననుకోను; రష్యాలో గనుక ఇంకొకసారి విప్లవం బద్దలైందంటే ("losgeht"), ఇక జేయ్!''

1887 ఏప్రిల్ 23 న రాసిన లేఖ ఇది: ''జర్మనీలో హింసాకాండ తరువాత హింసాకాండ'' (సోషలిస్టులపై) ''జరుగుతూంది. బిస్మార్క్ అంతా సిద్ధంచేసి పెట్టుకున్నట్టే కనబడుతూంది; ఇక దీనితో ఏమవుతూందంటే, రష్యాలో విప్లవం బద్దలయే ఉత్తరక్షణంలో, అది కూడా ఇక కొద్ది నెలల ప్రశ్నే, జర్మనీలో కూడా ఇక ఉపక్రమించడమే తరువాయి అన్నమాట'' ("losgeschlagen werden").

---

* అన్నట్టు, ''మన అభిప్రాయభేదాలు'' పైనా, రష్యాలో రాబోతూన్న విప్లవం స్వభావంపైనా ప్లెహానొవ్ పేర ఎంగెల్స్ రాసిన లేఖ ఎక్కడో వుందని, ప్లెహానొవో, వి.ఐ. జసూలిచో 1900–1903 లో నాతో చెప్పినట్టు, నేను పొరపడుతున్నానేమో చెప్పలేనుగాని, నాకు మాత్రం బాగా జ్ఞాపకం వుంది. ఇలాంటి వుత్తరం అంటూ ఒకటి వుందా, వుంటే అది ఎక్కడ వుంది, దానిని ప్రచురించే తరుణం ఆసన్నంకాలేదా, అని తెల్సుకోవడం ఎంతేనా ఆసక్తిదాయకంగా వుంటుంది.[103]

ఆ నెలలు ఎంతో సుదీర్ఘాలుగా, ఎంతో సుదీర్ఘాలుగా పరిణమించాయి. కనుబొమలు ముడిపెట్టుకుని, నుదురు గంటుపెట్టుకుని ఎంగెల్స్ యొక్క "విప్లవతత్వాన్ని" కఠినంగా అధిక్షేపించేటట్టీ, లేదా ఆ వృద్ధ విప్లవాత్మక ప్రవాసజీవి యొక్క పాతకాలపు ఊహాజగత్తుల పట్ల ముద్దుగా చిరునవ్వు నవ్వేటట్టీ అల్పబుద్ధులు వుండకపోరు, అందుకు సందేహంలేదు.

అవును, విప్లవం ఆసన్నమయే ముహూర్తాన్ని నిర్ణయించడంలో, విప్లవ విజయంలో తమకుండిన ఆశలలో (ఉదాహరణకు, 1848 లో జర్మనీలో), జర్మన్ "రిపబ్లిక్" అవతరణ సామీప్యంలోనూ (1848–1849 లో రైఖ్ రాజ్యాంగం కోసమై జరిపిన యుద్ధ చర్యలో పాల్గొనిన వ్యక్తిగా తన మనస్థితిని గుర్తుకు తెచ్చుకుంటూ, ఆ రోజుల గురించి, "రిపబ్లిక్ కోసం ప్రాణత్యాగం" అని రాశాడు ఎంగెల్స్[104]) మార్క్స్, ఎంగెల్స్లు అనేకసార్లు తరుచుగానే పొరపాట్లు చేశారు. తాము (తన గురించి, తనకు అత్యంత సన్నిహితులైన మిత్రులను గురించి రాస్తూ, బెకెర్ "మేము" అనే పదం ఉపయోగిస్తాడు: 1871 జూలై 21 తేదీగల 14 వ లేఖ), "దక్షిణ ఫ్రాన్సులో తిరుగుబాటును లేవనెత్తడం"లో మానవులకు సాధ్యమైన దానినంతనూ ఒడ్డి పాల్గొన్నప్పుడు 1871 లో పొరపడ్డారు. అదే లేఖలో ఇలా వుంది: "మార్చి, ఏప్రిల్ నెలలలో మాకు ఇంకా అధికంగా సాధనసంపత్తి చిక్కివుండినట్టయితే, దక్షిణ ఫ్రాన్సు నంతటినీ తిరుగుబాటులోకి దింపి, ఆ విధంగా పారిస్లో కమ్యూన్ని రక్షించి వుండేవాళ్లం" (29 వ పుట). అయితేనేమి, అట్టి పొరపాట్లు — సర్వప్రపంచ శ్రామికవర్గాన్నీ చిల్లరమల్లర, దైనందిన, స్వల్ప కర్తవ్యాల స్థాయినుండి ఉన్నతస్థితికి లేవనెత్త యత్నించినట్టీ, లేవనెత్తినట్టీ విప్లవచింతనా దిగ్దంతుల పొరపాట్లు — విప్లవాత్మక గర్వాల గర్వం గురించీ, విప్లవపోరాట నిరర్థకత గురించీ విప్లవప్రతిఘాత "రాజ్యాంగబద్ధ" బుద్ధిభ్రమల గురించీ గానంచేస్తూ, పెడబొబ్బలు పెడుతూ, విజ్ఞప్తులు చేస్తూ, ఉద్ఘాటించేటట్టి అధికారయుత లిబరలిజం యొక్క చౌకబారు జ్ఞానం కంటె వెయ్యిరెట్లు ఉదాత్తములు, మహోజ్వలితములు, చారిత్రాత్మకంగా అమూల్యములు, యథార్థవంతములూనూ.

రష్యన్ కార్మికవర్గం తన విప్లవాత్మక కార్యాలచే, అవి పొరపాట్లతో నిండివున్నప్పటికీ కూడా, తన స్వేచ్ఛను సాధించుకుని యూరప్ పురోగమనాన్ని సుగమం చేస్తుంది — అల్పబుద్ధులు తమ విప్లవాత్మక కార్యరాహిత్య అమోఘత్వం గురించి ఆత్మస్తుతి చేసుకుంటే చేసుకుందురు గాక.

ఏప్రిల్ 6, 1907.

# రష్యాలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి

## బృహత్ పరిశ్రమకు దేశీయ మార్కెట్టు ఏర్పడే ప్రక్రియ

### ఖండిక

## రెండవ కూర్పు పీఠిక

ఈ పుస్తకం రష్యన్ విప్లవానికి ముందరి కాలావధి, 1895–1896 లో ప్రజ్వరిల్లిన పెద్ద సమ్మెలు తరువాత ప్రవేశించిన స్వల్పశాంతి కాలంలో రచించబడింది. ఆ కాలంలో కార్మికవర్గ ఉద్యమం, ఒక మోస్తరుగా చెప్పాలంటే, తనలో తాను నిమగ్నమైపోయి, విశాలంగానూ లోతుగానూ విస్తరిల్లుతూ, 1901 ప్రదర్శనల ఉద్యమ ప్రారంభానికి మార్గం సుగమం చేసింది.

ఆర్థిక గవేషణ, సంఖ్యావివరాల విమర్శనాత్మక విశ్లేషణ ప్రాతిపదికపై ఈ పుస్తకంలో వివరించబడినట్టి రష్యను సామాజిక-ఆర్థిక వ్యవస్థయొక్క, తదానుషంగికంగా వర్గ నిర్మాణంయొక్క విశ్లేషణ, విప్లవగమనంలో అన్ని వర్గాల బహిరంగ రాజకీయ కార్యాచరణవల్ల ధ్రువీకృతమైంది. శ్రామికవర్గంయొక్క నాయకత్వపు పాత్ర పూర్తిగా బహిరంగపరచబడింది. మొత్తం జనసంఖ్యలో శ్రామికవర్గంయొక్క భాగంకంటె, చారిత్రాత్మక ప్రక్రియలో దాని బలం లెక్కలేనన్ని రెట్లు అధికమని కూడా బహిరంగపరచబడింది. ఈ రెండు దృగ్విషయాలకూ గల ఆర్థిక ప్రాతిపదిక ప్రస్తుత గ్రంథంలో రుజావుచేయబడింది.

ఇంతేకాకుండా, రైతాంగానికున్న ద్వంద్వ స్థానాన్నీ ద్వంద్వ పాత్రనూ ఇప్పుడు విప్లవం అంతకంతకు మరింత అధికంగా బహిరంగ పరుస్తూంది. ఇటు రైతాంగపు పేదలలో ప్రబలివున్నట్టి ఇంతవరకెన్నడూ ఎరగనంతటి దౌర్భాగ్యమూ వినాశాలతోపాటు వెట్టిచాకిరీ ఆర్థికవ్యవస్థయొక్క బ్రహ్మాండములైన అవశేషాలూ, భూదాస్య వ్యవస్థయొక్క అన్ని రకాల అవశేషాలూ విప్లవాత్మక రైతు ఉద్యమానికున్న లోతైన మూలాధారాలనూ, ఒక ప్రజారాశిగా రైతాంగపు విప్లవాత్మక స్వభావంయొక్క లోతువేళ్ళనూ పూర్తిగా విశదపరుస్తున్నాయి. అటు, విప్లవగమనంలో, వివిధ రాజకీయ పార్టీల స్వభావమూ, అనేక భావశాస్త్రీయ-రాజకీయ ధోర

ణులూ ఈ రాశియొక్క స్వతస్సిద్ధమైన వర్గ వైరుధ్య రచననూ, దాని పెట్టీబూర్జువా స్వభావాన్నీ, దానిలోపల వున్న యాజమాన్య, శ్రామికవర్గ ధోరణుల రెండింటి మధ్యనున్న వైషమ్యాన్నీ బైటపెట్టుతున్నాయి. సన్నకారు ఉత్పత్తిదారులలో అల్పాతి అల్పసంఖ్యాకులు ధనవంతులవుతూ "ప్రపంచంలో ముందుకొస్తూ" బూర్జువాగా మారిపోతూండగా, ప్రబల సంఖ్యాకులు సంపూర్ణంగా నాశనమైపోయి, కూలికార్మికులుగానో బికారులుగానో అయిపోయో, లేదా శాశ్వతంగా ఇంచుమించు శ్రామికులలాగానే బతుకులు ఈడుస్తూండేటట్టి, ప్రతి పెట్టుబడిదారీ సమాజంలోనూ నెలకొనివున్నట్టి ఈ దృగ్విషయం ఎంత అనివార్యమో, విప్లవప్రతీఘాత బూర్జువా వర్గానికీ విప్లవ శ్రామికవర్గానికీ మధ్య నిర్భాగ్యుడైన సన్నకారు యజమాని ఊగిసలాట కూడా అంత అనివార్యమే. ప్రస్తుత వ్యాసంలో, రైతాంగంలోవున్న ఈ రెండు ధోరణుల ఆర్థిక ప్రాతిపదిక రుజువు చేయబడుతుంది.

ఈ ఆర్థిక ప్రాతిపదికతో రష్యాలోని విప్లవం అనివార్యంగా బూర్జువా విప్లవమే అయి తీరడం సహజమే. ఈ మార్క్సిస్టు ప్రమేయం కేవలం నిర్వివాదం. దీనిని ఎన్నడూ మరచి పోకూడదు. రష్యన్ విప్లవంయొక్క అన్ని ఆర్థిక, రాజకీయ సమస్యలకూ దీనిని ప్రయుక్తం చేసితీరాలి.

కాని దీనిని ఏలాగు ప్రయుక్తం చేయాలో మనం తెలుసుకోవాలి. ఒక ఫలానా సమస్యకు ప్రయుక్తం చేసినప్పుడు ఈ సత్యంయొక్క నిశితమైన ప్రాముఖ్యాన్ని నిర్వచించేందుకు, భిన్నభిన్న వర్గాల ప్రతిపత్తులు, ప్రయోజనాల నిర్దిష్ట విశ్లేషణ ఒక సాధనంగా వినియోగ పడాలి. ప్లెహానొవ్ నాయకత్వాన కుడిపక్షపు సోషల్-డెమొక్రాట్లలో తరుచుగా తారసిల్లుతూ వ్నట్టి తత్ వ్యతిరేక హేతువాద విధానం, అనగా మన విప్లవంయొక్క మౌలిక స్వభావం గురించిన సాధారణ సత్యంయొక్క సరళమైన తార్కిక అభివృద్ధిలో, నిర్దిష్టప్రశ్నలకు జబాబుల కోసం వెతకే యత్నం, మార్క్సిజాన్ని అపభ్రంశ పరచడమూ గతితార్కిక భౌతిక వాదాన్ని అవహేళన చేయడమూ తప్ప మరేమీ కాదు. విప్లవానికున్న స్వభావంయొక్క సాధారణ సత్యం నుండి, ఉదాహరణకు విప్లవంలో "బూర్జువావర్గం" యొక్క నాయకత్వపు పాత్రనూ, లేదా సోషలిస్టులు లిబరల్సును బలపర్చాల్సిన అవసరాన్నీ ఎవరైనా ఊహ చేసినట్టయితే, అట్టివారిని గురించి, ఒక సందర్భంలో హైనె నుండి తాను ఉల్లేఖించినట్టి: "రాక్షస దంతాలను నేను విత్తనాలుగా చల్లాను, పుష్కలంగా పండాయి పేలు" అనే మాటలను మార్క్స్ బహుశా పదేపదే ఉద్ఘాటించి వుండేవాడు.

ప్రస్తుతపు ఆర్థిక విధానాన్ని ప్రాతిపదికగా కలిగివుండడం వల్ల, రష్యన్ విప్లవం యొక్క అభివృద్ధిలోనూ ఫలితాలలోనూ రెండు ప్రధాన పంథాలు బాహ్యగతాత్మకంగా సాధ్యం కావచ్చు:

భూదాస్య వ్యవస్థతో వేలాది శృంఖలాలతో బంధించబడి వున్నట్టి పాతకాలపు భూస్వామ్య ఆర్థికవ్యవస్థ నిలబెట్టబడి, స్వచ్ఛమైన పెట్టుబడిదారీ విధానపు ''యుంకర్''* వ్యవస్థగా మెల్లగా మార్పుచెందుతుంది. శ్రమసేవ నుండి పెట్టుబడిదారీ విధానానికి సంపూర్ణ పరివర్తనయొక్క ప్రాతిపదిక, ఫ్యూడలిస్టు విధానపు భూస్వామ్య వ్యవస్థలోని అంతరిత రూపభేదమే. రాజ్యాంగయంత్రం యొక్క వ్యవసాయసంబంధపు వ్యవస్థ యావత్తూ పెట్టుబడిదారీ విధానపు వ్యవస్థగా తయారయి, ఫ్యూడలిస్టు ఆకృతులను చాలాకాలం వరకూ నిలబెట్టుకుంటుంది. లేదా అంటే, భూదాస్య వ్యవస్థ యొక్క అన్ని అవశేషాలనూ, బడా భూస్వామ్యాన్ని ప్రప్రథమంగా ధ్వంసం చేసివేసే విప్లవంవల్ల పాతకాలపు భూస్వామ్య ఆర్థికవ్యవస్థ భగ్నమవుతుంది. రైతాంగపు ప్రయోజనాల కోసం భూస్వాముల నుండి వారి జమీలను లాక్కోవడం ఫలితంగా గొప్ప ఉరవడి పొందినట్టి సన్నకారు రైతువ్యవసాయం యొక్క స్వేచ్ఛాయుతమైన అభివృద్ధే, శ్రమసేవనుండి పెట్టుబడిదారీ విధానంలోకి జరిగే సంపూర్ణ పరివర్తనకు ప్రాతిపదిక. భూసంబంధ వ్యవస్థ యావత్తూ పెట్టుబడిదారీ వ్యవస్థగా మారిపోతుంది, ఎందుకంటే భూదాస్యవ్యవస్థ అవశేషాలు ఎంత సంపూర్ణంగా ధ్వంసమవుతే, అంత త్వరితగతిని రైతాంగంలో విభేదీకరణం సాగుతుంది. ఇదే వేరే మాటల్లో చెప్పాలంటే: ప్రథమంగా, భూయాజమాన్యాన్నీ, పాతకాలపు ''పై కట్టడాలకు'' వున్నట్టి దన్నులనూ అట్టేపెట్టి వుంచడమూ; ఇందువల్ల లిబరల్-రాచరిక పక్షాన్ని బలపరచే బూర్జువా యొక్క, భూస్వామియొక్క ప్రాబల్యమూ, వీరి పక్షంవైపుగా సంపన్న రైతాంగం త్వరితగతిని పరివర్తన చెందడమూ, విస్తృతస్థాయిని అస్తి హక్కులు లాగివేయబడడమే కాకుండా అందుకు తోడు కాడెట్లచే ఏదో ఒక రూపంలో ప్రతిపాదించబడినట్టి భూమి-విడుదల చెల్లింపుల వల్ల బానిసలుగా చేయబడి, అభివృద్ధి నిరోధకానికివున్న రాజ్యపాలనాధికారం వల్ల అణగదొక్కబడి మందమతులుగా చేయబడినట్టి రైతు ప్రజారాసుల హీనస్థితి; ఇటువంటి బూర్జువా విప్లవాన్ని అమలు జరిపేవారు అక్టోబ్రిస్టులను[105] పోలిన రకం రాజకీయవేత్తలే అవుతారు. లేదా అంటే — భూస్వామ్యవ్యవస్థనూ, దానికి అనుగుణమైనట్టి పాతకాలపు ''పైకట్టడాలకు'' ముఖ్యమైన దన్నులన్నింటినీ ధ్వంసం చేయడమూ; అస్థిరములైనట్టి, లేదా విప్లవప్రతిఘాత బూర్జువావర్గాన్ని తటస్థీకరణం చేయడంతోపాటు శ్రామికవర్గ, రైతు ప్రజారాసుల ప్రబలమైన పాత్ర; సరుకుల ఉత్పత్తి పరిస్థితిలో కార్మిక, రైతు ప్రజారాసుల అత్యంత అనుకూలసాధ్యములైన స్థితిగతుల కింద పెట్టుబడిదారీ విధాన ప్రాతిపదికపై ఉత్పాదక శక్తుల అత్యంత స్వేచ్ఛాయుతమైన అభివృద్ధి; ఇందువల్ల సోషలిస్టు పునర్నిర్మాణమూ, కార్మిక

---

* భూస్వామ్య ప్రభువు — అనువాదకుడు.

వర్గంచే దానికి ఆధారమైనట్టీ మౌలికమైనట్టీ కర్తవ్యసాధనను మరింత ముందుకు తీసు కొనిపోవడానికై అత్యంతానుకూల సాధ్యమైన స్థితిగతులను స్థాపించడం. పెట్టుబడిదారీ వ్యవస్థా పరిణామంయొక్క రకాలలో ఈ రకంయొక్క గాని, ఆ రకంయొక్కగాని మూల ద్రవ్యాల యొక్క అసంఖ్యాకములైన నానావిధ సంయోగాలు సాధ్యమవడం సహజమే, కాగా, తలెత్తుతూన్నట్టి అసాధారణ సంక్లిష్ట సమస్యలను, ఒక విభిన్న చారిత్రాత్మక శకం గురించి మార్క్స్ వెలిబుచ్చిన ఈ అభిప్రాయాన్నో ఆ అభిప్రాయాన్నో వూరకే ఉదాహరించడం వల్లనే పరిష్కరించ యత్నించడానికి కేవలం పండితప్రకాండులు మాత్రమే పూనుకుంటారు.

ఇప్పుడు పాఠకునికి అందిస్తూన్న వ్యాసం రష్యాలోని విప్లవాత్పూర్వపు ఆర్థికవ్యవస్థ విశ్లేషణకు వినియోగించబడుతూంది. ఒక విప్లవాత్మక శకంలో దేశంలోని జీవితం ఎంత జోరుగానూ ఎంతటి ఉరవడితోనూ సాగిపోతుందంటే, ఇక రాజకీయ పోరాట ఉద్రిక్తతలో ఆర్థిక పరిణామం ప్రధాన ఫలితాలను నిర్వచించడమే దుస్సాధ్య మవుతుంది. ఇటు శ్రీయుతులు స్తొలీపిన్‌లూ, అటు లిబరల్సూ (కాగా, స్త్రూవే రకం కాడెట్లే కాకుండా, కాడెట్లు అందరూనూ), మొదటి నమూనా ప్రకారం విప్లవాన్ని సాధించేందుకు వ్యవస్థాబద్ధంగానూ, మొండి పట్టుదలతోనూ, సుసంగతంగానూ కృషిచేస్తున్నారు. ఇటీవల మనం అనుభవించిన 1907 జూన్ 3 వ తేదీ రాజ్యాంగంపై దెబ్బతీత,[106] రష్యన్ ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తూందని చెప్పబడుతూన్న సంస్థలో భూస్వాముల సంపూర్ణ ప్రాబల్యాన్ని సుస్థిరం చేసేందుకు పాటుపడుతూన్నట్టి విప్లవప్రతీఘాతకం యొక్క విజయానికి ఒక చిహ్నం. అయితే ఈ "విజయం" ఎంతవరకూ శాశ్వతం అనేది వేరే విషయం. విప్లవం రెండవ ఫలితం కోసమై పోరాటం సాగుతూనే వుంటుంది. ఈ ఫలితం కోసమై ఒక్క శ్రామికవర్గమే కాదు, రైతాంగంలోని విస్తృత ప్రజారాసులు కూడా ఇంచుమించు దృఢసంకల్పంతోనూ, ఇంచుమించు సుసంగతంగానూ, ఇంచుమించు చైతన్యవంతంగానూ పాటుపడుతున్నారు. ప్రత్యక్ష రాశి పోరాటాన్ని నగ్నమైన దౌర్జన్య ప్రయోగంవల్ల నొక్కేయడానికి విప్లవప్రతీఘాతం ఎంత ప్రయత్నించినప్పటికీ, తుచ్ఛమైనట్టీ కపటమైనట్టీ తమ విప్లవప్రతీఘాత భావాల మూలంగా కాడెట్లు దాని పీకనొక్కేయడానికి ప్రయత్నించినప్పటికీ, ఏమి జరిగినప్పటికీ, ఆ పోరాటం ఇప్పుడు ఇక్కడా అప్పుడు అక్కడా ప్రజ్వరిల్లుతూ, మితవాదులైనట్టీ ఛాందస ప్రతిష్ఠ పట్టింపులు గలిగినట్టీ అల్పబుద్ధులకూ, లేక బ్యూరోక్రాట్లకూ స్వాభావికమైన ఆత్మసంతృప్తితోనూ, ద్రోహము, మొల్చాలిన్‌తత్వము[107] లతోనూ పరితప్తమైన కాడెట్లు భావంతో పెట్టీ బూర్జువా రాజకీయవేత్తల (ప్రత్యేకంగా "పాప్యులర్ సోషలిస్టుల," త్రుదొవీక్‌ల) ఉన్నత శ్రేణులు నిస్సందేహంగా కలుషితమైనప్పటికీ, "శ్రమ," నరోద్నిక్ పార్టీల విధానంపై తన ముద్రను వేస్తూనే వుంది.

ఈ పోరాటం ఎలా అంతమవుతుందో, రష్యన్ విప్లవం మొదటి విజృంభణ అంతిమ ఫలితం ఎలా వుంటుందో — ఇప్పుడు చెప్పడం దుస్సాధ్యం. అందుచేత ఈ వ్యాసం సాంగో పాంగంగా పునర్విమర్శించడానికి* కాలం ఇంకా ఆసన్నం కాలేదు (అంతేకాకుండా, కార్మికవర్గ ఉద్యమంలో పాల్గొంటూన్న వ్యక్తి నెరవేర్చాల్సిన తక్షణ పార్టీ విధులు తీరికకు అవకాశమే ఇవ్వవు). ఈ రెండవ కూర్పు రష్యాలో విప్లవానికి పూర్వం వుండిన ఆర్థికవ్యవస్థ స్వాభావాన్ని నిర్ణయించే పరిమితులను దాటడానికి వీలుపడదు. వ్యాసాన్ని పునః పరిశీలించి, వాచకం సవరించి, దరిమిలా నిన్నమొన్నటి గణాంకశాస్త్రీయ సాధనసామగ్రిలో అత్యంతావశ్యకములు అయిన వాటిని చేర్చ డానికే రచయిత పరిమితం కావాల్సి వచ్చింది. ఇవి ఇటీవలి అశ్వ జనాభా పంట లెక్కల దత్తాంశాలు, 1897 రష్యా జనాభా పట్టికలు, ఫ్యాక్టరీ, కార్ఖానా కొత్త లెక్కలనుండి దత్తాంశాలు వగైరాలు.

గ్రంథకర్త.

జూలై 1907.

---

*ఆటువంటి పునర్విమర్శ చేయాలంటే ప్రస్తుత గ్రంథానికి ఉత్తరగ్రంథం ఒకటి బహుశా అవసరమవుతుంది. అటువంటప్పుడు, విప్లవాత్పూర్వం వుండిన రష్యన్ ఆర్థిక వ్యవస్థ విశ్లేషణకే మొదటి సంపుటం పరిమితమై వుంటూ, విప్లవ విజయాల అధ్యయనం కోసం రెండవ సంపుటాన్ని వినియోగించాల్సి వుంటుంది.

# బోయ్‌కాట్‌కు వ్యతిరేకం

## సోషల్-డెమోక్రాటిక్ పత్రికావ్యాసరచయిత వివరణలు

### ఖండికలు

### V

బహు ఘటనా సంతృప్తమై వీరోచితమైన రష్యన్ విప్లవ కాలావధియొక్క చక్కని విప్లవాత్మక సంప్రదాయాలలో బోయ్‌కాట్ [బహిష్కరణ] ఒకటి. ఈ సంప్రదాయాలను సాధారణంగా జాగ్రత్తతో భద్రపరచడమూ, వాటిని పెంచి ప్రోదిచేయడమూ, వాటిని లిబరల్ (దీనితో సహా అవకాశవాద) పరాన్నభుక్కు మలినం నుండి శుద్ధి చేయడమూ మన కర్తవ్యాలలో ఒకటని మనం పైన చెప్పాం. దీని అంతరార్థమేమిటో నిశితంగా నిర్వచించేందుకూ, సులభంగా పొడసూప గలిగే అపార్థాలనూ అపోహలనూ తొలగించేందుకూ ఈ కర్తవ్యాన్ని విశ్లేషించేందుకుగాను ఇక్కడ మనం ఒక క్షణం ఆగలి.

పరిస్థితుల బాహ్యగతాత్మక స్థితిగతుల విశ్లేషణలోనూ పరిణామంయొక్క బాహ్యగతాత్మక గమన విశ్లేషణలోనూ సంపూర్ణమై శాస్త్రీయ గంభీరతను, ప్రజారాసుల విప్లవాత్మక శక్తి, విప్లవసృజనాత్మక ప్రతిభ, విప్లవాత్మక చొరవలయొక్క — అంతేకాకుండా, సహజంగానే, వివిధ వర్గాలను ఆవిష్కరించగల్గి, వాటితో సంబంధాలు ఏర్పరచుకొనగల్గిన వ్యక్తులు, గ్రూపులు, ఆర్గనైజేషన్లు, పార్టీలయొక్క ప్రాధాన్యతను అత్యంత స్పష్టమైన గుర్తింపుతో అద్భుతంగా మిళితంచేసే విధంలోనే మార్క్సిజం అన్ని ఇతర సోషలిస్టు సిద్ధాంతాలనుండీ భేదించుతూంది. మానవాళి అభివృద్ధిలో విప్లవాత్మక కాలావధులను ఉదాత్తంగా విలువ కట్టడం, చరిత్రపై మార్క్సుకుగల మొత్తం అభిప్రాయాల నుండి తర్కశాస్త్రానుసారంగా తేల్తుంది. ఇటువంటి కాలావధులలోనే, శాంతియుతమైన అభివృద్ధి కాలావధులని చెప్ప బడతూండే వాటిలో మెల్లమెల్లగా సంచయమయే వైరుధ్యాలు పరిష్కారమౌతాయి. ఇటువంటి కాలావధులలోనే, సామాజిక జీవిత రూపాలను నిర్ణయించడంలో వివిధ వర్గాల సూటి పాత్ర అత్యంత పటుతర శక్తితో సాక్షాత్కృతమై, కొత్త ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదికపై తదుపరి చాలాకాలం వరకూ సాగేటట్టి రాజకీయ ''పైకట్టడాల నిర్మాణానికి'' శంకుస్థాపన జరుగుతుంది. కాగా బూర్జువా లిబరల్ సిద్ధాంతకర్తలు భావించేటట్టుగా ఈ కాలావధులను

''మామూలు'' మార్గం నుండి అతిక్రమణలుగా, ''సామాజిక రుగ్మత''యొక్క సాక్షాత్కార ములుగా అంత్యస్థానాలయొక్క, పొరపాట్లయొక్క శోచనీయములైన ఫలితాలుగా భావించ కుండా, మానవ సమాజాల చరిత్రలో అత్యంత ముఖ్యములూ, ప్రధానములూ, నిర్ణయాత్మ కములూ అయిన క్షణాలుగా వాటిని మార్క్స్ భావించాడు. మార్క్స్, ఎంగెల్స్‌ల సొంత క్రియాకలాపాలలోనే 1848–1849 రాశి విప్లవ పోరాటంలో వారు పాల్గొన్న కాలావధి ఒక కేంద్ర బిందువుగా ప్రాధాన్యత వహిస్తూంది. భిన్నభిన్న దేశాలలోని కార్మికుల ఉద్యమమూ, ప్రజాస్వామ్యమూయొక్క విధికృతాన్ని నిర్ణయించేటప్పుడు వారు ఈ బిందు స్థానంనుండే బయల్దేరేవారు. వివిధ వర్గాలయొక్క, వాటి ధోరణులయొక్క సహజప్రకృతిని అత్యంత స్పష్ట మైన, స్వచ్ఛమైన రూపంలో నిర్వచించడానికి ఈ బిందుస్థానానికే వారు ఎల్లప్పుడూ తిరిగి చేరుకునేవారు. ఆ కాలపు విప్లవాత్మక కాలావధి దృక్స్థానం నుండే, ఆ తరువాత వచ్చినట్టి చిన్నచిన్న రాజకీయ రూపకరణములనూ, ఆర్గనైజేషన్లనూ, రాజకీయ కర్తవ్యాలనూ, రాజ కీయ సంఘర్షణలనూ వారు ఎల్లప్పుడూ విలువకట్టేవారు. సోంబార్ట్ లాంటి లిబరలిజం భావశాస్త్రవేత్తలు మార్క్స్ క్రియాకలాపాలలోని, రచనలలోని ఈ లక్షణాన్ని మనస్ఫూర్తిగా ద్వేషించారంటేనూ ''విదేశ ప్రవాసికి వుండే దుగ్ధ'' దీనికి కారణమని వారు ఆరోపించారం టేనూ పూరకనేకాదు మరి. మార్క్స్, ఎంగెల్స్‌ల విప్లవాత్మక దృక్పథంలోని అవిభాజ్యమైన అంశీభూతం ఏదైతే వుందో దానికి కారణం వ్యక్తిగత దుగ్ధ, విదేశ ప్రవాసజీవితపు వ్యక్తిగత ఇబ్బందులే అని చెప్పడం చూస్తే, అది సరిగ్గా పోలీసు-బూర్జువా యూనివర్సిటీ విజ్ఞాన శాస్త్రపు క్షుద్రజంతువులకు సరిగ్గా తగినట్టుగానే వుంది!

తాను రాసిన ఒక లేఖలో, కూగెల్‌మన్ పేర రాసిన దానిలోనే అని నేననుకుంటాను, అత్యంత స్వాభావికమైనట్టీ, మనమిప్పుడు చర్చించుతూన్న ప్రశ్న దృక్స్థానంనుండి ప్రత్యే కంగా ఆసక్తిదాయకమైనట్టీ, ఒక వ్యాఖ్యానం చేస్తాడు మార్క్స్ ప్రసంగవశాత్తూనూ. 1848 నాటి విప్లవ శక స్మృతులనూ సంప్రదాయాలనూ ప్రజల మనస్సులనుండి రూపు రేఖల్లేకుండా తుడిచి పెట్టేయడంలో జర్మనీలోని అభివృద్ధి నిరోధకం ఇంచుమించు విజయం సాధించిందనే అతడంటాడు.[108] ఫలానా దేశపు విప్లవాత్మక సంప్రదాయాల సందర్భంలో అభ్యు దయ నిరోధకంయొక్క లక్ష్యాలకూ శ్రామికవర్గ పార్టీ లక్ష్యాలకూ గల తేడా మనకిక్కడ అద్భుతంగా చూపబడుతూంది. ఈ సంప్రదాయాలను రూపుమాపి, విప్లవాన్ని ''పంచ భూతాల పైత్యవికారం''గా – జర్మన్ భాషలో "das tolle Jahr" (''వెర్రి సంవత్సరం'' – 1848 సంవత్సరానికి జర్మన్ పోలీసు-బూర్జువా చరిత్రకారుల చేతనూ, అంతకంటె తరుచుగానే జర్మన్ యూనివర్సిటీ ప్రొఫెసర్ల చరిత్రరచనలోనూ ప్రయుక్తం చేయబడిన ఉక్తి) అనే పదానికి స్వతంత్ర అనువాదం – ప్రదర్శించడమే అభివృద్ధి నిరోధకం

యొక్క లక్ష్యం. విప్లవాత్మక శకంచే బహుళసంఖ్యలోనూ రూపవైవిధ్యంలోనూ ప్రభావితం చేయబడినట్టి పోరాట రూపాలను ప్రజలచే మరపింప చేయడమే అభివృద్ధి నిరోధకం యొక్క లక్ష్యం. చార్టిజాన్ని, ఇంగ్లీషు కార్మికోద్యమంలోని విప్లవాత్మక శకాన్ని, ఇంగ్లీషు అల్పబుద్ధి తత్వం యొక్క బుద్ధిమాంద్యులైన భట్రాజులు వెబ్‌లు కేవలం పసిపిల్లల చేష్టలుగానూ, ''కుర్రకారుల ఆగడం'' గానూ, పెద్దగా పట్టించుకోవాల్సినంత అవసరమే లేని నిర్వ్యాజ ప్రవర్తనగానూ, యాదృచ్ఛికమూ అస్వాభావికమూ అయిన తప్పుడు పంథాగానూ ప్రదర్శించ ప్రయత్నించినట్టే, జర్మనీలోని 1848 సంవత్సరాన్ని జర్మన్ బూర్జువా చరిత్రకారులు నేటికి సహితమూ చిత్రించయత్నిస్తున్నారు. అపరిమిత కిరాతక ద్వేషం పురికొల్పుతూన్న దనే వాస్తవవిషయం వల్ల మానవాళిపై తనకున్న ప్రభావంయొక్క సజీవత్వాన్నీ శక్తినీ ఈ నాటికి కూడా బహిర్గత పరచుకుంటూన్నట్టి మహత్తర ఫ్రెంచి విప్లవం పట్ల అభివృద్ధి నిరోధకులు ఇదే వైఖరి ప్రదర్శిస్తున్నారు. కాగా ఇదే విధంగా మన విప్లవప్రతీఘాత వీరులు, ప్రత్యేకంగా స్త్రూవె, మిలుకోవ్, కిజెవెట్టర్ ఇంకా "tutti quanti"* వెనకటి ''డెమోక్రాట్లూ'' రష్యన్ విప్లవాత్మక సంప్రదాయాలపై విషపూరితమైన అభాండా లను మోపడంలో ఒకరితో ఒకరు పోటీ పడుతున్నారు. పాత పరిపాలనా వ్యవస్థ తాలూకు లిబరల్ బంట్లు మహదానందం పొందుతూన్నట్టే, ఆ రవంత స్వేచ్ఛనూ సూటి రాశిపోరా టం సాధించి ఇంకా రెండేళ్లైనా తిరిగాయో లేనేలేదో, అప్పుడే మన ప్రచలిత పత్రికావ్యాస సారస్వతంలో లిబరల్ (!!) అని తనకుతానుగా పేరు పెట్టుకున్న కాడెట్ పత్రికాప్రపంచం దోహదం చేస్తూన్నట్టే, మన విప్లవాన్నీ, మన విప్లవాత్మక పోరాట విధానాలనూ, విప్లవాత్మక నినాదాలనూ, విప్లవాత్మక సంప్రదాయాలనూ హేయము, ప్రాక్తనము, సత్యకాలము, ఆదిశక్తి స్వరూపము, ఉన్మాదమూ, వగైరా అనీ... చిట్టచిట్టవరకు శిక్షార్హమైన అపరాధమనీ చిత్రించేందుకే తన శక్తినంతనూ వినియోగించుతూన్నట్టి ధోరణి ఒకటి అప్పుడే తలెత్తింది... మిలుకోవ్ నుండి కమిషాన్‌స్కీకి il n'y a qu'un pas!** అటువైపు చూస్తే, మొదట ప్రజలను, కార్మిక రైతు ప్రతినిధుల సోవియట్లనుండి దుబాసొవ్-స్తొలీపిన్ దూమలలోకి తరమడం లోనూ, ఇక ఇప్పుడు ప్రజలను అక్టోబ్రిస్టు దూమలోకి తరమడంలోనూ అభివృద్ధి నిరోధకం సాధించిన విజయం, రష్యన్ లిబరల్ వీరులకు ''రష్యాలో రాజ్యాంగబద్ధ చైతన్యాభివృద్ధి విధా నం''గా కనబడుతూంది.

* ఈలాంటి యావన్మంది — అనువాదకుడు.

** ఇంకొక్క అడుగే! — అనువాదకుడు.

మన విప్లవాన్ని అత్యంత జాగ్రత్తగా సాంగోపాంగంగా అధ్యయనం చేయడమూ, దాని పోరాట రూపాలు, ఆర్గనైజేషనల్ రూపాలు వగైరాలను ప్రజారాసులకు పరిచయం చేయడమూ, ప్రజలలో విప్లవాత్మక సంప్రదాయాలను బలపర్చడమూ, కేవలంగానూ ఏకైకంగానూ విప్లవాత్మక పోరాటం ద్వారానే ముఖ్యమైనట్టి చిరకాలం నిలబడేటట్టి మెరుగు పరిస్థితులను సాధించడానికి వీలవుతుందనే విశ్వాసాన్ని ప్రజారాసులలో నెలకొల్పడమూ, ''రాజ్యాంగ బద్ధ'' బానిస మనస్తత్వపు ద్రోహపూరిత మొల్చాలిన్‌తత్వ విషవాయువులతో సామాజిక వాతావరణాన్ని కలుషిత పరుస్తూన్నట్టి ఆత్మసంతృప్తి పరులైన లిబరల్సు యొక్క శుద్ధ నైచ్యాన్ని వ్యవస్థాబద్ధంగా బట్టబయలు చేయడమూ నిస్సందేహంగా సోషల్-డెమోక్రాట్ల విధ్యుక్తధర్మం. స్వేచ్ఛాపోరాట చరిత్రలో, బాధ్యతారహితుడైన రాజు, రాజ్యాంగబద్ధమైన రాజరికం అనే విషయం గురించి డూమాలో నెలల తరబడి చేయబడిన బానిసమనస్తత్వపు కాడెట్ ఉపన్యాసాలకంటె, అక్టోబరు సమ్మెలోని, లేదా డిసెంబరు ఉపప్లవంలోని ఒక్కరోజు నూరురెట్లు ప్రాముఖ్యతను కలిగివుంటుంది. స్తొలీపిన్నూ, అతని సాయుధపోలీసు సెన్సార్ల పరివారమూయొక్క కరుణారసపూరితమైన అంగీకారంతో మన పార్టీ లిబరల్ పత్రికలూ పార్టీరహిత ''డెమోక్రాటిక్'' (థూ! థు!) పత్రికలూ అంత ఉత్సాహంతో పొగడుతూన్నట్టి ''రాజ్యాంగబద్ధమైన'' శ్వాసావరోధపు, బలలైకిన్-మొల్చాలిన్[109] ఐశ్వర్య భరితములైన మాసాలు కంటె, జీవకళాపూరితమూ విషయగర్భితమూ అర్థవంతమూ అయినట్టి మహత్తర ప్రాముఖ్యతను కల్గినట్టి ఆ రోజులు గురించే అంతకు మరింత సవివరంగా మౌలికంగా ప్రజలు తెలుసుకొనేటట్టు మనం చూడాలి — ఎందుచేతంటే, ఈ పని మనం చేయకపోతే ఇంకెవ్వరూ చేయరు.

గతకాలపు శ్రేష్ఠ విప్లవాత్మక సంప్రదాయాన్ని పెంచి ప్రోదిచేయడానికి ధైర్యవంతమైనట్టి బహిరంగమైనట్టి సంకల్పశీలమైనట్టి పోరాటమనే అగ్నికణంతో, నిస్పృహజనకమైనట్టి కళా విహీనమైనట్టి నిర్జీవమైనట్టి చిత్తడినేల ప్రదేశాన్ని పునరుజ్జీవింప చేయడానికి విప్లవకారులయొక్క ఈ శ్లాఘనీయమైన యత్నాలవల్లనే అనేక సందర్భాల్లో బోయ్‌కాట్ పట్ల సానుభూతి సరాసరి సృష్టించబడుతూండడం నిస్సందేహం. కాని విప్లవాత్మక సంప్రదాయాల పట్ల ఈ అభిమానాన్ని మనం పవిత్రంగా ఎంచుతున్నామనే అచ్చమైన కారణం చేతనే, ఒకానొక ఫలానా చారిత్రాత్మక శకానికి చెందిన నినాదాలలో ఒకదాని ప్రయుక్తం, ఆ శకం యొక్క ప్రధాన పరిస్థితులను పునః యథాస్థితికి తీసుకురాగలదనే అభిప్రాయానికి వ్యతిరేకంగా మన శక్తివంతమైన నిరసను మనం తెలపాల్సి వుంటుంది. విప్లవాత్మక సంప్రదాయాలను భద్రపరచడమూ నిరంతరాయమైన ప్రచారాందోళనలకూ పాత సమాజానికి వ్యతిరేకంగా ఒక సూటి అయిన సమరశీలమైన పోరాటంయొక్క పరిస్థితులను ప్రజారాసులకు పరి

చయం చేసేందుకూ వాటిని ఏలాగు ఉపయోగించడమో తెలుసుకోవడం ఒకటి; దానిని ఉత్పన్నం చేసేటట్టీ, దాని విజయానికి హామీ ఇచ్చేటట్టీ యావత్తు పరిస్థితుల మొత్తం నుండి బలవంతంగా వేరుచేయబడిన ఒక నినాదాన్ని పునశ్చరణచేసి, మౌలికంగా విభిన్నమైన పరిస్థితులకు ప్రయుక్తం చేయడం వేరొకటి.

విప్లవాత్మక సంప్రదాయాలను ఎంతో విలువైనవిగా భావించి, వాటిపట్ల పార్టీ పరిత్యాగ, లేదా అల్పబుద్ధితత్వ భావప్రదర్శనా ధోరణిని నిర్దాక్షిణ్యంగా దుయ్యబట్టినట్టి మార్క్స్, విప్లవకారులు ఆలోచనా శక్తిని కల్గివుండాలనీ, పోరాటం యొక్క పాత పద్ధతుల ప్రయుక్తానికై అవసరమయే పరిస్థితులను విశ్లేషణ చేయగల్గే శక్తిని కల్గివుండాలనీ, అంతేగాని కేవలం కొన్ని ప్రత్యేక నినాదాలను పునశ్చరణ చేయకూడదనీ కోరాడు. కొన్ని ప్రత్యేకములైన విప్లవ పోరాట పద్ధతులకు ఫ్రాన్సులోని 1792 ''జాతీయ'' సంప్రదాయాలు నమూనాగా బహుశా శాశ్వతంగానే వుండిపోతాయి; అయినప్పటికీ, అంతమాత్రాన ఈ సంప్రదాయాలను విభిన్నశక పరిస్థితులకు బదలాయించడమనే పొరపాటు చేయకూడదని 1870 లో తానిచ్చిన ప్రఖ్యాతమైన ఇంతర్నేషనల్ ''విజ్ఞాప్తి''లో ఫ్రెంచి శ్రామికవర్గాన్ని హెచ్చరించడానికి మార్క్సుకి ఇది ప్రతిబంధకం కాలేదు.

మన పరిస్థితులూ ఇలాంటివే. బోయ్‌కాట్‌ను ప్రయుక్తంచేసే పరిస్థితులను మనం అధ్యయనం చేయాలి; విప్లవం ఉచ్చదశకు వస్తూన్న క్షణాలలో (నిరర్థకంగా మార్క్సునామ స్మరణ చేస్తూన్న పండితప్రకాండులు ఏమి చెబుతూన్నా సరే, దానిని లెక్కచేయకుండా) బోయ్‌కాట్ పూర్తిగా న్యాయసమ్మతమైనట్టీ, ఒక్కొక్కప్పుడు ఆవశ్యకమే అయినట్టీ పద్ధతి అని ప్రజారాసుల మనస్సులో నాటుకునేటట్టు మనం చెయ్యాలి. కాని విప్లవం నిజంగా ఉచ్చంలోకి — బోయ్‌కాట్ ప్రకటించేందుకు మౌలికమైన స్థితిలోకి — వస్తూందా అనే ప్రశ్న, మనం స్వతంత్రంగా లేవనెత్తగలిగి, వాస్తవవిషయాల గంభీర విశ్లేషణా ప్రాతిపదికపైన నిర్ణయించగలిగి వుండాల్సినట్టి ప్రశ్న. మన శక్తిలో వున్నంత వరకూ ఇటువంటి ఉచ్చానికి మార్గం సుగమం చేయడం మన విధాయకం గాని, యుక్తమైన తరుణం వచ్చేటప్పటికల్లా బోయ్‌కాట్‌ను విసర్జించడం కాదు; కాని బూటకపు ప్రాతినిధ్యపు సంస్థ ప్రతి దానికీ, లేదా మరీమరీ బూటకమైన ప్రతిదానికీ బోయ్‌కాట్ నినాదం సాధారణంగా ప్రయుక్తం చేయడానికి వీలవుతుందని భావించడం మాత్రం కేవలమూ పొరపాటే అవుతుంది.

''స్వేచ్ఛాయుత దినాల్లో'' బోయ్‌కాట్‌ను సమర్థించడానికీ బలపరచడానికీ ఉపయోగించబడినట్టి వాదనలను తీసుకోండి; ఈ వాదనలను ఈనాటి పరిస్థితులకు సరాసరి అన్వయించడం ఎంత అసాధ్యమో మీరే వెంటనే తెలుసుకుంటారు.

1905 లోనూ 1906 ఆద్యంలోనూ బోయ్‌కాట్‌కు అనుకూలంగా మనం వాదించి నప్పుడు, ఎన్నికలలో పాల్గొనడం మన మనోనిబ్బరాన్ని అధ్వాన్న పరచేస్తుందనీ, మన స్థానాన్ని శత్రు వశం చేయడమే అవుతుందనీ, విప్లవాత్మకులైన ప్రజలను పెడదార్లు పట్టించే టట్లు చేయడమే అవుతుందనీ, జారిజమూ విప్లవప్రతిఘాతక బూర్జువావర్గమూ మధ్య ఒక ఒప్పందం కుదరడానికి దోహదకారి అవుతుందనీ ఇంకా ఈ మొదలైన వాటికీ మనం వాదించాం. ఈ వాదనలకు మౌలికమైన ఆధారవాక్యం, ఎల్లప్పుడూ బయటకు వ్యక్తంకానట్టి అయినప్పటికీ ఆ కాలంలో స్వయం ప్రత్యక్షమైనట్టిదిగా ఎల్లప్పుడూ ఊహచేయబడినట్టి ఆధారవాక్యం, ఏమిటి? ''రాజ్యాంగబద్ధమైన'' దారులు కాకుండా సూటి ద్వారాల కోసం వెతకి కనుగొనేటట్టి ప్రజారాసుల సంపన్నవంతమైన విప్లవశక్తే ఈ ఆధారవాక్యం. అభివృద్ధి నిరోధకానికి వ్యతిరేకంగా అవిచ్ఛిన్నమైన విజృంభణను, సాధారణ సంఘర్షణను బలహీనపర్చే ఉద్దేశ్యంతోనే శత్రువు బుద్ధిపూర్వకంగానే మనకు వశపరచిన స్థానాన్ని అక్రమించుకుని పరిరక్షించుకోవడంవల్ల శీఘ్రార్థంగా బలహీనపరచబడేటట్టి విజృంభణను, విప్లవం సాగి స్తూండేదనేదే ఈ ఆధారవాక్యం. మౌలికమైన ఈ ఆధారవాక్యపు పరిస్థితులతో సంబంధం లేకుండా ఈ వాదనలను మరొకసారి చేసి చూడండి; అప్పుడు మీ ''స్వరకల్పన''లోవున్న సమన్వయరాహిత్యమూ, మీ శ్రుతిలోవున్న అపస్వరమూ వెంటనే మీకే తెలిసిపోతుంది.

రెండవ దూమకూ, మూడవ దూమకూ తేడా చూపడం ద్వారా బోయ్‌కాట్‌ను సమ ర్థించ ప్రయత్నించడమూ ఇంత నిరర్థకంగానే వుంటుంది. కాడెట్లకూ (రెండవ దూమలో ప్రజలపట్ల ద్రోహంచేసి వారిని నల్లదండు ముఠాలకు వశపరిచేసినట్టి కాడెట్లకూ) అక్టో బ్రిస్టులకూ వున్న భేదాన్ని గంభీరమూ మౌలికమూ అయిన భేదంగా భావించడమూ, జూన్ 3 వ తేదీన రాజ్యాంగయంత్రంపై దెబ్బతీత వల్ల భగ్నమైపోయినట్టి అప్రతిష్ఠపాలైన ''రాజ్యాంగానికి'' యథార్థ ప్రాముఖ్యతను ఆపాదించడం — ఇదంతా విప్లవాత్మక సోషల్-డెమొక్రసీ యొక్క భావం కంటె అపభ్రంశ ప్రజాస్వామ్యాన్ని స్థూలంగా పోలిన భావానికే అనుగుణ్యంగా వుంటుంది. మొదటి దూమ, రెండవ దూమల ''రాజ్యాంగబద్ధం'' కేవలం గగనకుసుమమే అనీ, కాడెట్లుచెప్పే కబుర్లన్నీ తమ అక్టోబ్రిస్టు స్వభావాన్ని కప్పిపుచ్చే వ్యూహమే అనీ శ్రామికవర్గ, రైతాంగాల కోర్కెలను తృప్తిపరచేందుకు అది పూర్తిగా నిరుపయోగ మైన సాధనం అనీ మేమెల్లప్పుడూ చెబుతూనే వచ్చాం, సమర్థించుతూనే వచ్చాం, పదేపదే ఉద్ఘాటించుతూనే వచ్చాం. 1905 డిసెంబరునాటి అపజయంయొక్క ప్రకృతిసిద్ధమై నట్టి అనివార్యమైనట్టి ఫలితమే 1907 జూన్ 3 అని మేం భావిస్తాం. ''దూమ'' రాజ్యాంగ సౌందర్యాన్ని చూసి మేమెన్నడూ ''సమ్మోహితులమూ'' కాలేదు, కాగా ఆ కారణాన ధారా పాతగా వర్షించే రోదిచెవ్ పంచరంగుల రాజకీయ పదజాలం యొక్క నగ్నమూ బహిరంగమూ

మొరటూ అయిన అభివృద్ధి నిరోధకంగా మారిన పరివర్తన మాకేమీ ప్రత్యేకమైన ఆశా భంగమూ కల్గించలేదు. ఈ రెండవ ఫలితం నాగరికతలేని మొద్దు, లిబరల్ వెర్రివెంగళాయిలకో, లేదా వీరిని తప్పుడు దార్లు పట్టించిన ప్రజా విభాగాలకో తెలివి తెప్పించడానికి బహుశ మరింత సార్థకమైన సాధనమేమో...

స్టేట్ దూమ మెన్‌షెవిక్‌ల స్టాక్‌హోమ్ తీర్మానాన్ని బోల్‌షెవిక్‌ల లండన్ తీర్మానంతో సరిపోల్చి చూడండి. మొదటిది అలంకారభూయిష్ఠమూ, వాగ్బాహుళ్యమూ, దూమ ప్రాముఖ్యాన్నీ దూమలో జరిగే కార్యాల మహత్వాన్నీ గుర్తెరగడంతో ఉబ్బిపోయినట్టి సుదీర్ఘ పద పూరితంగానూ వుంది. రెండవది సరళంగానూ సంగ్రహంగానూ గంభీరంగానూ నిరాడంబరంగానూ వుంది. మొదటి తీర్మానం సోషల్-డెమొక్రసీకీ రాజ్యాంగవ్యవస్థా వాదానికీ జరిగిన మనువు పట్ల అల్పబుద్ధితత్వపు ఆనందావేశంతో (''ప్రజా గర్భం నుండి జన్మించిన నూతన శక్తి,'' ఇంకా ఇలాంటివే ఇదే రకం అచ్చుగుద్దిన కుహనాభావపూరిత పదాలతో) పరితప్తమై వుంది. రెండవ తీర్మానానికి ఇంచుమించు ఈ దిగువ టీకచెప్పొచ్చు: ఈ వెధవ విప్లవప్రతీఘాతం మనని వెధవ పందులదొడ్డిలోకి తోలుకొచ్చింది కాబట్టి, మెర్రో కుంయో మనకుండా, ప్రగల్భాలు పలకకుండా విప్లవాన్ని పెంపొందించేందుకు అక్కడ సహితమూ మనం పనిచేద్దాం.

సూటి విప్లవాత్మక పోరాటం కాలావధిలోనే మనమింకా వుండినప్పుడు, బోయ్‌కాట్ నుండి మెన్‌షెవిక్‌లు దూమను కాపాడుతూండినందువల్ల, దూమ ఒక విధమైన విప్లవాత్మ స్వభావం కలిగివుంటుందని, ప్రజలకు వారు ఒక రకమైన హామీ ఇచ్చారు. కాగా వారు ఇచ్చిన ఈ హామీ పూర్తిగా నీళ్లుకారిపోయింది. కాని బోల్‌షెవిక్‌లు మనం నిజంగా ఒక హామీ గనుక ఇచ్చి వుండినట్టయితే, అది విప్లవప్రతీఘాతం నుండి పుట్టినదే ఈ దూమ అనే, దానినుండి వాస్తవమైన మంచి కోసం మనం ఎదురుచూడ కూడదనే ఆ హామీ. మన అభిప్రాయం ఇంత వరకూ దివ్యంగా ధ్రువపడింది, కాగా భావి ఘటనలవల్ల కూడా అది మరింతగా ధ్రువపడుతుందనే నిర్భయంగా ఢంకామీద దెబ్బకొట్టి చెప్పొచ్చు. అక్టోబరు-డిసెంబరు వ్యూహం ''సరిదిద్దబడి'' కొత్త దత్తాంశాల ప్రాతిపదికపై పునరుక్తము కాబడిబడితేనే తప్ప, ఎన్నటికీ రష్యాలో స్వేచ్ఛ వుండదు.

కాబట్టి రెండవ దూమను ఉపయోగించుకున్నట్టు, మూడవ దూమను ఉపయోగించుకోవడానికి వీలుపడదనీ, దానిలో పాల్గొనడం ఆవశ్యకమని ప్రజారాసులు గ్రహించేటట్టు చేయడం సాధ్యం కాదనీ ఎవరైనా నాతో చెబితే, అందుకు నేనిలా జబాబు చెబుతాను: ''ఉపయోగించుకోవడం'' అనే పదానికి, విప్లవాత్మ్రమూ వగైరా ఈలాటి మెన్‌షెవిక్‌ల నిరర్థక శబ్దపుష్టిగల అర్థమే గనుక అయితే, అప్పుడు అది నిశ్చయంగా అసాధ్యమే అవుతుంది.

కాని మొదటిరెండు డూమలూ వాస్తవంగా అక్టోబ్రిస్టు డూమకి సోపానాలుగా మాత్రమే ఏర్పడినట్టు రుజువైంది; అధ్వాన్నంలోనూ అధ్వాన్నమైనట్టి ప్రాతినిధ్యపు సంస్థలను సహితమూ మనం ఎల్లప్పుడూ ఉపయోగించుకోగల్గే సరళమైనట్టి, నిరాడంబరమైనట్టి,* లక్ష్యం (ప్రచారం, ఆందోళన, విమర్శన జరుగుతూన్న విషయాలను ప్రజారాసులకు వివరించడం) కోసం వాటిని మనం ఉపయోగించుకున్నాం. డూమలో ఇచ్చే ఉపన్యాసం ఎట్టి "విప్లవాన్ని" సహితమూ రేకెత్తించలేదు, కాగా డూమ సందర్భపు ఆందోళన ప్రత్యేకంగా ఏ గొప్ప యోగ్యతలతోనూ విరాజిల్లుతూ వుండదు; కాని అచ్చుపడిన ఏ ఉపన్యాసం నుండిగాని, మరే ఇతర సమావేశంలో ఇచ్చిన ఉపన్యాసం నుండిగాని పొందే లాభం కంటె, ఈ మొదటి పేర్కొనిన దానినుండీ రెండవ దానినుండీ సోషల్-డెమోక్రసీ పొందగలిగే లాభం ఎంత మాత్రమూ తీసిపోదు సరే కదా, ఒక్కొక్కప్పుడు అధికమే కూడానూ.

కాగా అక్టోబ్రిస్టు డూమలో మనం పాల్గొనడం కూడా ఇంత సరళంగానే మనం ప్రజారాసులకు వివరించి చెప్పాలి. 1905 డిసెంబరు అపజయం కారణంగానూ, ఈ అపజయాన్ని "మరమ్మతు" చేయడానికై కావించిన 1906–1907 యత్నాల వైఫల్యం కారణంగానూ, మరింత ఇంకా మరింత అధ్వాన్నపు quasi రాజ్యాంగ బద్ధమైన సంస్థలోకి అభివృద్ధి నిరోధకం మనలను నిరంతరం తప్పనిసరిగా తోలింది, నిరంతరమూ తోలుతూనే వుంటుంది కూడా. అన్ని వేళలందూ సర్వేసర్వత్రాసూ మన విశ్వాసాలను మనం సమర్థించుతూనే వుంటాం, మన అభిప్రాయాలకు అనుకూలంగా మనం వాదించుతూనే వుంటాం, పాత పరిపాలనా వ్యవస్థ నిలబడి వుండేంత వరకూ దానిని కూకటివేళ్లతో సహా నిర్మూలించనంత వరకూ, ఎట్టి మేలునూ నిరీక్షించ కూడదని మనం నొక్కినొక్కి చెబుతూనే

---

* చూ. "ప్రొలెతారియ్" (జినీవా), 1905 లో వ్యాసం, "బులీగిన్ డూమ బోయ్‌కాట్" (వి. ఐ. లెనిన్ "బులీగిన్ డూమ బోయ్‌కాట్, ఉపప్లవమూ" "రచనలు," నాల్గవ రష్యన్ కూర్పు, 9 వ సంపుటం, పుటలు 156–164.—సం.); ఈ వ్యాసంలో, సాధారణంగా డూమను ఉపయోగించుకోవడం మనం వదలుకోమనీ, కాని మనను ఎదుర్కొంటూన్నట్టి మరొక సమస్యను, అనగా సూటైన విప్లవ మార్గం కోసం పోరాడడమనే సమస్యను, మనం ఇప్పుడు పరిష్కరించుతున్నామనీ చెప్పబడింది. "ప్రొలెతారియ్" (రష్యన్) 1906, నెం. 1 లో, "బోయ్‌కాట్ గురించి" అనే వ్యాసం (వి.ఐ. లెనిన్, "రచనలు", నాల్గవ రష్యన్ కూర్పు, 11 వ సంపుటం, పుటలు 118–125.—సం.) కూడా చూడవచ్చు. ఈ వ్యాసంలో, డూమలో జరిగే కృషినుండి కలుగబోయే మేళ్లయొక్క నిరాడంబర పరిమాణం వొత్తి చెప్పబడింది.

వుంటాం. కొత్తగా మరొకసారి విప్లవం తలెత్తేందుకు అవసరమయే పరిస్థితులను మనం సిద్ధం చేదాం, కాగా అది సంభవించే వరకూ, అది సంభవించేందుకు మరింతగా వజ్రసంకల్పంతో కృషిచేస్తూ, విప్లవం పోటుమీద వున్నప్పుడు మాత్రమే అర్థం కలిగినట్టి నినాదాలను ముందుకు తీసుకురావడం మానుకుందాం.

శ్రామికవర్గాన్నీ ప్రజాస్వామ్యంలోని విప్లవాత్మక బూర్జువా భాగాన్నీ లిబరలిజానికీ అభివృద్ధి నిరోధకానికీ వ్యతిరేకంగా నిలబెట్టేటట్టి ఎత్తుగడల పంథాగా బోయ్‌కాట్‌ను భావించడం కూడా ఇందుతో సమానమైన తప్పే అవుతుంది. బోయ్‌కాట్ ఎత్తుగడల పంథా కాదు, విశిష్ట పరిస్థితులకు సరిపడేటట్టి విశిష్ట పోరాట సాధనం అది. బోల్‌షెవిజాన్ని "బోయ్‌కాటిజం"తో తారుమారు చెయ్యడం ఎంత పొరపాటో, "పోరాటప్రయోగతత్వం"తో దాన్ని తారుమారు చెయ్యడమూ అంత పొరపాటే. బోల్‌షెవిక్, మెన్‌షెవిక్ ఎత్తుగడ పంథాలకు గల భేదం ఇదివరకే పూర్తిగా బహిర్గతం చేయబడింది, కాగా ఇది 1905 వ సంతంలో, లండన్‌లో జరిగిన మూడవ బోల్‌షెవిక్ కాంగ్రెస్‌లోనూ జినీవాలో జరిగిన మెన్‌షెవిక్ కాన్ఫరెన్స్‌లోనూ ఆమోదించబడినట్టి మౌలికంగా విభేదించుతూన్న తీర్మానాల్లో రూపం ధరించింది. అప్పట్లో బోయ్‌కాట్ వూసు గాని, "పోరాటం" వూసుగాని అసలు లేనేలేదు, వుండడానికి వీలూ లేదు. అందరికీ తెలిసినట్టే, మనం బోయ్‌కాట్ వాదులం కాకుండావుండినట్టి రెండవ దూమకు జరిగిన ఎన్నికలలోనూ, అసలు రెండవ దూమలోనూ మెన్‌షెవిక్ పంథానుండి మన ఎత్తుగడల పంథా అతి నిష్కర్షగా విభేదించుతుంది. పోరాట సాధనాలూ పద్ధతులూ ఏవైనప్పటికీ, ఏ ఒక్క పంథాకు విశిష్టమైన పోరాట పద్ధతులు సృష్టించబడినప్పటికీ, ప్రతీ పోరాట రంగంలోనూ, రెండు ఎత్తుగడల పంథాలు పరస్పరం దూరమవుతూంటాయి. కాగా, మొదటి దూమ, రెండవ దూమ సందర్భాలలో విప్లవాత్మక నిరీక్షణలు భగ్నమైపోవడం కారణంగా, "న్యాయబద్ధము," "బలోపేతము," "ఆయుష్మంతము," "యథార్థము" అయినట్టి రాజ్యాంగం భగ్నమైపోవడం కారణంగానూ, మూడవ దూమ బోయ్‌కాట్‌ను సమర్థించ పూని నట్టయితే, లేదా బోయ్‌కాట్‌కు దిగినట్టయితే, ఇది అధమాతి అధమమైన మెన్‌షెవిజమే అవుతుంది.

## VII

సంగ్రహంగా చెబుతాం. బోయ్‌కాట్ నినాదం విశిష్ట చారిత్రాత్మక కాలావధిలో ఉత్పన్నమైంది. 1905 లోనూ, 1906 ప్రారంభంలోనూ కార్యకలాపాల బాహ్యగతాత్మక పరిస్థితులు తక్షణ మార్గాన్ని ఎంచుకోవాల్సిన సమస్యను పోరాటంలో పాల్గొనిన సామాజిక శక్తుల ఎదుట నిలబెట్టాయి: సూటి విప్లవ మార్గం, లేదా రాజ్యాంగబద్ధమైన రాచరికం

దిశగా తిరిగిపోవడం. ఆరోజుల్లో బోయ్‌కాట్ అర్థం రాజ్యాంగ వ్యవస్థావాదతత్వపు భ్రాంతులతో ప్రధానంగా పోరాడడమే. బోయ్‌కాట్ జయప్రదం కావడానికి విప్లవం విస్తృతంగా, సాధారణంగా, త్వరితంగా, శక్తివంతంగా పెల్లుబకడమే అప్పుడు షరతు అయింది.

అన్ని అంశాలలోనూ నేటి 1907 శరత్తులోని పరిస్థితులు ఇటువంటి నినాదానికి అనువుగా లేవు, దానిని సమర్థించవు కూడానూ.

ఎన్నికలలోసం సంసిద్ధమయేందుకు మన దైనందిన కార్యకలాపం సాగించుతూనే, ఎంతటి అత్యంత అభివృద్ధి నిరోధకమైన ప్రాతినిధ్యపు సంస్థ అయినప్పటికీ అందులో పాల్గొనడమును ముందుగా తిరస్కరించకుండానే, డిసెంబరు ఓటమికీ తరువాత సంభవించిన స్వేచ్ఛాపతన, రాజ్యాంగ దుర్వినియోగాలకూ వున్న సంబంధాన్ని ప్రజలకు బోధపర్చడానికే యావత్తు ప్రచార ఆందోళనలనూ మనం సాంద్రీకరించాలి. సూటి రాశి పోరాటం లేనిదే రాజ్యాంగప్రణాళిక దుర్వినియోగం తప్పనిసరిగా సాగుతూనే వుండి, మరింత బలోపేతమవుతుందనే దృఢమైన నమ్మికను ప్రజలలో స్థిరంగా నాటుకునేటట్టు మనం కృషిచేయాలి.

విప్లవం పోటులో వున్న సమయాల్లో, బోయ్‌కాట్ నినాదంయొక్క అవసరం గంభీరంగా ఏర్పడడం సంభవమైనప్పుడు ఆ నినాదాన్ని ఉపయోగించడం వదలుకోకుండానే, మొత్తం అభివృద్ధి నిరోధానికీ, దాని పునాదులకూ వ్యతిరేకంగా కార్మికవర్గ ఉద్యమంలోని ప్రతీ ఉత్తుంగ తరంగాన్ని మన సరాసరి తక్షణ ప్రభావంచే ఒక సాధారణ, విస్తృత, విప్లవాత్మక, విజృంభణోద్యమంగా పరివర్తన చెందే లక్ష్యాభిముఖంగా మన యత్నాలన్నింటినీ మనమీనాడు సాగించాలి.

జూన్ 26, 1907.

# మార్క్సిజమూ, రివిజనిజమూ

రేఖాగణిత ఆధారన్యాయాలు మానవ ప్రయోజనాలకు భంగం కలిగించిన పక్షంలో వాటిని ఖండించే యత్నాలు తప్పక జరిగితీరుతాయని ఒక సుప్రసిద్ధ లోకోక్తి చెబుతూంది. మతశాస్త్రపు పాత దురభిమానాలను వ్యతిరేకించినట్టి ప్రకృతిచారిత్రక సిద్ధాంతాలు అత్యంత తీవ్ర మతోన్మాద ప్రతిఘటనను రేకెత్తించాయి, ఇప్పటికీ రేకెత్తించుతూనే వున్నాయి. కాబట్టి ఆధునిక సమాజంలో వున్న పురోగామి వర్గాలకు ప్రబోధం కల్గించేటట్టీ ఆర్గనైజు చేయడానికి సూటిగా ఉపయోగపడుతూన్నట్టీ, ఈ వర్గం యొక్క కర్తవ్యాలను సూచించుతూన్నట్టీ, ప్రస్తుతవ్యవస్థ స్థానంలో ఒక కొత్త పద్ధతిని నెలకొల్పడం అనివార్యమని (ఆర్థికాభివృద్ధి కారణంగా) రుజువు చేస్తూన్నట్టీ మార్క్సియ సిద్ధాంతం — దాని జీవిత పథంలో అడుగడుగునా మొండిగా పోరాడాల్సి వుండినదంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

ఆస్తిపరుల వర్గాలలోని యువక తరాన్ని మందమతులుగా చేసి, బాహ్య, అంతరిత శత్రువులకు వ్యతిరేకంగా దానిని ''తర్ఫీదు'' చేసేందుకు అధికార్లచే నియమితులైన ప్రొఫెసర్లచే అధికారయుతంగా బోధించబడుతూన్నట్టి బూర్జువా విజ్ఞానశాస్త్ర, తత్వశాస్త్రాల గురించి ప్రస్తావించ నవసరం లేదు. మార్క్సిజం ఏనాడో ఖండించివేయబడి నాశనం చేయబడిందని ఉద్ఘాటించుతూన్న ఈవిజ్ఞానశాస్త్రం మార్క్సిజం పేరెత్తుతేనే చెవులు మూసుకుంటుంది; కాగా సోషలిజాన్ని ఖండించడం ద్వారానే ఉద్యోగాలలో ముందుకు వస్తూన్న యువక విజ్ఞానశాస్త్రజ్ఞులూ, పాతబడి శిథిలమవుతూన్న నానారకాల ''వ్యవస్థల'' సంప్రదాయాలను భద్రపరచేటట్టి జవసత్వాలుడిగిన వృద్ధులూ సమానోద్రేకంతో మార్క్సుపై దాడి చేస్తూన్నారు. అధికారయుత విజ్ఞానశాస్త్రంచే ప్రతిపర్యాయమూ ''నాశనం'' చేయబడిన తరువాత మరింత బలోపేతమూ మరింత దృఢీకృతమూ మరింత జీవశక్తి సమన్వితమూ అవుతూన్న మార్క్సిజంపై ఈ బూర్జువా దాడుల పునరుక్తినీ ఉధృతాన్నీ మార్క్సిజంయొక్క ప్రగతీ, కార్మికవర్గాలలో దాని భావాల వ్యాప్తి పటుత్వములూ తప్పనిసరిగా మరింత అధికం చేస్తాయి.

కాని కార్మికవర్గ పోరాటానికి సంబంధించినట్టీ, శ్రామికవర్గంలోనే ప్రధానంగా వ్యాపించినట్టీ సిద్ధాంతాలలో సహితం, మార్క్సిజం తన స్థానాన్ని వెంటనే పటిష్ఠం చేసుకునే స్థితిలో ఏ మాత్రమూ లేకపోయింది. దాని మనుగడలోని మొదటి అర్ధశతాబ్దిలో (1840 ల నుండీ) దానికి మౌలికంగా శత్రువులైన సిద్ధాంతాలతో అది పోరాడింది. 1840 ల పూర్వార్ధంలో, తాత్విక భావవాద స్థానం తీసుకున్నట్టి, రాడికల్ యువక హెగేలియన్‌వాదులతో వాగ్యుద్ధాలు చేసి మార్క్స్, ఎంగెల్స్‌లు వారిని ఓడించారు. ఈ దశాబ్ది అంతంలో ఈ పోరాటం ప్రూడనిజానికి వ్యతిరేకంగా ఆర్థిక సిద్ధాంతరంగంలో ప్రవేశించింది. 1850 లలో ఈ పోరాటం పూర్తి అయింది: ఫలితం, 1848 తుపాను సంవత్సరంలో ప్రత్యక్షమైన పార్టీలపైన, సిద్ధాంతాలపైనా విమర్శ. 1860 లలో పోరాటం సాధారణ సిద్ధాంతరంగం నుండి కార్మికవర్గ ఉద్యమానికి తక్షణ సామీప్యంలో వున్న రంగంలోకి మారింది: ఫలితం, బకూనిజాన్ని ఇంటర్నేషనల్ నుండి వెళ్లగొట్టడం. 1870 ల మొదట్లో కొద్ది కాలం పాటు జర్మనీలో ప్రూడనిస్టు మ్యూల్‌బెర్గరూ, డెబ్భై ల ఆఖరి సంవత్సరాలలో పాసిటివిస్టు డ్యూరింగూ రంగం ఆక్రమించారు. కాని శ్రామికవర్గంపై వీరిద్దరి ప్రభావం అప్పటికే కేవలం అతిస్వల్పం. కార్మికవర్గ ఉద్యమంలో అన్ని ఇతర భావశాస్త్రాలపై మార్క్సిజం అప్పటికే నిస్సందేహమైన విజయం సాధించుతూంది.

1890 ల నాటికి ఈ విజయం ప్రధానంగా సంపూర్ణమైంది. అన్ని ఇతర దేశాలలో కంటె ప్రూడనిస్టు సంప్రదాయాలు దీర్ఘకాలం తమ ప్రాబల్యాన్ని నిల్పుకొన్న లాటిన్ దేశాలలో సహితం, కార్మికుల పార్టీలు తమ కార్యక్రమాన్నీ ఎత్తుగడలనూ మార్క్సిస్టు పునాది పైనే వాస్తవంగా రూపొందించుకున్నాయి. పునరుజ్జీవం పొందిన కార్మికవర్గోద్యమ అంతర్జాతీయ ఆర్గనైజేషను — నియమిత కాలానుసరణమైన అంతర్జాతీయ మహాసభల రూపంలో — వెంటనే, ఇంచుమించు పోరాటం లేకుండానే కూడా, అన్ని ప్రధానాంశాలలోనూ మార్క్సిస్టు దృక్‌స్థానాన్నే స్వీకరించింది. కాని తనపై శత్రుత్వం వహించి, ఒక విధంగా తమలోతాము సమైక్యత సాధించుకున్నట్టి సిద్ధాంతాల నన్నింటినీ మార్క్సిజం తరిమికొట్టి వాటి స్థానాన్ని ఆక్రమించుకున్న తరువాత, ఆ సిద్ధాంతాలలో తలలెత్తిన ధోరణులు తాము పైకిరావడానికి ఇతర మార్గాలను వెతకడం ప్రారంభించాయి. పోరాటం యొక్క రూపాలూ పోరాటానికి ప్రేరకహేతువులూ మారాయేకాని, పోరాటం సాగుతూనే వుంది. కాగా మార్క్సిజం లోపలనే మార్క్సిజానికి శత్రువైన ఒక ధోరణితో జరిగిన పోరాటంతో మార్క్సిజం మనుగడలో రెండవ అర్ధశతాబ్ది (1890 లలో) ప్రారంభమైంది.

ఈ ధోరణికి — మార్క్సును పునర్విమర్శచేయడం, రివిజనిజం — అందరికంటె పెద్దగా గోలచేసి, మార్క్సుకు చేసిన దిద్దుబాట్లకు పూర్తి సమ్యగ్ రూపాన్నిచ్చినట్టీ, ఒకప్పుడు

సనాతన మార్క్సిస్టు అయివుండినట్టీ బెర్న్‌స్టయిన్ పేరు వచ్చింది. ఆర్థికంగా దేశంయొక్క వెనుకబాటుతనమూ, భూదాస్య వ్యవస్థ అవశేషాలచే పీడించబడిన రైతు జనాభా ప్రాబల్యమూ కారణంగా మార్క్సిస్టేతర సోషలిజం అన్ని దేశాలలో కంటెనూ హెచ్చుకాలం ఏ దేశంలో నిలదొక్కుకుని వుండినదో అట్టి రష్యాలో సహితం అది మన కళ్లముందే రివిజనిజంలోకి స్పష్టంగా మారిపోతూంది. వ్యవసాయ సంబంధమైన ప్రశ్నలోనూ (అంత భూమినీ మ్యునిసిపలైజేషన్ చేసివేయడం), కార్యక్రమానికీ ఎత్తుగడలకూ సంబంధించిన సాధారణ ప్రశ్నలలోనూ మన సోషల్-నరోద్నిక్కులు, తన సొంత రీతిలోనే సమైక్యతను సాధించుకుని మార్క్సిజానికి మౌలికంగా శత్రువైనట్టి పాత వ్యవస్థయొక్క చివికి చీకిపోయి కాలం చెల్లిపోయిన అవశేషాల స్థానంలో, మార్క్సుకు మరిన్ని మరిన్ని ''దిద్దుబాట్లను'' ప్రత్యామ్నాయంగా తీసుకొచ్చి పెడుతున్నారు.

మార్క్సుకు ముందుండిన సోషలిజం భగ్నమయిపోయింది. తన సొంత స్వతంత్ర స్థానం నుంచి గాక, మార్క్సిజం యొక్క సాధారణ స్థానం నుంచే, రివిజనిజంగా అది పోరాటం సాగిస్తూంది. రివిజనిజంయొక్క భావశాస్త్ర విషయాన్ని మనం ఇప్పుడు పరిశీలించుదాం.

తత్వశాస్త్ర రంగంలో, రివిజనిజం బూర్జువా ప్రొఫెసర్ల ''విజ్ఞానశాస్త్రం'' అడుగు జాడల్లోనే నడిచింది. ఈ పండితులు ''కాంట్ వైపు తిరిగి'' మళ్లారు — కాగా రివిజనిజం నవీన-కాంటియన్ల[110] వెంటే కాళ్లీడ్చుకుంటూ నడిచింది; తాత్విక భౌతికవాదానికి వ్యతిరేకంగా మతగురువులు లక్షసార్లు ఉచ్చరించిన ఊకదంపు మాటలనన్నింటినీ ఈ ప్రొఫెసర్లు మళ్లీ పునశ్చరణ చేశారు — కాగా రివిజనిస్టులు అభిజాతంతో మందహాసంచేస్తూ, చిరకాలం కిందటనే భౌతికవాదం ''ఖండించబడింద''ని (సరికొత్తగా వెలువడిన పరామర్శగ్రంథంలో వున్నదానినే ముక్కకి ముక్క) గొణిగారు. ఈ ప్రొఫెసర్లు హెగెల్‌ను ''చచ్చిన కుక్క''[111] కింద కట్టేశారు, కాగా, హెగెల్ భావవాదం కంటె వెయ్యిరెట్లు నిరర్థకమూ పేలవమూ అయినట్టి భావవాదాన్నే తామూ బోధించుతూనే, గతితర్కంపట్ల మాత్రం తృణీకారంతో బుజాలు ఎగరేశారు — ఇక వీరి వెంటే రివిజనిస్టులు నడుస్తూ, ''కుయుక్తి పూరితము'' (విప్లవాత్మకమూ కూడా) అయినట్టి గతితర్కం స్థానే, ''సరళము'' (ప్రశాంతమూ కూడా) అయినట్టి ''పరిణామాన్ని'' నెలకొల్పుతూ, విజ్ఞానశాస్త్రాన్ని తత్వశాస్త్రంతో కలిపి నీళ్లు కార్చేయడమనే చిత్తడినేల ప్రదేశంలోకి వీరితో సహా దిగబడ్డారు. ప్రభుత్వం తమకిచ్చే జీతాలను ఈ ప్రొఫెసర్లు తమ భావవాద, ''విమర్శనాత్మక'' పద్ధతులను రెండింటినీ, అధికారం చలాయిస్తూన్నట్టి మధ్యయుగపు ''తత్వశాస్త్రం''తో (అనగా, మతశాస్త్రంతో) సర్దుబాటు చేయడం ద్వారా సంపాదించుకున్నారు — ఇక రివిజనిస్టులు, ఆధునిక రాజ్యాంగ

యంత్ర సంబంధంలో కాకుండా, పురోగామివర్గ పార్టీ సంబంధంలోనే, మతాన్ని ఒక ''ప్రైవేటు వ్యవహారం''గా చేసేందుకు పాటుపడుతూ వీరికి దగ్గరగా చేరారు.

మార్క్స్‌కు తెచ్చిపెట్టిన ఇటువంటి ''దిద్దుబాట్ల''యొక్క యథార్థమైన వర్గ ఆంతర్యాన్ని గురించి ప్రస్తావించాల్సిన ఆవశ్యకత లేనేలేదు — అది స్వయంవ్యక్తంగానే వుంది. రివిజనిస్టుల నోటనుండి వెడలినట్టి నమ్మశక్యం కానంతటి ఊకదంపుడు మాటలను, అంత ర్జాతీయ సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమం అంతటిలోనూ సుసంగతమైన గతితార్కిక భౌతిక వాద దృక్స్థానం నుండి విమర్శించినవాడు ప్లెహానొవ్ ఒక్కడే అన్న విషయం మనమిక్కడ ఎత్తిచూపాల్సి వుంది. ఇది మరీ గట్టిగా నొక్కిచెప్పాల్సిన విషయం, ఎందుచేతనంటే ఎత్తుగడల పట్ల ప్లెహానొవ్ ప్రదర్శించిన అవకాశవాదాన్ని విమర్శించడమనే ముసుగుతో పాతపడి పోయినట్టి అభివృద్ధి నిరోధకమైనట్టి పనికిమాలిన తత్వశాస్త్రపు చెత్తను పెరటి దారిని ప్రవేశపెట్టేందుకు పూర్తిగా పొరపాటైన యత్నాలు మన రోజుల్లో జరుగుతున్నాయి.*

ఇక అర్థశాస్త్రం గురించి ప్రస్తావించేటప్పుడు మొట్టమొదట గుర్తించాల్సిన విషయ మేమిటంటే, ఈ రంగంలో రివిజనిస్టుల ''దిద్దుబాట్లు'' అన్నీ కూడా పరిపూర్ణంగానూ, మరింత సవివరంగానూ వున్నాయి; ''ఆర్థికాభివృద్ధిపై నూతన దత్తాంశాలను'' ఉదా హరించడం వల్ల ప్రజపై ప్రభావం కలిగించే యత్నాలు జరిగాయి. సాంద్రీకరణమూ, అధికస్థాయి ఉత్పత్తిచే స్వల్పస్థాయి ఉత్పత్తి క్రియారంగం నుండి తరిమివేయబడడమూ వ్యవసాయంలో అసలు సంభవించనే సంభవించవనీ, వాణిజ్యంలోనూ పరిశ్రమలోనూ ఇవి అతి మెల్లగా సాగుతాయనీ చెప్పబడింది. ఇప్పుడు సంక్షోభాలు అరుదవుతాయనీ, వాటి శక్తి కూడా తగ్గిందనీ, కార్టెల్స్‌ల, ట్రస్టుల సహాయంతో పెట్టుబడి సంక్షోభాలనే బహుశా పూర్తిగా తొలగించి వేయడమే సంభవమని కూడా చెప్పబడింది. వర్గవైషమ్యాలు మరింత సాధువైపోయి, వాటి తీవ్రత మరింత తగ్గుముఖంపట్టే ధోరణినే అవి అనుసరించడం కారణాన, ''భగ్నస్థితి సిద్ధాంతా'' భిముఖంగా పెట్టుబడిదారీ విధానం సాగిపోతుందనడం సమర్థనీయం కాదనీ

---

* చూ. బొగ్దానొవ్, బజారొవ్, తదితరులు రచించిన ''మార్క్సిజం యొక్క తత్వ శాస్త్రంపై వ్యాసాలు.'' ఈ పుస్తకంపై చర్చించడానికి ఇది తగిన స్థలంకాదు, కాగా నేనిప్పుడు ప్రస్తుతగ్రంథంలో నవీన-కాంటియన్ రివిజనిస్టులను గురించి చెప్పినది ప్రతీదీ ''నూతన'' నవీన-హ్యూమిస్ట్, నవీన-బార్క్లియన్ రివిజనిస్టులకు[112] ప్రధానంగా అనువర్తిస్తుందని ఒక వ్యాసపరంపరలోనో, లేదా వేరే ప్రత్యేకమైన ఒక పాంఫ్లెట్‌లోనో ఆద్యతనభావిలో నిరూపించ నుద్దేశిస్తున్నానని మాత్రం ఇక్కడ చెప్పి విరమించుతున్నాను.

చెప్పబడింది. మార్క్సుయొక్క విలువ సిద్ధాంతాన్ని బ్యోమ్-బావెర్క్ ఫక్కీలో సరిద్దిడం అప్రస్తుతమేమీ కాదని కూడా చిట్టచివరకు చెప్పడం జరిగింది.

ఇరవైయ్యేళ్ల క్రితం డ్యూరింగ్‌తో ఎంగెల్స్ జరిపిన వాదోపవాదం, అంతర్జాతీయ సోషలిజం సైద్ధాంతిక చింతన యొక్క ఎంతటి ఫలప్రదమైన పునరుజ్జీవానికి దారితీసిందో, ఈ ప్రశ్నలపై రివిజనిస్టులతో పోరాటం కూడా అంతటి ఫలప్రదమైన పునరుజ్జీవానికీ దారితీసింది. వాస్తవవిషయాల, సంఖ్యల సహాయంతో రివిజనిస్టుల వాదనలు విశ్లేషించబడ్డాయి. ఆధునిక స్వల్పస్థాయి ఉత్పత్తిని మసిపూసి మారేడుకాయ చేయడానికి రివిజనిస్టులు వ్యవస్థాబద్ధంగా విశ్వప్రయత్నాలు చేశారని రుజువయింది. పరిశ్రమలోనే కాకుండా వ్యవసాయంలో కూడా స్వల్పస్థాయి ఉత్పత్తికంటె అధికస్థాయి ఉత్పత్తి సాంకేతికమూ, వాణిజ్యమూ దృష్ట్యా ఉత్తమమని నిరాక్షేపణీయమైన వాస్తవవిషయాలచే రుజువు చేయబడింది. కాని వ్యవసాయంలో సరుకుల ఉత్పత్తి చాలా తక్కువగా అభివృద్ధి పొందింది, కాగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో జరిగే మార్పిడి వ్యవహారంలోకి అంతకంతకు మరింత హెచ్చుగా వ్యవసాయం ఆకర్షించబడుతూందని తెల్పేటట్టి వ్యవసాయంలోని ప్రత్యేక శాఖలను (ఒక్కొక్కప్పుడు ప్రత్యేక శాఖల ప్రక్రియలను సహితమూ) ఎంచి చూపగలిగే సామర్థ్యం ఆధునిక గణాంకశాస్త్ర వేత్తలలోనూ ఆర్థికశాస్త్రవేత్తలలోనూ మామూలుగా లోపించుతూంది. ఆహారంలో పోషక ద్రవ్యాలు నిరంతరమూ తగ్గిపోతూండడం మూలంగానూ, ప్రజ శాశ్వతంగా పస్తులు పడివుండడం మూలంగానూ, రోజుకు పనిచేసే గంటల సంఖ్య హెచ్చవుతూండడం మూలంగానూ, పశువుల రకమూ వాటిని పెంచి పోషించే విధానమూ నానాటికీ క్షీణించడం మూలంగానూ, ఒక్కమాటలో చెప్పాలంటే, పెట్టుబడిదారీ విధానపు కార్ఖానా ఉత్పత్తికి వ్యతిరేకంగా చేతిపనుల ఉత్పత్తి ఏలాగు తన మనుగడను గడుపుకుంటూ వస్తూందో, కేవలం ఆ విధానాల వల్లనే ప్రకృతిసిద్ధమైన ఆర్థికవ్యవస్థ శిథిలాలపై స్వల్పస్థాయి ఉత్పత్తి తన మనుగడ గడుపుకుంటూ వస్తూంది. విజ్ఞానశాస్త్ర, సాంకేతిక శాస్త్రాలలోని ప్రతి పురోగమనమూ పెట్టుబడిదారీ విధానపు సమాజంలో స్వల్పస్థాయి ఉత్పత్తియొక్క ప్రాతిపదికను తప్పనిసరిగానూ నిర్దాక్షిణ్యంగానూ నాశనం చేసివేస్తుంది, కాగా మామూలుగా దానికున్న అన్ని సంక్లిష్టములైన చిక్కులతో కూడుకున్నట్టి రూపాలతో సహా ఈ ప్రక్రియను గవేషించబడమూ, పెట్టుబడిదారీ విధానంలో తన స్థానాన్ని నిలబెట్టుకోవడం దుస్సాధ్యమనీ, పెట్టుబడిదారీ విధానంలో రైతు సేద్యం కేవలం నిరాశాజనకమనీ, శ్రామికుని దృక్పథాన్నే రైతు అనుసరించడం ఆవశ్యకమనీ చూపడమూ సోషలిస్టు ఆర్థికశాస్త్రంయొక్క కర్తవ్యం. శాస్త్రీయ దృక్స్థానం నుండి చూసినట్టయితే, ఒక పక్షంవైపు మొగ్గుచూపడమూ, పెట్టుబడిదారీ విధాన వ్యవస్థను మొత్తంగా తీసుకోకుండా, ప్రత్యేకంగా ఏర్చి ఎంచుకున్నట్టి వాస్తవాంశాలను సాధారణీకరణం

చేయడంవల్ల, రివిజనిస్టులు ఈ ప్రశ్న విషయంలో పాపానికి ఒడిగట్టిన వారయారు; రాజకీయ దృక్స్థానం నుండి చూచినట్టయితే, విప్లవాత్మక శ్రామికుని దృక్స్థానం స్వీకరించమని రైతును పురికొల్పడం బదులు, యజమానియొక్క (అనగా, బూర్జువావర్గపు) దృక్స్థానాన్ని స్వీకరించమని సప్రయత్నంగా నైతేనేమి, అప్రయత్నంగా నైతేనేమి వారు రైతును పురికొల్పడంలోను, లేదా ఆహ్వానించడంలోనూ వారు పాపానికి ఒడిగట్టిన వారయారు.

సంక్షోభాల సిద్ధాంత సందర్భంలోనూ, భగ్నస్థితి సిద్ధాంత సందర్భంలోనూ రివిజనిజం తీసుకున్న స్థానం మరింత అధ్వాన్నంగా వుంది. కేవలం అతిస్వల్పకాలానికి మాత్రమే, అదైనా అత్యంత హ్రస్వదృష్టిగలవారు మాత్రమే, కొద్దిపాటి సంవత్సరాల పారిశ్రామిక సుభిక్షమూ శ్రేయస్సుల ఫలితంగా మార్క్సీయ సిద్ధాంత పునాదులను పునర్నిర్మించేందుకు ప్రజలు ఆలోచిస్తారు. సంక్షోభాలు గతకాలపు విషయాలు కావనీ, రివిజనిస్టులకు వాస్తవవిషయాలు అతిత్వరగానే తెలియజేప్పాయి — శ్రేయస్సు వెనువెంటనే సంక్షోభం సంభవించింది. ఆ యా ప్రత్యేక సంక్షోభాల రూపాలూ, సంభవక్రమమూ, స్వరూపమూ మారుతాయి, కాని పెట్టుబడిదారీ విధాన వ్యవస్థలో విధికృతమైన అంతర్భాగాలుగా సంక్షోభాలు స్థిరంగా వుండిపోతాయి. కార్టెల్స్‌నూ ట్రస్టులూ ఉత్పత్తిని ఐక్యపరుస్తూ, అదే సమయంలో సర్వప్రపంచానికీ స్పష్టంగా అవుపడేటట్టుగా, ఉత్పత్తియొక్క అరాచకాన్నీ, శ్రామికవర్గ అస్తిత్వానికి భద్రతలేమినీ, పెట్టుబడిదారీ విధానపు పీడనూ మరింత అధ్వాన్న పరిచాయి, తద్వారా వర్గ వైషమ్యాలను ఇదివరకెన్నడూ లేనంత హెచ్చు స్థాయిలో తీవ్రతరం చేస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానం భగ్నంమొందే దిశగా సాగడం — రాజకీయ, ఆర్థిక సంక్షోభాలలో ప్రతి ఒక్కదాని అర్థంలోనూ, మొత్తం పెట్టుబడిదారీ విధాన వ్యవస్థ అంతటి అర్థంలోనూ — బ్రహ్మాండమైన ఈ కొత్త ట్రస్టులవల్లనే అచ్చంగా పూర్తిగానూ విస్తృతస్థాయిలోనూ స్పష్టపరచబడింది. అమెరికాలోని దరిమిలా ఆర్థిక సంక్షోభమూ, యూరప్ అంతటా నిరుద్యోగం భయకరంగా పెరిగిపోవడమూ, ఇత్యాది అనేక లక్షణాలను కొట్టవచ్చేటట్టుగా చూపిస్తూన్నట్టి రానున్న పారిశ్రామిక సంక్షోభం మాట చెప్పనవసరమే లేకపోగా — దీనంతటి ఫలితంగా రివిజనిస్టుల ఇటీవలి "సిద్ధాంతాలు" అందరిచేతనూ — ప్రత్యక్షంగా రివిజనిస్టులలో చాలామంది చేతనే — విస్మరించబడ్డాయి. కాని కార్మికవర్గానికి మేధావిస్తరపు డోలాయమానం నేర్పిన గుణపాఠాన్ని ఎంత మాత్రం విస్మరించడానికి వీల్లేదు.

విలువ సిద్ధాంతం గురించి మనం చెప్పాల్సినదంతా ఏమిటంటే, బ్యోమ్-బావెర్క్ శైలిలో అత్యంత అస్పష్టంగా కనబడుతూన్నట్టి సూచనలు అటుండగా, రివిజనిస్టులు రవంతైనా దీనిపై కృషి చేయలేదు; కాగా ఇందువలన శాస్త్రీయ చింతనాభివృద్ధిపైన వారి ప్రభావఛాయలు పిసరంతైన పడలేదు.

రాజకీయ రంగంలో, మార్క్సిజం యొక్క నిజమైన పునాదిని, అనగా వర్గపోరాట సిద్ధాంతాన్ని, రివిజనిజం పునర్విమర్శించడానికి ప్రయత్నించింది. రాజకీయ స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, సార్వజనిక నియోజన హక్కు వర్గపోరాట కారణాలను తొలగించివేసి, కార్మికులకు మాతృభూమి అంటూ లేదు అని ''కమ్యూనిస్టు ప్రణాళిక'' చెప్పిన పాతకాలపు వాక్యం అసత్యమని నిరూపించిందట — అని వాళ్ళు మనతో అంటున్నారు. ఎందుచేతంటేనట, ప్రజాస్వామ్యంలో ''అధికసంఖ్యాకవర్గం యొక్క అభీష్టం'' చెల్లుతుంది కాబట్టి, రాజ్యాంగ యంత్రాన్ని వర్గ పరిపాలనగా పరిగణించనూ కూడదట, అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా ప్రగతిశీలమైన, సామాజిక సంస్కరణాత్మకమైన బూర్జువావర్గంతో మిత్రత్వ సంబంధాలను తిరస్కరించనూ కుడదట.

రివిజనిస్టులు చెప్పే ఈ అభ్యంతరాలు ఇంచుమించు సమగ్రమైన ఒక అభిప్రాయ వ్యవస్థగా, అనగా చాలాకాలంగా తెలిసినట్టి లిబరల్-బూర్జువా అభిప్రాయాలుగా, ఏర్పడుతున్నాయన్న సంగతి నిర్వివాదమే. వోటుచేసే హక్కు, రాజ్యాంగయంత్ర వ్యవహారాలలో పాల్గొనే హక్కు ఎట్టి వివక్షత లేకుండా పౌరులందరకూ చెందుతూంది కాబట్టి, బూర్జువా పార్లమెంటరీ విధానం వర్గాలనూ వర్గ విభేదాలనూ నాశనం చేసివేస్తుందని లిబరల్సు ఎప్పుడూ అంటూనే వుండేవారు. ఇటువంటి అభిప్రాయాలు ఎంతటి అసందర్భాలో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధపు యూరప్ చరిత్ర యావత్తూ, ఇరవైయ్యో శతాబ్ది ఆరంభంలో రష్యా చరిత్ర యావత్తూ స్పష్టంగా తెలియజెప్పుతూంది. ''ప్రజాస్వామిక'' పెట్టుబడిదారీ విధాన స్వేచ్ఛ కింద ఆర్థిక వివక్షతలు ఉపశమించడం బదులు తీవ్రమవుతున్నాయి. పార్లమెంటరీ విధానం వర్గ పీడనను తొలగించదు, కాని వర్గ పీడన అంగాలుగా అత్యున్నత ప్రజాస్వామిక బూర్జువా రిపబ్లిక్కుల సహజ స్వభావాన్ని బట్టబయలు చేస్తుంది. రాజకీయ ఘటనలలో క్రియాశీలంగా వెనకటి రోజులలో పాల్గొన్న ప్రజారాసులకంటె అపరిమితంగా విస్తృతమైన ప్రజారాసులను విజ్ఞానవంతం చేసి, ఆర్గనైజు చేయడంవల్ల, పార్లమెంటరీ విధానం సంక్షోభాలనూ రాజకీయ విప్లవాలనూ తొలగించివేయడానికి కారణభూత మవడంలేదు, అందుకు బదులు ఈ విప్లవాలలో అంతర్యుద్ధాన్ని గరిష్ఠ పరిమితిలో తీవ్రతరం చేయడానికే కారణభూత మవుతూంది. ఈ తీవ్రత ఎంత విధికృతంగా జరిగి తీరుతుందో 1871 వసంతంలో జరిగిన పారిస్ ఘటనలు, 1905 చలికాలంలో జరిగిన రష్యన్ ఘటనలు ఎంత స్పష్టంగా చెప్పాలో అంత స్పష్టంగా చెబుతున్నాయి. ఫ్రెంచి బూర్జువావర్గం శ్రామిక వర్గ ఉద్యమాన్ని అధః పాతాళంలోకి అణచివేయడానికని తన మాతృభూమిని దోచుకుని, ధ్వంసంచేసిన విదేశీయ సేనతో ఒక క్షణమైనా జంకూ గొంకూ లేకుండా బేరం కుదుర్చుకుంది. పార్లమెంటరీ విధాన, బూర్జువా ప్రజాస్వామ్యాల విధికృతమైన ఆంతరిత గతితర్కాన్ని

—వెనకటికంటె రాశి దౌర్జన్యం వల్ల వివాదపరిష్కారాన్ని ఇంకా మరింత తీవ్రతరం చేయడానికే దారితీసేటట్టి గతితర్కాన్ని—ఎవరైతే అర్థం చేసుకోరో అట్టివారు ఇటువంటి ''వివాదాలలో'' విజయవంతంగా పాల్గొనడానికై కార్మికవర్గ రాసులను నిజంగా సంసిద్ధంచేసి, సూత్ర దృష్ట్యా సుసంగతమైన ప్రచారాందోళనలను ఈ పార్లమెంటరీ విధాన ప్రాతిపదికపైన ఎన్నడూ సాగించలేరు. పాశ్చాత్యంలో వున్న సామాజిక-సంస్కరణవాద లిబరలిజంతోనూ, రష్యన్ విప్లవంలో లిబరల్ రిఫార్మిజం (కాడెట్లు) తోనూ మిత్రత్వ సంబంధాల, ఒప్పందాల, సంఘటనల అనుభవాలు, ఈ ఒప్పందాలు ప్రజారాసుల చైతన్యానికి తూట్లు పొడుస్తాయనీ, పోరాడడానికి అతి తక్కువ సామర్థ్యం కల్గినట్టీ ఊగిసలాటనూ, ద్రోహబుద్ధినీ అత్యధికంగా కలిగినట్టీ మూలద్రవ్యాలతో యోధులకు లంకె పెట్టడంవలన ప్రజారాసుల పోరాటంయొక్క యథార్థ ప్రాముఖ్యతను ఇనుమడింపజేయవనీ విశ్వాసజనకంగా రుజువుచేశాయి. ఫ్రెంచి మిలెరానిజం — విస్తృతమూ, నిజంగా జాతీయస్థాయిలోనూ రివిజనిజంయొక్క ప్రయుక్తంలోనూ ఇంతవరకు జరిగిన ప్రయోగాలన్నిటిలోనూ పెద్దదీ అయిన ప్రయోగం — ఆచరణసిద్ధమైన రివిజనిజానికి ఎట్టి విలువను నిర్ణయించిందంటే, ఆ విలువను సర్వప్రపంచ శ్రామికవర్గం ఇక ఎన్నటికీ మరచిపోజాలదు.

రివిజనిజంయొక్క ఆర్థిక, రాజకీయ ధోరణులకు ప్రకృతిసిద్ధమైన శేషపూరణం, సోషలిస్టు ఉద్యమ అంతిమగమ్యం పట్ల దాని వైఖరే అయింది. ''ఉద్యమమే సర్వమూ, అంతిమ లక్ష్యంలో ఏమీ లేదు'' — బెర్న్‌స్టయిన్‌యొక్క ఈ ఊతపదమే రివిజనిజం సారాన్ని సుదీర్ఘమైన వాదనలన్నిటి కంటెనూ ఉత్తమంగా వ్యక్తంచేస్తూంది. సందర్భానుసారంగా తన విధానాన్ని నిర్ణయించుకోవడమూ; దైనందిన ఘటనలకూ చిల్లర మల్లర రాజకీయ మార్పులకూ అనుగుణ్యంగా సర్దుకుపోవడమూ, శ్రామికవర్గం యొక్క మౌలిక ప్రయోజనాలనూ, యావత్తు పెట్టుబడిదారీ విధాన వ్యవస్థ యొక్క, మొత్తంగా పెట్టుబడిదారీ విధాన పరిణామం యొక్క ప్రధాన లక్షణాలనూ మరచిపోవడమూ; యథార్థమైనట్టీ, లేక ఊహించబడినట్టీ లాభాల కోసం ఈ మౌలిక ప్రయోజనాలను బలిపెట్టడం — ఇదీ రివిజనిజంయొక్క విధానం. ఈ విధానం అనంత రూప వైవిధ్యాన్ని ధరించవచ్చుననీ, కొద్దిగానో గొప్పగానో ''కొత్తదైన'' ప్రతీ ప్రశ్న, కొద్దిగానో గొప్పగానో ఎన్నడూ అనుకోనట్టీ ఎదురుచూడనట్టీ దిశలో ఘటనల మలుపు ప్రధాన అభివృద్ధి దిశను స్వల్పాతిస్వల్ప పరిమాణంలోనూ స్వల్పాతిస్వల్ప కాలానికే మార్పు చేసినప్పటికి సహితమూ, ఇది ఎల్లప్పుడూ ఏదో ఒక రకం రివిజనిజాన్నే విధికృతంగా ప్రభావితం చేస్తుందనీ ఈ విధానం యొక్క ఆంతరిత ప్రకృతినుండే స్పష్టంగా తెలియవస్తూంది.

రివిజనిజంయొక్క అనివార్యత ఆధునిక సమాజంలో దానికున్న వర్గమూలముల వల్ల నిర్ణయించబడుతూంది. రివిజనిజం ఒక అంతర్జాతీయ దృగ్విషయం. జర్మనీలో సనాత

నులకూ బెర్న్‌స్టయినియన్లకూ, ఫ్రాన్సులో గెడిస్టులకూ జోరేస్ అనుయాయులకూ (ఇప్పుడు ప్రత్యేకంగా బ్రుసిస్టులకూ), బ్రిటన్‌లో సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్‌కూ ఇండిపెండెట్ లేబర్ పార్టీకీ, బెల్జియంలో బ్రూకేర్‌కీ వాండెర్‌వెల్డ్‌కీ, ఇటలీలో ఇంటెగ్రలిస్టులకూ రిఫార్మిస్టులకూ, రష్యాలో బోల్‌షెవిక్‌లకూ మెన్‌షెవిక్‌లకూ వున్న సంబంధాలు నేడు ఈ దేశాలన్నిటిలో వున్న జాతీయ పరిస్థితులూ చారిత్రాత్మక అంశాలలో ఎంతటి బ్రహ్మాండమైన వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూన్నప్పటికీ, సర్వత్రా ప్రధానంగా ఒకే రకానికి చెందినవని ఏ మాత్రం అనుభవం కలిగినట్టీ వివేచనాపరుడైనట్టీ సోషలిస్టుకి పిసరంత అనుమానమూ వుండదు. వాస్తవానికి ఆధునిక అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమంలో వున్న "విభజన" ప్రపంచంలోని వివిధ దేశాలలోనూ ఒకే పంథాలో ఇప్పుడు సాగుతూంది; ఒకేఒక్క అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమంలోని భిన్నభిన్న రకాలకు చెందిన ధోరణులు వివిధ దేశాలలో ఒకదానితో ఒకటి పోరాడుతూండినట్టి ముప్ఫై నలభై యేళ్ల పరిస్థితితో పోల్చిచూస్తే, ఇది మహత్తర పురోగమనానికి సాక్ష్యమిస్తూంది. "విప్లవాత్మక సిండికలిజం"[113]గా లాటిన్ దేశాలలో ఇప్పుడు రూపం ధరించినట్టి "వామపక్షపు రివిజనిజం" కూడా, మార్క్సిజాన్ని "సవరించుతూనే," మార్క్సిజానికి అనుగుణ్యంగా తానే సర్దుకుంటూంది: ఇటలీలో లబ్రియోల, ఫ్రాన్సులో లగార్డెల్, వీరిద్దరూ తప్పుగా అర్థం చేసుకోబడిన మార్క్సునుండి ఒప్పుగా అర్థం చేసుకోబడుతూన్న మార్క్సుకి తరుచు విజ్ఞప్తి చేస్తున్నారు.

అవకాశవాదతత్వపు రివిజనిజం అభివృద్ధి పొందినంత పరిమితి వరకూ ఇంకా ఏ మాత్రమూ అభివృద్ధి పొందనట్టీ, అంతర్జాతీయ రూపం ధరించనట్టీ, ఏ ఒక్క దేశంలో సహితం ఆచరణలో సోషలిస్టు పార్టీతో ఒక్క యుద్ధపరీక్షలోనైనా ఇంత వరకూ విజయవంతంగా నిలబడనట్టీ ఈ రివిజనిజంయొక్క భావశాస్త్రపు సారాన్ని విశ్లేషించడానికై మనమిక్కడ ఆగలేం. కాబట్టి పైన వివరించబడిన "కుడి పక్షపు రివిజనిజా"నికే మనం పరిమిత మవుదాం.

పెట్టుబడిదారీ విధాన సమాజంలో దీని అనివార్యత ఎందులో వుంది? జాతీయ ప్రత్యేకతలలోని భేదాల కంటెనూ, పెట్టుబడిదారీ విధానాభివృద్ధి స్థాయిలలోని భేదాల కంటెనూ ఇంకా లోతుగా ఇది ఎందుకు చొచ్చుకుని పోతూంది? ఎందుచేతంటే, ప్రతి పెట్టుబడిదారీ దేశంలోనూ శ్రామికవర్గం సరసనే, పెట్టీబూర్జువావర్గపు విశాలస్తరాలు ఎల్లప్పుడూ వుంటూనే వుంటాయి; సన్నకారు చేతిపని వ్యాపారాల యజమానులే ఈ స్తరాలవారు. స్వల్ప స్థాయి ఉత్పత్తిలో నుంచే పెట్టుబడిదారీ విధానం ప్రభవించింది, నిరంతరమూ ప్రభవిస్తూనే వుంటుంది కూడానూ. పెట్టుబడిదారీ విధానం వల్ల కొత్త "మధ్యమ స్తరాలు" పెద్ద సంఖ్యలో (ఉదాహరణకు: సైకిల్, మోటారుకారు పరిశ్రమలు లాంటి బృహత్ పరిశ్రమల అవసరాల దృష్ట్యా దేశం అంతటి మీదా చెల్లాచెదరుగా వున్న ఫ్యాక్టరీ-అనుబంధాలు, గృహ

పరిశ్రమ, చిన్న కార్ఖానాలు, వగైరాలు) సృష్టించబడుతున్నాయి. ఈ సన్నకారు ఉత్పత్తి దారులు కూడా అంత విధికృతంగానే శ్రామికవర్గ శ్రేణులలోకి తిరిగి నెట్టి వేయబడుతున్నారు. విశాలమైన కార్మికుల పార్టీలలో పెట్టీబూర్జువా ప్రపంచ దృక్పథం పదేపదే పైకితోసుకు వస్తూండడం కేవలం ప్రకృతిసిద్ధమే. శ్రామికవర్గ విప్లవపు హఠాత్తు మార్పు వరకూ ఇది ఇలాగే ఎల్లప్పుడూ వుండడమూ వుండితీరడమూ కేవలం ప్రకృతిసిద్ధమే, ఎందుచేతనంటే అలాంటి విప్లవాన్ని సాధించగల్గే ముందు ప్రజలలో అధికసంఖ్యాకవర్గం "సంపూర్ణంగా" శ్రామికవర్గీయమవడం ఆవశ్యకమని అనుకోవడం ప్రమాదభరితమైన పొరపాటే అవుతుంది. వివాదగ్రస్తములైన అంశాలనన్నింటిని శ్రామికవర్గ విప్లవం తీవ్రతరం చేసి, ప్రజారాసుల ప్రవర్తనను నిర్ణయించడంలో సూటిగా తక్షణ ప్రాముఖ్యతను కలిగినట్టి విషయాలపై అన్ని అభిప్రాయభేదాలనూ సాంద్రీకరించి, శత్రువులపై నిర్ణయాత్మకములైన దెబ్బలు తీయడానికి వీలుకలిగేందుకు, పోరాటం యొక్క అగ్నిలో మిత్రులెవరో శత్రువులెవరో పోల్చుకుని, ఎట్టి సమయంలో దుష్ట మిత్రులను వదలించుకోవడం అవసరమవుతుందో అట్టి సమయంలో, భావశాస్త్రీయ రంగంలో మాత్రమే మనకు ఇప్పుడు తరుచుగా అనుభవమవుతూన్నట్టి, వాటిని — మార్క్సుకు సైద్ధాంతిక "దిద్దుబాట్ల"పై వివాదాలనూ — ఈ ప్రాతిపదికపై రివిజనిస్టులతో కార్మికవర్గ ఉద్యమం యొక్క వివిధ పాక్షిక వివాదాంశాలను గురించి ఆచరణలో ఎత్తుగడలపై మాత్రమే చీలికలుగా ఇప్పుడు పైకి పెచ్చరిల్లుతూన్నట్టి వాటిని అనన్యసామాన్యమైన అధికస్థాయిలో కార్మికవర్గం తప్పకుండా అనుభవించాల్సే వుంటుంది.

పెట్టీబూర్జువావర్గం యొక్క ఊగిసలాటలూ బలహీనతయూ అన్నీ ఏలాగు వున్నప్పటికీ, సంపూర్ణ విజయోన్ముఖంగా పురోగమించుతూన్న శ్రామికవర్గం పోరాడాల్సివున్న బృహత్తర విప్లవయుద్ధాలకు, పందొమ్మిదవ శతాబ్ది అంత్యమందు రివిజనిజానికి వ్యతిరేకంగా విప్లవాత్మక మార్క్సిజం సాగించిన భావశాస్త్రీయ పోరాటం కేవలం నాందీవాచకమే అవుతుంది.

1908 మార్చి
ఉత్తరార్థంలోనూ,
ఏప్రిల్ 3(16) కంటె
తరువాత కాకుండానూ.

# భౌతికవాదమూ, ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదమూ

## ఒక అభివృద్ధి నిరోధక తత్వశాస్త్రంపై సవిమర్శనా వ్యాసాలు



ఖండిక

ఆరవ ప్రకరణం

## ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదమూ, చారిత్రక భౌతికవాదమూ

## 4. తత్వశాస్త్రంలో పక్షాలూ, తాత్విక జడభరతులూ

మతంతో మాఖిజానికి వున్న సంబంధాన్ని పరిశీలించడం ఒక్కటే మనకిక మిగిలి పోయింది. కాని ఈ పరిశీలన, తత్వశాస్త్రంలో సాధారణంగా పక్షాలున్నాయా, తత్వశాస్త్రంలో పక్షపాతరాహిత్యం అంటే ఏమిటి, అనే ప్రశ్నల కిందకు దిగుతుంది.

ఈ వివరణ అంతటిలోనూ, మనం స్పృశించిన ప్రతి జ్ఞానసాధనశాస్త్రీయ సమస్య సందర్భంలోనూ, నవీన భౌతికశాస్త్రం లేవనెత్తుతూన్న ప్రతి తత్వశాస్త్రీయ ప్రశ్న సందర్భం లోనూ భౌతికవాదానికీ భావవాదానికీ వున్న పోరాటాన్ని మనం వివరించాం. తత్వశాస్త్ర సమస్య లను పరిష్కరించడంలో, కొత్త పారిభాషికపద యుక్తుల మేటల వెనుక, విద్వత్సంపన్నమైన సమగ్రవిజ్ఞాతా వాదపు పెంటపోగుల వెనుక రెండు మౌలికములైన పంథాలు, రెండు మౌలిక ములైన ధోరణులు ఎట్టి మినహాయింపులూ లేకుండా ప్రతిసారీ మనకు కనబడ్డాయి. ప్రకృతి, పదార్థం, భౌతిక బాహ్య ప్రపంచం, వీటిని ప్రధానంగా తీసుకుని, మనస్సు, అధ్యాత్మ, ఇంద్రి యసంవేదన (మన కాలంలో విస్తృత ప్రయోగంలోవున్న పరిభాష ననుసరించి — అను భవము), ఆత్మ సంబంధం, వగైరా, వగైరాలను గౌణంగా పరిగణించాల్సి వుంటుందా? — ఇదే మూలప్రశ్న, ఇదే వాస్తవంగా తత్వవేత్తలను మునుపటిలాగే రెండు పెద్ద శిబిరాలుగా ఇంకా విభజిస్తూనే వుంది. ఉక్తులూ, నిర్వచనలూ, సమగ్రవిజ్ఞతావాదపు యుక్తులూ,

పద(ప్రయోగవైపరీత్యాలూ, వీటి ముసుగు వెనక మౌలికములైన ఈ రెండు ధోరణులూ ఉపేక్షించబడుతున్నాయి అనే వాస్తవవిషయమే ఈ రంగంలో వున్న వేనవేల పొరపాట్లకూ, గందరగోళానికీ మూలకారణం. (ఉదాహరణకు, తనది భావవాదమని బొగ్దానొవ్ ఒప్పుకోకుండా వున్నాడు; అందుకు ఏమిటి కారణం అంటారా: "ప్రకృతి," "అధ్యాత్మ" అనే "అతి భౌతిక" సామాన్యప్రత్యయాలు బదులు, భౌతికమూ ఆత్మసంబంధమూ అయిన "అనుభవవేద్య" సామాన్యప్రత్యయాలను వాడాడు. ఒక్కముక్క మారింది!)

మార్క్స్, ఎంగెల్స్‌ల ప్రతిభ ఎందులో వుందంటే, సుదీర్ఘకాలంలో, ఇంచుమించు అర్ధశతాబ్ది కాలంలో, వారు భౌతికవాదాన్ని అభివృద్ధి చేయడంలోనూ, తత్వశాస్త్రంలో ఒక మౌలికమైన ధోరణిని వారు ప్రగతిశీలంగా ముందుకు తీసుకొనిపోవడంలోనూ, అదివరకే అప్పటికే పరిష్కరించబడినట్టి జ్ఞానసాధనశాస్త్రీయ సమస్యలను పునశ్చరణ చేయడంతో తాము పరిమితం కాకుండా, తత్వశాస్త్రంలో ఒక "నూతన" ధోరణిని "ఆవిష్కరించడం" కోసమూ, ఒక "నూతన" పంథాను "కల్పించడం," వగైరాల కోసమూ కావించబడినట్టి భేషజపూరితములైన చాటభారతాలనూ, అసంఖ్యాకములైన యత్నాలనూ చెత్త అనీ, పెంట అనీ నిర్దాక్షిణ్యంగా తోసిపారేసి, సాంఘికశాస్త్రీయ రంగంలో అచ్చంగా ఈ భౌతికవాదాన్నే సుసంగతంగా ప్రయుక్తం చేయడంలోనే వుంది. — ఏ విధంగా ప్రయుక్తం చేయడమో వారు చూపించారు కూడా. ఇటువంటి యత్నాల పద(ప్రయోగ స్వభావమూ, కొత్త తత్వశాస్త్రీయ "ఇజమ్" లతో సమ(గవిజ్ఞతావాదాత్మకములైన కుస్తీపట్లూ, ప్రశ్నయొక్క సారాన్ని డాంబికములైన కుయుక్తులతో పూడ్చివేయడమూ, మౌలికములైన జ్ఞానసాధనశాస్త్రీయ ధోరణుల రెండింటి మధ్యవున్న పోరాటాన్ని అర్థంచేసుకుని స్పష్టంగా వ్యక్తపరచడంలో అసమర్థతా — వీటిని వెన్నాడి వీటితో పోరాడడానికే మార్క్స్, ఎంగెల్స్‌లు సుదీర్ఘమైన తమ యావత్తు క్రియాకలాపాన్నీ వినియోగించారు.

"ఇంచుమించు అర్ధశతాబ్ది కాలంలో" అని మనం అన్నాం. వాస్తవంగా 1843 లోనే, మార్క్స్ ఇంకా మార్క్స్ అవుతూండే కాలంలోనే, అంతకు ముందుండిన భౌతికవాద రూపాలన్నిటి కంటెనూ విషయంలో అనన్యసామాన్యంగా సంపన్నవంతమైనట్టీ, సుసంగతంలో నిరుపమానమైనట్టీ ఆధునిక భౌతికవాదంయొక్క సంస్థాపకుడు అవుతూండిన కాలంలోనే, తత్వశాస్త్రంలోని మౌలిక ధోరణులను ఆనాటికే మార్క్స్ అద్భుతమైన తేటతనంతో చూపెట్టాడు. "Deutsche-Französische Jahrbücher" అనే వార్షికసంచికకు, షెల్లింగ్‌ను వ్యతిరేకిస్తూ ఒక వ్యాసం రాయమని ఆహ్వానించుతూ మార్క్స్ 1843 అక్టోబరు 20 న ఫాయెర్‌బాఖ్ పేర రాసిన లేఖను కారల్ గ్ర్యూన్ ఉదాహరిస్తాడు. ఈ షెల్లింగ్ ఇదివరకున్న అన్ని తత్వశాస్త్రీయ ధోరణులనూ గ్రహించి, తాను అన్నిటికీ అతీతుడనని చాటుకున్నట్టి వొట్టి

బడాయకోరు అని మార్క్సు రాశాడు. "ఫ్రెంచి కాల్పనికులతోనూ మర్మజ్ఞాన వాదులతోనూ: తత్వశాస్త్ర, మత శాస్త్రాల సాయుద్యం నేను, అని అంటాడు షెల్లింగ్; ఫ్రెంచి భౌతికవాదులతో: దేహమూ, భావమూ వీటి సాయుద్యం నేను, అంటాడు; ఫ్రెంచి సంశయవాదులతో: డాగ్మాటిజం సంహారిని నేను, అంటాడు."* సంశయవాదులు — వీరిని హ్యూమ్ అనుయాయులు అని అన్నా సరే, కాంట్ అనుయాయులు అని అన్నా సరే (లేదంటారా, ఇరవైయ్యో శతాబ్దిలో మాఖ్ అనుయాయులు అని అన్నా సరే) — భౌతికవాద భావవాదాల రెండింటికీ చెందిన డాగ్మాటిజానికి వ్యతిరేకులని అప్పటికే ఆనాడే తెలుసుకున్నాడు మార్క్సు; నిరర్థకమైన వెయ్యిన్నొక తత్వశాస్త్రీయ పద్ధతులలో ఏ ఒక్కటి సహితమూ తన మార్గానికి ప్రతిబంధకంగా ఏర్పడనీయకుండా, ఫాయెర్‌బాఖ్‌ను దాటిపోయి, భావవాదానికి వ్యతిరేకంగా సరాసరి భౌతికవాద మార్గం చేపట్టగల్గాడు మార్క్సు. ముప్పైయ్యేళ్ల తరువాత, "పెట్టుబడి" గ్రంథం మొదటి సంపుటం రెండవ కూర్పు మలిపలుకులో, అన్నిరకాల భావవాదాల్లోనూ అత్యంత సుసంగతమై అభివృద్ధి చెందిన హేగెల్ భావవాదానికీ తన భౌతికవాదానికీ వున్న భేదాన్ని అంత స్పష్టంగానూ అంత నిష్కర్షగానూ అతడు చూపించుతాడు; కొంట్‌యొక్క "పోసిటివిజం"**ను అతడు తృణీకారభావంతో పక్కకునెట్టేసి, తాము వాస్తవానికి కాంట్, హ్యూమ్‌ల పూర్వహేగెలీయన్ పొరపాట్లనే పునశ్చరణచేయ నారంభించినప్పటికీ తాము హేగెల్‌ను నాశనం చేసేశామని విర్రవీగినట్టి సమకాలిక తత్వశాస్త్రజ్ఞులకు జాలిపుట్టించే అనుకరణులు అని అతడు పేరుపెట్టాడు. కూగెల్‌మన్ పేర మార్క్సు 1870 జూన్ 27 వ లేఖ రాస్తూ, "బ్యూఖ్నర్, లాంగె, డ్యూరింగ్, ఫెఖ్నర్, వగైరాలు" హేగెల్ గతితర్కాన్ని ఏ మాత్రమూ అర్థం చేసుకోక, ఆయనను చులకన చేశారనే కారణాన, వారిని గురించి తృణీకారభావంతో ప్రస్తావించుతాడు.*** కాగా చిట్టచివరకి, "పెట్టుబడి," తదితర గ్రంథాల్లో మార్క్సు వెలిబుచ్చిన వివిధ తాత్విక వాక్యాలను తీసుకొని చూస్తే,

---

* Karl Grün. "Ludwig Feuerbach in seinem Brifwechsel und Nachlass, sowie in seiner philosophishen Charakterentwicklung," I Bd., Lpz., 1874, S. 361. కారల్ గ్ర్యూన్ ("అతని ఉత్తరప్రత్యుత్తరాల, మరణానంతర ప్రచురిత రచనలలోనూ, అతని తాత్విక, స్వభావపరిణామంలోనూ లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్," 1వ సంపుటం; లైప్‌జిగ్, 1874, 361 వ పుట. — సం.)

** నిశ్చయవాదం — అనువాదకుడు.

*** పోసిటివిస్టు బీజ్‌లి (Beesley) గురించి, మార్క్సు 1870 డిసెంబరు 13న రాసిన లేఖలో ఇలా అంటాడు: "ప్రొఫెసర్ బీజ్‌లీ కోంట్ అనుయాయి, అందుచేత అన్ని రకాల పిచ్చి అభిప్రాయలనూ (crotchets) వెనుకవేసుకురాక తప్పదతనికి." 1892 లో హక్స్‌లీ లాంటి పోసిటివిస్టులు గురించి ఎంగెల్సు అభిప్రాయంతో దీనిని సరిపోల్చి చూడండి.[114]

వాటిలో సుస్థిరమైనట్టి మూలభావం ఒకటి మీకు కనబడుతుంది, అదేమిటంటే: భౌతికవాదాన్ని పట్టువిడుపు లేకుండా అనుసరించడం, నిగూఢపరచేటట్టీ, గందరగోళ పరచేటట్టీ అన్ని యత్నాలనూ, భావవాద దిశగా మళ్ళీ అన్ని పెడదార్లనూ తృణీకారభావంతో పరిహాసం చెయ్యడం. మార్క్స్ యొక్క తత్వశాస్త్రీయ వాక్యాలు అన్నీ ఈ రెండు మౌలికములైన విరుద్ధాల చుట్టూ పరిభ్రమణం చేస్తూంటాయి; కాగా యూనివర్సిటీ ప్రొఫెసర్ల దృష్టిలో, వీటి లోపం ఈ "సంకుచితతత్వం"లోనూ, "ఒక పక్షంవైపు మొగ్గు చూపడం"లోనూ వుంది. వాస్తవానికి, నిశితంగా నిర్వచించబడినట్టి తత్వశాస్త్రీయ మార్గాన ముందుకు సాగిపోయిన మార్క్స్ యొక్క మహత్తర శ్రేష్ఠత భౌతికవాద భావవాదాలకు పొత్తుకుదిర్చే సంకరజాతి పథకాలను లెక్కచేయక పోవడంలోనే వుంది.

మార్క్స్ భావంలోనే సంపూర్ణంగానూ, అతనితో అత్యంత సన్నిహితంగానూ కృషి చేస్తూ, ఎంగెల్స్ తన తత్వశాస్త్ర రచనలలో భౌతికవాద, భావవాదాలయొక్క "ఒక వైపు మొగ్గు చూపడము"నకు "అతీతం" అయేందుకూ, ఒక నూతన ధోరణిని – "పోసిటివిజం" "రియలిజం"* ఇంకా ఏదో మరొక విశ్వవిద్యాలయ పండితమ్మన్యుల చిట్కావైద్యాన్ని – ప్రపంచానికి చాటేందుకూ ఆద్యంతాలు లేని యత్నాలను 1878 లోనైతేనేమి, 1888 లోనైతేనేమి, 1892 లోనైతేనేమి[115] ఏ మాత్రం గంభీరంగానూ లెక్కచేయకుండా, అన్ని ప్రశ్నల సందర్భంలోనూ సంక్షిప్తంగానూ స్పష్టంగానూ భౌతికవాద, భావవాద మార్గాలను ఒక దానితో ఒకటి సరిపోల్చి, వాటి భేదాలను చూపుతాడు. వివాదగ్రస్త విషయాన్ని మాటలతో చిక్కుపెట్టేశాడనీ, పదజాలప్రయోగం చేశాడనీ, భావవాదంతో రాజీపడి, భావవాద స్థానాన్ని స్వీకరించే హేతువాద విధానాలను భ తికవాది అయిన డ్యూరింగ్ అవలంబించాడనీ అతనిపై నేరం మోపుతూ, భౌతికవాదానికి సుసంగతంగా కట్టుబడి వుండాలనే నినాదంకిందనే డ్యూరింగ్‌కు వ్యతిరేకంగా తన యావత్తు యుద్ధమూ సాగించాడు ఎంగెల్స్. "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" గ్రంథం ప్రతి పరిచ్ఛేదంలోనూ ప్రశ్నను ఈ విధంగా సూత్రీకరిస్తాడు అతడు: కడ వెళ్ళా, సుసంగతమైన భౌతికవాదమూ, లేదా తాత్వికభావవాదపు అబద్ధాలూ, గందరగోళమూ; కాగా యూనివర్సిటీ ప్రొఫెసర్ల అభివృద్ధినిరోధక తత్వశాస్త్రంతో విచ్చిపోయిన మెదడుగల వాళ్ళకి తప్ప కడంవాళ్ళందరికీ ఇది స్పష్టంగానే కనబడుతుంది. తుదిసారిగా పరిష్కరించి విస్తృత పరచబడిన "డ్యూరింగ్ సిద్ధాంతఖండన" గ్రంథానికి గ్రంథకర్త చిట్టచివరి పర్యాయం పీఠిక రాసినప్పటి వరకూ, 1894 అంతం వరకూ కూడా తత్వశాస్త్ర, విజ్ఞానశాస్త్రాల లోని సరికొత్త పరిణామాలను ఆకళింపు చేసుకుంటూ వచ్చి, చిన్నవీ పెద్దవీ అనే వ్యత్యాసం

* వస్తుస్వాతంత్ర్యవాదం – అనువాదకుడు.

లేకుండా కొత్త పద్ధతుల చెత్తచెదారం అంతనీ తుడిచిపారేసి, స్పష్టమైనట్టి దృఢమైనట్టి తన స్థానంలోనే తన తొల్నిటి వజ్రసంకల్పంతో నిలబడ్డాడు ఎంగెల్స్.

తత్వశాస్త్రంలోని నూతన పరిణామాలను ఎంగెల్స్ ఆకళింపు చేసుకున్నట్లు "లుడ్విగ్ ఫొయెర్‌బాఖ్" గ్రంథం నుండి ప్రత్యేకంగా కనబడుతూనే వుంది. ఆ గ్రంథానికి తాను రాసిన 1888 పీఠికలో, ఆనాడు ప్రచలితమవుతూన్న నవీన-కాంట్‌వాదము, హ్యూమ్‌వాదముల పట్ల ఎంగెల్స్‌కి (ఆ గ్రంథ పీఠికలోనూ గ్రంథ వాచకంలోనూ) కేవలం తృణీకారభావమే తప్ప మరేమీ లేకపోయినప్పటికీ, ఇంగ్లండులోనూ స్కాండినేవియాలోనూ సాంప్రదాయిక జర్మన్ తత్వశాస్త్రం యొక్క పునరావతరణ దృగ్విషయాన్ని సహితమూ అతడు పేర్కొన్నాడు. ఒక ఫాషనుగా మారిపోయిన జర్మన్, ఇంగ్లీషు తత్వశాస్త్రం కాంట్‌వాదము, హ్యూమ్ వాదములయొక్క పాతకాలపు పూర్వహేగెలీయన్ పొరపాట్లనే రోకటిపాటగా వల్లించడమును ఎంగెల్స్ గమనించుతూనే, హేగెల్ దిశగా మలుపు నుండైనా ఏదోకొంత సత్ఫలితం కోసం ఎదురుచూస్తూ, నిస్సారమైన భావవాద, అతిభౌతికవాద ప్రమాదాలను బయట పెట్టేందుకు మహనీయుడైన ఆ భావవాది, గతితార్కికుడు సహాయపడతాడని ఆశించాడు.

జర్మనీలో నవీన-కాంట్‌వాదంయొక్క, ఇంగ్లండులో హ్యూమ్‌వాదం లెక్కకుమించిన ఛాయల పరిశీలనలోకి దిగకుండానే, భౌతికవాదంనుండి అది మౌలికంగా మారుతోవ తొక్కడం ఎంగెల్స్ ఆరంభం నుండీ ఖండిస్తాడు. ఈ రెండు పంథాల సంపూర్ణధోరణి "శాస్త్రీయంగా ఒక వెనుకంజ" అని ఎంగెల్స్ ఉద్ఘాటిస్తాడు. కాగా, ఎవరి సంఖ్యలోనైతే, ఉదాహరణకు హక్స్‌లీని చేర్చక తనకు తప్పిందికాదో అట్టి నవీన-కాంటియన్ల, హ్యూమియన్ల నిస్సందేహమైన "పొసిటివిస్టు" ధోరణులను నేడు చలామణీలోవున్న పరిభాష ప్రకారం నిస్సందేహంగా "రియలిస్టు" ధోరణులను అతడు ఎలా విలువకట్టాడు? అసంఖ్యాకములైన అయోమయపు బుర్రలను ఆకర్షించినట్టి, ఇంకా ఆకర్షించుతూనే వున్నట్టి ఇటువంటి "పొసిటివిజమూ," "రియలిజమూ," ఎంత ఉత్తమపక్షంలో చూసినప్పటికీ కూడా, బహిరంగా భౌతికవాదాన్ని విమర్శిస్తూ దానిని వదలకుంటూనే, దొడ్డిదారంట దానిని ప్రవేశపెట్టే అల్పబుద్ధి విధానమే అని ఎంగెల్స్ ఉద్ఘాటించాడు! "అధునాతన పొసిటివిజం" అంటేనూ, "అధునాతన రియలిజం" అంటేనూ పట్టుమని యే పదిమంది మార్క్సిస్టులో పడుతూన్న నేటి వెర్రి ఉత్సాహంపట్ల, ఎంగెల్స్ ఎంతటి తృణీకారభావం చూపివుండేవాడో గ్రహించాలంటే, టామస్ హక్స్‌లీని — మహామహుడైన శాస్త్రవేత్త, మాఖ్, అవెనారియస్ ప్రభృతులకంటెనూ అనన్యసామాన్యుడైన వస్తుస్వాతంత్ర్యతత్వ వస్తుస్వాతంత్ర్యవాది, అనన్యసామాన్యుడైన ప్రత్యక్షవాస్తవికతత్వ ప్రత్యక్షవాస్తవికతత్వవాది అయిన టామస్ హక్స్‌లీని — ఈ విధంగా విలువకట్టడమును మనం ఒక్క క్షణమాత్రం పర్యాలోచించుతే చాలు.

మార్క్స్, ఎంగెల్స్‌లు ఇద్దరూ ఆదినుండి అంతంవరకూ తత్వశాస్త్రంలో పక్షపాతులుగానే వున్నారు; ప్రతి ''అధునాతన'' ధోరణిలోనూ భౌతికవాద దిశగా వున్న మలుపులనూ, భావవాదానికీ ఫిడెయిజానికీ* కలుగజేసిన సదుపాయాలనూ వారు బయటపెట్టగల్గారు. కాబట్టే ప్రత్యేకమూ సుసంగత భౌతికవాద దృక్స్థానంనుంచే వారు హక్స్‌లీని విలువకట్టారు. కాబట్టే కడవెళ్ళా భౌతికవాదాన్ని అవలంబించినందుకే, వ్యక్తిగతంగా భౌతికవాదులు కొందరు పొరపాట్లు చేసిన కారణాన భౌతికవాదాన్ని వదలుకున్నందుకే, మతానికి కొత్త మెరుగులు దిద్దేందుకూ, లేక ఒక కొత్త మతాన్ని కల్పించేందుకూ మతంతో పోరాడినందుకే, భావవాద పదజాలాన్ని వదిలించుకుని సాంఘికశాస్త్రంలో భౌతికవాదిగా మారినందుకే ఫాయెర్‌బాఖ్‌ను వారు దుయ్యబట్టారు.

గతితార్కిక భౌతికవాదాన్ని వివరించడంలో జె. డీట్స్‌గెన్ ఎట్టి ప్రత్యేకమైన పొరపాట్లు చేస్తే చేసివుండినప్పటికీ, తన గురువర్యులు స్థాపించిన సంప్రదాయాల విలువను తాను పూర్తిగా గుర్తించి, వాటిని అతడు అనుసరించాడు. భౌతికవాద మార్గం వదలి అతడు తొక్కిన మొరటు తప్పుడు పంథాల మూలంగా అతడు ఎన్నో తప్పిదాలు చేశాడు; అయినప్పటికీ సూత్ర దృష్ట్యా మాత్రం దానితో సంబంధం వదలుకునే యత్నం అతడు ఎన్నడూ చేయలేదు, ''నూతన'' పతాకను ఎగరవేసే యత్నం అతడు ఎన్నడూ చేపట్టలేదు, కాగా, నేను భౌతికవాదిని, మన తత్వశాస్త్రం ఒక భౌతికవాద తత్వశాస్త్రం, అని అతడు దృఢంగానూ నిశ్చయంగానూ నిర్ణయాత్మక క్షణంలో ఎల్లప్పుడూ చాటిచెప్పాడు. ''అన్ని పక్షాలకంటే మధ్యమ పక్షం అతి ఏహ్యమైనది.... రాజకీయాలలో పక్షాలు ఎలాగైతే రెండు శిబిరాలుగా అంతకంతకు మరింతగా విభాగమయిపోతున్నాయో, ...అలాగే విజ్ఞానశాస్త్రం కూడా రెండు సాధారణ వర్గాలు (Generalklassen) కింద విభాగమయిపోతూంది: అటు అతిభౌతికవాదులు, ఇటు పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు, లేక భౌతికవాదులు.** అనేక పేర్లలో — ఆధ్యాత్మికవాదులు, ఇంద్రియ సంవేదన వాదులు [sensualists], రియలిస్టులు వగైరా వగైరా పేర్లతో — చలామణీ అవుతూన్న మాధ్యస్థ మూలద్రవ్యాలూ, మధ్యవర్తిత్వం వహించే చిట్కావైద్యులూ తమ దారిలో నడుస్తూ ఒక్కొక్కప్పుడు ఈ ప్రవాహంలోనూ, ఒక్కొక్కప్పుడు ఆ ప్రవాహంలోనూ పడుతూంటారు. మేము నిష్కర్షత, స్పష్టత

* జ్ఞానాతీత ఆత్మనివేదనవాదం — అనువాదకుడు.

** ఇక్కడ కూడా ఒక అవకరమైనట్టీ, నిశితముకానట్టీ ఉక్తి దొర్లింది: ''అతిభౌతికవాదులు'' బదులు ''భావవాదులు'' అని అతడు చెప్పి వుండాల్సింది. డీట్స్‌గెన్నే ఇంకొకచోట అతిభౌతికవాదులను గతితార్కికులకు ప్రతిగా నిలబెట్టుతాడు.

దిశగా చుక్కాని పట్టుతాము. తిరోగమనానికి బాకా వూదేవారు (Retraitebläser) తాము భావవాదులమని పేరుపెట్టుకుంటున్నారు,* కాగా అతిభౌతికవాద మంత్రప్రభావం నుండి మానవ మనస్సును విముక్తి చేయ యత్నించుతూన్నవారు 'భౌతికవాదులం' అని పేరు పెట్టుకోవాలి.... ఈ రెండు పక్షాలనూ ఘనపదార్థంతోనూ ద్రవపదార్థంతోనూ వరుసగా మనం పోల్చినట్టయితే, వీటి రెంటి నడుమను వున్నది ఏదో ఒక జావ లాంటిది.''**

నిజమే! ''పొసిటివిస్టులతోనూ,'' మాఖిస్టులతోనూ, వగైరాలతోనూ సహా ''రియలిస్టులు'' అందరూ వుత్త జావముద్దే; ప్రతి ప్రశ్నపైనా భౌతికవాద, భావవాద ధోరణులను ఒకదానితో ఒకటి గందరగోళం చేస్తూ తత్వశాస్త్రంలో తుచ్ఛమైన మాధ్యస్థ పక్షం వహిస్తూంటారు వీరు. తత్వశాస్త్రంలో మౌలికములైన ఈ రెండు ధోరణులనుండీ తప్పించుకొన జూచే యత్నం ''సమాధానతత్వవ్యసనపు చిట్కావైద్యం'' తప్ప మరేమీ కాదు.

భావవాద తత్వశాస్త్రంయొక్క ''విజ్ఞానశాస్త్రీయ మతాచార్య మాయను బహిరంగ మతాచార్య మాయకి కేవలం పూర్వమందిరం అనడంలో జె. డీట్స్‌గెన్ ఏ మాత్రము సందేహించలేదు. ''విజ్ఞానశాస్త్రీయ మతాచార్య మాయ మతాచార్య మాయకి మద్దతు ఇచ్చేందుకు విశ్వప్రయత్నాలు చేస్తూంది'' (చూ. ముందు పేర్కొన్న గ్రంథం, పుట 51). ''అందులోనూ ప్రత్యేకంగా, జ్ఞానసాధనశాస్త్ర రంగం, మానవ మనస్సును అపార్థం చేసుకొనడం,'' ఈ మతాచార్యులూ ఆ మతాచార్యులూ కూడా వారి ''గుడ్లనుపెట్టే పేనుల బెజ్జమే,'' (Lausgrube) అని అతడు రాశాడు. '''ఆదర్శప్రాయములైన ఆశీస్సులు' గురించి వుత్తుత్త కబుర్లు చెప్పే 'పట్టభద్రులైన భృత్యులు' తమ కృతక (geschraubter) భావవాదంతో ప్రజలను బుద్ధిహీనులను చేస్తున్నారు'' (పుట 53) — ఇదీ తత్వశాస్త్రపు ప్రొఫెసర్లపై జె. డీట్స్‌గెన్ అభిప్రాయం. ''దయాళుడైన దేవునికి దయ్యం ఎలాగైతే ప్రత్యర్థో, అలాగే ప్రొఫెసరుపురోహితుడు (Kathederpfaffen) భౌతికతత్వవాదికి ప్రత్యర్థి.'' భౌతికవాద జ్ఞానసాధన సిద్ధాంతం ఒక్క ''మతవిశ్వాసానికి వ్యతిరేకమైన సార్వజనీన ఆయుధమే'' కాకుండా (పుట 55), ''ఆభాసపాలైనట్టీ, రూపాన్నే ప్రాముఖ్యతను కలిగినట్టీ, సామాన్య పురోహిత మతానికి వ్యతిరేకంగానే కాకుండా, గందరగోళంతో నిండిన (benebelter) భావవాదుల

* డీట్స్‌గెన్ తన పొరపాటును దిద్దుకుని, ఏది భౌతికవాద శత్రువుల పక్షమో మరింత బరాబరీగా ఇప్పుడు వివరించుతున్నాడని గమనించాలి.

** చూ. 1876 లో రాసిన ''సోషల్-డెమోక్రాటిక్ తత్వశాస్త్రం'' అనే వ్యాసం. "Kleinere philosophischen Schriften," 1903, S. 135. [''సంగ్రహతత్వశాస్త్ర వ్యాసాలు''] 1903, పుట 135. — అనువాదకుడు.

మిక్కిలి సున్నితమైనట్టీ, అత్యంతోన్నతమైనట్టీ, ప్రొఫెసర్‌గిరీ మతానికి వ్యతిరేకంగా కూడా సార్వజనీనమైన ఆయుధమే." (పుట 58.)

స్వేచ్ఛాచింతనపరులైన ప్రొఫెసర్ల "అర్ధాంగీకారం" కంటె "మతంయొక్క నిజాయితీ"యే ఎప్పుడైనా మెరుగు అనేవాడు డీట్స్‌గెన్ (పుట 60), ఎందుకంటే "పద్ధతి అంటూ ఒకటుంది అక్కడ," సమ్యగ్ వ్యక్తులూ, ఆచరణ నుండి సిద్ధాంతాన్ని విడదీయని వ్యక్తులూ అక్కడ మనకి తారసిల్లుతారు. శ్రీయుతులు ఈ ప్రొఫెసర్లకు "తత్వశాస్త్రం ఒక విజ్ఞానశాస్త్రం కాదు, సోషల్-డెమొక్రసీ నుండి కాపాడుకుందుకు ఒక సాధనం మాత్రమే..." (పుట 107). "తత్వశాస్త్రజ్ఞులమనీ, ప్రొఫెసర్లమనీ, యూనివర్సిటీ అధ్యాపకులమనీ పేర్లు పెట్టుకున్నవారు, వారి స్వేచ్ఛాచింతన ఎలాగున్నా, మూఢత్వంలోనూ మర్మవాదంలోనూ ఇంచుమించుగా మునిగివున్నారు... కాగా, సోషల్-డెమొక్రసీకి సంబంధించినంత వరకు ఒకేఒక... అభివృద్ధి నిరోధక రాశిగా ఏర్పడుతున్నారు" (పుట 108). "నిజమార్గాన్ని ఇప్పుడు అనుసరించేందుకూ, ఈ యావత్తు మతసంబంధ, తత్వశాస్త్రీయ అసందర్భం (Welsch) వల్ల మోసపోయి పెడదార్లు పట్టకుండా వుండేందుకూ, తప్పుదోవలన్నిటిలోనూ తప్పుదోవ (der Holzweg der Holzwege) అయిన తత్వశాస్త్రాన్ని పఠించడం అవసరం" (పుట 103).

తత్వశాస్త్రంలోని పార్టీల దృష్ట్యా మాఖ్, అవెనారియుస్‌లనూ, వారి పంథీయులనూ మనమిప్పుడు పరిశీలించుదాం. అహో, ఈ పెద్దమనుషులు తమ పక్షపాతరాహిత్యం గురించి బడాయిలు కొడుతూంటారు, కాగా తమకు ప్రతిలోముడు అంటూ అసలు వుంటే అట్టివాడు ఒక్కడే, అదిన్నీ కేవలమూ... భౌతికవాదే. అందరి మాఖ్ అనుయాయుల అన్ని రచనలలోనూ, తాము భౌతికవాదాన్నీ భావవాదాన్నీ "మించి ముందుకు వెళ్ళిపోయాము" అనేటట్టీ, ఈ "కాలం చెల్లిపోయిన" విరుద్ధానికి తాము అతీతులము అనేటట్టీ తెలివితక్కువ ప్రగల్భం ఒకటి ఎర్రని పోగులా అవుపడుతూంటుంది. కాని వాస్తవంగా ఈ భ్రాతృగణం అంతా కూడా ప్రతిక్షణమూ భావవాదంలోకి దిగజారిపోతూ, భౌతికవాదంపై నిశ్చలమైనట్టీ నిరంతరాయమైనట్టీ పోరాటాన్ని సాగిస్తూనే వుంది. అవెనారియుస్ బోటి వ్యక్తికివున్న జ్ఞానసాధన శాస్త్రీయ వైపరీత్యాలు, ఒక చిన్న "తన సొంత" తాత్విక తెగను తయారు చేసుకుందుకై, ప్రొఫెసర్‌గిరీ కల్పనలు తప్ప మరేమీ కావు; కాని వాస్తవానికి ఆధునిక సమాజంలో భావాలు, ధోరణుల మధ్య జరుగుతూన్న పోరాటాల సాధారణ సందర్భాలలో ఈ జ్ఞానసాధన శాస్త్రీయ కుయుక్తులు నిర్వహించే బాహ్యాగతాత్మక పాత్ర పతి సందర్భంలోనూ ఒక్కటే, అదేమిటంటే భావవాదానికీ, ఫిడేయిజానికీ మార్గం సుగమం చేసే వాటికి భక్తివిశ్వాసాలతో ఊడిగం చేయడమే. వాస్తవానికి, భౌతికవాదంపై దాడి వెడలినందుకు మాఖ్‌ను శ్లాఘించు

తూన్నట్టి వార్డ్ లాంటి ఇంగ్లీషు ఆధ్యాత్మికవాదులూ, ఫ్రెంచి నవీన-విమర్శనాతత్వవాదులూ, జర్మన్ ఇమ్మనెంటిస్టులు* ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదులలో ఈ చిన్న పంథాకు నివాళులు ఎత్తుతూండడం యాదృచ్ఛికమేమీ కాదు! "ఫిడేయిజంయొక్క పట్టభద్రులైన భృత్యులు" అని డీట్జ్‌గెన్ ప్రయోగించిన వాక్యం, మాఖ్, అవెనారియుస్ గార్లలకూ, వారి పంథీయులందరికీ సూటిగా గుండెల్లో తగులుతూంది.**

---

* అంతస్థవాదులు — అనువాదకుడు.

** విస్తృతంగా విస్తరిల్లుతూన్నట్టి అభివృద్ధి నిరోధక బూర్జువా తత్వశాస్త్రపు ధోరణులు మాఖిజాన్ని ఆచరణలో ఎలా ఉపయోగించుకుంటూన్నదీ అందుకు ఇదిగో ఇంకొక ఉదాహరణ. అమెరికన్ అధునాతన తత్వశాస్త్రంలో బహుశా "అధునాతనమైన ఫాషను" "ప్రాగ్మటిజం" [కార్యకారణవివేక వాదం — అనువాదకుడు.] (pragma అనే గ్రీకు పదం — కార్యం; అనగా కార్యాచరణయొక్క తత్వశాస్త్రం). తత్వశాస్త్ర పత్రికలు ప్రాగ్మటిజం తప్ప మరిదేని గురించీ రాయడం లేదేమో కూడానూ. భావవాద, భౌతికవాదాలు రెంటియొక్క అతిభౌతికతత్వాన్నీ కార్యకారణవివేక వాదం అవహేళన చేస్తూ, అనుభవాన్నే, కేవలం ఒక్క అనుభవాన్నే హర్షించుతూ, ఆచరణను మాత్రమే ఏకైక ప్రమాణంగా గుర్తించుతూ, సాధారణంగా పోసిటివిస్టు ఉద్యమాన్ని పేర్కొని, విజ్ఞానశాస్త్రం "వాస్తవికతకు కేవలం నకలు" కాదు, అనే నమ్మికను సమర్థించుకుందుకు ఆసరా కోసం ప్రత్యేకంగా ఓస్ట్‌వాల్డ్, మాఖ్, పియర్‌సన్, పాయింకారె, డూహెమ్‌లవంక తిరుగుతూంది. కాగా... అతిభౌతిక ఛాయలేవీ లేకుండా, అనుభవ పరిమితులకు అతీతం కాకుండా, ఆచరణలో, కేవలం ఆచరణలో ఉపయోగార్థం, దేవుడు ఒకడు వున్నాడని దీనంతటనుండీ ఊహచేస్తూంది (చూ. William James. "Pragmatism. A new name for some old ways of thinking" N. Y., and L. 1907, p. 57 and 106. ప్రత్యేకంగా [విలియమ్ జేమ్స్, "ప్రాగ్మటిజం, కొన్నిపాత చింతనా మార్గాలకు కొత్త పేరు," న్యూయార్క్ మరియు లండన్, 1907, పుట 57, ప్రత్యేకంగా పుట 106. — అనువాదకుడు.] భౌతికవాద దృక్స్థానంనుండి చూస్తే, ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదానికీ ప్రత్యక్షానుభావయుత ఏకతావాదానికీ [empirio-monism] వున్న భేదం ఎంత స్వల్పాతిస్వల్పమో, ఎంత అప్రాముఖ్యమైనదో మాఖిజానికీ ప్రాగ్మటిజానికీ వున్న భేదం కూడా అంతే. ఉదాహరణకు, బొగ్దానొవ్ సత్యానికి ఇచ్చిన నిర్వచనాన్ని, "అనుభవంలో అన్ని రకాల నిష్కర్షమైన కార్యకార-విలువలకూ (working-values) ప్రాగ్మటిస్టు దృష్టిలో సత్యం ఒక వర్గనామమవుతుంది," అని ప్రాగ్మటిజం ఇచ్చిన నిర్వచనంతో సరిపోల్చి చూడండి (అదే గ్రంథం, 68 వ పుట).

మాఖిజానికీ మార్క్సిజానికీ ''సామరస్యం కుదుర్చుతామని'' బయల్దేరిన రష్యన్ మాఖ్ అనుయాయులు, తత్వశాస్త్రపు అభివృద్ధి నిరోధక ప్రొఫెసర్లను తాము నమ్ముతూ, తత్ఫలితంగా గట్టునుండి జారి నీటిలో పడడం వారి దురదృష్టమే. మార్క్సిను అభివృద్ధి చేయడానికీ, పరిష్కరించి శేషపూరణం చేయడానికీ కావించబడిన భిన్నభిన్నయత్నాల కార్యా చరణలో ప్రయుక్తం చేయబడిన విధానాలు ఏమంత చమత్కారములైనవి కావు. వారు ఓస్ట్ వాల్డ్ను పఠిస్తారు. ఓస్ట్వాల్డ్ను నమ్ముతారు, ఓస్ట్వాల్డ్కు టీక చెబుతారు. దీనికి మార్క్సి జం అని నామకరణం చేస్తారు. మాఖ్ను పఠిస్తారు, మాఖ్ను నమ్ముతారు, మాఖ్కు టీక చెబుతారు. దీనికి మార్క్సిజం అని నామకరణం చేస్తారు. పోయింకారెను పఠిస్తారు, పాయిం కారెను నమ్ముతారు! పాయింకారెకు టీక చెబుతారు, దీనికి మార్క్సిజం అని నామకరణం చేస్తారు. రసాయనశాస్త్రం, చరిత్ర, భౌతికశాస్త్రం, ఈ ప్రత్యేకరంగాల్లో అత్యంత విలువ కల్గిన ఆవిష్కరణలు చేయ సమర్థులైన ఈ ప్రొఫెసర్లలో ఏ ఒక్కరినీ కూడా, తత్వశాస్త్ర విషయంలో ఈషణ్మాత్రమైనా మనం నమ్మడానికి వీల్లేదు. ఎందుచేత? ఎందుచేతంటే, వాస్తవవిషయక, ప్రత్యేక గవేషణా రంగంలో అత్యంత విలువకల్గిన ఆవిష్కరణలు చేయ సమర్థులైన అర్థశాస్త్రపు ప్రొఫెసర్లలో ఏ ఒక్కరినీ కూడా, అర్థశాస్త్రపు సాధారణ సిద్ధాం తంలో ఈషణ్మాత్రమూ నమ్మడానికి వీలుండదనే కారణం చేతనే. ఎందుచేతనంటే, ఆధునిక సమాజంలో, జ్ఞానసాధనశాస్త్రం ఎంత పక్షపాత పూరితమైన శాస్త్రమో, అర్థశాస్త్రం కూడా అంతే. మొత్తంమీద చూస్తే, తత్వశాస్త్రపు ప్రొఫెసర్లు ఏలాగైతే మత గురువుల నౌకరీలోవున్నట్టి విద్యాపారంగతులైన అమ్మకం గుమాస్తాలో, ఆలాగే పెట్టుబడి దారీవర్గపు నౌకరీలోవున్నట్టి అర్థికశాస్త్రపు ప్రొఫెసర్లు కూడా విద్యాపారంగతులైన అమ్మకం గుమాస్తాలే తప్ప అంతకంటె మరేమీ కాదు.

ఈ ''అమ్మకం గుమాస్తాలు'' సాధించిన కార్యాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, వాటిని తిరిగి తయారుచేసే సామర్థ్యాన్ని సంపాదించడమూ (ఉదాహరణకు, ఈ ''అమ్మకం గుమాస్తాల'' రచనలను ఉపయోగిస్తేనే తప్ప కొత్త ఆర్థిక దృగ్విషయాల గవేషణలో రవం తైనా మనం ముందుకు సాగిపోలేం), వారి అభివృద్ధి నిరోధక ధోరణిని అడ్డం కొట్టగల్గే సామర్థ్యం సంపాదించడమూ, సొంత పంథాను సాగించే సామర్థ్యం సంపాదించడమూ మనపై శత్రుత్వం వహించిన శక్తులూ వర్గాలతో దారి కడవెళ్ళా పోరాడేందుకు సామర్థ్యం సంపాదించడమూ ఈ రెండు సందర్భాలలోనూ మార్క్సిస్టుల కర్తవ్యం. దీనినే మాఖ్ అనుయాయులు నెర వేర్చలేక పోయారు; ప్రొఫెసర్లు తయారు చేసిన అభివృద్ధి నిరోధక తత్వశాస్త్రపు అడుగు జాడల్లోనే బానిస మనస్తత్వంతో వారు నడుస్తారు. ''వ్యాసాలు'' అనే గ్రంథం రచయితల తరపున లునచార్స్కి రాస్తూ ''మేము పొరపడితే పొరపడే వుండొచ్చు, కాని మా అన్వే

షణను మాత్రం మేం సాగిస్తూనే వున్నాం'' అంటాడు. కాని చిక్కంతా ఏమిటంటే అన్వేషిస్తూన్నది మీరు కాదు, మీరే అన్వేషించబడుతున్నారు! మీ దృక్స్థానంతో, అనగా మార్క్సిస్టు (మార్క్సిస్టులుగా వుందామనే మీ ఉద్దేశం) దృక్స్థానంతో, బూర్జువా తత్వశాస్త్రపు ఫాషన్లలో ప్రతీ మార్పునూ మీరు సమీపించడంలేదు; ఆ ఫాషన్లే మిమ్మల్ని సమీపించి, భావవాదపు అబద్ధాలతో, ఈ వేళ ఓస్ట్‌వాల్డ్‌పాకం, రేపు మాఖ్‌పాకం, ఎల్లుండి పాయింకారె పాకం ప్రకారం అవి తయారు చేసిన కొత్త రుచులను మీకు మప్పుతున్నాయి. మీరు సత్యకాలంగా నమ్ముతూన్నట్టి పిచ్చిపిచ్చి ''సైద్ధాంతిక'' కుహకాలు (''ఎనర్జెటిక్స్,''* ''ఎలిమెంట్స్,''** ''ఇంట్రొజెక్షన్''*** వగైరాలు) ఒక సంకుచిత పంథీయుల అల్ప బృందానికి మాత్రమే పరిమితమై వుండగా, ఈ కుహకాల భావశాస్త్రీయ, సామాజిక ధోరణిని వార్డ్‌లూ, నవీన విమర్శనాతత్వవాదులూ, ఇమ్మనెంటిస్టులూ, లొపాతిన్‌లూ, ప్రాగ్మటిస్టులూ వెంటనే పసికట్టుతున్నారు, ఇది వారికే సేవచేస్తూంది కూడానూ. నవీనకాంటియనిజం, ''శరీరశాస్త్రీయ'' భావవాదం వీటిపై వెర్రి వ్యామోహం ఎంతత్వరగా ఎగిరిపోయిందో, ప్రత్యక్షానుభవయుత విమర్శన వాదంపైనా, ''భౌతికశాస్త్రీయ భావవాదం'' పైనా వెర్రి వ్యామోహమూ అంత త్వరగానే ఎగిరిపోతుంది; కాని ఇటువంటి వెర్రి వ్యామోహం నుండి ఫిడేయిజం ఉపహారం కోరందే వూరుకొనక, తాత్విక భావవాదానికి ఉపయోగపడేందుకని తన కుయుక్తులను వెయ్యి విధాలుగా మార్చుకుంటూ వుంటుంది.

బూర్జువా అభివృద్ధి నిరోధకులు యథార్థ వర్గప్రయోజనాలకు ఈ ప్రత్యక్షానుభవయుత విమర్శనవాద ఉపయోగానికి మతంపట్ల వైఖరి, ప్రకృతి శాస్త్రంపట్ల వైఖరి భేష్మైన తార్కాణం.

మొదటి ప్రశ్న తీసుకోండి. మార్క్సిజం యొక్క తత్వశాస్త్రానికి వ్యతిరేకంగా రాయబడిన సంకలిత గ్రంథంలో లునచార్స్కి, ''ఉన్నత మానవశక్తుల దైవసమీకరణ'' గురించీ, ''మతసహిత నాస్తికత్వం,'' వగైరాల గురించీ**** మాట్లాడేంత వరకూ వెళ్ళాడంటే, అది

---

* ''విశ్వశక్తి'' — అనువాదకుడు.

** ''మూలద్రవ్యాలు'' — అనువాదకుడు.

*** ''అంతర్విక్షేపం'' — అనువాదకుడు.

**** ''వ్యాసాలు,'' పుటలు 157, 159: ''జగ్రనిచ్‌నయ గజేత'' [''విదేశ వార్తాపత్రిక'' — అనువాదకుడు] లో ఈ రచయితే, ''మతవిషయిక ప్రాముఖ్యతలో శాస్త్రీయ సోషలిజం'' అనీ (3 వ సంచిక, పుట 5), ''ఒబ్రజొవానియె'' [''విద్యాభ్యాసం'' — అనువాదకుడు] 1908, 1 వ సంచిక, 164 వ పుటలో ''బహుకాలంగా నాలో కొత్త మతం ఒకటి పరిపక్వం చెందుతూంది,'' అనీ నిష్కర్షగా అంటాడు.

యాదృచ్ఛికమే అనుకుంటారా? అలా మీరనుకుంటే మాత్రం, అందుకు కారణం యూరప్‌లోని ప్రతీ మాఖియన్ ధోరణి గురించీ, మతం పట్ల ఈ ధోరణి వైఖరి గురించీ రష్యన్ మాఖిస్టులు ప్రజలకు యథార్థంగా తెలియజేయక పోవడమే. మార్క్స్, ఎంగెల్స్, జె. డీట్జ్‌గెన్‌ల యొక్క వైఖరితో, చివరకు ఫాయెర్‌బాఖ్ యొక్క వైఖరితో సహితం ఈ వైఖరి ఏ విధమైన సారూప్యతనూ కల్గివుండక, "ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదం ఆస్తికత్వాన్నీ ఖండించదు, నాస్తికత్వాన్నీ ఖండించదు" అని పెట్జోల్ట్ చెప్పిన వాక్యం" (Einführung in die Philosophie der reinen Erfahrung,* 1 వ సంపుటం, పుట 351), లేదా "మతానికి సంబంధించిన అభిప్రాయం స్వవిషయం" అని మాఖ్ ఉద్ఘాటన (ఫ్రెంచి అనువాదం, పుట 434), వీటితో మొదలు, మాఖ్‌ను తాను శ్లాఘించి, తనను మాఖ్ శ్లాఘించినట్టి కార్నీలియస్ యొక్క, కారుస్ యొక్క అపరావతారమెత్తిన అభివృద్ధి నిరోధక అభిప్రాయాలూ, ఇమ్మనెంటిస్టులు అందరి యొక్క నిర్ద్వంద్వమైన ఫిడేయిజమూ, నిర్ద్వంద్వమైన అభివృద్ధి నిరోధక అభిప్రాయాల వరకూ, దీనికి కేవలం శుద్ధ విరుద్ధం. ఈ ప్రశ్నపై ఒక తత్వశాస్త్రవేత్త తటస్థంగా వున్నాడంటే, దాని అసలు అర్థం ఫిడేయిజానికీ మాఖ్‌కీ, అవెనారియుస్‌కీ అతడు దాసుడైపోయాడన్నమాటే; ఎందుచేతంటే వీరి జ్ఞాన సాధనశాస్త్రం యొక్క అసలు ఆధారవాక్యాలు తాటస్థ్యానికి అతీతం కావు, కాజాలవు కూడానూ.

ఇంద్రియ సంవేదన రూపంలో మన కివ్వబడిన బాహ్యగతాత్మక వాస్తవికతను మీరు కాదన్నారంటే, ఇక ఫిడేయిజంతో పోరాడడానికి మీకున్న ఆయుధాలలో ప్రతి ఒక్కదానినీ మీరు అప్పుడే పోగొట్టుకున్నారన్న మాటే, ఎందుచేతంటే ఇక దీనితో అగ్నాస్టిసిజం** లోకీ, స్వకీయగతాత్మకవాదంలోకీ కాలుజారి పడిపోయారన్నమాటే — ఫిడేయిజానికి కావాల్సిందే అది. ఇంద్రియగోచర ప్రపంచం బాహ్యగతాత్మక వాస్తవమే అయితే, అప్పుడు ఇతర విధాల "వాస్తవికతలకూ" లేక కుహనా వాస్తవికతలకూ (దైవం ఒక "వాస్తవ సామాన్యప్రత్యయం" అని ఉద్ఘాటించిన ఇమ్మనెంటిస్టుల "వస్తుస్వాతంత్ర్యవాదాన్ని" బజారోవ్ నమ్మాడన్న విషయం మరచిపోకండి) దేవిడీమన్నా చెప్పడమన్నమాటే. చలనంలో వున్న ద్రవ్యమే ప్రపంచం అయిన పక్షంలో ద్రవ్యాన్నీ ఈ చలనం యొక్క ఎంతో సంక్లిష్టమైనట్టి ఎన్నో వివరాలు కలిగినట్టి అనంతములైన సాక్షాత్కారాలనూ జిగిబిగి అల్లికలనూ; ఈ ద్రవ్యంయొక్క చలనాన్నీ అనంతంగా అధ్యయనం చెయ్యవచ్చు, చెయ్యాలి కూడానూ; కాని దీని ఆవల, ప్రతి వారికీ పరిచితమైన "ద్రవ్య," బాహ్యప్రపంచం ఆవల ఏమీ వుండడానికి వీల్లేదు. కాగా భౌతిక

* "స్వచ్ఛ ప్రత్యక్షానుభవతత్వశాస్త్ర దర్శిని." — అనువాదకుడు.

** అనిశ్చయవాదం — అనువాదకుడు.

వాదం పట్ల శత్రుత్వమూ, భౌతికవాదులపై కుప్పతెప్పలుగా పడుతూన్న దూషణలూ, ఇవన్నీ నాగరిక, ప్రజాస్వామిక యూరప్‌లో నిత్యకృత్యాలే. ఇదంతా నేటికీ జరుగుతూన్నదే. భౌతికవాదానికి అనుకూలంగా ఫాయెర్‌బాఖ్, మార్క్స్, ఎంగెల్స్, జె. డీట్స్‌గెన్‌లు చేసిన ప్రకటనలతో మాఖ్, అవెనారియుస్, పెట్జోల్ట్ ప్రభృతులు చేసిన దాడులతో సుళువుగా సరిపోల్చి చూపడానికి ఒక్కసారైనా యత్నించని రష్యన్ మాఖిస్టులు ప్రజలనుండి దీని నంతనూ కప్పిపుచ్చుతున్నారు.

కాని, ఫిడేయిజం పట్ల మాఖ్, అవెనారియుస్‌ల వైఖరిని ''కప్పిపుచ్చడం'' వల్ల ఎట్టి ఫలితమూ వుండబోదు. వాస్తవవిషయాలే కోడై కూస్తున్నాయి. అభివృద్ధి నిరోధకులైన ఈ ప్రొఫెసర్లను, వార్డ్, నవీనవిమర్శనవాదులూ షుప్పె, షూబెర్ట్-సోల్డెర్న్, లిక్లేర్‌లూ, ప్రాగ్మటిస్టులూ, వగైరాలు వీరిపై కురిపించిన ముద్దులు కారణంగానే వీరి మెడలూ చేతులూ గట్టిగా చిక్కుకున్న వెదురు గడియలనుండి విడిపించడానికి, ప్రపంచం ఎన్ని ప్రయత్నాలు చేసినా సాధ్యపడదు. తత్వవేత్తలుగానూ ప్రొఫెసర్లుగానూ ఇప్పుడు పేర్కొన్న వ్యక్తుల పలుకుబడీ ''విద్యాసంస్కృతి'' కల్గిన ప్రజలలో, అనగా బూర్జువావర్గంలో, వీరి అభిప్రాయాల ప్రభావమూ, వీరు సృష్టించిన విశిష్ట సారస్వతమూ, ఇవి మాఖ్, అవెనారియుస్‌ల చిన్న పాఠశాల కంటె పదిరెట్లు విస్తృతమైనవీ, సంపన్నమైనవీనీ. ఈ చిన్న పాఠశాల ఎవరికి ఊడిగం చెయ్యాలో వారికి ఊడిగం చేస్తూంది, కాగా ఎవరి అవసరంకొద్దీ వారు దానిచేత ఊడిగం చేయించుకుంటున్నారు.

లునచార్‌స్కి దిగజారిపోయినట్టి సిగ్గుచేటైన విషయాలు అసాధారణములైనవేమీ కావు; రష్యన్, జర్మన్ రెండు రకాల ప్రత్యక్షానుభవయుత విమర్శనవాద ఫలితాలే అవి. గ్రంథకర్త ''ఉద్దేశాలు మంచివే'' అనీ, లేదా అతని మాటలకు ''ప్రత్యేక అర్థం'' వుందనీ చెప్పి, ఆ కారణంచేత వాటిని సమర్థించడానికి వీల్లేదు; వాటి అర్థం, సూటి అయినట్టీ, సామాన్యమైనట్టీ, అనగా సరాసరి ఫిడేయిస్టు అర్థమే అయితే, ఇక్కడ మనం ఆగి గ్రంథకర్తతో చర్చించాల్సిన అవసరమే లేదు మనకి; ఎందుకంటే అనతోలి లునచార్‌స్కి యొక్క ఈ మాటలు విని ఇతనిని ప్యోత్ర్ స్త్రూవె వర్గంలోనే సంపూర్ణంగా చేర్చని మార్క్సిస్టు బహుశ ఒక్కడైనా వుండడు. ఇలా కాని పక్షంలో (ఇంతవరకూ అలా కాలేదు కూడానూ), ఇందుకు కారణంకేవలం ''ప్రత్యేక'' అర్థాన్ని మనం గమనించుతూండమూ, సుహృద్భావ మార్గాలలో పోరాడడానికి ఇంకా కారణం వుంటూండడంచేత మనం పోరాడుతూండడమే. లునచార్‌స్కి ప్రకటనలలో వున్న సిగ్గుచేటంతా ఇక్కడే — తన ''మంచి ఉద్దేశాల''ను వీటితో జోడించ గల్గడంలోనే — వుంది. అతని ''సిద్ధాంతం''లో వున్న చెడుపు — మంచి ఉద్దేశాలను అన్వేషించడంలో ఇట్టి పద్ధతులను, లేదా ఇట్టి పర్యవసానాల ఉపయోగాన్ని అది అంగీకరించ

డమే. అసలు చిక్కు ఏమిటంటే "మంచి" ఉద్దేశాలు, ఎట్టి ఉత్తమ సందర్భంలోనైనా, పుల్లయ్య, మల్లయ్య, సింగయ్యల స్వకీయగతాత్మక వ్యవహారమై వుండగా, ఈ ప్రకటనలయొక్క సామాజిక ప్రాముఖ్యత నిర్నిబంధమూ, నిరాక్షేపణీయమూ, కాగా ఎట్టి మినహాయింపులూ, వివరణలూ సహితం ఈ ప్రాముఖ్యతను బలహీనపరచజాలవు.

లునచార్స్కి యొక్క "ఉన్నత మానవశక్తుల దైవసమీకృతం," సర్వ పదార్థ ప్రకృతి స్థానే బొగ్దానోవ్‌యొక్క ఆత్మసంబంధమైన ప్రకృతిని "సాధారణ ప్రతిక్షిప్తం," నిటి రెండింటికీగల భావశాస్త్రీయ స్నేహం అంధులుకాని ప్రతివారికీ అవుపడుతుంది. రెండింటి లోనూ వున్న చింతన ఒక్కటే; ఒక దృష్టాంతంలో ఇది ప్రధానంగా రసజ్ఞాన దృక్స్థానం నుండి చెప్పబడగా, రెండవ దృష్టాంతంలో జ్ఞానసాధన శాస్త్రీయ దృక్స్థానం నుండి చెప్ప బడింది. విభిన్న కోణంనుండి "ప్రతిక్షేపం" మౌనంగా విషయాన్ని సమీపించుతూ, మానవుడి నుండి "ఆత్మసంబంధమును" విడదీసి, సర్వపదార్థ ప్రకృతి స్థానే బ్రహ్మాండంగా విస్తరింప జేయబడినట్టి, అనిర్దిష్టమైనట్టి, దైవికమై-నిర్జీవమైనట్టి "సాధారణంగా ఆత్మసంబంధ మును" ప్రతిక్షిప్తం చేయడంవల్ల, "ఉన్నత మానవశక్తులను" అప్పటికే దైవసమీకృతం చేసివేస్తోంది. కాగా "అనుభవం యొక్క హేతువాదరహిత ప్రవాహం"లోకి ప్రవేశపెట్టబడి నట్టి యుష్కేవిచ్ యొక్క "లోగోస్"* మాటేమిటి?

పిట్ట కాలిగోరు ఒక్కటైనా సరే వలలో చిక్కుకుందంటే ఇక పిట్ట పని సున్న. మన మాఖియన్లు భావవాదంలో, అనగా పలచనచేయబడినట్టి, అతి సూక్ష్మమైనట్టి ఫిడేయింజంలో, పూరిగా చిక్కుకున్నారు; "ఇంద్రియసంవేదన"ను బాహ్యప్రపంచం యొక్క బింబంగా కాకుండా, ఒక ప్రత్యేకమైన "మూలద్రవ్యం"గా స్వీకరించిన ఉత్తరక్షణం నుండి వారు వలలో చిక్కుకున్నారు. మానవమనస్సు ఒక బాహ్యాగాతాత్మకమైన వాస్తవ బహ్యప్రపంచాన్ని ప్రతిబింబిస్తుంది అనే భౌతికవాద సిద్ధాంతాన్ని ఎవరైనా గుర్తించని పక్షమందు — ఇంద్రియ సంవేదన ఎవరి ఇంద్రియసంవేదనా కాదు, మనస్సు ఎవరి మనస్సూ కాదు, ఆధ్యాత్మ ఎవరి ఆధ్యాత్మాకాదూ, సంకల్పం ఎవరి సంకల్పమూ కాదూ — అనే పర్యవసానానికి అట్టి వారు విధికృతంగా వచ్చితీరుతారు.

ఫిబ్రవరి — అక్టోబరు, 1908

---

* "ఆదిశబ్దం" — అనువాదకుడు.

# మతం పట్ల కార్మికుల పార్టీ వైఖరి

స్టేటు దూమలో సినోద్[116] పద్దుపై బడ్జెటు అంచనాల చర్చ సమయమప్పుడు దూమ సభ్యుడు సుర్కోవ్ ఉపన్యాసమూ, ఈ ఉపన్యాసం ముసాయిదాను మన దూమ పార్టీ సభ్యుల గ్రూపు పరిశీలించినప్పుడు జరిగిన చర్చా — వీటిని ఈ సంచికలో వేరే చోట ఇస్తున్నాం — ప్రత్యేకంగా ఈ తరుణంలో అత్యంత ముఖ్యమైనట్టీ అత్యవసరమైనట్టీ ప్రశ్నను లేవనెత్తు తున్నాయి. మతంతో సంబంధం గలిగిన అన్ని ప్రశ్నలపై ''సమాజం'' యొక్క విస్తృత శ్రేణులలో గొప్ప ఆసక్తి నేడు నిస్సందేహంగా ప్రదర్శిత మవుతూంది; ఈ ఆసక్తి కార్మిక వర్గంతో సన్నిహిత సంబంధం కల్గినట్టి మేధావుల శ్రేణులలోనూ కొన్ని కార్మిక గ్రూపుల లోనూ కూడా వ్యాపించింది. మతం పట్ల తమ వైఖరిని గురించి ఒక బహిరంగ ప్రకటన చేయడం సోషల్-డెమోక్రాట్లకు తప్పనిసరైన విధ్యుక్తధర్మం.

తన యావత్తు ప్రపంచ దృక్పథానికీ సోషల్-డెమోక్రసీ శాస్త్రీయ సోషలిజాన్ని, అనగా మార్క్సిజాన్ని, ఆధారంగా చేసుకుంటూంది. ఫ్రాన్సులోని పద్దెనిమిదవ శతాబ్ది భౌతిక వాద చారిత్రాత్మక సంప్రదాయాలనూ, జర్మనీలోని ఫాయెర్‌బాఖ్ (పంథొమ్మిదవ శతాబ్ది ప్రథమ అర్ధభాగం) భౌతికవాద చారిత్రాత్మక సంప్రదాయాలనూ పూర్తిగా స్వీకరించినట్టి గతితార్కిక భౌతికవాదమే — కేవలమూ నాస్తికవాది అయినట్టీ, అన్ని మతాలకూ బద్ధవ్యతి రేకి అయినట్టీ భౌతికవాదమే — మార్క్స్ ఎంగెల్స్‌లు పదేపదే ఉద్ఘాటించినట్లు, మార్క్సి జానికి తత్త్వశాస్త్రీయ ఆధారం. లిఖితప్రతిలో మార్క్స్ చదివినట్టి ఎంగెల్స్ రాసిన ''డ్యూ రింగ్ సిద్ధాంత ఖండన'' అంతా కూడా, భౌతికవాదీ నాస్తికుడూ అయిన డ్యూరింగ్‌పై సుసంగత మైన భౌతికవాదిగా వుండనందుకూ మతానికీ మతసంబంధమైన తత్త్వశాస్త్రానికీ సందులు వదలిపెట్టినందుకూ మోపిన నేరమే అన్న సంగతి మనం గుర్తుకు తెచ్చుకుందాం. లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్‌పై తాను రాసిన వ్యాసంలో, మతాన్ని నాశనం చేసేందుకు కాకుండా దాన్ని పున రుద్ధరించేందుకే, ఒక కొత్త ''ఉన్నత'' మతాన్ని సృష్టించడం, వగైరాల కోసమే మతంపై

కత్తికట్టినందుకు ఫాయెర్‌బాఖ్‌ను ఎంగెల్స్ తూర్పారబట్టాడన్న విషయం మనం గుర్తుకు తెచ్చుకుందాం. మతం ప్రజల నల్లమందు — అని మార్క్స్ చెప్పిన సూక్తి మతంపై మార్క్సిస్టు దృక్పథానికంతటికీ పునాదిరాయి. దోపిడీని సమర్థించడానికీ, కార్మికవర్గంపై మందుచల్లడానికీ ఉపయోగపడేటట్టి బూర్జువావర్గ అభివృద్ధి నిరోధక పరికరాలుగానే ఆధునిక మతాలనూ చర్చీలనూ అన్ని మతసంస్థలనూ మార్క్సిజం ఎల్లప్పుడూ పరిగణించుతుంది.

అయినప్పటికీ అదే సమయంలో, కార్మికుల పార్టీ కార్యక్రమంలో, మతంపై యుద్ధం ప్రకటించే అర్థంతో, నాస్తికమతాన్ని స్వీకరిస్తూన్నట్టు స్పష్టమైన ప్రకటనను ఒకదానిని ప్రవేశపెట్టడానికి, సోషల్-డెమోక్రాట్ల కంటెసూ "మరింత విప్లవాత్మకం"గానూ, "మరింత వామపక్షం"గానూ ఉండగోరినట్టి వ్యక్తుల యత్నాలను ఎంగెల్స్ తరుచుగా ఖండించాడు. ఇంగ్లండులో ప్రవాసజీవితం గడుపుతూన్నట్టి పలాయితులైన బ్లాంకీస్టు కమ్యునార్డుల సుప్రసిద్ధ ప్రణాళికను 1874 లో వ్యాఖ్యానించుతూ, మతంపై వారు గొంతుక చించుకుని చేసిన యుద్ధప్రకటన ఒక తెలివితక్కువ అని ఎంగెల్స్ అంటూ, మతాన్ని హరించిపోనిచ్చేందుకుబదులు దాని పట్ల ఆసక్తిని పునరుజ్జీవింపజేయడానికి ఇటువంటి యుద్ధప్రకటనే భేష్షైన మార్గమనీ అతడు వివరించాడు. మతంపై యుద్ధ ప్రకటనను కార్మికుల పార్టీయొక్క రాజకీయ కర్తవ్యంగా చేయడం కేవలం అరాచకవాద పదజాల ప్రయోగమే అవుతూండగా, చైతన్యవంతమైనట్టీ విప్లవాత్మకమైనట్టీ సామాజిక ఆచరణలోనికి శ్రామికవర్గంలోని బహుళ సంఖ్యాకులను అన్ని వైపులనుండీ లాక్కొనిరావడంవల్లనే వాస్తవంగా పీడిత ప్రజారాసులను వారిపై మోపబడిన మతమనే గాటినుండి విముక్తి చేయగల్గేది కార్మికవర్గ ప్రజారాసులవర్గ పోరాటమే అనే వాస్తవవిషయాన్ని అర్థం చేసుకోలేకపోయినందుకు బ్లాంకీస్టులను ఎంగెల్స్ నిందించాడు. అంతే కాకుండా, 1877 లో కూడా, భావవాదానికీ మతానికీ తత్వవేత్త డ్యూరింగ్ చూపిన ప్రతి స్వల్ప రాయితీ పైనా నిర్దాక్షిణ్యంగా దాడి వెడలుతూనే, సోషలిస్టు సమాజంలో మతం నిషేధించబడాలనే డ్యూరింగ్ యొక్క కుహనా విప్లవాత్మక భావాన్ని ఎంగెల్స్ తన "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" గ్రంథంలో అంత దృఢంగానూ ఖండించాడు. మతంపై ఇటువంటి యుద్ధప్రకటన "బిస్మార్క్‌ను మించి అపర బిస్మార్క్ కావడమే" అవుతుందని, అనగా మతగురువుల పక్షంవారికి వ్యతిరేకంగా పోరాటం (అపఖ్యాతిపాలైన "సంస్కృతికై పోరాటం," Kulturkampf [కుల్చూర్‌కాంఫ్], అనగా కేతలిక్ మతంపై పోలీసు హింసాకాండ జరపడంద్వారా జర్మన్ కేతలిక్ పార్టీపై, "సెంటర్" పార్టీపై, 1870 లలో బిస్మార్క్ సాగించిన పోరాటం) సాగించిన బిస్మార్క్ తెలివితక్కువతనాన్నే పునరుక్తం చేయడం అవుతుందని ఎంగెల్స్ అంటాడు. ఈ పోరాటంవల్ల కేతలిక్కుల పోరాటశీలమైన క్లెరికలిజమ్‌నే కేవలం పటిష్ఠంచేసి, నిజమైన సంస్కృతీ కృషికే కేవలం హాని కల్గించింది,

ఎందుచేతంటే రాజకీయ విభాగాల కంటె మతవిభాగాలకే ప్రాధాన్యత నిచ్చి, కార్మికవర్గాల లోనూ ప్రజాస్వామ్యంలోనూ కొన్ని విభాగాల దృష్టిని వర్గ, విప్లవాత్మక పోరాటంయొక్క తక్షణ కర్తవ్యాలనుండి కేవలం పైపై విషయాలకే పరిమితమైనట్టి అబద్ధాలపుట్ట అయి నట్టి బూర్జువా క్లెరికలిజమ్‌వ్యతిరేకత దిశగా మళ్లించింది. బిస్మార్క్‌యొక్క తెలివితక్కు వను మరొక రూపంలో పునరుక్తం చేయ యత్నించాడని అత్యంత తీవ్ర విప్లవకారునిగా పైకి అగుపడేటట్టుగా ప్రయత్నించిన డ్యూరింగ్‌పై, ఎంగెల్స్ నేరం మోపుతూ, మతం హరించి పోవడానికి దారితీసేందుకై శ్రామికవర్గాన్ని ఆర్గనైజు చేయడమనేటట్టి, ప్రబోధితంచేసే టట్టి కర్తవ్యసాధనకై ఓరిమితో కృషి చేయగలిగే సామర్థ్యం కలిగి వుండాలి, అంతేగాని మతంపై రాజకీయ యుద్ధంలోకి దిగేందుకు సాహసించకూడదని ఎంగెల్స్ గట్టిగా చెప్పాడు. జర్మన్ సోషల్-డెమోక్రసీకి ఈ భావం వరనరాలా ఎక్కిపోయింది; ఉదాహరణకు జెసూట్లకు స్వేచ్ఛ వుండాలినీ, జర్మనీలోకి వారిని రానియ్యాలనీ, ఏ మతానికి వ్యతిరేకంగానయినా సరే పోరాడేందుకు పోలీసు హింసాకాండను ఉపయోగించడమనే విధానానికి పూర్తిగా స్వస్తిచెప్ప బడాలనీ జర్మన్ డెమోక్రసీ వాదించింది. ''మతం ప్రైవేటు విషయం'' — ఏర్‌ఫుర్ట్ కార్య క్రమంలోని (1891) ప్రసిద్ధి చెందిన ఈ వాక్యం సోషల్-డెమోక్రసీయొక్క ఈ రాజకీయ ఎత్తుగడలను ధ్రువీకరించింది.

ఈ ఎత్తుగడలు ఇప్పుడు కేవలం ఒక లాంఛనం కిందకి దిగజారిపోగల్గాయి; కేవలం వ్యతిరేక ధోరణిలో, అవకాశవాద దిశగా, మార్క్సిజానికి ఒక కొత్త వికృతరూపాన్ని ఇవి ఇప్పుడే ప్రభావితం చేయగల్గాయి. సోషల్-డెమోక్రాట్లమైన మనచేతనూ, మన పార్టీచేతనూ మతం ప్రైవేటు విషయంగా పరిగణించబడుతుందనీ, సోషల్-డెమోక్రాట్లుగా మనకి, ఒక పార్టీగా మనకి, మతం ప్రైవేటు విషయమనీ, ఏర్‌ఫుర్ట్ కార్యక్రమంలో వున్న ఈ అంశానికి ఒక అర్థం చెప్పడం ప్రారంభమైంది. ఈ అవకాశవాద అభిప్రాయంతో సరాసరి వాగ్వాదానికి దిగకుండానే, తర్కవాద రూపంలో కాకుండా, నిశ్చితమైన భావార్థక రూపంలో దీనిని వ్యతిరే కించడం ఆవశ్యకమని 1890 లలో ఎంగెల్స్ భావించాడు. ఏ విధంగానంటే: సోషలిస్టులు రాజ్యాంగయంత్రానికి సంబంధించినంత వరకు మతం ఒక ప్రైవేటు విషయంగా పరిగణి స్తారేగాని, తమకు సంబంధించినంత వరకు, మార్క్సిజానికి సంబంధించినంత వరకు, కార్మి కుల పార్టీకి సంబంధించినంత వరకు ప్రైవేటు విషయంగా పరిగణించరనీ దీనిని ఒక ప్రకటన రూపంలో, బుద్ధిపూర్వకంగానే ఈ మాటలకింద గీతగీస్తూ, ఎంగెల్స్ ఈ భావం వ్యక్తంచేశాడు.[117]

మతం విషయంపై మార్క్స్, ఎంగెల్స్‌లు చెప్పిన వచనాల బాహ్యచరిత్ర ఈ విధంగా వుంది. మార్క్సిజం పట్ల అషామషీ వైఖరి ప్రదర్శించేవాళ్లకీ, ఆలోచించడానికి శక్తిగానీ,

ఇష్టంగానీ లేనివాళ్ళకీ, ఈ చరిత్ర అర్థంలేని మార్క్సిస్టు వైరుధ్యాలతోనూ ఊగిసలాటల తోనూ చిక్కులూ ముళ్ళూ పడిపోయిన బుడత లాగానూ, ''సుసంగతమైన'' నాస్తికమతంతో, మతం పట్ల ''మెత్తతనం'' పైనా, దేవునిపైనా వి-ప్ల-వాత్మకమైన యుద్ధం చేద్దామని ఒకవైపునా, రెండవవైపున మతభక్తిగల కార్మికుల ''అనుగ్రహం సంపాదించుదాము'' అనే కోర్కె, వాళ్ళను ఎక్కడ బెదరగొట్టుతామో అనే భీతి, వీటి మధ్య ''నియమరహిత మైన'' డోలాయమానాన్ని కలిపిన కలగాపులగంలాగానూ వుంటుంది. మార్క్సిజంపై ఈ ధోరణిలో చేసిన దాడులతో అరాచకవాద పదజాల వ్యాపారుల సారస్వతం నిండి వుంటుంది.

కాని మార్క్సిజాన్ని కాస్తో కూస్తో జాగ్రత్తగా పఠించగలిగేటట్టీ, దాని తాత్విక పునాదులనూ అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీ యొక్క అనుభవాలనూ యోచించగలిగే సామర్థ్యం గలవారి కైవరికైనా సరే, మతం పట్ల మార్క్సిస్టు ఎత్తుగడలు పూర్తిగా సుసంగ తంగా వున్నాయనీ, వాటిని మార్క్స్, ఎంగెల్స్‌లు జాగ్రత్తగా ఆలోచించే నిర్ణయించారనీ, విలాసార్థ పాఠకులూ మూర్ఖులూ డోలాయమానమని భావించేది గతితార్కిక భౌతికవాదంనుండి సూటి అయినట్టీ అనివార్యమైనట్టీ అనుమితే తప్ప ఇంకొకటి కాదనీ వెంటనే అవుపడుతుంది. మతం పట్ల మార్క్సిజం ప్రత్యక్షంగా ప్రదర్శిస్తూన్న ''మితవాద'' వైఖరి, ''ఎత్తుగడల'' సంబంధమైనట్టీ, ఎవరినీ కూడా ''బెదరగొట్టకూడదు'' అనేటట్టీ, వగైరా ఆలోచనల ఫలితమని అనుకోవడం మాత్రం గొప్ప పొరపాటే అవుతుంది. తత్‌వ్యతిరేకంగా, ఈ ప్రశ్న పైన కూడా మార్క్సిజంయొక్క రాజకీయ విధానంతో దానియొక్క తాత్విక పునాదులు అవిభాజ్యంగా పెనవేసుకునే వున్నాయి.

మార్క్సిజం భౌతికవాదం. మార్క్సిజం భౌతికవాదం అయి వుండడంచేత, పద్దెనిమి దవ శతాబ్ది విజ్ఞానసర్వస్వవాదుల భౌతికవాదమూ, ఫాయెర్‌బాఖ్ భౌతికవాదమూ మతం పట్ల ఎంతటి నిర్దాక్షిణ్యమైన శత్రువులో ఇది కూడా అంత నిర్దాక్షిణ్యమైన శత్రువే. ఇది నిస్సందే హం. కాగా చరిత్ర రంగానికీ సామాజిక శాస్త్రాల రంగానికీ భౌతికవాద తత్వశాస్త్రాన్ని ప్రయు క్తం చేయడంవల్ల, విజ్ఞానసర్వస్వవాదుల కంటెనూ ఫాయెర్‌బాఖ్ కంటెనూ మార్క్స్, ఎంగెల్స్‌ల గతితార్కిక భౌతికవాదం మరింత ముందుకు పురోగమించుతూంది. మతంతో మనం పోరాడాలి — ఇదే భౌతికవాదం అంతటికీ, తదానుషక్తంగా మార్క్సిజానికీ ఓనమాలు. కాని ఓనమాలతో ఆగిపోయే భౌతికవాదం కాదు మార్క్సిజం. అంతకంటే ముందుకు వెళ్తుంది మార్క్సిజం. మతంపై ఎలా పోరాడాలో మనం తెలుసుకోవాలి, కాగా ఇందుకోసమని, మతవి శ్వాసంపట్లనూ, మతంపట్లనూ ప్రజారాసులలో వున్న మూలాధారాన్ని మనం భౌతికవాదాత్మ కంగా వివరించాల్సి వుంటుంది — అని మార్క్సిజం చెబుతుంది. అనిర్దిష్టమైన భావశాస్త్రీయ

బోధనకే మతవ్యతిరేక పోరాటాన్ని పరిమితం చేయకూడదు, అటువంటి బోధనకే దానిని దిగజార్చేయ కూడదు. మతానికున్న సామాజిక మూలాలను పీకి పెళ్లగించివేసే లక్ష్యాన్ని కలిగినట్టి వర్గోద్యమంయొక్క నిర్దిష్ట ఆచరణీయ కార్యంతో ఈ పోరాటానికి లింకు కల పాలి. పట్నవాస శ్రామికవర్గంలో వెనుకబడిన శ్రేణులపైన, అర్ధశ్రామికవర్గంలో విస్తృత శ్రేణులపైన, రైతుప్రజా రాసిపైన మతం ఎందుచేత తన ప్రాబల్యాన్ని నిలబొట్టుకో గల్గుతూంది? ఇందుకు కారణం ప్రజల అజ్ఞానమే అని బూర్జువా ప్రొగ్రెసిస్టూ, రాడికల్ వాదీ, బూర్జువా భౌతికవాదీ జబాబుచెబుతారు. కనుకనే మతం నాశనమవాలి, నాస్తికవాదం వర్ధిల్లాలి! — నాస్తిక భావాల ప్రచారం మన ప్రధాన కర్తవ్యం! — అనే నినాదాలు. ఇది నిజం కాదు, అంటాడు మార్క్సిస్టు. ఇది పైపై అభిప్రాయం, సంకుచిత బూర్జువా సాంస్కృతిక తత్వం. మతంయొక్క మూలాలను ఇది తగినంతగా లోతుకి వెళ్లి వివరించడం లేదు; వీటి నిది భావవాదాత్మకంగా వివరించుతూందే గాని భౌతికవాదాత్మకంగా వివరించడం లేదు. ఆధు నిక పెట్టుబడిదారీ విధాన దేశాల్లో ఈ మూలాలు ప్రధానంగా సామాజిక స్వభావం కలిగి నవై వుంటున్నాయి. కార్మిక ప్రజారాసులు సామాజికంగా అణగదొక్కబడి వుండడమూ, యుద్ధాలూ భూకంపాలూ వగైరాల్లాంటి అసాధారణ ఘటనల బాధ కంటె వెయ్యి రెట్లు తీవ్రతరమైనట్టి ఘోరాతిఘోరమైన బాధకూ, కిరాతక చిత్రహింసకూ సామాన్య కార్మిక ప్రజలను ప్రతిదినమూ ప్రతిగంటా పాల్జేస్తూన్నట్టి పెట్టుబడిదారీ విధాన అంధశక్తుల ఎదుట వాటి ప్రత్యక్ష నిస్సహాయత — ఇందులోనే పాతుకునిపోయి వుంది మతంయొక్క మూలకందం. "భయమే దేవుళ్లను సృష్టించింది." పెట్టుబడి యొక్క గుడ్డిబలం అంటే భయం — ప్రజా రాసులు దానిని ముందుగా తెలుసుకో లేకపోవడం కారణంగానే దానికి అంధత్వం ఆరోపిస్తు న్నారు — జీవితంలో అడుగడుగునా శ్రామికవర్గాన్ని, సన్నకారు ఆస్తిపరుని "ఆకస్మికమై నట్టి," "ఎన్నడు అనుకోనట్టి," "యాదృచ్ఛికమైనట్టి" విధ్వంసనము, వినాశము, దౌర్భా గ్యము, వ్యభిచారము, ఆకలిచావుల పాల్జేస్తూందో అట్టి బలం — ఇదీ ఆధునిక మతం యొక్క మూలకందం; తానింకా ఓనమాల తరగతి భౌతికవాదిగానే వుండిపోవడానికి ఇష్టపడని భౌతిక వాది ఈ విషయాన్ని ప్రధానంగానూ ప్రప్రథమంగానూ మనస్సులో పెట్టుకుతీరాలి. ఆర్గనైజు కాబడినట్టీ, పథకాత్మకమైనట్టీ, చైతన్యయుతమైనట్టీ మార్గంలో మతంయొక్క ఈ మూలంపై, అన్ని రూపాల్లోవున్న పెట్టుబడి పరిపాలనపై, తమంతట తామే పోరాడడం నేర్చుకొనేంత వరకూ, పెట్టుబడిదారీ విధానం విధించేటట్టి నడుములు విరగ్గొట్టే చాకిరీ కింద నలిగి గుండపిండైపోతూన్నట్టీ, పెట్టుబడిదారీ విధానపు వినాశకరములైన గుడ్డి బలాల దయదాక్షిణ్యాలకు గురి అవుతూన్నట్టీ ప్రజారాసుల మనస్సుల నుండి మతాన్ని ఎట్టి ప్రబోధాత్మకమైనట్టి గ్రంథమూ నిర్మూలించ జాలదు.

మతానికి వ్యతిరేకంగా రచించబడిన విద్యాప్రబోధక గ్రంథాలు హానికరములనీ, లేదా అనవసరములనీ దీని అర్థమా? కాదు, ఎంత మాత్రమూ కాదు. సోషల్-డెమోక్రసీ యొక్క నాస్తిక ప్రచారం, దాని యొక్క ప్రధాన కర్తవ్యానికి — దోపిడీదార్లకు వ్యతిరేకంగా దోపిడీ పాలవుతూన్న ప్రజారాసుల వర్గపోరాటాన్ని అభివృద్ధి చేయడమనే కర్తవ్యానికి లోబడి వుండాలనే దీని అర్థం.

గతితార్కిక భౌతికవాదం, అనగా మార్క్స్, ఎంగెల్స్‌ల తత్వశాస్త్రం యొక్క పునాదులను పర్యాలోచన చేయనివారికి ఈ వాక్యం అర్థం కాకపోవచ్చు (లేదా, అధమం వెంటనే అర్థం కాకపోవచ్చు). "ఇదేమిటి? భావశాస్త్రీయ ప్రచారం, నిర్దిష్టమైన భావాలను బోధించడం, సంస్కృతీ ప్రగతుల శత్రువుతో (అనగా, మతంతో) వేలాది సంవత్సరాలుగా సాగుతూన్న పోరాటం, వర్గపోరాటానికి, అనగా ఆర్థిక రాజకీయ రంగంలో నిశ్చితములై ఆచరణీయములైన లక్ష్యాలకు, లోబడే జరగాలా?" అని వీరు ప్రశ్నించవచ్చు.

మార్క్సిజానికి వ్యతిరేకంగా చలామణీ అవుతూన్న అభ్యంతరాలలో, మార్క్సీయ గతితర్కాన్ని పూర్తిగా అపార్థం చేసుకున్నట్టు నిదర్శనమిస్తూన్న అభ్యంతరాలలో ఇదొకటి. ఈ విధంగా అభ్యంతరం చెబుతూన్న వారిని కలవరపెట్టే వైరుధ్యం, వాస్తవమూ సజీవమూ అయిన వైరుధ్యమే, అనగా గతితార్కిక వైరుధ్యం, అంతేగాని శబ్దసంబంధమైనట్టీ, లేదా కల్పితమైనట్టీ వైరుధ్యం కాదు. సైద్ధాంతికమైన నాస్తికవాద ప్రచారానికీ, అనగా కొన్ని శ్రామికవర్గ శ్రేణులలో వున్న మతవిశ్వాసాలను నాశనం చేయడమునకూ, ఈ శ్రేణుల వర్గ పోరాటం యొక్క కార్యసిద్ధి, ప్రగతి, స్థితిగతులకీ మధ్య ఒక స్థిరమైనట్టీ అతిక్రమించ శక్యంగానట్టీ సరిహద్దు గీత గీయడం, గతితార్కిక విరుద్ధంగా తర్కించడమవుతుంది, మారుతూన్నట్టీ సాపేక్షమైనట్టీ సరిహద్దును శాశ్వత సరిహద్దుగా పరివర్తన చెందించడమే అవుతుంది; వాస్తవ జీవితంలో అభేద్యంగా పెనవేసుకునిపోయి వున్న వాటిని విడదీయడమే అవుతుంది. ఉదాహరణ నొకదానిని తీసుకుందాం. ఫలానా జిల్లాలో ఫలానా పరిశ్రమయొక్క శాఖలో పనిచేస్తూన్న శ్రామికవర్గాన్ని, ఒక మోస్తరుగా చైతన్యవంతులైన సోషల్-డెమోక్రాట్లూ, సహజంగానే నాస్తికులూ అయినట్టి పురోగామి విభాగంగానూ, పల్లెపట్టులతోనూ రైతాంగంతోనూ ఇంకా సంబంధాలు కలిగి, దైవమంటే నమ్మకం వుండి, చర్చికి వెళ్తూ, లేదా క్రిస్టియన్ కార్మికసంఘాన్ని స్థాపించిన మాటవరసకు అనుకుందాం, స్థానిక మతగురువు యొక్క సూటి ప్రభావంకింద సహితమూ వుంటూ, ఒక మోస్తరుగా వెనుకబడివున్నట్టి కార్మికుల విభాగంగానూ విభజించడం జరిగిందనే అనుకుందాం. ఈ చోట వున్న ఆర్థిక పరిస్థితుల ఫలితంగా ఒక సమ్మె జరిగిందని కూడా అనుకుందాం. ఈ సమ్మె ఉద్యమ విజయమే అన్నిటికంటే పరమార్థమని భావించడమూ, ఈ సమ్మెలో కార్మికులను నాస్తికులనీ

క్రిస్టియన్లనీ విభజించే యత్నాలను ప్రతిఘటించడమూ, అటువంటి విభజనను శక్తివంతంగా వ్యతిరేకించడమూ మార్క్సిస్టు విధ్యుక్తధర్మం. ఇట్టి సందర్భాలలో నాస్తిక ప్రచారం అనవసరమూ అవుతుంది, హానికరమూ అవుతుంది. వెనకబడిన విభాగం బెదిరిపోతుందనో, ఎన్నికలలో ఒక స్థానం నష్టపోతామనో, వగైరా కారణాలవల్ల కలిగే సంకుచితతత్వపు భయం వల్ల కాకుండా, ఆధునిక పెట్టుబడిదారీ సమాజపు పరిస్థితులలో, క్రిస్టియన్ కార్మికులను సోషల్-డెమోక్రసీనీ నాస్తికమతాన్నీ స్వీకరింపజేయడంలో కేవలం వుత్త నాస్తికబోధ కంటె నూరురెట్లు విజయవంతంగా పనిచేయగల్గేది శ్రామికవర్గ పోరాట యథార్థ పురోగమనమే అనే ఆలోచన కారణంగానే ఇట్టి సమయంలోనూ ఇట్టి సందర్భాల్లోనూ నాస్తికమత ప్రచారం చేసే వ్యక్తి, సమ్మె ఉద్యమంలో పాల్గొనడం పాల్గొనకపోవడం అనే ప్రాతిపదికస్థానే దేముడిలో నమ్మకం వుందా లేదా అనే ప్రాతిపదికపైన కార్మికుల విభజననే పరమార్థంగా ఎంచేటట్టి మతగురువుతోనూ మతగురువ్యవస్థతోనూ చేతులుకలిపినవాడే అవుతాడు. ఏదిఏమైనా సరే దేముడిపై యుద్ధం చేసితీరాలనే ప్రబోధించే అరాచకవాది ఆచరణలో మతగురువులకూ బూర్జువావర్గానికీ (ఆచరణలో అరాచకవాదులు ఎల్లప్పుడూ బూర్జువావర్గానికే సహాయం చేసేటట్టుగానే) సహాయం చేస్తాడు. మార్క్సిస్టు భౌతికవాది అయి తీరాలి, అనగా మత వ్యతిరేకి అయి తీరాలి; అంతేకాదు, అతడు గతితార్కిక భౌతికవాది అయి తీరాలి, అనగా మత వ్యతిరేక పోరాటాన్ని అనిర్దిష్టమైనట్టి, స్వచ్ఛంగా సైద్ధాంతికమైనట్టి, ఒకటే రొకటి పాట అయినట్టి బోధనా ప్రాతిపదికపైన కాకుండా, నిర్దిష్టంగా ఆచరణలో సాగుతూన్నట్టి, అన్నిటికంటెనూ అధికంగానూ ఉత్తమంగానూ ప్రజారాసులకు విద్యాప్రబోధం చేస్తూందో అట్టి వర్గపోరాట ప్రాతిపదికపైన వుంచే వాడు అయి తీరాలి. మార్క్సిస్టు నిర్దిష్ట పరిస్థితిని మొత్తంగా గ్రహించగలిగేవాడై వుండాలి, అరాచకవాదానికీ అవకాశవాదానికీ మధ్యనున్న సరిహద్దును (ఈ సరిహద్దు సాపేక్షమూ, మారుతూన్నట్టిదీ, అస్థిరమైనదే అయినా, అది వుండడం మాత్రం తథ్యం) ఎల్లప్పుడూ నిర్ణయించ గలిగి వుండాలి, కాగా అరాచకవాదియొక్క అనిర్దిష్టమూ, పదజాలపూరితమూ, వాస్తవానికి వుత్తుత్తదీ అయిన ''విప్లవ భేషజా''నికి గాని, మతంతో పోరాటం అంటే భయపడిపోతూ, మతపోరాటం తన విధాయకమన్న విషయమే మర్చిపోయి, దేవునియందు నమ్మకంతో పొత్తు కుదుర్చుకుని, వర్గపోరాట ప్రయోజనాల ప్రకారం నడచుకోకుండా, ''నీవు బతుకు, ఒకరిని బతకనియ్యి,'' వగైరా వగైరా వివేకపూరిత సూత్రాల ననుసరించి, ఎవ్వరినీ నొప్పించకూడదు, ఎవ్వరినీ ప్రతిఘటించ కూడదు, ఎవ్వరినీ బెదరగొట్ట కూడదు అనే నీచమైనట్టి హేయమైనట్టి ఆలోచనతో ప్రవర్తిస్తాడో అట్టి లిబరల్ పెట్టీబూర్జువా యొక్క, లేదా మేధావి యొక్క అవకాశవాదానికి గాని లొంగిపోకుండా వుండాలి.

మతం పట్ల సోషల్-డెమోక్రాట్ల వైఖరికి సంబంధించిన అన్ని ప్రత్యేక ప్రశ్నలూ ఈ దృక్స్థానం నుండే నిర్ధారితమవాలి. ఉదాహరణకు, సోషల్-డెమోక్రాటిక్ పార్టీలో మత గురువు ఒకడు సభ్యుడుగా వుండొచ్చునా అనే ప్రశ్న తరుచుగా తలెత్తుతూంటుంది, కాగా ఈ ప్రశ్నకు నిర్నిబంధమైన "అవును" అని మామూలుగా జాబాబు చెబుతూ, దీనిని సమర్థించుకోడానికి యూరప్‌లోని సోషల్-డెమోక్రాటిక్ పార్టీల అనుభవాన్ని ఉదాహరించడం కద్దు. కాని ఈ అనుభవం కార్మికుల ఉద్యమానికి మార్క్సిస్టు సిద్ధాంత ప్రయుక్త ఫలితం అయివుండడమే కాకుండా, రష్యాలో లేని (ఈ పరిస్థితులను గురించి తరువాత విపులంగా వివరించడ మవుతుంది) ప్రత్యేకంగా పశ్చిమ యూరప్‌లోని చారిత్రాత్మక పరిస్థితుల ఫలితం కూడా, కాబట్టి ఈ దృష్టాంతంలో నిర్నిబంధమైన "అవును" అనే జబాబు యథార్థమైనదై వుండదు. సోషల్-డెమోక్రాటిక్ పార్టీలో మతగురవులు సభ్యులుగా వుండడానికి వీల్లేదు అని శాసించి చెప్పేయడానికి వీల్లేదు; అలాగని చెప్పి తత్‌వ్యతిరేకంగా శాసించి చెప్పేయడానికీ వీల్లేదు. మన సమిష్టి రాజకీయ క్రియాకలాపాల్లో పాల్గొనడానికని మన దగ్గరకి వచ్చి, పార్టీ విధులను చిత్తశుద్ధితో నిర్వర్తించుతూ, పార్టీ కార్యక్రమాన్ని అతిక్రమించకుండా వున్న పక్షంలో సోషల్-డెమోక్రాట్ల శ్రేణులలో అతనిని చేర్చుకోవచ్చు; ఎందుచేతంటే, ఇలాంటి దృష్టాంతంలో మన కార్యక్రమ భావాలకూ సూత్రాలకూ ఆ మతగురువుయొక్క మతవిశ్వాసాలకీ వున్న వైరుధ్యం కేవలం అతని కొక్కనికి సంబంధించినదే, అతని వ్యక్తిగత వైరుధ్యమే అయివుంటుంది; కాగా తన సభ్యుల భావాలకీ పార్టీ కార్యక్రమానికీ మధ్య ఏదైనా వైరుధ్యం వుందేమో చూడడానికని ఒక రాజకీయ ఆర్గనైజేషను తన సభ్యులను పరీక్షచేయజాలదు. అయితే, సహజంగానే అట్టి దృష్టాంతం, రష్యాలో పూర్తిగా అసంభవమే అవగా, పశ్చిమ యూరప్‌లో సహితమూ మిక్కిలి అరుదే కావచ్చు. కాగా, ఉదాహరణకు, మతగురువు ఒకతను సోషల్-డెమోక్రాటిక్ పార్టీలో చేరి, పార్టీలో మతభావాలను ప్రచారం చేయడమే తన ప్రధానమైనట్టీ ఇంచుమించు కేవలమైనట్టీ పనిగా పెట్టుకుంటే మాత్రం, అట్టి పక్షంలో అతనిని పార్టీ తన శ్రేణినుండి నిస్సందేహంగా తొలగించాల్సే వుంటుంది. దేముడిలో ఇంకా నమ్మకం వున్న కార్మికులనందరినీ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలోకి చేర్చుకోవడమే కాకుండా, అటువంటి వారిని పనికట్టుకుని వెదకి మరీ పార్టీలోకి తెచ్చుకోవాలి; వారి మతవిశ్వాసాల పట్ల ఈషణ్మాత్రపు అగౌరవాన్నయినా మనం ఎంతమాత్రమూ సహించకూడదు; మన పార్టీ కార్యక్రమ భావంలో వారికి ప్రబోధం కల్గించడానికి వారిని మనలోకి తీసుకు వస్తామే గాని, మన కార్యక్రమానికి వ్యతిరేకంగా వారు చురుకైన పోరాటం సాగించడానికి కాదు. పార్టీ లోపల అభిప్రాయస్వేచ్ఛను మనం ఒప్పుకుంటాం, కాని గ్రూపులుగా ఏర్పడే స్వేచ్ఛచే నిర్ధరించబడే నిర్దిష్ట పరిమితులకు ఇది లోనైయే వుంటుంది; పార్టీ అధికసంఖ్యాకవర్గంచే

నిరాకరించబడిన భావాలను చురుకుగా బోధించే వారితో మనం చేతులు కలిపి నడవాల్సిన అవసరం మనకేమీ లేదు.

ఇంకొక ఉదాహరణ: ''సోషలిజం నా మతం'' అని ఉద్ఘాటించినందుకూ, ఈ ఉద్ఘాటనను అనుసరించినట్టి భావాలను ప్రకటించినందుకూ, అన్ని సందర్భాల్లోనూ, సమానంగానూ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సభ్యులు అధిక్షేపించబడాల్సిందేనా? ఎంతమాత్రమూ కూడదు! మార్క్సిజంనుండి (ఫలితంగా సోషలిజంనుండి కూడా) తప్పు దారి పట్టడం ఇక్కడ నిర్వివాదమే, కాని ఈ తప్పుదారి ప్రాముఖ్యత, ఒక విధంగా చెప్పాలంటే దాని విశిష్ట భారం, విభిన్న సందర్భాల్లో విభిన్నంగా వుంటుంది. ఒక ఆందోళనాకార్యకర్త, లేదా ఒక వ్యక్తి కార్మికుల ఎదుట ఉపన్యసించుతూన్నప్పుడు, తన శ్రోతలు తనను బాగా అర్థం చేసుకోగల్గడానికని గాని, తన ఉపన్యాస విషయానికి ఉపోద్ఘాతంగా గాని, తన భావాలను వెనకబడిన ప్రజారాసులు బాగా అలవాటుపడిన ఉక్తులలో చెబితేనే వారికి మరింత స్పష్టంగా వ్యక్తమయేందుకని గాని ఈ విధంగా చెప్పడం ఒకటి. ''దైవనిర్మితం''[118] అనిగాని, దైవనిర్మితమైన సోషలిజం అనిగాని ఒక రచయిత బోధ చేయడం (ఉదాహరణకు, మన లునచార్‌స్కి, ప్రభృతుల భావంలో) మొదలుపెట్టడం ఇంకొకటి. మొదటి దృష్టాంతంలో అధిక్షేపణ కేవలం తప్పులు పట్టడమే అవుతుంది, లేదా ఆందోళనాకార్యకర్త స్వేచ్ఛకు, ''ప్రబోధక'' విధానాలను ఉపయోగించే స్వేచ్ఛకు యుక్తముకాని అవరోధాలు కల్పించడమే అవుతూండగా, రెండవ దృష్టాంతంలో పార్టీ అధిక్షేపణ అవసరమూ ముఖ్యమూ కూడా. ''సోషలిజం ఒక మతం'' అనే వాక్యం కొందరి విషయంలో మతం నుండి సోషలిజానికి పరివర్తన రూపం అవుతూండగా, కొందరి విషయంలో అది సోషలిజం నుండి మతానికి పరివర్తన రూపం అవుతుంది.

''మతం ప్రైవేటు విషయం'' అనే వాదానికి అవకాశవాద వ్యాఖ్యానం పాశ్చాత్యంలో ఏ పరిస్థితులలో తలెత్తిందో వాటిని గురించి మనమిప్పుడు ప్రస్తావించుదాం. క్షణికమైన లాభాలకోసమని కార్మికుల ఉద్యమం యొక్క మౌలికప్రయోజనాలను త్యాగంచేయడంవల్ల అవకాశవాదం తలెత్తడానికి మామూలుగా అవకాశం కల్గించినట్టి సాధారణాంశాల ప్రభావం మనకిక్కడ తారసిల్లుతూంది, ఇది సహజమే. మతం ప్రైవేటు విషయమని రాజ్యాంగయంత్రం ప్రకటించాలని శ్రామికవర్గ పార్టీ కోరుతూంది, అయితే ప్రజల నల్లమందుకు వ్యతిరేకమైన పోరాటం, మతమౌఢ్యం, వగైరాలకు వ్యతిరేకమైన పోరాటం ''ప్రైవేటు విషయం'' కాదనే పార్టీ పరిగణించుతుంది. మతం ప్రైవేటు విషయంగా సోషల్-డెమోక్రాటిక్ పార్టీ పరిగణించుతూందన్నట్టుగా ఈ ప్రశ్నకు అవకాశవాదులు వక్రభాష్యం చెబుతున్నారు!

కాని ఈ మామూలు అవకాశవాద వక్రభాష్యంతో పాటు (మన పార్టీ దూమ సభ్యుల గ్రూపు సమావేశంలో మతంపై ఉపన్యాసం గురించి జరిగిన చర్చలో ఈ విషయాన్ని వివరించనే

లేదు), మత(ప్రశ్న పట్ల యూరపియన్ సోషలిస్టులలో అధునాతనపు, అత్యధికమైనట్టి అని చెప్పొచ్చునేమో కూడా, ఉదాసీనత పొడచూపడానికి (ప్రత్యేక చారి(త్రాత్మక పరిస్థితులున్నాయి. ఈ పరిస్థితుల స్వభావం రెండు రకాలుగా వుంటుంది. మతంతో పోరాడే కర్తవ్యం చారి(త్రాత్మకంగా విప్లవాత్మక బూర్జువావర్గానిది, కాగా పాశ్చాత్య దేశాల్లో బూర్జువా (ప్రజాస్వామ్యం ప్యూడలిస్టు, మధ్యయుగవ్యవస్థలపై తాను విప్లవాలు, లేదా దాడులు సాగించిన శకంలో ఈ కర్తవ్యాన్ని చాలా వరకు సాధించింది (లేదా సాధించ యత్నించుతూనే వుండేది). (ఫాన్సు, జర్మనీ, ఈ రెండు దేశాల్లోనూ మతంపై బూర్జువా యుద్ధం ఒక సం(ప్రదాయం కింద ఏర్పడి, సోషలిజానికి ఎంతో ముందుగానే (విజ్ఞానసర్వస్వవాదులు, ఫొయెర్‌బాఖ్) ఆరంభమయింది. రష్యాలో, మన బూర్జువా-(ప్రజాస్వామ్య విప్లవ పరిస్థితుల ననుసరించి, ఈ కర్తవ్యం కూడా ఇంచుమించు పూర్తిగా కార్మికవర్గ భుజస్కంధాలపైనే పడుతూంది. మన దేశంలోని పెట్టీబూర్జువా (నరోద్నిక్) (ప్రజాస్వామ్యం ఈ విషయంలో (కొత్తగా అవతరించిన నల్లదండు ముఠాల కాడెట్ల్లూ, లేదా కాడెట్లు నల్లదండు ముఠాల "వేహి"119 లో చెబుతూన్నట్టుగా కాకుండా) విపరీత కృషి ఏమీ చేయలేదు సరే కదా, యూరప్‌లో చేసినదానితో సరిపోల్చిచూస్తే మరీ తక్కువే చేసిందేమో కూడా.

పైపెచ్చు, మతవ్యతిరేక బూర్జువాయుద్ధ సం(ప్రదాయం ఈ యుద్ధంపై అరాచకవాదంచే కావించబడిన ఒక విశిష్ట బూర్జువా వ(క్రభాష్యం యూరప్‌లో తలెత్తడానికి కారణభూతమైంది; ఇంతకముందే మార్క్సిస్టులు అనేకసార్లు వివరించినట్టుగా, బూర్జువావర్గంపై అరాచకవాద దాడుల "తీ(వ్రత" ఎంత హెచ్చుగా వున్నప్పటికీ, అరాచకవాదం బూర్జువా (ప్రపంచ దృక్పథాన్నే తీసుకుంటుంది. ల్యాటిన్ దేశాలలో అరాచకవాదులూ బ్లాంకిస్టులూ, జర్మనీలో మోస్ట్ (ఇతడు డ్యూరింగ్ శిష్యుడు అని ఇక్కడ సందర్భవశాత్తూ చెప్పొచ్చు), ఇతని రకం వారూ, ఆస్ట్రియాలో 1880 లలో అరాచకవాదులూ మతవ్యతిరేక పోరాటంలో విప్లవాత్మక పదజాల (ప్రయోగాన్ని nec plus ultra* వరకు తీసుకుపోయారు. అరాచకవాదులకు వ్యతిరేకంగా యూరపియన్ సోషల్-డెమో(క్రాట్లు ఇప్పుడు ఈ కొసనుండి ఆ కొసకి వెళ్లడంలో ఆశ్చర్యమేమీ లేదు. దీనిని పూర్తిగా అర్థం చేసుకోవచ్చు, కాగా కొంతవరకు సూ(త్రబద్ధమే కూడా; కాని పాశ్చాత్యదేశాల (ప్రత్యేక చారి(త్రాత్మక పరిస్థితులను రష్యన్ సోషల్-డెమో(క్రాట్లు మర్చిపోవడం తప్పే అవుతుంది.

రెండవది, పాశ్చాత్య దేశాల్లో, జాతీయ బూర్జువా విప్లవాలు అయిపోయిన తరువాత, ఇంచుమించు పూర్తి మనస్సాక్షి స్వేచ్ఛ (ప్రవేశపెట్టబడిన తరువాత, సోషలిజానికి వ్యతిరేకంగా

* పరమోన్నత స్థాయి — అనువాదకుడు.

బూర్జువా ప్రజాస్వామిక పోరాటంవల్ల మతవ్యతిరేక ప్రజాస్వామిక పోరాట సమస్య అప్పటికే ఎంతగా చారిత్రాత్మక పూర్వరంగంలోకి నెట్టివేయబడిందంటే, బూర్జువా ప్రభుత్వాలు మతగురువ్యవస్థకు వ్యతిరేకంగా quasi లిబరల్ ''దాడి''ని సంఘటితపరచి, ఈ విధంగా ప్రజారాసుల దృష్టిని సోషలిజం నుండి మళ్లించడానికి బుద్ధిపూర్వకంగా ప్రయత్నించాయి. ఇదీ జర్మనీలో Kulturkumpf యొక్క, ఫ్రాన్సులో క్లెరికలిజమ్ బూర్జువా రిపబ్లికన్ల మతగురువ్యవస్థవ్యతిరేక పోరాటం యొక్క నిజస్వభావం. కార్మిక రాసుల దృష్టిని సోషలిజం నుండి మళ్లించడానికి ఒక సాధనంగా బూర్జువా క్లెరికలిజమ్ వ్యతిరేకత — ఇదీ పాశ్చాత్య దేశాల్లో మతవ్యతిరేక పోరాటం పట్ల సోషల్-డెమోక్రాట్లలో ఆధునిక ''ఉదాసీన'' భావ విస్తరణకు ముందుగా జరిగినది. కాగా దీనిని పూర్తిగా అర్థంచేసుకోవచ్చు, ఇది సూత్రబద్ధమే కూడా; ఎందుచేతంటే, బూర్జువావర్గంయొక్క, బిస్మార్క్‌యొక్క క్లెరికలిజమ్‌వ్యతిరేకతను భంగపుచ్చేందుకు సోషల్-డెమోక్రాట్లు మతవ్యతిరేక పోరాటాన్ని సోషలిజానికై సాగించే పోరాటానికి లోబర్చాల్సి వచ్చింది.

రష్యాలో పరిస్థితులు పూర్తిగా వేరుగా వున్నాయి. మన బూర్జువా-ప్రజాస్వామిక విప్లవానికి శ్రామికవర్గం నాయకత్వం వహించింది. పాతకాలపు అధికారయుతమైన మతంతోసహా, దానిని పునరుజ్జీవింప జేయడానికి గాని, లేదా దానికి ఒకకొత్త ప్రాతిపదిక స్థానం కల్పించడమూ, వగైరాలకై చేసే ప్రతీ ప్రయత్నంతో సహా మధ్యయుగతత్వ వ్యతిరేక యుద్ధంలో శ్రామికవర్గ పార్టీయే భావశాస్త్రీయరంగంలో నాయకత్వం వహించాల్సి వుంటుంది. కాబట్టి, మతం ప్రైవేటు విషయమని రాజ్యాంగ యంత్రం ప్రకటించాలనే కార్మికపార్టీ కోర్కె స్థానే, సోషల్-డెమోక్రాట్లకీ సోషల్-డెమోక్రాటిక్ పార్టీకీ మతం ప్రైవేటు విషయమనే ప్రకటనను నిలబెట్టడంలో జర్మన్ సోషల్-డెమోక్రాట్ల అవకాశవాదాన్ని ఎంగెల్స్ సాపేక్షంగా మృదువైన మాటలలోనే సరిదిద్దినప్పటికీ — ఈ జర్మన్ వక్రభాష్యాన్ని అనుసరించినందుకు రష్యన్ అవకాశవాదులను ఎంగెల్స్ నూరురెట్లు కఠినంగా చివాట్లు పెట్టివుండేవాడన్నది స్పష్టమే.

మతం ప్రజల నల్లమందు అని దూమ వేదికనుండి ప్రకటించడంలో మన దూమ గ్రూపు కేవలం సరిగానే వ్యవహరించి, తద్వారా మత ప్రశ్నపై రష్యన్ సోషల్-డెమోక్రాట్లు చేయబోయే అన్ని ప్రకటనలకూ ఒక ప్రాతిపదికగా ఉపయోగపడాల్సిన ఒక ప్రమాణాన్ని కూడా సృష్టించింది. వారు ఇంతకంటె ముందుకు వెళ్లి, మరింత విపులంగా నాస్తిక వాదాన్ని వివరించి వుండాల్సిందా? మేము అలా అభిప్రాయపడడం లేదు. అలా చేసివుండిన పక్షంలో శ్రామిక వర్గం యొక్క రాజకీయ పార్టీచే మతవ్యతిరేక పోరాటం మరింత అతిశయోక్తులలో చెప్పబడే ప్రమాదానికి దారితీసి వుండేది; మతానికి వ్యతిరేకంగా బూర్జువా వర్గం జరిపే పోరాటానికీ

సోషలిస్టులు జరిపే పోరాటానికీ గల భేదాన్ని తుడిచిపెట్టేయడమే దాని ఫలితమయి వుండేది. నల్లదండు ముఠాల దూమలో సోషల్-డెమోక్రాటిక్ గ్రూపుయొక్క ప్రథమ విధ్యుక్త ధర్మం గౌరవప్రదంగా నెరవేర్చబడింది.

రెండవ విధ్యుక్తధర్మం — సోషల్-డెమోక్రాట్లకు బహుశా అత్యంత ముఖ్యమైనది — అనగా, నల్లదండు ముఠాల ప్రభుత్వానికి మద్దతు ఇవ్వడంలో చర్చీ, మతగురువుల బృందం యొక్క, కార్మికవర్గానికి వ్యతిరేకంగా పోరాడ్డంలో బూర్జువావర్గం యొక్క వర్గపాత్రసూ వివరించడం కూడా గౌరవప్రదంగా నెరవేర్చబడింది. ఈ విషయమై ఇంకా ఎంతో అంత అధికంగానే మాట్లాడి వుండవచ్చు సహజంగానే, కాగా భవిష్యత్తులో వారు చేయబోయే ఉపన్యాసాలలో కామ్రేడ్ సుర్కోవ్ ఉపన్యాసాన్ని ఎలా విపులీకరించాలో సోషల్-డెమోక్రాట్లు తెలుసుకుంటారు; అయినప్పటికీ అతని ఉపన్యాసం భేషుగ్గా వుంది, ఆ ఉపన్యాసాన్ని పార్టీ సంస్థలన్నింటి చేత విస్తృతంగా ప్రచారం చేయించడం మన పార్టీ నెరవేర్చవలసిన తక్షణ విధి.

మూడవ విధ్యుక్తధర్మం, జర్మన్ అవకాశవాదులచే అతి తరుచుగా వక్రభాష్యం చేయబడినట్టి "మతం ప్రైవేటు విషయం" అనే వాక్యం యొక్క సరైన అర్థం సవివరంగా వివరణచేసి చెప్పడం. దురదృష్టవశాత్తూ కామ్రేడ్ సుర్కోవ్ దీనిని చెయ్యలేదు. ఇది నిజంగా శోచనీయమే. ఎందుచేతనంటే, దూమ గ్రూపుయొక్క వెనకటి క్రియాకలాపంలో ఈ విష యంపై కామ్రేడ్ బెలౌవూసొవ్ అప్పటికే ఒక పొరపాటు చేశాడు, అప్పట్లో "ప్రొలెతారియ్" పత్రిక ఆ పొరపాటును గురించి రాసింది కూడా. మతం ప్రైవేటు విషయంగా పరిగణించ బడాలి అనే ప్రసిద్ధివడసిన కోర్కెయొక్క యథార్థ వ్యాఖ్యాన సమస్యను దూమ గ్రూపు దృష్టిలో నాస్తికమతం గురించిన వివాదం మరుగుపరచేసిందని దూమ గ్రూపులో జరిగిన చర్చ తెలుపుతూంది. దూమ గ్రూపు యావత్తూ చేసిన ఈ పొరపాటుకు కామ్రేడ్ సుర్కోవ్ ఒక్కడినే మేము నిందించం. అంతే కాదు, ఈ ప్రశ్నను తగినంతగా విశదపరచనందుకూ, జర్మన్ అవకాశవాదులపై ఎంగెల్స్ చేసిన వ్యాఖ్యను సక్రమంగా అవగాహన చేసుకునేందుకు సోషల్-డెమోక్రాట్ల చైతన్యాన్ని తగినంతగా అభివృద్ధి పరచనందుకూ తప్పు యావత్తు పార్టీపైనా వుందని మేము నిష్కపటంగా ఒప్పుకుంటున్నాం. ప్రశ్నను తికమకగా అర్థం చేసు కోవడం వల్లనే వాస్తవంగా ఈ పొరపాటు సంభవించింది కాని, మార్క్స్ ఉపదేశాలను నిర్ల క్ష్యంచేసే ఉద్దేశంవల్ల కాదనీ దూమ గ్రూపులో జరిగిన చర్చ రుజువుచేస్తూంది, కాగా దూమ గ్రూపులో జరిగే భవిష్యత్తు ఉపన్యాసాలలో ఈ పొరపాటు సవరించబడుతుందని మేము విశ్వ సిస్తున్నాం.

కామ్రేడ్ సుర్కోవ్ ఉపన్యాసం మొత్తంమీద భేషుగ్గా వుందనీ, దానిని అన్ని ఆర్గ నైజేషన్లూ విస్తృతంగా ప్రచారంలోకి తీసుకురావాలనీ మేము మళ్లీ మరొకసారి చెబుతున్నాం.

తన సోషల్-డెమోక్రాటిక్ విధ్యుక్తధర్మాన్ని చిత్తశుద్ధితో తాను నెరవేర్చుతూందని ఈ ఉపన్యాసంపై జరిగిన చర్చలో పార్టీ దూమ గ్రూపు రుజువుచేసుకుంది. పార్టీయొక్క దూమ గ్రూపునీ పార్టీనీ మరింతగా సన్నిహితపరచేందుకూ, పార్టీయొక్క దూమ గ్రూపులో జరుగుతూన్న క్లిష్టమైన కృషితో పార్టీకి పరిచయం కల్గించేందుకూ, పార్టీ పనిలోనూ దూమ గ్రూపుయొక్క పనిలోనూ భావశాస్త్రీయ ఐక్యతను స్థాపించేందుకూ దూమ గ్రూపులో జరిగే చర్చలపై నివేదికలు పార్టీ పత్రికలలో మరింత తరుచుగా ప్రచురించబడుతూండడం ఎంతైనా అపేక్షణీయం.

మే, 1909.

# యూరపియన్ కార్మికోద్యమంలో విభేదాలు

## I

యూరప్, అమెరికాల సమకాలిక కార్మికోద్యమంలోని మౌలికములైన ఎత్తుగడల విభేదాలు కార్మికోద్యమంలో వాస్తవంగా ఏలుబడి సాగిస్తూన్న సిద్ధాంతంగా పరిణమించినట్టి మార్క్సిజంనుండి విడిపోతూన్న పెద్ద ధోరణులు రెండింటి పోరాటంగా తేలిపోతున్నాయి. ఈ రెండు ధోరణలూ: రివిజనిజమూ (అవకాశవాదం, రిఫార్మిజం), అరాజకవాదమూ (ఎనార్కో-సిండికలిజం* ఎనార్కో-సోషలిజం). కార్మికోద్యమంలో ఏలుబడి సాగిస్తూన్నట్టి మార్క్సిస్టు సిద్ధాంతంనుండీ మార్క్సిస్టు ఎత్తుగడలనుండీ ఈ రెండు విడిపోవడములూ రాశి కార్మికోద్యమపు అర్ధశతాబ్ది పైచిలుకు చరిత్ర అంతటిలోనూ నాగరిక దేశాలన్నిటిలోనూ వివిధ రూపాలలోనూ ఛాయలలోనూ అవేక్షించబడ్డాయి.

ఈ వాస్తవవిషయంవల్ల, విడిపోవడములు ఏ హఠాత్సంభవ ఫలితమో, ఏ వ్యక్తుల లేదా ఏ గ్రూపులయొక్క పొరపాట్ల ఫలితమో అని గాని, లేదా జాతీయ స్వభావాల, లేక సంప్రదాయాల పలుకుబడి, వగైరాల ఫలితమో అని కూడా గాని విశదపరచేందుకు వీల్లేదని స్పష్టంగా తెలుస్తూంది. అన్ని పెట్టుబడిదారీ దేశాల ఆర్థికవ్యవస్థల ప్రాతిపదికలోను, ఆ దేశాలన్నిటి అభివృద్ధియొక్క స్వభావంలోను వున్నట్టీ, ఈ విడిపోవడములకు నిరంతరము కారణభూతము లవుతూన్నట్టీ మూలకారణాలు ఏవో వుండేతీరాలి. అన్‌తోన్ పన్నెకుక్ అనే డచ్చి దేశపు మార్క్సిస్టు ఒకతను గతసంవత్సరం "కార్మికవర్గ ఉద్యమంలోని ఎత్తుగడల విభేదాలు" (Anton Pannekoek: "Die taktischen Differenzen in der Arbeiter-bewegung", Hamburg, Erdmann Dubber, 1909), అనే పేరుతో ప్రచురించిన ఒక చిన్నగ్రంథం, ఈ కారణాలను శాస్త్రీయంగా గవేషణ చేయడంలో ఆసక్తిదాయకమైన యత్నానికి ఒక తార్కాణం. మన వ్యాఖ్యానంలో పన్నెకుక్ తేల్చిన సారాంశాలతో పాఠకునికి పరిచయం చేయించుతాం; అవి నిరాక్షేపణీయములని ఒప్పుకొనక తప్పదు.

---

* అరాజకవాద-కార్మికసంఘవాదం — అనువాదకుడు.

ఎత్తుగడలపై ఆవృత్తికంగా బయల్దేరుతూన్న అభిప్రాయ భేదాలపుగల లోతైన కారణాలలో ఒకటి అసలు కార్మికోద్యమంయొక్క పెరుగుదలే. ఈ ఉద్యమాన్ని ఏదో ఒక చోద్యమైన ఆదర్శానికి లక్షణం చెప్పడమనే ప్రమాణంతో కొలవకుండా, ఆచరణలో సామాన్య ప్రజల ఉద్యమంగానే గనక పరిగణించినట్టయితే, నిరంతరమూ కొత్తకొత్త "రిక్రూట్ల"ను తీసుకురావడమూ, శ్రామికరాసులలోనుండి కొత్త స్తరములను తనలోకి తెచ్చుకోవడమూ, వీటి వెనువెంట సిద్ధాంత, ఎత్తుగడల పరిధిలో ఊగిసలాటలూ, పాత పొరపాట్ల పునరా వృత్తములూ, పాతకాలపు అభిప్రాయాల, పాతకాలపు పద్ధతుల తాత్కాలిక పునస్థిరీకరణములూ వగైరాలు తప్పనిసరిగా అనుగాములవుతాయి. ప్రతి దేశంలోని కార్మికోద్యమమూ కొత్త రిక్రూట్ల "తర్ఫీదు" కోసం కొద్దో గొప్పో పరిమాణంలో శక్తినీ, శ్రద్ధనూ, కాలాన్నీ ఆవృత్తంగా వినియోగించుతూనే వుంటుంది.

ఇంకా ముందుకువెళ్దాం. పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి గతి వివిధ దేశాల్లోనూ, జాతీయ ఆర్థికవ్యవస్థయొక్క వివిధ విభాగాల్లోనూ వివిధంగా వుంటూంటుంది. అధికస్థాయి పరిశ్రమ యొక్క అత్యధికాభివృద్ధి పరిస్థితులకింద వున్న కార్మికవర్గం చేతనూ, దాని భావ శాస్త్రవేత్తలచేతనూ మార్క్సిజం అతి సులభంగానూ, అతి త్వరితంగానూ, అతి సమగ్రంగానూ, అతి సుస్థిరంగానూ ఔంటపట్టించుకోబడుతుంది. సాధారణంగా బూర్జువా ప్రపంచ దృక్పథం యొక్క, అందులోనూ ప్రత్యేకంగా బూర్జువా-ప్రజాస్వామిక ప్రపంచదృక్పథం యొక్క, సంప్రదాయాలన్నిటితోనూ ఇంకా నిష్కర్షగా తెగతెంపులు చేసుకోలేకుండా వున్న కారణంగా మార్క్సిజంలోని కొన్ని ప్రత్యేక అంశాలనో, నూతన ప్రపంచదృక్పథంలోని కొన్ని ప్రత్యేక భాగాలనో, లేక ప్రత్యేక నినాదాలనో డిమాండ్లనో మాత్రమే అవగాహన చేసుకున్నట్టి కార్మికోద్యమ అనుయాయులు అవుపడుతూండడానికి, వెనకబడి వున్నట్టి, లేదా వాటి అభివృద్ధిలో వెనక వెనకనే వున్నట్టి ఆర్థికసంబంధాలే నిరంతరమూ దారితీస్తూంటాయి.

ఇదిగాక, విభేదాలకు నిరంతరమూ మూలాధారం, వైరుధ్యాలలోనూ, వైరుధ్యాల ద్వారానూ సాగుతూండేటట్టి సామాజికాభివృద్ధి యొక్క గతితార్కిక స్వభావమే. పాత ఉత్పత్తి పద్ధతులను నాశనంచేసి ఉత్పాదక శక్తులను అభివృద్ధిచేస్తుంది. కాబట్టే, పెట్టుబడిదారీ విధానం ప్రగతిశీల మవుతూంది; అయినప్పటికీ అదే సమయంలో అభివృద్ధిలోని ఒక నిర్దిష్టదశలో, ఉత్పాదక శక్తుల పెరుగుదలను అరికట్టుతుంది. కార్మికులలో అభివృద్ధి కలిగించి, వారిని ఆర్గనైజుచేసి క్రమశిక్షణను అలవర్చుకొనేటట్టు చేస్తుంది — కాగా ప్రజాపీడన కావించుతూ, హింసించుతూ, క్షీణదశకూ దారిద్ర్యం, వగైరాలకూ కూడా అది దారితీస్తుంది. పెట్టుబడిదారీ విధానం తన సమాధినిర్మాతనే ప్రభావితంచేసుకుంటుంది, ఒక కొత్త వ్యవస్థయొక్క మూలద్రవ్యాలను తానంతటదే సృష్టించుతుంది, అయినప్పటికీ అదేసమయంలో, ఒక "దాటు"

లేనిదే, ఈ విడివిడి మూలద్రవ్యాలు కార్యకలాపాల సాధారణ పరిస్థితులను వేటినీ మార్చవు, పెట్టుబడి పరిపాలనకు ఏ మాత్రమూ కదల్చవు. వాస్తవజీవితం యొక్క, పెట్టుబడిదారీ విధాన, కార్మికోద్యమాల వాస్తవ చరిత్రయొక్క ఈ వైరుధ్యాలను మార్క్సిజం, అనగా గతి తార్కిక భౌతికవాద సిద్ధాంతం, తనలో ఇముడ్చుకో గల్గుతూంది. అయితే ప్రజారాసులు పుస్తకాలనుండిగాక, జీవితం నుండే నేర్చుకుంటారనే విషయం చెప్పనవసరం లేదు: దీన్ని బట్టి కొందరు వ్యక్తులు, లేదా కొన్ని గ్రూపులుగా ఏర్పడిన కొందరు వ్యక్తులు, పెట్టు బడిదారీ విధానాభివృద్ధి యొక్క ఒక లక్షణాన్ని ఈవేళ, ఒక లక్షణాన్ని రేపు, ఈ అభివృద్ధి నుండి ఒక ''గుణపాఠాన్ని'' ఈవేళ, మరొక గుణపాఠాన్ని రేపు, ఈ విధంగా ఒకవైపు మొగ్గు చూపే సిద్ధాంతంగానూ, ఒకవైపు మొగ్గుచూపే ఎత్తుగడల విధానంగానూ నిరంతరమూ అతిశయోక్తులతో చెబుతూ పైకెత్తుతూ వుంటారు.

బూర్జువా భావశాస్త్రవేత్తలూ, లిబరల్సూ, ప్రజాస్వామికవాదులూ మార్క్సిజాన్ని అర్థం చేసుకోకుండానూ, సమకాలిక కార్మికోద్యమాన్ని అర్థం చేసుకోకుండానూ నిస్సహా యులై ఒక చివరనుండి ఒక చివరకు నిరంతరమూ కుప్పిగంతులు వేస్తూనే వుంటారు. దుష్ట బుద్ధులు కొందరు ఒక వర్గంపై ఒక వర్గాన్ని ''ఉసికొల్పుతున్నారని'' చెబుతూ, ఈ విధంగా వీరు యావత్తు విషయాన్నీ ఒకనాడు వివరించుతారు, మరొకనాడు కార్మికుల పార్టీ ''సంస్క రణలను కోరుతూన్నట్టి శాంతియుతమైన పార్టీ'' అని ఉద్ఘాటించుతూ తమ్ముతామే ఊరడించు కుంటారు. కార్మికోద్యమం యొక్క ఒక పార్శ్వాన్నే పట్టుకుని, ఒకవైపు మొగ్గుచూపే స్వభావాన్ని ఒక సిద్ధాంతంగా పైకెత్తుతూ, కార్మికవర్గ క్రియాకలాపంలో ఫలానా కాలా వధిలో, ఫలానా పరిస్థితులో ఈ ఉద్యమంలో ఒక విశిష్ట ప్రత్యేకతగా ఏర్పడేటట్టి ధోరణు లనూ లక్షణాలనూ పరస్పరం మినహాయించుకునేటట్టివిగా ప్రకటించేటట్టి ఎనార్కో-సిండి కలిజమూ, రిఫార్మిజమూ — ఈ రెండింటినీ ఈ బూర్జువా ప్రపంచదృక్పథంయొక్క, దాని ప్రభావం యొక్క సూటి ఫలితాలుగానే పరిగణించాలి. అయితే, ఏ విధంగానైతే మెల్లగా సాగే పరిణామమూ, శీఘ్రమైన దాట్లూ — అవిరతంలో విరుపులు — విరామములు, జీవితము లోనూ ప్రకృతి అభివృద్ధిలోనూ ఇమిడి వున్నాయో అలాగే ఈ విభిన్న ధోరణులు వాస్తవ జీవితంలోనూ వాస్తవ చరిత్రలోనూ ఇమిడి వున్నాయి.

''దాట్లు'' గురించీ, కార్మికోద్యమానికీ యావత్తు పాత సమాజానికీ వున్న మౌలిక విరుద్ధం గురించీ అన్ని అవేక్షణలనూ రివిజనిస్టులు వుత్త పదజాల ప్రయోగంగా పరిగణి స్తారు. సంస్కరణలను సోషలిజం యొక్క పాక్షిక సాధనగా వారు పరిగణిస్తారు. ఎనార్కో- సిండికలిస్టు ''చిల్లర మల్లర కార్యకలాపాన్ని,'' అందులోనూ ముఖ్యంగా పార్లమెంటరీ వేది కను ఉపయోగించుకోవడమును తిరస్కరిస్తాడు. ఇప్పుడు చివర పేర్కొనబడిన ఎత్తుగడలు

''మహత్తర దినాలు'' కోసం కాచుకుని కూచోవడంతో సమానమే అవుతూ, ఈ మహత్తర ఘటనలను సంభవింపజేసే శక్తులను సమీకృతం చేయడంలో అసమర్థతనే వాస్తవంగా తెలియ పరుస్తున్నాయి. పెద్దవీ, బలమైనవీ, తమ విధులను యుక్తంగా నెరవేర్చగల్గేవీ అయినట్టి ఆర్గనైజేషన్లలో — అన్ని పరిస్థితులలోనూ యుక్తంగా తమ విధులను నిర్వర్తింపగలిగే ఆర్గనైజేషన్లలో — వర్గపోరాట భావంతో పరితప్తమై, తమ లక్ష్యాలను స్పష్టంగా తెలుసు కుంటూ, నిజమైన మార్క్సిస్టు ప్రపంచదృక్పథంలో శిక్షణ పొందినట్టి ఆర్గనైజేషన్లలో — కార్మికులను సమీకృతం చేసేటట్టి అత్యంత ప్రధానమైనట్టీ అత్యంత ముఖ్యమైనట్టి కార్యానికి ఈ రెండు ఎత్తుగడలూ కూడా అడ్డంకులే అవుతున్నాయి.

ఒక్క పశ్చిమ యూరపియన్ చరిత్రనుండే, అందులోనూ ముఖ్యంగా జర్మనీ, ఫ్రాన్సు చరిత్రలనుండే, ఉదాహరణలను తీసుకుని, రష్యాను లెక్కలోకి తీసుకోకుండా పూర్తిగా వదలి పెట్టేసి, తన విశ్లేషణకు తార్కాణాలను చూపిస్తున్నాడు పన్నెకుక్ అని చెప్పేందుకు అవకాశం కలిగేటట్టి అపోహను నివారించేందుకుగాను అసలు విషయం వదలిపెట్టి, ప్రాసంగి కంగా వేరే ఒక చిన్న విషయం గురించి మనమిక్కడ ప్రస్తావించాల్సి వుంటుంది. రష్యాను గురించి అతడు లీలగా సూచిస్తూండేటట్టుగా ఒక్కొక్కప్పుడు కనబడినప్పటికీ, అందుకు కారణం కేవలమూ, మార్క్సిస్టు ఎత్తుగడలనుండి ప్రత్యేకములైన విడిపోవడములను ప్రభా వితం చేసేటట్టి మౌలికధోరణులు సంస్కృతిలోనూ జీవితవిధానంలోనూ చరిత్రలోనూ ఆర్థిక వ్యవస్థలోనూ రష్యాకీ పాశ్చాత్యానికీ మధ్య బ్రహ్మాండమైన వ్యత్యాసం వున్నప్పటికి సహితమూ, మన దేశంలో కూడా కనబడుతూ వుండడమే.

చిట్టచివరి విషయం ఏమిటంటే, కార్మికోద్యమంలో పాల్గొంటున్న వారిలో అభి ప్రాయభేదాలకు దారితీసే అత్యంత ముఖ్యమైన కాణం, సాధారణంగా పాలకవర్గాల ఎత్తుగ డలలోనీ, ప్రత్యేకంగా బూర్జువావర్గపు ఎత్తుగడలలోనీ, మార్పులలో వుంటుంది. బూర్జువా వర్గపు ఎత్తుగడలు ఎల్లప్పుడూ ఒక్కలాగే వుండిన పక్షంలోనూ, లేదా అధమం ఒక్క రకానికి చెందినవే అయివుండిన పక్షంలోనూ, కార్మికవర్గం కూడా అదే ఎత్తుగడలతో, లేదా అదే రకం ఎత్తుగడలతోనూ అందుకు జబాబివ్వడం త్వరగానే నేర్చుకుంటుంది. యథార్థానికి అన్ని దేశాలలోని బూర్జువావర్గం పరిపాలనా వ్యవస్థలను రెండింటిని, తన ప్రయోజనాల కోసమూ, తన పరిపాలనను నిలుపుకొనడానికోసమూ రెండు పోరాట పద్ధతులను విధిగా అభి వృద్ధి చేస్తుంది, కాగా ఈ రెండు పద్ధతులూ ఒక్కొక్కప్పుడు ఒకదాని తరువాత ఒకటిగానూ, ఒక్కొక్కప్పుడు ఒకదానితో ఒకటి వివిధ సంయోగాలలోనూ వుంటూంటాయి. అవి ఏవంటే: మొదటిది, బలప్రయోగ పద్ధతి, కార్మికోద్యమానికి ఎట్టి రాయితీలను సహితమూ ఇవ్వ నిరాకరించే పద్ధతి, పాతబడిపోయినట్టీ కాలం చెల్లిపోయినట్టీ సంస్థలన్నింటికీ వత్తాసు

ఇచ్చే పద్ధతి, ఎట్టి సామరస్య స్వభావమూ చూపకుండా సంస్కరణలను తిరస్కరించే పద్ధతి. ఇది కన్సర్వేటివ్ విధానం యొక్క స్వభావం, పాశ్చాత్య యూరప్‌లో ఈ విధానం అంతకంతకు మరింతగా భూస్వామ్యవర్గం యొక్క విధానంగానే వుండడంపోయి, మరింత అధికంగా బూర్జువా వర్గపు సాధారణ విధానం యొక్క వివిధ రకాలలో ఒక రకంగా తయారవుతూంది. రెండవ పద్ధతి రాజకీయ హక్కుల అభివృద్ధి దిశగా, సంస్కరణలూ రాయితీలూ, వగైరాల దిశగా నడచే ''లిబరలిజం'' పద్ధతి.

బూర్జువావర్గం ఒక పద్ధతినుండి ఇంకొక పద్ధతిలోకి వెళ్లేందుకు కారణం, వ్యక్తుల యొక్క ద్వేషపూరిత కుతంత్రాలూ కావు, కాకతాళీయ న్యాయమూ కాదు, అందుకు కారణం దాని స్వీయ స్థానంయొక్క మౌలిక వైరుధ్య స్వభావమే. దృఢంగా స్థాపితమైన ప్రాతినిధ్యపు వ్యవస్థ లేనిదే, సాపేక్షంగా ఉన్నతస్థాయి ''సాంస్కృతిక'' డిమాండ్లను కోరడంవల్ల తప్పని సరిగా విభేదించి తీరుతూన్నట్టి జనసంఖ్య కొన్ని నిర్దిష్టములైన రాజకీయ హక్కులను అనుభవించనిదే ప్రామాణికమైన పెట్టుబడిదారీ సమాజం విజయవంతంగా అభివృద్ధి పొందజాలదు. తనకు స్వాభావికమైన ఉన్నత సాంకేతికము, ప్రపంచ పోటీ అభివృద్ధి సంక్లిష్టత, ఉలుసుబాటు, చలనసామర్థ్యం, త్వరితం, వగైరాలను కలిగినట్టి పెట్టుబడిదారీ విధానపు స్థితిగతుల వల్లనే సంస్కృతియొక్క ఒక నిర్దిష్ట కనిష్ఠస్థాయికిగాను ఈ డిమాండ్లు సృష్టించబడుతున్నాయి. తదానుషంగికంగా బూర్జువావర్గపు ఎత్తుగడలలోని మార్పులూ, బలప్రయోగ వ్యవస్థనుండి ప్రత్యక్షంగా రాయితీలను కల్పించే వ్యవస్థకు మలుపూ గత శతాబ్ది ఉత్తరార్థంలో అన్ని యూరపియన్ దేశాల చరిత్రకూ ప్రత్యేకమైనదిగానే వుంటూండగా, అదే సమయంలో నిర్దిష్ట కాలావధులలో ఏదో ఒక పద్ధతి యొక్క ప్రయుక్తాన్ని వివిధ దేశాలు ప్రధానంగా అభివృద్ధి చేస్తాయి. ఇందుకు దృష్టాంతం: 1860 లలోనూ, 1870 లలోనూ ''లిబరల్'' బూర్జువా విధాన అవలంబనకు ఇంగ్లండు సాంప్రదాయిక దేశం, 1870 లలోనూ, 1880 లలోనూ జర్మనీ బలప్రయోగ పద్ధతికే కట్టుబడి వుండిపోయింది. ఇలాగే ఇతర దృష్టాంతాలు కూడా.

ఈ పద్ధతి జర్మనీలో సాగిన రోజుల్లో, బూర్జువా పరిపాలన వ్యవస్థలలో ఒక వ్యవస్థ యొక్క పాక్షిక ప్రతిధ్వని అయినట్టీ, ఆనాడు అరాజకవాదం అని పిలువబడినట్టీ ఎనార్కో-సిండికలిజం కార్మికోద్యమంలో వృద్ధిచెందింది (1890 లలో ''యువకులు''[120] అనీ, 1880 ల ప్రారంభంలో యోహన్ మోస్ట్.) 1890 లో ''రాయితీల'' దిశగా మార్పు జరిగినప్పుడు, ఎల్లప్పుడూ జరిగేటట్టుగానే అప్పుడు కూడా, ఈ మార్పు కార్మికోద్యమానికి మరింత ప్రమాద భరితంగా పరిణమించి, బూర్జువా ''రిఫార్మిజం''యొక్క సరిసమాన పాక్షిక ప్రతిధ్వని అయినట్టి అవకాశవాదాన్ని కార్మికోద్యమంలో ప్రభావింత జేసింది. ''బూర్జువావర్గ లిబరల్

విధానంయొక్క ధనాత్మకమైనట్టీ నిజమైనట్టీ లక్ష్యం కార్మికులను పెడదారులను పట్టించి, వారిశ్రేణులను చీల్చి, వారి విధానాన్ని నిర్వీర్యమైనట్టి, ఎల్లప్పుడూ నిర్వీర్యంగానే వుండే టట్టి, క్షణభంగురమైన కుహనా రిఫార్మిజంయొక్క నిర్వీర్యమైన అనుబంధంగా పరివర్తన చేయడమే'' అని పన్నెకుక్ అంటాడు.

బూర్జువావర్గం అతి తరుచుగా, పన్నెకుక్ న్యాయంగా అన్నట్టుగానే ''మరింత జిత్తులమారి'' విధానమైనట్టి, ''ఉదారమైన'' విధానం వల్ల తన లక్ష్యాన్ని కొంత నిర్దిష్ట కాలం వరకూ సాధించుకుంటుంది. కార్మికులలోనూ, వారి ప్రతినిధులలోనూ, ఒక భాగం పైకి నిజమైనవిగానే కనబడుతూన్నట్టి రాయితీలచే మోసగించబడ నిచ్చగించుతుంది. వర్గపోరాట సిద్ధాంతం ''పాతపడిపోయిందని'' రివిజనిస్టులు చాటిచెబుతారు, లేదా వర్గపోరాట పరిత్యాగంతో వాస్తవంగా సమానమే అవుతూన్న విధానాన్ని సాగించడం ఆరంభించుతారు. బూర్జువా వర్గపు ఎత్తుగడల వంకరటొంకర నడకలు, కార్మికోద్యమంలోని రిఫార్మిస్టు తత్వాన్ని తీవ్రం చేసి, కార్మికోద్యమంలోని విభేదాలను, సూటి చీలికలుగా ఏర్పడేంతవరకూ కూడా తరుచుగా తీసుకుపోతాయి.

పైన సూచించిన తరహాకి చెందిన కారణాలన్నీ కార్మికోద్యమంలో, శ్రామికవర్గ శ్రేణులలో ఎత్తుగడల ప్రశ్నలపై అభిప్రాయభేదాలు పొడసూపేందుకు దారితీస్తాయి. శ్రామిక వర్గానికీ, దానితో సంపర్కం వున్నట్టీ, రైతాంగాన్ని కలుపుకున్న పెట్టీబూర్జువావర్గ స్తరములకూ మధ్య చైనీయ మహాకుడ్యం అంటూ ఏదీ లేదు, ఉండడానికి వీలూలేదు. కొందరు వ్యక్తులూ, కొన్ని గ్రూపులూ, కొన్ని పెట్టీబూర్జువా స్తరములూ శ్రామికవర్గ శ్రేణులలోకి మారిపోవడం తక్షణ ఫలితంగా శ్రామికవర్గపు ఎత్తుగడలలో ఊగిసలాటలకు తప్పనిసరిగా దారి ఏర్పడుతూందన్న విషయం ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది.

నిర్దిష్టమైన ఆచరణీయ సమస్యల ఉదాహరణనుండి మార్క్సిస్టు ఎత్తుగడల సారాన్ని అర్థం చేసుకుందుకు వివిధ దేశాల కార్మికోద్యమానుభవం మనకు సహాయ పడుతుంది. మార్క్సిజం నుండి విడిపోతూన్నట్టి అన్యమార్గాల అనుసరణ యొక్క నిజమైన వర్గ ప్రాముఖ్యతను మరింత స్పష్టంగా గుర్తెరగేందుకూ ఈ అన్యమార్గాల అనుసరణతో మరింత విజయవంతంగా పోరాడేందుకూ ఇది యువదేశాలకు సహాయపడుతుంది.

డిసెంబరు 1910.

# మార్క్సిజంయొక్క చారిత్రకాభివృద్ధిలో కొన్ని విశిష్ట లక్షణాలు

తామూ — అనగా తానూ ప్రఖ్యాతివహించిన తన మిత్రుడూ — చేసిన ఉపదేశం ఒక పిడిసూత్రం కాదు, కార్యాచరణకు అది మార్గదర్శి అన్నాడు ఎంగెల్స్. ఈ మహావాక్యం మార్క్సిజంయొక్క తరుచుగా విస్మరించబడుతూన్నట్టి ఆ అంశాన్ని ఎంతో భావోద్దీపితంగానూ అపూర్వశక్తితోనూ నొక్కిచెపుతూంది. ఇలాగు నిర్లక్ష్యం చేయడంవల్ల మార్క్సిజాన్ని ఒక పక్కకు ఒరిగిపోయి వికృతరూపాన్ని పొందిన జీవచ్ఛవంలాగు తయారుచేస్తున్నాం మనం; దాని సజీవమైన ఆత్మనే మనం హరింపజేస్తున్నాం; మార్క్సిజంయొక్క మౌలిక సైద్ధాంతిక పునాదులనే — గతితార్కికాన్నే, వైరుధ్యాలతో నిండినట్టి సర్వవ్యాప్తమైన చారిత్రకాభివృద్ధినే — మనం నాశనంచేస్తున్నాం; చరిత్రగమనంయొక్క ప్రతి కొత్త మార్పుతోనూ మారిపోయేటట్టి నిర్దిష్టమైన ఆచరణయోగ్యమైన యుగకర్తవ్యాలతో దానికుండే సంబంధాన్నే తెగగొట్టేస్తున్నాం మనం.

నిజం చెప్పాలంటే, ఈనాడు రష్యాలో మార్క్సిజంయొక్క విధి గురించి తాపత్రయ పడుతూన్న వారిలోనే, మార్క్సిజంయొక్క ఈ అంశాన్నే సరిగ్గా నిర్లక్ష్యంచేసే వారే మనకు అతి తరుచుగా తటస్థపడుతూంటారు. అయినప్పటికీ, కార్యాచరణ పరిస్థితులను వాటితోసహా కార్యాచరణయొక్క లక్ష్యాలనూ అత్యంత ప్రత్యక్షంగా తక్షణమే నిర్ణయించేటట్టి రాజకీయ సాంఘిక స్థితిగతులనూ అసామాన్య త్వరితగతితోనూ అనన్యసామాన్య శక్తితోనూ జరిగిన పరిస్థితుల మార్పుకు రష్యా ఇటీవలి సంవత్సరాల్లో అత్యంత ఆకస్మికంగా లోనైనదన్న విషయం అందరకూ స్పష్టంగా కనబడి తీరుతూంది. వర్గాలమధ్య వుండే మౌలిక సంబంధాలు మార్పుచెందనంతవరకూ చరిత్రగమనంయొక్క ప్రతీ మార్పుతోపాటుగా మార్పు చెందనటువంటి సాధారణములైనట్టీ మూలాధారములైనట్టీ లక్ష్యాలను గురించి నేను సహజంగానే చెప్పడం లేదు. రష్యను సమాజంలో వివిధవర్గాలమధ్య వున్న మౌలికమైన

సంబంధంలాగే, రష్యాలో ఆర్థిక పరిణామంయొక్క (ఆర్థికపరిణామం ఒక్కటే కాదు) మొత్తం ధోరణి కూడా, మాటవరసకు గత ఆరేళ్లలో మార్పు చెందలేదనేది సుస్పష్టంగానే కనబడుతూంది.

కాని ఈ కాలంలోనూ, నిర్దిష్ట సాంఘిక రాజకీయ పరిస్థితులలో జరిగిన మార్పుల తోపాటుగా, ప్రత్యక్ష తక్షణ చర్యలయొక్క లక్ష్యాలు కూడా అతి నిశితంగా మారిపోయాయి; — కాగా మార్క్సిజం సజీవమైన సిద్ధాంతంకాబట్టే, తదానుషంగికంగా వివిధ పార్శ్వాలు ప్రథమ స్థానాన్ని వహించక తప్పింది కాదు.

ఈ అభిప్రాయం స్పష్టంగా బోధపడాలంటే, గత ఆరేళ్లలోనూ నిర్దిష్టములైన సాంఘిక రాజకీయ పరిస్థితులు ఏలా మార్పు చెందాయో మనం ఒకసారి గమనించడం అవసరం. ఆలా గమనించినట్టయితే, ఈ ఆరు సంవత్సరాల కాలమూ, మూడు సంవత్సరాల దశలు రెండింటికింద ఏర్పడుతూన్నట్టు మనకు స్పష్టంగా కనబడుతుంది: 1907 వేసవితో దరి దాపు పూర్తి అయిన మొదటి దశ; 1910 వేసవితో దరిదాపు పూర్తి అయిన రెండవ దశ. స్వచ్ఛమైన సైద్ధాంతిక దృష్టితోనే చూచినట్టయితే, రష్యాలో వున్న రాజ్యాంగవ్యవస్థయొక్క మూలస్వభావాల్లో అత్యంత త్వరితగతిని సంభవించిన మార్పులనుబట్టి మొదటి మూడేళ్ల కాలమూ ప్రాధాన్యత వహించుతూంది: ఈ మార్పులయొక్క గమనం ఎంతో ఒడిదుడుకుగానూ, వీటి స్పందనవిస్తారం రెండు దిశలలోనూ కూడా ఎంతో విస్తృతంగానూ జరిగింది. అమిత వైవిధ్యాన్ని కలిగిన వేర్వేరు రంగాలలో — (దూమలోనూ, దూమవెలుపలనూ, పత్రికల్లోనూ, సంఘాల్లోనూ, సభల్లోనూ, ఇంకా ఇతరత్రానూ), ఇంతవరకూ చరిత్రలో తరుచుగా గమనించబడనట్టిన్నీ, ఇంత బాహాటంగానూ, ఇంత మనస్సుకు నాటి పోయేటట్టు గానూ, ఇంత భారీస్థాయిలోనూ జరిగిన అన్ని రష్యను సాంఘిక వర్గాలయొక్క కార్యాచరణ క్రియే "పైకట్టడము"లో సంభవించిన మార్పులకు సాంఘిక ఆర్థిక ప్రాతిపదికగా ఏర్పడింది.

ఇందుకు భిన్నంగా, ఇంచుమించు నిస్తబ్ధతకిందే ఏర్పడినంతటి మిక్కిలి మెల్లగా జరిగిన పరిణామాన్నిబట్టి — సైద్ధాంతికమైన "సాంఘికశాస్త్ర" దృష్టికి పరిమితమైన స్థానంనుంచే మాట్లాడుతున్నామని మళ్లీ మరొకసారి మనం చెప్పాల్సి వుంది — రెండవ మూడేళ్లకాలం ప్రాధాన్యత వహిస్తూంది. రాజ్యాంగయంత్రవ్యవస్థలో చెప్పదగినంతటి మార్పేదీ ఈకాలంలో జరగలేదు. అంతకు ముందరి మూడేళ్లకాలంలో ఏ యే "రంగాల" లోనైతే కార్యాచరణక్రియలు మొలకలెత్తి అభివృద్ధి చెందాయో, అట్టిరంగాలలోని చాలా వాటిలో, వర్గాలచే వివిధ రూపాల్లో జరపబడిన బహిరంగ చర్యలేవీ ఈ కాలంలో ఇంచుమించు జరగ లేదు.

ఇదివరకు రెండు కాలాలకూ వున్న సారూప్యత ఎందులో వుందంటే, ఈ రెండు కాలాల్లోనూ రష్యాయొక్క పరిణామం వెనుకటి విధాంగానే వుండి పోయింది, అనగా పెట్టు బడిదారీ విధాన పరిణామంగానే వుండిపోయింది. ఈ ఆర్థిక పరిణామానికీ అనేక ఫ్యూడల్, మధ్యయుగపు సంస్థల అస్తిత్వానికీ వున్న వైరుధ్యం యేవిధంగానూ తొలగింపబడక పోవడమే కాకుండా, వీటిలో కొన్ని సంస్థలు పాక్షికమైన బూర్జువా స్వభావాన్ని వహించిన కారణంగా ఈ వైరుధ్యం తొలగిపోవడం బదులు మరింత ఉధృతమై అలాగే స్థిరపడిపోయింది.

ఈ రెండు దశలకూ వున్న భేదం అంతా ఎక్కడ ఉందీ అంటే, మొదటి దశలో, పైన పేర్కొనబడినట్టి అతి త్వరితంగానూ అతి అసమాన గతితోనూ జరిగిన మార్పుల యొక్క ఫలితాలు అచ్చంగా ఏలాగుంటాయి? — అనే ప్రశ్నే చరిత్రను నిర్మించే ప్రధాన పాత్రను వహించింది. రష్యాలోని పరిణామస్వభావం పెట్టుబడిదారీ విధానపు స్వభావాన్నే కలిగి వుండడం కారణంగా, ఈ మార్పులయొక్క పర్యవసానం తప్పనిసరిగా బూర్జువా స్వభావాన్నే కలిగి వుండడం తథ్యం. ఐతే మాత్రం బూర్జువావర్గమూ వుంది, బూర్జువావర్గమూ వుంది. కాస్తోకుస్తో మితవాద ఉదారతత్వాన్ని [మోడరేట్ లిబరలిజం] బహిరంగంగా అంగీకరించిన మధ్యతరగతి, ధనికతరగతుల బూర్జువావర్గం, తన వర్గపరిస్థితుల ననుసరించి హఠాత్తుగా జరిగిన ఏ మార్పులన్నా కూడా భయపడిపోయి, వ్యవసాయసంబంధమైన వ్యవస్థలోనూ, ఈ వ్యవస్థ ప్రాతిపదికపై నిర్మించబడిన రాజకీయ "పైకట్టడం" లోనూ, నిలిచివున్న పురాతన సంస్థల గణనీయమైన అవశేషాలను ఇంకా నిలబెట్టుకోవడానికే ప్రయత్నించింది. దీనికి విభిన్నమైనట్టి సంస్కరణాలను — మధ్యయుగపు అవశేషాలకు బహుస్వల్ప ఆస్కారం ఇచ్చే సంస్కరణలను — "తమ రెక్కల కష్టంవల్లనే జీవనాన్ని జరుపుకొనే" రైతాంగంతో పెనవేసుకొనిపోయిన గ్రామీణ పెట్టీబూర్జువావర్గం విధిగా వాంఛించేది. తమ చుట్టు పక్కల జరుగుతూన్న పరిస్థితులను గ్రహించుకొనగలిగే చైతన్యాన్ని కలిగివున్నంత మేరకూ, కూలినాలి చేసుకుని జీవించే శ్రామికులు, బూర్జువా వ్యవస్థయొక్క నిర్మాణపరిధుల్లోనే ఉని కిని కలిగి వుండినప్పటికీ, ఆ వ్యవస్థలోనే పూర్తిగా విభిన్న రూపాలనూ పూర్తిగా విభిన్న పరి ణామవేగాన్నీ పూర్తిగా విభిన్న స్థాయిలలో వున్న అభ్యుదయకరములైన ప్రభావాలను ప్రతి బింబిస్తూన్న ఈ రెండు ధోరణుల మధ్యనూ జరుగుతూన్న సంఘర్షణపట్ల, తాము ఏ వైఖ రిని అవలంబించవలసి వుంటుందో తమంతటతామే వారు నిర్ణయించుకోవడం సహజమే.

ఈ విధంగా, గత మూడు సంవత్సరాల కాలమూ ఎత్తుగడల సమస్యలు అని చెప్పబడే మార్క్సిజంయొక్క సమస్యలను కాకతాళీయంగా కాకుండా ఆవశ్యకంగానే ముందుకు తీసుకు వచ్చింది. ఈ సమస్యలపైన సంభవించిన వివాదాలూ విభేదాలూ "మేధావులలో" జరిగిన తగాదాలేననీ, "అపరిపక్వ దశలో వున్న శ్రామికవర్గంపైన పలుకుబడిని సంపాదించడానికోసం

జరిగిన పోరాటం'' అనీ, ''శ్రామికవర్గానికి అనుగుణ్యంగా మేధావులు అవలంబించే అనువర్తనలకు అవి చిహ్నాలనీ,'' రకరకాల ''వేహిస్టులు'' అనుకుంటూన్నట్టి, అభిప్రాయమంతటి పొరపాటు అదే కాని మరొకటి లేదు. తత్ భిన్నంగా ఈ వర్గం పరిపక్వదశను అందుకొన్న నిశిత కారణంవల్లనే యావత్తు రష్యను బూర్జువావర్గ పరిణామంలోనూ ఏర్పడిన ఈ రెండు విభిన్నధోరణుల మధ్యనూ వున్న సంఘర్షణపట్ల ఉదాసీనతను వహించడానికి ఈ వర్గానికి వీలుపడింది కాదు; తత్ఫలితంగా ఈ వర్గంయొక్క సిద్ధాంతకర్తలకు ఈ విభిన్నధోరణులకు (ప్రత్యక్షంగానో పరోక్షంగానో, సవ్యమైన లేక పరావర్తితమైన ప్రతిబింబంలోనో) అనువర్తించేటట్టి సైద్ధాంతిక సూత్రీకరణాలను చేయక తప్పింది కాదు.

రెండో మూడేళ్లకాలంలో, రష్యాలో బూర్జువా పరిణామాభివృద్ధిలోని విరుద్ధధోరణుల మధ్యనున్న సంఘర్షణ ప్రధానపాత్రను వహించనే లేదు; ఈ రెండు ధోరణులనూ కూడా రాజకీయ ''జ్వాబి''[121] అణగదొక్కేసి, వెనక్కితరిమేసి, తాత్కాలికంగా నోరు నొక్కేశాయి. ఈ మధ్యయుగపు జ్వాబి రాజకీయాల్లో ఉత్తర రంగాన్ని ఆక్రమించు కోవడమేకాకుండా, బూర్జువా సమాజంయొక్క అత్యంత విస్తృతభాగాల్లో వేహిస్టు అభిప్రాయాలను ప్రచారంచేసి నిరాశనూ, స్వాభిప్రాయాలను పరిత్యజించి క్షమాపణను అర్థించే భావాన్నీ నెలకొల్పాయి. ఆనాడు బైటపడినది పాతకాలపు సామాజిక వ్యవస్థను సంస్కరించేందుకు బయలుదేరిన రెండువిధానాలయొక్క పరస్పర సంఘర్షణ కాదు; ఎట్టి సంస్కరణలపట్లనూ విశ్వాసాన్ని కోల్పోవడమూ, ''నమ్రతనూ,'' ''పశ్చాత్తాపాన్నీ'' ప్రదర్శించడమూ, సంఘవ్యతిరేక సిద్ధాంతాలపైన మితిమీరిన మోజు చూపడమూ, నిగూఢవాదం పైన వెర్రిభ్రాంతిని కనపర్చడమూ, ఇలాంటివే ఆనాడు బైటపడ్డాయి.

కాగా ఆశ్చర్యకరమైన ఈ హఠాత్తుమార్పు యాదృచ్ఛికంగా వచ్చినదీ కాదు, కేవలం ''బాహ్యంనుండి'' కలిగిన ఒత్తిడివల్ల సంభవించిన ఫలితమూ కాదు. తరతరాలనుండి శతాబ్దాలనుండి ఆనాటివరకూ రాజకీయసమస్యలతో ఎట్టిప్రమేయమూ లేకుండా దూరంగా వుండి, రాజకీయ సమస్యలతో పరిచయంలేని ప్రజావర్గాలను గత మూడేళ్లకాలం ఎంత ప్రగాఢంగా కదర్చివేశాయంటే, ''అన్ని విలువలనూ పునః విలువకట్టాల్సింది'' అనే వాంఛ, మౌలికములైన సమస్యలన్నింటినీ నూతనంగా అధ్యయనం చేద్దామనే ఇచ్ఛ, సిద్ధాంతంలోనూ మూలవిషయాల్లోనూ మూలసూత్రాలతో ప్రారంభించే అధ్యయనంలోనూ ఒక నూతనాసక్తి ఈ ప్రజావర్గాలలో సహజంగానూ అనివార్యంగానూ తలయెత్తింది. ఇన్నాళ్లుగా దీర్ఘనిద్రలో మునిగి వున్న కోటానుకోట్ల ప్రజలు తమ నిద్రనుండి ఒక్కుమ్మడి మేల్కొని, అత్యంత ప్రాముఖ్యమైన సమస్యలు తమను ఎదుర్కోవడాన్ని చూసి ఈ స్థాయిలోనే అట్టేకాలం వుండలేకపోయారు; ఎట్టి విశ్రాంతిగాని ఎట్టి ఎడతెరపిగాని లేకుండా తమ మనుగడను సాగించు

కోలేకపోయారు; మౌలికములైన ప్రశ్నలను పునః ప్రశ్నించకుండా, అనన్య సామాన్యమైనట్టి బలవర్ధకమైన గుణపాఠాలను ''జీర్ణించుకోవడానికి'' సహాయపడి, తత్ఫలితంగా మునుపటి కంటె అసదృశమైన విస్తృతపరిధులలోని ప్రజారాసులు వెనుకటికంటెనూ మరింత దృఢ చిత్తంతోనూ చైతన్యవంతంగానూ మరింత ఏకాగ్రచిత్తతతోనూ మరింత పట్టుదలతోనూ ముందుకు సాగిపోవడానికి వీలును కలిగించే ఒక కొత్తరకమైన తర్ఫీదును పొందకుండా, అట్టే కాలం వుండలేకపోయారు.

చారిత్రక పరిణామక్రమంయొక్క గతితార్కికం ఎలా వుండెనంటే, దేశంయొక్క జీవితంలోని ప్రతిరంగంలోనూ తక్షణ సంస్కరణలను సాధించడమే, మొదటి మూడేళ్ల కాలపు కర్తవ్యాలలో ప్రధానస్థానం వహించింది; ఇక రెండో మూడేళ్లకాలంలో, వెనుకటి అనుభవాన్ని అవగాహన చేసుకోవడమూ, ఈ అనుభవాన్ని జనసామాన్యంలోని విస్తృతశ్రేణులు వొంటపట్టించుకోవడమూ, వివిధవర్గాలలో వెనకబడివున్న తరగతుల్లోకి, ఒక విధంగా చెప్పాల్సివస్తే, నేల అడుగుపొరల్లోకి, ఈ అనుభవం ఇంకేటట్టు చూడడమూ, కర్తవ్యాలలో ప్రధానస్థానం వహించాయి.

మార్క్సిజం నిర్జీవమైన పిడి సూత్రమూ, సంపూర్ణమైనట్టి, పరిణతి చెందినట్టి, అన్నిహంగులతో సిద్ధంగా తయారుచేసినట్టి, మార్పుచెందన్నట్టి సిద్ధాంతం కాకపోవడమే కాకుండా, అందుకు బదులు, కార్యాచరణకు దారిచూపే సజీవమైన మార్గదర్శి అయిన కారణంవల్లనే, అచ్చంగా ఈ కారణంవల్లనే, సాంఘికజీవిత పరిస్థితుల్లో ఆనాడు ఆకస్మికంగా సంభవించిన మార్పులను తప్పనిసరిగా అది ప్రతిబింబించవలసి వచ్చింది. మార్క్సిజంలో ఆనాటి తీవ్రమైన విచ్ఛిత్తీ అనైక్యతలూ అన్నిరకాల ఊగిసలాటలూ, ఒక్క మాటలో చెప్పాలంటే మార్క్సిజంలో ఆనాడు ఏర్పడిన అతితీవ్రమైన ఆంతరంగిక సంక్షోభమే, ఈ మార్పుయొక్క ప్రతిబింబం. ఈ విచ్ఛిత్తిని దృఢనిశ్చయంతో ఎదుర్కొనవలసిన అవసరమూ, మార్క్సిజం పునాదులను కాపాడడానికి దృఢనిశ్చయంతోనూ పట్టుదలతోనూ పోరాటాన్ని సాగించవలసిన ఆవశ్యకతా, ఇవే తక్షణకర్తవ్యాలుగా పరిణమించాయి. అంతకు ముందటి మూడేళ్ల కాలంలోనూ, తమ లక్ష్యాలను సూత్రీకరించడంలో మార్క్సిజాన్ని విధిగా అన్వయించి తీరవలసిన వర్గాలకు చెందిన అతి విస్తృతశ్రేణులు కొన్ని ''నినాదాలనూ,'' ఎత్తుగడ సమస్యలకు చెందిన కొన్ని సమాధానాలనూ, ఈ సమాధానాలకు అవసరమైన మార్క్సిస్టు నిర్ణయ ప్రమాణాలనూ అర్థంచేసుకోకుండానే రోకలిపాటలాగు కంఠస్థంచేసుకొని, మార్క్సిజాన్ని ఒక పక్కకు ఒరిగిపోయినట్టి వికలాంగస్వరూప విధానంలో ఆకళింపుచేసుకున్నాయి. సాంఘిక జీవితంలో వున్న వివిధరంగాలన్నింటిలోని ''అన్ని విలువలనూ పునః విలువకట్టాల్సింది'' అనే ధోరణి మార్క్సిజంయొక్క అత్యంత నిరుపాధికములైనట్టి, అత్యంత సాధారణములైనట్టి,

తాత్విక పునాదులను ''తిరుగతోడడానికి'' దారితీసింది. బహువిధ భావవాదచ్ఛాయలతో చలామణీ అవుతూన్న బూర్జువా తత్వశాస్త్రంయొక్క ప్రభావం, ఆనాడు మార్క్సిస్టులలో విజృంభించిన మాఖియన్ జాడ్యరూపంలో ప్రత్యక్షమైంది. అర్థంచేసుకోకుండా ఆలోచనారహితంగా రోకలిపాటలాగు కంఠపాఠంచేసి నేర్చుకున్న ''నినాదాల'' పునశ్చరణ, అతివిస్తృతంగా వ్యాపించిన శుష్కపదజాల ప్రచారానికి దారితీసింది. తీరా ఆచరణ రంగంలోకి వచ్చేసరికల్లా, మార్క్సిజం అని సుతరామూ ఎన్నడూ అనిపించుకోదగని, పెట్టీబూర్జువా ధోరణులతో — ఎట్టి దాపరికమూ లేకుండా సిగ్గులేని ''ఒట్జొవీజం'' తోనూ,[122] లేదా ఒట్జొవీజం కూడా మార్క్సిజంయొక్క ''న్యాయమైన ఛాయే'' అనే ఒప్పుకోలుతోనూ — ఇది సమానమైంది.

దీనితోపాటుగా, ఇక రెండోవైపున, బూర్జువావర్గపు విస్తృతశ్రేణులను లోబరుచేసుకుని, తమవి తప్పు అభిప్రాయాలని క్షమాపణచెప్పుకొనే వేహిస్టుతత్వం, మార్క్సిస్టు సిద్ధాంతాన్నీ ఆచరణనూ ''మితవాద, యథార్థ'' మార్గాలకే పరిమితం చెయ్యడానికి యత్నించే పంథాలోకి కూడా చొచ్చుకొనిపోయింది. ఇక మార్క్సిజంలో ఇక్కడ మిగిలినదల్లా, ''సశ్రేణీ సంఘటిత నిర్మాణం'' [''హీరార్కీ''], ''ఆధిపత్యం'' [''హెజిమోనీ''] వగైరాల గురించి పూర్తిగా లిబరలిజం భావంతో సంతృప్తమైన వాదనల కోసం అలంకారంగా ఉపయోగించ బడిన పదజాలం ఒక్కటే.

ఈ వ్యాసంయొక్క ఉద్దేశం ఈ వాదనలను పరిశీలించడం కాదని వేరే చెప్పనవసరం లేదు. ప్రస్తుతకాలంలో మార్క్సిజం ఎదుర్కొంటున్న సంక్షోభంయొక్క తీవ్రతను గురించి, ప్రస్తుతకాలపు సాంఘిక, ఆర్థిక పరిస్థితి అంతటితోనూ ఈ సంక్షోభానికుండే సంబంధాన్ని గురించి పైన వివరించినదానికి తార్కాణంగా చూపడానికి, వాటిని అంతమాత్రం సూచిస్తే సరిపోతుంది. ఈ సంక్షోభంవల్ల ఉత్పన్నమవుతూన్న సమస్యలను తేలికగా తోసిపారేయడానికి ఎంతమాత్రమూ వీలులేదు. పదజాలాన్ని కురిపించేసి అంతమాత్రంతో వాటికి స్వస్తిచెప్ప ప్రయత్నించడమంతటి హానికరమైనదీ నీతిబాహ్యమైనదీ మరొకటి లేదు. మార్క్సిజం యొక్క ''సహప్రయాణికులు'' అనేకులలో బూర్జువా ప్రభావం వ్యాపించడం ఫలితంగా, ఒక దానితో ఒకటి శుద్ధవిరుద్ధంగా వున్న దిశలనుండి కల్పించబడుతూన్నట్టి వికృతార్థాల నుండి మార్క్సిజంయొక్క సైద్ధాంతిక పునాదులనూ, దాని మూలసూత్రాలనూ కాపాడడానికిగాను ఈ సంక్షోభంయొక్క తీవ్రతనూ దానిని ప్రతిఘటించవలసిన ఆవశ్యకతనూ గ్రహించిన అందరి మార్క్సిస్టులను సమీకృతం చేయడంకంటెనూ మించిన ప్రధానకర్తవ్యం మరొకటి లేదు.

వాస్తవమైన పద్ధతిలో మార్క్సిజంతో తొలిసారిగా పరిచయం కలుగజేసుకుంటూన్న విస్తృతశ్రేణులను, అనేక దృష్టాంతాల్లో చైతన్యవంతంగా సాంఘికజీవితంలో పాల్గొనేటట్టుగా

గత మూడు సంవత్సరాలూ వారిని మేల్కొలిపాయి. ఈ సందర్భంలో బూర్జువా పత్రికలు వెనకెప్పుడూ లేనంతటి ఆభాసములైన అభిప్రాయాలను సృష్టించుతూ, వాటిని వెనకటి కంటె మరింత విస్తృతంగా ప్రచారంచేస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో మార్క్సిస్టులయొక్క శ్రేణులు విచ్ఛిన్నంకావడం ప్రత్యేకంగా ప్రమాదభరితమైన విషయం. అందుచేత, యుగ కర్తవ్యం అనే పదంయొక్క ప్రత్యక్ష నిశితార్థాలలో, ఈ సమయంలో విధిగా సంభవించి తీర వలసిన ఈ విచ్ఛిన్నానికిగల కారణాలను ఆకళింపు చేసుకోవడమూ, ఈ విచ్ఛిన్నాన్ని ప్రతి ఘటించేందుకు నిరంతరాయమైన పోరాటాన్ని సాగించడానికి తమ శ్రేణులను కట్టుదిట్టం చేసుకోవడమూ మార్క్సిస్టుల యుగకర్తవ్యం.

డిసెంబరు 1910.

# రష్యన్ సోషల్-డెమొక్రసీలో రిఫార్మిజం

ఇటీవలి దశాబ్దులలో పెట్టుబడిదారీ విధానంయొక్క బ్రహ్మాండమైన ప్రగతి, అన్ని నాగరిక దేశాలలోనూ కార్మికవర్గ ఉద్యమం యొక్క చురుకైన పెరుగుదల, శ్రామికవర్గం పట్ల బూర్జువావర్గ వైఖరిలో పెద్ద మార్పును తీసుకువచ్చాయి. ప్రైవేటు ఆస్తియొక్క సంపూర్ణ అలంఘనీయత పేరిటనూ స్వేచ్ఛాయుతమైన పోటీ పేరిటనూ సోషలిజంయొక్క అన్ని మౌలిక ప్రమేయాలతో బహిరంగంగానూ సూత్రప్రాయంగానూ సూటిగానూ పోరాడడం బదులు, ఇంగ్లండు అమెరికాలలోని బూర్జువావర్గం — దానికి ప్రాతినిధ్యం వహించుతూన్న భావశాస్త్రవేత్తల, రాజకీయవేత్తలద్వారా సామాజిక విప్లవ భావానికి వ్యతిరేకంగా — సామాజిక సంస్కరణలు అని పిలువబడుతూన్నవాటి రక్షణార్థం అంతకంతకు మరింతగా బయటికి వస్తూంది. లిబరలిజానికి ప్రతికక్షి సోషలిజం అని కాకుండా, సోషలిస్టు విప్లవానికి ప్రతికక్షి రిఫార్మిజం — ఇదీ ఆధునిక, "పురోగామి," విద్యావంతమైన బూర్జువా వర్గంయొక్క సాంకేతికం. కాగా ఏదైనా ఫలానా దేశంలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి ఎంత ఉన్నతదశలో వుంటే, బూర్జువావర్గ పాలన ఎంత శుద్ధమైన బూర్జువావర్గ స్వభావం కల్గివుంటే రాజకీయ స్వేచ్ఛ ఎంత అధికంగా వుంటే, బూర్జువావర్గంయొక్క "అత్యధునాతన" నినాదం: సంస్కరణలకు ప్రతికక్షి విప్లవం; కార్మికవర్గాన్ని విభజించి బలహీనపరచేందుకుగానూ, బూర్జువావర్గ రాజ్యాధికారాన్ని నిలబెట్టేందుకుగానూ విచ్ఛిన్నమైపోతూన్న పరిపాలనా వ్యవస్థకు పాక్షికంగా అతుకులువేతకు ప్రతికక్షి ఈ రాజ్యాధికారాన్ని విప్లవకరంగా కూలదోయడం అనే నినాదం — యొక్క ప్రయుక్తరంగం అంత విశాలమవుతుంది.

సోషలిజం యొక్క ప్రపంచవ్యాపిత అభివృద్ధి దృక్స్థానం నుండి చూచినట్లయితే, పైన పేర్కొనబడిన మార్పు పెద్ద ముందంజగానే తప్ప అన్యథా భావించడానికి వీల్లేదు. మొట్టమొదట సోషలిజం తన అస్తిత్వానికై పోరాడింది, కాగా తన బలంలో ఆత్మవిశ్వాసం కలిగి వున్నట్టి, ఆర్థిక రాజకీయ దృక్పథాల సమ్యగ్ వ్యవస్థే లిబరలిజం అని ధైర్యంగానూ

సుసంగతంగానూ వాదించుతూండినట్టి బూర్జువావర్గం సోషలిజానికి అప్పుడు ముఖాముఖీ నిలబడింది. ఇప్పుడు సోషలిజం వృద్ధిచెంది తన అస్తిత్వానికి గల హక్కును నాగరిక ప్రపంచం అంతటియందూ అప్పుడే విజయవంతంగా సమర్థించుకుంది; ఇప్పుడు అది రాజ్యాధికారం కోసం పోరాడుతూంది; కాగా విచ్ఛిత్తి చెందుతూన్న బూర్జువావర్గం, తన చావుతప్పదని తెలుసుకుని, తన చావుదినాన్ని మరికాస్త ఆలస్యం చేసేందుకూ, పాక్షికమూ కపటమూ అయిన రాయితీల మూల్యానికి ప్రతిఫలంగా కొత్త పరిస్థితులకింద తన రాజ్యాధికారాన్ని నిలబెట్టుకునేందుకూ సర్వప్రయత్నాలూ చేస్తూంది.

విప్లవాత్మక సోషల్-డెమోక్రసీకీ రిఫార్మిజానికీ కార్మికవర్గ ఉద్యమం లోలోపలనే సాగించుతూన్న పోరాటం తీవ్రమవడము ప్రపంచంలోని అన్ని నాగరిక దేశాల యావత్తు ఆర్థిక, రాజకీయ పరిస్థితులలోని పైన పేర్కొనబడిన మార్పులయొక్క కేవలం అనివార్యమైన ఫలితమే. కార్మికవర్గ ఉద్యమాభివృద్ధి, ఒక నిర్దిష్ట సంఖ్యనుగల పెట్టీబూర్జువా మూలద్రవ్యాలను, బూర్జువా భవశాస్త్ర మంత్రబలానికి ముగ్ధములై దానిని వదలించుకుందుకు తంటాలుపడినప్పటికీ ఒకంతట వదలించుకొన జాలక తిరిగి దాని ప్రభావంలోనే నిరంతరమూ పడిపోతూన్నట్టి మూలద్రవ్యాలను, తప్పనిసరిగా ఆకర్షించుతూంటుంది. ఈ పోరాటం లేనిదే, ఈ విప్లవానికి పూర్వం సోషలిస్టు ''పర్వతం'', సోషలిస్టు ''జిరోండ్'',[123] మధ్యను సూత్రదృష్ట్యా వున్న సరిహద్దు రేఖను స్పష్టంగా నిర్ణయించనిదే అవకాశవాద, పెట్టీబూర్జువా మూలద్రవ్యాలతో ఈ విప్లవ కాలంలోని నూతన చారిత్రకశక్తియొక్క శ్రామికవర్గ, విప్లవాత్మక మూలద్రవ్యాలు సంపూర్ణంగా తెగతెంపులు చేసుకోనిదే శ్రామికవర్గ సామాజిక విప్లవం అనూహ్యమే అవుతుంది.

రష్యాలో అసలు పరిస్థితియొక్క సారంలో మార్పులేదు; అయితే యూరప్‌కంటె (అంతేకాదు, ఆసియాలోని పురోగామి భాగంకంటెనూ కూడా) మనం ఎంతో వెనకబడి వున్నాం, బూర్జువా విప్లవ శకంలోనే మనం ఇంకా వున్నాం, ఇక్కడ పరిస్థితి మాత్రం సంక్లిష్టమై, గూఢమై వుంటూంది. ఈ కారణం చేతనే, రష్యన్ రిఫార్మిజం ఒక ప్రత్యేకమైన మొండి స్వభావాన్నికల్గి విభేదించుతూంది; ఒక విధంగా చెప్పాలంటే మరింత వినాశకరమైన జాడ్యాన్ని అది ప్రదర్శిస్తూంది; శ్రామికవర్గ కార్యానికీ, విప్లవ కార్యానికీ మరింత హానికరమవుతూంది. మన దేశంలో రిఫార్మిజం ఒకే సమయంలో రెండు మూలధారాలనుండి వెలువడుతూంది. మొదటిది, పాశ్చాత్య యూరపియన్ దేశాలకంటెనూ రష్యా మరింత పెట్టీబూర్జువా దేశం; అందుచేతనే సోషలిజం పట్ల పెట్టీబూర్జువావర్గానికి సాధారణంగా స్వాభావికమైన పరస్పరవిరుద్ధ, అస్థిర, డోలాయమాన వైఖరిని (నిమిషంలో ''తీవ్రప్రణయం'', నిమిషంలో నిచాతినీచమైన ద్రోహం) ప్రముఖంగా కనబర్చేటట్టి వ్యక్తులూ గ్రూపులూ,

ధోరణులూ తరుచుగా మనకు కనబడుతూంటారు. రెండవది, మన బూర్జువా విప్లవం యొక్క దశలలో ఏ ఒక్క దశ అయినా సరే విఫలమవడంతో మన దేశంలోని పెట్టీబూర్జువా ప్రజారాసులు అత్యంత సులభంగా అత్యంతత్వరగా బేజారెత్తిపోయి, స్వపక్షపరిత్యాగ మనస్థితులకు దాసులైపోతారు; రష్యాను మధ్యయుగ, భూదాస్య వ్యవస్థల అవశేషాలన్నిటి నుండీ పూర్తిగా విముక్తి చేయబోయే సంపూర్ణ ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాలన్నిటినీ వదులుకోడానికి వీరు అత్యంత శీఘ్రంగా సిద్ధపడతారు.

మొదటి మూలాధారం గురించి మనం వివరంగా ప్రస్తావించ దల్చుకోలేదు. మన స్త్రూవెలూ, ఇజ్‌గోయెవ్‌లూ, కరవూలోవ్‌లూ వగైరా వగైరాలలాగానే అంత త్వరగా సోషలిజం పట్ల సానుభూతి నుండి విప్లవప్రతిఘాతక లిబరలిజం పట్ల సానుభూతి వైపు "తిరిగి పోవడ"మనే ఘటనలు ఇంత త్వరితగతిని సంభవించే దేశం ప్రపంచంలో మరేదీ లేదని చెబితే అక్కడకి చాలు. కాగా ఈ పెద్దమనుషులు మినహాయింపులూ కాదు, వ్యక్తిగతమైన ఉదాహరణలూ కాదు; విశాలవ్యాప్తి చెందిన ధోరణులకు ప్రతినిధులు వీరు! "మితిమీరిన" వాగ్వాదాలనూ, "సరిహద్దు నిర్ణయం చేయడమనే వ్యామోహమూ," వగైరాలను ఖండించుతూ నీతిబోధలు చేయడమంటే చెవికోసుకునే భావలాలసులు — ఇట్టివారు సోషల్-డెమోక్రసీ శ్రేణులకు బయట చాలామందే వున్నారు, అయితేనేమి సోషల్-డెమోక్రసీ శ్రేణులలో కూడా పెద్ద సంఖ్యలోనే వున్నారు — రష్యాలో సోషలిజం నుండి లిబరలిజానికి దాట్లు వేసేందుకు "మితిమీరిన" "వ్యమోహాన్ని" ప్రభవించేటట్టి చారిత్రక పరిస్థితులను అర్థం చేసుకోవడంలో సంపూర్ణమైన లోపాన్నే బయటపెట్టుకుంటున్నారు.

ఇక రష్యాలో రిఫార్మిజం రెండవ మూలాధారం వైపు మన దృష్టిని మరలించుదాం.

మన దేశంలో బూర్జువా విప్లవం ఇంకా పూర్తికాలేదు. దీని మరణశాసనం వల్ల తనకు సంక్రమించినట్టీ, ఆర్థికాభివృద్ధి యావత్తు బాహ్యగతాత్మక గమనమూ తనపై విధించినట్టీ కర్తవ్యాలను కొత్త రీతిలో నెరవేర్చడంకోసం నిరంకుశాధిపత్యం ప్రయత్నిస్తూంది; కాని ఈ కార్తవ్యాలను అది నెరవేర్చజాలదు. పాతకాలపు జార్ పరిపాలనా వ్యవస్థను వినూత్నంచేసి బూర్జువా రాజరికవ్యవస్థగా రూపొందించడమైతేనేమి, కులీనవంశస్థులనూ బూర్జువా వర్గపు ఉన్నత వ్యక్తులనూ జాతీయస్థాయిలో ఆర్గనైజు చేయడమైతేనేమి (మూడవ దూమ), అదీకాకుండా ఇంకా జేమ్‌స్కీ అధికారి[124] ద్వారా బూర్జువావర్గంయొక్క వ్యవసాయ సంబంధమైన విధానాన్ని అమలు జరిపించడమైతేనేమి — ఈ "తీవ్ర"చర్యలు తనకింకా మిగిలిపోయిన తుది రంగంలో పెట్టుబడిదారీ అభివృద్ధితో సరిపుచ్చుకునే రంగంలో — జార్ పరిపాలనా వ్యవస్థయొక్క ఈ "తుది" యత్నాలు ఇవేవీ కూడా సమర్థవంతం కాజాలవు. అదిక పనిచేయలేదు, అంతే! ఇటువంటి చర్యలవల్ల "వినూత్నం చేయబడిన" రష్యా

దేశం జపానువాళ్ల అందుకోగల్గడం దుస్సాధ్యం; బహుశా చైనాకంటే వెనకపడిపోవడం ఆరంభమైందేమో కూడానూ. బూర్జువా-డెమోక్రాటిక్ కర్తవ్యాలు నెరవేర్చబడకపోవడం కారణంగా, విప్లవ సంక్షోభం మిగిలిపోవడం అనివార్యమవుతుంది. తిరిగి అది పక్కానికి వస్తూంది, సరాసరి దాని దిశగానే మనం మళ్ళీ మరొకసారి వెళ్తున్నాం — వెనకటి వంటిది కాకుండా మరొక కొత్త రీతిలో, వెనకటి నడకతో కాకుండా, కేవలం వెనకటి రూపాలనే అనుసరించకుండా కాని, సరాసరి దాని దిశగానే మనం వెళ్తూండడం మాత్రం నిర్వివాదం.

పరిస్థితులు ఇలా వున్నప్పుడు, శ్రామికవర్గ కర్తవ్యాలు పూర్తిగానూ, నిస్సందేహమైన స్పష్టతతోనూ ప్రత్యక్షంగా కనబడుతూనే వున్నాయి. సమకాలిక సమాజంలోని సుసంగతమైన విప్లవాత్మకవర్గం అది ఒక్కటే అవడం చేత సంపూర్ణ ప్రజాస్వామిక విప్లవం కొరకు యావత్ ప్రజల పోరాటంలోనూ, పీడకులకూ హింసాపరులకూ వ్యతిరేకంగా యావన్మంది శ్రామిక, పీడిత ప్రజల పోరాటంలోనూ అదే నాయకమణి అయి, అదే అధిపతి అవాలి. ఆధిపత్యం వహించడమనే భావాన్ని అది చైతన్యవంతంగా గుర్తించి, దీనిని నెరవేర్చే మేరకు శ్రామిక వర్గం విప్లవాత్మకంగా వుంటుంది. ఈ కర్తవ్యాన్ని గుర్తించే చైతన్యంకల్గిన శ్రామికుడు బానిసతనంపై తిరగబడేందుకు లేచిన బానిస. తన వర్గంయొక్క ఆధిపత్యం అనే భావంపట్ల చైతన్యం లేనట్టీ, లేదా ఈ భావాన్ని పరిత్యజించినట్టీ శ్రామికుడు బానిసే; ఎంత ఉత్తమ పక్షంలో చూచినప్పటికీ, అతడు తన బానిసస్థితిని మెరుగు పరచుకుందుకు పోరాడే బానిసే కాని బానిసవ్యవస్థను కూలదోయడానికి పోరాడే బానిస మాత్రం కాదు.

రష్యన్ సోషల్-డెమోక్రసీ ఒక "ఆధిపత్యం కాదు, కాని ఒక వర్గ పార్టీ"గా వుండాలి అని మన యువనాయకులలో ఒకడైనట్టీ, "నాష జార్య"* పత్రికకు చెందినట్టీ మిస్టర్ లెవీట్స్కి ఉద్ఘాటించిన సాంకేతికం, అత్యంత సుసంగతమైన రిఫార్మిస్టు సాంకేతికమే. అంతేకాదు, కుళ్ళుకంపు కొడుతూన్న స్వపక్షపరిత్యాగపు సాంకేతికం. "ఆధిపత్యం కాదు, కాని ఒక వర్గ పార్టీ"యే అని ఒక వ్యక్తి చెప్పినప్పుడు ఆ వ్యక్తి బూర్జువావర్గ వైఖరినే, "బానిసగానే నీ పరిస్థితిని మెరుగు పరచుకునేందుకు పోరాడు, అంతేకాని బానిసవ్యవస్థను కూలదోయడమనే తలంపు మాత్రం వినాశకరమైన ఊహాజగత్తు అని భావించుకో సుమా!" అని ఈనాటి మన శకపు బానిస అయిన వేతనపు కార్మికునితో చెప్పే లిబరల్ వైఖరినే అవలంబించుతున్నాడని అర్థం. బెర్న్‌స్టయిన్ సుప్రసిద్ధ సాంకేతికాన్ని — "ఉద్యమమే సర్వమూ, అంతిమ లక్ష్యంలో ఏమీ లేదు" — లెవీట్స్కి సాంకేతికంతో మీరు సరిపోల్చి చూస్తే, ఒకే భావం యొక్క వివిధ స్వరూపాలే ఈ రెండూ అని మీరు తెలుసుకుంటారు. రెండూ కూడా సంస్కరణలను మాత్రమే

---

* మన ఉషారాగం" — అనువాదకుడు.

గుర్తించుతాయి, విప్లవాన్ని పరిత్యజించుతాయి. సోషలిస్టు విప్లవం (= బూర్జువా సమాజపు పార్టీగా సోషల్-డెమొక్రసీయొక్క అంతిమ లక్ష్యం) అంటూ ఒక దానిని గుర్తించడం కారణంగా బెర్న్‌స్టయిన్ సాంకేతికం రెండవదానికంటె మరింత విశాలమైనది. లెవీత్స్‌కి సాంకేతికం మరింత సంకుచితమైనది: ఎందుచేతంటే, సాధారణంగా అది విప్లవాన్ని పరిత్యజించుతూనే 1905–1907 లో అన్నిటికంటె అధికంగా లిబరల్స్‌కు ఉడుకుబోతుతనం కల్గించినట్టి వాస్తవవిషయాన్ని అదేమిటంటే: సంపూర్ణమైన ప్రజాస్వామిక విప్లవం కోసం జరిగిన పోరాటంలో, ప్రజారాసుల (మరీ ముఖ్యంగా రైతాంగపు) నాయకత్వాన్ని లిబరల్స్ నుండి శ్రామిక వర్గం లాగేసుకుందన్న వాస్తవవిషయాన్ని — పరిత్యజించడమే దీని ఉద్దేశ్యం.

కార్మికులకు కావలసినది "ఆధిపత్యం కాదు, కాని వర్గ పార్టీ" అని వారికి ఉద్బోధించడమంటే, దాని అర్థం శ్రామికవర్గ కార్యానికి ద్రోహంచేసి దానిని లిబరల్స్ చేతుల్లో వదలిపెట్టడమే; దాని అర్థం సోషల్-డెమొక్రాటిక్ కార్మిక విధానం స్థానే లిబరల్ కార్మిక విధానం నెలకొల్పడమే.

ఆధిపత్యభావ పరిత్యాగం రష్యన్ సోషల్-డెమొక్రసీలో రిఫార్మిజంయొక్క మోటు రకాలన్నిటిలోనూ మోటు రకం కాబట్టే ఇంత నిష్కర్షమైన మాటల్లో తమ భావాన్ని వ్యక్తపరచడానికి లిక్విడేటర్లలో[125] అందరకూ సాహసం చాలదు. వారిలో కొందరు (ఉదాహరణకు, మిస్టర్ మార్తొవ్) సత్యాన్నే అపహాస్యం చేస్తూ, ఆధిపత్య పరిత్యాగానికీ లిక్విడేషనిజానికీ వున్న సంబంధాన్ని కూడా కాదనేందుకు సహితమూ ప్రయత్నిస్తున్నారు.

రిఫార్మిస్టు భావాలను "రుజువు చేసుకోవడానికి" ఇంతకంటే "సూక్ష్మమైన" యత్నం ఇదిగో ఈ వాదం: రష్యాలో బూర్జువా విప్లవం పూర్తి అయిపోయింది; 1905 తరువాత రెండవ బూర్జువా విప్లవం, ప్రజాస్వామిక విప్లవంకోసం రెండవ జాతివ్యాపిత పోరాటం అంటూ వుండడానికి వీల్లేదు; కాబట్టి రష్యాను ఎదుర్కొంటూన్నది విప్లవాత్మక సంక్షోభం కాదు, "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభమే, అందుచేత ఆ "రాజ్యాంగబద్ధమైన సంక్షోభం" ప్రాతిపదికపైనే తన హక్కులనూ ప్రయోజనాలనూ కాపాడుకోవలసిన కార్యం ఒక్కటే కార్మిక వర్గానికి ఇప్పుడు మిగిలింది. లిక్విడేటర్ వై. లారిన్ "దేలో జీజ్ని"* పత్రికలో (ఇంతకుముందే "వొజ్‌రొజ్‌దేనియె"** పత్రికలో కూడా) వివరించిన వాదన ఇదే.

మిస్టర్ లారిన్ ఇలా రాశాడు: "1905 అక్టోబరు నేటి కార్యక్రమావళిలో లేదు. దూమ గనుక రద్దు చేయబడిందంటే, విప్లవానంతర ఆస్ట్రియా రాజ్యాంగాన్ని 1851 లో

* "జీవిత కార్యం" — అనువాదకుడు.

** "పునరుజ్జీవనం" — అనువాదకుడు.

రద్దుచేసి, తన ఆర్థికవ్యవస్థను పెట్టుబడిదారీ విధాన ప్రాతిపదికపై పునర్వ్యవస్థీకరించు కున్నట్టి పాలకవర్గాలలోని విభాగాలన్నిటిలోనూ అత్యంత పలుకుబడి కలిగిన విభాగాల ప్రయో జనాలకు అనుగుణ్యంగా వుండినదనే కేవల కారణంచేతనే, తొమ్మిదేళ్ల తరువాత ఏ విప్ల వమూ లేకుండానే (దీన్ని గమనించండి!) 1860 లో మళ్లీ గుర్తించి పునస్థాపితమైన రాజ్యాంగంకంటె మరింత త్వరగానే ఇది పునస్థాపితం చేయబడుతుంది." "1905 లాంటి జాతివ్యాపిత విప్లవోద్యమం మనమిప్పుడున్న దశలో అసాధ్యం."

మిస్టర్ లారిన్ చేసిన ఈ వాదనలన్నీ, 1908 డిసెంబరులో ఆర్. ఎస్. డి. ఎల్.పి కాన్ఫరెన్స్‌లో మిస్టర్ దాన్ చెప్పిన మాటలనే మళ్లీ సాగతీసి చెప్పడం కంటె మరేమీ లేదు. "1905 విప్లవాన్ని ప్రభావితం చేసినట్టి ఆర్థిక, రాజకీయ జీవితంలోని మౌలిక అంశాలు ఇంకా పనిచేస్తూనే వున్నాయి" అనీ, ఇప్పుడు అభివృద్ధి చెందుతూన్నట్టి కొత్త సంక్షోభం విప్లవాత్మకమైనదే, కాని "రాజ్యాంగబద్ధమైనది" కాదనీ ఉద్ఘాటించిన తీర్మానానికి వ్యతి రేకంగా వాదిస్తూ, లిక్విడేటర్ల పత్రిక "గోలోస్" సంపాదకుడు: "ఇదివరకొకసారి వాళ్లు" (అనగా ఆర్. ఎస్. డి. ఎల్.పి) "ఎక్కడైతే ఓటమి పొందారో, మళ్ళీ అక్కడికే చొరబడాలని వాళ్లు కోరుకుంటున్నారు" అని తన ఆశ్చర్యం తెలిపాడు.

విప్లవాభిముఖంగా "చొరబడడం," అలసట లేకుండా కృషి చేయడం, కాగా కొత్త పరిస్థితుల్లో విప్లవమనే భావాన్ని ప్రచారంచేసి, దానికోసమే కార్మికవర్గ శక్తులను సన్నద్ధం చేయడం — ఇదీ ఆర్.ఎస్.డి.ఎల్.పి చేస్తూన్న మహాపరాధం, ఇందులోనే వుంది రిఫార్మిస్టుల దృష్టిలో విప్లవకర శ్రామికవర్గం చేసిన నేరం. "ఇదివరకొక సారి ఎక్కడైతే ఓటమి పొందారో మళ్ళీ అక్కడికే చొరబడడం"లో ఏమీ ప్రయోజనం లేదు — ఇదీ స్వపక్షపరిత్యా గుల యొక్క, ఎట్టి ఓటమి తరువాతనైనా సరే ధైర్యం కోల్పోయేవారియొక్క వివేకం.

కాని రష్యా కంటెనూ పురాతనమైనట్టి, మరింత "అనుభవం" కలిగినట్టి దేశాల లోని విప్లవాత్మక శ్రామికవర్గం, మళ్ళీ రెండుసార్లు, మూడుసార్లు, నాల్గుసార్లు "ఇదివరకు తాను ఓటమి చెందిన చోటకే చొరబడగల్గింది," 1789 నుండి 1871 వరకూ (ఫ్రాన్సులో లాగున), అత్యంత తీవ్రమైన అపజయాలను పొందినప్పటికీ, మరొకసారి ఇంకా మరొక సారి లేస్తూ — ఏ రిపబ్లిక్కులోనైతే తానిప్పుడు తన కడపటి శత్రువును — పురోగామి బూర్జువా వర్గాన్ని — ఎదుర్కొంటూందో, సోషలిజం విజయం కొరకు అంతిమ పోరాటానికి అవసర మైన పరిస్థితులకు అనుగుణమైన ఏకైక ప్రభుత్వరూపమైనట్టి రిపబ్లిక్కును సంపాదించు కుని, నాలుగు సార్లు విప్లవాన్ని సాధించగల్గింది.

ఇదీ సోషలిస్టులకూ, లిబరల్సుకూ, అనగా బూర్జువావర్గ అనుచరులకూ, వున్న తేడా. విప్లవం అనివార్యమనీ, ఒక కొత్త విప్లవాత్మక పోరాటం కొరకు తయారయేందుకూ,

మరింత విశాలరంగంలో జనం మరింత ఉన్నతాభివృద్ధి పొందిన షరతుపైన విప్లవాన్ని తిరిగి ప్రారంభించేందుకూ సమాజం యొక్క జీవితంలోని అన్ని వైరుధ్యాలనూ, తన శత్రువులలో వున్నట్టి, లేదా మధ్యస్తరములలో వున్నట్టి ప్రతి ఒక్క బలహీనతను శ్రామికవర్గం ఉపయోగించుకోవాలనీ సోషలిస్టులు ఉద్బోధించుతారు. విప్లవాలు అనవసరమనీ, కార్మికులకు హానికరములు కూడా అనీ, విప్లవంవైపు వారు ''పొరబడ'' కూడదనీ, అందుకు బదులు బుద్ధిమంతులైన చిన్నకుర్రాళ్లల్లాగు, సంస్కరణల కొరకు నిరాడంబరంగా కృషిచెయ్యాలనీ, బూర్జువాలూ లిబరల్సూ ఉద్బోధిస్తారు.

అందుచేతనే రష్యన్ కార్మికుడిని సోషలిజం నుండి మళ్ళించేందుకనే బూర్జువా భావాలకు దాసులైన రిఫార్మిస్టులు 1860 లనాటి ఆస్ట్రియానే (జర్మనీ యొక్క కూడా) ఉదాహరణగా నిరంతరమూ చూపుతూంటారు. అచ్చంగా ఈ ఉదాహరణలనే వారు అంత సరదాతో చూపించడానికి కారణమేమిటి? ఆ రహస్యమేదో వై. లారిన్ బయపెట్టేశాడు: ''విఫలమైన'' 1848 విప్లవం అనంతరం, ఈ దేశాల బూర్జువా పరివర్తన ''ఏ విప్లవమూ లేకుండానే'' సమాప్తి చెందడమే కారణమట.

ఇది అసలు కిటుకు! ఇదీ వారిని అంత సంతోషభరితులను చేస్తూన్నది. విప్లవం లేకుండానే బూర్జువా పరివర్తన సాధ్యమట!! కాగా ఇదే నిజమయే పక్షంలో, విప్లవం గురించి రష్యన్లం మనం ఎందుకంతగా బాధపడాలి? రష్యాయొక్క బూర్జువా పరివర్తనను సాధించడమును ''ఏ విప్లవమూ లేకుండానే'' మనం కూడా భూస్వాములకూ ఫ్యాక్టరీ యజమానులకూ ఎందుకు వదిలిపెట్టేయకూడదు!?

ఆస్ట్రియా, ప్రష్యాలలోని శ్రామికవర్గం బలహీనంగా వుండడం కారణంగానే, కార్మికుల ప్రయోజనాలకు వ్యతిరేకమైన విధంగా కార్మికులకు అత్యంత ప్రతికూలమైనట్టి రూపంలో రాజరిక వ్యవస్థనూ కులీనవర్గపు విశేషాధికారాలనూ గ్రామాలలోని హక్కులు లేమిడినీ, ఇంకా మధ్యయుగపు ఇతర అవశేషాలరాసులనూ భద్రపరచుతూ భూస్వాములు బూర్జువావర్గమూ సాధించిన పరివర్తనను వారించడానికి దానికి శక్తి లేకపోయింది.

రష్యన్ రిఫార్మిస్టులు—పాశ్చాత్యంలో జరిగిన మరే యితర బూర్జువా విప్లవాల్లోనూ చూపనంతటి నిరుపమాన బలాన్ని 1905 లో మన శ్రామికవర్గం చూపిన తరువాత — తాము ఒడిగట్టిన స్వధర్మపరిత్యాగాన్ని సమర్థించుకుందుకు, తమ స్వపక్షపరిత్యాగ బోధనలను ''నిరూపించుకుందుకు,'' నలభై యాభై య్యేళ్ళ కిందట ఇతర దేశాల కార్మికవర్గంయొక్క బలహీనతల ఉదాహరణలపైనే ఆధారపడతారు!

మన రిఫార్మిస్టులు అతి సరదాపడి సూచించే 1860 లనాటి ఆస్ట్రియా, ప్రష్యాల ఉదాహరణే వారి వాదనలలో వుండే సైద్ధాంతిక హేత్వాభాసకూ, ఆచరణీయ రాజకీ

యాల్లో తమ స్వపక్షాన్నీ వదలుకుని బూర్జువావర్గంతో కలిసిపోవడానికీ ఉత్తమ నిదర్శనం.

నిజానికి 1848 విప్లవం ఓడిపోయిన తరువాత రద్దుకావించబడిన రాజ్యాంగాన్ని ఆస్ట్రియా పునరుద్ధరించిందన్న వాస్తవవిషయం, 1860 ల తరువాత ప్రష్యాలో "సంక్షోభ శకం" ఆరంభమైనదన్న వాస్తవవిషయం ఏమిటి రుజువుచేస్తూంది? ప్రధానంగా, ఈ దేశాల బూర్జువా పరివర్తన సమాప్తి చెందలేదనే విషయాన్నే రుజువుచేస్తూంది. రష్యాలో వున్న పరిపాలనా వ్యవస్థ అప్పుడే బూర్జువాగా మారిపోయిందనీ (లారిన్ చెబుతూన్నట్టు), మన దేశంలో ప్రభుత్వాధికారం ఫ్యూడల్ స్వభావం కలిగివుందని చెప్పడం ఇప్పుడు తప్పు అనీ (ఆ లారిన్ చెబుతూన్నట్టే మళ్లీ) సమర్థించడమూ, అదే సమయంలో ఆస్ట్రియా, ప్రష్యాల ఉదాహరణను చూపించడమూ స్వవచనవ్యాఘాతమే అవుతుంది! రష్యా యొక్క బూర్జువా పరివర్తన పూర్తికాలేదన్న విషయం సాధారణంగా చెప్పాలంటే, హాస్యాస్పదమే అవుతుంది: బూర్జువా వర్గపు కాన్‌స్టిట్యూషనల్-డెమొక్రాటిక్, అక్టోబ్రిస్టు పార్టీల సొంత విధానమే దీనిని ఎంత స్పష్టంగా రుజువుచేయాలో అంత స్పష్టంగానూ రుజువుచేస్తూంది, కాగా లారినే స్వయంగా తనంతటతానే (దీనిని మనం ఇటుపైన గమనించుతాం) తన స్థానం వదలుకుంటున్నాడు కూడానూ. ఇంతకుముందు మనం చెప్పినట్టుగానూ, పార్టీ తీర్మానంలో (1908 డిసెంబరు) చూపబడినట్టూ, బూర్జువావర్గపు అభివృద్ధికి అనుగుణ్యంగా తాను సర్దుకునేందుకు రాజరికవ్యవస్థ ఇంకొక అడుగు ముందుకు వేస్తూందన్న విషయం నిస్సందేహం — ఈ సర్దుకోవడం సహితమూ, బూర్జువా అభివృద్ధి నిరోధకం సహితమూ, మూడవ దూమ, 1906 నవంబరు 9 వ (1910, జూన్ 14 వ), వ్యావసాయ శాసనమూ రష్యాయొక్క బూర్జువా పరివర్తన కర్తవ్యాలను పరిష్కరించవన్న విషయం అంతకంటే నిస్సందేహం.

ఇంకా ముందుకు వెళ్దాం. ఆస్ట్రియాలోనూ ప్రష్యాలోనూ 1860 ల "సంక్షోభాలు" "రాజ్యాంగబద్ధమైనవి" గానూ విప్లవాత్మకమైన సంక్షోభాలు ఎలా పరిణమించాయి? రాజరికవ్యవస్థయొక్క క్లిష్టస్థితిని ఉసులుపరచినట్టి అనేక ప్రత్యేక పరిస్థితుల పరంపరే (జర్మనీలో "పైనుండి వచ్చిన విప్లవమూ," "ఇనుమూ రక్తమూ" విధానంవల్ల ఆ దేశం ఏకీకరణమూ) ఇందుకు కారణమైంది; ఆ కాలంలో ఆ దేశాలలోని శ్రామికవర్గం అత్యంత బలహీనంగానూ అభివృద్ధి చెందని స్థితిలోనూ వుంది, కాగా మన రష్యన్ కాడెట్ల లాగానే, లిబరల్ బూర్జువావర్గం కూడా అదే రకం ఏహ్యమైన పిరికితనమూ, ద్రోహమూ ప్రదర్శించి ఘనతవహించడమూ ఇందుకు కారణమైంది.

ఆ శకాన్ని స్వయంగా అనుభవించినట్టి జర్మన్ సోషల్-డెమొక్రాట్లు సంగతి సందర్భాల పరిస్థితిని ఎలా విలువకట్టారో తెలియజేసేందుకు, గతసంవత్సరం వెలువడిన తన జీవిత

స్మృతుల ("నా జీవితం నుండి") మొదటి సంపుటిలో బేబెల్ వ్యక్తపరచిన కొన్ని అభిప్రాయాలను ఇక్కడ ఉల్లేఖించబోతున్నాం. ప్రష్యాలో "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభయుత సంవత్సరమైన 1862 విషయంలో ఇటీవల తెలియవచ్చినట్లుగా, రాజు వుత్త నిరాశాజనితమైన నిస్పృహ స్థితిలో వుండి, తనతో సహా – అనగా బిస్మార్క్‌తో – వారిద్దరూ ఉరికంబానికి బలికావలసి వస్తుందని రాజు భోళ్లున ఏడ్చాడని బిస్మార్క్ కథనం చెప్పాడు. ఆ పిరికిపందకు సిగ్గువచ్చేటట్టు బిస్మార్క్ ధైర్యం చెప్పి, యుద్ధం చెయ్యడానికి వెనుదీయవద్దని బుద్ధిచెప్పాడు.

ఈ సందర్భం గురించి బేబెల్ అంటాడు: "పరిస్థితిని ఎలా ఉపయోగించుకోవడమో వారు తెలుసుకొనగల్గి వుండినట్టయితే, ఎట్టి కార్యాలను లిబరల్సు సాధించి వుండేవారో ఈ ఘటనలు తెలియజేస్తున్నాయి. తమ వెనుక నిలబడి తమకు అండదండల నిస్తూన్న కార్మికులను చూసి వారు అప్పడే భయపడిపోయారు. తాను తీవ్రచర్యలకు దిగవలసివస్తే తాను అభిరాన్‌ను చలనంలో పెట్టవలసి వస్తుందని" (అనగా అడుగున వున్న ప్రజారాసులను ఉసికొల్పి ప్రజోద్యమం లేచేటట్లు చేయాల్సి వస్తుందని) బిస్మార్క్ అనే సరికి "వారికి హడలెత్తి గుండెలు ఆగిపోయాయి."

"ఏ విప్లవమూ లేకుండానే" తన దేశాన్ని బూర్జువా-యుంకర్ [జమీందారు] రాజరికవ్యవస్థ పరివర్తనను పూర్తిచేసినట్టి "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభం జరిగిన అర్ధశతాబ్ది అనంతరం, కార్మికులంటే వారికుండిన భయంవల్ల లిబరల్సు ఉపయోగించుకోనట్టి పరిస్థితి యొక్క విప్లవాత్మక సాధ్యతలను గురించి జర్మన్ సోషల్-డెమోక్రాట్ల నాయకుడు ప్రసంగిస్తున్నాడు. రష్యన్ రిఫార్మిస్టుల నాయకులు రష్యన్ కార్మికులతో ఇలా అంటున్నారు: భయంతో క్రుంగిపోతూన్న రాజు ఎదుట జర్మన్ బూర్జువావర్గం భయంతో క్రుంగిపోయేటంతటి నీచంగా ప్రవర్తించింది కాబట్టి, జర్మన్ బూర్జువావర్గంయొక్క ఇటువంటి భేషైన ఎత్తుగడలను మనం కూడా అనుకరించేందుకు ఏల ప్రయత్నించకూడదు? ప్రజోద్యమం పట్ల తన దోపిడీదారుడి భయం కారణంగా, విప్లవం తీసుకొచ్చేందుకై "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభాన్ని "ఉపయోగించు" కోనందుకు బూర్జువావర్గంపై బేబెల్ నేరం మోపుతున్నాడు. రష్యన్ కార్మికులు ఆధిపత్యం (అనగా లిబరల్సు ఏమి చెప్పినా వినకుండా ప్రజారాసులను విప్లవంలోకి ఆకర్షించడం) కొరకు యత్నించారని వారిపై లారిన్ ప్రభృతులు నేరం మోపుతూ, "విప్లవం కోసం కాకుండా," అందుకు బదులు "రష్యాను రాజ్యాంగవ్యవస్థగా మార్చబోయే రానున్న సంస్కరణలలో తమ ప్రయోజనాలను కాపాడుకుందుకు" ఆర్గనైజు కావలసిందని వారికి సలహాచెబుతున్నారు. ఎందుకు కొరగాని జర్మన్ లిబరలిజంయొక్క ఎందుకూ కొరగాని అభిప్రాయాలను "సోషల్-డెమోక్రాటిక్" అభిప్రాయాలుగా రష్యన్ కార్మికులతో

చెబుతున్నారు లిక్విడేటర్లు! ఇలా జరిగిన తరువాత, ఇలాంటి సోషల్-డెమోక్రాట్లను స్త్రీ పిన్ సోషల్-డెమోక్రాట్లు అని ఎవరైనా అనకుండా వుండగలరా?

ప్రష్యాలోని 1860 సంవత్సరాల "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభాన్ని విలువకట్టే టప్పుడు, కార్మికులంటే జడిసిపోయి బూర్జువావర్గం రాజరికవ్యవస్థతో పోరాడడానికి భయ పడిపోయిందని ఆ ఒక్కమాటా చెప్పేసి వూరుకోలేదు బేబెల్. ఆ కాలంలో కార్మికుల శ్రేణు లలో ఏమి జరుగుతూండెనో దాని గురించి కూడా అతడు చెప్పాడు. "రాజకీయ వ్యవహారాల అధ్వాన్నపు స్థితిని అంతకంతకు మరింత ఆత్రంతో వారు గమనించుతూండడం వల్ల, సహ జంగానే వారి మనస్థితిలో మార్పు సంభవించింది. మార్పు జరగాలంటూ సర్వత్రా పెద్ద గోల లేచింది. కాని, కావల్సినదేమిటో పూర్తిగా ఆకళింపు చేసుకునే చైతన్యం కల్గినట్టీ, లక్ష్యమేమిటో తెలుసుకొనే ముందుచూపు కల్గినట్టీ, విశ్వాసాన్ని చూరగొన్నట్టి నాయకత్వం లేకపోవడం వల్లనూ, శక్తులనన్నింటినీ సమీకరింపగల్గేటట్టి పటిష్ఠవంతమైన ఆర్గనైజే షను లేకపోవడం వల్లనూ ఈ మనస్థితి నీళ్ళ కారిపోయింది (verpuffte). అంత భేషైన సారం వుండిన్నీ (in Kern vortreffliche) చివరకు ఇంత నిష్ఫలితంగా అంతమొందిన ఉద్యమం ఇంకొకటి లేదు. సభలన్నీ జనంతో కిటకట లాడుతూ వుండేవి, వక్తలు ఎంత ఉగ్రంగా ఉపన్యసిస్తే అంత వీరులుగా వారికి జేజేలు కొట్టే వారు ప్రజలు. ప్రజల్లో ఈ మనస్థితి లైప్జిగ్ కార్మికుల విద్యాప్రబోధక సంఘంలో మరీ ప్రత్యేకంగా వ్యాపించింది." 1866 మే 8 న లైప్జిగ్‌లో జరిగినట్టి 5,000 జనం హాజ రైన ఒక బహిరంగ సభ సార్వజనిక సరిసమాన నియోజన హక్కు, ప్రత్యక్ష ఎన్నికలు, రహ స్యపు బేలట్ పద్ధతి ప్రాతిపదికలపై ఎన్నుకోబడినట్టీ, సార్వజనీనంగా సాయుధులైన ప్రజ లపై ఆధారపడేటట్టి పార్లమెంటును సమావేశపరచాలని, లీబ్‌క్నెఖ్ట్, బేబెల్‌లు ప్రతిపాదిం చిన ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. "వంశపారం పర్యమైన కేంద్రాధికారాన్ని ఎట్టిదానినైనా సరే వ్యతిరేకించే వ్యక్తులనే తమ ప్రతినిధులుగా జర్మన్ ప్రజలు ఎన్నుకుంటా రనే ఆశ"ను కూడా ఈ తీర్మానం వెలిబుచ్చింది. లీబ్‌క్నెఖ్ట్, బేబెల్‌లు ప్రతిపాదించిన తీర్మానంయొక్క స్వభావం, ఈ విధంగా, నిస్సందేహమైన రిపబ్లికన్, విప్లవాత్మక స్వభావాలను కలిగి వుంది.

ఈ విధంగా, "రాజ్యాంగబద్ధమైన" సంక్షోభం రోజుల్లో బహిరంగ సభలలో జర్మన్ సోషల్-డెమోక్రాట్ల నాయకుడు రిపబ్లికన్, విప్లవాత్మక స్వభావాలు గలిగిన తీర్మానాలను ప్రతిపాదించాడు. అర్ధశతాబ్ది అనంతరం, తాను యువకునిగా వున్న రోజులను జ్ఞప్తితెచ్చుకుని, బహుకాలం కిందట జరిగిన ఘటలను గురించి నూతన తరంవారికి చెబుతూ, చాలినంతగా చైతన్యయుతమైనట్టీ, విప్లవ కర్తవ్యాలను అర్థంచేసుకున్నట్టీ నాయకత్వం లేకపోయిందనీ

(అనగా, అధిపత్యభావంలో ఆంతరితమైవున్న కర్తవ్యాన్ని గ్రహించినట్టి విప్లవాత్మక సోషల్-డెమొక్రాటిక్ పార్టీ లేకపోయిందని) పటిష్ఠవంతమైన ఆర్గనైజేషను లోపించిందనీ, విప్లవాత్మక మనస్థితి "నీళ్ళుకారిపోయిందనీ" తన విచారాన్ని అతడు ముఖ్యంగా నొక్కిచెబుతాడు. అయినప్పటికీ వెర్రివెంగళాయ ఇవాన్ గారి ప్రగాఢ వివేకంతో రష్యన్ రిఫార్మిస్టుల నాయకులు "ఏ విప్లవమూ లేకుండానే" అంతా జరిపించొచ్చునని రుజువు చేస్తూందంటూ 1860 ల ఆస్ట్రియా, ప్రష్యాల ఉదాహరణలను చూపిస్తారు! విప్లవప్రతిఘాత విషవాయువులకు సమ్మోహితులైనట్టి, లిబరలిజం భావశాస్త్రానికి దాసులైనట్టి తుచ్ఛులైన ఈ అల్పబుద్ధులు, ఆర్.ఎస్. డి. ఎల్. పి పేరు ఆభాసపాల్జేయడానికే ఇంకా సాహసిస్తున్నారు!

సోషలిజంతో తెగతెంపులు చేసుకున్నట్టి రిఫార్మిస్టులలో కార్మికవర్గ ఉద్యమం యొక్క అత్యంత ముఖ్యమైనట్టి సూత్రప్రాయమైన ప్రశ్నలను గురించి వ్యవహరించుతూన్నప్పుడు లారిన్ యొక్క నిష్కపటమైన అవకాశవాదం బదులు, మంత్రాంగపు డొంకతిరుగుడు పద్ధతి అవలంబించేవారు వుండడం సహేతుకమే. ఉదాహరణకు, లారిను న్నూ, "సనాతన బోల్షెవిక్లూ, 1908 తీర్మానాల్లో" అచ్చంగా ఇలాంటి "పథకమే" ఒకదానిని ప్రతిపాదించారని, చట్టబద్ధంగా వెలువడుతూన్న (అనగా, ఆర్.ఎస్.డి.ఎల్.పి సభ్యుల సూటి ప్రత్యాక్షేపణ నుండి స్తొలీపిన్చే పరిరక్షించబడుతూన్న) పత్రికల్లో, మిస్టర్ మార్తొవ్ వాలాయించుతూన్నట్టే వీరున్నూ వివాదగ్రస్త విషయాన్ని గందరగోళపరచి, భావశాస్త్రీయ వివాదాలను కలగాపులగంచేసి, వాటిని కలుషితం చేస్తున్నారు. ఈ విధంగా వాస్తవవిషయాలను కేవలం మొరటుగా వికృతపరచడం ఈ బూతుల పంచాగం రచయితకు పూర్తిగానే తగివుంది. లారిన్కు వ్యతిరేకంగా వాదించుతూన్నట్టే నటించుతూ "రిఫార్మిస్టు ధోరణులు లారిన్లో వున్నాయని తాను సహజంగానే అనుమానించడం లేద"ని అచ్చులో ప్రకటించాడు అచ్చంగా ఈ మార్తొవ్ గారే. నిష్కళంకమైన రిఫార్మిస్టుతత్వపు అభిప్రాయాలను అనుసరించుతూన్న లారిన్ రిఫార్మిస్టు అని మార్తొవ్ అనుమానించడమే లేదు!! రిఫార్మిస్టు దౌత్యతంత్రజ్ఞులు తాము అవలంబించడానికి దిగజారిపోయే కుతంత్రాలకు ఇదొక మచ్చుతునక.* లారిన్ కంటెనూ "వామపక్షీయుడనీ," అతనికంటెనూ విశ్వసనీయుడైన విప్లవకారి అనీ కొందరు వెర్రివెంగళాయిలు నమ్ముతూన్నట్టి ఈ మార్తొవ్గారే, లారిన్కూ తనకూ వున్న "విభేదాలను" క్లుప్తపరచి ఈ విధంగా చెప్పాడు:

* రిఫార్మిజం గురించీ, మార్తొవ్ సందిగ్ధపు మాటలు గురించీ, "దిస్కుస్సియోన్ని లిస్తోక్" ["చర్చా పత్రములు"] (మన పార్టీ కేంద్రపత్రికకు అనుబంధం) 3 వ సంచికలో పార్టీ సభ్యుడైన మెన్షెవిక్ ద్నెవీత్స్కి న్యాయంగానే రాసిన వాక్యాలను చదివిచూడండి.

''సారాంశం తేల్చుతున్నాను: ఈనాటి రాజ్యపాలనా వ్యవస్థ ఆంతరిత వైరుధ్యములైన నిరంకుశవిధాన, రాజ్యాంగబద్ధవిధాన మిశ్రమాన్ని వ్యక్తపరుస్తూందన్నట్టీ, పాశ్చాత్యంలోని ప్రగతిశీలములైన దేశాలలోని కార్మికుల మోస్తరుగానే, రష్యన్ కార్మికవర్గం ఈ రాజ్యపాలనా వ్యవస్థయొక్క అకిలీస్ కాలిమడమపై దెబ్బకొట్టి హస్తగతం చేసుకుందుకు పరిపక్వం చెందినదన్నట్టీ వాస్తవవిషయమే మార్క్సిజం పట్ల భక్తివిశ్వాసాలతో వుంటూన్న మెన్‌షెవిక్‌లు ఇప్పుడు చేస్తూన్న దానిని సైద్ధాంతికంగా రుజావు పరచేందుకూ, రాజకీయంగా సమర్థించేందుకూ సమృద్ధిగా సరిపోతుంది.''

అసలు వివాదగ్రస్త విషయాన్ని దాటవేసేందుకు మార్తొవ్ ఎంత కష్టపడి ప్రయత్నించినప్పటికీ, సారాంశం తేల్చేందుకై అతడు చేసిన మొదటి ప్రయత్నంలోనే, అతని కుయుక్తులన్నీ వాటంతటవే చిత్తయిపోయాయి. మేము ఉల్లేఖించిన వాక్యాలు, సోషలిజాన్ని పూర్తిగా పరిత్యజించడమూ దానిని వదలుకుని దాని స్థానే లిబరలిజాన్ని నెలకొల్పడమునూ వ్యక్తం చేస్తున్నాయి. ''సమృద్ధిగా సరిపోతుంద''ని మార్తొవ్ దేని గురించైతే అంటున్నాడో అది కేవలం లిబరల్స్‌కే, కేవలం బూర్జువావర్గానికే ''సమృద్ధిగా సరిపోతుంది.'' నిరంకుశత్వ, రాజ్యాంగబద్ధ విధానాల మిశ్రమం యొక్క వైరుధ్య స్వభావాన్ని గుర్తించడమే ''సమృద్ధిగా సరిపోతుంద''ని భావించే శ్రామికుడు, లిబరల్ కార్మిక విధాన దృక్స్థానాన్ని అంగీకరిస్తున్నాడన్నమాటే. అతడు సోషలిస్టే కాడు, నిరంకుశత్వ రూపాలన్నిటికీ వ్యతిరేకంగా బూర్జువా వర్గపు ఊగిసలాటలూ వ్యతిరేక చర్యలూ ఎలావున్నప్పటికీ లెక్కచేయకుండా, దేశం యొక్క చారిత్రక విధిలో స్వతంత్రంగా జోక్యం కలుగజేసుకుందుకు వ్యతిరేకంగా, ప్రజారాసులను, పీడిత శ్రామికప్రజా రాసులను, మేల్కొల్పాల్సి వుంటుందనీ, మేల్కొల్పి తీరాలనీ డిమాండు చేస్తూన్నట్టి తన వర్గం నెరవేర్చాల్సిన కర్తవ్యాలు అతనికి అర్థం కావు. కాని బూర్జువా వర్గాధిపత్యాన్ని వదిలించుకుంటూన్న ప్రజారాసుల స్వతంత్ర కార్యాచరణ ''రాజ్యాంగబద్ధమైన'' సంక్షోభాన్ని విప్లవం కింద మార్చివేస్తుంది. విప్లవమంటే బూర్జువావర్గానికి (1905 తరువాత ప్రత్యేకంగా) హడలు, విప్లవమంటే దానికి అసహ్యం; శ్రామికవర్గం, విప్లవభావానికి అర్పితమవడమనే మనఃప్రవృత్తిలో ప్రజలకు ప్రబోధం కల్గించి, విప్లవ కర్తవ్యాలను వివరించి అధునాతనమగు నవీన విప్లవయుద్ధాలకై ప్రజారాసులను సన్నద్ధం చేస్తుంది. విప్లవం ఆవిర్భవించుతుందో లేదో, ఆవిర్భవించుతే ఎప్పుడు ఏయే పరిస్థితులలో ఆవిర్భవించుతుందో ఈ వర్గం యొక్క, లేదా మరేవర్గం యొక్క ఇచ్ఛపైన ఆధారపడదు; అయినప్పటికీ ప్రజారాసులలో కావించే విప్లవాత్మక కృషి ఎన్నటికీ ఫలితం లేకుండా వృథా

పోదు. ప్రజారాసులను సోషలిజం విజయానికై సన్నద్ధులను కావించే ఇట్టి కృషే సిసలైన క్రియాకలాపంగా పరిగణించాల్సి వుంటుంది. సోషలిజం యొక్క ఈ ప్రాథమిక, ఒనమాల సత్యాలనే లారిన్, మార్టొవ్ గార్లు మర్చిపోతున్నారు.

ఆర్.ఎస్.డి.ఎల్.పి తో పూర్తిగా తెగతెంపులు చేసుకున్న రష్యన్ లిక్విడేటర్ల గ్రూపు యొక్క అభిప్రాయాలను వ్యక్తపరుస్తూన్న లారిన్, తన రిఫార్మిజాన్ని విశదీకరించడంలో జంకుగొంకులు లేకుండా అన్ని వివరాలనూ నగ్నంగా చెప్పేస్తున్నాడు. ''దేలొ జీజ్ని'' (1911, 2 వ సంచిక) పత్రికలో అతడు ఈవిధంగా రాస్తున్నాడు — సోషల్-డెమోక్రసీ సూత్రాలను ప్రియతమంగా భావించుకునే ప్రతివారూ ఈ మాటలను జ్ఞాపకం వుంచుకుని తీరాలి:

> ''రేపు దేనికై నిరీక్షించాల్సి వుంటుందో ఏ కర్తవ్యాలను తాము నిర్ణయించుకోవాల్సి వుంటుందో ప్రజలకు కేవలమూ ఏమీ తెలియని గందరగోళపు అనిశ్చిత స్థితి — ఈ ఫలితమే ఆద్యంతాలులేని నిరీక్షణా భావనుండీ, విప్లవం తిరిగి సంభవిస్తుందనో, లేక 'చూతాం, మీదటికి ఏం జరుగుతుందో' అనే అస్పష్టపు ఆశల నుండీ సంభవించుతుంది. ఇప్పటి తక్షణ కర్తవ్యం అనుకూల వాతావరణం కోసం సముద్రపుటొడ్డున వృథాగా పడిగాపులు కాసుకుని వుండడం కాదు; ఇప్పటి కర్తవ్యం, ప్రస్తుతం రష్యన్ జీవితంలో ప్రారంభమైనట్టి నూతన చారిత్రక కాలావధిలో 'విప్లవం కోసం' కాకుండా, 'విప్లవంకోసం నిరీక్షణకై' కాకుండా, కేవలం సరళమైన'' (''కేవలం సరళమైన'' అన్నమాటను గమనించండి...) ''అన్ని జీవిత రంగాలలోనూ కార్మికవర్గం యొక్క ప్రత్యేక ప్రయోజనాల నిరంతర, వ్యవస్థాబద్ధ పరిరక్షణకై; బహుముఖ సంక్లిష్టమైన ఈ క్రియాకలాపంలో దాని శక్తులను కూడదీసుకొని తర్ఫీదు చేయడానికై; ఈ విధంగా సాధారణంగా సోషలిస్టు చైతన్యాన్ని తర్ఫీదుచేసి సంచయం చేసుకోవడానికై; ప్రత్యేకంగా, ఫ్యూడల్ అభివృద్ధి నిరోధకం యొక్క ఆర్థికంగా అనివార్యమైన స్వీయక్షీణం అనంతరం దేశం యొక్క రానున్న రాజ్యాంగబద్ధమైన వినూత్న కరణం కాలంలో రష్యాలోని సామాజిక వర్గాల మధ్య నుండబోయే క్లిష్ట సంబంధాలలో తనంతటతాను తన స్థానాన్ని నిశ్చయించుకొనగల్గి (తన ప్రాదేశిక స్థితిని నిర్ణయించుకొనగల్గే) — కాగా తనకోసం తాను స్వతంత్రంగా వ్యవహరించుకొనగల్గే — కార్మికవర్గం ఆర్గనైజు కాబడాలనే గురుతర భావంతో విశాల విభాగాలను పరితప్తం చేయడమే.''

ఇది సంపూర్ణమైనట్టి నిష్కపటమైనట్టి నూటికి నూరు పాళ్లా స్వచ్ఛమైనట్టి ఆత్మసంతుష్టి పూరితమైన రిఫార్మిజం. విప్లవమనే భావానికి వ్యతిరేకంగా, విప్లవం కోసం

''ఆశల''కు (సంస్కరణవాది దృష్టిలో ఇటువంటి ''ఆశలు'' అస్పష్టమైనవి, ఎందుకంటే సమకాలిక ఆర్థిక, రాజకీయ వైరుధ్యాల లోతును అతడు గ్రహించలేడు) వ్యతిరేకంగా యుద్ధం; శక్తులను ఆర్గనైజుచేసి మనస్సులను విప్లవానికై తర్ఫీదుచేసే ఉద్దేశ్యం కలిగిన ప్రతీ క్రియా కలాపంతోనూ యుద్ధం; విప్లవాత్మక సోషల్-డెమోక్రాట్లనుండివచ్చే సూటి ఎదురుదాడి నుండి స్తొలీపిన్‌చే పరిరక్షించబడుతూన్నట్టి చట్టసమ్మతంగా ప్రచురితమవుతూన్న పత్రికలలో సాగించబడుతూన్న యుద్ధం; ఆర్.ఎస్.డి.ఎల్.పి తో పూర్తిగా తెగతెంపులు చేసుకున్నట్టి ఒక గ్రూపు లీగలిస్టుల పేరుతో సాగించుతూన్న యుద్ధం — ఇవీ పొత్రేసొవ్, లెవీత్స్కి, లారిన్ ప్రభృతులు సృష్టించ నుద్యమించే స్తొలీపిన్ కార్మిక పార్టీయొక్క కార్యక్రమమూ ఎత్తుగడలూనూ. ఈ మనుషుల నిజమైన కార్యక్రమమూ ఎత్తుగడలూ పై ఉల్లేఖనలో ఖచ్చితమైన మాటల్లో — తాము ''కూడా సోషల్-డెమోక్రాట్లమే'' అనీ, తాము ''కూడా'' ''రాజీ అంటే ఏమిటో ఎరగని ఇంటర్నేషనల్'' లో వారమే అనీ అధికారయుతంగా వారు ఇచ్చిన వాగ్దానాల నుండి విభేదంగా — వ్యక్తపరచబడ్డాయి. ఈ వాగ్దానాలు కేవలం పైపై మెరుగుపూత మాటలు తప్ప మరేమీ కాదు. వీరి క్రియాకలాపమూ, వీరి అసలైన సామాజిక సారమూ, సోషలిజం స్థానే లిబరల్ కార్మిక విధానాన్ని పూర్తిగా నిలబెడుతూన్నట్టి ఈ కార్యక్రమంలో వ్యక్తమవుతున్నాయి.

ఎటువంటి హాస్యాస్పదమైన వైరుధ్యాల్లో రిఫార్మిస్టులు చిక్కుబడిపోతున్నారో ఒక్కసారి గమనించండి. రష్యాలో బూర్జువా విప్లవం పూర్తి కావించబడిన పక్షంలో (లారిన్ చెప్పినట్టుగా) ఇక సోషలిస్టు విప్లవమే కార్యక్రమావళిలో తరువాతి అంశం అయితీరాలి. ఇది విస్పష్టమే; ప్రజానురంజకమైన పేరు తగిలించుకుని కార్మికులను మోసగించే ఉద్దేశంతో సోషలిస్టునని బహిరంగంగా చెప్పుకునే వాడికి తప్ప కడమ ప్రతీ సోషలిస్టుకీ ఇది స్వయంవ్యక్తమే. అట్టి పక్షమందు, కచ్చితంగా ''విప్లవం కోసమే'' (సోషలిస్టు విప్లవం కోసమే), కచ్చితంగా దానికై ''నిరీక్షణ కోసమే,'' కాగా సోషలిస్టు విప్లవం కోసమై ''ఆశ''తోనే (అస్పష్టమైనది కాకుండా, విజ్ఞానశాస్త్రం యొక్క నిరకైన, నానాటికి అధికమవుతూన్న దత్తాంశాల ప్రాతిపదికనుగల ''ఆశ'' — నిశ్చయతతో సమానమైనట్టి ''ఆశ''తోనే) మనం ఆర్గనైజుకాబడాలి.

అయితే కిటుకు అంతా ఇక్కడే వుంది — ఎంచేతంటే, పూర్తికాబడిన బూర్జువా విప్లవం గురించి రిఫార్మిస్టు చెప్పే ఊకదంపు మాటలన్నీ (అకిలీస్ కాలిమడమ, వగైరా గురించి మార్తొవ్ చెప్పిన ఊకదంపు) అతని యావత్తువిప్లవ పరిత్యాగాన్నీ కప్పిపుచ్చేందుకు తగిలించుకున్న ముసుగే తప్ప మరేమీ కాదు. బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం పూర్తిచేయబడిందనే మిషపైన, లేదా నిరంకుశ విధానానికీ రాజ్యాంగబద్ధ విధానానికీ మధ్యనున్న వైరుధ్యాన్ని పోల్చుకుందుకు అది ''సమృద్ధిగా సరిపోతుంద''నే మిషతోనూ, బూర్జువా-ప్రజాస్వామిక విప్లవాన్ని

అతడు పరిత్యజించుతున్నాడు; కాగా ''తాత్కాలికంగా'' ''రష్యా యొక్క రానున్న రాజ్యాంగ బద్ధమైన మరమ్మతు''లో పాల్గొనేందుకే మనం ''కేవలం సరళమైన'' ఆర్గనైజు కాబడాలనే మిషతో సోషలిస్టు విప్లవాన్ని అతడు పరిత్యజించుతున్నాడు!

సోషలిస్టు తూలికలు తగిలించుకుని డాబుగా తిరుగుతూన్నట్టి ఓ కాడెట్ మహానుభావా, రష్యాలో ''రానున్న రాజ్యాంగబద్ధమైన వినూత్నకరణం'' అనివార్యతను గుర్తించిన మీమాటలను మీరే కాదంటున్నారు; ఎందుచేతంటే, అలా గుర్తించడంవల్ల మన దేశంలో బూర్జువా-ప్రజాస్వామ్య విప్లవం పూర్తి చేయబడలేదని మీరే ఒప్పుకుంటున్నారు ''ఫ్యూడల్ అభివృద్ధినిరోధక స్వీయక్షీణం'' అనివార్యతను గురించి పదేపదే చెబుతూండడం వల్లనూ ప్రజావిప్లవోద్యమం వల్ల ఫ్యూడల్ అభివృద్ధి నిరోధకమే కాకుండా, ఫ్యూడలిజపు అన్ని అవశేషాలనూ నాశనం చేయడమనే శ్రామికవర్గ స్వభావాన్ని మీరు ఈసడించడం వల్లనూ మీ అజ్ఞానాన్ని మీరే బయటపెట్టుకుంటున్నారు.

ప్తొలీపిన్ కార్మిక పార్టీ వీరులు ఎంతగా లిబరల్ ధర్మబోధలు చేసినప్పటికీ, ప్రజాస్వామిక విప్లవానికే, సోషలిస్టు విప్లవానికే అర్పితమవాలనే భావంతో తనపై విప్లవప్రతిఘాతకం శిక్షగా విధించినట్టి కష్టభూయిష్ఠము, కఠినము, నిత్యము, దినక్రమమూ అయినట్టీ, నలుగురి దృష్టిలో పడనట్టి తన యావత్తు కృషినీ రష్యన్ శ్రామికవర్గం ఎల్లప్పుడూ తప్పకుండా మనస్సుకు పట్టించుకుంటూనే వుంటుంది; విప్లవం కోసం తన శక్తులను ఆర్గనైజు చేసుకుని కూడదీసుకుంటుంది; ద్రోహులనూ స్వపక్షపరిత్యాగులనూ అది నిర్దాక్షిణ్యంగా తోసివేస్తుంది, ''అస్పష్టమైన ఆశ'' కాకుండా, విప్లవం నిశ్చయంగా తిరిగి సంభవించి తీరుతుందనే శాస్త్రీయమైన నమ్మకమే దానికి చోదకశక్తిగా వుంటుంది.

సెప్టెంబరు 1911.

# జాతులకుగల స్వయంనిర్ణయ హక్కు

ఖండిక

## 8. స్వాప్నికుడు కారల్ మార్క్సు, ఆచరణవేత్త రోజా లుక్సెంబుర్గ్

పోలెండు స్వాతంత్ర్యాన్ని అనుభవించడం ''స్వప్నంలో''ని మాట అంటూ, ఆ మాటనే అసహ్యంపుట్టించేటట్టు పదేపదే వర్ణించుతూ, ఐర్లండుకు స్వతంత్రంకావాలన్న కోర్కెను ఎందుకు లేవదీయకూడదు? — అని రోజా లుక్సెంబుర్గ్ పరిహాసంగా అడుగుతుంది.

దీన్ని పట్టి చూస్తే, ఐర్లండు స్వాతంత్ర్య సమస్య గురించి కారల్ మార్క్సుయొక్క అభిప్రాయాలేమిటో ''ఆచరణవేత్త'' అయిన రోజా లుక్సెంబుర్గ్‌కి తెలియదని స్పష్టమవుతూంది. నిర్దిష్టమైన ఒక జాతీయ స్వాతంత్ర్య కోర్కెను అవకాశవాద దృక్పథంనుండే కాక నిజమైన మార్క్సిస్టు దృక్పథంనుండి ఏ విధంగా విశ్లేషణపద్ధతిలో పరిశీలించాల్సి వుంటుందో తెలుసుకోవడానికి ఈ విషయాన్ని విశదీకరించడం లాభకారిగా వుంటుంది.

తన సోషలిస్టు పరిచయస్థులయొక్క చైతన్యాన్ని వారి నమ్మకాలయొక్క దృఢత్వాన్నీ తెలుసుకోవడానికి, వారి ''దంతాలను పరీక్షించి చూడాలి'' అని అంటూండేవాడు కారల్ మార్క్సు.[126] లొపాతిన్‌తో తనకి పరిచయం కల్గిన తరువాత, ఆ యువక రష్యను సోషలిస్టుని శ్లాఘించుతూ మార్క్సు 1870 జూలై 5 వ తేదీన ఎంగెల్స్‌కి రాస్తూ, అందుతోపాటు ఈ మాటని కూడా చేర్చాడు:

''...అతనిలోని బలహీన విషయం పోలెండు. ఈ విషయంపైన అచ్చంగా ఇంగ్లీషువాడు — మాటవరుసకి, పాతరకపు చార్టిస్టుపంథాకి చెందిన ఇంగ్లీషువాడు ఐర్లండు గురించి ఎలా మాట్లాడుతాడో — అలాగే మాట్లాడాడు అతను.''

పీడిత జాతినిగూర్చి మీ వైఖరి ఏమిటి అని పీడక జాతికి చెందిన సోషలిస్టుని ప్రశ్నిస్తాడు మార్క్సు; ఆ ప్రశ్నతో పీడక జాతికి (బ్రిటిషు, రష్యా జాతులకు) చెందిన సోషలిస్టులలో సామాన్యంగావున్న లోపాలనన్నీ మార్క్సు బయటపెట్టుతాడు: అణగదొక్కబడిన జాతుల

పట్ల తమ సోషలిస్టు కర్తవ్యాన్ని అర్థంచేసుకో లేకపోవడమూ, "మహాజాతి" బూర్జువా వర్గాలనుండి అలవరచుకొన్న దురభిమానాలనే ఏకరవు పెట్టడమూ — ఇవీ ఆ లోపాలు.

ఐర్లండుమీద మార్క్స్ సూటిగా చేసిన ప్రకటనలని పరిశీలించేముందు, జాతీయ సమస్యపట్ల మార్క్స్, ఎంగెల్స్‌లు సాధారణంగా అవలంబించిన వైఖరి కచ్చితమైన విమర్శనా దృష్టినే ప్రదర్శిస్తోందనీ, చారిత్రకంగా ఈ సమస్యకుగల సాపేక్ష ప్రాముఖ్యతను వారు గ్రహించారనీ మనం చెప్పవలసి వుంది. ఈ ప్రకారం 1851 మే 23 వ తేదీన మార్క్స్ పేర ఎంగెల్స్ వుత్తరం రాస్తూ, చరిత్రని అధ్యయనం చేస్తూంటే పోలెండు గురించి నిరాశాజనకమైన పర్యవసానానికే తాను రావలసివస్తూందనీ, పోలెండుయొక్క ప్రాముఖ్యత తాత్కాలికంగానే రష్యాలో వ్యవసాయ విప్లవం సంభవించేవరకే వుంటుందనీ రాశాడు. చరిత్రలో పోలెండు దేశస్థుల పాత్ర అంతా "సాహసోపేతంగా చేసిన తెలివితక్కువ గందరగోళపు గలభాచేష్టలే" అన్నాడు. "ఏ ఒక్క విషయంలోనైనాసరే, పోలెండు రష్యాకు వ్యతిరేకంగానైనా సరే, అభ్యుదయానికి జయప్రదంగా ప్రాతినిధ్యం వహించిన విషయాన్ని గానీ, లేక చారిత్రక ప్రాముఖ్యతను కల్గిన కృత్యాన్నిగానీ సాధించిన దృష్టాంతాన్ని ఒక్కదానినైనా చూపించుదామంటే కనబడదు కదా." నాగరికత, విద్య, పరిశ్రమ, బూర్జువా వర్గం — ఈ మూలద్రవ్యాలన్నీ పోలెండు లోకంటె రష్యాలోనే హెచ్చుగా కనబడుతూ వుండగా, "పోలెండు దేశస్థులు కులీనవంశస్థునీ సోమరిపోతుతనాన్నే" ప్రదర్శిస్తూంటారు అన్నాడు. "సెంట్ పీటర్స్‌బర్గ్, మాస్కో, ఒదెస్సా, వీటితో పోల్చిచూస్తే వార్సా, క్రాకొవ్‌లు ఏ మూల!" అన్నాడు ఎంగెల్స్. పోలెండు కులీనవంశస్థులు లేవదీసే పితూరీకి ఏమాత్రమూ జయం లభించదనే ఎంగెల్స్ అభిప్రాయపడ్డాడు.

మేధాశక్తినీ ధీశక్తినీ ప్రదర్శించుతూన్న ఈ అభిప్రాయాలను ఎంగెల్స్, మార్క్స్‌లు కలిగి వుండినప్పటికీ, పన్నెండు సంవత్సరాల తరువాత, రష్యా ఇంకా నిద్రావస్థలోనే వున్నప్పటికీ, పోలెండు దవానలంతో మండిపోతూన్నప్పుడు పోలెండు జాతీయోద్యమంపట్ల వారికుండిన ప్రగాఢమైన, హృదయపూర్వకమైన సానుభూతిని ప్రకటించడానికి ఈ అభిప్రాయాలేవీ అడ్డుతగల్లేదు.

1864 లో ఇంటర్నేషనల్‌కి "విజ్ఞప్తి" తయారుచేస్తూన్న సమయంలో మార్క్స్ ఎంగెల్స్ పేర వుత్తరం రాస్తూ (1864 నవంబరు 4 వ తేదీన), మజ్జీనియొక్క జాతీయ తత్వాన్ని ఎదుర్కోనవలసి వచ్చిందని అంటూ, ఇలా రాశాడు: "విజ్ఞప్తిలో పేర్కొనబడిన అంతర్జాతీయ రాజకీయాల పరిధులలో, దేశాలగురించే ఎత్తుకున్నానుగాని జాతులగురించి మాత్రం నేను ఎత్తుకోలేదు; ఆ ఎత్తుకోవడంలో కూడా రష్యాను తీవ్రంగా ఖండించానేగాని, చిన్న దేశాలను ఖండించనే లేదు." జాతీయసమస్యను "కార్మికసమస్య"తో పోల్చిచూస్తే

''కార్మికసమస్య''కే హెచ్చుప్రాధాన్యత ఇవ్వాలని, దీని తరువాతనే జాతీయసమస్య వస్తుందని భావించడంలో మార్క్సుకి ఎట్టి సందేహమూ లేదు. అంతమాత్రాన అతని సిద్ధాంతం జాతీయోద్యమాలను లెక్కలోకి తీసుకోలేదని ఎవరేనా అంటే అది సత్యదూరమే అవుతుంది.

1866 వ సంవత్సరం వచ్చింది. పారిస్‌లో ఏర్పడిన ''ప్రూడన్‌ముఠా''ను గురించి మార్క్సు ఎంగెల్సు పేర రాస్తూ: ''జాతీయతలంటూ'' వుండడమే అసందర్భమని ప్రకటించుతూ, బిస్మార్క్‌నీ గరిబాల్డినీ తదితరులనీ ఈ ముఠా దుయ్యబట్టుతూంది. జాతీయ దురహంకారానికి విరుగుడుగా వీరి ఎత్తుగడలకి కొంత ఉపయోగమూ వుంటుంది, వీటిలో కొంత అర్థమూ వుంది. కాని ప్రూడన్ అనుచరులు (ఇక్కడున్న నా స్నేహితులు లాఫార్గ్, లాంగ్వే గార్లు కూడా ఈ అనుచరవర్గంలోని వారే), దారిద్ర్యాన్ని అజ్ఞానాన్ని ఫ్రాన్సులో వున్న ఈ పెద్దమనుష్యులందరూ అంతమొందించేవరకూ యూరపులో వున్న వారందరూ కదుపులో చల్ల కదలకుండా హాయిగా కాలుమీద కాలేసుకొని కూచోవచ్చును, కూచుని తీరాలి అని భావించితే మాత్రం, వీరు నలుగురినోట నగుబాలు కావడం తప్ప మరొకటి కాదు,'' అని రాశాడు. (1866 జూను 7 వ తేదీన రాసిన వుత్తరం.)

1866 జూను 20 వ తేదీన రాస్తూ మార్క్సు ఆ వుత్తరంలో ఇలా అంటాడు: ''ఇంటర్నేషనల్ సలహా సమితిలో ప్రస్తుతం జరుగుతూన్న యుద్ధం గురించి నిన్న చర్చ జరిగింది. ...అనుకున్నట్టుగానే, 'జాతీయతల' గురించి స్థూలమైన ప్రసంగంతోనూ, ఈ సమస్యపట్ల మనం ఏ వైఖరిని అవలంబించాలి అనే ప్రశ్నతోనూ చర్చ ముగిసింది.... వివిధ జాతీయతలు అనే భావమూ, చివరకి జాతులు అనే భావమూ, బూజుపట్టిన పాతకాలపు దురభిమానాలు అనే వాదనని ''యువఫ్రాన్సు'' ప్రతినిధులు (కార్మికేతరులు) లేవదీశారు. ఇది ప్రూడన్ తయారీ స్టిర్‌నర్‌తత్వం తప్ప మరేమీ కాదు.... ఫ్రాన్సు విప్లవస్థితికి పరిపక్వం చెందేటంత వరకూ ప్రపంచమంతా వేచివుండాలన్నమాట... జాతీయతలనే తుడిచిపెట్టేసిన మన మిత్రులు లాఫార్గ్ వగైరాలు మాతో ఫ్రెంచి మాట్లాడారని, అనగా అక్కడ సమావేశమైన వారిలో పదింట తొమ్మండుగురికి అర్థంకాని భాషలో ప్రసంగించారని చెపుతూ నేను ఉపన్యాసాన్ని ప్రారంభించేసరికి, ఇంగ్లీషువాళ్ళందరూ అదేనవ్వడం మొదలెట్టారు. జాతీయతలంటూ లేనేలేవని అనడంలో అందరకూ అనుకరణయోగ్యమైన నమూనా ఫ్రెంచి జాతిలో ఇవన్నీ సంలీనమైపోవాలని తనకు తెలియకుండానే లాఫార్గ్ అంతర్గతంగా అనుకుంటూన్నట్టు కనబడుతూందని కూడా నేను సూచించాను.''

మార్క్సుయొక్క ఈ విమర్శనాత్మకములైన అభిప్రాయాలన్నిటినుండీ పర్యవసానం స్పష్టంగానే కనబడుతూంది. అదేమంటే: పెట్టుబడిదారీవిధాన పరిణామం అన్ని జాతులనీ తప్పనిసరిగా స్వాతంత్ర్య జీవితానికి మేల్కొల్పదు కాబట్టి, జాతీయసమస్యను ఇతరులు ఒక

పూజావిగ్రహంగా ఆరాధించుతే ఆరాధించవచ్చునుగాని, కార్మికవర్గం మాత్రం ఆలా ఆరాధించ కూడదు. కాని ఆలాగని చెప్పి, ఒక సారి జాతీయప్రజోద్యమాలు తలలెత్తిన తరువాత వాటిని తేలికగా కొట్టిపారేయడమూ, వాటిలో వున్న అభ్యుదయకరములగు మూలద్రవ్యాలను బల పరచకపోవడమూ — ఇవి చేసినట్టయితే, "తన స్వజాతినే" "అనుకరణయోగ్యమైన నమూనా జాతిగా" గుర్తించుతూ (రాజ్యాంగయంత్రంగా ఆవిర్భవింపదగిన ప్రత్యేక హక్కునుగల జాతిగా, అని కూడా మనం చేర్చవచ్చును), జాతీతత్వ దురభిమానాలకు దోహదమిచ్చినట్టే అవుతుంది.*

ఇక ఐర్లండు సమస్యకి వద్దాం.

మార్క్సు వుత్తరాల్లోని ఈ కింది ఉదాహరణలవల్ల ఈ సమస్యపట్ల ఆయన తీసు కొన్న స్థానం మనకు స్పష్టంగా తెలుస్తుంది.

"ఫెనియనిజంపట్ల ఇంగ్లీషు కార్మికులు తమ సానుభూతిని అన్నివిధాలా వ్యక్తపర చేందుకు నేను చేయగలిగినదంతా చేశాను... ఇంగ్లండునుండి ఐర్లండు వేరుపడడం అసం భవమనే నేనింతవరకూ అనుకొనేవాణ్ణి. ఇప్పుడు మాత్రం ఇది విధిగా జరిగితీరుతుందనే అనుకొంటాను; ఐతే ఇది జరిగిన తరువాత సమాఖ్య ఏర్పడితే ఏర్పడవచ్చు." ఈవిధంగా 1867 నవంబరు 2 వ తేదీన మార్క్సు ఎంగెల్స్‌పేర రాశాడు.

ఆ సంవత్సరమే నవంబరు 30 వ తేదీన రాస్తూ, ఇంకా ఈప్రకారంగా అన్నాడు:

"ఇంగ్లీషు కార్మికులకి మనం ఏమని సలహా చెప్పాలి? నా ఉద్దేశంలో, సంయుక్త రాజ్యాంగ చట్టాన్ని Repeal (రద్దు పరచడము)" (ఇంగ్లండుకు ఐర్లం డుకు ఇప్పుడున్న సంబంధము రద్దు అయిపోయి, ఇంగ్లండునుండి ఐర్లండు వేరుపడిపోవడము), క్లుప్తంగా చెప్పాలంటే, 1783 లో జరిగిన ఉదంతాన్నే ప్రజాస్వామ్యయుక్తంచేసి, ఈ కాలపు పరిస్థితులతో అన్వయింపజేయడమే తమ ప్రణాళికలో ఒక అంశంగా వారు ఉదాహరించాలి. ఐరిష్ విమోచనయొక్క చట్టబద్ధమైనట్టి, ఈ కారణంచేత ఏ ఇంగ్లీషు పార్టీ కార్యక్రమంలో నైనా పొందుపరచడానికి సాధ్యమైనట్టి, రూపం ఇదొక్కటే. రెండు దేశాలమధ్యనూ కేవ లం వ్యక్తిగతమైన ఐక్యతాసంబంధాలు సాగుతూనే వుంటాయో వుండవో తదుపరి అనుభవం వల్లనే తెలియాలి...

---

* ఈ సందర్భంలో 1867 జూను 3 వ తేదీన మార్క్సు ఎంగెల్స్‌కు రాసిన వుత్తరాన్ని చూడవచ్చును: "...రష్యా వ్యతిరేకంగా పోలెండుతో సానుభూతిని తెల్పే నినాదాలను పారిస్ నగరవాసులు వీధుల్లో ఇస్తున్నారనే విషయాన్ని తెల్పుతూ "టైమ్సు" పత్రికలో ఆ పత్రిక పారిస్ విలేఖరి రాసిన లేఖలు చదివితే నాకెంతో ఆనందం కలిగింది... ఫ్రెంచి ప్రజలంటే కేవలం ప్రూడన్‌గారూ ఆయన చాంధసముతా వారొక్కరేకారు."

"...ఐర్లండు దేశస్థులకు కావలసినదేమంటే:

"1) స్వపరిపాలనా, ఇంగ్లండునుండి విడిపోయి స్వతంత్రంగా వుండడమూ;

"2) వ్యవసాయ విప్లవం...."

ఐర్లండు సమస్యకి మార్క్స్ గొప్ప ప్రాముఖ్యతను ఇచ్చాడు; ఈ సమస్యపైన జర్మను కార్మిక సంఘంలో గంటన్నరకాలంపట్టే ఉపన్యాసాన్ని ఇచ్చాడు (1867 డిసెంబరు 17 వ తేదీన రాసిన వుత్తరం).

1868 నవంబరు 20 వ తేదీన రాసిన వుత్తరంలో, "ఇంగ్లీషు కార్మికులలో ఐర్లండు దేశస్థులపట్ల వున్న ద్వేషాన్ని" ఎంగెల్స్ గమనించాడు; కాగా ఒక సంవత్సరం తరువాత (1869 అక్టోబరు 24 వ తేదీన) ఈ విషయాన్ని గూర్చే మళ్లీ ఈ విధంగా ఎంగెల్స్ రాశాడు:

"ఐర్లండునుండి రష్యాకి il n'y a qu'un pas (ఒకేఒక అడుగు) వెళ్ళుదాం... ఒక జాతి మరొకజాతిని బానిసగా చేసుకోవడము ఆ జాతికి అది ఎంత వినాశకరమో ఐర్లండు చరిత్ర గుణపాఠాన్ని నేర్పుతూంది. ఇంగ్లీషువాళ్లలో వుండే దుర్వ్యసనాలన్నిటికీ ఐర్లండులోవున్న ఇంగ్లీషువలసప్రాంతమే పుట్టిల్లు. క్రామ్‌వెల్ కాలాన్ని గురించి రచననింకా నేను పూర్తి చేయలేదు. ఐనప్పటికీ ఐర్లండులో సైనికపరిపాలన సాగించవలసిన అవసరమేలేకుండా వుండి, అక్కడ ఒక కొత్త ప్రభువర్గాన్ని సృష్టించకుండా వుండినట్టయితే, ఇంగ్లండులో పరిస్థితులు మరో విధంగా రూపొంది వుండేవని మాత్రం నేనింతవరకూ అధ్యయనం చేసినదానిని పట్టి నాకు స్పష్టంగా కనబడుతూంది."

1869 ఆగస్టు 18 వ తేదీన ఎంగెల్స్ పేర మార్క్స్ రాసిన వుత్తరాన్ని ప్రసంగవశాత్తూ మనం ఇక్కడ ఉదహరించవచ్చు:

"బెర్లిన్‌లో వున్న తమ వృత్తి సహోదరుల అండదండల ఫలితంగా, పోజ్నాన్‌లో వున్న పోలెండు దేశపు కార్మికులు తమ సమ్మెను జయప్రదంగా ముగించారన్న సమాచారాన్ని జాబిస్కిద్వారా తెలిసింది. 'మహారాజ శ్రీ పెట్టుబడి మహాశయుడిగారికి' వ్యతిరేకంగా — అతి తక్కువ స్థాయిలో సమ్మెరూపంలో జరిగినప్పటికీ — ఈవిధమైన పోరాటమే, జాతీయ దురభిమానాలను పారదోలడంలో బూర్జువా పెద్దమనుష్యులు కావించే శాంతి మహోపన్యాసాలకంటె ఎంతో గొప్పగా సహాయపడుతుంది."

ఐర్లండు సమస్యపట్ల ఇంటర్నేషనల్‌లో మార్క్స్ ఏ విధానాన్ని అవలంబించాడో ఈ కింద పేర్కొన్న ఉదాహరణలవల్ల తెలుస్తూంది:

1869 నవంబరు 18 వ తేదీన మార్క్స్ ఎంగెల్స్‌పేర రాసిన వుత్తరంలో, ఇంటర్నేషనల్ సలహాసంఘంలో ఐర్లండు సార్వజనికక్షమాపణ ప్రతిపాదనపట్ల బ్రిటిష్ మంత్రిత్వ

శాఖ వైఖరి గురించి గంటంపాటు ప్రసంగించిన తరువాత ఈ కింది తీర్మానాన్ని తాను ప్రతిపాదించినట్టు రాశాడు:

"కారాగృహంలో వున్న ఐర్లండు దేశభక్తులను విడుదల చేయవలసిందని ఐర్లండు దేశస్థులు చేసిన కోర్కెలకు ప్రత్యుత్తరం చెప్పుతూ, ఐరిషుజాతిని మిస్టర్ గ్లాడ్‌స్టన్ బుద్ధిపూర్వకంగా అవమానించాడనీ;

"దుష్టపరిపాలనకు గురైన వారికేకాకుండా, వారితోపాటు వారి దేశ ప్రజలందరకూ కూడా ఒకే విధంగా అవమానకరంగా వున్నట్టి షరతులను ముడిపెట్టడంద్వారా రాజకీయ సార్వజనికక్షమాపణ కార్యానికే ఆయన అడ్డంకులను కలిగించుచున్నాడనీ;

"తాను నిర్వహించుతున్న గురుతర బాధ్యతగల హోదాను సహితం లెక్క చేయకుండా, అమెరికా దేశపు బానిసయజమానుల తిరుగబాటును బహిరంగంగానూ అమితోత్సాహంతోనూ హర్షించిన మనిషే, ఐర్లండు దేశస్థులు నోరుమూసుకొని వినయవిధేయతలతో ప్రవర్తించాలనే సూత్రాన్ని వారికి ప్రబోధించడానికి తయారయాడనీ;

"ఐర్లండు దేశస్థులకు సార్వజనికక్షమాపణా సమస్యపట్ల తాను గావించుతూన్న ఈ తతంగమంతా, ఏ 'యుద్ధ దురాక్రమణ విధానాన్ని' నిప్పులుచెరుగుతూ ఖండించడం ద్వారా తన టోరీపక్షపు ప్రత్యర్థులని పదవులనుండి మిస్టర్ గ్లాడ్‌స్టన్ వెళ్లగొట్టాడో, అట్టి విధానంనుండి జన్మించిన నిష్కళంకమైన ఔరససంతానమేననీ;

"ఐర్లండుదేశ ప్రజలు తమ సార్వజనికక్షమాపణోద్యమాన్ని అత్యంత ధైర్య సాహసాలతోనూ అంచంచల దీక్షతోనూ మహోదాత్తతతోనూ సాగించుతూన్నందుకు ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్సు ఎసోసియేషనుయొక్క జనరల్ కౌన్సిల్ తమ జోహార్లను అర్పించుతూందనీ;

"ఈ తీర్మానాలను యూరపులోనూ అమెరికాలోనూ వున్న అంతర్జాతీయ కార్మికుల సంఘంయొక్క అన్ని శాఖలకూ, సంఘంతో సంబంధాలను కలిగియున్న అన్ని కార్మికుల సంస్థలకూ తెలియపర్చవలసిన దనిన్నీ — తీర్మానించడమైనది."

ఇంటర్నేషనల్‌యొక్క సలహాసమితి ఎదుట ఐర్లండుసమస్యపై తన నివేదిక ఈ కింది అంశాలను ఆధారంగా చేసుకొని వుంటుందని 1869 డిసెంబరు 10 వ తేదీన రాసిన వుత్తరంలో మార్క్సు పేర్కొన్నాడు:

"...ఐర్లండుపట్ల చూపవలసిన 'అంతర్జాతీయ' 'కరుణాశీలమైన' 'ధర్మం' మొదలైన పదప్రయోగాలు అలావుంచి — ఇంటర్నేషనల్‌యొక్క సలహాసమితి దృష్టిలో ఈ విధంగా

ఎలాగూ జరిగే తీరాలి — ఇప్పుడు ఐర్లండుతో ఇంగ్లండుకున్న సంబంధానికి స్వస్తిచెప్పడమే, ఇంగ్లండుదేశపు కార్మికవర్గ క్షేమాన్ని ఉద్ధరించడానికి సూటి అయినట్టిన్నీ అత్యవసరమైనట్టిన్నీ విధానం. ఇదే నా పరిపూర్ణ విశ్వాసం; అయితే నాకున్న కొన్ని కారణాలనుబట్టి, నా విశ్వాసాన్ని ఇంగ్లీషు కార్మికుల ఎదుట నేను వెల్లడిచేయలేకుండా వున్నాను. ఇంగ్లీషు కార్మికుల ప్రాబల్యం అధికంకావడంవల్లనే ఐర్లండులో వున్న పరిపాలనను కూలదొయ్యడానికి వీలవుతుందని నేను చాలా కాలం నమ్మాను. ఈ దృక్పథాన్నే నేను 'న్యూయార్క్ ట్రిబ్యూన్' పత్రికలో (ఈ అమెరికన్ పత్రికకు మార్క్స్ చాలా కాలం వ్యాసాలు రాస్తూండేవాడు) ఎల్లప్పుడూ వెల్లడి చేస్తూ వచ్చాను. ఈ సమస్యను లోతుగా అధ్యయనం చేసిన ఫలితంగా, నా అభిప్రాయం పొరపాటని నాకిప్పుడు నమ్మకం కలిగింది. ఐర్లండుతో తెగతెంపులు చేసుకోనంతకాలమూ ఇంగ్లీషు కార్మికవర్గం ఏ కార్యాన్నీ సాధించనేరదు.... ఇంగ్లండులో వున్న ఇంగ్లీషు అభివృద్ధి నిరోధకతత్వంయొక్క అంకురాలన్నీ ఐర్లండుని జయించి ఆక్రమించుకొన్న విధానంలోనే పాతుకొని పోయివున్నాయి." (ఒత్తులన్నీ మార్క్సవే.)

దీనితో ఐర్లండు సమస్యపైన మార్క్సుయొక్క విధానం పాఠకునికి స్పష్టంగా బోధపడే వుంటుంది.

"స్వాప్నికుడైన" మార్క్స్ ఎంతటి "ఆచరణ తెలియని వాడంటే," ఐర్లండు విడివడిపోవాలని అతడు చేసిన ప్రతిపాదన అర్ధశతాబ్ది జరిగిపోయినా ఇంకా సఫలీకృతం కాకుండానే వుండిపోయింది. మార్క్స్ విధానం ఆవిర్భావానికి కారణమేమిటి? ఆ విధానం పొరపాటైనదా?

పీడితజాతియొక్క జాతీయ ఉద్యమంవల్ల కాకుండా, పీడకజాతియొక్క జాతీయ కార్మికవర్గపు ఉద్యమంవల్లనే ఐర్లండుకు విముక్తి కలుగుతుందని మార్క్స్ మొదటలో భావించాడు. కార్మికవర్గ విజయం ఒక్కటే అన్ని జాతీయతలనూ సంపూర్ణంగా విముక్తిచేయగలదని అతను నమ్మడంచేతనే, జాతీయోద్యమమే పరమావధిగా ఎంచలేదు మార్క్స్. పీడితజాతులకు చెందిన బూర్జువా విముక్తి ఉద్యమాలకూ పీడకజాతులకు చెందిన శ్రామికవర్గపు విముక్తి ఉద్యమాలకూ వుండేందుకు అవకాశమున్న అన్యోన్య సంబంధాలనన్నింటినీ ముందుగానే తెలుసుకొని వాటిని అంచనాకట్టడం (ఇదే రష్యాలో నేటి జాతీయసమస్యని చిక్కుపెట్టేస్తున్న విషయం) అసంభవమైన పని.

కాని ఇంగ్లండులో పరిస్థితులు ఏ విధంగా సంభవించాయంటే, చాలా కాలంవరకూ ఇంగ్లీషు కార్మికవర్గం లిబరల్ పక్షంయొక్క ప్రభావంకిందకి వచ్చేసి, లిబరల్‌పక్షంయొక్క అనుబంధంగా తయారై, లిబరల్ కార్మికవిధానాన్ని అవలంబించడంద్వారా స్వతంత్రంగా వ్యవహరించే శక్తిని కోల్పోయి జీవచ్ఛవంలా తయారైంది. ఐర్లండులో బూర్జువా విముక్తి

ద్యమం బలోపేతంగా అభివృద్ధిపొంది విప్లవరూపాలని ధరించింది. మార్క్స్ తన అభిప్రాయాన్ని పునఃపరిశీలించి దాన్ని దిద్దుకొన్నాడు. ''ఒక జాతి మరొకజాతిని బానిసగా చేసుకోవడము ఆ జాతికి అది ఎంత వినాశకరము!'' ఇంగ్లీషు బానిస పరిపాలననుండి ఐర్లండు స్వతంత్రాన్ని పొందేటంతవరకు ఇంగ్లీషు కార్మికవర్గానికి స్వతంత్రం వుండనే వుండదు. ఐర్లండును బానిసశృంఖలాల్లో బంధించి వుంచడం కారణంగా (అనేక జాతులను రష్యా బానిసశృంఖలాలలో వుంచడం కారణంగా రష్యాలో అభివృద్ధి నిరోధక శక్తులకి ఎలా దోహదం జేయబడుతూందో సరిగ్గా ఆవిధంగానే!)

కాగా ''ఐర్లండు జాతితో'', ''ఐర్లండుప్రజతో'' సానుభూతిని తెలియపరచే తీర్మానాన్ని ఇంటర్నేషనల్‌లో ప్రతిపాదించడంలో (మార్క్స్ వర్గపోరాటాన్ని మర్చిపోయినందుకు, తెలివితేటలుగల ఎల్. వ్లా. గారు అతనిని పాపం ఎంతగా తిట్టి వుండేవాడోకదా!), ''విడిపోయిన తరువాత సమాఖ్య ఏర్పడితే ఏర్పడవచ్చును'' అని అన్నప్పటికీ, ఇంగ్లండునుండి ఐర్లండు విడివడిపోవడమే అవసరమని మార్క్స్ వాదించాడు.

ఇట్టి పర్యవసానానికే మార్క్స్ రావడానికి సైద్ధాంతికంగా వున్న కారణాలేమిటి? ఇంగ్లండులో చాలా కాలంకిందటే బూర్జువావిప్లవం పూర్తి అయిపోయింది. అర్ధ శతాబ్ది దాటిన తరువాత ఇంగ్లీషు లిబరల్‌పక్షంవారు ప్రవేశపెట్టిన సంస్కరణల ఫలితంగా, ఐర్లండులో మాత్రం ఇది ఇప్పుడిప్పుడే పూర్తి చెందుతూంది. మార్క్స్ అనుకున్నంత శీఘ్రంగా ఇంగ్లండులో పెట్టుబడిదారీవిధానం నాశనం చేయబడివుంటే, ఐర్లండులో బూర్జువా-ప్రజాతంత్ర ఉద్యమానికీ, సర్వసాధారణ జాతీయోద్యమానికీ అవకాశమే వుండేది కాదు. కాని అట్టి ఉద్యమం అవతరించింది గనుక, దానికి వత్తాసు అందజేయవలసిందనీ, దానికొక విప్లవాత్మకమగు ఉరవడిని ఇవ్వవలసిందనీ తమ సొంత స్వేచ్ఛనే సుస్థిరం చేసుకోవడమనే స్వార్థప్రయోజనం దృష్ట్యా దానిని సమాప్తివరకూ నడిపించవలసిందనీ మార్క్స్ ఇంగ్లీషు కార్మికులకి సలహా చెప్పాడు.

1860 లలో ఐర్లండుకీ ఇంగ్లండుకీ వున్న ఆర్థిక సంబంధాలు, రష్యాకీ పోలెండు, ఉక్రేయిన్ వగైరా దేశాలకీ వున్న వాటికంటె సహజంగానే, చాలా సన్నిహితంగా వుండేవి. ఐర్లండు విడివడిపోవడం (ఇతర కారణాలనటుంచి, భౌగోళిక పరిస్థితుల దృష్ట్యానూ ఇంగ్లండుకున్న బ్రహ్మాండమైన వలససామ్రాజ్యశక్తి దృష్ట్యానూ), ''ఆచరణయోగ్యం కాదనీ'' ''అసాధ్యమనీ'' అప్పట్లో ప్రత్యక్షంగానే కనబడింది. సమాఖ్యకి మార్క్స్ సూత్రప్రాయంగా వ్యతిరేకమే అయినా, ఈ దృష్టాంతంలో మాత్రం, ఐర్లండుయొక్క విమోచన, సంస్కరణవిధానంవల్ల కాకుండా, విప్లవవిధానంవల్ల ఇంగ్లీషు కార్మికవర్గయొక్క సహాయాన్ని కలిగిన ఐర్లండుప్రజా ఉద్యమంవల్లనే సాధించబడిన పక్షంలో, సమాఖ్యకు మార్క్స్

అనుమతించాడు.* చారిత్రకమైన ఈ సమస్యను ఈ విధంగా పరిష్కారం చేస్తేనే, శ్రామిక వర్గంయొక్క ప్రయోజనాలకి ఉత్తమోత్తమంగా ఉపకరించి సాంఘికాభివృద్ధి త్వరితగతిని పరిణతి చెందడానికి అనుకూలించుతుందనడంలో ఎట్టి సందేహమూ లేదు.

పరిస్థితులు మాత్రం ఇందుకు భిన్నంగా పరిణమించాయి. ఐర్లండుదేశపు ప్రజ, ఇంగ్లండుదేశపు కార్మికవర్గమూ రెండూ కూడా బలహీనంగానే వున్నట్టు రుజువైంది. ఇంగ్లండులోని లిబరల్‌పక్షంవారూ, ఐర్లండు బూర్జువావర్గమూ, ఒకరితో ఒకరు చేసుకొన్న నీచాతి నీచమైన బేరసారాలని కుదుర్చుకొన్న ఫలితంగా, నష్టపరిహారంతో కూడుకొన్న భూసంస్కరణలవల్లనూ (ఇది ఎంత కష్టభూయిష్ఠంగా వుందో అల్‌స్టర్ దృష్టాంతమే చెపుతూంది), స్వపరిపాలన (ఇది ఇంతవరకూ ప్రవేశపెట్టనే లేదు) వల్లనూ, ఐర్లండు సమస్యను పరిష్కారం చేయజూస్తున్నారు. దీని అర్థం ఏమిటి? దీన్ని పట్టి మార్క్స్, ఎంగెల్స్‌లు "స్వాప్నికులు" అనీ, "అసాధ్యమైన" జాతీయ కోర్కెలను ప్రతిపాదించారనీ, ఐర్లండు దేశపు పెట్టీబూర్జువావర్గపు జాతీయవాదుల ప్రభావానికి లొంగిపోయారనీ ("ఫెనియన్" ఉద్యమంయొక్క పెట్టీబూర్జువాతత్వం గురించి ఎట్టి సందేహమూ వుండనవసరం లేదు) మనం అర్థం చేసుకోవాలా?

కాదు. ఐర్లండుసమస్య విషయంలో కూడా, మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రజాస్వామ్యపు, సోషలిజపు భావాల్లో ప్రజాసామాన్యానికి ప్రబోధాన్ని కలిగించేటట్టి సూత్రైన శ్రామికవర్గ విధానాన్నే అవలంబించారు. అత్యవసరంగా ప్రవేశపెట్టవలసిన సంస్కరణలను అర్ధశతాబ్ది

---

* సోషల్-డెమోక్రసీ దృష్ట్యా, స్వయంనిర్ణయానికిగల హక్కుయొక్క అర్థం, సమాఖ్య అనికాని, స్వపరిపాలన అనికాని (సిద్ధాంతరీత్యా రెండున్నూ "స్వయంనిర్ణయం" అనే అంశాని కిందే వచ్చినప్పటికీ) కానే కాదు. సమాఖ్యలో చేరడానికిగల హక్కు, సామాన్యంగా ఆలోచిస్తే, అసందర్భంగానే కనబడుతుంది. ఎందుచేతనంటే, సమాఖ్య అనేది రెండు పక్షాల ఇష్టంపైన జరగవలసిన ఒప్పందం. తమ కార్యక్రమంలో సమాఖ్యవిధాన సమర్థనకు ప్రధాన స్థానాన్ని ఇవ్వడానికి మార్క్సిస్టులకి వీలులేదని మనం ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. స్వపరిపాలనకి సంబంధించినంత వరకు, స్వపరిపాలనా హక్కునుగాక, పలురకములగు వివిధ జాతుల సంఘట్టనను భౌగోళికంగా ఇతర పరిస్థితులవల్లనూ నిశితమైన విభేదాలను కలిగిన ప్రజాస్వామిక రాజ్యాంగయంత్రంయొక్క సాధారణ సార్వత్రిక సూత్రంగా స్వపరిపాలననే మార్క్సిస్టులు సమర్థిస్తారు. కాబట్టి, "జాతులకు సమాఖ్యగా ఏర్పడడానికిగల హక్కు" ఎంత అసందర్భంగా వుందో, "జాతులకు స్వపరిపాలనకుగల హక్కు" కూడా అంత అసందర్భంగానూ వుంది.

పాటు జాప్యంచేయడంవలన ఐర్లండుకూ ఇంగ్లండుకూ నష్టం కలుగకుండానూ, అభివృద్ధి నిరోధకులకు సంతోషాన్ని కలిగించడానికని లిబరల్‌పక్షంవారు ఈ సంస్కరణలకు వికృత పరచకుండానూ ఈ విధానం ఒక్కటే కాపాడగలిగి వుండేది.

ఐర్లండుసమస్యపట్ల మార్క్స్, ఎంగెల్స్‌లు సూచించిన విధానం జాతీయోద్యమాలయెడల పీడక జాతులలోని శ్రామికవర్గం అవలంబించవలసిన వైఖరికి చక్కని దృష్టాంతాన్ని చూపుతూంది. ఈ దృష్టాంతానికి నేటికి కూడా ఎంతో అంత ప్రాయోగికమైన విలువ ఉంది. ఒక జాతికి చెందిన భూస్వాములూ బూర్జువావర్గమూ చేసే దౌర్జన్యాలవల్లనూ, వీరికి వున్న విశేషాధికారాలవల్లనూ, ఏర్పడిన రాజ్యాల సరిహద్దులను మార్పుచేసే ఉద్దేశమే ''కలలోని మాట'' అని, ముందుగానే అన్ని దేశాలకీ అన్ని రంగులకీ అన్ని భాషలకీ చెందిన అల్పబుద్ధులు ఆదికి ముందుగానే కాకిగోలచేసే ''బానిస తొందరపాటు'' పట్ల జాగ్రత్తవహించి వుండాలని ఈ ఉదాహరణ హెచ్చరిక చేస్తూంది.

ఐర్లండు ఇంగ్లండు దేశాల శ్రామికవర్గాలు, మార్క్స్, ఎంగెల్స్‌లు సూచించిన విధానాన్ని అవలంబించక, ఐర్లండుకు విడివడిపోవడానికిగల హక్కును తమ నినాదంగా తీసుకొనకపోయి వుంటే, అది వాటి పక్షాన హేయాతిహేయమైన అవకాశవాదమే, ప్రజాస్వామ్యవాదియొక్కా సోషలిస్టుయొక్క కర్తవ్యాలను విస్మరించడమే, ఇంగ్లండులోని అభివృద్ధి నిరోధకానికీ బూర్జువావర్గానికీ రాయితీని కల్పించడమే అయివుండేది.

ఫిబ్రవరి — మే 1914.

# యూరప్ సంయుక్త రాష్ట్రములు అనే నినాదం గురించి

''యూరప్ సంయుక్త రాష్ట్రములు'' అనే నినాద ప్రశ్నను, ఆ ప్రశ్నయొక్క ఆర్థిక పార్శ్వంపై పత్రికలో చర్చ ఇంకా సాగుతూనే వుండడం కారణంగా, దానిని వాయిదా వేయ డానికి మన పార్టీ విదేశ విభాగాల కాన్ఫరెన్స్ నిశ్చయించిందని ''సోత్సియాల్-డెమోక్రాత్'' పత్రిక, 40 వ సంచికలో మేం నివేదించాం.

ఈ ప్రశ్నపై మన కాన్ఫరెన్స్‌లో జరిగిన చర్చ ఏకపక్షపు రాజకీయ స్వభావం ధరిం చింది. ఈ నినాదాన్ని కేంద్ర కమిటీ ప్రణాళిక రాజకీయమైనదని సూటిగా సూత్రీకరించ డమూ (''తక్షణ రాజకీయ నినాదం...'' అని అందులో చెప్పింది), రిపబ్లికన్ యూరప్ సంయుక్త రాష్ట్రాలు అనే నినాదాన్ని అది ప్రతిపాదించడమే కాకుండా, ''జర్మన్, ఆస్ట్రి యన్, రష్యన్ రాజరిక వ్యవస్థలు విప్లవాత్మకంగా కూలదోయబడనిదే'' ఈ నినాదం అర్థ రహితమూ బూటకమూ అనే విషయం నొక్కి చెప్పడం బహుశా పాక్షికంగా ఇందుకు కారణమై వుండవచ్చు.

ఈ ప్రత్యేక నినాదాన్ని రాజకీయంగా విలువకట్టుతూన్నట్టి పరిమితులలో ఈ ప్రశ్నను ప్రదర్శించడానికి అభ్యంతరం చెప్పడం — ఉదాహరణకు, సోషలిస్టు విప్లవ నినాదాన్ని మరుగు పరచేస్తూందీ, లేక బలహీనపరచేస్తూందీ వగైరా దృక్స్థానంనుండి అభ్యంతరం చెప్పడం — కేవలం తప్పే అవుతుంది. నిజమైన ప్రజాస్వామిక దిశలో జరిగే రాజకీయ మార్పులూ, మరీ ముఖ్యంగా రాజకీయ విప్లవాలూ, ఎన్నడూ ఎట్టి సందర్భాల్లోనూ సోషలిస్టు విప్లవ నినాదాన్ని మరుగుపరచనూ లేవు, బలహీనపరచనూ లేవు. తత్‌వ్యతిరేకంగా, దానిని ఎల్లప్పుడూ దగ్గరగా తీసుకువస్తాయి; దాని ప్రాతిపదికను మరింత విశాలతరం చేస్తాయి; పెట్టీబూర్జువా, అర్ధశ్రామికవర్గ రాసులలోని నూతన స్తరాలను సోషలిస్టు పోరాటంలోకి లాక్కొస్తూంటాయి. ఇక అటు సోషలిస్టు విప్లవ గమనంలో రాజకీయ విప్లవాలు అనివార్యము అవుతాయి; సోష లిస్టు విప్లవాన్ని ఒకే ఒక-అంకంగా భావించకూడదు, ఝంఝూవాతభరితములైన రాజకీయ,

ఆర్థిక ఉత్పాతాలనూ, తీవ్రతమములైన వర్గ పోరాటాలనూ, అంతర్యుద్ధాన్నీ, విప్లవాలనూ, విప్లవప్రతిఘాతాలనూ కలిగిన శకంగానే మనం భావించాల్సి వుంటుంది.

కాని, రష్యా నాయకత్వాన వున్నట్టి యూరప్‌లోని అత్యంత అభివృద్ధి నిరోధకములైన మూడు రాజరిక వ్యవస్థలను విప్లవాత్మకంగా కూలదోయడం సంబంధంలో రిపబ్లికన్ యూరప్ సంయుక్త రాష్ట్రాల నినాదం, ఒక రాజకీయ నినాదంగా పూర్తిగా అభేద్యమైనదై వుండగా, ఈ నినాదంయొక్క ఆర్థిక విషయమూ ప్రాముఖ్యతా అనే ప్రశ్న ఇంకా మిగిలే వుంది. సామ్రాజ్య వాద ఆర్థిక పరిస్థితుల — అనగా, పెట్టుబడి ఎగుమతి, ''పురోగాములు'', ''నాగరికములు'' అయిన వలస రాజ్యాలు ప్రపంచాన్ని విభజించి పంచేసుకునాయన్న వాస్తవవిషయాల — దృక్ స్థానంనుండి చూసినట్టయితే యూరప్ సంయుక్త రాష్ట్రాలు అన్నది పెట్టుబడిదారీ విధానం కింద అసాధ్యమైనా అవుతుంది, లేదా అభివృద్ధి నిరోధకమైనా అవుతుంది.

పెట్టుబడి అంతర్జాతీయమూ, గుత్తవ్యాపార స్వాభావికమూ అయిపోయింది. పట్టు మని పట్టెడు మహా రాజ్యాలు, అనగా జాతులను నిలువునా దోచుకోవడంలోనూ హింసించ డంలోనూ విజయం సాధించిన రాజ్యాలు, ప్రపంచాన్ని విభజించి పంచేసుకున్నాయి. యూరప్ లోని నాలుగు మహా రాజ్యాలు — 25 కోట్ల నుండి 30 కోట్లు వరకూ జనాభా కల్గి, 70 లక్షల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం కల్గిన ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, జర్మనీలు — ఇంచు మించు అర్ధశతకోటి (49,45,00,000) జానాభా కల్గి, 6 కోట్ల 46 లక్షల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం, అనగా భూగోళం ఉపరితలంలో (ధ్రువప్రాంతం మినహా, 13 కోట్ల 30 లక్షల చదరపు కిలోమీటర్లు) ఇంచుమించు సగం విస్తీర్ణం కల్గిన వలసలను తమ అధీ నం చేసుకున్నాయి. ''విముక్తి'' సంగ్రామం సాగించుతూన్నట్టి జపాను, రష్యా, ఇంగ్లండు, ఫ్రాన్సు అనే దోపుడుకాండ్రచే నేడు తునాతునుకలుగా చీల్చివేయబడుతూన్న ఆసియా రాజ్యా లనూ చైనా, టర్కీ, పర్షియాలనూ దీనికి కలపండి. అర్ధవలసదేశాలు అని పిలువతగినట్టి (వాస్తవానికి అవి పదింట తొమ్మిది పాళ్ళు వలసదేశాలే), ఈ మూడు ఆసియా రాజ్యాల లోనూ 36 కోట్ల జనులు నివసిస్తున్నారు, వీటి విస్తీర్ణం కోటీ 45 లక్షల చదరపు కిలో మీటర్లు (మొత్తం యూరప్ విస్తీర్ణం కంటె ఇంచుమించు ఒకటిన్నర రెట్లు).

ఇంతేకాదు. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీలు విదేశాల్లో ఎంతలేదన్నా 70 వేల మిలి యన్ల రూబుళ్లు పెట్టుబడులు పెట్టాయి. ఈ చక్కని మొత్తంపైన సాలీనా 3 వేల మిలియన్ల రూబుళ్ళకుపైగా ''ధర్మబద్ధమైన'' లాభం సంపాదించి పెట్టడమనే కర్తవ్యాన్ని సేనల, యుద్ధనౌకాదళాల సహాయంతో ''మహారాజశ్రీ శతకోటి గారి'' కొమాళ్లనూ అన్న దమ్ములనూ, వైస్‌రాయ్‌లు, కాన్సల్స్, రాయబారులు, నానా రకాల ఉద్యోగస్థులు, మతగురు

వులు, వగైరా జలగల స్థానాల్లో ''వుంచేటట్టి'', ''ప్రభుత్వాలు'' అని పిలువబడుతూన్న లక్షాధికార్ల జాతీయ సమితులు నెరవేర్చుతున్నాయి.

పెట్టుబడి అభివృద్ధి అత్యుచ్చదశ శకంలో పట్టెడు మహా రాజ్యాలచే భూప్రపంచపు జనాభాలోని సుమారు కోటి జనాన్ని దోపిడి చేయడం ఈ విధంగా ఆర్గనైజు చేయబడుతూంది. పెట్టుబడిదారీ విధానం కింద ఇతర విధమైన ఆర్గనైజేషను మరొకటేదీ సాధ్యం కాదు. వలసదేశాలనూ, ''ప్రభావ మండాల''నూ, పెట్టుబడి ఎగుమతినీ వదలుకోవడమా? ఇది సాధ్యపడుతుందని అనుకోవడం, క్రైస్తవమత ఉదాత్త సూత్రాలను గురించి ప్రతి ఆది వారమూ ధనికులకు బోధించుతూ, బీదలకు కొన్ని శతకోటి రూబుళ్లు పోనీ శతకోటి కాక పోతే మానె, కొన్ని వందల రూబుళ్ళేనా ఏటా దానంచేయ వలిసిందని సలహాచెప్పే సామాన్య మతగురువు స్థాయికి దిగజారిపోవడమే అవుతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ కింద యూరప్ సంయుక్త రాష్ట్రాలంటే వలసదేశాలను విభజించుకునే ఒప్పందంతో సమానమన్నమాటే. ఏమైనప్పటికీ పెట్టుబడిదారీ వ్యవస్థ కింద బలం తప్ప, విభజించి పంచుకోవడానికి మరే సూత్రమూ, మరే ప్రాతిపదికా సాధ్యం కాదు. ''పెట్టుబడుల'' నిష్పత్తిలో (పెద్ద పెట్టుబడికి న్యాయమైనదాని కంటెనూ ఇంకా హెచ్చే ఇచ్చేందుకని ముట్టజెప్పతూన్న అదనపు బోనస్‌తో సహా) తప్ప మరొక లాగున పెట్టుబడిదారీ దేశంయొక్క ''జాతీయ ఆదాయాన్ని'' పంచుకోవడానికి కోటీశ్వరుడు ఒప్పకోడు. పెట్టుబడిదారీ విధానమంటే ఉత్పత్తి సాధానాలలో సొంత ఆస్తీ, ఉత్పత్తిలో అరాచకమూ అన్నమాట. ఇటువంటి ప్రాతిపదికపై ''ధర్మమైన'' ఆదాయ విభజనను బోధించడమంటే ప్రూడనిజం అన్నమాట, తెలివితక్కువ అల్పబుద్ధి అన్నమాట. ''బలాబలాల'' నిష్పత్తిలోనే తప్ప మరొక విధంగా విభజన జరగడానికి వీలేలేదు. కాగా ఆర్థికాభివృద్ధి ప్రగతి ననుసరించి బలాబలాలు మారుతూ వుంటాయి. 1871 తరువాత జర్మనీ బలం ఇంగ్లండు, ఫ్రాన్సుల బలంకంటె మూడునుండి నాల్గింతలవరకూ త్వరితగతినీ, జపాను బలం రష్యా బలంకంటె సుమారు పదింతలు త్వరితగతినీ పెరిగింది. పెట్టుబడిదారీ దేశం యొక్క నిజమైన బలాన్ని యుద్ధంలో తప్ప మరొక విధంగా పరీక్షించే మార్గం వుండేందుకే వీల్లేదు. యుద్ధం సొంత ఆస్తి మూలసూత్రాలకు విరుద్ధం కాదు — తత్‌వ్యతిరేకంగా ఈ మూల సూత్రాల నుండి అది సూటిగానూ తప్పనిసరిగానూ ప్రభావిత మవుతుంది. పెట్టుబడిదారీ విధానం కింద వ్యక్తిగత పారిశ్రామిక సంస్థల, వ్యక్తిగత రాజ్యాల ఆర్థికాభివృద్ధియొక్క సమమైన పెరుగుదల అసాధ్యం. పెట్టుబడిదారీ విధానంకింద, ఆవర్తక్రమంగా కల్లోలిత మవుతూన్న సమతాస్థితిని పరిశ్రమలో సంక్షోభాలూ, రాజకీయాల్లో యుద్ధాలు మినహా పునస్థాపించే సాధనం ఇంకొకటిలేదు.

పెట్టుబడిదారుల మధ్యా, రాజ్యాల మధ్యా తాత్కాలికపు ఒడంబడికలు, సాధ్యమవడం సహజమే. ఈ అర్థంలో, యూరపియన్ పెట్టుబడిదారుల మధ్య ఒక ఒడంబడికగా యూరపియన్ సంయుక్త రాష్ట్రాలు సాధ్యమే. దేని గురించి ఒడంబడిక? యూరప్‌లో సోషలిజాన్ని ఉమ్మడిగా అణచివేసేందుకే, వయస్సు ముదురుతూన్నకొద్దీ క్షీణత ప్రారంభించి, వెనుకబడి నట్టి రాజరికవ్యవస్థిత యూరప్ కంటె గత అర్ధశతాబ్దిలోనూ అపరిమితమైన త్వరితగతిని తమ బలాన్ని పెంచుకున్నట్టి, వలసదేశాల ప్రస్తుతపు విభజన ప్రకారం తమకు రావలసిన భాగం ముట్టకపోవడం కారణంగా తమకు జరిగిన అన్యాయానికి కినుక చెందిన అమెరికా, జపానులకు వ్యతిరేకంగా వలస కొల్లసొత్తును ఉమ్మడిగా పరిరక్షించుకుందుకే. అమెరికా సంయుక్త రాష్ట్రాలతో సరిపోల్చిచూస్తే, మొత్తంగా యూరప్ ఆర్థిక స్తబ్ధత వ్యక్తమవుతూంది. ప్రస్తుతపు ఆర్థిక ప్రాతిపదికపై, అనగా పెట్టుబడిదారీ విధానం కింద, యూరప్ సంయుక్త రాష్ట్రాల ఏర్పాటంటే దాని అర్థం, అమెరికా యొక్క మరింత సత్వరాభివృద్ధిని ఆలస్యంచేసే అభివృద్ధి నిరోధకం యొక్క ఆర్గనైజేషను అన్నమాటే. ప్రజాస్వామ్యం, సోషలిజం కార్యంయొక్క పురోభివృద్ధిని కేవలం ఒక్క యూరప్‌తోనే ముడిపెట్టి వుంచిన కాలం శాశ్వతంగా అంతరించిపోయింది.

ప్రపంచ సంయుక్త రాష్ట్రాలు (ఒక్క యూరపే కాకుండా) అనేది — ప్రజాస్వామిక రాజ్యాంగయంత్రంతో సహా ప్రతి రాజ్యాంగయంత్రపు పూర్తి అంతర్ధానాన్ని తీసుకువచ్చే కమ్యూనిజం యొక్క సంపూర్ణ విజయం సంభవించేవరకు సోషలిజంతో మనం కలిపి చెప్పుకునే జాతుల ఏకీకరణ స్వేచ్ఛల యొక్క రాజ్యాంగయంత్ర రూపం. అయితే మట్టుకు, ప్రపంచ సంయుక్త రాష్ట్రాలు అనే నినాదం, విడిగా వేరే ఒక నినాదంగా మాత్రం సరైనది కాజాలదు; ఎందుచేతనంటే మొదటి కారణం, ఇది సోషలిజంలో లీనమైపోతూంది; రెండవది, ఈ నినాదంనుండి ఏదైనా ఒకే ఒక్క దేశంలో సోషలిజం విజయం అసాధ్యమనే అపార్థం తీయడానికి వీలవుతుంది, కాగా ఇతర దేశాలతో అట్టి దేశంయొక్క సంబంధాలను గురించి ఇది అపోహలు సృష్టించవచ్చు కూడానూ.

అసమమైన ఆర్థిక, రాజకీయ అభివృద్ధి పెట్టుబడిదారీ విధానం యొక్క పరమ నియమం. కాబట్టి సోషలిజం విజయం అనేక పెట్టుబడిదారీ దేశాలలోనైనా, లేదా విడిగా ఏదైనా ఒకే ఒక పెట్టుబడిదారీ దేశంలోనైనా మొదట సాధ్యం కావచ్చు. ఈ దేశంలోని విజయోపేతమైన శ్రామికవర్గం, పెట్టుబడిదార్లనుండి వారి ఆస్తి హక్కులను లాక్కొని తన సొంత సోషలిస్టు ఉత్పత్తిని ఆర్గనైజుచేసుకుని, కడమ పెట్టుబడిదారీ ప్రపంచానికి వ్యతిరేకంగా నిలబడుతుంది. ఇతర దేశాల పీడిత వర్గాలను తన పక్షం ఆకర్షించుతూ ఆ దేశాలలో పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా ఉపప్లవాలు లేవదీస్తూ, ఒకవేళ అవసరమైన పక్షంలో

దోపిడీదారీ వర్గాలకూ వారి రాజ్యాలకు వ్యతిరేకంగా సాయుధ బలంతో సహితం ముందుకు వస్తుంది. ఏ సమాజం యొక్క రాజకీయ రూపంలోనైతే బూర్జువావర్గాన్ని కూలదోయడం వల్ల శ్రామికవర్గం విజయం సాధించిందో అట్టి సమాజపు రాజకీయ రూపం రిపబ్లిక్కే అవుతుంది. ఈ ప్రజాస్వామిక రిపబ్లిక్కు సోషలిజంలోకి ఇంకా పరివర్తనచెందనట్టి రాజ్యాలకు వ్యతిరేకమైన పోరాటంలో ఆ జాతి, లేక జాతుల శ్రామికవర్గ శక్తులను అంతకు మరింతగా కేంద్రీకరించుతుంది. పీడిత వర్గాలయొక్క, శ్రామికవర్గంయొక్క, నియంతృత్వం లేనిదే వర్గాలను అంతంచేయడం అసాధ్యం. బడుగు రాజ్యాలకు వ్యతిరేకంగా సోషలిస్టు రిపబ్లిక్కుల ఇంచుమించు సుదీర్ఘమైన మొండి పోరాటం లేనిదే సోషలిజంలో జాతుల స్వేచ్ఛాయుతమైన ఏకీకరణ అసాధ్యం.

ఈ హేతువుల వల్లనూ, విదేశాలలో వున్నట్టి ఆర్.ఎస్.డి.ఎల్.పి యొక్క విభాగాల కాన్ఫరెన్స్‌లో పదేపదే సాగిన చర్చల తరువాతనూ, కాన్ఫరెన్స్ తరువాతనూ, కేంద్ర పత్రిక సంపాదకులు యూరప్ సంయుక్త రాష్ట్ర నినాదం సరైనదికాదనే సారాంశాన్ని తేల్చారు.

ఆగస్టు 1915.

# గతితార్కిక ప్రశ్న గురించి

ఐక్యతయొక్క విభజన, దాని విరుద్ధ విభాగాల జ్ఞేయమూ (చూ. హెరాక్లిటస్‌పై లాసాల్ రాసిన గ్రంథంలో "జ్ఞేయము" అనే శీర్షికనుగల 3 వ భాగం ప్రారంభంలో హెరాక్లిటస్‌ను గురించి ఫిలొనుండి ఉల్లేఖన) గతితర్కంయొక్క సారం ("సారాంశముల"లో ఒకటి, దాని ప్రత్యేకతలలో లేక స్వభావాలలో మౌలికము, అలా కానియెడల మౌలికములైన వాటిలో ఒకటి). ఈ విషయాన్ని హెగెల్ కూడా సరిగ్గా ఈ విధంగానే చెబుతాడు (అరిస్టాటిల్ తన "అతిభౌతికవాదం"* లో దీనితోనే నిరంతరమూ పెనగులాడుతాడు, హెరాక్లిటస్ respective** హెరాక్లియన్ భావాలతోనూ యుద్ధం చేస్తాడు).

గతితార్కిక విషయంలోని ఈ పార్శ్వం యొక్క యథార్థతను విజ్ఞానశాస్త్ర చరిత్ర వల్ల పరీక్షించాల్సి వుంటుంది. గతితర్కంయొక్క ఈ పార్శ్వంపైన సాధారణంగా చాలినంత శ్రద్ధ తీసుకోబడడం లేదు (ఉదాహరణకు, ప్లెహానొవ్); విరోధముల అభిన్నత్వం ఉదాహరణల పూర్ణ మొత్తంగా తీసుకోబడుతూంది ["ఉదాహరణకు, ఒక విత్తు," "ఉదాహరణకు, ఆదిమ కమ్యూనిజం." ఎంగెల్స్ విషయంలో కూడా ఇది నిజమే. కాని "ప్రజానురంజకంగా వుండేందు" మాత్రమే ఈయన ఇలా చేశాడు....] అంతేగాని జ్ఞాన నియమంగా (లేదా బాహ్యగతాత్మక ప్రపంచంయొక్క నియమంగా కాదు).

గణితశాస్త్రంలో: +, –. వ్యావర్తక [Differential], పూర్ణాంకిక [Integral].

యాంత్రికశాస్త్రంలో: క్రియ, ప్రతిక్రియ.

భౌతికశాస్త్రంలో: ధన, రుణ విద్యుత్తు.

రసాయనశాస్త్రంలో: అణు సంయోగం, అణు విచ్ఛేదనం.

సాంఘికశాస్త్రంలో: వర్గపోరాటం.

---

* మెటఫిజిక్స్ — అనువాదకుడు.

** ఆ యా సంబంధమైన — అనువాదకుడు.

విరోధముల అభిన్నత్వం (వాటి ''ఐక్యత'' అంటేనే బహుశ సరిగా వుంటుందేమో? — అభిన్నత్వం, ఐక్యత అనే పదాలకుగల భేదం ఇక్కడ ప్రత్యేకంగా ముఖ్యమైనది కాకపోయి నప్పటికీ కూడానూ. ఒక ప్రత్యేకార్థంలో రెండూ సరైనవే), ప్రకృతియొక్క (మనస్సు, సమాజమూ కలుపుకొని) అన్ని దృగ్విషయాలలోనూ, ప్రక్రియలలోనూ వున్న వైరుధ్యాన్ని కల్గినట్టి, పరస్పరమూ వినాయించుకునేటట్టి, విరోధ ధోరణుల గుర్తింపు (ఆవిష్కరణ). వాటి ''స్వీయచలనమూ,'' వాటి అయత్నకృత అభివృద్ధి, వాటి సజీవ జీవితములతో సహా అన్ని ప్రపంచ ప్రక్రియల జ్ఞానానికి షరతు అవి విరోధముల ఐక్యత అనే జ్ఞానమే. అభివృద్ధి విరోధముల ''పోరాటం.'' అభివృద్ధి (పరిణామం) యొక్క రెండు మౌలిక (లేదా రెండు సాధ్యమైన? లేదా చారిత్రకంగా రెండు అవేక్షింపబడగల్గిన?) భావాలు ఏవంటే: హెచ్చు, తగ్గుల రూపంగానూ, పునరుక్తి రూపంగానూ అభివృద్ధి; మరియు, విరోధముల ఐక్యతగానూ అభివృద్ధి (పరస్పరమూ వినాయింపు చేసుకునేటట్టి విరోధాలుగానూ, వీటి పరస్పర సంబంధం గానూ ఐక్యతయొక్క విభజన). చలనంయొక్క మొదటి భావనలో, స్వీయ చలనం, దాని చోదకశక్తి, దాని మూలాధారం, దాని నిమిత్తం పూర్వరంగంలోనే వుండిపోతుంది (లేదా, దీని మూలాధారం బాహ్యం చేయబడుతుంది — దేవుడు, కర్త, వగైరాలు). రెండవ భావనలో, ''స్వీయ'' చలన మూలాధారంయొక్క జ్ఞానంపైనే దృష్టి సారించబడుతుంది. మొదటి భావన మృతం, వివర్ణం, శుష్కం. రెండవది జీవకళాసహితం. రెండవది మాత్రమే, అస్తిత్వంకలిగివున్న ప్రతిదాని ''స్వీయచలనంలో'' వున్న కీలకాన్నీ బయట పెట్టుతుంది; ''దాట్ల''కూ, ''అవిరతంలో విరుపుల''కూ ''విరుద్ధంలోకి పరివర్తన''కూ, పాతయొక్క వినాశానికీ, కొత్తయొక్క ప్రాదుర్భావానికీ వుండే కీలకాన్ని ఇది మాత్రమే బయట పెట్టుతుంది.

విరుద్ధాల ఐక్యత (అనురూపం, అభిన్నత్వం, ఫలితసమానత నిబంధనాబద్ధం తాత్కాలికం, పరివర్తనీయం, సాపేక్షం. అభివృద్ధి, చలనం, ఎలాగైతే పరమమో, అలాగే పరస్పరం వినాయించుకునే విరోధాల పోరాటమూ పరమమే.

ష.రా. ప్రాసంగికంగా, స్వకీయగతాత్మక వాదానికీ (సంశయవాదం, కుతర్కం, వగైరా), గతితర్కానికీ భేదమేమిటంటే, (బాహ్యగతాత్మక) గతితర్కంలో సాపేక్షానికీ పరమానికీ వున్న భేదమే అసలు సాపేక్షం. బాహ్యగతాత్మక గతితర్కానికి సాపేక్షం లోపల సహితం పరమం గోచరించుతుంది. స్వకీయగతాత్మకవాదానికీ కుతర్కానికీ రెండింటికీ సాపేక్షం కేవలం సాపేక్షమూ, పరమాన్ని వినాయించేదిన్నీ.

తన "పెట్టుబడి" గ్రంథంలో మార్క్స్ అన్నిటికంటే సరళమైనదీ, అన్నిటిలోనూ సాధారణమూ, మౌలికమూ, అన్నిటికంటే సామాన్యమూ, అనుదినమూ అయినట్టి బూర్జువా (వర్తకపు సరుకుల) సమాజ సంబంధాన్ని, లక్షోపలక్షల సార్లు తారసిల్లుతూన్నట్టి సంబంధాన్ని, అనగా, వర్తకపు సరుకుల మార్పిడిని, మొట్టమొదట విశ్లేషించుతాడు. అత్యంత సరళమైన ఈ దృగ్విషయంలో (బూర్జువా సమాజ జీవితంలోని ఈ "కణం"లో), ఆధునిక సమాజంలో వున్న అన్ని వైరుధ్యాలనూ (respective, అన్ని వైరుధ్యాల మూలబీజాలనూ) ఈ విశ్లేషణ బహిరంగపరుస్తుంది. తరువాతి వ్యాఖ్యానంలో ఈ వైరుధ్యాలయొక్క అభివృద్ధిని (వృద్ధి, చలనం, రెండింటినీ కూడా), ఈ సమాజంయొక్క అభివృద్ధినీ (దాని మొదటి నుండి చివర వరకూ), దాని విడి భాగాల $\Sigma$* అభివృద్ధినీ మనకు చూపెడుతుంది.

సాధారణంగా గతితర్కాన్ని వ్యాఖ్యానించేటప్పుడు (respective అధ్యయనం చేసేటప్పుడు) అవలంబించాల్సిన పద్ధతి ఈ విధంగా వుండాలి (ఎందుచేతంటే, మార్క్స్ దృష్టిలో గతితర్కం యొక్క ఒక ప్రత్యేక దృష్టాంతమే బూర్జువా సమాజపు గతితర్కం). అన్నిటి కంటే అత్యంత సరళము, సాధారణము, సామాన్యము వగైరా వగైరా అయినట్టి, ఏదైనా సరే ఒక వాక్యం తీసుకుందాం: చెట్టు ఆకులు పచ్చగా వున్నాయి; వెంకన్న ఒక మనిషి; టామీ ఒక కుక్క, వగైరా. గతితర్కం అప్పుడే ఇక్కడ మనకి (హెగెల్ ప్రతిభ గుర్తించినట్లు) మనకు తారసిల్లుతూంది: విశేషమే సాధారణం అవుతూంది (చూ. Aristotels, Metaphysik, ష్వెగ్లర్ అనువాదం, 25 వ సంపుటి, 40 వ పుట; 3 వ గ్రంథం, 4 వ అధ్యాయం, 8–9: "denn natürlich kann man nicht der Meinung sein, dass es ein Haus – సాధారణంగా ఒక ఇల్లు – gebe ausser den sichtbaren Häusern" οὐ γὰρ ἂν θείημεν εἶναί τινα οἰκίαν παρὰ τὰς τινὰς οἰκίας.**) ఆనుషంగికంగా, విరోధాలు రెండూ (సాధారణానికి విరోధి అయిన విశేషం) అభిన్నములే: సాధారణానికి కేవలమూ దారితీసే సంబంధంలోనే విశేషం అస్తిత్వాన్ని కలిగివుంటుంది. విశేషంలోనే, విశేషం ద్వారానే అస్తిత్వాన్ని కలిగివుంటుంది సాధారణం. ప్రతి విశేషమూ (ఏదో ఒక విధంగా) ఒక సాధారణమే. ప్రతి సాధారణమూ ఒక విశేషమే (లేదా, ఒక విశేషం యొక్క ఖండం, లేదా పక్షం, లేదా సారం). ప్రతి సాధారణమూ అన్ని

* మొత్తం. — సం.

** "ఎందుచేతంటే, ప్రత్యక్షంగానే, కనబడుతూన్న ఇళ్ళుకాక, వేరే మరొక ఇల్లు వుండొచ్చుననే అభిప్రాయం ఎవ్వరికీ కలగదు." — సం.

విశేష విషయాలనూ కేవలం ఆసన్నంగానే తనలో ఇముడ్చుకుని వుంటుంది. ప్రతి విశేషమూ అసంపూర్ణంగానే సాధారణంలో, చేరివుంటుంది వగైరా వగైరా. ప్రతి విశేషమూ ఇతర రకాలకు చెందిన విశేషాలు (వస్తువులు, దృగ్విషయాలు, ప్రక్రియలు) వగైరాలతో వేలాది పరివర్తనలవల్ల సంబంధం కలిగి వుంటుంది. మనకిక్కడ అప్పుడే అవసరం యొక్క, ప్రకృతిలోని బాహ్యగతాత్మక సంబంధమూ మూలద్రవ్యాలు, మూలబీజాలు, సామాన్య ప్రత్యయాలు వగైరాలు కనబడుతున్నాయి. ఇక్కడప్పుడే మనకి ఆగంతుకమూ, అవసరమూ, స్వరూపమూ, సారమూ కనబడుతున్నాయి; ఎందుచేతంటే, వెంకన్న ఒక మనిషి, టామీ ఒక కుక్క, ఇది చెట్టు యొక్క ఆకు అని మనం అన్నప్పుడు, అనేక గుణాలను మనం ఆగంతుకం అని తోసిపారేస్తున్నాం; స్వరూపం నుండి సారాన్ని వేరుపరచి, ఒకదానికొకటి విపర్యస్తంగా పెడుతున్నాం.

ఈలాగున ఏ ఒక వాక్యంలోనైనా సరే, ఒక "న్యూక్లియస్"* ("సెల్యూల్") లో వున్నట్టే గతితర్కంలోని అన్ని మూలద్రవ్యాలయొక్క మూలబీజాలనూ మనం బహిర్గతం చేయగల్గుతాం (చేయాలి కూడానూ); కాగా తద్వారా గతితర్కం సాధారణ మానవజ్ఞానం అంతటియొక్క ధర్మమని చూపగల్గుతాం. కాగా, ఇవే గుణాలు కలిగినట్టి బాహ్యగతాత్మక ప్రకృతిని, విశేషం సాధారణంలోకి ఆగంతుకం అవసరంలోకి పరివర్తన చెందడమును, విరోధాల యొక్క మార్పులను, మూర్ఛనలను పరస్పర సంబంధాలను ప్రకృతిశాస్త్రం మనకి కనబరుస్తుంది (కాగా ఇక్కడ కూడా ఏదైనా సరే ఒక సరళ దృష్టాంతం తీసుకునే దీనిని నిరూపించాలి). గతితర్కం మార్క్సిజం యొక్క (హేగెల్ యొక్క కూడా) జ్ఞానసాధన సిద్ధాంతమే. విషయం యొక్క ఈ "పార్శ్వం" పట్ల (ఇది విషయం యొక్క ఒక "పార్శ్వమే" కాదు, విషయం యొక్క సారమే) ప్లెహానొవ్ — ఇక ఇతర మార్క్సిస్టుల గురించి చెప్పనే అక్కరలేదు — ఎట్టి శ్రద్ధ చూపలేదు.

* * *

హేగెల్ (చూ. అతను రచించిన "తర్కశాస్త్రం"), ప్రకృతిశాస్త్రం యొక్క ఆధునిక "జ్ఞానసాధన సిద్ధాంతకర్త", వరణతత్వవేత్త, హేగేలియన్ తత్వశాస్త్ర శత్రువు (దానిని అతడు అర్థమే చేసుకోలేదు!) అయినట్టి Paul Volkmann (చూ. అతని Erkenntniss-

---

* కేంద్రకం. — అనువాదకుడు.

theoretische Grundzüge. S.*) – వీరిద్దరూ కూడా జ్ఞానాన్ని ఒక వృత్తముల పరంపర రూపంలో చిత్రించారు.

| |
|---|
| తత్వశాస్త్రంలో "వృత్తములు": [వ్యక్తుల కాలక్రమఘటనా వివరణ ఆవశ్యకమా? కాదు!] |
| పురాతన: డెమోక్రిటస్ నుండి ప్లేటో, హెరాక్లిటస్ యొక్క గతితర్కం వరకూ. |
| పునరుజ్జీవనం: డేకార్ట్ versus**. Gassendi (Spinoza?) |
| ఆధునిక: హోల్‌బాఖ్ – హేగెల్ (బార్క్లీ, హ్యూమ్, కాంట్ మీదుగా). |
| హేగెల్—ఫాయెర్‌బాఖ్ – Marx. |

సజీవమైనట్టి, వాస్తవికతను సమీపించుతూనట్టి ఆసన్నమవుతూన్నట్టి నానావిధ అనంతసంఖ్యాకములైన ఛాయలను (ప్రతి ఛాయనుండీ ఒక సంపూర్ణమైన రూపంలో అభివృద్ధి పొందినట్టి తత్వశాస్త్ర వ్యవస్థను) కల్గి బహుముఖమైనట్టి (ఈ ముఖాల సంఖ్య నిరంతరమూ అధికమవుతూనే వుంటుంది) జ్ఞానసాధనగా గతితర్కం – Bildertheorie,*** జ్ఞానప్రక్రియకూ అభివృద్ధికి, గతితర్కాన్ని ప్రయుక్తంచేయ సామర్థ్యంలేని మౌలికమైన దురదృష్టాన్ని కలిగినట్టి "అతి భౌతికతత్వ" భౌతికవాదంతో సరిపోల్చిచూచినప్పుడు ఎంతో అంత సంపదగర్భితమైన విషయం మనకిక్కడ తారసిల్లుతూంది.

మొరటు, సరళము, అతిభౌతికము అయిన భౌతికవాద దృక్స్థానం నుండి చూసినట్టయితే, తాత్విక భావవాదం కేవలం అసందర్భంగానే కనబడుతుంది. అటు గతితార్కిక భౌతికవాద దృక్స్థానం నుండి చూచినట్టయితే, ద్రవ్యం నుండీ ప్రకృతినుండీ విడిపోయి, దైవత్వం ఆరోపించబడిన పరమముగా జ్ఞానసాధనకుగల లక్షణాలలోనూ, పార్శ్వాలలోనూ, ఫలకములలోనూ ఒకటి ఏకపార్శ్వంగా ఒరిగిపోయినట్టి, విపరీతమైనట్టి, überschwengliches

* ఫోల్క్‌మన్ "ప్రకృతిశాస్త్ర జ్ఞానసాధనసిద్ధాంత మూలసూత్రాలు" – సం.
** ఎదురుకక్షి – సం.
*** ప్రతిబింబ సిద్ధాంతం – సం.

ష.రా. ఈ వచనం

(Dietzgen) అభివృద్ధే (ఉల్బణమే, పొంగే) తాత్విక భావవాదం. భావవాదం మతగురుతత్వం. నిజమే. కాని ("మరింత యథార్థంగానూ," అంతేకాకుండా "దీనితో సహా") తాత్విక భావవాదం, అపరిమితంగా సంక్లిష్టమైన మానవ (గతితార్కిక) జ్ఞానసాధనయొక్క ఛాయలలో ఒక ఛాయ ద్వారా మతగురుతత్వానికి ఒక మార్గం.

మానవ జ్ఞానసాధన సరళరేఖ కాదు (respective అనుసరించనూ అనుసరించదు), అది ఒక వృత్త పరంపరకు నిరంతరమూ ఆసన్నమవుతూన్నట్టి వక్రరేఖ, ఒక సర్పిలం. ఈ వక్రరేఖలోని ప్రతి ఖండమూ, ప్రతి విభాగమూ ఒక స్వతంత్ర, సంపూర్ణ, సరళ రేఖగా పరివర్తన (ఏక పార్శ్వంగా ఒరిగిపోయినట్టి పరివర్తన) కాబడగలదు, తరువాత ఈ సరళ రేఖ (చెట్లను చూసి అడవిని చూడనట్టయితే) చిత్తడినేలలోకి (ఎక్కడైతే పాలకవర్గాల వర్గప్రయోజనాలచే దానికి అక్కడ అదనపు బలం చేకూరుతుందో అట్టి చిత్తడినేలలోకి), మతగురుతత్వానికి దారితీస్తుంది. సరళరేఖాత్మకతత్వమూ, ఏకపార్శ్వంగా ఒరిగిపోవడమూ, బిర్ర బిగుసుకుపోవడమూ, శిలాకృతమైపోవడమూ, స్వకీయగతాత్మకతత్వమూ, స్వకీయగతాత్మక అంధత్వమూ — voilà* భావవాదంయొక్క జ్ఞానసాధనశాస్త్రీయ మూలాలు. కాగా మతగురుతత్వానికి (=తాత్విక భావవాదం), సహజంగానే జ్ఞానసాధన శాస్త్రీయ మూలాలు వున్నాయి, పెరిగి పెద్దదవడానికి దానికి నేలలేకపోలేదు; అది గొడ్డుపువ్వే నిస్సందేహంగా, కాని సజీవమైన, సారవంతమైన, యథార్థమైన, బలమైన, సర్వశక్తివంతమైన, బాహ్యగతాత్మకమైన, పరమమైన మానవజ్ఞానమనే సజీవ వృక్షంపై పాదుకొన్న గొడ్డుపువ్వే అది.

1915.

* ఇదే — అనువాదకుడు.

# సోషలిస్టు విప్లవమూ, జాతులకుగల స్వయంనిర్ణయ హక్కూ

## సంగ్రహ సూత్రీకరణల నుండి

### ఖండిక

## 5. జాతీయ ప్రశ్నపై మార్క్సిజమూ, ప్రూడనిజమూ

పెట్టీబూర్జువా ప్రజాస్వామికవాదులకు భిన్నంగా మార్క్స్, ఎట్టి మినహాయింపు లేకుండా ప్రతి ప్రజాస్వామిక డిమాండునూ, ఒక నిరపేక్షమైనదిగా కాకుండా, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా బూర్జువావర్గ నాయకత్వాన నడిపించబడిన ప్రజారాసుల పోరాటం యొక్క చారిత్రక వ్యక్తీకరణగా భావించాడు. ఈ డిమాండ్లలో కార్మికులను మోసపుచ్చడానికి బూర్జువా వర్గం చేతుల్లో ఉపకరణంగా ఆ యా ప్రత్యేక పరిస్థితులను అనుసరించి ఉపయోగ పడజాలనిదీ, ఉపయోగపడనిదీ ఒకటైనా లేదు. ఈ సందర్భంలో, రాజకీయ ప్రజాస్వామ్య డిమాండ్లలో ఒకదానిని, విశిష్టంగా జాతుల స్వయంనిర్ణయాన్ని ఎంచి ముందుకు తీసుకొచ్చి, కడమవాటికి వ్యతిరేకంగా దానిని నిలబెట్టడం సిద్ధాంతం దృష్ట్యా మౌలికంగా తప్పు. ఆచరణలో, రిపబ్లిక్కు కోసమైన డిమాండును కూడా మినహాయించకుండా, ప్రజాస్వామిక డిమాండ్లన్నిటికై అది సలిపే పోరాటానికంటె బూర్జువావర్గాన్ని కూలదోయడం కోసమై అది సలిపే పోరాటానికే ప్రాధాన్యతనివ్వడం వల్లనే శ్రామికవర్గం తన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోగల్గుతుంది.

అటు "సామాజిక విప్లవం పేరుతో" జాతీయ ప్రశ్నను "కాదని" వ్యతిరేకించిన ప్రూడనిస్టులలాగు కాకుండా మార్క్స్, పురోగామి దేశాలలోని శ్రామికవర్గ వర్గపోరాట ప్రయోజనాలను ప్రధానంగా గుర్తుంచుకుని, అంతర్జాతీయతావాదం యొక్క, సోషలిజం యొక్క మౌలిక సూత్రాన్ని — అనగా, ఒక జాతి ఇతర జాతులను పీడించితే అది స్వేచ్ఛగా వుండజాలదు[127] అనే సూత్రాన్ని — ముందరి రంగంలో వుంచాడు. జర్మన్లచే పీడించబడిన జాతులకు విజయవంతమైన జర్మన్ ప్రజాస్వామ్యం స్వేచ్ఛను ప్రకటించి ప్రసాదించాలనే

కోర్కెను జర్మన్ కార్మికుల ప్రయోజనాల దృక్స్థానంనుండి 1848లో మార్క్స్ డిమాండు చేశాడు.[128] ఇంగ్లీషు కార్మికుల విప్లవాత్మక పోరాట దృక్స్థానం నుండే, ఇంగ్లండు నుండి ఐర్లండ్ విడదీయబడాలనే కోర్కెను 1869 లో మార్క్స్ డిమాండు చేస్తూ "విడిపోయిన తరువాత సమాఖ్య ఏర్పడితే ఏర్పడవచ్చును"[129] అని కూడా అన్నాడు. కేవలం ఈ డిమాం డును ముందుంచడం వల్లనే, ఇంగ్లీషు కార్మికులకు అంతర్జాతీయతత్త్వ భావంలో మార్క్స్ నిజంగా ప్రబోధం కల్గించాడు. ఆనాడు ఎదుర్కొన్నట్టి నిర్దిష్టమైన చారిత్రక కర్తవ్యం యొక్క విప్లవాత్మక పరిష్కారంతో, అవకాశవాదులనూ — ఈ నాటికి సహితమూ అర్ధ శతాబ్ది గడచిన తరువాత కూడా ఐరిష్ "సంస్కరణ"ను ప్రసాదించినట్టి — బూర్జువా సం స్కరణ విధానాన్నీ కేవలం ఈ మార్గంలోనే అతడు వ్యతిరేకించగల్గాడు. విడివడిపోవడానికి చిన్న జాతులకుగల హక్కు ఊహాజనిత జగత్తుకు సంబంధించినదనీ, అసాధ్యమైనదనిన్నీ, కాగా ఆర్థికంగానే కాకుండా రాజకీయంగా కూడా సాంద్రీకరణ ప్రగతిశీలమైనదనీ, గొంతుక చించుకుని అరిచే పెట్టుబడిదారీ విధాన సమర్థకులను ఈ సాంద్రీకరణ సామ్రాజ్యవాద తత్వేతరమైనప్పుడు అది ప్రగతిశీలమైనదేననీ, బలాత్కారంగా కాకుండా, అన్ని దేశాల శ్రామికవర్గాల స్వేచ్ఛాయుతమైన ఐక్యతవల్లనే జాతులు సన్నిహితపరచబడాలనీ కేవలం ఈ విధంగానే అతడు వ్యతిరేకించగాల్గాడు. జాతుల సమానత్వాన్నీ, స్వయం నిర్ణయాన్నీ నోటి మాటతోనూ, తరుచు కుటిల బుద్ధితోనూ కూడుకున్నట్టి గుర్తింపును వ్యతిరేకిస్తూ, జాతీయ ప్రశ్నల పరిష్కారంలో కూడా ప్రజారాసుల విప్లవాత్మక కార్యాచరణను ఈ విధంగా మాత్రమే మార్క్స్ సమర్థించగల్గాడు. అన్ని పురోగామి దేశాలకు, అవి అన్నీ కూడా ఇతర జాతులను పీడించుతూండడం కారణాన, ఆదర్శప్రాయంగా ఉపయోగపడాల్సినట్టి మార్క్స్ విధానం యొక్క యథార్థతను 1914–1916 సామ్రాజ్యవాద సంగ్రామమూ, అది బట్టబయలు చేసినట్టి అవకాశవాదుల, కౌట్స్కీవాదుల దుర్గంధపు కపటోపాయమూ అద్భుతంగా ధ్రువపర్చాయి.*

జనవరి — ఫిబ్రవరి 1916.

---

* కొన్ని ప్రత్యేక జాతుల జాతీయోద్యమం పట్ల — ఉదాహరణకు, 1848 లో చెక్కుల జాతీయోద్యమంపట్ల — జాతుల స్వయంనిర్ణయాన్ని గుర్తించడంయొక్క అవసరాన్ని మార్క్సిస్టు దృక్స్థానంనుండి మార్క్స్ అభ్యంతరం ఖండించుతూందనే విషయాన్ని తరచు — దృష్టాం తం చూపాలంటే, "Die Glocke" ["గంట"] పత్రిక 8, 9 సంచికలలో జర్మన్ దుర హంకారవాది లెన్ష్ ఇటీవల రాసినట్టూ — ఉదహరించడం జరుగుతూంది. కాని ఇది యథార్థం

కాదు, ఎందుచేతంటే, ''అభివృద్ధి నిరోధక'' జాతులకూ, విప్లవాత్మక-ప్రజాస్వామిక జాతులకూ మధ్య స్పష్టమైన సరిహద్దు రేఖ గీయవలసి వచ్చినందుకు 1848 లో చారిత్రక, రాజకీయ కారణాలు ఏర్పడ్డాయి. మొదట పేర్కొనబడిన జాతులను ఖండించడంలోనూ, తరువాత పేర్కొనబడిన వాటిని సమర్థించడంలోనూ, మార్క్స్ అవలంబించిన పద్ధతి సరైనదే. ప్రజాస్వామ్యం యొక్క సాధారణ ప్రయోజనాలకు సహజంగా లోబడి వుంచాల్సినట్టిదే స్వయం నిర్ణయ హక్కు. ఈ సాధారణ ప్రయోజనాలూ, 1848 లోనూ తరువాతి సంవత్సరాలలోనూ, జార్ పరిపాలనా విధానంతో పోరాడడమూ, రెండూ ఒకటే అయాయి.

# స్వయంనిర్ణయ చర్చ సారంశం

## ఖండికలు

## 7. మార్క్సిజమా, లేక ప్రూడనిజమా?

ఐర్లండ్ వేరుపడడం పట్ల మార్క్స్ వైఖరి గురించి మేము చేసిన సూచనను పరోక్షంగా కాకుండా, ఈ సారి ఒక మినహాయింపుగా, ప్రత్యక్షంగానే మన పోలిష్ కామ్రేడ్లు తప్పించుకుంటున్నారు. ఏమిటి వారి అభ్యంతరం? 1848 నుండి 1871 వరకూ, ఈ మధ్య కాలంలో మార్క్స్ స్వీకరించిన స్థానానికి వర్తించే సూచనలకు "ఈషణ్మాత్రపు విలువ సహితమూ లేదని" వారంటారు. అసాధారణమైన ఆగ్రహంతో నిండినట్టీ నిశ్చితమైనట్టీ ఈ ఉద్ఘాటనను బలపరచేందుకు, "చెక్కులు, దక్షిణ స్లావ్‌లు, వగైరాల" స్వాతంత్ర్యపు ఆశయాలకు "ఒకే సమయంలోనే" వ్యతిరేకతను వ్యక్తపరిచాడు మార్క్స్ అనే వాదనను[130] వీరు తీసుకొస్తారు.

ఈ వాదన ప్రత్యేకమూ బేసబబుగా వుంది కాబట్టే అంత ప్రత్యేకమూ ఆగ్రహపూరితంగా వుంది. పోలిష్ మార్క్సిస్టుల ప్రకారం, "ఒకే సమయంలోనే" పరస్పర విరుద్ధంగా మాట్లాడే వుత్త జడభరతుడు అన్నమాట మార్క్స్! ఇది కేవలం అసత్యం, కాగా ఇది మార్క్సిజమే కాదు కూడా. నిర్దిష్టములైన వేర్వేరు "జాతీయ" ఉద్యమాలపట్ల మార్క్స్ అవలంబించిన వేర్వేరు వైఖరులు అదే సోషలిస్టు దృక్పథంనుండి ప్రభవించుతున్నాయా అనే విషయాన్ని పరిశీలించేందుకు మనకు విధాయకమౌతూన్నట్టీ, మన పోలిష్ కామ్రేడ్లు తాము ప్రయుక్తంచేయకుండా వుండేందుకే ముందుకు తెస్తూన్నట్టీ "నిర్దిష్ట" విశ్లేషణకై డిమాండే ఇది అచ్చంగా.

జారిస్టువిధానంయొక్క బలానికీ, పలుకుబడికీ వ్యతిరేకంగా — లేక, జారిస్టువిధానంయొక్క ప్రబల అభివృద్ధి నిరోధక ప్రభావానికీ, సర్వవ్యాప్త శక్తికీ వ్యతిరేకంగా అని కూడా చెప్పవచ్చు — పోరాటం సాగించుతూన్న యూరపియన్ ప్రజాస్వామ్యంయొక్క ప్రయోజనాల దృష్ట్యా పోలిష్ స్వాతంత్ర్యానికి మార్క్స్ సుముఖంగా వుండెనన్న విషయం సాధారణంగా తెలిసినదే. ఈ వైఖరి సరైనదనే విషయం 1849 లో, ఎప్పుడైతే హంగేరీలోని జాతీయవిముక్తి,

విప్లవాత్మక-ప్రజాస్వామిక ఉపప్లవాన్ని రష్యన్ భూదాస సేన అణచివేసిందో అప్పుడే అత్యంత స్పష్టంగానూ ఆచరణలోనూ రుజువయింది. అప్పటినుండి మార్క్స్ మరణం వరకూ, ఇంకా ఆ తరువాత ఫ్రాన్సుతో మిత్రత్వం నెరపుకున్న జారిస్టు విధానం సామ్రాజ్యవాద తత్వేతరమూ జాతీయంగా స్వతంత్రమూ అయిన జర్మనీపై యుద్ధం సాగించే ప్రమాదం ఏర్పడినట్టి 1890 వరకూ కూడానూ, జారిస్టు విధానానికి వ్యతిరేకంగా పోరాటానికే ప్రధానంగానూ అందరికంటెనూ ముందుగానూ ఎంగెల్స్ నిలబడ్డాడు. ఈ హేతువునే, కేవలం ఈ హేతువునే, చెక్కులూ దక్షిణ స్లావ్‌ల జాతీయోద్యమాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు వ్యతిరేకించారు. 1848–1849 లలో వారు రాసినదానిని కేవలం ఉదాహరించినయెడల యూరప్‌లో "రష్యన్ అగ్రగామి గస్తీచౌకీలు"గా సేవచేసినట్టి "అభివృద్ధి నిరోధకములైన సంపూర్ణ జాతులనూ," "విప్లవాత్మక జాతులకు," అనగా జర్మన్లు, పోలులు, మాగ్యార్లను, మార్క్స్, ఎంగెల్స్‌లు ఆ కాలంలో స్పష్టమూ నిర్దిష్టమూ అయిన ప్రతిలోములుగా నిలబెట్టారన్న విషయం మార్క్సిజాన్ని కేవలం దాటవేయడానికనే దానియందు అభిలాష కనబర్చేవారికి తప్ప కడమవారందరికీ రుజువవుతుంది. ఇది వాస్తవవిషయం. కాగా ఈ వాస్తవవిషయం నిర్వివాదమైన సత్యమని ఆ కాలంలో వ్యక్తమయింది: స్వేచ్ఛకోసం, దాని ప్రధాన శత్రువైన జారిస్టు విధానంతో విప్లవాత్మక ప్రజలు 1848 లో పోరాడగా, చెక్కులు వగైరాలు వాస్తవంగా అభివృద్ధి నిరోధక ప్రజలుగా వుంటూ, జార్ ప్రభుత్వ విధానం యొక్క అగ్రగామి గస్తీ చౌకీలుగా పనిచేశారు.

మార్క్సిజం పట్ల విశ్వాసంగా వుండగోరినట్టయితే నిర్దిష్టంగా విశ్లేషించబడాల్సిన ఈ నిర్దిష్ట ఉదాహరణ నుండి నేర్చుకొనవలసిన గుణపాఠం ఏమిటి? ఆ గుణపాఠం కేవలమూ ఇదే: 1) చిన్న జాతుల విముక్తి ఉద్యమ ప్రయోజనాలకంటె, కొన్ని మరీ పెద్ద పెద్ద జాతుల విముక్తి ఉద్యమ ప్రయోజనాలు అధిక ప్రాముఖ్యత కల్గివుంటాయి; 2) ఒక ప్రజాస్వామిక డిమాండును దానంతటదే విడిగా కాకుండా, యూరపియన్ స్థాయిలో — ఈనాడు మనం ప్రపంచస్థాయిలో అంటాం — పర్యాలోచించాల్సి వుంటుంది.

ఇంతకుమించి మరేమీ లేదు. పోలులు మర్చిపోతూన్నట్టి, మార్క్స్ మాత్రం ఎల్లవేళలా విశ్వాసం చూపినట్టి ప్రాథమిక సోషలిస్టు సూత్రాన్ని — ఒక జాతి ఇతర జాతులను పీడించితే అది స్వేచ్ఛగా వుండజాలదు అనే సూత్రాన్ని — విస్మరించే సూచన ఎక్కడా కనబడదు. అంతర్జాతీయ రాజకీయాల్లో జారిస్టు ప్రభావం ప్రబలంగా వున్న కాలావధిలో మార్క్సును ఎదుర్కొన్న నిర్దిష్ట పరిస్థితి తిరిగి పునరుక్తమైన పక్షంలో, ఉదాహరణకు, కొందరు ఇతర ప్రజలు బూర్జువా అభివృద్ధి నిరోధకానికి కోటబురుజులుగా ఏర్పడగా మరికొందరు ప్రజలు సోషలిస్టు విప్లవం ప్రారంభించిన పక్షంలో (1848 లో యూరప్‌లో

బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం ప్రారంభించబడినట్టుగా) — అప్పుడు ఈ మొదట పేర్కొన బడిన ప్రజలపై విప్లవాత్మక సమరానికి అనుకూలంగానే, వీరి "అణచివేతకు" అనుకూ లంగానే, వీరి అగ్రగామి గస్తీ చౌకీలన్నిటినీ, వాటిలో ఏ యే చిన్న ప్రజల ఉద్యమాలు లేచి నప్పటికి సహితమూ, నాశనం చేసివేయడానికి అనుకూలంగానే వుండాల్సి వుంటుంది మనం కూడా. ఫలితంగా, మార్క్సు ఎత్తుగడల ఉదాహరణలను వేటిని సహితమూ తిరస్కరించ డమూ — మార్క్సిజాన్ని మాటల్లో అంగీకరిస్తూ ఆచరణలో విడనాడడంతో సమానమే అవుతుంది ఇది — బదులు, వాటిని మనం నిర్దిష్టంగా విశ్లేషించి, భవిష్యదుపయోగం కోసం వాటినుండి అమూల్యమైన గుణపాఠాలను గ్రహించాలి. స్వయం నిర్ణయంతో సహా ప్రజాస్వామ్యం యొక్క వివిధ డిమాండ్లు నిరపేక్షంగాక, సర్వసాధారణ-ప్రజా స్వామిక (ఇప్పుడు: సర్వసాధారణ-సోషలిస్టు) ప్రపంచ ఉద్యమంలో ఒక స్వల్ప భాగంగా మాత్రమే ఏర్పడుతున్నాయి. వ్యక్తిగతంగా నిర్దిష్టమైన దృష్టాంతాలలో, పూర్ణాన్ని భాగం నిరోధించవచ్చు; అట్టి పక్షంలో దాన్ని తిరగ్గొట్టక తప్పదు. ఏదైనా ఒక దేశంలోని రిపబ్లికన్ ఉద్యమం కేవలం మతగురుతత్వం యొక్క, లేదా పరదేశాల ఫినాన్షల్-రాజరికవర్గపు కుతం త్రాల ఉపకరణమే అయివుండొచ్చు; అలాంటి పక్షంలో ప్రత్యేకమైనట్టీ, నిర్దిష్టమైనట్టీ ఈ ఉద్యమాన్ని మనం బలపరచ కూడదు. కాని ఈ కారణాలపైన అంతర్జాతీయ సోషల్-డెమొక్రసీ కార్యక్రమం నుండి రిపబ్లిక్కును కాంక్షించే ఈ డిమాండును తొలగించివేయడం హాస్యాస్పదంగా వుంటుంది.

1848–1871 కాలావధికీ, 1898–1916 కాలావధికీ మధ్య (ఒక కాలావ ధిగా సామ్రాజ్యవాద కాలం యొక్క అత్యంత ముఖ్యమైన సరిహద్దు రాళ్ళుగా నేను తీసుకుం టూన్నది: స్పానిష్-అమెరికన్ సామ్రాజ్యవాద యుద్ధం మొదలు యూరపియన్ సామ్రాజ్య వాద యుద్ధంవరకు) నిర్దిష్ట పరిస్థితి ఏ విధంగా మార్పుచెందింది? జారిస్టు విధానం ప్రత్య క్షంగానూ నిర్వివాదంగానూ అభివృద్ధి నిరోధకానికి ప్రధానాధారంగా వ్యవహరించడం ఇక మానుకుంది; అందుకు కారణం, మొదటిది, దానిని అంతర్జాతీయ, ముఖ్యంగా ఫ్రెంచి, ఫినా న్షల్ పెట్టుబడి బలపరుస్తూంది; రెండవది, 1905 సంవత్సరపు ఫలితం. ఆ కాలంలో పెద్ద జాతీయ రాజ్యాల వ్యవస్థ — యూరప్‌లోని ప్రజాస్వామిక వ్యవస్థలు — జారిస్టు విధా నం ఏమన్నప్పటికీ కూడా వినిపించుకోకుండానే ప్రపంచానికి ప్రజాస్వామ్యాన్నీ సోషలిజాన్నీ ప్రసాదించుతూండేది.* సామ్రాజ్యవాద కాలం వరకూ మార్క్సు, ఎంగెల్సులు జీవించివుండ

---

*గ్ర్యూన్‌బెర్గ్ ప్రచురించిన "సోషలిజం చరిత్ర పురాతనపత్ర భాండారం" (1916, 1 వ సంపుటం) గ్రంథంలో, పోలిష్ ప్రశ్నపై ఎంగెల్స్ 1866 లో రాసిన ఒక

లేదు. ఈనాడు పట్టెడు (సంఖ్యలో ఐదో, ఆరో) "మహా" సామ్రాజ్యవాద రాజ్యాల వ్యవస్థ ఒకటి ప్రాదుర్భవించింది: వీటిలో ప్రతి ఒక్కటీ ఇతర జాతులను పీడించుతూంది. పెట్టు బడిదారీ విధాన పతనాన్ని కృత్రిమంగా ఆలస్యం చేసేటట్టీ, ప్రపంచంపై తమ పరిపాలన సాగిస్తూన్న సామ్రాజ్యవాద జాతులలోవున్న అవకాశానికీ సోషల్-జాతీయ దురహంకారానికీ కృత్రిమంగా వత్తాసునిస్తూన్నట్టీ మూలాధారాలలో ఒకటి ఈ పీడన. ఆ కాలంలో, పెద్ద జాతులను విముక్తి చేస్తూన్నట్టి పాశ్చాత్య యూరపియన్ ప్రజాస్వామ్యం, కొన్ని చిన్న జాతుల ఉద్యమాలను అభివృద్ధి నిరోధక లక్ష్యాలకై వినియోగించుకున్నట్టి జారిస్టు వ్యవస్థను వ్యతిరేకించాయి. ఈనాడు ఇటు జాతీయ దురహంకారులుగానూ "సోషల్-సామ్రాజ్య వాదులు" గానూ, అటు విప్లవకారులుగానూ చీలిపోయినట్టి సోషలిస్టు శ్రామికవర్గం, జారిస్టు సామ్రాజ్యవాదమూ, పురోగామి పెట్టుబడిదారీ విధాన యూరపియన్ సామ్రాజ్య వాదమూ, ఈ రెండింటి మిత్రత్వాన్ని, అనేక జాతులపై తమ సామాన్య పీడన ప్రాతి పదికపై ఏర్పడినట్టి మిత్రత్వాన్ని, ఎదుర్కోనాల్సి వస్తూంది.

పరిస్థితిలో ఇటువంటి నిర్దిష్టమైన మార్పుల జరిగాయి, కాగా తాము నిర్దిష్టంగా వుంటామని ఖరారు చేసినప్పటికీ, పోలిష్ సోషల్-డెమోక్రాట్లు సరిగ్గా వీటినే విస్మరిస్తున్నారు! ఈ కారణంవల్ల అచ్చంగా ఈ సోషలిస్టు సూత్రాల ప్రయుక్తంలో వచ్చిన నిర్దిష్టమైన మార్పు ఇదీ: ఆనాడు "జారిస్టు వ్యవస్థకు వ్యతిరేకంగా" (ప్రజాస్వామ్య వ్యతిరేక ధ్యేయాలకై జారిజంచే ఉపయోగించు కొనబడుతూండిన కొన్ని ప్రత్యేకములైన చిన్న జాతుల ఉద్యమాలకు వ్యతిరేకంగానూ), పాశ్చాత్యంలోని బృహత్ జాతుల విప్లవాత్మక ప్రజలకోసమూ, పోరాడడం ప్రధాన విషయంగా వుండేది; ఈనాడు సామ్రాజ్యవాదతత్వపు రాజ్యాల, సామ్రాజ్య వాద బూర్జువావర్గపు సోషల్-సామ్రాజ్యవాదుల ఐక్య, దృఢ సంఘటనను ప్రధానంగా.

---

ఆసక్తిజనకమైన వ్యాసాన్ని ర్యజానొవ్ ప్రకటించాడు. యూరప్‌లోని పెద్దవీ, మహత్తరములూ అయిన జాతుల రాజకీయ స్వాతంత్ర్యాన్నీ "స్వయంనిర్ణయాన్నీ" (right to dispose of itself) శ్రామికవర్గం గుర్తించడం అవసరమనీ ఎంగెల్స్ నొక్కిచెబుతూ, "జాతీయతల సూత్రం" (ప్రత్యేకంగా బోనపార్ట్‌చే అది ప్రయుక్తం చేయబడిన విధంలో) అనగా ఏ చిన్న జాతినైనా సరే, పెద్ద జాతులతో సమానస్థాయిలో వుంచడంయొక్క అసందర్భాన్ని చూపిస్తాడు. "రష్యా అధీనంలో బ్రహ్మాండమైన చోరీపాత్తు వుంది" (అనగా, పీడిత జాతులు) లెక్కలు తేల్చు కోవలసిన రోజున దీనిని అది వాపసు చేయాల్సే వుంటుంది" అని అంటాడు ఎంగెల్స్ కాగా, యూరపియన్ ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా, తమ సొంత ప్రయోజనాల కోసం బోనపార్టిజమూ, జారిజమూ రెండున్నూ చిన్నజాతుల ఉద్యమాలను ఉపయోగించుకుంటున్నాయి.

వ్యతిరేకిస్తున్నాం, కాగా సోషలిస్టు విప్లవ లక్ష్యాలకై సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అన్ని జాతీయ ఉద్యమాల వినియోగానికీ మనం సుముఖులం. సాధారణ సామ్రాజ్యవాద సంఘటనకు వ్యతిరేకంగా పోరాటం అంతకు మరింత స్వచ్ఛంగా శ్రామికవర్గ పోరాటంగా నేడు మారుతూన్నకొద్దీ, "ఒక జాతి ఇతర జాతులను పీడించితే అది స్వేచ్ఛగా వుండజాలదు" అనే అంతర్జాతీయ సూత్రం మరింత ప్రత్యక్షంగా ప్రాణతుల్యమవుతుంది.

సామాజిక విప్లవంయొక్క ఛాందససూత్రవాదభావన అనే పేరుతో ప్రూడనిస్టులు పోలెండు యొక్క అంతర్జాతీయ పాత్రను అలక్ష్యంచేసి, జాతీయోద్యమాలను గురించి పట్టించుకోనే లేదు. ఇంత ఛాందససూత్రవాదంతోనూ వుంది పోలిష్ సోషల్-డెమోక్రాట్ల వైఖరి కూడా. ఎందుచేతంటే, సోషల్-సామ్రాజ్యవాదులకు వ్యతిరేకమైన అంతర్జాతీయ సంఘటనను వారు భగ్నం చేస్తూ, రాజ్యాల అన్యాక్రమణల ప్రశ్నలో తమ ఊగిసలాటల మూలంగా వారికి (బాహ్యగతాత్మకంగా) సాయమే చేస్తున్నారు. కారణమేమిటంటే, శ్రామికవర్గ పోరాటంయొక్క అంతర్జాతీయ సంఘటన చిన్న జాతుల నిర్దిష్ట స్థానం సందర్భంలోనే అచ్చంగా మార్పుచెందింది; ఆ కాలంలో (1848–1871) "పాశ్చాత్య ప్రజాస్వామ్యమూ," విప్లవాత్మక జాతులతోనో, లేదా జారిజంతోనో ఏదో ఒక పక్షం యొక్క భావి మిత్రులుగా చిన్న జాతులకు ప్రాముఖ్యత వుండేది; ఇప్పుడు (1898–1914) చిన్నజాతులకు ఈ ప్రాముఖ్యత పోయింది; నేడు వాటికున్న ప్రాముఖ్యతంతా పరాన్నభుక్త వ్యవస్థయొక్క, తదానుషంగికంగా "మహా జాతుల" సోషల్-సామ్రాజ్యవాదం యొక్క పోషకపదార్థ మాధ్యమంగా ఉండడమే. సోషలిస్టు విప్లవం వచ్చేముందు చిన్న జాతులలో ఏభైయ్యోవంతో, నూరోవంతో విముక్తిచెందిందా అనేదికాదు ముఖ్యమైన విషయం, సామ్రాజ్యవాద శకంలో బాహ్యగతాత్మకకారణాలవల్ల శ్రామికవర్గం రెండు అంతర్జాతీయ శిబిరాలుగా చీలిపోయింది; మహా జాతుల బూర్జువావర్గాలు — చిన్నజాతులను రెండింతలు మూడింతలు దోపిడీ చేయడం ద్వారానూ తదితరమార్గాల ద్వారానూ పారేసిన ఎంగిలి మెతుకులతో పొట్ట నింపుకుని అవినీతిపాలైన శిబిరం ఒకటి, చిన్నజాతులను విముక్తి చేయనిదే, ప్రజారాసులను జాతీయ దురహంకార వ్యతిరేక, రాజ్యాక్రమణ వ్యతిరేక భావంలో, అనగా "స్వయంనిర్ణాయక" భావంలో, ప్రబోధం కల్గించనిదే, తన్నుతాను విముక్తి చేసుకోలేని శిబిరం రెండవది.

ఈ విషయాన్ని, ప్రశ్నయొక్క అత్యంత ముఖ్యమైన పార్శ్వాన్ని సామ్రాజ్యవాద శకంలోని కేంద్రస్థానం నుండి, అంతర్జాతీయ శ్రామికవర్గం రెండు శిబిరాలుగా విభాగమైపోయిందనే దృక్స్థానం నుండి వీక్షించని మన పోలిష్ కామ్రేడ్లు ఉపేక్ష చేస్తున్నారు.

వారు ప్రూడనిస్టు తత్వానికి మరికొన్ని నిర్దిష్ట ఉదాహరణలు ఇవిగో చూడండి: 1) 1916 ఐరిష్ తిరుగుబాటు పట్ల వారి వైఖరి, దీని గురించి మనం తరువాత ప్రస్తావి

స్తాం; 2) సోషలిస్టు విప్లవ నినాదం "ఏ విషయం వల్లనూ మరుగుపడ కూడదు" అనే సంగ్రహ సూత్రీకరణ (II, 3, § 3 చివర). జాతీయ ప్రశ్నను కలుపుకొని అన్ని ప్రశ్నలపట్ల సుసంగతమైన విప్లవాత్మక స్థానంతో సోషలిస్టు విప్లవ నినాదానికి లంకె కలపడంవల్ల ఈ నినాదం మరుగున పడిపోగలదనే భావం నిజంగా ప్రగాఢమైన మార్క్సిస్టువ్యతిరేక భావమే.

మన కార్యక్రమం "జాతీయ-రిఫార్మిస్టుతత్వపు" కార్యక్రమమని పోలిష్ సోషల్-డెమోక్రాట్లు భావిస్తున్నారు. ఈ రెండు ఆచరణీయ ప్రతిపాదనలనూ పరిశీలించండి: 1) స్వయంపరిపాలనకోసం ప్రతిపాదన (పోలిష్ సంగ్రహ సూత్రీకరణ, III, 4) మరియు 2) విడివడిపోవడానికి స్వేచ్ఛకోసం ప్రతిపాదన. ఇందులోనే, కేవలం ఇందులోనే, మన కార్యక్రమాలు భేదిస్తున్నాయి! కాగా రిఫార్మిస్టుతత్వంతో కూడుకున్నది మొదటిదే, కాని రెండవదికాదనీ ప్రత్యక్షంగా కనబడడం లేదూ? పాలకవర్గపు రాజ్యాధికారశక్తియొక్క పునాదిని నాశనం చేయకుండా, ఈ వర్గంయొక్క పాలనను కేవలం భద్రపరచేందుకు ఇచ్చిన సౌకర్యమే ఒక రిఫార్మిస్టుతత్వపు మార్పు. ఈ శక్తియొక్క పునాదిని నాశనంచేసేది విప్లవాత్మకమైన మార్పు. జాతీయ కార్యక్రమంలోని రిఫార్మిస్టుతత్వం పాలకజాతి ప్రత్యేకాధికారాలను అన్నింటినీ రద్దు చేయదు; అది సంపూర్ణ సమానత్వాన్ని నెలకొల్పదు; "పాలక" జాతికుండే హక్కులతో సమానమైన హక్కులు "స్వయం పరిపాలనాయుత" జాతికి వుండవు; రాజకీయ సామాన్యప్రత్యయాల నిశ్చయార్థాల విశ్లేషణను మొండిగా (మన పాత "ఆర్థికవాదులు" లాగానే) తప్పించుకోకుండా వుండినట్టయితే, మన పోలిష్ కామ్రేడ్లు దీనిని గమనించి వుండేవారు. స్వయంపరిపాలనాయుత నార్వే 1905 వరకూ స్వీడన్‌లో ఒక భాగంగా అత్యంత విశాలమైన స్వయంపరిపాలన అనుభవించినప్పటికీ, స్వీడన్‌తో సరిసమానం కాలేదు. స్వేచ్ఛాయుతంగా విడివడిపోవడం వల్లనే దాని సరిసమానత ఆచరణలో వ్యక్తమయింది, రుజువయింది కూడా (హక్కుల సమానతపై స్థాపితమైన మరింత సన్నిహితత్వానికీ, మరింత ప్రజాస్వామిక స్నేహభావానికీ ప్రాతిపదికను అచ్చంగా ఈ స్వేచ్ఛాయుతమైన విడివడిపోవడమే సృష్టించిందని కూడా మనమిక్కడ ప్రాసంగికంగా చెప్పవచ్చు). కేవలం స్వయంపరిపాలితంగా వుండినంత కాలమూ, స్వీడన్ దేశపు ప్రభువర్గానికి ఒక అదనపు విశేషాధికారం వుండేది; కాగా విడివడిపోవడం వల్ల ఈ విశేషాధికారం "బలహీనపడ"లేదు (ఒక ఘోరకలిని నాశనం చేయకుండా, దానిని బలహీనపరచడంలోనే వుంటుంది రిఫార్మిస్టుతత్వ సారం), అది సంపూర్ణంగా తొలగించి వేయబడింది (ఒక కార్యక్రమం యొక్క విప్లవాత్మక స్వభావానికి ఇదే ప్రధాన చిహ్నం).

విప్లవాత్మక చర్య అయిన విడివడిపోవడానికిగల స్వేచ్ఛతో సంస్కరణగా లభించిన స్వయంపరిపాలన మౌలికంగా విభేదించుతూందన్న విషయాన్ని సందర్భవశాత్తూ ఇక్కడ గమ

నించాల్సి వుంది. ఈ విషయం నిస్సందేహం అయినప్పటికీ, ఆచరణలో ఒక సంస్కరణ తరుచుగా విప్లవానికి ముందంజే అవుతుందని అందరికీ తెలిసినదే. ఒకానొక రాజ్యం యొక్క సరిహద్దులలో బలాత్కారంగా బంధించబడిన ఒక జాతిని, తాను ఒక జాతిగా నిష్కర్షగా సంఘటిత పడేందుకూ, తన శక్తులను కూడదీసుకుని విలువకట్టి, ఆర్గనైజు చేసుకునేందుకూ, "ఇకనుండి అఖిల రష్యన్ల చక్రవర్తి పోలెండు దేశాలకు రాజు కానేరడని ఫలానా జాతియొక్క, లేదా ఫలానా ప్రాంతంయొక్క స్వయం పరిపాలిత పార్లమెంటు అయిన మేము ప్రకటించుతున్నాం..." వగైరా అని "సార్వేదేశీయ" భావంతో ఒక ప్రకటన చేసేందుకై అత్యంత అనుకూల తరుణాన్ని ఎంచుకుందుకూ అవకాశం కల్గించేది అచ్చంగా స్వయంపరిపాలనే. ఇలాంటి సమస్యలను నిర్ణయించేవి యుద్ధాలే, ప్రకటనలు కావు అని ఇందుకు మామూలుగా "అభ్యంతరం" చెప్పడం కద్దు. నిజమే: ఇట్టి సందర్భాలు అత్యధికసంఖ్యలో యుద్ధాలవల్లనే (ఎలాగైతే పెద్ద రాజ్యాలలో ప్రభుత్వ రూపాన్ని గురించిన ప్రశ్న, ఇట్టిసందర్భాల అత్యధికసంఖ్యలో, యుద్ధాలవల్లను విప్లవాలవల్లనూ నిర్ణయించబడుతూందో అలాగే) నిర్ణయించబడుతుంది. అయినప్పటికీ ఒక విప్లవాత్మక పార్టీ యొక్క కార్యక్రమానికి ఇట్టి "అభ్యంతరం" తర్కబద్ధమైనదా, అనే విషయాన్ని పర్యాలోచించడంలో ప్రమాదమేమీ వుండదు. శ్రామిక వర్గానికి ఏది న్యాయం చేకూర్చుతుందో దాని తరపున, ప్రజాస్వామ్యానికీ సోషలిజానికీ ఏది న్యాయం చేకూర్చుతుందో దాని తరపున జరిగే యుద్ధాలకు మనం వ్యతిరేకులమా?

"ఏ కోటో రెండు కోట్లో జనాభాగల ఏ చిన్న ప్రజకోసం, మహత్తర జాతుల మధ్య యుద్ధానికి, రెండు కోట్ల జనుల మారణహోమానికి మనం సుముఖులం కాజాలమే!" కాజాలం, సహజంగానే మనమిందుకు విముఖులం! అలాగని చెప్పి, సంపూర్ణ జాతీయ సమానత్వాన్ని మన కార్యక్రమంనుండి తీసిపారేయడంలేదే, అనేక దేశాల, అన్ని దేశాల ప్రజాస్వామిక ప్రయోజనాలకు ఒక్క దేశపు ప్రజాస్వామిక ప్రయోజనాలు లోబడివుండేటట్లు చేయాల్సి వుండడమే ఇందుకు కారణం. మహత్తరములైన రెండు రాజరికరాజ్యాల మధ్య, చిన్న రాజ్యం ఒకటి వుందనీ, ఈ పిల్లరాజ్యంయొక్క పిల్లరాజుకు ఇరుపక్కలా వున్న రాజులతో, రక్తసంబంధమూ బాంధవ్యాలవల్ల అతడు "ముడిపడి" వున్నాడని అనుకుందాం. ఈ చిన్నదేశంలో ఒక రిపబ్లిక్కు ప్రకటించడం కారణంగానూ, ఈ రాజును దేశంనుండి వెళ్లగొట్టడం కారణంగానూ, ఆ దేశంలో ఆ రాజునో, లేదా మరొక రాజునెవరినో తిరిగి సింహాసనంమీద కూర్చోపెట్టడానికని పొరుగు పెద్ద రాజ్యాల రెండిటి మధ్యనూ ఆచరణలో యుద్ధమే సంభవించుతుందని కూడా అనుకుందాం. ఈ దృష్టాంతంలో, అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీ యావత్తూ, ఆ చిన్నదేశపు సోషల్-డెమోక్రసీలోని నిజమైన అంతర్జాతీయ విభాగమూ రాజరికవ్యవస్థ స్థానే రిపబ్లిక్ స్థాపనను వ్యతిరేకిస్తాయి అనడంలో ఏ మాత్రమూ సందేహం

లేదు. రాజరికవ్యవస్థ బదులు రిపబ్లిక్కును నెలకొల్పడం ఒక నిరపేక్షమైన డిమాండేమీ కాదు, మొత్తంగా ప్రజాస్వామ్య ప్రయోజనాలకు (అంతేకాదు, అంతకు మించి, సోషలిస్టు శ్రామికవర్గ ప్రయోజనాలకు లోబడినట్టి) ఒక ప్రజాస్వామిక డిమాండే. ఇట్టి సందర్భం ఏ దేశంలోని సోషల్-డెమోక్రాట్లలోనూ పిసరంత అభిప్రాయభేదానికైనా కారణభూతమవడం ముప్పాతిక మువ్వీసం సంభవం కాదు. కాని ఈ కారణాలపైన అంతర్జాతీయ సోషల్-డెమోక్రసీ కార్యక్రమం నుండి రిపబ్లిక్‌కోసం డిమాండును పూర్తిగా తొలగించి వేయాలని ఏ సోషల్-డెమోక్రాట్ అయినా ప్రతిపాదించినట్టయితే, అతనిని వెర్రివానికిందే కట్టేస్తారందరూ. ప్రత్యేకానికీ సాధారణానికీ వుండే ప్రాథమిక తార్కిక భేదాన్ని విస్మరించడానికి ఏది ఏమైనప్పటికీ వీలుపడదని అతనితో అందరూ చెబుతారు.

ఈ ఉదాహరణ కార్మికవర్గపు అంతర్జాతీయ విద్యాప్రబోధక ప్రశ్నను ఒక మోస్తరుగా వేరేవిధమైన దృక్కోణంనుండి సమీపిస్తుంది. ఇట్టి — దేని అత్యవసరం తక్షణ ప్రాముఖ్యతను గురించైతే త్సిమ్మర్‌వాల్డ్ వామపక్షీయులలో[131] అభిప్రాయభేదాలు దురూహ్యమైనవో అట్టి — విద్యాప్రబోధం, మహత్తరములైన పీడక జాతుల్లోనూ పీడితులైన చిన్నజాతులలోనూ, అన్యాక్రమణచేసే జాతులలోనూ అన్యాక్రమిత జాతుల్లోనూ, నిర్దిష్టంగా ఏకరూపంలోనే ఉండగలదా?

లేదు అని ప్రత్యక్షంగానే కనబడుతూంది. సంపూర్ణ సరిసమానత్వమూ, అత్యంత సన్నిహితత్వమూ, తదుపరి సర్వజాతుల సమ్మేళనమూ, — ఈ సామాన్య గమ్యానికి, ఏ విధంగానైతే, మాటవరసకు, ఏదైనా ఒక పుటలో మధ్యనున్న బిందువును చేరుకోవడానికి, ఒక అంచునుండి కుడివైపుగానూ, ఎదుటి దిశనుండి ఎడమవైపుగానూ రెండు మార్గాలుంటాయో, అలాగే—ప్రతి నిర్దిష్ట దృష్టాంతంలోనూ భిన్నభిన్న మార్గాలున్నట్టు ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. మహత్తరమైనట్టి పీడాకరమైనట్టి అన్యాక్రమణ జరిపేటట్టి జాతికి చెందిన సోషల్-డెమోక్రాట్ ఒకడు సాధారణంగా జాతుల సమ్మేళనాన్ని సమర్థించుతూనే, ''తన'' రెండవ నికోలస్, ''తన'' విల్‌హెల్మ్, జార్జి, పాయింకారె వగైరాలు కూడా చిన్నజాతులతో సమ్మేళనానికే (అన్యాక్రమణ మూలంగా)—గెలీషియాతో ''సమ్మేళనానికి'' నికోలస్సూ, బెల్జియంతో సమ్మేళనానికి విల్‌హెల్మూ, ఇలాగే ఇతరులూ—నిలబడతారనే విషయాన్ని విస్మరించిన పక్షంలో, ఇట్టి సోషల్-డెమోక్రాట్, సిద్ధాంతం దృష్ట్యా హాస్యాస్పదమైన ఛాందససూత్రవాదీ ఆచరణ దృష్ట్యా సామ్రాజ్యవాదం యొక్క కుమ్మకుదారుడూ అవుతున్నాడు.

పీడక దేశాలలోని కార్మికుల అంతర్జాతీయ విద్యాప్రబోధంలో, విడివడిపోవడానికీ, అందుకై పోరాడడానికీ పీడిత దేశాలకుగల స్వేచ్ఛను వారు సమర్థించాలని నొక్కి చెప్పబడాలి. ఇది లేనిదే అంతర్జాతీయతే వుండదు. ఇట్టి ప్రచారం చేయని పీడక జాతికి చెందిన ప్రతి

సోషల్-డెమోక్రాట్‌నీ సామ్రాజ్యవాదిగానూ, దగల్బాజీగానూ పరిగణించడం మన హక్కూ, విధ్యుక్తధర్మమూనూ. సోషలిజం ప్రవేశపెట్టబడేముందు విడివడిపోవడమునకు గల సాధ్యత, "సాఫల్యత"ం యొక్క యద్భృచ్ఛ వెయ్యింటిలో ఒక పాలే అయినప్పటికి సహితమూ ఇది నిరపేక్షమైన డిమాండే.

జాతీయ వ్యత్యాసాల పట్ల "ఉదాసీనత" వహించాలని కార్మికులకు బోధించడం మన విధాయకం. ఇది నిర్వివాదమైన విషయం. కాని ఇది అన్యాక్రమణవాదుల ఉదాసీనత మాత్రం కాకూడదు. తన సానుభూతి ఎటున్నదీ అనుసరించి చిన్నజాతులు తన రాజ్యానికి చెందినవనీ, పొరుగు రాజ్యానికి చెందినవనీ, లేదా వాటంతటవి సొంత రాజ్యాలనేటట్టి వివక్షత పట్ల పీడకజాతికి చెందిన వ్యక్తి తప్పక "ఉదాసీనత" వహించి తీరాలి: ఈ విధంగా అతడు "ఉదాసీనత" వహించకపోతే, అతడు సోషల్-డెమోక్రాటే కాడు. అంతర్జాతీయ సోషల్-డెమోక్రాట్‌గా వుండాలంటే అట్టి వ్యక్తి కేవలం తన స్వజాతి గురించి ఆలోచించడం కాకుండా, అన్ని జాతులప్రయోజనాలూ, వాటి సాధారణ స్వేచ్ఛ, సమానతలు తనజాతి ప్రయోజనాలకు అతీతమని భావించాలి. దీనినొక "సిద్ధాంతం"గా ప్రతివారూ అంగీకరిస్తారు, కాని ఆచరణలో "అన్యాక్రమణ" పట్ల "ఉదాసీనత"గా ద్యోతకమవుతుంది. ఇందులోనే వుంది ఘోర కలికి మూలం అంతానూ.

ఇందుకు భిన్నంగా, చిన్నజాతికి చెందిన సోషల్-డెమోక్రాట్, తన ప్రచారంలో జాతుల "స్వేచ్ఛాపూర్వక ఐక్యత" అనే మన సాధారణ సాంకేతికంలో రెండవ పదాన్నే నొక్కి చెబుతూండాలి. అంతర్జాతీయవాదిగా తన విధులను ఉల్లంఘించకుండానే, తనజాతి రజకీయ స్వాతంత్ర్యానికి, తన పొరుగున వున్న X, Y, Z మొదలైన రాజ్యాలలో దేనితోనైనా చేర్చబడడానికీ, రెండింటికీ సుముఖంగానే వుండొచ్చు. కాని అన్ని సందర్భాల్లో మాత్రం, చిన్నజాతి సంకుచిత తత్వంతోనూ, నిస్సంగత్వంతోనూ, ఏకాకిత్వంతోనూ తప్పక పోరాడాలి, సంపూర్ణమూ సాధారణముల గుర్తింపుకోసమూ, సాధారణప్రయోజనాలకు ప్రత్యేక ప్రయోజనాలను లోబడి వుంచడమునకూ అతడు పోరాడాలి.

ఈ ప్రశ్న విషయమై లోతుగా ఆలోచించని వారు, "విడివడిపోవడమునకు స్వేచ్ఛ" గురించి పీడక జాతులకు చెందిన సోషల్-డెమోక్రాట్లు వొత్తిచెబుతూండగా విని, పీడిత జాతులకు చెందిన సోషల్-డెమోక్రాట్లు "ఐక్యతా స్వేచ్ఛ"పై వొత్తిచెప్పడము "పరస్పర విరుద్ధమ"ని అనుకుంటారు. కాని ఏమాత్రం పర్యాలోచించినా, ఈ నిర్దిష్ట పరిస్థితినుండి అంతర్జాతీయతకూ, జాతుల సమ్మేళనానికీ దారితీసే మరే ఇతర మార్గమూ లేదనీ, ఈ గమ్యానికి మరే ఇతర మార్గమూ లేదనీ, ఉండేందుకు వీల్లేదనీ వ్యక్తమవుతుంది....

# 9. కౌట్స్కి పేర ఎంగెల్స్ రాసిన లేఖ

అప్పటికింకా మార్క్సిస్టుగానే వున్న కౌట్స్కి తన "సోషలిజమూ, వలస రాజకీయాలు" (బెర్లిన్, 1907) అనే పాంఫ్లెట్‌లో, ఎంగెల్స్ తనపేర రాసినట్టి, 1882 సెప్టెంబరు 12 తేదీగల లేఖను ప్రచురించాడు; మనమిప్పుడు చర్చించుతూన్న ప్రశ్న సందర్భంలో ఈ లేఖ అత్యంత ఉత్సుకతను కల్గివుంటూంది. ఇదీ ఆ లేఖలోని ప్రధానభాగం:

"...నా ఉద్దేశంలో అచ్చమైన వలసదేశాలు — అనగా యూరపియన్ ప్రజచే ఆక్రమించబడినట్టి, కెనడా, కేప్, ఆస్ట్రేలియాలు — అన్నీ కూడా స్వతంత్రములైపోతాయి; అందుకు వ్యతిరేకంగా దేశీయప్రజ నివసించుతూ కేవలమూ స్వాధీనంచేసుకొనబడిన దేశాలు — ఇండియా, ఆల్జీరియా, డచ్చి, పోర్చుగీస్, స్పానిష్ అధీనాలు — తాత్కాలికంగా శ్రామికవర్గంచే దాని చేతికిందకి తీసుకొనిరాబడి దాని నాయకత్వాన సాధమైనంత త్వరగా స్వాతంత్ర్యోన్ముఖంగా కొనిపోబడాలి. ఈ విధానం ఎలా పరిణమించుతుందో చెప్పడం కష్టం. ఇండియా బహుశ విప్లవానికి దిగుతుంది, అసలు ఇది అత్యంత సంభవనీయం కూడా; కాగా స్వవిమోచనలో నిమగ్నమైవున్న శ్రామికవర్గం ఎలాంటి వలస యుద్ధాన్నీ సాగించజాలదు కాబట్టి, దేని దారిని దాన్ని పోనివ్వాల్సిందే; అలాంటప్పుడు సహజంగా అన్ని రకాల విధ్వంసమూ జరిగితీరుతుంది; కాని ప్రతి విప్లవంతోనూ అలాంటిది అభేద్యంగా పెనవేసుకుని వుండి తీరుతుంది మరి. ఇటువంటిదే ఇతరత్రా సహితమూ, ఉదాహరణకి, ఆల్జీరియాలోనూ, ఈజిప్ట్‌లోనూ సంభవించవచ్చు; అది నిశ్చయంగా మనకి ఉత్తమోత్తమమైనదే కూడా. మన ఇంట మనకి చేతినిండా పని ఉంటుంది. మొదట యూరప్, ఉత్తర అమెరికాలు పునర్వ్యవస్థీకరించబడ్డాయంటే, ఇది ఎంతటి బ్రహ్మాండమైన బలాన్ని సమకూర్చి, ఎట్టి దృష్టాంతాన్ని అందిస్తుందంటే, అర్ధనాగరిక దేశాలు వాటంతటవే వీటివెంట పడతాయి; మరేవి కాకపోయినా ఆర్థిక అవసరాలే వాటిచేత ఆ పని చేయించేటట్టు చూస్తాయి. కాగా, అవి కూడా సోషలిస్టు ఆర్గనైజేషనుకు చేరుకునే ముందు, ఎట్టి సామాజిక, రాజకీయ దశలను అవి అనుభవించాల్సి వుంటుందో, అందు గురించి మనం నేడు ఇంచుమించు శుష్క శాస్త్రీయకల్పనలను మాత్రమే ప్రతిపాదించగలుగుతాం. ఒక్కటి మాత్రం నిశ్చయం: విజయవంతమైన శ్రామికవర్గం, ఆ విధంగా చేయడం వల్ల తన సొంత విజయాన్నే నాశనం చేసుకోకుండా, ఎట్టి దీవనలనూ ఏ పరజాతిపైనా బలవంతాన రుద్దజాలదు. అంటే దీనివల్ల వివిధ రకాల ఆత్మరక్షణ యుద్ధాలు సహజంగానే ఎంత మాత్రమూ మినహాయించబడడం లేదు. ..."

''ఆర్థికము'' ఒక్కటే అన్ని ఇబ్బందులను తొలగించివేస్తుందని ఎంగెల్స్ ఎంత మాత్రమూ అనుకోవడం లేదు. అందరు ప్రజలూ సోషలిజంవైపు తిరిగేటట్లుగా ప్రేరేపించుతుంది ఆర్థిక విప్లవం; కాని అదే సమయంలో విప్లవాలూ — సోషలిస్టు రాజ్యాంగయంత్రానికి వ్యతిరేకంగా — యుద్ధాలు కూడా సాధ్యమే అవుతాయి. వాటంతటవే రాజకీయాలు ఆర్థికాలకు అనుగుణ్యంగా సరిపెట్టుకుంటాయి, కాని వెంటనేనూ, సజావుగానూ, సులభంగానూ, సూటిగానూ మాత్రం కాదు. ''నిశ్చయంగా,'' నిరపేక్షంగా అంతర్జాతీయమైన ఒకే ఒక్క సూత్రాన్ని ఎంగెల్స్ పేర్కొంటాడు, కాగా దీనిని అన్ని ''పరదేశ ప్రజలకు,'' అనగా ఒక్క వలస ప్రజలకే కాకుండా, ప్రయుక్తం చేస్తాడు; అదేమిటంటే: వాటిపైన ఎట్టి దీవనలనూ బలవంతాన రుద్దడమంటే శ్రామికవర్గ విజయాన్ని నాశనం చేయడమన్నమాట.

సామాజిక విప్లవాన్ని తాను సాధించినంత మాత్రాన్నే శ్రామికవర్గం పవిత్రమైపోయి, ఇక ఎల్లకాలానికీ బలహీనతారహితమైపోదు. కాని సంభవమయ్యే పొరపాట్లను, (స్వార్థాలు — ఇతరుల నెత్తిమీదెక్కి స్వారిచేసే యత్నాలు) అది తప్పనిసరిగా గుర్తించేటట్లు చేస్తాయి.

1914 లో జాతీయ దురహంకారాన్ని సమర్థించే నిమిత్తం మార్క్సిజాన్ని పరిత్యజించే ముందు కౌట్స్కీకి వుండిన అభిప్రాయమే, త్సిమ్మర్‌వాల్డ్ వామపక్షానికి చెందిన మనకీ వుంది; అదే దనగా: అత్యంత ఆద్యతన భావిలోనే — కౌట్స్కీయే అన్నట్లు ''తెల్లవారేసరికల్లా'' — సోషలిస్టు విప్లవం పూర్తిగా సాధ్యమవుతుందనే అభిప్రాయం. జాతీయ విరోధాలు అంత త్వరగా అదృశ్యమైపోవు; పీడిత జాతికి పీడకజాతి పట్ల ద్వేషం — అదికేవలం ధర్మమైనదే కూడానూ — కొంతకాలం వరకూ అలాగే వుంటుంది; సోషలిజం విజయం సాధించిన తరువాతనే, జాతుల మధ్య సంపూర్ణమైన ప్రజాస్వామిక సంబంధాల అంతిమ స్థాపన తరువాతనే అది హరించిపోతుంది. సోషలిజం పట్ల సత్యసంధులమై వుండడమే మనం వాంఛించినట్లయితే, పీడిత జాతులకు విడివడిపోయే హక్కును సమర్థించనిదే పీడక జాతులలో నెలకొనడం దుస్సాధ్యమయేటట్టి అంతర్జాతీయతా భావంలో ప్రజారాసులకు ఇప్పటినుండి సహితమూ మనం ప్రబోధం కల్గించాలి.

జూలై 1916.

# సామ్రాజ్యవాదమూ, సోషలిజంలో చీలిక

సామ్రాజ్యవాదానికీ, యూరప్‌లోని కార్మికోద్యమంపై (సోషల్-జాతీయ దురహంకార రూపంలో) అవకాశవాదం సాధించినట్టి రాక్షసమూ, ఏహ్యమూ అయిన విజయానికీ ఏమైనా సంబంధం వుందా?

ఇదే సమకాలిక సోషలిజాన్ని ఎదుర్కొంటూన్న మౌలికప్రశ్న. కాగా మొదటిది, మన శకం యొక్కా, ప్రస్తుత యుద్ధంయొక్కా సామ్రాజ్యస్వభావమూ, రెండవది, సోషల్-జాతీయ దురహంకారానికీ అవకాశవాదానికీ వున్న అవిభాజ్య చారిత్రక సంబంధమూ, అంతే కాకుండా ఈ రెండింటి భావశాస్త్రీయ-రాజకీయ విషయంయొక్క అభిన్నతా మన పార్టీ సారస్వతంలో సంపూర్ణంగా స్థాపించబడింది కాబట్టి, ఈ మౌలికప్రశ్నను విశ్లేషించే కార్యానికి మనమిప్పుడు పూనుకోగలం, పూనుకు తీరాలి కూడానూ.

సామ్రాజ్యవాదాన్ని, ఎంత నికరంగానూ సంపూర్ణంగానూ నిర్వచించడానికి వీలవుతుందో, అంత నికరమూ సంపూర్ణమూ అయిన నిర్వచనంతో మనం ఆరంభించాలి. సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానంయొక్క విశిష్టమైన చారిత్రాత్మక దశ. దాని విశిష్ట లక్షణాలు మూడు: సామ్రాజ్యవాదం (1) గుత్త పెట్టుబడిదారీ విధానం; (2) పరాన్నభుక్కు, లేదా క్షీణించుతూన్న పెట్టుబడిదారీ విధానం; (3) మరణావస్థలో వున్న పెట్టుబడిదారీ విధానం. స్వేచ్ఛాయుతమైన పోటీని నెట్టివేసి, దాని స్థానాన్ని గుత్తాధిపత్యం ఆక్రమించుకోవడం సామ్రాజ్యవాదం యొక్క మౌలికమైన ఆర్థిక లక్షణం, సామ్రాజ్యవాదం యొక్క సారం. గుత్తాధిపత్యం ఐదు ప్రధాన రూపాల్లో ప్రత్యక్ష మవుతుంది: 1) కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు; పెట్టుబడిదార్లయొక్క ఈ గుత్తాధిపత్య సంఘాలు అవసరమయే దశకు ఉత్పత్తి సాంద్రీకరణ చేరుకుని, వీటిని అది ప్రభవించుతుంది. 2) పెద్ద బ్యాంకుల గుత్తాధిపత్య స్థానం — మూడు నుండి ఐదువరకూ బృహత్ బ్యాంకులు అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ యావత్తు ఆర్థిక జీవితాన్ని తమ చిత్తం వచ్చినట్టు నడుపుతున్నాయి; 3) ముడిపదార్థపు వనరులను

ట్రస్టులు, ఫినాన్షల్ ఆలిగార్కి [విత్తీయ మంత్రాంగవర్గం] హస్తగతం చేసుకోవడం (బ్యాంకు పెట్టుబడితో విలీనీకరణమైన గుత్తాధిపత్యపు పారిశ్రామిక పెట్టుబడే ఫినాన్స్ పెట్టుబడి); 4) అంతర్జాతీయ కార్టెల్సుచే ప్రపంచ (ఆర్థిక) విభజన అదివరకే ఆరంభమయింది. యావత్తు ప్రపంచ మార్కెట్టుపై అధికారం చలాయించుతూ, దానిని తమలో తాము "సఖ్యతతో" విభాగించుకునేటట్టి – యుద్ధం పునః విభాగించే వరకూ – ఇట్టి అంతర్జాతీయ కార్టెల్సు ఇప్పటికప్పుడే నూటికి పైగా వున్నాయి! పెట్టుబడి ఎగుమతి – గుత్తవ్యాపారేతర-పెట్టుబడిదారీ విధానం కింద వర్తకపు సరుకుల ఎగుమతితో విభేదించుతున్నట్టి అత్యంత విశిష్టమైన దృగ్విషయం – ఆర్థిక, ప్రాదేశిక-రాజకీయ ప్రపంచ విభాగంతో సన్నిహితంగా ముడిపడి వుంది; 5) ప్రపంచాన్ని ప్రాదేశికంగా విభాగించడం (వలసలు) పూర్తి అయిపోయింది.

అమెరికాలోనూ యూరప్‌లోనూ, అటుతరువాత ఆసియాలోనూ పెట్టుబడిదారీ విధానం యొక్క అత్యున్నత దశగా సామ్రాజ్యవాదం 1898–1914 మధ్యకాలంలో సంపూర్ణంగా అభివృద్ధి చెందింది. స్పానిష్-అమెరికన్ సంగ్రామం (1898), ఆంగ్లో-బోయర్ సంగ్రామం (1899–1902), రష్యా-జాపాన్ సంగ్రామం (1904–1905), 1900లో యురప్‌లో ఆర్థికసంక్షోభమూ ప్రపంచ చరిత్ర నూతన శకంలో చారిత్రాత్మకంగా ప్రధానములైన సరిహద్దురాళ్లు.

సామ్రాజ్యవాదం పరాన్నభుక్కు, లేక క్షీణించుతూన్న పెట్టుబడిదారీ విధానమేనని, ఉత్పత్తి సాధనాలపై సొంత స్వామ్యం వున్న చోట్లల్లా, గుత్తవ్యాపారం సర్వానికీ స్వాభావికమైనట్టి క్షీణత చెందడమనే వైఖరిలో ప్రప్రథమంగా ప్రత్యక్షమవుతుంది. సామ్రాజ్యవాద బూర్జువావర్గంలో ప్రజాసత్తాక, అభ్యుదయ నిరోధక-రాజరిక విధానాల మధ్యనున్న భేదం తుడుచుపోతూంది, అందుకు అచ్చమైన కారణం, రెండూ కూడా ప్రాణంతోనే వున్నప్పటికీ కుళ్లిపోతూ వుండడమే (ఇంత మాత్రాన కొన్ని వ్యక్తిగత పరిశ్రమలలోనూ, కొన్ని వ్యక్తిగత దేశాలలోనూ, కొన్ని వ్యక్తిగత కాలావధులలోనూ పెట్టుబడిదారీ విధానం యొక్క అత్యద్భుత త్వరితగతినిగల అభివృద్ధిని ఇది ఆటంకపరచదు). రెండవది, రెంటీయర్స్* "వడ్డీ ప్రతాల చీట్లు కత్తిరించి" జీవించే పెట్టుబడిదార్ల బ్రహ్మాండ స్తరములను సృష్టించడంలోనే పెట్టుదారీ విధాన క్షీణం ప్రత్యక్షమవుతూంది. అగ్రస్థానమందున్న నాల్గు సామ్రాజ్యవాద దేశాలలోనూ – ఇంగ్లండు, ఉత్తర అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ – ప్రభుత్వరుణపత్రాల

---

*ఉత్పత్తిలో సూటిగా పాల్గొనకుండానే వాటా పత్రాలు, ప్రభుత్వరుణపత్రాలు స్టాకు పత్రాలపై వచ్చే లాభాలపైనే జీవించేవారు. – అనువాదకుడు.

రూపంలో వున్న పెట్టుబడి ఒక్కొక్క దేశంలో 100 నుండి 150 మిలియార్డుల ఫ్రాంకులవరకూ వుంటుంది, అనగా దీనినుండి సాలీనా వచ్చే ఆదాయం ఒక్కొక్క దేశం లోనూ 5 నుండి 8 మిలియార్డులకు తక్కువలేకుండా వుంటుందన్నమాట. మూడవది, పరా కాష్ఠ అందుకున్న పరాన్నభుక్తమే పెట్టుబడి ఎగుమతి. నాల్గవది, "ఫినాన్స్ పెట్టుబడి పరిపాలన కోసమే ప్రయత్నిస్తుంది కాని, స్వేచ్ఛకోసం ప్రయత్నించదు." దారి కడవెళ్లా రాజకీయ అభివృద్ధి నిరోధమే సామ్రాజ్యవాదంయొక్క స్వాభావిక లక్షణం. అవినీతి, పెద్ద యెత్తున లంచగొండితనం, బ్రహ్మాండమైన అన్ని రకాల మోసాలూనూ. ఐదవది, అన్యా క్రమణతో అవిభాజ్యంగా పెనవేసుకు పోయినట్టి పీడిత జాతుల దోపిడీ, అందులోనూ ముఖ్యంగా పట్టెడుమంది "మహా" రాజ్యాలచే వలసదేశాల దోపిడీ కోటానకోట్ల అనాగరిక ప్రజల శరీరంపై జీవించుతూన్న పరాన్నభుక్కుగా నాగరిక ప్రపంచాన్ని మార్చివేసింది. రోమన్ శ్రామికుడు సమాజం మీద జీవించుతూండే వాడు. సమకాలిక సమాజం ఆధునిక శ్రామికుని మీద జీవించుతూంది. సిస్మొండి చేసిన ఈ ప్రగాఢ అవేక్షణను మార్క్స్ ప్రత్యే కంగా ఒత్తిచెప్పాడు.[132] పరిస్థితులను సామ్రాజ్యవాదం కొంతవరకూ మార్చుతుంది. సామ్రాజ్య వాద దేశాలలోని శ్రామికవర్గం యొక్క ఉపరిస్తరములు కోటానకోట్ల అనాగరిక ప్రజల కష్టంపై జీవించుతున్నాయి.

సామ్రాజ్యవాదం మరణావస్థలో వున్న పెట్టుబడిదారీ విధానమే, సోషలిజంలోకి పరివర్తన చెందుతూన్న పెట్టుబడిదారీ విధానమే ఎందుకవుతూందో స్పష్టమవుతూంది: పెట్టుబడిదారీ విధానం లోపలినుండి పుట్టుకు వచ్చేటట్టి గుత్తాధిపత్యం, అప్పటికే మరణ శయ్యమీద వున్నట్టి పెట్టుబడిదారీ విధానం, సోషలిజంలోకి పరివర్తన యొక్క ఆరంభం. సామ్రాజ్యవాదంచే శ్రమను బ్రహ్మాండంగా సామాజికీకరణం (క్షమార్హులు — బూర్జువా అర్థశాస్త్రవేత్తలు చెప్పే — "పరస్పరానుబంధం") చేయడమంటే ఇదే.

సామ్రాజ్యవాదానికి ఈ నిర్వచనం ప్రతిపాదించడంలో, సామ్రాజ్యవాదాన్ని "పెట్టు బడిదారీ విధాన అవస్థగా" భావించడానికి నిరాకరించుతూ, ఫినాన్స్ పెట్టుబడిచే "ఉత్తమము" అని అవలంబించబడిన విధానం అనీ, "పారిశ్రామిక" దేశాలచే "వ్యావసాయక" దేశాల ఆక్ర మణ ధోరణి అనీ సామ్రాజ్యవాదానికి నిర్వచనం చెప్పేటట్టి కె.కౌట్స్కీతో మనం సంపూ ర్ణంగా వ్యతిరేకిస్తున్నాం.* సైద్ధాంతిక దృక్స్థానంనుండి చూచినట్టయితే, కౌట్స్కీ ఇచ్చిన

---

* "అత్యున్నత స్థాయిలో అభివృద్ధి చెందిన పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ ఫలితమే సామ్రాజ్యవాదం. పారిశ్రామిక పెట్టుబడిదారీ జాతి ప్రతీదీ, అంతకు మరింత అధిక సంఖ్య వ్యావసాయక ప్రాంతాలను, వాటిలో ఏ జాతులు నివసిస్తున్నాయనే ప్రసక్తి లేకుండా,

నిర్వచనం పూర్తిగా బూటకం. పారిశ్రామిక పెట్టుబడియొక్క పరిపాలన గాకుండా, ఫినాన్స్ పెట్టుబడియొక్క పరిపాలనే, కేవలం వ్యవసాయక దేశాలనే గాకుండా, అన్ని రకాల దేశాలనూ అన్యాక్రమణచేసి కల్పుకునే యత్నాలలోనే వుంది సామ్రాజ్యవాదంయొక్క ప్రత్యేకత. ''నిరాయుధీకరణ,'' ''అతిసామ్రాజ్యవాదం,'' ఇత్యాది అసందర్భాలవంటి తన అపభ్రంశపు బూర్జువా రిఫార్మిజానికి మార్గం సుగమం చేసేందుకు, సామ్రాజ్యవాదంయొక్క రాజకీయాలను దాని ఆర్థిక విధానంనుంచీ, రాజకీయాల్లో వున్న గుత్తాధిపత్యాన్ని ఆర్థిక వ్యవస్థలో వున్న గుత్తాధిపత్యంనుంచీ కౌట్స్కీ వేరుచేస్తున్నాడు. సామ్రాజ్యవాదంలో వున్న అత్యంత ప్రగాఢ వైరుధ్యాలను మసిపూసి మరుగుపరచడమూ, ఆ విధంగా సామ్రాజ్యవాదపక్షపు క్షమార్హులతో, తాము సోషల్-జాతీయ దురహంకారులమని బహిరంగంగా చెప్పకుంటూన్న వాళ్లతో ''ఐక్యత'' అనే సిద్ధాంతాన్ని సమర్థించడమూ ఈ సైద్ధాంతిక అసత్యంయొక్క లక్ష్యమూ ఉద్దేశమూన్నూ.

మార్క్సిజంనుండి కౌట్స్కీ తెగతెంపులు చేసుకుని విడిపోవడమును గురించి ''సోత్సియాల్-డెమొక్రాత్'' లోనూ, ''కామ్యూనిస్ట్'' లోనూ మే మిదివరకే చాలినంతగా ప్రస్తావించాం. మన రష్యన్ కౌట్స్కీయ అనుచరులూ, మార్తొవ్‌నూ చాలా మట్టుకు ట్రాట్స్కీనీ కూడగట్టుకుని, అక్సెల్‌రోడ్, స్పెక్టేటర్లు నాయకత్వం వహించుతూన్న ఆర్గనైజింగ్ కమిటీ[133] సహాయకులూ, కౌట్స్కీతత్వాన్ని ఒక ధోరణిగా, ఒక వివాదగ్రస్త విషయంగా పరిగణించాల్సి వుంటుందనే విషయాన్ని నోరుకుట్టుకుని దాటవేశారు. కౌట్స్కీని కేవలం శ్లాఘించడంతోనే (ఆర్గనైజింగ్ కమిటీ రష్యన్ భాషలో ప్రచురణను ఖరారు చేసినట్టి జర్మన్ పాంప్లెట్‌లో అక్సెల్‌రోడ్), లేదా తాను ప్రతిపక్షానికి చెందినవాడనేనని వాలాయించుతూ, తన జాతీయ దురహంకార ప్రకటనలను కపటబుద్ధితో తాను నిరర్థకంచేయ ప్రయత్నించుతూ కౌట్స్కీ (స్పెక్టేటర్) రాసిన ప్రైవేటు వుత్తరాల నుండి ఉల్లేఖనలకే తాము పరిమితమవుతూ, కౌట్స్కీ యుద్ధకాలంలో రాసిన దానిని మాత్రం సమర్థించడానికి వారికి దమ్ములు లేకపోయాయి.

సామ్రాజ్యవాదం గురించి తనకున్న ''అవగాహన''లో — సామ్రాజ్యవాదాన్ని ముస్తాబు చేయడంతో సమాన మవుతూన్నట్టి భావనలో — హిల్‌ఫెర్‌డింగ్ రచించిన ''ఫినాన్స్ పెట్టుబడి'' గ్రంథంతో సరిపోల్చుతేనే (కౌట్స్కీనీ, సోషల్-జాతీయ దురహంకారులతో ''ఐక్యతనూ'' ఈనాడు హిల్‌ఫెర్‌డింగ్ ఎంత శ్రద్ధతో సమర్థించుతూన్నప్పటికైనా సరే!), అంతే

లొంగదీసి వాటిని కలిపివేసుకునే ప్రగాఢ వాంఛను అది కలిగి వుంటుంది'' (కౌట్స్కీ: "Neue Zeit" 1914 సెప్టెంబరు11).

కాకుండా సోషల్-లిబరల్ అయిన జె.ఎ. హాబ్సన్‌తో కూడా సరిపోల్చినప్పటికీ కూడా ఒక వెనుకంజే కౌట్‌స్కీ వేస్తున్నాడని గమనించాల్సి వుంటుంది. తాను మార్క్సిస్టునని ఈషణ్మాత్రమైనా ఒప్పుకోనని ఈ ఇంగ్లీషు అర్థశాస్త్రవేత్త, సామ్రాజ్యవాదాన్ని మరింత ప్రగాఢంగా నిర్వచిస్తూ, దాని వైరుధ్యాలను 1902 లో రచించిన తన గ్రంథంలో మరింత సమూలంగా* బహిర్గతం చేస్తున్నాడు. సామ్రాజ్యవాదంయొక్క పరాన్నభుక్కు స్వభావం అనే అత్యంత ప్రాముఖ్యతను కల్గిన సమస్య గురించి ఈ రచయిత (కౌట్‌స్కీయొక్క యుద్ధ వ్యతిరేక "సామరస్య" తత్వపు చప్పచప్పని మాటలన్నీ ఈ రచయిత పుస్తకంలో వున్నాయి) ఇలా రాస్తున్నాడు:

పాతకాలపు సామ్రాజ్యాల శక్తిని హాబ్సన్ అభిప్రాయంలో రెండు సందర్భాలు బలహీన పరచాయి: 1) "ఆర్థిక పరాన్నభుక్కు విధానం" 2) తమకు లోబడివున్న పరదేశ ప్రజలతో తమ సేనలను నిర్మించుకోవడమూ. "మొదటి సందర్భం, పరిపాలన చలాయించుతూన్న రాజ్యం తన రాష్ట్రాలనూ వలసదేశాలనూ తన పరాధీన రాజ్యాలనూ తన పాలకవర్గాలనూ ధనవంతులను చేయడానికీ, తన కార్మికవర్గాలను తల ఒగ్గేటట్టు చేసేందుకు వారికి లంచం మేపడానికీ ఉపయోగించినట్టి ఆర్థిక పరాన్నభుక్కు విధానపు అలవాటు." రెండవ సందర్భాన్ని గూర్చి హాబ్సన్ ఇలా రాస్తాడు:

"సామ్రాజ్యవాద అంధత్వానికున్న అత్యంత చిత్రమైన లక్షణాలలో ఒకటి " (సామ్రాజ్యవాదులకున్న "అంధత్వం" గురించిన ఈ గీతాలు, "మార్క్సిస్టు" కౌట్‌స్కీనుండి కంటె సోషల్-లిబరల్ హాబ్సన్ నోటనుండి వెలువడడమే హెచ్చు సమంజసంగా వుంటుంది) "ఈ ప్రమాదభరితమైన మార్గాన్ని గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు, తదితర సామ్రాజ్య జాతులు అనాలోచితమైన ఉదాసీనతతో చేపట్టుతూండడం. ఈ మార్గాన అందరికంటె హెచ్చు దూరం పయనించింది గ్రేట్ బ్రిటనే. ఇండియా సామ్రాజ్యాన్ని జయించడానికై మనం సాగించిన యుద్ధాల్లో అత్యధికభాగం ఇండియా దేశీయులు మనతరఫున పోరాడినవే; ఇటీవల ఈజిప్టులో లాగానే, మహత్తరమైన స్థాయీ సేనల నాయకత్వాన్ని బ్రిటిష్ సేనానులు తమ చేతిలోనే వుంచుకున్నారు; మన ఆఫ్రికన్ పరాధీన దేశాలకు సంబంధించినంత వరకూ, దక్షిణ భాగం మినహా, ఇంచుమించు అన్ని యుద్ధాలనూ మన తరఫున దేశీయులే సాగించారు."

ఆర్థిక దృష్ట్యా, చైనా భావి విభజనను హాబ్సన్ ఈ విధంగా విలువకట్టుతున్నాడు: "దక్షిణ ఇంగ్లండు, రివియేరాలలోనీ, విలాసయాత్రికులమయమైనట్టీ, లేదా ఆవాసికములై

* J.A.Hobson. "Imperialism," London, 1902.[జె. ఎ. హాబ్సన్, "సామ్రాజ్యవాదం," లండన్, 1902. – అనువాదకుడు.]

నట్టే ఇటలీ, స్విట్జర్లెండ్‌లలోని కొన్ని భాగాలూ చిన్న గుంపులుగా నివసించుతూన్నట్టే దూర ప్రాచ్యంనుంచి డివిడెండ్లనూ పెన్షన్లనూ ఆర్జించుకుంటూన్నట్టే ధనిక ప్రభువులనూ, వీరితోపాటు ఇంతకంటె కొద్దిగా అధికసంఖ్యలో వున్న వృత్తి ఆశ్రితులూ వ్యాపారస్థులనూ, ఇంతకంటె బాగా అధికసంఖ్యలోనే వున్న ఆసన్నపరిచారకులనూ రవాణా వ్యాపారంలోనూ ఆహారపు సరుకుల చివరి ఉత్పత్తి దశలలోనూ పనిచేస్తూన్న కార్మికులనూ కల్గిన ప్రాంతాలు ఇప్పటికప్పుడే ప్రదర్శిస్తూన్న రూపాన్నీ స్వభావాన్నీ పశ్చిమ యూరప్‌లోని అత్యధిక భాగం కూడా అప్పుడు వహించవచ్చు; ముఖ్యమైన ప్రధాన పరిశ్రమలన్నీ అదృశ్యమైపోయి, దిన దినమూ ఆహారానికి కావలసిన సరుకులూ ఫ్యాక్టరీ ఉత్పత్తులూ కప్పము రూపంలో ఆసియా ఆఫ్రికాలనుండి దేశంలోకి ప్రవహించుతూంటాయి." "ఇంతకంటెనూ పెద్దదైన పాశ్చాత్య రాజ్యాల మిత్రత్వం, బృహత్ రాజ్యాల యూరపియన్ సమాఖ్య, ప్రపంచ నాగరికతా కార్యాన్ని ముందుకు తీసుకుపోవడం బదులు, ఒక పాశ్చాత్య పరాన్నభుక్కు విధానం అనే బ్రహ్మాండమైన ప్రమాదాన్ని ప్రవేశపెట్టగలిగే సాధ్యతనే, వ్యవసాయమూ, ఫ్యాక్టరీ సరుకుల ఉత్పత్తిలాంటి మౌలిక పరిశ్రమలలో ఇకనుండి పనిచేయకుండా, ఒక నూతన ఫినాన్షల్ ప్రభువర్గంచే కంట్రోలు చేయబడుతూన్నట్టి లేదా పారిశ్రామికంగా అప్రధానమైన సేవలను నిర్వర్తించడంలో నియుక్తులై, వినమ్రులైన విస్తృత ఆశ్రిత జనరాసులను పోషించుతూన్నట్టి, ఆసియా ఆఫ్రికాల నుండి బృహత్తరమైన కప్పాన్ని ఆర్జించే ఉన్నత వర్గాలను కలిగిన పురోగామి పారిశ్రామిక జాతుల సమూహం ఒకటి మున్ముందు సాధ్యం కావచ్చునని మనం సూచించాం. ఇటువంటి సిద్ధాంతం" (భవిష్యత్తు అనవలసింది అతడు) "పర్యాలోచించ తగనిది కానేకాదని హేళన చేయబోయేవారిని, ఇప్పటికప్పుడే ఈ స్థితికి దిగజారిపోయినట్టి దక్షిణ ఇంగ్లండు జిల్లాల సామాజిక, ఆర్థిక స్థితిని పరిశీలించి, ఇంతవరకు ప్రపంచం ఎరుగని శక్తివంతమైన బృహత్‌లాభ జలాశయాన్ని యూరప్‌లో వినిమయం చేసేందుకుగాను ఖాళీ చేయబోతూన్న ఫినాన్షియర్ల, ఇన్వెస్టర్ల (రెంటీయర్స్) గ్రూపులవంటి గ్రూపుల ఆర్థిక కంట్రోలుకు చైనాను ఒప్పగించడం వల్ల సాధ్యం కాబోయే వ్యవస్థయొక్క అపార విస్తర్ణగూర్చి పర్యాలోచించమనండి. భవిష్యత్తును గురించి ఈ ఒక్క వ్యాఖ్యానం, లేదా మరే ఇతర వ్యాఖ్యానం సాధ్యమవుతుందో చెప్ప డానికి, ప్రపంచశక్తుల లీల ఎంతో అంత లెక్కకట్టనలవికాకుండానూ, పరిస్థితి ఎంతో అంత సంక్లిష్టంగానూ వుంది; కాని పాశ్చాత్య యూరప్‌యొక్క సామ్రాజ్యవాదాన్ని పరిపాలించుతూన్న ప్రభావాలు నేడు ఈ దిశలోనే నడుస్తున్నాయి, కాగా వీటికి భంగపాటు కలగని పక్షమందూ, లేదా ఇతర మార్గాలకు మళ్లించబడని పక్షమందూ, ఇటువంటి సమాప్తి అభిముఖంగానే ఇవి తప్పక సాగిపోతాయి".

విప్లవాత్మక శ్రామికవర్గంవల్ల మాత్రమే అదిన్నీ సామాజిక విప్లవ రూపంలో మాత్రమే వీటికి "భంగపాటు" కల్గుతుందన్న విషయాన్ని సోషల్-లిబరల్ హాబ్సన్ గమనించడం లేదు. అతడు సోషల్-లిబరల్ కాదా మరి! అయినప్పటికీ, "యూరప్ సంయుక్త రాష్ట్రాల" సమస్యనూ దాని ఆంతర్యాన్నీ వివిధ దేశాలకు చెందిన వంచకులు కౌట్స్కీయ అనుచరులచే నేడు పూర్తిగా దాటవేయబడుతూన్న దానినంతనూ, అనగా అవకాశవాదులు (సోషల్-జాతీయ దురహంకారులు) సామ్రాజ్యవాద బూర్జువావర్గంతో కలిసి ఆఫ్రికా ఆసియాల మూపులపై స్వారిచేసే సామ్రాజ్యవాద యూరప్‌ను అచ్చంగా సృష్టించడానికే కృషిచేస్తున్నారనే విషయాన్ని, బాహ్యగతాత్మకంగా చూచినట్టయితే సామ్రాజ్యవాదంయొక్క అపరిమిత లాభాలనుండి లంచాలు తినిపించి, పెట్టుబడిదారీ విధానంయొక్క కావలికుక్కలుగానూ, కార్మికోద్యమాన్ని అవినీతి పాల్జేసేవారుగానూ రూపొందించబడినట్టి పెట్టీబూర్జువావర్గానికీ, కార్మికవర్గంలోని కొన్ని ప్రత్యేక స్తరములకూ చెందిన విభాగాలవారే అవకాశవాదులనే విషయాన్ని, ఎంతో ముందుగానే 1902 లోనే (కౌట్స్కీయ అనుచరుడైన ట్రాట్స్కీ దీనిని గమనించుతాడనే ఆశించుదాం!) అతడు ఎంతో ఘనంగా ఎదుర్కొన్నాడు.

సామ్రాజ్యవాద బూర్జువావర్గానికీ, కార్మికోద్యమంలో నేడు విజయం గాంచినట్టి (ఇది ఎన్నాళ్ళు నిలుస్తుందో మరి!) అవకాశవాదానికీ వున్నట్టి ఆర్థికమూ అత్యంత ప్రగాఢమూ అయిన ఈ సంబంధాన్ని పత్రికావ్యాసాలలోనూ, పార్టీ తీర్మానాలలోనూ మేం పదేపదే చూపించుతూ వచ్చాం. సోషల్-జాతీయ దురహంకారులతో చీలిక తప్పనిసరి అనే పర్యవసానాన్ని దీనినుంచే, ఇతర విషయాలతోపాటు, తేల్చాం. ఈ సమస్యను దాటవేయడమే మంచిదని ఎంచుతున్నారు మన కౌట్స్కీయ అనుచరులు! ఉదాహరణకు, "ఆర్గనైజేషన్ కమిటీ విదేశీయ సెక్రిటేరియట్ బుల్లెటిన్"లో (నెం.4, 1916 ఏప్రిల్ 10) ఈ కింది విధంగా వ్యక్తీకరించబడినట్టి ఒక కుతర్కాన్ని మార్తొవ్ తన ఉపన్యాసాలలో వ్రాకుచ్చాడు:

"...మానసికాభివృద్ధిలో 'మేధావిస్తరాన్ని' అతి సన్నిహితంగా సమీపించుతున్నట్టీ, అత్యంత ఉన్నతస్థాయి నైపుణ్యత కలిగినట్టీ కార్మిక గ్రూపులు విప్లవాత్మక సోషల్-డెమోక్రసీనుండి అవకాశవాద దిశగా ప్రాణాంతకంగా దూరమైపోతూన్నట్టయితే, విప్లవాత్మక సోషల్-డెమోక్రసీ ఉద్యమస్థితి విచారకరంగానే కాకుండా, నిరాశాజనకంగానే వుంటుంది...."

"ప్రాణాంతకంగా" అనే తెలివిమాలిన పదం ఉపయోగించడం వల్లనూ, ఒకానొక "హస్తలాఘవం" వల్లనూ కొన్ని నిర్దిష్టములైన కార్మికవర్గ స్తరములు అవకాశవాద దిశగానూ, సామ్రాజ్యవాద బూర్జువావర్గ దిశగానూ దూరమయిపోయాయన్న వాస్తవవిషయం దాటవేయబడుతూంది! ఆర్గనైజేషన్ కమిటీ కుతర్కవాదులకు కావలసినదంతా ఈ వాస్త విషయాన్ని దాటవేయడమే! ఈనాడు కౌట్స్కీయ అనుచరుడు హిల్‌ఫెర్‌డింగ్, ఇంకా ఇతరుల

నేకులూ గొప్పలు చెప్పుకుంటూన్నట్టి "అధికారయుతమైన ఆశావాదం"తో అసలు విషయాన్నివారు కొట్టిపారేస్తున్నారు: శ్రామికవర్గ ఐక్యతకూ, విప్లవాత్మక ధోరణి విజయానికీ బాహ్యగతాత్మక పరిస్థితులే హామీ యిస్తాయట! — అని వారు ఉద్ఘాటిస్తున్నారు. శ్రామికవర్గం విషయంలో — వారు ఉద్ఘాటిస్తున్నారు — మేము "ఆశావాదుల"మట!

వాస్తవంగా మాత్రం, ఈ కౌట్‌స్కీయ అనుచరులందరూ — హిల్‌ఫెర్డింగ్, ఆర్గనైజేషన్ కమిటీ పక్షంవారు మార్తొవ్‌ప్రభృతులు — అవకాశవాద విషయంలో... ఆశావాదులు. ఇదీ అసలు విషయం!

శ్రామికవర్గం — ఒక్క యూరపియన్ పెట్టుబడిదారీ విధానం యొక్క కాకుండా, ఒక్క సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానం యొక్క కాకుండా — ప్రపంచ పెట్టుబడిదారీ విధానం యొక్క బిడ్డ. ప్రపంచస్థాయిలో ఏభైయ్యేళ్ళ ముందుగానో, ఏభైయ్యేళ్ళ ఆలస్యంగానో — ఈ దృష్ట్యా, సమస్య స్వల్పమైనదే — "శ్రామికవర్గం" సహజంగానే ఐక్యతను "కల్గివుంటుంది," దీనిలోపల సోషల్-డెమోక్రసీ "తప్పనిసరిగా" విజయవంత మవుతుంది. కాని కౌట్‌స్కీయ అనుచరుల్లారా! అసలు విషయం ఇదికాదు. యూరప్‌లోని సామ్రాజ్యవాద దేశాల్లో ఒక వర్గంగా శ్రామికవర్గానికి అన్యులైనట్టి, బూర్జువావర్గం యొక్క నౌకర్లూ, ఏజెంట్లూ, బూర్జువావర్గ ప్రభావానికి వాహనాలూ అయినట్టి అవకాశవాదుల ఎదుట వారి బంట్లుగా మీరు ఊడిగం చేస్తున్నారు. కార్మికోద్యమం గనుక వీరిని వదలించుకొనకపోతే, అది బూర్జువా కార్మికోద్యమంగానే వుండిపోతుంది. అవకాశవాదులతో, లెజీన్‌లతో, డావిడ్‌లతో, ప్లెహానొవ్‌లు, లేదా ఛెన్‌కేలిలు, పొత్రేసొవ్‌ల వగైరాలతో "ఐక్యత" కోసమైన మీ వాదన బాహ్యగతాత్మకంగా చూచినట్టయితే కార్మికోద్యమంలో వున్న సామ్రాజ్యవాద బూర్జువావర్గపు అత్యుత్తమమైన ఏజెంట్ల ద్వారా కార్మికులను బానిసలుగా చేసివేయడమును సమర్థించడమే. ప్రపంచ స్థాయిలో విప్లవాత్మక సోషల్-డెమోక్రసీ విజయం కేవలమూ అనివార్యం, కాని ఇది మీకు వ్యతిరేకంగానే సాగుతుంది, తప్పక సాగితీరుతుంది, ఇది సంభవించుతూనేవుంది. తప్పక సంభవించి తీరుతుంది, అది మీ మీద విజయమే కాబోతుంది.

సమకాలిక కార్మికోద్యమంలో వున్నట్టి, 1914–1916లలో యావత్తు ప్రపంచంలోనూ ప్రత్యక్షంగా ఒకదానినుండి ఒకటి విడిపోయి వేరు మార్గాలు చేపట్టిన ఈ రెండు ధోరణులు, ఆ మాటకొస్తే ఈ రెండు పార్టీలు, మార్క్స్, ఎంగెల్స్‌లచే ఇంగ్లండులో అనేక దశాబ్దాల కాలంలో, సుమారు 1858 నుండి 1892 వరకు, అవేక్షితమయాయి. 1898–1900 కంటె ముందే ఆరంభించబడినట్టి ప్రపంచ పెట్టుబడిదారీ విధానంయొక్క సామ్రాజ్యవాదశకాన్ని చూసేవరకూ మార్క్స్‌గాని, ఎంగెల్స్‌గాని జీవించి వుండలేదు. సామ్రాజ్యవాద విశిష్టలక్షణాలను, అధమం రెండు ప్రధాన లక్షణాలను అప్పటికే, పందొ

మ్మిదవ శతాబ్ది మధ్యకాలంనుంచే బహిరంగ పరచడం ఇంగ్లండు యొక్క విశిష్ట స్వభావం: 1) బ్రహ్మాండమైన వలసదేశాలు, 2) గుత్తవ్యాపార లాభం (ప్రపంచ మార్కెట్టులో తన కున్నట్టి గుత్తాధిపత్య స్థానం దీనికి కారణం. రెండు విషయాలలోనూ కూడా, ఆ కాలంలో పెట్టుబడిదారీ దేశాలలో ఇంగ్లండు ఒక మినహాయింపు; కాగా ఈ మినహాయింపును మార్క్స్, ఎంగెల్స్‌లు విశ్లేషణచేస్తూ, ఇంగ్లీషు కార్మికోద్యమంలో అవకాశవాద (తాత్కాలిక) విజయంతో దీనికిగల సంబంధాన్ని సుస్పష్టంగానూ నిష్కర్షగానూ చూపించారు.

1858 అక్టోబరు 7 తేదీ లేఖలో ఎంగెల్స్, మార్క్స్ పేర ఇలా రాశాడు: "...ఇంగ్లీషు శ్రామికవర్గం వాస్తవంగా అంతకు మరింత బూర్జువాగా తయారవుతూందంటే, జాతులన్నిటిలోనూ అత్యంత బూర్జువా అయిన ఈ జాతి, ఒక బూర్జువా ప్రభువర్గాన్నీ, బూర్జువావర్గం సరసనే ఒక బూర్జువా శ్రామికవర్గాన్నీ తుదకు కలిగివుండడానికే ప్రత్యక్షంగా ప్రయత్నిస్తూంది. ప్రపంచాన్నంతనూ దోపిడీ చేస్తూన్నట్టి జాతికి ఇది సహజంగా సమర్థనీయమే." సోర్గె పేర ఎంగెల్స్ 1872 సెప్టెంబరు 21 తేదీన రాసిన లేఖలో, ఇంటర్నేషనల్ యొక్క ఫెడరల్ కౌన్సిల్‌లో హేల్స్ (Hales) పెద్ద రగడ లేవనెత్తాడనీ, "ఇంగ్లీషు కార్మికోద్యమ నాయకులు అమ్ముడుపోయారని" మార్క్స్ అన్నందుకు, మార్క్స్‌పై ఒక అభిశంసన తీర్మానాన్ని హేల్స్ సాధించగల్గాడనీ సోర్గెకు తెలియపరచాడు. మార్క్స్ 1874 ఆగస్టు 4 న సోర్గె పేర ఇలా రాశాడు: "ఇక్కడ" (ఇంగ్లండులో) "పట్నవాస కార్మికుల మాట చెప్పాలంటే, ఈ నాయకుల మంద యావత్తూ పార్లమెంటు సభ్యులైవుంటే ఏ విచారమూ లేకపోను. ఈ మూకను వదల్చుకోవడానికి ఇంతకంటె మంచి మార్గం మరొకటిలేదు." ఎంగెల్స్ 1881 ఆగస్టు 11 న మార్క్స్ పేర రాస్తూ: "మధ్యతరగతికి అమ్ముడుపోయి, లేదా అధమం దాని డబ్బుతింటూన్న మనుషుల నాయకత్వాన్ని సహించుతూన్నట్టి ఈ శుద్ధ అధ్వాన్నపు ఇంగ్లీషు ట్రేడ్‌యూనియన్ల" గురించి ప్రస్తావిస్తాడు. ఎంగెల్స్ కౌట్‌స్కీ పేర 1882 సెప్టెంబరు 12 న ఇలా రాశాడు: "వలస విధానం గురించి ఇంగ్లీషు కార్మికులు ఏమనుకుంటున్నారని మీరు అడుగుతున్నారు. సరే చెప్తాను వినండి. సాధారణంగా రాజకీయాల గురించి వాళ్ళే మనుకుంటున్నారో సరిగ్గా అదే అనుకుంటున్నారు.... ఇక్కడ కార్మికుల పార్టీ లేదు, ఇక్కడున్నదల్లా కన్సర్వేటివ్‌లూ, లిబరల్-రాడికల్సూ; ప్రపంచ మార్కెట్లపైనా, వలసదేశాలపైనా ఇంగ్లండుకున్న గుత్తాధిపత్యపు విందులో వీళ్లు కూడా ఉల్లాసంతో పాల్గొంటున్నారు."

ఎంగెల్స్ సోర్గెపేర 1889 డిసెంబరు 7 న ఇలా రాశాడు: "... ఇక్కడ" (ఇంగ్లండులో) "అన్నిటికంటెనూ అసహ్యాకరమైన దేమిటంటే, కార్మికుల చీమురక్తాల్లోకి ఎక్కిపోయినట్టి బూర్జువాతత్వపు 'గౌరవార్హత' (respectability) భావం.... కాగా

ఈ జట్టు అంతటిలోనూ ఉత్తముడని నేను భావించే టామ్ మాన్ సహితం, లార్డ్ మేయర్‌తో తాను భోజనానికి వెళ్ళుతున్నానన్న సంగతి వలుగురితోనూ చెప్పుకుని మహా ఆనందపడేవాడు. దీనిని మనం ఫ్రెంచివాళ్లతో సరిపోల్చిచూస్తే, ఏది ఎలావున్నప్పటికీ, విప్లవం ఎంత మంచిదో మనం అర్థం చేసుకోగల్గుతాం." 1890 ఏప్రిల్ 19 న తాను రాసిన లేఖలో అతడిలా అంటున్నాడు: "కాని అడుగున మాత్రం ఉద్యమం" (ఇంగ్లండులో కార్మికవర్గ ఉద్యమం) "సాగుతూనే వుంది, అంతకంతకు మరింత విశాల స్తరాలను ఇంతవరకూ స్తంభించిపోయి అట్టడుగున వున్న రాశిని ముఖ్యంగా ఆవహించుతూంది" (ఒత్తులు ఎంగెల్స్‌వి). "కాగా తనను తానే కనుగొని, చలనంలో వున్నది తానే అనే జ్ఞానం ఈ బ్రహ్మాండ రాశికి కలిగే దినం ఇంక అట్టే ఎంతో దూరంలో లేదు." 1891 మార్చి 4 న ఇలా రాస్తాడు: "రేవు కార్మికుల యూనియన్ చితికి పోయింది; డబ్బుండి, ఆ కారణం చేతనే పిరికిపందలైనట్టి 'పాత' కన్సర్వేటివ్ ట్రేడ్‌యూనియన్లు మాత్రమే రంగంలో నిలబడుతున్నాయి...." 1891 సెప్టెంబరు 14 న ఇలా రాశాడు: న్యూకాసిల్‌లో జరిగిన ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో, పాత ట్రేడ్‌యూనియనిస్టులు, ఎనిమిది గంటల పనిదినాన్ని వ్యతిరేకించినవారు, ఓడిపోయారు, "కాగా బూర్జువా లేబర్ పార్టీ ఓటమిని బూర్జువా పత్రికలు గుర్తించుతున్నాయి" (ఒత్తులు ఎంగెల్స్‌వే) ....

కొన్ని దశాబ్దుల కాలంలో ఎంగెల్స్ పునశ్చరణ చేసిన ఈ అభిప్రాయాలను అతడు బహిరంగంగానూ పత్రికలలోనూ వ్యక్తీకరించిన విషయం, "ఇంగ్లండులో కార్మికవర్గంయొక్క స్థితి" అనే గ్రంథం రెండవ కూర్పునకు 1892 లో అతడు రాసిన పీఠికే రుజువు చేస్తూంది. "కార్మికవర్గంలో ఒక ప్రభువర్గం" గురించి, "కార్మికప్రజల బృహత్తరరాశి" తో విభేదించుతూన్నట్టి "కార్మికులలో విశేషాధికారాలుగల ఒక అల్పసంఖ్యాకవర్గం" గురించి ఈ పీఠికలో అతడు ప్రస్తావించుతాడు. 1848–1868 లో ఇంగ్లండుయొక్క ఆధిక్యతా స్థానం ఫలితంగా, కార్మికవర్గంలో "విశేషాధికారాలు కల్గి రక్షణ పొందుతూన్న ఒక చిన్న అల్పసంఖ్యాకవర్గం" మాత్రమే "శాశ్వతంగా లాభం" పొందుతూండగా, కార్మికవర్గంలో "బృహత్తరరాశి, మహా అవుతే తాత్కాలికంగా మాత్రమే, కాస్త మెరుగు పరిస్థితులను అనుభవించుతూంది." "ఈ" (ఇంగ్లండుయొక్క పారిశ్రామిక) "గుత్తాధిపత్యం ఛిన్నాభిన్నం అయిపోయేటప్పుడు, కార్మికవర్గం కూడా తానిప్పుడు అనుభవించుతూన్న పరిస్థితిని కోల్పోతుంది...." "కాస్త మంచి పరిస్థితిలో వున్నట్టి 'పాత ట్రేడ్‌యూనియనిస్టుల' మెదడులకు ప్రతిబంధకంగా ఏర్పడినట్టి వంశపారంపర్యంగా అందివ్వబడిన "గౌరవార్హమైన" బూర్జువా దురభిమానాలు ఏమాత్రమూ లేని, నాగరి ఎరుగని కొత్త నేల అనదగిన మనస్సులు కలిగివుండడమనే అపరిమిత లాభకరమైన స్థితిలో వున్నారు" "కొత్త" యూనియన్లు, నిపుణతలేని కార్మి

కుల యూనియన్ల సభ్యులు.... ఇంగ్లండులో కార్మికుల ప్రతినిధులని పిలువబడుతున్న వాళ్లు "కార్మికులమనే తమ లక్షణాన్ని తమ లిబరలిజం సముద్రంలో తమ చేజేతులతో ముంచి వేసేందుకు తమ ఇష్టతే, తాము కార్మికవర్గంలో సభ్యులమనే విషయం క్షమించబడడానికి కారణమవుతూన్నట్టి" వాళ్లే.

పాఠకుడు మార్క్స్, ఎంగెల్స్‌ల సరాసరి కథనాలను మొత్తంగా అధ్యయనం చేయ గలిగేందుకే, మేము ఉద్దేశపూర్వకంగానే వాటిని కాస్త సుదీర్ఘంగానే ఉల్లేఖించాము. కాగా వాటిని పఠించితీరాలి కూడానూ, అవి అతి జాగ్రత్తతో పఠించ తగినవి. ఎందుచేతంటే, సామ్రాజ్యవాద శకంయొక్క బాహ్యగతాత్మక పరిస్థితులవల్ల విధించబడినట్టి కార్మికవర్గో ద్యమ ఎత్తుగడలకు ఇవే కీలకం.

"మంచినీళ్లను బురద చేసేందుకూ" మార్క్సిజం స్థానే అవకాశవాదులతో భావలోల త్వపు సభ్యతాభావాన్ని నిలబెట్టేందుకూ కౌట్‌స్కీ అప్పటికే ప్రయత్నించాడు. బ్రిటన్ యొక్క గుత్తాధిపత్యాన్ని నాశనం చేసేందుకు ఒక సాధనంగా యుద్ధంలో జర్మనీ పాల్గొనడ మును సమర్థించే బాహాట, నిష్కపట సోషల్-సామ్రాజ్యవాదులకు (లెన్ష్ వంటి వారికి) వ్యతిరేకంగా కౌట్‌స్కీ వాదించుతూ, ఈ ప్రత్యక్ష అసత్యాన్ని, దీనితో సమానమైన మరొక అసత్యంతో "సరిదిద్దుతున్నాడు:" మోటు అసత్యం బదులు, తీయని అసత్యాన్ని అతడు వినియోగిస్తున్నాడు! ఇంగ్లండుయొక్క పారిశ్రామిక గుత్తాధిపత్యం ఏనాడో చితికిపోయింది, ఏనాడో నాశనమయిపోయింది. ఇక నాశనం చేయడానికి మిగిలింది సున్నకి సున్న, హళ్లికి హళ్లీయే, అంటాడతడు.

ఈ వాదన అసత్యమని ఎందుకంటున్నాం?

అందు కారణం, మొదటిది, ఈ వాదన ఇంగ్లండుకు వున్నట్టి వలస గుత్తాధిపత్యాన్ని దాటవేస్తూంది. అయినప్పటికీ, పైన మనం గమనించినట్టుగా, ఏనాడో ఎంతో ముందుగా 1882 లోనే, ముప్పైనాలుగేళ్ళ క్రితమే ఈ విషయాన్ని ఎంగెల్స్ విస్పష్టంగా ఎత్తిచూపాడు! ఇంగ్లండు యొక్క పారిశ్రామిక గుత్తాధిపత్యం నాశనం కాబడినప్పటికీ దాని వలస గుత్తాధిపత్యం నిలబడి వుండడమే కాకుండా, అసాధారణంగా ఉధృతమైంది. ఎందుచేతంటే, సర్వ ప్రపంచాన్నీ విభాగించుకోవడం అప్పుడే అయిపోయింది! తేనెపూత పూసిన ఈ అబద్ధం మూలంగా, "యుద్ధంచేసేందుకు మిగిలింది సున్న" అనే బూర్జువా-పాసిఫిస్టు, అవకాశ వాద-అల్పబుద్ధి భావాన్ని కౌట్‌స్కీ దొడ్డిదారిని ప్రవేశపెడుతున్నాడు. తత్‌వ్యతిరేకంగా, పెట్టుబడిదారులకు యుద్ధంచేసుకుందుకు ఇప్పుడు ఏదో ఒకటి వుండడమే కాకుండా, పెట్టుబడిదారీ విధానాన్ని వారు భద్రపరచుకోవాలంటే యుద్ధంచేయకుండా వుండడం వారి శక్యం కాదు, ఎందుచేతంటే, వలసదేశాల బలాత్కారసహితమైన పునర్విభజన జరగనిదే పాత (బల

హీనమైనట్టీ కూడా) సామ్రాజ్యవాద రాజ్యాలు అనుభవించుతూన్న విశేషాధికారాలను కొత్త సామ్రాజ్యవాద దేశాలు సంపాదించుకో లేకపోతాయి.

రెండవది, ఇంగ్లండుకున్న గుత్తాధిపత్యం ఇంగ్లండులో అవకాశవాదం సాధించిన (తాత్కాలిక) విజయం ఏల వివరించగల్గుతూంది? ఇందుకు కారణం, గుత్తాధిపత్యం అత్యధిక లాభాన్ని, అనగా ప్రపంచం అంతటా ప్రామాణికమూ, రివాజూ అయిన పెట్టుబడిదారీ విధాన లాభానికి పైబడి ఇంకా మించినట్టి అత్యధిక లాభాన్ని సంపాదించి పెడుతూంది గనుక. ఈ అత్యధిక లాభంలో కొంత భాగాన్ని (ఇదేమంత తక్కువ భాగమేమీ కాదు!) పెట్టుబడిదార్లు తమ సొంత కార్మికులకు లంచాలు మేపడానికీ, ఇతర దేశాలకు వ్యతిరేకంగా ఆ ఫలానా జాతుల కార్మికులకూ వాటి పెట్టుబడిదార్లకూ మధ్య ఒక విధమైన మిత్రత్వం, (వెబ్ దంపతులు అభివర్ణించినట్టి ఇంగ్లీషు ట్రేడ్‌యూనియన్లకూ యజమాన్లకూ మధ్యవున్న ప్రఖ్యాత "మిత్రత్వాల"ను జ్ఞాపకం పెట్టుకోండి) సృష్టించడానికీ వినియోగించుకో గల్గుతారు. ఇంగ్లండుయొక్క పారిశ్రామిక గుత్తాధిపత్యం పందొమ్మిదవ శతాబ్ది అంతమందు నాశనం కావించబడింది. ఇది నిర్వివాదం. కాని ఈ వినాశం ఏ విధంగా జరిగింది? గుత్తాధిపత్యం ఎట్టిదైనా అదృశ్యమైపోయే విధంగా ఇది జరిగిందా?

అలాగు జరిగి వుండినట్టయితే, కౌట్‌స్కీ యొక్క (అవకాశవాదంతో) సామరస్య "సిద్ధాంతం" కొంత వరకూ సమర్థనీయమే కాగలదు. ఇప్పుడున్న విషయమంతా ఆలా జరగ లేదనే. సామ్రాజ్యవాదమే గుత్త పెట్టుబడిదారీ విధానం. ప్రతి కార్టెలూ, ప్రతి సిండికేటూ, ప్రతి బృహత్తర బ్యాంకూ ఒక గుత్తవ్యాపారమే. అత్యధిక లాభం అదృశ్యంకానేలేదు, అదింకా అలాగే వుంది. ఫినాన్సల్‌గా ధనవంతమైన ఒక దేశంచే ఇతర దేశాలు అన్నీ దోపిడీ చేయబడడం అలాగే వుంది, మరింత ఉధృతం కావించబడింది కూడానూ. సంపన్నములైన పట్టెడు దేశాలు — స్వతంత్రములై నిజంగా బృహత్తరములైన "ఆధునిక" సంపదే మన ఉద్దేశమైతే, అటువంటి దేశాలు కేవలం నాలుగే వున్నాయి: ఇంగ్లండు, ఫ్రాన్సు, సంయుక్త రాష్ట్రాలు, జర్మనీ — గుత్తాధిపత్యాన్ని బ్రహ్మాండమైన పరిమాణానికి అభివృద్ధి చేశాయి; కొన్ని దశ కోట్లను, ఆ మటకొస్తే సహస్రకోట్లను అత్యధిక లాభంగా సంపాదించుతున్నాయి. ఇతర దేశాల్లో వున్న కోటానుకోటి ప్రజల "మూపులపై స్వారిచేస్తూ," ప్రత్యేకంగా సంపదవంతమూ, ప్రత్యేకంగా ఫలవంతమూ, ప్రత్యేకంగా సులభసాధ్య సంపాదితమూ అయిన కొల్ల సొత్తును పంచుకోడానికై అవి తమలో తాము పోట్లాడుకుంటున్నాయి.

వాస్తవంగా ఇదే సామ్రాజ్యవాదంయొక్క ఆర్థిక, రాజకీయ సారం, సామ్రాజ్యవాదం యొక్క ప్రగాఢ వైరుధ్యాలను బట్టబయలు చేయడం బదులు వాటిని మరుగుపరుస్తున్నాడు కౌట్‌స్కీ.

"మహా" సామ్రాజ్యవాద రాజ్యాల బూర్జువావర్గాలలో ఏ ఒక్కటైనా సరే, "తన" కార్మికులలోని ఉన్నతస్తరములకు లంచాలు ఆర్థికంగా ఇవ్వగల్గుతూంది. ఇందుకోసం, సాలీనా పదికోట్ల ఫ్రాంకులను ఖర్చుపెట్ట గల్గుతూంది, ఎందుచేతంటే అది సంపాదించే అత్యధిక లాభం బహుశా నూరుకోట్లకు మించే వుంటుంది. కార్మిక మంత్రులూ, "కార్మిక ప్రతినిధులూ" (ఈ పదాన్ని ఎంగెల్స్ ఎంత అద్భుతంగా విశ్లేషించాడో జ్ఞాపకం తెచ్చుకోండి), యుద్ధ పరిశ్రమ కమిటీలు,[134] కార్మిక అధికారులు, సంకుచిత వృత్తియూనియన్లకు సంబంధించిన కార్మికులు, ఆఫీసు ఉద్యోగస్థులు, వగైరా, వగైరాల మధ్య ఈ పిసరు తాయం ఏ విధంగా పంచిపెట్టబడుతూందనేది అప్రధానమైన ప్రశ్న.

1848 నుండి 1868 మధ్యనూ, కొంత వరకు ఆ తరువాతనూ, ఒక్క ఇంగ్లండే గుత్తాధిపత్యం చలాయించింది; ఇందువల్లనే ఇంగ్లండులో దశాబ్దాల తరబడి అవకాశవాదం వ్యాపించ గల్గింది. అత్యంత సంపదవంతములైన వలసలు, లేదా పారిశ్రామిక గుత్తాధిపత్యము కలిగిన దేశాలు మరేవీ లేకపోయాయి.

నూతన సామ్రాజ్యవాదవిధాన శకానికి పరివర్తన చెందడంలోనే పంథొమ్మిదవ శతాబ్ది ఆఖరి మూడవ భాగం విశిష్టత వ్యక్తమయింది. ఒకే ఒక్కటి కాకుండా, కొద్ది సంఖ్యలో మాత్రమే వున్నట్టి అనేక మహారాజ్యాల ఫినాన్స్ పెట్టుబడిచే గుత్తాధిపత్యం అనుభవించు బడుతూంది. (జపానులోనూ రష్యాలోనూ వున్నట్టి సైనిక శక్తియొక్క గుత్తాధిపత్యమూ, బ్రహ్మాండమైన ప్రాంతాలూ, లేదా అల్పసంఖ్య జాతీయతలనూ, చైనా, వగైరాలనూ దోచుకోవడానికిగల ప్రత్యేక అవకాశాలూ సమకాలిక ఫినాన్స్ పెట్టుబడి గుత్తాధిపత్యాన్ని పాక్షికంగా శేషపూరణం చేస్తూ, దాని స్థానాన్ని పాక్షికంగా ఆక్రమించుకున్నాయి.) దశాబ్దాల తరబడి ఇంగ్లండుయొక్క గుత్తాధిపత్యం సవాలు లేకుండా నిలబడే సామర్థ్యం గలిగి వుండడానికి ఈ భేదమే కారణమవుతూంది. సమకాలిక ఫినాన్స్ పెట్టుబడి యొక్క గుత్తాధిపత్యం ఇప్పుడు అతి ఉగ్రంగా సవాలు చేయబడుతూంది; సామ్రాజ్యవాద యుద్ధాల శకం ఇప్పుడు మొదలైంది. దశాబ్దాల తరబడి ఒక దేశంలోని కార్మికవర్గాన్ని లంచాలు మేపి చెడగొట్టడం ఆ రోజుల్లో సాధ్యమయింది. ఇప్పుడిది అసాధ్యమే కాకుండా, అసంభవం కూడానూ. కాని ఇందుకు భిన్నంగా, "కార్మిక ప్రభువర్గం"లోని (1848–1868 లో బ్రిటన్‌లో వుండిన వాటితో సరిపోల్చి చూస్తే) స్వల్పతరములైన ఉన్నతస్తరములను ప్రతి సామ్రాజ్యవాద "మహా" రాజ్యమూ లంచాలిచ్చి మేపగల్గుతుంది, మేపుతూంది కూడానూ. ఆ రోజుల్లో, ఒక "బూర్జువా లేబరు పార్టీ" – ఎంగెల్స్ వాడినట్టి అద్భుతంగా ప్రగాఢమైన పదాన్ని ప్రయోగించాలంటే – ఒకే ఒక దేశంలో మాత్రమే రూపొంద గలిగింది, ఎందుచేతంటే అదొక్కటే గుత్తాధిపత్యాన్ని అనుభవించింది, చాలా కాలం అనుభవించింది కూడా. ఇప్పుడు అన్ని సామ్రాజ్యవాద

దేశాల్లోనూ అచ్చమైన "బూర్జువా లేబర్ పార్టీ" తరహావంటిది ఒకటి ఉండడం అనివార్యమూ, మామూలూ అయిపోయింది; కాని కొల్లసొత్తు పంచుకోడానికి అవి సాగించుతూన్న మొండి పోరాటం దృష్ట్యా, ఇటువంటి పార్టీ అనేక దేశాల్లో బహుకాలం మనగల్గడమనేది అసంభవం. ఎందుచేతంటే, ట్రస్టులూ, ఫినాన్షల్ అల్పజనపరిపాలనమూ, అధిక ధరలూ, వగైరాలు, ఉన్నతస్తరములలోని పట్టెడుమందికీ లంచాలు ఇవ్వడానికి అనుమతించినప్పటికీ, శ్రామికవర్గ, అర్ధశ్రామికవర్గాల రాశిని అంతకంతకు మరింత అధికంగా పీడించి, చితకతొక్కి, నాశనంచేసి, చిత్రహింస చేస్తున్నాయి.

ఇటు చూడబోతే, అపార ధనసంపత్తీ, విశేషాధికారాలూ కలిగినట్టి పట్టెడు జాతులను కడమ మానవాళి శరీరంపై "శాశ్వత" పరాన్నభుక్కులుగా మార్చివేసేటట్టీ, ఆధునిక సైనిక విధానం సమకూర్చుతున్నట్టి అత్యాశ్చర్యకరములైన మారణాయుధాల సహాయంతో నీగ్రోలు, ఇండియా దేశస్థులు, వగైరాలను పరాధీనులుగా చేసివేసి, వారిని దోపిడీ చేయడం ఫలితంగా సంభవించిన "విజయాలతో సంతృప్తి" చెందేటట్టీ, ఒక ధోరణి బూర్జువావర్గంలోనూ అవకాశవాదులలోనూ కనబడుతూంది. అటు చూడబోతే, వెనుకటికంటె మరింతగా పీడించబడుతూన్నట్టీ, సామ్రాజ్యవాద యుద్ధం యావత్తు బాధలనూ భరించుతూన్నట్టీ ప్రజారాసులలో ఈ కాడిని తోసిపారేడానికీ, బూర్జువావర్గాన్ని కూలదోయడానికీ ఒక ధోరణి కనబడుతూంది. ఈ రెండు ధోరణుల మధ్య జరిగే పోరాటంలోనే, ఈనాడు కార్మికోద్యమ చరిత్ర తప్పనిసరిగా అభివృద్ధి చెందుతుంది. ఎందుచేతంటే, మొదటి ధోరణి యాదృచ్ఛికం కాదు, దానికి ఒక ఆర్థిక "ప్రాతిపదిక" వుంది. ఇప్పటికప్పుడే బూర్జువావర్గాలు అన్ని దేశాల్లోనూ వున్న సోషల్-జాతీయ దురహంకారుల "బూర్జువా లేబర్ పార్టీల"ను కని, పెంచి, పెద్దవి చేసి, తమకోసం భద్రపరచి వుంచారు. నిష్కర్షగా ఏర్పాటు చేయబడినట్టీ, ఉదాహరణకు ఇటలీలోని బిస్సొలాతి యొక్క పార్టీలాంటి సంపూర్ణంగా సోషల్-సామ్రాజ్యవాద పార్టీ అయిన పార్టీకీ, మాటవరసకు చెప్పాలంటే, పాత్రేసావ్, గ్వొజ్‌దేవ్, బూల్‌కిన్, ఛెయీడ్‌జె, స్కోబెలెవ్, ప్రభృతుల సగం ఏర్పాటైన ఇంచుమించు పార్టీకిన్నీ వున్న భేదాలు లెక్కలోనివి కావు. ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఆర్థిక దృష్ట్యా, కార్మిక ప్రభువర్గ స్తరం తన సొంత పక్షాన్ని పరిత్యజించి బూర్జువావర్గంతో కలయిక పరిపక్వం చెంది యథార్థంకాగా, ఈ ఆర్థిక వాస్తవవిషయం, వర్గాల మధ్య వుండే సంబంధాల మార్పు, ఎట్టి ప్రత్యేకమైన రాజకీయ రూపం ధరించబోతుందో అది మాత్రం విశిష్టమైన "ఇబ్బంది"ని దేనినీ కలిగించబోదు.

ఇది వరకు సూచించిన ఆర్థిక ప్రాతిపదికపై, ఆధునిక పెట్టుబడిదారీ విధానం యొక్క రాజకీయ సంస్థలు — పత్రికలు, పార్లమెంటు, ట్రేడ్‌యూనియన్లు సంఘాలు,

మహాసభలు, వగైరాలు — మర్యాద, నమ్రత రిఫార్మిస్టుతత్వం కల్గినట్టి, దేశభక్తి పూరితులైనట్టి, ఆఫీసు ఉద్యోగులకు, కార్మికులకు ప్రసాదించబడిన ఆర్థిక విశేషాధికారాలతోనూ తాయాలతోనూ సారూప్యం కల్గినట్టి రాజకీయ విశేషాధికారాలనూ తాయాలనూ సృష్టించాయి. మంత్రిమండలిలోనో, యుద్ధ పరిశ్రమల కమిటీలలోనో, పార్లమెంటులోనో, లేదా రకరకాల కమిటీలలోనో, లేదా "స్తోమత" కలిగి, చట్టబద్ధంగా ప్రచురించబడుతూన్న పత్రికల సంపాదకీయ సిబ్బందిలోనో, లేదా స్తోమతలో వీటికేమాత్రం తీసిపోనట్టి "బూర్జువా జోహుకుమ్" ట్రేడ్‌యూనియన్ల పాలకవర్గ కౌన్సిళ్లలోనో లాభదాయకమైనట్టి ఖుషీ ఉద్యోగాలు — ఇటువంటి వాటితో సామ్రాజ్యవాద బూర్జువావర్గం, "బూర్జువా లేబర్ పార్టీల" ప్రతినిధులనూ, అనుయాయులనూ ఆకర్షించి బహూకరించుతూంది.

రాజకీయ ప్రజాస్వామ్యం యొక్క యాంత్రికశాస్త్రం కూడా ఇటువంటి దిశలోనే పనిచేస్తుంది. ఎన్నికలు లేనిదే మన రోజుల్లో ఏది చేయడానికీ వీల్లేదు; ప్రజారాసులు లేనిదే ఏది చేయడానికీ వీల్లేదు. కాగా పత్రికావ్యవస్థతోనూ పార్లమెంటరీ విధానంతోనూ నిండిన ఈ శకంలో బూర్జువావర్గాన్ని కూలదోసే విప్లవాత్మక పోరాటాన్ని కార్మికులు పరిత్యజించినంత కాలమూ వారికి అన్ని రకాల సంస్కరణలనూ, ఆశీస్సులనూ ఖరారు చేయడానికిగాను ముఖస్తుతితోనూ, అబద్ధాలతోనూ, మోసంతోనూ, ఫాషన్‌లోవున్నట్టి ప్రజాదరణను పొందినట్టి ఊతపదాలతో గారిడీ చేసేటట్టి — కుడి చేత్తోనూ, ఎడమచేత్తోనూ విరజల్లబడుతూన్నట్టి — వాగ్దానాలతో విరాజిల్లుతూ విస్తృత శాఖోపశాఖలు కల్గి వ్యవస్థాబద్ధంగా నడిపించబడి, చక్కని ఉపకరణాలతోనూ సమకూర్చబడిన వ్యవస్థ లేనిదే ప్రజారాసుల పరివారాన్ని సంపాదించడం ఎంత మాత్రమూ వీలుపడదు. "బూర్జువా లేబర్ పార్టీ" యొక్క సాంప్రదాయిక దేశంలో ఈ వ్యవస్థకు — ఈ వ్యవస్థ ప్రతినిధులందరిలోనూ అగ్రగణ్యుడూ, అందెవేసిన చేయి అయిన బ్రిటిష్ మంత్రి, లాయిడ్ జార్జ్ పేరులో, దీనిని లాయిడ్ జార్జిజం అని నేను నామకరణం చేస్తున్నాను. బూర్జువా అగ్రశ్రేణీ ఘటనా ఘటన సమర్థుడు, రాజకీయ జిత్తులమారి, ఎటువంటి ఉపన్యాసాలనైనా సరే మీ చిత్తం వచ్చిన ఉపన్యాసాలను, చివరకు కార్మిక శ్రోతల ఎదుట జబ్బలు చరుకునే వి–వి–వి–విప్లవాత్మక ఉపన్యాసాలను సహితమూ ఇచ్చే ప్రజాను రంజకుడైన వక్త, విధేయులైన కార్మికులకు సోషల్ సంస్కరణల రూపంలో (భీమా, వగైరాలు) కాస్త పెద్ద పరిమాణమే కల్గిన తాయాలను సంపాదించిపెట్ట సమర్థుడైన లాయిడ్ జార్జ్ బూర్జువావర్గానికి భేషుగ్గా ఊడిగం చేస్తున్నాడు,* కాగా అచ్చంగా కార్మికుల

---

* "టోరీ దృక్పథంలో లాయిడ్ జార్జ్" అనే శీర్షికతో లాయిడ్ జార్జ్‌కి రాజకీయ ప్రత్యర్థి అయిన ఒక టోరీ రాసిన వ్యాసాన్ని ఒక ఇంగ్లీషు మాసపత్రికలో ఇటీవల నేను చదివాను.

మధ్యనే అతడు పనిచేస్తున్నాడు, బూర్జువావర్గ ప్రభావం ఎక్కడైతే అచ్చంగా అవసరమవుతూందో, ఏ చోటనైతే దాని అవసరం ఎక్కువగా వుందో, నైతికంగా ప్రజారాసులను పట్టుకోవడం ఎక్కడైతే అత్యంత కష్టమో అక్కడే, అచ్చంగా శ్రామికవర్గంలోనే అతడు బూర్జువా ప్రభావాన్ని తీసుకొస్తున్నాడు.

కాగా లాయిడ్ జార్జ్ మధ్యా, షైడెమన్‌లూ, లెజీన్‌లూ, హెండరసన్‌లూ, హైండ్‌మన్‌లూ, ప్లెహానొవ్‌లూ, రెనొడెల్‌లూ ప్రభృతుల మధ్యా ఏమంత పెద్ద భేదం వుందా? రెండవ రకం వారిలో కొందరు మార్క్సీయ విప్లవాత్మక సోషలిజానికే తిరిగి రావచ్చు కదా, అని ఎవరైనా అభ్యంతరం చెప్పవచ్చు. అది సాధ్యమే, కాని ప్రశ్నను రాజకీయ స్థాయిలో అనగా రాశి స్థాయిలో పరిశీలించినట్టయితే, తరతమ స్థాయిలో అత్యంత స్వల్ప భేదం తప్ప ఇది మరేమీ కాదు. ఈనాటి సోషల్-జాతీయ దురహంకారవాద నాయకులలో కొందరు వ్యక్తులు శ్రామికవర్గంలోకి తిరిగి చేరుకోవచ్చు. కాని సోషల్-జాతీయ దురహంకారవాద, లేదా అవకాశవాద (రెండూ ఒకటే) ధోరణి అదృశ్యం కానూ కాదు, విప్లవాత్మక శ్రామికవర్గాన్ని అది "తిరిగి చేరుకోనూ" చేరుకోజాలదు. ఎక్కడైతే కార్మికులలో మార్క్సిజం ప్రజాదరణ పొందిందో అక్కడ సర్వత్రా ఈ రాజకీయ ధోరణి, ఈ "బూర్జువా లేబర్ పార్టీ" మార్క్స్ నామస్మరణ చేస్తూ మార్క్స్ సాక్షిగా ప్రమాణం చేస్తూంటుంది. ఫలనా ఉల్లాకు, లేదా గుర్తు, లేదా అడ్వర్‌టైజుమెంటు వాడకూడదని వ్యాపార సంస్థను నిషేధించేందుకు ఎలాగైతే వీలుపడదో, అలాగే వీళ్లని నిషేధించడానికీ వీల్లేదు. పీడిత వర్గాలలో ప్రజాదరణ పొందిన విప్లవాత్మక నాయకులు మరణించిన తరువాత, పీడిత వర్గాలను మోసపుచ్చడానికని, ఈ నాయకుల పేర్లను వారి శత్రువులు భుక్తం చేసుకోడానికి యత్నించడం చరిత్రలో ఎల్లప్పుడూ జరిగిన విషయమే.

వాస్తవ విషయం ఏమిటంటే, ఒక రాజకీయ దృగ్విషయంగా, "బూర్జువా లేబర్ పార్టీలు" పురోగామి పెట్టుబడిదారీ దేశాలు అన్నిటిలోనూ అప్పడే ఏర్పడి పోయాయి, కాగా యీ పార్టీలకు — లేదా గ్రూపులు, ధోరణులు, వగైరాలు ఏవైనా కానీయండి — వ్యతిరేకంగా దారి కడవెళ్లా పట్టుదలతోనూ నిర్దాక్షిణ్యంగానూ పోరాటం సాగించని పక్షంలో, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమనే ప్రశ్నగాని, మార్క్సిజం, లేదా సోషలిస్టు కార్మికోద్యమం అనే ప్రశ్నగాని యేదీ వుండదు. రష్యాలో ఛెయీడ్జె గ్రూపు,[135] రష్యాలో "నాషె దేలొ," "గోలొస్

---

యుద్ధం వల్ల యీ ప్రత్యర్థికి కనువిప్పు కలిగి, బూర్జువావర్గానికి లాయిడ్ జార్జ్ ఎంతటి భేష్షైన భృత్యుడో అతడిప్పుడు తెలుసుకున్నాడు! టోరీలు ఇప్పుడు ఇతనితో సఖ్యపడ్డారు!

త్రుదా,''[136] విదేశాల్లో ''ఆర్గనైజింగ్ కమిటీ పక్షీయులు,'' వీరందరూ ఇటువంటి పార్టీ యొక్క రకాలే తప్ప మరేమీ కాదు. సోషల్ విప్లవం ముందు ఈ పార్టీలన్నీ అదృశ్యమై పోతాయని అనుకోడానికి ఏ కారణాలూ మాకు కనబడవు. తత్‌వ్యతిరేకంగా, విప్లవం ఎంత దగ్గర పడుతూంటే అంత జోరుగా ఇది ప్రజ్వరిల్లుతుంది, అంత అకస్మాత్తుగానూ అంత ఉగ్రంగానూ వుంటాయి ప్రగతిలో పరివర్తనలూ దాట్లూనూ, అంత అధికంగానూ వుంటుంది కార్మికోద్యమంలో అవకాశవాద, పెట్టీబూర్జువా ప్రవాహానికి ఎదురుగా విప్లవాత్మక ప్రజావెల్లువ పోరాటం యొక్క పాత్ర. కౌట్‌స్కీతత్వం ఒక స్వతంత్ర ధోరణి ఎంత మాత్రమూ కాదు, ఎందుచేతంటే ప్రజారాసులలో గాని, బూర్జువావర్గంతో చేరిపోయినట్టి విశేషాధికారాలనుగల స్తరంలోగాని, అదివేరూనలేదు. కాని కౌట్‌స్కీతత్వంయొక్క ప్రమాదం ఎక్కడుందంటే, వెనకటి భావశాస్త్రాన్ని ఉపయోగించి, ''బూర్జువా లేబర్ పార్టీ''తో శ్రామికవర్గం పొత్తు కుదుర్చుకొనేటట్టుగానూ, ఆ పార్టీతో శ్రామికవర్గ ఐక్యతను భద్రపరచడానికీ, తద్వారా ఆ పార్టీ ప్రతిష్ఠను అధికం చేయడానికీ అది ప్రయత్నించుతుందనే వాస్తవవిషయంలోనే వుంది. తాము సోషల్-జాతీయ దురహంకారవాదులమని బాహాటంగా చెప్పకునే వారికి రాశి అనుచరవర్గం ఇప్పుడేమీ లేదు: ఇంగ్లండులో కార్మిక సభలలో లాయిడ్ జార్జ్‌ని మాట్లాడనివ్వకుండా గోలచేసి అతని నోరు కట్టించేస్తున్నారు; హైండ్‌మన్ పార్టీనుండి రాజీనామా చేసేశాడు; రెనాడెల్, షైడెమన్ ప్రభృతులనూ, పొత్రేసొవ్, గ్వొజ్‌దేవ్ ప్రభృతులనూ పోలీసులు పరిరక్షిస్తున్నారు. కౌట్‌స్కీయ అనుచరులచే సోషల్-జాతీయ దురహంకారుల రహస్యపు సమర్థనే మరింత ప్రమాదకరమైనది.

కౌట్‌స్కీతత్వం యొక్క విస్తృతవ్యాప్త కుతర్కాలలో ఒకటి ''ప్రజారాసుల'' గురించి చెబుతూండడం. ప్రజారాసులనుండీ, రాశి ఆర్గనైజేషన్ల నుండీ తెగతెంపులు చేసుకొనే ఉద్దేశం మాకు లేనే లేదని వారు అంటారు! ఈ సమస్యను ఎంగెల్స్ ఎలా పరిష్కారం చేశాడో ఆలోచించండి. పంధొమ్మిదవ శతాబ్దిలో ఇంగ్లీషు ట్రేడ్‌యూనియన్ల ''ఇంగ్లీషు రాశి ఆర్గనైజేషన్లు'' బూర్జువా కార్మిక పార్టీ పక్షాన్నే వున్నాయి. ఈ కారణం చెప్పి మార్క్స్, ఎంగెల్స్‌లు దీనితో రాజీపడలేదు, దీనిని వారు బట్టబయలు చేశారు. వారు రెండు విషయాలను మరచిపోలేదు: మొదటిది, శ్రామికవర్గంలో అల్పసంఖ్యాకవర్గమే సూటిగా ట్రేడ్‌యూనియన్ ఆర్గనైజేషన్లలో పాల్గొంటూంది. ఆనాడు ఇంగ్లండులోనూ, ఈనాడు జర్మనీలోనూ శ్రామికవర్గంలో ఐదోవంతో ఆర్గనైజైంది. పెట్టుబడిదారీ విధాన పరిస్థితులలో శ్రామికవర్గంలో అధికసంఖ్యాకవర్గాన్ని ఆర్గనైజు చేయడం సాధ్యమని ఒక్కనాటికైనా ఎవ్వరూ అనుకోరు. రెండవది — ఇదే ముఖ్యమైనది కూడా — ఆర్గనైజేషను యొక్క పరిమాణం

కాదు ప్రధాన విషయం, దాని పాలసీయొక్క నిజమైన, బాహ్యగతాత్మక తాత్పర్యమే ప్రధాన విషయం: ఈ విధానం ప్రజారాసులకు ప్రాతినిధ్యం వహిస్తుందా, ప్రజారాసులకు ఉపయోగకరంగా వుంటుందా, అనగా పెట్టుబడిదారీ విధానంనుండి ప్రజారాసుల విముక్తినే అది లక్షించిందా, లేక అల్పసంఖ్యాకవర్గ ప్రయోజనాలకు, పెట్టుబడిదారీ విధానంతో అల్పసంఖ్యాకవర్గం కుదుర్చుకున్న సమాధానం యొక్క ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తూందా? పంధొమ్మిదవ శతాబ్దిలో ఇంగ్లండులో ఈ రెండవదే నిజమైంది, నేడు జర్మనీ, వగైరా దేశాల్లోనూ ఇదే నిజమవుతూంది.

పాత ట్రేడ్‌యూనియన్ల "బూర్జువా లేబర్ పార్టీ"కీ — విశేషాధికారాలు కల్గిన అల్పసంఖ్యాకవర్గానికీ — "అట్టడుగు రాశి," అనగా యథార్థమైన అధికసంఖ్యాకవర్గానికీ వున్న వ్యత్యాసాన్ని ఎంగెల్స్ చూపుతూ, "బూర్జువా మర్యాదా భావం"తో ఇది కలుషితం కాబడని దీనికే అతడు విజ్ఞప్తి చేస్తాడు. ఇదే మార్క్సిస్టు ఎత్తుగడలలోని సారం!

సోషల్-జాతీయ దురహంకారవాదులనూ అవకాశవాదులనూ శ్రామికవర్గంలోని ఏ భాగం అనుసరించుతుందో, అనుసరించబోతుందో మనం చెప్పలేం — మనమే కాదు, ఎవ్వరూ చెప్పలేరు. పోరాటంవల్లనే ఇది బయలుపడుతుంది, సోషలిస్టు విప్లవం వల్లనే ఇది నిష్కర్షగా నిర్ణయించబడుతుంది. కాని సామ్రాజ్యవాద సంగ్రామంలో "పితృదేశ రక్షకులు" కేవలం అల్పసంఖ్యాకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారనేదే తథ్యమని మనకు తెలుసు. కాగా అందు చేతనే, మనం సోషలిస్టులంగా వుండదల్చుకుంటే, అడుగుకు వెళ్లి, ఇంకా మరింత లోతుకు వెళ్లి, యథార్థమైన ప్రజారాసుల లోపలికి వెళ్లడమే మన విధ్యుక్తధర్మం. అవకాశవాద వ్యతిరేక పోరాటంలో వున్న యావత్తు అర్థమూ, యావత్తు విషయమూ ఇదే. అవకాశవాదులూ సోషల్-జాతీయ దురహంకారులూ ప్రజారాసుల ప్రయోజనాలకు వాస్తవంగా ద్రోహం చేస్తున్నారనీ, వాటిని అమ్మివేస్తున్నారనీ, కార్మికులలో అల్పసంఖ్యాకవర్గపు తాత్కాలిక ప్రయోజనాలనే వారు కాపాడుతున్నారనీ, బూర్జువా భావాలకూ ప్రభావాలకూ యథార్థంగా వారు వాహకములే అనీ, బూర్జువావర్గపు మిత్రులే, ఏజెంట్లే అనీ మనం బట్టబయలు చేయడంలో, ప్రజారాసులకు తమ వాస్తవ ప్రయోజనాలను పోల్చుకొనగల్గి, సామ్రాజ్యవాద సంగ్రామాల, సామ్రాజ్యవాద యుద్ధవిరమణ సంధుల సుదీర్ఘములైన బాధాకరములైన మార్పులన్నిటిలోనూ సోషలిజం కోసమూ విప్లవంకోసమూ పోరాడాలని ప్రజారాసులకు మనం ప్రబోధించుతాం.

అవకాశవాదులతో తెగతెంపులు చేసుకోవడం యొక్క అనివార్యతనూ, ఆవశ్యకతనూ ప్రజారాసులకు వివరించడమూ, అవకాశవాదానికి వ్యతిరేకంగా నిర్దాక్షిణ్యమైన పోరాటం

సాగించడం ద్వారా విప్లవానికై వారిలో ప్రబోధం కలిగించడమూ, జాతీయ-లిబరల్ కార్మిక విధానంలో వున్న నైచ్యాన్నంతనూ మరుగుపరచడం బదులు, దానిని బయటపెట్టేందుకై యుద్ధానుభవాన్ని ఉపయోగించడమూ — ఇదే ప్రపంచ కార్మికోద్యమంలో ఏకైక మార్క్సిస్టు పథం.

కౌట్స్కీతత్వం నుండి ఈ పథం భేదించడంలో దీని ప్రధాన లక్షణాల సారాంశం తేల్చడానికి తరువాతి వ్యాసంలో ప్రయత్నించుతాం.

అక్టోబరు 1916.

# శ్రామికవర్గ విప్లవంయొక్క యుద్ధ కార్యక్రమం

### ఖండిక

హాలండ్, స్కాండినేవియా, స్విట్జర్లాండ్‌లలో పాత సోషల్-డెమోక్రాటిక్ కనిష్ఠ కార్యక్రమంలోని "మిలీషియా, లేక ప్రజలను సాయుధులను చేయడం" అనే అంశాన్ని తీసివేసి, దాని స్థానే "నిరాయుధీకరణ" అనే కొత్త అంశం పొందుపర్చడమునకు అనుకూలంగా, ప్రస్తుతపు సామ్రాజ్యవాద యుద్ధంలో "పితృదేశ రక్షణ" విషయమై సోషల్-జాతీయ దురహంకారుల అబద్ధాలతో పోరాడుతూన్న విప్లవాత్మక సోషలిస్టు-డెమోక్రాట్లలో కొన్ని గొంతుకలు వినవస్తున్నాయి. ఈ ప్రశ్నపై "Jugend-Internationale"[137] పత్రిక ఒక చర్చ ఆరంభించేసి, నిరాయుధీకరణకు అనుకూలంగా నెం. 3 వ సంచికలో ఒక సంపాదకీయ వ్యాసం ప్రచురించింది. ఆర్. గ్రిమ్ ప్రచురించిన ఇటీవలి సంగ్రహ సూత్రీకరణలలో "నిరాయుధీకరణ" భావానికి కొంత రాయితీ కూడా వుండడం మాకు విచారం కలిగించుతూంది. "Neues Leben", "Vorbote"* మాసపత్రికలలో చర్చలు ప్రారంభించబడ్డాయి.

నిరాయుధీకరణ వాదుల స్థానాన్ని మనం పరిశీలించుదాం.

### I

సైనికతత్వం అంతటికీ, యుద్ధం అంతటికీ వ్యతిరేకంగా జరిపే పోరాటంయొక్క సుస్పష్టము, అత్యంత నిశ్చితము, అత్యంత సుసంగతమూ అయిన వ్యక్తీకరణమే నిరాయుధీకరణ డిమాండు, అనేది ప్రధాన వాదం.

---

* "నూతన జీవితం," "వైతాళికుడు" — అనువాదకుడు.

కాని, అచ్చంగా ఈ ప్రధాన వాదనలోనే నిరాయుధీకరణ వాదుల మౌలికమైన పొరపాటు వుంది. తాము సోషలిస్టులుగా వుండేంతకాలమూ, యుద్ధం అంతటికీ వ్యతిరేకులుగా వుండేందుకు సోషలిస్టులకు వీల్లేదు.

మొదటి విషయం ఏమిటంటే, విప్లవాత్మక యుద్ధాలకు సోషలిస్టులు ఎన్నడూ వ్యతిరేకులుకారు, కాజాలరు. సామ్రాజ్యవాద "మహా" రాజ్యాల బూర్జువావర్గం పూర్తిగా అభ్యుదయ నిరోధకమయిపోయింది, కాగా ఈ బూర్జువావర్గం నేడు సాగిస్తూన్న యుద్ధం అభివృద్ధి నిరోధక యుద్ధమనీ, బానిస యజమానుల యుద్ధమనీ, శిక్షార్హమైన యుద్ధమనీ మేము భావిస్తున్నాం. కాని ఈ బూర్జువావర్గానికి వ్యతిరేకంగా సాగించే యుద్ధం మాటేమిటి? ఉదాహరణకు, ఈ బూర్జువావర్గంచే అణగద్రొక్కబడినట్టీ, దీనిపై ఆధార పడినట్టి, లేక వలసదేశాలకు చెందినట్టీ ప్రజలు తమ విమోచనకై సాగించే యుద్ధం మాటేమిటి? "ఇంటర్నాత్సియొనాలె" గ్రూపు[138] సంగ్రహ సూత్రీకరణలలో §5 వ పేరాలో ఇలా వుంది: "ఈ విశృంఖల సామ్రాజ్యతత్వ శకంలో, ఎట్టి తరహా జాతీయ యుద్ధాలు వుండడానికీ ఇక వీలుండదు." ఇది తప్పు అని ప్రత్యక్షంగాగే తెలిసిపోతూంది.

ఇరవయ్యో శతాబ్ది చరిత్ర, ఈ "విశృంఖల సామ్రాజ్యవాద" శతాబ్ది చరిత్ర, వలస యుద్ధాలతో పూర్తిగా నిండివుంది. యూరపియన్లమైన మనం, ప్రపంచప్రజలోని అధికసంఖ్యాకవర్గం యొక్క సామ్రాజ్యవాద పీడకులం మనం, మనకు అలవాటైపోయిన తుచ్ఛమైన యూరపియన్ జాతీయ దురహంకారంతో "వలస యుద్ధాలు" అని వేటిని అంటామో అవి, తరుచుగా ఈ పీడితప్రజల జాతీయ యుద్ధాలే, లేదా జాతీయ ఉపప్లవాలే. సామ్రాజ్యవాదం యొక్క ప్రధాన మౌలిక లక్షణాలలో ఒకటి, అత్యంత బడుగు దేశాలలోని పెట్టుబడిదారీ విధానాభివృద్ధిని త్వరితంచేసి, తత్ఫలితంగా జాతీయ పీడనకు వ్యతిరేకంగా సాగే పోరాటాన్ని విశాలపరచి తీవ్రం చేయడం. ఇది వాస్తవవిషయం. సామ్రాజ్యవాదం తరచుగా జాతీయ యుద్ధాలకు దారితీస్తుందని దీనినుండి తప్పనిసరిగా తేల్తూంది. తాను రాసిన పాంఫ్లెట్‌లో, పైన ఉదాహృతమైన "సంగ్రహసూత్రీకరణాన్ని" సమర్థించుతూన్న యూనియస్, సామ్రాజ్యవాద శకంలో ఏ ఒక్క సామ్రాజ్యవాద మహారాజ్యంపైన సాగించే జాతీయ యుద్ధమైనా సరే, మరొక పోటీ సామ్రాజ్యవాద మహారాజ్యం ఆ యుద్ధంలో జోక్యం కలుగజేసుకోడానికి దారితీస్తుందనీ, ఈ విధంగా ప్రతి జాతీయ యుద్ధమూ ఒక సామ్రాజ్యవాద యుద్ధంగా మారిపోతుందనీ రాసింది. కాని ఈ వాదం కూడా తప్పే. ఇది జరగవచ్చు, కాని ఇలా ఎల్లప్పుడూ జరగదు. 1900 నుండి 1914 వరకూ వున్న మధ్యకాలంలో జరిగిన వలస యుద్ధాలలో అనేకం ఈ మార్గాన్ని అనుసరించలేదు. కాగా ఉదాహరణకు, నేటి యుద్ధం అనంతరం, యుద్ధంలో పాల్గొన్న దేశాలన్నీ అమితంగా బలహీనపడిపోవడంతో యుద్ధం

23*

ఆఖరైన పక్షంలో, జాతీయ, అభ్యుదయకర, విప్లవాత్మక యుద్ధాలు ''ఏవీ కూడా'' మాట వరసకు, మహారాజ్యాలకు వ్యతిరేకంగా ఇండియా, పర్షియా, సయాం, వగైరాలతో మిత్రత్వం కల్గి చైనా సాగించే యుద్ధం లాంటి యుద్ధాలు ఎటువంటివీ ''ఉండవని'' మనం ఉద్ఘాటించితే, అది కేవలం హాస్యాస్పదమే అవుతుంది.

సామ్రాజ్యవాదం కింద జాతీయ యుద్ధాల సాధ్యతను పూర్తిగా కాదనడం సైద్ధాంతికంగా పొరపాటూ, చరిత్రను ప్రత్యక్షంగా తప్పు అర్థం చేసుకోవడమూ అవుతుంది, కాగా ఆచరణలో యూరపియన్ జాతీయ దురహంకారంతో సమానం కూడా అవుతుంది: యూరప్, ఆఫ్రికా, ఆసియా, వగైరాలలో నివసించుతూన్నట్టి లక్షోపలక్షల ప్రజలను పీడించుతూన్న జాతులకు చెందిన మనం, పీడితప్రజలతో, ''మన'' జాతులకు వ్యతిరేకంగా వారు యుద్ధం చేయడం ''అసాధ్యమ''ని మనం చెప్పాలన్నమాట!

రెండవ విషయం, అంతర్యుద్ధాలు కూడా యుద్ధాలే. వర్గపోరాటాన్ని గుర్తించే ప్రతివారికీ ప్రతి వర్గసమాజంలోనూ, వర్గపోరాటం యొక్క ప్రకృతిసిద్ధమైనట్టి, కాగా కొన్ని పరిస్థితులలో అనివార్యమైనట్టి కొనసాగింపూ, అభివృద్ధీ, తీవ్రకరణములకు చిహ్నమైన అంతర్యుద్ధాన్ని గుర్తించకతప్పదు. మహా విప్లవాలు అన్నీ దీనిని రుజువు చేస్తున్నాయి. అంతర్యుద్ధంతో తనకు సంబంధంలేదని అనడమూ, లేదా దానిని విస్మరించడమూ అంటే, దాని అర్థం తీవ్రాతితీవ్రమగు అవకాశవాదంలో దిగబడిపోయి, సోషలిస్టు విప్లవాన్ని విడనాడడమే అవుతుంది.

మూడవది, ఒక దేశంలో సోషలిజం విజయవంతమైనంత మాత్రాన, అట్టి విజయం మొత్తం యుద్ధాలనన్నిటినీ ఒక్క దెబ్బతో తొలగించివేయదు. తత్‌వ్యతిరేకంగా, యుద్ధాలు వుంటాయని అది ముందుగానే అంగీకరించుతూంది. పెట్టుబడి విధానాభివృద్ధి వివిధ దేశాలలో మిక్కిలి అసమమంగా సాగుతుంది. వర్తక సరుకుల ఉత్పత్తి వ్యవస్థకింద ఇది వేరొక విధంగా వుండడానికి వీల్లేదు. అన్ని దేశాలలోనూ ఏకసమయమందే సోషలిజం విజయం సాధించ జాలదనే దీనినుండి సారాంశం తేల్తూంది. మొదట ఒక దేశంలోనో, లేదా అనేక దేశాల్లోనో అది విజయం సాధించగా, కడమ దేశాలు బూర్జువా స్థితిలోనే, లేదా బూర్జువా స్థితికి ఇంకా పూర్వస్థితిలోనే మరికొంతకాలం వరకూ వుండిపోతాయి. ఇది ఘర్షణను సృష్టించి తీరడమే కాకుండా, సోషలిస్టు రాజ్యాంగయంత్రంలోని విజయవంతమైన శ్రామికవర్గాన్ని నాశనం చేసేందుకు ఇతర దేశాలలోని బూర్జువావర్గాల సరాసరి యత్నాలను కూడా సృష్టించి తీరుతుంది. ఇటువంటి దృష్టాంతాలలో, మనం యుద్ధానికి దిగిన పక్షంలో, అది న్యాయసమ్మతమైనట్టీ, ధర్మబద్ధమైనట్టీ యుద్ధమే అవుతుంది. అది సోషలిజం కోసం యుద్ధమే, బూర్జువావర్గం నుండి ఇతర ప్రజలను విముక్తి చేసే యుద్ధమే అవుతుంది. ఎంగెల్స్ 1882

సెప్టెంబరు 12 న కౌట్‌స్కీ పేర రాసిన లేఖలో, అప్పటికప్పుడే విజయం సాధించిన సోషలిజం "రక్షణ యుద్ధాలు" సాగించడం సాధ్యమేనని బాహాటంగా అతడు అంగీకరించాడూ అంటే, అతడు సంపూర్ణంగా సరిగానే చెప్పాడన్నమాట. అతని మనస్సులో వుండిన దేమిటంటే, ఇతర దేశాల బూర్జువావర్గానికి వ్యతిరేకంగా విజయం సాధించిన శ్రామికవర్గ రక్షణే.

ఒకే ఒక్క దేశపు బూర్జువావర్గాన్నే కాకుండా, సర్వప్రపంచ బూర్జువావర్గాన్నీ మనం కూలదోసి, దానిని సంపూర్ణంగా ఓడించి, దాని ఆస్తి హక్కులను లాగివేసిన తరువాత మాత్రమే యుద్ధాలు అసాధ్య మవుతాయి. కాగా శాస్త్రీయ దృక్పథం నుండి చూసినట్టయితే, అత్యంత కష్టమైన కర్తవ్యం, సోషలిజంలోకి పరివర్తన చెందడంలో బృహత్తర పరిమాణంలో పోరాటాన్ని కోరే కర్తవ్యం, బూర్జువావర్గ ప్రతిఘటనను అణచి వేయడమేనన్న విషయాన్ని, అత్యంత ముఖ్యమైన ఈ విషయాన్ని మనం మరుగుపరచినా లేదా పక్కకు నెట్టివేసినా, అది శుద్ధతప్పే అవుతుంది, పూర్తిగా విప్లవవ్యతిరేకమే అవుతుంది. "సోషల్" మతగురువులూ అవకాశవాదులూ భావికాలపు శాంతియుతపు సోషలిజం గురించి కలలు కనడానికి ఎల్లప్పుడూ సిద్ధంగానే వుంటారు; కాని వీరికీ, విప్లవాత్మక సోషల్-డెమొక్రాట్లకీ వున్న అసలు భేదం ఎక్కడుందంటే, ఈ సుందరమైన భవిష్యత్తును సాధించడానికి ఆవశ్యకమయేటట్టి భయానకమైన వర్గపోరాటం గురించీ, వర్గ యుద్ధాలు గురించీ తలపోయడానికిగాని, కలలు కనడానికిగాని వారు నిరాకరించడంలోనే వుంది.

మాటలు మనను పెడదార్లు పట్టించకుండా మనం జాగ్రత్తపడాలి. "పితృదేశ రక్షణ" అనే పదం, ఉదాహరణకు, అనేకులకు ద్వేషకారణ మవుతూంది, ఏమంటే, ప్రస్తుతపు పరరాజ్య కబళనా యుద్ధంలో బూర్జువావర్గం ఆడుతూన్న అబద్ధాలను కప్పిపుచ్చి, దాట వేయడానికి తాము అవకాశవాదులమనీ, కౌట్‌స్కీయానుచరులమనీ బహిరంగంగా చెప్పకుంటూన్నవారు ఈ పదాన్ని వాడుతూండడమే. ఇది వాస్తవవిషయం. అయితే అంతమాత్రాన, రాజకీయ నినాదాలను గురించి పర్యాలోచించడం మనం మరచిపోవాలని దీనినుండి పర్యవసానం తేల్చకూడదు. ప్రస్తుత యుద్ధంలో "పితృదేశ రక్షణ"ను గుర్తించడమంటే, ఈ యుద్ధం "ధర్మ" యుద్ధమనీ, శ్రామికవర్గ ప్రయోజనాలకోసం యుద్ధమనీ తు.చ గుర్తించడమే తప్ప మరొకటికాదని మేము మళ్లీమళ్లీ చెబుతున్నాం, ఎందుచేతంటే ఏ యుద్ధంలో నైనా సరే, దండయాత్రలు జరగవచ్చు. సామ్రాజ్యవాద మహారాజ్యాలకు వ్యతిరేకంగా తాము సాగిస్తూన్న యుద్ధాలలో పీడిత ప్రజలకు తమ "పితృదేశ రక్షణ" కూ, లేదా ఏ బూర్జువా దేశానికి చెందిన ఏ గాల్లిఫెకు వ్యతిరేకంగానో విజయవంతమైన శ్రామికవర్గానికి తన యుద్ధం సాగించడానికీ హక్కు నిరాకరించడమూ, కేవలం తెలివితక్కువే అవుతుంది.

రాజకీయాలను ఇతర సాధనాల ద్వారా సాగించడమే ప్రతి యుద్ధమూ, అనే విషయాన్ని మరచిపోవడం సైద్ధాంతికంగా కేవలం తప్పే అవుతుంది; మహారాజ్యాలలో రెండు గ్రూపులు తమ సామ్రాజ్యవాద విధానాల కొనసాగింపే ప్రస్తుత యుద్ధం; కాగా సామ్రాజ్యవాద శకం యొక్క మొత్తం సంబంధాలవల్లనే ఈ రాజకీయాలు ఉత్పన్నమై, దోహదం చేయబడ్డాయి. కాని జాతీయ పీడకు వ్యతిరేకమైన పోరాటం యొక్క, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామిక వర్గ పోరాటంయొక్క రాజకీయాలనూ, కాగా అందువల్లనే మొదటిది, విప్లవాత్మక జాతీయ ఉపప్లవాల, యుద్ధాలయొక్క; రెండవది, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గ యుద్ధాల, ఉపప్లవాలయొక్క; మూడవది, పై రెండు రకాల విప్లవాత్మక యుద్ధాలు, వగైరాల యొక్క, సాధ్యతనూ అనివార్యతనూ కూడా, అచ్చంగా ఈ శకమే అవశ్యంగా ఉత్పన్నమూ, దోహదమూ చేసి తీరాలి.

సెప్టెంబరు 1916.

# మన విప్లవంలో శ్రామికవర్గంయొక్క కర్తవ్యాలు

## శ్రామికవర్గ పార్టీ వేదికకు ముసాయిదా

### ఖండిక

## మన పార్టీకి శాస్త్రీయంగా నిర్దుష్టమూ, శ్రామిక వర్గ చైతన్యాన్ని రాజకీయంగా తేటపరచేందుకు సహాయకారీ అయే పేరు ఎట్టిది వుండాలి?

19. ఇక ఆఖరి విషయానికొచ్చాను — మన పార్టీ పేరు. కమ్యూనిస్టు పార్టీ అని మనం పేరు పెట్టుకోవాలి — సరిగ్గా మార్క్సు ఎంగెల్సులు పేరు పెట్టుకున్నట్టే.

మనం మార్క్సిస్టులమనీ, "కమ్యూనిస్టు ప్రణాళికను" మనం ప్రాతిపదికగా తీసుకుంటున్నామనీ మనం పదే పదే చెప్పాల్సివుంది. రెండు ముఖ్యమైన అంశాలలో సోషల్-డెమోక్రాట్లు దీనికి వక్రభాష్యం చెప్పి దీనికి ద్రోహం చేశారు: 1) కార్మిక జనానికి దేశం అనేది లేదు: సామ్రాజ్యవాద యుద్ధంలో "పితృదేశ రక్షణ" అంటే సోషలిజానికి ద్రోహమే; 2) రాజ్యాంగయంత్రం గురించిన మార్క్సిస్టు సిద్ధాంతం రెండవ ఇంటర్నేషనల్‌చే వికృతం చేయబడింది.

మార్క్సు అనేకసార్లు, అందులోనూ ప్రత్యేకంగా 1875 లో "గోతా కార్యక్రమ విమర్శ"లో విశదీకరించినట్టూ, ఇంతకంటె సుబోధకంగా 1894 లో ఎంగెల్సు పునరుద్ఘాటించినట్టూ[139] "సోషల్-డెమోక్రసీ" అనే పేరు శాస్త్రీయంగా తప్పు. మానవాళి పెట్టుబడిదారీ విధానంనుండి సరాసరి కేవలం సోషలిజానికే, అనగా ఉత్పత్తి సాధనాల సామాజిక స్వత్వానికీ, ప్రతి వ్యక్తి చేతనూ నెరవేర్చబడిన పనియొక్క పరిమాణం అనుసరించి సరుకుల పంపిణీకీ, చేరుకోగల్గుతుంది. ఇంతకంటె బాగా దూరమే ఆలోచించుతుంది మన పార్టీ: "ప్రతివాని నుండీ వాని శక్తి సామర్థ్యాలను అనుసరించి, ప్రతివానికీ వాని అవసరాలను అనుసరించి" అనే దీక్షావాక్యం లిఖించబడిన పతాకను కలిగిన కమ్యూనిజంలోకి సోషలిజం క్రమేణా తప్పనిసరిగా పరివర్తన చెంది తీరుతుంది.

ఇది నా మొదటి వాదం.

రెండవ వాదం: మన పార్టీ పేరులో రెండవ భాగం (సోషల్-డెమోక్రాటిక్) కూడా శాస్త్రీయంగా తప్పే. రాజ్యాంగయంత్రంయొక్క రూపాలలో ప్రజాస్వామ్యం ఒక రూపమై వుండగా, మార్క్సిస్టులమైన మనం ఏ రాజ్యాంగయంత్రానికైనా వ్యతిరేకులమే.

ప్లెహానొవ్, కౌట్స్కీ లాంటి రెండవ ఇంటర్నేషనల్ (1889–1914) నాయకులు మార్క్సిజాన్ని అపభ్రంశపరచి, వికృతం చేసేశారు.

మార్క్సిజానికీ అరాజకవాదానికీ భేదం ఎక్కడుందంటే, సోషలిజంలోకి పరివర్తన చెందేందుకు రాజ్యాంగయంత్ర ఆవశ్యకతను మార్క్సిజం గుర్తించుతుంది; కాని (కౌట్స్కీ ప్రభృతులతో మనమిక్కడే విభేదించుతున్నాం) మనం గుర్తించేది మామూలు పార్లమెంటరీ విధానపు బూర్జువాప్రజాస్వామిక రిపబ్లిక్కు తరహా వంటి రాజ్యాంగయంత్రం కాదు, 1871 పారిస్ కమ్యూన్ని పోలినట్టి, 1905, 1917 కార్మిక ప్రతినిధుల సోవియట్లను పోలినట్టి రాజ్యాంగయంత్రం.

నా మూడవ వాదం: మనదేశంలో, రాజ్యాంగయంత్రం అనే పదంయొక్క సరైన అర్థంలో రాజ్యాంగయంత్రం కానట్టి ఈ కొత్త "రాజ్యాంగయంత్రాన్ని," అది బలహీనంగానూ, ఇంకా పిండోత్పత్తి రూపంలోనే వున్నప్పటికీ, జీవితమే, విప్లవమే వాస్తవానికి ఇప్పటికప్పుడే సృష్టించింది.

ఇది కేవలం నాయకుల సిద్ధాంతాలు కాకుండా, ఇప్పటికప్పుడే ప్రజారాసుల ఆచరణీయ ప్రశ్న అయింది.

రాజ్యాంగయంత్రం అనే పదం యొక్క సరైన అర్థంలో, రాజ్యాంగయంత్రమంటే ప్రజలనుండి వేర్పరచబడిన సాయుధ దళాలచే ప్రజారాసులపై ఆజ్ఞాపనము.

ఇప్పుడు జన్మించుతూన్న మన కొత్త రాజ్యాంగయంత్రం కూడా ఒక రాజ్యాంగయంత్రమే, ఎందుచేతంటే మనకు కూడా సాయుధ దళాలు అవసరం; మనకు కూడా కఠినాతి కఠినమైన క్రమం అవసరం, విప్లవప్రతిఘాతానికి జారిస్టు, లేదా గుచ్‌కోవ్ బూర్జువా యత్నాలను అన్నిటినీ మనం బలప్రయోగంతోనూ నిర్దాక్షిణ్యంగానూ అణచివేసి తీరాలి.

కాని ఇప్పుడు జన్మించుతూన్న మన కొత్త రాజ్యాంగయంత్రం, ఈ పదంయొక్క సరైన అర్థంలో, రాజ్యాంగయంత్రం కానే కాదు, ఎందుచేతంటే రష్యాలో అనేక భాగాల్లో ఈ సాయుధ దళాలు ప్రజల నెత్తిమీద కూచోపెట్టినట్టి, ప్రజలనుండి వేర్పరచబడినట్టి, ఆచరణలో పదవినుండి తొలగించ వీల్లేనట్టి కొందరు విశేషాధికారాలనుగల మనుషు లెవరో కాకుండా, అసలు ప్రజారాసులే, యావత్తు ప్రజే.

పాతకాలపు రాజరిక ప్రభుత్వనిర్వహణాంగములైన పోలీసు, సైన్యము, ఉద్యోగిబృందం సహాయంతో బూర్జువావర్గ పరిపాలనను పటిష్ఠం చేసినట్టి మామూలు బూర్జువా తరహా ప్రజాస్వామ్యంవైపు వెనక్కి చూడడకుండా, మనం ముందుకే చూడాలి.

ఇప్పుడు జన్మించుతూన్నట్టి, ఇప్పటికప్పుడే ప్రజాస్వామ్యంగా ఇక వుండనట్టి కొత్త ప్రజాస్వామ్యానికై మనం ఎదురుచూడాలి. ఎందుచేతనంటే ప్రజాస్వామ్యం అర్థం ప్రజలపై రాజ్యం అయివుండగా, సాయుధప్రజ తనపై తానే రాజ్యం చేయజాలదు.

ప్రజాస్వామ్యం అనే పదం కమ్యూనిస్టు పార్టీకి ప్రయుక్తంచేయడం శాస్త్రీయంగా తప్పు అవడమేకాకుండా, ఈనాడు, 1917 మార్చి తరువాత, ఈ పదం విప్లవాత్మక ప్రజల కళ్లకు తగిలించిన గంతగానూ, "రాజ్యాంగయంత్రంలో" ఏకైకశక్తిగా, ఏ రాజ్యాంగయంత్రమైనా సరే "హరించిపోవడము"కు వైతాళికుడుగా కార్మిక, కర్షక, తదితర ప్రతినిధులందరి సోవియట్లు అనే కొత్తను ధైర్యంగా, స్వేచ్ఛగా, తమ సొంత చొరవతో నిర్మించుకోవడానికి ఆటంకముగానూ ఏర్పడుతూంది.

నా నాల్గవ వాదం: అంతర్జాతీయంగా సోషలిజంయొక్క బాహ్యగతాత్మక పరిస్థితిని లెక్కలోకి తీసుకోవాలి.

ఈ పరిస్థితి, 1871–1914 మధ్యకాలంలో "సోషల్-డెమోక్రసీ" అనే తప్పుడు అవకాశవాద పదంతో మార్క్స్, ఎంగెల్స్‌లు బుద్ధిపూర్వకంగానే సమాధానపడిన పరిస్థితికాదు. ఎందుచేతంటే, అప్పుడు, పారిస్ కమ్యూన్ ఓటమి తరువాత, ఆర్గనైజేషనుకూ ప్రబోధానికీ సంబంధించిన నెమ్మదైన కార్యకలాపమే ఆనాటి కర్తవ్యమని చరిత్ర ఆదేశించింది. ఆ రోజుల్లో మరేదీ సాధ్యం కాకపోయింది. సిద్ధాంత రీత్యానే కాకుండా, ఆర్థికంగానూ రాజకీయంగానూ అరాజకవాదులు ఆనాడు (ఇప్పటిలాగానే) మౌలికంగా తప్పుడు మార్గాన్ని అనుసరించారు. అరాజకవాదులు ఆ కాలపు స్వభావాన్ని సరిగా విలువకట్టలేకపోయారు, ఎందుచేతనంటే ప్రపంచ పరిస్థితిని — సామ్రాజ్యవాద లాభాలవల్ల చెడిపోయినట్టి ఇంగ్లీషు కార్మికుడు, పారిస్‌లో కమ్యూన్ ఓటమి, జర్మనీలో దరిమిలా (1871) బూర్జువా-జాతీయోద్యమ విజయోత్సాహం, అర్ధఫ్యూడల్ రష్యా యొక్క యుగయుగాల సుషుప్తి — వారు అర్థం చేసుకోలేకపోయారు.

పరిస్థితిని మార్క్స్, ఎంగెల్స్‌లు సరిగా విలువకట్టారు, అంతర్జాతీయ పరిస్థితిని వారు అర్థం చేసుకున్నారు; సోషల్ విప్లవారంభాన్ని నెమ్మదిగా సమీపించడమనే కర్తవ్యాన్ని వారు అవగతం చేసుకున్నారు.

మన వంతు మనం కూడా కొత్త శకంయొక్క ప్రత్యేక స్వభావాలనూ కర్తవ్యాలనూ అర్థం చేసుకుందాం. "రాక్షస దంతాలను నేను విత్తునాలుగా చల్లాను, పుష్కలంగా పండాయి పేలు"

అని మార్క్స్ ఎవరినుద్దేశించి అన్నాడో అట్టి కొరగాని మార్క్సిస్టులను మనం అనుకరించవద్దు.

సామ్రాజ్యవాదంగా పెరిగి పెద్దదైనట్టి పెట్టుబడిదారీ విధానంయొక్క బాహ్యగతాత్మక అవసరాలు సామ్రాజ్యవాద యుద్ధాన్ని దాపురింపజేశాయి. ఈ యుద్ధం మానవాళిని నాగరికతా విధ్వంసనం అంచుకు, లక్షోపలక్షల కోటానకోట్ల మానవులను పశుప్రాయులను చేసేటట్టి, నాశనం చేసేటట్టి ఒక అగాధం అంచుకు తీసుకొచ్చింది.

శ్రామికవర్గ విప్లవంద్వారానే తప్ప దీనినుండి బయటపడడానికి గత్యంతరం లేదు.

కాగా, ఈ విప్లవం ఆరంభమయే క్షణంలో, పిరికితనంతోనూ సంశయంతోనూ కూడిన తప్పటడుగులు, బూర్జువావర్గంపై విపరీతమైన ఆశలు పెట్టుకున్న అడుగులు అది వేస్తూన్నప్పుడు, సరిగా అట్టి క్షణంలో, ''సోషల్-డెమోక్రాటిక్'' నాయకులలో, ''సోషల్-డెమోక్రాటిక్ పార్టీ''కి చెందిన పార్లమెంటరీ విధానవాదులలో, ''సోషల్-డెమోక్రాటిక్'' పత్రికలలో — ప్రజారాసులపై ప్రభావం నెరపే పత్రికలు ఇవే కదా మరి — అధిక సంఖ్యాకవర్గం (ఇది సత్యం, ఇది వాస్తవవిషయం) — సోషలిజాన్ని పరిత్యజించి, సోషలిజానికి ద్రోహంచేసి, ''తమ'' జాతీయ బూర్జువావర్గ పక్షంతో చేరిపోవడం తటస్థించింది.

ఈ నాయకులు ప్రజారాసులను గందరగోళ పరచి, పెడదారులు పట్టించి, మోసం చేస్తున్నారు.

కాగా రెండవ ఇంటర్నేషనల్ ఎంత కుళ్లిపోవాలో అంత కుళ్లిపోయి, అంత పాతపడిపోయి, అంత ముసలి తుక్కు అయిపోయినట్టి పేరుకు ముడిపడిపోయి, తద్వారా ఈ మోసానికి మద్దతు ఇచ్చి, దానిని మనం సులభం చేయాలట!

కార్మికులలో ''చాలా మంది'' చిత్తశుద్ధితో సోషల్-డెమోక్రసీని అర్థం చేసుకుంటున్నారనే మనం ఒప్పుకుందాం; కాని బాహ్యగతాత్మకం నుండి స్వకీయగతాత్మకాన్ని పోల్చుకోవడం ఎలాగో తెలుసుకునే సమయం ఆసన్నమయింది.

స్వకీయగతాత్మకంగా మట్టుకు, అట్టి సోషల్-డెమోక్రాటిక్ కార్మికులు శ్రామికవర్గ ప్రజారాసుల అత్యంత విశ్వాసపాత్రులైన నాయకులు.

అయినప్పటికీ బాహ్యగతాత్మకంగా మట్టుకు, ప్రపంచ పరిస్థితి ఎలా వుందంటే, ప్రజారాసుల మోసగింపును మన పార్టీ పాతపేరు మరింత సులభం చేస్తూంది, కాగా పురోగమనాన్ని కుంటుపరుస్తూంది; ఎందుచేతనంటే, అడుగడుగున, ప్రతి పత్రికలోనూ, ప్రతి పార్లమెంటరీ గ్రూపులోనూ నాయకులే, అనగా ఎవరి గొంతుకలైతే మారుమూలలకు సహితం వినబడతాయో, ఎవరి చేతలైతే స్ఫుటంగా కనబడుతాయో అట్టి వారే, ప్రజారాసులకు అగుపడతారు; అయినప్పటికీ వీరందరూ ''కూడా-సోషల్-డెమోక్రాట్లే,'' సోషలిజం ద్రోహు

లతో, సోషల్-జాతీయ దురహంకారులతో ''ఐక్యతకు'' సముఖులే; వీరందరూ కూడా ''సోషల్-డెమోక్రసీ'' రాసియిచ్చిన పాత హుండీలను చెల్లింపుకై హాజరుపెట్టుతున్నారు....

కాగా, ఈ వాదములకు ప్రతివాదములేమిటి?.. ''అరాజకవాద-కమ్యూనిస్టులూ మీరూ ఒకరే అనుకుంటారు'' అని కొందరంటున్నారు....

సోషల్-నేషనలిస్టులూ, సోషల్-లిబరల్సూ, లేదా ఫ్రెంచి రిపబ్లిక్కులోని ప్రముఖ బూర్జువా పక్షమూ, ప్రజరాసులను బూర్జువా పద్ధతిలో మోసగించడంలో అత్యంత నేర్ప రులూ అయిన రాడికల్-సోషలిస్టులూ మేమూ ఒకరమే అనుకుంటారని మేము ఎందుచేత భయపడడం లేదు?...''ఆ పేరుకు ప్రజారాసులు బాగా అలవాటుపడిపోయారు, తమ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ అంటే కార్మికులు ఎంతగానో 'ప్రేమిస్తారు,''' అని ఇందుకు జబాబు చెబుతున్నారు.

కేవలం ఇదొక్కటే వాదన. కాని మార్క్సీయ శాస్త్రాన్ని, రేపు జరుగనున్న విప్లవం లోని కర్తవ్యాలను, ప్రపంచ సోషలిజం యొక్క బహ్యగతాత్మక స్థానాన్ని, రెండవ ఇంటర్నే షనల్ సిగ్గుచేటైన పతనాన్ని, శ్రామికవర్గీయుల చుట్టూ తిరుగుతూన్నట్టి ''కూడా-సోషల్-డెమోక్రాట్ల'' మందలు ఆచరణ కార్యానికి కలుగజేస్తూన్న హానిని నిరాకరించే వాదన ఇది.

ఇదొక రివాజు వాదన, నిద్దరమత్తు వాదన, జడత్వపు వాదన.

ప్రపంచాన్ని పునర్నిర్మించడానికి కంకణం కట్టుకున్నాం మనం. లక్షోపలక్షల జనాన్ని చుట్టుముట్టినట్టీ, కోటానకోట్ల పెట్టుబడియొక్క ప్రయోజనాలు చిక్కుకున్నట్టీ ఈ సామ్రాజ్యవాద యుద్ధాన్ని, మానవచరిత్రలో అత్యంత మహత్తరమైన శ్రామికవర్గ విప్లవం జరగనిదే నిజమైన ప్రజాస్వామిక శాంతితో అంతమొంద జాలని ఈ యుద్ధాన్ని అంతమొం దించడానికి కంకణం కట్టుకున్నాం మనం.

అయినప్పటికీ మనన్ని చూసుకుని మనమే భయపడుతున్నాం. మనం ''అలవాటు పడిపోయి'' మన ''ప్రేమను చూరగొన్న ఆ కుళ్ళు చొక్కా''ని తీసి పారేయడానికి మనకి మనసొప్పడంలేదు....

కాని ఆ కుళ్ళు చొక్కాని తీసి పారేసి కొత్త మడతలు వేసుకునే సమయం వచ్చింది.

పెట్రోగ్రాడ్, ఏప్రిల్ 10, 1917.

# ఎత్తుగడలను గురించి లేఖలు

## ఖండిక

## మొదటి లేఖ

## ప్రస్తుత పరిస్థితిపై అంచనా

వర్గముల అన్యోన్యసంబంధాలయొక్క, ప్రతి చారిత్రక పరిస్థితిలోని నిర్దిష్టము లైన ప్రత్యేకతలయొక్క అత్యంత సునిశితమైనట్టి, బాహ్యగతాత్మకంగా రుజావు పరచబడ గల్గేటట్టి విశ్లేషణను మనం చెయ్యాల్సి వుంటుందని మార్క్సిజం డిమాండు చేస్తోంది. రాజకీయ విధానానికి శాస్త్రీయమైన పునాదికోసం తప్పనిసరిగా ఆవశ్యకమైనట్టి ఈ డిమాండును నెరవేర్చడానికి బోల్‌షెవిక్‌లం మనం ఎల్లప్పుడూ చిత్తశుద్ధితో ప్రయత్నించాం.

"మా ఉపదేశం ఒక పిడిసూత్రం కాదు, అది కార్యాచరణకు మార్గదర్శి,"[140] అని మార్క్స్, ఎంగెల్స్‌లు ఎల్లప్పుడూ చెప్పేవారు; చారిత్ర ప్రక్రియ ప్రతి ప్రత్యేక దశ యొక్క నిర్దిష్ట ఆర్థిక, రాజకీయ పరిస్థితులచే అవశ్యంగా మార్పునకు లోనయే సాధారణ కర్తవ్యాల రేఖా చిత్రాన్ని మాత్రమే, అత్యుత్తమ సందర్భాల్లోనే వ్యక్తపరచగల్గే "సాంకేతికాలను" కంఠపాఠంచేసి, కేవలం పునశ్చరణ చేయడమును వారు న్యాయంగానే ఎగతాళి చేశారు.

అలాంటప్పుడు, విప్లవాత్మక శ్రామికవర్గ పార్టీ తన కర్తవ్యాలనూ తన క్రియాకలాప రూపాలనూ నిశ్చయించుకుందుకు ఈనాడు అది అనుసరించాల్సినట్టి, నిశితంగా స్థిరపడినట్టి బాహ్యగతాత్మక వాస్తవవిషయాలు ఏమిటి?

"ప్రావ్దా", 1917 మార్చి 21, 22 తేదీలుగల నెం. 14, 15 సంచికలలో ప్రచురించబడిన నా మొదటి "దూరదేశాలనుండి లేఖ" ("ప్రథమ విప్లవంలో ప్రథమ దశ") లోనూ, నా సంగ్రహ సూత్రీకరణలలోనూ, "రష్యాలోని ప్రస్తుత పరిస్థితి విశిష్ట స్వభావాన్ని," విప్లవంయొక్క మొదటి దశనుండి రెండవ దశకు పరివర్తనచెందే కాలావధి అని నిర్వచించాను. మరి, అందుచేతనే: "కార్మికులారా, మీరు జారిస్టు వ్యవస్థతకు వ్యతిరేకంగా అంతర్యుద్ధంలో అద్భుతమైన శ్రామికవర్గ వీరత్వాన్ని, ప్రజా వీరత్వాన్ని ప్రదర్శించారు. విప్లవం రెండవ దశలో మీ విజయసాధనకై మార్గం సుగమం చేసుకునేందుకు శ్రామికవర్గాన్నీ, సర్వ ప్రజలనూ ఆర్గనైజుచేయడంలో మీరు అద్భుతాలను ప్రదర్శించాలి"

అని ఈ తరుణంలో ప్రధాన నినాదంగా, "ప్రధాన కర్తవ్యంగా" నేను భావించాను ("ప్రావ్ద", నెం. 15)

మొదటి దశలో వున్న విషయమేమిటి?

రాజ్యాంగయంత్రంయొక్క అధికారాన్ని బూర్జువావర్గానికి బదిలీ చేయడంలో వుంది ఈ దశలో వున్న విషయం.

1917 ఫిబ్రవరి–మార్చి విప్లవం ముందు, రాజ్యాంగయంత్రం యొక్క అధికారం ఒక పాత వర్గం, అనగా నికోలస్ రొమానొవ్ నాయకత్వం వహించిన ఫ్యూడల్ భూస్వామ్య కులీనవర్గం చేతిలో వుండేది.

ఇప్పుడు ఆ విప్లవం అనంతరం మరొక వర్గం, ఒక కొత్త వర్గం, అనగా బూర్జువా వర్గం, చేతిలో వుంది అధికారం.

రాజ్యాంగయంత్రాధికారం ఒక వర్గం నుండి మరొక వర్గానికి బదిలీ కావడమే విప్లవం, అనే ఉక్తియొక్క ఖండితంగా శాస్త్రీయమూ, ఆచరణలో రాజకీయమూ అయిన రెండు అర్థాల్లోనూ, ప్రథమమూ, ప్రధానమూ, మౌలికమూ అయిన చిహ్నం.

ఈ మేరకు రష్యాలో బూర్జువా, లేదా బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం పూర్తి చేయబడింది.

సరిగా ఇక్కడే, తాము "పాత బోల్‌షెవిక్‌ల" మని గొప్పగా చెప్పుకునే ఆక్షేపకుల రగడ ఒకటి మనకు వినబడుతూంది: " కేవలం 'శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం' వల్లనే బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం పూర్తిచేయబడుతుందని మేం ఎల్లప్పుడూ చెప్పామా లేదా? బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం కూడా అయిన వ్యవసాయ విప్లవం పూర్తి చేయబడిందా? తత్‌వ్యతిరేకంగా, అది అసలు ప్రారంభమే కాలేదు అన్నది వాస్తవవిషయం కాదూ?" అని వారు ప్రశ్నించుతున్నారు.

అందుకు ఇదీ నా జబాబు: చరిత్ర బోల్‌షెవిక్ నినాదాలనూ భావాలనూ సాధారణంగా ధ్రువీకరించింది; కాని నిర్దిష్టంగా మాత్రం, ముందుగానే అనుకోగల్గినదాని కంటె (ఎవరైనాసరే అనుకోగల్గినదానికంటె) భిన్నంగా విషయాలు, మరింత స్వకపోలకల్పితంగానూ, మరింత సమయోచితంగానూ, మరింత బహువర్ణభూయిష్ఠంగానూ రూపొందాయి.

ఈ వాస్తవవిషయాన్ని మనం నిర్లక్ష్యం చేసినా, విస్మరించినా, నూతనమైనట్టి సజీవమైనట్టి యథార్థంయొక్క విశిష్ట లక్షణాలను పఠించడం బదులు, రోకటి పాటలా నేర్చుకున్న సాంకేతికాన్ని ఆలోచనారహితంగా పునశ్చరణ చేయడంవల్ల మన పార్టీ చరిత్రలో ఒక సారి కాదు, అనేక సార్లు దురదృష్టకరమైన పాత్రను ధరించినట్టి ఆ "పాత బోల్‌షెవిక్‌ల" లాగానే మనమూ తయారవుతాం.

‘‘శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం’’ రష్యన్ విప్లవంలో ఇప్పటికప్పుడే నిజపరచబడింది*; ఎందుచేతంటే, ఈ ‘‘సాంకేతికం’’ కేవలం వర్గాల అన్యోన్యసంబంధాలనే చూడగల్గుతూంది, కాని ఈ సంబంధాన్ని, ఈ సహకారాన్ని అమలు జరిపేటట్టి నిర్దిష్ట రాజకీయ సంస్థను చూడలేకపోతూంది. వాస్తవంగా నిజపరచబడిన ‘‘శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం’’ఇదిగో ఇక్కడుంది మీకు.

ఈ సాంకేతికం ఇప్పటికప్పుడే పాతబడిపోయింది. జీవితం దీనిని సాంకేతిక ప్రపంచం నుండి వాస్తవ ప్రపంచంలోకి మార్చివేసి, దీనికి రక్తమాంసాలను పెట్టి, నిర్దిష్టపరచి, తద్వారా దీనిని మార్చివేసింది కూడానూ.

కొత్తదీ, భిన్నమైనదీ వేరొక కర్తవ్యం నేటి కార్యక్రమావళిలో నిల్చి వుంది: ఈ నియంతృత్వం లోపల వున్న శ్రామికవర్గపు (దేశరక్షణ వ్యతిరేక, అంతర్జాతీయ, ‘‘కమ్యూనిస్టు,’’ కమ్యూన్‌లోకి పరివర్తనకు సుముఖములైన) మూలద్రవ్యాలను, సన్నకారు సొంతదారీ, లేక పెట్టీబూర్జువా (ఛెయీద్‌జె, త్సెరెతేలి, స్టెక్లోవ్‌ల, సోషల్-రివల్యూషనరీల, వీరిలాంటి విప్లవాత్మక దేశరక్షణవాదుల, కమ్యూన్ దిశగా పయనించేందుకు వ్యతిరేకుల, బూర్జువావర్గానికి బూర్జువా ప్రభుత్వానికీ వత్తాసు ఇచ్చేందుకు సుముఖులైన మూలద్రవ్యాలనుండి చీలదీయడం.

‘‘శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం’’ గురించి మాత్రమే ఈనాడు మాట్లాడే మనిషి పాతకాలపు మనిషే, తదానుషంగికంగా, పర్యవసానంలో స్వపక్షం వదలిపెట్టేసి పెట్టీబూర్జువావర్గంతో చేరినవాడై, శ్రామికవర్గపు వర్గపోరాటానికి వ్యతిరేకి అవుతున్నాడు. అట్టివాడు ‘‘బోల్‌షెవిక్’’ విప్లవాత్పూర్వ పురావస్తు భాండాగారంలో (‘‘పాత బోల్‌షెవిక్‌ల’’ పురావస్తు భాండాగారం అని దీనిని పిలువవచ్చు) వుంచి భద్రపరచబడడానికి అర్హుడవుతాడు.

శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం ఇప్పటికప్పుడే నిజపరచబడింది, కాని అది అత్యంత స్వకపోలకల్పిత రూపంలోనూ, అనేక రకాల ముఖ్యమైన మార్పులతోనూ నిజపరచబడింది. వీటిని గురించి ప్రత్యేకంగా మరొక లేఖలో నేను వివరిస్తాను. ప్రస్తుతానికి, మార్క్సిస్టు అన్నవాడు సజీవమైన జీవితాన్ని, వాస్తవికతయొక్క యథార్థ విషయాలను గుర్తించాలే గాని, ఎంత ఉత్తమంగా చూసినా, ప్రాధాన్యతనూ సాధారణాన్నీ రేఖామాత్రంగా చూపి, జీవిత సంక్లిష్టాలను ఆసన్నంగా మాత్రమే గ్రహించగల్గే అన్ని సిద్ధాంతాల్లాంటిదే అయినట్టి, నిన్నటి సిద్ధాంతాన్ని పట్టుకుని వేళ్లాడకూడదు.

---

* ఒకానొక రూపంలోనూ ఒకానొక మెట్టుకూ.

"ప్రియ మిత్రమా, బూడిదెవర్ణం సిద్ధాంతం; పచ్చగా కలకల్లాడుతూంటుంది జీవితమనే శాశ్వతవృక్షం."141

బూర్జువా విప్లవ "పరిసమాప్తి" ప్రశ్నను ఇంకా పాతపద్ధతిలోనే ప్రదర్శించే వ్యక్తి, సజీవమైన మార్క్సిజాన్ని మృతాక్షరాలకు బలిపెడుతున్నాడు.

పాత భావన ప్రకారం, శ్రామికవర్గ, రైతాంగాల పరిపాలన, వాటి నియంతృత్వం బూర్జువా పరిపాలన తరువాత సంభవించగలదు, సంభవించి తీరుతుంది కూడానూ.

కాని వాస్తవ జీవితంలో, దీనికి భిన్నంగా అప్పుడే సంభవించనే సంభవించింది: అత్యంత స్వకపోల కల్పితమైనట్టీ, నూతనమైనట్టీ, అపూర్వమైనట్టీ ఒకదానితో ఒకటి పెనవేసుకొనిపోవడం సంభవించింది. బూర్జువావర్గ పరిపాలన (ల్వోవ్, గుచ్‌కోవ్‌ల ప్రభుత్వం), దానితోసహా బూర్జువావర్గానికి ఐచ్ఛికంగా అధికారాన్ని ధారాదత్తంచేసి, తనంతట తానే బూర్జువావర్గ అనుబంధంగా ఐచ్ఛికంగా మారిపోతూన్నట్టి శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం — ఈ రెండూ ఏకసమయంలో ఒకదాని సరస నొకటి ఉనికి కలిగివున్నాయి.

ఎందుచేతంటే, పెట్రోగ్రాడ్‌లో అధికారం వాస్తవంగా కార్మికులు, సైనికుల చేతిలోనే వుందన్న విషయం మరచిపోకూడదు: కొత్త ప్రభుత్వం వీరిమీద బలం ప్రయోగించడం లేదు, ప్రయోగించ జాలదు, ఇందుకు కారణం, ప్రజలనుండి వేర్పడినట్టి పోలీసు బలగమూ లేదు, ప్రజలనుండి వేర్పడినట్టి సైన్యమూ లేదు, ప్రజలకు అతీతంగా వుంటూ సర్వశక్తి వంతమైన ఉద్యోగివర్గమూ లేదు. ఇది వాస్తవవిషయం. కాగా ఇది అచ్చంగా పారిస్ కమ్యూన్ తరహా రాజ్యాంగయంత్రానికి స్వాభావికమైన వాస్తవవిషయం కూడా. ఈ వాస్తవ విషయం పాత పథకాలలో ఇమడదు. సాధారణంగా "శ్రామికవర్గ, రైతాంగాల విప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వం" గురించి ఈనాడు ఆలోచనారహితమైన కబుర్లు వల్లెవేసే బదులు, వాస్తవవిషయాలతో పథకాలను ఎలా సరిపెట్టాలో మనం ఎరిగివుండాలి.

ఈ ప్రశ్నను మరింత ఉత్తమంగా విశదం చేసేందుకు దీనిని మరొక పార్శ్వంనుండి సమీపించుదాం.

వర్గ సంబంధాలను అత్యంత జాగ్రత్తగా విశ్లేషణ చేయడమనే స్థిరమైనవేలను మార్క్సిస్టు ఎన్నడూ విడువకూడదు. బూర్జువావర్గం అధికారంలో వుంది. కాని రైతాంగపు రాశి, విభిన్న స్తరానికి చెందినట్టిదే, విభిన్న రకానికి చెందినట్టిదే, విభిన్న స్వభావం కలిగినట్టిదే అయినప్పటికీ, అది కూడా ఒక బూర్జువావర్గమే కదా, అలాంటప్పుడు ఈ విధంగా బూర్జువా-ప్రజాస్వామిక విప్లవాన్ని "పరిసమాప్తం చేసేందుకు" ఈ స్తరం అధికారానికి రాజాలదనే పర్యవసానం తేల్చడానికి ఎలా వీలవుతుంది? ఇది ఏల అసాధ్యం?

ఈ విధంగా తరుచు వాదిస్తారు పాతకాలపు బోల్షెవిక్‌లు.

ఇది కేవలం సాధ్యమనే నా జబాబు. కాని ఏదైనా ఫలానా పరిస్థితిని మార్క్సిస్టు విలువకట్టేటప్పుడు, సాధ్యతనుండి కాకుండా, వాస్తవికత నుండి బయల్దేరాలి.

కాగా, రెండవ సమాంతర ప్రభుత్వంలో స్వేచ్ఛగా ఎన్నుకోబడిన సైనికుల, రైతుల ప్రతినిధులు స్వేచ్ఛగా పాల్గొంటూ, దానికి స్వేచ్ఛగా అనుబంధాలను సృష్టించుతూ, దానిని అభివృద్ధిచేస్తూ, సంపూర్ణం చేస్తున్నారనే వాస్తవవిషయాన్ని యథార్థం బయట పెట్టుతూంది. కాగా అంత స్వేచ్ఛాయుతంగానే వారు బూర్జువావర్గానికి అధికారాన్ని అప్పగించి వేస్తున్నారు — అయితే ఈ దృగ్విషయం మార్క్సీయ సిద్ధాంతాన్ని ఈషణ్మాత్రమూ "అతి క్రమించడం" లేదు, ఎందుచేతంటే, ఒక్క బలప్రయోగం వల్లనే కాకుండా, ప్రజారాసులలో వర్గచైతన్యం లోపించడం, అవి పాత అలవాట్లను పట్టుకుని వేలాడ్డం, బెదర గొట్టబడిన స్థితిలో వుండడం, ఆర్గనైజేషను రాహిత్యం వలన కూడా బూర్జువావర్గం తన స్థానాన్ని నిలబెట్టు కుంటూాందన్న విషయాన్ని మేము ఎరిగే వున్నాం, పదేపదే పునరుద్ఘాటించుతూన్నే వచ్చాం కూడానూ.

ఈనాటి వాస్తవికత దృష్ట్యా, వాస్తవవిషయాల పట్ల పెడముఖం చూపుతూ, "సాధ్యతలను" గురించి కబుర్లు చెప్పడంకేవలం హాస్యాస్పదం.

భూమినంతనూ, అధికారాన్నంతనూ రైతాంగం హస్తగతం చేసుకోవచ్చునేది సాధ్యమే. ఈ సాధ్యతను ఏమాత్రమూ విస్మరించక పోవడమే కాకుండా, కేవలం ఈనాటికి మాత్రమే నేను ఏమాత్రం పరితమై వుండకుండా, అందుకు పైపెచ్చు, కొత్త దృగ్విషయాన్ని, అనగా ఇటు వ్యవసాయ కూలీకూ, పేదరైతులకూ మధ్యను వున్నట్టీ, అటు వీరికీ సంపన్నులైన రైతులకూ మధ్యను వున్నట్టీ లోతైన చీలిక అనే దృగ్విషయాన్ని లెక్కలోకి తీసుకుంటూనే, వ్యవసాయ కార్యక్రమాన్ని నిష్కర్షగానూ స్పష్టంగానూ నేను సూత్రీకరించాను.

అయితే ఇంకొక సాధ్యత కూడా వుంది; బూర్జువావర్గపు ప్రభావానికి లొంగిపోయి, దేశరక్షణతత్వ శిబిరంలో చేరిపోయినట్టీ, రాజ్యాంగ నిర్ణయ పరిషత్తు సమావేశపు తేదీ ఇంతవరకు నిర్ణయించబడకపోయినప్పటికీ*, పరిషత్తు వరకూ ఆగడం మంచిదని

---

* నా మాటలకు అపార్థం కల్పించే అవకాశం లేకుండా వుండేందుకని, నేను ముందుగానే ఒక విషయం చెబుతున్నాను: యావత్తు భూమినీ వ్యవసాయ కూలీల, రైతుల సోవియట్లు తక్షణం వశపరచుకోవడమే నా సంపూర్ణ అభిమతం; కఠినాతికఠినమైన క్రమాన్నీ క్రమశిక్షణనూ వాటంతట అవే పాటించాలి, యంత్రపరికరాలకూ భవనాలకూ పశువులకూ

సలహాచెబుతూన్నట్టే పెట్టీబూర్జువా సోషలిస్టు-రివల్యూషనరీ పార్టీ సలహానే రైతాంగం వినడమూ సాధ్యమే!

తాము బూర్జువావర్గంతో కుదుర్చుకున్న బేరాన్ని, కార్మికుల సైనికుల ప్రతినిధుల సోవియట్లద్వారా తామిప్పుడు లాంఛనప్రాయంగానే కాకుండా యథార్థంగా కుదుర్చుకున్న బేరాన్ని పాటించుతూ, ఇంకా సాగించుతూనే వుంటారనేది సాధ్యమే.

అనేక సంగతులు సాధ్యమవుతాయి. వ్యవసాయ ఉద్యమాన్నీ, వ్యవసాయ కార్యక్రమాన్నీ మరచిపోవడం ప్రగాఢమైన పొరపాటే అవుతుంది. కాని యథార్థతను మరచిపోవడం కూడా ఇంతటితో సమానమైన పొరపాటే కాగలదు; కాగా బూర్జువావర్గ, రైతాంగాల మధ్య ఒక ఒప్పందం, లేదా — ఇంతకంటె మరింత నిశితమైనట్టీ, ఇంతకంటె కాస్తతక్కువ న్యాయశాస్త్రీయ పదాన్నీ, అయినప్పటికీ ఇంతకంటె మరింత నిశితమైన వర్గ-ఆర్థిక పదాన్నీ, ఉపయోగించాలంటే — వర్గ సహకారం వున్నదనే వాస్తవవిషయాన్ని యథార్థత మనికి బహిర్గతపర్చుతూంది.

ఈ వాస్తవవిషయం ఎప్పటినుండైతే ఇక వాస్తవవిషయం కాకపోతుందో, ఎప్పుడైతే రైతాంగం బూర్జువావర్గం నుండి వేరైపోయి, బూర్జువావర్గాన్ని లక్ష్యపెట్టకుండా భూమినీ అధికారాన్నీ తనగుప్పిట్లోకి తెచ్చుకుంటుందో అప్పుడే బూర్జువా-ప్రజాస్వామిక విప్లవంలో ఒక కొత్త దశ వచ్చిందన్నమాట; కాగా దీని గురించి విడిగా ప్రస్తావించుదాం.

ఇటువంటి దశ భవిష్యత్కాలంలో సాధ్యం కావచ్చుననే కారణంచేత, బూర్జువా వర్గంతో రైతాంగం ఒప్పందం కుదుర్చుకున్న ప్రస్తుత సమయంలో తన విధ్యుక్తధర్మాన్ని మరచిపోయినట్టి మార్క్సిస్టు, పెట్టీబూర్జువాగా మారిపోయాడన్నమాటే. ఎందుచేతంటే, ఆచరణలో అట్టి మార్క్సిస్టు, పెట్టీబూర్జువావర్గంలో విశ్వాసం వుంచమని శ్రామికవర్గానికి (“బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం ఇంకా జరుగుతూవుండే సమయంలో, పెట్టీబూర్జువా వర్గమూ రైతాంగమూ బూర్జువావర్గం నుండి వేరైపోవాలి”) బోధించుతాడు. అట్టి వాడు ఇంత సంతోషకరమైనట్టీ, మధురమైనట్టీ భవిష్యత్తు “సాధ్యం” కావచ్చుననే కారణాన, ఏ భవిష్యత్తులోనైతే రైతాంగం బూర్జువావర్గపు తోకగా ఇక వుండదో, ఏ భవిష్య

---

వేటికిగాని కించిత్తు అయినా నష్టం కల్గకుండేలాగున జాగ్రత్త వహించాలి, ఎందుచేతంటే సైనికులకు మునుపటికంటె రెండింతలు తినుబడి సామగ్రి అవసరం కాబట్టీ, ప్రజలను ఆకలి బాధనుండి రక్షించించాల్సి వుంది కాబట్టీ వ్యవసాయానికీ ధాన్యం ఉత్పత్తికీ ఎట్టి భంగమూ కల్గకుండా వుండేటట్టే కాకుండా, ఇవి మరింత అభివృద్ధిపొందేటట్టు అవి చూడాల్సి వుంటుంది.

త్తులోనైతే సోషలిస్టు-రివల్యూషనరీలూ, ఛెయిద్‌జెలూ, త్సెరెతేలిలూ, స్తెక్లోవ్‌లూ బూర్జువా ప్రభుత్వపు అనుబంధాలుగా వుండరో అట్టి సంతోషకరమైన భవిష్యత్తు "సాధ్యం" కావచ్చుననే కారణాన, ఇంకా బూర్జువావర్గపు తోకగానే వుంటూన్నట్టీ, సోషలిస్టు-రివల్యూషనరీలూ, సోషల్-డెమొక్రాట్లూ బూర్జువా ప్రభుత్వపు అనుబంధంగా వుండే పాత్రను, "ఘనతవహించిన" ల్వోవ్ "రాజుగారి ప్రతిపక్షంగా"[142] వ్యవహరించే పాత్రను ఇంతవరకూ వదలిపెట్టనట్టీ జుగుప్సాకరమైనట్టీ వర్తమానకాలాన్ని మరచిపోతూ వుంటాడు.

ఇట్టి కల్పిత వ్యక్తి తీపి వోడుతూన్న ఏ లూయీ బ్లాంక్‌నో, లేక పాకంపట్టిన ఏ కౌట్‌స్కీయవాదినో పోలివుంటాడే గాని, విప్లవాత్మక మార్క్సిస్టును మాత్రం పోలివుండడు.

కాని, స్వకీయగతాత్మకానికి లొంగిపోయేటట్టి, బూర్జువా-ప్రజాస్వామిక విప్లవాన్ని — ఇంకా పరిసమాపత్తం కానట్టీ, రైతు ఉద్యమాన్ని ఇంకా పూర్తిగా అలసటపరచనట్టీ బూర్జువా-ప్రజాస్వామిక విప్లవాన్ని — "కుప్పిగంతుతో దాటేసి," సోషలిస్టు విప్లవాన్ని చేరుకోనాశించే ప్రమాదంలో లేమా మనం?

"జార్ వుండకూడదు, కార్మికుల ప్రభుత్వం వుండాలి"[143] అని నేను అనివుంటే నేను కూడా అట్టి ప్రమాదానికి లోనై వుండేవాడినే. కాని నేను అలా అనలేదు. నేన్నది వేరు. కార్మికుల, వ్యవసాయకూలీల, సైనికుల, రైతుల ప్రతినిధుల సోవియట్ల ప్రభుత్వం తప్ప మరొక ప్రభుత్వం (బూర్జువా ప్రభుత్వపు విషయం అలా వుంచి) రష్యాలో వుండడానికే వీల్లేదు అని నేనన్నాను. నేడు రష్యాలో అధికారం గుచ్‌కోవ్, ల్వోవ్‌లనుండి కేవలం ఈ సోవియట్లకే సంక్రమించాలని నేనన్నాను. కాగా ఈ సోవియట్లలో రైతులే అధికప్రాబల్యం కలిగి వున్నారు, సైనికులే అధికప్రాబల్యం కల్గివున్నారన్నదే వాస్తవవిషయం — సామాన్యము, లౌకికము, వృత్తిసంబంధము అయినట్టి పదం కాకుండా, శాస్త్రీయమైన మార్క్సిస్టు పదం, వర్గాన్ని సూచించే పదం, ఉపయోగించి చెప్పాలంటే, పెట్టీబూర్జువావర్గమే అధికప్రాబల్యం కల్గివుంది.

ఇంకా పూర్తిగా అలసటపడనట్టి రైతు ఉద్యమాన్నీ, లేదా సాధారణంగా పెట్టీ బూర్జువా ఉద్యమాన్నీ కుప్పిగంతుతో దాటవేయకుండానూ, కార్మికుల ప్రభుత్వంచే "అధికారం చేజిక్కించుకోవడమ"నే ఆటలాడడమునకు లోనుకాకుండానూ, ఏ రకమైన బ్లాంకిస్టు దుస్సాహసానికీ లొంగిపోకుండానూ సంగ్రహ సూత్రీకరణలలో నేను నిష్కర్షగా జాగ్రత్తపడ్డాను; ఎందుచేతంటే పారిస్ కమ్యూన్ అనుభవం గురించి నేను కచ్చితంగా ప్రస్తావించాను. కాగా మనం ఎరిగినట్లు, 1871 లో మార్క్సు, 1891 లో ఎంగెల్సు సవివరంగా చూపినట్లు,[144]

బ్లాంకీజాన్ని కచ్చితంగా తోసిపారేసి, అధికసంఖ్యాకవర్గం యొక్క సూటి అయినట్టి, తక్షణము, నిరాక్షేపము అయినట్టి పరిపాలననూ, అధికసంఖ్యాకవర్గపు సొంత కార్యశీలత ఎంతవరకూ చైతన్యం కలిగివుంటుందో, కేవలం ఆమేరకు మాత్రమే ప్రజారాసుల కార్యశీలతనూ కచ్చితంగా నిశ్చయపరుస్తుంది.

ఈ సంగ్రహ సూత్రీకరణలలో, ఈ ప్రశ్న సారాంశం కార్మికుల, వ్యవసాయ కూలీల, రైతుల, సైనికుల ప్రతినిధుల సోవియట్ల లోపలనే పలుకుబడికై ఒక పోరాటం అని తేల్చి చూపాను. ఈ అంశం గురించి ఏ మాత్రపు సంశయచ్ఛాయలు లేకుండా వుండేందుకనే, "ఆచరణలో ప్రజారాసుల అవసరాలకు అనుగుణ్యంగా వుండేటట్టి" ఓరిమితోనూ, పట్టుదలతోనూ సాగించబడే "వివరణాత్మక" క్రియాకలాపంయొక్క ఆవశ్యకతను గురించి ఈ సంగ్రహ సూత్రీకరణలలో రెండు సార్లు నొక్కిచెప్పాను.

అజ్ఞానులైన వ్యక్తులు, లేదా మిస్టర్ ప్లెహానొవ్ లాంటి స్వపక్షపరిత్యాగులు అరాచకవాదమనీ, బ్లాంకీజమూ, వగైరాలనీ గావుకేకలు పెట్టవచ్చు, కాని, కార్మికుల వ్యవసాయ కూలీల, సైనికుల, రైతుల ప్రతినిధుల సోవియట్లు ప్రజారాసులలో అత్యధికసంఖ్యాకవర్గం యొక్క సూటీ, సన్నిహితమూ అయిన ఆర్గనైజేషను అని సర్వాంగీకృతం అయివుండగా, బ్లాంకీజమంటే అల్పసంఖ్యాకవర్గంచే అధికారం హస్తగతం చేసుకోవడమనీ వివేచనా శక్తిని ఉపయోగించి విషయాన్ని నేర్చుకొన దలచుకున్నవారు తప్పక అర్థం చేసుకోగల్గుతారు. ఈ సోవియట్ల లోపలనే పలుకుబడికోసం సాగే పోరాటానికి సంబంధించిన క్రియాకలాపం బ్లాంకీజపు చిత్తడి నేలలోకి ఎంత మాత్రమూ పెడదారి పట్టించజాలదు. అంతేకాకుండా అరాజకవాదపు చిత్తడిలోకి సహితమూ అది పెడదారి పట్టించజాలదు, ఎంచేతంటే బూర్జువా పరిపాలన నుండి శ్రామికవర్గ పరిపాలనకు పరివర్తన కాలావధిలో రాజ్యాంగయంత్రం యొక్క, రాజ్యాంగయంత్రాధికారం యొక్క ఆవశ్యకతను నిరాకరించడమే అరాజకవాదం. కాగా, నేను ఎట్టి అపోహలకూ అవకాశం కల్గించనంతటి నిశితంగా, ఈ శకంలో మామూలు బూర్జువా వర్గ పార్లమెంటరీ రాజ్యాంగయంత్రం కాకుండా, మార్క్స్ చెప్పినట్టుగానూ, పారిస్ కమ్యూన్ అనుభవానికి అనుగుణ్యంగానూ, స్థాయీ సైన్య రహితమైనట్టి, ప్రజలతో విరోధించుతూన్న పోలీసు బల రహితమైనట్టి, ప్రజలకు అతీతంగా వ్యవహరించే అధికారవర్గ రహితమైనట్టి, రాజ్యాంగయంత్రం అవసరమని నేను గట్టిగా నొక్కిచెబుతున్నాను.

ఇది అరాజకవాదమని తన పత్రిక "యెదీన్‌స్ట్వో" లో మిస్టర్ ప్లెహానొవ్ గొంతు చించుకుని అరుస్తూంటే మాత్రం, మార్క్సిజంతో తాను తెగతెంపులు చేసుకున్నట్టు మళ్లీ మరొకసారి రుజువుచేయడం తప్ప ఇది మరేమీ కాదు. రాజ్యాంగయంత్రం విషయమై 1871, 1872, 1875 లలో మార్క్స్, ఎంగెల్స్‌లు ఏమి బోధించారో తాను తెలుపవలిసిందని

"ప్రావ్దా" (నెం. 26) లో నేను చేసిన సవాలుకు ప్రత్యుత్తరంగా, ఈప్రశ్న సారంపైని మిస్టర్ ప్లెహానొవ్ ఇంతవరకూ నోరుమెదపలేదు, ఇకముందు కూడా నోరు మెదపడు, కాగా మరి గత్యంతరంలేక అందుకు బదులు, ఆగ్రహావేశపరమైన బూర్జువావర్గం వలెనే పొలికేకలు పెట్టడంలోకి దిగాడు.

మాజీ మార్క్సిస్టు మిస్టర్ ప్లెహానొవ్ రాజ్యాంగయంత్రం గురించి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఏ మాత్రమూ అర్థం చేసుకోలేదు. అరాజకవాదంపై అతడు రాసిన జర్మన్ పాంఫ్లెట్‌లో[145] కూడా ఈ ప్రతిపత్తురహిత బీజాలు ప్రదర్శితమవుతున్నాయని మనం ప్రాసంగికంగా చెప్పవచ్చు.

ఏప్రిల్ 1917.

# రాజ్యాంగయంత్రం, విప్లవం

ఖండికలు

## రాజ్యాంగయంత్రం గురించి మార్క్సిస్టు ఉపదేశం, విప్లవంలో శ్రామికవర్గం నిర్వర్తించవలసిన కర్తవ్యాలు

## రెండవ ప్రకరణం

## రాజ్యాంగయంత్రం, విప్లవం. 1848—1851 అనుభవాలు

### 3. 1852 లో మార్క్సుచే ఈ ప్రశ్న ప్రదర్శన *

1852 మార్చి 5 న మార్క్సు, వేడిమేయర్ పేర రాసిన ఉత్తరంనుండి కొన్ని ఖండికలు 1907 లో మేరింగ్ "Neue Zeit" (సంపుటం 25, సంచిక 2, పుట 164) మాసపత్రికలో ప్రచురించాడు. ఇతర విషయాలతోపాటు ఈ దిగువ వివరించిన అద్భుతమైన భావన ఆ ఉత్తరంలో వుంది:

"ఇక నా గురించా అంటే, ఆధునిక సమాజంలో వర్గాలున్నాయన్న విషయాన్ని గానీ, వాటి నడుమనున్న పోరాటాన్నిగానీ ఆవిష్కరించినందుకు నాకు ఏ కీర్తి అవసరంలేదు. ఈ వర్గ పోరాటంయొక్క చారిత్రక క్రమాభివృద్ధిని బూర్జువా చరిత్రకారులూ, వర్గాలయొక్క ఆర్థిక నిర్మాణాన్ని బూర్జువా అర్థశాస్త్రవేత్తలూ నా కంటె ఎంతో ముందుకాలంలోనే వర్ణించారు. నేను కొత్తగా చెప్పినదేమంటే: 1) ఉత్పత్తి క్రమాభివృద్ధిలో సంభవించే నిర్దిష్ట చారిత్రక దశలతో (historische Entwicklungsphasen der Produktion) మాత్రమే వర్గాల ఉనికి ముడిపడి

* ఈ అధ్యాయం రెండవ కూర్పులో చేర్చబడింది.

ఉంటుంది, 2) శ్రామికవర్గ నియంతృత్వానికి వర్గపోరాటం తప్పనిసరిగా దారి తీస్తుంది, 3) వర్గాలన్నీ అంతమొందడానికీ, వర్గరహిత సమాజ ప్రాదుర్భావానికీ ఈ నియంతృత్వమే ఒక పరివర్తన దశగా ఏర్పడుతుంది, అని నిరూపించడమే....''

అత్యంత గంభీరులైన బూర్జువావర్గ భావుకులలో అగ్రగణ్యుల బోధనకూ తన బోధ నకూగల ముఖ్యమైనట్టీ మౌలికమైనట్టీ భేదాన్ని మొదటి విషయంగానూ, రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి తన ఉపదేశసారాన్ని రెండవ విషయంగానూ, ఆశ్చర్యమైనట్టి విస్పష్టతతో మార్క్స్ విశదీకరించగలిగాడు.

వర్గపోరాటమే మార్క్స్ ఉపదేశాలలో ప్రధానమైన విషయమని తరుచుగా చెప్పడం రాయడం జరుగుతూంది; కాని ఇది సత్యంకాదు. కాగా మార్క్సిజానికీ అవకాశవాద వికృతార్థ కల్పనలకూ, బూర్జువా వర్గానికి అంగీకృతమయేటట్టుగా మార్క్సిజాన్ని అసత్య పరచడము నకూ తరుచు ఈ అసత్యమే కారణమవుతూంది. ఎందుచేతనంటే వర్గపోరాట సిద్ధాంతం మార్క్స్ సృష్టం కాదు, కాగా మార్క్స్ ముందరి బూర్జువా వర్గపు సృష్టమే; స్థూలంగా చెప్పాలంటే ఇది బూర్జువా వర్గానికి అంగీకృతమే. ఒక్క వర్గపోరాటాన్ని మాత్రమే గుర్తించే వారు ఇంకా మార్క్సిస్టులుకారు; అట్టివారింకా బూర్జువావర్గ ఆలోచనా పరిమితులలోనూ బూర్జువావర్గ రాజకీయాల పరిమితులలోనూ స్థిరపడి ఉండిపోతున్నారు. వర్గపోరాట సిద్ధాంత పరిధిలో మార్క్సిజాన్ని కట్టిపడేయడమంటే దాని అర్థం మార్క్సిజాన్ని కత్తిరించి వేయడమే, దానిని వికృతపర్చడమే, దానిని బూర్జువావర్గానికి అంగీకృతమయేటట్టుగా ఏదో ఒక అయో మయంకిందకి దిగజార్చేయడమే. వర్గపోరాటం గుర్తింపును శ్రామికవర్గ నియంతృత్వపు గుర్తింపు వరకూ విస్తరింపజేసేవాడే మార్క్సిస్టు అనిపించుకుంటాడు. సామాన్య పెట్టీబూర్జువాకీ (బడాబూర్జువాకీ కూడా) మార్క్సిస్టుకీ ఉన్నటువంటి ప్రగాఢమైన భేదం ఇందులోనే ఉంది. మార్క్సిజాన్ని వాస్తవంగా అర్థంచేసుకొన్నదీ గుర్తించినదీ తెలుసుకోవడానికి ఇదే గీటు రాయి. ఈ ప్రశ్నను ఆచరణీయమైన ఆశయంగా కార్మికవర్గం ఎదుట యూరప్ చరిత్ర ఎప్పుడైతే నిలబెట్టిందో అప్పుడు యావన్మంది అవకాశవాదులూ సంస్కరణవాదులేకాకుండా, అందరు ''కౌట్‌స్కీయవాదులు'' (సంస్కరణవాదమూ మార్క్సిజమూ మధ్య ఊగిసలాడే టట్టివారు) కూడా శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిరాకరించే దౌర్భాగ్యపు ఫిలిస్టైన్లు అనీ, పెట్టీబూర్జువా ప్రజాతంత్రవాదులనీ రుజువైపోవడంలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. 1918 ఆగస్టులో, అనగా ఈ పుస్తకం మొదటి కూర్పు ప్రచురించబడిన దీర్ఘకాలం తరు వాత, వెలువడిన కౌట్‌స్కీ విరచితమైన ''శ్రామికవర్గ నియంతృత్వం'' అనే చిన్నపుస్తకం, పెట్టీబూర్జువా వర్గంచే మార్క్సిజాన్ని వికృతపరచడానికి కపట వాక్కులతో మార్క్సిజాన్ని

గుర్తించుతూనే ఆచరణలో దానిని నీచంగా నిరాకరించడానికి చక్కని ఉదాహరణ (చూ. నేను రాసిన చిన్నపుస్తకం: "శ్రామిక విప్లవమూ, స్వపక్షపరిత్యాగి కౌట్‌స్కీ," పెట్రోగ్రాడ్, మాస్కో, 1918).

తన ప్రముఖ ప్రతినిధీ మాజీమార్క్సిస్టూ అయిన కె. కౌట్‌స్కీ రూపంలో అవతరించినట్టి నేటి అవకాశవాదానికి, పై ఉదాహరణలో మార్క్స్ గావించిన బూర్జువావర్గ ప్రవర్తనాస్వభావ వర్ణన అచ్చు గుద్దినట్టు సరిపోతూంది; ఎందుచేతంటే ఈ అవకాశవాదం, వర్గపోరాటపు గుర్తింపును బూర్జువా పరిస్థితులకే పరిమితం చేస్తూంది. (వర్గపోరాటాన్ని ఈ పరిమితులలో, ఈ చట్రంలో వర్గపోరాటాన్ని "సూత్రప్రాయంగా" గుర్తింప నిరాకరించేవాడు విద్యావంతులైన ఉదారవాదులలో ఒక్కడైనా ఉండడు!) పెట్టుబడిదారీ విధానం నుండి కమ్యూనిజానికి పరివర్తన చెందే సంధికాలానికి, బూర్జువావర్గాన్ని కూలదోసి దానిని పూర్తిగా రద్దు గావించే కాలానికి, ఈ దిగ్గంతికి వర్తించేటట్టుగా వర్గపోరాటపు గుర్తింపును అవకాశవాదం విస్తరింప నిరాకరిస్తుంది. వాస్తవానికి, ఈ కాలం అది వరకెన్నడూ ఎరుగనంతటి ఉధృత రూపాలలో, అది వరకెన్నడూ ఎరుగనంతటి బలాత్కారసహితమైన వర్గపోరాటం అనివార్యంగా జరిగే కాలం; తదానుషంగికంగా ఈ కాలంలో రాజ్యాంగయంత్రం (శ్రామిక వర్గంపట్ల, అసలు సాధారణంగా నిరాస్తిపరులపట్ల) ఒక కొత్త పంథాలో వున్నట్టి ప్రజాస్వామ్యంగానూ, (బూర్జువావర్గ వ్యతిరేకంగా ఒక కొత్త పంథాలో వున్నట్టి నియంతృత్వ రాజ్యాంగయంత్రంగానూ ఉండి తీరడం అనివార్యం.

ఇక ముందుకు సాగుదాం. సాధారణంగా ప్రతివర్గసహిత సమాజానికేకాకుండా, బూర్జువావర్గాన్ని కూలదోసిన శ్రామికవర్గానికే కాకుండా, "వర్గరహిత సమాజంనుండి," కమ్యూనిజం నుండి, పెట్టుబడిదారీ విధానాన్ని వేరుపరచే యావత్తు చరిత్రకాలావధికి, ఒకే ఒక వర్గం యొక్క నియంతృత్వం అవసరమని ఎవరు గ్రహించుతారో, వారే రాజ్యాంగయంత్రాన్ని గూర్చి మార్క్స్ బోధించిన ఉపదేశసారాన్ని కుణ్ణంగా అధ్యయనం చేసిన వారవుతారు. బూర్జువా రాజ్యాంగయంత్రాల రూపాలు అత్యంత వైరుధ్యాన్ని కలిగివుంటాయి; కాని వాటి సారం ఒక్కటే: వాటి రూపం ఎలాగున్నప్పటికీ, అంతిమ విశ్లేషణలో వాటి సారం అనివార్యంగా ఒక్కటే అవుతుంది: అది బూర్జువావర్గ నియంతృత్వం. పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తన జరిగేటప్పుడు, ఈ పరివర్తననుండి అసంఖ్యాకములైనట్టి అత్యంత వైవిధ్యాన్ని కలిగినట్టి రాజకీయ రూపాలు ఉత్పన్నములవుతాయి, కాని వాటి సారం మాత్రం అనివార్యంగా ఒక్కటే అవుతుంది: అది శ్రామికవర్గ నియంతృత్వం.

## ఐదవ ప్రకరణం

# రాజ్యాంగయంత్రం హరించిపోవడానికి ఆర్థిక ప్రాతిపదిక

ఈ ప్రశ్నను మార్క్స్ తన ''గోతా కార్యక్రమ విమర్శ''లో (1891 "Neue Zeit," సంపుటి 9, సంచిక 1 లో అచ్చుపడేవరకూ ప్రకటింపబడనట్టి, తరువాత రష్యన్ భాషలో ప్రత్యేక ముద్రణలో ప్రకటితమైనట్టి, 1875 మే 5 న బ్రాకె పేర రాసిన ఉత్తరంలో), ఆమూలాగ్రంగా వివరిస్తాడు. లాసాల్‌తత్వంపై విమర్శను గలిగినట్టి అద్భుతమైన ఈ గ్రంథంయొక్క తర్కవాద పూరితమైన భాగం, గ్రంథంయొక్క భావగర్భితమైన భాగాన్ని, కమ్యూనిజానికీ రాజ్యాంగయంత్రం హరించిపోవడానికీగల సంబంధంయొక్క విశ్లేషణను కలిగివున్న భాగాన్ని, ఒక విధంగా మరుగుపరిచేసింది.

## 1. మార్క్స్‌చే ఈ ప్రశ్న ప్రదర్శన

ఇదివరలో మనం పరిశీలించినట్టి, బేబెల్ పేర ఎంగెల్స్ 1875 మార్చి 28 న రాసిన ఉత్తరంతో, 1875 మే 5 న బ్రాకె పేర మార్క్స్ రాసిన ఉత్తరాన్ని పైపైనే సరి పోల్చి చూచినట్టయితే, ఎంగెల్స్‌కంటె మార్క్స్ హెచ్చు దృఢచిత్తుడైన ''రాజ్యాంగయంత్ర పరిరక్షకుడు'' అయినట్టూ, రాజ్యాంగయంత్ర సమస్యపై రచయితలిద్దరి అభిప్రాయాల్లోనూ గణనీయమైన వ్యత్యాసమే ఉన్నట్టూ అగపడవచ్చు.

రాజ్యాంగయంత్రాన్ని గురించి ప్రేలాపనంతా మానుకోవడమే మంచిదనీ; కార్యక్రమం నుండి ''రాజ్యాంగయంత్రం'' అనే మాటనే ఏకంగా తీసివేసి, దాని బదులు ''ప్రజా సంఘం'' అనే మాట ఉపయోగించవలసిందనీ, ఎంగెల్స్ బేబెల్‌కి సూచించాడు. రాజ్యాంగయంత్రం అనే అర్థంలో కమ్యూన్ ఇక రాజ్యాంగయంత్రం కానేకాదని కూడా ఉద్ఘోషించాడు. ఇదిలా వుండగా, ''కమ్యూనిస్టు సమాజంలో భావి రాజ్యాంగయంత్ర వ్యవస్థ'' అని, అనగా కమ్యూనిజంకింద సహితమూ రాజ్యాంగయంత్రం అవసరాన్ని తాను గుర్తించినట్టుగా మార్క్స్ అన్నాడు.

కాని, ఈ అభిప్రాయం మౌలికంగా తప్పే అవుతంది. ఇంకా లోతుగా పరిశీలించినట్టయితే, రాజ్యాంగయంత్రంపైనా, రాజ్యాంగయంత్రం హరించిపోవడంపైనా మార్క్స్, ఎంగెల్స్‌ల అభిప్రాయాలు సంపూర్ణంగా ఒకటే అనీ, హరించిపోతూన్న ఈ

రాజ్యాంగయంత్ర సంస్థకే పైన మనం ఉదాహరించిన మార్క్స్ వాక్యం కూడా అచ్చంగా అన్వయిస్తుందనీ విశదమవుతుంది.

''హరించిపోవడం'' అనేది భవిష్యత్తులో సరిగ్గా ఒక ఖచ్చితమైనసమయంలో – అందులోనూ ఈ విధానం బహుకాలం తీసుకుంటుందనే విషయం ప్రత్యక్షంగా కనబడుతూనే ఉన్నప్పుడు – జరుగుతుందని ఇదమిద్ధంగా చెప్పడమనే ప్రశ్నే ఉదయించదనేది స్పష్టంగా కనబడుతూనే ఉంది. మార్క్స్, ఎంగెల్స్‌లమధ్య అభిప్రాయభేదం ఉన్నట్టు అగపడడానికి కారణం, వారిద్దరూ వేర్వేరు విషయాలను పరిశీలించుతూ, వేర్వేరు లక్ష్యాలను కలిగివుండడమే తప్ప మరేమీకాదు. రాజ్యాంగయంత్రం విషయమై మామూలుగా చెలామణీలోవున్న (కాగా చాలావరకూ లాసాల్‌కి కూడా భాగస్వామ్యమున్న) దురభిమానంలో ఉండే కేవల అసంబద్ధాన్ని స్పష్టంగానూ, నిశితంగానూ, స్థూలంగానూ బేబెల్‌కు తెలియజెప్పడానికి ఎంగెల్స్ పూనుకొన్నాడు. మరో ఇతర విషయాన్ని, అనగా కమ్యూనిస్టు సమాజంయొక్క క్రమాభివృద్ధిని, మార్క్స్ పరిశీలించుతూ, కేవలం ప్రసంగవశాత్తూ మాత్రమే ఈ ప్రశ్నను తడిమాడు.

క్రమాభివృద్ధి సిద్ధాంతాన్ని అత్యంత సుసంగతంగానూ, సమగ్ర, సమాలోచిత, సమాహృత రూపంలోనూ – ఆధునిక పెట్టుబడిదారీ విధానానికి వినియుక్తం చేయడమే మార్క్స్‌యొక్క సంపూర్ణ సిద్ధాంతం. పెట్టుబడిదారీ విధానంయొక్క భవిష్యత్ పతనమూ, భావి కమ్యూనిజంయొక్క భావి క్రమాభివృద్ధి, ఈ రెంటికీ కూడా ఈ సిద్ధాంతాన్ని వినియుక్తం చేయడమనే సమస్యను సహజంగానే మార్క్స్ ఎదుర్కోవలసి వచ్చింది.

ఇలాంటప్పుడు ఏ దత్తాంశాలను ఆధారం చేసుకొని భావి కమ్యూనిజంయొక్క భావి క్రమాభివృద్ధి సమస్యను పరిశీలించడానికి వీలుపడుతుంది?

దాని మూలం పెట్టుబడిదారీ విధానంలోనే ఉందనీ, పెట్టుబడిదారీ విధానంనుండి అది చారిత్రకంగా క్రమాభివృద్ధిని పొందుతుందనీ, పెట్టుబడిదారీ విధానమే ఆవిర్భవింపజేసిన సామాజికశక్తి క్రియయొక్క ఫలితమే అది, అనే వాస్తవవిషయ ప్రాతిపదికపైనే. ఊహాజనితమైన విధానాన్ని కల్పనజేయడం, తెలుసుకోజాలని విషయాలను గురించి ఉబుసుపోని కథలల్లడం, ఇట్టి ప్రయత్నంయొక్క జాడ మార్క్స్‌లో లేశమైనా కనబడదు. ఉదాహరణకు, జీవశాస్త్రంలో ఒక కొత్త రకం జీవి ఆవిష్కరింపబడినప్పుడు, దాని ఉత్పత్తి ఫలానా ఫలానా విధంగా ఉందనీ, ఖచ్చితమైనట్టి ఫలానా ఫలానా దిశలో అది మార్పును చెందుతూందనీ తెలుసుకొన్న తరువాత, ప్రకృతిశాస్త్రజ్ఞుడు ఎలాగైతే దాని క్రమాభివృద్ధి సమస్యను పరిశోధించుతాడో ఆ విధంగానే, మార్క్స్ కమ్యూనిజం సమస్యను పరిశోధించుతాడు.

రాజ్యాంగయంత్రానికీ సమాజానికీగల సంబంధం విషయంలో గోతా కార్యక్రమం తీసుకొచ్చిపెట్టిన గందరగోళాన్ని మార్క్స్ మొదట తోసివేస్తాడు. అతడు ఇలా రాస్తాడు:

"...కొద్దిగానో గొప్పగానో మధ్యయుగపు మిశ్రమంలేకుండా ఉన్నట్టి, అథవా ప్రతి దేశం యొక్క ప్రత్యేక చారిత్రక క్రమాభివృద్ధి కొద్దిగానో గొప్పగానో మార్పు చెందినట్టి, కొద్దిగానో గొప్పగానో క్రమాభివృద్ధి చెందినట్టి, అన్ని నాగరిక దేశాల్లో మనుతూన్నట్టి పెట్టుబడిదారీ విధానమే నేటి సమాజం. ఇదిలా ఉండగా, దేశం యొక్క సరిహద్దులు మారడంతో 'నేటి రాజ్యాంగయంత్రం' కూడా మారుతూంది. స్విట్జర్లెండ్‌లో ఉన్న రాజ్యాంగయంత్రంకంటె ప్రష్యన్-జర్మన్ సామ్రాజ్యంలో ఉన్నది వేరుగా ఉంది, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోకంటె ఇంగ్లండులో అది వేరుగా ఉంది. అందుచేత 'నేటి రాజ్యాంగయంత్రం' అనేది కల్పన తప్ప మరేమీకాదు.

"తత్రాపి, వాటి రూపవైవిధ్యం ఎలాగున్నప్పటికీ, వివిధ నాగరిక దేశాలలో ఉన్న వివిధ రాజ్యాంగయంత్రాలన్నిటికీ, ఒక సామాన్య స్వభావం వుంది; అదేమిటంటే, కొద్దిగానో గొప్పగానో పెట్టుబడిదారీ విధాన మార్గంలోనే క్రమాభివృద్ధిని చెందిన ఆధునిక బూర్జువా సమాజ పునాదులనే అవి కలిగివుండడం. ఇందువల్ల వాటన్నిటికీ కొన్ని ముఖ్యమయిన సామాన్య లక్షణాలు కూడా ఉన్నాయి. ఈ అర్థంతో మాత్రమే ఈనాడు దానికి మూలకందంగావున్న బూర్జువావర్గ సమాజం నశించిపోయే భావి కాలానికి భిన్నంగా, 'నేటి రాజ్యాంగయంత్రవ్యవస్థ' అని వాడడానికి వీలవుతుంది.

"ఇప్పుడు ఈ ప్రశ్న ఉదయించుతూంది: కమ్యూనిస్టు సమాజంలో రాజ్యాంగ యంత్రం ఎట్టి పరివర్తన పొందుతుంది? దీనినే వేరుమాటల్లో చెప్పాలంటే, రాజ్యాంగయంత్రం యొక్క వర్తమాన వ్యాపారాలతో సాదృశ్యాన్నిగల సామాజిక వ్యాపారాలు ఏవి అక్కడింకా మిగిలి వుంటాయి? ఈ ప్రశ్నకు శాస్త్రయుక్తంగా మాత్రమే సమాధానం చెప్పడానికి వీలవుతుంది; అంతేనేకాని 'రాజ్యాంగయంత్రము' అనే మాటతో 'ప్రజ' అనే మాటను వెయ్యివిధాల కలిపిచెప్పినంత మాత్రాన ఈ సమస్యను పరిష్కరించడంలో తలవెంట్రుక వాసి పురోగమనమైనా జరగదు...."

"ప్రజా రాజ్యాంగయంత్రం" గురించిన ప్రేలాపనను ఈ విధంగా ఎగతాళి చేసిన తరువాత, ప్రశ్నను మార్క్స్ సూత్రీకరించి, దృఢంగా స్థాపించబడినట్టి శాస్త్రీయములైన దత్తాంశాలను ఉపయోగించడంవల్ల మాత్రమే దీనికి శాస్త్రసమ్మతమైన సమాధానం దొరకగలదని ఒక విధంగా మార్క్స్ మనకి హెచ్చరిక చేస్తాడు.

క్రమాభివృద్ధి సిద్ధాంతమంతా, మొత్తం విజ్ఞానశాస్త్రమంతా అతి సునిశితంగా స్థాపించిన మొట్టమొదటి విషయం — ఊహాజగన్నిర్మాతలచే ఇదివరకు విస్మరించబడినట్టి, సోషలిస్టు విప్లవమంటే భీతిచెందే ఈనాటి అవకాశవాదులచే విస్మరింపబడుతూన్నట్టి విషయం ఏమిటంటే — పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిస్టు విధానానికి పరివర్తన చెందడంలో నిస్సందేహంగా ఒక ప్రత్యేక దశ, లేదా ఒక ప్రత్యేక అవస్థ చారిత్రకంగా ఉండితీరాలి.

# 2. పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తన

మార్క్స్ ఇంకా ఇలా అంటాడు:

"...పెట్టుబడిదారీ విధాన సమాజం కమ్యూనిస్టు సమాజం నడుమ, మొదటి దానినుండి రెండవ దానిలోకి మారే విప్లవాత్మక పరివర్తన కాలావధి ఉంటుంది. దీనికి అనుగుణ్యంగా, రాజకీయ పరివర్తన కాలావధి కూడా ఉంటుంది; ఈ దశలో రాజ్యాంగయంత్రం విప్లవాత్మక శ్రామికవర్గ నియంతృత్వం తప్ప మరొకటి కానేరదు...."

ఆధునిక పెట్టుబడిదారీ సమాజంలో శ్రామికవర్గపాత్ర విశ్లేషణనూ, ఈ సమాజాభివృద్ధికి సంబంధించిన దత్తాంశాలనూ శ్రామికవర్గ బూర్జువావర్గాల ప్రయోజనాల పరస్పర వైరాన్నీ తన పర్యవసానానికి మార్క్స్ ఆధారంగా చేసుకుంటాడు.

ఈ ప్రశ్నను ఇంతకముందు ఈ రూపంలో వేసేవారు: శ్రామికవర్గం తన విముక్తిని సాధించుకోవడానికి బూర్జువావర్గాన్ని కూలదోసి, రాజకీయ శక్తిని హస్తగతం చేసుకుని, తన విప్లవాత్మక నియంతృత్వాన్ని స్థాపించాలి.

ఈ ప్రశ్ననే ఇప్పుడు కొద్దిగా మారో రూపంలో వేస్తున్నారు: పెట్టుబడిదారీ విధాన సమాజంనుండి — కమ్యూనిజం అభిముఖంగా అభివృద్ధి చెందుతూన్న పెట్టుబడిదారీ విధానం నుండి — కమ్యూనిస్టు విధాన సమాజానికి పరివర్తనం "రాజకీయ పరివర్తన శకం" లేనిదే సాధ్యంకాదు; కాగా ఈ కాలావధిలో రాజ్యాంగయంత్రం శ్రామికవర్గ విప్లవాత్మక నియంతృత్వంగానే ఉండితీరుతుంది.

ఇలాగున్నప్పుడు ఈ నియంతృత్వంతో ప్రజాస్వామ్యానికి ఉన్న సంబంధం ఎటువంటిది?

"శ్రామికవర్గాన్ని పాలకవర్గపు స్థితికి పైకి తీసుకు రావడము," "ప్రజాస్వామ్యం కొరకు యుద్ధంలో విజయాన్ని చేపట్టడము," ఈరెండు భావాలనూ "కమ్యూనిస్టు ప్రణాళిక"లో కేవలం ఒకదాని సరసను ఒకదానిని పెట్టి ఉంచింది. పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తనం చెందడంలో ప్రజాస్వామ్యం ఎట్టి మార్పులు చెందుతుందో, పైని చెప్పినదానినంతటినీ ఆధారంగా చేసుకొని, మరింత నిశితంగా నిర్ధారించడానికి వీలవుతూంది.

పెట్టుబడిదారీ విధాన సమాజంలో, — దాని అభివృద్ధి అత్యంత అనుకూల పరిస్థితులలోనే గనుక జరిగిన పక్షమందు — కాస్త హెచ్చుతగ్గుగా సంపూర్ణ ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్య రిపబ్లిక్‌లో మనకి తటస్థపడుతుంది. కాని పెట్టుబడిదారీ విధాన దోపిడీచే నిర్ణయించబడిన సంకుచిత పరిమితులోనే ఈ ప్రజాస్వామ్యాన్ని ఎల్లప్పుడూ నొక్కేస్తున్నాయి; తదానుషంగికంగా, ఇది యథార్థంగా అల్పసంఖ్యాక వర్గానికోసం మాత్రమే, ఆస్తిపరుల వర్గానికోసం మాత్రమే, ధనికులకోసం మాత్రమే ప్రజాస్వామ్యంగా ఎల్లప్పుడూ ఉండిపోతుంది. బానిస యజమానులకే స్వేచ్ఛనిచ్చే పురాతన గ్రీకు రిపబ్లిక్కులలో ఉండినట్టుగానే, పెట్టుబడిదారీ సమజంలో స్వేచ్ఛ ఇంచుమించు ఆలాగే ఉండిపోతుంది. పెట్టుబడిదారీ విధానపు దోపిడీ పరిస్థితుల ఫలితంగా ఆధునిక వేతనపు బానిసలు లేమితో బీదరికంతో ఎంత వరకు క్రుంగిపోతారంటే, ''ప్రజాస్వామ్యం వూసే వారు పట్టించుకోరు,'' ''రాజకీయాల వూసే వారు పట్టించుకోరు;'' మామూలుగా శాంతియుతంగా స్థితిగతులు జరిగిపోతూన్నంత కాలమూ ప్రజా జీవితంలోనూ, రాజకీయ జీవితంలోనూ పాల్గొనడమనేది ప్రజాబాహుళ్యంలో అధికసంఖ్యాకవర్గానికి దుస్సాధ్యమయిపోతుంది.

జర్మనీలో ఆశ్చర్యాన్ని కలిగించేతంతటి దీర్ఘకాలం — ఇంచుమించు అర్ధశతాబ్దికాలం (1871–1914) — రాజ్యాంగబద్ధమైన న్యాయశాస్త్రీయత నిలబడి ఉండడమూ, ఈ కాలంలో ఇతర దేశాలన్నిటిలోకంటె ఈదేశంలో ''న్యాయశాస్త్రీయతను ఉపయోగించుకోవడం'' తెలుసుకొని, ప్రపంచంలో మరే ఇతర దేశంలోకంటే కూడా అధికతరమైన నిష్పత్తిలో కార్మికులనందరినీ ఒక రాజకీయ పక్షంగా ఆర్గనైజు చేయడానికి సోషల్-డెమోక్రాటిక్ పార్టీకి వీలుకలుగడము, అచ్చంగా ఈ కారణంవల్లనే, ఈ వివరణయొక్క యథార్థత జర్మనీ దృష్టాంతంవల్లనే బహుశ అత్యంత విస్పష్టంగా ధ్రువపరచబడుతూంది.

పెట్టుబడిదారీ విధాన సమాజంలో రాజకీయంగా చైతన్యవంతులైనట్టి కార్యశీలురైనట్టి వేతనపు బానిసల గరిష్ఠ సంఖ్యానిష్పత్తి ఇప్పటికి కనిపెట్టబడినంత వరకూ ఎంత ఉంటుంది? కోటీ యాభైలక్షల వేతనపు బానిసలలోనూ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సభ్యులైనవారు పదిలక్షలు! కోటీ యాభై లక్షలలోనూ ట్రేడ్‌యూనియన్లలో ఆర్గనైజు చేయబడిన వారు ముప్పైలక్షలు!

అత్యల్పసంఖ్యాక వర్గానికి ప్రజాస్వామ్యం, ధనికులకు ప్రజాస్వామ్యం — ఇదీ పెట్టుబడిదారీ సమాజంలో వున్న ప్రజాస్వామ్యం. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య యంత్రాంగాన్ని మనం మరింత లోతుగా పరిశీలించినట్టయితే, ''స్వల్పమైన'' — స్వల్పమనే చెప్పబడుతూన్న — ఎన్నికహక్కుల వివరాలలోనూ (నివాస సంబంధమైనట్టి అర్హతలు, స్త్రీల మినహాయింపు, వగైరాలు), ప్రజాప్రాతినిధ్య సంస్థల విధానంలోనూ, సమావేశహక్కు వినియోగంలో యథా

ర్థంగా వున్న అడ్డంకులలోనూ (ప్రజోపయోగ భవనాలు "బిచ్చగాళ్ల" కోసం కాదు!), స్వచ్ఛమైన పెట్టుబడిదారీ విధానపు రీతిలోనే దినపత్రికలు ఆర్గనైజుకాబడి ఉండడములోనూ, వగైరా వగైరాల — వీటన్నిటిలోనూ ఎక్కడ చూచినా ప్రజాస్వామ్యానికి నిర్బంధాలపైన నిర్బంధాలే సర్వత్రా కనబడుతున్నాయి. లేమి అంటే ఏమిటో ఎన్నడూ ఎరగనివాడి దృష్టికి, పీడితవర్గాల రాశిజీవితంతో ఎట్టి సన్నిహిత సంబంధమూ ఎరగనివాడి (బూర్జువా రచయితలలోనూ, బూర్జువా రాజకీయవేత్తలలోనూ పదింట తొమ్మండుగురు కాదుకదా, నూటికి తొంభై తొమ్మండుగురు ఈ రకంవారే) దృష్టికి, పేదవారిపట్ల నిర్బంధాలూ, మినహాయింపులూ, బహిష్కారాలూ, అవరోధాలూ అతిస్వల్పంగానే కనబడతాయి; కాని ఈ నిర్బంధాలన్నీ వాటి మొత్తం ఫలితంగా, రాజకీయాలనుండీ, ప్రజాస్వామ్యంలో క్రియాశీలంగా పాల్గొనడమునుండీ, పేదవారిని మినహాయించి దూరం చేసేస్తున్నాయి.

ప్రతి కొద్ది సంవత్సరాలకీ ఒకసారి పీడకవర్గంలో ఎవరు పార్లమెంటుద్వారా తమకు ప్రాతినిధ్యం వహించి తమను అణగదొక్కి వుంచి పీల్చిపిప్పి చేయవచ్చునో పీడితవర్గం నిశ్చయించుకొనేందుకు అవకాశం ఇవ్వబడుతూందని, కమ్యూన్ అనుభవాన్ని విశ్లేషించుతూ పెట్టుబడిదారీ విధానంయొక్క సారాన్ని మార్క్సు భేషుగ్గా గ్రహించాడు![146]

కాని ఈ పెట్టుబడిదారీవర్గపు ప్రజాస్వామ్యంనుండి — అనివార్యంగా, సంకుచిత స్వభావాన్నే గలిగి, పేదలను ఒక పక్కకు రహస్యంగా నెట్టివేస్తూ, తత్కారణంగా మోసంతోనూ కపటంతోనూ నఖశిఖపర్యంతమూ నిండివున్న ఈ పెట్టుబడిదారీవర్గ ప్రజాస్వామ్యంనుండి — లిబరల్ పండితోత్తములూ, పెట్టీబూర్జువా అవకాశవాదులూ మనను నమ్మమని చెప్పేటట్టు మరింత, మరింత ప్రజాస్వామ్య పురోగమనాభిముఖమైన క్రమాభివృద్ధి సరళంగానూ సూటిగానూ సాఫీగానూ జరగదు. ఎన్నటికీ జరగదు. పురోగమనాభిముఖమైన క్రమాభివృద్ధి, అనగా కమ్యూనిజంవైపు క్రమాభివృద్ధి, శ్రామికవర్గ నియంతృత్వం ద్వారానే జరుగుతుంది తప్ప మరొక విధంగా జరగడానికి వీలులేదు; ఎందుచేతంటే పెట్టుబడిదారీ దోపిడీదార్ల ప్రతిఘటనను మరేయితర విధంగానూ మరెవ్వరి వల్లనూ భగ్నం చేయడం సాధ్యపడదు.

కాగా శ్రామికవర్గ నియంతృత్వం, అనగా పీడకులను తొక్కిపెట్టి వుంచడానికిగాను పీడితుల అగ్రగామిదళంయొక్క ఆర్గనైజేషను, ఫలితంగా కేవలం ప్రజాస్వామ్య విస్తరణ ఒక్కటే సంభవించదు. ప్రజాస్వామ్యం బ్రహ్మాండంగా విస్తరించడంతో పాటుగా మొట్టమొదటి సారిగా పేదప్రజలకు ప్రజాస్వామ్యంగా, ప్రజలకు ప్రజాస్వామ్యంగా, డబ్బుసంచులకే ప్రజాస్వామ్యం కాకుండా, ఏర్పడుతుందో, తదేకసమయంలో పీడకులయొక్క, దోపిడీదార్లయొక్క, పెట్టుబడిదార్లయొక్క స్వేచ్ఛకు కొన్ని నిర్బంధ పరంపరలను శ్రామిక

వర్గ నియంతృత్వం విధిస్తుంది. మానవాళిని వేతనపు బానిసత్వంనుండి విడిపించేందుకు వీరిని మనం తొక్కిపెట్టి వుంచాలి, వీరి ప్రతిఘటనను బలప్రయోగంవల్ల నిర్మూలించాలి; ఎక్కడైతే తొక్కిపెట్టి వుంచడం ఉంటుందో, ఎక్కడైతే బలాత్కారం ఉంటుందో, అక్కడ స్వేచ్ఛ వుండదనేదీ, ప్రజాస్వామ్యం వుండదనేదీ స్పష్టమే.

ఎంగెల్స్ బేబెల్‌కు రాసిన ఉత్తరంలో దీనినే బేషుగ్గా చెప్పాడన్న విషయం పాఠకునికి జ్ఞప్తి వుంటుంది: "రాజ్యాంగయంత్రాన్ని శ్రామికవర్గం స్వేచ్ఛను పెంపొందించడానికోసం ఉపయోగించక, తన ప్రత్యర్థులను అణచిపెట్టి వుంచడానికే ఉపయోగించుతుంది; స్వేచ్ఛను గురించి మాట్లాడడానికి ఎప్పుడైతే వీలుకలుగుతుందో, అప్పుడు రాజ్యాంగయంత్రంగా రాజ్యాంగయంత్రం ఇక ఉండనే ఉండదు."

ప్రజాబాహుళ్యంలో అత్యధికసంఖ్యాక వర్గానికి ప్రజాస్వామ్యమూ, బలప్రయోగం వల్ల, దోపిడీదార్లనూ ప్రజాపీడకులనూ అణచిపెట్టి వుంచడమూ, అనగా వారిని ప్రజాస్వామ్యంనుండి బహిష్కరించడమూ — ఇట్టి మార్పును పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజం పరివర్తనచెందే కాలంలో ప్రజాస్వామ్యం పొందుతుంది.

ఒక్క కమ్యూనిస్టు సమాజంలోనే, పెట్టుబడిదారుల ప్రతిఘటన పూర్తిగా నిర్మూలం చేయబడినప్పుడే, పెట్టుబడిదారులు అంతరించిపోయినప్పుడే, వర్గాలు లేనప్పుడే (అనగా, సామాజిక ఉత్పత్తి సాధనాలపట్ల సమాజ సభ్యులకున్న సంబంధం దృష్ట్యా, వారిమధ్య ఎట్టి భేదమూ లేనప్పుడే), అప్పుడు మాత్రమే "రాజ్యాంగయంత్రం హరించిపోయి," ఇక "స్వేచ్ఛను గురించి మాట్లాడడానికి వీలుకలుగుతుంది." వాస్తవంగా సమగ్రమైన ప్రజాస్వామ్యం, ఎట్టి మినహాయింపు సహితమూ లేనట్టి ప్రజాస్వామ్యం అప్పుడు మాత్రమే వీలవుతుంది, అప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. కాగా అప్పుడు మాత్రమే, పెట్టుబడిదారీ బానిసతనంనుండి, పెట్టుబడిదారీ దోపిడీయొక్క ఎనలేని భీతావహములు, కిరాతకములు, అసంగతములు, అప్రతిష్ఠలనుండి విముక్తి చేయబడిన తరువాతనే, శతాబ్దాలకొద్దీ అందరికీ తెలిసినట్టి వేలసంవత్సరాల తరబడి నీతిసూత్రాలుగా ఒరవడులు దిద్దబడి పునశ్చరణ చేయబడినట్టి సామాజిక సంబంధాల ప్రాథమిక నియమాలను పాటించడం ప్రజలు క్రమంగా అలవాటు చేసుకుంటారు. ఎట్టి బలప్రయోగమూ లేకుండానే, ఒకరికింద ఒకరు లొంగివుండడం అవసరం లేకుండానే, నిర్బంధం లేకుండానే, రాజ్యాంగయంత్రం అని పిలువబడే ప్రత్యేక ఉపకరణం లేకుండానే వీటిని పాటించడానికి ప్రజలు అలవాటుపడతారు.

"రాజ్యాంగయంత్రం హరించిపోతుంది" అనే మాట ఎంచి తూచినట్టు మహబాగా సరిపోతూంది; ఎందుచేతంటే ఈ విధానంయొక్క క్రమక్రమ స్వభావాన్నీ, అయత్నకృత

స్వభావాన్నీ, ఈ రెండింటినీ ఈ మాట సూచించుతూంది. అలవాటు ఒక్కటే ఇట్టి ఫలితాలను కలుగజేయగలుగుతుంది, నిస్సంశయంగా కలుగజేస్తుంది కూడా; ఎందుచేతంటే, దోపిడీ లేనప్పుడూ, ఆగ్రహాన్ని రేకెత్తించేదేదీ లేనప్పుడూ, విరుద్ధాభిప్రాయాన్ని తెల్పడానికీ తిరుగుబాటు చేయడానికీ కారణం లేనప్పుడూ, అణగదొక్కి వుంచడమునకు అవసరమును సృష్టించేదేదీ లేనప్పుడూ, సామాజిక సంబంధ నియమాలను పాటించడానికి ప్రజలు ఎంత త్వరగా అలవాటుపడతారో లక్షలాది సార్లు మనం నిత్యమూ చూస్తూనేవుంటాం.

ఈ రీతిగా, పెట్టుబడిదారీ సమాజంలో తగ్గించి వేయబడినట్టి, క్షుద్రమైనట్టి, బూటకమైనట్టి ప్రజాస్వామ్యం, ధనికులకు మాత్రమే, అల్పసంఖ్యాకవర్గానికి మాత్రమే ఉండే ప్రజాస్వామ్యాన్ని మనం చూస్తున్నాం. శ్రామికవర్గ నియంతృత్వం, కమ్యూనిజంలోకి పరివర్తన చెందే కాలం, అల్పసంఖ్యాకులైన దోపిడీదారులను అవశ్యం అణగదొక్కి వుంచడంతోపాటు మొట్టమొదటి సారిగా అధికసంఖ్యాకవర్గమైన ప్రజలకు, ప్రజాస్వామ్యాన్ని సృష్టించుతుంది. సమగ్రమైన ప్రజాస్వామ్యాన్ని చేకూర్చే సామర్థ్యం ఒక్క కమ్యూనిజానికి మాత్రమే ఉంది; కాగా అది ఎంత సమగ్రంగా ఉంటే అంత త్వరగా అది అనవసరమై, దానంతటదే హరించిపోతుంది. .

దీనినే వేరే మాటలలో చెప్పాలంటే, నిజమైన అర్థంలో రాజ్యాంగయంత్రం, అనగా ఒక వర్గాన్ని ఒకవర్గం, అంతేకాకుండా పైగా, అధికసంఖ్యాకవర్గాన్ని అల్పసంఖ్యాకవర్గం, అణగదొక్కి వుంచేందుకు ప్రత్యేక యంత్రం, పెట్టుబడిదారీ విధానంకిందే మనకి తటస్థించుతుంది. పీడిత అసంఖ్యాకవర్గాన్ని పీడక అల్పసంఖ్యాకవర్గం క్రమవిధానంలో అణగదొక్కి వుంచాలనేటట్టి ఇట్టి కర్తవ్యనిర్వహణ జయప్రదంగా ఉండాలంటే, అనిర్వచనీయమైన క్రౌర్యమూ, కిరాతకత్వమూ సహజంగా అవసరమవుతుంది; బానిసత్వమూ, భూదాస్యమూ, వేతన శ్రమననుభవించుతూన్న మానవాళి రక్తసముద్రాలను సహితమూ ఈదవలసిన అవసరం కలుగుతుంది.

ఇంతేకాదు; పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి జరిగే పరివర్తనలో కూడా అణగదొక్కి వుంచడం ఇంకా అవసరమే అవుతుంది; కాని ఇప్పుడు దీనిని పీడితులైన అధికసంఖ్యాకవర్గం పీడకులైన అల్పసంఖ్యాకవర్గంపై జరుపుతుంది. అణగదొక్కి వుంచడానికి ఒక ప్రత్యేక ఉపకరణం, ఒక ప్రత్యేక యంత్రం, "రాజ్యాంగయంత్రం," ఇంకా అవసరమే అవుతుంది; కాని, ఇది ఇప్పుడు పరివర్తన దశలోవున్న రాజ్యాంగయంత్రం మాత్రమే; ఉచితమైన అర్థంలో ఇది ఒక రాజ్యాంగయంత్రము కాదు; ఎందుచేతంటే నిన్నటివరకూ వేతనపు బానిసలుగా ఉండిన అధికసంఖ్యాకవర్గంచే పీడకులైన అల్పసంఖ్యాకవర్గాన్ని అణగదొక్కి వుంచడం ఎంత సులువైనట్టి, సరళమైనట్టి, సహజమైనట్టి కార్యమంటే, బానిస, భూదాస,

వేతన శ్రమజీవుల తిరుగుబాట్లను అణచి వేసినప్పుడు సంభవించిన రక్తపాతంకంటె అతి తక్కువలోనే ఇది జరిగిపోయి, అతి చౌకగానే మానవాళి బైటపడుతుంది. ప్రజాస్వామ్యాన్ని ప్రజానీకంలో ఎంతటి బ్రహ్మాండమైన అధికసంఖ్యకు విస్తరింపజేయడానికి ఇది అణుగుణ్యంగా ఉంటుందంటే, అణగదొక్కి వుంచడానికి ఒక ప్రత్యేక యంత్రంయొక్క అవసరం తీరి పోవడం కూడా ఆరంభమవుతుంది. అత్యంత క్లిష్టమైన యంత్రం లేనిదే దోపిడీదార్లు సహజంగానే ప్రజలను అణగదొక్కి వుంచలేరు, ఈ కార్యం జరిపేందుకు అత్యంత క్లిష్టమైన యంత్రం అవసరమౌతుంది; కాని ఒక సులభమైన "యంత్రంతోనే," ఇంచుమించుగా ఒక "యంత్రం" లేకుండానే, ప్రత్యేకమైన ఉపకరణం లేకుండానే, సరళతరమైన సాయుధ ప్రజారాసుల ఆర్గనైజేషను (ముందు జరగబోయే విషయాలను ఒక విధంగా ఇప్పుడే ఎదురుచూచి చెప్పాలంటే, కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లను పోలినట్టిది) వల్లనే దోపిడీదార్లను ప్రజ అణగదొక్కి వుంచగలుగుతుంది.

ఇక ఆఖరి మాట. కమ్యూనిజం ఒక్కటే రాజ్యాంగయంత్రాన్ని పొంతమూ అనవసరమయేటట్టు చేస్తుంది. ఎందుచేతంటే, అణగదొక్కబడవలసినవాడు ఒక్కడు కూడా ఉండదు — వర్గం అనే అర్థంలో ప్రజలో ఒక నిర్దిష్టమైన భాగానికి వ్యతిరేకంగా క్రమబద్ధమైన పోరాటాన్ని సాగించవలసిన అర్థంలో, "ఒక్కడు కూడా" ఉండడు. మనం ఊహాజనిత ప్రపంచంలో నివసించడంలేదు. వ్యష్టిగా వ్యక్తులచే అత్యాచారాలు జరుపబడే అవకాశం, తప్పనిసరిగా జరిగే అవకాశం ఉండదనిగాని, ఇట్టి అత్యాచారాలను అణచివేయవలసిన అవసరం ఎంత మాత్రం ఉండదనిగాని, మనం అంగీకరించకపోవడంలేదు. అయితే, మొదటి విషయమేమిటంటే, ఇందుకోసం, అణచిపెట్టి వుంచడంకోసం, ఒక ప్రత్యేకమైన యంత్రంగాని, ప్రత్యేక ఉపకరణంగాని అవసరముండదు; ఆధునిక సమాజంలో సహితం మనుష్యులు కొట్టుకుంటూన్నప్పుడు ఆపడానికి గాని, ఒక స్త్రీని అవమానపరచే యత్నాన్ని నిరోధించడానికి గాని నాగరిక ప్రజాసమూహం ఎంత సరళంగానూ ఎంత సంసిద్ధంగానూ ఎలా చేయిచేసుకుంటుందో అలాగే సాయుధులైన ప్రజలే ఈ కార్యాన్ని నిర్వహించుతారు. ఇక రెండవది: సామాన్య ప్రజానీకాన్ని దోపిడీ చేయడమూ, వారి లేమీ, పేదరికమూ — ఇవే సామాజిక సంబంధ నియమాల అతిక్రమణ రూపంలో జరిగే అత్యాచారాలకు మౌలికమైన సాంఘిక కారణమని మనం ఎరుగుదుం. ఈ ముఖ్యకారణాన్ని తొలగించడంతో అత్యాచారాలు కూడా విధిగా "హరించిపోవ" నారంభించుతాయి. ఎంత శీఘ్రంగానూ, ఎట్టి క్రమంలోనూ అవి హరించిపోతాయో మనకి తెలియదు; కాని అవి హరించితీరుతాయని మాత్రం మనకి తెలుసు. వాటి హరింపుతోపాటుగా రాజ్యాంగయంత్రం కూడా హరించిపోతుంది.

ఊహాజనిత ప్రపంచ సృష్టిలో నిమగ్నుడై వుండకుండా, ఈ భావికాలం గురించి ఏ విష యాన్నయితే ఇప్పుడు నిర్వచించి చెప్పడానికి వీలవుతుందో ఆ విషయాన్ని, అనగా కమ్యూనిస్టు సమాజంయొక్క నిమ్నోన్నత దశల భేదాలను (స్థితులను, స్థాయిలను) మార్క్స్ మరింత సంపూర్ణంగా నిర్వచనం చేసిచెప్పాడు.

## 3. కమ్యూనిస్టు సమాజంయొక్క ప్రథమ దశ

''ఏవిధంగాను తగ్గించబడని,'' లేక ''తన శ్రమయొక్క పూర్తి ఫలితాన్ని'' సోషలిజం కింద కార్మికుడు పొందుతాడు అనే లాసాల్ అభిప్రాయం తప్పు అని రుజువుపరచడానికి, ''గోతా కార్యక్రమ విమర్శ''లో మార్క్స్ అనేక వివరాలను చూపుతాడు. సమాజంయొక్క సంపూర్ణ సామాజిక శ్రమ ఫలితంనుండి క్షేమ నిధిని, ఉత్పత్తి విస్తృతం చేయడానికీ, యంత్రాంగం యొక్క ''అరుగుదల, తరుగుదలలను'' భర్తీ చేయడము, వగైరాలకుగాను నిధిని ఒక దానిని తీసివెయ్యాల్సి ఉంటుందనీ; తరువాత వినిమయ సాధనాలనుండి పరిపాలనకోసమూ, పాఠ శాలలు, ఆస్పత్రులు, వృద్ధులకు వసతిగృహాలు మొదలైన వాటి ఖర్చులకోసమూ నిధినొక దానిని తీసి వేయాల్సి వుంటుందనీ మార్క్స్ నిరూపించాడు.

అయోమయంగానూ, అస్పష్టంగానూ, స్థూలంగానూ ఉన్న లాసాల్‌యొక్క వాక్యం (''కార్మికుడికి తన శ్రమయొక్క పూర్తిఫలితం'') బదులు, సోషలిస్టు సమాజం తన వ్యవ హారాలను చక్కబెట్టుకునే నిశిత విధానాన్ని గురించి మార్క్స్ నిదానమైన మదింపు వేశాడు. పెట్టుబడిదారీ విధానం లేని సమాజంలో ఉండే జీవిత పరిస్థితులను నిర్దిష్టమైన విశ్లేష ణకు లోనుగావించుతూ మార్క్స్ ఈవిధంగా అంటాడు:

> ''మనమిక్కడ'' (కార్మికుల పార్టీయొక్క కార్యక్రమాన్ని విశ్లేషించుతూన్న ప్పుడు), ''చెబుతూన్నది తన సొంత పునాదులపైన అభివృద్ధిని పొందకుండా, పెట్టుబడిదారీ సమాజంనుండి అప్పటికప్పడే జన్మించినట్టి, తత్కారణంగా ఆర్థికం గానూ, నైతికంగానూ, వైజ్ఞానికంగానూ, తనను కనినట్టి పాత సమాజంయొక్క పుట్టుమచ్చలనే తాను కూడా ప్రతి విషయంలోనూ ప్రదర్శించుతూన్నట్టి కమ్యూ నిస్టు సమాజాన్ని గురించే.''

కాగా ఈ కమ్యూనిస్టు సమాజాన్నే — పెట్టుబడిదారీ సమాజ గర్భంనుండి ప్రపం చంలోకి ఇప్పుడే వచ్చినట్టి, అన్నివిషయాలలోనూ పాతసమాజపు పుట్టుమచ్చలనే తానుకూడా

కలిగివున్నట్టి సమాజానికే – కమ్యూనిస్టు సమాజంయొక్క "ప్రథమ," లేక నిమ్న దశ అని మార్క్స్ పేరుపెట్టాడు.

ఇకమీదటనుండి ఉత్పత్తి సాధనాలు వ్యక్తులయొక్క వ్యక్తిగత ఆస్తులై వుండవు. ఉత్పత్తి సాధనాలు సమాజానికంతకూ చెందుతాయి. సామాజికంగా అవసరమైన పనిలో నిర్దిష్టమైన కొంత భాగాన్ని నిర్వర్తించే ప్రతి సామాజిక సభ్యుడూ తాను ఫలానాఫలానా పరిమాణముగల పనిని చేసినట్టు సమాజంనుండి ఒక ధ్రువపత్రాన్ని పొందుతాడు. ఇక ఈ ధ్రువపత్రంతో అందుకు అనుగుణ్యంగా ఉండే ఉత్పత్తులను బహిరంగ వినిమయ వస్తు భాండా రంనుండి అతడు పొందుతాడు. ఈ ప్రకారంగా, సమాజ నిధికి చెందవలసిన మొత్తాన్ని శ్రమపరిమాణంనుండి మినహాయింపబడిన తరువాత, ప్రతి కార్మికుడూ సమాజానికి తానెంత ఇచ్చాడో, సమాజంనుండి అంత అందుకుంటాడు.

"సమానత్వమే" ఇక్కడ ప్రత్యక్షసార్వభౌమత్వాన్ని వహించుతూందట.

కాని ఇటువంటి సామాజిక వ్యవస్థను (దీనిని సోషలిజం అని సామాన్యంగా అంటారు, కాని దీనిని మార్క్స్ కమ్యూనిజంయొక్క ప్రథమ దశ అంటాడు), మనస్సులో ఉంచుకొని, దీనిని "న్యాయమైన పంపకము" అనీ, ఇది "సమాజ సభ్యులకందరికీ సమానమైన శ్రమ ఫలితానికి గల సమాన హక్కు" అనీ అనడంలో లాసాల్ పొరపాటు చేయగా, ఇతని పొరపాటును మార్క్స్ వివరించుతున్నాడు.

ఇక్కడ మనకి నిజంగా "సమాన హక్కే" ఉంది అంటాడు మార్క్స్, కాని ఇది ఇంకా, అన్ని హక్కులలాగానే, అసమానత్వం ఉన్నట్టు ముందుగా ఊహించుతూన్న "బూర్జువా హక్కే." నిజానికి మనుష్యులలో వాస్తవానికి ఒకరినొకరు పోలని, ఒకరితో ఒకరు సమానులుకాని, ఒకరితో ఒకరు విభేదించుతున్నట్టి ప్రజలకు సమాన పరిమాణం అన్వయింపజేయడమే ప్రతి హక్కూనూ; అందుచేతనే "సమాన హక్కు" అనేది నిజంగా సమానతకు భంగంకలిగించుతూ, అన్యాయమే అవుతూంది. వాస్తవానికి, ప్రతి మనిషీ, మరొక మనిషితో సమానమైన సామాజిక శ్రమను నిర్వహించిన తరువాత, సామాజిక ఫలితంలో సమానమైన భాగాన్ని (పైన జెప్పిన తగ్గింపులు జరిగిన తరువాత) పొందుతాడు.

అయితే మనుష్యులందరూ ఒకరిని పోలి ఒకరుండరు; ఒకడు బలంగా వుంటాడు, ఒకడు నీర్సంగా వుంటాడు; ఒకడికి భార్యా పిల్లలూ ఉంటారు, ఒకడు బ్రహ్మచారి; ఒకడికి పెద్ద కుటుంబం వుంటుంది, ఒకడికి చిన్న కుటుంబం వుంటుంది, ఇలాగ తేడాలు ఉంటూనే ఉంటాయి. కాగా మార్క్స్ తేల్చిన పర్యవసానం ఇదీ:

"...సమాన శ్రమను నిర్వర్తించిన తరువాత, దాని ఫలితంగా సామాజిక వినిమయ నిధిలో సమాన భాగాన్ని కలిగివుండి కూడా, వాస్తవానికి ఒకనికంటె మరొక

నికి హెచ్చే ముట్టుతూంది, ఒకనికంటె మరొకడు ధనవంతుడవుతున్నాడు; ఇంకా ఈ విధంగానే ఉంటూంటుందన్నమాట. ఈ లోట్లన్నీ లేకుండా ఉండాలంటే, హక్కు సమానంగా ఉండడం బదులు అసమానంగా ఉండాలి....''

అందుచేత కమ్యూనిజంయొక్క ప్రథమ దశ ఇంకా న్యాయాన్నీ సమానత్వాన్నీ కలుగజేయడంలేదు; డబ్బులో భేదాలూ, అన్యాయమైన భేదాలూ ఇంకా ఉంటూనే వుంటాయి; కాని ఉత్పత్తి సాధనాలు: ఫ్యాక్టరీలూ, యంత్రాలూ, భూమీ వగైరాలు, వ్యక్తిగత ఆస్తిగా వ్యక్తులు హస్తగతం చేసుకోవడానికి ఇక వీలుండదు కాబట్టి, మనిషిని మనిషి దోపిడీ చెయ్యడం మాత్రం ఇక సాధ్యంకాదు. ''సమానత,'' ''న్యాయము'' గురించి స్థూలంగా లాసాల్ చెప్పినట్టి పెట్టీబూర్జువాతత్వపు అయోమయపు వాక్యాలను తుత్తునియలుగా ఖండించుతూ, వ్యక్తులచే ఉత్పత్తి సాధనాలు హస్తగతం గావించుకోబడడమనే ''అన్యాయాన్ని'' మాత్రమే మొదటలో రద్దుగావింపక విధిలేనట్టి, వినిమయ వస్తువులను ''శ్రమ పరిమాణాన్నిబట్టి'' (అవసరాలనుబట్టి గాక), పంపకం చేయడమనే రెండవ అన్యాయాన్ని తక్షణమే రద్దుచేయ జాలనట్టి కమ్యూనిస్టు సమాజంయొక్క క్రమాభివృద్ధి గమనాన్ని మార్క్స్ అదే సమయంలో చూపుతాడు.

ప్రజంలో ఉన్న అసమానతను మరచిపోయి, ఈ అసమానతను తొలగించుతామని ''కలలుగంటూన్నార''ని ''మన'' తుగాన్‌తోసహా బూర్జువా పండితమ్మన్యులను కూడా కలుపుకొన్న అపభ్రంశపు అర్థశాస్త్రవేత్తలు సోషలిస్టులను నిరంతరమూ నిందిస్తూంటారు. ఇలాంటి నిందను మోపడంవల్ల బూర్జువావర్గ భావశాస్త్రీయవేత్తల యొక్క అంతులేని అజ్ఞానమే రుజువవుతూంది.

మనుష్యులలో అనివార్యంగా ఉండే అసమానతలను మార్క్స్ ఖచ్చితంగా గణనలోకి తీసుకోవడమే కాకుండా, ఉత్పత్తి సాధనాలను సమాజం అంతటికీ చెందిన సమిష్టి ఆస్తిగా మార్చినంత మాత్రాన (దీనినే మామూలుగా అందరూ ''సోషలిజం'' అంటూంటారు), ''నిర్వర్తింపబడిన శ్రమ పరిమాణాన్నిబట్టి'' ఫలితాలు విభజింపబడేవరకూ అమలులో సాగుతూనే ఉండేటట్టి ''బూర్జువా హక్కు'' లోవున్న పంపిణీలోవుండే లోపాలనూ, అసమానతనూ ఇది అంత మొందించదు అనే విషయాన్ని కూడా లెక్కలోకి తీసుకుంటాడు. మార్క్స్ ఇంకా చెబుతూ ఇలా అంటాడు:

> ''...పెట్టుబడిదారీ విధాన సమాజంనుండి దీర్ఘకాల ప్రసవవేదన తరువాత అచ్చంగా ఇప్పుడే ఆవిర్భవించిన కమ్యూనిస్టు విధాన సమాజంయొక్క ప్రథమ దశలో ఈ లోపాలు తప్పనిసరిగా ఉంటాయి. సమాజంయొక్క ఆర్థిక నిర్మాణానికీ, దీనికి లోబడి రూపొందినట్టి వైజ్ఞానికాభివృద్ధికీ అతీతంగా హక్కు ఎన్నడూ ఉండనేరదు....''

ఈ విధంగా, కమ్యూనిస్టు సమాజంయొక్క ప్రథమ దశలో (దీనినే సోషలిజం అని మామూలుగా అంటూంటారు) ''బూర్జువా హక్కు'' సాంతమూ రద్దుకాబడకుండా, కొంత భాగం మాత్రమే, అంతవరకూ సాధింపబడిన ఆర్థిక విప్లవానికి అనుగుణ్యంగా ఉన్నంత వరకూ మాత్రమే, అనగా ఉత్పత్తి సాధనాల విషయంలో మాత్రమే, రద్దుగావింపబడుతుంది. వీటిని వ్యక్తులయొక్క సొంత ఆస్తిగా ''బూర్జువా హక్కు'' గుర్తించుతుంది. వీటిని సోష లిజం ఉమ్మడి ఆస్తిగా మార్చేస్తుంది. ఆ మేరకు — కాగా ఆ మేరకు మాత్రమే — ''బూర్జువా హక్కు'' అంతమొందుతుంది.

అయితే దాని రెండవ భాగానికి సంబంధించినంతవరకు అది అమలులో ఉంటూనే వుంటుంది; వస్తువుల పంపకంలోనూ, సమాజ సభ్యులమధ్య శ్రమను కేటాయించడంలోనూ నియంత్రకంగా (నిర్ధారించే అంశంగా) పనిచేస్తూ ఉనికిని కలిగే ఉంటుంది. ''పనిచేయని వానికి తిండికి అర్హతలేదు'' అనే సోషలిస్టు సూత్రం అప్పటికే సాధించబడింది; ''సమాన పరిమాణంగల శ్రమకి సమాన మరిమాణంగల వస్తువులు'' అనే రెండవ సోషలిస్టు సూత్రం కూడా అప్పటికే సాధించబడింది. కాని ఇదింకా కమ్యూనిజం కాదు, అసమాన వ్యక్తులకు అసమానమైన (యథార్థంగా అసమానమైన) పనికి ప్రతిఫలంగా సమాన పరిమాణాన్నిగల ఫలితాలను ఇచ్చే ''బూర్జువా హక్కు''ను ఇంకా అంతమొందించడంలేదు.

ఇది ఒక ''లోపమే'' అంటాడు మార్క్స్; కాని కమ్యూనిజం ప్రథమ దశలో ఇది అనివార్యం; ఊహాజనిత ప్రపంచంలో మనం విహరించ దలచుకోకపోతే మాత్రం, పెట్టుబడి దారీ విధానాన్ని కూలదోసిన వెంటనే, ఏ హక్కు ప్రమాణమూ లేకుండానే సమాజంకోసమని ప్రజ పనిచేయడం నేర్చుకుంటారని మనం అనుకోకూడదు; పోతే, అటువంటి మార్పునకు అవసరమైన ఆర్థిక పునాదులను పెట్టుబడిదారీ విధానంయొక్క అంతం వెంటనే సృష్టించదు.

కాగా ''బూర్జువా హక్కు'' తప్ప మరో ఇతర ప్రమాణం ఏదీ లేదు. అందుచేత ఈ మేరకు, రాజ్యాంగయంత్రంయొక్క అవసరం ఇంకా ఉంటుంది; ఈ రాజ్యాంగయంత్రం ఉత్పత్తి సాధనాలయొక్క ప్రజల స్వామ్యాన్ని పరిరక్షిస్తూనే, శ్రమలో సమానత్వాన్ని, ఫలితాల పంపకంలో సమానత్వాన్ని పరిరక్షిస్తుంది.

ఏ విధమైన పెట్టుబడిదారులుగాని, వర్గాలుగాని ఇక లేకపోవడంచేతనూ, తదాను షంగికంగా అణగదొక్కి వుంచవలసినట్టి వర్గం ఏదీ లేకపోవడంచేతనూ, ఆ మేరకు రాజ్యాంగ యంత్రం హరించిపోతుంది.

అయితే వాస్తవమైన అసమానత్వాన్ని పవిత్రమొనర్చుతూన్న ''బూర్జువా హక్కు''ను పరిరక్షించవలసిన కార్యం ఇంకా నిలచి వుండడం కారణంగా, రాజ్యాంగయంత్రం ఇంకా పూర్తిగా హరించిపోవడంలేదు. రాజ్యాంగయంత్రం సంపూర్ణంగా హరించిపోవాలంటే అందుకు సంపూ ర్ణమైన కమ్యూనిజం అవసరం.

# 4. కమ్యూనిస్టు సమాజంయొక్క ఉన్నత దశ

మార్క్సు ఇంకా ఇలా అంటాడు:

"...కమ్యూనిస్టు సమాజంయొక్క ఉన్నత దశలో, శ్రమవిభజనకు బానిసత్వపు విధేయతతో లొంగివుండడమూ, దానితో కూడానే ఉన్న మానసిక శారీరక శ్రమలకూ గల విరుద్ధమూ అంతరించి పోయిన తరువాత, జీవనోపాధిగానే కాకుండా జీవిత ముఖ్యావసరంగా శ్రమ రూపొందిన తరువాత, వ్యక్తియొక్క సర్వతోముఖాభివృద్ధితోపాటు ఉత్పాదక శక్తులు కూడా అభివృద్ధిచెంది, సహకార సంపదయొక్క మూలాధారాలన్నీ సమృద్ధిగా ప్రవహించుతూన్న తరువాత — అప్పుడు మాత్రమే సమాజం బూర్జువా హక్కుయొక్క సంకుచిత దిగ్మండల పరిధిని పూర్తిగా అధిగమించి, సమాజం తన పతాకలపైన 'ప్రతివాని నుండీ వాని శక్తిసామర్థ్యాలను అనుసరించి, ప్రతివానికీ వాని అవసరాలను అనుసరించి!' అనే శీర్షికలను చిత్రించుకోగలుగుతుంది."

"రాజ్యాంగయంత్రం" అనే మాటతో "స్వేచ్ఛ" అనే మాటను జోడించడంలో వున్న అసంబద్ధాన్ని ఎంగెల్స్ దయదాక్షిణ్యంలేకుండా పరిహసిస్తూ చేసిన అభిభాషణయొక్క యథార్థతను మనమిప్పుడు గ్రహింపగలుగుతాం. రాజ్యాంగయంత్రం ఉన్నంతకాలమూ స్వేచ్ఛ ఉండదు. స్వేచ్ఛ ఉన్నప్పుడు రాజ్యాంగయంత్రం ఉండదు.

మానసిక శారీరక శ్రమలకుండే విరుద్ధం అంతరించిపోయి, ఫలితార్థంగా నేటి సామాజిక అసమానత్వానికి ఒక ప్రధాన మూలాధారం — అంతేకాకుండా, ఉత్పత్తి సాధనాలను ప్రజా ఆస్తిగా మార్చినంత మాత్రాన, పెట్టుబడిదార్ల ఆస్తి హక్కులను లాగివేసినంత మాత్రాన, తొలగింప వీలుపడని మూలాధారం కూడా — అంతరించిపోయేటట్టి కమ్యూనిజంయొక్క ఉన్నత దశే రాజ్యాంగయంత్రం సంపూర్ణంగా హరించిపోవడానికి అవసరమైన ఆర్థిక ప్రాతిపదిక.

ఉత్పాదక శక్తులు బ్రహ్మాండంగా అభివృద్ధి పొందే అవకాశాన్ని ఈ ఆస్తి హక్కుల తొలగింపు సృష్టించుతుంది. కాగా ఈ అభివృద్ధికి పెట్టుబడిదారీ విధానం నమ్మశక్యంగాని రీతిని ఎంతగా అవరోధాలు కల్పించుతూందో మనం చూచినప్పుడు, ఇప్పటికి అందుకున్న సాంకేతిక స్థాయి ప్రాతిపదికపైనే ఎంతటి అభివృద్ధిని సాధింపవీలైందో మనం చూస్తూన్నప్పుడు, పెట్టుబడిదార్ల ఆస్తి హక్కులను లాగివేయడం ఫలితంగా మానవ సమాజంయొక్క

ఉత్పాదక శక్తుల బృహత్తరమైన అభివృద్ధి తప్పనిసరిగా సంభవించుతుందని సంపూర్ణమైన విశ్వాసంతో చెప్పడానికి మనకి అధికారం ఉంది. కాని ఈ అభివృద్ధి ఎంత త్వరగా కొనసాగు తుందో, శ్రమవిభజన విసర్జించే తరుణానికి, మానసిక శారీరక శ్రమల విరుద్ధాన్ని నిరాకరించే తరుణానికి, ''జీవిత ముఖ్యావసరంగా'' శ్రమ రూపొందే తరుణానికి, ఇది ఎంత శీఘ్రంగా చేరుకుంటుందో — మనకి తెలియదు, మనం తెలుసుకోలేము కూడా.

ఈ కారణంచేతనే రాజ్యాంగయంత్రం తప్పనిసరిగా హరించి తీరుతుందనీ, ఈ హరింపు విధానంయొక్క సుదీర్ఘకాలపు స్వభావాన్నీ కమ్యూనిజంయొక్క ఉన్నత దశాభివృద్ధి త్వరిత గతిపై దీని ఆధారాన్నీ నొక్కి చెబుతూ, హరించిపోవడానికి ఎంతకాలం పడుతుంది, దాని నిర్దిష్ట రూపాలేమిటి, అనే ప్రశ్నలకు సమాధానమివ్వడానికి అవసరములైన దత్తాంశాలు లేని కారణాన ఈ ప్రశ్నలను అపరిష్కృతంగానే వదిలిపెట్టేయడాన్ని మనం సమర్థించు కోవచ్చు.

''ప్రతివాని నుండీ వాని శక్తిసామర్థ్యాలను అనుసరించి, ప్రతివానికీ వాని అవసరా లను అనుసరించి'' అనే సూత్రాన్ని సమాజం ఎప్పుడైతే అంగీకరించుతుందో, అనగా మౌలిక మైన సామాజిక సూత్రాలను పాటించడం ప్రజలు ఎంతగా అలవాటుపడి, వారి శ్రమ ఎంత ఉత్పాదకమవుతుందంటే, ఇక వారు వారి సామర్థ్యాన్ని అనుసరించి స్వచ్ఛందంగానే పనులను నిర్వహిస్తారో, అప్పుడు రాజ్యాంగయంత్రం హరించి పోవడానికి వీలవుతుంది. పొరుగువాని కంటె తాను ఒక అరగంట హెచ్చు పనిచేసేశానే అని, వాడికంటె తాను తక్కువ జీతాన్ని సంపాదించుతున్నానే అని తప్పనిసరిగా లెక్కలు కట్టించే షైలాక్ శిలాహృదయతత్వ[147] పూరి తమైన ''బూర్జువా హక్కు''యొక్క సంకుచిత దిగ్మండల పరిధి — ఈ సంకుచిత దిగ్మం డల పరిధి అప్పుడు అధిగమింపబడుతుంది. ప్రతీ వాడికీ ముట్టే వస్తువుల పరిమాణం నిర్ణ యించడం సమాజానికి అవసరమే వుండదు; ప్రతీవాడూ తన ''అవసరాలనుబట్టి'' వాడే స్వేచ్ఛగా తీసుకుంటాడు.

ఇటువంటి సామాజిక వ్యవస్థ ''కేవలం ఊహాజనితమైనదని'' ఉద్ఘాటించుతూ, వ్యక్తిగతంగా ప్రతి పౌరునియొక్క శ్రమపైనా ఎట్టి ఖాయిదా లేకుండానే ప్రతీ వాడికీ సమా జంనుండి ఎట్టి పరిమితిలేకుండా ఎన్నిపడితే అన్ని పుట్టకొక్కులూ, మోటారుకార్లూ, పియానోలూ, వగైరాలు ముట్టుతాయని సోషలిస్టులు వాగ్దానం చేస్తున్నారని బూర్జువా దృక్పథంనుండి సోషలిస్టులను వెక్కిరించడం సులభమే. ఈనాటికి కూడా, ఈ విధంగా వెక్కి రించడంతప్ప కేవలం మరోపని అంటూ లేనట్టి బూర్జువా ''విద్వాంసులు'' చాలామందే ఉన్నారు; ఈవిధంగా తమ అజ్ఞానాన్నీ, డబ్బుకోసమే పెట్టుబడిదారీ విధానాన్ని వెనకేసుకు రావడమునూ, రెంటినీ వారు బయటబెట్టుకుంటున్నారు.

అజ్ఞానమే — ఎందుచేతంటే కమ్యూనిజంయొక్క ఉన్నత దశ ఆసన్నమవుతుందని "వాగ్దానం చెయ్యాలని" ఏ సోషలిస్టు బుర్రలోకీ ఇంతవరకూ ఎక్కలేదు; తద్భిన్నంగా అట్టితరుణం ఆసన్నమవుతుందని ఎదురుచూడడంలో శ్రమయొక్క నేటి శ్రామిక ఉత్పాదకశీలతనుగానీ, పొమ్యలోవ్స్కీ కథలలో సమాజ సంపత్తి నిధులను "కేవలం తమాషాకోసం" పాడుచేసేగానీ, సమాజంనుండి హిరణ్యాక్షవరాలను కోరేటట్టి మత పాఠశాల విద్యార్థిలాంటి[148] నేటి రకం మనుషులనూ మహనీయులైన సోషలిస్టులు ఆధారంగా పెట్టుకోలేదు.

కమ్యూనిజంయొక్క "ఉన్నత" దశ వచ్చేవరకూ, శ్రమను కొలవడంలోనూ వినిమయాన్ని కొలవడంలోనూ సమాజమూ, రాజ్యాంగయంత్రమూ కూడా కఠిన తమమైన ఖాయిదాను చలాయించాలని సోషలిస్టులు ఖండితంగా కోరుతారు. అయితే పెట్టుబడిదారీ వర్గానికున్న ఆస్తి హక్కులను లాక్కోవడంతోనూ, పెట్టుబడిదారులపైన కార్మికుల ఖాయిదాను స్థాపించడంతోనూ ఆరంభమై, ఉద్యోగివర్గంచే నడుపబడే రాజ్యాంగయంత్రంచే గాకుండా, సాయుధ కార్మికుల రాజ్యాంగయంత్రంచేతనే ఈ ఖాయిదా అమలులో పెట్టబడాలి.

పెట్టుబడిదారీ విధానాన్ని బూర్జువాభావశాస్త్రవేత్తలు (వారి వెంటతిరిగే త్సెరెతేలి, చెర్నోవ్ ప్రభృతులు) స్వార్థపరత్వంతో పరిరక్షించడం ఎందులో ఉందంటే, పెట్టుబడిదారుల ఆస్తి హక్కులను లాగివేయడమూ, ఒకే ఒక బ్రహ్మాండమైన "సిండికేటు"కింద — అనగా సమగ్ర రాజ్యాంగయంత్రం అంతటికిందా — పౌరులను అందరనూ కార్మికులుగానూ ఉద్యోగులుగానూ మార్చివేయడమూ, ఈ సిండికేటుయొక్క కార్యకలాపాన్నంతటినీ యథార్థమైన ప్రజాస్వామ్య రాజ్యాంగయంత్రంకింద — అనగా కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్ల రాజ్యాంగయంత్రంకింద — లొంగివుండేటట్టు చేయడమూ — అనే ఈనాటి రాజకీయాలలో అత్యవసరమైనట్టి, అంతటికీ ఆయువుపట్టయినట్టి సమస్యనుగూర్చి ఇప్పుడు తేల్చడం బదులు, సుదూర భవిష్యత్తునుగూర్చిన వాదోపవాదాలనూ చర్చలనూ తెచ్చిపెట్టడంలోనే ఉంది.

వాస్తవానికి, విద్యాపారంగతుడైన ఒక ప్రొఫెసరుగారూ, ఆయననుసరించి ఫిలిస్టైనూ, ఇతగాని ననుసరించి త్సెరెతేలి, చెర్నోవ్ ప్రభృతులూ, బోల్షెవిక్‌ల హేతురహిత ఊహాప్రపంచాల గురించీ, ప్రజాందోళనకై వాగ్దానాల గురించీ, సోషలిజాన్ని "ప్రవేశపెట్టడం"లో వున్న అసాధ్యతను గురించీ, మాట్లాడేటప్పుడు, వాళ్ళమనస్సులో ఉన్నది కమ్యూనిజంయొక్క ఉన్నత దశే, లేక ఉన్నత స్థాయే; దీన్ని "ప్రవేశపెట్టడాన్ని" గూర్చి ఎవ్వరూ వాగ్దానమూ చేయులేదు, వాగ్దానము చేద్దామని ఆలోచించనైనా ఆలోచించలేదు; ఎందుచేతంటే అది సాధారణంగా "ప్రవేశపెట్టడానికి" వీలైనదికాదు.

ఇక, ''సోషల్-డెమోక్రాట్'' అనే పేరులోవున్న అసంగతాన్నిగూర్చి మనం పైన ఉల్లేఖించిన ఎంగెల్స్‌యొక్క వాదనలో అతడు ప్రస్తావించినట్టి సోషలిజానికీ కమ్యూనిజానికీ వున్న శాస్త్రయుక్తమైన భేదమనే ప్రశ్నకు మనమిప్పుడు వస్తాం. కమ్యూనిజంయొక్క ప్రథమ, లేక నిమ్న దశకూ, ఉన్నత దశకూగల భేదం కాలం సాగుతూన్నకొద్దీ రాజకీయంగా బహుశ బ్రహ్మాండంగా ఉంటుంది; కాని పెట్టుబడిదారీ విధానంకింద ఉన్నంతకాలమూ ఈ భేదాన్ని ఇప్పుడు ఆలోచించడం హాస్యాస్పదంగా ఉంటుంది; పోతే బహుశా వ్యష్టిగా అరాచకవాదులు మాత్రమే క్రొపోత్కిన్‌లూ, గ్రావేలూ, కొర్నెలిస్సెనులూ, మొదలైన అరాచకవాద ''హేమా హేమీలు'' అందరూ సోషల్-జాతీయ దురహంకారులో, (లేక ఆత్మగౌరవమూ, అంతః కరణ అంటూ ఇంకా కలిగినట్టి కొద్ది అరాచకవాదులలోనూ ఒకడైన గె చెప్పినట్టుగా, ''అరాచకవాద-కందకసంగ్రామ సైనికులుగానో,'' ''ప్లెహానొవ్ మతావలంబులు''గానో, మార్పునుండి గుణపాఠం నేర్చుకోని అరాచకవాదులు ఇంకా మిగిలివుంటే, వారు మాత్రమే) దీనికి ప్రధాన ప్రాముఖ్యతను కల్పిస్తే కల్పించవచ్చు.

కాని సోషలిజానికీ కమ్యూనిజానికీ శాస్త్రీయంగావున్న భేదం స్పష్టంగానే కనబడుతూంది. సోషలిజం అని మామూలుగా అందరూ అంటూన్నదానికే, కమ్యూనిజంయొక్క ''ప్రథమ,'' లేక నిమ్న దశ అని మార్క్స్ పేరుపెట్టాడు. ఉత్పత్తి సాధనాలు ఉమ్మడి ఆస్తిగా ఏర్పడినంత మేరకు, ఇది సంపూర్ణమైన కమ్యూనిజం కాదు అని మనం మర్చిపోకుండా వున్న పక్షంలో మాత్రమే, ''కమ్యూనిజం'' అనే మాటను ఇక్కడ కూడా వర్తింపజేయడానికి వీలుంటుంది. మార్క్స్ చేసిన వివరణల గొప్ప ప్రాముఖ్యత ఏమిటంటే, భౌతికవాద గతితర్కాన్ని, క్రమాభివృద్ధి సిద్ధాంతాన్ని ఇక్కడ కూడా సుసంగతంగా వినియుక్తంచేస్తూ, పెట్టుబడిదారీ విధానంలోనుండే క్రమాభివృద్ధిని చెందుతూన్న వస్తువుగా కమ్యూనిజాన్ని అతడు పరిగణించుతాడు. సమగ్రవిజ్ఞతావాదంచే కల్పించబడినట్టీ, ''ఆలోచించి తయారుచేసినట్టీ'' పదనిర్వచనాలూ, నిరర్థకములైన వివాదాలూ (సోషలిజం అంటే ఏమిటి? కమ్యూనిజం అంటే ఏమిటి?) బదులు, కమ్యూనిజంయొక్క, ఒక విధంగా చెప్పాలంటే ఆర్థిక పరిపక్వతా దశలయొక్క, విశ్లేషణను మార్క్స్ ఇస్తున్నాడు.

ప్రథమ దశలో, లేక ప్రథమ స్థాయిలో కమ్యూనిజం ఇంకా ఆర్థికంగా పరిపక్వస్థితిని గాని, పెట్టుబడిదారీ విధానపు సంప్రదాయాలనూ- జాడలనూ పూర్తిగా వదలించుకొనే స్థితినిగాని అందుకోజాలదు. తత్కారణంగానే దాని ప్రథమ దశలో, ''బూర్జువా హక్కుయొక్క సంకుచిత దిగ్మండల పరిధిని'' కమ్యూనిజం ఇంకా వదలకుండా నిలబెట్టుకునే ఆసక్తిదాయకమైన దృగ్విషయం తటస్థిస్తూంది. హక్కు ప్రమాణాల ఆచరణను బలాత్కారంగా అమలులో పెట్టించగలిగే ఉపకరణం లేనిదే హక్కుకు అర్థంలేని కారణాన వినిమయ

వస్తువుల పంపకం విషయంలో బూర్జువా హక్కును గుర్తించడమంటే, సహజంగానే పూర్వ సిద్ధాంతంగా బూర్జువా రాజ్యాంగయంత్రంయొక్క ఉనికిని ముందుగా అంగీకరించడమే అవుతుంది.

దీనినిబట్టి కమ్యూనిస్టు వ్యవస్థలో బూర్జువా హక్కేగాక, బూర్జువావర్గ రహితమైన బూర్జువా రాజ్యాంగయంత్రం కూడా కొంత నిశ్చిత కాలంవరకూ ఉంటుందని తెలుస్తూంది!

ఇదొక స్వవచన వ్యాఘాతంగానూ, లేక కేవలం ఒక గతితార్కికపు పొడుపుకథలాగానూ ఉందనీ, మార్క్సిజంలో ఇలాంటివే ఉంటాయనీ, అసాధారణ గంభీరతను గలిగిన దాని విషయాన్ని అధ్యయనంచేసే ప్రయాసాన్ని తీసుకోనొల్లని వారు మార్క్సిజంపైన తరుచు ఒక అభాండాన్ని మోపుతూ ఉంటారు.

కాని వాస్తవానికి ప్రకృతి, సమాజము, ఈ రెండింటిలోనూ పాతయొక్క అవశేషాలు నశించిపోకుండా కొత్తదానిలో చావక మిగిలి వుండడము జీవితంలో మనకి అడుగడుగునా ఎదురవుతూనే ఉంటుంది. కాగా కమ్యూనిజంలోకి "బూర్జువా" హక్కును మార్క్స్ ఆవంత కూడా అకారణంగా చొప్పింపకుండా, పెట్టుబడిదారీ విధాన గర్భంలోనుండి బయట పడుతూన్న సమాజంలో ఆర్థికంగానూ రాజకీయంగానూ ఏది తప్పనిసరిగా ఉండి తీరుతుందో దానిని సూచించాడు.

కార్మికవర్గం తన విముక్తికోసం పెట్టుబడిదారీ విధానంతో సలిపే పోరాటంలో ప్రజాస్వామ్యానికి బృహత్తరమైన ప్రాముఖ్యత ఉంది. అయినా ఎట్టి పరిస్థితులలో సహితమూ అతిక్రమింపగూడని సరిహద్దేమీకాదు ప్రజాస్వామ్యం; ఫ్యూడలిజంనుండి పెట్టుబడిదారీ విధానానికీ, పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి సాగిపోయే మార్గంలో అది ఒక మజిలీ మాత్రమే.

ప్రజాస్వామ్యం అంటే సమానత్వం. సమానత్వంకోసం శ్రామికవర్గం సలిపే పోరాటంయొక్క ప్రాముఖ్యత, ఒక నినాదంగా సమానత్వానికి ఉన్న గొప్ప ప్రాముఖ్యత, వర్గాలు అంతమొందించడమే దాని అర్థమనీ వ్యాఖ్యానించినప్పుడే స్పష్టంగా బోధపడుతుంది. కాని ప్రజాస్వామం అంటే కేవలం లాంఛనప్రాయమైన సమానత్వమే. ఉత్పత్తి సాధనాల యాజమాన్య సంబంధంలో సమాజంలోని అందరి సభ్యులకూ సమానత్వం, అనగా శ్రమలో సమానత్వమూ, వేతనాల్లో సమానత్వమూ లభించిన వెంటనే, అక్కడనుండి ఇంకా ముందుకు, లాంఛనప్రాయమయిన సమానత్వంనుండి యథార్థమయిన సమానత్వానికి, అనగా "ప్రతివాని నుండీ వాని శక్తిసామర్థ్యాలను అనుసరించి, ప్రతివానికీ వాని అవసరాలను అనుసరించి" అనే సూత్రాన్ని అమలులో పెట్టడానికి పురోగమించే సమస్యను మానవాళి తప్పని

సరిగా ఎదుర్కోవలసి ఉంటుంది. ఈ సర్వోత్కృష్టమైన గమ్యాన్ని చేరుకోవడానికి మానవాళి ఏ యే మజిలీలను చేస్తుందో, ఏ యే ఆచరణీయములయిన చర్యలను తీసుకుంటుందో — మనకి తెలియదు, మనం తెలుసుకోలేము కూడా. వాస్తవానికి, ప్రజా, వ్యక్తి జీవిత పరిధులన్నిటిలోను, మొదట అధికసంఖ్యాకవర్గమూ, తరువాత సంపూర్ణ జనసంఖ్య పాల్గొంటూన్నట్టి ఒక సత్వర, వాస్తవ, యథార్థ రాశి పురోగామి ఉద్యమం ఒక్క సోషలిజంకిందనే ఆరంభం కాబోగా, సోషలిజం అంటే అదేదో ఒక నిర్జీవమైనట్టీ, శిలారూపంలో స్తంభించిపోయినట్టీ, ఎల్లకాలానికీ స్థిరపడిపోయినట్టీ విషయమనే మామూలు బూర్జువా భావన ఎంతటి అంతులేని మోసమో తెలుసుకోవడం అత్యంత ముఖ్యమైన విషయం.

ప్రజాస్వామ్యం రాజ్యాంగయంత్రంయొక్క ఒక రూపం; దాని రకాలలో ఒక రకం. ఫలితార్థంగా అన్ని రాజ్యాంగయంత్రాలలాగానే, అది కూడా ఇటు, వ్యక్తులపై నిర్మాణయుతమైన, క్రమబద్ధమైన బలాత్కారప్రయోగాన్ని సూచిస్తూండగా, అటు పౌరుల సమానత్వాన్నీ, రాజ్యాంగయంత్ర రచననూ, దాని పరిపాలననూ నిర్ణయించడానికి అందరికీ సమాన హక్కును లాంఛనప్రాయంగా గుర్తించుతుంది. దీని అనుషంగిక ఫలితంగానే ప్రజాస్వామ్యాభివృద్ధియొక్క ఒక నిర్ణీత దశలో, పెట్టుబడిదారీ విధానానిపై విప్లవాత్మక పోరాటాన్ని సలిపే వర్గాన్ని, శ్రామికవర్గాన్ని, ఐక్యపరచి బూర్జువావర్గపు, రిపబ్లికన్ బూర్జువావర్గపు రాజ్యాంగయంత్రాంగాన్ని సహితమూ, స్థాయీసైన్యాన్నీ, పోలీసుబలగాన్నీ, ఉద్యోగివర్గాన్నీ అణగదొక్కి తుత్తినియలు గావించి, భూమిమీదనుండి తుడిచిపెట్టేయడానికి తోడ్పడి, వాటి బదులు, అంతకంటెనూ ప్రజాస్వామ్యమైన రాజ్యాంగయంత్రాంగాన్ని, జనాభా అంతా పాల్గొనే పౌరసైన్యంగా క్రమాభివృద్ధి చెందిన సాయుధకార్మిక తండోపతండముల రూపంలో ఉన్న తత్రాపి రాజ్యాంగయంత్రాంగాన్ని, నెలకొల్పడం సంభవించుతుంది.

ఇక్కడ "పరిమాణం గుణంగా మారుతూంది": బూర్జువా సమాజంయొక్క హద్దులను అతిక్రమించడమే, దాని సోషలిస్టు పునర్నిర్మాణారంభమే ఇట్టి ప్రజాస్వామ్య స్థాయియొక్క తాత్పర్యం. అందరూ గనుక యథార్థంగా రాజ్యాంగయంత్ర పరిపాలనలో పాల్గొన్న పక్షంలో పెట్టుబడిదారీ విధానం తన పట్టును జారవిడవకతప్పదు. కాగా పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధే, దాని వంతు వచ్చేసరికల్లా, రాజ్యాంగయంత్ర పరిపాలనలో "అందరూ" పాల్గొన గలిగే పూర్వాధారాలను దానంతటదే సృష్టించుతుంది. ఈ పూర్వాధారాల్లో కొన్ని ఇవి: పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోనూ ముందుకు పురోగమించిన వాటిలో ఇదివరకే సాధింపబడినట్టి సార్వజనిక అక్షరాస్యత; తపాలా సదుపాయం, రైల్వేలు, పెద్ద ఫ్యాక్టరీలు, పెద్దస్థాయి వాణిజ్యం, బ్యాంకింగు వ్యాపారాలూ, వగైరా వగైరా బ్రహ్మాండమైన, సామాజిక

పరంగా రూపొందించబడిన క్లిష్టతర ఉపకరణాలూ, వీటివల్ల లక్షలాది కార్మికులు "తర్ఫీదు కాబడి క్రమశిక్షణను పొందడం."

ఈ ఆర్థిక పూర్వాధారాలు ముందుగానే ఉన్నట్టయితే, పెట్టుబడిదారులనూ, ఉద్యోగస్థులనూ కూలదోసిన వెంటనే, ఉత్తరక్షణంలోనే ఉత్పత్తి, పంపకాల కంట్రోలులోనూ, శ్రమ, సరుకుల నివేదనలోనూ, వీరిస్థానంలో సాయుధులైన కార్మికులను, సాయుధ ప్రజానీకాన్నంతనీ నియమించే కార్యాన్ని ప్రారంభించడానికి పూనుకుంటుంది. (శాస్త్రయుక్తంగా తర్ఫీదుపొందిన ఇంజినీర్లు, వ్యవసాయనిపుణులు, ఇత్యాదుల సమస్యతో, కంట్రోలు, సరుకుల నివేదన సమస్యను తారుమారు చేయకూడదు. ఈ పెద్దమనుష్యులు నేడు పెట్టుబడిదార్ల అభీష్టాలకు విధేయులై పనిచేస్తున్నారు; సాయుధులైన కార్మికుల అభీష్టాలకు విధేయులై రేపు మరింత చక్కగా పనిచేస్తారు.)

సరుకుల నివేదన, కంట్రోలు – ఇదీ కమ్యూనిజంయొక్క ప్రథమ దశను సాఫుగానూ సరిగ్గానూ పనిచేసేటట్టు "ఏర్పరచడానికి" ప్రధానమైనది. సాయుధులైన కార్మికులను కలిగి ఏర్పడినట్టి రాజ్యాంగయంత్రంయొక్క వేతనపు ఉద్యోగులుగా పౌరులందరూ మార్పు చెందుతారు. పౌరులు అందరూ, జ్యాతివ్యాపితమైన ఏకైక రాజ్యాంగయంత్ర "సిండికేటు"యొక్క ఉద్యోగులూ కార్మికులూ అవుతారు. పౌరులు అందరూ, సరిసమానంగా పనిచేయడమూ, పనిలో ఉచితమైన భాగాన్ని నెరవేర్చడమూ, సరిసమానమైన వేతనాలను పుచ్చుకోవడమూ – కావలసినదంతా ఇదే. దీనికి వలయు సరుకుల నివేదన, కంట్రోలు పెట్టుబడిదారీ విధానంచే అత్యంత సరళీకృతం చేయబడి, అతి సులభమైనట్టీ, అక్షరాస్యుడైన ప్రతి మనిషీ చేయగలిగినట్టి అజమాయిషీ చేయడమూ, రికార్డు చేయడమూ, నాలుగు గణిత పరికర్మల జ్ఞానమూ, సరైన రశీదులను ఇవ్వడమూ, ఇటువంటి పరికర్మలకిందకి మార్చివేసింది*.

ప్రజలలో అధికసంఖ్యాకవర్గం స్వతంత్రంగానూ సర్వత్రానూ, ఇట్టి సరుకుల నివేదన, పెట్టుబడిదార్లపైనా (ఇప్పుడు ఉద్యోగులుగా రూపొందించబడినట్టి), తమ పెట్టు

---

* రాజ్యాంగయంత్రంయొక్క ఉద్యోగాలలో అధికభాగం కార్మికులవల్ల నెరవేర్పబడగలిగినట్టి సరుకుల నివేదన, కంట్రోలు విధానాలుగానూ సరళీకృతం చేయబడినప్పుడు, రాజ్యాంగయంత్రం ఇక "రాజకీయ రాజ్యాంగయంత్రంగా" ఉండడంపోయి, "ప్రభుత్వోద్యోగాలు వాటికున్న రాజకీయ స్వభావాన్ని కోల్పోయి, సరళమైనట్టి పరిపాలనా నిర్వహణ ఉద్యోగాలుగా మారిపోతాయి" (చూ. IV వ ప్రకరణం, § 2, అరాచకవాదులతో ఎంగెల్స్‌యొక్క వివాదం). (చూ. వి. ఐ. లెనిన్, "రాజ్యాంగయంత్రం విప్లవం," IV వ అధ్యాయనం రచనలు 4 వ కూర్పు, 25 వ సంపుటం. – సం.)

బడిదారీ విధానపు అలవాట్లను విడువక నిలబెట్టుకుంటూన్న మేధావిస్తరపు పెద్దమనుషుల పైనా, ఇట్టి కంట్రోలు నిర్వహించడమూ, ఎప్పుడు సాగించుతారో, అప్పుడు ఈ కంట్రోలు నిజంగా సార్వజనికముగానూ, సర్వసాధారణముగానూ, ప్రజానురంజకముగానూ ఉంటుంది; కాగా దీనినుండి తప్పించుకునే మార్గం ఉండదు; ''మరొక చోటకి పోయే'' అవకాశమూ ఉండదు.

సమాజం సర్వమూ, అందరూ సరిసమాన శ్రమను నెరవేర్చుతూన్నట్టి, సరిసమాన వేతనాలను అందుకుంటూన్నట్టి ఒకేఒక కార్యాలయమూ, ఒకేఒక ఫ్యాక్టరీగా ఏర్పడిపోతుంది.

కాని పెట్టుబడిదార్లను ఓడించిన తరువాత, దోపిడీదార్లను కూలదోసిన తరువాత, సమాజమంతటిపైనా శ్రామికవర్గం విస్తరింపజేసే ఈ ''ఫ్యాక్టరీ'' క్రమశిక్షణ మన ఆదర్శమూ, మన అంతిమగమ్యమూ ఎంతమాత్రమూ కాదు. పెట్టుబడిదారీ దోపిడీయొక్క అపవాదులనన్నింటినీ అసహ్యాలనన్నింటినీ సమాజంనుండి పూర్తిగా వదలగొట్టి సమాజాన్ని పరిశుద్ధం చేయడానికీ, తదుపరి ఇంకా ముందుకు పురోగమించడానికి ఇదొక ఆవశ్యకమైన మెట్టు.

సమాజంలో వుండే అందరూ లేక అత్యధికసంఖ్యాకవర్గమైనా సరే, తమంతటతామే రాజ్యాంగయంత్ర నిర్వహణను నేర్చుకొని, ఈ కార్యాన్ని తమ చేతుల్లోకి తెచ్చుకుని, అల్పాతి అల్పసంఖ్యలో ఉన్న పెట్టుబడిదారులపైన, తమ పెట్టుబడిదారీ అలవాట్లను కాపాడుకో నిచ్చగించే పెద్దమనుషులపైన, పెట్టుబడిదారీ విధానంచే పూర్తిగా చెడగొట్టబడినట్టి కార్మికులపైన కంట్రోలును ''నడిపించే కార్యాన్ని'' ప్రారంభించుతారో — ఆ క్షణంనుండి ఎవ్విధమైనట్టి ప్రభుత్వంయొక్క అవసరమూ పూర్తిగా అంతరించిపోతుంది. ప్రజాస్వామ్యం ఎంత సమగ్రంగా ఉంటే, అది అనవసరమయే తరుణం అంత త్వరగా ఆసన్నమవుతుంది. సాయుధ కార్మికులను కలిగివుండి రాజ్యాంగయంత్రమనే మాటకు ఉన్న సరైన అర్థంలో ఇకనుండి రాజ్యాంగయంత్రమని అనిపించుకోనట్టి ''రాజ్యాంగయంత్రం'' ఎంత హెచ్చుస్థాయిలో ప్రజాస్వామ్యయుతంగా పరిణతి చెందుతుందో, రాజ్యాంగయంత్రంయొక్క ప్రతి రూపమూ అంత త్వరగా హరించిపోవడం ప్రారంభించుతుంది.

సామాజికోత్పత్తి నిర్వహణను నేర్చుకోవడమేకాకుండా, వాస్తవంగా దానిని స్వతంత్రంగా నిర్వహించడమునూ స్వతంత్రంగా సరుకుల నివేదననూ, సోమరిపోతులూ పెద్దమనుషులూ అషాఢభూతులూ, ఈ రకం ''పెట్టుబడిదారీ సంప్రదాయాల సంరక్షకుల'' పైనా కంట్రోలూ చలాయించడమునూ అందరూ అలవర్చుకుంటారో, సరుకుల నివేదన నుండి, ఈ కంట్రోలునుండీ తప్పించుకోవడం విధిగానూ నమ్మశక్యంకాకుండానూ ఎంతో అసాధ్యమైపోయి, అరుదుగా సంభవించే దృష్టాంతంకింద ఎంతగా మారిపోయి, దానికి

ప్రతిఫలంగా విధింపబడే శిక్ష ఎంత సత్వరంగానూ ఎంత కఠినంగానూ (సాయుధులైన కార్మికులు సులువుగా కన్నీరుగార్చే మేధావులుకారు, వారు కార్యశూరులూ, తమతో తేలికగా వ్యవహరించేవారిపట్ల సహనం ప్రదర్శించనివారూ అయిన కారణంగా) ఉంటుందంటే, మానవ సమాజ జీవనానికి మౌలికమైన ఎట్టి సరళ సూత్రాలను పాటించే అవసరమూ అతిత్వరలో ఒక అలవాటుగా ఏర్పడిపోతుంది.

దానితో కమ్యూనిస్టు సమాజంయొక్క ప్రథమ దశనుండి దాని ఉన్నత దశకు మార్పు చెందడానికి, దానితోపాటు రాజ్యాంగయంత్రం పూర్తిగా హరించిపోవడానికి రాజమార్గం ఏర్పడుతుంది.

ఆగస్టు – సెప్టెంబరు 1917

# మార్క్సిజమూ, ఉపప్లవమూ

## ఆర్. ఎస్. డి. ఎల్. పి సెంట్రల్ కమిటీకి లేఖ

ఈనాడు ప్రబలంగా వున్న "సోషలిస్టు" పార్టీలచే అత్యంత దుష్టబుద్ధితోనూ, బహుశా అత్యంత విస్తృతవ్యాపితంగానూ అనుష్ఠించబడుతూన్నట్టి మార్క్సిజం వికృత రూపాల్లో ఒకటి, ఉపప్లవానికి తయారుకావడమూ, ఉపప్లవాన్ని సాధారణంగా ఒక కళగా భావించడమూ "బ్లాంకీజం" కాగలదనే అవకాశవాదతత్వపు అబద్ధం.

మార్క్సిజంపై బ్లాంకీజమనే నేరాన్ని మోపుతూ అవకాశవాద నాయకుడైన బెర్న్ స్టయిన్ ఇప్పటికప్పుడే అప్రతిష్ఠ సంపాదించుకున్నాడు, ఇక మన ఈనాటి అవకాశవాదులు బ్లాంకీజం అని బొబ్బలు పెట్టడంలో బెర్న్ స్టయిన్‌యొక్క ఆ కొద్దిపాటి "భావాలను" ఆవంతైనా మెరుగుపరచడమూ లేదు, "సంపన్నవంతం" చేయడమూ లేదు.

ఉపప్లవాన్ని ఒక కళగా భావించుతున్నందుకు బ్లాంకీజమనే నేరాన్ని మార్క్సిస్టుల మీద మోపుతున్నారు! ఈ విషయాన్ని గురించి అత్యంత స్పష్టము, సునిశితము నిర్ద్వంద్వము అయిన రీతిలో ఉపప్లవం కచ్చితంగా ఒక కళ అని సూచించి, దానిని ఒక కళగా భావించాల్సి వుంటుందనీ, ప్రథమ విజయం సాధించి, శత్రువుకు కల్గే గంద్రగోళం, వగైరాలను ఉపయోగించుకుంటూ శత్రువుపై ఎదురుదాడిని ఒక్క నిమిషమైనా ఆపకుండా సాగించి, ఆ తరువాత ఒక విజయం నుండి మరొక విజయానికి పురోగమించాలని వ్యక్తపరచినది మార్క్స్ అనే సంగతిని ఒక్క మార్క్సిస్టు అయినా కాదని అననప్పుడు, సత్యాన్ని ఇంతకంటె ఘోరంగా వికృతం చేసి చెప్పడం మరొకటేదైనా ఉంటుందా?

ఉపప్లవం జయప్రదమవాలంటే, కుట్ర పైనగాని, ఒక పార్టీ పైనగాని ఆధార పడకుండా, పురోగామి వర్గం పైనే ఆధార పడాలి. ఇది మొదటి అంశం. ఉపప్లవం ప్రజల విప్లవాత్మక వెల్లువ పైన ఆధారపడాలి. ఇది రెండో అంశం. ప్రవర్ధమానమవుతూన్న విప్లవం చరిత్రలో, ప్రజలలోని పురోగామి శ్రేణుల క్రియాశీలత ఉచ్చంలో వున్నప్పుడూ, శత్రు శ్రేణులలోనూ, విప్లవంయొక్క బలహీన, అర్థాసక్త, అనిశ్చిత స్నేహితుల శ్రేణులలోనూ

ఊగిసలాటలు అత్యంత బలంగావున్న నిర్ణయాత్మక క్షణంపై ఉపప్లవం ఆధారపడాలి. ఇది మూడో అంశం. ఉపప్లవ ప్రశ్నను లేవనెత్తేందుకు అవసరమయే ఈ మూడు షరతులూ మార్క్సిజాన్ని బ్లాంకీజం నుండి వేరుపరుస్తున్నాయి.

కాని ఎప్పుడైతే ఈ మూడు షరతులూ హాజరుగా వున్నాయో, అప్పుడు ఉపప్లవాన్ని ఒక కళగా భావించకపోవడం మార్క్సిజానికి ద్రోహమే, ఉపప్లవానికి ద్రోహమే అవుతుంది.

ఉపప్లవం దినకార్యక్రమావళిలో బాహ్యగతాత్మక ఘటనల సంపూర్ణ గమనంవల్ల రూపొందించబడిందనీ, ఉపప్లవాన్ని ఒక కళగా భావించాల్సి వుంటుందనీ పార్టీ ఒప్పుకొనక తప్పని సమయం అచ్చంగా ఇదేనని చూపేందుకు తారతమ్యవిధానం ఉపయోగించడమూ, జూలై 3–4 లను సెప్టెంబరు దినాలతో సరిపోల్చడమూ బహుశా ఉత్తమమార్గ మవుతుంది.

అధికారం హస్తగతం చేసుకోవడమే సరైనదని, సత్యానికి భంగం వాటిల్లకుండానే వాదించడానికి జూలై 3–4 లనాడు వీలుండేది, ఎందుచేతంటే, ఉపప్లవ నేరాన్ని మన శత్రువులు మనపై యేలాగూ మోపి మనల్ని నిర్దాక్షిణ్యంగా శిక్షించివుండేవారు. అయినప్పటికీ ఈ కారణాన అప్పట్లో అధికారం హస్తగతం చేసుకుందుకు నిర్ణయం తీసుకొని వుండడం తప్పే అయి వుండేది, ఎందుచేతంటే, ఉపప్లవం విజయవంత మయేందుకు అవసరమయే బాహ్యగతాత్మక పరిస్థితులు అప్పట్లో లేవు.

1) విప్లవానికి అగ్రగామి అయిన వర్గంయొక్క వత్తాసు మనకప్పట్లో లోపించింది. ప్రధాననగరాలలో[149] కార్మికులలోనూ సైనికులలోనూ అధికసంఖ్యాకవర్గం మనకింకా లేకపోయింది. ఇప్పుడు రెండు సోవియట్లలోనూ అధికసంఖ్యాకవర్గం మనదే. జూలై ఆగస్టుల చరిత్ర, బోల్‌షెవిక్‌లపట్ల "ప్రతీకారముల" అనుభవాలు, కోర్నీలొవ్ ఉదంతం[150] అనుభవాలు, కేవలం ఇవే ఈ అధికసంఖ్యాకవర్గాన్ని సృష్టించాయి.

2) జాతివ్యాపిత విప్లవ వెల్లువ అప్పట్లో లేదు. రాష్ట్రాలలో పరిస్థితులూ, అనేక నగరాల్లో సోవియట్లు అధికారం చేపట్టడమూ రుజువు చేసినట్టుగా, కోర్నీలొవ్ ఉదంతం తరువాత ఇప్పుడుంది.

3) ఆ కాలంలో మన శత్రువులలోనూ, అనిశ్చితులైన పెట్టీబూర్జువావర్గంలోనూ ఊగిసలాట గంభీరమైన రాజకీయ స్థాయిలో లేదు. ఇప్పుడు ఉపద్రవమైన ఊగిసలాట వుంది. మన ప్రధానశత్రువైన మిత్రరాజ్య, ప్రపంచవ్యాపిత సామ్రాజ్యవాదం (ప్రపంచ సామ్రాజ్యవాదానికి "మిత్రరాజ్యాలే" నాయకత్వం వహించి నడుపుతున్నాయి), యుద్ధాన్ని విజయవంతంగా పరిసమాప్తి చేయడమా, లేక రష్యాకు నష్టం కలిగే విధంగా విడి సంధి చేసుకోవడమా, అనే ఈ రెంటి మధ్యా తటపటాయించడం ఆరంభమైంది. మన పెట్టీబూర్జువా సోషల్-డెమోక్రాట్లు తమకుండిన అధికసంఖ్యాకవర్గాన్ని స్పష్టంగా పోగొట్టుకుని, అమితమైన

ఊగిసలాట ప్రారంభించి, ఐక్యసంఘటనను, అనగా కాడెట్లతో మిశ్రమ మంత్రివర్గపు ఏర్పాటును, తిరస్కరించారు.

4) ఇందువేత, జూలై 3–4 లలో ఉపప్లవం పొరపాటే అయివుండేది: భౌతికంగా ఐతేనేమి, రాజకీయంగా ఐతేనేమి, అధికారాన్ని నిలబెట్టుకోవడం మనకి సాధ్యమై వుండేది కాదు. కొన్ని సమయాల్లో పెట్రోగ్రాడ్ మనచేతిలో వుండినప్పటికీ, దానిని మనచేతిలో భౌతికంగా నిలుపుకొని వుండలేకపోయేవారం, ఎందుచేతంటే, అప్పట్లో మన కార్మికులూ సైనికులూ పెట్రోగ్రాడ్‌ను స్వాధీనపరచుకుందుకు చావుకు తెగించి యుద్ధంచేసి వుండేవారుకారు. కేరెన్‌స్కీలు, వీరితోసహా త్సెరెతేలి – చెర్నోవ్‌లు, ఉభయులపట్ల ఆ "ఆటవిక," ఉగ్రద్వేషము ఆనాటికింకా లేదు. బోల్‌షెవిక్‌లపై సాగించబడినట్టి, సోషలిస్టు-రివల్యూషనరీలూ మెన్‌షెవిక్‌లూ పాల్గొన్నట్టి హింసాకాండ అనుభవంవల్ల మన ప్రజ ఇంకా కాకదేరలేదు.

జూలై 3–4 లలో మనం అధికారాన్ని రాజకీయంగా నిలుపుకొనగల్గి వుండేవారం కాదు, కారణమేమంటే, కొర్నీలొవ్ ఉదంతం జరగక పూర్వం, సైన్యమూ రాష్ట్రాలూ పెట్రోగ్రాడ్ మీద పురోగమించడం సాధ్యమయి వుండేది, తథ్యమే అయివుండేది కూడానూ.

ఈనాటి పరిస్థితి పూర్తిగా వేరుగా వుంది.

తనతో కూడా ప్రజారాసులను తీసుకొనిపోగల్గే విప్లవ పురోగామిదళం, ప్రజాపురోగామిదళం అయిన వర్గంలో అధికసంఖ్యాకవర్గం మన పక్షాన వుంది.

ప్రజలలో అధికసంఖ్యాకవర్గం మన పక్షాన వుంది, ఎందుచేతనంటే, సోషలిస్టు-రివల్యూషనరీల ఐక్య సంఘటన చేతినుండి (లేదా సోషలిస్టు-రివల్యూషనరీల చేతినుండి అయినా సరే) రైతాంగం భూమిని పొందదనడానికి, చెర్నోవ్ రాజీనామా ఎంత స్పష్టమూ ప్రత్యక్షమూ అయిన చిహ్నమే అయినప్పటికీ, అది ఒక్కటే చిహ్నం కాదు. కాగా విప్లవం ప్రజాదరణీయ స్వభావం కలిగివుండడానికి అదొక ప్రధాన హేతువు.

తాను అవలంబించాల్సిన మార్గాన్ని దృఢచిత్తంతో తెలుసుకున్న పార్టీ వుండగలిగే లాభకరమైన స్థితిలో మన పార్టీ వుండగా, సామ్రాజ్యవాదం మొత్తంగానూ, మెన్‌షెవిక్ సోషలిస్టు-రివల్యూషనరీ ఐక్యసంఘటన మొత్తంగానూ, నమ్మశక్యం కానంతగా ఊగిసలాడుతున్నాయి.

మన విజయం తథ్యం ఎందుచేతంటే, ప్రజలు ఇంచుమించు నిరాశాస్థితిలో వున్నారు. కాగా, ఇందులోనుండి బయటపడేందుకు మొత్తం ప్రజలందరకూ విశ్వసనీయమైన మార్గం మనం చూపిస్తున్నాం; ఎందువల్లనంటే "కొర్నీలొవ్ దినాల్లో" మన నాయకత్వంయొక్క విలువను ప్రజలందరి ఎదుటా మనం రుజువుచేశాం; అటుతరువాత మనం ఐక్యసంఘటనా

రాజకీయవేత్తలతో రాజీమార్గం ప్రతిపాదించాం కూడా; కాని వారి ఊగిసలాటలు విధివిరామం లేకుండా సాగుతునే వున్నప్పటికీ, వారు ఈ ప్రతిపాదనను తిరస్కరించారు.

మన రాజీ ప్రతిపాదన ఇంకా తిరస్కరించబడలేదనీ, దానిని డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్[151] ఇంకా అంగీకరించవచ్చుననీ అనుకుంటే అది శుద్ధ పొరపాటే అవుతుంది. ఈ రాజీ ప్రతిపాదన ఒక పార్టీచే ఇతర పార్టీలకు సూచించబడింది; దీనిని మరి ఏ ఇతర మార్గంలో ప్రతిపాదించేందుకూ వీలుపడి వుండేదికాదు. ఇతర పార్టీలు దానిని తిరస్కరించాయి. డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్ ఒక కాన్ఫరెన్సే తప్ప, అంతకు మించి మరేమీ కాదు. ఒక విషయాన్ని మనం విస్మరించ కూడదు, అదేమిటంటే, విప్లవాత్మక ప్రజలో అధికసంఖ్యాకవర్గానికి, పేదరికం అనుభవించి, మనస్సు విరిగిపోయినట్టి రైతాంగానికి అందులో ప్రాతినిధ్యంలేదు. ప్రజలో అల్పసంఖ్యాక వర్గంయొక్క కాన్ఫరెన్సు అది — ఈ ప్రత్యక్ష సత్యాన్ని మనం విస్మరించకూడదు. ఈ డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్‌ను ఒక పార్లమెంటుగా మనం భావించినట్లయితే, శుద్ధ పొరపాటే అవుతుంది, మన పక్షాన శుద్ధ పార్లమెంటరీ జడ్డితనమే తప్ప మరొకటికాదు; ఎందువల్ల నంటే, తాను ఒక పార్లమెంటుగా, విప్లవంయొక్క సార్వభౌమాధికారంగల పార్లమెంటుగా, అది ప్రకటించుకున్నప్పటికైనా సరే, అది దేనినీ నిర్ణయించజాలదు. నిర్ణయం తీసుకునే శక్తి దాని చేతిలో లేదు. ఆ శక్తి పెట్రోగ్రాడ్, మాస్కో శ్రామికవర్గపు పేటల్లో వుంది.

ఉపప్లవం విజయవంతం కావడానికి అవసరమైన బహ్యాగతాత్మక పరిస్థితులన్నీ హాజరై వున్నాయి. ప్రజలను నలిపి పిప్పిచేసినట్టీ, ఈ భూప్రపంచంమీద వున్న బాధలన్నిటిలోనూ అత్యంత బాధాకరమైనట్టి ఊగిసలాటను మన విప్లవ విజయం ఒక్కటే అంతమొందించగలిగే అసాధారణంగా లాభకరమైన పరిస్థితి మనకు తారసిల్లుతూంది; మరింత సంపూర్ణంగానూ న్యాయంగానూ వుండి, మరింత ముందుగానే జరిగేటట్టి శాంతిని, విప్లవానికి మేలు చేకూర్చేటట్టి శాంతిని, బహిరంగంగా ప్రతిపాదించడం మూలంగా విప్లవానికి వ్యతిరేకంగా ఉద్దేశించబడినట్టి ఒక విడి శాంతి కపటనాటకాన్ని కేవలం ఉపప్లవంలో మన విజయం ఒక్కటే వమ్ము చేయ గలిగేటట్టి పరిస్థితి ఇది.

చిట్టచివరి విషయం, విజయవంతమైన ఉపప్లవాన్ని చేపట్టడం ద్వారా మన పార్టీ ఒక్కటే పెట్రోగ్రాడ్‌ను రక్షించగల్గుతుంది; ఎందుచేతంటే, మన శాంతి ప్రతిపాదన తిరస్కరించబడిందంటే, కనీసం యుద్ధవిరమణ అయినా మనం సాధించలేకపోతే, అప్పుడు మనం "రక్షణవాదుల" మవుతాం, అప్పుడు మనం యుద్ధ పార్టీల అగ్రాన్ని నిలబడుతాం, అప్పుడు మనం అందరికంటె భేషైన "యుద్ధ పార్టీ" అయి, యథార్థమైన విప్లవమార్గంలో యుద్ధాన్ని సాగించుతాం. బ్రెడ్డునీ బూడ్సులనూ పెట్టుబడిదార్లనుండి సొంతమూ మనం లాక్కుంటాం.

తినడాని కేవలం రొట్టెపెచ్చులూ, కాళ్ళకి నారజోళ్ళూ మాత్రమే వాళ్ళకిస్తాం. బ్రెడ్డునీ, బూడ్సులనూ సొంతమూ యుద్ధశ్రేణికి పంపించివేస్తాం.

ఇక అప్పుడు మనం పెట్రోగ్రాడ్‌ను రక్షించుతాం.

యథార్థమైన విప్లవయుద్ధానికి అవసరమైన భౌతిక, ఆధ్యాత్మిక వనరులు రెండూ రష్యాలో ఇంకా అపరిమితంగా వున్నాయి; కనీసం యుద్ధవిరమణనైనా జర్మన్లు ఒప్పుకోవడం నూటుకి తొంభైతొమ్మిది పాళ్ళు నిశ్చయంగానే కనబడుతూంది. కాగా ఇప్పుడు యుద్ధ విరమణను మనం సాధించామంటే, సర్వప్రపంచాన్నీ జయించామన్న మాటే.

* * *

విప్లవాన్ని రక్షించేందుకూ, రెండు మిత్రమబృందాల సామ్రాజ్యవాదులచే "విడి" విభజననుండి రష్యాను రక్షించేందుకూ పెట్రోగ్రాడ్, మాస్కో కార్మికుల ఉపప్లవంయొక్క కేవల ఆవశ్యకతను గుర్తించిన తరువాత, దినదినాభివృద్ధి పొందుతూన్న ఉపప్లవ పరిస్థితులకు అనుగుణ్యంగా మనం కాన్ఫరెన్సులో అవలంబించబోయే ఎత్తుగడలను మనం మొట్టమొదట రూపొందించుకోవాలి; ఇక రెండోది, ఉపప్లవాన్ని ఒక కళగా భావించాల్సి వుంటుందనే మార్క్సీయ భావనపట్ల మన అంగీకారం కేవలం నోటిమాటలతో అంగీకారం కాదని మనం రుజువుచెయ్యాలి.

సంఖ్యకోసం మాత్రమే తాపత్రయపడకుండానూ, తటపటాయించేవారు తటపటా యింపు శిబిరంలోనే వుండిపోయినప్పటికీ భయపడకుండానూ, కాన్ఫరెన్సులో మనం వెంటనే ఒక సంయుక్త బోల్‌షెవిక్ గ్రూపును ఏర్పరచాలి: నిశ్చలులూ, దృఢసంకల్పులూ అయిన యోధుల శిబిరంలో కంటె ఈ తటపటాయింపు జనం అక్కడ వుండడం వల్లనే విప్ల వోద్యమానికి వారు ఎక్కువ లాభంచేసిన వారవుతారు.

సుదీర్ఘోపన్యాసాల యొక్క, సాధారణంగా "ఉపన్యాసాల" యొక్క అసందర్భత గురించి ఎంత నిశితంగా నొక్కిచెప్పాలో అంత నిశితంగా నొక్కిచెబుతూ, విప్లవాన్ని రక్షించే తక్షణ కార్యావశ్యకతనూ, బూర్జువావర్గంతో సొంతమూ తెగతెంపులు చేసుకోవాల్సినట్టీ, ప్రస్తుత ప్రభుత్వాన్నంతనీ తొలగించివేయాల్సినట్టీ, రష్యాను "విడిగా" విభజించే ఏర్పాట్లు కావించు తూన్న ఆంగ్లో-ఫ్రెంచి సామ్రాజ్యవాదులతో సంబంధాలు సంపూర్ణంగా తెంచుకోవాల్సి నట్టీ, యావత్తు అధికారాన్నీ విప్లవాత్మక శ్రామికవర్గ నాయకత్వాన విప్లవాత్మక ప్రజాస్వా మ్యానికి తక్షణం బదిలీ చేయాల్సినట్టీ అత్యంతావశ్యకతనూ నొక్కిచెబుతూ బోల్‌షెవిక్‌ల సంక్షిప్త ప్రకటనొకదానిని మనం తయారు చెయ్యాలి.

ప్రజలకు శాంతి, రైతులకు భూమి, దారుణంగా సంపాదించిన లాభాలను జప్తు

చేయడం, దారుణ ఉత్పత్తి విధ్వంసక కృత్యాలను అదుపులోకి తీసుకురావడం — ఈ కార్యక్రమ ప్రతిపాదన సందర్భంలో పై పర్యవసానం యొక్క సంక్షిప్త సూత్రీకరణ, అత్యంత సంక్షిప్త సూత్రీకరణ, మన ప్రకటనలో వుండాలి.

ప్రకటన ఎంత సంక్షిప్తంగానూ, ఎంత ఘాటుగానూ వుంటే అంత మంచిది. అత్యంత ముఖ్యమైన మరో రెండు విషయాలను మాత్రం, అవేవనగా, ఊగిసలాటలపట్ల ప్రజలు విసుగు చెందుతున్నారనీ, సోషలిస్టు-రివల్యూషనరీల మెన్‌షెవిక్‌ల అనిశ్చయత ప్రజలకు బాధాకరంగా వుందనీ; విప్లవానికి వీరు ద్రోహం చేసినందువల్ల ఈ పార్టీలతో మనం నిష్కర్షగా తెగ తెంపులు చేసుకుంటున్నామనీ అందులో స్పష్టంగా సూచించాలి.

ఇంకా మరొక విషయం. అన్యాక్రమణలు లేని శాంతిసంధిని ప్రతిపాదించడం వల్లనూ, మిత్రరాజ్యాల సామ్రాజ్యవాదులతోనూ, సామ్రాజ్యవాదులందరితోనూ వెంటనే తెగతెంపులు చేసుకోవడం వల్లనూ, యుద్ధవిరమణనైనా వెంటనే సాధించుకోగల్గుతాం, లేదా యావత్తు విప్లవాత్మక శ్రామికవర్గమూ దేశరక్షణకై సమీకృతమవుతుంది; కాగా అప్పుడు శ్రామికవర్గం యొక్క నాయకత్వాన విప్లవాత్మక ప్రజాస్వామ్యం యథార్థమైన విప్లవాత్మక యుద్ధం సాగించుతుంది.

ఈ ప్రకటన చదివిన తరువాతనూ, కబుర్లు చెప్పడం కాకుండా నిర్ణయాల కోసమూ, తీర్మానాలు రాయడం కాకుండా కార్యాచరణ కోసమూ విజ్ఞప్తి చేసిన తరువాతనూ, మన గ్రూపు నంతనూ ఫ్యాక్టరీల్లోకీ సైనిక బారకాసుల్లోకీ మనం పంపించాలి, వారి స్థానం అక్కడుంది, అక్కడుంది జీవనాడి, అక్కడుంది విప్లవం విముక్తికి మూలాధారం, అక్కడేవుంది డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్‌కు చలనశక్తి కూడానూ.

ఉత్సాహవంతమూ, ఉద్రేకపూరితమూ అయిన ఉపన్యాసాలతో మన కార్యక్రమాన్ని మనమక్కడ విశదీకరించుతూ, మన కార్యక్రమాన్ని సంపూర్ణంగా కాన్ఫరెన్స్ అంగీకరించడం, లేకపోయేమాటుంటే ఉపప్లవం — ఈ ప్రత్యామ్నాయాన్ని మనం తెలియపర్చాలి. మధ్యేమార్గం మరిలేదు. విలంబన ఇక అసాధ్యం. విప్లవం మృత్యువాత పడిపోతూంది.

ఈ రూపంలో ప్రశ్నను వేయడంలో, మన యావత్తు గ్రూపునూ ఫ్యాక్టరీలలో బారకాసులలో సాంద్రీకరించడంవల్ల ఉపప్లవాన్ని ప్రారంభించడానికి సరైన మహూర్తాన్ని నిర్ణయించేందుకు మనకు వీలవుతుంది.

కాగా, ఉపప్లవాన్ని మార్క్సిస్టు మార్గంలో, అనగా ఒక కళగా, భావించేందుకుగాను, అదే సమయంలో మనం ఒక్క నిమిషమైనా ఆలస్యం చేయకుండా, ఉపప్లవ సైనిక దళాల ప్రధాన సైనికాధికార సిబ్బందిని ఏర్పాటుచేసి, మన సైనికబలాలను పంపిణీచేసి, అన్నిటికంటె ముఖ్యమైన స్థానాలకు విశ్వసనీయులైన రెజిమెంట్లను తరలించి, అలెగ్జాండ్రిన్‌స్కి

నాటకశాలను ముట్టడించి, పీత్రొపావ్‌లొవ్‌స్కి కోటను[152] ఆక్రమించుకుని, కేంద్ర సైనికాధికార సిబ్బందినీ, ప్రభుత్వాన్నీ అరెస్టుచేసి, మిలిటరీ కెడెట్లపైనా,[153] ఆటవిక డివిజన్‌పైనా,[154] పట్టణ మధ్యభాగాలలోకి శత్రువును చొరనీకుండా ప్రాణాలను ఒడ్డిపోరాడే సాయుధదళాలను మనం పంపాలి; సాయుధ కార్మికులను మనం యుద్ధానికై తరలించి, ఆఖరి మొండి యుద్ధాన్ని సాగించాలనీ, వెంటనే టెలిగ్రాఫ్ కార్యాలయాన్నీ టెలిఫోన్ ఎక్స్ఛేంజినీ ఆక్రమించుకుని, మన ప్రధాన సైనికాధికార సిబ్బందిని కేంద్ర టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో ఉంచి, అన్ని ఫ్యాక్టరీలతోనూ, అన్ని రెజిమెంట్లతోనూ, సాయుధ సంఘర్షణ స్థానాలు, వగైరాలన్నిటితోనూ టెలిఫోన్ సంబంధాలు ఏర్పరచాలనీ పిలుపు ఇవ్వాలి.

ఈ క్షణంలో మార్క్సిజమ్ పట్ల భక్తివిశ్వాసాలు కలిగివుంటూ, విప్లవం పట్ల భక్తివిశ్వాసాలు కలిగివుంటూ, ఉపప్లవాన్ని ఒక కళగా భావించకుండా వుండేందుకు వీల్లేదని చూపేందుకు ఇదంతా సహజంగా ఒక ఉదాహరణగానే చెప్పడమైంది.

ఎన్. లెనిన్

సెప్టెంబరు 13–14 (26–27), 1917.

# ప్రేక్షకుని సలహా

ఈ పంక్తులను నేను అక్టోబరు 8 ని రాస్తున్నాను, కాని ఇవి పెట్రోగ్రాడ్ కామ్రేడ్లకు 9 కి అందుతాయని నాకేమంత ఆశలేదు. అక్టోబరు 10 కే ఉత్తరాది సోవియట్ల కాంగ్రెస్ జరుపడానికి నిశ్చయమవడంచేత బహుశా ఈ పంక్తులు ఆనాటికిగాక అంతకంటే బాగా ఆలస్యంగా అందవచ్చు కూడాను. అయినప్పటికీ, పెట్రోగ్రాడ్, ఆ యావత్తు "ప్రాంతపు" కార్మికులు, సైనికులు తలపెట్టిన కార్యం త్వరలోనే జరగనున్నట్టీ, కాని ఇంతవరకు జరగనట్టీ సందర్భంలో నా "ప్రేక్షకుని సలహా" ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

సర్వాధికారమూ సోవియట్లకే చెందాలన్నది స్పష్టమే. సాధారణంగా యావత్తు ప్రపంచపు, అందులోనూ ప్రత్యేకంగా, యుద్ధంలో పాల్గొంటూన్న దేశాలయొక్క, కష్టజీవుల, పీడితుల, అందులోనూ మరీ ప్రత్యేకంగా రష్యన్ రైతాంగంయొక్క పరిపూర్ణ సానుభూతీ, సంపూర్ణ సహాయమూ విప్లవాత్మక-శ్రామికవర్గ అధికారానికే (లేదా బోల్షెవిక్ అధికారానికే — ఈ రెండూ ఇప్పుడు ఒకటే) చెందాలనేది నిశ్చయమైందన్నది ప్రతి బోల్షెవిక్‌కీ నిస్సందేహంగా నిర్వివాదమైన విషయమే. అందరకి తెలిసినట్టీ, బహుకాలంగా రుజువు అయినట్టీ ఈ సత్యాలను గురించి సుదీర్ఘంగా వివరించడంలో అర్థమేమీలేదు.

ఇప్పుడు వివరించాల్సిన విషయం ఒకటుంది, కామ్రేడ్లందరకూ అది అంత స్పష్టంగా వుండకపోవడం సంభవమే కూడా; అదేమిటంటే: సోవియట్లకే అధికారం చెందడమంటే ఇప్పుడు ఆచరణలో దాని అర్థం సాయుధ ఉపప్లవమన్నమాట. ఇది ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది, కాని దీని గురించి అందరూ పర్యాలోచించలేదు, లేదా కొందరు ఇంకా పర్యాలోచించుతూనే వున్నారు. సాయుధ ఉపప్లవాన్ని ఇప్పుడు కాదనడమంటే, బోల్షెవిజం ప్రధాన నినాదాన్నీ (సర్వాధికారమూ సోవియట్లకే), సాధారణంగా విప్లవాత్మక-శ్రామికవర్గ అంతర్జాతీయ వాదాన్నీ కాదనడమే.

కాని సాయుధ ఉపప్లవం రాజకీయ పోరాటంయొక్క, శ్రద్ధతో పర్యాలోచించాల్సినట్టి విశేష నియమాలచే పరిపాలితమవుతూన్నట్టి విశేషరూపం. ''యుద్ధం ఎటువంటి కళో, దానితో సరిసమానమైన కళే ఉపప్లవమూనూ,'' అని కారల్ మార్క్స రాయడంలో, ఈ సత్యాన్ని అతడు అద్భుతమైన ప్రాముఖ్యతతో వ్యక్తంచేశాడు.

ఈ కళయొక్క ప్రధాన నియమాలను మార్క్స ఈ విధంగా సూచించాడు:

1) ఉపప్లవంతో ఎన్నడూ ఆటలాడ కూడదు, కాని ఒకసారి ఆరంభించితే మాత్రం, దానిని చివరకంటా సాగించాల్సిన విషయం దృఢంగా ఆకళింపు చేసుకోవాలి.

2) నిర్ణయాత్మక స్థానంలో, నిర్ణయాత్మక క్షణంలో అత్యంత శ్రేష్ఠాధిక్యతను గల బలాలను సాంద్రీకరించాలి, లేనియెడల ఇంతకంటె ఉత్తమ సన్నద్ధత, ఆర్గనైజేషనూ కలిగివున్న శత్రువు ఉపప్లవకారులను నాశనం చేసివేస్తాడు.

3) ఒకసారి ఉపప్లవం ఎప్పుడైతే ప్రారంభమైందో, ఇక అత్యంత కృతనిశ్చయంతో కార్యాన్ని సాగించాలి, కాగా అన్నివిధాలుగానూ తప్పకుండానూ ఎదురుదాడికి దిగాలి. ''దెబ్బ కాచుకోవడము ప్రతి సాయుధ విద్రోహానికీ మృత్యుసదృశమే''.

4) శత్రువుమీద అకస్మాత్తుగా పడి, అతని బాలాలు ఎప్పుడైతే చెదిరి వుంటాయో ఆ క్షణాన్ని ఎంచి అతని మీద అప్పుడు దాడిచేయడానికి యత్నించాలి.

5) విజయాలు స్వల్పములే అయినప్పటికి సహితమూ ప్రతిదినమూ (ఒకే పట్నంలో గనుక అయితే, గంటగంటకూ అని కూడా చెప్పవచ్చు) వాటిని సాధించడానికి పాటు పడాలి, కాగా ఏది ఏమైనా సరే, ''నైతిక ప్రాబల్యం'' మాత్రం నిలబెట్టుకోవాలి.

నేటికి తెలిసినంత వరకు ''విప్లవాత్మక రాజనీతిలో నిరుపమాన ప్రతిభాసమన్వితుడు డేంటన్ నుడివిన: సాహసం, సాహసం, ఇంకా సాహసం'' అనే వాక్యంలో సాయుధ ఉపప్లవానికి సంబంధించినంత వరకూ అన్ని విప్లవాల గుణపాఠాల సంగ్రహ సారాంశాన్ని మార్క్స తేల్చి చెప్పాడు.

ఈ వాక్యాన్ని రష్యాకూ, 1917 అక్టోబరుకూ అనుప్రయుక్తం చేస్తే, దాని అర్థం ఇలావుంటుంది: పెట్రోగ్రాడ్‌పై, పట్నం లోపలినుండి – కార్మిక పేటల్లోనుండీ, వెలుపల నుండీ, ఫిన్‌లాండ్ నుండీ, రేవెల్ నుండీ, క్రోన్‌స్టాడ్ట్ నుండీ తప్పకుండా సాగించాల్సినట్టి సాధ్యమైనంత ఆకస్మికమూ త్వరితమూ అయినట్టి ఏకసమయపు విజృంభణ, యావత్తు నౌకాదళంయొక్క ఎదురుదాడి; మన ''బూర్జువా గార్డ్'' (మిలిటరీ ఆఫీసర్ల పాఠశాలల విద్యార్థులు), మన ''వెండియాన్ సైనిక బలాలు'' (కోసక్కులలో కొంత భాగం),[155] వగైరాల 15,000 లేక 20,000 (బహుశా ఇంకా హెచ్చే వుంటాయేమో కూడా) సేనను మించిన బ్రహ్మాండమైన అత్యధిక శ్రేష్ఠతను కలిగిన సైనికబలాలను సాంద్రీకరించడం.

మన మూడు ప్రధాన సైనిక బలాలను — నౌకాదళం, కార్మికులు, సైనికుల యూనిట్లూ — మనం ఏ విధంగా మిశ్రమంచేసి ఉపయోగించాలంటే, ఎ) టెలిఫోన్ ఎక్స్ఛేంజినీ; బి) టెలిగ్రాఫ్ ఆఫీసునీ; సి) రైల్వేస్టేషన్లనూ; డి) అన్నిటికంటె ముఖ్యంగా వంతెనలనూ, తప్పకుండా ఆక్రమించుకుని, ఎంతటి త్యాగానికైనా వెనుదీయకుండా వాటిని తమ స్వాధీనంలో వుంచుకోవాలి.

నిరుపమానమైన దృఢసంకల్పం కలిగిన మూలద్రవ్యాలను (మన "షాక్ సైనిక బలాలూ," మన యువకార్మికులూ, వీరితోపాటు నావికులలో శ్రేష్ఠులను) చిన్న చిన్న దళాలుగా ఏర్పాటుచేసి, వాటిని అన్ని ముఖ్య స్థానాలనూ ఆక్రమించుకోడానికీ, అన్ని ముఖ్య యుద్ధ చర్యలలోనూ, సర్వత్రానూ పాల్గొనేందుకూ వినియోగించాలి; ఉదాహరణకు:

పెట్రోగ్రాడ్‌ను చక్రబంధంలో ఇరికించి, ఇతర స్థలాలతో దానికున్న సంబంధాలను ఛేదించడం; నౌకాదళం, కార్మికులు, సైనిక బలాలు సంయుక్తంగా దాడిచేసి ఆ పట్టణాన్ని వశపరచుకోవడం; — ఈ కర్తవ్య సాధనకు కళ, త్రిగుణీకృత సాహసమూ అవసరం.

శత్రు "కేంద్రాలపై" (మిలిటరీ ఆఫీసర్ల పాఠశాలలు, టెలిగ్రాఫ్ ఆఫీసు, టెలిఫోన్ ఎక్స్ఛేంజి, వగైరాలు) దాడిచేసి, వాటిని చుట్టుముట్టేందుకు, రైఫిళ్లతోనూ బాంబులతోనూ ఆయుధులైన ఉత్తమ కార్మికులను కల్గి ఏర్పడిన దళాలను నిర్మించడం. "మా అందరి ప్రాణాలు పోయినా సరే శత్రువును మాత్రం తప్పించుకు పోనివ్వం!" అని వుండాలి వారి నినాదం.

కార్యాచరణే గనుక నిశ్చయించ బడినట్టయితే, డాంటన్, మార్క్స్‌ల మహత్తర సూక్తులను మన నాయకులు జయప్రదంగా అనుప్రయుక్తం చేస్తారనే ఆశించుదాం.

రష్యన్ విప్లవం, ప్రపంచ విప్లవమూ, రెండింటి విజయమూ రెండు, మూడు దినాల పోరాటంపైన ఆధారపడి వుంటుంది.

అక్టోబరు 8 (21), 1917.

# జ్యోతిష వచనాలు

దేవుని ధర్మమా అంటూ ఈ రోజుల్లో అద్భుతాలంటే ఎవరికీ నమ్మకంలేదు. అద్భుత జోస్యం కాకమ్మ కథే. కాని విజ్ఞాన శాస్త్రీయంగా జ్యోతిషం చెప్పడం మాత్రం వాస్తవవిష యమే. కాగా సిగ్గుచేటైన నిస్పృహ, అంతే కాకుండా నిరాశ సహితం ఎంతో తరుచుగా మన చుట్టూ మనకు తారసిల్లుతూన్న ఈ రోజుల్లో, యథార్థంగా జరిగిన ఒక విజ్ఞానశాస్త్రీయపు జోస్యం గురించి జ్ఞాపకం తెచ్చుకోవడం ఉపయోగకరంగా వుంటుంది.

సిగిస్‌ముండ్ బోర్క్‌హైమ్ రచించిన "1806–1807 నాటి జర్మన్ సర్వోత్కృష్ట దేశభక్తుల జ్ఞాపకార్థం" ("Zur Erinnerung für die deutschen Mordspatrioten 1806—1807"), అనే పాంఫ్లెట్‌కి 1887 లో ఫ్రెడరిక్ ఎంగెల్స్ పీఠిక రాస్తూ, రానున్న ప్రపంచ యుద్ధం గురించి అందులో ప్రస్తావించడం జరిగింది. ("సోషల్-డెమోక్రాటిక్ లైబ్రరీ" గ్రంథమాలలో నెం. 24 గ్రంథంగా ఈ పాంఫ్లెట్ 1888 లో హోట్టింగెన్-జ్యూరిచ్‌లో ప్రచురించబడింది.)

భావి ప్రపంచయుద్ధం గురించి ముప్పై యేళ్ల కిందట ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఈ విధంగా రాశాడు:

"...ప్రష్యా – జర్మనీకి ప్రపంచయుద్ధం తప్ప, అదైనా ఎటువంటి ప్రపంచయుద్ధ మంటే వ్యాప్తిలోనూ దౌర్జన్యంలోనూ ఇంతవరకెన్నడూ ఊహించనట్టి ప్రపంచయుద్ధం తప్ప, మరొక యుద్ధమేదీ ఇకమీదటనుండి సాధ్యంకాదు. ఎనభై లక్షలు మొదలు కోటి వరకూ సైనికులు ఒకరి పీకలు ఒకరు ఉత్తరించుకుంటారు. కాగా ఈ హత్యాకాండలో ఇంత వరకు ఏ మిడుతుల దండూ నాశనం చేయనంతగా వీరు యూరప్ నంతనూ నగ్నంగా కొల్లగొట్టి, తరువాత కబళించి వేస్తారు. ముప్పై సంవత్సరాల సంగ్రామాన్ని మూడు నాల్గేళ్లకు కుదించివేసి, యావత్తు యూరప్ భూభాగంపై విస్తరింపజేయడం; కఠినాతికఠినమైన దురవస్థ ఫలితంగా ప్రాదుర్భవించిన కరువు, రోగమూ సైన్యాలలోనూ ప్రజారాసులలోనూ

సర్వసాధారణంగా మనోనిబ్బరం సడలిపోవడమూ, వాణిజ్య, పారిశ్రామిక, పరపతి రంగాలలో మనం సృష్టించిన కృత్రిమ యంత్రాంగంలో నిరాశాపూరితమైన గంద్రగోళం ప్రవేశించి, చిట్ట చివరకు సర్వసాధారణపు దివాళా స్థితితో అంతమవడం; పదులూ పాతికల సంఖ్యలో కిరీటాలు నడివీధుల్లో దొర్లుతూండగా వాటిని ఎవ్వరూ ఏరుకోనైనా ఏరుకోనంతగా పాత రాజ్యాలూ వాటి సాంప్రదాయిక రాజ్యాంగధురీణతా కుప్పకూలిపోవడం; ఇదంతా ఎలా అంతమవుతుందో, ఈ పోరాటంలో విజేతలుగా ఎవరు చివరకు నిలబడతారో ముందుగానే తెలుసుకొన శక్యం కానంతటి పరమ అసాధ్యత; దీనంతటికీ కేవలం ఒకే ఒక్క ఫలితం మాత్రం తప్పక నిశ్చయం: సర్వసాధారణ గ్లాని, దానితోపాటు కార్మికవర్గ అంతిమ విజయానికై పరిస్థితుల స్థాపన.

"అంతిమస్థాయి వరకు సాగించబడిన ఈ పరస్పర ఆయుధ ప్రతిస్పర్ధ వ్యవస్థ చివరకు ఇట్టి అనివార్య ఫలితాలకు దారితీయడమే దీని భవిష్యత్తు. ఓ ప్రభువులారా, చక్రవర్తులారా, రాజనీతి దురంధరులారా, చూడండి ఈ వృద్ధ యూరప్‌ను మీ విజ్ఞత ఏ స్థితికి తీసుకువచ్చిందో! ఇక అంతిమ యుద్ధ విలయతాండవం ప్రారంభించడం తప్ప మరే కార్యమూ మీకు మిగలనప్పుడు—కానియ్యండి, మాకు సరిపడేదీ అదే (uns kann es recht sein). యుద్ధం మమ్మల్ని బహుశా పూర్వరంగానికి తాత్కాలికంగా నెట్టివేయవచ్చు, మేము ఇది వరకు విజయవంతంగా సాధించుకున్న అనేక స్థానాలను యుద్ధం మా చేతిలోనుండి గుంజుకోవచ్చు; కాని ఇకమీదటినుండి మీరు మీ అదుపాజ్ఞలలో వుంచజాలనట్టి విశృంఖల శక్తులు ఎప్పుడైతే మీకు ముఖాముఖీ ఎదురవుతాయో, అప్పుడు వాటి ఇష్టప్రకారమే సంగతులు జరుగుతాయి: ఈ విషాదాంత నాటకం అంతమయ్యే ముందే మీరు నాశనమైపోతారు, కాగా శ్రామికవర్గ విజయం అప్పటికప్పుడే సాధించడమైనా జరిగివుంటుంది, లేదా అధమపక్షం (doch) అనివార్యమేనా అవుతుంది.

"లండన్, డిసెంబరు 15, 1887. (ఫ్రెడరిక్ ఎంగెల్స్)"

ఎంత ప్రతిభాన్వితమైన జోస్యమో ఇది! కాగా నిశితమూ, స్పష్టమూ, సంక్షిప్తమూ, శాస్త్రీయమూ అయిన ఈ వర్గ విశ్లేషణలో ప్రతి వాక్యమూ ఎంత అనంతభావగర్భితంగా వుందో కదా! విశ్వాసరాహిత్యం, నిస్పృహ, నిరాశలకు ఈనాడు సిగ్గుచేటుగా లొంగిపోతూన్నవారు, బూర్జువావర్గానికి వంగివంగి నమస్కారాలు చేయడం అలవాటుపడినవారు, లేదా బూర్జువా వర్గపు బెదరింపులకు హడలిపోయేవారూ, తమంతట తాము ఒక్కసారి, ఒక్కసారి ఆలోచించుకున్నా, ఆలోచించడానికి సామర్థ్యం కలిగివున్నా, దీనినుండి నేర్చుకోవాల్సింది ఎంత వుందో కదా!

ఎంగెల్సు చెప్పిన జోస్యాల్లో కొన్ని యథార్థాలు కాలేదు: ముప్పై యేళ్ళ సామ్రాజ్య వాద ఉధృతాభివృద్ధి కాలంలో ప్రపంచమూ పెట్టుబడిదారీ విధానమూ మార్పు చెంద కుండా వుంటుందని ఎవ్వరూ అనుకోరు. కాని అత్యంత అద్భుతమైన విషయం ఏమిటంటే, ఎంగెల్సు చెప్పిన జోస్యాలలో అనేకములు ''అక్షరాలా'' నిజమయ్యాయి. ఎందుచేతంటే, ఎంగెల్సు చేసిన వర్గవిశ్లేషణ సంపూర్ణంగా యథార్థం, కాగా వర్గాలూ, వాటి పరస్పర సంబంధాలూ మార్పులేవీ లేకుండా ఎప్పట్లాగే వుండిపోయాయి.

''...యుద్ధం మమ్మల్ని బహుశా పూర్వరంగానికి తాత్కాలికంగా నెట్టివేయవచ్చు....'' అచ్చంగా ఈ మార్గాల్లోనే జరిగాయి పరిణామాలు, అంతేకాదు ఇంతకంటే మరింత ముందుకే మరింత అధ్వాన్నంగానే సాగాయి: ''వెనక్కి నెట్టివేయబడినట్టి'' సోషల్-జాతీయ దురహంకారులలో కొందరూ, వారి ప్రత్యర్థులైనట్టి వెన్నెముకలేని ''అర్ధశత్రువులు'' కౌట్‌స్కీయానుచరులూ, తమ తిరోగమన చలనాన్ని స్తుతించుకోవడం ఆరంభించి, సోషలి జానికి ప్రత్యక్ష విశ్వాసఘాతకులుగానూ ద్రోహులుగానూ తయారయ్యారు.

''...మేము ఇదివరకు విజయవంతంగా సాధించుకున్న అనేక స్థానాలను యుద్ధం మా చేతుల్లోనుండి బహుశ గుంజుకోవచ్చు....'' ''చట్టబద్ధములైన'' సా నాలు అనేకం కార్మిక వర్గం నుండి గుంజుకోబడ్డాయి. కాని అందుకు పైపెచ్చు, కష్టాలవల్ల అది మరింత కాకలు తేరి, చట్టవిరుద్ధమైన ఆర్గనైజేషన్లను ఏర్పరచడంలోనూ, విప్లవాత్మకమైన దాడికై తన శక్తులను సిద్ధం చేసుకోవడంలోనూ, కఠినములే అయినప్పటికీ శ్రేయస్కరము లైన గుణపాఠాలనే అది నేర్చుకుంటూంది.

''...పదులూ పాతికల సంఖ్యలో కిరీటాలు దొర్లుతాయి....'' కొన్ని కిరీటాలు అప్పుడే నేలరాలాయి. కాగా వాటిలో ఒకటి — కడమవాటిలో కొన్ని పదులూ పాతికలతో అది సమానం — అఖిల రష్యన్ల నిరంకుశ చక్రవర్తి నికోలస్ రొమానొవ్ కిరీటం.

''... ఇదంతా ఎలా అంతమవుతుందో ముందుగానే తెలుసుకొన శక్యంకానంతటి పరమ అసాధ్యత....'' నాల్గు సంవత్సరాల యుద్ధం తర్వాత, ఈ పరమ అసాధ్యత, మరోవిధంగా చెప్పేందుకు వీలుంటే, మరింతగా పరమమైంది.

''...వాణిజ్య, పారిశ్రామిక, పరపతి రంగాలలో మనం సృష్టించిన కృత్రిమ యంత్రాం గంలో నిరాశాపూరితమైన గంద్రగోళం....'' పెట్టుబడిదార్లచే యుద్ధంలోకి దించబడిన రాజ్యాలన్నిటిలోనూ అత్యంత బడుగు రాజ్యం — రష్యా విషయంలో, యుద్ధం నాల్గో సంవత్స రాంతమందు ఇది పూర్తిగా నిజమైందని రుజువుచేయబడింది. అయితే, జర్మనీలోనూ ఆస్ట్రియా లోనూ ఎప్పటికప్పుడు పెరిగిపోతూన్న ఆకలిపస్తులు, కట్టుగుడ్డలకూ ముడి పదార్థా

లకూ కొరత, ఉత్పాదక సాధనాల తరుగుదల, ఇటువంటి పరిస్థితులే ఇతర దేశాల్లోనూ అతి త్వరితంగా వ్యాపించుతున్నాయని ఇవి తెలియజేయడం లేదా?

"విదేశాల్లో జరిగే" యుద్ధం తెచ్చిపెట్టే ఫలితాలను మాత్రమే ఎంగెల్స్ చిత్రించాడు; ఏది జరగనిదే చరిత్రలోని మహత్తర విప్లవాలలో ఒక్కటైనా సంభవించలేదో, ఏది లేనిదే గంభీరుడైన మార్క్సిస్టు ఏ ఒక్కడు సహితమూ పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తనను ఊహించుకోవడం లేదో, అట్టి అంతర్గతయుద్ధం, అనగా అంతర్యుద్ధం గురించి ఎంగెల్స్ అభివర్ణించడంలేదు. కాగా, పెట్టుబడిదారీ విధానపు "కృత్రిమ యంత్రాంగం"లో "నిరాశాపూరితమైన గంద్రగోళం" కలుగజేయకుండా విదేశాల్లో జరిగే యుద్ధం కొంతకాలం వరకూ ఈడ్చితే ఈడ్చినప్పటికీ, ఇట్టి ఫలితం లేని అంతర్యుద్ధం కేవలం ఊహాతీతమని ప్రత్యక్షంగా తెలుస్తూనే వుంది.

తాము "సోషలిస్టుల"మని చెప్పకుంటూనే యీ "నిరాశాపూరితమైన గంద్రగోళం" ప్రాదుర్భావాన్ని ద్వేషంతో వేలుపెట్టి చూపుతూ, ప్రతీ విషయానికి శ్రామికవర్గం పైనే, సోవియట్ రాజ్యాధికారంపైనే, సోషలిజంలోకి పరివర్తన అనే "ఊహాజనితజగత్తు" పైనే నిందమోపేటట్టి మన "నోవయ జీజ్న్" అనుయాయులూ, మెన్షెవిక్లూ, కుడిపక్షపు సోషలిస్టు-రివల్యూషనరీలూ, వగైరాల్లాంటి వారు ఎంతటి బుద్ధిహీనతనూ బలహీనతనూ — బూర్జువావర్గానికి వీరు చేస్తున్న కిరాయి సేవ గురించి చెప్పనవసరమే లేకపోగా — ప్రదర్శిస్తున్నారో కదా. "గంద్రగోళం" — లేక ఆ మాటకు బదులు భేషైన రష్యన్ పదాన్ని ఉపయోగించాలంటే, "రజ్రూహ"* — యుద్ధంవల్ల సంభవించిన ఫలితమే. విచ్ఛిన్నం లేనిదే ఉగ్రయుద్ధం ఉండేందుకు వీల్లేదు. విచ్ఛిన్నం లేనిదే, అంతర్యుద్ధం — సోషలిస్టు విప్లవంయొక్క అనివార్య పరిస్థితీ, అనుగతమూ అయినట్టి అంతర్యుద్ధం — ఉండేందుకు వీల్లేదు. విచ్ఛిన్నం జరుగుతుందనే "కారణాన" విప్లవాన్నీ సోషలిజాన్నీ పరిత్యజించడమంటే, దాని అర్థం, కేవలం తన నియమరాహిత్యాన్ని బయటపట్టుకోవడమే అవుతుంది, ఆచరణలో తన సొంత పార్టీని వదిలిపెట్టేసి, బూర్జువావర్గంతో చేరిపోవడమే అవుతుంది.

"... కఠినాతికఠినమైన దురవస్థ ఫలితంగా ప్రాదుర్భవించిన కరువు, రోగం, సైన్యాలలోనూ ప్రజారాశిలోనూ సర్వసాధారణంగా మనోనిబ్బరం సడలిపోవడము...."

అనేక సంవత్సరాలుగా సాగుతూన్నట్టి కఠినమూ బాధాకరమూ అయినట్టి యుద్ధం యొక్క బాహ్యగతాత్మక అనుషంగికమును గురించి పర్యాలోచించేందుకు రవంత సమర్థ్యత వున్న ప్రతివారికీ ప్రత్యక్షంగా కనపడి తీరాల్సినట్టి ఈ నిరాక్షేపణీయమైన సారాంశాన్ని

---

* "రజ్రూహ": అస్తవ్యస్తం, విచ్ఛిన్నం. — అనువాదకుడు.

ఎంగెల్స్ ఎంత సరళంగానూ స్పష్టంగానూ తేల్చుతున్నాడో కదా. కాగా, ఇంతటి అత్యంత సరళ మైన భావనను అర్థం చేసుకో నిచ్చగించనీ, చేసుకోలేనట్టీ అనేకమంది ''సోషల్-డెమో(క్రాట్లు,'' కుహనా-''సోషలిస్టులు'' ఎంత ఆశ్చర్యకరమైన బుద్ధిమాంద్యులో కదా.

సైన్యాలూ, ప్రజారాసులూ, రెండింటి మనోనిబ్బరపు సడలింపు అనేక సంవత్స రాలు యుద్ధం సాగగలదన్న విషయం ఊహింప శక్యమేనా? ఎంతమాత్రమూ కాదు. దీర్ఘ కాలపు యుద్ధంయొక్క ఇట్టి అనుషంగం అనేక సంవత్సరాలు, ఆమాటకొస్తే ఒక పురు షాంతరం పాటు సహితమూ, ద్యోతకమవడం కేవలం అనివార్యమే అవుతుంది. మన ''శాలు వలుకప్పుకున్న వారు,'' తాము ''సోషల్-డెమో(క్రాట్ల''మనీ, ''సోషలిస్టుల''మనీ పేరుపెట్టు కున్న బూర్జువా మేధావి స్తరపు చేతకాని ఏడుపునాగమ్మలు, మనోనిబ్బరపు సడలింపు ఆవి ర్భావానికీ, లేదా మనోనిబ్బరపు సడలింపుయొక్క మరింత తీవ్రమైనట్టి, ప్రత్యేక దృష్టాం తాలను నిరోధించేందుకు అవలంబించబడే చర్యల అనివార్య కాఠిన్యానికీ విప్లవంపైనే నింద మోపే బూర్జువావర్గానికి వంతపాడుతారు — ఈ మనోనిబ్బరపు సడలింపును సామ్రా జ్యవాద యుద్ధమే ప్రభవించిందనీ, సుదీర్ఘమైన పోరాటం లేనిదే, కఠిన నిర్బంధ చర్యలు కొన్ని లేనిదే ఏవిప్లవమూ ఇట్టి యుద్ధాను షంగికముల నుండి బైటపడలేదనీ, అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు స్పష్టంగా కనబడుతూనే వుంది.

(శామికవర్గపు, ఇతర పీడితవర్గాల విప్లవమంటే ''సిద్ధాంతరీత్యా,'' ''నోవయ జీజ్న్,'' ''వ్పెర్యోద్,'' ''దేలా నరోద''[156] పత్రికల్లో రాస్తూన్నట్టి తీపి వోడుతూన్న వ్యాసకర్తలకు ఏమీ అభ్యంతరంలేదు, అయితే ఒక్కటి, ఆ విప్లవం మాత్రం ఆకాశంనుండి ఊడిపడాలి, భూమిమీద పుట్టి పెరగకుండా, నాలుగు సంవత్సరాల సామ్రాజ్యవాద కసాయికోతకు బలియైన ప్రజల రక్తంలో తడిసి ముద్దకాకుండా, ఈ కసాయికోత ఫలితంగా లక్షోపలక్షల స్త్రీ పురుషులు నిస్త్రాణచెందకుండా, మనోవ్యథ పాల్గాకుండా, మనోనిబ్బరం పోగొట్టుకోకుండా వుండాలి.

విప్లవాన్ని ప్రసవప్రకియతో సరిపోల్చాల్సి వుంటుందని ఎవరో చెప్పగా అది వారి చెవిని బడి ''సిద్ధాంత రీత్యా'' వారు దానిని అంగీకరించారు; కాని వారు అసలు విషయానికి వచ్చే సరికల్లా, సిగ్గుచేటుగా తోకముడుచుకుని, (శామికవర్గ విప్లవానికి వ్యతిరేకంగా బూర్జువా వర్గపు ద్వేషపూరితమైన గావుకేకలే వారి పిరికితనపు ఏడుపుల్లో ప్రతిధ్వనించాయి. సార స్వతంలో చెప్పబడిన ప్రసవప్రకియ వర్ణనలనే తీసుకోండి, ఆ వర్ణనలలో రచయితలు, ఉదాహరణకు, ఏమిల్ జోలా రాసిన "La joie de vivre" (''జీవితానందం''), లేదా వెరెసాయెవ్ రాసిన ''ఒక వైద్యుని వివరణలు,'' ప్రసవప్రకియలో వున్న కఠినత, బాధ, భయానకముల యథార్థ చిత్రణను ప్రదర్శించడానికి యత్నిస్తారు. మానవ ప్రసవప్రకియ స్త్రీని ఇంచుమించు ప్రాణరహితమై, చిత్రహింసపాలై, దుఃఖభాజనమై, దుర్భరమైన బాధతో ఉన్మాదినియైన

రక్తసిక్తపు మాంసపుముద్దగా మార్చివేస్తుంది. కాని, ప్రేమలోనూ దాని ఉత్తరఫలితంలోనూ, స్త్రీ మాతృమూర్తిగా పరివర్తన చెందడంలోనూ కేవలం దీనినే చూసేటట్టి "వ్యక్తి" మానవునిగా పరిగణించబడేందుకు అర్హుడవుతాడా? ఈ హేతువును ప్రేమను, మానవోత్పత్తినీ ఎవడైనా పరిత్యజించుతాడా?

ప్రసవవేదన సుళువుగా వుండొచ్చు, కష్టంగా వుండొచ్చు. పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజంలోకి పరివర్తన సుదీర్ఘమైన ప్రసవవేదనతో అనుగతమై వుండడం అనివార్యమని శాస్త్రీయ సోషలిజం స్థాపకులు మార్క్స్, ఎంగెల్స్‌లు ఎల్లప్పుడూ చెబుతూనే వచ్చారు. కాగా, ప్రపంచయుద్ధ అనుషంగములను విశ్లేషించుతూ, యుద్ధానుగతమైనట్టీ, యుద్ధసంబంధమైనట్టీ (అంతేకాకుండా, యుద్ధ కాలంలోనే ప్రజ్వలించేటట్టీ, ప్రపంచ యుద్ధం వడిమధ్యలో పుట్టి, పెరిగి, నిలదొక్కుకోవాల్సి వచ్చినట్టి విప్లవం — అని మనవంతు మనం కూడా చేర్చాల్సి వుంటుంది) విప్లవం ప్రత్యేకంగా కష్టమైన ప్రసవకార్యమని నిరాక్షేపణీయంగానూ, ప్రత్యక్షంగానూ కనబడుతూన్న వాస్తవవిషయాన్ని ఎంగెల్స్ సరళమూ స్పష్టమూ అయిన విధంలో అభివర్ణించాడు.

ఈ వాస్తవవిషయాన్ని ఎంగెల్స్ స్పష్టంగా గ్రహించుతూ, ఒక ప్రపంచయుద్ధంలో చావును అనుభవించుతూన్న పెట్టుబడిదారీ సమాజం నుండి సోషలిజం ప్రభావితమవడం గురించి అతడు బహుజాగ్రత్తగా ప్రస్తావిస్తాడు. అతడిలా అంటాడు: "కేవలం ఒకే ఒక్క" (ప్రపంచయుద్ధంయొక్క) "ఫలితం మాత్రం తప్పక నిశ్చయం: సర్వసాధారణ నిస్త్రాణ, దానితోపాటు కార్మికవర్గ అంతిమ విజయానికై పరిస్థితుల స్థాపన".

ఈ తలంపే మనం పరిశీలిస్తూన్న పీఠిక అంతమందు ఇంకా మరింత స్పష్టంగా వ్యక్తీకరించబడింది:

"...ఈ విషాదాంత నాటకం అంతమందు మీరు (పెట్టుబడిదార్లూ, భూస్వాములూ, చక్రవర్తులూ, బూర్జువావర్గపు రాజ్యకార్యదురంధరులూ) నాశనమైపోతారు, కాగా శ్రామికవర్గ విజయం అప్పటికప్పడే సాధించడమేనా జరుగుతుంది, లేదా అధమపక్షం అనివార్యమేనా అవుతుంది."

కష్టమైన ప్రసవం ప్రమాదభరితమైన రోగంయొక్క, లేదా మరణ గండంయొక్క ప్రమాదాన్ని మరింత అధికంచేస్తుంది. కాని ప్రసవక్రియలో వ్యక్తులు కొందరు మరణించినప్పటికీ, పాత వ్యవస్థ ప్రభవించిన కొత్త వ్యవస్థ మాత్రం మరణించజాలదు, ఏదైనా మహా జరుగుతే, ప్రసవం మరింత బాధాకరంగానూ, మరింత సుదీర్ఘంగాను వుండి, పెరుగుదల, అభివృద్ధి కొంత ఆలస్యంగా జరగవచ్చు.

యుద్ధం ఇంకా అంతంకానే లేదు. సర్వసాధారణ నిస్త్రాణ అప్పుడే ప్రవేశించింది. ఎంగెల్స్‌చే షరతుబద్ధమై జోస్యంచెప్పబడినట్టి ప్రత్యక్ష యుద్ధఫలితాలు రెండింటి విషయం లోనూ (అప్పటికప్పుడే సాధించబడిన కార్మికవర్గ విజయమో, లేక కష్టాలన్నిటినీ లెక్కచేయ కుండా దీనిని అనివార్యం చేసే షరతుల స్థాపనో), ఈ రెండు షరతుల విషయంలోనూ ఈనాడు, 1918 మధ్యలో, రెండూ వున్నట్టు మనకు సాక్ష్యం లభించుతూంది.

పెట్టుబడిదారీ విధానం అంత హెచ్చుగా అభివృద్ధికాని దేశాలలో ఒక దేశంలో కార్మిక వర్గ విజయం అప్పుడే సాధించబడింది. కడమ పెట్టుబడిదారీ దేశాలలో అసదృశముల్లైన బాధ, యత్నాలతో ఈ విజయం "అధమపక్షం అనివార్యం" కాగల్గే షరతులు స్థాపించబడు తున్నాయి.

"సోషలిస్టుల" మని పేరుపెట్టుకున్న చేతకాని ఏడుపు నాగమ్మలు మొర్రో కుంయ్యో మని రాగాలు పెట్టనీయండి, బూర్జువావర్గం ధామ్ ధూమ్ అని వికటాట్టహాసం చేయనీ యండి. కాని చూడడానికి ఇష్టంలేక కళ్లుమూసుకున్నవారు, వినడానికి ఇష్టంలేక చెవుల్లో దూది కుక్కుకున్నవారు మాత్రమే సోషలిజాన్ని తన గర్భంలో ధరించుతూన్నట్టి పాత పెట్టు బడిదారీ సమాజంయొక్క ప్రసవవేదన ప్రపంచమందంటా ఆరంభమైనదన్న విషయాన్ని గ్రహించలేకపోతున్నారు. చారిత్రకఘటనల పురోగమనం వల్ల సోషలిస్టు విప్లవాగ్రమందు తాత్కాలికంగా నిలబెట్టబడిన మన దేశం, అప్పుడే ఆరంభమైన ప్రసవకార్యం మొదటి కాలా వధికి ప్రత్యేకమైన కఠినవేదనను అనుభవించుతూంది. భవిష్యత్తును సంపూర్ణ విశ్వాసం తోనూ, నిశ్చల సంకల్పంతోనూ ఎదుర్కొన గల్గుతామనడంలో మనకెట్టి సంశయమూ లేదు, ఎందుచేతంటే, నూతన మిత్రులనూ, మనకంటె మరింతగా పురోగమించిన దేశాలు కొన్నిం టిలో సోషలిస్టు విప్లవ నూతన విజయాలనూ భవిష్యత్తు మనకు సమకూర్చడానికి సిద్ధంగా వుంది. ప్రపంచాన్ని రక్తపాతంలో ముంచి, మానవాళిని ఆకలిపస్తులకూ, మనోనిబ్బరపు సడ లింపుకూ దిగజార్చేసినట్టి, మృత్యుసందర్శన సమయమందు దాని ఉన్మాదం ఎంత రాక్షసంగానూ కిరాతకంగానూ వున్నప్పటికైనా సరే, తప్పక సత్వరవినాశం పొందితీరాల్సినట్టి ఆ వన్య మృగాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని, ఈ భూగోళం ఒక భాగంలో ప్రప్రథమంగా హత మార్చ గలిగే అవకాశం మనకే దక్కడం మనకు గర్వకారణమనీ, మన అదృష్టభాగ్యమనీ మనం భావించుకోవచ్చు.

జూన్ 29, 1918.

# శ్రామికవర్గ విప్లవమూ, స్వపక్షపరిత్యాగి కౌట్‌స్కీ

ఖండిక

## కౌట్‌స్కీ మార్క్సును ఒక సాధారణ లిబరల్‌గా మార్చివేసిన విధం

కౌట్‌స్కీ తన పాంఫ్లెట్‌లో చర్చించుతూన్న మౌలిక ప్రశ్న శ్రామికవర్గ విప్లవం మూల విషయాన్ని గురించిన ప్రశ్న, అనగా శ్రామికవర్గ నియంతృత్వం. ఈ ప్రశ్న అన్ని దేశాలకూ, మరీ ముఖ్యంగా పురోగామి దేశాలకూ, మరింత ముఖ్యంగా యుద్ధంలో పాల్గొంటూన్న దేశాలకూ, అందులో మరింత ముఖ్యంగా ప్రస్తుతసమయంలోనూ, అపరిమిత ప్రాముఖ్యతను కలిగివుంది. ఇదే యావత్తు శ్రామికవర్గ వర్గపోరాటంయొక్క అన్నిటికంటేనూ ముఖ్యమైన సమస్య అని చెప్పడంలో ఏమాత్రమూ అతిశయోక్తిలేదు. కాబట్టి దీనిని గురించి ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

ఈ ప్రశ్నను కౌట్‌స్కీ ఈ విధంగా సూత్రీకరించుతున్నాడు: "రెండు" (అనగా, బోల్‌షెవిక్, బోల్‌షెవికేతర) "సోషలిస్టు ధోరణులకూ గల వ్యత్యాసం మౌలికంగా విభేదించుతూన్న రెండు — ప్రజాస్వామిక, నియంతృత్వ — విధానాలకుగల వ్యత్యాసమే." (పుట 3.)

రష్యాలో వున్న బోల్‌షెవికేతరులను, అనగా మెన్‌షెవిక్‌లను, సోషలిస్టు-రివల్యూషనరీలను, సోషలిస్టులు అని పిలవడంలో, వారు పెట్టుకున్న పేరుపైనే, అనగా ఒక పదంపైనే, కౌట్‌స్కీ ఆధారపడ్డాడేగాని, శ్రామికవర్గానికీ బూర్జువావర్గానికీ మధ్య వున్న పోరాటంలో వారు ఆక్రమించుతూన్న యథార్థస్థానం పైన కానే కాదని మనమిక్కడ ప్రాసంగికంగా చెప్పవచ్చు. ఇతడు మార్క్సిజాన్ని ఎంత భేషుగ్గా ఆకళింపు చేసుకున్నాడో, ఎంత భేషుగ్గా అనుప్రయుక్తం చేస్తున్నాడో చూడండి! అయితే దీనిగురించి ముందు ఇంకా విపులంగా ప్రస్తావిస్తాం.

ప్రస్తుతం మనం ముఖ్యవిషయాన్నే, అనగా "ప్రజాస్వామిక, నియంతృత్వ విధానాల" రెండింటి మధ్య వుండే "మౌలిక వ్యత్యాసం" అనే కౌట్‌స్కీయ ఉత్కృష్ట ఆవిష్కరణనే పరిశీలించాలి. అసలు విషయానికంతకూ ఇదే కీలకం; కౌట్‌స్కీ పాంఫ్లెట్ సారమే ఇది. కాగా, ఇది ఎంత ఘోరమైన సైద్ధాంతిక గంద్రగోళమంటే, ఎంత సంపూర్ణమైన మార్క్సిజం

పరిత్యాగమంటే, కౌట్స్కీ ఎదుట బెర్న్‌స్టయిన్ ఏ మూలకూ పనికిరావడం లేదనే మనం ఒప్పుకు తీరాలి.

శ్రామికవర్గ నియంతృత్వ ప్రశ్న, శ్రామికవర్గ రాజ్యాంగయంత్రానికీ బూర్జువా వర్గ రాజ్యాంగయంత్రానికీ, శ్రామికవర్గ ప్రజాస్వామ్యానికీ బూర్జువావర్గ ప్రజాస్వామ్యానికీ గల సంబంధాన్ని గురించిన ప్రశ్న. ఇది ఎంత స్పష్టంగా వుందంటే, అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినంత స్పష్టంగా వుందనే అందరికీ తోస్తుంది. కాని, బూజుపట్టిన ఆ పాత చరిత్ర పాఠ్యపుస్తకాలనే శాశ్వతంగా పునశ్చరణచేసి చెప్పుకుపోతూ ఎముకలపోగై పోయిన బడి పంతుల్లాగ, కౌట్స్కీ మొరాయించి ఇరవైయ్యో శతాబ్దివైపు తన పృష్ఠమూ, పద్దెని మిదో శతాబ్ది వైపు తన ముఖమూ తిప్పి, బూర్జువా ప్రజాస్వామ్యానికీ నిరంకుశతత్వ మధ్య యుగతత్వాలకూ గల సంబంధం గురించే నమ్మశక్యం కానంతగా విసుగు పుట్టించేటట్టు అనేక పరిచ్ఛేదాల్లో ఆ పాతగిలిన కుడితినే నూరోసారి నెమరువేస్తున్నాడు.

అవును, నిజంగా అతడు గాఢనిద్రలో ఆ పాత కుడితినే విసుగు పుట్టించేంతగా నెమరు వేస్తున్నాడు!

కాని దీని అర్థమేమిటంటే, ఏది ఏమిటో అతనికి తెలియడంలేదన్నమాట! "ప్రజాస్వామ్యం పట్ల తృణీకారం" (పుట 11), ఇత్యాదులు బోధించేవారు కొందరున్నా రన్నట్టుగా ఒక భావం కలిగించేందుకు కౌట్స్కీ చేస్తూన్న ప్రయత్నాలను చూస్తే నవ్వే వస్తుంది. ఇలాంటి ప్రేలాపనలవల్ల వివాదాంశాన్ని మరుగుపరచి, గంద్రగోళ పరచడంతప్ప గత్యంతరం లేని స్థితిలో తాను చిక్కుకున్నానని కౌట్స్కీ తెలుసుకున్నాడు, ఎందువల్లనంటే, లిబరల్సు అవలంబించే పంథాలోనే వివాదాంశాన్ని అతడు ప్రదర్శించుతూ ప్రజాస్వామ్యం గురించి సాధారణంగా చెబుతాడేగాని, <u>బూర్జువా</u> ప్రజాస్వామ్యం గురించి చెప్పడు; నిశితమైన ఈ వర్గ పదాన్ని ఉపయోగించడం సహితం అతడు దాటవేస్తూ, అందుకు బదులు "సోషలిస్టుపూర్వ" ప్రజాస్వామ్యం గురించి చెప్ప ప్రయత్నిస్తాడు. ఈ వదరుబోతుతనపు పాంఫ్లెట్‌లో మూడో వంతు, అరవై మూడు పుటల్లోనూ ఇరవై పుటలు, బూర్జువావర్గానికి ఎంతో మనోజ్ఞమైన ఈ అసందర్భపు ప్రేలాపనకే అతడు వినియోగిస్తాడు, ఎందుచేతంటే, ఇది బూర్జువా ప్రజాస్వామ్యానికి మెరుగులు దిద్ది, శ్రామికవర్గ విప్లవ ప్రశ్నకు ముసుగు తొడుగుతూంది.

కాని, ఏది ఏలాగున్నా, కౌట్స్కీ పాంఫ్లెట్ శీర్షిక "శ్రామికవర్గ నియంతృత్వం." ఇది మార్క్సీయ సిద్ధాంతానికి అసలు నిగ్గుతేల్చిన <u>సారం</u> అనే విషయం అందరకూ తెలిసినదే. కాగా బోలెడంత అసందర్భపు ప్రేలాపన సాగించిన తరువాత, శ్రామికవర్గ నియంతృత్వం గురించి మార్క్స్ వాక్యాలను ఉల్లేఖించక <u>తప్పిందికాదు</u> కౌట్స్కీకి.

కాని, "మార్క్సిస్టు" అయిన ఇతడు దీనిని నిర్వర్తించిన విధం చూస్తే కేవలం నవ్వే నస్తుంది! ఇదిగో వినండి:

"ఈ అభిప్రాయం" (దీనిలో కౌట్స్కీకి ప్రజాస్వామ్యంపట్ల తృణీకారం కనబడు తూందిట), "కారల్ మార్క్స్ ఉపయోగించిన ఒకే ఒక పదంపై ఆధారపడి వుంది." అక్షరాలా 20 వ పుటలో ఇలాగే అన్నాడు కౌట్స్కీ. కాగా, 60 వ పుటలో మళ్లీ దీనినే, వారు (బోల్షెవిక్‌లు), "1875 లో ఒక లేఖలో మార్క్స్ ఒకసారి శ్రామికవర్గ నియంతృత్వం గురించి ఉపయోగించిన ఈ చిన్న మాటను" (అక్షరాలా అతడు చెప్పినది ఇదీ!!–des Wörtchens) "సమయోచితంగా జ్ఞాపకం తెచ్చుకుంటున్నారు."

ఇదిగో, ఇదీ మార్క్స్ ఉపయోగించిన "చిన్న మాట":

"...పెట్టుబడిదారీ విధాన సమాజం కమ్యూనిస్టు సమాజం నడుమ, మొదటి దాని నుండి రెండవ దానిలోకి మారే విప్లవాత్మక పరివర్తన కాలావధి ఉంటుంది. దీనికి అనుగుణ్యంగా, రాజకీయ పరివర్తన కాలావధి కూడా ఉంటుంది; ఈ దశలో రాజ్యాంగయంత్రం విప్లవాత్మక శ్రామికవర్గ నియంతృత్వం తప్ప మరొకటి కానేరదు."[157]

మొట్టమొదటి విషయం, మార్క్స్‌యొక్క యావత్తు విప్లవాత్మక ఉపదేశ సారాన్ని సంక్షిప్తంగా తెలియజేస్తూన్నట్టి ఈ సుప్రసిద్ధ వాక్యాన్ని, "ఒకే ఒక మాట" అనీ, అంతే కాకుండా "ఒక్క చిన్న మాట" అనీ అనడం, మార్క్సిజాన్ని అవమానపరచడమే, మార్క్సిజాన్ని సంపూర్ణంగా పరిత్యజించడమే అన్నమాట. కౌట్స్కీకి మార్క్స్ ఇంచుమించు కంఠోపాఠమే అనే విషయం మనం మర్చిపోకూడదు; కాగా మార్క్సిజంపై అతడు రాసిన దాని అంతటినిబట్టి మనం ఒక పర్యవసానానికి వచ్చామంటే, ఉల్లేఖనకు వెంటనే చేతికి అందుకు వచ్చేందుకుగాను, మార్క్స్ రాసినదానినంతనీ అతని డస్కుబల్లలోనో, లేదా అతని మెదడు లోనే వున్న పిచ్చికగూళ్లలోనో అతడు భద్రంగా దాచిపెట్టి వుంచుకున్నాడన్నమాటే. తమ లేఖలలో ఐతేనేమి, పారిస్ కమ్యూన్ ముందు, మరీ ప్రత్యేకంగా, పారిస్ కమ్యూన్ తరువాతనూ ప్రచురితమైన తమ రచనలలో ఐతేనేమి, శ్రామికవర్గ నియంతృత్వం గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు పదేపదే చెబుతూ వచ్చారన్న విషయం కౌట్స్కీకి తెలియకుండా వుండదు. 1852, 1891 సంవత్సరాల మధ్య నలభై యేళ్లపాటు, 1848 విప్లవానుభవాన్నీ, మరీ ముఖ్యంగా 1871 విప్లవానుభవాన్నీ సంక్షిప్తపరుస్తూ ఏ కర్తవ్యం గురించైతే మార్క్స్, ఎంగెల్స్‌లు చెప్పారో, అట్టి బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని భగ్నం చేయడమనే శ్రామికవర్గ కర్తవ్యం యొక్క కేవలం చారిత్రకంగా మరింత నిర్దిష్టమూ, శాస్త్రీయంగా మరింత నిశితమూ అయిన సూత్రీకరణే "శ్రామికవర్గ నియంతృత్వ" మనే సాంకేతికమని కౌట్స్కీకి తెలియకుండా వుండదు.

మార్క్సిస్టు గ్రంథ ఘనపాఠి, శతపాఠి అయిన కౌట్‌స్కీ మార్క్సిజాన్ని ఇంత ఘోరంగా వికృతపరచడమును ఎలాగు వివరించగల్గుతాం? ఈ దృగ్విషయంయొక్క తాత్విక మూలాలకు సంబంధించినంత వరకు, గతితర్కాన్ని తీసిపారేసి, దాని బదులు వరణతత్వాన్నీ కుతర్కాన్నీ ప్రతిష్ఠాపన చేయడంతో సమానమే అవుతుంది ఇది. ఈ విధమైన ప్రతిష్ఠాపనలో కౌట్‌స్కీది అందెవేసిన చేయి. ఆచరణీయ రాజకీయాల దృక్‌స్థానం నుండి చూచినట్టయితే, ఇది అవకాశవాదులకు దాసోహం అనడం, అనగా చివరి విశ్లేషణలో బూర్జువావర్గానికి దాసోహం అనడంతో సమానమే అవుతుంది. యుద్ధం ప్రజ్వరిల్లింది మొదలు, మాటల్లో మార్క్సిస్టుగా వుంటూ, చేతల్లో బూర్జువావర్గపు భృత్యుడుగా వుండడమనే ఈ కళలో అంతకంతకు మరింత త్వరితగతిని ప్రగతి సాధించి, చివరకు ఈ కళలో నిష్ణాతుడయాడు కౌట్‌స్కీ.

ఇది నిజమేనని శ్రామికవర్గ నియంతృత్వం గురించి మార్క్స్‌యొక్క "చిన్న మాట" ను కౌట్‌స్కీ ఎంత అద్భుతంగా "వ్యాఖ్యానించుతాడో" పరిశీలించుతే, మరింత నమ్మకం కలుగుతుంది. ఇదిగో వినండి:

"ఈ నియంతృత్వాన్ని తాను ఎలా భావించాడో మరింత వివరంగా మనకు చూపడం మార్క్స్ దురదృష్టవశాత్తూ ఉపేక్ష చేశాడు...." (ఇది స్వపక్షపరిత్యాగి అయిన వ్యక్తి ఉపయోగించే శుద్ధమోసపు వాక్యం, ఎందుచేతంటే, నిజానికి మార్క్స్, ఎంగెల్స్‌లు అత్యంత వివరములైన సూచనలు అనేకములను మనకిచ్చారు, వీటిని మార్క్సిస్టు ఘనపాఠి, శతపాఠి అయిన కౌట్‌స్కీ బుద్ధిపూర్వకంగానే దాటవేస్తున్నాడు.) "శబ్దార్థంప్రకారం నియంతృత్వ పదానికి అర్థం ప్రజాస్వామ్యాన్ని ఎత్తివేయడం. కాని, శబ్దార్థమే తీసుకుంటే ఈ మాటకు, ఎట్టి చట్టాలచేతనూ నిర్బంధించబడనట్టి ఒకే ఒక వ్యక్తియొక్క అవిభాజ్య పరిపాలన — శాశ్వతమైన రాజ్యాంగయంత్ర సంస్థగా కాకుండా, స్వల్పకాలిక అత్యవసర చర్యగానే పరిగణించబడుతూందన్న విషయంలో మాత్రమే ఇష్టారాజ్యం నుండి విభేదించుతూన్నట్టి నిరంకుశాధిపత్యం అనే అర్థం కూడా సహజంగానే వుంది.

"ఇందువలన ఒకే ఒక వ్యక్తియొక్క కాకుండా, ఒక వర్గంయొక్క నియంతృత్వాన్ని తెలియజేసే 'శ్రామికవర్గ నియంతృత్వం' అనే పదంయొక్క శబ్దార్థమైన నియంతృత్వాన్ని ఈ సందర్భంలో మార్క్స్ మనస్సులో పెట్టుకున్నాడనే ఇటువంటి సాధ్యతను ముందుగానే మినహాయించేస్తుంది.

"పరిపాలనయొక్క ఒక రూపం గురించి అతడిక్కడ చెప్పడంలేదు. ఎక్కడైతే శ్రామికవర్గం రాజకీయాధికారాన్ని సాధించిందో అక్కడల్లా తప్పకుండా తలెత్తవలసిన స్థితి గురించే అతడు చెబుతున్నాడు. ఈ దృష్టాంతంలో మార్క్స్ మనస్సులో వున్నది పరిపాలనయొక్క రూపం కాదనే విషయం, ఇంగ్లండులోనూ అమెరికాలోనూ శాంతియుతంగా, అనగా

ప్రజాస్వామిక మార్గంలో పరివర్తన జరగవచ్చుననే అతడు అభిప్రాయపడ్డాడనే వాస్తవ విషయంచే రుజువు కాబడుతూండి.'' (పుట 20.)

''సిద్ధాంతకర్త'' కౌట్స్కి ఉపయోగించే విధానాలు ఎట్టివో పాఠకుడు స్పష్టంగా గ్రహించేందుకే మేము ఈ వాదాన్ని ఉద్దేశపూర్వకంగానే పూర్తిగా ఉల్లేఖించాం.

నియంతృత్వ ''పదం'' నిర్వచనంతో ప్రారంభమయే విధంగా ఈ ప్రశ్నను సమీపింప నెంచాడు కౌట్స్కి.

కానీయండి, ఇదీ భేషుగ్గానే వుంది. ఒక ప్రశ్నను సమీపించడంలో తనకు ఇష్టమొచ్చిన విధంగా సమీపించడానికి ప్రతివానికీ పవిత్రాధికారం వుంది. అయితే ఒక్కటి, గంభీరంగానూ చిత్తశుద్ధితోనూ సమీపించడానికీ, మోసబుద్ధితో సమీపించడానికి వుండే భేదాన్ని మాత్రం గమనించాలి. ప్రశ్నను ఈ విధంగా సమీపించడంలో గంభీరతను అవలంబించదల్చుకున్న వ్యక్తి, ఆ ''పదానికి'' తన సొంత నిర్వచనం ఇచ్చి వుండాల్సింది. అప్పుడు స్పష్టంగానూ సూటిగానూ ప్రశ్న వేసివుండడం జరిగివుండేది. కాని కౌట్స్కి అలా చేయడు. ''శబ్దార్థం ప్రకారం, నియంతృత్వమనే పదానికి అర్థం ప్రజాస్వామ్యాన్ని ఎత్తివేయడం'' అని అతడు రాస్తాడు.

మొట్టమొదటి విషయం, ఇది నిర్వచనం కాదు. నియంతృత్వ భావనకు నిర్వచనం ఇవ్వడమును దాటవేయడమే కౌట్స్కి ఉద్దేశమై వుండినట్టయితే, ఈ ప్రత్యేక విధంలో ప్రశ్నను సమీపించేందుకే అతడెందుకు ఎంచుకున్నట్టు?

రెండో విషయం, ఇది తప్పు అని ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. లిబరల్ అన్నవాడు ''ప్రజాస్వామ్యం'' గురించి సాధారణంగా మాట్లాడాడూ అంటే అది సహజమే; కాని మార్క్సిస్టు అన్నవాడు మాత్రం ''ఏ వర్గానికి'' అని అడగడం ఎన్నటికీ మరచిపోడు. ఉదాహరణకు, గ్రీకు, రోమక రాజ్యాల కాలంలోని బానిసలలో అంతర్విప్లవాలు, లేదా తీవ్రమైన ఉద్రేకాలు సహితమూ, గ్రీకు, రోమక రాజ్యాంగయంత్రం ప్రధానంగా బానిసయజమానుల నియంతృత్వమే అనే వాస్తవవిషయాన్ని బయటపెడుతూందని అందరకూ (కాగా, ''చరిత్రకారుడు'' కౌట్స్కికి కూడా) తెలిసినదే. ఈ నియంతృత్వం బానిసయజమానుల మధ్యనూ, బానిసయజమానుల కోసమూ ప్రజాస్వామ్యాన్ని ఎత్తివేసిందా? అలా అది చేసివుండలేదని అందరకీ తెలుసును.

''మార్క్సిస్టు'' కౌట్స్కి ఇంత ఘోరమైన అసందర్భమూ అసత్యమూ చెప్పడానికి కారణం వర్గపోరాటాన్ని అతడు ''మరచిపోవడమే''....

కౌట్స్కి చేసిన అసత్య లిబరల్‌తత్వ ఉద్ఘోషను మార్క్సిస్టుతత్వపు సత్యమైన ఉద్ఘోషగా పరివర్తన చేయాలంటే, దానిని ఇలా చెప్పాలి: నియంతృత్వమంటే కడమ వర్గా

లపై నియంతృత్వం చలాయించుతూన్న వర్గంయొక్క ప్రజాస్వామ్యాన్ని ఎత్తివేయడమని తప్పనిసరైన అర్థం కానేరదు; కాని ఏ వర్గంపైనైతే, లేక ఏ వర్గానికి వ్యతిరేకంగానైతే నియంతృత్వం చలాయించబడుతూందో ఆ వర్గానికి ప్రజాస్వామ్యం ఎత్తివేయడం (లేదా, ఎత్తివేతయొక్క రూపాలలో ఒక రూపమైనట్టి కేవల భౌతిక నిర్బంధన అని మాత్రం తప్పనిసరిగా దాని అర్థమవుతుంది.

కాని, ఈ ఉద్ఘోష పూర్తిగా నిజమే అయినప్పటికీ, ఇది నియంతృత్వానికి నిర్వచనం ఇవ్వడంలేదు.

కౌట్స్కీయొక్క తరువాతి వాక్యం పరిశీలించుదాం:

"కాని శబ్దార్థమే తీసుకుంటే, ఈ మాటకు ఎట్టి చట్టాలచేతనూ నిర్బంధించబడనట్టి ఒకే ఒక వ్యక్తియొక్క అవిభాజ్య పరిపాలన అనే అర్థం కూడా సహజంగానే వుంది."

కళ్లువిడని కుక్కపిల్ల ఎలాగైతే వూరికేనే ఒకసారి ఇటూ ఒక సారి అటూ వాసన చూస్తూంటుందో అలాగే, సత్యమైన భావం ఒకటి (అదేదనగా నియంతృత్వమంటే ఎట్టి చట్టాలచేతనూ నిర్బంధించబడని పరిపాలన అనే భావం) కౌట్స్కీకి అకస్మాత్తుగా తట్టుతుంది, ఐనప్పటికీ నియంతృత్వానికి అతడు నిర్వచనం ఇవ్వలేకపోయాడు, కాగా, అంతే కాకుండా, నియంతృత్వమనగా ఒకే ఒక వ్యక్తియొక్క పరిపాలన అనే ఒక ప్రత్యక్ష చారిత్రక అసత్యాన్ని అతడు వ్రాకుచ్చాడు. వ్యాకరణరీత్యా సహితం ఇది తప్పు, ఎందుచేతంటే పట్టెడుమంది వ్యక్తులు, లేదా ఒక అల్పజనపరిపాలన లేదా ఒక వర్గం, వగైరాలు కూడా నియంతృత్వాన్ని చలాయించవచ్చు.

నియంతృత్వానికీ ఇష్టారాజ్యానికీ వున్న భేదం గురించి కౌట్స్కీ తరువాత ప్రస్తావించ పూనుకుంటాడు, కాని అతడు చెప్పేది తప్పు అని ప్రత్యక్షంగా కనబడుతూన్నప్పటికీ, దీనిని గురించి మనం ప్రస్తావించడంలేదు, ఎందుకంటే మనకి ఆసక్తిదాయకమైన ప్రశ్నతో దీనికేమీ సంబంధంలేదు. ఇరవైయ్యో శతాబ్దిని వదిలేసి పద్దెనిమిదో శతాబ్దివైపు తిరగడం, అక్కడ నుండి గ్రీకు, రోమక కాలంవైపు తిరగడమూ అంటే కౌట్స్కీకి ఇష్టమనే సంగతి అందరకూ తెలిసినదే, కాగా నియంతృత్వాన్ని సాధించుకున్న తరువాత, జర్మన్ శ్రామికవర్గం ఇతని వాటం గమనించి, మాటవరసకు ఏ ఉన్నతపాఠశాలలోనో పురాతనచరిత్ర ఉపాధ్యాయునిగా ఇతనిని నియమించుతుందనే మనం ఆశించుదాం. ఇష్టారాజ్యం గురించి తాత్విక ప్రసంగం కావించుతూ, ఈ విధంగా నియంతృత్వానికి నిర్వచనం చెప్పడమును దాటవేయ ప్రయత్నించడం శుద్ధ తెలివితక్కువైనా అవుతుంది, లేదా కేవలం మొరటు పితలాటకమైనా అవుతుంది.

ఫలితంగా మనకేమి కనబడుతూందంటే, నియంతృత్వాన్ని చర్చించడానికి కౌట్‌స్కీ పూనుకుని, బోలెడు పేరుమోసిన అబద్ధాలను వ్రాకుచ్చాడేగాని, నిర్వచనం మాత్రం చెప్ప లేదు! అయినప్పటికీ తన మనశ్శక్తులపై నమ్మకంలేనివాడు, తన జ్ఞాపకశక్తిని వినియోగించుకుని, నియంతృత్వంపై మార్క్స్ ఇచ్చిన దృష్టాంతాలన్నిటినీ తన "పిచ్చికగూళ్ళలో" నుంచి బయటికి తీసివుంటే తీరిపోయేది. అలా చేసివుంటే, ఈ దిగువ నిర్వచనో, లేదా దాని సారాంశాన్ని సమీపించేది ఇంకొకటేదో అతనికి దొరికివుండేది:

సూటిగా బలప్రయోగంపైన ఆధారపడినట్టీ, ఎట్టి చట్టాలచేతనూ నిర్బంధించ బడనట్టీ పరిపాలన నియంతృత్వం.

శ్రామికవర్గ విప్లవాత్మక నియంతృత్వం బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామిక వర్గంచే బలప్రయోగంవల్ల సాధించబడినట్టీ, నిలబెట్టబడినట్టీ పరిపాలన.

కాగా ఈ సామాన్య సత్యాన్ని, వర్గచైతన్యవంతుడైన ప్రతి కార్మికునికీ (పెట్టుబడి దార్లిచ్చే లంచాలు తింటూన్నట్టి అన్నిదేశాలలోని సోషల్-సామ్రాజ్యవాదులలాగానే, పెట్టీ బూర్జువావర్గపు దగల్బాజీల ఉన్నతస్తరంయొక్క ప్రతినిధి కాకుండా, ప్రజారాసులకు ప్రాతి నిధ్యం వహించుతూన్నట్టి ప్రతి కార్మికునికీ) అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు స్పష్టంగా కనబడుతూన్నట్టీ ఈ సత్యాన్ని, తమ విముక్తికై పోరాడుతూన్నట్టి పీడితవర్గాల ప్రతిని ధులలో ప్రతివారికీ ప్రత్యక్షంగా కనబడుతూన్నట్టి ఈ సత్యాన్ని, ప్రతి మార్క్సిస్టుకీ నిరాక్షేపణీయమైన ఈ సత్యాన్ని, మహాపండితుడు మిస్టర్ కౌట్‌స్కీ నుండి "బలప్రయోగం చేసి బైటకి లాగాల్సివచ్చింది"! దీనిని వివరించడం ఎలాగు? బూర్జువావర్గానికి సేవచేస్తూ నీచులైన భట్రాజులుగా తయారైన రెండవ ఇంటర్నేషనల్ నాయకుల ప్రతి రోమకూపం నుండీ ఓడుతూన్నట్టి కేవలం ఆ బానిస మనస్తత్వం వల్లనే దీనిని వివరించగలుగుతాం.

శబ్దార్థం ప్రకారం నియంతృత్వపదం అర్థం ఒకే ఒక వ్యక్తియొక్క నియంతృత్వం అని ఒక ప్రత్యక్షపు అసందర్భాన్ని ప్రకటించి, తద్వారా కౌట్‌స్కీ మొదట ఒక హస్తలాఘవం ప్రయోగించేసి మోసగించి, అటుతరువాత — ఈ హస్తలాఘవాన్నే ఆధారం చేసుకుని! — ఒక వర్గంయొక్క నియంతృత్వం గురించి మార్క్స్ చెప్పిన మాటలు "ఇందువలన" శబ్దార్థంలోనే తీసుకోవాల్సినవిగా ఉద్దేశించబడలేదని (విప్లవాత్మక బలప్రయోగాన్ని సూచించకుండా, బూర్జువా — గమనించండి — "ప్రజాస్వామ్యం" కింద అధికసంఖ్యాకవర్గాన్ని "శాంతి యుతంగా సాధించుకోవడమును ధ్వనించేటట్టి అర్థంలోనే ఉద్దేశించబడ్డాయని) అతడు ఉద్ఘాటించాడు.

ఒక "స్థితి"కీ, ఒక "పరిపాలనయొక్క ఒక రూపా"నికీ వుండే భేదమేమిటో దయ చేసి మీరే చెప్పండి. ఎంత అద్భుతమైన భేదమో ఇది! తెలివితక్కువగా తర్కించుతూన్న వ్యక్తి

యొక్క బుద్ధిమాంద్యపు "స్థితి"కీ, అతని బుద్ధిమాంద్యంయొక్క "రూపా"నికీ వ్యత్యాసం చూపడం ఎలాగుంటుందో ఇదీ అలాగే వుంది.

నియంతృత్వానికి "రాజ్యపదవీస్థితి" (తరువాతి పుట 21 వ పుటలోనే అతడు అక్షరాలా ఈ పదాన్ని ఉపయోగించాడు) అని భాష్యం చెబితేనేగాని కౌట్స్కీకి వీలైందికాదు, దీనికి కారణమేమిటంటే, ఆలాగు చెబితేనే విప్లవాత్మక బలప్రయోగమూ, బలప్రయోగాత్మక విప్లవమూ ఎగిరిపోతాయి. "రాజ్యపదవీస్థితి" ఎటువంటిస్థితి అంటే, ఏ అధికసంఖ్యాక వర్గమైనా సరే తాను సాధించుకోగల్గిన స్థితి... "ప్రజాస్వామ్యం"కింద! ఇటువంటి మోసపు కుయుక్తి పుణ్యమా అంటూ విప్లవం హాయిగా అదృశ్యమైపోతుంది.

కాని ఈ కుయుక్తి మరీ మొరటుగా వుండడం వల్ల కౌట్స్కీని రక్షించదు. ఒక వర్గంపై ఒక వర్గంయొక్క విప్లవాత్మక బలప్రయోగ "స్థితి"ని, స్వపక్షపరిత్యాగులకు చికాకు కలుగజేసే స్థితిని, నియంతృత్వం చెప్పకనే చెబుతూందనీ, ఆ ధ్వనితార్థాన్ని సూచిస్తూందన్న విషయాన్ని ఎవ్వరూ కప్పిపుచ్చలేరు. ఒక "స్థితి"కీ, ఒక "పరిపాలన రూపా"నికీ మధ్య వ్యత్యాసం చూపే యత్నం ఎంత అసందర్భమైనదో ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. ఈ సందర్భంలో పరిపాలన రూపాలను గురించి చెప్పడం ముమ్మాటికీ బుద్ధిమాంద్యమే అవుతుంది, ఎందుచేతంటే, ఏకరాజాధిపత్యమూ, ప్రజా సత్తాకమూ, రెండూ వేర్వేరు పరిపాలన రూపాలని ప్రతి బడిపిల్లవానికీ తెలుసు. పెట్టుబడిదారీ విధానం కిందవున్నట్టి తాత్కాలిక పరివర్తనాస్థితిలోవున్న అన్ని "పరిపాలనరూపాల" లాగానే, ఈ రెండు పరిపాలన రూపాలు కూడా, బూర్జువా రాజ్యాంగయంత్రం యొక్క, అనగా బూర్జువావర్గ నియంతృత్వంయొక్క రకాలే.

చివరి విషయమేమిటంటే, పరిపాలనరూపాలను గురించి చెప్పడమంటే, ఇక్కడ పరిపాలన రూపాలను గురించిగాక స్పష్టంగా రాజ్యాంగయంత్ర రూపం గురించే, లేదా తరహా గురించే ప్రసంగిస్తూన్న మార్క్సును తెలివితక్కువగానే కాకుండా కేవలం పచ్చిగా అబద్ధం చేయడమే అవుతుంది.

బూర్జువా రాజ్యాంగయంత్రాంగాన్ని బలప్రయోగంచే నాశనం చేయనిదే, దాని బదులు, ఎంగెల్సు చెప్పినట్టు, "ఆ పదంయొక్క ఉచితమైన అర్థంలో ఇక మీదటనుంచి రాజ్యాంగ యంత్రం కానేరని"[158] ఒక కొత్త రాజ్యాంగయంత్రాన్ని నెలకొల్పనిదే శ్రామికవర్గ విప్లవం అసాధ్యం.

కాని దీనికంతటికీ మసిపూసి, మారేడుకాయ చేసి, దీనిని అబద్ధంచేస్తేనేగాని కౌట్స్కీ పబ్బం గడవదు — అతని స్వపక్షపరిత్యాగ స్థితి వల్లనే అతనికి మరొక గత్యంతరం లేకపోతూంది.

అతడు ఎంతటి తుచ్ఛమైన కుతంత్రానికి ఒడిగడుతున్నాడో చూడండి.

మొదటి కుతంత్రం "...ఈ దృష్టాంతంలో మార్క్స్ మనస్సులో వున్నది పరిపాలన రూపంకాదనే విషయం, ఇంగ్లండులోనూ అమెరికాలోనూ శాంతియుతంగా, అనగా ప్రజా స్వామిక మార్గంలో పరివర్తన జరగవచ్చుననే అతడు అభిప్రాయపడ్డాడనే వాస్తవవిషయంచే రుజువు కాబడుతూంది."

ఇక్కడున్న దృష్టాంతంతో పరిపాలన రూపానికి సుతరామూ ఎట్టి సంబంధమూ లేదు, ఎందుచేతంటే, బూర్జువా రాజ్యాంగయంత్రంయొక్క అచ్చమైన తరహాకు చెంది నట్టి ఏకరాజాధిపత్యాలు, ఉదాహరణకు మిలిటరీ ముఠాలు లేనట్టి ఏకరాజాధిపత్యాలూ వున్నాయి, కాగా ఈ విషయంలో అచ్చమైన తరహాకు చెందినట్టి ప్రజాసత్తాకాలు, ఉదాహరణకు ఒక మిలిటరీ ముఠానూ ఒక బ్యూరాక్రసీనీ, రెండింటినీ కలిగినట్టి ప్రజా పత్తాకాలూ వున్నాయి. ఇది సర్వేసర్వత్రా తెలిసినట్టి చారిత్రక, రాజకీయ వాస్తవవిషయం, కాగా దీనిని అబద్ధం చేయడం కౌట్స్కీ తరంగాదు.

కౌట్స్కీకి గనుక గంభీరతతోనూ నిజాయితీతోనూ వాదించాలనే ఉద్దేశమే వుండిన పక్షంలో, అతడు తననుతానీ ప్రశ్న వేసుకుని వుండేవాడు: విప్లవానికి సంబంధించినంత వరకూ ఎట్టి మినహాయింపులూ లేనట్టి చారిత్రక నియమాలు వున్నాయా? అందుకు ఈ విధంగా జబాబు వచ్చివుండేది: లేవు, అటువంటి నియమాలు లేవు. అటువంటివి కేవలమూ, మార్క్స్ ఒకసారి పేరుపెట్టినట్టి, "ఆదర్శవంతమైన," అనగా సగటు, సామాన్యము, జాతిస్వాభా వికమూ అయిన పెట్టుబడిదారీ విధానానికే వర్తిస్తాయి.

ఇంకా ముందుకు వెళ్దాం. ఇప్పుడు మనం చర్చించుతూన్న విషయం సందర్భంలో ఇంగ్లండునూ అమెరికానూ మినహాయింపుగా చేసినట్టి విషయం ఏదైనా 1870 లలో వుండెనా? ఈ ప్రశ్న వేసితీరాలనే విషయం, చారిత్రక సమస్యలకు సంబంధించినంత వరకూ విజ్ఞానశాస్త్రపు అవసరాలతో ఏ మాత్రం పరిచయం కల్గినవారికైనా స్పష్టంగా కనబడు తూనే వుంటుంది. ఈ ప్రశ్న వేయకపోవడమంటే, విజ్ఞానశాస్త్రాన్ని అసత్యపరచడమే అవు తుంది, కుతర్కానికి పూనుకోవడమే అవుతుంది. కాగా, ఎప్పుడైతే ప్రశ్న వేయబడిందో, అప్పుడు దానికి వచ్చే జబాబు గురించి ఎట్టి సంశయమూ వుండనేరదు: శ్రామికవర్గంయొక్క విప్లవాత్మక నియంతృత్వం బూర్జువావర్గానికి వ్యతిరేకంగా బలప్రయోగమే, కాగా మార్క్స్, ఎంగెల్స్‌లు అనేకసార్లు (మరీ ప్రత్యేకంగా "ఫ్రాన్సులో అంతర్యుద్ధం" అనే గ్రంథంలోనూ, ఆ గ్రంథం పీఠికలోనూ) సవివరంగా చెప్పినట్టు, మిలిటరీ ముఠా, బ్యూరాక్రసీ, రెండూ వుండడంవల్లనే ఇట్టి బలప్రయోగంయొక్క ఆవశ్యకత ప్రత్యేకంగా సృష్టించబడుతూంది. కాని, మార్క్స్ తన అవేక్షణలను కావించిన కాలంలో, అచ్చంగా 1870 లలోనూ ఇంగ్లండు

లోనూ అమెరికాలోనూ అచ్చంగా ఈ సంస్థలు లేనేలేవు! (ఇప్పుడివి ఇంగ్లండులోనూ అమెరికాలోనూ వున్నాయి.)

తన స్వపక్షపరిత్యాగాన్ని కప్పిపుచ్చేందుకై అక్షరాలా అడుగడుగునా కుతంత్రానికి ఒడిగట్టాల్సి వస్తూంది కౌట్‌స్కీ!

కాగా అతడు అనుకోకుండానే తన దుష్టబుద్ధిని తానే ఎలాగు బయటపెట్టుకుంటు న్నాడో గమనించండి; అతనిలా రాశాడు: "శాంతియుతంగా, అనగా ప్రజాస్వామిక మార్గంలో"!!

నియంతృత్వాన్ని నిర్వచించడంలో, ఈ భావనయొక్క మౌలిక స్వభావాన్ని, అదేదనగా, విప్లవాత్మక బలప్రయోగమనే మౌలిక స్వభావాన్ని, పాఠకుడికి కనబడకుండా మరుగుపరచేం దుకు తన శాయశక్తులా ప్రయత్నించాడు. కాని ఇప్పుడు నిజం బయటపడిపోయింది: శాంతి యుత విప్లవానికీ, బలప్రయోగ సహితమైన విప్లవానికీ వుండే వ్యత్యాసం గురించే అసలు ప్రశ్న అంతానూ.

అసలు చిక్కు అంతా ఇక్కడే వుంది. కేవలం బలప్రయోగసహితమైన విప్లవంతో సంబంధాన్ని వదలుకోడానికే, తాను దానిని పరిత్యజించుతున్నాననే విషయాన్ని, లిబరల్ కార్మిక విధానంతో, అనగా బూర్జువావర్గంతో తాను చేరిపోతున్నాననే విషయం కప్పిపుచ్చ డానికే కౌట్‌స్కీ ఇన్ని కుతంత్రాలకీ, కుతర్కాలకీ, కపటబుద్ధితో అబద్ధంచేయడములకూ ఒడిగట్టాల్సి వచ్చింది. అసలు చిక్కంతా ఇక్కడే వుంది.

"చరిత్రకారుడు" కౌట్‌స్కీ ఎంత సిగ్గు బిడియాలు లేకుండా చరిత్రను అబద్ధం చేస్తున్నాడంటే, ఇంగ్లండులోనూ అమెరికాలోనూ దృష్టాంతకంగా ద్యోతకమైన దాని మౌలిక ఆర్థిక లక్షణాల కారణంగా గుత్తపెట్టుబడిదారీ విధానానికి పూర్వముండిన పెట్టుబడిదారీ విధానం, వాస్తవంగా తన ఉచ్చదశను 1870 లలో అనుభవించినట్టి పెట్టుబడిదారీ విధానం, సాపేక్షంగా చూచినట్టయితే శాంతి, స్వేచ్ఛా వాంఛలనే తన విశిష్ట లక్షణాలనుగా కలిగి వుండినదన్న మౌలికమైన వాస్తవవిషయాన్ని అతడు "విస్మరిస్తున్నాడు." తద్వ్యతిరేకంగా, చిట్టచివరకు ఇరవైయ్యో శతాబ్దిలో మాత్రమే పక్వానికొచ్చిన సామ్రాజ్యవాదం, అనగా గుత్త పెట్టుబడిదారీ విధానం, తన మౌలిక ఆర్థిక లక్షణాల కారణంగా, కనిష్ఠ పరిమితిలో శాంతి, స్వేచ్ఛలపట్ల వాంఛనూ, సైనిక విధానంపట్ల వాంఛను గరిష్ఠపరిమితిలోనూ సర్వేసర్వ త్రానూ తన విశిష్ట లక్షణాలనుగా కలిగివుంది. ఏ మేరవరకు శాంతియుత, లేదా దౌర్జన్యయుత విప్లవం అత్యంత దృష్టాంతకమౌతుందో, లేక సంభవమో అనే విషయాన్ని చర్చించుతూన్న ప్పుడు, దీనిని "గమనించకపోవడమంటే" బూర్జువావర్గంయొక్క అత్యంత సామాన్యమైన గులాము కిందకి దిగజారిపోవడమే అవుతుంది.

రెండవ కుతంత్రం: పారిస్ కమ్యూన్ శ్రామికవర్గ నియంతృత్వమే, కాని అది సార్వ జనిక నియోజన ననుసరించి, అనగా బూర్జువావర్గానికుండిన నియోజన హక్కును దాని చేతుల్లోనుండి లాగివేయకుండానే, అనగా "ప్రజాస్వామికంగా," ఎన్నుకోబడింది. కాగా కౌట్స్కీ విజయగర్వంతో ఇలా అంటాడు: "... మార్క్స్ అభిప్రాయంలో (లేదా మార్క్స్ ప్రకారం), శ్రామికవర్గం అధికసంఖ్యాకవర్గంగా ఏర్పడిన పక్షంలో" (bei überwiegendem Proletariat, S. 21) "స్వచ్ఛమైన ప్రజాస్వామ్యంయొక్క అనివార్య ఫలితమైన స్థితే శ్రామికవర్గ నియంతృత్వం."

కౌట్స్కీయొక్క ఈ వాదన ఎంతగా నవ్వు పుట్టిస్తూందంటే, నిజంగా మనం embarras de richesses తో (దాని కారణంగా మీదవచ్చిపడే ప్రత్యుత్తరాలు అనే అధికధనంవల్ల కల్గిన చికాకుతో) బాధపడాల్సే వుంటుంది. మొదటి విషయమేమిటంటే, బూర్జువావర్గంలో అగ్రశ్రేణి, ప్రధాన సైనికాధికార వర్గం, ఉన్నతస్తరం పారిస్‌నుండి వెర్సైయ్‌ల్స్‌కు పలాయనం చిత్తగించిందన్న విషయం జగత్ప్రసిద్ధం. వెర్సైయ్‌ల్స్‌లో "సోషలిస్టు" లూయీ బ్లాంక్ వున్నాడు — సోషలిజంలోని "అన్ని ధోరణులూ" పారిస్ కమ్యూన్‌లో పాల్గొన్నాయని కౌట్స్కీ చేసిన ఉద్ఘాటన అబద్ధమని ఈ సంగతి రుజువు చేస్తూందని ఇక్కడ ప్రాసంగికంగా చెప్పవచ్చు. రెండు శిబిరాలుగా వేరైపోయిన పారిస్ వాస్తవ్యుల విభజనను — అందులో ఒకటి బూర్జువావర్గంలో పోరాటశీలమైన యావత్తు విభాగాన్ని కూడగట్టుకున్నట్టి శిబిరం — "సార్వజనిక నియోజన హక్కును" కలిగివున్నట్టి "స్వచ్ఛమైన ప్రజాస్వామ్య" మని అభివర్ణించడం హాస్యాస్పదం కాదా?

రెండో విషయం, బూర్జువావర్గ ప్రభుత్వాన్ని వ్యతిరేకించుతూన్నట్టి ఫ్రాన్సు దేశ కార్మికుల ప్రభుత్వంగా పారిస్ కమ్యూన్ వెర్సైయ్‌ల్స్‌పై యుద్ధంచేసింది. ఫ్రాన్సు భావి గతినే పారిస్ నిర్ణయించుతూన్న సమయమప్పుడు, "స్వచ్ఛమైన ప్రజాస్వామ్యా"నికీ, "సార్వజనిక నియోజన హక్కు"కీ అక్కడేమి పని? యావత్తు ఫ్రాన్సుకీ చెందినట్టి బ్యాంకును స్వాధీన పరచు కొనకపోవడంలో పారిస్ కమ్యూన్ తప్పుచేసిందని మార్క్స్ అభిప్రాయం వెల్లడించి నప్పుడు, "స్వచ్ఛమైన ప్రజాస్వామ్య" నియమాలనూ ఆచరణనూ తన ప్రాతిపదికగా తీసుకునే అతడు తన అభిప్రాయానికి వచ్చాడా?

నిజానికి, ప్రజలు "సామూహికంగా" నవ్వకూడదని ప్రజపై పోలీసు నిర్బంధంవున్న దేశంనుండి కౌట్స్కీ దీనిని రాస్తున్నాడన్నది ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది, లేకుంటే ప్రజాహేళనకు తట్టుకోలేక కౌట్స్కీ ప్రాణాలు విడిచివుండాల్సిందే.

మూడో విషయం: "స్వచ్ఛమైన ప్రజాస్వామ్య" దృక్పథం నుండే పారిస్ కమ్యూన్ని పొగడుతూ ఎంగెల్స్ రాసిన ఈ దిగువ ఖండాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లను కంఠస్థం చేసినట్టి మిస్టర్ కౌట్స్కీ దృష్టికి నేను సవినయంగా జ్ఞాపకంచేస్తున్నాను:

''ఈ పెద్దమనుష్యులు'' (అధికారవ్యతిరేకులు) ''ఎప్పుడైనా విప్లవాన్ని చూశారా? విప్లవానికి మించిన అధికార విధేయతను కోరేది అదే తప్ప మరొకటిలేదు. తుపాకులనూ, సన్నీలనూ, ఫిరంగులనూ — వీటికి మించి అధికార విధేయతను కోరేవి ఇంకేవేనా వున్నాయా అంటే ఇవే — ఉపయోగించి ప్రజలో ఒక భాగం తన అభీష్టాన్ని మరొక భాగంపై రుద్దే కార్యం అది. విజయం గాంచిన పక్షం నిరర్థకంగా పోరాడివుండ దల్చుకొనకపోయిన పక్షంలో, అభివృద్ధి నిరోధకులతో భయోత్పాతాన్ని పురికొల్పే తన ఆయుధబలంతో ఈ పరిపాలనను నిలబెట్టుకొని తీరాలి. బూర్జువావర్గానికి వ్యతిరేకంగా సాయుధ ప్రజాధికారాన్ని ఉపయోగించుకొని ఉండకపోతే పారిస్ కమ్యూన్ ఒక్క రోజైనా నిలబడగల్గేదా? తత్‌వ్యతిరేకంగా, ఈ అధికారాన్ని మరింత విస్తృతంగా ఎందుకు ఉపయోగించలేదని దానిని మనం నిందించవద్దా?''[159]

ఇదిగో ఇక్కడ తారసిల్లుతూంది మీకు ''స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం''! వర్గాలుగా విభాగించబడిన సమాజంలోని ''స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం'' గురించి కబుర్లు చెప్పనెంచిన చౌకబారు పెట్టీబూర్జువా ''సోషల్-డెమోక్రాట్''ను (1840 సంవత్సరాల ఫ్రెంచి అర్థంలోనూ, 1914–1918 సంవత్సరాల సాధారణ యూరపియన్ అర్థంలోనూ), ఎంగెల్స్ ఎంతగా ఎగతాళిచేసి వుండేవాడో కదా!

ఇక చాలు. కౌట్‌స్కీ ఉచ్చరిస్తూన్న అన్ని అసందర్భాలను పేర్కొనడం మన తరం గాదు, ఎందుకంటే, అతడి నోటనుంచి వస్తూన్న ప్రతి వాక్యమూ స్వపక్షపరిత్యాగ పంకిల మైన అధఃపాతాళమే.

మార్క్స్, ఎంగెల్స్‌లు పారిస్ కమ్యూన్ని అత్యంత సవివరంగా విశ్లేషించి, ''సిద్ధంగా తయారైవున్న రాజ్యాంగయంత్రాంగాన్ని'' ధ్వంసంకావించి, భగ్నం చేసే యత్నంలోనే దాని గొప్పతనం వుందని చూపించారు. ఈ పర్యవసానం ఎంత ముఖ్యమైనదిగా మార్క్స్, ఎంగెల్స్‌లు పరిగణించారంటే, ఈ ఒక్క సవరణను మాత్రమే ''కమ్యూనిస్టు ప్రణాళిక'' లోని ''పాతపడిపోయిన'' (కొన్ని భాగాలలో) కార్యక్రమంలో వారు పొందుపరచారు. పారిస్ కమ్యూన్ సైన్యాన్నీ, అధికారవర్గ పరిపాలననూ అంతమొందించిందనీ, పార్లమెంటరీ విధానాన్ని అంత మొందించిందనీ, ''పరాన్నభుక్తపు కంత అయిన రాజ్యాంగయంత్రాన్ని'' నాశనం కావించిందనీ, ఇంకా వగైరా కార్యాలను చేసిందనీ మార్క్స్, ఎంగెల్స్‌లు చూపించారు; కాని అన్నీ తెలిసిన కౌట్‌స్కీ నిద్ర పుచ్చేందుకని జోకొట్టుతూ, ఇంతకుముందు లిబరల్ ప్రొఫెసర్లు వెయ్యి సార్లు చెప్పినట్టే ''స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం'' గురించిన నాయనమ్మ కథే తాను మళ్లీ చెబుతున్నాడు.

జర్మన్ సోషల్-డెమోక్రసీ ఇప్పుడు కుళ్లి కంపుకొడుతూన్న శవం అని 1914 ఆగస్టు 4 న రోజా లుక్సెంబుర్గ్ వూరకే అనలేదు.

మూడో కుతంత్రం: "నియంతృత్వాన్ని పరిపాలన రూపంగా మనం చెప్పేటప్పుడు, ఒక వర్గంయొక్క నియంతృత్వమని చెప్పడానికి మనకు వీలుండదు, ఎందుచేతంటే, మనమిది వరకే చూపించినట్టు, వర్గం అన్నది రాజ్యంచేయగల్గుతుందేగాని పరిపాలించజాలదు...." "ఆర్గనైజేషనులే" లేక "పార్టీలే" పరిపాలించుతాయి.

మిస్టర్ "గందరగోళపు సలహాదారుడా," ఇది వుత్త గందరగోళం, అసహ్యామైన గందర గోళం! నియంతృత్వం ఒక "పరిపాలన రూపం" కాదు; అలా చెప్పడం కేవలం హాస్యాస్పద మైన అసందర్భం. కాగా, "పరిపాలన రూపం" గురించి కాకుండా, రాజ్యాంగయంత్ర రూపం, లేదా దృష్టాంతం గురించి చెబుతున్నాడు మార్క్స్. ఇదికేవలం భిన్నమైన విషయం, కేవలమూ భిన్నమైన విషయం. ఒక వర్గం పరిపాలనను నడిపించజాలదని అనడం కూడా కేవలం అసంద ర్భమే: ఇటువంటి అసందర్భాన్ని ఉచ్చరించడం బూర్జువా పార్లమెంట్లను తప్ప, "పాలక వర్గ పార్టీలను" తప్ప, మరి దేనిని చూడనొల్లని "పార్లమెంటరీ జడ్డివాడే" తప్ప మరొకడి కెవ్వడికీ సాధ్యం కాదు. పాలకవర్గంచే నడిపించబడుతూన్న పరిపాలన దృష్టాంతాలను, ఉదా హరణకు, చాలినంతగా ఆర్గనైజేషను లేకపోయినప్పటికీ మధ్యయుగాలలో భూస్వాముల పరి పాలన, యూరప్‌లోని ఏ దేశమైనాసరే మిస్టర్ కౌట్‌స్కీకి చూపగల్గుతుంది.

ఇక సారాంశం తేల్చుదాం: శ్రామికవర్గ నియంతృత్వ భావాన్ని అత్యంత నిరుపమాన మైన విధంగా వికృతపరచడమే కాకుండా, మార్క్స్‌ను వుత్త సామాన్యపు లిబరల్ కిందకి మార్చివేశాడు మిస్టర్ కౌట్‌స్కీ; అనగా, పీడితవర్గంచే విప్లవాత్మక బలప్రయోగ మంటేనే అన్నిటికంటెను ముఖ్యంగా భయంతో వెనక్కి జంకుతూ, బూర్జువావర్గ ప్రజాస్వామ్యం యొక్క వర్గ విషయానికి మెరుగులుదిద్ది దానిని దాటవేస్తూన్నట్టి, "స్వచ్ఛమైన ప్రజా స్వామ్యం" గురించి చప్పచప్పని వాక్యాలు ఉచ్చరించుతూన్నట్టి లిబరల్ స్థాయికి తానే దిగ జారిపోతున్నాడు. పీడకులకు వ్యతిరేకంగా పీడితవర్గంయొక్క విప్లవాత్మక దౌర్జన్యం అదృ శ్యమైపోయేటట్టుగా "శ్రామికవర్గ విప్లవాత్మక నియంతృత్వ" భావానికి "భాష్యం చెప్ప డంలో," మార్క్స్‌ను లిబరల్‌గా వికృతపరచడమనే కార్యంలో కౌట్‌స్కీ ప్రపంచపు రికా ర్డునే భగ్నంచేశాడు. స్వపక్షపరిత్యాగి కౌట్‌స్కీ బెర్న్‌స్టయిన్‌ను తలదన్నాడు.

అక్టోబరు — నవంబరు 1918.

# మూడవ ఇంటర్నేషనల్, చరిత్రలో దాని స్థానమూ

సోవియట్ రిపబ్లిక్కును అంటురోగానికి పుట్టిల్లుగా పెట్టుబడిదారీ ప్రపంచం నుండి తెగగొట్టి వేయడానికి ప్రయత్నించుతూ "మిత్రరాజ్య" దేశాల[160] సామ్రాజ్యవాదులు రష్యాపై దిగ్బంధన ప్రకటించారు. తమ "ప్రజాస్వామిక" సంస్థలను గురించి బడాయిలు చెప్పుకుంటూన్న ఈ మనుషులకు సోవియట్ రిపబ్లిక్‌పట్ల వున్న గుడ్డి ద్వేషం ఎంతవరకూ పోతూందంటే, తాము ఎంతటి నగుబాట్లకు పాలవుతూన్నదీ కూడా వారు తెలుసుకో లేకుండా వున్నారు. "ప్రజాస్వామిక ముల్లైనట్టి," నఖశిఖపర్యంతమూ ఆయుధాలు ధరించినట్టి సర్వ ప్రపంచం పైనా అవిభక్తమైన సైనిక పరిపాలనను చలాయించుతూన్నట్టి అత్యంత నాగరికతను కల్గిన పురోగామి దేశాలు, శిథిలమైపోయి, పస్తుంటూ, వెనకపడిపోయి, కొందరి ఉద్ఘోషననుసరించి అర్ధకిరాతకమైన దేశంనుండి భావశాస్త్రీయ సంసర్గ దోషం కలుగుతుందని ప్రాణాంతకంగా భయపడడం ఎంత విడ్డూరమో ఆలోచించండి!

ఈ వైరుధ్యం ఒక్కటే అన్ని దేశాల్లోని కష్టజీవులకు కనువిప్పు కలిగించుతూ, సామ్రాజ్యవాదులు క్లెమాన్‌సో, లాయిడ్ జార్జ్, విల్సన్‌లయొక్క, వారి ప్రభుత్వాలయొక్క కృత్రిమబుద్ధిని బయట పెట్టేందుకు తోడ్పడుతూంది.

అయినప్పటికీ, సోవియట్లపట్ల పెట్టుబడిదార్ల గుడ్డి ద్వేషమే కాకుండా, తమలో తాము సాగించుకుంటూన్నట్టి ఒకరి వెనుక ఒకరు గోతులు తీయడానికి ప్రేరేపించుతూన్నట్టి తగవులాటలు కూడా మనకు తోడ్పడుతున్నాయి. వారు పరస్పరంగా అచ్చమైన మౌనదుస్తంత్రం ఒకదానిని పన్నుతున్నారు, ఎందుచేతనంటే, సాధారణంగా సోవియట్ రిపబ్లిక్ గురించీ, ప్రత్యేకంగా దాని అధికారపత్రాలను గురించీ నిజమైన భోగట్టాను ప్రచురించడానికి వారికి వల్లమాలినంత భయం కలుగుతూంది. అయినప్పటికీ, ఫ్రెంచి బూర్జువావర్గ ప్రధాన పత్రిక అయిన "కాలము" ("Le Temps"), మాస్కోలో మూడవ ఇంటర్నేషనల్ స్థాపన గురించి ఒక వృత్తాంతం ప్రచురించింది.

ఇందుకుగాను ఫ్రెంచి బూర్జువావర్గపు ప్రధాన పత్రికకు, ఫ్రెంచి జాతీయదుర హంకార, సామ్రాజ్యవాద నాయకమణికి మన గౌరవపురస్సరమైన వందనాలు తెలియజేస్తున్నాం. ఆ పత్రిక మనకు అందజేస్తూన్న ఫలప్రదమూ సమర్థవంతమూ అయిన సహాయానికి అస్మదభివందన సూచకంగా సువర్ణాక్షరాలతో ఉజ్వలితమగు విజ్ఞాపన పత్రాన్ని "Le Temps" కు పంపడానికి మేం సిద్ధంగా వున్నాం.

మన రేడియో ప్రసారాలను ఆధారం చేసుకుని "Le Temps" తన వృత్తాం తాన్ని సంకలనం చేసిన విధానమే, డబ్బుసంచులకు బాకా పట్టుతూన్న ఈ పత్రికను ప్రేరేపించిన ఉద్దేశాన్ని స్పష్టంగానూ సంపూర్ణంగానూ బయటపెట్టుతూంది. "ఎలాంటి వాళ్లతో సంప్రతింపులు జరపడానికి మీరు ఒడిగట్టుతున్నారో, చూశారా!" అంటూ ధ్వనించే టట్టుగా విల్సన్‌ని దెప్పడమే దాని ఉద్దేశ్యం. బోల్‌షెవిక్ బూచిని చూపించి విల్సన్‌ని భయపెట్టేందుకు డబ్బుసంచుల హుకుమ్ ప్రకారం రాస్తూన్న ఈ పండితమ్మన్యులు చేస్తూన్న యత్నం, బోల్‌షెవిక్‌లకు ఒక అడ్వర్‌టైజ్‌మెంటుగా కష్టజీవుల దృష్టిలో కనబడు తూందన్న విషయం వారు గమనించడంలేదు. ఫ్రెంచి కోటీశ్వరుల పత్రికకు మన గౌరవ పురస్సరాభివందనాలు తెలియజేస్తున్నాం!

ప్రపంచ కార్మికవర్గంలో ఈ ఇంటర్నేషనల్ గురించిన వార్తలూ, దానిపట్ల సాను భూతీ వ్యాప్తిచెందకుండా "ఆంటాంట్" సామ్రాజ్యవాదుల, లేదా జర్మనీలోని షైడెమన్‌లూ, ఆస్ట్రియాలోని రెన్నెర్‌లూ లాంటి పెట్టుబడిదారీ వర్గపు గులాముల ఎట్టి నిషేధాజ్ఞలూ, ఎట్టి నీచమైన దౌర్భాగ్యపు కుతంత్రాలూ అరికట్టజాలనట్టి అంతర్జాతీయ పరిస్థితులలో మూడవ ఇంటర్నేషనల్ స్థాపించబడింది. సర్వత్రా స్పష్టంగా దినదినమూ, ఆమాటకొస్తే గంటగంటకూ, ప్రవర్ధమానమౌతూన్న శ్రామికవర్గ విప్లవమే ఈ పరిస్థితికి కారణం. కష్ట జీవిరాసులలో నిజంగా అంతర్జాతీయంగా రూపొందినంతటి బలాన్ని ఇప్పటికప్పుడే సంపా దించిన సోవియట్ ఉద్యమమే ఈ పరిస్థితికి కారణభూతమైంది.

పెట్టుబడిపై తమ విప్లవాత్మక దాడిని సన్నద్ధం చేసుకుందుకు కార్మికుల అంత ర్జాతీయ ఆర్గనైజేషను ఒకదానికి మొదటి ఇంటర్నేషనల్ (1864–1872) శంకు స్థాపన చేసింది. విప్లవాత్మక స్థాయిలో తాత్కాలికమైన తగ్గుదలకూ, చిట్టచివరకు ఈ ఇంటర్నేషనల్ యొక్క అవమానకరమైన వినాశానికే దారితీసిన అవకాశవాదంయొక్క తాత్కాలిక పటుత్వానికీ కారణమైన వైశాల్యాభివృద్ధిని సాధించినట్టి శ్రామికవర్గ ఉద్యమంయొక్క అంత ర్జాతీయ ఆర్గనైజేషను రెండవ ఇంటర్నేషనల్ (1889–1914).

అవకాశవాదానికీ సోషల్-జాతీయ దురహంకారానికీ వ్యతిరేకంగా సుదీర్ఘ సంవ త్సరాల కాలంలో, ప్రత్యేకంగా యుద్ధకాలంలో, సాగిన పోరాటం అనేక దేశాలలో కమ్యూనిస్టు

పార్టీల స్థాపనకు దారితీసిన పరిస్థితులలో, వాస్తవంగా 1918 లో మూడవ ఇంటర్నేషనల్ ప్రాదుర్భవించింది. అధికారయుతంగా మూడవ ఇంటర్నేషనల్ మాస్కోలో 1919 మార్చి లో జరిగిన ఈ ఇంటర్నేషనల్‌యొక్క మొదటి కాంగ్రెస్‌లో స్థాపించబడింది. కాగా ఈ ఇంటర్నేషనల్‌యొక్క అత్యంత స్వాభావికమైన లక్షణం, మార్క్సిజం కార్యాన్ని నెరవేర్చి, ఆచరణలోకి తీసుకురావడమూ, సోషలిజంయొక్క, కార్మికవర్గంయొక్క చిరకాల ఆదర్శాల సాధన — మూడవ ఇంతర్నేషనల్‌యొక్క అత్యంత స్వాభావికమైన ఈ లక్షణం — ఈ కొత్త మూడవ ''ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోషియేషన్'' ఇప్పటికే సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్‌తో కొంతమేరకు అనురూపం చెందడం ప్రారంభించిందనే వాస్తవవిషయంలో ప్రాదుర్భవించింది.

సోషలిజానికై శ్రామికవర్గ, అంతర్జాతీయ పోరాటానికి మొదటి ఇంటర్నేషనల్ పునాది వేసింది.

అనేక దేశాల్లో ఉద్యమానికై విశాల, రాశివిస్తరణకు నేలను సిద్ధంచేసే కాలావధికి రెండవ ఇంటర్నేషనల్ చిహ్నమైంది.

రెండవ ఇంటర్నేషనల్ క్రియాకలాప ఫలితాలను క్రోడీకరించి, దాని అవకాశవాద, సోషల్-జాతీయ దురహంకార, బూర్జువా, పెట్టీబూర్జువా వర్గాల చెత్తచెదారాన్ని తిరస్కరించి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఆచరణలోకి తీసుకువచ్చేందుకు మూడవ ఇంటర్నేషనల్ ప్రారంభించింది.

ప్రపంచంలోని అత్యంత విప్లవాత్మకమైన ఉద్యమానికి, పెట్టుబడి గాటినుండి విముక్తిని సాధించేందుకై శ్రామికవర్గంయొక్క ఉద్యమానికి నాయకత్వం వహించుతూన్న పార్టీల అంతర్జాతీయ మిత్రత్వం, అంతర్జాతీయ స్థాయిలో శ్రామికవర్గ నియంతృత్వానికీ, పెట్టుబడిదారీ విధానంపై దాని విజయానికీ రూపురేఖలు దిద్దుతూన్న అనేక సోవియట్ రిపబ్లిక్కుల స్వరూపంలో అవతరించుతూన్నట్టి అపూర్వ పటుతర ప్రాతిపదికపై ఇప్పుడు ఆధారపడివుంది.

మూడవ ఇంటర్నేషనల్ యొక్క చారిత్రాత్మక ప్రాముఖ్యతంతా, మార్క్స్ ఇచ్చినట్టి ప్రధాన నినాదం, శతాబ్దులుగా సాగితూన్న సోషలిజంయొక్క, కార్మికవర్గ ఉద్యమంయొక్క అభివృద్ధిన్ని సంక్షిప్తంగా వ్యక్తపరుస్తూన్న నినాదం, శ్రామికవర్గ నియంతృత్వమనే భావనలో ద్యోతకమవుతూన్న నినాదాన్ని చరితార్థంచేయ నారంభించడంలోనే వుంది.

ప్రతిభాన్వితమైన ఈ భవిష్యత్ జ్ఞానం, ప్రతిభాన్వితమైన ఈ సిద్ధాంతం — యథార్థమవుతూంది.

లాటిన్ భాషలోవున్న ఈ వాక్యం ఇప్పుడు సమకాలిక యూరప్‌లోని అన్ని భాషల్లోకీ — అంతేకాదు, ప్రపంచంలోని అన్ని భాషల్లోకీ అనువదించబడింది.

ప్రపంచ చరిత్రలో ఒక నూతన శకం ఆరంభమైంది.

పెట్టుబడిదారీ విధానపు బానిసత్వం, లేదా వేతనపు బానిసత్వం, అనే బానిసత్వపు తుది రూపాన్ని మానవాళి వదిలించేసుకుంటూాంది.

బానిసత్వంనుండి తాను విమోచన సాధించుకోవడంవల్ల మానవాళి తొలిసారిగా నిజమైన స్వేచ్ఛాస్థితికి పరివర్తన చెందుతూాంది.

యూరప్‌లోని మిక్కిలి వెనుకబడిన దేశాల్లో ఒక దేశానికి, శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించడానికీ, సోవియట్ రిపబ్లిక్కును ఆర్గనైజు చేయడానికీ ఎలా వీలైంది? రష్యా బడుగుస్థితికీ, బూర్జువా ప్రజాస్వామ్యంపై గంతువేసి సోవియట్, లేక శ్రామికవర్గ ప్రజాస్వామ్యంలోకి, ప్రజాస్వామ్యంయొక్క అత్యున్నత రూపంలోకి ''దాటు'' వేయడానికీ వున్న ఈ వైరుధ్యమే — సోవియట్ల పాత్రను అర్థం చేసుకుందుకు పాశ్చాత్యంలో ప్రత్యేకంగా కలుగుతూన్న కష్టానికీ, లేదా ఆలస్యానికీ ఈ వైరుధ్యమే ఒక కారణమని (సోషలిస్టు నాయకులలో అధికసంఖ్యాకవర్గానికి గుదిబండలా తయారైన అవకాశవాదపు అలవాట్లూ, అల్పబుద్ధి దురభిమానాలూ అటుండగా) చెప్పడంలో మనమెంతమాత్రమూ పొరపడడంలేదు.

శ్రామికవర్గ పోరాటంలో ఒక ఉపకరణంగా, శ్రామికవర్గ రాజ్యాంగయంత్రంయొక్క ఒక రూపంగా సోవియట్ల ప్రాముఖ్యతను యావత్ ప్రపంచ కార్మికప్రజారాసులూ సహజ జ్ఞానంతో ఆకళింపు చేసుకున్నాయి. కాని అవకాశవాదంచే చెడగొట్టబడిన ''నాయకమ్మన్యులు,'' ''ప్రజాస్వామ్య'' మని తాము సాధారణంగా పిలుస్తూన్నట్టి బూర్జువా ప్రజాస్వామ్యాన్నే వారు ఆరాధించ సాగించి, దానిని ఇంకా ఆరాధించుతూనేవున్నారు.

రష్యాయొక్క వెనకబాటుతనమూ, బూర్జువా ప్రజాస్వామ్యంపై గంతువేసి ''దాటు'' వేయడమూ, ఈ రెంటికీ వున్న వైరుధ్యాన్ని శ్రామికవర్గ నియంతృత్వ స్థాపన ప్రధానంగా వ్యక్తపరచడంలో ఆశ్చర్యమేముంది? అనేక వైరుధ్యాలు లేకుండానే ప్రజాస్వామ్య నూతన రూపాన్నొకదానిని చరిత్ర మనకు ప్రసాదించి వుండిన పక్షంలో ఆ విషయమే ఎంతో ఆశ్చర్యం కల్గించి వుండేది.

''శ్రామికవర్గ నియంతృత్వంలోకి వేర్వేరు పెట్టుబడిదారీ విధానపు దేశాల పరివర్తనలు అసమానంగానూ, లేదా సమస్వర నిష్పత్తిలోనే వుండడమూ సంభవమా?'' అని ఒక మార్క్సిస్టుని, లేదా ఆధునిక విజ్ఞానశాస్త్రంతో ఏ మాత్రం పరిచయంవున్న వ్యక్తినైనా ప్రశ్నించినట్టయితే, వుండదనే అతడు తప్పక జవాబిస్తాడు. పెట్టుబడిదారీ ప్రపంచంలో సమానత, సమస్వరమూ, లేదా నిష్పత్తిబద్ధమూ ఇదివరకెన్నడూ వుండలేదు, వుండేందుకు వీలూలేదు. పెట్టుబడిదారీ విధానంయొక్కా, కార్మికవర్గ ఉద్యమంయొక్కా పార్శ్వాలలోనూ, లేక స్వభావాలలోనూ, లేక గుణగణాలలోనూ ఒకప్పుడు ఒకదానికీ, మరొకప్పుడు మరొక

దానికీ ప్రత్యేక ప్రాధాన్యతను ప్రదర్శించి, ప్రతి దేశమూ అభివృద్ధిచెందింది. అభివృద్ధి ప్రక్రియ అసమానంగానే వుంటూ వచ్చింది.

ఫ్రాన్సు తన మహనీయ బూర్జువా విప్లవాన్ని సాగించుకుంటూ, యూరపియన్ ఖండాన్నంతనూ చారిత్రకంగా ఒక నూతన జీవితానికి మేల్కొల్పుతూండినప్పుడు, పెట్టుబడిదారీ విధానం దృష్ట్యా ఫ్రాన్సుకంటె ఇంగ్లండే అత్యంత ఉన్నతాభివృద్ధి చెందివుండినప్పటికీ, విప్లవప్రతీఘాత సంయుక్తమండలికి ఇంగ్లండే నాయకత్వం వహించింది. కాగా ఆనాటి బ్రిటిష్ కార్మికవర్గ ఉద్యమం భావి మార్క్సిజంలోని విషయాన్ని చాలావరకు ముందుగానే ఉజ్వలంగా ఊహించగలిగింది.

ప్రపంచానికి బ్రిటన్ చార్టిజాన్ని, మొట్టమొదటి సారిగా విశాలమైనట్టీ యథార్థ ప్రజారాశీయమైనట్టీ రాజకీయంగా అర్గనైజైనట్టీ శ్రామికవర్గ విప్లవాత్మక ఉద్యమాన్ని, బహూకరించినప్పుడు, బలహీనస్థితిలోనే వుండిన అనేక బూర్జువా విప్లవాలు యూరప్ ఖండంలో జరుగుతూండగా, అదే సమయంలో శ్రామికవర్గానికీ, బూర్జువావర్గానికీ మధ్య మొదటి మహనీయ అంతర్యుద్ధం ఫ్రాన్సులో ప్రజ్వరిల్లింది. శ్రామికవర్గంయొక్క వివిధ జాతీయ దళాలను ఒకదాని తరువాత ఒకటిగానూ, భిన్నభిన్న దేశాల్లో భిన్నభిన్న మార్గాలలోనూ బూర్జువావర్గం ఓడించివేసింది.

ఎంగెల్స్ చెప్పినట్టు, బూర్జువావర్గపు ప్రభువర్గం సరసనే అత్యంత బూర్జువా రూపాన్ని ధరించినట్టి శ్రామికవర్గ ఉన్నత స్తరమొక దానిని ప్రభవించిన బూర్జువావర్గాన్ని కలిగినట్టి దేశాలకు, బ్రిటన్ ఒక నమూనా దేశంగా తయారైంది. శ్రామికవర్గంయొక్క విప్లవాత్మక పోరాటానికి సంబంధించినంత వరకు, ఈ పురోగామి పెట్టుబడిదారీ దేశం అనేక దశాబ్దుల తరబడి వెనకే ఉండిపోయింది. 1848, 1871 సంవత్సరాలలో జరిగినట్టీ, ప్రపంచచరిత్ర అభివృద్ధికి అత్యంత గణనీయంగా సహాయం చేసినట్టీ, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా జరిగినట్టీ విరోచిత కార్మికవర్గ విప్లవాలు రెండింటిలోనూ, ఒక విధంగా చెప్పాలంటే, శ్రామికవర్గపు పటిమను ఫ్రాన్సు పూర్తిగా బలహీనపరచేసింది. తరువాత అంతర్జాతీయకార్మికవర్గ ఉద్యమాధిపత్యం జర్మనీకి లభించింది; పంథొమ్మిదో శతాబ్ది ఎనిమిదో దశాబ్దిలో ఆర్థికదృష్ట్యా, ఇంగ్లండు ఫ్రాన్సులకంటె జర్మనీ ఇంకా వెనుకబడే వుండిన కాలంలో ఇది జరిగింది. కాని ఎప్పుడైతే ఆర్థికంగా జర్మనీ ఈ రెండు దేశాలనూ మించిపోయిందో, అనగా ఇరవైయ్యో శతాబ్ది రెండో దశాబ్దిలో, ప్రపంచానికంతటికీ నమూనాగా వుండిన జర్మన్ మార్క్సిస్టు కార్మికుల పార్టీ, కార్మికుల శ్రేణులలోనుండి వచ్చినట్టీ, ఏకరాజాధిపత్యంయొక్క, విప్లవప్రతీఘాతక బూర్జువావర్గంయొక్క కొలువులో వుండినట్టీ, పెట్టుబడిదార్లకు అమ్ముడుపోయినట్టీ, నీచాతినీచులైన కసాయివాళ్లు, అత్యంత హేయకరమైన పట్టెడుమంది శుద్ధ

దగల్బాజీల — షైడెమన్, నోస్కేలమొదలు డావిడ్, లెజీన్ల వరకూ — నాయకత్వం కిందకి వచ్చినట్లు రుజువైంది.

శ్రామికవర్గ నియంతృత్వానికే ప్రపంచ చరిత్ర సూటిగా సాగిపోతూంది; కాని ఈ సాగిపోవడంలో ఎంత మాత్రమూ చదునూ, సరళమూ, సూటీ కానట్టి మార్గాలనే అది అనుసరించుతూంది.

కౌట్స్కి తానింకా మార్క్సిస్టుగానూ, సోవియట్, లేక శ్రామికవర్గ, ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా షైడెమన్తోనూ బూర్జువా ప్రజాస్వామ్యంతోనూ కలిసి ఐక్యత తరఫున పోరాడి, తద్వారా మార్క్సిజంనుండి స్వపక్షపరిత్యాగి ఇంకా కాకుండానూ వుండిన రోజుల్లో, ''స్లావ్ ప్రజలూ, విప్లవమూ'' అనే శీర్షికతో ఒక వ్యాసం — ఇరవైయ్యో శతాబ్ది మొట్టమొదట్లో — రాశాడు. అంతర్జాతీయ విప్లవోద్యమంలో ఆధిపత్యం స్లావ్ప్రజలకు లభించే సాధ్యతను సూచించుతూండినట్టి చారిత్రక పరిస్థితులను ఈ వ్యాసంలో అతడు ఎత్తి చూపాడు.

సరిగ్గా అలాగే జరిగింది. ఎలాగైతే పంధొమ్మిదో శతాబ్దిలో వివిధ కాలావధులలో విప్లవాత్మక శ్రామికవర్గపు ఇంటర్నేషనల్లోని ఆధిపత్యం మొదట బ్రిటిష్ కార్మికుల చేతిలోనూ, తరువాత ఫ్రెంచి కార్మికుల చేతిలోనూ, ఆతరువాత జర్మన్ కార్మికుల చేతిలోనూ వుండినదో, అలాగే కొంతకాలం — కొంతకాలం వరకే అని చెప్పనవసరమే లేదు — అది రష్యన్లకు లభించుతుంది.

పురోగామి దేశాలతో సరిపోల్చి చూస్తే, మహత్తర శ్రామికవర్గ విప్లవాన్ని రష్యన్లు సులభంగానే ఆరంభించ గలిగారు గాని, సోషలిస్టు సమాజాన్ని అర్గనైజు చేయడమనే అర్థంలో, దానిని సాగించి, అంతిమ విజయానికి కొనిపోవడం వారికి మరింత కష్టమవుతుందని చెప్పడానికి నాకనేకసార్లు అవకాశం కలిగింది.

మనకు ఆరంభం సులభమవడానికి కారణాలలో మొదటి కారణం: రాజకీయంగా జారిస్టు ఏకరాజ పరిపాలనా వ్యవస్థయొక్క — ఇరవైయ్యో శతాబ్ది యూరప్ పరిస్థితుల దృష్ట్యా— అసాధారణమైన వెనుకబడినతనం అసాధారణ బలంకలిగినట్టి విప్లవాత్మక దాడిని ప్రజారాసులలో పురికొల్పింది. రెండోకారణం, రష్యా వెనుకబడినతనం బూర్జువావర్గానికి వ్యతిరేకంగా లేచిన శ్రామికవర్గ విప్లవాన్ని, భూస్వాములకు వ్యతిరేకంగా లేచిన రైతు విప్లవంతో ఒక చిత్రమైన విధంగా విలీనంచేసింది. అక్టోబరు 1917 లో సరిగా ఇక్కడే మనం ప్రారంభించాం, కాగా ఇక్కడే గనుక మనం ప్రారంభించక పోయుంటే, అంత సులభంగా మనం విజయం సాధించగల్గి వుండేవారంకాం. రష్యా గురించి చెబుతూ శ్రామికవర్గ విప్లవము, రైతుయుద్ధాల చిత్రమైన కలయికయొక్క సాధ్యతను గురించి 1856 లోనే మార్క్స

ప్రస్తావించాడు. 1905 ఆరంభంనుండీ బోల్షెవిక్‌లు శ్రామికవర్గ, రైతాంగాలవిప్లవాత్మక-ప్రజాస్వామిక నియంతృత్వ భావానికి అనుకూలంగానే వాదించుతూ వచ్చారు. మూడో కారణం: కార్మిక, రైతు ప్రజారాసుల రాజకీయ ప్రబోధానికై, పాశ్చాత్యంలో సోషలిజం గురించి చెప్పబడిన "తుది మాట"ను వాటి అగ్రగామిదళాలకు పరిచయం చేయడమూ, ప్రజారాసుల విప్లవాత్మక క్రియాకలాపాలూ, ఈ రెంటి విషయంలోనూ, 1905 విప్లవం బ్రహ్మాండంగా తోడ్పడింది. 1905 లో జరిగినట్టి "డ్రెస్ రిహర్సల్" మనకు లేకుండిన పక్షమందు – 1917 లో ఫిబ్రవరి బూర్జువా విప్లవమూ, అక్టోబరు శ్రామికవర్గ విప్లవమూ, రెండూ అసాధ్యములే అయివుండేవి. నాల్గో కారణం: పెట్టుబడిదారీ పురోగామి దేశాల సైనిక శ్రేష్ఠతకు తట్టుకొని, మరే ఇతర దేశంకంటే కూడా రష్యాయే దీర్ఘకాలం నిలబడగల్గిందంటే, అందుకు రష్యా భౌగోళిక పరిస్థితులే కారణమయాయి. ఐదోకారణం: రైతాంగం పట్ల శ్రామికవర్గంయొక్క ప్రత్యేక వైఖరి, బూర్జువా విప్లవంనుండి సోషలిస్టు విప్లవంలోకి పరివర్తనను సులభంచేసి, గ్రామీణ కష్టజీవులలో నిరుపేద అర్ధశ్రామికవర్గ విభాగాలపై నగర శ్రామికులకు తమ ప్రభావం ప్రసరించడానికి మరింత సులభ చేసింది. ఆరో కారణం: సమ్మెక్రియాకలాపంలో సుదీర్ఘమైన శిక్షణా, యూరపియన్ రాశి కార్మికవర్గ ఉద్యమానుభవమూ సోవియట్లు లాంటి శ్రామికవర్గ విప్లవాత్మక ఆర్గనైజేషను యొక్క అద్వితీయ రూప ఆవిర్భవాన్ని – ప్రగాఢంగానూ త్వరితగతినీ తీవ్రమవుతూన్న విప్లవాత్మక పరిస్థితులలో – సులభంచేశాయి.

ఈ జాబితా అసంపూర్ణంగా వుండడం సహజమే; కాని ప్రస్తుతానికి ఇది చాలు.

సోవియట్, లేక శ్రామికవర్గ ప్రజాస్వామ్యం రష్యాలో ఉద్భవించింది. పారిస్ కమ్యూన్ తరువాత చరిత్రాత్మకమైన రెండవ అడుగు వేయడం జరిగింది. శ్రామికవర్గ-కర్షక సోవియట్ రిపబ్లిక్కే ప్రపంచంలో సుస్థిరమైన మొదట సోషలిస్టు రిపబ్లిక్కు అని రుజువయింది. ఒక కొత్త తరహా రాజ్యాంగయంత్రంగా దానికి మృతివుండదు. ఈనాడు అది ఒంటరిగా నిలబడడంలేదు.

సోషలిస్టు నిర్మాణకార్యాన్ని సాగించడానికీ, పరిసమాప్తం కావించడానికీ మరింత, ఇంకా మరింత కృషి అవసరం. ఇంతకంటె మరింతగా నాగరికత చెందిన దేశాలు, ఇంటకంటె మరింత అధికంగా శ్రామికవర్గానికి బలప్రభావాలుగల దేశాలు ఒకసారి గనుక శ్రామికవర్గ నియంతృత్వ మార్గాన్ని చేపట్టాయంటే, అట్టిదేశాలలో ఏర్పడే సోవియట్ రిపబ్లిక్కులకు రష్యాను మించిపోవడానికి ఎంతేనా సాధ్యమవుతుంది.

దివాళాకోరు రెండవ ఇంటర్నేషనల్ ఇప్పుడు మరణశయ్య మీద కొనవూపిరితో కుళ్ళుతూంది. వాస్తవంగా అది అంతర్జాతీయ బూర్జువావర్గపు గులాము పాత్రను నిర్వహిస్తూంది.

అది అచ్చమైన పసుప్పచ్చ ఇంటర్నేషనల్. కౌట్స్కీలాంటి దాని ప్రధాన భావశాస్త్రవేత్తలు, బూర్జువా ప్రజాస్వామ్యాన్ని ఆకాశానికి ఎత్తుతూ, దానికి సాధారణంగా "ప్రజాస్వామ్య" మని, లేక — మరింత బుద్ధితక్కువగానూ, మరింత మొరటుగానూ — "స్వచ్ఛమైన ప్రజాస్వామ్య" మని పేరుపెడతారు.

బూర్జువా ప్రజాస్వామిక చట్రపు పరిమితులలో కార్మికవర్గాన్ని తర్ఫీదుచెయ్యడమే తక్షణకర్తవ్యమై వుండినప్పుడు చారిత్రకంగా అవసరమూ ఉపయోగకరమూ అయినట్టి ఆ కర్తవ్యాన్ని రెండవ ఇంటర్నేషనల్ నెరవేర్చినప్పటికీ, దీనిలాగానే బూర్జువా ప్రజాస్వామ్యం తన ఆయుష్కాలాన్ని మించి జీవించుతూంది.

అత్యంత ప్రజాస్వామికమైన బూర్జువా రిపబ్లిక్కు అయినా సరే, అది పెట్టుబడిచే కష్టజీవులను అణచిపెట్టివుంచే యంత్రమే, పెట్టుబడియొక్క రాజకీయ పారిపాలనా ఉపకరణమే, బూర్జువా నియంతృత్వమే తప్ప మరొకటిగా ఇంతవరకూ కాలేదు, ఇకమీదటా కానేరదు. ప్రజాస్వామిక బూర్జువా రిపబ్లిక్కు అధికసంఖ్యాకవర్గపు ప్రభుత్వాన్ని వాగ్దానం చేసింది, ప్రకటించింది, కాని భూమిపైనీ, ఇతర ఉత్పత్తి సాధనాలలోనూ ప్రైవేటు ఆస్తి వుండినంత కాలమూ దీని నది ఆచరణలో పెట్టజాలదు.

బూర్జువా ప్రజాస్వామిక రిపబ్లిక్కులలో "స్వేచ్ఛ" అంటే ధనికులకు స్వేచ్ఛే అయింది నిజంగా. పెట్టుబడిని కూలదోసేందుకై తమ బలాలను తయారుచేసుకుందుకు శ్రమజీవులూ, కష్టజీవిరైతాంగమూ దానిని ఉపయోగించుకొనగల్గి వుండేవారు, ఉపయోగించుకుని వుండాల్సిందే కూడా, కాని వాస్తవానికి, ఒక సాధారణ నియమంగా పెట్టుబడిదారీ విధానం కింద కష్టజీవి ప్రజారాసులు ప్రజాస్వామ్యాన్ని అనుభవించ లేకపోయారు.

సోవియట్, లేక శ్రామికవర్గ ప్రజాస్వామ్యం, ప్రపంచంలో మొట్టమొదటి సారిగా ప్రజారాసులకు, కార్మికులకూ, సన్నకారు రైతులకూ ప్రజాస్వామ్యాన్ని సృష్టించింది.

సోవియట్ రాజ్యాధికారంవంటి, జనసంఖ్యలో అధికసంఖ్యాకవర్గంచే పరిపాలనా రాజ్యాధికారం, ఈ అధికసంఖ్యాకవర్గంచే రాజ్యాధికారం వాస్తవంగా, ఇంతవరకెన్నడూ ప్రపంచంలో ప్రభవించివుండలేదు.

దోపిడీదార్లయొక్క, వారి కుమ్మకుదార్లయొక్క "స్వేచ్ఛ"ను అది అణగదొక్కివుంచుతుంది; వారికి దోపిడీ చేసేందుకు "స్వేచ్ఛ" లేకుండా, ఇతరుల కడుపులుకొట్టి తాము కొవ్వెక్కేందుకు "స్వేచ్ఛ" లేకుండా, పెట్టుబడి పరిపాలనను తిరిగి నెలకొల్పేందుకు పోరాడే "స్వేచ్ఛ" లేకుండా, తమ స్వదేశపు కార్మికులకూ రైతులకూ వ్యతిరేకంగా విదేశ బూర్జువావర్గంతో ఒప్పందాలు కుదుర్చుకుందుకు "స్వేచ్ఛ" లేకుండా అది చేస్తుంది.

అట్టి స్వేచ్ఛను కౌట్‌స్కీలు రక్షించుతే రక్షించవచ్చు గాక. ఇందుకు మార్క్సిజం నుండి స్వపక్షపరిత్యాగి సోషలిజంనుండి స్వపక్షపరిత్యాగి కాకతప్పదు.

హిల్‌ఫెర్‌డింగ్, కౌట్‌స్కీలాంటి రెండవ ఇంటర్నేషనల్ భావశాస్త్రవేత్తల దివాళా కోరుతనం సోవియట్, లేక శ్రామికవర్గపు ప్రజాస్వామ్యంయొక్క ప్రాముఖ్యతను, పారిస్ కమ్యూన్‌తో దాని సంబంధాన్ని, చరిత్రలో దాని స్థానాన్ని, శ్రామికవర్గ నియంతృత్వ రూపంగా దాని ఆవశ్యకతను బొత్తిగా అర్థం చేసుకో లేకపోవడంలో ప్రదర్శితమైనంత అద్భుతంగా మరెందులోనూ ప్రదర్శితం కావడంలేదు.

''స్వతంత్ర'' (మధ్యతరగతి, అల్పబుద్ధి, పెట్టీబూర్జువా తత్వం పెట్టుకున్న మారు పేరు ఇది) జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ వార్తాపత్రిక ''స్వేచ్ఛ'' ("Die Freiheit") ''జర్మనీ దేశపు విప్లవాత్మక శ్రామికవర్గానికి'' అనే శీర్షికతో ఒక విజ్ఞప్తిని 1919 ఫిబ్రవరి 11 న 74 సంచికలో ప్రచురించింది.

ఈ విజ్ఞప్తి మీద పార్టీ కార్యవర్గమూ, జర్మన్ ''ఉచ్రెదీల్‌క''* అయినట్టి ''జాతీయ సమావేశం''లోని పార్టీసభ్యులందరూ సంతకాలు చేశారు.

షైడెమన్ ప్రభుతులకు సోవియట్లను రద్దుచేసే ఉద్దేశ్యం వుందని, వీరిపై నేరం మోపుతూ, ఈ విజ్ఞప్తి — నవ్వకండి! — ఉచ్రెదీల్‌కతో సోవియట్లు మిళితం చేయబడాలనీ, కొన్ని నిర్దిష్టములైన రాజకీయాధికారాలనూ, రాజ్యాంగంలో ఒక నిర్దిష్ట స్థానాన్నీ, సోవియట్లకు కల్గించాల్సిందనీ ప్రతిపాదించింది.

బూర్జువా నియంతృత్వానికి శ్రామికవర్గ నియంతృత్వంతో పొత్తు కుదిర్చి, ఐక్యం చేయడం! ఎంత సులభమో! ఎంత ప్రతిభాన్విత అల్పబుద్ధి భావమో!

అసలు లోపమంతా ఎక్కడుందంటే, సంయుక్త మెన్‌షెవిక్‌లూ, తాము సోషలిస్టులమని భ్రమపడుతూన్నట్టి పెట్టీబూర్జువాలైన ఆ సోషలిస్టు-రివల్యూషనరీలూ ఇద్దరూ లోగడే సంయుక్తమై, కేరెన్‌స్కీ నాయకత్వాన రష్యాలో దీనినప్పడే ప్రయత్నంచేయనే చేశారు.

మార్క్సను చదివి, పెట్టుబడిదారీ సమాజంలో ప్రతి తీవ్ర క్షణమందూ, గంభీరమైన ప్రతి వర్గ సంఘర్షణలోనూ, బూర్జువా నియంతృత్వమా, లేక శ్రామికవర్గ నియంతృత్వమా అనే ప్రత్యామ్నాయం తారసిల్లుతుందని అర్థం చేసుకోజాలని వ్యక్తి, మార్క్సయొక్క

* ''ఉచ్రెదీతెల్‌నొయె స్రాబానియె'' — రాజ్యాంగ నిర్ణయ పరిషత్తు పట్ల తృణీకార భావం ప్రదర్శించుతూ ఉపయోగించే సంగ్రహపదం. — అనువాదకుడు.

ఆర్థిక సిద్ధాంతాలనుగాని, రాజకీయ సిద్ధాంతాలనుగాని ఏ మాత్రమూ ఆకళింపు చేసుకోలేదన్నమాటే.

అత్యంత అద్భుతమైనట్టి, విపరీతంగా నవ్వుపుట్టించేటట్టి ఈ ఫిబ్రవరి 11 వ తేదీ విజ్ఞప్తినిండా దట్టించి వున్న ఆర్థిక, రాజకీయపుటసందర్భాలను క్షుణ్ణంగా విశదపరచాలంటే, బూర్జువా నియంతృత్వంతో శ్రామికవర్గ నియంతృత్వాన్ని శాంతియుతంగా మిళితం చేయడమనే హిల్ఫెర్డింగ్, కౌట్స్కీ ప్రభృతుల ప్రతిభాన్విత అల్పబుద్ధి భావాన్ని విడిగా పరిశీలించాల్సి వుంటుంది. ఇందుకు ప్రత్యేకంగా మరొకసారి మరొకవ్యాసం అవసరమవుతుంది.

మాస్కో, ఏప్రిల్ 15, 1919.

# హంగేరియన్ కార్మికులకు అభివందనలు

కామ్రేడ్స్, హంగేరియన్ సోవియట్ నాయకులనుండి అందుతూన్న వార్తలు మనలను పరమానంద సంతోష భరితులను కావించుతున్నాయి. హంగేరీలో సోవియట్ రాజ్యాధికారశక్తి ఏర్పడి కేవలం రెండు నెలలు పైచిలుకే అయినప్పటికీ, ఆర్గనైజేషను విషయంలో హంగేరీ శ్రామికవర్గం మనల్ని అప్పుడే మించిపోయినట్లు కనబడుతూంది. దీనిని అర్థం చేసుకోవచ్చు, ఎందుచేతంటే, హంగేరీలో ప్రజానీకంయొక్క సాధారణ సాంస్కృతిక స్థాయి మరింత ఉన్నతమైనది; అంతేకాకుండా, పారిశ్రామిక కార్మికుల సంఖ్యకీ మొత్తం జనభాసంఖ్యకీ వున్న నిష్పత్తి (ఈనాటి హంగేరీ జనాభా 80 లక్షలలోనూ, 30 లక్షలు బుడాపెస్టులోనే వున్నారు) ఎంతో అంత అధికం; ఇక చివరి విషయం, సోవియట్ వ్యవస్థకు, శ్రామికవర్గ నియంతృత్వానికి పరివర్తన హంగేరీలో అనన్యసామాన్యమైన సులభతర, శాంతితరముగానూ జరిగింది.

ఈ చివరి విషయం ప్రత్యేకంగా ముఖ్యమైనది. సోషల్-జాతీయ దురహంకార, కౌట్స్కీయ ధోరణులు రెండింటికీ చెందిన యూరపియన్ సోషలిస్టు నాయకులలో అధిక సంఖ్యాకవర్గం, దశాబ్దులపాటుగా సాగినట్టీ, సాపేక్షంగా "శాంతియుతమైన" పెట్టుబడిదారీ విధాన బూర్జువా పార్లమెంటరీ విధానాలచే దోహదం చేయబడినట్టీ స్వచ్ఛమైన అల్పబుద్ధి దురభిమానాలలో ఎంతగా మునిగిపోయిందంటే, సోవియట్ రాజ్యాధికారశక్తీ, శ్రామికవర్గ నియంతృత్వమూ అంటే ఏమిటో ఈ నాయకులు అర్థం చేసుకోలేకుండా వున్నారు. తన దారికి అడ్డంగావున్న ఈ నాయకులను శ్రామికవర్గం తొలగించివేస్తేనేగాని, వీరిని తుడిచిపారేస్తేనేగాని, తన చారిత్రాత్మక విమోచన కార్యాన్ని అది నిర్వర్తించ లేకపోతుంది. ఈ వ్యక్తులు రష్యాలోవున్న సోవియట్ రాజ్యాధికారశక్తి గురించిన బూర్జువావర్గపు అబద్ధాలను పూర్తిగానో, లేక సగంసగంగానో నమ్మి, తాము బానిస మనస్తత్వంతో ఆరాధించుతూ "స్వచ్ఛమైన ప్రజాస్వామ్య"మనీ, లేదా సాధరణ "ప్రజాస్వామ్య"మనీ తాము పిలుస్తూన్నట్టి బూర్జువా

ప్రజాస్వామ్యానికీ, కొత్త, శ్రామికవర్గ ప్రజాస్వామ్యం — సోవియట్ రాజ్యాధికారశక్తిలో మూర్తీభవించినట్టి కార్మికవర్గ ప్రజకు ప్రజాస్వామ్యం — యొక్క సారానికీ వున్న వ్యత్యాసాన్ని వారు గ్రహించలేక పోయారు.

బూర్జువా దురభిమానాలతో పొట్టలు పెట్లిపోతూన్న ఈ అంధులు బూర్జువా ప్రజాస్వామ్యంనుండి శ్రామికవర్గ ప్రజాస్వామ్యానికి, బూర్జువా నియంతృత్వంనుండి శ్రామిక వర్గ నియంతృత్వానికి ప్రపంచచరిత్రాత్మక మలుపును అర్థం చేసుకోలేక పోయారు. రష్యన్ సోవియట్ రాజ్యాధికారంశక్తియొక్క, రష్యాలో దాని అభివృద్ధి చరిత్రయొక్క విశిష్టములైన కొన్ని ప్రత్యేకతలను, అంతర్జాతీయ దృగ్విషయంగా సోవియట్ రాజ్యాధికారశక్తితో తారు మారుచేసేశారు.

అంధులు కూడా చూడగల్గేటట్టు చేస్తూంది హంగేరీ శ్రామికవర్గ విప్లవం. హంగేరీలో శ్రామికవర్గ నియంతృత్వానికి మార్పుయొక్క రూపం, బూర్జువా ప్రభుత్వం స్వచ్ఛందంగా రాజీనామా ఇవ్వడం, కార్మికవర్గ ఐక్యత తక్షణ పునరుద్ధరణ, కమ్యూనిస్టు కార్యక్రమంపై సోషలిస్టు ఐక్యత, రష్యాలో దాని రూపంకంటె పూర్తిగా భిన్నంగా వుంది. సోవియట్ రాజ్యాధికారశక్తి సారం ఇప్పుడు మరింత స్పష్టంగా గోచరమౌతూంది: సోవియట్ రాజ్యాధికారశక్తి తప్ప, శ్రామికవర్గ నియంతృత్వం తప్ప, కార్మికప్రజ అగ్రమందునిలబడు తూన్న శ్రామికవర్గపు అండదండలు కల్గిన మరే ఇతర రాజ్యాధికారశక్తీ ప్రపంచంలో ఎక్కడా సాధ్యంకాదు.

దోపిడీదార్లూ, పెట్టుబడిదార్లూ, భూస్వాములూ, వీరి తాబేదార్లూ, వీరందరి ప్రతిఘటనను నిర్మూలించేందుకై నిర్దాక్షిణ్యమైనట్టీ కఠినమైనట్టీ సత్వరమైనట్టీ దృఢ సంకల్పం కల్గినట్టీ బలప్రయోగం ఈ నియంతృత్వానికి పూర్వం వుండి తీరుతుందన్న విష యం స్పష్టమే. ఈ విషయం అవగాహన చేసుకోని వ్యక్తి విప్లవకారుడే కాదు, అట్టి వ్యక్తి శ్రామికవర్గపు నాయకత్వ స్థానంనుండి, లేదా సలహాదారుని స్థానంనుండి తొలగించబడాలి.

కాని శ్రామికవర్గ నియంతృత్వంయొక్క సారం, ఒక్క బలప్రయోగంలోనే, లేదా ప్రధానంగా బలప్రయోగంలోనే లేదు. దాని అంతస్సారం శ్రమజీవుల పురోగామి దళమూ, వారి అగ్రగామి దళమూ, వారి ఏకైక నాయకుడూ అయిన శ్రామికవర్గంయొక్క ఆర్గనైజేషనూ క్రమ శిక్షణే. దాని లక్ష్యం సోషలిజాన్ని నిర్మించడమూ, సమాజ వర్గవిభజనను నాశనం చేయడమూ, సమాజ సభ్యులనందరినీ శ్రమజీవులుగా చేయడమూ, మనిషి మనిషిని ఏవిధంగానైనా సరే దోపిడీచేయడమునకుగల కారణాన్ని తొలగించివేయడమూనూ. ఈ లక్ష్యాన్ని ఒక్క దెబ్బతో సాధించడానికి వీల్లేదు. పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజంలోకి పరివర్తనకు ఇంచు మించు సుదీర్ఘ కాలావధే అవసరమవుతుంది, ఉత్పత్తిని పునర్వ్యవస్థీకరించడం క్లిష్టమైన

పని అవడవమూ, జీవితంలోని అన్ని రంగాలలోనూ సమూలమైన మార్పులను తీసుకురావడానికి కొంత కాలం అవసరమవడమూ, అంతేకాకుండా దైనందిన కార్యకలాపాలను పెట్టీబూర్జువా, బూర్జువా విధానాల్లో నడిపించడమనే అత్యంత బలోపేతంగా ఏర్పడిపోయిన అలవాట్లను అధిగమించడానికి దీర్ఘమైనట్టీ మొండిగా సాగించాల్సినట్టీ పోరాటం అవసరమవడమూ ఇందుకు కారణాలు. ఇందుచేత, శ్రామిక నియంత్రత్వానికి అవసరమయే ఒక యావత్తు కాలావధి గురించీ మార్క్స్ ప్రస్తావించినప్పుడు, పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తనచెందే కాలావధి అని అతడు చెప్పాడు.

ఈ పరివర్తన కాలావధి అంతటిలోనూ, తమ బుద్ధినంతనూ వినియోగించి ప్రతిఘటించే పెట్టుబడిదార్లూ, బూర్జువా మేధావిస్తరంలోని అసంఖ్యాకులైన వారి కిరాయి కింకరులూ, వీరిచేతనూ, పెట్టీబూర్జువా అలవాట్లతోనూ సంప్రదాయాలతోనూ పీకలుమొయ్యా నిండిపోయినట్టీ, రైతులతో కూడా ఏర్పడుతూన్నట్టీ అతి తరుచుగా అనాలోచితంగానే ప్రతిఘటించేటట్టీ కార్మికప్రజల బ్రహ్మాండరాసుల చేతనూ ప్రతిఘటన జరుగుతుంది. ఈ స్తరాలలో ఊగిసలాటలు తప్పవు. రైతు తాను కష్టజీవిగా సోషలిజంవైపే మొగ్గుతూ, బూర్జువావర్గ నియంతృత్వానికి ప్రత్యామ్నాయంగా కార్మికవర్గ నియంతృత్వాన్నే అతడు ఎంచుకుంటాడు. ధాన్య విక్రేతగా అతడు బూర్జువావర్గంవైపే, వ్యాపార స్వేచ్ఛవైపే, అనగా తాను "అలవాటుపడినట్టీ," పాతబడినట్టీ "బహుకాలంనుండి పవిత్రంగా ఎంచబడుతూన్నట్టీ" పెట్టుబడిదారీ విధానానికి మళ్లడానికే మొగ్గుతాడు.

రైతాంగానికీ, సాధారణంగా పెట్టీబూర్జువా స్తరాలకూ శ్రామికవర్గం నాయకత్వం వహించి నడిపించగల్గేందుకు శ్రామికవర్గ నియంతృత్వం, ఒక వర్గంయొక్క రాజ్యాధికార శక్తి, ఆ వర్గంయొక్క ఆర్గనైజేషనూ క్రమశిక్షణల పటుత్వం, పెట్టుబడిదారీ విధానంయొక్క సాంస్కృతికవైజ్ఞానిక సాంకేతిక విజాయాలన్నిటిపై ఆధారపడి కేంద్రీకృతమైన శక్తి, ప్రతి కష్టజీవియొక్క మానసికతత్వంతో దానికిగల శ్రామికవర్గ సాన్నిహిత్యం, గ్రామీణ ప్రాంతంలో వుంటూనో లేక హీనస్థాయి పరిశ్రమలో పనిచేస్తూనో చెల్లాచెదరుగా వుండి రాజకీయాల్లో అంతగా స్థిరచిత్తం లేనట్టి అంతగా అభివృద్ధి చెందని కష్టజీవులలో దాని పలుకుబడి అవసరమవుతుంది. సాధారణ "ప్రజాస్వామ్యం" గురించీ, "ఐక్యత," లేదా "శ్రమప్రజాస్వామిక ఐక్యత" గురించీ, సర్వ "శ్రమైక జనుల" "సమానత్వం" గురించీ, ఇంకా వగైరా, వగైరాలగురించీ పదజాల ప్రయోగం — ఈనాటి పెట్టీబూర్జువా సోషల్-జాతీయ దురహంకారులకూ, కౌట్స్కీయానుచరులకూ ఒక దుర్వ్యసనంగా తయారైన పదజాల ప్రయోగం — ఇక్కడ ఎందుకూ పనికిరాదు. పదజాల ప్రయోగం కేవలం కళ్లలో దుమ్ముకొడుతుంది, మానసికంగా అంధత్వం కలుగజేసి పాతకాలపు బుద్ధిమాంద్యాన్నీ, సనాతనతత్వాన్నీ

పెట్టుబడిదారీ విధానపు, పార్లమెంటరీ విధానపు, బూర్జువా ప్రజాస్వామ్యపు నియమిత చర్యను దృఢపరుస్తుంది.

వర్గాలను అంతమొందించడానికి సుదీర్ఘమైనట్టి, కష్టమైనట్టి, మొండి పట్టుదలతో సాగించాల్సినట్టి వర్గ పోరాటం అవసరమవుతుంది; ఇది పెట్టుబడి పరిపాలన కూలదోత తరువాత, బూర్జువా రాజ్యాంగయంత్రం భగ్నం తరువాత, శ్రామికవర్గ నియంతృత్వ స్థాపన తరువాత (పాతకాలపు సోషలిజం, పాతకాలపు సోషల్-డెమోక్రసీలయొక్క చౌకబారు నాయకులు చెప్పేటట్టు కాకుండా) అదృశ్యమైపోదు సరేకదా, తన రూపాలు మాత్రమే మార్చుకుని, అనేక విషయాల్లో మరింత తీవ్రమవుతుంది.

బూర్జువా వర్గ ప్రతిఘటనకు వ్యతిరేకంగా, పెట్టీబూర్జువా వర్గపు సనాతనతత్వము, నియమితచర్య, అనిశ్చత, ఊగిసలాటలకు వ్యతిరేకంగా వర్గపోరాట సాధనంవల్ల శ్రామికవర్గం తన రాజ్యాధికారశక్తిని నిర్మించుకుని, తన ఆర్గనైజేషనల్ పలుకుబడిని బలపరచుకుని బూర్జువా వర్గాన్ని వదిలిపెట్టేయడానికి భయపడుతూన్నట్టి, ఎంతో అంతగా తటపటాయించుతూ శ్రామికవర్గాన్ని అనుసరించుతూన్నట్టి స్తరములను ''తటస్థీకృతంచేసి,'' కొత్త క్రమశిక్షణను, కార్మికప్రజల కామ్రేడ్లీ క్రమశిక్షణను, — మధ్యయుగాలనాటి భూదాస్యపు క్రమశిక్షణ, ఆకలిబాధవల్ల ప్రేరితమైన క్రమశిక్షణ, పెట్టుబడిదారీ విధానం కింద ''స్వేచ్ఛా'' వేతన భానిసత్వపు క్రమశిక్షణ స్థానే, ఈ కొత్త క్రమశిక్షణను, సామాజిక సంబంధాలకు ఈ కొత్త ప్రాతిపదికను — శ్రామికవర్గంతో వారి దృఢ సంబంధాన్ని, శ్రామికవర్గంతో వారి ఐక్యతను పటిష్ఠవంతంచేసుకోవాలి.

వర్గాలను అంతమొందించాలంటే, ఒక వర్గంయొక్క నియంతృత్వపు కాలావధి దోపిడీదార్లను కూలదోయగల్గే సామర్థ్యమే కాకుండా, వారి ప్రతిఘటనను నిర్దాక్షిణ్యంగా అణచివేయగల్గే సామర్థ్యమే కాకుండా, యావత్తు బూర్జువా-ప్రజాస్వామిక దృక్పథంతోనూ, సాధారణ స్వేచ్ఛ గురించిన, సమానత్వం గురించిన అల్పబుద్ధి పదజాల ప్రయోగం అంతటితోనూ (వాస్తవానికి, బహుకాలం క్రితమే మార్క్స్ నిరూపించినట్టుగా, వర్తకపు సరుకుల సొంతదార్ల ''స్వేచ్ఛ, సమానత్వాల''నే, పెట్టుబడిదారుడు, కార్మికుడు, వీరిద్దరి పరస్పర సమానత్వాన్నే ఈ పదజాల ప్రయోగం తెలియజేస్తుంది), భావశాస్త్రీయంగా తెగతెంపులు చేసుకోగలిగే సామర్థ్యం కూడా కలిగినట్టి నియంతృత్వకాలావధి అవసరమవుతుంది.

ఇంతేకాదు, దశాబ్దాల తరబడి, పెట్టుబడికి వ్యతిరేకమైన సమ్మెలవల్లనూ, రాజకీయ పోరాటంవల్లనూ శిక్షణపొంది, ఐక్యమై, కాకలుదేరిన ఆ పీడితవర్గంయొక్క — నగర, పారిశ్రామిక, బడా పెట్టుబడిదారీ సంస్కృతిని యావత్తునూ వొంటబట్టించుకుని, దానిని పరిరక్షించి, భద్రపరచి, ప్రజలందరికీ, కష్టజీవులందరికీ అందజేసే దృఢసంకల్పమూ, సామ

ర్థ్యమూ కలిగినట్టి కేవలం ఆ వర్గంయొక్క — గతకాలంతో తెగతెంపులు చేసుకుని, తమకొరకొక నూతన భవిష్యత్తుకై ధైర్యంతో కొత్త పథాన్ని మలచుకొనేవారిపై చరిత్ర తప్పనిసరిగా మోపే బాధలు, పరీక్షలు, కష్టాలు, ఉత్కృష్ట త్యాగాలు, వీటినన్నింటినీ భరించగల్గే కేవలం ఆ వర్గంయొక్క — పెట్టీబూర్జువా, అల్పబుద్ధి తత్వాలపట్ల, పెట్టీబూర్జువాలలోనూ చిన్న ఉద్యోగులలోనూ ''మేధావిస్తరం''లోనూ అతి పుష్కలంగా వర్ధిల్లేటట్టి గుణాల పట్ల ద్వేష, తృణీకార భావాలతో నిండిన వ్యక్తులనే తన ఉత్తమోత్తమ సభ్యులనుగా గల్గినట్టి కేవలం ఆ వర్గంయొక్క — ''మనిషిని కాకదేర్చేటట్టి శ్రమ పాఠశాలను ముంగించి,'' ప్రతి కష్టజీవియందూ నిజాయితీగల ప్రతి మనిషియందూ శ్రమసామర్థ్యంపట్ల గౌరవాన్ని పురికొల్ప గల్గే కేవలం ఆ పీడిత వర్గంయొక్క — నియంతృత్వంవల్ల మాత్రమే వర్గాలు అంతమొందించబడగల్గుతాయి.

కామ్రేడ్ హంగేరియన్ కార్మికుల్లారా! అచ్చమైన శ్రామికవర్గ నియంతృత్వ కార్యక్రమ ప్రాతిపదికపై సోషలిస్టుల నందరనూ తక్షణం ఐక్యపరచగల్గిన మీ సామర్థ్యంతో సోవియట్ రష్యాకంటె సహితము ఉత్తమమైన ఉదాహరణను ప్రదర్శించడంలో ప్రపంచానికి మీరు ఆదర్శవంతులయారు. ఆంటాంట్‌పై కఠినమైన యుద్ధంలో మీ స్థానాలను ఓడిపోకుండా నిలబెట్టుకోవడమనే అత్యంత వందనీయమైనట్టి అత్యంత కష్టభూయిష్ఠమైనట్టి కర్తవ్యాన్ని మీరు ముఖాముఖీ ఎదుర్కోవాల్సి వుంది. దృఢంగా నిలబడండి. మిమ్ములను అనుసరిస్తామనీ శ్రామికవర్గ నియంతృత్వాన్ని అనుసరిస్తామనీ నిన్న మీకు మాట యిచ్చినట్టి సోషలిస్టులలో, లేదా పెట్టీబూర్జువావర్గంలో ఊగిసలాట పొడచూపితే మాత్రం, దయదాక్షిణ్యం లేకుండా దానిని అణచివేయండి. యుద్ధంలో పిరికిపందకు న్యాయమైన గతి తుపాకిగుండే.

న్యాయమైనట్టీ, ధర్మమైనట్టీ, యథార్థంగా విప్లవాత్మకమైనట్టీ యుద్ధాన్ని, పీడకులపై పీడితుల యుద్ధాన్ని, దోపిడీదార్లపై కార్మికప్రజానీకంయొక్క యుద్ధాన్ని, సోషలిజం విజయసిద్ధికై యుద్ధాన్ని మీరు సాగించుతున్నారు. సర్వప్రపంచ కార్మికవర్గంలోని న్యాయశీలురైన సభ్యులందరూ మీ పక్షాన వున్నారు. ఒక్కొక్క నెల గడుస్తున్నకొద్దీ ప్రపంచ శ్రామికవర్గ విప్లవం మరింత దగ్గరపడుతూంది.

దృఢంగా నిలబడండి! విజయం మీదే అవుతుంది.

లెనిన్

మే 27, 1919.

# గొప్ప చొరవ

## ఖండిక

## (దేశీయరంగంలో కార్మికుల వీరత్వం. "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు.*")

కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లను గురించి నేనింత సాంగోపాంగము, అత్యంత సవివరము అయిన సమాచారం ఇవ్వడానికి కారణమేమిటంటే, కమ్యూనిస్టు నిర్మాణంలో వున్న అత్యంత ముఖ్యమైన అంశాలలో ఒక దానిని, దేనిగురించైతే మన పత్రికాప్రపంచం తగినంత శ్రద్ధ చూపడంలేదో, కాగా దేనినైతే మన మందరమూ సరిగా విలువకట్టడంలేదో అట్టి ఒక అంశాన్ని మనం ఇందులో నిస్సందేహంగా గమనించుతున్నాం.

తక్కువ రాజకీయ బాణసంచా, వాస్తవజీవితంనుండి తీసుకోబడి వాస్తవజీవితంచే రుజువుచేయబడినట్టి కమ్యూనిస్టు నిర్మాణపు సరళమైనా సజీవవాస్తవవిషయాలపై జాస్తి శ్రద్ధ, ఈ నినాదాన్నే మనమందరమూ, మన రచయితలు, ఆందోళనాకార్యకర్తలు, ప్రచారకులు, ఆర్గనైజేషను కార్యకర్తలు, వగైరాలు నిరంతరం పునశ్చరణ చేస్తూండాలి.

శ్రామికవర్గ విప్లవం తరువాత మొదటి దినాల్లో, బూర్జువావర్గపు ప్రతిఘటనను అధిగమించడమూ, దోపిడీదార్లను ఓడించడమూ, వారి కుట్రలను (పెట్రోగ్రాడ్‌ను శత్రు స్వాధీనం చేయడానికై నల్లదండు మూఠాల సభ్యులూ, కాడెట్లూ మొదలుకొని మెన్‌షెవిక్‌లూ, సోషలిస్టు-రివల్యూషనరీల వరకూ అందరూ పాల్గొన్నట్టి "బానిసయజమానుల కుట్ర లాంటి" కుట్రలను[161]) అణచివేయడమూ, ఈ ప్రధాన, మౌలిక కర్తవ్య నిర్వహణలో మనం ముఖ్యంగా నిమగ్నులమై వుండడం సహజమూ, అనివార్యమూ కూడానూ. కాని ఈ కర్తవ్య నిర్వహణతో కూడా ఏకసమయమందే, అంత ఆనివార్యమైనదీ, కాలం సాగుతూన్నకొద్దీ మరింత మరింతగా విధాయకమవుతూన్నట్టి మరొక కర్తవ్యం, రూఢమైన కమ్యూనిస్టు నిర్మాణ

---

* సుబ్బోత్నిక్ అనే పదానికి మూలం 'సుబ్బోత' అనే రష్యన్ మాట. 'సుబ్బోత' అంటే శనివారం అని అర్థం. 'సుబ్బోత్నిక్' అనగా స్వచ్ఛందంగానూ, సమిష్టిగానూ, డబ్బు పుచ్చుకోకుండానూ చేసిన పని — అనువాదకుడు.

మనే ముఖ్యమైన కర్తవ్యం, నూతన ఆర్థిక సంబంధాల, నూతన సమాజ సృష్టి, ప్రధాన రంగంలోకి వస్తుంది.

ఇదివరకు అనేకసార్లు, అందులోనూ ప్రత్యేకంగా మార్చి 12 న పెట్రోగ్రాడ్ కార్మిక సైనిక, రైతు ప్రతినిధుల సోవియట్ సభలో నేను కావించిన ఉపన్యాసంలో కూడా, ఎత్తిచూప డానికి నాకు అవకాశం కల్గినట్టూ, శ్రామికవర్గ నియంతృత్వమంటే కేవలం దోపిడీదార్ల పైన బలప్రయోగమే కాదు, అంతేకాకుండా ప్రధానంగా బలప్రయోగం సహితమూ కాదు కూడానూ. ఈ విప్లవాత్మక బలప్రయోగంయొక్క ఆర్థికపునాది, దాని సార్థకతకూ విజయా నికీ హామీనిచ్చేది, పెట్టుబడిదారీ విధానంతో సరిపోల్చిచూస్తే శ్రమయొక్క సామాజిక ఆర్గ నైజేషనులో ఒక ఉన్నత తరహాకు శ్రామికవర్గ ప్రాతినిధ్యం వహించుతూందనేదానిని సృష్టించు తూందనే వాస్తవవిషయమే. ఇదే సారం. ఇదే కమ్యూనిజంయొక్క అనివార్యమైన సంపూర్ణ విజయానికి బలంచేకూర్చేటట్టి హామీ నిచ్చేటట్టి మూలాధారం.

సామాజిక శ్రమయొక్క ఫ్యూడల్ విధానపు ఆర్గనైజేషనుకు దుడ్డుకర్రపైనే ఆధార పడిన క్రమశిక్షణనే పునాది అయివుండగా, పట్టెడుమంది భూస్వాములచే కొల్లగొట్టి పీడించ బడినట్టి కార్మికప్రజలు శుద్ధ అజ్ఞానులుగానూ, అణగదొక్కబడీ వుండేవారు. సామాజిక శ్రమయొక్క పెట్టుబడిదారీ విధానపు ఆర్గనైజేషనుకు క్షుద్బాధపైన ఆధారపడిన క్రమ శిక్షణే పునాదిగా ఏర్పడింది, కాగా బూర్జువా సంస్కృతీ, బూర్జువా ప్రజాస్వామ్యం ఎంతగా పురోగమించినప్పటికీ, అత్యంత పురోగమనాన్నీ నాగరికతనూ ప్రజాస్వామ్యాన్నీ సాధించినట్టి రిపబ్లిక్కులలో నివసించే బ్రహ్మాండమైన కార్మిక ప్రజారాశి అజ్ఞా నాంధకారంలో మునిగి, అణగదొక్కబడి పట్టెడుమంది పెట్టుబడిదార్లచే కొల్లగొట్టబడి, పీడించబడినట్టి వేతనపు బానిసల, హింసలపాలైన రైతుల రాశిగానే వుండిపోయింది. దేని సాధనలోనైతే సోషలిజం మొదటి మెట్టో అట్టి సామాజిక శ్రమయొక్క కమ్యూనిస్టు ఆర్గనై జేషను భూస్వాములూ పెట్టుబడిదార్లూ, వీరిద్దరూ మోపిన గాటిని విడిపించుకున్నట్టి కార్మికప్రజలు తమంతటతాము విధించుకున్న స్వచ్ఛందమై చైతన్యవంతమైన క్రమశిక్షణ పైనే ఆధారపడి, కాలం సాగినకొద్దీ ఆ క్రమశిక్షణపైనే అంతకు మరింత అధికంగా ఆధార పడుతుంది.

ఈ కొత్త క్రమశిక్షణ ఆకాశంనుంచి ఊడిపడదు, కావాలి కావాలి అని పదేపదే జపం చేయడం వల్ల అంతకంటే ఫలించదు; కేవలం అధికస్థాయి పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క భౌతిక పరిస్థితులనుండే అది ఆవిర్భవించుతుందే తప్ప వేరొక విధంగా ఎంత మాత్రమూ ఆవి ర్భవించదు. ఆ పరిస్థితులు లేనిదే దాని ఆవిర్భావం అసాధ్యం. కాగా ఈ భౌతిక పరిస్థితుల వాహకం, లేదా మార్గదర్శి, అధికస్థాయి పెట్టుబడిదారీ విధానంవల్ల సృష్టించబడి ఆర్గ

నైజు చేయబడి ఐక్యపడి, తర్ఫీదై, విద్యాప్రబోధం పొంది, రాటుదేరిన ఒక స్పష్టమైన చారిత్రక వర్గమే. ఈ వర్గమే శ్రామికవర్గం.

"శ్రామికవర్గ నియంతృత్వం" అనే పదంయొక్క శాస్త్రీయ, చారిత్రక — తాత్విక అర్థాన్ని సులభమైన భాషలో అనువదించామంటే, దాని అర్థం ఇలా వుంటుంది:

పెట్టుబడి మోపిన గాటిని వదిలించుకుందుకు సలిపే పోరాటంలో, ఈ పోరాట విధానంలో, విజయం నిలబెట్టుకుని దృఢతరం చేసేందుకై సాగించే పోరాటంలో, నూతన సోషలిస్టు సామాజిక వ్యవస్థను సృష్టిచేసే కార్యంలోనూ, వర్గాలను సంపూర్ణంగా అంత రింపజేసే యావత్తు పోరాటంలోనూ కేవలం ఒక స్పష్టమైన వర్గమే, అనగా నగరకార్మికుల, సాధారణంగా ఫ్యాక్టరీ, పారిశ్రామిక కార్మికుల వర్గమే, పీడిత కార్మికప్రజల యావత్తు రాశికి నాయకత్వం వహించి నడిపించగల్గుతుంది. (సోషలిజానికీ కమ్యూనిజానికీ గల శాస్త్రయుక్త మైన భేదం ఎందులో వుందంటే, పెట్టుబడిదారీ విధానంనుండి ప్రాదుర్భవించే కొత్త సమా జంయొక్క మొదటి దశను మొదటి పదం సూచించుతూండగా, దీని తరువాతి దశనూ, అంతకంటె ఉన్నతదశనూ రెండవ పదం సూచించుతుందని మనమిక్కడ కుండలీకరణము లలో చెప్పవచ్చు.)

"బెర్న్", పసుప్పచ్చ ఇంటర్నేషనల్[162] చేస్తూన్న పొరపాటేమిటంటే, దాని నాయకులు వర్గపోరాటాన్నీ, శ్రామికవర్గపు అగ్రగామి పాత్రనూ నామమాత్రంగానే అంగీకరిస్తూ, దాని సారాంశాన్ని ప్రత్యేకంగా కడవెళ్లా ఆలోచించడానికే భయపడతారు. బూర్జువావర్గాన్ని హడలెత్తించేటట్టీ, దానికి ఈషణ్మాత్రమూ అంగీకృతం కానట్టీ ఆ అనివార్య సారాంశ మంటేనే వారికి ఎక్కడలేని భయమూనూ. వర్గాలను అంతం చేయనంత వరకూ అనివార్యమై నట్టీ, పెట్టుబడి కూలదోయబడిన వెనువెంటనే వచ్చే కాలంలో ప్రత్యేకంగా భయానకం గానూ ప్రత్యేకంగా చిత్రంగానూ వుంటూ తన రూపాన్ని మార్చుకునేటట్టీ, వర్గ పోరాటం యొక్క కాలావధే శ్రామికవర్గ నియంతృత్వం కూడానూ అని ఒప్పుకుందుకే వారు భయపడ తారు. తాను రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకున్న తరువాత శ్రామికవర్గం వర్గపోరా టాన్ని చాలించదు, వర్గాలు అంతమొందే వరకూ — సహజంగానే, విభిన్న పరిస్థితులలోనూ, విభిన్న రూపంలోనూ, విభిన్న సాధనాలవల్లనూ — పోరాటాన్ని అది సాగించుతూనే వుంటుంది.

కాగా, "వర్గాలను అంతంచేయడమంటే" ఏమిటి? ఇదే సోషలిజం అంతిమ గమ్య మని సోషలిస్టులమని పేరుపెట్టుకున్న వారందరూ అంగీకరిస్తారు, కాని దీని అర్థం గురించి మాత్రం అందరూ పర్యాలోచించరు. చారిత్రకంగా నిర్ధరించబడిన ఒక సామాజిక ఉత్పత్తి వ్యవస్థలో అవి ఆక్రమించే స్థానాన్ని బట్టీ, ఉత్పత్తి సాధనాలతో వాటికున్న (అత్యధిక దృష్టాం తాల్లో చట్టంవల్ల స్థిరపరచబడి సూత్రీకరించబడుతూన్నట్టి) సంబంధాన్నిబట్టీ, శ్రమ

యొక్క సామాజిక అర్గనైజేషనులో వాటి పాత్రనుబట్టీ, తదానుషక్తంగా అవి అందు బాటులోకి తెస్తూన్నట్టి సామాజిక సంపత్తిలో భాగంయొక్క పరిమాణాన్నీ ఆ భాగాన్ని సంపాదించే విధాన్నీబట్టీ, ఒకదానినుండి ఒకటి విభేదించుతూన్న పెద్దపెద్ద ప్రజాసమూహాలే వర్గాలు. సామాజిక ఆర్థిక జీవితంయొక్క ఒక స్పష్టమైన వ్యవస్థలో ఇవి ఆక్రమించే వివిధ స్థానాల కారణంగా ఒక సమూహంయొక్క శ్రమను మరొక సమూహం భుక్తంచేసుకోగల్గే ప్రజాసమూహాలే వర్గాలు.

వర్గాలను సంపూర్ణంగా అంతం చేయాలంటే, దోపిడీదార్లనూ, భూస్వాములనూ, పెట్టుబడిదార్లనూ కూలదోసినంత మాత్రాన చాలదన్న విషయం స్పష్టంగా కనబడుతూనే వుంది, వీరి స్వామ్యపు హక్కులను రద్దుచేసినంత మాత్రాన చాలదు; ఉత్పత్తి సాధనాలలో ప్రైవేటు స్వామ్యపు హక్కులను అన్నింటినీ కూడా రద్దు చేయడం అవసరం, పల్లెపట్టులకూ నగరానికీ వుండే వ్యత్యాసాన్నీ, దీనితోపాటు కాయకష్టంచేసే కార్మికులకూ మెదడుతో పనిచేసే కార్మికులకూ వుండే వ్యత్యాసాన్నీ రద్దు చేయడం అవసరం. ఇందుకు బహుదీర్ఘ కాలం అవసర మవుతుంది. దీనిని సాధించాలంటే ఉత్పత్తిశక్తులను అభివృద్ధి పరచేందుకై ఒక బ్రహ్మాండమైన ముందంజ వెయ్యాల్సి వుంటుంది; సన్నకారు ఉత్పత్తియొక్క అనేక అవశేషాల ప్రతిఘటనను (ఇది తరుచుగా కర్మరహితంగా వుండి, ప్రత్యేకంగా మొండిగానూ, దీనిని అధిగమించడం ప్రత్యేకంగా కష్టమైనదిగానూ వుంటుంది) జయించాల్సి వుంటుంది; ఈ అవశేషాలకు సంబంధించిన అలవాట్లయొక్క, సనాతనతత్వంయొక్క బ్రహ్మాండమైన శక్తిని అధిగమించడం అవసరమవుతుంది.

ఈ కార్యసాధనలో ''కార్మికప్రజ'' లందరకూ సమాన సామర్థ్యం వుంటుందనే ఊహ ఇష్వాకులనాటి, మార్క్సుకు పూర్వపు సోషలిస్టుల శష్కపదజాలము, లేక భ్రమ అవుతుంది; ఎందుచేతంటే, ఈ సామర్థ్యం దానంతటదే రాదు, అది చారిత్రకంగా అభివృద్ధి అవుతుంది, అంతేకాదు, అధికస్థాయి పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క భౌతిక పరిస్థితులనుండి మాత్రమే అది ఉద్భవించుతుంది. పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజంలోకి దారితీసే మార్గారంభంలో కేవలం ఒక్క శ్రామికవర్గానికి మాత్రమే ఈ సామర్థ్యం వుంటుంది. తనను ఎదుర్కొంటూన్న బృహత్తర కర్తవ్యాన్ని సాధించగల్గే సామర్థ్యం దానికుంటుంది; ఇందుకు మొదటి కారణం, నాగరిక సమాజాలలో అత్యంత బలోపేతమూ, అత్యంత పురోగామి అయిన వర్గం ఇదే; రెండో కారణం, అత్యంతాభివృద్ధి గాంచిన దేశాల జనాభాల్లో ఇదే అధికసంఖ్యాక వర్గంగా ఏర్పడుతూంది; ఇక మూడో కారణం, రష్యాలాంటి వెనకబడినదేశాల్లో, అర్ధశ్రామికులే, అనగా నియమితానుసారంగా సంవత్సరంలో కొంత భాగం శ్రామికవర్గ విధంగా జీవనం చేసేవారు, తమ జీవనోపాధిలో కొంత భాగాన్ని నియమితానుసారంగా పెట్టుబడిదారీ వ్యాపార

సంస్థలలో పనిచేయడంవల్ల సంపాదించుకునేవారు జనసంఖ్యలో అధికసంఖ్యాకవర్గంగా ఏర్పడు తున్నారు.

పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన చెందేటప్పుడు తలయెత్తే సమ స్యలను స్వేచ్ఛ, సమానత్వం, సాధారణ ప్రజాస్వామ్యం, శ్రామిక ప్రజాస్వామ్య సమానత్వం, వగైరా మామూలు పదజాలం ప్రాతిపదికపైన ఎవరైతే పరిష్కరించ ప్రయత్నిస్తారో అట్టి వారు (బెర్న్, పసుప్పచ్చ, ఇంటర్నేషనల్ వీరులు కౌట్స్కీ, మార్తొవ్ లాంటివారు), ఆ విధంగా తమ పెట్టీబూర్జువా, అల్పబుద్ధి స్వభావాన్నే బయటపెట్టుకుంటూ, భావశాస్త్రీయ రంగంలో బానిసమనస్తత్వంతో బూర్జువావర్గపు అడుగుజాడల్లోనే కాళ్లీడ్చుకుంటూ నడు స్తూంటారు. ఈ సమస్యకు సరైన పరిష్కారం, రాజకీయాధికారాన్ని జయించుకున్నట్టి విశిష్ట వర్గానికీ, అనగా శ్రామికవర్గానికీ, కార్మికప్రజానీకంలోని యావత్తు శ్రామికవర్గేతర రాశీ కాకుండా, దానితోసహా అర్ధశ్రామికవర్గ రాశితోనూ వుండే విశిష్ట సంబంధాల — ''ఆదర్శవంతములైన'' పరిస్థితులలో చిత్రవిచిత్రమై ఏకస్వరమై మేళవించుకుని రూపొందే సంబంధాలుగాక, బూర్జువావర్గంయొక్క అనేకములైనట్టీ, విభిన్న రూపాలను ధరించేటట్టీ ఉన్మత్త ప్రతిఘటనయొక్క వాస్తవ పరిస్థితులలో రూపొందే సంబంధాల — నిర్దిష్ట పఠనంలోనే కనబడుతుంది.

రష్యాతోసహా పెట్టుబడిదారీ దేశాలలో ఏ దేశంలోని జనసంఖ్యలోనైనా సరే — అందులోనూ ముఖ్యంగా కార్మికప్రజల జనసంఖ్యలో — బ్రహ్మాండమైన అధికసంఖ్యాకవర్గం పెట్టుబడిదారీ విధాన హింసనూ, దోపుడునీ, అన్నిరకాల క్రౌర్యాన్నీ తాము స్వయంగానూ, తమ ఆప్తులూ బంధువుల ద్వారాను వేనవేలసార్లు అనుభవించే వుంది. ఈ కఠినపరీక్షలను సామ్రాజ్యవాద యుద్ధం, అనగా ప్రపంచాన్నంతనీ కొల్లగొట్టేందుకై బ్రిటిష్ పెట్టు బడికి సర్వాధికారం వుండాలా, లేక జర్మన్ పెట్టుబడికి సర్వాధికారం వుండాలా అనే విషయాన్ని నిశ్చయించేందుకు కోటి జనం బలి కావాల్సివచ్చిన సామ్రాజ్యవాదయుద్ధం, ఇదివరకెన్నడూ లేనంతగా తీవ్రమూ, విస్తృతమూ, దారుణమూ చేసివేసింది. ఇందుచేతే, జనసంఖ్యలో బ్రహ్మాండ మైన అత్యధికసంఖ్యాకవర్గం, అందులోనూ ప్రత్యేకంగా కార్మికప్రజారాసులు, శ్రామిక వర్గంపట్ల సానుభూతి చూపడం అనివార్యమైంది; ఇందుకు కారణం, దోపిడీదార్లకు తావు లేని కొత్త సమాజాన్ని సృష్టించేందుకై రాచబాట వేసేందుకు, పెట్టుబడి మోపిన గాటిని విడిపించుకుని, దోపిడీదార్లను కూలదోసి, వారి ప్రతిఘటనను వీరోచిత పరాక్రమంతోనూ, విప్లవాత్మక నిర్దాక్షిణ్యంతోనూ అణచివేసేందుకు అది తన రక్తాన్ని చిందించుతుంది.

బూర్జువావర్గపు ''రెక్కలకింద'' బూర్జువా ''వ్యవస్థ''కు తిరిగిచేరుకోవడానికే కార్మిక ప్రజానీకంలోని శ్రామికర్గేతర, అర్ధశ్రామికవర్గ ప్రజారాసుల పెట్టీబూర్జువా తటపటా

యింపులూ, ఊగిసలాటలూ జోరుగానూ, అనివార్యమైనవిగానూ వున్నప్పటికీ, దోపిడీదార్లను కూలదోయడమే కాకుండా, వారి ప్రతిఘటనను అణచివేయడమేకాకుండా, ఒక నూతన, ఉన్నత సామాజిక సంబంధాన్ని నిర్మించుతూన్నట్టీ, ఒక సామాజిక క్రమశిక్షణను, తమ సొంత ఐక్యతయొక్క, మరింత అధికంగా చైతన్యవంతమూ, ధైర్యవంతమూ, దృఢతరమూ, విప్లవాత్మకమూ, అంచంచలమైన తమ సొంత అగ్రగామిదళంయొక్క అధికారం తప్ప వేరొక అధికారాన్నిగాని, వేరొక కాడినిగాని ఎరగనట్టి వర్గచైతన్యయుతమై ఐక్యపడిన కార్మికప్రజా క్రమశిక్షణను నిర్మించుతూన్నట్టి శ్రామికవర్గంయొక్క నైతిక, రాజకీయాధికారాన్ని అవి గుర్తించకుండా వుండజాలవు.

విజయసాధనకూ, సోషలిజాన్ని నిర్మించి దృఢపరచేందుకూ శ్రామికవర్గం ఒక ద్విముఖ, లేక ద్వంద్వ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి: మొదటిది, పెట్టుబడిపై సాగించే విప్లవాత్మక పోరాటంలో తన నిస్వార్థ వీరోచిత పరాక్రమంచే కార్మికప్రజల, పీడితప్రజల యావత్తు రాశినీ అది తనవైపు తిప్పుకోవాలి; దీనిని తనవైపు తిప్పుకొని, దీనిని ఆర్గనైజుచేసి, బూర్జువా వర్గాన్ని కూలదోసే పోరాటంలో దీనికి నాయకత్వం వహించి, బూర్జువా వర్గ పక్షంనుండి వచ్చే ప్రతీ ప్రతిఘటనను సంపూర్ణంగా అణచివెయ్యాలి. రెండోది, కార్మికప్రజల, పీడిత ప్రజల యావత్తు రాశినీ, అంతేకాకుండా పెట్టీబూర్జువా స్తరములనన్నింటినీ, అధికస్థాయి సామాజిక ఉత్పత్తిని సృష్టించే చైతన్యవంతులైన కార్మికుల రాశిసంఘాలతో పెట్టుబడిదారీ విజ్ఞాన, సాంకేతిక శాస్త్రంల్లో అధునాతన విధానాలను మిళితంచేసేటట్టి ఒక నూతన ఆర్థికనిర్మాణ మార్గంలోకి, నూతన సామాజిక సంబంధాలను, శ్రమయొక్క ఒక నూతన ఆర్గనైజేషనుని సృష్టించే మార్గంలోకి నడిపించాలి.

మొదటి కర్తవ్యం కంటె రెండోదే ఎక్కువ కష్టమైనది, ఎందుచేతనంటే విడివిడిగా ఆచరించే వీరోచితోత్సాహ కృత్యాలవల్లనే దానిని నెరవేర్చడానికి సాధ్యపడదు; అన్నిటికంటే అత్యంత సుదీర్ఘమూ, అత్యంత హఠమూ, అత్యంత కష్టమూ అయిన రాశివీర్యమూ దైనందిన కృషీ అందుకు అవసరమవుతాయి. అయినప్పటికీ, మొదటిదానికంటెనూ ఇదే ముఖ్యమైనది, కారణమేమంటే, తుది విశ్లేషణలో, బూర్జువావర్గంపై సాధించే విజయాల కవసరమయే బలానికి అత్యంత ప్రగాఢమయిన మూలాధారమూ, ఈ విజయాలు సుస్థిరంగానూ శాశ్వతంగానూ నిల్చివుండేందుకు ఏకైక హామీ కేవలం ఒక నూతన ఉన్నత సామాజికోత్పత్తి విధానమే తప్ప, పెట్టుబడిదారీ, పెట్టీబూర్జువా ఉత్పత్తి స్థానే అధికస్థాయి సోషలిస్టు ఉత్పత్తిని నెలకొల్పడమే తప్ప వేరొకటేదీ కాజాలదు.

* * *

''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌ల''కు ఇంత బృహత్తరమైన చారిత్రక ప్రాముఖ్యత వుండడానికి అచ్చమైన కారణం, శ్రామిక ఉత్పాదకశీలతను అభివృద్ధి చేయడంలోనూ, ఒక కొత్త శ్రమైక క్రమశిక్షణను అవలంబించడంలోనూ, సోషలిస్టు ఆర్థికవ్యవస్థ జీవితపరిస్థితులను సృష్టించడంలోనూ కార్మికుల చైతన్యయుతమైన, స్వచ్ఛందమైన చొరవను అవి రుజువు చేయడమే.

1870–1871 గుణపాఠాల తరువాత జాతీయ దురహంకారంతోగాని, జాతీయ-లిబరల్ తత్వంతోగాని చేరిపోకుండా, సోషలిజంలోకే చేరిన కొద్దిమంది జర్మన్ బూర్జువా డెమోక్రాట్లలో ఒకడైనట్టి, ఇంకా యథార్థంగా చెప్పాలంటే, మిక్కిలి అరుదైన మినహాయింపులలో ఒకడైనట్టి, జె. యాకోబి, సడోవా యుద్ధం[163] కంటెనూ ఒక ట్రేడ్‌యూనియన్ ఏర్పడడమే చారిత్రకంగా అధిక ప్రాముఖ్యతను కలిగివుంటుందని ఒకసారి అన్నాడు. ఇది నిజం. జర్మన్ జాతీయ పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రాన్ని సృష్టించడంలో ఆస్ట్రియా, జర్మనీ, ఈ రెండింటి బూర్జువా ఏకరాజాధిపత్యాలలో దేనిది పైచేయి అనే సమస్యను సడోవా యుద్ధం తేల్చివేసింది. బూర్జువావర్గంపై శ్రామికవర్గంయొక్క ప్రపంచవ్యాప్త విజయానికి దారి చూపే మార్గంలో ఒక ట్రేడ్ యూనియన్‌న్ని స్థాపించడం ఒక చిన్న అడుగే అయింది. అదే విధంగా 1914–1918 సామ్రాజ్యవాద యుద్ధంలో హిండెన్‌బర్గ్‌గానీ, లేదా ఫోష్, బ్రిటిష్ వాళ్లూగానీ సాధించిన విజయాలలో ఏ ఒక్క విజయంకంటేనూ, మాస్కోలో 1919 మే 10 న మాస్కో-కజాన్ రైల్వే కార్మికులచే ఏర్పాటుచేయబడిన మొదటి కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌కే చారిత్రకంగా అధికప్రాముఖ్యత వుంటుందని మనం చెప్పవచ్చు. సామ్రాజ్యవాదుల విజయాల అర్థం ఆంగ్లో-అమెరికన్, ఫ్రెంచి కోటీశ్వరుల లాభాల కోసమని లక్షోపలక్ష కార్మికుల ఊచకోతే, శరీరమంతా ఉబ్బిపోయి బతికుండగానే కుళ్ళిపోతూ చావుగడియలు దగ్గరపడుతూన్న పెట్టుబడిదారీ విధానంయొక్క పాశవికతే. మాస్కో-కజాన్ రైల్వే కార్మికులచే ఏర్పాటుచేయబడిన కమ్యూనిస్టు సుబ్బోత్నిక్, పెట్టుబడిదారీ విధానంమోపిన గాటినుండీ, యుద్ధాలనుండీ ఈ భూమిమీద నివసించే సర్వప్రజలకూ విముక్తి ప్రసాదించే నూతన, సోషలిస్టు సమాజంయొక్క కణాలలో ఒక కణం.

శ్రీయుతులు బూర్జువావర్గంవారూ, తాము ''ప్రజాభిప్రాయ'' ప్రతినిధులమని అనుకుందుకు అలవాటుపడిన మెన్‌షెవిక్‌లూ సోషలిస్టు-రివల్యూషనరీలతో సహా ఈ బూర్జువా వర్గపు ఆశ్రితులూ, కమ్యూనిస్టుల ఆశలను సహజంగానే ఈసడించుతూ, ''లక్కపిడతలో కల్పవృక్షం'' అని వీటికి పేరుపెట్టుతూ, సుబ్బోత్నికుల స్వల్పాతిస్వల్పసంఖ్యను, దొంగతనమూ సోమరితనమూ ఉత్పాదకశీలతా క్షీణమూ ముడిసరుకులనూ తయారైన సరుకులనూ పాడుచేయడమూ వగైరా దృష్టాంతాల బ్రహ్మాండసంఖ్యతో పోల్చిచూపుతూ అపహాస్యం చేస్తాం

టారు. ఈ పెద్దమనుషులకు ఇదీ మన జబాబు: రష్యన్ పెట్టుబడిదార్ల, విదేశపెట్టుబడి దార్ల పరిపాలనను పునరుద్ధరించేందుకుగాను ఈ బూర్జువా మేధావులు తమ విజ్ఞానాన్ని వీరికి అందివ్వకుండా, కార్మికప్రజలకు సహాయం చేసేందుకై అందిచ్చి వుండినట్లయితే, విప్లవం మరింత త్వరితంగానూ మరింత శాంతియుతంగానూ సాగివుండేది. కాని ఇది ఊహానిర్మిత జగత్తులో సఫలీకృతమయే కోర్కె; ఎందుచేతంటే ఈ ప్రశ్నను తెల్చేది వర్గ పోరాటమే, కాగా మేధావులలో అధికసంఖ్యాకవర్గం బూర్జువావర్గంతోనే చేరుతుంది. శ్రామికవర్గం విజ యాన్ని సాధించేది మేధావుల సహాయంతో కాదు, తత్‌వ్యతిరేకంగా వీరి ప్రతికూలతను (అధమం అధికసంఖ్య సందర్భాల్లో) లక్ష్యపెట్టకుండానే, ఇక బాగుపరచ నశక్యమైనంతగా బూర్జువా వర్గపు పక్షపాతం కలిగిన వారిని తొలగించివేసి, సంశయమనస్కులను సంస్కరించి, వారికి పునఃప్రబోధం కలిగించి, వారిని తన చేతికిందికి తెచ్చుకుని, వారిలో అంతకంతకు మరింత అధిక భాగాన్ని శ్రామికవర్గం తనవైపు తిప్పుకోవాలి. విప్లవం ఎదుర్కొంటూన్న చిక్కులనూ, తాత్కాలిక తిరోగమనాలనూ చూచి సంతోషించడమూ, భయా ఆందోళనలను వ్యాపింపజేయ డమూ, గతానికే తిరిగి మళ్లాలని బోధించడమూ — ఇవన్నీ వర్గపోరాటంలో బూర్జువా మేధా వులు ఉపయోగించే ఆయుధాలూ, విధానాలూనూ. వీటిని చూచి శ్రామికవర్గం మోసపోదు.

విషయంయొక్క అసలు సారాన్ని గనుక మనం తీసుకున్నట్లయితే, తిరోగమనాలూ, పొరపాట్లూ, వెనుకంజలూ, వీటి సుదీర్ఘ పరంపర లేనిదే ఏ కొత్త ఉత్పత్తి విధానమైనా వెంటనే వేళ్ళూనడం చరిత్రలో ఎన్నడైనా సంభవించిందా? భూదాస్య వ్యవస్థ రద్దు కావించబడిన తరువాత ఒక అర్ధశతాబ్ది వరకు సహితమూ రష్యా పల్లెపట్టులలో భూదాస్యపు అవశేషాలు అనేకం ఇంకా ఉంటూనే వుండేవి. అమెరికాలో బానిసవ్యవస్థ రద్దు కావించబడిన తరువాత ఒక అర్ధశతాబ్ది వరకు సహితమూ నీగ్రోలు అతి తరుచుగా అర్ధబానిస స్థితిలోనే వుండేవారు. మెన్‌షెవిక్‌లూ సోషలిస్టు-రివల్యూషనరీలతో సహా బూర్జువా మేధావులు పెట్టుబడికి ఊడి గంచేస్తూ శుద్ధ బూటకపు వాదనలే ఇంకా సాగించుతుండడం వారి నిజస్వభావానికి సరిగా సరిపడుతూనే వుంది: శ్రామికవర్గ విప్లవం జరగకముందు మనం ఉహాజగత్తు వాస్తవ్యులమని మనమీద నిందమోపారు; విప్లవం తరువాత ఊహాతీతమై త్వరితగతిని గతకాలపు జాడలన్ని టినీ మనం తుడిచిపెట్టేయ్యాలని వారు కోరుతున్నారు!

కాని మనం ఊహాజగత్తువాస్తవ్యులంకాం, కాగా బూర్జువా "వాదనల" యథార్థపు విలువ మనకు తెలుసు; ఆచారాల అలవాట్లలోని పురాతనంయొక్క జాడలు విప్లవానంతరపు కొంతకాలం వరకూ నవ్యతయొక్క కొత్త మొలకలపై తప్పనిసరిగా ప్రబలమైన ప్రభావం కలిగివుంటాయని కూడా మనకు తెలుసు. కొత్తది నూతనంగా జన్మించినప్పుడు దానికంటె కొంతకాలం వరకు పాతదే బలంగా వుంటుంది; ఈ సత్యం ప్రకృతిలోనూ సామాజిక జీవితం

లోనూ మనకెల్లప్పుడూ తారసిల్లుతూనే వుంటుంది. నవ్యతయొక్క లేత మొలకల బలహీన తను చూసి ఈసడింపూ, మేధావుల చౌకబారు సంశయతత్వమూ, దీనిలాంటివే ఇతరములూ — ఇవి ప్రధానంగా శ్రామికవర్గంపై బూర్జువావర్గం సాగించే వర్గపోరాట విధానాలు, సోష లిజానికి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ విధానంయొక్క రక్షణోపాయం. కొత్త మొలకలను మనం జాగ్రత్తగా అధ్యయనం చెయ్యాలి, వాటిని గురించి మనం అత్యధిక శ్రద్ధ వహించాలి, వాటి వృద్ధికి శక్తివంచన లేకుండా దోహదం చెయ్యాలి, బలహీనములైన ఈ మొలకలకు "సంర క్షణ" జరపాలి. వీటిలో కొన్ని మృత్యువాత పడడం అనివార్యం. అచ్చంగా ఈ "కమ్యూ నిస్టు సుబ్బోత్నిక్‌లే" ప్రత్యేకంగా ముఖ్యములైనట్టి పాత్రను నిర్వర్తిస్తాయని మనం రూఢిగా చెప్పలేం. కాని అసలు విషయం అదికాదు. నవ్యతయొక్క అన్నిమొలకలనూ, ప్రతి ఒక్క మొలకనూ పెంచి వృద్ధిలోకి తీసుకురావాలన్నదే అసలు విషయం; వాటిలో అన్నిటికంటె బలమైనవాటిని జీవితమే ఎంపిక చేస్తుంది. సిఫిలిస్ వ్యాధిపై మానవాళి విజయం సాధించేందుకు గాను, అన్ని అవసరాలకూ నిష్కర్షగా ఉపయోగపడేటట్టి ఆరువందల అరవైయ్యో సజ్జీకరణాన్ని తయారు చేయగలిగే ముందు ఆరువందల అరవైయ్యైదు సజ్జీకరణాలను పరీ క్షించే ఓపిక ఆ జపాన్ శాస్త్రవేత్తకు అవసరమై వుండినప్పుడు, అంతకంటే ఎంతో కష్ట మైన సమస్యను, అనగా పెట్టుబడిని ఓడించడమనే సమస్యను పరిష్కరించ నుద్దేశించిన వారికి, వందలాది వేలాది కొత్త పోరాట విధానాలు, సాధనాలు, ఆయుధాలను, వాటిలో అత్యంత ఉచితమైనవాటిని విపులీకరించేందుకై పరిశీలన చేసేందుకు ఎంతేనా పట్టుదల అవసరమవుతుంది.

"కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు" ఎందుకింత ప్రాముఖ్యతను కలిగివున్నాయంటే, అం దుకు కారణం, వాటిని ప్రారంభించ గల్గేందుకు అపూర్వమైన సదవకాశాలను కల్గిన కార్మికు లచే కాకుండా, విభిన్నములైన అర్హతలను కల్గిన కొందరు కార్మికుల చేతనూ, సర్వసాధారణ పరిస్థితులలో, అనగా అత్యంత కఠిన పరిస్థితులలో పనిచేస్తూన్న ఎట్టి అర్హతలూ లేని కేవలం అప్రవీణ కార్మికులు కొందరి చేతనే ఇవి ప్రారంభించబడడమే. ఒక్క రష్యాలోనే కాకుండా ప్రపంచమందంతటా కనబడుతూన్నట్టి శ్రామిక ఉత్పాదకశీలతలో తగ్గుదలకు ప్రధాన కారణం మనకందరకూ బాగా తెలిసినదే: సామ్రాజ్యవాద యుద్ధ ఫలితమైన వినాశమూ దౌర్భా గ్యమూ, మనఃక్లేశమూ; నిస్త్రాణా, జబ్బులూ, సరైన ఆహారం లేకపోవడమూనూ. ప్రాము ఖ్యత దృష్ట్యా కడపటిదే ప్రథమస్థానం తీసుకుంటూంది. ఆకలిపస్తు — ఇదీ కారణం. కాగా ఆకలిపస్తులను నిర్మూలించాలంటే వ్యవసాయంలోనూ, రవాణా వ్యవస్థలోనూ, పరిశ్రమలోనూ శ్రామిక ఉత్పాదకశీలతను అధికంచెయ్యాలి. ఈ విధంగా విషవలయం ఒకటి తారసిల్లుతూంది: శ్రామిక ఉత్పాదకశీలతను అధికం చెయ్యాలంటే ఆకలిపస్తులనుండి కాపాడుకోవాలి, ఆకలి పస్తులనుండి కాపాడుకోవాలంటే శ్రామిక ఉత్పాదకశీలతను అధికం చెయ్యాలి.

ప్రజారాసుల మానసిక స్థితిలో సమూలమైన మార్పు తీసుకురావడంవల్ల, ఇట్టిసమూలమైన మార్పు ఒక పూర్వరంగంగా ఏర్పడిన పరిస్థితులలో నిర్ణయాత్మక పాత్రను తరుచు నిర్వర్తించేటట్టి వ్యక్తిగత గ్రూపుల వీరోచితమైన చొరవవల్ల విషయవలయాన్ని ఛేదించడం ద్వారానే ఈ వైరుధ్యాలు పరిష్కార మవుతాయని ఆచరణలో మనం తెలుసుకుంటున్నాం. మాస్కోలోని అప్రవీణ కార్మికులూ మాస్కో రైల్వేకార్మికులూ (మా మనస్సులో వున్నది వీరిలో అధికసంఖ్యాకవర్గమేగాని, ఏ పట్టెడుమంది అధికలాభాపేక్షాపరులో, ఉన్నతోద్యోగులో, వైట్‌గార్డిస్టులో కాదు), అత్యంత అధ్వాన్నపు పరిస్థితులలో జీవించుతూన్నట్టి కార్మిక ప్రజలు. నిరంతరమూ అర్ధాకలితో వుండడమే వారి గతి, ఇక ఇప్పుడు కోతలింకా ప్రారంభించబడకముందు, ఆహార పరిస్థితి సాధారణంగా మరింత అధ్వాన్నంగా వుంటూన్న ఈ రోజుల్లో, వారు యథార్థంగా ఆకలితో మాడిపోతూన్నారు. అయినప్పటికీ పస్తుంటూన్న ఈ కార్మికులు బూర్జువావర్గం, మెన్‌షెవిక్‌లు, సోషలిస్టు-రివల్యూషనరీలు ద్వేషబుద్ధితో సాగిస్తూన్న విప్లవప్రతిఘాతక ఆందోళన నడిమధ్య నివసించుతూన్నప్పటికీ, ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌ల''ను ఆర్గనైజు చేస్తూ తాము నిస్స్పృహచెంది, మనఃక్లేశంతో బాధపడుతూ, సరైన ఆహారంలేమి ఫలితంగా నిస్త్రాణతో వున్నప్పటికీ లక్ష్యం చేయకుండానే ఎట్టి వేతనమూ లేకుండానే ఓవర్‌టైమ్ చేస్తూ, శ్రామిక ఉత్పాదకశీలతలో బ్రహ్మాండమైన పెరుగుదల సాధించారు. సర్వోత్కృష్టమైన వీరోచితకృత్యంకాదా ఇది? ప్రపంచచారిత్రక ప్రాముఖ్యతను గల మలుపు తిరుగుడుకు ప్రారంభం కాదా ఇది?

తుది విశ్లేషణలో, నూతన సామాజిక వ్యవస్థ విజయానికి అతి ముఖ్యమైన, ప్రధానమైన విషయం శ్రామిక ఉత్పాదకశీలత. భూదాస్య విధానంకింద ఎన్నడూ ఎరగనంతటి శ్రామిక ఉత్పాదకశీలతను పెట్టుబడిదారీ విధానం సృష్టించింది. నూతనమైనట్టి ఇంతకంటె అత్యధికమైనట్టి శ్రామిక ఉత్పాదకశీలతను సృష్టించగల్గడం వల్లనే పెట్టుబడిదారీ విధానాన్ని సోషలిజం అంతిమంగా ఓడించగల్గుతుంది, అంతిమంగా ఓడించి తీరుతుంది కూడానూ. ఇది మిక్కిలి కష్టమైన విషయం, ఇందుకు సుదీర్ఘకాలం అవసరం కూడానూ; అయితేనేమి, ఇదిప్పుడు ఆరంభమైంది, ఇదే ప్రధానమైన విషయం. ఆకలితో పస్తుంటూన్న మాస్కోలో, 1919 వేసంగిలో, నాలుగేళ్లతరబడి అష్టకష్టాలతో కూడినట్టి సామ్రాజ్యవాద యుద్ధాన్నీ, అటుతరువాత మరొక యేణ్ణర్ధం ఇంతకంటెనూ అధ్వాన్నమయిన కష్టాలతో కూడిన అంతర్యుద్ధాన్నీ అనుభవించినట్టి పస్తులతో మాడుతూన్న కార్మికులు ఈ మహత్తర కార్యం ప్రారంభించ గల్గితే, అంతర్యుద్ధంలో మనం విజయోపేతులమై శాంతిని సాధించినప్పుడూ, తరువాతా, ఇంకా మీదటికీ ఇది ఎంతగా అభివృద్ధి పొందుతుందో కదా?

అభ్యుదయకరమైన సాంకేతిక విధానాలను ఉపయోగించుతూన్నట్టీ, స్వచ్ఛందులైనట్టీ, వర్గచైతన్యయుతులైనట్టీ ఐక్యపడినట్టీ కార్మికుల శ్రమయొక్క — పెట్టుబడిదారీ విధానంకింద వున్న దానితో సరిపోల్చిచూస్తే — మరింత ఉన్నత శ్రామిక ఉత్పాదకశీలత — ఇదే కమ్యూనిజం. కమ్యూనిజంయొక్క వాస్తవ ఆరంభంగా కమ్యూనిస్టు సబ్బోట్నిక్‌లు అసాధారణ ప్రాముఖ్యతను కలిగివున్నాయి; కాగా ఇది మిక్కిలి అరుదైన విషయం, కారణమేమిటంటే, (మన పార్టీ కార్యక్రమం పరిపూర్ణ యథార్థతతో చెబుతూన్నట్టుగా) "పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తన చెందడంలో కేవలం మొదటి అడుగులే వేస్తూన్న" స్థితిలో మనం వున్నాం.

శ్రామిక ఉత్పాదకశీలతను అధికం చేసేందుకూ, వ్యక్తిగతంగా కార్మికులకుగాని, లేక వారి "దగ్గర" ఆప్తులకుగాని, బంధువులకుగాని చెందక, వారి "దూరపు" ఆప్తులకూ బంధువులకూ, అనగా సమాజమొత్తానికి, మొదట ఒక సోషలిస్టు రాజ్యాంగయంత్రంలోనూ, అటుతరువాత సోవియట్ రిపబ్లిక్కుల యూనియన్‌లోను ఐక్యమైనట్టి లక్షోపలక్షల ప్రజలకు చెందేటట్టీ ధాన్యమూ, నేలబొగ్గూ, ఇనుమూ, తదితర ఉత్పత్తులలో ప్రతి పూడ్‌నూ పొదుపుచేసేందుకూ సామాన్యశ్రేణి కార్మికులు కఠినాతికఠినమైన కష్టాన్ని లక్ష్యంచేయని స్వార్థత్యాగశీలమైన ఆకాంక్షను ఎప్పుడైతే ప్రదర్శించనారంభించుతారో అప్పుడు కమ్యూనిజం ఆరంభమవుతుంది.

"పెట్టుబడి" గ్రంథంలో కారల్ మార్క్స్, మానవ స్వేచ్ఛ, మానవ హక్కులను గురించి డాంబికమైనట్టీ, ఆడంబరమైనట్టీ, వాచాలతో కూడినట్టీ బూర్జువాప్రజాస్వామిక మహనీయ ప్రణాళికను ఎగతాళిచేస్తాడు, తుచ్ఛమైన బెర్న్ ఇంటర్నేషనల్‌లో చేరినట్టి నేటి తుచ్ఛమైన వీరాగ్రేసరులతో సహా అన్ని దేశాల పెట్టీబూర్జువాలనూ అల్పబుద్ధులనూ మిరుమిట్లు కొలుపుతూన్నట్టి సాధారణ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం గురించిన ఈ పదజాలప్రయోగాన్ని ఎగతాళి చేస్తాడు. హక్కులను గురించి ఈ డాంబిక ప్రకటనలతో, ఈ ప్రశ్నను పరిశీలించడంలో శ్రామికవర్గంయొక్క నిరాడంబరమూ, సామాన్యమూ, దైనికమూ, సరళమూ అయిన విధానాన్ని — దినసరి పనిగంటలను తగ్గించేందుకు చేసిన చట్టనిర్మాణం ఇందుకొక మామూలు ఉదాహరణ — సరిపోల్చుతాడు మార్క్స్. శ్రామికవర్గ విప్లవంయొక్క విషయం వికసించుతూన్నకొద్దీ, మార్క్స్ చేసిన అవేక్షణలో వున్న ఔచిత్యము, ప్రగాఢత మరింత స్పష్టంగానూ మరింత ప్రత్యక్షంగానూ మనకు ద్యోతకమవుతుంది. అచ్చమైన కమ్యూనిజంయొక్క "సాంకేతికాల"కూ, కౌట్‌స్కీలు, మెన్‌షెవిక్‌లు, సోషల్-రివల్యూషనరీలూ, వీరి ప్రియతమ బెర్న్ "భ్రాతలూ," వీరి డాంబికమూ కుయుక్తులూ ధర్మపన్నాలతో కూడుకున్నట్టి పదజాలానికీ వున్న భేదం ప్రతివిషయాన్ని వీరు శ్రమ పరిస్థితులకిందకి దించివేయ

డంలోనే వుంది. ''శ్రామిక ప్రజాస్వామ్యం'' గురించీ, ''స్వేచ్ఛ, సరిసమానత్వం, సౌభ్రాతృత్వం'' గురించీ, ''ప్రజలచే ప్రభుత్వం,'' ఇంకా ఇలాంటివే ఇతర ఊకదంపు గురించీ శుష్క ప్రియాలు తగ్గించడం; ''నిష్కళంకమైన'' రూపురేఖలతో దర్జాగా ''ముస్తాబై'' తయారైన ''జంటిల్‌మన్'' గారి షోకూ, డాబుసరి వ్యవహారమూ వాటమూ చూసి ''వీడెవడో బహుశ పెద్దకేడీ అయివుంటాడ''ని లోకజ్ఞానం, ప్రపంచానుభవమూ కల్గిన వ్యక్తి ఏ అనుమానమూ లేకుండా వెంటనే పోల్చేసుకునేటట్టి ఈనాటి చైతన్యవంతులైన కార్మికులూ రైతులూ, బూర్జువా మేధావియొక్క డాంబికమైన ఈ మాయలనన్నీ ఇట్టేకనిపెట్టేస్తారు.

డాబుసరి పదజాలం కాస్త తక్కువ, నిరాడంబర దైనందిన క్రియాకలాపం మరికొంచెం ఎక్కువ, ఒక పూడ్ ధాన్యపు గింజల కోసం, ఒక పూడ్ నేలబొగ్గు కోసం తాపత్రయపడితే ఎంతేనా నయంగా వుంటుంది! ఈ పూడ్ ధాన్యపు గింజలూ, నేలబొగ్గూ అత్యవసరంగా కావలసినట్టి పస్తులుంటూన్న కార్మికులకూ, చింకిపాతలతోనూ వుత్తకాళ్లతోనూ వుంటూన్న రైతులకూ అందిచ్చేందుకు, బేరసారాలు సాగించే విధంగా కాకుండా, పెట్టుబడిదారీ విధం ద్వారా కాకుండా, మాస్కో-కజాన్ రైల్వే అప్రవీణ కార్మికులూ రైల్వేకార్మికులూ లాంటి నిరాడంబరులైన కార్మికప్రజల చైతన్యయుతము, స్వచ్ఛందము అయిన అపార వీరోచిత శ్రమ ద్వారానే మారికాస్త తాపత్రయపడితే ఎంతేనానయంగా వుంటుంది!

విప్లవానికి సంబంధించిన ప్రశ్నలను సమీపించడంలో బూర్జువా-మేధావివర్గ పదజాలప్రయోగపు జాడలు సర్వత్రా, మన శ్రేణులలో సహితం, అడుగడుగునా కనబడుతూనే వున్న విషయం మనం ఒప్పుకుతీరాలి. ఉదాహరణకు, గతకాలపు బూర్జువా-ప్రజాస్వామ్యంయొక్క కుళ్లి కంపుకొడుతూన్న ఈ అవశేషాలకు వ్యతిరేకంగా మన పత్రికలు తగినంతగా పోరాడడమే లేదు; సిసలైన కమ్యూనిజంయొక్క సరళమూ, నిరాడంబరమూ, సర్వసామాన్యములే అయినప్పటికీ జీవంతో ఉట్టిపడుతూన్నటీ మొలకలకు అవి తగినంతగా దోహదం చేయడంలేదు.

స్త్రీల పరిస్థితిని తీసుకోండి. ప్రపంచంలో ఏ ఒక్క ప్రజాస్వామిక పార్టీ కూడా, అత్యంత పురోగామి బూర్జువా రిపబ్లిక్కులో సహితమూ, మనం అధికారం చేపట్టిన మొట్టమొదటి సంవత్సరంలోనే మనం చేసినదాంట్లో నూరోవంతు, దశాబ్దులలో కూడా చేయలేదు. స్త్రీలను అసమత్వ స్థితిలో వుంచినట్టీ, లేదా విడాకుల హక్కును పరిమితం చేస్తూ, ఆ హక్కును అసహ్యకరమైన తతంగాలతో నింపేసినట్టీ, లేదా ఔరసులుకాని పిల్లలకు గుర్తింపు నిరాకరించి, వారి తండ్రులను వెతకి కనిపెట్టడంపై నిషేధాజ్ఞలూ, వగైరాలను జారీచేసినట్టీ న్యాయ చట్టాలను, బూర్జువావర్గానికీ, పెట్టుబడిదారీ విధానానికీ సిగ్గుచేటైనట్టి — ఏ న్యాయ చట్టాలయొక్క అనేక అవశేషాలైతే నాగరిక దేశాలన్నిటిలోనూ కనబడుతున్నాయో అట్టి

హేయమైన న్యాయచట్టాలను — అక్షరాలా ఒక్క కూకటివేరైనా మిగిలిపోకుండా ఆమూలాగ్రంగా పెల్లగించి పారేశాం మనం. ఈ రంగంలో మనం సాధించిన దాని గురించి సగర్వంగా చెప్పకోడానికి మనకు వెయ్యిరెట్లు హక్కుంది. కాని పాతబడిపోయిన బూర్జువా న్యాయచట్టాల, సంస్థల చెత్తచెదారాన్ని తీసిపారేసి నేలను మనం ఎంత శుభ్రంగా బాగుపరచినా, నిర్మాణాలను కట్టడానికి నేలను బాగుపరచామేగాని, నిర్మాణకార్యానికి మనమింత వరకూ ఉపక్రమించలేదని అంతస్పష్టంగానూ మనకు తెలుస్తూంది.

స్త్రీని విముక్తి చేయడానికి ఎన్ని న్యాయచట్టాలు చేయబడినప్పటికీ కూడా, ఆమె ఇంకా ఇంట్లో బానిసగానే వుంటూంది, కారణమేమంటే, సంసారానికి సంబంధించిన చిల్లర పనులు ఆమెను క్రుంగదీసి, ఊపిరాడకుండా చేసి, ఆమె తెలివితేటలను నశింపజేసి, ఆమెను అవమానపరచి, వంటింటికీ వుయ్యాలా మంచానికి ఆమెను ఇనుపగొలుసులతో కట్టిపడేసి, కిరాతకమైనట్టి ఉత్పాదకరహితమూ, హేయమూ అయినట్టి, నరాలను రేకెత్తించేటట్టి, మోటు తేర్చేటట్టి మనిషిని క్రుంగదీసేటట్టి చాకిరీలో ఆమె శ్రమను వ్యర్థపరుస్తున్నాయి. ఈ చిల్లరమల్లర సంసారపు ఆర్థికవ్యవస్థపై (రాజ్యాంగయంత్రాధికారాన్ని చలాయించుతూన్న శ్రామికవర్గం నాయకత్వాన) రాశి పోరాటం, ఎప్పుడైతే ఎక్కడైతే ఆరంభమవుతుందో కేవలం అప్పుడే అక్కడే, ఇంకా నిశితంగా చెప్పాలంటే, అధికస్థాయి సోషలిస్టు ఆర్థికవ్యవస్థగా ఇది ఎప్పుడైతే రాసిగా పునర్నిర్మించబడుతుందో కేవలం అప్పుడే స్త్రీల నిజమైన విముక్తి, నిజమైన కమ్యూనిజం, ఆరంభమవుతుంది.

సైద్ధాంతికంగా, ప్రతి కమ్యూనిస్టుకీ నిర్వివాదమైన ఈ ప్రశ్నపట్ల ఆచరణలో మనం తగినంత శ్రద్ధ చూపుతున్నామా? నిజంగా చూపడంలేదు. కమ్యూనిజంయొక్క ఈరంగంలో ఇప్పటికప్పుడే అస్తిత్వంలోవున్న కమ్యూనిజం లేతమొలకలను గురించి మనం తగినంత జాగ్రత్త తీసుకుంటున్నామా? లేదు, లేదనే మనం మళ్లీ ఉద్ఘాటించాల్సి వుంది. బహిరంగ భోజనశాలలు, శిశుమందిరాలు, కిండర్‌గార్డెన్లు — ఈ మొలకల దృష్టాంతాలు మనకిక్కడున్నాయి, వాస్తవంగా స్త్రీలను విముక్తి చేయగల్గేటట్టి, సామాజిక ఉత్పత్తిలోనూ, పౌరజీవితంలోనూ పురుషులతో తమ పాత్రసందర్భంలో తమ అసమత్వాన్ని వాస్తవంగా తగ్గించగలిగేటట్టి, అంతమొందించగలిగేటట్టి, డాబుదర్పమూ, ఆడంబరమూ, యథావిధి తతంగమూ లేనట్టి, సరళమైనట్టి, దైనందిన సాధనాల దృష్టాంతాలు మనకిక్కడున్నాయి. ఈ సాధనాలేవీ కొత్తవికావు, ఇవి కూడా (సోషలిజానికి అవసరములైన అన్ని పూర్వకాంక్షితములలాగానే) అధికస్థాయి పెట్టుబడిదారీ విధానంచే సృష్టించబడ్డాయి; కాని పెట్టుబడిదారీ విధానంకింద అవి, మొదట ఒక అపురూప విషయంగానూ, రెండోది — ఇది ప్రత్యేకంగా ముఖ్యమైన విషయం — చట్టావ్యాపారం, అధికలాభాపేక్ష, మోసం, కృత్రిమం, వీటి అధ్వాన్నపు లక్షణాలను

కలిగివున్నట్టి లాభార్జన వ్యాపారాలుగానూ, లేదా ఉత్తమ కార్మికులు కేవలం న్యాయంగానే ద్వేషించి, తృణీకరించినట్టి ''బూర్జువా లోకోపకార పరణాయత్వంయొక్క దొమ్మరాటలు'' గానూ వుండిపోయాయి.

మన దేశంలో ఈ సంస్థల సంఖ్య బ్రహ్మాండంగా పెరగడంలోనూ, ఇవి తమ స్వభావాన్ని మార్చుకోడానికి ప్రారంభించడంలోనూ ఎట్టి సందేహమూ లేదు. కార్మికస్త్రీలలోనూ, రైతాంగపు స్త్రీలలోనూ ఆర్గనైజింగ్ శక్తిసామర్థ్యాలు మనకు తెలిసినదాని కంటె అధికంగానే వున్నాయనడంలోనూ, గర్వంతో విర్రవీగుతూన్నట్టి మన మేధావివర్గానికీ, లేదా మన సగంసగం పలుకుబారిన ''కమ్యూనిస్టుల''కూ ''జాడ్య''మైనట్టి పథకాలూ, పద్ధతులూ వగైరాల గురించి పుష్కలమైన పెద్దకబుర్లూ, హడావుడీ, బాతాఖానీలు లేకుండానే అధికసంఖ్యలో కార్మికులూ, ఇంకా అత్యధికసంఖ్యలో వినిమయదార్లూ పాల్గొంటూన్నట్టి ఆచరణ క్రియాకలాపాన్ని నడిపించగల్గేవారు మనం అనుకునే కంటెనూ అనేకులే వున్నారనడంలోనూ ఎట్టి సందేహమూ లేదు. కాని నవ్యతయొక్క ఈ మొలకలను సరైన విధంగా మనం పెంచడం లేదు.

బూర్జువావర్గాన్ని చూడండి. తనకు కావలసినదాని గురించి డప్పువేసి ప్రకటించడం దానికెంత భేషుగ్గా తెలుసునో చూడండి! ఏ వ్యాపారసంస్థలనైతే పెట్టుబడిదార్లు ''నమూనా''గా ఎంచుతారో, అట్టివాటిని వారి వార్తాపత్రికలు లక్షోపలక్షప్రతులలో ఎలా పొగడుతాయో చూడండి! ''నమూనా'' బూర్జువా సంస్థలు ఏ విధంగా జాతీయ గర్వకారణ విషయాలుగా చేయబడుతున్నాయో చూడండి! మన భోజనశాలలోగాని, శిశుమందిరాలలోగాని ఉత్తమములైన వాటిని గురించి దినదినమూ ఉద్ఘాటించడం ద్వారా వాటిలో కొన్నింటిని ఆ యా తరహా సంస్థలకు నమూనాలుగా రూపొందించేందుకుగాను అట్టివాటిని అభివర్ణించి రాయడానికి మన వార్తాపత్రికావ్యవస్థ ఏ మాత్రమూ శ్రమతీసుకోవడంలేదు, తీసుకున్నా అతి స్వల్ప శ్రమే తీసుకుంటూంది. వాటిని గురించి మన పత్రికావ్యవస్థ చాలినంత ప్రచారం చేయడమేలేదు; ఆదర్శవంతమైన కమ్యూనిస్టు శ్రమతో మానవ శ్రమను ఎంతవరకు తగ్గించడానికి వీలవుతుందో, వినిమయదారునికి ఎట్టి సదుపాయాలను కలుగజేస్తాయో, సరుకులలో ఎంత పొదుపు చేసేందుకు వీలుంటుందో, ఇంటి పనులు బానిసత్వంనుండి స్త్రీలకు ఎంతగా విముక్తి కలుగుతుందో, పారిశుధ్య పరిస్థితులలో ఎంత మెరుగును సాధించడానికి వీలుకల్గుతుందో వీటన్నిటినీ యావత్తు సమాజానికీ కార్మికప్రజలందరికీ అందజేయడానికి వీలుంటుందో సవివరంగా అది అభివర్ణించడమేలేదు.

ఆదర్శవంతమైన ఉత్పత్తి, ఆదర్శవంతమైన కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు, ప్రతి ఫూడ్ ఆహారధాన్యాన్ని జాగ్రత్త చేయడంలోనూ పంపిణీ చేయడంలోనూ ఆదర్శవంతమైన శ్రద్ధ, నిజాయితీలు, ఆదర్శవంతమైన భోజనశాలలు, ఫలానా ఫలానా కార్మికుల నివాస

గృహంలో, ఫలానా ఫలానా గృహసముదాయంలో ఆదర్శవంతమైన పరిశుభ్రత — వీటన్నిపట్లనూ ప్రతి కార్మిక, కర్షక సంస్థ ఇప్పుడు చూపుతూన్న శ్రద్ధ, జాగ్రత్తలకంటె పదింతలు అధిక శ్రద్ధ జాగ్రత్తలనే మన పత్రికావ్యవస్థ చూపాల్సి వుంటుంది. ఇవన్నీ కమ్యూనిజంయొక్క కొత్త మొలకలే. కాగా వాటికి సంరక్షణ చేయడం మన ప్రధాన సమిష్టి విధాయకం. మన ఆహార, ఉత్పత్తి పరిస్థితులు గడ్డుగానే వున్నప్పటికీ, సంవత్సరం ఆరునెలల బోల్‌షెవిక్ పరిపాలన కాలంలో, యావత్తు శ్రేణిలోనూ నిస్సంశయమైన ప్రగతి సాధించబడింది: ఆహార ధాన్యాల వసూలు మూడుకోట్ల పూడ్లనుండి (1917, 1వ ఆగస్టునుండి 1918, 1వ ఆగస్టు వరకూ) పదికోట్ల పూడ్లవరకు (1918, 1వ ఆగస్టునుండి 1919, 1వ ఆగస్టు వరకు) పెరిగింది; కూరగాయల తోటల విస్తీర్ణం అధికమైంది, విత్తనాలు చల్లకుండా వుండిపోయిన భూమి విస్తీర్ణం తగ్గిపోయింది, ఇంధనాల ఇబ్బంది విపరీతంగా వున్నప్పటికీ రైల్వే రవాణా మెరుగుపడడం ఆరంభమైంది; ఇలాగే ఇతర రంగాలలో కూడా పరిస్థితులు బాగుపడుతున్నాయి. ఈ మొత్తం పరిస్థితుల పూర్వరంగంతోనూ, శ్రామికవర్గ రాజ్యాంగ యంత్రాధికారంయొక్క ఆసరాతోనూ కమ్యూనిజం కొత్త మొలకలు ఎంత మాత్రమూ వాడిపోవు; అవి పెరిగి పెద్దవై పరిపూర్ణమైన కమ్యూనిజంగా పుష్పించుతాయి.

* * *

ఈ గొప్ప చొరవనుండి అత్యంత ముఖ్యమైనట్టి అన్ని ఆచరణీయములగు గుణపాఠాలనూ మనం తెలుసుకుందుకు "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌ల" తాత్పర్యాన్ని గురించి మనం మిక్కిలి లోతుగా పర్యాలోచించాల్సి వుంటుంది.

ఈ చొరవకి అన్ని విధాల సహాయమూ అందజేయాల్సి వుంటుందనేది మొదటి ప్రధాన గుణపాఠం. "కమ్యూన్" పదాన్ని మనవారు ఇష్టంవచ్చినట్లూ వాడుతున్నారు. కమ్యూనిస్టులచే ప్రారంభించబడినట్టి, లేదా వారు పాల్గొంటూన్నట్టి ఎటువంటి సంస్థనైనా సరే వెంటనే "కమ్యూన్" అని అతి తరుచుగా దానికి నామకరణం చేస్తున్నారు, అలాచేయడంలో, సుదీర్ఘమైనట్టీ దృఢసంకల్పంతో సాగించినట్టీ యత్నం వల్లనే సిసలైన కమ్యూనిస్టు నిర్మాణంలో ఆచరణద్వారా సాధించబడి రుజువుకాబడగల్గిన విజయం వల్లనే అత్యంత గౌరవనీయమైన ఈ బిరుదును సంపాదించాల్సి వుంటుందనే విషయం విస్మరించబడుతూంది.

అందుచేతనే "వినిమయదార్ల కమ్యూన్లు" అనే పేరుకు సంబంధించినంత వరకూ, ప్రజా కమిస్సార్ల కౌన్సిల్ జారీచేసిన ఉత్తరవును రద్దు చేయడానికి కేంద్ర కార్యవర్గ సమితి సభ్యులలో అధికసంఖ్యాకవర్గం చేసిన నిర్ణయం సరైనదేనని నా అభిప్రాయం. పేరు సరళంగా

వుండనీయండి — కాగా, కొత్త ఆర్గనైజేషనల్ కార్యం ఆరంభ దశలలో, లోపాలకూ పొర పాట్లకూ ''కమ్యూన్ల''పై నిందపడకుండా, అందుకు బదులు చెడ్డ కమ్యూనిస్టులపైనే (ఇదే న్యాయమూ, ధర్మమూ కూడా) నిందపడుతుందని మనం ప్రాసంగికంగా చెప్పవచ్చు. ''కమ్యూన్'' పదాన్ని మామూలు వాడుకనుండి తొలగించివేయడమూ, కొత్తగా వచ్చిన ప్రతివాడూ దానిని లంకించుకొనడమును నిషేధించడమూ, లేదా తమ కార్యకలాపాన్ని కమ్యూనిస్టు పద్ధతిలో ఆర్గనైజుచేయడంలో తాము సమర్థులమని ఆచరణలో (చుట్టుపక్కలవున్న యావన్మంది ప్రజలచే ఏకగ్రీవంగా గుర్తించబడి) రుజువు చేసుకొనగల్గినట్టి సిసలైన కమ్యూన్లచేత మాత్రమే ఈ పేరు వాడుకుందుకు అనుమతించడమూ మంచిదే అవుతుంది. సమాజం ప్రయోజనాలకై, కార్మికప్రజలందరి ప్రయోజనాలకై ప్రతిఫలం లేకుండా పనిచేసే సామర్థ్యం మీకుందని మొదట చూపండి, ''విప్లవాత్మక రీతిలో పనిచేసే'' సామర్థ్యం మీకుందని, శ్రామిక ఉత్పాదక శీలతను అధికంచేసే సామర్థ్యం, క్రియాకలాపాన్ని ఆదర్శప్రాయమైన విధంగా ఆర్గనైజు చేసే సామర్థ్యం మీకుందనీ మొదట చూపండి, ఇక అప్పుడు ''కమ్యూన్'' అనే గౌరవ నామంకోసం చేతులు చాపండి!

ఈ సంబంధంలో ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు'' మిక్కిలి విలువైన మినహాయింపు అని చెప్పాలి. ఎందుచేతంటే, కమ్యూనిస్టులలాగున పనిచేసే సామర్థ్యం తమకుందని మొదట చేతలు చేసి వారు రుజువుపరచుకుని, ఆ తరువాతే తమ మాస్కో-కజాన్ రైల్వేలో పని చేస్తూన్న అప్రవీణ కార్మికులూ, రైల్వే కార్మికులూ చొరవకి ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు'' అని పేరుపెట్టుకున్నారు. ఏ వ్యక్తిఅయినా తన వ్యాపారసంస్థకు, కార్యాలయానికి, లేదా ఉద్య మానికి గాని, అది ఆదర్శవంతమైన, యథార్థమైన కమ్యూనిస్టు పద్ధతులపై ఆర్గనైజు చేయబడిందని, కష్టపడి చేసిన పనివల్లనూ, ఆచరణలో సుదీర్ఘమైన ప్రయత్నంచే సాధించ బడిన విజయంవల్లనూ రుజువుపరచనిదే కమ్యూన్ అని పేరుపెడితే, అట్టి వ్యక్తిని చిట్కా వైద్యుడనీ, బడాయిఖోరనీ నిర్దాక్షిణ్యంగా ఎగతాళిచేసి బహిరంగంగా చివాట్లుపెట్టాలి.

ఈ గొప్ప చొరవను, ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లను,'' మరొక కార్యానికి కూడా వినియోగించాలి, అదేదనగా పార్టీని శుద్ధిచేసే కార్యం. విప్లవానంతరం మొదటి దినాల్లో, ''నిజాయితీ'' కల్గినట్టీ, అల్పబుద్ధి కల్గినట్టీ అత్యధికసంఖ్యాక వ్యక్తులు ప్రత్యేకంగా పిరికి వారై వుండిన రోజుల్లోనూ, ఎట్టి మినహాయింపులూ లేకుండా సహజంగానే మెన్‌షెవిక్‌లూ సోషలిస్టు-రివల్యూషనరీలతోసహా, బూర్జువా మేధావిస్తరంలో ప్రతివారూ బూర్జువావర్గా నికి గులాములుగా తయారై విధ్వంసక చర్యలకు పూనుకున్న రోజుల్లోనూ, దుస్సాహసికులూ హానికరములగు ఇతర మూలద్రవ్యాలూ పాలక పార్టీ వెంటపడడం కేవలం అనివార్యమే అయింది. ఇలా కాకుండా ఏ విప్లవమూ ఇది వరకు జరగలేదు, ఇకముందూ జరగదు. అసలు విషయం

ఏమిటంటే, విశ్వసనీయమైనట్టి బలోపేతమైనట్టి పురోగామివర్గంపై ఆధారపడి, పాలక పార్టీ తన శ్రేణులను శుద్ధి చేసుకొనే సామర్థ్యం కలిగివుండాలి.

చాలాకాలం కిందటే మనమీ కార్యాన్ని ప్రారంభించాం. దీనిని నిలకడగానూ విసుగులేకుండానూ సాగించుతూనే వుండాలి. యుద్ధంలోకి కమ్యూనిస్టుల తరలింపు మనకు ఈ కార్యంలో సహాయపడింది: పిరికిపందలూ దగల్బాజీలూ పార్టీనుండి పలాయనం చిత్తగించారు. శని విరగడైంది! ఇందువల్ల పార్టీ సభ్యత్వం తగ్గిపోవడమంటే పార్టీ బలమూ ప్రభావమూ బ్రహ్మాండంగా అభివృద్ధి అయాయన్నమాట. శుద్ధి కార్యాన్ని మనం సాగించాలి, కాగా ఇందుకోసం ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌ల''ను ఉపయోగించాల్సి వుంటుంది: ఆరునెలలపాటు ''విప్లవాత్మక రీతిలో పని చేయడం''లో, మాటవరసకు ''పరీక్షా కాలం,'' లేదా ''అర్హత కాలం'' ముగిసిన తరువాత మాత్రమే సభ్యులను పార్టీలోకి చేర్చుకొనడానికి అంగీకరించాలి. 1917 అక్టోబరు 25 తరువాత చేరినట్టీ, తాము నూటికి నూరుపాళ్లూ విశ్వసనీయులైనట్టీ, పార్టీ యెడల భక్తి కలిగినట్టీ, కమ్యూనిస్టులై వుండేందుకు సమర్థత కలిగినట్టీ వ్యక్తులమని ఒక ప్రత్యేక క్రియాకలాపం వల్లగానీ, లేదా సేవవల్లగానీ రుజువు చేసుకొననట్టీ సభ్యులు అందరూ ఇట్టి పరీక్షను పూర్తిచేసి తీరాలని వారినుండి డిమాండుచేయాలి.

అచ్చమైన కమ్యూనిస్టు క్రియాకలాపం విషయంలో నిలకడగా అంతకంతకుమరింత అధికమైన కోర్కెలను పార్టీ కోరడం ద్వారా పార్టీని శుద్ధిచేసే కార్యం రాజ్యాంగయంత్ర పరికరాన్ని మెరుగుపరచి, విప్లవాత్మక శ్రామికవర్గ పక్షపు దిశగా రైతుయొక్క అంతిమ పరివర్తనను జాంబవంతుని అంగలతో మరింత చేరువగా తీసుకువస్తుంది.

శ్రామికవర్గ నియంతృత్వం కింద రాజ్యాంగయంత్ర పరికరంయొక్క వర్గ స్వభావంపై ''కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు'' అద్భుతమైన ఉజ్వలకాంతిని ప్రసరించాయని సందర్భవశాత్తూ ఇక్కడ చెప్పవచ్చు. ''విప్లవాత్మక రీతిలో పని చేయడం'' గురించి పార్టీ కేంద్ర కమిటీ ఒక లేఖ రాస్తూంది. లక్ష, రెండు లక్షల సభ్యత్వం కలిగిన (శుద్ధి కార్యం జరిగిన తరువాత మిగిలిన సంఖ్య ఇంత వుంటుందని నేను అనుకుంటాను; ప్రస్తుతపు సభ్యత్వం ఇంతకంటె అధికం) ఒక పార్టీయొక్క కేంద్ర కమిటీ ఈ భావాన్ని ప్రకటించింది.

ట్రేడ్ యూనియన్లలో అర్గనైజుకాబడిన కార్మికులు ఈ భావాన్ని స్వీకరించారు. రష్యాలోనూ, ఉక్రైన్‌లోనూ వీరిసంఖ్య సుమారు 40 లక్షలవరకూ వుంటుంది. వీరిలో బ్రహ్మాండమైన అధికసంఖ్యాకవర్గం శ్రామికవర్గ రాజ్యాధికారానికి, శ్రామికవర్గ నియంతృత్వానికి సుముఖంగా వుంది. రెండు లక్షలు, నలభై లక్షలు: ఒక విధంగా చెప్పాలంటే ఇదీ ''పళ్లచక్రాల''నిష్పత్తి. దీని తరువాత వస్తారు లక్షోపలక్షల రైతుప్రజలు: వీరిని మూడు ప్రధాన గ్రూపులకింద విభజించవచ్చు: అన్నిటికంటె అధికసంఖ్యను కల్గినట్టీ శ్రామికవర్గా

నికి అతిసన్నిహితంగా వున్నట్టి అర్ధశ్రామికులు, లేక పేదరైతులు; తరువాతివారు మధ్య తరగతి రైతులు, ఇక ఆఖరున, సంఖ్యలో అన్నిటికంటె మిక్కిలి చిన్న గ్రూపు అయిన కులాక్‌లు, లేక గ్రామీణ బూర్జువావర్గం.

ధాన్యపు వర్తకం చేయడానికి వీలున్నంత కాలమూ, కరువు పరిస్థితులనుండి లాభం చేసుకుందుకు వీలున్నంత కాలమూ (శ్రామికవర్గ నియంతృత్వంకింద కొంతకాలం వరకూ ఇది అనివార్యమే అవుతుంది), రైతు అర్ధ-కష్టజీవిగానూ, అర్ధ-చట్టావ్యాపారిగానూ వుండి పోతాడు. చట్టావ్యాపారిగా అతడు మనకు శత్రువు, శ్రామికవర్గ రాజ్యాంగయంత్రానికి అతడు శత్రువు; ధాన్యపు వర్తకం సాగించేందుకు స్వేచ్ఛను సమర్థించే బూర్జువావర్గం యొక్క, మెన్‌షెవిక్ షేర్, సోషలిస్టు-రివల్యూషనరీ బి. చెర్నోన్‌కొవ్, వీరిద్దరినీ వీరిపర్యంతమూ వచ్చేవారినీ కలుపుకొని, వీరితో సహా బూర్జువావర్గానికి విశ్వాసపాత్రులైన గులాములయొక్క అభిప్రాయాలపైపే అతడు మొగ్గచూపుతాడు. కాని తానొక కష్టజీవిగా రైతు శ్రామిక వర్గ రాజ్యాంగయంత్రానికి మిత్రుడే, భూస్వామికీ పెట్టుబడిదారుడికీ వ్యతిరేకమైన పోరాటంలో కార్మికునికి విశ్వాసపాత్రుడైన మిత్రుడు. కష్టజీవులుగా రైతులు, వీరి అత్యధికరాశి, లక్షోపలక్ష కర్షకప్రజ, ఆర్గనైజు కాబడినట్టి లక్షోపలక్షల శ్రామికులతో ఏర్పడినట్టి శ్రామిక వర్గ అగ్రగామిదళంలో వున్న ఒకటి, రెండు లక్షల కమ్యూనిస్టుల నాయకత్వానవున్న రాజ్యాంగ "యంత్రాంగానికి" తమ అండదండల నిస్తున్నారు.

ప్రజాస్వామ్యం అనే పదంయొక్క నిజమైన అర్థంలో ఇంతకంటె ప్రజాస్వామికమైనట్టీ, కార్మిక, పీడిత ప్రజారాసులతో ఇంతకంటె దృఢతరమైన సంబంధాన్ని కలిగినట్టి రాజ్యాంగయంత్రం ప్రపంచంలో ఇంతవరకూ మనివుండలేదు.

"కమ్యూనిస్టు సుబ్బోత్నిక్" అనే పదం తెలియజేస్తూన్నట్టే, ఈ సుబ్బోత్నిక్‌లలో నిర్వర్తించబడుతూన్నట్టి అచ్చంగా ఈ శ్రామికవర్గ క్రియాకలాపమే శ్రామికవర్గ రాజ్యాంగ యంత్రంపట్ల రైతాంగంయొక్క సంపూర్ణ గౌరవాన్నీ ప్రేమనూ చూరగొంటూంది. ఇట్టి క్రియాకలాపమే, కేవలం ఇట్టి క్రియాకలాపం ఒక్కటే, మనం చేపట్టిన మార్గం సరైనదనీ, కమ్యూనిజం సరైనదనీ అతనిని ఒప్పించగల్గి, మనయందు భక్తివిశ్వాసాలు గల్గిన మిత్రునిగా చేయగల్గుతుంది, కాగా ఆహార సమస్యలో మనం ఎదుర్కొంటూన్న చిక్కులను పూర్తిగా అంతరింపజేసేందుకూ, ఆహారధాన్యపు ఉత్పత్తి, పంపకాల విషయంలో పెట్టుబడిదారీ విధానంపై కమ్యూనిజంయొక్క సంపూర్ణ విజయానికీ, కమ్యూనిజాన్ని నిర్ద్వంద్వంగా దృఢపరచేందుకూ దారితీస్తుంది.

జూన్ 28, 1919.

# రాజ్యాంగయంత్రం

## స్వెర్డ్లోవ్ విశ్వవిద్యాలయంలో 1919 జూలై 11 తేదీన చేసిన ఉపన్యాసం

కామ్రేడ్స్! మీరు వేసుకుని నాకు తెలియజేసిన ప్రణాళిక ప్రకారం నేటి ప్రసంగం రాజ్యాంగయంత్రం గురించి. ఈ విషయం గురించి మీకిదివరకే యేమాత్రం పరిచయంవుందో నాకు తెలియదు. మీ పాఠాలు యిప్పుడే మొదలైయాయనీ యీ విషయాన్ని వ్యవస్థాత్మకంగా అధ్యయనం చెయ్యడం మీకు యిదే మొదటి పర్యాయమనీ నా భోగట్టా. ఇది నిజమే అయితే యీ మొదటి ఉపన్యాసంలోనే శ్రోతలకందరికీ జటిలమైన యీ విషయాన్ని చెప్పవలసినంత స్పష్టంగానూ సుబోధకంగానూ చెప్పడంలో నేను కృతకృత్యుడను కాకపోవచ్చు. నిజంగా నేను కృతకృత్యుడను కాకపోయిన పక్షంలో యీ కారణంవల్ల మీరేమీ కలవరపడవలసిన అవసరం లేదని నేను మిమ్మలిని కోరవలసి వుంటుంది. ఎందుచేతంటే రాజ్యాంగయంత్రం అనే విషయం చాలా చిక్కులతో కూడిన కఠినమైన విషయమేకాకుండా బూర్జువా పండితులూ రచయితలూ తత్వవేత్తలూ యీ విషయాన్ని తక్కిడిబిక్కిడి తారుమారు చేసినట్టు బహుశా మరే విషయాన్ని కూడా చేయలేదు. అందుచేత సంక్షిప్తమైన యీ ఉపన్యాసం వినీవినడంతోనే మొదటి పాఠంతోనే యీ విషయం స్పష్టంగా అర్థం అయిపోతుందని కూడా అనుకోకూడదు. ఈ మొదటి ఉపన్యాసాన్ని మీరు విన్నతరువాత దీనిలో మీకు అర్థంకాని భాగాలనూ స్పష్టంగా తెలియని భాగాలనూ గుర్తుపెట్టి మీకు బోధపడని విషయాలు తదుపరి అధ్యయనంవల్లనూ ఉపన్యాసాలూ ప్రసంగాలవల్లనూ ఆ భాగాలు బోధపడి విశదం అయేటందుకు రెండవసారి మూడవసారి యింకా అవసరం అయితే నాల్గవసారి కూడా వాటినిగూర్చి మీరు పర్యాలోచన చెయ్యాలి. మనం మళ్లీ మరొకసారి కలుసుకునేటందుకూ, అప్పుడు అన్ని అనుబంధ ప్రశ్నల గురించీ పరస్పరాభిప్రాయాలను తెలుసుకునేందుకూ, యింకా తేటతెల్లంకాకుండా మిగిలి పోయిన విషయాలేమైతే వుంటాయో వాటిని గురించి తెలుసుకొనేందుకూ అవకాశం కలుగుతుందని నేను ఆశిస్తున్నాను. ఇంతేకాకుండా ప్రసంగాలనీ ఉపన్యాసాలనీ వినడమేకాకుండా మార్క్స్, ఎంగెల్సులు రాసిన పుస్తకాల్లో అత్యంతముఖ్యమైన వాటిలో అధమం కొన్నింటి

నైనా చదవడంలో మీకాలాన్ని వినియోగిస్తారని కూడా నేను ఆశిస్తున్నాను. ఈ ముఖ్యమైన గ్రంథాలు సోవియట్ పార్టీ పాఠశాలా విద్యార్థులకు అందుబాటుగా వుండేందుకు వాటిపేర్ను మీ పుస్తక భాండాగారాల కేటలాగుల్లోనూ పాఠ్యగ్రంథాల్లోనూ వుంటాయనడంలో నాకేమీ సందేహం లేదు. ఈ గ్రంథాలలోని వివరణాశైలి కాఠిన్యాన్ని చూచి మీలో కొందరికి మొట్ట మొదట భయం కలిగినప్పటికీ అందుచేత మీరు నిరుత్సాహ పడకూడదనీ మొదట చదివి నప్పుడు మీకు స్పష్టంగా తెలియనిది రెండవసారి చదివినప్పుడుగాని మరొక దృక్కోణంనుండి పరీక్షించినప్పుడుగాని స్పష్టంగా తెలుస్తుందనీ మీకు నేను మళ్లీ మరొకసారి హెచ్చరించవల్సి వుంది. ఈ ప్రశ్న అసలే అనేక చిక్కులతో కూడినదైవుండగా దానికితోడు బూర్జువా పండితులూ రచయితలూ దీన్ని యింకా యెంత చిక్కు పెట్టి పారేశారంటే యీ ప్రశ్నను నిజంగా అధ్యయనంచేసి దీనిలో ప్రావీణ్యాన్ని స్వతంత్రంగా సాధింపతలచుకున్నవారు దీన్ని స్పష్టంగానూ క్షుణ్ణంగానూ అవగాహన చేసుకోవడానికి యీ ప్రశ్నను అనేక పర్యాయాలు తర్జన భర్జన చేస్తూ పునఃపునహా దాన్నే యెత్తుకుంటూ దాన్ని వివిధ దృక్కోణాలనుండి పర్యాలోచన చేయడం అవసరం అని నేను మళ్లీ మరొకసారి చెప్పవలసివుంది. ఇది రాజకీయాలన్నింటికి యెంతో మూలకందమైనట్టిన్నీ మౌలికమైనట్టిన్నీ ప్రశ్న అవడంచేతనూ ఝంఝూనిలయ విప్లవాత్మకములైనట్టి నేటి రోజుల్లోనేకాకుండా అత్యంత శాంతియుతమైన సమయాల్లోకుడా యే ఆర్థిక ప్రశ్నగాని యేరాజకీయ ప్రశ్నగాని చర్చించినప్పుడూ ప్రతీ రోజూ యే పత్రికలోనైనా సరే యీ ప్రశ్నే మీకు తటస్థపడూతుంటుంది కాబట్టిన్నీ, యీ ప్రశ్నను పదేపదే యెత్తుకోవడం చాలా సులభం అవుతుంది కూడా. రాజ్యాంగయంత్రం అంటే యేమిటి? దాని స్వభావమేమిటి? దాని విశిష్టత యెందులో వుంది? రాజ్యాంగయంత్రంయెడల పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయడానికి పోరాడుతూన్న మన పార్టీ — కమ్యూనిస్టు పార్టీ — యొక్క వైఖరి యేమిటి? — అనే యీ ప్రశ్నలని మీరు ప్రతి రోజూ యేదో ఒక సందర్భంలో యెత్తుకోవలసి వస్తూంటుంది. రకరకాల విషయాల్లోనూ అతి స్వల్ప విషయాల గురించి పాఠాలను అధ్యయనం చేస్తూన్నప్పుడూ, యెప్పుడూ అనుకోని సందర్భాల్లోనూ, ప్రత్యర్థులతో చర్చలూ వివాదాలూ సాగిస్తూన్నప్పుడూ, యీ ప్రశ్నని మీరు ఎదుర్కోవలసి వుంటుంది గనుకనూ, మీ అధ్యయన ఫలితంగానూ రాజ్యాంగయంత్రాన్ని గురించి మీరు వినే ప్రసంగాలు ఉపన్యాసాల ఫలితంగానూ యీ విషయాన్ని స్వతంత్రంగా పరిశీలించగలిగే శక్తిని మీరు అలవరచుకోడం అన్నిటికంటే ముఖ్యమైన విషయం. ఎప్పుడైతే మీరీ ప్రశ్నను గురించి స్వతంత్రంగా ఒక పర్యవసానానికి రాగలుగుతారో అప్పుడే మీ అభిప్రాయాలను మీరు స్థిరపరచుకోగలిగి యెవరి యెదుటనైనాసరే, యెటువంటి సమయంలోనైనాసరే, మీ అభిప్రాయాలను సమర్థించుకోగలుగుతారన్నమాట.

ఈ నాలుగు మాటలూ చెప్పినతరువాత అసలు ప్రశ్న గురించి, అనగా: రాజ్యాంగ యంత్రం అంటే యేమిటి? ఇది యేవిధంగా ఉద్భవించింది? పెట్టుబడిదారీవిధానాన్ని సంపూర్ణంగా కూలదొయ్యడానికి పోరాడుతూన్నట్టి కార్మిక వర్గ పార్టీ — కమ్యూనిస్టు పార్టీ — యీ రాజ్యాంగయంత్రంయెడల మౌలికంగా యెట్టి వైఖరిని ప్రదర్శించాలి? — అనే ప్రశ్నల గురించి ప్రస్తావించడం ప్రారంభిస్తాను.

బూర్జువా విజ్ఞానశాస్త్ర తత్వశాస్త్ర ధర్మశాస్త్ర అర్థశాస్త్ర పత్రికారచనలయొక్క ప్రతినిధులు ప్రయత్నపూర్వకంగానూ అప్రయత్నంగానూ రాజ్యాంగయంత్రం అనే సమస్యను యింతగా తక్కిడిబిక్కిడి తారుమారు చేసేసినట్టు మరే యితర ప్రశ్నని కూడా తారుమారు చేయలేదని నేనిదివరకే చెప్పాను. ఈ నాటికికూడా యీ ప్రశ్నని మతవిషయక ప్రశ్నలతో తరుచు తారుమారు చేయడం జరుగుతూంది. మతసిద్ధాంతాల ప్రతినిధులేకాకుండా (వారు అలా చేస్తారని మనం అనుకోవడం సహజమే) మతదురభిమానాలయెడల తమకు పక్షపాతం లేదని చెప్పుకునేవారు సహితం రాజ్యాంగయంత్రం గురించి విశిష్ట సమస్యలని మత సమస్యలతో కలగాపులగం జేస్తారు. రాజ్యాంగయంత్రం అనేది యేదో ఒక దైవాంశసంభూతమైన విషయమనీ, ప్రకృతికి అతీతమైన విషయమనీ, యే శక్తివలన మానవాళి మనగలుగుతూందో, పురుషప్రసక్తి లేకుండా మానవాళికి కేవలం బాహ్యంనుండే యేశక్తిని కలుగజేస్తుందో, లేక కలుగజేయగలుగుతుందో, లేక ప్రసాదించుతుందో, అట్టి భగవత్కారణమైన ఒక శక్తే రాజ్యాంగ యంత్రం అని ప్రతిపాదింపబూనే ఒక సిద్ధాంతాన్ని — తరుచుగా సైద్ధాంతికంగానూ తత్వశాస్త్రరీత్యానూ ఒక దృక్పథాన్ని, ఒక తర్కాన్ని కలిగిన క్లిష్ట సిద్ధాంతాన్ని — నిర్మించడానికే వారు ప్రయత్నిస్తూంటారు. ఈ సిద్ధాంతం దోపిడీవర్గాల — పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గాల — స్వప్రయోజనాలతో యెంతగా ముడిపడిపోయిందంటే, వారి స్వప్రయోజనాలకి యెంతగా ఉపకరిస్తూందంటే, బూర్జువా ప్రతినిధివర్యులయొక్క అన్ని ఆచారవ్యవహారాల్లోనూ అభిప్రాయాల్లోనూ శాస్త్రంలోనూ యెంతలోతుగా చొచ్చుకొని పోయిందంటే, మీరు యెటువైపు తిరిగినాసరే, చివరికి మతదురభిమానాలకి మీరెన్నడైనా లోనయారా అన్న సూచననే అతి ఏహ్యపడి తిరస్కరించుతూ రాజ్యాంగయంత్రాన్ని స్థిరబుద్ధితో పరిశీలించగలమనే నమ్మకంతోవున్న మెన్‌షెవిక్‌ల, సోషలిస్టు-రివల్యూషనరీల అభిప్రాయాల్లో కూడా, యీ సిద్ధాంతంయొక్క అవశేషాలు మీకు యెదురవుతునే వుంటాయి. మరియేయితర ప్రశ్నలకంటె (అర్థశాస్త్రపు మూల సూత్రాలు మినహా) యీ ప్రశ్నే రాజ్యపరిపాలన సాగిస్తూన్న వర్గాలయొక్క స్వప్రయోజనాలపైన తీవ్రమైన ప్రభావాన్ని కలిగి వుంది కాబట్టే యీ ప్రశ్నను వారు మరింత గందరగోళపరచి చిక్కుపెట్టేశారు. ఇప్పుడు సంఘంలో కొందరు అనుభవిస్తూన్న ప్రత్యేక అధికృతలనూ ఇప్పుడు ఉనికిలోవున్న దోపిడీ విధానాన్నీ, ఇప్పుడు ఉనికి

లోవున్న పెట్టుబడిదారీవిధానాన్నీ, సమర్థించడానికి యీ రాజ్యాంగయంత్ర సిద్ధాంతం పని కొస్తుంది. కాగా యీ కారణంవల్లనే నిష్పాక్షికంగా అందరూ యీ ప్రశ్నను ఆలోచించుతారని అనుకోవడమూ, తాము శాస్త్రజ్ఞులమని వాదించేవారు మనకి తప్పకుండా యీ విషయంపైన కేవలం శాస్త్రోక్తమైన అభిప్రాయాన్ని యివ్వగలుగుతారని మనం ఆశించడము కూడా, ఒక గొప్ప పొరపాటే అవుతుంది. రాజ్యాంగయంత్రం గురించిన ప్రశ్నలో, రాజ్యాంగయంత్రం గురించిన సిద్ధాంతంలో, రాజ్యాంగయంత్రం గురించిన సూత్రంలో — మీరు యీ ప్రశ్నని బాగా తెలుసుకొని దానిని కొంతవరకూ లోతుగా తరిచి చూచినతరువాత — వివిధ వర్గాల మధ్య వున్న పరస్పర పోరాటం — యీ రాజ్యాంగయంత్రం గురించి వుండే అభిప్రాయ వైరుధ్యాల్లోనూ రాజ్యాంగయంత్రంయొక్క పాత్రనీ దానియొక్క అంతరార్థాన్నీ అంచనా వేయడంలోనూ ద్యోతకమౌతూనో లేక ప్రతిబింబిస్తూనో వున్న సంఘర్షణ ఒకటి — మీకు తప్పకుండా కనపడుతుంది.

ఈ ప్రశ్నని మనం వీలైనంత శాస్త్రోక్తంగా సమీపించడానికి రాజ్యాంగయంత్రం ఉద్భవంయొక్కా, అభివృద్ధియొక్కా చరిత్రను అధమం అతిస్థూలంగానైనా మనం గమనించవలసి వుంటుంది. సాంఘిక శాస్త్రానికి సంబంధించిన ప్రశ్నలో అత్యంత విశ్వసనీయమైన విషయమూ, యీ ప్రశ్నను సమీపించడంలో తండోపతండాలుగా వున్న వివరాలలో పడిపోయో, లేక పరస్పరవిరుద్ధంగా వున్నట్టి అభిప్రాయ వైవిధ్య పరంపరలో పడిపోయో దారితప్పిపోకుండా, సరిగ్గా సమీపించే అలవాటు చేసుకోవడంలో అత్యంత అవసరమైన విషయమూ, యీ ప్రశ్నను శాస్త్రోక్తంగా సమీపించడానికి అతిముఖ్యమైన విషయమూ ఏమిటంటే: దీనికి ఆధారమైన చారిత్రాత్మక సంబంధాన్ని మర్చిపోకుండా వుండడమూ, ఫలానా సంఘటన చరిత్రలో ఏలా ఉత్పన్నం అయినదీ, తన అభివృద్ధిలో యీ సంఘటన ఏ యే మౌలికావస్థలను అనుభవించినదీ అనే దృక్స్థానంనుండి ప్రతి ప్రశ్ననూ పరిశీలించడమూ, ఆ ఫలానా విషయం నేడు ఏమి అయినదీ దాని అభివృద్ధి దృక్స్థానంనుండి పరిశీలించడమూ.

రాజ్యాంగయంత్రం గురించిన ప్రశ్న సందర్భంలో ఎంగెల్స్ రచించిన ''కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుపూర్వోత్తరాలు'' అనే గ్రంథాన్ని మీరు చదువుతారని నేను ఆశిస్తున్నాను. ఆధునిక సోషలిజం రచించిన మౌలికమైన గ్రంథాల్లో యీ గ్రంథం ఒకటి. ఈ గ్రంథంలో వున్న ప్రతీవాక్యమూ కూడా ఆదేదో ఆషామాషీగా చెప్పడంకాకుండా ఆఖండమైన చారిత్రక రాజకీయ అంశాలని ఆధారంగా చేసుకుని రాయబడిందనే నమ్మికతో ప్రమాణవాక్యంగా మనం ధైర్యంతో అంగీకరించవచ్చు. ఈ గ్రంథలో అన్ని భాగాలూ కూడా సమాన విధంగా సుబోధకంగానూ సులభగ్రాహ్యంగానూ విశదీకరింపబడలేదనడంలో యెట్టి సందేహమూ లేదు. చరిత్రలోనూ అర్థశాస్త్రంలోనూ పాఠకుడికి యిదివరకే కొంత ప్రవేశం

వుందనే ఊహమీద కొన్ని భాగాలు రాయబడ్డాయి. అయినా యీ గ్రంథాన్ని మొట్టమొదటి పర్యాయం చదివేటప్పుడే మీకు అర్థంకాని యెడల దాని గురించి మీరు కంగారు పడనవసరం లేదని కూడా మళ్లీ మరొకసారి మిమ్మలిని హెచ్చరిస్తున్నాను. ఈ గ్రంథం ఎవరికోగాని తొలిసారి చదివినవెంటనే బోధపడదు. ఈ గ్రంథంమీద మీకు ఆసక్తి కుదిరి మళ్లీ మరొక సారి చదివారంటే గ్రంథం అంతా కాకపోయినా చాలా భాగాన్ని మీరు అర్థంచేసుకో గలుగు తారు. ఈ ప్రశ్నను సమీపించడంలో నేను యిదివరకు సూచించిన సరియైన దృక్పథాన్ని యీ గ్రంథం ప్రదర్శిస్తూండడం హేతువునే నేను యీ గ్రంథాన్ని పేర్కొంటున్నాను. రాజ్యాంగ యంత్రంయొక్క ఉద్భవాన్ని గురించి చారిత్రాత్మకమైన సంక్షిప్తవృత్తాంతంతో యీ గ్రంథం ఆరంభం అవుతుంది.

ఇతర ప్రశ్నలన్నింటి లాగేనే, ఉదాహరణకి: పెట్టుబడిదారీవిధానంయొక్క పుట్టుకా, మనిషిని మనిషి దోపిడీచేసే పద్ధతీ, సోషలిజమూ, సోషలిజం యేవిధంగా ఉద్భవించిందీ, యేకారణాలవల్ల అది ఉద్భవించిందీ — అనే ప్రతీ ప్రశ్ననీ కూడా సరిగ్గా సమీపించేందుకూ — ఈ ప్రశ్నయొక్క మొత్తం అభివృద్ధి చరిత్రనంతటినీ సింహావలోకనం చేస్తేనే ఈ ప్రశ్నని మనం చక్కగానూ ధైర్యంగానూ యెదుర్కొనగలుగుతాం. ఈ ప్రశ్న సందర్భంలో రాజ్యాంగ యంత్రం ఆదినుండీ వున్నటువంటిది కాదు అనే విషయాన్ని మొట్టమొదట మనం గ్రహించ వలసి వుంది. రాజ్యాంగయంత్రం అంటూ లేని కాలం ఒకటి వుండేది. సమాజంలో వర్గ విభజన యెప్పుడైతే యెక్కడైతే కనబడుతుందో, దోపిడీచేసేవారూ దోపిడీచేయబడ్డవారు ఎప్పుడైతే కనబడతారో, అప్పుడల్లా యీ రాజ్యాంగయంత్రం కనబడుతూనే వుంటుంది.

మనిషిని మనిషి దోపిడీచేయడంయొక్క మొదటి రూపం, వర్గములు — బానిసయజ మానులు, బానిసలు — అనే విభజనయొక్క మొదటి రూపం తలయెత్తక పూర్వం పితృ స్వామిక కుటుంబం వుంటూండేది. దీనినే గణము అని కూడా అంటూండేవారు (గణం అంటే, ఒక తెగ, ఒక బంధుత్వమూ యేర్పడిన కాలంలో, తెగల ప్రకారమూ బంధుత్వము ప్రకారమూ జీవించే సమిష్టి జీవనము). నాగరికతలో అట్టడుగు జాతుల జీవనంలో యీ పురాతన కాలంయొక్క స్పష్టమైన అవశేషాలు యీ నాటికి కూడా నిల్చివున్నాయి. పురాతన సంస్కృతిని గురించి రాసిన యేగ్రంథాన్ని మీరు తీసి చూసినాసరే సమాజంలో బానిస యజమానులు, బానిసలు అనే విభజన యింకా యేర్పడని ఆదిమ కమ్యూనిజాన్ని యించుమిం చుగా పోలినట్టి కాలం ఒకటి వుండేది అనే వాస్తవాంశంయొక్క యించుమించు స్పష్టమైన వర్ణనలు, సూచనలు, స్మరణలు, ఆ గ్రంథంలో మీకు తప్పకుండా తటస్థపడుతూనే వుంటాయి. కాగా ఆ కాలంలో రాజ్యాంగయంత్రం యింకా ఆవిర్భవించలేదు. ఒక క్రమపద్ధతి ప్రకారం బలాన్ని ప్రయోగించడానికీ బలప్రయోగంవల్ల ప్రజలని లోబర్చుకోవడానికి ఒక ప్రత్యేక

యంత్రం అప్పటికి యింకా యేర్పడలేదు. ఇటువంటి యంత్రానికే రాజ్యాంగయంత్రం అని పేరు.

ఆదిమ మానవ సమాజంలో మనుష్యులింకా చిన్నచిన్న కుటుంబపు గుంపులలో జీవిస్తూ యించుమించుగా అడవిమనుష్యుల స్థితిలోనే వుంటూ, అభివృద్ధిలో యింకా అట్టడుగు స్థాయిలోనే వుంటూండే కాలంలో — ఆ కాలానికీ ఆధునిక నాగరిక మానవసమాజ కాలానికీ మధ్య యెన్నో వేల సంవత్సరాలున్నాయన్నమాట — రాజ్యాంగయంత్రం నెలకొల్పబడినట్టు యింకా అప్పటికి సూచనలైనా లేవు. ఆచారంయొక్క ప్రాబల్యమూ, కులపెద్దలకుండే అధికార గౌరవశక్తులూ, యివే మనకి కనపడుతూంటాయి. స్త్రీలకి కూడా అప్పుడప్పుడు యీ అధికారం వుంటూండేది — అప్పటి రోజుల్లో స్త్రీల స్థితి యీనాడుండే అధోగతి దురవస్థ కాదు. కాని యితరులను పాలించేందుకూ, కేవలం ఈ పరిపాలనకోసమే యితరుల చిత్తాలని బలప్రయోగంవల్ల లోబర్చుకొనేందుకూ, నేడు అమలులో వుంటూ మీకందరికీ బాగా తెలిసినట్టి సాయుధసైనికదళాలు, కారాగృహాలు మొదలైన సాధనాలను చిహ్నంగా గలిగిన బలప్రయోగపు యంత్రాంగాన్ని వ్యవస్థాత్మకంగానూ శాశ్వతంగానూ తమ చేతుల్లోనే వుంచుకొనేందుకూ, కేటాయించబడినట్టి ఒక ప్రత్యేక వర్గానికి చెందిన వ్యక్తులున్నట్టు — యేదైతే రాజ్యాంగయంత్రంయొక్క సారాన్ని లక్షణాలుగా కలిగి వుంటుందో అట్టి వ్యవస్థ వున్నట్టు — ఆ రోజుల్లో మాత్రం మనకెక్కడా కనబడదు.

బూర్జువా పండితులచేత డాంబికంగా ''మతము'' అని నామకరణం చేయబడిన బోధనలనుండీ, చమత్కారాలనుండీ, తత్త్వశాస్త్రజ్ఞుల సిద్ధాంతరాద్ధాంతాలనుండీ, వారిచే ప్రతిపాదింపబడిన అభిప్రాయాలనుండీ, మనం తప్పించుకుని బైటపడి వాటిని ఒక వైపు నెట్టివేసి విషయంయొక్క అసలు సారాంశాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించే యెడల మానవ సమాజంనుండి కేవలమూ పరిపాలన చేయడానికే ప్రత్యేకించబడిన యంత్రాంగమే యీ రాజ్యాంగయంత్రం అనే విషయం మనం స్పష్టంగా తెలుసుకో గలుగుతాం. మరియే యితర కార్యాన్నీ నిర్వర్తించకుండా ఒకేఒక్క పరిపాలనా కార్యంలోనే నిమగ్నులైన ఒక ప్రత్యేకపు వ్యక్తుల కూటమి యెప్పుడైతే ఆవిర్భవిస్తుందో, పరిపాలన చేయడానికిగాను కారాగృహాలూ ప్రత్యేకపు దళాలూ సైన్యాలూ మొదలైన వాటిద్వారా బలప్రయోగంవల్ల యితరుల చిత్తాలని లోబర్చుకోవడానికి ఇట్టిప్రత్యేకపు వ్యక్తుల కూటమికి ఒక ప్రత్యేకపు యంత్రం ఎప్పుడు అవసర మవుతుందో, అప్పుడే రాజ్యాంగయంత్రం ఉద్భవిస్తుంది.

రాజ్యాంగయంత్రం అంటూ లేకుండానే ఆచారసాంప్రదాయాల బలంవల్లనో లేక కులపెద్దలకూ స్త్రీలకూ — ఆ రోజుల్లో స్త్రీలకు పురుషులతో సమాన హోదా, తరుచుగా హెచ్చైన హోదా కూడా వుంటూండేది — వుండే అధికార గౌరవాలవల్లనో, సాధారణ సంబం

ధాలు, మానవ సమాజమూ క్రమశిక్షణ, కార్యకలాపాల నిర్వహణ, పరిరక్షింపబడుతూండే కాలం, పరిపాలన నిర్వహణలో ప్రవీణులైనట్టి ప్రత్యేక వర్గమువారు ఇంకా ఏర్పడలేదు. సమాజంలో వర్గభేదం — యితరుల శ్రమని స్థిరంగా యెల్లకాలమూ తామే భుక్తం చేసుకోగలిగే టట్టినీ కొందరి ప్రజలను దోచుకొనగలిగేటట్టినీ వ్యక్తుల గ్రూపుల సమాజంలో విభజన — యేర్పడుతుందో, అప్పుడే ప్రజలని బలాత్కారంగా నిర్బంధం చేయడానికి ఒక ప్రత్యేకమైన యంత్రాంగం ఆవిర్భవించిందని చరిత్ర తెలుపుతూంది.

ఈ సమాజ వర్గవిభజనను చరిత్రలో జరిగిన ఒక ప్రధానాంశంగా యెల్లప్పుడూ పరిగణించవలసి వుంటుంది. వేలాది సంవత్సరాలనుంచి, ఎట్టి మినహాయింపు లేకుండా అన్ని దేశాల్లోనూ జరుగుతూన్న అన్ని మానవ సమాజాల అభివృద్ధి ఒక సాధారణ నియమానుసరణనూ, ఒక క్రమాన్నీ, ఒక సుసంగతాన్నీ ఈ అభివృద్ధిలో మనకు బహిర్గతం చేస్తూంది; ఈ విధంగా మొట్టమొదట వర్గాలు లేని సమాజం — ప్రభువులు లేని తొలి పితృస్వామిక, ఆదిమ సమాజం — మనకు ఉండెను; తర్వాత బానిసత్వం మీద ఆధారపడినట్టి సమాజం — మనకు ఉండెను. ఆధునిక నాగరిక ఐరోపాఖండం అంతా కూడా యీ దశను అనుభవించింది — రెండువేల సంవత్సరాలక్రితం బానిసవ్యవస్థ ఏకఛత్రాధిపత్యాన్ని వహించి పరిపాలించింది. ప్రపంచంలో యితర భాగాల్లో వున్న ప్రజల్లో బహుళసంఖ్యాకవర్గం కూడా యీ దశను అనుభవించింది. కొన్ని వెనకబడిన జాతుల్లో బానిసత్వపు అవశేషాలు నేటికి కూడా నిల్చి వున్నాయి. ఉదాహరణకి యీనాడుకూడా ఆఫ్రికాలో బానిసవ్యవస్థాసంస్థలు కొనసాగుతూనే వున్నాయి. మొట్టమొదట జరిగిన వర్గవిభజనలలో బానిసయజమానులూ బానిసలూ అనేది ప్రధానమైనది. మొదటి వర్గంవారు అన్ని ఉత్పత్తి సాధనాలనీ — భూమినీ దానితోపాటు పరికరాలనూ ఆ కాలంలో అవి యెంత ఆదిమ దశలో వున్నప్పటికీ కూడా — తమ సొంతానికి కలిగి వుండడమే కాకుండా, ప్రజలనే సొంత ఆస్తికింద కలిగి వుండేవారు. వీరు బానిసయజమానులనీ, యితరులకోసం శ్రమపడుతూ యితరులకు తమ శ్రమను సరఫరా చేసేవారు బానిసలనీ, పిలవబడుతూండేవారు.

చరిత్రక్రమంలో యీ రూపం తరవాత ఫ్యూడలిజం అనే మరొక రూపం వచ్చింది. ప్రపంచంలోవున్న దేశాలన్నిటిలో చాలా దేశాలలో బానిసవిధానం, తన అభివృద్ధిలో, భూదాస్యవిధానంకింద మార్పు చెందింది. ఈ దశలో, ఫ్యూడల్ భూస్వాములనీ రైతుభూదాసులనీ, సమాజంలో మౌలికమైన విభజన ఒకటి యేర్పడింది. ప్రజల మధ్య వుండే సంబంధాల స్వరూపం కూడా మార్పు చెందింది. బానిసయజమానులు బానిసలని తమ సొంత ఆస్తిగా పరిగణించేవారు. ధర్మశాస్త్రం కూడా యీ అభిప్రాయాన్నే స్థిరపరచి, బానిసపై సంపూర్ణహక్కును కలిగియున్న బానిసయజమానియొక్క సొంత చరాస్తిగా బానిసను పరిగణించింది. రైతు

బానిసకు సంబంధించినంతవరకు మాత్రం, వర్గదాస్యమూ వర్గపరాధీనతా యెప్పటిలాగే వుండి పోయినప్పటికీ రైతులు ఫ్యూడల్ భూస్వామియొక్క సొంత చరాస్తులకింద పరిగణింపబడక రైతులయొక్క శ్రమను భూస్వామి అనుభవించడానికీ, వారిచేత నిర్బంధంగా కొన్ని సేవలను చేయించుకోడానికీ, భూస్వామికి అధికారం వున్నట్టు మాత్రమే అంగీకరించబడింది. ఆచరణలో మాత్రం మీకందరకీ తెలిసినట్టే యీ వ్యవసాయ బానిస విధానం అన్నిదేశాలలోకంటే ముఖ్యంగా రష్యాలో చాలా కాలంవరకూ అత్యంత ఘోరాతిఘోరమైన రూపాలను ధరిస్తూ వుండిపోయి బానిసవిధానంకంటె యేవిధంగానూ కూడా భిన్నంగా వుండేది కాదు.

దీని తదుపరి వర్తకవాణిజ్యాలు అభివృద్ధి పొంది, ప్రపంచ మార్కెట్టు రూపొంది డబ్బు చెలామణీ అభివృద్ధి పొందడంతో భూస్వామ్యవిధానపు సమాజంలోనే పెట్టుబడిదారీ వర్గం అనే కొత్తవర్గం ఒకటి ఆవిర్భవించింది. సరకులలోనుండీ, సరకుల వినిమయంలోనుండీ, డబ్బుయొక్క శక్తి అధికం అవడంలోనుండీ, పెట్టుబడియొక్క శక్తి ఉత్పన్నం అయింది. పద్దెనిమిదవ శతాబ్దిలోనూ — సరిగ్గా చెప్పాలంటే పద్దెనిమిదవ శతాబ్ది చివరినుండి పందొమ్మిదవ శతాబ్ది అంతట్లోనూ — ప్రపంచం అంతటా విప్లవాలు సంభవించాయి. పశ్చిమ యూరప్ దేశాలన్నింటిలోనూ ఫ్యూడలిజం అంతమొందింపబడింది. అన్ని దేశాల్లోకంటె ఆలస్యంగా యిది రష్యాలో సంభవించింది. 1861 లో రష్యాలో కూడా ఒక మౌలికమైన మార్పు జరిగింది. ఫలితంగా ఒక సమాజరూపంపోయి దాని స్థానే మరొక సమాజరూపం వచ్చింది — ఫ్యూడలిజం పోయి దాని స్థానాన్ని పెట్టుబడిదారీవిధానం ఆక్రమించుకుంది. దానికింద వర్గవిభజన, దానితోపాటు భూదాస్యంయొక్క జాడలూ అవశేషాలూ మునపటిలాగే వుండిపోయినప్పటికీ, దానిలో వర్గవిభజన మౌలికంగా నూతన రూపాన్నే ధరించింది.

అన్ని పెట్టుబడిదారీ దేశాల్లోనూ వున్న పెట్టుబడిని కలిగినవారూ, భూఖామందుల మిల్లుల ఫ్యాక్టరీల సొంతదారులూ, మొత్తం ప్రజలందరి శ్రమమీదనూ అధికారాధిపత్యాన్ని వహిస్తూ ఆ యా దేశాల జనాభాలో మునుపూ అల్పసంఖ్యాకవర్గంగానే వుంటూ యిప్పటికీ కూడా అల్పసంఖ్యాకవర్గంగానే వుంటున్నారు. ఎవరైతే తమ రెక్కల కష్టాన్ని — తమ శ్రమ శక్తిని — అమ్ముకోవడంద్వారానే ఉత్పత్తి విధానంలో తమ జీవనభృతిని గడుపుకుంటూ, యేవర్గంలో అయితే అధికసంఖ్యాకవర్గమైన కూలికార్మికులుగా శ్రామికులుగా వుంటున్నారో, అట్టి శ్రామిక కోటానకోటినంతటిపైననూ అధికారాధిపత్యాలను వహిస్తూ వారిని పీడించుతూ వారిని దోచుకుంటూన్నట్టి స్వల్పాతిస్వల్ప అల్పసంఖ్యాకవర్గంగానే వుంటున్నారు. పెట్టుబడిదారీ విధానంలోకి పరివర్తనచెందడంతో వెనకటి ఫ్యూడల్ విధానపు కాలంలోనే అప్పటి కప్పుడే ఒకరినుండి ఒకరు ఐక్యతలేక చీలిపోయి అణగదొక్కబడిన రైతులు పాక్షికంగా (అధిక సంఖ్యాకవర్గం) శ్రామికులుగానూ, పాక్షికంగా (అల్పసంఖ్యాకవర్గం) తామే కార్మికులను

కిరాయి ఇచ్చి పనిలో పెట్టుకొనేటట్టి ధనిక రైతులుగానూ, గ్రామీణ బూర్జువావర్గంగానూ, మార్పుచెందారు.

మౌలికమైన యీ వాస్తవాంశాన్ని — ఆదిమ బానిసత్వపు రూపాలనుండి భూదాస్య విధానంలోకీ, అందులోంచి చిట్టచివరకి పెట్టుబడిదారీవిధానంలోకీ, సమాజంయొక్క పరివర్తనను — మీరెప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటూనే వుండాలి. ఎందుచేతనంటే మౌలికమైన యీ అంశాన్ని జ్ఞాపకం పెట్టుకోవడంవల్లనే అన్నిటికీ మూలమైన యీ మౌలిక పరిధుల్లోనే అన్ని రాజకీయ సిద్ధాంతాలనీ ఇమడ్చగలిగినప్పుడే మీరు యీ సిద్ధాంతాలను సరిగా విలువకట్టి, అవి వేటిని గురించి వివరించి చెబుతున్నాయో ఆ విషయాలను అర్థంచేసుకో గలుగుతారు. ఇంతే కాదు: మానవ చరిత్రలో మహత్తరములైన ఈ యుగాలు — బానిసయాజమాన్య, ఫ్యూడల్ పెట్టుబడిదారీ యుగాలు — ఒక్కొక్కటి పదులూ వందలూ శతాబ్దుల కాలం విస్తరించి ఒక్కొక్క యుగం వివిధములైన రాజకీయ రూపాలనూ విభిన్నములైన రాజకీయ సిద్ధాంతాలనూ అభిప్రాయాలనూ విప్లవాలనూ ప్రదర్శిస్తూంది. సమాజంలో యీ వర్గ విభజన, వర్గపరిపాలనలో కలిగిన యీ మార్పును, మార్గదర్శి అయిన యీ సూత్రాన్ని ధృడంగా పట్టుకుని, యీ దృక్కోణంనుండి ఆర్థిక రాజకీయ ఆధ్యాత్మిక మతవిషయకవగైరా, సాంఘిక సమస్యలన్నింటిని పరిశీలించే పక్షంలోనే — ఈ అత్యంత వైవిధ్యాన్ని నానావిధ వ్యత్యాసాన్ని — ముఖ్యంగా బూర్జువా పండితులు రాజకీయవేత్తలు ప్రతిపాదించిన రాజకీయ తాత్త్విక తదితర సిద్ధాంతాలకు సంబంధించిన విషయాలను — మీరు అర్థంచేసుకోగలుగుతారు.

రాజ్యాంగయంత్రాన్ని, మూలకందమైన యీ విభజన దృక్స్థానంనుండి పరీక్షించినట్టైతే, మానవసమాజం వర్గాలకింద విభజింపబడక పూర్వం — నేను వెనక చెప్పినట్టు — రాజ్యాంగయంత్రం ఆవిర్భవించి వుండేది కాదు. కాని యెప్పుడైతే వర్గాలకింద సాంఘిక విభజన పుట్టి వేరూనిందో, ఎప్పుడైతే వర్గసమాజం ప్రాదుర్భవించిందో, అప్పుడే రాజ్యాంగ యంత్రం కూడా పుట్టి వేరూని పాతుకుపోవడం మొదలుపెట్టింది. బానిసవిధానం, ఫ్యూడలిజం పెట్టుబడిదారీవిధానం, యీ దశలను పూర్తిచేసినట్టిన్నీ, యింకా యీ దశలగుండా సాగుతూన్నట్టిన్నీ, వందలాది దేశాలగురించి మానవచరిత్ర తెలుపుతూంది. ఈ దేశాల్లో ప్రతి ఒక్క దేశంలోనూ చారిత్రాత్మకమైన మార్పులు యెంత విపరీతంగా జరిగినప్పటికిన్నీ, బానిసవిధానంనుండి ఫ్యూడలిజంలోకి అందులోనుండి పెట్టుబడిదారీవిధానంలోకి, అందులోనుండి ప్రస్తుతం ప్రపంచం అంతటా సర్వవ్యాపితంగా పెట్టుబడిదారీవిధానానికి వ్యతిరేకంగా సాగుతూన్న పోరాటానికి మారినప్పుడు, మానవాభివృద్ధికి సంబంధించిన యెన్ని రాజకీయ అవస్థాంతరాలు యెన్ని విప్లవాలు జరిగినప్పటికిన్నీ, వీటన్నిటిలోనూ రాజ్యాంగయంత్రంయొక్క ఆవిర్భావం మీకు స్పష్టంగా గోచరించుతూనే వుంటుంది. అదెప్పుడూ కూడా సమాజంలో

నుండి వేరుగా కేటాయింపబడినట్టిన్నీ పరిపాలనా కార్యంలో పూర్తిగానో, లేక యించుమించు పూర్తిగానో, లేక ప్రధానంగానో నిమగ్నులైనట్టి వ్యక్తులబృందంతో కూడినట్టిన్నీ, ఒక ప్రత్యేక యంత్రంగానే వుంటూ వచ్చింది. ప్రజలందరూ కూడా ఒక వైపున పాలితులకిందనూ, రెండవవైపున సమాజంలోనుండి పైకిలేచి పాలించడంలో నిపుణులైన పాలకులు అని, రాజ్యాంగ యంత్రానికి ప్రతినిధులు అని, పేరుమోసినవారికిందనూ విభజింపబడుతున్నారు. ఈ యంత్రం — తమలో కడమవారిని పరిపాలించే వ్యక్తులబృందం — నిర్బంధాన్ని ఉపయోగింపగలిగేటట్టిన్నీ పచ్చిబలాన్ని ప్రయోగింపగలిగేటట్టిన్నీ ఉపకరణాన్ని — ప్రజలమీద యీ బలాత్కారం యేరూపాన్ని ధరిస్తూందీ అన్న ప్రసక్తి లేకుండానే — కేవలం దుడ్డుకర్రనే కానీయండి, లేదా బానిసశకంలో మరింత బాగా పరిణతి చెందిన వివిధ రకాల ఆయుధాలనే కానీయండి, లేదా మధ్యయుగాలలో బయలుదేరిన మందుగుండు పేల్చే ఆయుధాలనే కానీయండి, లేదా చిట్టచివరకి ఇరవైయ్యో శతాబ్దిలో సాంకేతిక నైపుణ్యశక్తిలోని అత్యద్భుతాలున్నూ, ఆధునిక సాంకేతికశాస్త్రంయొక్క వినూతన విజయాల ననుసరించి నిర్మింపబడినట్టిన్నీ, అధునాతన ఆయుధాలనే కానీయండి — తన అధీనం చేసుకుంటుంది. బలప్రయోగ విధానాలు మారాయి, కాని రజ్యాంగయంత్రం అంటూ ఒకటి వున్నప్పుడల్లా మాత్రము ప్రతి మానవ సమాజం లోనూ, యితరులని పరిపాలించేటటువంటిన్నీ, యితరులమీద అధికారాన్ని చలాయించేటటు వంటిన్నీ, యితరులమీద ప్రభావాన్ని కలిగినటువంటిన్నీ, తమ శక్తిని నిలబెట్టుకోవడానికిగాను పచ్చిబలాన్ని ప్రయోగించే ఉపకరణాన్ని, దౌర్జన్యాన్ని ఉపయోగించగలిగే ఉపకరణాన్ని, ఆ ఫలానా శకంలో సాధించిన సాంకేతిక నైపుణ్యస్థాయి ననుసరించి తయారు చేయబడిన ఆయుధాలని తమ హస్తగతం చేసుకున్న వ్యక్తులబృందం ఒకటి యెప్పుడూ వుంటూనే వచ్చింది. కాగా యిట్టి సాధారణ సంఘటనలను పరిశీలన చేయడంవల్లనే, వర్గాలు లేనప్పుడు, దోపిడీచేసే వారూ దోపిడీచేయబడ్డవారూ లేనప్పుడు, రాజ్యాంగయంత్రం యెందుకు లేకపోయింది, వర్గాలు పుట్టేటప్పటికల్లా రాజ్యాంగయంత్రం యెందుకు పుట్టాలి, అనే ప్రశ్నలని మనంతట మనమే వేసుకోవడంవల్లనే — ఒక్క యీ మార్గంవల్లనే, రాజ్యాంగయంత్రంయొక్క సారాంశమూ అంతరార్థమూ యేమిటి, అనే ప్రశ్నకి మనం సమాధానం తెలుసుకోగలుగుతాం.

ఒక వర్గంమీద మరొక వర్గం చేసే పరిపాలనని నిలబెట్టుకోవడానికి ఉపయోగించే యంత్రమే రాజ్యాంగయంత్రం. మానవ సమాజంలో యింకా వర్గాలు యేర్పడని శకంలోనూ బానిసయుగం యింకా ఆరంభంకాకముందూ, ఆదిమ సమాజ పరిస్థితుల్లో వుండి ఇంచు మించు సమాన హక్కులతోనే వున్న ప్రజలయొక్క శ్రమ ఉత్పాదకశక్తి యింకా అతి తక్కువ స్థాయిలోనే వున్న పరిస్థితులలోనూ, అతి మొరటైన అనాగరిక జీవనాన్ని గడపడానికైనా చాలీచాలనంతమేరకే ఆదిమ మానవుడు ఉత్పత్తిని చేయగలిగే స్థితిలో వుండి ప్రజలందరూ

కాయకష్టం చేసినప్పుడూ — సమాజంలోనున్న మిగతా ప్రజలమీద తమ ప్రభావాన్ని చూపించి వారిమీద పాలనాధికారాన్ని చలాయించడానికి ప్రత్యేక వ్యక్తుల బృందం ఒకటి సమాజంలో నుండి వేరుపడియింకా పైకి రాలేదు సరేకదా, రావడానికి తగిన అవకాశాలు కూడా యేర్పడ లేదు. ఎప్పుడైతే మొట్టమొదటి రూపంలో సమాజంలో వర్గవిభజన యేర్పడిందో, యెప్పుడైతే బానిసవిధానం తలయెత్తిందో, యెప్పుడైతే వ్యవసాయక్రమయొక్క అతిమోటైన రూపాలను సాంద్రీకరించడంవల్ల ఒక ప్రత్యేక వర్గానికి చెందినవారు కొంత అదనపు ఉత్పత్తి చేయగలిగారో, యెప్పుడైతే బానిసయొక్క నికృష్టజీవనానికి అదనపు ఉత్పత్తి తప్పనిసరిగా అవసరం లేకపోయిన కారణంగా బానిసయజమానికి హస్తగతం అయేదో, యీ ప్రకారంగా యెప్పుడైతే బానిసయజమానుల వర్గం యేర్పడి వేళ్లాని ధృడంగా పాతుకుని పోయిందో — అప్పుడే, యీ వర్గం వేళ్లాని ధృడంగా పాతుకుని పోవడానికే, రాజ్యాంగయంత్రం ఆవిర్భవించి తీరవలసిన అవసరం కలిగింది.

ఆ ప్రకారమే అది ఆవిర్భవించి తీరింది కుడానూ — బానిసస్వామ్య రాజ్యాంగయంత్రం, బానిసయజమానులకు శక్తినిచ్చి, బానిసలపై పరిపాలనచేసే అధికారాన్ని యిచ్చినట్టి యంత్రం, అవతరించింది. వెనకటి రోజుల్లో సమాజమూ, రాజ్యాంగయంత్రమూ, యీ రెండూ కూడా యిప్పటికంటె చాలా చిన్నవిగానే వుంటూండేవి. రవాణారాకపోకల బందోబస్తులు బహుస్వల్పంగా వుండేవి — యిప్పటి అధునాతనమైన రవాణా యేర్పాట్లు అప్పుడుండేవి కావు. పర్వతాలు నదులు సముద్రాలు యిప్పటికంటె అప్పుడు మరింత దుర్ఘటమైన ఆటంకాలుగా వుండేవి. ఈ హేతువును అప్పటి రాజ్యాలు భౌగోళికంగా చాలా తక్కువ పరిధుల్లోనే యేర్పడి చాలా చిన్నవిగా వుంటూండేవి. ఇరుకైన ఎల్లలమధ్యనే యేర్పడి చాలా తక్కువ వైశాల్యంగల కార్యరంగాన్నే కలిగిన రాజ్యానికి సాంకేతికశాస్త్ర దృష్ట్యా చాల దుర్బలమైన రాజ్యాంగయంత్రమే వుంటూండేది. అయినప్పటికీ బానిసలను బానిసశృంఖలాల్లోనే నిర్బంధించి వుంచుతూ సమాజంలో వున్న ఒక భాగం రెండో భాగాన్ని వశపరచుకొని దానిని పీడించుతూ వుండేటట్టి ఒక యంత్రం వుంటూనే వచ్చింది. సమాజంలో వుండే అత్యధిక భాగాన్ని, సమాజంలో వుండే రెండో భాగం యొక్క స్వప్రయోజనాలకోసం యథావిధిగా నిర్బంధంగా పనిచేయించుకోవాలంటే, బలప్రయోగం చేయగలిగే యంత్రం ఒకటి శాశ్వతంగా వుండితీరాలి. వర్గాలు యేర్పడనంతవరకు యిలాంటి యంత్రమూ యేర్పడనే లేదు. ఎప్పుడైతే వర్గాలు తలలెత్తాయో, యెప్పుడైతే యీ వర్గవిభజన మరింత లోతుకు చొచ్చుకునిపోయి వేళ్లతన్ని పాతుకుపోయిందో, అటువంటి చోట్ల సర్వత్రా యెల్లప్పుడూ రాజ్యాంగయంత్రం అంటూ ఒక ప్రత్యేక రాజ్యపాలనా యంత్రాంగం తలయెత్తుతూ వచ్చింది. ఈ రాజ్యాంగయంత్రం రకరకాల రూపాలను ధరించింది. బానిస యుగంలో ఆ కాలపు ప్రమాణాలదృష్ట్యా అత్యంత అభివృద్ధి, నాగరికత, సంస్కృతి కలిగిన

దేశాల్లో — ఉదాహరణకు బానిసవిధానంమీదే సంపూర్ణంగా ఆధారపడినట్టి పురాతన గ్రీసు, రోము దేశాల్లో — అప్పటికే రకరకాల రూపాల్లో రాజ్యాంగయంత్రం ప్రబలి వుంటూండేది. ఆ కాలంలో రాచరికానికీ రిపబ్లిక్ [ప్రజాసత్తాకానికీ] మధ్య వుండే తేడా, ప్రభువర్గపాలనకూ డెమోక్రసీకి [ప్రజాస్వామికానికి] మధ్యవుండే తేడా అప్పుడే తలయెత్తడం ఆరంభించింది. రాచరికం అంటే, ఒకేఒక్క వ్యక్తియొక్క అధికారమూ, ప్రజాసత్తాకం అంటే, ఎన్నుకొన బడని రాజ్యాధికారశక్తి యేదీ కూడా లేకపోవడమూ, అన్నమాట. ప్రభువర్గపాలనం అంటే మొత్తంమీద కొద్దిపాటి అల్పసంఖ్యాకవర్గపు అధికారమూ, ప్రజాస్వామికం అంటే ప్రజాధి కారమూ, అన్నమాట (డెమోక్రసి అన్న గ్రీకుపదానికి అక్షరశః అర్థం ప్రజలయొక్క అధి కారం). ఈ భేదాలన్నీ కూడా బానిస శకంలో పొడచూపాయి. ఈ భేదాలున్నప్పటికీ కూడా అప్పటి రాజ్యాంగయంత్రం రాచరికం కానీయండి ప్రజాసత్తాకమే కానీయండి ప్రభువర్గపాలి తమే కానీయండి ప్రజాస్వామ్యపాలితమే కానీయండి — యేదైనప్పటికీ కూడా బానిసస్వామ్య శకంలోని రాజ్యాంగయంత్రం బానిసస్వామ్య రాజ్యాంగయంత్రంగానే వుండేది.

పురాతనయుగ చరిత్ర అధ్యయనం చేసేటప్పుడు యీ విషయాన్ని గురించి మీరు వినే ప్రతిప్రసంగంలోనూ, రాచరికప్రభుత్వాల మధ్యనూ ప్రజాసత్తాక ప్రభుత్వాల మధ్యనూ జరిగిన పోరాటాలను గురించి మీరు వింటూంటారు. అయితే బానిసలు మనుష్య మాత్రులతో సమానంగా పరిగణింపబడేవారు కారని — పౌరసత్వపు హక్కులున్న ప్రజల్లాగ పరిగణింప బడకపోవడం అటుండగా, అసలు మనుష్య మాత్రుల్లాగ కూడా పరిగణింపబడేవారు కారన్న మౌలికమైన వాస్తవాంశాన్ని మాత్రం యీ సందర్భంలో మీరు గమనింపవలసి వుంటుంది. రోమను ధర్మశాస్త్రం వారిని గృహోపకరణములైన తట్టా బుట్టా చీపురూలాంటి చరాస్తిగానే పరిగణించింది. నరహత్య గురించిన న్యాయచట్టం అసలు బానిసలకు వర్తించేదే కాదు. వ్యక్తి పరిరక్షణను గురించిన యితర న్యాయచట్టాలమాట ఇక చెప్పనే అక్కర లేదు. బానిసయజ మానులు మాత్రమే పూర్ణస్వత్వార్హతలు కలిగినవారుగా భావింపబడడంచేత రోమను ధర్మ శాస్త్రం వీరినే పరిరక్షించేది. ఈ హేతువును రాచరికం అమలులో వున్నాసరే ప్రజా సత్తాకం ప్రవేశపెట్టబడినాసరే అది బానిసయజమానుల రాచరిక ప్రభుత్వంగానో లేక బానిసయజ మానుల ప్రజాసత్తాక ప్రభుత్వంగానో మాత్రమే వుండేది. బానిస యజమానులే అన్ని హక్కు లనీ అనుభవించుతూ వుండగా, ధర్మశాస్త్ర దృష్ట్యా బానిసలు కేవలం చరాస్తిగానే భావింప బడేవారు. కాగా బానిసమీద యెటువంటి దౌర్జన్యము జరిపినా కూడా, చివరకి బానిసను హత్య చేసినా కూడా, అది ఒక నేరంకింద లెక్కకొచ్చేదే కాదు. బానిసవిధానాన్ని అవలంబించిన ప్రజా సత్తాక రాజ్యాలు వాటివాటి ఆంతరంగిక నిర్మాణంలో ఒక దానితో ఒకటి భేదిస్తూ వుండేవి: ప్రభువర్గపాలన కలిగిన ప్రజాసత్తాకాలూ వుండేవి, ప్రజాస్వామికాన్ని కలిగిన ప్రజాసత్తా

కాలూ వుండేవి. ప్రభువర్గపాలన ప్రజాసత్తాకంలో విశేషాధికారాలను కలిగిన యేకొద్దిమంది వ్యక్తులు మాత్రమో ఎన్నికలలో పాల్గొనేవారు. ప్రజాస్వామిక ప్రజాసత్తాకంలో అందరూ ఎన్నికల్లో పాల్గొనేవారు — అందరూ అనగా బానిసలు మినహా బానిసయజమానులందరూ అన్నమాట. అన్ని యితర విషయాలకంటే మూలకందమైన యీ విషయం, రాజ్యాంగయంత్ర సమస్యని బాగా విశదీకరించి, రాజ్యాంగయంత్రంయొక్క నిజమైన స్వభావాన్ని స్పష్టంగా వ్యక్తపరుస్తుంది. కాబట్టి యీ విషయాన్ని గుర్తుంచుకోవల్సిన అవసరం యెంతైనా వుంది.

ఒక వర్గాన్ని మరొకవర్గం పీడించడానికి సాధ్యపడే యంత్రమే — ఒక వర్గంయొక్క చెప్పుచేతల్లో కడమ వర్గాలను తాబేదారులుగా అణిగి వుండేటట్టుచేసే యంత్రమే — రాజ్యాంగ యంత్రం. ఈ యంత్రానికి అనేక రూపాలున్నాయి. బానిసయజమానుల రాజ్యంలో రాచరికమూ, ప్రభువర్గపాలిత ప్రజాసత్తాకమే కాకుండా, ప్రజాస్వామ్య ప్రజాసత్తాకం కూడా వుండేది. వాస్తవానికి ప్రభుత్వ రూపాల్లో అత్యంత వైవిధ్యం వుంటూండేదే కాని, వాటి సారం యెప్పుడూ ఒక్కటిగానే వుండేది: బానిసలు యెవ్విధమైన హక్కులు లేకుండా పీడిత వర్గం కింద యేర్పడి మనుష్య మాత్రులుగానైనా పరిగణింపబడనివారుగా వుండేవారు. ఫ్యూడల్ రాజ్యాంగయంత్రంలో కూడా యిదే విధంగా వుండడం మనం చూస్తాం.

దోపిడీ రూపంలో వచ్చిన మార్పుబానిసస్వామ్య రాజ్యాంగయంత్రాన్ని ఫ్యూడల్ రాజ్యాంగ యంత్రకింద మార్చేసింది. దీనికి అపారమైన ప్రాముఖ్యత వుండెను, బానిసస్వామ్య సమాజంలో బానిసకి యెట్టి హక్కులూ లేకుండా వుంటూ మనుష్య మాత్రుడికిందైనా పరిగణింపబడే వాడు కాడు. ఫ్యూడల్ సమాజంలో రైతుబానిసని భూమికి కట్టిపడేశారు. భూమితో కూడా భూమికి ముడిపడిపోయిన ఒక భాగంగా రైతులు (ఆ రోజుల్లో ప్రజల్లో అధికసంఖ్యాకవర్గం రైతులే — పట్నవాసప్రజల సంఖ్య చాలా తక్కువగా వుండేది) పరిగణింపబడడమే భూదాస్య విధానంయొక్క ప్రధాన లక్షణం — భూదాస్య విధానంయొక్క అసలు భావమే అది. భూస్వామి చేత రైతుకి యేర్పరచబడిన పొలంమీద భూస్వామిచేత యిన్ని రోజులంటూ నిర్ణయించ బడిన రోజుల్లోనే రైతు పనిచేసుకోవడానికి వీలుండేది. కడమ రోజుల్లో రైతుబానిస తన ఖామందుకోసం పనిచేయవలసి వచ్చేది. వర్గసమాజంయొక్క అసలు సారం మార్పుచెందకుండా అలాగే వుండిపోయింది: వర్గదోపిడీమీదే సమాజం ఆధారపడి వుండేది. ఒక్క భూస్వాములకే సంపూర్ణమైన హక్కులుండేవి. రైతులకి హక్కులంటూ యేమాత్రమూ వుండేవి కావు. ఆచరణలో వారిస్థితికి, బానిసస్వామ్య రాజ్యాంగయంత్రంలో బానిసలస్థితికి, కించిత్తు కూడా వ్యత్యాసం వుండేది కాదు. ఐనప్పటికీ రైతుబానిస భూస్వామియొక్క సరాసరి ఆస్తికింద పరిగణింప బడకపోవడంచేత, రైతాంగాన్ని భూదాస్యంనుండి విముక్తి చేయడానికి సువిశాలమైన పథం ఒకటి యేర్పడింది. తన సొంత పొలంలో తన కాలంలో కొంతకాలన్నైనా వినియో

గించుకోడానికి — అంటే మాటవరసకి తనమీద తనకి కొంత స్వాధికారం లభించే — వీలు కలిగింది అతనికి. కాగా దినుసుల మార్పిడికీ, వర్తక వ్యాపార సంబంధాల అభివృద్ధికీ, అవకాశాలు హెచ్చుకావడంతో ఫ్యూడల్ విధానం క్రమేణ విచ్ఛిన్నమైపోయి రైతాంగపు విమోచనకి క్రమక్రమంగా సువిశాలమైన అవకాశం యేర్పడ సాగింది. బానిస సమాజంకంటె ఫ్యూడల్ సమాజం ఎప్పుడూ కూడా మరింత క్లిష్టభూయిష్ఠంగా వుండేది. వాణిజ్యము పరిశ్రమ మరింతగా అభివృద్ధి పొందడానికి అవకాశంవుంటూ, అప్పటికే ఆ రోజుల్లోనే యీ అవకాశం పెట్టుబడిదారీవిధానానికి దారితీసింది. మధ్యయుగాల్లో ఫ్యూడలిజంయొక్క ప్రాబల్యం హెచ్చుగా వుండేది. కాగా యిక్కడ కూడా రాజ్యాంగయంత్రంయొక్క రూపాల్లో వైవిధ్యం వుంటూ యిక్కడ కూడా రాచరికమూ ప్రజాసత్తాకమూ — ప్రజాసత్తాకంయొక్క రూపం యెంతో అస్పష్టంగా వున్నప్పటికీ కూడా — రెండు వుంటూండడం మనకి కనపడుతూంది. రెండు రూపాలూ వుంటూండినప్పటికీ ఫ్యూడల్ భూస్వామే అసలైన పరిపాలకుడుగా పరిగణింపబడేవాడు. రైతుబానిసకి యేలాంటి రాజకీయ హక్కులూ వుండేవి కావు.

బానిసవిధానం, ఫ్యూడలిజమూ, యీ రెండు విధానాల్లోనూ కూడా నిర్బంధాన్ని ప్రయోగించనిదే అత్యల్పసంఖ్యాకవర్గం ఒకటి, అత్యధికసంఖ్యాకవర్గాన్ని పాలించడానికి వీలుపడేది కాదు. పీడితవర్గాలు తమ పీడను వదలగొట్టుకోడానికి యెడతెగకుండా చేసిన ప్రయత్నాలయొక్క దృష్టాంతాలు చరిత్రనిండా అనేకం కనబడుతూనే వున్నాయి. బానిసతనంనుండి విముక్తి చెందడానికి దశాబ్దులతరబడి నడచిన యుద్ధాలగురించి బానిసవిధానపు చరిత్రలో అనేక చోట్ల ఉల్లేఖింపబడివుంది. స్పార్టకస్ అనే బానిస బానిసతిరుగుబాటుల్లోకల్లా సుమారు రెండువేల సంవత్సరాలకిందట జరిగినట్టి ఒక బృహత్తరమైన తిరుగుబాటులో పాల్గొన్న వీరాగ్రేసరుల్లో ఒకడు అవడం హేతువును జర్మను కమ్యూనిస్టులు — పెట్టుబడిదారీవిధానం మోపిన బరువును వదలించుకోడానికి నిజంగా పోరాడుతూన్న యేకైక జర్మను పార్టీ — ''స్పార్టకస్'' అనే పేరును యిప్పుడు పెట్టుకున్నారని ప్రసంగవశాత్తూ యిక్కడ చెప్పవలసి వుంది. బానిసలందరూ ఐక్యమై సాయుధులై స్పార్టకాస్ నాయకత్వన బ్రహ్మాండమైన సేనగా తయారై లేవనెత్తిన మహత్తరమైన తిరుగుబాటుతో ఢీకొని, బానిసవిధానంపైనే పూర్తిగా నిర్మించబడి అనేక సంవత్సరాలుగాపైగా సర్వశక్తివంతంగా కనపడిన రోమను సామ్రాజ్యం అనేక దెబ్బలనూ పోట్లనూ భరించవలసి వచ్చింది. చిట్టచివరకి వారు ఓడిపోయి ఖైదీలుగా పట్టుబడిపోయి బానిసయజమానుల చేతుల్లో నానా చిత్రహింసలపాలు అయిపోయారు. వర్గసమాజం పుట్టినదిమొదలు దాని చరిత్ర అంతటిలోనూ యిలాంటి అంతర్యుద్ధాలనేకం జరుగుతూనే వచ్చాయి. బానిసవిధాన శకంలో జరిగిన గొప్ప అంతర్యుద్ధాన్ని ఇప్పుడే ఉదహరించను. ఫ్యూడల్ శకమంతా నిరంతరం జరుగుతూనే వుండినట్టి రైతు తిరుగుబాట్లతో

నిండి వుంది. ఉదాహరణకింద మధ్యయుగాల్లో జర్మనీలో రెండు వర్గాలమధ్యా — భూస్వాములకీ భూదాసులకీ — జరిగిన పోరాటం పెద్దయెత్తున విస్తరించి భూస్వాములకి వ్యతిరేకంగా రైతులు లేవదీసిన ఒక అంతర్యుద్ధంకింద పరిణమించింది. ఈ విధంగానే రష్యాలో భూస్వాములకు వ్యతిరేకంగా రైతులు పదేపదే లేవదీసిన తిరుగుబాట్లయొక్క ఉదాహరణలు మీకందరకీ బాగా తెలిసినవే.

తమ పరిపాలనను నిలబెట్టుకొనే ఉద్దేశంతోనూ, తమ శక్తితాహతులను భద్రపరచుకొనే లక్ష్యంతోనూ, అపారమైన సంఖ్యలో వున్నట్టి ప్రజని తమకిందకి లొంగదీసుకుని వారినందరినీ యేకంజేసి వారిపైని కొన్ని చట్టాలనూ నిబంధనలనూ మోపడానికి వీలుగా వుండేందుకు భూస్వాములకు యంత్రాంగం ఒకటి అవసరమైంది. కాగా రైతుబానిసలపైన భూస్వాములయొక్క శక్తిని పకడ్బందీగా నిలబెట్టడమే యీ చట్టాలలో వున్నట్టి ప్రధానోద్దేశం. ఉదాహరణకు, రష్యాలోనే కానీయండి, లేక యెంతో వెనకబడి నేటికి కూడా ఫ్యూడలిజం కొనసాగుతూన్న ఆసియా దేశాల్లోనే కానీయండి, ప్రజాసత్తాకమైనాసరే రాచరికమైనాసరే — ఆ భేదం అంతా రూపంలోనే వుంది — అచ్చంగా ఇదే ఫ్యూడల్ రాజ్యాంగయంత్రం. రాజ్యాంగయంత్రం రాచరికం అయినప్పుడు ఏకైక వ్యక్తియొక్క పరిపాలనను అందరూ అంగీకరించేవారు; రాజ్యాంగయంత్రం ప్రజాసత్తాకమయినప్పుడు అందులో భూస్వామ్య సమాజంయొక్క ఎన్నికైన ప్రతినిధులు యేదో ఒక స్థాయిలో పాల్గొనడం అందరూ అంగీకరించేవారు — ఫ్యూడల్ సమాజంలో యీ విధంగా వుంటూండేది. భూమిపై స్వామ్యం గల్గిన అల్పాతి అల్పసంఖ్యాకులైన భూస్వాములు — వారికి పూర్తిగా లోబడిపోయి వున్నట్టి అత్యధికసంఖ్యాకవర్గమైన రైతుబానిసలు — యీ విధంగా రెండు వర్గాలకింద విభజనను ఫ్యూడల్ సమాజం ప్రదర్శించింది.

వర్తకవ్యాపారాల అభివృద్ధీ, సరుకుల మారకపు అభివృద్ధి, వీటి ఫలితంగా కొత్త వర్గమొకటి — పెట్టుబడిదారుల వర్గం — స్ఫుటికీకృతమైంది. మధ్యయుగాల ఆఖరి సంవత్సరాల్లో, అమెరికా కనుగొనబడిన కారణంగా ప్రపంచ వాణిజ్యవ్యాపారం అపారంగా పెరిగిన తరువాతనూ, వెండి బంగారాలు బాగా హెచ్చు అయిపోవడంతో వెండి బంగారాలే మారకపు పరికరాలుగా పరిణమించిన తరువాతనూ, డబ్బు చెలామణీ ఫలితంగా కొంతమంది వ్యక్తులకి బ్రహ్మాండమైన ఐశ్వర్యాలని పోగుచేసుకొనే అవకాశం కలిగిన తరువాతనూ, పెట్టుబడి తలయెత్తింది. ప్రపంచం అంతటా వెండి బంగారాలే ధనంగా అంగీకరించబడ్డాయి. భూస్వాముల వర్గంయొక్క ఆర్థికశక్తి క్షీణించిపోయి కొత్తగా పైకొచ్చిన వర్గంయొక్క శక్తి — పెట్టుబడియొక్క ప్రతినిధులశక్తి — అభివృద్ధి అయింది. సమాజంయొక్క పునర్నిర్మాణం యెలా జరిగిందంటే, పైకిమాత్రం పౌరులందరూ సమానంగానేవున్నట్టు కనబడ్డారు. బానిసయజ

మానులు బానిసలు అన్న పూర్వపు విభజన అదృశ్యమైపోయింది. ఎవడిదగ్గర యెంత పెట్టుబడి వున్నదీ విచక్షణ లేకుండా న్యాయం యెదుట అందరూ సమానులే అన్నారు: భూమిని పైవేటు ఆస్తిగా కలిగిన భూమందైనాసరే, తన శ్రమశక్తి తప్ప 'నా' అన్న మరేయితర ఆస్తి లేని బికారీవాడైనాసరే — న్యాయం యెదుట అందరూ సమానులే. న్యాయం అందరినీ సమానంగా రక్షిస్తుంది. కేవలం తమ శ్రమశక్తి అనే ఆస్తి తప్ప మరేయితర ఆస్తిపాస్తులూ లేక క్రమక్రమంగా దరిద్రంతో కుంగికృశించిపోతూ నాశనం అయిపోయి శ్రామికవర్గీయుల కింద దిగజారిపోయిన అలగాజనం, ఆస్తిపరుల ఆస్తిమీద పడకుండా ఆస్తిని రక్షిస్తుంది చట్టం. ఇదీ పెట్టుబడిదారీ సమాజం."

ఈ విషయాన్ని గురించి యింకా విపులీకరించి చెప్పడానికి నాకు యిప్పట్లో అవకాశం చాలదు. పార్టీయొక్క కార్యక్రమాన్ని మీరు చర్చించేటప్పుడు యీ ప్రశ్నని మీరు మళ్లీ యెత్తుకోవలసిన ఆవకాశం మీకు కలుగుతుంది — అప్పుడు పెట్టుబడిదారీ సమాజంయొక్క స్వభావాలను లక్షణాలను మీరు తెలుసుకొన గలుగుతారు. ఈ సమాజం భూదాస్య విధానంమీద — పాత ఫ్యూడల్ విధానంమీద — స్వేచ్ఛ అనే నినాదాన్ని యిస్తూ విజృంభించింది. కాని ఆస్తి వున్న వారికోసమే ఆ స్వేచ్ఛ. కాగా ఫ్యూడలిజం ధ్వంసం అయిపోయినతరువాత — యిది పద్దెనిమిదవ శతాబ్ది చివరి కాలానికీ పందొమ్మిదవ శతాబ్ది మొదటి కాలానికీ మధ్య జరిగినా — రష్యాలో మాత్రం కడమ దేశలలోకంటే ఆలస్యంగా 1861 లో జరిగింది, ఫ్యూడల్విధాన రాజ్యాంగయంత్ర స్థానాన్ని ప్రజలందరికీ స్వేచ్ఛకావాలనే నినాదాన్ని చాటుతూన్నట్టిన్నీ, యావత్తు ప్రజాభీష్టాన్నీ తాను వ్యక్తీకరిస్తున్నాని ఘంటాపథంగా చాటుతూన్నట్టిన్నీ, తాను వర్గ భేదాలున్న రాజ్యాంగయంత్రం యెంత మాత్రం కాను అని చెప్పకుంటునట్టిన్నీ, పెట్టుబడిదారి రాజ్యాంగయంత్రం ఆక్రమించింది. ఈ సందర్భంలో యావత్తు ప్రజలందరి స్వేచ్ఛకోసమూ పోరాడుతూన్న సోషలిస్టులకీ, పెట్టుబడిదారీ విధానపు రాజ్యాంగయంత్రానికీ పోరాటం — యిప్పుడు సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ స్థాపనకు దారితీసి, యావత్తు ప్రపంచానికీ విస్తరించినట్టి పోరాటం — సంభవించింది.

ప్రపంచపెట్టుబడికి వ్యతిరేకంగా యిప్పుడు లేవనెత్తిన యీ పోరాటాన్ని అర్థంచేసుకోవాలంటేనూ, పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రంయొక్క ఆంతర్యాన్ని మనం గ్రహించాలంటేనూ, ఫ్యూడల్ రాజ్యాంగయంత్రంమీదకి పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రం విజృంభించినప్పుడు అది స్వేచ్ఛా నినాదంతో రణభేరిని మోగిస్తూ సంఘర్షణలోకి దిగిందన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. ఫ్యూడలిజం అంతంకావడమూ, తత్ఫలితంగా రైతులు పరిహారాన్ని సీదాగా చెల్లించివేసుకో లేక కొంత భాగాన్ని క్విట్‌రెంటుగా చెల్లించుతూనో తాము క్రయంచేసిన భూములను తమ పూర్తి ఆస్తికింద సంపాదించుకొనడానికి అవకాశం దొరికిన

కారణంవల్లనూ, ఫ్యూడలిజం అంతమవడం పెట్టుబడిదారులకి స్వేచ్ఛను కలిగించి వారికే ఉపకరించింది. ప్రైవేటు ఆస్తిమీదనే అసలు రాజ్యాంగయంత్రం ఆధారపడి వుండడంచేత ఆస్తి యేవిధంగా సంక్రమించినాసరే ఆస్తిని రాజ్యాంగయంత్రం పరిరక్షిస్తుంది. కనుకనే దీన్ని గురించి అది యేమాత్రమూ చికాకు పడలేదు. ఆధునిక నాగరిక రాజ్యాలన్నింటిలోనూ రైతులు ప్రైవేటు ఆస్తిదారులైయారు. భూస్వామి తన భూమిలో కొంత భాగాన్ని రైతుకి దఖలు పరచినప్పుడు కూడా రాజ్యాంగయంత్రం భూస్వామికి క్రయధనం బదులుగా పరిహారాన్ని యిప్పించి అతన్ని బహూకరించుతూ ప్రైవేటు ఆస్తిని పరిరక్షిస్తూనే వచ్చింది. ప్రైవేటు ఆస్తిని సంపూర్ణంగా కాపాడి భద్రపరుస్తాను అని రాజ్యాంగయంత్రం అక్షరాల ఘంటా పథంగా చాటి, ప్రైవేటు ఆస్తికి అన్నివిధాలా వత్తాసు ఇచ్చి, దాన్ని పరిరక్షించి, దానికి దోహదం చేసింది. వర్తకుడూ, పరిశ్రమయజమానీ, ఫ్యాక్టరీ సొంతదారుడూ — వీరందరి ఆస్తిహక్కు లని రాజ్యాంగయంత్రం గుర్తించింది. ప్రైవేటు ఆస్తిమీదనూ పెట్టుబడియొక్క శక్తిబలాల మీదనూ, ఆస్తిపాస్తులంటూ లేని కార్మికులను కూలినాలిచేసుకుని బతికే రైతాంగాన్ని పూర్తిగా పీడించుకుని తినడంమీదనూ, నిర్మించబడిన యీ రాజ్యాంగయంత్రం స్వేచ్ఛాస్వాతంత్ర్యాల మీదనే తన పరిపాలన నెలకొల్పబడిందని ప్రకటించింది. ఫ్యూడలిజంతో పోరాడుతూ ఆస్తి హక్కులకు సంపూర్ణమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు వుంటాయని చాటింది. కాగా వర్గవిభేదాలు పాటించే రాజ్యాంగంయొక్క రోజులు అంతరించి పోయాయనిపైకి నటిస్తూనే, ఈ బడాయిలు ప్రకటించి మరీ విర్రవీగింది.

ఐనప్పటికీ పేదరైతాంగాన్ని కార్మికవర్గాన్ని తమకింద అణచిపెట్టి వుంచడానికి పెట్టుబడిదారులకి సహాయంచేసే యంత్రంగానే వుంటూ వచ్చింది రాజ్యాంగయంత్రం. కాని పైకి మాత్రం అది స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను రక్షించుతూన్నట్టే కనబడింది. సార్వజనికమైన ఎన్నికహక్కు వుంటుందని గొప్పగా చాటిచెప్పింది. ఇంకా తన పక్షంవారిచేత, తన పీఠాధిపతుల చేత, తన చెప్పుచేతల్లో వున్న పండితవర్గంచేత, తత్వవేత్తలచేత, తాను వర్గాలను పాటించే రాజ్యాంగయంత్రాన్ని యెంత మాత్రము కాను అని చెప్పించింది. వర్గయుతమైన రాజ్యాంగ యంత్రాంతో సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కులు పోరాడుతున్న యీ సమయంలో తమదే ప్రజాయుత్తమైనట్టిన్నీ ప్రజాస్వామికమైనట్టిన్నీ రాజ్యాంగయంత్రమనీ, మనం స్వేచ్ఛా స్వాంత్ర్యాలని కాలరాసేస్తున్నామనీ, బలాత్కారమే, కొందరు కొందరిని అణగదొక్కడమే, ప్రాతిపదికగాగల రాజ్యాంగయంత్రాన్ని నిర్మించామనీ మనమీద వారు అభాండాలు వేస్తున్నారు. ప్రపంచ సోషలిస్టు విప్లవం ఆరంభమై, అప్పుడే కొన్నిదేశాల్లో యీ విప్లవం జయప్రదంగా సాగి, ప్రపంచపెట్టుబడికి వ్యతిరేకంగా లేవనెత్తిన, యీ పోరాటం అత్యంత తీవ్రస్థాయిలో చెలరేగుతూన్నప్పుడు, అనగా వర్తమాన సమయంలో, రాజ్యాంగయంత్ర సమస్య అత్యంత

ప్రాముఖ్యతను వహిస్తూన్నట్టి — నిజంగా చెప్పాలంటే వెంటనే పరిష్కారం కావలసినట్టి — ప్రశ్నగానూ, ఏప్రశ్నలోనైతే నేటి రాజకీయ సమస్యలూ రాజకీయ వివాదాలూ అన్నీ కేంద్రీ కరింపబడినవో అట్టి ప్రశ్నగానూ తయారైంది.

రష్యాలోనూ బాగా నాగరికత చెందిన యితర దేశాల్లోనూ వున్న రాజకీయ పక్షాల్లో యేపక్షాన్ని మనం తీసుకుని చూసినాసరే, యించుమించు అన్ని రాజకీయ వివాదాలు విభేదాలు అభిప్రాయాలు కూడా నేడు యీ రాజ్యాంగయంత్రంయొక్క భావన చుట్టూ కేంద్రీకృత మవుతూన్నట్టు మనకి స్పష్టంగా కనబడుతుంది. పెట్టుబడిదారీ దేశాల్లో వున్న రాజ్యాంగ యంత్రం ప్రజాస్వామికమైన ప్రజాసత్తాకాల్లోకల్లా అత్యంత స్వేచ్ఛాయుత ప్రజాస్వామిక ప్రజాసత్తాకాల్లో వున్న రాజ్యాంగయంత్రం, ముఖ్యంగా అమెరికా స్విట్జర్లెండులలో వున్న రాజ్యాంగయంత్రం, ప్రజాభీష్టాన్ని, మొత్తం ప్రజానిర్ణయాన్ని, జాతీయాభీష్టాన్ని, ఇత్యా దులను ప్రతిబింబిస్తూందా — లేక ఆ దేశాల కార్మికవర్గ రైతాంగాలమీద తమ అధికారం కొనసాగుతూండేటట్టు తమకి అండగా పెట్టుబడిదారులు నిలబెట్టుకున్న యంత్రంగానే వుందా? —మౌలికమైన యీ ప్రశ్నమీదనే రాజకీయ వివాదాలన్నీ కేంద్రీకృతమౌతున్నాయి బోల్షె విజాన్ని గురించి వీళ్లు యేమిటంటున్నారు? పెట్టుబడిదారీవర్గపు పత్రికలన్నీ బోల్షెవిక్‌ల మీద దుమ్మెత్తిపోస్తున్నాయి. ప్రజాస్వామ్య పరిపాలనని బోల్షెవిక్‌లు మట్టిపాలు జేస్తున్నా రనే బూజుపట్టిన అభాండాలు చర్వితచరణంగా ప్రచారంచెయ్యని వార్తాపత్రిక మచ్చుకు ఒక టైనా మీకు కనపడదు కదా. మన మెన్‌షెవిక్‌లూ సోషల్-రివల్యూషనరీలూ మంచితనంగానే (ఒక మంచితనమైనా అయివుండవచ్చు, లేదా బందిపోటుతనంకంటె మంచితనమే కొంప తీస్తుంది అని శాస్త్రంచెప్పిన మంచితనమైనా అయివుండవచ్చు) బోల్షెవిక్‌లు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని మట్టిపాలు చేశారనే అభాండాన్ని తామే కనుగొని బైటపెట్టినట్టుగా నమ్ము తూంటే మాత్రం, వారు పొరపాటు చేయడమేకాకుండా నలుగురినోట అవహేళన పాలవుతు న్నారనే చెప్పాల్సి వుంది. ఐశ్వర్యంతో తులతూగున్న దేశాల్లో కోట్లాది ధనాన్ని సంపాదించిన వార్తాపత్రికల్లో — తమ ప్రచారంకోసం కోట్లమీద ఖర్చుపెడుతూ కోట్ల సంఖ్య ప్రతుల్లో బూర్జువా వర్గపు అబద్ధాలనూ సామ్రాజ్యవాదవిధానాన్నీ ప్రచారంచేస్తూన్న వార్తాపత్రి కల్లో — అమెరికా ఇంగ్లండు స్విట్జర్లెండు దేశాలు ప్రజాస్వామ్యంమీద ఆధారపడి పురోగ మించిన రాజ్యాలైవుండగా, బోల్షెవిక్ ప్రజాసత్తాకరాజ్యం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలంటే యేమిటో యెరగని బందిపోటుదొంగల రాజ్యమనిన్నీ, ప్రజాపరిపాలన సూత్రాన్ని మట్టిపాలు చేయడ మేకాకుండా, వున్న రాజ్యాంగనిర్ణయ పరిషత్తునే తరిమేసి స్వస్తిచెప్పేసేవరకూ పోయార నేటటువంటి మౌలికమైన వాదనలనీ అభాండాలనీ శతధా బోల్షెవిజం నెత్తిమీద వెయ్యని పత్రిక ఒక్కటి కూడా లేదు. బోల్షెవిక్‌లమీద ఘోరాతిఘోరమైన యీ ఆరోపణలను ప్రపం

చంలో సర్వత్రా పదేపదే ప్రచారం చేస్తున్నారు. ఈ ఆరోపణల గురించి మనం ఆలోచించినప్పుడు అసలు రాజ్యాంగయంత్రం అంటే యేమిటి అన్న ప్రశ్ననే తేల్చవలసి వస్తుంది. ఈ ఆరోపణ లని అర్థంచేసుకోవాలంటే వాటిని పరిశీలించి — వూరికే వాటినిగురించి యితరులు చెప్పే మాటలని నమ్మి పరిశీలించకుండా దృఢమైన మన స్వంత అభిప్రాయాలతో మనంతట మనం, వాటి లోగుట్టు తెలుసుకోడానికని పరిశీలించాలంటే, రాజ్యాంగయంత్రం అంటే యేమిటో మనకి స్పష్టంగా తెలిసి వుండాలి. ఈ సందర్భంలో, అన్ని రకాల పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రాల గురించీ, వాటిని సమర్థించి వాటి ఉనికిని కాపాడడానికి యుద్ధానికి పూర్వం సృష్టించిన అన్ని తరహాల సిద్ధాంతాల గురించీ, మనం తెలుసుకోవలసి వుంటుంది. ఈ ప్రశ్నకి మనం స్పష్టమైన జబాబు యివ్వాలంటే యీ సిద్ధాంతాలనన్నింటినీ, యీ అభిప్రాయాలనన్నింటినీ, మనం విమర్శనాదృష్టితో పరిశీలించవలసి వుంటుంది.

ఇందుకు ఎంగెల్స్ రచించిన "కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టు పూర్వోత్తరాలు" అనే పుస్తకం చాలా సహాయపడుతుందనీ అది మీరు చదవడం మంచిదనీ యిదివరకే చెప్పాను. ఏరాజ్యాంగయంత్రంలో అయితే భూమీ, ఉత్పత్తి సాధనాలూ ప్రైవేటు ఆస్తులుగానే వుండి, పెట్టుబడిదే పైచేయిగా వుంటుందో, అట్టి రాజ్యాంగయంత్రం యెంత ప్రజాస్వామికంగా వున్నప్పటికీ కూడా — సార్వజనికమైన ఎన్నికహక్కు, రాజ్యాంగ నిర్ణయ పరిషత్తు, పార్లమెంటు, యివన్నీ కూడా అసలు విషయంయొక్క అంతర్యాన్ని యేమాత్రమూ మార్చనట్టి కేవలం లాంఛనాలుగానే — ఒక విధమైన హుండీ పత్రాలుగానే వుంటూ — కార్మికవర్గాన్ని పేద రైతాంగాన్ని అణచివెయ్యడానికి ఉపయోగపడే యంత్రమే అవుతుందని యీ పుస్తకంలో వుంది.

రాజ్యాంగయంత్రంయొక్క అధికార రూపాల్లో వైవిధ్యం వుండొచ్చు: అది ఒక చోట ఒక రూపంలో వున్నప్పుడు పెట్టుబడి తన శక్తిని ఒక విధంగా మూర్తీభవింపజేస్తుంది. అది మరొకచోట మరో రూపంలో వున్నప్పుడు పెట్టుబడి తన శక్తిని మరొక విధంగా మూర్తీ భవింపజేస్తుంది. ఇది యెలాగున్నప్పటికీ — ఎన్నిక అర్హతలంటూ వుండనీయండి లేకపోనీ యండి, ప్రజాసత్తాకం ప్రజాస్వామికమైనదే కానివ్వండి కాకపోనివ్వండి, అసలు శక్తి మాత్రం ప్రధానంగా పెట్టుబడి చేతుల్లోనే వుంటుంది. ఆ మాటకొస్తే — రాజ్యాంగం యెంత ప్రజా స్వామికంగా వుంటే, పెట్టుబడిదారీ విధానంయొక్క రాజ్యం అంత మొరటుగాను అంత దయదాక్షిణ్యాలు లేకుండానూ వుంటుందన్నమాటే. ప్రపంచంలో వున్న ప్రజాస్వామిక ప్రజా సత్తాకలన్నింటిలోకి అత్యంత ప్రజాసత్తాకమైనట్టి రాజ్యాల్లో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఒకటి. ఐనప్పటికి అమెరికాలో వున్నట్టు (యీ విషయం 1905 తరువాత అక్కడకి వెళ్లిన వారికి బహుశా బాగా తెలిసి వుంటుంది) పెట్టుబడియొక్క శక్తి సమాజం అంతటిమీద

పట్టెడుమంది కోటీశ్వరుల శక్తి — యింత మొరటుగాను యింత బాహాటంగా లంచగొండి తనంతో నిండిపోయినట్లూ మరెక్కడా లేదు. పెట్టుబడి అంటూ వుంటే చాలు, సమాజం అంతటిమీద అది తన ఆధికారాన్ని చలాయించిందన్నమాటే. యెట్టి ప్రజాస్వామికమైన ప్రజాసత్తాక రాజ్యం అవనీయండి, ఎన్నిక విధానం యే రూపంలోనైనాసరే వుండనీయండి, అసలు విషయంయొక్క ఆంతర్యాన్ని అవి మార్చ లేవు.

ప్రజాస్వామ్య ప్రజాసత్తాకము, సార్వజనికమైన ఎన్నికహక్కు, ఫ్యూడలిజం కంటె యెంతో అభ్యుదయకరములై, మానవసమాజాన్ని ముందుకు తీసుకుపోయాయి: నేడున్న ఐక్యతనూ సంసక్తినీ సాధించ డంలోనూ, పెట్టుబడితో నేడు అడుగడుగునా పోరాడుతూ న్నట్టి మనోనిశ్చలతనూ సుశిక్షణమూ కలిగిన బృందాలను తన వర్గంలోనుండి రూపొందించ డంలోనూ శ్రామికవర్గానికి అవి యెంతగానో సాయపడ్డాయి. ఈ హక్కులతో ఏమాత్రపు మారుమూల పోలికలను కలిగిన హక్కులైనా కూడా రైతు భూదాసలకు లేకపోయాయి. ఇక బానిసలమాట చెప్పనే అవసరం లేదు. బానిసలు తిరుగుబాట్లు లేవదీశారనీ పితూరీలు చేశారనీ అంతర్యుద్ధాలు సాగించారనీ మనకి తెలుసు. కాని వర్గచైతన్యాన్ని కలిగిన అధిక సంఖ్యాకవర్గాన్నీ, పోరాటంలో వారికి నాయకత్వం వహించగలిగే రాజకీయపక్షాన్నీ, సృష్టించ డానికి వారికి యేమాత్రమూ సాధ్యమైవుండేది కాదు. వారి లక్ష్యాలేమిటో నిశితంగా గ్రహించ గలిగేటట్టి శక్తిని కలిగి వుండడానికే వారికి సాధ్యపడేది కాదు. చరిత్రలో అత్యంత విప్లవాత్మక తరుణాల్లో సహితం వారు పరిపాలక వర్గాలచేతుల్లో పాచికలుగానే వుండిపోయారు. బూర్జువా విధానపు ప్రజాసత్తాకము, పార్లమెంటు, సార్వజనికమైన ఎన్నికహక్కు — యివన్నీ కూడా ప్రపంచం అంతటా వున్న మానవసమాజ అభివృద్ధి దృష్ట్యా గొప్ప ప్రగతికింద పరిగణించ వలసి వుంది. మానజాతి పెట్టుబడిదారీ విధానంవైపు పురోగమించింది. కాగా పట్నవాస సంస్కృతి ధర్మమా అంటూ — తనని తాను తెలుసుకోవడానికీ, ప్రపంచ కార్మికవర్గోద్య మాన్ని సృష్టించడానికీ, కోట్లాది కార్మికులను ప్రపంచమంతటా పనిచేస్తూన్న రాజకీయ పక్షాల్లో, అనగా ప్రజారాసుల పోరాటానికి చైతన్యవంతమైన నాయకత్వంవహించి నడిపించుతూన్న సోషలిస్టు పక్షాలలో — ఆర్గనైజు చేయడానికీ కేవలం ఒక్క పెట్టుబడి దారీ విధానంవల్లనే పీడిత శ్రామికవర్గానికి సాధ్యం అయింది. పార్లమెంటరీ విధానంలేని పక్షంలోనూ, యెన్నికపద్ధతిలేని పక్షంలోనూ కార్మికవర్గానికి యీ అభివృద్ధిని సాధించడం సాధ్యంకాకపోయే వుండేది. విశాలప్రజారాశి దృష్టిలో వీటన్నిటికీ యింత ప్రాముఖ్యత రావ డానికి యిదే కారణం. ఈ కారణంచేతనే కూలంకషమైన మార్పు తీసుకు రావడానికి కూడా కష్టం అవుతూంది. రాజ్యాంగయంత్రం స్వేచ్ఛను కలిగివుందనీ అందరి ప్రజలయొక్క ప్రయోజనాలను నిష్పాక్షికంగా కాపాడడమే రాజ్యాంగయంత్రంయొక్క పరమావధి అనే బూర్జువా

అబద్ధాలను వెనకేసుకొస్తూ వాటిని సమర్థించే సిగ్గుమాలిన ఆషాఢభూతులూ శాస్త్ర వేత్తలూ మతగురువులూ లేకపోలేదు. వీళ్లేకాకుండా పాతపడిపోయిన దురభిమానాలను మన స్ఫూర్తిగానే యింకా పట్టుకుని పాకులాడుతూన్నట్టే, పాతపడిపోయిన పెట్టుబడిదారీ సమాజం పోయి దానిస్థానే సోషలిజం వస్తూందన్న మార్పునే అర్థంచేసేకోలేనట్టే, అనేకులు వ్యక్తులు కూడా వీరిలాగే యీ అబద్ధాలను వెనకేసుకొస్తూ సమర్థిస్తూ వుంటారు. బోల్షెవిజంమీద కత్తికట్టిన వారిలో బూర్జువావర్గంమీదనే ప్రత్యక్షంగా ఆధారపడుతూండేటటువంటివారే కాకుండా, పెట్టుబడి జూలూముకింద అణగిపడి వున్నవారే కాకుండా, పెట్టుబడి ఇచ్చే లంచా లను తింటూ పెట్టుబడికి దాసోహం అంటున్న వారే కాకుండా, (పెట్టుబడి చెప్పుచేతల్లో అనేకరకాల శాస్త్రవేత్తలు కళాకారులు మతగురువులు వగైరాలు చాలామందే వున్నారు) సోవియట్ రిపబ్లిక్ స్థాపన సమయంలో ఈ బూర్జువావర్గపు అబద్ధాలను తిరస్కరిస్తూ, "మీ ప్రజాస్వామ్యాలు స్వేచ్ఛాయుతాలైనవని మీరు చెపుతూన్నప్పటికీ, మీ రాజ్యాంగ యంత్రం ప్రజాస్వామ్యమైన ప్రజాసత్తాకమే అయినప్పటికీ, ప్రైవేటు ఆస్తి వున్నంతకాలమూ వాస్తవానికి మీ రాజ్యాంగయంత్రం కార్మికులని అణగదొక్కడానికి పెట్టుబడిదారులకి ఉపయోగ పడే యంత్రమే అవుతుందనీ, రాజ్యాంగయంత్రం యెంత స్వేచ్ఛగా వుంటే అంత స్పష్టంగా యీ విషయం ప్రస్ఫుటమవుతుంది" అని సోవియట్ రిపబ్లిక్ బాహాటంగా చాటిచెప్పిన కార ణంవల్లనే, కేవలం తమ పెట్టీబూర్జువావర్గపు స్వేచ్ఛాభావాల దురభిమానాలకి లొంగి పోయినవారు కూడా వున్నారు. ఇందుకు ఐరోపాలో స్విట్జర్లెండు అమెరికాలో సంయుక్త రాష్ట్రాలు దృష్టాంతాలు. ఇవి ప్రజాస్వామ్యములైన ప్రజాసత్తాకాలే అయినప్పటికీ, వాటి గురించి యెంత ఆకర్షణీయంగా వర్ణించి చెప్పబడుతూన్నప్పటికీ, కార్మిక ప్రజాస్వామ్యం గురించీ, ప్రజ లందరి సమానత్వం గురించీ, యెంతగా కబుర్లు చెపుతూన్నప్పటికీ, యీ దేశాల్లో ఇంత దయదాక్షిణ్య రహితంగానూ ఇంత కర్కోటకంగానూ పెట్టుబడి తన అధికారాన్ని చలాయి స్తూన్నట్టు మరియేయితర దేశాల్లోనూ కూడా చలాయించడం లేదు. అసలు విషయం యేమిటంటే, స్విట్జర్లెండులోనూ అమెరికాలోనూ పెట్టుబడి హయామే సాగుతూ, కార్మి కులు తమ స్థితిగతులలో యేమాత్రపు అభివృద్ధిని సాధించుకుందామని ప్రయత్నంచేసినప్ప టికీ, ప్రతీ స్వల్పప్రయత్నాన్నీ కూడా, అంతర్యుద్ధాన్ని లేవదీసి యెదుర్కోనడం జరుగుతూంది. ఈ దేశాల్లో సైనికుల సంఖ్య చాలా తక్కువ. స్థాయీసేన కూడా చాలా చిన్నదే — స్విట్జ ర్లెండుకి ప్రజాసైన్యం వుంది, ప్రతి స్విట్జర్లెండు పౌరుడికీ తన యింట్లో తుపాకీ వుంటుంది, అమెరికాకి నిన్నమొన్నటివరకూ స్థాయీసేనంటూ లేనేలేదు. అందుచేత యెప్పుడైనా సమ్మె జరుగుతే, బూర్జువావర్గం తాను ఆయుధాలని ధరించి, కిరాయి సైనికులకి ఆయుధాలని యిచ్చి, సమ్మెలు అణచేస్తుంది. కాగా స్విట్జర్లెండులోనూ అమెరికాలోనూ కార్మికోద్యమాన్ని

అణచివేస్తున్నప్పుడు ప్రదర్శింపబడే ఘోరాతిఘోరమైన కర్కోటకం మరియేయితర దేశాల్లోనూ లేకపోవడమే కాకుండా, పెట్టుబడియొక్క ప్రభావం యీ దేశాల పార్లమెంటుల్లో శక్తి వంతంగా ప్రత్యక్షం అవుతూన్నట్టు మరెక్కడా కూడా ప్రత్యక్షం అవడం లేదు. పెట్టుబడే సర్వశక్తివంతమైనదీ, షేరుమార్కెట్టే సర్వశక్తివంతమైనదీ అయివుంటూండగా, పార్ల మెంటూ ఎన్నికలూ కేవలం తోలుబొమ్మలూ కీలుబొమ్మలూఅయి తైతకలాడుతున్నాయి.... కాని క్రమేణ కార్మికుల కళ్లనుండి గంతలు రాలిపోతూన్నాయి. కాగా సోవియట్ ప్రభుత్వ విధానం అమలు జరుగుతూందనే భావన నానాటికి — అందులోకి ప్రత్యేకంగా యిటీవల జరి గిన రక్తసంహారం మనం అనుభవించిన తరువాత మరింత ప్రబలంగా విస్తరిస్తూంది. పెట్టు బడిదారులమీద కఠోరయుద్ధాన్ని సాగించడం అవసరమనే విషయం కార్మికులకి నానాటికి మరింత ప్రస్ఫుటమవుతూంది.

ప్రజాసత్తాకం యెట్టి ముసుగు వేసుకున్నాసరే, యెంతటి ప్రజాస్వామ్యమైన ప్రజా సత్తాకపు వేషాన్ని ధరించినాసరే, అది పెట్టుబడిదారీ ప్రజాసత్తాకమైనంత కాలమూ, భూముల మీదనూ మిల్లుల మీదనూ ఫ్యాక్టరీలమీదనూ ప్రైవేటు ఆస్తిని ఆ ప్రజాసత్తాకం గుర్తించి నట్టైతే, వ్యక్తిగత పెట్టుబడి యావత్ సమాజాన్ని కిరాయి బానిసత్వంకింద మట్టిపెట్టి వుంచినట్టైతే — అనగా మన పార్టీ కార్యక్రమంలోనూ, సోవియట్ రాజ్యాంగ చట్టంలోనూ, ఘంటాపథంగా చాటినట్టి లక్ష్యాలను అమలులో పెట్టకపోతే — అట్టి రాజ్యాంగయంత్రం కొందరు వ్యక్తులు మరికొందరు వ్యక్తులను అణగదొక్కి వుంచడానికి ఉపయోగపడే యంత్రమే అయితీరుతుంది. కాగా ఇట్టి యంత్రాన్ని, పెట్టుబడి శక్తిని కూలదొయ్యడానికి యేర్పడిన వర్గంయొక్క చేతుల్లోనే పెడతాం. రాజ్యాంగయంత్రం అంటే సార్వజనిక సమానత్వం అనే టటువంటి పాత దురభిమానాలనన్నిటిని మనం తిరస్కరించి తీరుతాం — యెందుచేతనంటే అట్టి అభిప్రాయాలు కేవలం మోసం తప్ప మరొకటి కాదు: దోపిడీ వున్నంతకాలమూ సమా నత్వం వుండడానికి అవకాశం లేదు. కార్మికునితో భూస్వామి యెన్నటికీ సమానం కాజాలడు. తలాగే ఆకలితో అలమటిస్తూన్న మనిషి, కడుపునిండా సుష్టుగా భోజనంచేసిన మనిషితో యెన్నటికీ సమానం కాజాలడు. ఏయంత్రం రాజ్యాంగయంత్రం అని యింతవరకూ పిలవ బడుతూండేదో అట్టి యంత్రాన్ని, పాతపుక్కిటి పురాణాలని నమ్మి అది ప్రజా పరి పాలన అని భావించి, దేనిముందైతే మూఢనమ్మకంతో గడగడ వణకిపోతూ ప్రజలు సాష్టాంగ పడేవారో అట్టి యంత్రాన్ని, శ్రామికవర్గం కాలదన్ని — యీ యంత్రాన్ని పెంటకుప్ప మీద పారేసి యిదొక బూర్జువావర్గపు అబద్ధం అని యెలుగెత్తి చాటుతూంది. ఈ యంత్రాన్ని పెట్టుబడిదారుల చేతుల్లోనుండి గుంజుకొని మనం హస్తగతం చేసుకున్నాం. ఈ యంత్రంతో — యీ దుడ్డుకర్రతో — మనం యావత్తు దోపిడీని నాశనం చేసితీరుతాం. ఇక ప్రపంచంలో

యెక్కడా కూడా దోపిడీ వుండడానికి అవకాశం లేకుండా చేసినతరువాత, భూఖామందులూ ఫ్యాక్టరీయజమానులూ ప్రపంచంమీద లేకుండా చేసినతరువాత, కొంతమంది పీకలమొయ్యా మెక్కుతూండగా కడమవారు ఆకలితో పస్తుండ వలసిన పరిస్థితులని అంతంచేసినతరువాత — అట్టి పరిస్థితులుండడానికి యెన్నటికీ యెట్టి అవకాశమూ వుండకుండా చేసినతరువాతే, యీ యంత్రాన్ని మనం పెంటకుప్పమీద పారేస్తాం. అప్పుడు రాజ్యాంగయంత్రమూ వుండదు, దోపిడీ వుండదు. ఇదీ మన కమ్యూనిస్టు పార్టీ దృక్పథం. ఈ విషయాన్ని గురించి తదుపరి ఉపన్యాసాల్లో ప్రస్తావించడానికి మనకి అవకాశం వుంటుందనీ యీ విషయాన్ని గురించి మనం పదేపదే ప్రస్తావించ గలుగుతామనీ నేను ఆశిస్తున్నాను.

# శ్రామికవర్గ నియంతృత్వ శకంలో ఆర్థికములూ, రాజకీయములూ

సోవియట్ ప్రభుత్వపు రెండవ జయంతి సందర్భంలో ఈ శీర్షిక సూచించుతూన్న విషయంపై ఒక చిన్న పాంప్లెట్ రాద్దామని అనుకున్నాను. కాని దైనందిన కార్యకలాపాల ఒత్తిడి మూలాన కొన్ని ప్రకరణాలకు అవశ్యకమైన ప్రాథమిక యత్నాలు తప్ప అంతకు మించి ముందుకు సాగలేకపోయాను. అందుచేత ఈ విషయంపై ఏవైతే అత్యంత ముఖ్యమైన భావాలని నేను అభిప్రాయపడుతున్నానో వాటిపై సంగ్రహవ్యాసం ఒకదానిని రాయడానికి నిశ్చయించుకున్నాను. సంగ్రహ సారాంశాన్ని మాత్రమే ప్రదర్శించుతూన్న వ్యాసం సహజంగానే అనేక లోపాలనూ పొరపాట్లనూ కలిగి వుంటుంది. అయినప్పటికీ, వివిధ దేశాల్లోని కమ్యూనిస్టులు ఈ విషయాన్ని చర్చించాలనే నిరాడంబరమైన లక్ష్యాన్ని ఒక క్లుప్తమైన మాసపత్రికా వ్యాసం బహుశా నెరవేర్చ గల్గుతుందేమో కూడా.

I

సిద్ధాంతరీత్యా పెట్టుబడిదారీ విధానానికీ కమ్యూనిజానికీ మధ్య ఒక కచ్చితమైన పరివర్తన కాలావధి వుండడం నిస్సంశయం. సామాజిక ఆర్థికవ్యవస్థయొక్క రెండు రూపాల స్వభావాలనూ లక్షణాలనూ అది మిళితం చేయకతప్పదు. ఈ పరివర్తన కాలావధి చావుకు సిద్ధంగావున్న పెట్టుబడిదారీ విధానానికీ, కొత్తగా పుట్టిన కమ్యూనిజానికీ — ఇదే మరో మాటల్లో చెప్పాలంటే, ఓటమి చెందినప్పటికీ ఇంకా నిర్మూలించబడని పెట్టుబడిదారీ విధానానికీ,

నూతనంగా జన్మించి ఇంకా బలహీనంగానే వున్నట్టి కమ్యూనిజానికీ — మధ్య జరిగే పోరాటం యొక్క కాలావధి అవడం అనివార్యమే అవుతుంది.

పరివర్తన కాలావధియొక్క ఈ లక్షణాలచే గుర్తించబడుతూన్నట్టి ఒక పూర్తి చారిత్రక శకం అవసరమవుతుంది. ఈ విషయం — కేవలం ఒక్క మార్క్సిస్టులకే కాకుండా, అభివృద్ధి సిద్ధాంతంతో ఏ మాత్రం పరిచయమున్న ప్రతి విద్యావంతునికీ కూడా స్పష్టంగా కనబడుతుంది. అయినప్పటికీ, పెట్టీబూర్జువా ప్రజాస్వామ్యంయొక్క ఈనాటి ప్రతినిధుల నోటనుండి (వీరేకాకుండా, తాము తగిలించుకున్న బూటకపు ఉల్లాకు చీటి ఏలాగున్నప్పటికీ, మెక్‌డోనల్డ్, జాన్ లాంగ్వే, కౌట్‌స్కి, ఫ్రీడ్రిఖ్ ఆడ్లర్ లాంటి వ్యక్తులతో సహా, రెండవ ఇంటర్నేషనల్ ప్రతినిధులైన వీరందరి నోటనుండీ కూడా) మనం వింటూన్న కబుర్లన్నీ ఈ ప్రత్యక్ష సత్యాన్ని సంపూర్ణంగా విస్మరిస్తున్నాయి. వర్గపోరాటంపట్ల అనిష్టం, వర్గ పోరాటం లేకుండానే కార్యం సాధించవచ్చుననే ఆశ, ఎలాగో ఒకలాగున చిక్కులు లేకుండా చేసుకుని సమరసంగా వుండేందుకు యత్నం, అభిప్రాయ భేదాల కఠోరతీవ్రతను సర్దుబాటు చేయడం — ఇవీ పెట్టీబూర్జువా ప్రజాస్వామికవాదుల స్వభావం. ఇటువంటి ప్రజాస్వామికవాదులు పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తనచెందేందుకు ఒక పూర్తి చారిత్రక కాలావధి అవసరమవుతుందనే విషయాన్ని గుర్తించడమును దాటవేయనైనా దాటవేస్తారు, లేదా పరస్పరం ప్రతిస్పర్ధులైన రెండు శక్తులలో, ఏదో ఒకదానికి నాయకత్వం వహించి పోరాటంలోకి నడిపించడం బదులు, రెండింటికీ పొత్తు కుదిర్చేందుకు పథకాలను కృత్రిమంగా తయారుచేయడమే తమ విధాయకమని పరిగణించనైనా పరిగణిస్తారు.

## II

మన దేశం మిక్కిలి వెనకబడి వుండడమూ, మన దేశంయొక్క పెట్టీబూర్జువా స్వభావమూ కారణంగా, కొన్ని స్పష్టమైన విశేషాలలో ఇతర పురోగామి దేశాలలోకంటె రష్యాలో శ్రామికవర్గ నియంతృత్వం తప్పనిసరిగా విభేదించే తీరుతుంది. అయితే పెట్టుబడిదారీ దేశాలలో ఏ దేశంలోనైనాసరే, రష్యాలోనైనా సరే, ఈ మౌలిక శక్తులూ — సామాజిక ఆర్థిక వ్యవస్థయొక్క మౌలిక రూపాలు కూడానూ — ఒక్కటే, అందుచేతనే కేవలం అప్రాముఖ్యతను కలిగివున్న వాటికి మాత్రమే ఈ ప్రత్యేకతలు వర్తించగలుగుతాయి.

పెట్టుబడిదారీ విధానం, చిల్లర వర్తకపు సరుకుల ఉత్పత్తి, కమ్యూనిజం — ఇవే ఈ సామాజిక ఆర్థికవ్యవస్థయొక్క మౌలిక రూపాలు. బూర్జువావర్గం, పెట్టీబూర్జువావర్గం (ప్రత్యేకంగా రైతాంగం), శ్రామికవర్గం — ఇవీ మౌలిక శక్తులు.



శ్రామికవర్గ నియంతృత్వ శకంలో చిల్లర వర్తకపుసరుకుల ఉత్పత్తీ, పెట్టుబడిదారీ విధానమూ ఇంకా నాశనంకాకుండా సజీవంగావుండి, చిల్లర వర్తకపు సరుకుల ఉత్పత్తి ప్రాతి పదికపై సరికొత్తగా తలెత్తుతూన్నట్టి పెట్టుబడిదారీ విధానమూ, ఈ రెండింటికీ వ్యతి రేకంగా కమ్యూనిస్టు పద్ధతిలో — బ్రహ్మాండమైనట్టి ఏకైక రాజ్యాంగయంత్ర స్థాయిలో — ఐక్యపడిన శ్రమ సాగించే పోరాటంలో మొదటి అడుగులను రష్యా ఆర్థికవ్యవస్థ ప్రదర్శించు తూంది.

రష్యాలో మొదటిది, ఉత్పత్తి సాధనాల్లో ప్రైవేటు స్వామ్యం రద్దుకాబడిన మేరకూ, రెండోది, శ్రామికవర్గ రాజ్యాధికారం రాజ్యాంగయంత్ర స్వామ్యమైన భూమిలో అధికస్థాయి ఉత్పత్తినీ, రాజ్యాంగయంత్ర స్వామ్యమైన వ్యాపారసంస్థలలో ఉత్పత్తిని జాతీయస్థాయిలోనూ ఆర్గనైజుచేస్తూ, ఉత్పత్తి వివిధ విభాగాలలోనూ, వివిధ వ్యాపారసంస్థలలోనూ శ్రమశక్తిని పంపకంచేస్తూ, రాజ్యాంగయంత్రానికి చెందినట్టి వినిమయ వస్తువులను అధిక రాసులలో కార్మిక ప్రజల మధ్య పంపకంచేసే మేరకూ, కమ్యూనిస్టు పద్ధతిలో శ్రమ ఐక్యపరచబడింది.

రష్యాలో కమ్యూనిజం "మొదటి అడుగులు" (1919 మార్చిలో ఆమోదించబడిన మన కార్యక్రమంలో కూడా ఇలాగే చెప్పబడింది) అనే అన్నాం; ఇందుకు కారణమేమంటే, మన దేశంలో ఈ షరతులన్నీ కేవలం పాక్షికంగానే సాధించబడ్డాయి, ఇదే వేరే మాటల్లో చెప్పాలంటే, ఈ షరతులను సాధించడంలో మనమింకా తొలి దశలోనే వున్నామన్నమాట. సాధారణంగా తక్షణం సాధించగల్గిన దానినంతనూ ఒక్క విప్లవాత్మక దెబ్బతో వెనువెంటనే సాధించాం: ఇందుకు దృష్టాంతం, శ్రామికవర్గ నియంతృత్వం తొలి రోజునే, 1917 అక్టోబరు 26 నే (నవంబరు 8), బడా భూస్వాములకు పరిహారం చెల్లించకుండానే భూమిలో ప్రైవేటు స్వామ్యం రద్దు పరచేశాం; బడా భూస్వాముల ఆస్తిహక్కులు లాక్కోనబడ్డాయి. కొద్దినెలల వ్యవధిలో ఇంచుమించు అందరి పెట్టుబడిదార్లయొక్క, మిల్లుల ఫ్యాక్టరీల సొంతదార్లయొక్క జాయింటు స్టాకు కంపెనీల, బ్యాంకుల, రైల్వే వగైరాలయొక్క ఆస్తిహక్కులు పరిహారం చెల్లించకుండానే లాక్కోనబడ్డాయి. రాజ్యాంగయంత్రపరంగా పరిశ్రమలో అధికస్థాయి ఉత్ప త్తిని ఆర్గనైజు చేయడమూ ఫ్యాక్టరీలనూ, మిల్లులనూ, రైల్వేలనూ "కార్మికుల కంట్రోలు" నుండి, "కార్మికుల పాలన" లోకి పరివర్తన చెందించడమూ — ఇదంతా, మొత్తంమీద ఇప్పటికప్పుడే సాధించబడింది; కాని వ్యవసాయం విషయంలో మాత్రం ఇది ఇప్పుడే ప్రారంభ మైంది ("ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు", అనగా ప్రభుత్వ భూములలో కార్మికుల రాజ్యాంగ యంత్రంచే ఆర్గనైజు చేయబడిన పెద్ద వ్యవసాయక్షేత్రాలు). ఇదే విధంగా, చిల్లర వర్తకపు దినుసుల వ్యవసాయంనుండి కమ్యూనిస్టు వ్యవసాయంలోకి పరివర్తనగా వివిధ రూపాలలో సన్నకారు వ్యవసాయదారుల సహకార సంఘాల ఆర్గనైజేషనును ఇప్పుడిప్పుడే కొత్తగా ప్రారం

ఖించాం*. ప్రైవేటు వర్తకం స్థానే ప్రభుత్వపరంగా సరుకుల పంపకంయొక్క ఆర్గనైజేషను, అనగా, రాజ్యాంగయంత్రమే ధాన్యం సేకరించడమూ, పట్టణాలకు విడుదల చేయడమూ, పారిశ్రామిక ఉత్పత్తులను పల్లెపట్టులకు విడుదల చేయడమూ విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. ఈ విషయమ్మై అందుబాటులోవున్న గణాంకశాఖ వివరాలు ఈదిగువ పొందుపరచబడ్డాయి.

రైతు సేద్యం ఇంకా చిల్లర వర్తకపు దినుసుల వ్యవసాయంగానే సాగుతూంది. పెట్టుబడిదారీ విధానానికి అతి విశాలంగా, అతి ప్రగాఢంగా, అతి దృఢంగా స్థిరపడినట్టి ప్రాతిపదిక మనకిక్కడ ఎదురుపడుతూంది. ఈ ప్రాతిపదికపై పెట్టుబడిదారీ విధానం ఆలాగే నిలబడి వుంటూ కమ్యూనిజంతో మొండి పోరాటంలో అది నూతనంగా ప్రాదుర్భవించుతుంది. ప్రభుత్వంచే ధాన్యము ఇతర దినుసుల సేకరణకూ సాధరణంగా ప్రభుత్వంచే సరుకుల పంపకానికీ వ్యతిరేకంగా చీకటిబజారు, చట్బావ్యాపారమూ, ఈ పోరాటంయొక్క రూపాలు.

## III

ఈ నిరుపాధిక సైద్ధాంతిక వాక్యాలు స్పష్టంగా ద్యోతకమయేందుకు నిర్దిష్టములైన దత్తాంశాలను ఉల్లేఖించుతాం.

కామ్‌ప్రోద్ (ఆహార ప్రజా మంత్రిత్వశాఖ) లెక్కల ప్రకారం, 1917 ఆగస్టు 1 నుండి 1918 ఆగస్టు 1 వరకూ రష్యాలో ప్రభుత్వంచే ధాన్య సేకరణల మొత్తం సుమారు 3 కోట్ల పూడ్లు; తరువాత సంవత్సరంలో సుమారు 11 కోట్ల పూడ్లు. 1918 లో అదే నెలలలో (ఆగస్టు – అక్టోబరు) 3 కోట్ల 70 లక్షల పూడ్లు సేకరించబడగా, దీని తరువాతి సేకరణోద్యమవు (1919–1920) మొదటి మూడు నెలలలోనూ మొత్తం సేకరణ సుమారు 4 కోట్ల 50 లక్షల పూడ్ల వరకూ వుండొచ్చు.

పెట్టుబడిదారీ విధానంపై కమ్యూనిజం విజయం దృక్‌స్థానం నుండి చూచినట్టయితే, పరిస్థితులలో మెల్లనే అయినప్పటికీ నిలకడైన అభివృద్ధినే ఈ అంకెలు స్పష్టంగా తెలుపుతున్నాయి. ప్రపంచంలో అత్యంత బలోపేతమైన రాజ్యాల సర్వశక్తులనూ రష్యన్

---

* సోవియట్ రష్యాలో "ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల," సంఖ్య సుమారు 3,536, "వ్యవసాయ కమ్యూన్ల" సంఖ్య సుమారు 1,961; వ్యవసాయ సహకార సంఘాల సంఖ్య 3,696. మన కేంద్ర గణాంక శాఖ అన్ని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల, కమ్యూన్ల నికరమైన సంఖ్యా వివరాలు ప్రస్తుతం తయారుచేస్తూంది. 1919 నవంబరులో తొలి ఫలితాలు అందడం మొదలవుతుంది.

పెట్టుబడిదార్లూ, విదేశీ పెట్టుబడిదార్లూ ఆర్గనైజుచేసి నడిపించుతూన్న అంతర్యుద్ధం కారణంగా సంభవించినట్టి, ప్రపంచంలో నిరుపమానమైనట్టి గడ్డు పరిస్థితులను లక్ష్యపెట్టకుండానే ఈ అభివృద్ధి సాధించబడుతూంది.

కాబట్టి అన్ని దేశాల బూర్జువాలూ, వారి ప్రత్యక్ష పరోక్ష భృత్యులూ, (రెండవ ఇంటర్నేషనల్‌లో వున్నట్టి ''సోషలిస్టులు'') వీరి అబద్ధాలూ దూషణలూ ఎలా వుంటూన్నప్పటికీ, ఒక్క విషయం మాత్రం నిర్వివాదం; అదేమిటంటే, శ్రామికవర్గ నియంతృత్వం యొక్క మౌలిక ఆర్థికసమస్య దృక్స్థానం నుండి చూచినట్టయితే, పెట్టుబడిదారీ విధానంపై కమ్యూనిజం విజయం మన దేశంలో తథ్యం. ప్రపంచమంతటా బూర్జువావర్గం బోల్‌షెవిక్‌లపై కారాలూ మరియాలూ నూరుతూ, నిప్పులు చెరుగుతూ సైనిక దండయాత్రచర్యలూ, కుహకాలూ, వగైరాలను బందోబస్తు చేస్తూంది; సైనిక బలంవల్ల మనను అణచివేయడం సాధ్యంకాని పక్షంలో, సామాజిక ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించడంలో మన విజయం అనివార్యమని అది పూర్తిగా గ్రహించడమే కేవలం ఇందుకు కారణం. కాగా ఈ విధంగా మనను అణచివేయడానికి అది కావించుతూన్న యత్నాలన్నీ విఫలమవుతున్నాయి.

మనకు లభించిన కొద్దిపాటి వ్యవధిలోనూ, నమ్మశక్యంకానట్టి గడ్డు పరిస్థితుల నడుమ కృషిచేస్తూ, ఎంత మేరకైతే పెట్టుబడిదారీ విధానాన్ని మనం ఇప్పటికప్పుడే ఓడించేశామో ఈ దిగువ పొందుపరచబడిన సంక్షిప్త సంఖ్యలనుండి వ్యక్తమవుతుంది. మొత్తం సోవియట్ రష్యా అంతకూ కాకుండా, రష్యాలో ఒక్క ఇరవైయ్యారు రాష్ట్రాలకు మాత్రమే వర్తిస్తూన్న ధాన్యపు ఉత్పత్తి, వినిమయం గురించిన దత్తాంశాలను పత్రికా ప్రచురణార్థం కేంద్ర గణాంక శాఖ ఇప్పుడే తయారు చేసింది.

ఫలితాలు ఈ విధంగా వున్నాయి (చూ. పట్టకం, 489 వ పుట).

ఈ విధంగా పట్టణాలకు సరఫరాచేసిన మొత్తం ధాన్యంలో ఇంచుమించు సగం ఆహార మంత్రిత్వశాఖ జాగ్రత్త చేసినది, రెండవ సగభావం చట్టావ్యాపారులు విడుదలచేసేసినది. పట్టణాల్లో నివసించుతూన్న కార్మికులచే వినిమయం చేయబడుతూన్న ఆహారం గురించి 1918 లో జాగ్రత్తగా జరిపిన పరిశీలన కూడా ఈ నిష్పత్తినే బయటపెడుతూంది. చట్టావ్యాపారులు సరఫరా చేస్తూన్న బ్రెడ్డు కొనుక్కోడానికై కార్మికుడు చెల్లించుతూన్న ధరలో తొమ్మిదింట ఒక వంతు మాత్రమే ప్రభుత్వం సరఫరా చేస్తూన్న బ్రెడ్డు కొనుక్కోడానికి కార్మికుడు చెల్లించుతున్నాడు. ప్రభుత్వపు బ్రెడ్డు ధరకంటె చట్టావ్యాపారి బ్రెడ్డు ధర పదింతలు అధికంగా వుంది. ఈ సంగతి కార్మికుల ఆదాయవ్యయ పట్టికలను నిశితంగా అధ్యయనం చేయడంవల్ల బయటపడుతూంది.

| సోవియట్ రష్యాలో 26 గుబేర్నియాలు | జనసంఖ్య (మిలియన్లలో) | | ధాన్యం ఉత్పత్తి (విత్తనాలు, పశు గ్రాసం మినహా) మిలియన్ను పూడ్లలో | ధాన్యం విడుదల (మిలియన్ల పూడ్లలో) | | జనసంఖ్య అధీనంలో వున్న మొత్తం ధాన్యం, మిలియన్ల పూడ్లలో | జనసంఖ్యలో తలసరి ధాన్యపు వినిమయం (పూడ్లలో) |
|---|---|---|---|---|---|---|---|
| | | | | ఆహార మంత్రిత్వ శాఖ | చట్టావ్యాపారులు | | |
| ఉత్పత్తిచేస్తున్న | నగర | 4.4 | – | 20.9 | 20.6 | 41.5 | 9.5 |
| గుబేర్నియాలు . . . | గ్రామీణ | 28.6 | 625.4 | – | – | 481.8 | 16.9 |
| వినిమయంచేసే | నగర | 5.9 | – | 20.0 | 20.0 | 40.0 | 6.8 |
| గుబేర్నియాలు . . . . | గ్రామీణ | 13.8 | 114.0 | 12.1 | 27.8 | 151.4 | 11.0 |
| మొత్తం (26 గుబేర్నియాలు) | | 52.7 | 739.4 | 53.0 | 68.4 | 714.7 | 13.6 |

## IV

పైన ఉల్లేఖించిన సంఖ్యలను జాగ్రత్తగా పర్యాలోచించినట్టయితే, ఈనాటి రష్యా ఆర్థికస్థితియొక్క మౌలిక స్వభావాలను అవి వ్యక్తం చేస్తూన్నట్టు మనం తెలుసుకోగల్గుతాం.

యుగయుగాల నుండి తమను పీడించుతూ, దోపిడీ చేస్తూన్న భూస్వాములు, పెట్టుబడిదార్లనుండి కార్మికప్రజలు విముక్తి చేయబడ్డారు. యథార్థమైన స్వేచ్ఛ, యథార్థమైన సమానత్వం దిశగా వేసిన ఈ అంజకు, దాని మేరకు, దాని పరిమాణానికి, దాని త్వరితానికి సంబంధించినంత వరకు ప్రపంచంలో నిరుపమానమైన ఈ అంజకు, తాము స్వేచ్ఛ గురించీ సమానత్వం గురించీ మాట్లాడుతూన్నప్పుడల్లా సాధారణంగా "ప్రజాస్వామ్యం" అనీ, లేదా "స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం" (కౌట్‌స్కి) అని బూటకంగా ప్రకటించుతూన్నట్టి పార్లమెంటరీ ప్రజాస్వామ్యమేనని అర్థం చెబుతూన్నట్టి బూర్జువా అనుయాయులు (పెట్టీ బూర్జువా ప్రజాస్వామికవాదులతో సహా) విస్మరిస్తున్నారు.

కాని కార్మికప్రజ తాపత్రయమంతా నిజమైన సమానత్వం, నిజమైన స్వేచ్ఛ (భూస్వాముల, పెట్టుబడిదార్ల బారినుండి స్వేచ్ఛ) గురించే, అందుచేతనే సోవియట్ రాజ్యాధికారం పట్ల అంత దృఢంగా వారు నిలబడుతున్నారు.

ఈ రైతాంగపు దేశంలో శ్రామికవర్గ నియంతృత్వంనుండి మొట్టమొదట లాభం పొందినవారు, హెచ్చు లాభం పొందినవారు, తక్షణం లాభం పొందినవారు మొత్తంమీద రైతులే. భూస్వాములకిందనూ పెట్టుబడిదార్ల కిందనూ రష్యాలో రైతు ఆకలితో మాడుతూండేవాడు. సుదీర్ఘమైన మన దేశచరిత్రలో శతాబ్దాల తరబడి శతాబ్దాలుగా రైతుకు తనకోసం తాను పాటుపడే అవకాశం లేకపోయింది: పెట్టుబడిదార్లకూ, పట్టణాలకూ, విదేశ ఎగుమతులకూ కోటానకోట్ల పూడ్ల తిండిగింజలను ఇచ్చివేసి, తాను మాత్రం ఆకలితో మాడుతూండేవాడు రైతు. శ్రామికవర్గ నియంతృత్వంకింద మొట్టమొదటి సారిగా రైతు తనకోసం తాను పాటుపడి, పట్నవాసుడి కంటె బాగా భోజనం చేయగల్గాడు. మొట్టమొదటి సారిగా రైతు నిజమైన స్వేచ్ఛను — తాను పండించిన గింజలను తాను తినే స్వేచ్ఛను, ఆకలిపస్తునుండి స్వేచ్ఛను — చవిచూడగల్గాడు. భూమి పంపకంలో గరిష్ఠ పరిమితిలో సమానత్వం నెలకొల్పబడిందన్న విషయం అందరూ ఎరిగినదే: దృష్టాంతాల అత్యధికసంఖ్యాకవర్గంలో, పోషించబడవలసిన వారు కుటుంబంలో ఎంతమంది వున్నారో వారి సంఖ్యనుబట్టి రైతులు భూమిని పంచుకుంటున్నారు.

సోషలిజమంటే వర్గాలను అంతం చేయడమన్నమాట.

వర్గాలను అంతం చేయడానికి, మొట్టమొదట, భూస్వాములనూ పెట్టుబడిదార్లనూ కూలదోయడం అవసరం. మన కర్తవ్యంలో ఈ భాగం సాధించబడింది, కాని ఇది ఒక భాగం మాత్రమే, కాగా అన్నిటికంటెనూ కష్టమైన భాగం కూడా కాదు. వర్గాలను అంతం చేసేందుకు, రెండోది, అనగా కార్మికులకూ రైతులకూ మధ్యవుండే వ్యత్యాసాన్ని అంతం చేయడం, అందరనూ శ్రమికులనుగా చేయడం అవసరం. ఇది ఒక్క చిటికెలో చేయగల్గే పనికాదు. అసదృశంగా కష్టమైన కర్తవ్యం ఇది. దీనిని సాధించేందుకు సుదీర్ఘకాలం అవసర మవడం అనివార్యం కూడానూ. ఒక వర్గాన్ని కూలదోయడంతో పరిష్కారమయే కర్తవ్యం కాదిది. యావత్తు సామాజిక ఆర్థికవ్యవస్థనూ ఆర్గనైజేషనల్‌గా పునర్నిర్మించడం వల్లనే, వ్యష్టిగత, ఐక్యతా రహిత, చిల్లర వర్తకపు సరుకుల, ఉత్పత్తి నుండి అధికస్థాయి సామాజికోత్పత్తిలోకి పరివర్తన వల్ల మాత్రమే ఇది పరిష్కారం కాగలదు. ఈ పరివర్తనకు సుదీర్ఘకాలం అవసర మవడం అనివార్యమే అయితీరుతుంది. తొందరపాటుతోనూ, అజాగ్రతగానూ కావించే పరిపాలనా చర్యలవల్ల ఇది కేవలం ఆలస్యమై, సంక్లిష్టమే కావచ్చు. రైతుకు అతని యావత్తు వ్యావసాయక విధానాన్ని బ్రహ్మాండంగా వృద్ధిపరచి, దాన్ని సమూలంగా సంస్కరించడానికి అతనికి సామర్థ్యాన్ని కలిగించే సహాయాన్ని అందజేయడం వల్ల మాత్రమే దీనిని త్వరితం చేయడానికి వీలవుతుంది.

ఈ కర్తవ్యంయొక్క అతిక్లిష్టమైన రెండవ భాగాన్ని నిర్వర్తించాలంటే, బూర్జువా వర్గాన్ని ఓడించిన తరువాత, రైతాంగంపట్ల శ్రామికవర్గం తన విధానాన్ని ఈ దిగువ సూచించిన మార్గాలలో వజ్రసంకల్పంతో సాగించాలి: సొంతదారుడైన రైతునుండి వ్యవసాయ కార్మికుడినీ, కార్మికుడిని రైతుషాహుకారునుండీ, కాయకష్టంచేసే రైతుని చట్టావ్యాపారం చేసే రైతునుండీ వేరుచేసి, ఇద్దరి మధ్యనూ సరిహద్దు ఏర్పరచాలి.

ఈ సరిహద్దు ఏర్పాటులోనే వుంది సోషలిజం సారమంతా.

కాగా, మాటల్లో మాత్రమే సోషలిస్టులూ, చేతల్లో కేవలం పెట్టీబూర్జువా ప్రజాస్వామికవాదులూ అయిన (మార్టొవ్‌లూ, చెర్నోవ్‌లూ, కౌట్‌స్కీలూ, వగైరా వగైరాల లాంటి) సోషలిస్టులు సోషలిజంయొక్క ఈ సారాన్ని అర్థం చేసుకొన లేకపోవడంలో ఆశ్చర్యమేమీ లేదు.

పైన మనం చెప్పిన సరిహద్దు ఏర్పాటు అతి కష్టమైన పని, ఎందుచేతనంటే, వాస్తవ జీవితంలో, "రైతు" స్వభావాలు ఎంతగా పరస్పర విరుద్ధములే అయినప్పటికీ, వాటిలో ఎంత వైరుధ్యమున్నప్పటికీ, అవి ఒక పూర్ణతగా ఏకమైపోయున్నాయి. అయినప్పటికీ, సరిహద్దు ఏర్పాటు సాధ్యమే అవుతుంది; కాగా అది సాధ్యమవడమే కాకుండా, రైతు ఆర్థిక జీవిత పరిస్థితుల వల్లనే అది అనివార్యమవుతుంది కూడా. అత్యంత ప్రజాస్వామిక బూర్జువా రిపబ్లిక్కులలో

సహా భూస్వాములచే, షాహుకార్లచే, చట్టావ్యాపారులచే, వీరి రాజ్యాంగయంత్రంచే కష్టజీవి రైతు యుగయుగాలుగా పీడించబడ్డాడు. ఈ పీడకులపట్ల, దోపిడీదార్లపట్ల ద్వేషం, ఏవగింపు అనే విద్యను యుగయుగాలుగా అతడు తనలో పెంపొందించుకున్నాడు, జీవిత పరిస్థితులు నేర్పిన ఈ "విద్యే," పెట్టుబడిదారుడికి వ్యతిరేకంగానూ, చట్టావ్యాపారికి వ్యతిరేకంగానూ, షాహుకారికి వ్యతిరేకంగానూ కార్మికునితో మిత్రత్వం నెరపుకొనేటట్టు రైతును నిర్బంధించుతూంది. అయినప్పటికీ అదే సమయంలో, ఆర్థికపరిస్థితులు, వర్తకపు సరుకుల ఉత్పత్తి పరిస్థితులు రైతుని (ఎల్లప్పుడూ కాకపోయినా, దృష్టాంతాల అత్యధికసంఖ్యాకవర్గంలో) షాహుకారుగానూ, చట్టావ్యాపారిగానూ అనివార్యంగా చేసివేస్తాయి.

పైన ఉదాహరించిన సంఖ్యా వివరాలు, కష్టజీవిరైతుకీ, షాహుకారురైతుకీ మధ్య ఒక అద్భుతమైన వ్యత్యాసాన్ని బయటపెడుతున్నాయి. 1918–1919 లో ఆకలితో మాడిపోతూన్న పట్నవాస కార్మికులకు 4 కోట్ల పూడ్ల ధాన్యాన్ని ప్రభుత్వంచే నిర్ణయించబడిన ధరలకు విడుదల చేసినట్టి, సోషలిజానికి పరివర్తన చెందే మొదటి కాలావధిలో అనివార్యములే అని కార్మికుల ప్రభుత్వంచే పూర్తిగా గుర్తించబడుతూన్నట్టి లోపాలనూ పొరపాట్లనూ ప్రభుత్వ నియమిత సంస్థలు ఎన్నిచేసినప్పటికి కూడా ఆ ప్రభుత్వ నియమిత సంస్థలకే ధాన్యాన్ని విడుదల చేసినట్టి రైతు — ఆ కష్టజీవిరైతే, సోషలిస్టు కార్మికునికి విశ్వసనీయుడైన మిత్రుడే, సోషలిస్టు కార్మికునితో సమాన హోదాలో వున్నట్టి క్రామేడే, పెట్టుబడిదారీ విధానం మోపిన గాటికి వ్యతిరేకంగా జరుగుతూన్న పోరాటంలో సోషలిస్టు కార్మికుని సొంత సోదరుడే. ఇదిలా వుండగా, పట్నవాస కార్మికుని అవసరాలనూ ఆకలిబాధనూ ఉపయోగించుకుని, రాజ్యాంగయంత్రాన్ని మోసంచేసి, సర్వత్రా దగా, దోపిడీ, వంచనలను అధికంచేస్తూ, సృష్టిస్తూ, ప్రభుత్వపు ధరకంటె పదింతలు పెచ్చు ధరకు 4 కోట్లపూడ్ల ధాన్యాన్ని చీకటిబజారులో అమ్మిన రైతు — ఆ రైతు షాహుకారే, పెట్టుబడిదారుని మిత్రుడే, కార్మికుని వర్గశత్రువే, దోపిడీదారుడే, ఎందుచేతంటె రాజ్యాంగయంత్రానికి అంతకీచెందిన భూములలో, ఏదో ఒక విధంగా రైతు యొక్క కాకుండా, కార్మికుడు, వగైరాలయొక్క శ్రమతో రూపొందించినట్టి పరికరాల సహాయంతో పండించిన ధాన్యంలో మిగులు ధాన్యాన్ని తన స్వాధీనంలో వుంచుకుంటాడో, ఎవడైతే మిగులు ధాన్యాన్ని కలిగివుండి, దానితో చట్టావ్యాపారం చేస్తాడో అట్టివాడు ఆకలితో మాడుతూన్న కార్మికుడిని దోపిడీ చేస్తున్నవాడవుతున్నాడు.

మీరు స్వేచ్ఛను, సమానత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని భ్రష్టుచేస్తున్నారు — అని మన రాజ్యాంగ ప్రణాళికలో వున్న కార్మిక కర్షక అసమానత్వాన్నీ, రాజ్యాంగ నిర్ణయ పరిషత్తును వెళ్లగొట్టడమునూ, మిగులు ధాన్యాన్ని బలప్రయోగంతో జప్తుచేయడమునూ, వగైరా వగైరాలను వేలుపెట్టి చూపుతూ వారు నాలుగు చెరగులనుండీ గావుకేకలు పెడుతున్నారు.

అందుకు ఇదీ మన జబాబు: శతాబ్దుల తరబడి కష్టజీవి రైతు అనుభవించిన వాస్తవ స్వేచ్ఛా రాహిత్యాన్ని, వాస్తవ అసమానతను తొలగించడానికి ఇంతగా పాటుపడిన రాజ్యాంగయంత్రం ప్రపంచంలో ఇంతవరకూ మరేదీలేదు. కాని, ఏవిధంగానైతే దోపిడీదారునికీ దోపిడీచేయబడిన వానికీ వుండే ''సమానత్వాన్ని,'' మృష్టాన్నభోక్తకీ, ఆకలితో మాడుతున్నవానికీ వుండే ''సమానత్వాన్ని,'' మొదటివారికి రెండోవారిని కొల్లగొట్టేందుకు గల ''స్వేచ్ఛ''ను మనమెన్నటికీ గుర్తించనట్టుగానే, రైతుకీ చట్టావ్యాపారికీ వుండే సమానత్వాన్ని మనమెన్నట్టికీ గుర్తించము. కాగా ఈ వ్యత్యాసాన్ని గుర్తించ నిరాకరించే విద్యావంతులను, తాము ప్రజాస్వామికవాదులమనీ, సోషలిస్టులమనీ, ఇంటర్నేషనలిస్టులమనీ, కౌట్‌స్కీలమనీ, చెర్నోవ్‌లమనీ, మార్తొవ్‌లమనీ వారు పేర్లుపెట్టుకున్నప్పటికీ, అట్టి వారిని వైట్‌గార్డ్‌లుగానే మేము పరిగణిస్తాము.

## V

సోషలిజమంటే వర్గాలను రద్దు చేయడమన్నమాట. వర్గాలను రద్దు చేసేందుకు శ్రామికవర్గ నియంతృత్వం తాను చేయగల్గినదంతా చేసింది. కాని వర్గాలను ఒక్క చిటికెలో రద్దు చేసేందుకు వీలుపడదు.

కాగా శ్రామికవర్గ నియంతృత్వ శకంలో వర్గాలు మిగిలాయి, మిగిలే వుంటాయి కూడానూ. ఎప్పుడైతే వర్గాలు అదృశ్యమవుతాయో అప్పుడే నియంతృత్వమూ అనవసరమవుతుంది. శ్రామికవర్గ నియంతృత్వం లేనిదే అవి అదృశ్యంకావు.

వర్గాలు మిగిలాయి, కాని శ్రామికవర్గ నియంతృత్వ శకంలో ప్రతి వర్గమూ మార్పు చెందింది, వర్గాలమధ్య వుండే సంబంధాలు కూడా మార్పు చెందాయి. శ్రామికవర్గ నియంతృత్వంకింద వర్గపోరాటం అదృశ్యంకాదు, అది కేవలం విభిన్న రూపాలను ధరించుతుంది.

పెట్టుబడిదారీ విధానంకింద శ్రామికవర్గం పీడితవర్గంగా, ఉత్పత్తి సాధనాలలో ఎట్టి స్వామ్యములూ లేని వర్గంగా, బూర్జువావర్గంతో సూటిగానూ, సంపూర్ణంగానూ వ్యతిరేకించుతూన్నట్టి ఏకైక వర్గంగా, తత్కారణంగా చిట్టచివరి వరకూ విప్లవాత్మకంగా వుండే సామర్థ్యం కల్గిన వర్గంగా వుండేది. బూర్జువావర్గాన్ని కూలదోసి, రాజకీయ శక్తిని జయించుకున్న తరువాత, శ్రామికవర్గమే పాలక వర్గమయింది. రాజ్యాంగయంత్ర శక్తిని అది తన చేతిలో వుంచుకుంటుంది. ఇప్పటికప్పుడే సామాజికీకృతం కావించబడిన ఉత్పాదక సాధనాలు దాని చేతిలో వున్నాయి; తటపటాయించుతూన్నట్టీ, మధ్యస్థంగా వున్నట్టీ మూలద్రవ్యాలకూ, వర్గాలకూ అది మార్గం చూపుతూంది. దోపిడీదార్ల పెచ్చుపెరిగిన ప్రతిఘటనను

అది అణచివేస్తుంది. ఇవన్నీ వర్గపోరాటంయొక్క విశిష్ట కర్తవ్యాలు, ఇదివరలో శ్రామికవర్గం తన విధిగా పెట్టుకొననట్టి, పెట్టుకొని వుండజాలనట్టి కర్తవ్యాలు.

శ్రామికవర్గ నియంతృత్వం కింద దోపిడీదార్ల, భూస్వాముల, పెట్టుబడిదార్ల వర్గాలు ఒక్క చిటికెలో అదృశ్యమైపోలేదు, అదృశ్యం కాజాలవు కూడానూ. దోపిడీదార్లు అణచి వేయబడ్డారే కాని, వారింకా నాశనం కాబడలేదు. తాము ఒక శాఖకు ప్రాతినిధ్యం వహించుతూ న్నట్టి అంతర్జాతీయ పెట్టుబడి రూపంలో ఒక అంతర్జాతీయ ఆధారం వారికింకా వుండనే వుంది. ఉత్పత్తి సాధనాలలో ఒక స్పష్టమైన భాగాన్ని వారింకా తమ చేతులోనే అట్టే పెట్టు కున్నారు, వారికింకా డబ్బుంది, బ్రహ్మాండంగా విస్తరించిన సామాజిక సంబంధాలున్నాయి వారికి. ఓడిపోయారనే కారణంచేతనే, వారి ప్రతిఘటనాశక్తి నూరురెట్లు వెయ్యిరెట్లు పెచ్చుపెరిగింది. రాజ్యాంగ, సైనిక, ఆర్థిక పరిపాలనా ''కళ'' వారికి తెలిసివుండడంవల్ల ఆధిక్యత, జనాభాలో వారికున్న సంఖ్యాబలం అనుసరించి వారికుండతగిన దానికంటె ఎంతో మించిన ఆధిక్యతే వారికుంది. జయప్రదమైన పీడిత అగ్రగామి దళంపై, అనగా శ్రామిక వర్గంపై, అధికార భ్రష్టులైన దోపిడీదార్లు సాగించుతూన్న వర్గపోరాటం మరింత నిరుప మానమైనదే, కాగా, విప్లవం గురించి మాట్లాడేటప్పుడు, ఈ భావనస్థానంలో, (రెండవ ఇంటర్నేషనల్ వీరులందరూ నెలకొల్పుతూన్నట్టుగా) సంస్కరణ భ్రాంతులును నెలకొల్ప డమును మానని పక్షమందు మరొక విధంగా వుండేందుకు ఏమాత్రమూ వీల్లేదు.

చిట్టచివరి విషయం, శ్రామికవర్గ నియంతృత్వంకింద సహితమూ సాధారణంగా పెట్టీబూర్జువావర్గం లాగానే, రైతాంగం మధ్యంతర, మధ్యేమార్గ స్థానం ఆక్రమించు తుంది: ఇటుచూస్తే భూస్వామినుండీ, పెట్టుబడిదారుడినుండీ విముక్తి సాధన అనే కష్ట జీవులందరి ఉమ్మడి ప్రయోజనాల కారణంగా ఐక్యపడినట్టి కష్టజీవి ప్రజారాశిని ఇంచుమించు అత్యధిక (వెనుకబడిన స్థితిలోవున్న రష్యాలో బృహత్తర) పరిమాణంలో అది కలిగివుంది; ఇక అటుచూస్తే, అది పరస్పరం ఐక్యత లేనట్టి సన్నకారు భూస్వాముల, ఆస్తిపరుల, వర్త కుల వర్గం. ఇటువంటి ఆర్థిక స్థితిలో శ్రామికవర్గానికీ బూర్జువావర్గానికీ మధ్య ఊగిసలా టలు తప్పనిసరిగా పొడచూపుతాయి. ఈ రెండు వర్గాల మధ్యా పోరాటం ధరించిన అత్యంత తీవ్రరూపం దృష్ట్యా, సామాజిక సంబంధాలన్నీ నమ్మశక్యంకానంత తీవ్రంగా భగ్నమైపోవడం దృష్ట్యా, మొత్తంమీద పాతదానికీ అలవాటుపడినదానికీ కట్టుబడివుంటూ, మార్పుపట్ల అనిష్టతకు రైతాంగమూ, పెట్టీబూర్జువావర్గమూ గట్టిగా ముడిపడిపోయి వుండడం దృష్ట్యానూ, ఒక పక్షంనుండి ఒక పక్షానికి వాటి మొగ్గుదల మనకు తప్పనిసరిగా ద్యోతకమవ డమూ, తటపటాయింపు, చపలచిత్తము, అనిశ్చత వగైరాలు వారిలో మనకు కనబడడమూ కేవలం సహజమే.

ఈ వర్గం — లేదా ఈ సామాజిక మూలద్రవ్యాలు — పట్ల శ్రామికవర్గం నిర్వర్తించాల్సిన కర్తవ్యం, దానిని సరైన దారిలో నడిపించి, దానిపై తన ప్రభావాన్ని ప్రసరింపజేయడానికి యత్నించడం. ఊగిసలాడుతూన్న వారికీ, స్థిరచిత్తులు కానివారికీ శ్రామికవర్గం నాయకత్వం వహించి, వారిని అది తనతో కూడా తీసుకువెళ్లితీరాలి.

శ్రామికవర్గ నియంతృత్వం వల్ల మార్పుచెందిన అన్ని మౌలిక శక్తులనూ, లేక వర్గాలనూ, వాటి పరస్పర సంబంధాలనూ మనం సరిపోల్చి చూచినట్టయితే, రెండవ ఇంటర్నేషనల్ ప్రతినిధులందరూ నమ్ముతూన్నట్టి మామూలు పెట్టీబూర్జువా భావన, సోషలిజంలోకి పరివర్తన సాధారణ "ప్రజాస్వామ్యం ద్వారా" సాధ్యమవుతుందనే భావన ఎంత శుద్ధ అసందర్భమైనదో, సైద్ధాంతికంగా ఎంత తెలివిమాలినదో మనకు బోధపడుతుంది. ఈ పొరపాటుకు మౌలిక మూలాధారం ఎక్కడుందంటే, "ప్రజాస్వామ్యం" అనేది ఏదో ఒక పరమమైనదనేటట్టి, వర్గాలతో దానికి ఎట్టి సంబంధమూ లేదనేటట్టి బూర్జువావర్గంనుండి వారసత్వంగా వచ్చిన దురభిమానంలోనే వుంది. వాస్తవానికి వర్గపోరాటం వెనకటికంటె ఉన్నతస్థాయికి లేచి, ఏ ఒక రూపంకంటెనూ, అన్ని రూపాలకంటెనూ ప్రబలమైన ఆధిక్యతను వహించుతూండే సమయంలోనే, ప్రజాస్వామ్యమే శ్రామికవర్గ నియంతృత్వం కింద సంపూర్ణంగా ఒక కొత్త దశలోకి ప్రవేశిస్తుంది.

స్వేచ్ఛ, సమానత్వం, ప్రజాస్వామ్యాల గురించి చెప్పబడే సామాన్యపు కబుర్లన్నీ, వర్తకపు సరుకుల ఉత్పత్తి సంబంధాల ప్రతిరూపమే అయిన భావాల గుడ్డి పునశ్చరణే తప్ప మరేమీ కాదు. ఇట్టి సామాన్యపు కబుర్లవల్లనే శ్రామికవర్గ నియంతృత్వపు నిర్దిష్ట సమస్యలను పరిష్కరించ ప్రయత్నించడమంటే, బూర్జువా సిద్ధాంతాలనూ, సూత్రాలనూ కడవెళ్లా అంగీకరించడ మన్నమాటే. శ్రామికవర్గ దృక్స్థానం నుండి చూచినట్టయితే, ప్రశ్నను కేవలం ఈ విధంగా వేయాల్సి వుంటుంది: ఏ వర్గంయొక్క పీడనుండి స్వేచ్ఛ, ఏ వర్గంతో ఏ వర్గంయొక్క సమానత్వం, ప్రైవేటు ఆస్తి ప్రాతిపదికపైన ఏర్పడిన ప్రజాస్వామ్యమా, లేక ప్రైవేటు ఆస్తిని రద్దు పరచే పోరాటపు ప్రాతిపదికపైన ఏర్పడిన ప్రజాస్వామ్యమా? — ఇంకా ఇలాంటివే, ఇతర ప్రశ్నలను కూడా వేయాల్సి వుంటుంది.

సమానత్వ భావన వృత్పన్నమే వర్తకపు సరుకుల ఉత్పత్తి సంబంధాల వృత్పన్నమే, సమానత్వమంటే దాని అర్థం వర్గాలను రద్దుచేయడమే అని గ్రహించని పక్షంలో, సమానత్వ భావన ఒక దురభిమానంగా తయారవుతుందని, ఎంగెల్స్ తన "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" అనే గ్రంథంలో ఏనాడో వివరించి చెప్పాడు. బూర్జువా-ప్రజాస్వామిక సమానత్వ భావానికీ సోషలిస్టు సమానత్వ భావానికీ వుండే వ్యత్యాసాన్ని గురించిన ఈ ప్రాథమిక సత్యం నిరంతరమూ విస్మరించబడుతూంది. కాని ఇది విస్మరించబడని పక్షంలో, బూర్జువావర్గాన్ని కూల

దోయడం మూలంగా శ్రామికవర్గం వర్గాలను రద్దు చేసేందుకై అత్యంత నిర్ణయాత్మక చర్యను తీసుకుంటూందనీ, రాజ్యాంగయంత్ర శక్తియొక్క ఉపకరణాన్ని ఉపయోగించుతూ, కూలదోయబడిన బూర్జువావర్గంతోనూ, ఊగిసలాడుతూన్న పెట్టీబూర్జువావర్గంతోనూ పోరాడుతూ, వాటిపై ప్రభావాన్ని ప్రసరించుతూ, వాటిపై ఒత్తిడిని కల్గించుతూ, ఈ ప్రక్రియను పూర్తి చేసేందుకై శ్రామికవర్గం తన వర్గపోరాటాన్ని సాగించాల్సే వుంటుందనీ ప్రత్యక్షంగా స్పష్టమవుతుంది.

(సశేషం)*

అక్టోబరు 30, 1919

---

* వ్యాసం అసంపూర్తిగానే వుండిపోయింది — సం.

# యువజన సంఘాల కర్తవ్యాలు

## (రష్యన్ కమ్యూనిస్టు యువజన సంఘం తృతీయ అఖిల రష్యా కాంగ్రెస్‌లో ఇచ్చిన ఉపన్యాసం)

### అక్టోబరు 2, 1920

కామ్రేడ్స్, యువజన కమ్యూనిస్టు సంఘం మౌలిక కర్తవ్యాలను గురించీ, ఈ సందర్భంలో సోషలిస్టు రిపబ్లిక్కులో యువకుల ఆర్గనైజేషనులు సాధారణంగా ఎలా వుండాలో ఆ విషయం గురించీ నేడు నేను చర్చించ నుద్దేశించాను.

ఒక విధంగా చెప్పాలంటే, కమ్యూనిస్టు సమాజం సృష్టించడమనే నిజమైన కర్తవ్యాన్ని ఎదుర్కొన వలసినవారు అచ్చంగా యువకులే అవడం కారణంగా ఈ ప్రశ్నను పరిశీలించడం మరింత ముఖ్యం. ఎందుచేతంటే, పెట్టుబడిదారీ సమాజంలో పుట్టి పెరిగిన శ్రమజీవుల తరం ఎంత సాధించగల్గినా, దోపిడీ విధానంపై నిర్మించబడిన పాత, పెట్టుబడిదారీ సామాజిక జీవిత పునాదులను నాశనం చేయడమనే కర్తవ్యాన్ని మాత్రమే సాధించగల్గుతుందన్న విషయం స్పష్టంగానే కనబడుతూంది. అది ఎంత సాధించగల్గినా, శ్రామికవర్గానికీ, శ్రమజీవి వర్గాలకూ, తమ అధికారాన్ని నిలబెట్టుకునేందుకు సహాయపడే నూతన స్థితిగతులలో, మానవుల మధ్య దోపిడీ సంబంధాలు అప్పుడే అంతరించిపోయినట్టి పరిస్థితిలో క్రియాకలాపాలను సాగించ నారంభించిన తరం ఏ పునాదులపైన మాత్రమే నిర్మించ గల్గుతుందో, అట్టి దృఢమైన పునాదులను నిర్మించేటట్టి సామాజిక వ్యవస్థను సృష్టించే కర్తవ్యాన్ని మాత్రమే సాధించ గల్గుతుంది.

కాగా, యువకుల కర్తవ్యాలను ఈ దృక్‌స్థానంనుండి సమీపించడంలో, సాధారణంగా యువకుల కర్తవ్యాలనూ, ప్రత్యేకంగా యువజన కమ్యూనిస్టు సంఘంయొక్క, ఇంకా అన్ని ఇతర ఆర్గనైజేషన్లయొక్క కర్తవ్యాలనూ క్లుప్తంగా ఒక్కమాటలో చెప్పేయవచ్చునవే నేను భావించుతున్నాను: మీ కర్తవ్యం నేర్చుకోవడం.

అవును, ఇది ''ఒక్క పదమే''. ప్రధానమైనట్టీ, అత్యంత ముఖ్యమైనట్టీ ప్రశ్నలకు ఇది సమాధానం ఇవ్వడంలేదు: ఏమిటి నేర్చుకోవాలి? ఎలాగు నేర్చుకోవాలి? పాత, పెట్టు

బడిదారీ సమాజం పరివర్తన చెందడంతో, కమ్యూనిస్టు సమాజాన్ని సృష్టించేటట్టి నూతన తరాల విద్యాబోధన, పెంచి వృద్ధికి తెచ్చే శిక్షణ, విద్యాభ్యాసం పాతపద్ధతులపైన సాగించ డానికి వీలుపడదు, ఇదే అసలు విషయం. యువకుల విద్యాబోధన, పెంచి వృద్ధికితెచ్చే, శిక్షణ, విద్యాభ్యాసం పాత సమాజం మనకిచ్చిపోయిన సాధనసంపత్తిపైనే ఆరంభమవాలి. పాత సమాజం నుండి మనకు సంప్రాప్తించిన మొత్తం విజ్ఞానమూ ఆర్గనైజేషన్లూ, సంస్థలూ, వీటినుండి మాత్రమే, మనకు సంప్రాప్తించిన మానవశక్తుల, సాధనాల సంచయంతో మాత్రమే మనం కమ్యూనిజాన్ని నిర్మించగల్గుతాం. యువకుల విద్యాబోధన కార్యకలాపాన్నీ యువకులను ఆర్గనైజు చేయడమునూ, పెంచి వృద్ధికితెచ్చే శిక్షణనూ సమూలంగా పునర్నిర్మించడంవల్ల మాత్రమే, పాతసమాజంతో పోలికలేని సమాజాన్ని, అనగా కమ్యూనిస్టు సమాజాన్ని సృష్టించ డంలో నూతన తరం యత్నాలు సఫలీకృత మయేటట్లు మనం చేయగల్గుతాం. ఇందుచేతనే, యువకులకు మనం బోధించాల్సింది ఏమిటి, కమ్యూనిస్టు యువకులు అనే పేరు నిజంగా సార్థకపరచుకోవాలంటే వారు ఎలా నేర్చుకోవాలి, మనం ప్రారంభించిన దానిని నిర్మించి, పరిసమాప్తి చేయగల్గేందుకు వారు ఎట్టి శిక్షణ పొందాలి, అనే ఈ ప్రశ్నను మనం సవివరంగా పరిశీలించాల్సి వుంటుంది.

ఈ ప్రశ్నకు మొట్టమొదటి సమాధానంగానూ, అత్యంత ప్రకృతిసిద్ధమైన సమాధానంగానూ కమ్యూనిజంలోకి పరివర్తనను కాంక్షించుతూన్న యువజన సంఘం, అంతేకాకుండా సాధారణంగా యువకులు అందరూనూ కమ్యూనిజాన్ని అధ్యయనం చెయ్యాల్సి వుంటుందనే జబాబు వస్తుందనే నేను చెప్పాలి.

కాని ఈ సమాధానం — "కమ్యూనిజాన్ని అధ్యయనం చేయాలి" అనే సమాధానం — మరీ సాధారణమైనది. కమ్యూనిజాన్ని అధ్యయనం చెయ్యాలంటే మనకు ఏమిటి అవసరమవుతుంది? కమ్యూనిజం గురించి విజ్ఞానాన్ని సంపాదించేందుకు సాధారణ విజ్ఞానం మొత్తం నుండి దేనిని మనం ముఖ్యంగా ప్రత్యేకించి ఎంచుకోవాలి? కమ్యూనిజాన్ని అధ్యయనం చేయడమనే కర్తవ్యం పొరపాటుగా ప్రదర్శించబడి నప్పుడల్లా, లేదా కేవలం ఏకపక్షంగా మాత్రమే వ్యాఖ్యానించబడి నప్పుడల్లా, అనేక ప్రమాదాలు తలెత్తుతాయి.

కమ్యూనిజాన్ని అధ్యయనం చేయడమంటే దాని అర్థం కమ్యూనిస్టు పాఠ్యపుస్తకాల్లోనూ, పాంఫ్లెట్లలోనూ, గ్రంథాల్లోనూ పొందుపరచబడినట్టి మొత్తం విజ్ఞానాన్ని అవగాహన చేసుకోవడమే, అని ఎవరికేనా సహజంగానే తట్టుతుంది. కాని కమ్యూనిజం అధ్యయనాన్ని ఈ విధంగా నిర్వచించడం మరీ మొరటుగానూ అయుక్తంగానూ వుంటుంది. కమ్యూనిజాన్ని అధ్యయనం చేయడమంటే, కేవలం కమ్యూనిస్టు పుస్తకాలలో వున్నదానిని ఆకళింపు చేసుకోవడంతోనే సమానమయే పక్షమందు, కమ్యూనిస్టు వచనంతో ఇంద్రజాలం చేసేవారూ బడా

యిఖోరులూ మనకు అతి సులభంగానే దొరుకుతారు, కాగా దీనివల్ల మనకెంతేనా హానీ, నష్టమే సంభవించుతుంది కూడా, ఎందుకంటే ఇటువంటివారు కమ్యూనిస్టు గ్రంథాలలోనూ పాంఫ్లెట్లలోనూ వున్నదానిని భట్టీయంవేసి నేర్చుకోవడం కారణంగా ఈ విజ్ఞానాన్నంతనూ సమైక్యం చేసేందుకు వారు అసమర్థు లనిపించుకుంటారు, కమ్యూనిజం యథార్థంగా డిమాండు చేసే విధంగా ఆచరించేందుకు కూడా వారు అసమర్థులే అవుతారు.

పాత, పెట్టుబడిదారీ సమాజం మనకి ఇచ్చిపోయినట్టి మహా ఘోరకలిలోనూ, దురదృష్టాలలోనూ ఒకటి, ఆచరణలో జీవితానికీ పుస్తకాలకీ మధ్యవుండే అగాధం; దీనికి కారణమేమంటే, పుస్తకాల్లో ప్రతీదీకూడా ఎంత చక్కగా అభివర్ణించడానికి వీలుంటుందో అంత చక్కగా అభివర్ణించబడింది, అయినప్పటికీ ఈ పుస్తకాలలో అధికసంఖ్య పెట్టుబడిదారీ సమాజాన్ని అతి హేయములైనట్టి కుటిలబుద్ధితో కూడుకున్నట్టి అబద్ధాలతో మనకు వర్ణించుతున్నాయి.

ఇందుచేత కమ్యూనిజం గురించి కేవలం పుస్తకాల్లో రాసినదానిని ఒంటపట్టించుకోవడం ఎంతేనా తప్పు అవుతుంది. మన ఉపన్యాసాలూ, మన పత్రికావ్యాసాలూ మన దైనందిన కార్యకలాపంలో ప్రతి శాఖతోనూ సంబంధం కలిగివుంటాయి కాబట్టి, మన ఉపన్యాసాల్లోనూ మన పత్రికావ్యాసాల్లోనూ కమ్యూనిజాన్ని గురించి మునుపు పుస్తకాల్లో చెప్పిన దానినే మన మిప్పుడు పునశ్చరణ చేయడంలేదు. పనిచేయకుండా, పోరాటం లేకుండా, కమ్యూనిజం గురించి పాంఫ్లెట్లనుండీ గ్రంథాలనుండీ నేర్చుకున్న అనిర్దిష్ట విజ్ఞానం శుద్ధనిరర్థకం, ఎందుచేతంటే, ఇలా చేసినట్టయితే సిద్ధాంతానికీ ఆచరణకూ వుండినట్టి పాత అగాధం, పాత బూర్జువా సమాజపు స్వభావాలన్నిటిలో అత్యంత ఏహ్యమైనట్టి ఆ పాత అగాధం ఇంకా ఆలా వుండిపోతూనే వుంటుంది.

ఇక ఇంతకంటెనూ ప్రమాదభరితమైనది, కేవలం కమ్యూనిస్టు నినాదాలను మాత్రమే ఒంటపట్టించుకుందుకు ప్రారంభించడం. ఈ ప్రమాదాన్ని మనం సకాలంలోనే గనుక గుర్తించి వుండని యెడల, ఈ ప్రమాదాన్ని నివారించేందుకు మన శక్తినంతనూ వినియోగించి వుండని యెడల, ఈ పద్ధతిలో కమ్యూనిజాన్ని అధ్యయనం చేసిన పిమ్మట తాము కమ్యూనిస్టులమని పేరు పెట్టుకొనబోయే ఐదు లక్షలమంది, పది లక్షలమంది యువతీయువకులు, కమ్యూనిజానికి మహత్తరమైన నష్టాన్నే కల్గించేవారవుతారు.

ఇక్కడ ఈ ప్రశ్న తలెత్తుతుంది: కమ్యూనిజం గురించి నేర్చుకుందుకు దీనినంతనూ మనం మేళవించడం ఎలాగు? పాత పాఠశాలనుండి, పాత విజ్ఞానశాస్త్రంనుండి మనం దేనిని స్వీకరించాలి? సర్వతోముఖ విద్యను అలవరచుకున్న ప్రజలను తయారుచెయ్యడమూ, సాధారణంగా విజ్ఞానశాస్త్రాలను బోధించడమూ తన ధ్యేయమని పాత పాఠశాల ఉద్ఘోషించింది.

ఇది శుద్ధ అబద్ధంకింద తేలిపోయిందని మనం ఎరుగుదుం, ఎందుకంటే యావత్తు సమాజమూ ప్రజలను వర్గాలకింద, దోపిడీదార్లూ పీడితులూ కింద, విభాజనపైనే ఆధారపడి, ఆ విభాజనపైనే అది నిలబెట్టబడుతూ వచ్చింది. వర్గభావంతో పూర్తిగా నిండివుండిన యావత్తు పాతపాఠశాల సహజంగానే ఒక్క బూర్జువావర్గం బిడ్డలకు మాత్రమే విద్య కరపింది. ప్రతి పదమూ బూర్జువావర్గ ప్రయోజనాలకు అనుగుణ్యంగా వుండేటట్టు అబద్ధంచేయబడింది. ఈ పాఠశాలలో యువతరం కార్మిక కర్షకులను విద్యావంతులను చేయడం కంటె, బూర్జువావర్గ ప్రయోజనాల కోసం వారి చెవుల్లో చదువు నూరిపోయడమే ఎక్కువైంది. బూర్జువావర్గానికి ఉపయోగపడి, దాని శాంతికీ, విశ్రాంతికీ భంగం కలుగకుండానే దానికి లాభాలు సృష్టించ సమర్థులైన నౌకర్లుగా వారికి తర్ఫీదు ఇవ్వబడింది. ఈ హేతువునే, పాత పాఠశాలను తిరస్కరించుతూ, నిజమైన కమ్యూనిస్టు విద్యాప్రబోధానికై మనకు కావలసినదానిని మాత్రమే దానినుండి స్వీకరించడం మన కర్తవ్యంగా భావించాలి.

తరుచు మనం వింటూన్నట్టి, కేవలం తప్పుడు పర్యవసానాలకు దారితీసేటట్టి పాత పాఠశాలపై మోపబడుతూన్నట్టి నిందలనూ, నేరాలనూ గురించి నేనిప్పుడు ప్రస్తావిస్తాను. పాత పాఠశాల పాఠాలు నేర్పే బడి అనీ, డ్రిల్-సార్జంటు పద్ధతిలో చదువుచెప్పే బడి అనీ, విద్యను బలవంతాన బుర్రలో కూరే బడి అనీ చెప్పడం కద్దు. ఇది నిజమే, కాని పాత పాఠశాలావిధానంలో ఏది చెడ్డదో ఏది మంచిదో, మనకి ఏది ఉపయోగపడుతుందో మనం పోల్చుకొని, కమ్యూనిజానికి ఏది మంచిదో దానిని ఎంచుకోగల్గి వుండాలి.

పాత పాఠశాల కేవలం పాఠాలు నేర్పే బడే; నిరుపయోగమైనట్టి, అనావశ్యకమైనట్టి, నిర్జీవమైనట్టి, మెదడును కరడుకట్టించినట్టి, ఒకే ఒక నమూనాలో మలచబడి దాష్టీకంచేసే సగటుసరి అధికార్లుగా యువతరంవారిని రూపొందించినట్టి విజ్ఞానాన్నే ఒంటపట్టించుకున్నట్టుగా విద్యార్థులను అది నిర్బంధించింది. ఏతావాతా మానవ విజ్ఞానం సంతరించిపెట్టిన దానిని సముపార్జించకుండానే కమ్యూనిస్టు కాగలడని దీనినుండి పర్యవసానం తేల్చడానికి మీరు ప్రయత్నించారంటే మాత్రం, మీరు గొప్ప పొరపాటు చేసినవారే అవుతారు. కమ్యూనిజం తానే దేనికి అనుషక్తమవుతూందో అట్టి మొత్తం విజ్ఞానాన్నీ సముపార్జించుకోనిదే కమ్యూనిస్టు నినాదాలను, కమ్యూనిస్టు విజ్ఞానశాస్త్ర పర్యవసానాలను నేర్చుకున్నంత మాత్రాన చాలునని అనుకోవడం పొరపాటవుతుంది. మొత్తం మానవ విజ్ఞానం నుండి ఏ విధంగా కమ్యూనిజం ఉద్భవించిందో అందుకు మార్క్సిజమే ఒక తార్కాణం.

కమ్యూనిస్టు సిద్ధాంతం, ప్రధానంగా మార్క్సుచే స్థాపించబడినట్టి కమ్యూనిస్టు విజ్ఞానశాస్త్రం, మార్క్సిజం చేసే ఈ ఉపదేశం, పందొమ్మిదవ శతాబ్దిలోని ఏకైక సోషలిస్టు యొక్క, అతడెంతటి ప్రతిభాశాలే అయినప్పటికీ, ఆ ఏకైక సోషలిస్టుయొక్క కృతిగా నిలిచి

పోలేదనీ, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా, తాము సాగించుతూన్న పోరాటంలో ఈ ఉపదేశాన్ని ప్రయుక్తం చేస్తూన్నట్టి లక్షోపలక్షల కోటానకోట్ల సర్వప్రపంచ శ్రామికుల ఉపదేశంగా రూపొందిందనీ మీరు చదివేవుంటారు, వినేవుంటారు. అత్యంత విప్లవాత్మక మైన వర్గానికి చెందిన లక్షోపలక్షల, కోటానకోట్ల ప్రజలను మార్క్స్ ఉపదేశం ఎందుకు ఆకర్షించ గల్గిందని మీరు అడిగారంటే, అందుకు మీకు ఒకే ఒక ప్రత్యుత్తరం వస్తుంది: పెట్టుబడిదారీ విధానంకింద సంచితము కాబడినట్టి మానవవిజ్ఞానంయొక్క దృఢమైన పునాదిపై మార్క్స్ తన స్థానం తీసుకోవడమే ఇందుకు కారణమైంది. మానవసమాజ అభివృద్ధి నియమాలను అధ్యయనం చేసినవాడై, కమ్యూనిజం దిశగా పెట్టుబడిదారీ విధానాభివృద్ధి అనివార్యతను మార్క్స్ గ్రహించాడు. కాగా, ముఖ్యమైన విషయ మేమిటంటే, ఇంతకు ముందుండిన విజ్ఞానశాస్త్రం ప్రభవించిన దానినంతనూ సంపూర్ణంగా జీర్ణించుకోవడం ఫలితంగానే, ఈ పెట్టుబడిదారీ సమాజాన్ని అత్యంత నిశితంగానూ అత్యంత వివరంగానూ అత్యంత ప్రగాఢంగానూ అధ్యయనం చేయడమనే ప్రాతిపదికపైనే అతడీ విషయాన్ని కచ్చితంగా రుజువుచేశాడు. ఒక్క విషయాన్ని కూడా వదలిపెట్టకుండా, మానవసమాజం సృష్టించిన దాని నంతకూ విమర్శనాత్మకంగా ఒక నూతనరూపాన్నిచ్చాడు. మానవ చింతన సృష్టించినదాని నంతనూ అతడు పునఃరూపొందించి, విమర్శించి, కార్మికవర్గ ఉద్యమ పరీక్షకు లోనుగావించి, బూర్జువా పరిధులకే పరిమితం చేయబడినట్టి, లేదా బూర్జువా దురభిమానాలచే బంధించబడిన వారికి తేల్చ శక్యముకానట్టి పర్యవసానాలను అతడు తేల్చగల్గాడు.

శ్రామికవర్గ సంస్కృతిని గురించి మనం మాట్లాడేటప్పుడు ఉదాహరణకు, ఈ విషయాన్ని మనం దృష్టిలో వుంచుకోవాలి. మానవజాతియొక్క యావత్తు అభివృద్ధీ సృష్టించినట్టి సంస్కృతిని గురించి కచ్చితమైన విజ్ఞానంవల్లనే, ఈ సంస్కృతికి పునరాకృతినివ్వడం వల్లనే శ్రామికవర్గ సంస్కృతిని నిర్మించ గల్గుతామన్న విషయాన్ని మనం స్పష్టంగా గ్రహించుతేనే తప్ప — దీనిని మనం అర్థం చేసుకుంటేనే తప్ప — మనమీ సమస్యను పరిష్కరించలేం. శ్రామికవర్గ సంస్కృతి ఎక్కడనుంచో ఏ ఆకాశనుంచో ఊడిపడినదికాదు, శ్రామికవర్గ సంస్కృతిలో నిష్ణాతులమని చెప్పుకొనేవారి నూతన కల్పనకాదు. అలాగని చెప్పడం సబబూ సందర్భంలేని ప్రేలాపన. పెట్టుబడిదారీ విధాన సమాజ, భూస్వామ్య విధాన సమాజ, అధికార వర్గ పాలన విధాన సమాజాల కాడికింద మగ్గుతూండిన మానవజాతి కూడబెట్టుకున్న విజ్ఞాననిధుల సూత్రబద్ధమైన అభివృద్ధి ఫలితంగానే శ్రామికవర్గ సంస్కృతి ఉద్భవించి తీరాలి. మార్క్స్‌చే నూతన రూపకల్పన చేయబడినట్టి అర్థశాస్త్రం మానవ సమాజం తన పురోగమనంలో చేరుకుంటూన్న గమ్యాన్ని మనకేలాగైతే చూపించిందో, వర్గపోరాటంలోకి పరివర్తనను, శ్రామికవర్గ విప్లవారంభాన్ని మనకేలాగైతే చూపించిందో, అలాగే ఈ మార్గ

లన్నీ, ఈ బాటలన్నీ శ్రామికవర్గ సంస్కృతికే దారి తీశాయి, దారి తీస్తున్నాయి, ఇకముందు కూడా దారి తీస్తునే వుంటాయి.

యువకుల ప్రతినిధులూ, నూతన విద్యావిధాన సమర్థకులు కొందరూ పాత పాఠశాలను దుయ్యబట్టుతూ, అది విద్యను బలవంతాన బుర్రలో కూరే పాఠశాలే తప్పమరేమీ కాదని చెప్పుతూండడం మనం తరుచుగా వింటూనప్పుడు, పాత పాఠశాలలోని మంచిని మనం స్వీకరించాలని వారితో మనం చెబుతాం. పదింట తొమ్మిదిపాళ్లు నిరర్థకమైనట్టీ, కడమ ఒక పాలూ వికృతం చేయబడినట్టీ బ్రహ్మాండమైన విజ్ఞానభారాన్ని యువజనుల మనస్సులపై మోపుతూన్న విధానాన్ని పాత పాఠశాలనుండి మనం తీసుకోకూడదు. అయితే కమ్యూనిస్టు పర్యవసానాలకే మనం పరిమితమై వుండాలనీ, కమ్యూనిస్టు నినాదాలను మాత్రమే మనం నేర్చుకోవాలనీ దీని అర్థంకాదు. ఆ విధంగా మీరు కమ్యూనిజాన్ని సృష్టించలేరు. మానవ జాతి ఉద్భవింపజేసినట్టి సర్వవిజ్ఞాన నిధులతోనూ మీ మేధస్సును సంపన్నవంతం చేసుకున్నప్పుడే మీరు కమ్యూనిస్టులు కాగల్గుతారు.

విద్యను బలవంతాన బుర్రలో కూరడం మనకవసరంలేదు; కాని మౌలిక వాస్తవవిషయాల పరిజ్ఞానంచే ప్రతి విద్యార్థి మనస్సునీ మనం అభివృద్ధిచేసి, పరిణతికి తీసుకురావాలి. ఎందుచేతనంటే, తాను సంపాదించిన విజ్ఞానం అంతాకూడా తన మనస్సులో జీర్ణించుకోని పక్షమందు కమ్యూనిజం శూన్యమే, వుత్త ఖాళీ సైన్‌బోర్డు మాత్రమే అవుతుంది, కమ్యూనిస్టు అన్నవాడు శుద్ధ బడాయిఖోరుగానే తయారవుతాడు. మీ మేధస్సును నిరర్ధక పరిజ్ఞానంతో కుక్కికూరకుండా, ఆధునిక విద్యావంతునికి అపరిత్యాజ్యమైనట్టి వాస్తవవిషయాలన్నిటితోనూ మీ మేధస్సును సంపన్నవంతం చేసేందుకై ఈ విజ్ఞానాన్ని మీరు జీర్ణం చేసుకోవడమే కాకుండా, దానిని మీరు విమర్శనాత్మకంగా ఒంటపట్టించుకోవడం అవసరం. తాను స్వయంగా ఎంతో కష్టపడి గంభీరమైన కృషి చేయకుండానే, తాను విమర్శనాత్మకంగా పరిశీలించాల్సిన వాస్తవవిషయాలను అర్థం చేసుకోకుండానే, సిద్ధంగా తయారుచేసి పెట్టిన పర్యవసానాలను నేర్చుకున్న కారణంగా తన కమ్యూనిజం విజ్ఞానాన్ని గురించి బడాయిలు చెప్పుకొన నుద్యమించేటట్టి కమ్యూనిస్టును చూచి ఎంతేనా జాలిపడాల్సే వుంటుంది. ఇటువంటి మిడిమిడి జ్ఞానం నిస్సందేహంగా వినాశకరమే అవుతుంది. నాకున్న జ్ఞానం స్వల్పమే అని నేను తెలుసుకున్నప్పుడు, ఇంకా అధికజ్ఞాన సముపార్జనకు నేను కృషిచేస్తాను; కాని తాను కమ్యూనిస్టుననీ, తాను దేనినీ కుణ్ణంగా నేర్చుకో నవసరంలేదనీ చెప్పుకునే మనిషి, మరేమైనా కాగలడేమో గాని, కమ్యూనిస్టు మాత్రం కాజాలడు.

పెట్టుబడిదార్లకు అవసరమైన గులాములను తయారుచేసేంది పాత పాఠశాల; పెట్టుబడిదార్లకు ఏది సరిపోయేదో దానిని రచించి, దానినే నుడివేటట్టి మనుషులుగా విజ్ఞాన

శాస్త్రవేత్తలను మార్చివేసింది పాత పాఠశాల. అందుచేతే మనం దానిని ఎత్తివేయాల్సి వచ్చింది. కాని దానిని మనం ఎత్తివేయాల్సి వచ్చిందంటేనూ, దానిని నాశనం చేయాల్సి వచ్చిందం టేనూ, దానినుండి మానవునికి అతిముఖ్యమైన, మానవజాతి కూడబెట్టుకున్న దానినంతనూ మనం తీసుకోకూడదనా దీని అర్థం? పెట్టుబడిదారీ విధానానికి అవసరమైన దానినీ కమ్యూని జానికి అవసరమైన దానినీ మనం విడదీసి వేర్వేరు చేయగల్గడం అవసరం లేదనా దీని అర్థం?

బూర్జువావర్గ సమాజంలో అధికసంఖ్యాకవర్గంయొక్క సంకల్పానికి వ్యతిరేకంగా అవలంబించబడిన డ్రిల్-సార్జంటు పద్ధతిలో చదువుచెప్పే పాత పద్ధతుల స్థానంలో, ఐక్యత లేక, బ్రహ్మాండమైన దేశమందంతటా చెదురు మదురుగావున్న లక్షోపలక్షల, కోటానకోట్ల ప్రజల సంకల్పాలను ఏకైక సంకల్పంగా పరిణమింపజేసే ఈ పోరాటం కోసం తమ శక్తులను పట్టుదలతోనూ, సమర్థతతోనూ, సంసిద్ధతతోనూ ఐక్యపరచి, ఆర్గనైజుచేసి, వాటిని పాత సమాజంపట్ల ద్వేషంతో ఎవరైతే మిళితం చేస్తున్నారో అట్టి కార్మికుల కర్షకుల చైతన్య యుతమైన క్రమశిక్షణను మనం నెలకొల్పుతున్నాం; ఎందుచేతనంటే ఈ ఏకైక సంకల్పం లేనిదే ఓటమి తప్పనిసరే అవుతుంది. ఈ సంసక్తి లేనిదే, కార్మికుల, కర్షకుల చైతన్యవంత మైన క్రమశిక్షణ లేనిదే, మన ఉద్యమం నెరవేరే ఆశలేదు. ఇదిలేనిదే, సర్వప్రపంచ పెట్టుబడి దార్లనూ భూస్వాములనూ మనం జయించలేము. ఏ పునాదిపైనైతే మనం నూతన కమ్యూ నిస్టు సమాజాన్ని నిర్మించాలనుకుంటున్నామో అట్టి నిర్మాణం అటుండగా, అసలు ఆ పునా దినే మనం దృఢపరచలేక పోతాం. అదే విధంగా పాత పాఠశాలను తిరస్కరించుతూండగా, పాత పాఠశాలపట్ల ద్వేషం కేవలం న్యాయమైనదే, ఆవశ్యకమైనదే అయివుండగా, పాత పాఠ శాలను నాశనం చేసేందుకు సంసిద్ధత హర్షణీయమే అయివుండగా, పాఠాలు నేర్పే పాత విధా నమూ, విద్యను బలవంతాన బుర్రలో కూరే పాత విధానమూ, డ్రిల్-సార్జంటు పద్ధతిలో చదువుచెప్పే విధానం స్థానే, మానవ విజ్ఞాన నిధిని సముపార్జించే సామర్థ్యాన్నీ, కమ్యూనిజ మంటే ఏదో రోకటిపాటగా నేర్చుకునేది కాకుండా, మీ అంతట మీరే పర్యాలోచించినట్టిదే, ఆధునిక విద్యావిధానం దృష్ట్యా అనివార్యములైనట్టి సారాంశాలను కలిగివున్నట్టిదే కమ్యూనిజం అనే విధంగా నేర్చుకునేటట్టి సామర్థ్యాన్ని నెలకొల్పాల్సి వుంటుందని మనం గ్రహించాలి.

ఈ హేతువునే కమ్యునిజాన్ని అధ్యయనం చేయడమనే కర్తవ్యం గురించి మాట్లాడు తూన్నప్పుడు ఏవి ప్రధాన కర్తవ్యాలో వాటిని మనం ప్రదర్శించాల్సి వుంటుంది.

దీనిని మీకు వివరించేందుకూ, ఏ విధంగా అధ్యయనం చెయ్యాలి అనే ప్రశ్నను సమీ పించేందుకు కూడానూ, ఆచరణనుండి ఒక ఉదాహరణను తీసుకుని మీకు చూపిస్తాను. సైనిక కర్తవ్యాల వెనువెంటనే, రిపబ్లిక్కును రక్షించుకునే కర్తవ్యాల వెనువెంటనే, ఆర్థిక కర్తవ్యాలను మన మిప్పుడు ఎదుర్కోవాల్సి వుందన్న విషయం మీకందరకూ తెలిసినదే. పరి

శ్రమనూ, వ్యవసాయాన్నీ పునరుద్ధరించనిదే కమ్యూనిస్టు సమాజ నిర్మాణం జరగనేరదన్న విషయం మనం ఎరుగుదుం; అంతేకాదు, వీటి పునరుద్ధరణ పాతపద్ధతిలో జరగకూడదు కూడా. వీటి పునరుద్ధరణ ఆధునిక ప్రాతిపదికపైన, విజ్ఞానశాస్త్రంలో తుది మాట ననుసరించే జరగాలి. ఈ ప్రాతిపదిక విద్యుచ్ఛక్తి అనీ, యావత్తు దేశమూ, పరిశ్రమ వ్యవసాయాల అన్ని శాఖలూ విద్యుదీకృతమైనప్పుడే, ఈ కర్తవ్యంలో మీరు ప్రవీణతను సంపాదించిన తరువాత మాత్రమే, పాత తరంవారు నిర్మించలేని కమ్యూనిస్టు సమాజాన్ని మీకోసం మీరు నిర్మించగల్గుతారనీ కూడా మీకు తెలుసు. యావత్తు దేశాన్నీ ఆర్థికంగా పునరుజ్జీవింప జేయడమనే ఈ కర్తవ్యం మిమ్మల నెదుర్కొంటూంది. విద్యుదీకరణ కార్యాన్ని నిరక్షరాస్యులైన ప్రజలు సాధించలేరనీ, అంతేకాకుండా కేవలం అక్షరాస్యతే ఇందుకు చాలదని కూడా మీరు పూర్తిగా ఎరుగుదురు. విద్యుచ్ఛక్తి అంటే ఏమిటో తెలిసినంత మాత్రాన సరిపోదు; పరిశ్రమలోనూ వ్యవసాయంలోనూ, పరిశ్రమ వ్యవసాయాల వివిధ శాఖలలోనూ సాంకేతిక శాస్త్ర దృష్ట్యా దానిని ఏ విధంగా ప్రయుక్తం చేయాలో తెలిసివుండడం అవసరం. దీనిని మన మటుకు మనమే నేర్చుకోవాలి; అంతేకాకుండా ఇప్పుడు పెరిగి పెద్దవారవుతూన్న శ్రామికవర్గ తరానికంతకూ బోధించాలి కూడా. ఈ కర్తవ్యాన్ని వర్గచైతన్యవంతుడైన ప్రతి కమ్యూనిస్టూ, తాను కమ్యూనిస్టునని భావించుకున్నట్టీ, యువ కమ్యూనిస్టు సంఘంలో చేరడం మూలంగా కమ్యూనిజాన్ని నిర్మించేందుకు పార్టీకి సహాయపడతాననీ, కమ్యూనిస్టు సమాజాన్ని సృష్టించడంలో నూతన తారానికంతకూ సహాయపడతాననీ తాను ప్రతిజ్ఞ బూనుతున్నానని స్పష్టంగా గ్రహించుతూన్న ప్రతి వ్యక్తీ ఎదుర్కొవాల్సివుంది. ఆధునిక విద్య ప్రాతిపదికపైనే తాను దీనిని సృష్టించ గల్గుతాననీ, కాగా ఈ విద్యను తాను సముపార్జించనిదే కమ్యూనిజం కేవలం అడియాశగానే వుండిపోతుందనీ అతడు గ్రహించాలి.

బూర్జువావర్గాన్ని కూలదోయడం పాత తరం వారి కర్తవ్యంగా వుండేది. బూర్జువా వర్గాన్ని విమర్శించడమూ, ప్రజారాసులలో బూర్జువావర్గం పట్ల ద్వేషం రేకెత్తించడమూ, వర్గచైతన్యాన్ని అభివృద్ధి పరచుకోవడమూ, తమ శక్తులను దృఢపరచుకునే సామర్థ్యాన్ని సంపాదించుకోవడమూ అప్పట్లో ప్రధాన కర్తవ్యంగా వుండేది. దీనికంటె మరింత సంక్లిష్టమైన కర్తవ్యాన్నే నూతనతరం ఎదుర్కోవాల్సి వుంది. పెట్టుబడిదార్లు సాగించే దాడులకు వ్యతిరేకంగా కార్మికుల రైతుల అధికారాన్ని పరిరక్షించేందుకు మీ శక్తులన్నిటినీ మీరు ఐక్యపరచుకోవడమే కాదు — దీనిని మీరెలాగా చెయ్యాలి. ఈ విషయాన్ని మీరు స్పష్టంగా గ్రహించనే గ్రహించారు; దీనిని కమ్యూనిస్టు స్పష్టంగా గుర్తిస్తున్నాడు. కాని ఇది చాలదు. మీరు కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించాలి. అనేక విషయాల్లో ఈ కార్యం మొదటి సగ భాగమూ అప్పుడే పూర్తి అయింది. పాత వ్యవస్థ నాశనం చేయబడింది, దానిని నాశనం చేయ

డమే న్యాయం కూడానూ; అదిప్పుడు శిథిలాల పోగుగా పరిణమించింది; అలా పరిణమించడమే న్యాయం కూడానూ. నేల బాగుచేయబడింది, కాగా ఈనేలపై యువకమ్యూనిస్టు తరం కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించాలి. ఈ నిర్మాణ కర్తవ్యం మీ ఎదుటుంది, కాగా ఆధునిక విజ్ఞానాన్నంతనూ మీరు క్షుణ్ణంగా అవగతం చేసుకుంటేనే, సిద్ధంగా తయారు చేసిపెట్టినట్టీ, కంఠతాపట్టి నేర్చుకున్నట్టీ సంకేతాలు, సలహాలూ, ప్రయోగాలూ, ఆదేశాలూ, కార్యక్రమాలనుండి మీ తక్షణ క్రియాకలాపాన్ని ఐక్యపరచగల్గే ఆ సజీవమైన వస్తువుగా కమ్యూనిజాన్ని రూపొందించగల్గితేనే, కమ్యూనిజాన్ని మీ ఆచరణ క్రియాకలాపంలో మార్గదర్శిగా రూపొందించగల్గితేనే మీరీ కర్తవ్యాన్ని నిర్వహించగల్గుతారు.

యావత్తు యువతరానికి విద్య గరపడంలోనూ, తర్ఫీదు చేయడంలోనూ, వారికి జాగృతిని కల్గించడంలోనూ మిమ్మల్ని నడిపించాల్సింది ఈ కర్తవ్యమే. ప్రతి యువకుడూ ప్రతియువతీ తాను కమ్యూనిస్టు సమాజ నిర్మాతగా వుండాలనే ఆదర్శాన్ని కలిగివుండాలి; అట్టి లక్షోపలక్షల కమ్యూనిస్టు సమాజనిర్మాతలలో మీరు అగ్రస్థానం ఆక్రమించాలి. కమ్యూనిజాన్ని నిర్మించే కార్యంలో యువ కార్మిక కర్షకుల యావత్తు రాశినీ మీరు భాగస్వాములుగా చేస్తేనే తప్ప కమ్యూనిస్టు సమాజాన్ని మీరు నిర్మించలేరు.

నేనిప్పుడు సహజంగానే ఒక ప్రశ్నను లేవదీయాల్సి వుంటుంది: కమ్యూనిజాన్ని ఎలా నేర్వాలి, మన విధానాలకు ఏయే విశిష్ట భావాలుండాలి?

మొట్టమొదట కమ్యూనిస్టు నీతి అనే ప్రశ్న గురించి ఇక్కడ ప్రస్తావిస్తాను.

కమ్యూనిస్టులుగా మీ అంతటమీరే పెరిగి వృద్ధికి రావాలి. యువజన సంఘం కర్తవ్యం ఏమిటంటే: విద్యనభ్యసించడం వల్లనూ, ఆర్గనైజు కావడంవల్లనూ, ఐక్యపడడం వల్లనూ, పోరాడడం వల్లనూ, తన సభ్యులనే కాకుండా, తనను తమ నియంతగా పరిగణించే వారినందరినీ పెంచి వృద్ధికి తీసుకొచ్చి, వారినందరినీ కమ్యూనిస్టులుగా పెంచి వృద్ధికి తీసుకువచ్చేటట్టు యువజన సంఘం తన ఆచరణ క్రియాకలాపాలను ఏర్పరచడం. నేటి యువకులు కమ్యూనిస్టు నీతిలో పెరిగి వృద్ధికి వచ్చేటట్టు చేయడమే, వారి ప్రబోధమే, చదువే, వీటి సంపూర్ణ ధ్యేయమై వుండాలి.

కాని కమ్యూనిస్టు నీతి అంటూ ఒకటుందా? కమ్యూనిస్టు నైతికప్రవర్తన అంటూ ఒకటుందా? లేకేమి, తప్పకుండా వుంది. మనకొక నీతి అంటూ లేనట్టు పైకి అవుపడే విధంగా విషయం ప్రదర్శించబడడం కద్దు; కాగా నీతినియమాలకు తిలోదకాలిచ్చేశామంటూ కమ్యూనిస్టులం మనమీద బూర్జువావర్గం తరుచు నేరం మోపుతూంది. భావనలను తక్కిడి బిక్కిడి తారుమారు చేసేటట్టీ, కార్మికుల కర్షకుల కళ్లల్లో దుమ్ముకొట్టే పద్ధతి ఇది.

ఏ అర్థంలో నీతినీ, నైతికప్రవర్తననీ మనం తోసిరాజంటున్నాం?

దేవుని ఆజ్ఞలనుండి నైతికప్రవర్తనను వ్యుత్పత్తి చేసిన బూర్జువావర్గంచే అది బోధించ బడుతూన్న అర్థంలో మనం దానిన్ని తోసిరాజంటున్నాం. దేవునిలో మనకు నమ్మకం లేదనీ, కాగా మతగురువులూ, భూస్వాములూ, బూర్జువావర్గంవారూ దోపిడీదార్లుగా తమ ప్రయోజనాలు సాధించుకుందుకు దేవుని పేరు ఉచ్చరిస్తూండేవారన్న సంగతి మనకు స్పష్టంగా తెలుసుననీ మనం బాహాటంగా చెబుతూన్నాం కూడా. లేదంటే, నైతికప్రవర్తన విధులనుండీ, దేవుని ఆజ్ఞలనుండీ ఈ నీతిని వ్యుత్పత్తిచేసే బదులు, దేవుని ఆజ్ఞలతో అతి సన్నిహితమైన పోలికను కల్గివున్నట్టి ఏదో భావవాద, లేక అర్ధభావవాద పదజాలంనుండి నైతికప్రవర్తనను వారు వ్యుత్పత్తిచేశారు.

మానవాళికి అతీతమూ, వర్గరాహిత్యమూ అనే భావాలనుండి వ్యుత్పత్తిచేయబడిన నైతికప్రవర్తన ఏదైనా సరే దానిని మనం తిరస్కరిస్తాం. ఇట్టి నైతికప్రవర్తన ఒక మోస మనీ, వంచన అనీ, భూస్వాముల, పెట్టుబడిదార్ల ప్రయోజనాల కోసమై కార్మికుల, రైతుల మనస్సును అయోమయం చేయడమనీ మనం అంటున్నాం.

మన నైతికప్రవర్తన శ్రామికవర్గ పోరాట ప్రయోజనాలకు పూర్తిగా లోబడి వుంటుందనే మనం చెబుతాం. మన నైతికప్రవర్తన శ్రామికవర్గ పోరాట ప్రయోజనాలనుండి వ్యుత్పత్తిచేయబడింది.

భూస్వాములూ, పెట్టుబడిదార్లూ కార్మిక కర్షకులందరిపైనా మోపిన భారంపైనే పాత సమాజం ఆధారపడింది. దీనిని మనం నాశనం చేయాల్సివచ్చింది, వీరిని మనం కూల దోయాల్సివచ్చింది; ఇందుకోసం మనం ఐక్యతను సృష్టించడం అవసరమైంది. ఇట్టి ఐక్యతను దయామయుడైన దేవుడు సృష్టించడు.

ఫ్యాక్టరీలు, మిల్లులు మాత్రమే, దీర్ఘనిద్రనుండి మేల్కొని శిక్షణపొందినట్టి శ్రామిక వర్గం మాత్రమే ఇట్టి ఐక్యతను సమకూర్చగల్గాయి. ఎప్పుడైతే ఈ వర్గం ఏర్పడిందో, ఈనాడు మనం దేనినైతే చూస్తున్నామో దానికి — మూడేళ్ళుగా సర్వప్రపంచ బూర్జువా వర్గపు ఎదురుదాడిని తిప్పికొడుతూన్నట్టి బలహీనమైన దేశాల్లో అత్యంత బలహీనమైనట్టి దేశంలోని ఆ శ్రామికవర్గ విప్లవ విజయానికి — దారితీసినట్టి రాశిఉద్యమం అప్పుడే ఆరంభ మైంది. కాగా ప్రపంచమంతటా, శ్రామికవర్గ విప్లవం ఎలా వృద్ధిపొందుతూందో మనమి ప్పుడు చూస్తున్నాం. ఐకమత్యం లేకుండా చెదురు మదురుగా వుండిన రైతాంగం అనుసరి స్తూన్నట్టీ, దోపిడీదార్ల దాడిధాకల నన్నిటినీ తట్టుకుని నిలబడినట్టీ దృఢశక్తిని కేవలం శ్రామికవర్గం మాత్రమే సృష్టించగల్గి వుంటుందని మన అనుభావాన్ని ఆధారం చేసుకుని మనమిప్పుడు చెప్పగలం. కేవలం ఈ వర్గమే, కార్మికప్రజలకు తమలోతాము ఐక్యపడేందుకు, తమ శ్రేణులను సమీకరించుకుందుకు, అంతిమంగా కమ్యూనిస్టు సమాజాన్ని రక్షించి, అంతి మంగా దానిని దృఢ పరచి, అంతిమంగా దానిని పూర్తిగా నిర్మించడానికి సహాయపడగల్గుతుంది.

ఇందువల్లనే మానవ సమాజానికి మించి నైతికప్రవర్తన ఏదీ లేదని మనం అంటున్నాం. అటువంటిది వంచన. మనకు మాత్రం నైతికప్రవర్తన అనేది శ్రామికవర్గంయొక్క పోరాట ప్రయోజనాలకు లోబడే వుంటుంది.

ఈ వర్గపోరాటమంటే ఏమిటి? జార్‌ని కూలదోయడం, పెట్టుబడిదార్లను కూల దోయడం, పెట్టుబడిదారీ వర్గాన్ని అంతం చేయడం — ఇదే దాని అర్థం.

కాగా సాధారణంగా వర్గాలన్నవి ఎట్టివి? సమాజంలోని ఒక విభాగం, రెండో విభాగం యొక్క శ్రమను భుక్తం చేసుకోవడమును అనుమతించేవే వర్గాలు. సమాజంలో ఒక విభాగం భూమినంతనూ భుక్తం చేసుకుంటే, అప్పుడు భూస్వామి వర్గమనీ, రైతు వర్గమనీ మనలో ఏర్పడుతున్నాయి. సమాజంలో ఒక విభాగమే మిల్లులూ, ఫ్యాక్టరీలూ, వాటాలూ, పెట్టుబడినీ కలిగివుండగా, రెండవ విభాగం ఈ ఫ్యాక్టరీలలో పనిచేస్తూన్నప్పుడూ, పెట్టుబడిదారీ వర్గమనీ శ్రామికవర్గమనీ మనలో ఏర్పడుతున్నాయి.

జార్‌ని వెళ్లగొట్టడం కష్టమైన పనిగా పరిణమించలేదు — అందుకు కొద్దిరోజులు మాత్రమే పట్టింది. భూస్వాములను వెళ్లగొట్టడమూ ఏమంత మరీ కష్టమైన పనిగా పరిణమించలేదు — అందుకు కొద్దినెలలు పట్టింది. పెట్టుబడిదార్లను వెళ్లగొట్టడం కూడా ఏమంత మరీ కష్టమైన పనిగా పరిణమించలేదు. కాని వర్గాలను అంతం చేయడం ఇంతకంటేనూ నిరుపమానమైన కష్టంతో కూడుకున్న పని; కార్మికులనీ రైతులనీ మనలో విభేదం ఇంకా వుంటూనే వుంది. రైతు తన మటుకు తాను తన విడి పొలంలో స్థిరపడిపోయి, తన మడి చక్కను తాను చేసుకుని, మిగులు ధాన్యాన్ని, అనగా కడమ ప్రజ తిండిలేకుండా మాడుతూండగా, తనకూ తన పశువులకూ అవసరంలేని మిగులు గింజలను తాను భుక్తం చేసుకుంటూన్న పక్షమందు, రైతు దోపిడీదారుడే అవుతాడు. తాను ఎంత ధాన్యాన్ని అట్టేపెట్టుకుంటే, తనకు అంత లాభమని అతనికి అనిపించుతుంది; ఇక కడమవాళ్ల మాటా? వారు ఆకలితో మాడితే మాడనీ: "వాళ్ల ఆకలిబాధ పెరుగుతూన్న కొద్దీ, నా ధాన్యం ధర కూడా పెరుగుతుంది" అంటాడు. ఒక ఉమ్మడి ప్రణాళిక ననుసరించి, ఉమ్మడి భూమిలో, ఉమ్మడి మిల్లులు ఫ్యాక్టరీలలో, ఉమ్మడి కార్యనిర్వహణ కింద ప్రతివారూ పనిచెయ్యాలి. దీనిని సాధించడం సులభమేనా? జార్‌నీ, భూస్వాములనూ, పెట్టుబడిదార్లనూ వెళ్లగొట్టడమనేటంత సులభమైన పని కాదని మీకు తెలుస్తూంది. రైతులలో ఒక భాగానికి శ్రామికవర్గం పునః పెంచి వృద్ధికి తెచ్చే శిక్షణ ఇవ్వడం పునఃప్రబోధం కలిగించడం, ఎంతేనా అవసరం; కడమరైతుల పేదరికాన్నీ లేమినీ ఉపయోగించుకుని అధికలాభాలార్జించే ధనికరైతుల ప్రతిఘటనను అణచివేసేందుకుగాను శ్రామికవర్గం కష్టజీవి రైతులను తన పక్షానికి ఆకర్షించాలి. కాబట్టి జార్‌ను కూలదోయడంతోనూ, భూస్వాములనూ పెట్టుబడిదార్లనూ వెళ్లగొట్టడంతోనూ శ్రామిక

వర్గ పోరాటంయొక్క కర్తవ్యం పూర్తికాలేదు, కాగా దీనిని పూర్తిచేయడం శ్రామికవర్గ నియంతృత్వమని చెప్పబడే వ్యవస్థయొక్క కర్తవ్యం.

వర్గపోరాటం ఇంకా సాగుతూనే వుంది; అది తన రూపాలను మాత్రమే మార్చుకుంది. వెనకటి దోపిడీదార్లను తిరిగి రాకుండా చేయడమూ, చెదురు మదురుగా వుంటూ ఇంకా అజ్ఞానాంధకారంలోనే వున్న రైతాంగపు రాశిని ఒకే ఒక సంఘం కింద ఐక్యపరచడమూ, ఇదే శ్రామికవర్గంయొక్క వర్గపోరాటం. వర్గపోరాటం ఇంకా సాగుతూనే వుంది, కాగా ఈ పోరాటానికే అన్ని ప్రయోజనాలూ లోబడివుండేటట్టు చేయడమే మన కర్తవ్యం. కాగా మన కమ్యూనిస్టు నైతికప్రవర్తనను ఈ కర్తవ్యానికే లోబరచివుంచుతాం. పాత పెట్టుబడిదారీ సమాజాన్ని నాశనం చేసేందుకు, కొత్త కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మిస్తూన్నట్టి శ్రామిక వర్గం చుట్టూ కార్మికప్రజల నందరినీ ఐక్యపరచేందుకూ ఏది ఉపకరించుతుందో అదే నైతికప్రవర్తన అంటాం మనం.

ఈ పోరాటానికి ఉపకరించేటట్టి, యావత్తు దోపిడీకి వ్యతిరేకంగానూ, స్వల్ప ఆస్తికి వ్యతిరేకంగానూ కార్మికప్రజలను ఐక్యపరచేటట్టి నైతికప్రవర్తనే కమ్యూనిస్టు నైతికప్రవర్తనే; ఎందుచేతంటే స్వల్ప ఆస్తి యావత్ సమాజపు శ్రమచే సృష్టించబడినదానిని ఒక వ్యక్తి చేతులో పెతుతూంది. మన దేశంలో భూమి ఉమ్మడి ఆస్తి.

కాని ఈ ఉమ్మడి ఆస్తిలో ఒక భాగాన్ని నేను తీసుకొని, దానిలో నాకు అవసరమైన దానికంటె రెండింతలు ధాన్యం పండించి, మిగులు ధాన్యాన్ని అధికధరకు అమ్మి లాభం చేసుకుంటున్నానని అనుకుందాం. ఎంతమంది ఆకలితో మాడుతూంటే అంత పెచ్చు ధరలు చెల్లించి వాళ్లే కొనుక్కుంటారు కదా, అని నేను లెక్కలు వేస్తూతూంటానని అనుకుందాం. అప్పుడు నేను కమ్యూనిస్టులాగానే ప్రవర్తిస్తున్నానా? లేదే, దోపిడీదారునిలాగానే ఆస్తిపరుని లాగానే నేనూ ప్రవర్తిస్తున్నానన్నమాట. దీనితో మనం పోరాడి తీరాలి. దీనిని ఈలాగే సాగనిచ్చినట్టయితే, వెనకటి విప్లవాల్లో ఒకసారి కాదు, అనేక సార్లు జరిగినట్టే, పెట్టుబడిదార్ల పరిపాలనకే, బూర్జువావర్గ పరిపాలనకే పరిస్థితులు మళ్లీ డేకుతాయి. కాగా పెట్టుబడిదార్ల, బూర్జువావర్గ పరిపాలనా పునరుద్ధరణను నివారించేందుకు, అధికలాభార్జనను మనం అరికట్టాలి, కడమవారి కడుపులుకొట్టి కొందరి వ్యక్తుల ధనార్జనను మనం అరికట్టాలి, కాగా శ్రామికవర్గంతో కార్మికప్రజలు ఐక్యమై కమ్యూనిస్టు సమాజాన్ని ఏర్పరచాలి. ఇదే సంఘంయొక్క, కమ్యూనిస్టు యువకుల ఆర్గనైజేషనుయొక్క మౌలిక కర్తవ్యానికున్న ప్రధాన లక్షణం.

నువ్వే ఇతరులను దోచుకో, లేకపోతే ఇతరులే నిన్ను దోచుకుంటారు; ఇతరులకింద పనిచేయి, లేకపోతే నీ కిందే ఇతరులచేత పనిచేయించుకో; బానిసయజమానిగా వుండు, లేక

పోతే నువ్వే బానిసగా వుండాలి — ఈ సూత్రంపైనే పాత సమాజం ఆధారపడింది. సహజంగానే ఇటువంటి సమాజంలో పుట్టి పెరిగినవారు — నువ్వు బానిస యజమానివైనా కావాలి, లేదా బానిసవైనా కావాలి, లేదా సన్నకారు ఆస్తిపరుడు, సన్నకారు యజమాని, సన్నకారు ఉద్యోగి, మేధావి — ఇదే మరోమాటల్లో చెప్పాలంటే, తన గురించే ఆలోచించుకుంటూ, ఇతరులు ఎలా చస్తే మనకేంకావాలి అని అనుకునే మనిషి — అయినా కావాలి, అనే భావన ఉగ్గుపాలతో నేర్చుకుంటారు.

ఈ పొలం నేను చేసుకుంటే చాలు, కడమవాళ్లు ఎలా చస్తే నాకేం; కడమవాళ్లు ఆకలితో మాడితే మరీ మంచిది, నా ధాన్యం మరింత పెచ్చు ధరకి అమ్ముకుంటాను. డాక్టరుగానో, ఇంజినీరుగానో, ఉపాధ్యాయుడుగానో, లేక గుమాస్తాగానో నాకు ఉద్యోగం దొరికితే చాలు, కడమవాళ్లు ఎలా చస్తేనాకేం? బహుశ నా పైఅధికార్లను ఇచ్చకాలాడి వాళ్ల అనుగ్రహం సంపాదించానంటే నా ఉద్యోగం ఖాయమవడమే కాకుండా, పైకొచ్చి, నేనూ ఒక బూర్జువానే కావచ్చు కూడా — ఇలాంటి మనస్తత్వమూ, ఇలాంటి భావాలూ కమ్యూనిస్టుకి వుండేందుకు వీల్లేదు. తమ సొంత ప్రయత్నాలవల్ల తమ్ముతాము పరిరక్షించుకుని, ఒక నూతన సమాజాన్ని నిర్మించుకోగలమని కార్మికులూ రైతులూ ఎప్పుడైతే రుజువుచేశారో — అప్పుడే కమ్యూనిస్టు పెనుపు, దోపిడీదార్లకూ స్వార్థపర్లకూ స్వల్ప ఆస్తిపరులకూ వ్యతిరేకంగా, "నా స్వల్పాభమే నా పరమావధి, ఇతరులెలా చస్తే నాకేం" అనే మనస్తత్వానికీ అలవాట్లకూ వ్యతిరేకంగా శ్రామికవర్గంతో కలిసి సాగించే పోరాటంలో పెనుపు, మొదలైంది.

ఈ నాడు పెరుగుతూన్న యువతరం కమ్యూనిజాన్ని ఏవిధంగా నేర్చుకోవాలన్న ప్రశ్నకు ఇదీ జబాబు.

తన చదువులోనూ, తాను పెరిగి వృద్ధికి రావడంలోనూ, విద్యా ప్రబోధంలోనూ తానువేసే ప్రతి అడుగుకూ పాత దోపిడీదారీ సమాజంపై శ్రామికులూ కార్మికప్రజలూ సాగించుతూన్న నిరంతర పోరాటంతో సన్నిహిత సంబంధం కలిగివుండేటట్టు చేయడంవల్ల మాత్రమే యువ తరం కమ్యూనిజాన్ని నేర్చుకోగల్గుతుంది. నైతికప్రవర్తన గురించి మనతో ఎవరైనా మాట్లాడితే వారితో మనమిలా అంటాం: దృఢమైన, సంసక్తమైన ఈ క్రమశిక్షణలోనే, దోపిడీదార్లపై చైతన్యవంతమైన ప్రజారాశి పోరాటంలోనే వుంది కమ్యూనిస్టుకి నైతికప్రవర్తన అంతానూ. శాశ్వతపు నైతికప్రవర్తన అనే దాంట్లో మనకు నమ్మకంలేదు, కాగా నైతికప్రవర్తన గురించి చెప్పే కట్టుకథలన్నిటి మోసాన్నీ మనం బట్టబయలు చేస్తాం. మానవ సమాజం మరింత ఉన్నత స్థాయిని అందుకునేందుకూ, శ్రమకు దోపిడీనుండి విమోచన కలిగేందుకూ నైతికప్రవర్తన ఉపకరించుతుంది.

దీనిని సాధించేందుకు, బూర్జువావర్గంపై క్రమశిక్షణతో కూడుకున్నట్టి, తెగు

వతో సాగించేటట్టి పోరాట పరిస్థితులలో చైతన్యవంతులైన మానవులుగా అప్పుడే పరివర్తన చెంద నారంభించిన యువ తరం అవసరం. ఈ పోరాటంలో అది సిసలైన కమ్యూనిస్టులను పెంచి వృద్ధిలోకి తెస్తుంది, తన చదువులోనూ, విద్యాప్రబోధంలోనూ తాను పెరిగి వృద్ధికి రావడంలోనూ అది వేసే ప్రతి అడుగుకూ ఈ పోరాటంతో లింకు ఏర్పరచి, ఈ పోరాటానికి లోబడి వుండేటట్టు చేయాలి. కమ్యూనిస్టు యువకులను పెంచి వృద్ధికి తీసుకురావడమంటే, నైతికప్రవర్తన గురించి వారి ఎదుట కోకొల్లలుగా తేనెలొలికే ఉపన్యాసాలు ఇవ్వడమూ, నియమాలు పునశ్చరణచేయడమూ కాదు. పెంచి వృద్ధికి తీసుకురావడంలో వుండాల్సినది ఇదికాదు. భూస్వాములూ పెట్టుబడిదార్లూ మోపిన గాటికింద తమ తల్లితండ్రులు ఏ విధంగా జీవించారో ప్రజలు చూసినప్పుడు, దోపిడీదార్లపై పోరాటాన్ని ప్రారంభించినవారు ఎట్టి బాధలను అనుభవించారో తాము స్వయంగా చూసినప్పుడు, ఇదివరకు సాధించినదానిని పరిరక్షించుకుందుకు ఈ పోరాటాన్ని కొనసాగించడంలో ఎట్టి త్యాగాలు చేయాల్సివచ్చిందో తాము చూసినప్పుడు, భూస్వాములూ పెట్టుబడిదార్లూ ఎంతటి ఉగ్రశత్రువులో తాము చూసినప్పుడు — అప్పుడు ఈ పరిస్థితులలో వారిని కమ్యూనిస్టులుగా పెంచి వృద్ధికి తీసుకురావడం జరిగింది. కమ్యూనిజాన్ని పటిష్ఠంచేసి పూర్తి చేసేందుకై సాగించే పోరాటమే కమ్యూనిస్టు నైతిక ప్రవర్తనకు పునాది. కమ్యూనిస్టు పెనుపు, విద్యాప్రబోధం, చదువులకూ ఇదే పునాది. కమ్యూనిజాన్ని ఏ విధంగా నేర్చుకోవాలన్న ప్రశ్నకు ఇదీ జబాబు.

కేవలం ఒక్క పాఠశాలకే పరిమితమై ఝంఝూవాత జీవితంతో సంబంధంలేని చదువు, పెనుపు, విద్యాప్రబోధాలలో మనం నమ్మలేదు. కార్మికులూ రైతులూ భూస్వాముల పెట్టుబడిదార్ల హింసలకు లోనవుతూన్నంత కాలమూ, భూస్వాముల పెట్టుబడిదార్ల చేతుల్లోనే పాఠశాలలు వున్నంత కాలమూ యువ తరం అంధులుగానే, అజ్ఞానులుగానే వుండిపోతుంది. కాని మన పాఠశాలా విజ్ఞానంయొక్క మౌలికాధారాలను, కమ్యూనిస్టు అభిప్రాయలను స్వయంగా ఏర్పరచుకునే సామర్థ్యాన్ని యువకులకు నేర్పాలి; పాఠశాల వారిని విజ్ఞానవంతులుగా చేయాలి. ప్రజలు పాఠశాలలో విద్యనేర్చుకుంటూన్న కాలంలో, దోపిడీదార్లనుండి విముక్తిపొందే పోరాటంలో వారు భాగస్వాములుగా వుండేటట్టుగా వారిని పాఠశాల తర్ఫీదు చెయ్యాలి. దోపిడీదార్లపై సాధారణ పోరాటంలో కార్మికప్రజలందరూ పాల్గొనడంతో, కమ్యూనిస్టు యువజన సంఘం తాను చదువు చెప్పడంలోనూ పెంచి వృద్ధికి తీసుకురావడంలోనూ విద్యాప్రబోధం కల్గించడంలోనూ తాను వేసే ప్రతి అడుగుకూ ఎప్పుడైతే సంబంధం ఏర్పరచుకుంటుందో, అప్పుడే కమ్యూనిస్టు యువతరంయొక్క సంఘంగా అది తన పేరు సార్థక పరచుకోగల్గుతుంది. ఎందుచేతంటే రష్యా ఒక్కటే కార్మికుల రిపబ్లిక్కుగా వుంటూ, కడమ ప్రపంచంలో పాత బూర్జువా వ్యవస్థ మనుతూన్నంత కాలమూ, వాటికంటె మనం బలహీనంగా వుంటూ,

కొత్త దాడుల ప్రమాదానికి నిరంతరమూ లోనవుతూనే వుంటామన్న విషయాన్నీ, దృఢత్వాన్నీ, ఐక్యతనూ మనం నేర్చుకున్న పక్షంలోనే, తదుపరి పోరాటంలో మనం విజయం పొందుతాం. ఇక — బలం సంపాదించిన పిమ్మట — మనం నిజంగా అజేయుల మవుతామన్న విషయమూ మీరు బాగా ఎరుగుదురు. ఈ విధంగా, కమ్యూనిస్టుగా వుండడమంటే, దాని అర్థం, నేడు వయసులోకి వస్తూన్న యావత్తు తరాన్నీ మీరు ఆర్గనైజుచేసి, ఐక్యపరచి, ఈ పోరాటంలో పెంచి వృద్ధికి తీసుకురావడంలోనూ, క్రమశిక్షణలోనూ ఆదర్శప్రాయంగా వుండడమన్నమాట. అప్పుడు మీరు కమ్యూనిస్టు సమాజ నిర్మాణం ప్రారంభించి, దానిని పరిసమాప్తి చేయగల్గుతారు.

దీనిని మీకింకా స్పష్టంగా చూపేందుకు ఉదాహరణ ఒకదానిని పేర్కొంటాను. మనం కమ్యూనిస్టులమనే పేరు పెట్టుకున్నాం. కమ్యూనిస్టు అంటే ఏమిటి? కమ్యూనిస్టు అన్నది లాటిన్ భాష పదం. కమ్యూనిస్టు అంటే ''సాముదాయక'' అని అర్థం. ఏ సమాజంలోనైతే — భూమి, ఫ్యాక్టరీలు, సకల వస్తువులూ — సాముదాయిక ఆస్తిగా వుంటాయో, ప్రజలు సాముదాయికంగా పనిచేస్తారో అట్టి సమాజమే కమ్యూనిస్టు సమాజం. అదే కమ్యూనిజం.

ప్రతివాడూ ఎవడి మట్టుకువాడు విడిగా తన సొంతపొలం చేసుకుంటూంటే సాముదాయికంగా పనిచేయడం సాధ్యమవుతుందా? సాముదాయికంగా పనిచేయడమనేది ఒక్క చిటికెలో ఏర్పాటయే విషయంకాదు. అది ఒక్క చిటికెలో జరగడం అసాధ్యం, అది ఆకాశంనుండి ఊడిపడదు. అది కష్టం వల్లనే, బాధలవల్లనే సాధ్యమవుతుంది, పోరాటకాలమందే అది సృష్టించబడుతుంది. ఇక్కడ పాత పుస్తకాలెందుకూ ఉపయోగపడవు; వాటి నెవ్వరూ నమ్మరు. స్వానుభవమే ఇక్కడ అవసరం. కొల్చాక్, దెనీకిన్లు సైబీరియానుండీ, దక్షిణంనుండీ పురోగమించినప్పుడు రైతులు వారి పక్షం వహించారు. తమ ధాన్యాన్ని స్థిరమైన ధరలకు బోల్షెవిక్లు వసూలు చేయడం కారణంగా బోల్షెవిజమంటే రైతులకు గిట్టేందికాదు. కాని ఎప్పుడైతే సైబీరియా, యుక్రెనియనులలోని రైతులు కొల్చాక్, దెనీకిన్ల పరిపాలనను స్వయంగా అనుభవించారో, రెండింటిలోను ఏదో ఒకదానిని తాము ఎంచుకోవాల్సి వుంటుందని వారు అప్పుడు అవగతం చేసుకున్నారు: పెట్టుబడిదారుని దగ్గరకు వెళ్లడం, అలా వెళితే తక్షణం వారినతడు బానిసలుగా భూస్వామికి ఒప్పగించి వేస్తాడు; లేదా కార్మికుని — దేశాన్ని భూతలస్వర్గంగా మార్చేస్తానని ఖరారు చేయకుండా, అష్టకష్టాలతో కూడుకున్నట్టి పోరాటంలో రాటుదేరిన క్రమశిక్షణనూ, వజ్రసంకల్పాన్నీ డిమాండుచేసినప్పటికీ, పెట్టుబడిదార్ల, భూస్వాముల కింద బానిసత్వంనుండి విముక్తి చేకూర్చే మార్గాన తమను నడిపించేటట్టి కార్మికుని — అనుసరించడం. ఈ ప్రత్యామ్నాయాన్ని ఎప్పుడైతే అజ్ఞానులైన రైతులు సహితమూ తమ స్వాను

భవంవల్ల గ్రహించి కళ్లారా చూచారో, అప్పుడే వారు కఠిన పరీక్షను పూర్తిచేసినట్టి చైతన్య వంతులైన కమ్యూనిస్టు అనుచరులుగా తయారయారు. ఇట్టి అనుభవమే యువజన కమ్యూనిస్టు సంఘం క్రియాకలాపాలన్నిటికీ పునాదిగా ఏర్పడాలి.

మనం ఏమిటి నేర్చుకోవాలి, పాత పాఠశాలనుంచీ, పాత విజ్ఞానంనుంచీ మనం దేనిని స్వీకరించాలి, అనే ప్రశ్నలకు నేను సమాధాన మిచ్చాను. దీనిని ఎలా నేర్చుకోవడమనే ప్రశ్నకు ఇప్పుడు సమాధానమివ్వడానికి ప్రయత్నిస్తాను. ఇదీ సమాధానం: దోపిడీదార్లపై కార్మికప్రజ లందరి పోరాటంతో పాఠశాలాక్రియాకలాపాలలో ప్రతి అడుగుకూ, పెంచి వృద్ధికి తెచ్చే శిక్షణలో, విద్యాప్రబోధంలో చదువులో ప్రతి అడుగునూ అవిభాజ్యమైన సంబంధం ఏర్పర చడం వల్లనే.

కమ్యూనిజానికి దారితీసే ఈ శిక్షణ ఏ విధంగా జరగాలో ద్యోతకమయేందుకు కొన్ని కొన్ని యువజన ఆర్గనైజేషనుల క్రియాకలాపంలో సంపాదించిన అనుభవాలను కొన్నింటిని ఉదాహరిస్తాను. నిరక్షరాస్యతను అంతరింపజేయాలని అందరి నోటా వినవస్తూంది. నిర క్షరకుక్షి అయిన దేశంలో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించలేమన్న విషయం మీారెరుగుదురు. సోవియట్ ప్రభుత్వం ఉత్తరవు నొకదానిని జారీ చేసినంత మాత్రాన, లేదా ప్రత్యేక నినాదాన్నొక దానికై పార్టీ పిలుపు ఇచ్చినంత మాత్రాన, లేదా అత్యుత్తమ కార్మికులను కొందరిని ఈ కర్తవ్యానికై నియోజించినంత మాత్రాన చాలదు. యువతరమే స్వయంగా ఈ కార్యానికి పూనుకోవాలి. ఇది మేము చెయ్యాల్సిన పని, నిరక్షరాస్యతా నిర్మూలనకై మేము సంఘటిత పడి, ఇప్పుడు పైకివస్తూన్న తరంలో నిరక్షరాస్యులు లేకుండా చూడడానికిగాను మేము పల్లెటూళ్లలోకి వెళ్తాం, అని యువజన సంఘంలోవున్న యువతీయువకులు అనాలి; అదే కమ్యూనిజం. యువతరం తన క్రియాకలాపాలన్నిటినీ ఈ కార్యానికి అంకితం చేసేటట్టు మేము ప్రయత్నిస్తున్నాము. అజ్ఞానాంధకారంలో మునిగితేల్తూ నిరక్షరకుక్షి అయిన రష్యాను విజ్ఞాన నిలయమైన దేశంగా చటిక్కున మార్చలేమని మీాకు తెలుసు. కాని ఈ కార్యానికై యువ జన సంఘం నడుము కట్టిందంటే, అందరి బాగు కోసమూ అందరు యువకులూ పని చేశారంటే, 4 లక్షల యువతీయువకులను సంఘటిత పరచినట్టి సంఘం, యువజన కమ్యూనిస్టు సంఘం అని పేరు పెట్టుకోవడానికి తన అర్హతను రుజావు పరచుకుంటుంది. వేర్వేరు విష యాల్లో విజ్ఞానం సంపాదించినట్టి సభ్యులనుగల సమితి, తమ సొంత యత్నంవల్లనే నిరక్ష రాస్యతాంధకారం నుండి విముక్తి సాధించుకొనజాలని యువజనుల సహాయార్థం ఈ విజ్ఞానాన్ని వినియోగించడమనేది సంఘం నెరవేర్చాల్సిన ఇంకొక కర్తవ్యం. యువజన సంఘంలో సభ్యుడుగా వుండడమంటే, ఉమ్మడి కార్యానికై తన శక్తిసామర్థ్యాలను అంకితం చేయడమన్న మాట. ఇదీ కమ్యూనిస్టు పెంపు అర్థం. కేవలం ఇటువంటి కార్యం నెరవేర్చడంలోనే

యువతీయువకులు యథార్థమైన కమ్యూనిస్టులు కాగల్గుతారు. ఈ కార్యంలో ఆచరణీయ ఫలితాలు సాధించడంవల్లనే వారు కమ్యూనిస్టులవుతారు.

నగర సివార్లలోని కూరగాయల మళ్లలో పనిని ఉదాహరణగా తీసుకోండి ఇది ఒక ముఖ్యమైన కర్తవ్యం కాదా? యువజన కమ్యూనిస్టు సంఘం కర్తవ్యాల్లో ఇదొక కర్తవ్యం. ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు: మిల్లులలోనూ ఫ్యాక్టరీలలోనూ క్షుద్బాధ విలయతాండవం చేస్తూంది. ఆకలిబాధనుండి రక్షించుకోవాలంటే కూరగాయల మళ్లను మనం అభివృద్ధి చేయాలి. కాని వ్యవసాయం ఇంకా పాత పంథాలోనే సాగుతూంది. అందుచేత ఈ కార్యానికి మరింత అధికంగా చైతన్యవంతములైన మూలధాతువులే పూనుకోవాలి, అప్పుడు కూరగాయల మళ్లసంఖ్య పెరగడమూ, వాటి విస్తీర్ణం అధికం కావడమూ, ఫలితాలు వృద్ధి పొందడమూ మనం చూస్తాం. ఈ కార్యంలో యువజన కమ్యూనిస్టు సంఘం క్రియాశీలంగా పాల్గొనాలి. ప్రతి సంఘమూ, సంఘం ప్రతి సెల్లూ దీనిని తన సొంత కార్యంగా చేపట్టాలి.

యువజన కమ్యూనిస్టు సంఘం ప్రతి కార్యంలోనూ సహాయపడుతూ, చొరవనూ సాహసాన్నీ ప్రదర్శించుతూ, ఒక షాక్ గ్రూపుగా తయారవాలి. సంఘం ఎలాంటిదై వుండాలంటే, సంఘం సభ్యుల బోధనలను తాను అర్థం చేసుకో లేకపోయినప్పటికీ కూడా, సంఘం సభ్యుల బోధనలను ఒక వేళ వెంటనే నమ్మలేక పోయినప్పటికీ కూడా, వారి ఉత్సాహవంతమైన కృషిని చూసిన ఏ కార్మికుడైనా సరే, తనకు సరైన మార్గాన్ని చూపించుతూన్న వారు వీరే సుమా, ఈ సంఘ సభ్యులందరూ ఇటువంటి వారే సుమా అని అతడు అనుకొనేటట్టు వుండాలి.

యువజన కమ్యూనిస్టు సంఘం తన క్రియాకలాపాలన్నిటినీ అన్ని రంగాలలోనూ ఈ విధంగా ఆర్గనైజుచేయకపోతే మాత్రం పాత, బూర్జువా మార్గంలోకే అది దిగజారి పోతూందని అర్థమవుతుంది. కమ్యూనిజం బోధనలను అనుగమించే కర్తవ్యాలను నిర్వర్తించేందుకై కార్మికప్రజలకు సహాయపడేందుకుగాను దోపిడీదార్లకు వ్యతిరేకంగా సలిపే పోరాటంతో పెంచి వృద్ధికి తెచ్చేందుకు మనమిచ్చే శిక్షణ సమైక్యమవాలి.

కూరగాయల మళ్లను మెరుగు పరచేందుకో, లేక ఏ మిల్లులోనో ఫ్యాక్టరీలోనో పని చేస్తూన్న యువకుల విద్యాప్రబోధాన్ని ఆర్గనైజు చేసేందుకో, లేక ఇలాంటివే ఇతర కార్యాలకో సంఘ సభ్యులు తమ తీరిక వేళలో ప్రతి గడియనూ వినియోగించాలి. పేదరికంలో మునిగి, దౌర్భాగ్యాన్ని అనుభవించుతూన్న రష్యాను సిరులుపొంగి పారలే గడ్డగా రూపొందించ దల్చుకున్నాం మనం. తన పాఠశాలలోనే తలుపులు బిడాయించుక్కూచుని, కమ్యూనిస్టు గ్రంథాలూ పాంఫ్లెట్లకే తన పఠనాన్ని పరిమితం చేయకుండా వుండేందుకూ, యువజన కమ్యూనిస్టు సంఘం తన విద్యాప్రబోధాన్ని, తన చదువును, తాను పెరిగి వృద్ధికివచ్చే శిక్షణను కార్మికుల కర్షకుల

శ్రమతో సమ్మైక్యం చేసేందుకూ ఇది ఆవశ్యకం. కేవలం కార్మికుల కర్షకులతో చేతులు కలిపి పనిచేయడం ద్వారానే సిసలైన కమ్యూనిస్టులు కాగల్గుతారు. కాగా యువజన సంఘం సభ్యు లందరూ అక్షరాస్యులనీ, అదే సమయంలో పనిచేయడం ఎలాగో తెలిసినవారనీ కూడా ప్రతి వారికీ తెలిసేటట్టు చూడడం అవసరం. పాత పాఠశాలనుండి డ్రిల్-సార్జంటు పద్ధతుల్లో చదువుచెప్పే పాతకాలపు పద్ధతులకు స్వస్తి చెప్పేశామనీ, వాటి స్థానే చైతన్యయుతమైన క్రమశిక్షణ నెలకొల్పబడిందనీ, యువతీయువకులందరూ సుబ్బోత్నిక్‌లలో పాల్గొంటున్నారనీ, నగర సివార్లలోవున్న ప్రతి కూరగాయల క్షేత్రాన్నీ ప్రజకు సహాయంచేసేందుకు వినియోగి స్తున్నారనీ చూచిన ప్రతివారూ ఎప్పుడైతే అనుకుంటారో — అప్పుడు శ్రమపట్ల ఇదివరలో వారికుండిన భావం పూర్తిగా మారిపోతుంది.

గ్రామాలలోనో, లేదా పట్టణంలో ఒక పేటలోనో సహాయాన్ని, ఉదాహరణకు శుభ్రత విషయంలోనో, లేదా ఆహారం పంపిణీ చేయడంలోనో ఆర్గనైజు చేయడం యువజన కమ్యూ నిస్టు సంఘం కర్తవ్యం. పాతకాలపు పెట్టుబడిదారీ సమాజంలో ఇది ఏ విధంగా జరిగేది? ప్రతివాడూ తనమట్టుకు తాను ఒంటరిగా పనిచేసుకునేవాడు, వృద్ధులున్నారని గాని, రోగులున్నారని గాని, లేదా ఇంటిపనంతా స్త్రీలమీదే పడి తత్ఫలితంగా వారు హింస పాలై బానిస స్థితిలో మగ్గుతున్నారని గాని ఎవ్వరూ పట్టించుకునే వారేకారు. ఈ పరిస్థి తిని రూపుమాపడం ఎవరి కర్తవ్యం? ఇది యువజన సంఘాల కర్తవ్యం: ''మేము దీనిని రూపు మాపుతాం, శుభ్రతను నెలకొల్పడంలో, లేదా ఆహారం పంచిపెట్టడంలో సహాయపడేందుకూ, వ్యవస్థాబద్ధంగా ఇంటింటికీ వెళ్లి తనిఖీ చేసేందుకూ, తమ శక్తులను ఉచితరీతిని పంపకం చేస్తూ, శ్రమ అనేది ఆర్గనైజు కాబడినట్టి శ్రమగా వుండాలని నిరూపించుతూ, సమాజ మంతటికీ మేలు చేకూరేందుకై ఒక ఆర్గనైజుకాబడిన పద్ధతిలో పనిచేసే యువకుల దళా లను మేము ఆర్గనైజు చేస్తాము''ని అవి అనాలి.

ఇంచుమించు ఏభైయ్యో పడిలోవున్న నేటితరానికి కమ్యూనిస్టు సమాజంలో జీవించే అవకాశంలేదు. ఆలోపలనే ఈ తరం అంతరించిపోతుంది. కాని ప్రస్తుతం పదిహేనేళ్ల వయస్సులో వున్న తరం కమ్యూనిస్టు సమాజాన్ని కళ్లారా చూస్తుంది. తానే ఈ సమాజాన్ని నిర్మిస్తుంది. కాగా ఈ సమాజ నిర్మాణమే తన యావత్తు జీవితాశయమని ఈ తరం గుర్తెరగాలి. పాత సమాజంలో వేర్వేరు కుటుంబాలవారు విడివిడిగా ఎవరిమటుకు వారు తమ తమ పనులు చేసుకుంటూండేవారు, కాగా ప్రజారాసులను హింసించినట్టి భూస్వాములూ పెట్టుబడిదార్లూ తప్ప ఇంకెవ్వరూ వీరి శ్రమను సంఘటిత పరచేవారే కారు. మహనీయమైన స్వచ్ఛందశ్రమ సైన్యంలో నేను ఒక భాగాన్ని, భూస్వాములూ పెట్టుబడిదార్లూ లేకుండానే నా జీవితాన్ని నేనే తీర్చి దిద్దుకోగలను, కమ్యూనిస్టు వ్యవస్థను నేను స్థాపించగలను, అని ప్రతి కార్మికుడూ

ప్రతి రైతూ అనగల్గే విధంగా శ్రమనంతనూ, అది ఎంత మలినమైనదీ, కష్టమైనదీ అయిన శ్రమ అయినాసరే, మనం ఆర్గనైజు చెయ్యాలి. యువజన కమ్యూనిస్టు సంఘం ప్రతివారినీ పిన్నవయస్సు నుండీ కూడా, చైతన్యవంతమైనట్టీ, క్రమశిక్షణా సహితమైనట్టీ, శ్రమలో పెంచి వృద్ధికి తెచ్చే శిక్షణ ఇవ్వాలి. ఈ విధంగా పని చేసినయెడల, నేడు మనల్ని ఎదుర్కొంటూన్న కర్తవ్యాలన్నీ నిర్వర్తించబడగలవని మనం నిశ్చయంగా చెప్పవచ్చు. పేదరికాన్ని అనుభవించుతూన్నట్టి మన దేశం సాంకేతిక శాస్త్రం సాధించిన అధునాతన విజయాలనుండి లాభం పొందేందుకుగాను మన దేశాన్ని విద్యుదీకరణం చేయడానికి అధమం పదేళ్లు పడుతుందని మనం లెక్కవేసుకోవాలి. కాగా ఇందుకోసమే, ప్రస్తుతం పదిహేనేళ్ల వయస్సులో వున్నట్టీ, మరొక పది, ఇరవై సంవత్సరాలైన తరువాత కమ్యూనిస్టు సమాజంలో జీవించ బోయేటట్టీ తరం ఏదో ఒక సాముదాయిక శ్రమ కర్తవ్యాన్ని, అది ఎంత స్వల్పమైనదైనా సరే, ఎంత సరళమైనదైనా సరే, ప్రతిరోజూ, ప్రతి గ్రామంలోనూ, ప్రతి నగరంలోనూ యువకులు ఆచరణరీత్యా నిర్వర్తించితీరే విధంగా విద్యాప్రబోధంలో తన కర్తవ్యాలన్నిటినీ రూపొందించుకోవాలి. ఏ మేరకైతే ఇది ప్రతి గ్రామంలోనూ జరుగుతుందో, ఏ మేరకైతే కమ్యూనిస్టు అనుకరణ అభివృద్ధి అవుతుందో, ఏ మేరకైతే తమ శ్రమను ఐక్య పరచుకోగలమని యువకులు రుజువు పరుస్తారో, ఆ మేరకు కమ్యూనిస్టు నిర్మాణ విజయం సుస్థిర మవుతుంది. కేవలం ఈ నిర్మాణ విజయం దృష్ట్యానే మనం వేసే ప్రతి అడుగునూ పరిశీలించడం వల్లనే, ఐక్యపడినట్టీ, చైతన్యవంతులైనట్టీ శ్రమజీవులుగా తయారయేందుకు మనం చేయగల్గినదంతా చేశామా అని మనలో మనం ప్రశ్నించుకోవడం వల్లనే, తన ఐదు లక్షల సభ్యులను ఒక ఏకైక సైన్యంగా ఐక్యపరచే కార్యంలో యువజన కమ్యూనిస్టు సంఘం విజయం సాధించి, సార్వజనిక గౌరవం పొందుతుంది.

# మన విప్లవం గురించి

## (ఎన్. సుహానొవ్ వివరణలను గురించి)

I

సుహానొవ్ విప్లవంపై రాసిన వివరణలను ఇటీవల ఒకసారి పుటలు తిరగేసి చూస్తున్నాను. చూస్తూంటే మన పెట్టీబూర్జువావర్గపు డెమోక్రాట్లు, వీరితోపాటే రెండవ ఇంటర్నేషనల్ వీరులూ, వీరందరి పాండిత్య ప్రకర్ష కొట్టొచ్చినట్టు ప్రత్యక్ష మవుతుంది. వీరందరూ అసమాన భీరువులు అన్న సంగతి అలా వుండగా, తమ ఎదుటనున్న విషయం జర్మన్ నమూనానుండి తలవెంట్రుకవాసి ఇటు తప్పినా సరే, అటు తప్పినా సరే, వీరిలో అత్యుత్తములు సహితం, కాపుదలతో జాగ్రత్త పడడమనే వీరి స్వభావం — పెట్టీబూర్జువా డెమోక్రాట్లందరికీ సామాన్యమైనట్టీ, విప్లవగమనం అంతటిలోనూ వారిచే ధారాళంగా ప్రదర్శించబడినట్టీ ఈ స్వభావం — అలా వుండగా, బానిస మనస్తత్వంతో వీరు గతాన్ని అనుకరించడం మనకి కళ్లల్లో పొడిచినట్టు అవుపడుతంది.

తాము మార్క్సిస్టులమే అని వారంటారు, కాని మార్క్సిజం గురించి వారి భావన అసాధ్యమైన పాండిత్య ప్రకర్షను అందుకుంటూంది. మార్క్సిజంలో ఏదైతే నిర్ణయాత్మకమైనదో దానినే, అనగా మార్క్సిజంయొక్క విప్లవాత్మక గతితర్కాన్నే అర్థంచేసుకోవడంలో వీరు పూర్తిగా విఫలులయారు. విప్లవ సమయాల్లో అత్యంతమైన ఉలుసుబాటుతనం అవసరమవుతుందని మార్క్స్ చేసిన సరాసరి సూచనను గ్రహించడంలో వీరు కేవలం విఫలులయారు, కాగా ఉదాహరణకు, తాను రాసిన ఒక లేఖలో — 1856 లో అనుకుంటాను — మార్క్స్ చేసినట్టి సూచనను — జర్మనీలో విప్లవాత్మక పరిస్థితిని బహుశా సృష్టించేటట్టి రైతు యుద్ధం ఒకటి కార్మికోద్యమంతో ఐక్యమయే ఆశను వ్యక్తపరుస్తూన్నట్టి సూచనను — ఈ సూటి సూచనను సహితమూ వారు దాటవేస్తూ, వేడివేడి పాలున్న గిన్నె చుట్టూ తారట్లాడుతూన్న పిల్లిలాగు, దాని చుట్టూ తారట్లాడుతున్నారు.

బూర్జువావర్గాన్ని వదిలిపెట్టి — దానితో తెగతెంపులు చేసుకోవడం మాట ఇక చెప్పనే అక్కర్లేదు — ఒక్క అడుగైనా వేయడానికి భయపడుతూన్న సంస్కరణవాద తత్వపు

పిరికిపందలని వారి యావత్తు ప్రవర్తనే చాటుతూంది, కాగా అదే సమయంలో హద్దూ పద్దూలేని పదజాల ప్రయోగంతోనూ ప్రగల్భాలతోనూ తమ పిరికితనాన్ని కప్పిపుచ్చుకో జూస్తున్నారు. కాని స్వచ్ఛమైన సిద్ధాంత దృక్స్థానం నుండే చూచినప్పటికీ కూడా, ఈ దిగువ పేర్కొనబడిన మార్క్సిస్టు హేత్వాదాలను రవంతైనా గ్రహించకపోవడం వీరందరిలోనూ అతిస్పష్టంగా కనబడుతూంది. పెట్టుబడిదారీ విధానమూ, బూర్జువా ప్రజాస్వామ్యమూ పాశ్చాత్య యూరప్‌లో ఒక స్పష్టమైన అభివృద్ధి మార్గాన్ని చేపట్టడం ఇంతవరకూ వారు చూశారు, కాగా mutatis mutandis*, (ప్రపంచ చరిత్ర సాధారణ పరిణామ దృక్స్థానం నుండి చూచినట్టయితే కేవలం స్వల్పమే అయినట్టి) కొన్ని సవరణలతో మాత్రమే ఈ మార్గాన్ని ఒక నమూనాగా చేపట్టడానికి వీలవుతుందన్న విషయాన్ని వారు అసలు భావించుకోనైనా భావించుకోలేరు.

మొదటి విషయం: మొదటి సామ్రాజ్యవాద యుద్ధంతో సంబంధించిన విప్లవం. ఇట్టి విప్లవం తప్పనిసరిగా కొత్త లక్షణాలను, లేదా లక్షణాలలో అసలు యుద్ధం ఫలితంగానే కలిగినట్టి కొన్ని మార్పులను, ప్రదర్శించి తీరుతుంది; ఎందుచేతంటే ఇట్టి యుద్ధాన్ని, కాగా ఇట్టి పరిస్థితులలో, ప్రపంచం ఇదివరకెన్నడూ ఎగరదు. యుద్ధం ముగిసినప్పటినుండి ఈనాటి వరకూ అత్యంత సంపదవంతమైన దేశాల్లోని బూర్జువావర్గం కూడా "మామూలు" బూర్జువా సంబంధాలను పునస్థాపితం చేయలేకపోతూన్నట్టు మనం చూస్తున్నాం. అయిన ప్పటికీ, మామూలు బూర్జువా సంబంధాలే పరిమితులు (జవదాటడానికి వీల్లేని పరిమితులు) అని, తాము విప్లవకారులమని కపటనాటకమాడుతూన్నట్టి మన సంస్కరణవాదులూ, పెట్టీ బూర్జువాలూ నమ్మారు, ఇప్పటికీ నమ్ముతూనే వున్నారు. ఆమాటకొస్తే, ఈ "మామూలు" అనే భావం అతి సర్వసాధారణంగానూ, సంకుచితంగానూ వుంది.

రెండో విషయం: మొత్తంగా ప్రపంచ చరిత్ర అభివృద్ధి సాధారణ నియమాలను పాటించు తూండగా, అభివృద్ధిలో కొన్ని దశలు అభివృద్ధి రూపంలోనో, లేదా అభివృద్ధి క్రమంలోనో కొన్ని ప్రత్యేకతలను ప్రదర్శించవచ్చునన్న విషయం ప్రతిబంధకంగా ఏర్పడకపోవడమే కాకుండా, తత్వ్యతిరేకంగా సంభావ్యమనే మనం ఊహించుకోవాల్సి వుంటుదన్న ఆలోచనే అసలు వీరికి తట్టదు. ఉదాహరణకు, రష్యా — నాగరిక దేశాలకూ, యుద్ధంచే నాగరికత పరిధుల్లోకి నిష్కృష్టంగా తీసుకురాబడినట్టి దేశాలకూ, అనగా అన్ని ప్రాచ్య, యూరపేతర దేశాలకూ నడుమనున్న సరిహద్దు గీతపై నిలబడుతూన్నట్టి రష్యా — ఈ హేతువువల్లనే, తన విప్లవ విషయంలో ప్రపంచాభివృద్ధి సాధారణ మార్గాన్ని సహజంగానే తాను అనుసరిస్తూన్నప్పటికీ, పాశ్చాత్య

* అనుగుణములగు మార్పులతో — అనువాదకుడు.

యూరప్ దేశాలలో జరిగిన ఇదివరకటి అన్ని విప్లవాలనుండి విభేదించుతూన్నట్టి, ప్రాగ్దేశాలను చేరినప్పుడు, విశిష్టములైన కొన్ని పాక్షిక నూతన రీతులను ప్రవేశపెట్టేటట్టి స్పష్టములైన కొన్ని ప్రత్యేక లక్షణాలను తన విప్లవంలోనే బహిర్గతం చేయవచ్చుననీ, తప్పక చేసితీరుతుందనే ఆలోచనే వారికి కలగదు.

ఉదాహరణకు, పాశ్చాత్య యూరపియన్ సోషల్-డెమోక్రసీ అభివృద్ధి చెందుతూన్న రోజుల్లో వీరు రోకటిపాటగా నేర్చుకున్నట్టి వాదన, అనగా సోషలిజానికి మనమింకా పరిపక్వం కాలేదనీ, వీరిలో కొందరు "పండితులు" వ్రాకుచ్చేటట్టు, సోషలిజానికి ఆవశ్యకమయే బాహ్యగతాత్మక ఆర్థిక ఆధారవాక్యాలు మన దేశంలో మనడంలేదనే వాదన మితిమీరలేనంతటి మామూలు వాదన. కాని, మొదటి సామ్రాజ్యవాద యుద్ధకాలంలో సృష్టించబడినలాంటి విప్లవాత్మక పరిస్థితుల నడిమధ్యలో తానున్నట్టు కనుగొనిన ప్రజ మాటేమిటి, ఆశారహితమైన తన పరిస్థి ప్రభావం కారణంగా, తన నాగరికతయొక్క తదుపరి అభివృద్ధికి అవసరమైన, ఒక విధంగా చూస్తే, సామాన్యము కానట్టి స్థితిగతులను సాధించుకోడానికి అధమం ఏ మాత్రపు అవకాశాలనైనా ఇచ్చేటట్టి, పోరాటంలోకి అది ఉరకకూడదా? — అన్న ప్రశ్న వేద్దామని వీరిలో ఒకరికైనా తట్టదు.

"సోషలిజాన్ని సుసాధ్యం చేసేటట్టి ఉత్పాదక శక్తుల అభివృద్ధి స్థాయికి రష్యా ఇంకా చేరుకోలేదు." ఈ ప్రమేయాన్ని పట్టుకుని, రెండవ ఇంటర్నేషనల్ వీరాగ్రేసరులందరూ, సహజంగా సుహానొవ్‌ను కలుపుకునే, కోతికి కుళ్లాయి దొరికినట్టు అదే మురిసిపోతున్నారు. నిర్వివాదమైన ఈ ప్రమేయాన్ని పట్టుకుని వీరు లక్ష రాగాల్లో భజనచేస్తూన్నారు, కాగా మన విప్లవాన్ని విలువకట్టడానికి ఇదొక నిర్ణయాత్మకమైన ప్రమాణమని వీరు అనుకుంటున్నారు.

కొద్దోగొప్పో పలుకుబడి కలిగినట్టి ప్రతి పాశ్చాత్య యూరపియన్ దేశమూ చిక్కుకున్నట్టి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధంలోకి రష్యాను ప్రత్యేక పరిస్థితులు మొదట లాక్కొని వచ్చి, ప్రష్యాకు సాధ్యమే అయినట్టి ఒక భవిష్యత్తుగా మార్క్స్ అంతటి "మార్క్సిస్టే" 1856 లో సూచించినట్టి, కార్మికవర్గ ఉద్యమంతో ఒక "రైతు యుద్ధం" యొక్క ఆ సరాసరి ఐక్యతనే సాధించడానికి మనకు అవకాశం కల్గించినట్టి పరిస్థితులలో, ప్రాచ్యంలో పరిపక్వానికి వస్తూన్నట్టి, పాక్షికంగా ప్రారంభమైనట్టి విప్లవాల అంచు దరికి తన అభివృద్ధి తనను తీసుకువస్తే, అప్పుడేమిటి?

పరిస్థితుల సంపూర్ణ ఆశారహిత స్వభావమే, కార్మిక కర్షకుల ప్రయత్నాలను పదింతలు అధికం చేసేందుకు పురికొల్పిన ఫలితంగా, పశ్చిమ యూరప్ దేశాల నాగరికతయొక్క మౌలిక ఆవశ్యకతలు సృష్టించబడిన మార్గంకంటె భిన్నమార్గంలో సృష్టించబడే సాధ్యతను

కలుగజేసినట్టయితే, అప్పుడేమిటి? ప్రపంచచరిత్ర అభివృద్ధియొక్క సాధారణ మార్గం ఇందువలన ఏమైనా మారిందా? ప్రపంచ చరిత్ర సాధారణ ప్రవంతిలోకి ఆకర్షించబడుతూన్నట్టి, లేదా ఆకర్షించబడినట్టి అన్ని దేశాలలోని మౌలిక వర్గాల మౌలిక అన్యోన్య సంబంధాలు ఇందువలన ఏమైనా మారాయా?

సోషలిజాన్ని నిర్మించేందుకు ఒకనిర్దిష్ట సాంస్కృతిక స్థాయి (ఆ నిర్దిష్ట ''సాంస్కృతిక స్థాయి'' ఏమిటో, ప్రతి ఒక్క పాశ్చాత్య యూరపియన్ దేశంలోనూ అది విభేదించుతూండడం కారణాన, ఇదమిద్ధమని ఎవ్వరూ నిష్కర్షగా చెప్పలేకపోయినప్పటికీ) ఆవశ్యకమైన పక్షంలో, ఆ నిర్దిష్ట సాంస్కృతిక స్థాయికి ఆవశ్యకములైన వాటిని విప్లవాత్మక మార్గంలో సాధించేందుకు మొదట ప్రారంభించి, తరువాత కార్మికులరైతుల ప్రభుత్వంయొక్క, సోవియట్ వ్యవస్థయొక్క సహాయంతో ఇతర ప్రజలను మించిపోవడానికి మనం ఏల ముందుకు సాగిపోకూడదు?

జనవరి 16, 1923.

## II

సోషలిజాన్ని నిర్మించడానికి నాగరికత ఆవశ్యకమని మీరంటున్నారు. మీరు చెప్పేది భేషుగ్గా వుంది. అయితే భూస్వాములనూ, రష్యాదేశపు పెట్టుబడిదార్లనూ మన దేశనుండి వెళ్లగొట్టడంలాంటి నాగరికతా పూర్వకాంక్షితాలను మొదట సృష్టించి, తరువాత సోషలిజం దిశగా పురోగమనాన్ని మనమేల ప్రారంభించకూడదు? మామూలు చారిత్రక ఘటనల క్రమంలోని మార్పులు నిషిద్ధములనీ, లేదా అసాధ్యములనీ మీరు ఎక్కడ, ఏ గ్రంథాల్లో చదివారు?

నెపోలియన్ రాసినదానిని జ్ఞాపకం తెచ్చుకుందాం: "On s'engage et puis... on voit". దీనిని స్వేచ్ఛగా అనువదిస్తే ఇలా వుంటుంది: ''భీషణయుద్ధంలోకి మొదట దిగుతే, జరిగేదేమిటో అప్పుడు చూడొచ్చు.'' 1917 అక్టోబరులో భీషణయుద్ధంలోకే మనం దిగాం, బ్రెస్ట్-లితోవ్స్క్ శాంతి,[164] నూతన ఆర్థిక విధానం, వగైరాల్లాంటి అభివృద్ధి వివరాలనూ (ప్రపంచ చరిత్ర దృక్స్థానంనుండి చూస్తే అవి కేవలం వివారాలే) అప్పుడు చూశాం. కాగా ప్రధానంగా మనమే విజయం పొందామన్న విషయంలో ఇప్పుడేమాత్రమూ సందేహంలేదు.

విప్లవాలను అసలు మరొక విధంగా జరిగించడానికి ఏ మాత్రమూ వీల్లేదని, మన సుఖానొవ్‌లు — వీరికంటే ఇంకా కుడివైపునే వున్న సోషల్-డెమోక్రాట్ల మాట చెప్పన వసరమే లేదు — కలలోనైనా అనుకోలేరు. ఇంకా ఎంతో బ్రహ్మాండమైన జనసంఖ్యలను కలిగి, సామాజిక పరిస్థితులలో ఇంకా ఎంతో బ్రహ్మాండమైన వైవిధ్యాలను కలిగినట్టి ప్రాగ్దేశాలలోని తదుపరి విప్లవాలు, రష్యన్ విప్లవంకంటెనూ ఇంకా మరింత మహత్తరమైన అసాధారణ

లక్షణాలను నిస్సందేహంగా ప్రదర్శిస్తాయని మన యూరపియన్ అల్పబుద్ధులు కలలోనైనా అనుకోలేరు.

కౌట్‌స్కీయ పంథాను అనుసరించి రాసిన పాఠ్యపుస్తకం ఆకాలానికి బాగా ఉపయోగ పడిందని వేరే చెప్పనక్కరలేదు. అయినప్పటికీ తదుపరి ప్రపంచ చరిత్ర అభివృద్ధియొక్క రూపాలన్నింటినీ అది దూరదృష్టితో ముందుగానే చూడగల్గిందన్న అభిప్రాయాన్ని వదలు కోవాల్సిన కాలం రానే వచ్చింది. ఆ విధంగా అభిప్రాయపడేవారు శుద్ధ తెలివితక్కువవారని చెప్పాల్సిన కాలం కూడా అప్పుడే రానేవచ్చింది.

జనవరి 17, 1923.

# సమరశీల భౌతికవాదంయొక్క ప్రాముఖ్యత

...మాసపత్రిక సంపాదకులు 1–2 సంచికలలో పొందుపరచిన క్రియాకలాపాలం యొక్క విషయాన్నీ మా కార్యక్రమాలనూ మరింత నిష్కర్షగా నిర్వచించే కొన్ని స్పష్టమైన ప్రశ్నలపై నేను ప్రస్తావించ నుద్దేశించాను.

"పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ"[165] మాసపత్రిక చుట్టూచేరినా వారందరూ కమ్యూనిస్టులు కాకపోయినప్పటికీ, వారందరూ సుసంగతమైన భౌతికవాదులేనని ఈ ప్రకటన చెబుతూంది. కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టేతరులూ ఈ విధంగా ఐక్యంకావడం కేవలం ఆవశ్యకమనీ, మాసపత్రిక కర్తవ్యాలను సరిగా నిర్వచిస్తూందనీ నేను అభిప్రాయపడుతున్నాను. కమ్యూనిస్టుల (సాధారణంగా మహత్తర విప్లవాని జయప్రదంగా ప్రారంభించిన విప్లవకారుల యొక్క కూడా), ప్రమాదభరితములైన గొప్ప పొరపాట్లలో ఒకటి కమ్యూనిస్టులు ఒక్కరే విప్లవాన్ని తీసుకురాగల్గుతారనే భావన. తత్‌వ్యతిరేకంగా, ప్రతి విప్లవ కార్యమూ విజయవంతంగా వుండాలంటే, యథార్థంగా వీర్యవంతమైన పురోగామి వర్గపు అగ్రగామిదళ పాత్రను మాత్రమే విప్లవకారులు నిర్వర్తించ సమర్థులనే భావాన్ని అర్థంచేసుకోవడమూ, దానిని క్రియలో చూపడమూ అవసరం. తాను నడిపించుతూన్న ప్రజారాసులనుండి వేరుపడే ధోరణిని నివారించ సమర్థత కల్గి, యావత్ ప్రజారాశినీ ముందుకు నడిపించగల్గే సమర్థతను కల్గినప్పుడే అగ్రగామిదళం అగ్రగామిదళంగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించగల్గుతుంది. అత్యంత వైవిధ్యములైన క్రియారంగాలలో కమ్యూనిస్టేతరులతో మిత్రత్వం లేనిదే, విజయవంతమైన కమ్యూనిస్టు నిర్మాణకార్యమనే ప్రశ్న ఉదయించడానికే వీలుండదు.

"పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ" మాసపత్రిక పూనుకున్న భౌతికవాద, మార్క్సిజముల పరిరక్షణ కార్యానికీ ఇదే వర్తిస్తుంది. అదృష్టవశాత్తూ, రష్యాలో పురోగామి సామాజిక చింతనలోని ప్రధాన ధోరణులకు దృఢమైన భౌతికవాద సంప్రదాయం వుంది. జి.వి. ప్లెహానొవ్ గురించి చెప్పనవసరమేలేకపోగా, యూరపియన్ విజ్ఞానశాస్త్రంలో "తుది మాట" అని

చెప్పబడే ముచ్చిబంగారపు తళకులకు సమ్మోహితులై, ఈ ముచ్చిబంగారం అడుగుననున్నట్టి ఏదో ఒక రకం బూర్జువావర్గంపట్ల, బూర్జువావర్గ దురభిమానాలపట్ల, బూర్జువా అభివృద్ధి నిరోధకంపట్ల బానిస మనస్తత్వాన్ని గుర్తించ నశక్తులై, ఫాషన్‌గా చెలామణీ అవుతూన్న అభివృద్ధినిరోధక తాత్విక సిద్ధాంతాలకై అన్వేషించుతూ, ఆధునిక నరోద్నిక్కులు (పాప్యులర్ సోషలిస్టులు, సోషలిస్టు-రివల్యూషనరీలు, వగైరాలు) ఎవరినుండైతే తరుచుగా తిరోగమించారో అట్టి చెర్నిషేవ్‌స్కిని పేర్కొంటే చాలు.

ఏ విధంగా చూసినప్పటికీ, రష్యాలో కమ్యూనిస్టేతర శిబిరంనుండి భౌతికవాదులు మనకిప్పటికీ దొరుకుతూనే వున్నారు — ఇంకా కొంత సుదీర్ఘకాలం వరకూ దొరుకుతూనే వుంటారు కూడానూ, "విద్యావంతమైన సమాజం" అని పిలువబడే సమాజపు తాత్విక ప్రక్రియ, తాత్విక దురభిమానాలపై ప్రతిఘటన అనే ఉమ్మడి కార్యంలో సుసంగతమూ సమరశీలమైనట్టి భౌతికవాదంయొక్క అనుయాయుల నందరనూ సమీకరించడం మనం నిస్సందేహంగా నిర్వర్తించాల్సిన విధ్యుక్తధర్మం. డీట్జ్‌గెన్ — పెద్దతను గురించే నేను చెబుతున్నాను అంతేకాని అతని కొడుకూ, ఎంత డాబుసరైన మనిషో అంత వృద్ధిలోకిరానట్టి రచయిత చిన్న డీట్జ్‌గెన్ గురించికాదు — ఆచరణలో ఆధునిక సమాజంలోని తత్వశాస్త్రపు ప్రొఫెసర్లు అధికసంఖ్యాకవర్గపు సందర్భాల్లో "మతగురుతత్వంయొక్క పట్టభద్రులైన గులాములు" తప్ప మరేమీ కారని ఎప్పుడు చెప్పాడో, బూర్జువాదేశాల్లో వ్యాప్తిచెందుతూన్నట్టీ, ఆ దేశాల శాస్త్రవేత్తల, పత్రికావ్యాసరచయితలు మెప్పును పొందుతూన్నట్టీ తాత్విక ధోరణులను గురించి మౌలికమైన మార్క్సిస్టు అభిప్రాయాన్ని అప్పుడే యథార్థంగానూ, సముచితంగానూ, స్పష్టంగానూ తెలియజేశాడు.

కడమ అన్ని దేశాల్లోని తమ సోదరులలాగానే తామూ పురోగాములమని అనుకుంటూ ఆత్మసంతుష్టి పొందుతూన్నట్టి మన రష్యన్ మేధావులు, డీట్జ్‌గెన్ మాటలలో వ్యక్తపరచబడినట్టి అభిప్రాయ స్థాయికి ప్రశ్నను మార్చేందుకు ఎంతేనా విముఖులుగా వున్నారు, కాని వారి విముఖతకు కారణం వారు సత్యాన్ని ముఖాముఖీ చూడలేకపోవడమే. డీట్జ్‌గెన్ కావించిన ఘాటైన వర్ణన కేవలమూ సత్యమని గ్రహించేందుకు, ప్రభుత్వ సంబంధంగానూ, సాధారణ ఆర్థిక, జీవిత సంబంధంగానూ, ఇంకా ఇతరత్రా అన్ని విధాలుగానూ ఆధునిక విద్యావంతులు పాలక బూర్జువావర్గంపై ఎంతగా ఆధారపడి వున్నారో మనం ఏ మాత్రం పర్యాలోచించినా సరే మనకు విశదమవుతుంది. బూర్జువావర్గపు వర్గప్రయోజనాలూ వర్గ స్థానమూతో ఇటు మత రూపాలన్నింటికీ అది ఇచ్చే వత్తాసుకుగల సంబంధమూ, అటు ఫాషన్‌గా చెలామణీ అవుతూన్నట్టి తాత్విక ధోరణుల భావశాస్త్రానికీగల సంబంధమూ గురించి మనకు ఏ మాత్రం అవగాహన కలగాలన్నా, ఉదాహరణకు రేడియం ఆవిష్కరణ మొదలుకొని ఎన్

స్టయిన్ కొంగుపట్టుకోడానికి ఈనాడు ప్రయత్నించుతూన్నట్టివారి వరకూ మిక్కిలి తరుచుగా యూరప్‌లో తలయెత్తేటట్టి ఫాషన్‌గా చెలామణి అవుతూన్న తాత్విక ధోరణులలో అత్యధిక సంఖ్యాకవర్గాన్ని మనం జ్ఞప్తికి తెచ్చుకుంటే చాలు.

సమరశీలమైన భౌతికవాదపు పత్రికగా ఉండగోరే మాసపత్రిక ప్రప్రథమంగా, అధికారయుత విజ్ఞానశాస్త్ర ప్రతినిధులుగానే అవుపడుతూన్నట్టి వారైనా సరే, లేదా "ప్రజాస్వామిక వామపక్షపు, లేదా భావశాస్త్ర దృష్ట్యా సోషలిస్టు" పత్రికావ్యాసకర్తలమని పేరు తగిలించుకున్నట్టి స్వతంత్ర రచయితలైనా సరే, ఎట్టి వ్యత్యాసమూ చూపకుండా ఆధునిక "మత గురుతత్వంయొక్క పట్టభద్రులైన గులాముల" నందరినీ, నిస్సంకోచంగా బట్టబయలు చేసి, వారిపై నిందమోపే అర్థంలో పోరాటశీలమైన పత్రికగా వుండాలి.

రెండోది, ఇట్టి మాసపత్రిక సమరశీలమైన నాస్తికవాద పత్రికగా వుండాలి. నాస్తికవాద కార్యకలాపంపై అజమాయిషీ చేస్తూన్నట్టి ప్రభుత్వపు శాఖలు, శాఖలు కాకపోయినా ప్రభుత్వపు సంస్థలు మనకున్నాయి. కాని ఈ కార్యనిర్వహణ అత్యంత ఉదాసీనతతోనూ అమిత అసంతృప్తికరంగానూ జరుపబడుతూంది, కాగా ఈ కార్యనిర్వహణ కూడా అసలైన రష్యన్ (సోవియట్టే అయినప్పటికి సహితమూ) బ్యూరోక్రసీకి మామూలైన పరిస్థితుల జాడ్యంతోనే బాధపడుతూన్నట్టే వుంది చూడగా. అందుచేత ఈ ప్రభుత్వ సంస్థల కృషికి అందనంగానూ, ఈ కృషిని మెరుగుపరచి, దీనికి జీవంపోసేందుకూ, సమరశీలమైన భౌతికవాదాన్ని ధ్యేయంగా పెట్టుకున్నట్టి మాసపత్రిక ఒకటి, అలసట ఎరగని నాస్తికవాద ప్రచారం, అలసట ఎరగని నాస్తికవాద పోరాటం సాగించడం ఎంతేనా ఆవశ్యకం. ఈ విషయంపై అన్ని భాషలలోనూవున్న సారస్వతాన్నీ జాగ్రత్తగా గమనించుతూ, ఈ రంగంలో ఏ మాత్రపు విలువ కలిగిన విషయాలైనా సరే వాటినన్నిటినీ అనువదించడమూ, లేదా అధమం సమీక్షచేయడమూ జరిగితీరాలి.

పద్దెనిమిదో శతాబ్దాంతపు సమరశీలమైన నాస్తికవాద సారస్వతాన్ని ప్రజలలో రాసిగా పంచిపెట్టేందుకు దానిని అనువదించాలని ఆధునిక శ్రామికవర్గ నాయకులకు ఏనాడో ఎంగెల్స్ సలహా చెప్పాడు. ఈ కార్యాన్ని (విప్లవాత్మక శకమందు పరిపాలనాధికారాన్ని ఉచితరీతిని ఉపయోగించుకోవడమెలాగో తెలుసుకోవడం కంటె, దానిని హస్తగతం చేసుకోవడమే సులభమని తెలిపే అనేక దృష్టాంతాల్లో ఇదొకటి) ఈనాటి వరకూ నెరవేర్చలేదనే మనం సిగ్గుతో ఒప్పుకోవాల్సి వుంది. మన ఉదాసీనతనూ, కార్యశీలతారాహిత్యాన్నీ, అశక్తతనూ సమర్థించుకోను, ఉదాహరణకు పద్దెనిమిదో శతాబ్దపు పాత నాస్తికవాద సారస్వతం ఏనాడో బూజుపట్టి పోయినదనీ, అశాస్త్రీయమైనదనీ, మరీ సత్యకాలంగా వుందనీ, వగైరా అనేక కారణాలు చెప్పడం కద్దు. ఇటువంటి కుహనా శాస్త్రీయపు కుతర్కాలకంటె అధ్వాన్నమైనది మరేదీ వుండదు,

పాండిత్య ప్రకర్షకూ, లేదా మార్క్సిజం పూర్తి అపార్థానికీ ఇది ఒక ముసుగుతప్ప మరేమీ కాదు. పంథొమ్మిదో శతాబ్ది విప్లవాకారుల నాస్తికవాద రచనలలో అశాస్త్రీయమూ సత్యకాలమూ బోలెడంత వుందనే విషయం నిజమే, అది సహజమే కూడానూ. కాని ఈ రచనలను సంక్షిప్త పరచి, మతాలను సశాస్త్రీయంగా విమర్శించడంలో పద్దెనిమిదో శతాబ్దాంతంనుండి నేటి వరకూ మానవాళి సాధించిన ప్రగతినీ, ఈ విషయమై ఇటీవల వెలువడిన రచలనూ ఇతర విషయాలనూ పేర్కొంటూ, సంగ్రహ అనుబంధాలను చేర్చకూడదని వీటి ప్రచురణకర్తలను ఎవ్వరూ నివారించడంలేదే. అంధకారంలోనూ, అజ్ఞానంలోనూ, మూఢత్వంలోనూ నిర్బంధించబడిన లక్షోపలక్షల ప్రజలు, ప్రజారాసులు (ముఖ్యంగా రైతులు, చేతిపనులవారు), కేవలం స్వచ్ఛమైన మార్క్సిస్టు విద్యాప్రబోధమనే సూటి మార్గాన్ని చేపట్టడంవల్లనే ఈ అంధకారంనుండి తమ విముక్తిని సాధించుకో గల్గుతారని ఏ మార్క్సిస్టైనా అనుకుంటే, అట్టి మార్క్సిస్టు బ్రహ్మాండమైన పొరపాటే, అతి ఘోరమైన పొరపాటే చేస్తున్నాడు. అత్యంత వైవిధ్యమైన నాస్తికవాద ప్రచార సామగ్రిని ఈ ప్రజారాసులకు అందజేయాలి, అత్యంత వైవిధ్యములైన జీవిత రంగాలకు సంబంధించిన వాస్తవవిషయాలతో వారికి పరిచితి కల్గించాలి, వారికి ఆసక్తి కల్గించేందుకూ, భిన్నాతిభిన్న దృక్కోణాలనుండి, భిన్నాతిభిన్న పద్ధతులు వగైరాలవల్ల, ఈ విధంగా కాకపోతే ఇంకొకవిధంగా, ఇంకొక విధంగా కాకపోతే మరొక విధంగా, మతవిషయిక నిద్రావస్థనుండి వారిని మేలుకొల్పేందుకు వారిని సమీపించాలి.

ప్రజలను వారి మతవిషయిక నిద్రనుండి మేల్కొల్పేందుకై, మన సారస్వతంలో ప్రబలంగా వున్నట్టీ తరుచు మార్క్సిజాన్ని వికృతపరుస్తూన్నట్టీ (ఈ వాస్తవవిషయాన్ని బయిట పెట్టడంలో మహాపాపమేమీ లేదు), నేర్పరితనంతో ఎంచి ఏర్చిన వాస్తవవిషయాల తార్కాణల వల్ల ఇంచుమించు ఏ మాత్రమూ ద్యోతకపరచకుండా విసుగెత్తించుతూ మనసును రజింప జేయనట్టి మార్క్సిస్టు టీకల కంటె, ఆనాడు వ్యాప్తిలో వుండిన మతగురుతత్వంపై హాస్య రసంతోనూ, బహిరంగంగానూ ధ్వజమెత్తినట్టి పాతకాలపు పద్దెనిమిదో శతాబ్ది నాస్తికుల తీక్షణములూ, సమర్థవంతములూ, ఉత్సాహవంతములూ అయిన రచనలే వెయ్యిరెట్లు అధికంగా ఉపయోగకరంగా వుండవచ్చునన్న విషయం మిక్కిలి తరుచుగా రుజువుకాగలదు. మార్క్స్, ఎంగెల్స్‌ల ప్రధాన గ్రంథాలన్నిటి అనువాదాలూ మనకున్నాయి. మార్క్స్, ఎంగెల్స్‌లచే ప్రవేశ పెట్టబడినట్టి దిద్దుబాట్లచే పరిష్కృతం కాకుండా, పాతకాలపు నాస్తికతత్వమూ పాతకాలపు భౌతికవాదమూ అలాగే వుండిపోతాయనే భయానికి కేవలమూ ఎట్టి కారణాలూ లేవు. ఇంకా ఏమాత్రమూ అభివృద్ధి చెందనట్టి ప్రజారాసులలో మతవిషయిక ప్రశ్నల పట్ల తెలివి తేటలు కల్గిన వైఖరినీ, మతాలపట్ల తెలివితేటలు కల్గిన విమర్శనా దృష్టినీ మేల్కొల్పడం ఎలాగో తెలుసుకోవడమే — కాగా మార్క్సిస్టులు అని భావించబడుతూన్నట్టి, కాని వాస్తవంగా

మార్క్సిజానికి అంగవైకల్యాన్ని కలుగజేస్తూన్నట్టి మన కమ్యూనిస్టులచే మిక్కిలి తరుచుగా అలక్ష్యం చేయబడుతూన్నట్టి — అతి ముఖ్యమైన విషయం.

అటు, మతంపట్ల ఆధునిక శాస్త్రీయ విమర్శనా ప్రతినిధులవైపు ఒక సారి దృష్టిని సారించండి. విద్యావంతమైన బూర్జువావర్గపు ప్రతినిధులు మతవిషయికమగు మూఢ నమ్మకాల పట్ల తాము కావించే ఖండనలనే బూర్జువావర్గపు భావశాస్త్రీయ బానిసలుగా, ''మత గురుతత్వంయొక్క పట్టభద్రులైన గులాములు''గా తమను వెంటనే బట్టబయలు చేస్తూన్నట్టి వాదనలతో తప్పనిసరిగా ''శేషపూరణం'' చేస్తున్నారు.

రెండు ఉదాహరణలు: ప్రొఫెసర్ ఆర్.వై. విప్పెర్, ''క్రిస్టియను మతం పుట్టుక'' (''ఫారోస్'' ప్రచురణాలయం, మాస్కో) ఒక చిన్న పుస్తకాన్ని 1918 లో ప్రచురించాడు. ఆధునిక విజ్ఞానశాస్త్రపు ప్రధాన ఫలితాలను గురించి తానిచ్చిన కథనంలో ఒక రాజకీయ ఆర్గనైజేషనుగా చర్చియొక్క ఆయుధాలైన మూఢనమ్మకాలపైన, వంచనపైన రచయిత దాడి చేయకపోవడం అటుండగా, భావవాద, భౌతికవాదములు రెండు ''కొనలకూ'' తాను అతీతుడనుగా వుంటున్నాననే కేవలం హాస్యాస్పదమూ అత్యంత అభివృద్ధి నిరోధకమూ అయినట్టి ఒక ప్రగల్బం పలుకుతున్నాడు. మతానికి వత్తాసు ఇవ్వడానికిగాను కష్టజీవులనుండి పిండిన లాభాలనుండి కోటానుకోట్ల రూబుళ్లను ప్రపంచమంతటా వినియోగించుటూన్నట్టీ రాజ్యాధికారం చలాయించుతూన్నట్టీ బూర్జువావర్గం దయకోసం ఇచ్చకాలాడడం తప్ప ఇది మరొకటికాదు.

సుప్రసిద్ధ జర్మన్ విజ్ఞానశాస్త్రవేత్త ఆర్థూర్ డ్రెవ్స్, తాను రచించిన ''క్రీస్తు పురాణం'' అనే పుస్తకంలో మతవిషయిక మూఢనమ్మకాలూ, కల్పితగాథలూ అబద్ధాలని చెబుతూనే, క్రీస్తు ఎన్నడూ జీవించివుండలేదని రుజువు చేస్తూనే, పుస్తకం చివరను మాత్రం, మతానికి, ''దినదానిభివృద్ధి పొందుతూన్నట్టి ప్రకృతిశాస్త్ర తత్వ ప్రవాహాన్ని'' (నాల్గవ జర్మన్ కూర్పు, 1910, పుట 238) తట్టుకోగల సామర్థ్యం కలిగిన మతానికి — ఎంత పునరుద్ధరించబడి పరిశుద్ధం చేయబడి మరింత సూక్ష్మంచేయబడినట్టిదే అయినప్పటికీ మతమే, అట్టి మతానికి — తాను సుముఖుడనేనని ఉద్ఘోషిస్తాడు. పాతబడిపోయి, శిథిలావస్థలోనున్న మతవిషయిక మూఢనమ్మికల స్థానే నూతనమూ, మరింత హేయమూ, మరింత దుష్టమూ అయిన మూఢనమ్మకాలను నెలకొల్పేందుకు దోపిడీదార్లకు బాహాటంగా సహాయపడుతూన్నట్టి ఎట్టి మొగమాటమూ లేని, బుద్ధిపూర్వకమైన అభివృద్ధి నిరోధకుడు మన కిక్కడ తారసిల్లుతున్నాడు.

దీని అర్థం డ్రెవ్స్‌ను అనువదించ కూడదనికాదు. బూర్జువావర్గంలోని అభ్యుదయ శీలమైన విభాగంతో ఒక స్పష్టమైన మేరకు మిత్రత్వం నెరపుకుంటూనే, కమ్యూనిస్టులూ,

సుసంగత భౌతికవాదులందరూ, ఆ విభాగం అభివృద్ధి నిరోధకాన్ని సాగించినప్పుడల్లా దానిని నిర్దాక్షిణ్యంగా బట్టబయలు చేస్తూండాలనే దీని అర్థం. పద్దెనిమిదో శతాబ్ది, అనగా ఏ కాలం లోనైతే బూర్జువావర్గం విప్లవాత్మకంగా వుండినదో ఆ కాలంనాటి, బూర్జువావర్గ ప్రతిని ధులతో మిత్రత్వం పట్ల విముఖత ప్రదర్శించడమంటే దాని అర్థం, మార్క్సిజానికీ, భౌతిక వాదానికీ ద్రోహం చేయడమన్నమాటే; ఎందుచేతంటే అధికప్రాబల్యం కలిగివుంటూన్న మతాంధకారులపై మనం సాగించే పోరాటంలో ఈ డ్రెఫస్‌లతో, ఏదో ఒక రూపంలో, ఏదో ఒక అంతరం వరకూ ''మిత్రత్వం'' అగత్యమే అవుతుంది.

సమరశీలమైన భౌతికవాద పత్రికగా వుండాలనే ఆశయాన్ని కలిగినట్టి ''పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ'' మాసపత్రిక, నాస్తికవాద ప్రచారానికీ, ఈ విషయంపై వెలువడుతూన్న సారస్వతంపై సమీక్షలకూ, ఈ రంగాలలో మన ప్రభుత్వ క్రియాకలాపంలోని బ్రహ్మాండమైన లోపాల సవరణలకూ తన పుటలలో ప్రధానస్థాన మివ్వాలి. ఆధునిక బూర్జువావర్గం యొక్క వర్గ ప్రయోజనాలూ, వర్గ ఆర్గనైజేషనులూ మతసంస్థలతోనూ, మత ప్రచారంతోనూ ఏ విధంగా మిళితమై వున్నాయో చూపుతూన్నట్టి నిర్దిష్టములైన అనేక వాస్తవవిషయాలనూ, తారతమ్యాలనూ కలిగివున్నట్టి పుస్తకాలనూ, పాంఫ్లెట్లనూ ఉపయోగించుకోవడం ప్రత్యేకంగా ముఖ్యమైన విషయం.

మతానికీ పెట్టుబడికీ వుండే అధికారయుతమైనట్టీ, ప్రభుత్వ సంబంధమైనట్టీ సంబంధం అంత ప్రత్యక్షంగా కనబడనట్టి అమెరికా సంయుక్త రాష్ట్రాలకు సంబంధించిన విషయసామగ్రి యావత్తూ అత్యంత ముఖ్యమైనది. అంతేకాకుండా అటు ''ఆధునిక ప్రజాస్వామ్య'' మని పిలువబడుతూన్నట్టిది (దేనినైతే మెన్‌షెవిక్‌లూ, సోషలిస్టు-రివల్యూషనరీలూ, పాక్షికంగా అరాజకవాదులూ కూడా, ఇంకా ఇతరులూ, అత్యంత హేతువాదరాహితంగా ఆరాధించుతారో అట్టిది), బూర్జువావర్గానికి ఏది ఉపయోగకారో అట్టిదానినే, అనగా అత్యంత అభివృద్ధి నిరోధకములైన భావాలూ, మతమూ, మతాంధకారమూ, దోపిడీదార్ల సమర్థనా, వగైరాలను బోధచేయడానికి స్వేచ్ఛ కల్పించడమే తప్పమరొకటి కాదని మనకు స్పష్టపరుస్తూంది.

సమరశీలమైన భౌతికవాద పత్రికగా వుండాలనే ఆశయంతో బయలుదేరినట్టి మాస పత్రిక నాస్తికవాద సారస్వత సమీక్షలను మన పాఠకలోకానికి అందిస్తూ, ఫలానా ఫలానా రచన ఎట్టి ప్రత్యేకమైన పాఠకుల స్థాయికి, ఏ సంబంధంలో సరిపడి వుంటుందో చూపుతూ, మన దేశంలో ఏ సారస్వతం ప్రచురించబడిందో (ఆమాత్రం ఈమాత్రం మంచి అనువాదాలే పేర్కొనబడాలి, కాగా వీటి సంఖ్య అంత అధికమైనది కాదు కూడానూ), ఇంకా ఎటువంటిది ప్రచరించాల్సివుందో పేర్కొంటూంటుందనే ఆశించుదాం.

* * *

కమ్యూనిస్టు పార్టీకి చెందని సుసంగతులైన భౌతికవాదులతో మిత్రత్వంతోపాటు, సమరశీలమైనట్టి భౌతికవాదం సాధించాల్సిన కార్యానికి అంత ముఖ్యమూ, బహుశా అంతకంటే ముఖ్యమే అయినట్టిది భౌతికవాదంవైపు మొగ్గు చూపుతూన్నట్టీ, ''విద్యావంతమైన సమాజం'' అని చెప్పబడుతూన్న సమాజంలో ప్రాబల్యం వహించుతూ, నేడు ఫాషన్‌గా ఎంచబడుతూన్న భావవాద, సంశయవాదాభిముఖ తాత్విక విహారాలకు వ్యతిరేకంగా భౌతికవాదాన్ని సమర్థించుతూ, దానిని బోధించడానికి భయపడనట్టి ఆధునిక ప్రకృతిశాస్త్ర ప్రతినిధులతో మిత్రత్వం నెరపడం.

''పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ'' 1–2 సంచికలో ప్రచురించబడినట్టి, ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతంపై ఎ. తిమిర్యాజెవ్ రాసిన వ్యాసం, ఈ రెండో మిత్రత్వాన్ని నెలకొల్పడంలో ఈ మాసపత్రిక విజయం సాధిస్తుందనే ఆశకు అవకాశమిస్తూంది. ఈ వ్యాసాన్ని అత్యంత శ్రద్ధతో పఠించడం ఎంతేనా అవసరం. ఆధునిక ప్రకృతిశాస్త్రంలో నేడు పొడచూపినట్టి హఠాత్తు విరుపే, అభివృద్ధి నిరోధకములైన తాత్విక పంథాలకు, స్వల్ప పంథాలకు, ధోరణులకు, స్వల్ప ధోరణులకు కారణభూతమవుతూంది. అందుచేత, ప్రకృతిశాస్త్రంలో సంభవించినట్టి ఇటీవలి విప్లవాన్ని లేవనెత్తిన సమస్యలను అధ్యయనం చేస్తేనే తప్ప, తాత్విక మాసపత్రిక ఒకదాని క్రియాకలాపంలో ప్రకృతిశాస్త్రజ్ఞులను భాగస్వాములుగా చేర్చుకుంటేనే తప్ప, సమరశీలమైన భౌతికవాదం సమరశీలంగానూ ఉండనేరదు, భౌతికవాదంగానూ ఉండనేరదు. తిమిర్యాజెవ్ చెప్పినదాని ప్రకారం, భౌతికవాద పునాదులపై ఏ విధంగానూ క్రియాశీలమైన దాడిని తానై సాగించనట్టి ఐన్‌స్టయిన్‌యొక్క సిద్ధాంతం, అన్ని దేశాల్లోని బూర్జువా మేధావివర్గ ప్రతినిధులందరిచే ఇప్పటికప్పుడే హస్తగతం చేసుకోబడిందని పత్రిక తొలి సంచికలోనే మన దృష్టికి తీసుకురాక తిమిర్యాజెవ్‌కి తప్పిందికాదంటే, ఇది ఒక్క ఐన్‌స్టయిన్ కేకాకుండా, పంథొమ్మిదో శతాబ్దాంతంనుండి మహామహులైన ప్రకృతిశాస్త్ర సంస్కర్తలలో అధికసంఖ్యాకవర్గానికి కాకపోయినా అధికసంఖ్యకు ప్రయుక్తమవుతూందన్న విషయం మనం గమనించాల్సి వుంటుంది.

కాగా ఈ దృగ్విషయం పట్ల మనవైఖరి చైతన్యరహితమైనది కాకుండా వుండేందుకుగాను, దృఢమైన తాత్విక ప్రాతిపదికపైనే, అది నిలబడితేనే తప్ప, ఏ ప్రకృతిశాస్త్రమైనా సరే, ఏ భౌతికవాదమైనాసరే బూర్జువా భావాల, బూర్జువా ప్రపంచ దృక్పథాల పునస్థాపన, విజృంభణలపై అవి సాగించే పోరాటంలో తమ స్థానాన్ని నిలబెట్టుకోజాలవన్న విషయాన్ని మనం గ్రహించాల్సి వుంటుంది. ఈ పోరాటంలో ప్రకృతిశాస్త్రజ్ఞుడు తన స్థానాన్ని నిలబెట్టుకుని, పోరాటాన్ని విజయవంతంగా కొనసాగించాలంటే, అతడు ఆధునిక భౌతికవాదిగానూ, మార్క్సుచే అభివర్ణించబడినట్టి భౌతికవాద అనుయాయిగానూ వుండాలి, అనగా అతడు గతి

తార్కిక భౌతికవాది అయివుండాలి. ఈ ఆశయసిద్ధికై, "పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ" వ్యాసకర్తలందరూ భౌతికవాద దృక్స్థానంనుండి హేగెలీయన్ గతితర్కాన్ని, అనగా, మార్క్స్ తన "పెట్టుబడి" గ్రంథంలోనూ, తన చారిత్రక, రాజకీయ గ్రంథాల్లోనూ ఆచరణీయంగా ప్రయుక్తం చేసినట్టి, నేడుప్రతిదినమూ ప్రాచ్యంలో (జపాన్, ఇండియా, చైనాలలో) నూతన వర్గాలు జీవితానికి మేల్కొని సాగించే పోరాటం — అనగా ప్రపంచ జనసంఖ్యలో అత్యధిక భాగంగా ఏర్పడుతూన్నట్టీ, ఎవరి చారిత్రక నిష్క్రియాత్వమూ, చారిత్రక నిద్రాణమూ ఇంత వరకూ యూరప్‌లోని అనేక పురోగామి రాజ్యాల స్తబ్దతకూ, శిథిలావస్థకూ ఉత్తరవాదియైన పరిస్థితులుగా ఏర్పడిందో అట్టి కోటానుకోట్ల జనసంఖ్య — ప్రతిదినమూ నూతన ప్రజలూ నూతన వర్గాలూ జీవితానికి మేల్కొనడమూ, మార్క్సిజాన్ని తిరిగి మరొకసారి, మరొక సారి ధ్రువపరుస్తూన్నంతటి విజయవంతంగా ప్రయుక్తం చేసినట్టి గతితర్కం వ్యవస్థాబద్ధంగా అధ్యయనం చేయబడేందుకు ఏర్పాట్లు కావించబడాలి.

ఈ హేగెలీయ గతితర్కపు పఠనమూ, ఈ భాష్యమూ, ఈ ప్రచారమూ అత్యంత కష్టభూయిష్ఠమైన కార్యం, అందులో సందేహమేమీ లేదు; కాగా ఈ దిశలో మనం చేసే మొదటి ప్రయోగాలు అనేక పొరపాట్లతో కూడుకుని వుండడం కూడా నిస్సందేహమే. కాని ఏ పనీ చేయనివాడే పొరపాట్లు చేయకుండా వుంటాడు. భౌతికవాదబద్ధంగా ఊహించబడినట్టి హేగెలీయ గతితర్కాన్ని ప్రయుక్తం చేయడంలో మార్క్స్ అనుసరించిన విధానాన్ని మన ప్రాతి పదికగా తీసుకున్న పక్షంలో ఈ గతితర్కాన్ని మనం అన్ని వైపులనుండీ విపులీకరించగల్గుతాం, విపులీకరించి తీరాలి కూడానూ, హేగెల్ ప్రధాన గ్రంథాలనుండి ఖండికలను మాసపత్రికలో ప్రచురిస్తూండాలి, భౌతికవాద దృక్స్థానంనుండి వీటికి భాష్యం చెప్పాలి, మార్క్స్ ఏ విధంగా గతితర్కాన్ని ప్రయుక్తం చేశాడో ఆ ఉదాహరణల సహాయంతోనూ, అధునాతన చరిత్ర, అందు లోనూ ప్రత్యేకంగా ఆధునిక సామ్రాజ్యవాద యుద్ధమూ, విప్లవమూ అసాధారణమైన యథే ష్టతతో ఆర్థిక, రాజకీయ సంబంధాల రంగాలలో సమకూర్చుతూన్నట్టి ఉదాహరణలతో సహా వాటిని వ్యాఖ్యానించాలి నా అభిప్రాయంలో, "పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ" మాస పత్రిక సంపాదకుల, పత్రికా వ్యాసరచయితల దళమూ, ఒక రకమైన "హేగెలీయ గతితార్కిక భౌతికవాద మిత్రమండలి"గా ఏర్పడాలి. ఆధునిక ప్రకృతిశాస్త్రజ్ఞులకు (ఏ విధంగా అన్వే షించాలో వారికి తెలిసివుండిన పక్షంలోనూ, వారికి మనం సహాయం చేసిన పక్షంలోనూ), ప్రకృతిశాస్త్రంలో విప్లవం లేవదీస్తున్నట్టీ, బూర్జువా ఫాషను చూచి అచ్చెరువందే మేధా వుల అభివృద్ధి నిరోధకంలోకి "కాలు జారేటట్టు" చేస్తూన్నట్టీ తాత్త్వికసమస్యలకు భౌతిక వాదబద్ధంగా భాష్యం చెప్పబడినట్టి హేగెలీయ గతితర్కంలో సమాధాన పరంపర దొరుకు తుంది.

ఇటువంటి కర్తవ్యాన్ని తనపై వేసుకుని, దానిని వ్యవస్థాబద్ధంగా నెరవేర్చుతేనే తప్ప, భౌతికవాదం సమరశీలమైన భౌతికవాదం కానేరదు. శ్చేద్రిన్ మాటల్లో చెప్పాలంటే, తాను కత్తిదూయడంపోయి, తనమీదే అందరూ కత్తిదూస్తారు. ఇది లేనిదే ప్రసిద్ధికెక్కిన ప్రకృతిశాస్త్రవేత్తలు తాత్విక అనుమితులనూ, సూత్రీకరణలనూ చేయడంలో వెనకటిలాగే తరుచుగా ఇకముందు కూడా నిస్సహాయులవుతారు. ఎందుచేతంటే, ప్రకృతిశాస్త్రం ఎంత త్వరిత గతిని పురోగమించుతూందంటే, అన్ని రంగాలలోనూ ఎంతటి ప్రగాఢమైన విప్లవాత్మక విరుపును అది అనుభవించుతూందంటే, తాత్విక అనుమితులు లేనిదే అది ఎంత మాత్రమూ బయటపడలేదు.

ఇక ముగించే ముందు ఒక ఉదాహరణను, తత్వశాస్త్ర రంగానికి సంబంధించనప్పటికీ, ''పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ'' కూడా శ్రద్ధవహించదల్చుకున్న సామాజిక సమస్యల రంగానికి నిస్సందేహంగా సంబంధించినట్టి ఉదాహరణను పేర్కొంటాను.

మిక్కిలి మొరకైనట్టీ సిగ్గుచేటైనట్టీ అభివృద్ధినిరోధక భావాలకు ఆధునిక కుహనా విజ్ఞానశాస్త్రం ఏ విధంగానైతే కార్యాచరణలో వాహకంగా ఊడిగం చేస్తూందో అందుకిదొక ఉదాహరణ.

''రష్యన్ టెక్నికల్ సమాజం''యొక్క పదకొండవ విభాగం ప్రచురించుతూన్న ''ఎకనమీస్ట్''[166] మాసపత్రిక మొదటి సంచిక (1922) ఇటీవల నాకందింది. ఈ మాస పత్రికను నాకు పంపిన యువ కమ్యూనిస్టు (దానిలోని విషయాలను గురించి పరిచయం చేసుకోడానికి అతనికి వేళలేకపోయుంటుంది బహుశ) తొందరపాటుతో దానిమీద అమిత సానుభూతిని ప్రకటించుతూన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. వాస్తవానికి ఈ మాసపత్రిక — ఎంత బుద్ధిపూర్వకంగానో నేను చెప్పలేను గాని — విజ్ఞానశాస్త్రం, ప్రజాస్వామ్యం, వగైరాల బురఖా తగిలించుకున్న ఆధునిక ఫ్యూడలిస్టుల పత్రిక తప్ప మరొకటికాదు.

ఈ మాసపత్రికలో పి.ఏ. సొరోకిన్ అనే పేరుగల ఒక పెద్దమనిషి ''యుద్ధం ప్రభావం'' పై ''సాంఘికశాస్త్రపు'' గవేషణ అనే పేరుతో ఒక సుదీర్ఘమైన వ్యాసం ప్రచురించాడు. పాండిత్యాన్ని ప్రదర్శించుతూన్న ఈ వ్యాసం, రచయితయొక్క ఇతర ''సాంఘికశాస్త్ర'' గ్రంథాలకూ, బహుళసంఖ్యవిదేశాల్లో వున్న అతని బహుళసంఖ్య గురువర్యుల సహకారుల పాండిత్యపూరిత రచనా వివరణలతో నిండివుంది. అతని పాండిత్యానికి ఇదిగో ఇదొక ఉదాహరణ.

పుట 83 లో ఈ విధంగా వుంది:

''పెట్రోగ్రాడ్‌లో జరిగిన ప్రతి 10,000 వివాహాలలోనూ ఈనాడు 92.2 వివాహాల్లో — ఆత్యాశ్చరకరమైన సంఖ్యే — విడాకులివ్వడం జరిగింది. రద్దు కాబడిన ప్రతి 100

వివాహాల్లోనూ 51.1 ఒక సంవత్సరం కంటె హెచ్చుకాలం సాగలేదు, 11 శాతం నెలరోజుల కంటె తక్కువ కాలం, 22 శాతం రెండు నెలలకంటె తక్కువ కాలం, 41 శాతం మూడు నెలలనుండి ఆరు నెలల వరకూ, కేవలం 26 శాతం మాత్రమే ఆరు నెలలకు మించి సాగాయి. ఆధునిక చట్టసమ్మతమైన వివాహం, ఆచరణలో "స్ట్రాబెర్రీ పండ్ల"పై ప్రేమవున్న వారు తమ వాంఛలను "చట్టసమ్మతంగా" తీర్చుకుందుకు వీలు కలుగజేసేటట్టి, వైవాహి కాంతర లైంగిక సంపర్కాన్ని కప్పిపుచ్చేటట్టి ఒక లాంఛనమే అని ఈ లెక్కలు చూపుతున్నాయి" ("ఎకనమిస్ట్," నెం. 1 పుట 93.)

ఈ పెద్దమనిషీ, ఈ మాసపత్రికను ప్రచురించి ఇటువంటి రాతలకు స్థలం ఇచ్చే టట్టి రష్యన్ టెక్నికల్ సమాజమూ, తాము ప్రజాస్వామ్యం అనుచరులమని సహజంగా భావించు తూనే, వాస్తవానికి తాము ఫ్యూడలిస్టులూ, అభివృద్ధి నిరోధకులూ, "మతగురుతత్వంయొక్క పట్టభద్రులైన గులాములే" అయినప్పటికీ, ఆ పేరు పెట్టి పిలుస్తే తమను పరాభవం చేయ డమే అని భావిస్తారు.

వివాహం, విడాకులు, ఔరసులుకాని బిడ్డల విషయాలపై బూర్జువావర్గ దేశాలలోని శాసనాలతోనూ, ఈ విషయంలో కార్యకలాపలాల అసలు పరిస్థితితోనూ వున్న ఏ మాత్రపు పరిచయమూ, అత్యంత ప్రజాస్వామిక బూర్జువా రిపబ్లిక్కులన్నిటిలోని ఆధునిక బూర్జువా ప్రజాస్వామ్యం సహితమూ ఈ విషయమందు స్త్రీలయెడలా, ఔరసులుకాని బిడ్డలయెడలా అచ్చమైన ఫ్యూడల్ వైఖరినే ప్రదర్శిస్తున్నాయని ఈ విషయంపై ఏమాత్రం ఆసక్తి వున్న వారికైనా తెలియజేయడానికి చాలుతుంది.

మెన్షెవిక్‌లనూ, సోషల్-రివల్యూషనరీలనూ, అరాజకవాదులలో ఒక భాగాన్నీ, పాశ్చా త్యంలో వీరికి అనురూపమైన అన్ని పార్టీలనూ ప్రజాస్వామ్యం గురించీ, బోల్షెవిక్‌లచే ఇది భ్రష్టుచేయబడుతూన్న విధాన్ని గురించీ కాకిగోల చేయకుండా ఇది సహజంగానే నివారించజా లదు. కాని వాస్తవానికి, వివాహము, విడాకులు, ఔరసులుకాని బిడ్డలస్థితి, ఈ ప్రశ్నల విష యంలో కేవలం బోల్షెవిక్ విప్లవం ఒక్కటే సుసంగతమైన ప్రజాస్వామిక విప్లవం. కాగా ఈ ప్రశ్న ఏ దేశంలోనైనా సరే జనసంఖ్యలో సగం భాగం ప్రయోజనాలపై సూటిగా ప్రభావం కలిగినట్టిది. బోల్షెవిక్ విప్లవానికి పూర్వం జరిగినట్టీ, తాము ప్రజాస్వామికమని పేరు పెట్టుకున్నట్టీ విప్లవాలు అత్యధికసంఖ్యలో జరిగినప్పటికీ, ఈ సందర్భంలో అభివృద్ధి నిరోధ కమూ, ఫ్యూడలిజమూ, రెండింటికీ వ్యతిరేకంగానూ, పాలకులైనట్టీ ఆస్తిపరులైనట్టీ వర్గాల మామూలు కపటానికి వ్యతిరేకంగానూ దృఢసంకల్పంతో పోరాటం సాగించిన ఏకైక విప్లవం బోల్షెవిక్ విప్లవమే.

ప్రతి 10,000 వివాహాల్లోనూ 92 విడాకుల సంఖ్య ఆశ్చర్యకరమైన సంఖ్యగా మిస్టర్ సారోకిన్‌కి కనబడిందంటే, జీవితంతో ఏ మాత్రమూ సంబంధంలేని ఇటువంటి సన్యాసుల మఠం అంటూ వుంటుందా అని నమ్మడానికే వీల్లేనంతగా వేరుపడిపోయినట్టి ఏ సన్యాసుల మఠంలోనో అతడు పెరిగైనా వుండాలి, లేదా అభివృద్ధి నిరోధకమూ, బూర్జువా వర్గాల ప్రయోజనాలకై రచయిత సత్యాన్ని వికృతపరిచైనా వుండాలి. వాస్తవమైన విడాకుల వాస్తవసంఖ్య (చర్చి, లేదా చట్టము అంగీకరించనట్టివే సహజంగా) సర్వేసర్వత్రా ఇంతకు అపరిమితంగా అధికంగానే వుంటుందని బూర్జువా దేశాల సామాజిక పరిస్థితులతో ఏ మాత్రం పరిచయం వున్నవారికైనా విదితమే. రష్యాకీ, ఇతర దేశాలకీ ఈ సంబంధంలో వున్న తేడా అంతా ఎక్కడుందంటే, కపట ప్రవర్తననూ, స్త్రీనీ, ఆమె బిడ్డనూ అధోగతి పాల్జేయడమునూ మన శాసనాలు పవిత్రం చేయకుండా, అందుకు బదులు అవి రాజ్యాంగయంత్ర శక్తి పేరిట కపటప్రవర్తన అంతటిపైనా, అధోగతి అంతటిపైనా వ్యవస్థాబద్ధమైన యుద్ధాన్ని ప్రకటించడంలోనే వుంది.

''విద్యావంతులైన'' ఈ ఆధునిక ఫ్యూడలిస్టులపై కూడా ఈ మార్క్సిస్టు మాస పత్రిక యుద్ధం సాగించాల్సి వుంటుంది. బహుశా వీరిలో చాలా మందికి ప్రభుత్వపు డబ్బు ముడుతూండొచ్చు, యువకులు చదువుకునే విద్యాసంస్థలలో ప్రభుత్వాధికార్లుగా ఉద్యోగం చేసేందుకు పేరుమోసిన దుష్టబుద్ధులు ఏ విధంగా తగనివారో, ఆ విధంగానే వీరిలో చాలా మంది మన యువకులకు విద్య బోధించడానికి తగనివారే అయినప్పటికీ, అందుకు వీరిని మన ప్రభుత్వమే బహుశా నియమించి వుండవచ్చు కూడా.

రష్యాలోని కార్మికవర్గం రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడంలో విజయం సాధించింది; కాని దానిని వినియోగించడమెలాగో అదింకా నేర్చుకోలేదు, ఎందుచేతంటే, దీనిని నేర్చుకుని వుండిన పక్షంలో ఇట్టి ఉపాధ్యాయులనూ, ఇట్టి విద్వత్ సమాజాల సభ్యులనూ బూర్జువా ''ప్రజాస్వామిక'' దేశాలకు అతి మర్యాదాగానే ఏనాడో రవానాచేసి వుండేది. ఇటువంటి ఫ్యూడలిస్టులకు అవే తగిన నివాసస్థలాలు.

అయితేనేమి, నేర్చుకోడానికి దానికి మనసంటూ వుంటే మాత్రం, అది తప్పకుండా నేర్చుకుంటుంది.

మార్చి 12, 1922.

# సవ్యాఖ్యాన వివరణలు

[1] ''గ్రనాత్'' విజ్ఞానసర్వస్వ నిఘంటువు కోసమని 1914 లో లెనిన్ రాసిన వ్యాసానికి చివరను మార్క్సిస్టు రచనలూ మార్క్సిజమ్ గురించిన గ్రంథాలపై సమీక్షను లెనిన్ అనుబంధంగా చేర్చాడు. ప్రస్తుతపు కూర్పులో ఈ సమీక్ష వదలివేయబడింది. పుట 8.

[2] కె. మార్క్స్ రచించిన "Rechtfertigung des Korrespondenten von der Mosel" [''మొసెల్ విలేకరి సమాధానం''] అనే వ్యాసానికి వర్తించుతుంది. పుట 8.

[3] కె. మార్క్స్, "Zur Kritik der Hegelschen Rechtsphilosophie. Einleitung." [''హెగెలీయ న్యాయశాస్త్రంపై విమర్శనావ్యాసం. ఉపోద్ఘాతం.''] పుట 9.

[4] ''కమ్యూనిస్టు లీగ్'' — విప్లవాత్మక కార్మికవర్గంయొక్క మొదటి అంతర్జాతీయ ఆర్గనైజేషను. ఇది 1847 వేసవిలో లండన్‌లో ఏర్పాటుచేయబడింది. కె. మార్క్స్, ఎఫ్. ఎంగెల్స్‌లు దాని ఆర్గనైజర్లూ, నాయకులూనూ. లీగ్ ఆదేశానుసారం మార్క్స్, ఎంగెల్స్‌లు ''కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక''ను రచించారు. బూర్జువావర్గాన్ని కూలదోయడమూ, వర్గ వైషమ్యంపై ఆధారపడిన పాత బూర్జువా సమాజాన్ని నాశనంచేయడమూ, వర్గాలూ ప్రైవేటు ఆస్తీ లేనట్టి నూతన సమాజాన్ని స్థాపించడమూ లక్ష్యాన్ని లీగ్ అనుసరించింది. శ్రామికవర్గ విప్లవకారులకు పాఠశాలగానూ, శ్రామికవర్గ పార్టీ బీజాంకురంగానూ, ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్ (మొదటి ఇంటర్నేషనల్) పూర్వవర్తిగానూ ముఖ్యమైన చారిత్రాత్మక పాత్రను నిర్వర్తించింది. 1852 నవంబరు వరకూ కమ్యూనిస్టు లీగ్ తన మనుగడ సాగించింది. ఎఫ్. ఎంగెల్స్ రచించిన "Zur Geschichte des Bundes der Kommunisten" [''కమ్యూనిస్టు లీగ్ చరిత్ర గురించి''] అనే వ్యాసంలో లీగ్ చరిత్ర వివరించబడింది. పుట 9.

[5] 1848 ఫిబ్రవరి ఫ్రెంచి విప్లవానికి ఇది వర్తించుతూంది. పుట 10.

6 జర్మనీ ఆస్ట్రియాలలో 1848 మార్చిలో ఆరంభించినట్టి బూర్జువా విప్లవానికి ఇది వర్తించుతూంది. పుట 10.

7 1848 విప్లవం స్థాపించిన రాజ్యాంగ వ్యవస్థను శాసననిర్మాణ సభ అధ్యక్షుడూ, అధి కసంఖ్యాకవర్గమూ ఉల్లంఘించడంవలన, ఈ ఉల్లంఘనకు నిరసనగా పెట్టీబూర్జువా వర్గపు పార్టీ ("పర్వతం") పారిస్‌లో అర్గనైజుచేసిన ప్రజారాశి ప్రదర్శనకు ఇది వర్తించుతూంది. ప్రదర్శన ప్రభుత్వంచే చెదరగొట్టివేయబడింది. పుట 10.

8 "Mein Prozes sgegen die 'Allgemeine Zeitung'" ["'అల్గెమైనె సైటుంగ్' పై నేను తెచ్చిన అభియోగం"] అనే శీర్షికతో కె. ఫోగ్ట్ రాసినట్టి దూషణపూరితమైన పాంఫ్లెట్‌కు ప్రత్యుత్తరంగా మార్క్స్ రాసిన "Herr Vogt" ["శ్రీ ఫోగ్ట్"] అనే శీర్షికనుగల పాంఫ్లెట్‌ను గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు. పుట 10.

9 ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్ ప్రారంభ "విజ్ఞప్తి"కి ఇది వర్తించుతూంది. పుట 11.

10 ఎఫ్. ఎంగెల్స్ "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" గ్రంథంనుండి ఈ ఉల్లేఖన. (XI వ ప్రకరణం. మూడు కూర్పులకు ఉపోద్ఘాతం; I సాధారణ వివరణలు.) పుట 16.

11 ఎఫ్. ఎంగెల్స్, "Ludwig Feuerbach und der Ausgang der klassischen deutschen Philosophie"["లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్, మరియు సాంప్రదాయక జర్మన్ తత్వ శాస్త్రపు అంతము"]. పుట 16.

12 ఎఫ్. ఎంగెల్స్, "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" (I. సాధారణ వివరణలు). పుట 17.

13 ఎఫ్. ఎంగెల్స్, "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్, మరియు సాంప్రదాయక జర్మన్ తత్వశాస్త్రపు అంతము." పుట 18.

14 <u>రాజత్వపునరుద్ధరణ కాలం</u> — ఫ్రాన్సు దేశపు చరిత్రలో ఫ్రెంచి బూర్జువా విప్లవంచే 1792 లో కూలదోయబడిన బోర్బన్ వంశంచే తిరిగి అధికారం చలాయించబడినట్టి 1814 – 1830 సంవత్సరాల కాలం. పుట 22.

15 ఈ ఉల్లేఖన కె. మార్క్స్, "పెట్టుబడి," గ్రంథం, 1 వ సంపుటి (I వ ప్రకరణం, "సరుకులు") నుండి. పుట 24.

16 ఈ ఉల్లేఖన కె. మార్క్స్, "Zur Kritik der politischen Ökonomie" ["అర్థశాస్త్ర విమర్శనా వ్యాసాలు"] అనే రచననుండి. పుట 25.

17 ఈ ఉల్లేఖన కె. మార్క్స్, ''పెట్టుబడి,'' 1 వ సంపుటి (IV వ ప్రకరణం. ''డబ్బు పెట్టుబడికింద పరివర్తన'') నుండి. పుట 26.

18 ''సీమాంత ఉపయోగపు విలువ'' అనే సిద్ధాంతం గత శతాబ్ది అంత్యమందు ఆస్ట్రియన్ పంథా అని పిలువబడుతూన్న అర్థశాస్త్రజ్ఞులచే, మార్క్సిస్టు శ్రమ విలువ సిద్ధాంతానికి ప్రతిగా వివరించబడింది. అపభ్రంశపు అర్థశాస్త్రంయొక్క రకాలలో ఇదొకటి, కాని అపభ్రంశపు అర్థశాస్త్రంయొక్క ఇతర రకాలవలె సరుకుయొక్క విలువను కేవలమూ దాని ఉపయోగాన్నిబట్టే నిర్ధరించకుండా, మానవుని కనీస ముఖ్యావసరాన్ని తృప్తిపరచే సరుకుల నిధియొక్క ఏకాంకానికి వున్న అంతిమ (సీమాంత) ఉపయోగాన్ని బట్టే ఇది విలువను నిర్ధరించుతుంది. ఆస్ట్రియన్ పంథాయొక్క అన్ని ఇతర ఆర్థిక, తాత్విక వాదాల ముఖ్యలక్షణంలాగానే, సీమాంత ఉపయోగ సిద్ధాంతంయొక్క ముఖ్యలక్షణం కూడా పెట్టుబడిదారీ విధానం కింద వున్న దోపిడీయొక్క స్వభావాన్ని కప్పిపుచ్చేందుకు యత్నంలోనే వుంది. పుట 31.

19 ఎఫ్. ఎంగెల్స్, "Die Bauernfrage in Frankreich und Deutschland" [''ఫ్రాన్సు జర్మనీలలో రైతు సమస్య'']. పుట. 41.

20 "Die Neue Zeit" [''నూతన కాలం''] — జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీ సిద్ధాంత వారపత్రిక, 1883 నుండి 1923 వరకూ స్టుట్‌గార్ట్‌నుండి వెలువడింది. అక్టోబరు 1917 వరకూ కౌట్‌స్కీ, అతని తరువాత హెచ్. క్యూనోవ్ పత్రికకు సంపాదకులుగా వున్నారు. మార్క్స్, ఎంగెల్స్‌ల రచనలలో కొన్ని ఈ పత్రికలో తొలిసారిగా ప్రచురితమయాయి. పత్రికా సంపాదకులకు ఎంగెల్స్ సలహా ఇచ్చి సహాయపడడమే కాకుండా, మార్క్సిజంనుండి వారు పెడతోవలను అనుసరించినందుకుగాను వారిని అతడు తరుచుగా విమర్శించుతూండేవాడు కూడా. ఎంగెల్స్ మరణానంతరం, 1890 దశాబ్ది ఉత్తరార్ధంలో పత్రిక రివిజనిస్టుల వ్యాసాలను వ్యవస్థాబద్ధంగా ప్రచురించనారంభించింది. ఈ వ్యాసాలలో, ''సోషలిజం సమస్యలు'' అనే శీర్షికతో ఇ. బెర్న్‌స్టయిన్ రచించిన వ్యాసపరంపర కూడా వుంది. ఈ వ్యాసపరంపర మార్క్సిజానికి వ్యతిరేకంగా క్రూసేడ్‌ను ప్రారంభించింది. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో పత్రిక మధ్యస్థ స్థానం తీసుకుని, సోషల్-జాతియ దురహంకారులనే వాస్తవంగా బలపరచింది. పుట 41.

21 1815 నుండి ఆస్ట్రియా, ప్రష్యా, రష్యాల ఉమ్మడి కంట్రోలు కింద వుండిన క్రాకొవ్ రిపబ్లిక్‌లోని జాతీయ విముక్తి ఉపప్లవానికి ఇది వర్తించుతూంది. తిరుగుబాటు

దార్లు జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించారు. ఫ్యూడల్ సేవలను రద్దుచేస్తూ, పరిహారపు చెల్లింపు లేకుండానే రైతులకు భూమిని బదిలీ చేయడమును వాగ్దానంచేస్తూ జాతీయ ప్రభుత్వం ప్రణాళికను ప్రకటించింది. ప్రభుత్వం జారీచేసిన ఇతర ప్రణాళికలు జాతీయ కర్మాగారాల స్థాపననూ వాటిలో పనిచేసే కార్మికులకు వేతనాల హెచ్చింపునూ, సమాన పౌరహక్కులు ప్రవేశపెట్టడమునూ కూడా ప్రకటించాయి. అయినప్పటికీ ఉపప్లవం శీఘ్రంగానే అణచివేయబడింది. పుట 44.

22 ఈ ఉల్లేఖన కె. మార్క్స్, "Die Bourgeoisie und die Konterrevolution" [''బూర్జువావర్గమూ, విప్లవప్రతీఘాతమూ''] నుండి. పుట 45.

23 యుంకర్ — ప్రష్యన్ భూస్వామ్య కులీనవర్గ సభ్యుడు. పుట 45.

24 చూ. ఎల్. కూగెల్‌మన్ పేర కె. మార్క్స్ రాసిన 1871, ఏప్రిల్ 12 తేదీ ఉత్తరం. పుట 46.

25 సోషలిస్టు వ్యతిరేక చట్టం — కార్మికవర్గాన్నీ సోషలిస్టు ఉద్యమాన్నీ అణచివేసే ఉద్దేశ్యంతో 1878 లో బిస్మార్క్ ప్రభుత్వంచే ప్రవేశపెట్టబడింది. సోషల్-డెమోక్రాటిక్ పార్టీయొక్క అన్ని ఆర్గనైజేషన్లనూ, కార్మికుల రాశి ఆర్గనైజేషన్లనూ, కార్మికవర్గ పత్రికలనూ ఇది నిషేధించింది; సోషలిస్టు సారస్వతం జప్తుచేయబడింది; సోషల్-డెమోక్రాట్లు హింసించబడి దేశంనుండి వెళ్లగొట్టబడ్డారు. దినదిన ప్రవర్ధమానమవుతూన్న కార్మికవర్గ ఉద్యమపు ధాక కింద 1890 లో ఈ చట్టం రద్దుచేయబడింది. పుట 46.

26 ''ఫ్రెడరిక్ ఎంగెల్స్'' వ్యాసానికి మకుటంగా వున్న గీతిక రష్యన్ కవి నెక్రాసొవ్ రచించిన ''దొబ్రొల్యూబొవ్ స్మృతి'' అనే పద్యంనుండి ఉల్లేఖించబడింది. పుట 48.

27 ఈ ఉల్లేఖన ఎఫ్. ఎంగెల్స్, "Der deutche Bauernkrieg, Vorbemerkung" [''జర్మనీలో రైతు సంగ్రామం,'' ఉపోద్ఘాత వివరణ] నుండి. పుట 51.

28 ఎఫ్. ఎంగెల్స్ రచించిన "Umrisse zu einer Kritik der Nationalökonomie" [''జాతీయ ఆర్థికవ్యవస్థ విమర్శనకు రేఖాచిత్రం''] అనే గ్రంథానికి ఇది వర్తించుతూంది. పుట 53.

29 ఎఫ్. ఎంగెల్స్ రచించిన "Anti-Dühring. Herr Eugen Dührings Umwälzung der Wissenschaft" [''డ్యూరింగ్ సిద్ధాంత ఖండన. శ్రీ ఒయ్‌గెన్ డ్యూరింగ్ గారి విజ్ఞానశాస్త్ర విప్లవం''] అనే గ్రంథానికి ఇది వర్తించుతూంది. పుట 55.

30 ఎఫ్. ఎంగెల్స్, "Anti-Dühring" గ్రంథంలోని మూడు ప్రకరణాలను ప్రాతిపదికగాకల్గినట్టి ఎఫ్. ఎంగెల్స్ విరచితమైన "Die Entwieklung des Sozialismus von der Utopie zur Wissenschaft" [''ఊహాజగత్తునుండి విజ్ఞానశాస్త్రంగా సోషలిజం అభివృద్ధి''] అనే పుస్తకంయొక్క 1892 రష్యన్ కూర్పుకు ఈ శీర్షిక ఇవ్వబడింది. పుట 55.

31 ఎఫ్. ఎంగెల్స్ రచించిన "Ludwig Feuerbach und der Ausgang der klassischen deutschen Philosophie" గ్రంథానికి వర్తించుతూంది. [''లుడ్విగ్ ఫొయెర్‌బాఖ్, మరియు సాంప్రదాయక జర్మన్ తత్వశాస్త్రపు అంతము.''] పుట 55.

32 ''సొత్సియాల్-డెమోక్రాట్'' మొదటి రెండు సంపుటాల్లోనూ ప్రచురితమైనట్టి "Die auswärtige Politik des russischen Zarenthums" [''రష్యన్ జారిస్టు వ్యవస్థయొక్క వైదేశిక విధానం''] అనే ఎంగెల్స్ విరచితమైన వ్యాసం గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు.

''సొత్సియాల్-డెమోక్రాట్'' — విదేశాలలో వున్న ''శ్రమ విమోచన'' గ్రూపుచే 1890–1892 లో ప్రచురించబడిన (లండన్–జినీవా) సారస్వత, రాజకీయ సమీక్షా పత్రిక. రష్యాలో మార్క్సిజాన్ని వ్యాప్తిచెందించడంలో ఈ పత్రిక ముఖ్యమైన పాత్రను నిర్వర్తించింది; నాల్గు సంచికలు వెలువడ్డాయి. ''సొత్సియాల్-డెమోక్రాట్'' ప్రధానవ్యాస రచయితలలో ముఖ్యులు ప్లెహానొవ్, అక్సెల్‌రోడ్, జసూలిచ్. పుట 56.

33 "Zur Wohnungsfrage" [''గృహవసతి సమస్య''] అనే ఉమ్మడి శీర్షికతో ఎఫ్. ఎంగెల్స్ రాసిన వ్యాసాలను గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు. పుట 56.

34 "Soziales aus Russland" [''రష్యాలో సామాజిక సంబంధాలు''], 1894 లో జినీవాలో ప్రచురితమైన ''రష్యాను గూర్చి ఫ్రెడరిక్ ఎంగెల్స్'' అనే సంకలనంలో పొందుపరచబడిన వ్యాసాలకు మలిపలుకుకూ ఇది వర్తించుతూంది. పుట 56.

35 ''పెట్టుబడి'', నాల్గవ సంపుటం అని లెనిన్ అనడంలో, 1862–1863 లో మార్క్స్ రచించిన "Theorien über den Mehrwert" [''అదనపు విలువ సిద్ధాంతాలు'']

అనే గ్రంథమని, ఆయన ఉద్దేశం. ఈ ఉద్దేశం ఎంగెల్స్ ఆశయానికి అనుగుణ్యం గానే వుంది. ''పెట్టుబడి,'' రెండవ సంపుటానికి తాను రాసిన పీఠికలో ఎంగెల్స్ ఇలా రాశాడు: II వ, III వ గ్రంథాలలో ప్రస్తావించబడిన అనేక ఖండాలను విడిచి పెట్టేసి, ఈ లిఖితప్రతి (''అదనపు విలువ సిద్ధాంతాలు'' – సం.) లోని విమర్శనా భాగాన్ని ''పెట్టుబడి, IV వ గ్రంథంగా ప్రచురించడం నా ఉద్దేశం''(K. Marx, *Capital*, Vol. II, Moscow, 1957 p. 2.). కాని ఈ గ్రంథాన్ని అచ్చుకు సిద్ధంచేసేలోపలనే ఎంగెల్స్ మరణించాడు. ''అదనపు విలువ సిద్ధాంతాలు'' తొలిసారిగా కౌట్స్కిచే జర్మన్ భాషలో 1905, 1910 సంవత్సరాలలో ప్రచురించబడింది. శాస్త్రీయ దృక్పథంయొక్క మౌలికావసరాలను కౌట్స్కి ఉల్లంఘించి, మార్క్స్ ప్రమేయాలు చాలావాటిని అతడు వక్రీకరించాడు.

1862–1863 లిఖితప్రతిని అనుసరించి, ''అదనపు విలువ సిద్ధాంతాలు'' (''పెట్టుబడి,'' IV వ సంపుటం) కొత్త కూర్పును మూడు భాగాలుగా సి.పి. ఎస్.యు సెంట్రల్ కమిటీకింద వున్న మార్క్సిజం-లెనినిజం ఇన్స్టిట్యూట్ వెలువరించింది. పుట 56.

36 జె. పిహెచ్. బెకెర్ పేర 1884 అక్టోబరు 15 న ఎఫ్. ఎంగెల్స్ రాసిన లేఖకు ఇది వర్తించుతూంది. పుట 56.

37 చూ. కె. మార్క్స్, "Allgemeine Statuten der Internationalen Arbeiterassoziation"["ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్ సాధారణ నిబంధనలు''];"కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక'' 1890 జర్మన్ కూర్పుకు ఎఫ్. ఎంగెల్స్ రాసిన పీఠిక. పుట 58.

38 సోషలిస్టు-రివల్యూషనరీలు – నరోద్నికుల వివిధ గ్రూపులూ సర్కిల్సూ సమ్మిళితమవడం ఫలితంగా 1901 అంత్యమందూ 1902 ఆరంభంలోనూ రష్యాలో రూపొందిన పెట్టీబూర్జువా పార్టీ. సోషలిస్టు-రివల్యూషనరీల అభిప్రాయాలు నరోద్నికు, రివిజనిస్టు అభిప్రాయాల వరణతత్వపు కలగాపులగం తప్ప మరేమీ కాదు. లెనిన్ రాసినట్టుగా, '''నరోద్నికు భావాలలోని చినుగులకు' మార్క్సిజానికి వ్యతిరేకంగా చలామణీ అవుతూన్న ఫాషనబుల్ అవకాశవాద 'విమర్శనలతో' మాసికలు వేద్దామని'' వారు ప్రయత్నించారు. (V. I. Lenin, *Collected Works*, Vol. 9, p. 310.) సోషలిస్టు-రివల్యూషనరీలు రైతాంగానికీ శ్రామికవర్గానికీ మధ్య వున్న వర్గ విభేదాలను ఉపేక్షించారు, రైతులలో వున్న వర్గ విభేదీకరణాన్నీ వైరుధ్యాలనూ దాట

వేశారు, విప్లవంలో శ్రామికవర్గంయొక్క అగ్రగామి పాత్రను కాదన్నారు. నిరంకుశత్వానికి వ్యతిరేక పోరాటంయొక్క ప్రధాన సాధనంగా సోషలిస్టు-రివల్యూషనరీలు సమర్థించిన టెరరిస్టు కార్యాల ఎత్తుగడలు విప్లవోద్యమానికి గొప్ప హాని కల్గించాయి.

సోషలిస్టు-రివల్యూషనరీల వ్యవసాయక కార్యక్రమంలో భూమిపై ప్రైవేటు స్వామ్యము రద్దుపరచడమూ, సరిసమానసిద్ధాంత భూమి అనుభవ ప్రాతిపదికపై భూమిని రైతులకు బదిలీ చేయడమూ, నానారకాల సహకారాన్నీ స్థాపించడమూ పొందుపరచబడ్డాయి. సోషల్-రివల్యూషనరీలచే "భూమి సామాజికీకరణం" అని నామకరణం చేయబడిన ఈ కార్యక్రమంలో ఆవగింజంతైనా సోషలిజం లేదు, కారణమేమంటే, లెనిన్ చూపెట్టినట్లుగా, భూమిపై ప్రైవేటు యాజమాన్యం రద్దు అయినంత మాత్రాన, అది ఒక్కటే తనకుతానై పెట్టుబడిదారీ విధానాన్నీ ప్రజారాసుల పేదరికాన్నీ అంతంచేయజాలదు. బూర్జువా-ప్రజాస్వామిక విప్లవ కాలంలో, బాహ్యగతాత్మకంగా చూచినట్లయితే, రైతుల ప్రయోజనాలకూ వారి యత్నాలకూ వ్యక్తీకరణ అయినట్టి భూస్వామ్యపు రద్దుకై పోరాటం ఒక్కటే సోషలిస్టు-రివల్యూషనరీల కార్యక్రమంలో అభ్యుదయ కరమైన విషయం. సోషలిస్టులుగా చలామణీ అయేందుకు సోషలిస్టు-రివల్యూషనరీలు చేసిన యత్నాలను బోల్షెవిక్ పార్టీ బట్టబయలుచేసి, రైతులపై పలుకుబడికోసం వారితో పోరాడి, వారి టెరరిస్టు కార్యాల ఎత్తుగడలు కల్గించుతూన్న హానిని బయటపెట్టింది. అదే సమయంలో, జారిస్టు వ్యవస్థపై పోరాటంలో సోషలిస్టు-రివల్యూషనరీలతో బోల్షెవిక్‌లు కొన్ని షరతులతో తాత్కాలికపు ఒప్పందాలను కుదుర్చుకున్నారు.

మొదటి రష్యన్ విప్లవంలో సోషలిస్టు-రివల్యూషనరీ పార్టీ కుడి పక్షం చీలిపోయి, కాడెట్ పార్టీ అభిప్రాయాలతో సన్నిహితంగా వున్న చట్టబద్ధ "శ్రమజీవుల పాప్యులర్-సోషలిస్టు పార్టీ"గా ఏర్పడింది; కాగా పార్టీలోని వామ పక్షం "మాక్సిమలిస్టులు" ["గరిష్ఠవాదులు"] అనే అర్ధ-అరాజకవాదుల సమితిగా ఏర్పడింది. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో (1914–1918) సోషలిస్టు-రివల్యూషనరీలలో చాలామంది సోషల్-జాతీయ దురహంకార స్థానాలు తీసుకున్నారు.

1917 ఫిబ్రవరి బూర్జువా-ప్రజాస్వామిక విప్లవం తరువాత, మెన్‌షెవిక్‌లూ కాడెట్లతోపాటు సోషల్-రివల్యూషనరీలు విప్లవప్రతీఘాత తాత్కాలిక ప్రభుత్వానికి ప్రధాన అధారంగా తయారయారు; వీరి నాయకులు (కేరెన్‌స్కి, అవ్‌క్సేన్‌త్యెవ్, చెర్నోవ్) ఈ బూర్జువావర్గపు భూస్వాముల ప్రభుత్వంలో సభ్యులయారు. రైతు

లలో పెల్లుబుకుతూన్న విప్లవాత్మక మనస్థితి ప్రభావంకింద సోషలిస్టు-రివల్యూష నరీల వామ పక్షం 1917 నవంబరు అంత్యంలో వామపక్షీయ సోషలిస్టు-రివల్యూ షనరీల స్వతంత్ర పార్టీగా ఏర్పడింది. రైతులలో తమ పలుకుబడిని నిలబెట్టుకునే యత్నంలో వామపక్షీయ సోషలిస్టు-రివల్యూషనరీలు సోవియట్ ప్రభుత్వాన్ని గుర్తించి, బోల్షెవిక్‌లతో ఒప్పందం కుదుర్చుకున్నారు. కాని దీనితరువాత కొద్ది కాలానికే వీరు సోవియట్ రాజ్యాధి కారానికి వ్యతిరేకంగా తమ పోరాటాన్ని తిరిగి సాగించారు. పుట 64.

39 "రూస్కొయె బొగాత్‌స్త్వొ" ["రష్యన్ సంపత్తి"] – 1876 నుండి 1918 మధ్య వరకూ సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ప్రచురించబడిన మాసపత్రిక. ఎస్. ఎన్. క్రివేన్‌కొ, ఎన్. కె. మిహయ్‌లోవ్‌స్కీలు సంపాదకులుగా ఈ పత్రిక 1890 ల తొలి సంవత్స రాలలో లిబరల్ నరోద్నిక్కుల పత్రిక అయింది. జారిస్టు ప్రభుత్వంతో సామరస్యాన్ని ఈ పత్రిక ఉపదేశించి, మార్క్సిజంపైనా రష్యన్ మార్క్సిస్టులపైనా తీవ్రమైన దాడి సాగించింది. 1906 లో ఈ పత్రిక అర్ధ-కాడెట్ పార్టీ అయినట్టి పాప్యులర్ సోషలిస్టుల పత్రికగా తయారయింది. పుట 85.

40 యూదుష్క – ప్రఖ్యాత రష్యన్ వ్యంగ్య రచయిత సల్తికోవ్-శ్చెద్రీన్ రచించిన "ఖామం దులు గొలొవ్‌లొవ్‌లు" అనే నవల కథానాయకునికి ఇది వర్తిస్తూంది. ఈ కథానాయ కుడు కపటి, వంచకుడు, కఠినహృదయుడూ అవడంచేత అతనికి "యూదుష్క" అనే ఎగతాళి పేరు వచ్చింది. ఇటువంటి వ్యక్తులకు ఇది పర్యాయపదమైపోయింది. పుట 86.

41 అరక్చేయెవ్, ఎ.ఎ. – మొదటి పాల్, మొదటి అలగ్జాండర్ చక్రవర్తుల పరిపాలనలలో ఆంతరంగిక, వైదేశిక విధానంపై ప్రధానమైన ప్రభావం ప్రసరించినట్టి, పద్దెని మిదో శతాబ్దాంతమందూ, పందొమ్మిదో శతాబ్దారంభ మందూ జీవించిన అభివృద్ధి నిరోధక రాజ్య దురంధరుడు. విశృంఖలమైన పోలీసు నిరంకుశపరిపాలన, సైనిక నిరంకుశాధి పత్యములపేరుచెప్పగానే ఇతని పేరే జ్ఞప్తికొస్తుంది (అందుచేతనే "అరాక్చెయెవిజం" అనే పదం ఏర్పడింది). పుట 86.

42 "నరోద్నయ వోల్య" ["ప్రజా అభీష్టం"] మాజీసభ్యులచే (ఒ.వి. అప్తేక్‌మన్, ఎ.ఐ. బొగ్దనోవిచ్, ఎమ్. ఎ. నతన్‌సోన్ తదితరులు) 1893 లో స్థాపించబడినట్టి రష్యన్ ప్రజాస్వామిక మేధావుల చట్టవిరుద్ధ ఆర్గనైజేషను అయిన "నరోద్నొయె

ప్రావా" ["ప్రజా హక్కు"] అనే పార్టీ గురించి లెనిన్ ప్రస్తావించుతున్నాడు. రాజకీయ సంస్కరణలకై పోరాటంలో ప్రతిపక్ష శక్తులన్నిటినీ సమైక్యపరచడం తమ లక్ష్యంగా పెట్టుకున్నారు ఈ పార్టీ సభ్యులు. "ప్రణాళిక" "జరూరైన ప్రశ్న" అనే రెండు కార్యక్రమ పత్రాలను ఈ పార్టీ జారీచేసింది.

1894 వసంతకాలంలో జారిస్టు ప్రభుత్వం ఈ పార్టీని నాశనం చేసింది. కొంత కాలం తరువాత ఈ పార్టీ సభ్యులు చాలామంది సోషల్-రివల్యూషనరీల పార్టీలో చేరారు. పుట 87.

43 నరోదొవోల్త్సి — నరోద్నిక్-టెరరిస్టులచే 1879 నవంబరులో స్థాపించబడిన "నరోద్నయ వోల్య" ["ప్రజా అభీష్టం"] అనే రహస్య రాజకీయ ఆర్గనైజేషనుయొక్క సభ్యులు. నిరంకుశపరిపాలనను కూలదోయడం దీని తక్షణ లక్ష్యం. "నరోద్నయ వోల్య" కార్యక్రమంలో: సార్వజనిక ఎన్నిక హక్కు ప్రాతిపదికపై "శాశ్వత ప్రజా ప్రతినిధి సభ", రాజకీయ స్వేచ్ఛలను ప్రవేశపెట్టడం, భూమిని ప్రజలకు బదిలీ చేయడం, ఫ్యాక్టరీలను ప్రజల వశం చేసేందుకై చర్యలను అమలు జరపడమూ పొందుపరచబడ్డాయి. అయినప్పటికీ నరోదొవోల్త్సి విశాల ప్రజారాసులతో సంబంధాన్ని స్థాపించుకొనలేకపోయి, రాజకీయ కుట్రలూ టెరరిస్టు కార్యాల మార్గం చేపట్టింది.

ఈ సమాజ సభ్యులచే 1881 మార్చి 1 (13) వ తేదీని జార్ రెండవ అలెక్సాండ్ర్ హత్యచేయబడిన తరువాత కొద్ది కాలానికే జారిస్టు ప్రభుత్వంచే "నరోద్నయ వోల్య" నాశనం చేయబడింది. పుట 89.

44 చూ. మార్క్స్, "పెట్టుబడి", రెండవ కూర్పుకు మలిపలుకు. పుట 99.

45 ఈ ఉల్లేఖన ఎ. రూగె పేర కె. మార్క్స్ రాసిన లేఖ (1843 సెప్టెంబరు) నుండి. పుట 100.

46 "శ్రమ విమోచన" గ్రూపు — రష్యాలో మొట్టమొదటి మార్క్సిస్టు గ్రూపు. ఇది జి. వి. ప్లెహనొవ్‌చే 1883 లో జెనీవాలో ఆర్గనైజు చేయబడింది. రష్యాలో మార్క్సిజాన్ని వ్యాపింపజేసేందుకు ఇది విస్తృత కార్యాన్ని సాగించింది. పుట 102.

47 బ్లాంకిజం — ఫ్రెంచి సోషలిస్టు ఉద్యమంలో లూయీ అగస్ట్ బ్లాంకి (1805 – 1881) నడపిన ధోరణి. బ్లాంకిని ఒక ప్రముఖ విప్లవకారునిగానూ, సోషలిజాన్ని ఉగ్రంగా సమర్థించిన యోధునిగానూ మార్క్స్, ఎంగెల్స్‌లు పరిగణించారు; కాగా

అదే సమయంలో ఆతని సెక్టేరియనిజాన్ని, కుట్రతత్వపు ఎగ్స్టుగడలనూ వారు గట్టిగా విమర్శించారు. వర్గ పోరాటాన్ని బ్లాంకీజం కాదని, వేతనపు బానిసతనంనుండి మానవాళి విముక్తిని వర్గ పోరాటంవలన కాకుండా కొద్దిమంది మేధావుల కుట్ర ద్వారానే సాధించనాశించింది. పుట 104.

48 బెర్న్‌స్టయినిజం — అంతర్జాతీయ సోషల్-డెమొక్రసీలో గత శతాబ్ది అంత్యమందు జర్మనీలో తలెత్తినట్టి, జర్మన్ సోషల్-డెమొక్రాట్ ఎడువార్డ్ బెర్న్‌స్టయిన్ నామం ధరించుతూనట్టి మార్క్సిస్టు వ్యతిరేక ధోరణి. మార్క్సుయొక్క విప్లవాత్మక సిద్ధాంతానికి బూర్జువా లిబరలిజం భావంలో ఒక "రివిజన్"ను [పునర్విమర్శ, తిరుగదోడడం — అనువాదకుడు] బెర్న్‌స్టయిన్ ముందుకు తీసుకువచ్చాడు.

"లీగల్ మార్క్సిస్టులు," "ఎకానమిస్టులు" [ఆర్థికవాదులు], బుండ్‌పక్షానికి చెందినవారు, మెన్‌షెవిక్‌లూ రష్యాలో బెర్న్‌స్టయిన్ అనుచరులు. పుట 104.

49 చార్టిజం — 1830 లలోనూ, 1840 లలోనూ ఇంగ్లండులో జరిగినట్టి కార్మికవర్గ మొట్టమొదటి రాశి విప్లవాత్మక ఉద్యమం. ఈ ఉద్యమంలో పాల్గొన్నవారు ఒక "చార్టర్" [అధికారపత్రం] తయారుచేశారు (ఈ పదంనుండి "చార్టిజం" అనే పదం వచ్చింది). అందులో సార్వజనీన ఎన్నిక హక్కు, పార్లమెంటు సభ్యులకు భూమి రూపమైన ఆస్తి అర్హత రద్దు, వగైరాలను వారు డిమాండు చేశారు. అనేక సంవత్సరాలపాటు దేశమంతటా సమావేశాలూ ప్రదర్శనలూ జరిగాయి. వీటిలో లక్షోపలక్షల కార్మికులూ శిల్పులూ పాల్గొన్నారు. 1848 ఏప్రిల్‌లో జరిగిన మూడవ చార్టిస్ట్ జాతీయ సదస్సు పార్లమెంటుకు సమర్పించడానికి ఒక వినతి పత్రాన్ని తయారుచేసింది. దానిమీద ఏభై లక్షలకు మించిన ప్రజలు సంతకం చేశారు. భూస్వామ్య ప్రభువర్గ, బడా బూర్జువావర్గ ప్రతినిధులతో ప్రధానంగా కూడుకున్నట్టి ఇంగ్లీషు పార్లమెంటు ప్రజాధికారపత్రాన్ని ఆమోదించ నిరాకరించి, ఇక చార్టిస్ట్ అర్జీలు అన్నిటినీ తిరగ్గొట్టేసింది. ప్రభుత్వం చార్టిస్ట్‌లపై నిర్బంధాలను ఒక్కుమ్మడిగా ప్రయోగించి, వారి నాయకులను అరెస్టు చేసింది. ఉద్యమం అణగిదొక్కివేయబడింది, కాని కార్మికవర్గ ఉద్యమం తదుపరి అభివృద్ధిపై అది ప్రగాఢ ముద్ర వేసింది. పుట 108.

50 జర్మన్ సోషలిజం, లేక "వాస్తవిక" సోషలిజం — 1840 లలో జర్మనీలో ప్రధానంగా పెట్టీబూర్జువా మేధావులలో తలెత్తినట్టి అభివృద్ధినిరోధక ధోరణి. దీని

ప్రతినిధులు (కె. గ్ర్యూన్, ఎమ్. హెస్, ఎచ్. క్రీగె తదితరులు) సోషలిజం స్థానంలో ప్రేమ, భ్రాతృత్వాల భావలోలిత ఉపదేశాన్ని ప్రవేశపెట్టి, జర్మనీలో బూర్జువా-ప్రజాస్వామ్య విప్లవంయొక్క ఆవశ్యకతను నిరాకరించారు. "జర్మన్ భావశాస్త్రం," "క్రీగెకు వ్యతిరేకంగా సర్క్యులర్ లెటర్స్," "కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక" మొదలైన తమ రచనలలో మార్క్స్, ఎంగెల్స్‌లు ఈ ధోరణిని విమర్శించారు. పుట 109.

51 చూ. కె. మార్క్స్, "తత్వశాస్త్ర దారిద్ర్యం." పుట 110.

52 కార్మికవర్గానికి వ్యత్యాసంగా అన్ని ఇతర వర్గాలూ ఒక అభివృద్ధినిరోధక రాశి అనేటట్టి లాసాల్ సూత్రాన్ని — అంతకు ముందు స్వతంత్రంగా వుండిన రెండు జర్మన్ సోషలిస్టు పార్టీలు, ఐసెనాఖర్‌లూ లాసాలియన్‌లూ, ఐక్యపడిన 1875 గోతా కాంగ్రెస్‌లో అనుసరించబడినట్టి కార్యక్రమంలో పొందుపరచబడిన సూత్రాన్ని — లెనిన్ ఇక్కడ విమర్శించుతున్నాడు.

ఈ సూత్రంయొక్క విప్లవ వ్యతిరేక స్వభావాన్ని మార్క్స్ తన "గోతా కార్యక్రమ విమర్శ"లో బట్టబయలు చేశాడు. పుట 111.

53 "ఉత్తర రష్యన్ కార్మిక సంఘం" — రష్యాలో కార్మికవర్గ ఉద్యమం అభివృద్ధి చెందుతూన్న కాలంలో స్థాపించబడినట్టి తొలి విప్లవాత్మక రాజకీయ ఆర్గనైజేషన్లలో ఒకటి. 1878 అంత్యమందు సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఇది స్థాపించబడింది. ఫిట్టర్ పనివాడు విక్టర్ ఒబ్‌నోర్‌స్కి, వడ్రంగి స్తెపాన్ హల్తూరిన్ — ఈ ఇద్దరు సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికులూ దీని స్థాపకులు.

1878 డిసెంబరు 23 న, 30 న జరిగిన కార్మికుల సమావేశాలలో ఈ సంఘంయొక్క కార్యక్రమం ఆమోదించబడింది. కార్యక్రమం శ్రామికవర్గపు చారిత్రాత్మక పాత్రను నిర్వచించి, శ్రామికవర్గాన్ని సమాజంయొక్క పురోగామి వర్గంగా పేర్కొంది. దోపిడీ నుండి విముక్తికి ముఖ్యమైన షరతు రాజకీయ హక్కుల, స్వేచ్ఛల డిమాండును కార్యక్రమం ప్రకటించి, ఇతర దేశాల శ్రామికవర్గంతో కలిసి వర్గపోరాటాన్ని సాగించవలసిందిగా రష్యాదేశపు కార్మికులకు పిలుపు ఇచ్చింది. "రాజ్యాంగయంత్రంయొక్క ఇప్పటి రాజకీయ, ఆర్థిక వ్యవస్థ అత్యంత అన్యాయమైనది కాబట్టి దాని కూలదోత"ను సంఘం తన అంతిమ లక్ష్యంగా పెట్టుకుంది. అయినప్పటికీ, కార్యక్రమంలో నరోద్నిక్ తారతమ్యాలు లేకపోలేదు.

1879 ఆరంభానికి సంఘం సభ్యత్వపు సంఖ్య 200, సానుభూతిపరుల సంఖ్య కూడా ఇంతకు సమానంగానూ వుంది. శ్రామికవర్గపు సమ్మె పోరాటంలో

సంఘం క్రియాశీలంగా పాల్గొంది. 1880 తొలి రోజులలో జారిస్టు ప్రభుత్వం సంఘాన్ని ధ్వంసం చేసివేసింది. 1880 ఫిబ్రవరి 15 న సంఘ సభ్యులు "రబోచయ జార్య" ["కార్మిక ఉషోరాగం"] అనే పేరుగల కార్మికుల వారపత్రిక మొదటి సంచికను అచ్చువేశారు, కాని ఇంచుమించు అన్ని ప్రతులనూ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. పుట 112.

54 "దక్షిణ రష్యన్ కార్మిక సంఘం" — 1875 ఏప్రిల్—మే లో విప్లవాత్మక మేధావి యై.ఒ.జస్లావ్‌స్కిచే ఒదేస్స పట్నంలో స్థాపించబడినట్టి రష్యాలోని కార్మికవర్గపు మొదటి విప్లవాత్మక రాజకీయ ఆర్గనైజేషను. సంఘ నిబంధనలు, రష్యాలోని కార్మిక వర్గ ఉద్యమ చరిత్రలో తొలిసారిగా కార్మికులపై పెట్టుబడి సాగించుతూన్న హింసకు వ్యతిరేకంగా పోరాటం గురించి చెప్పి, "బలాత్కారయుతమైన వెల్లువ ద్వారానే" కార్మికులు తమ హక్కులను గెల్చుకొనగల్గుతారని నొక్కిచెప్పించి.

సంఘంలో సుమారు 60 క్రియాశీలురైన సభ్యులూ, 150–200 కార్మిక సానుభూతిపరులూ వుండేవారు. సంఘ సభ్యులు ఇష్టాగోష్ఠులలో కలుసుకుని, విప్లవాత్మకప్రజాస్వామ్య సారస్వతాన్ని చదివి, దానిని వ్యాప్తిచెందించుతూ, కార్మికుల సమ్మెలను ఆర్గనైజు చేయడంలో క్రియాత్మకంగా పాల్గొనేవారు. దక్షిణ రష్యాలోని రోస్తోవ్-న-దొనూ, హార్కొవ్, తగన్‌రోగ్, తదితర పారిశ్రామిక నగరాల కార్మికులలో తన పలుకుబడిని వ్యాపింపజేసేందుకు సంఘం ప్రయత్నించింది. రోస్తోవ్-న-దొనూలో సంఘం శాఖను స్థాపించడంలో జస్లావ్‌స్కి అనుచరులు కృతకృత్యులయారు. ఎనిమిది, తొమ్మిది నెలల మనుగడను సాగించిన తరువాత సంఘాన్ని, జారిస్టు ప్రభుత్వం ధ్వంసం చేసివేసింది. అరెస్టు తప్పించుకున్న సభ్యులు తమ విప్లవాత్మక క్రియాకలాపాన్ని సాగించుతూనేవచ్చారు. పుట 112.

55 జర్మన్ సోషల్-డెమోక్రాట్ల కాంగ్రెస్ 1899 అక్టోబరు 9 నుండి 14 వరకూ హన్నోవర్ పట్నంలో జరిగింది. కార్యావళిలో ప్రధానాంశమైన "పార్టీయొక్క మౌలిక అభిప్రాయాలూ ఎత్తుగడలపైన దాడి"పై ఔగుస్ట్ బేబెల్ నివేదిక ఇచ్చాడు. "మార్క్సిస్టు అభిప్రాయాల రక్షణకూ, నిక్కారైన సోషలిస్టు కార్మికుల పార్టీ కోసం పోరాటానికీ దృష్టాంతం"గా బేబెల్ ఉపన్యాసం "బహుకాలం ఉపయోగపడుతుంద"ని లెనిన్ రాశాడు. (చూ. V. I. Lenin, *Collected Works*, Vol. 19). బెర్న్‌స్టయిన్‌యొక్క రివిజనిస్టు అభిప్రాయాలను కాంగ్రెస్ తీర్మాన రూపంగా ఖండించినప్పటికీ, వాటిని కడవెళ్లా విమర్శించలేదు. పుట 118.

56 పారిశ్రామిక సంస్థల్లోనూ రైల్వే వర్క్‌షాపుల్లోనూ దినసరి పనిగంటల కాలాన్ని పదకొండున్నర గంటలకు స్థిరపరచినట్టి 1897 జూన్ 2 (14) శాసనం గురించి ఇక్కడ ప్రస్తావన. అప్పటివరకూ రష్యాలో దినసరి పనిగంటలకు ఒక పరిమితి అంటూ వుండక, కార్మికులను 14–15 గంటలు సహితమూ పని చేయించడానికి వీలుండేది. లెనిన్ చొరవపై ఏర్పడిన "కార్మికవర్గ విముక్తి పోరాట సమితిచే" నడుపబడిన కార్మికవర్గ ఉద్యమం ఒత్తిడికింద జారిస్టు ప్రభుత్వానికి ఈ శాసనం చేయక తప్పిందికాదు. లెనిన్ రచించిన "కొత్త ఫ్యాక్టరీ శాసనం" అనే వ్యాసంలో ఈ శాసనంపై విపులమైన విశ్లేషణ విమర్శనలు పొందు పరచబడ్డాయి. పుట 121.

57 లాసాలియన్లూ, ఐసెనాఖర్లూ – పంధొమ్మిదో శతాబ్ది అరవైలలోనూ డెబ్బైల తొలి సంవత్సరాలలోనూ జర్మన్ కార్మికవర్గ ఉద్యమంలోని రెండు పార్టీలు. ఎత్తుగడల ప్రశ్నలపైన, ప్రత్యేకంగా ఆనాటి జర్మన్ రాజకీయ జీవితంలోని అత్యవసర సమస్య – జర్మనీ ఏకీకరణకై మార్గాలు అనే సమస్య – పైనా ఈ రెండు పార్టీల మధ్యనూ తీవ్ర పోరాటం సాగుతూండేది.

లాసాలియన్లు – పెట్టీబూర్జువా సోషలిస్టు, 1863 లో లైప్జిగ్ పట్నంలో జరిగిన కార్మికుల సంఘాల కాంగ్రెస్‌లో స్థాపించబడిన జర్మన్ కార్మికుల సాధారణ సంఘం సభ్యుడూ అయిన ఫెర్డినాండ్ లాసాల్‌ను బలపరచినవారూ, అతని అనుచరులూ. ఈ సంఘానికి మొట్టమొదటి అధ్యక్షుడు లాసాల్, దాని కార్యక్రమాన్నీ ఎత్తుగడలనూ అతడు సూత్రీకరించాడు. వారి ఆచరణీయ క్రియాకలాపాల్లో లాసాల్, అతని అనుచరులూ బిస్మార్క్ యొక్క అగ్రరాజ్య విధానాన్ని బలపరచారు. "బాహ్యగతాత్మకంగా చూస్తే, ఇది ప్రష్యన్లకు లాభించే నైచ్యమూ, కార్మికవర్గ ఉద్యమానికి ద్రోహమూనూ" అని 1865 జనవరి 27 న మార్క్సు పేర ఎంగెల్సు రాశాడు. లాసాల్‌వాదంయొక్క సిద్ధాంతాన్నీ, ఎత్తుగడలనూ, ఆర్గనైజేషనల్ సూత్రాలనూ జర్మన్ కార్మికవర్గ ఉద్యమంలో ఒక అవకాశవాద ధోరణిగా మార్క్సు, ఎంగెల్సులు పదేపదిగా విమర్శించారు.

ఐసెనాఖర్లు – 1869 ఐసెనాఖ్ కాంగ్రెస్‌లో స్థాపించబడిన జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ కార్మికుల పార్టీ సభ్యులు. మార్క్సు, ఎంగెల్సుల భావశాస్త్రీయ ప్రభావంకింద వుండిన ఔగుస్ట్ బేబెల్, విల్‌హెల్మ్ లీబ్‌క్నెఖ్ట్ – వీరిద్దరూ ఐసెనాఖర్ల నాయకులు. "ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్‌లో తానొక భాగంగా పరిగణించుకుని దాని ఆశయాలను తాను పంచుకుంటున్నానని" జర్మన్ సోషల్-

డెమొక్రాటిక్ పార్టీ పరిగణించుతూందని ఐసెనాఖ్ కార్యక్రమం చెప్పుకుంది. జర్మనీ ఏకీకరణ సమస్యపై ఐసెనాఖర్లు "ప్రష్యనిజానికీ, బిస్మార్కిజానికీ, జాతీయతత్వానికీ రవంత లొంగుబాటైనా చూపకుండా ప్రజాస్వామ్య, శ్రామికవర్గ మార్గం" అనుసరించారు (V. I. Lenin, "*August Bebel*" *Collected Works, Vol. 19)*

1871 లో జర్మన్ సామ్రాజ్యం స్థాపనతో లాసాలియన్‌లకూ ఐసెనాఖర్‌లకూ మధ్య ఎత్తుగడలలో వున్న ప్రధాన భేదం తొలగిపోయింది, కాగా 1875 గోతా కాంగ్రెస్‌లో రెండు పార్టీలూ ఏకమై జర్మన్ సోషలిస్టు కార్మికుల పార్టీగా (అంతిమంగా జర్మన్ సోషల్-డెమొక్రాటిక్ పార్టీగా) ఏర్పడ్డాయి. పుట 122.

58 గెడ్ అనుయాయులూ, పోసిబిలిస్టులూ — సెంట్ ఎటియెన్ కాంగ్రెస్‌లో ఫ్రెంచి కార్మికుల పార్టీ చీలిపోయిన తరువాత 1882 లో ఫ్రెంచి సోషలిస్టు ఉద్యమంలో రూపొందినట్టి విప్లవాత్మక ధోరణీ, అవకాశవాద ధోరణీ.

గెడ్ అనుయాయులు — జ్యూల్ గెడ్, పాల్ లాఫార్గ్ అనుచరులు. వీరు ఉద్యమంలో మార్క్సిస్టు వామపక్షంగా ఏర్పడి, శ్రామికవర్గంయొక్క స్వతంత్ర విప్లవాత్మక విధానాన్ని సమర్థించారు. "ఫ్రెంచి కార్మికుల పార్టీ" అనే పేరును వీరు నిలబెట్టుకుని, 1880 లో ఆమోదించబడినట్టి సిద్ధాంత భాగం మార్క్స్‌చే రచించబడినట్టి హావర్ కార్యక్రమాన్నే వీరు అనుసరించుతూ వచ్చారు. ఫ్రాన్సుదేశపు పారిశ్రామిక నగరాలలో గెడ్ అనుయాయులు గొప్ప పలుకుబడిని కలిగివుంటూ, కార్మికవర్గంలోని పురోగామి మూలద్రవ్యాలను వీరు ఐక్యపరచారు. 1901 లో వీరు సోషలిస్టు పార్టీ ఆఫ్ ఫ్రాన్స్‌గా ఏర్పడ్డారు.

పోసిబిలిస్టులు (పి. బ్రుస్, బి. మలోన్ తదితరులు) — శ్రామికవర్గాన్ని విప్లవ పోరాట విధానాలనుండి మళ్లించడానికి ప్రయత్నించినట్టి పెట్టీబూర్జువా రిఫార్మిస్టు ధోరణి. పోసిబిలిస్టులు "కార్మికుల సోషల్-రివల్యూషనరీ పార్టీని" అర్గనైజుచేశారు; శ్రామికవర్గంయొక్క విప్లవాత్మక కార్యక్రమాన్నీ, ఎత్తుగడలనూ నిరాకరించారు, కార్మికవర్గ ఉద్యమపు సోషలిస్టు లక్ష్యాలను మరుగుపరచారు, పెట్టుబడిదారీ విధానంకింద ఏది "సాధ్యం" (possible — ఇందువల్లనే వారికి ఈ పేరు వచ్చింది) అవుతుందో దానినే వీరు సమర్థించి, కార్మికవర్గ క్రియాకలాపాన్ని ఈ మేరకే కుంచించివేశారు.

పోసిబిలిస్టులకు ఫ్రాన్సులోని బడుగు ప్రాంతాల్లోనూ, కార్మికవర్గపు వెనుకబడిన స్తరాల్లోనూ ప్రధానంగా పలుకుబడి వుండేది. 1902 లో, ఇతర రిఫార్మిస్టు

గ్రూపులతో సహా పోసిబిలిస్టులు జాన్ జోరేస్ నాయకత్వాన ఫ్రెంచి సోషలిస్టు పార్టీని ఆర్గనైజుచేశారు. 1905 వీరు సోషలిస్టు పార్టీ ఆఫ్ ఫ్రాన్సుతో చేరి, ఒక ఏకైక పార్టీని, ఫ్రెంచి సోషలిస్టు పార్టీని ఏర్పరచారు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో (1914–1918) ఈ పార్టీ నాయకులు (గెడ్, సెంబా, తదితరులు) కార్మికవర్గ ప్రయోజనాలకు ద్రోహంచేసి, సోషల్-జాతీయ దురహంకార స్థానాలకు తిరిగిపోయారు. పుట 122.

59 ఫేబియన్లు — 1884 లో ఇంగ్లండులో స్థాపించబడినట్టి ఫేబియన్ సమాజం అనే ఒక రిఫార్మిస్టు ఆర్గనైజేషను సభ్యులు. "కాలహరణపు" ఎత్తుగడలకూ, హాన్నిబల్‌తో నిర్ణయాత్మకములగు సంఘర్షణలను దాటవేసే యత్నాలకూ "కన్‌క్టేటర్" ("కాలహరణుడు") అనే మారుపేరును సంపాదించుకున్నట్టి రోమన్ సైన్యాధిపతి ఫేబియస్ మాక్సిమస్ (క్రీ. పూ. 3 వ శతాబ్ది పేరునుండి ఈ సమాజం తన పేరు పెట్టుకుంది. బూర్జువావర్గపు మేధావులు, రచయితలు, రాజకీయజీవితంలోని వ్యక్తులూ (ఉదాహరణకు: సిడ్నీ, బీట్రిస్ వెబ్‌లు, బెర్నార్డ్ షా, రామ్సే మెక్‌డోనల్డ్, తదితరులు) ఈ సమాజంలో అధికంగా చేరారు. ఫేబియన్ ధోరణిని "అత్యంత అవకాశవాద ధోరణి"గా లెనిన్ వర్ణించాడు. (V. I. Lenin *Collected Works*, Vol. 13, p. 358). ఫేబియన్ సమాజం 1900 సంవత్సరంలో లేబర్ పార్టీలో ఒక భాగంగా ఏర్పడింది. ఈనాటి లేబర్ పార్టీకి ఫేబియన్ సోషలిజం ఒక భావశాస్త్రీయ మూలాధారంగా ఉపయోగపడుతూంది.

సోషల్-డెమోక్రాట్లు — అదే సంవత్సరంలో (1884) స్థాపించబడిన ఇంగ్లీషు సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్ సభ్యులను గురించి లెనిన్ ఇక్కడ ప్రస్తావిస్తున్నాడు. దీని సభ్యులలో రిఫార్మిస్టులతోపాటూ (హైండ్‌మన్, తదితరులు), అరాజకవాదులతోపాటూ, మార్క్సిజాన్ని బలపరుచుతూ ఇంగ్లండ్‌లో సోషలిస్టు ఉద్యమంలో వామపక్షంగా ఏర్పడినట్టి విప్లవాత్మక సోషల్-డెమోక్రాట్ల గ్రూపువారు (హారీ క్వెల్చ్, టామ్ మాన్, ఎడ్వర్డ్ ఎవెలింగ్, ఎలియొనోర మార్క్స్, తదితరులు) కూడా వున్నారు. అది ప్రదర్శించిన డాగ్మాటిజానికీ సెక్టేరియనిజానికీ, ఇంగ్లండ్‌లోని రాశి కార్మికవర్గ ఉద్యమంనుండి దూరంగా వుండినందుకూ, ఆ ఉద్యమంయొక్క విశిష్ట లక్షణాలను ఉపేక్షించినందుకూ సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్‌న్ను ఎఫ్. ఎంగెల్స్ విమర్శించాడు. 1907 లో సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్‌న్ని సోషల్-డెమోక్రాటిక్ పార్టీ అని తిరిగి నామకరణం చేయడం జరిగింది; ఇండిపెండెంట్

లేబర్ పార్టీలోని వామపక్షపు మూలద్రవ్యాలతో సహా సోషల్-డెమోక్రాటిక్ పార్టీ బ్రిటిష్ సోషలిస్టు పార్టీగా ఏర్పడింది (1911); ఈ పార్టీ సభ్యులలో అధిక సంఖ్యాకులు కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్‌లో చేరి, దీనిని స్థాపించడానికి సహాయపడ్డారు. పుట 122.

60 మంత్రివర్గ పక్షంవారు (మిలెరానిస్టులు) శతాబ్ది మలుపులో ఫ్రెంచి సోషలిస్టు ఎ. మిలెరాన్‌చే ప్రారంభించబడినట్టి పాశ్చాత్య యూరపియన్ సోషలిస్టు పార్టీలలోని ఒక అవకాశవాద ధోరణికి ప్రతినిధులు. మిలెరాన్ 1899 లో ఫ్రాన్సు దేశపు అభివృద్ధి నిరోధక బూర్జువా ప్రభుత్వంలో ప్రవేశించి, బూర్జువావర్గంతో మిలాఖత్తు అయి సామ్రాజ్యవాద విధానాన్ని సాగించాడు. పుట 123.

61 మార్క్సుయొక్క విప్లవాత్మక బోధనను రష్యన్ పత్రికలలో విమర్శించినట్టి "లీగల్ మార్క్సిస్టులు" (చట్టబద్ధ మార్క్సిస్టులు) అని పిలువబడినవారికి ఇది వర్తించుతూంది. వీరు బెర్న్‌స్టయినియన్లకు సన్నిహితులు. పుట 123.

62 "Der achtzente Brumaire des Louis Bonaparte" ["లూయీ బోనపార్ట్‌యొక్క పద్దెనిమిదవ బ్రూమేర్"] అనే మార్క్సు విరచితమైన గ్రంథం మూడవ జర్మన్ కూర్పుకు ఎఫ్. ఎంగెల్స్ రాసిన పీఠికకు తాను స్వయంగా చేసిన అనువాదంనుండి ఒక ఖండికను లెనిన్ ఇక్కడ ఉల్లేఖించుతున్నాడు. పుట 124.

63 "దేశాంతర రష్యన్ సోషల్-డెమోక్రాట్ల సంఘం" "శ్రమ విమోచన" గ్రూపు చొరవపై 1894 లో స్థాపించబడింది. ఈ సంఘసభ్యులందరూ గ్రూపు కార్యక్రమాన్ని అనుసరించారు. సంఘంయొక్క ప్రచురణకార్యకలాపం గ్రూపుకు ఒప్పజెప్పబడింది. సంఘం ఉపయోగార్థం 1895 మార్చిలో గ్రూపు తన ముద్రాక్షరశాలను సంఘానికి ఇచ్చింది.

దేశాంతరంలో పార్టీయొక్క ప్రతినిధిగా సంఘాన్ని ఆర్. ఎస్. డి. ఎల్. పి మొదటి కాంగ్రెస్ (1898 మార్చి) గుర్తించింది. తదుపరి, అవకాశవాద మూలద్రవ్యాలదే ("ఏకానమిస్టులు," లేక "యువ" సభ్యులు సంఘంలో పైచేయి అయింది. రాజకీయ స్వేచ్ఛను గెల్చుకోవడమే సోషల్-డెమోక్రాట్ల తక్షణ కర్తవ్యమని కాంగ్రెస్ ప్రణాళిక ప్రకటించిన కారణంగా, దీనిని వీరు సమర్థించ నిరాకరించారు.

1898 నవంబరులో, జ్యూరిచ్‌లో జరిగిన సంఘం మొదటి కాంగ్రెస్‌లో, "రబోత్నిక్" 5–6 సంచిక, లెనిన్ రచించిన పాంఫ్లెట్లు: "రష్యన్ సోషల్-డెమోక్రాట్ల

కర్తవ్యాలు,'' ''కొత్త ఫ్యాక్టరీ శాసనం'' వీటి ప్రచురణను మినహా — ఈ పాంప్లెట్ల ప్రచురణ హక్కును తనకు ఉంచుకుని — సంఘం ప్రచురణలకు సంపాదకత్వం వహించనని ప్రకటించింది. ''ఎకానమిస్టుల'' ''రబోచెయె దేలో'' [''కార్మికుల కార్యం''] పత్రికను సంఘం 1899 లో ప్రచురించ నారంభించింది. ఈ పత్రికకు సంపాదకులుగా వున్నవారిలో బి. ఎన్. క్రిచేవ్‌స్కి, వి.పి. ఇవాన్‌షిన్, ఇతరలూ వుండేవారు. బెర్న్‌స్టయిన్, మిలెరానిస్టులు తదితర అవకాశవాదులతో సంఘం తన సంసక్తతను వెలిబుచ్చింది.

1900 ఏప్రిల్‌లో జినీవాలో జరిగిన రెండవ కాంగ్రెస్‌కు ముందూ కాంగ్రెస్ జరుగుతూన్నప్పుడూ సంఘంలోని ఈ కలహం కొనసాగుతూనే వుండెను. ఈ పోరాటం ఫలితంగా ''శ్రమ విమోచన'' గ్రూపూ, దానిని బలపరచినవారూ కాంగ్రెస్‌ను విడిచిపెట్టేసి, ''సోషల్-డెమోక్రాట్'' అనే పేరుతో ఒక స్వతంత్ర ఆర్గనైజేషన్ను స్థాపించారు.

1903 లో జరిగిన ఆర్. ఎస్. డి. ఎల్. పి రెండవ కాంగ్రెస్‌లో సంఘం ప్రతినిధులు అతివాదపూరితమైన అవకాశవాద స్థానం తీసుకుని, ''విదేశ రష్యన్ రివల్యూషనరీ సోషల్-డెమోక్రసీ సమితిని'' పార్టీయొక్క ఏకైక దేశాంతర ప్రతినిధిగా కాంగ్రెస్ గుర్తించిన తదుపరి, కాంగ్రెస్‌నుండి వీరు బైటకు వచ్చేశారు. సంఘం రద్దు అయిపోయినట్లు ఆర్. ఎస్. డి. ఎల్. పి రెండవ కాంగ్రెస్ ప్రకటించింది. పుట 127.

64 ''జార్య'' [''ఉషారాగం''] – ''ఇస్క్రా'' సంపాదకవర్గంచే 1901–1902 లో స్టుట్‌గార్ట్‌నుండి ప్రచురించబడిన మార్క్సిస్టు సిద్ధాంత, రాజకీయ ఆవర్తక్రమపత్రిక మొత్తానికి నాల్గు సంచికలు (మూడు సంపుటాలు): నెం. 1–1901 ఏప్రిల్ (వాస్తవానికి ఇది మార్చి 23 న వెలువడింది), నెం. 2–3 – 1901 డిసెంబరు, నెం. 4 – 1902 ఆగస్టు వెలువడ్డాయి.

''జార్య'' పత్రిక అంతర్జాతీయ రివిజనిజాన్నీ, రష్యన్ రివిజనిజాన్నీ విమర్శించి, మార్క్సిజం సైద్ధాంతిక సూత్రాలను పరిరక్షించింది. ''జార్య'' ప్రచురించినట్టి లెనిన్ విరచితములైన ''జేమ్‌స్ట్వోను హింసించినవారూ, లిబరలిజమ్ హాన్నిబాల్‌లూ,'' ''శ్రీయుతులు వ్యవసాయ ప్రశ్నపై 'విమర్శకులు''' (''వ్యవసాయ ప్రశ్న, 'మార్క్స్ విమర్శకులూ''' అనే గ్రంథంయొక్క మొదటి నాల్గు ప్రకరణాలు), ''రష్యన్ సోషల్-డెమోక్రసీ వ్యవసాయ కార్యక్రమం'' వ్యాసాలనూ, జి.వి. ప్లెహా

నొవ్ రచించిన, "మన విమర్శకులపై విమర్శ. మొదటి భాగం. మార్క్స్ యొక్క సాంఘిక అభివృద్ధి సిద్ధాంతపై విమర్శకుని పాత్రలో మిస్టర్ ఎ. స్క్రూవె," "cant [కపటం] వ్యతిరేకంగా కాంట్, లేక మిస్టర్ బెర్న్‌స్టయిన్ అభీష్టం," తదితర వ్యాసాలలో ఈ ప్రశ్నలు విశదీకరించబడ్డాయి. పుట 127.

65 చూ. 1875 మే 5 న బ్రాకె పేర మార్క్స్ రాసిన లేఖ. పుట 128.

66 గోతా కార్యక్రమం — జర్మనీలో విడిగావున్న రెండు సోషలిస్టు పార్టీలనూ — ఐసెనాఖర్లు (మార్క్స్, ఎంగెల్స్‌ల భావశాస్త్రీయ ప్రభావంకింద వుండిన ఔగుస్ట్ బేబెల్, విల్‌హెల్మ్ లీబ్‌క్నెఖ్ట్‌లు వీరికి నాయకులు), లాసాలియన్లూ — ఐక్యపరచిన జర్మన్ సోషలిస్టు కార్మికుల పార్టీచే 1875 లో గోతా కాంగ్రెసుచే అంగీకరించబడిన కార్యక్రమం. అత్యంత ముఖ్యమైన ప్రశ్నలపై లాసాలియన్లకు ఐసెనాఖర్లు సౌకర్యాలను చూపించి, లాసాలియన్ల సూత్రీకరణలను అంగీకరించిన కారణంగా ఈ కార్యక్రమం వరణతత్వ, అవకాశవాద లోపాలను కలిగివుంది. మార్క్స్, ఎంగెల్స్‌లు గోతా కార్యక్రమపు ముసాయిదాను నిశిత విమర్శనకు పాల్జేసి, 1869 ఐసెనాఖ్ కార్యక్రమంతో సరిపోల్చి చూస్తే ఒక వెనుకంజ అనీ దీనికి లక్షణం చెప్పారు. పుట 128.

67 ఎంగెల్స్ రచించిన "జర్మనీలో రైతు సంగ్రామం" అనే గ్రంథానికి ఎంగెల్స్ రాసిన పీఠికకు తన అనువాదంనుండి ఒక ఖండికను లెనిన్ ఇక్కడ ఉల్లేఖించుతున్నాడు. పుట 132.

68 1896 లో జరిగిన సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికుల రాశి సమ్మెలను గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు. మే 23 న కలీన్‌కిన్ మిల్లులో సమ్మె మొదట ప్రారంభమై, సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోని ముఖ్యమైన నూలు వడకు, నేత మిల్లులకూ, పెద్ద ఇంజనీరింగ్ ఫ్యాక్టరీలకూ, ఒక రబ్బర్ ఫ్యాక్టరీకీ, ఒక కాగితపు మిల్లుకూ, చక్కెర శుద్ధికర్మాగారానికీ త్వరగా విస్తరించింది. దోపిడీదార్లకు వ్యతిరేకంగా సెంట్ పీటర్స్‌బర్గ్ శ్రామికవర్గం రాశిస్థాయిలో సమ్మెచేయడం ఇదే తొలిసారి. 30,000 లకు పైగా కార్మికులు సమ్మెచేశారు. సెయింట్ పీటర్స్‌బర్గ్ "కార్మికవర్గం విముక్తి పోరాట సమితి" ఈ సమ్మెను నడిపించింది. సమైక్యమూ దృఢమూ అయిన కార్యాచరణ ద్వారా తమ హక్కులను నిలబెట్టుకోవలసిందని కార్మికులకు పిలుపు ఇచ్చిన కరపత్రాలను సమితి వెలువరించింది. కార్మికుల డిమాండ్ల జాబితాను సమితి అచ్చువేసి, ప్రచారంలో పెట్టింది. దినసరి పనిగంటలు పదిన్నర గంటలకు పరిమితం చేయ

బడాలనీ, వేతనపు రేట్లను పెంచాలనీ, వేతనాలు యుక్తకాలమందు చెల్లించబడాలనీ, ఇంకా ఇతరములనూ కార్మికులు డిమాండుచేశారు.

సమ్మెగురించిన నివేదికలు విదేశాలలో ప్రగాఢమైన ముద్ర వేశాయి. మాస్కో, తదితర రష్యన్ నగరాల్లోని కార్మికవర్గ ఉద్యమాభివృద్ధిని సెయింట్ పీటర్స్‌బర్గ్ సమ్మెలు త్వరితపరచి, అప్పటికి అమలులో వున్న ఫ్యాక్టరీ శాసనాన్ని ఎట్టి జాప్యమూ లేకుండా సవరించేటట్టు జారిస్టు ప్రభుత్వాన్ని బలవంతం చేసింది. 1897 జూన్ 2 (14)న ప్రభుత్వం ఒక శాసనం చేసింది. ఈ శాసనం ప్రకారం దినసరి పనిగంటలు పదకొండున్నర వరకు తగ్గించబడ్డాయి. సెయింట్ పీటర్స్‌బర్గ్ సమ్మెలు "నిల కడగా ఉధృతమౌతూన్న కార్మిక ఉద్యమ శకాన్ని ప్రవేశపెట్టాయి" అని లెనిన్ తరువాత రాశాడు. (V. I. Lenin, *Collected Works, Vol. 13 p. 94)*. పుట 133.

69 "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" 1895 ఆకురాలు కాలంలో లెనిన్‌చే స్థాపించ బడింది. సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోని సుమారు 20 మార్క్సిస్టు కార్మికుల గ్రూపులను ఐక్యపరచింది. కేంద్ర విధానం, కఠిన క్రమశిక్షణ సూత్రాలపై సమితి నిర్మించ బడింది. లెనిన్‌చే నడపబడిన ఒక కేంద్ర గ్రూపు సమితికి నాయకత్వం వహించింది.

సోషలిజాన్ని కార్మికవర్గ ఉద్యమంతో కలిపేందుకు రష్యాలో ఏర్పడిన ఆర్గనైజేషన్లలోకల్లా సమితే మొట్టమొదటిది. సమితి ఈ ఉద్యమాన్ని నడిపించి, ఆర్థిక డిమాండ్లకై కార్మికుల పోరాటాన్ని జారిస్టు విధానానికి వ్యతిరేకమైన రాజకీయ పోరాటంతో మిళితం చేసింది. లెనిన్ సంపాదకత్వంకింద కార్మికులకు కరపత్రాలనూ, పాంఫ్లెట్లనూ సమితి ప్రచురించింది. "రబోచెయె దేలో" ["కార్మికుల కార్యం"] అనే కార్మికుల రాజకీయ వార్తాపత్రిక ప్రచురణకై సన్నాహాలను ఆయన నడిపించాడు. సమితి ప్రభావం సెయింట్ పీటర్స్‌బర్గ్‌ను దాటి విస్తరించింది. సమితి దృష్టాంతాన్ని అనుసరించి మాస్కో, కీయెవ్, యెకతెరినొస్లావ్, ఇతర నగరాలలోని కార్మికుల గ్రూపులు ఇదే రకమైన "పోరాట సమితులు"గా ఏర్పడేందుకు సమైక్యపడ్డాయి.

1895 డిసెంబరు 8 (20) రాత్రి, అత్యధికసంఖ్య సమితిసభ్యులను (వీరిలో లెనిన్ కూడా వున్నాడు) ప్రభుత్వం అరెస్టు చేసింది. అచ్చుకు సిద్ధంగా వున్న "రబోచెయె దేలో" మొదటి ప్రతిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

జైలులో వుంటూండినప్పుడే లెనిన్ సమితి క్రియాకలాపాలను నడిపించి, సలహాలనిస్తూ సహాయంచేసి, సాంకేతిక భాషలో వుత్తరాలూ కరపత్రాలూ రాసి బైటకు పంపించుతూండేవాడు. "సమ్మెలను గురించి" అనే పాంఫ్లెట్‌నూ (దీని

లిఖితప్రతి ఇంతవరకూ లభించలేదు), "సోషల్-డెమోక్రాటిక్ పార్టీ కార్యక్రమం ముసాయిదా, వివరణ"నూ జైలులో వున్న రోజుల్లోనే రాశాడు.

లెనిన్ చెప్పినట్టుగా, కార్మికవర్గ ఉద్యమాన్ని ఆధారంగా కల్గినట్టి విప్లవాత్మక పార్టీ తొలి అంకురమే అది అయి వుండడంలోనూ, శ్రామికవర్గంయొక్క వర్గ పోరాటాన్ని అది నడిపించి వుండడంలోనూ సెయింట్ పీటర్స్‌బర్గ్ "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" ప్రాముఖ్యత వుంది. 1898 ఉత్తరార్ధంనాటికి పోరాట సమితి, ట్రేడ్‌యూనియనిజం భావాలను రష్యన్ పరిస్థితులకు అనుగుణ్యంగా మార్చబడిన బెర్న్‌స్టయినిజం భావాలనూ "రబోచయ మీస్ల్" ["కార్మికుల చింతన"] అనే వార్తాపత్రిక ద్వారా ప్రచారంచేసినట్టి "ఎకానమిస్టుల" చేతుల్లో పడిపోయింది. అరెస్టు కాకుండా తప్పించుకున్నట్టి సమితి పాత సభ్యులు, 1898 లో జరిగిన ఆర్. ఎస్. డి. ఎల్. పి మొదటి కాంగ్రెస్‌ను సన్నద్ధం చేయడంలోనూ సమావిష్టపరచడం లోనూ, కాంగ్రెస్ సమావేశం తరువాత ప్రచురించబడినట్టి "ప్రణాళికను" తయారు చేయడంలోనూ పాల్గొన్నారు. లెనిన్‌చే స్థాపితమైన "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" సాంప్రదాయలను వీరు సాగించారు. పుట 135.

70 యారొస్లావ్ల్ పెద్ద మిల్లుల్లో జరిగిన సమ్మెను 1895 ఏప్రిల్ 27 (మే 9) న అణచివేయబడిన ఉదంతానికి ఇది వర్తించుతూంది. తగ్గించివేయబడిన వేతనపు రేట్లను ప్రవేశపెట్టడం కారణంగా ఈ సమ్మె జరిగింది. సమ్మె క్రూరంగా అణచివేయ బడింది. యారొస్లావ్ల్ సమ్మెను గురించిన వ్యాసం లెనిన్‌చే రచించబడింది; ఈ వ్యాసపు లిఖితప్రతి ఇంతవరకూ లభ్యంకాలేదు. పుట 136.

71 "సెయింట్ పీటర్స్‌బర్గ్ రబోచియ్ లిస్తోక్"["సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికుల పత్రిక"]— సెయింట్ పీటర్స్‌బర్గ్ "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" పత్రిక. పత్రిక సంచి కలు రెండు వెలువడ్డాయి: నెం. 1 1897 ఫిబ్రవరిలోనూ (జనవరి తేదీని కల్గి రష్యాలో అచ్చుపడింది), నెం. 2 జినీవాలో 1897 సెప్టెంబరులోనూ.

శ్రామికవర్గంయొక్క ఆర్థిక పోరాటాన్ని విశాల రాజకీయ డిమాండ్లతో కల పడమునే కర్తవ్యాన్ని ఈ వార్తాపత్రిక ముందుకు తీసుకొచ్చి, కార్మికుల పార్టీ ఆవశ్యకతను నొక్కిచెప్పింది. పుట 136.

72 ఇచ్చట సూచించబడిన "ప్రైవేటు సమావేశం" 1897 ఫిబ్రవరి 14, 17 (ఫిబ్ర వరి 26, మార్చి 1) తేదీల మధ్య సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో జరిగింది. ఈ సమావే శానికి వి.ఐ. లెనిన్, ఎ.ఎ.వనేయెవ్, జి.ఎమ్. క్రీజిజనోవ్‌స్కి, సెయింట్ పీటర్స్

బర్గ్ "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" తదితర సభ్యులూ, అనగా సైబీరియాకు ప్రవాసం పంపబడే ముందు మూడు రోజుల పాటు జైలు నుండి విడుదల చేయ బడిన "వృద్ధ" సభ్యులూ, వీరేకాకుండా 1895 డిసెంబరున జరిగిన లెనిన్ అరెస్టు తరువాత సమితికి నాయకత్వం వహించిన సమితి "యువ" సభ్యులూ హాజరయ్యారు. పుట 138.

73 "లిస్తోక్ 'రబోత్నిక' " ["'కార్మికుని' పత్రిక"] – 1896 నుండి 1899 వరకూ జినీవాలో ప్రచురించబడిన "దేశాంతర రష్యన్ సోషల్-డెమోక్రాట్ల సంఘం" యొక్క పత్రిక. ఇది ఒక నియమిత ఆవర్తక్రమంలో కాకుండా అప్పటప్పట వెలు వడుతూండేది; మెత్తంమీద 10 సంచికలు వెలువడ్డాయి. సంచికలు 1–8 "శ్రమ విమోచన" గ్రూపు సంపాదకత్వంకింద వెలువడ్డాయి. కాని సంఘ సభ్యత్వంలోని అధికసంఖ్యాకవర్గం "ఎకానమిజం"వైపు తిరిగిపోయిన తరువాత, "శ్రమ విమోచన" గ్రూపు పత్రిక సంపాదకత్వాన్ని సాగించడానికి నిరాకరించింది. నెం. 9, 10 సంచిక లను "ఎకానమిస్టులు" వెలువరించారు. పుట 138.

74 జారిస్టు సాయుధ పోలీసులు నీలిరంగు యూనిఫారాలు ధరించేవారు. పుట 140.

75 వి.వి – వి.పి. వొరొంత్సోవ్ పెట్టుకున్న మారుపేరు. 1880, 1890 సంవత్సరాల లిబరల్ నరోదిజం భావశాస్త్రవేత్తలలో ఇతడొకడు. "రష్యన్ సోషల్-డెమోక్రసీ లోని వి.వి.లు" అని లెనిన్ అన్న మాటలు రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమంలో అవకాశవాద ధోరణికి ప్రాతినిధ్యం వహించిన "ఆర్థికవాదుల"కు వర్తిస్తున్నాయి. పుట 141.

76 1901 నవంబరు 2–6 తేదీల మధ్య జరిగిన ఆస్ట్రియా దేశపు సోషల్-డెమోక్రాటిక్ పార్టీయొక్క వియన్నా కాంగ్రెస్ 1888 నాటి పాత గైన్‌ఫెల్డ్ కార్యక్రమం స్థానే ఒక కొత్త కార్యక్రమాన్ని అవలంబించింది. 1899 బ్ర్యూన్ కాంగ్రెస్ ఆదేశానుసారం ఒక ప్రత్యేక కమిషన్‌చే (వి. అడ్లర్, తదితరులు దీనిలో సభ్యులు) తయారుచేయబడిన ముసాయిదాలో బెర్న్‌స్టయినిజానికి తీవ్రమైన రాయితీలు కల్పించ బడ్డాయి. పుట 143.

77 హిర్ష్-దుంకెర్ కార్మికుల సంఘాలు – బూర్జువా పార్టీ అయినట్టి ప్రొగ్రెసిస్ట్ పార్టీకి ప్రతినిధులైన హిర్ష్, దుంకెర్‌లచే 1868 లో జర్మనీలో స్థాపించబడిన రిఫార్మిస్టు ట్రేడ్ యూనియన్ ఆర్గనైజేషన్లు. శ్రమ, పెట్టుబడి – ఈ రెంటి ప్రయోజ

నాల ''ఐక్యతను'' వీరు ఉపదేశించారు ఈ సంఘాలలో కార్మికులతోపాటుగా పెట్టు బడిదార్లను కూడా సభ్యులుగా చేరనిచ్చారు, సమ్మెల ఆవశ్యకతను నిరాకరించారు. బూర్జువా చట్టనిర్మాణంయొక్క, ట్రేడ్ యూనియన్లయొక్కా సహాయంతో పెట్టుబడిదారీ సమాజ చట్రంలో ఇమిడి వుంటూనే పెట్టుబడి మోపిన గాటనుండి కార్మికులు స్వేచ్ఛను సాధించుకొన గల్గుతారని వీరు ఉద్ఘాటించారు; కార్మికులకూ పెట్టుబడిదారీ యజమానులకూ నడుమ మధ్యవర్తులుగా వుండడమూ, ధన నిధుల సంచయమూ ట్రేడ్ యూనియన్ల ప్రధాన కర్తవ్యాలని వీరు భావించారు. సమ్మెల పట్ల హిర్ష్-డుంకెర్ కార్మికుల సంఘాల స్థాపకుల వ్యతిరేక వైఖరి ఈ సంఘాలను సమ్మె విచ్ఛిన్నకారుల ఆర్గనైజేషన్లుగా మార్చివేసింది; ట్రేడ్ యూనియన్ల పాత్ర పరస్పర ఉపకార సంఘాల, విద్యాసంస్థల పాత్రకు కుదించివేయబడింది. 1933 వరకూ మనుగడ సాగించిన ఈ హిర్ష్-డుంకెర్ సంఘాలు జర్మన్ కార్మికవర్గ ఉద్యమంలో ఏనాడూ కూడా ఒక నిజమైన శక్తిగా ఏర్పడలేదు. పుట 147.

78 ''ఇస్క్రా'' [''అగ్నికణం''] – లెనిన్‌చే 1900 లో స్థాపించబడినట్టి మొదటి అఖిల రష్యా చట్టవిరుద్ధ మార్క్సిస్టు వార్తాపత్రిక; కార్మికవర్గపు మార్క్సిస్టు విప్లవాత్మక పార్టీని నిర్మించడంలో ఇది ప్రాణతుల్యమైన పాత్రను నిర్వహించింది.

పోలీసు హింసల మూలాన పత్రికను రష్యాలో ప్రచురించడం దుస్సాధ్యమైంది; అందుకని తానింకా సైబీరియాలో శిక్షాప్రవాసంలో వుంటూన్న రోజుల్లోనే విదేశాల్లో పత్రికను ప్రచురించేందుకై వివరమైన ప్రణాళికను లెనిన్ రూపొందించాడు. తన ప్రవాసకాలం పూర్తి అయిపోగానే (జనవరి 1900) తన ప్రణాళికను ఆచరణలో పెట్టేందుకు వెంటనే పూనుకున్నాడు.

లెనినిస్టు ''ఇస్క్రా'' మొదటి సంచిక 1900 డిసెంబరులో లైప్జిగ్‌నుండి వెలువడింది; పత్రిక తదుపరి మ్యూనిచ్‌నుండీ, లండన్‌నుండీ (1902 జూలైనుండి), 1903 వసంతకాలం ప్రారంభంనుండి జినీవానుండీ ప్రచురించబడింది.

''ఇస్క్రా'' సంపాదకవర్గం వి.ఐ.లెనిన్, జి.వి.ప్లెహానొవ్, ఎల్.మార్తొవ్, పి.బి. అక్సెల్‌రోడ్, ఎ.ఎన్.పొత్రేసొవ్, వి.ఐ. జసూలిచ్‌లతో ఏర్పడింది.

''ఇస్క్రా'' ఒక కేంద్రంగా రూపొందింది; ఈకేంద్రం చుట్టూ పార్టీ ఏకీకరణ సాగింది, దీని చుట్టూ పార్టీ శక్తులు మోహరించబడి శిక్షణ పొందాయి. అనేక నగరాల్లో (సెయింట్ పీటర్స్‌బర్గ్, మాస్కో, సమార, వగైరాలు) లెనినిస్టు ''ఇస్క్రా''ను అనుసరించే ఆర్. ఎస్. డి. ఎల్. పి కమిటీలూ గ్రూపులూ ఏర్పాటుచేయబడ్డాయి.

లెనిన్ చొరవపైనా, ఆయన ప్రత్యక్ష భాగస్వామ్యంతోనూ ''ఇస్క్రా'' సంపాదక వర్గం పార్టీ కార్యక్రమాన్ని తయారుచేసి (''ఇస్క్రా'' నెం. 21 వ సంచికలో ఈ ముసాయిదా ప్రచురించబడింది), రెండవ పార్టీ కాంగ్రెస్‌కు సన్నాహాలు జరిపింది. పార్టీ రెండవ కాంగ్రెస్ 1903 జూలై-ఆగస్టులో జరిగింది. కాంగ్రెస్ సమావేశమయే నాటికి రష్యాలోని సోషల్-డెమోక్రాటిక్ ఆర్గనైజేషన్లలో అధిక సంఖ్య ఆర్గనైజేషన్లు ''ఇస్క్రా''తో ఏకీభవించి, దాని ఎత్తుగడలనూ కార్యక్రమాన్నీ ఆర్గనైజేషనల్ ప్రణాళికనూ ఆమోదించి, దానిని తమ ప్రధాన పత్రికగా గుర్తించాయి. పార్టీని నిర్మించేందుకై పోరాటంలో ''ఇస్క్రా'' అసాధారణ పాత్రను గుర్తించి, పత్రికను సెంట్రల్ పార్టీ పత్రికగా అంగీకరించుతూ కాంగ్రెస్ ఒక ప్రత్యేక తీర్మానం చేసింది. లెనిన్, ప్లెహానొవ్, మార్తొవ్‌లతో ఏర్పడిన సంపాదకవర్గాన్ని కాంగ్రెస్ నియమించింది; కాని, కాంగ్రెస్ ఈ నిర్ణయాన్ని చేసినప్పటికీ, సంపాదకవర్గంలో చేర నిరాకరించాడు మార్తొవ్. ఫలితంగా ''ఇస్క్రా'' నెం. 46–51 సంచికలు లెనిన్, ప్లెహానొవ్ సంపాదకత్వంకింద వెలువడ్డాయి. తదుపరి కాలంలో ప్లెహానొవ్ మెన్‌షెవిక్‌లతో చేరిపోయి, వెనుకట్లో కాంగ్రెస్ ఆమోదించని పాత మెన్‌షెవిక్ సంపాదకులను అందరినీ సంపాదకవర్గంలోకి కోఆప్ట్ చేసుకోబడాలని డిమాండు చేశాడు. ఇందుకు లెనిన్ అంగీకరించలేక, 1903 అక్టోబరు 19 (నవంబరు 1) న లెనిన్ తన సంపాదకత్వానికి రాజీనామా ఇచ్చేశాడు; అతడు సెంట్రల్ కమిటీలోకి కోఆప్ట్ చేసుకోబడి, ఈ స్థానంనుండి మెన్‌షెవిక్ అవకాశవాదులపై దెబ్బతీశాడు. ''ఇస్క్రా'' నెం. 52 సంచిక ప్లెహానొవ్ ఒక్కడి సంపాదకవర్గంకిందే వెలువడింది. 1903 నవంబరు 13 (26) న, ప్లెహానొవ్ తనకుతానుగానూ కాంగ్రెస్ అభీష్టాన్ని అతిక్రమించుతూనూ ప్రవర్తించి, మెన్‌షెవిక్ మాజీ సంపాదకులను అందరినీ సంపాదకవర్గంలోకి కోఆప్ట్ చేసుకున్నాడు. నెం. 52 సంచికతో మొదలు ''ఇస్క్రా'' మెన్‌షెవిక్‌ల పత్రిక అయిపోయింది. కొత్త ''ఇస్క్రా'' గురించి ప్రస్తావించడంలో నెం. 52 వ సంచిక, తదుపరి సంచికలూ అని లెనిన్ ఉద్దేశం. పుట 151.

79 పాత ''ఇస్క్రా'' గురించి ప్రస్తావించడంలో పత్రిక సంచికలు నెం. 1 మొదలు నెం. 51 అని లెనిన్ ఉద్దేశం. (చూ: 78 వ వివరణ). పుట 154.

80 ''ఒస్వొబొజ్దేనియె'' ధోరణి – ''ఒస్వొబొజ్దేనియె'' అనే పక్షపత్రికనుండి ఈ ధోరణికి ఈ పేరు వచ్చింది.

"ఒస్వొబొజ్దేనియె" పత్రిక విదేశాల్లో 1902–1905 సంవత్సరాల్లో పి.బి. స్త్రూవె సంపాదకత్వాన వెలువడుతూండేది. 1904 జనవరిలో ఇది లిబరల్-ఏకరాజాధిపత్యతత్వపు "విమోచన సమితి"యొక్క పత్రికగా ఏర్పడింది. అటు తర్వాత ఈ సమితి సభ్యులు కాడెట్ పార్టీ మూలవిరాట్టులుగా తయారయారు. పుట 165.

81 "వ్పెర్యోద్" ["ముందుకు"] – 1904 డిసెంబరు 22 (1905 జనవరి 4) నుండి 1905 మే 5 (18) వరకూ జినీవానుండి ప్రచురించబడిన చట్టవిరుద్ధ బోల్షెవిక్ వారపత్రిక. మొత్తంమీద 18 సంచికలు వెలువడ్డాయి. పత్రిక లెనిన్‌చే ఆర్గనైజు చేయబడి, నడిపించబడింది.

మెన్షెవిజానికి వ్యతిరేకంగానూ, పార్టీ సూత్రాల పునరుద్ధరణ కోసమూ, విప్లవాత్మక ఉద్యమం వేసిన ఎత్తుగడల ప్రశ్నలపై చర్చలోనూ, ఇంతే కాకుండా మూడవ కాంగ్రెస్ సమావిష్టానికై జరిగిన పోరాటంలోనూ పత్రిక నిర్వర్తించిన పాత్రను మూడవ పార్టీ కాంగ్రెస్ ఒక ప్రత్యేక తీర్మానంలో గుర్తించింది. పత్రికా సంపాదకవర్గపు కృషిని కాంగ్రెస్ ప్రస్తుతించింది. మూడవ కాంగ్రెస్ నిర్ణయాన్ని అనుసరించి, "వ్పెర్యోద్" బదులు "ప్రొలెతారియ్" సెంట్రల్ పార్టీ కేంద్ర పత్రిక అయింది. "ప్రొలెతారియ్" జినీవానుండి 1905 మే 14 (27) నుండి నవంబరు 12 (25) వరకూ వెలువడింది. మొత్తంమీద 25 సంచికలు వెలువడ్డాయి. పుట 166.

82 1905 జనవరి 9 న, సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికుల ప్రదర్శనపై, జార్ ఆజ్ఞనను సరించి, సైనికులు పాశవికంగా తుపాకులు కాల్చారు. మతగురువు గపోన్‌చే నడుపబడిన ప్రదర్శకులు, ఒక విజ్ఞాపన పత్రాన్ని జార్‌కి సమర్పించడానికై వింటర్ పాలెస్ దిశగా సాగివెళ్లారు. నిరాయుధులైన కార్మికులను ఇంత దుర్మార్గంగా సంహరించడం ఫలితంగా, "నిరంకుశపరిపాలన నశించాలి!" అనే నినాదంకింద రష్యా అంతటా రాశి రాజకీయ సమ్మెలూ ప్రదర్శనల వెల్లువ ప్రారంభమైంది. జనవరి 9 ఉదంతాలు 1905–1907 విప్లవారంభానికి నాందివాచకం పలికాయి. పుట 167.

83 కొలోన్‌నగరపు కార్మికుల సంఘంయొక్క ప్రత్యేక పత్రిక "Zeitung des Arbeiter-Vereins zu Köln" ["కొలోన్ కార్మికుల సంఘం వార్తాపత్రిక"] అనే శీర్షికతోనూ, "Freiheit, Brüderlichkeit, Arbeit"["స్వేచ్ఛ, భ్రాతృత్వము, శ్రమ"] అనే ఉపశీర్షికతోనూ మొదట వెలువడింది; "కమ్యూనిస్టు లీగ్‌కు" చెందిన జె. మోల్, కె. షాప్పెర్

దాని సంపాదకులు. 1848 ఏప్రిల్‌నుండి అక్టోబరువరకూ 40 సంచికలు వెలువడ్డాయి. తరువాత పత్రిక ఉపశీర్షికే శీర్షికగా మారి, 1848 అక్టోబరు నుండి 1849 జూన్ వరకూ ఈ కొత్త పేరుతో 23 సంచికలు అదనంగా వెలువడ్డాయి. పుట 172.

84 ఖ్లెస్తకోవ్ — గోగొల్ రచించిన "ఇన్‌స్పెక్టర్-జనరల్" సుఖాంతనాటకంలోని పాత్ర — తణుకూ బెణుకూ లేని ప్రగల్భాల రాయుడూ, సిగ్గు బిడియాలు లేని అబద్ధాలకోరూ. పుట 176.

85 కాడెట్లు — 1905 అక్టోబరులో స్థాపించబడిన రష్యన్ లిబరల్-ఏకరాజాధిపత్యతత్వపు ప్రధాన బూర్జువావర్గపు పార్టీ సభ్యులు. ఏకరాజాధిపత్య వ్యవస్థను వీరు బలపర చారు. విప్లవాత్మక ఉద్యమానికి వ్యతిరేకమైన పోరాటమే తమ ప్రధాన కర్తవ్యమని వీరు భావించారు. జార్‌తోనూ, ఫ్యూడల్ భూస్వాములతోనూ సహా రాజ్యాంగ యంత్రాధికారంలో తమకు కూడ భాగం వుండాలని వీరు ప్రయత్నించారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో (1914–1918) జారిస్టు ప్రభుత్వంయొక్క జైత్ర యాత్ర వైదేశిక విధానిన్ని కాడెట్లు క్రియాశీలంగా బలపరచారు. 1917 ఫిబ్రవరి బూర్జువా-ప్రజాస్వామిక విప్లవ కాలంలో, ఏకరాజాధిపత్య రక్షణ తమ లక్ష్యంగా పెట్టుకున్నారు. బూర్జువా తాత్కాలిక ప్రభుత్వంలో వీరు ప్రజావ్యతిరేక, విప్లవ ప్రతీఘాత విధానాన్ని అవలంబించారు. అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం అనంత రం సోవియట్ అధికారానికి వీరు బద్ధశత్రువులుగా తయారై, విప్లవప్రతీఘాత సాయుధ చర్యలన్నిటిలోనూ, వ్యవధాతల దండయాత్రలల్లోనూ పాల్గొన్నారు. వ్యవధాతలూ వైట్‌గార్డ్‌లూ ఓడించబడిన తరువాత వీరు విదేశాలకు పారిపోయి, అక్కడనుండి తమ సోవియట్ వ్యతిరేక, విప్లవప్రతీఘాత క్రియాకలాపాన్ని సాగించారు. పుట 178.

86 "బెజ్జగ్లావ్‌త్సి" — 1905–1907 విప్లవం క్షీణదశను పొందుతూన్న కాలంలో బూర్జువా మేధావుల అర్ధ-కాడెట్, అర్ధ-మెన్‌షెవిక్ గ్రూపు. "బెజ్ జగ్లావియ" ["శీర్షికారహితం"] అనే ప్రొకొపొవిచ్ సంపాదకత్వంకింద 1906 జనవరి నుండి మే వరకు సెయింట్ పీటర్స్‌బర్గ్‌నుండి ప్రచురించబడిన రాజకీయ వారపత్రిక శీర్షిక నుండి ఈ గ్రూపు సభ్యులు తమ పేరు వ్యుత్పత్తిచేసుకున్నారు. తర్వాతి రోజుల్లో, "తొవారిశ్చ్" ["కామ్రేడ్"] అనే ఒక వామపక్షపు కాడెట్ దినపత్రిక ఈ గ్రూపుకు కేంద్రమైంది. పక్షాభిమానరహితులమని లాంఛనప్రాయంగా చెప్పుకుంటూ ఈ

ముసుగుతో వీరు బూర్జువా లిబరలిజాన్నీ అవకాశవాదాన్నీ సమర్థించి, రష్యాలోనూ విదేశాల్లోనూ వున్న సోషల్-డెమో(క్రాట్లలోని రివిజనిస్టులను బలపరిచారు. పుట 178.

87 కిషినెవ్ హత్యాకాండ — జారిస్టు రష్యాలో జరిగిన అత్యంత రక్తపాతమైన యూదువ్యతిరేక హత్యాకాండలలో ఒకటి. దీనిని 1903 ఏప్రిల్‌లో ఆంతరంగిక వ్యవహారాల మంత్రి వి.కె.ప్లేవె పురికొల్పాడు. ఈ హత్యాకాండ కాలంలో వందలాది ప్రజలు హత్యకావించబడ్డారు, వందలాది ప్రజలు క్షతగాత్రులయారు, వెయ్యికి పైగా కాపురపు ఇళ్లు దోపిడి పాలై నాశనమయాయి. సెద్లేత్జ్ నగరంలో యూదు వ్యతిరేక హత్యాకాండ 1906 ఆగస్టు చివరి రోజుల్లో జరిగింది. హత్యాకాండ జరుగుతూన్నప్పుడు నగరంమీద ఫిరంగి కాల్పులూ తుపాకి కాల్పులూ జరిగాయి; వందలాది ప్రజలు మరణించారు, వందలాది క్షతగాత్రులయారు. పుట 179.

88 "నోవొయె వ్రేమ్య" ["నూతన కాలం"] — 1868 నుండి 1917 వరకూ సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ప్రచురించబడిన దినపత్రిక; తన ప్రచురణ కర్తలనూ, తాను అనుసరించిన రాజకీయ పంథాలనూ ఇది తరుచు మార్చుతూండేది. మొదట్లో మితవాద లిబరల్‌గా వుండి, తరువాత 1876 లో ఇది అభివృద్ధి నిరోధక కులీనవంశస్థుల యొక్క, బ్యూరాక్రసీయొక్క పత్రికగా మారింది. 1905 లో ఇది నల్లదండు ముఠా పత్రిక అయింది. 1917 ఫిబ్రవరి బూర్జువా-ప్రజాస్వామ్య విప్లవం తరువాత, బూర్జువా తాత్కాలిక ప్రభుత్వంయొక్క విప్లవప్రతీఘాత విధానాన్ని ఈ పత్రిక పూర్తిగా బలపర్చి, బోల్షెవిక్‌లపై దాడిచేసింది. పెట్రోగ్రాడ్ సోవియట్ల విప్లవ మిలిటరీ కమిటీచే ఇది 1917 అక్టోబరు 26 (నవంబరు 8) న మూసి వేయబడింది. కిరాయి పత్రికకు స్వాభావికమైన ఉదాహరణ అని లెనిన్ ఈ పత్రికకు నామకరణం చేశాడు. పుట 181.

89 లాత్వియన్ సోషల్-డెమోక్రసీ కేంద్ర పత్రిక అయినట్టి «Zihna» ("పోరాటం") దినపత్రికకు ఇది వర్తిస్తూంది. ఈ పత్రిక 1904 మార్చిలో స్థాపించబడింది. 1940 లో ఇది లాత్వియన్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ, మరియు లాత్వియన్ రిపబ్లిక్ సుప్రీమ్ సోవియట్ యొక్క పత్రిక అయింది. పుట 181.

90 పోలిష్ సోషలిస్టు పార్టీ (Polska Partia Socjalistyczna) — 1892 లో స్థాపించబడినట్టి ఒక సంస్కరణతత్వపు జాతీయ పార్టీ. పుట 185.

91 ''మఫ్లర్ చుట్టుకున్న మనిషి'' – ఈ శీర్షికతో చేహొవ్ రాసిన కథలో ప్రధానపాత్ర; కొత్త పద్ధతులన్నా, చొరవ తీసుకోవడమన్నా భయపడిపోయేటట్టి సంకుచిత స్వభావపు అల్పబుద్ధి వ్యక్తిని ఈ పాత్ర ప్రదర్శిస్తుంది. పుట 197.

92 ఎరచేపలకున్న జ్ఞానతేజస్సు – పిరికిపంద అయిన అల్పబుద్ధిని ప్రదర్శించుతూ, రష్యన్ వ్యంగ్యరచయిత సల్తికోవ్-శ్చెద్రీన్ రాసిన ఒక కట్టుకథలోని ''జ్ఞానతేజస్వి ఎర చేప''కు ఇది వర్తిస్తూంది. పుట 197.

93 మార్క్స్ రచించిన ''ఫ్రాన్సులో అంతర్యుద్ధం'' అనే గ్రంథం గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు. పుట 198.

94 ''సొవ్రెమేన్నయ జీజ్న్'' [''సమకాలిక జీవితం''] – 1906 ఏప్రిల్ నుండి 1907 మార్చి వరకు మాస్కోలో ప్రచురించబడిన మెన్షెవిక్ ఆవర్తక్రమపత్రిక. పుట 201.

95 ''ఓత్క్లికి'' [''ప్రతిధ్వనులు''] – 1906, 1907 సంవత్సరాలలో సెంట్ పీటర్స్‌బర్గ్‌లో వెలువడిన మెన్షెవిక్ సంకలనములు. మూడు సంచికలు వెలువడ్డాయి; మొదటిది ''ఓత్క్లికి'' అనే శీర్షికతోనూ, కడమ రెండూ ''ఇజ్‌దాతెల్‌స్త్వో ఓత్క్లికి'' [''ప్రతిధ్వనుల ప్రచురణాలయం''] అనే శీర్షికతోనూ వెలువడ్డాయి. పుట 201.

96 చూ. 59 వ వివరణ. పుట 202.

97 ''కార్మిక కాంగ్రెస్'', ''విశాలమైన కార్మిక పార్టీ'' అనే భావాన్ని, 1905–1907 విప్లవం ఓటమి చెందిన తరువాత మెన్షెవిక్‌లలో తలెత్తిన ఒక అవకాశవాద ధోరణికి ప్రతినిధులైన లిక్విడేటర్లు ముందుకు తీసుకొచ్చారు. లిక్విడేటర్ల నాయకులలో లారిన్ ఒకడు.

కార్మికవర్గంయొక్క విప్లవాత్మక చట్టవిరుద్ధ పార్టీ లిక్విడేటు చేయబడాలని లిక్విడేటర్లు డిమాండుచేశారు (ఇందుచేతనే వారికీ మారుపేరు వచ్చింది). జారిజానికి వ్యతిరేకంగా విప్లవాత్మక పోరాటాన్ని వదలుకోవాల్సిందిగా కార్మికులను వీరు పురికొల్పారు, ఒక కార్యక్రమం లేనట్టి, సోషల్-డెమోక్రాట్లూ సోషలిస్టు-రివల్యూషనరీలూ, అరాజకవాదులూ అనే విచక్షణలేకుండా వీరందరకూ ప్రవేశం వుండేటట్టి ''కార్మిక కాంగ్రెస్'' అనే రూపంలో ఒక సార్వభౌమ సంస్థను కలిగినట్టి అవకాశవాద, విశాలమైన పెట్టీబూర్జువా కార్మికుల పార్టీని స్థాపించాలని వీరు కోరారు. లిక్విడేటర్ల అభిప్రాయం ప్రకారం, ఈ పార్టీ విప్లవాత్మక నినాదా

లను వదలుకుని, జారిస్టు ప్రభుత్వంచే అనుమతించబడిన క్రియాకలాంపంలో, శాసన పరిధులకే పరిమితమైన క్రియాకలాపంలోనే కేవలం పనిచెయ్యాల్సి వుంటుంది.

సోషల్-డెమోక్రాటిక్ లిబర్ పార్టీని లిక్విడేటుచేసేందుకూ, కార్మికవర్గ అగ్రగామిదళాన్ని పెట్టీబూర్జువా రాశిలో విలీనంచేసి వేసేందుకూ మెన్‌షెవిక్‌లు కావించుతూన్న యత్నాలయొక్క వినాశకర ఫలితాన్ని లెనిన్ ఎండగట్టాడు.

లిక్విడేషనిజానికి కార్మికులు తమ ఊతను అందివ్వలేదు. 1912 జనవరిలో జరిగిన ఆర్. ఎస్. డి. ఎల్. పి ప్రాగ్ కాన్ఫరెన్స్ లిక్విడేటర్లను పార్టీనుండి వెళ్లగొట్టింది. పుట 202.

98 పారిస్‌లో రెండు అంతర్జాతీయ సోషల్-డెమోక్రాటిక్ కాంగ్రెస్‌లు: రెండవ ఇంటర్నేషనల్‌యొక్క మొదటి కాంగ్రెస్, అదే సమయంలో ఫ్రెంచి పోసిబిలిస్టులూ సోషల్-డెమోక్రాటిక్ ఫెడరేషన్ ఆఫ్ ఇంగ్లండూ కలిసి సమావిష్టపరచిన కాంగ్రెస్. పుట 209.

99 ఎఫ్. కెల్లీ-విష్నెవేత్స్కయ పేర ఎఫ్. ఎంగెల్స్ రాసినట్టి 1888 మే 2 వ తేదీగల లేఖను లెనిన్ ఉల్లేఖించుతున్నాడు. పుట 210.

100 సోర్గె పేర ఎఫ్. ఎంగెల్స్ రాసినట్టి 1893 జనవరి 18 వ తేదీగల లేఖను లెనిన్ ఉల్లేఖించుతున్నాడు. పుట 211.

101 డెకాజ్‌విల్ సమ్మె – డెకాజ్‌విల్‌లో ప్రభుత్వ సైనికులచే 1886, జనవరిలో అణచివేయబడినట్టి ఫ్రెంచి గనికార్మికుల సమ్మె. సమ్మె అణచివేతలోనూ సమ్మెదార్లపై కక్షసాధించే చర్యలను సాగించడంలోనూ రాడికల్స్‌తో సహా బూర్జువా పార్లమెంటు ప్రతినిధులు ప్రభుత్వాన్ని బలపరచారు. ఫలితంగా పార్లమెంటులోని కార్మిక ప్రతినిధులు రాడికల్స్‌నుండి చీలిపోయి, కార్మిక ప్రతినిధుల స్వతంత్ర గ్రూపును ఏర్పరచుకున్నారు. పుట 215.

102 1877–1878 రష్యా-టర్కీ యుద్ధానికి ఇది వర్తిస్తూంది. పుట 217.

103 "మన అభిప్రాయభేదాలు" గురించిన్నీ, రష్యాలో సంభవింపనున్న విప్లవంయొక్క స్వభావం గురించిన్నీ వి. ఐ. జసూలిచ్ పేర ఎంగెల్స్ 1885 ఏప్రిల్ 23 న ఒక లేఖ రాశాడు. పుట 218.

104 ‘‘రైక్ [సామ్రాజ్య] రాజ్యాంగానికై జర్మన్ ప్రచారయుద్ధం’’ అనే వ్యాసపరంపరలో ‘‘రిపబ్లిక్ కోసం ప్రాణత్యాగం’’ అనే శీర్షికను గల్గిన వ్యాసమని లెనిన్ ఉద్దేశం. పుట 219.

105 అక్టోబ్రిస్టులు, లేక ‘‘అక్టోబరు పదిహేడు సంఘం’’ – 1905 నవంబరులో స్థాపించబడినట్టి, బడా పారిశ్రామిక బూర్జువావర్గ, బడా భూస్వాముల విప్లవ ప్రతీఘాత పార్టీ. విప్లవంచే బెదరగొట్టబడిన జార్ ప్రజలకు ‘‘పౌర స్వేచ్ఛల’’నూ, రాజ్యాంగాన్నీ వాగ్దానంచేస్తూ కావించిన అక్టోబరు 17 ప్రణాళికకు ఆడంబరంతో స్వాగతం చెబుతూనే అక్టోబ్రిస్టులు జార్ ప్రభుత్వపు ఆంతరంగిక, వైదేశిక విధానాన్ని నిర్నిబంధంగా బలపరిచారు. బడా పారిశ్రామికవేత్తలలో ఒకడైన గుచ్‌కోవ్, బ్రహ్మాండమైన జమీ ఎస్టేట్లకు అధిపతి అయిన రొద్‌జ్యాన్‌కొ అక్టోబ్రిస్టులకు నాయకులు. పుట 222.

106 1907 జూన్ 3 (16) తేదీ రాజ్యాంగంపై దెబ్బతీత – 1907 జూన్ 3 న రాజ్యాంగంపై జరిగిన అభివృద్ధి నిరోధకపు దెబ్బతీత; ఈ దెబ్బతీతలో ప్రభుత్వం రెండవ స్టేట్ దూమను రద్దుచేసి, దూమ ఎన్నికల చట్టాన్ని సవరించింది. భూస్వాములనుండీ, పారిశ్రామిక, వాణిజ్య బూర్జువావర్గంనుండీ ఎన్నుకొనబడే ప్రతినిధుల సంఖ్య అధికమయ్యే అవకాశం కొత్త చట్టంలో పొందుపరచబడింది. అదే సమయంలో ఆదివరకే తక్కువగా వున్న రైతు, కార్మిక ప్రతినిధుల సంఖ్య ఎన్నోరెట్లు కుంచించి వేయబడింది. ఆసియాఖండపు రష్యాలోని జనసంఖ్యలోని అధికభాగానికి ఈ కొత్త చట్టం ఎన్నిక హక్కు లేకుండాచేసి, పోలెండ్, కాకసస్ ప్రాతినిధ్యాన్ని సగానికి తగ్గించి వేసింది. కొత్త చట్టం ప్రకారం 1907 నవంబరులో ఎన్నుకోబడిన మూడవ స్టేట్ దూమలో అత్యధికసంఖ్యాకులు నల్లదండు ముఠాల ప్రతినిధులూ, కాడెట్ ప్రతినిధులూనూ.

స్తొలీపిన్ అభివృద్ధి నిరోధకం, లేక ‘‘మూడవ జూన్ వ్యవస్థ,’’ ప్రారంభానికి జూన్ 3 వ తేదీ రాజ్యాంగంపై దెబ్బతీత నాంది పలికింది. పుట 223.

107 మొల్చాలిన్‌తత్వము – ‘‘తెలివితేతటలు కడగండ్లకు దారితీస్తున్నాయి’’ అనే గ్రిబొయేదొవ్ నాటకంలో ఒక పాత్ర అయిన మొల్చాలిన్ నామంనుండి ఈ పదం వ్యుత్పత్తి – దాస్యభావానికీ, ఇచ్చకాలరాయిడి మనస్తత్వానికీ పర్యాయపదం. పుట 223.

108 చూ. ఎల్. కూగెలమన్ పేర కె. మార్క్స్ రాసినట్టి 1869 మార్చి 3 వ తేదీ లేఖ. పుట 226.

109 బలలైకిన్ — రష్యన్ రచయిత సల్తికోవ్-శ్చెద్రీన్ రచించిన "ఆధునిక ప్రశాంతజీవిత గాథ"లో ఒక పాత్ర, తన స్వార్థ ప్రయోజనాలనే అన్నిటికంటే ఉత్కృష్టంగా పెట్టుకున్నట్టి తణుకు బెణుకులేని వదరుబోతు, సాహసికుడు, అబద్ధాలరాయుడూనూ. పుట 228.

110 నవీన-కాంటియన్లు — జర్మనీలో పంధొమ్మిదవ శతాబ్ది మధ్యకాలంలో బూర్జువా తత్వశాస్త్రంలో రూపొందిన ఒక అభివృద్ధి నిరోధక ధోరణికి ప్రతినిధులు. కాంట్ తత్వశాస్త్రంలోని భౌతికవాద అంశాలను పక్కకు నెట్టివేసి, ఆ తత్వశాస్త్రంలో అత్యంత అభివృద్ధి నిరోధక భావశాస్త్రీయ అంశాలను వీరు పునః నెలకొల్పారు. "కాంట్ వైపు తిరిగి మరలుదాం" అనే నినాదం ఒక ముసుకుగా ఉపయోగించుకుని, కాంట్ భావవాద పునస్థాపనను వీరు ఉపదేశించి, గతితార్కిక, చారిత్రక భౌతికవాదానికి వ్యతిరేకంగా వీరు పోరాడారు. "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్, మరియు సాంప్రదాయక జర్మన్ తత్వశాస్త్రపు అంతము" అనే తన గ్రంథంలో ఎంగెల్స్ నవీన-కాంటియన్లను "అభివృద్ధి నిరోధక సిద్ధాంతకర్తలు," దౌర్భాగ్యపు వరణతత్వజ్ఞులు, పితలాటకపు మనుషులు" అని వర్ణించాడు.

జర్మన్ సోషల్-డెమొక్రాట్లలోని నవీన-కాంటియన్లు (ఇ. బెర్న్‌స్టయిన్, సి. ష్మిడ్ట్, తదితరులు) మార్క్సిస్టు తత్వశాస్త్రాన్నీ, ఆర్థిక సిద్ధాంతాన్నీ, వర్గ పోరాట శ్రామికవర్గ నియంతృత్వ సిద్ధాంతాన్నీ తిరుగదోడారు. నవీన-కాంటియనిజాన్ని రష్యాలో సమర్థించినవారు పి.బి.స్త్రూవె, ఎస్.ఎన్.బుల్గాకొవ్ తదితరులూనూ.

"నరోదిజంలోని ఆర్థిక విషయమూ, దీనిపై మిస్టర్ స్త్రూవె పుస్తకంలో విమర్శ (బూర్జువా సారస్వతంలో మార్క్సిజం ప్రతిబింబం)" (1895), "విమర్శనారహిత విమర్శ" (1900) అనే తన తొలి గ్రంథాల్లోనే లెనిన్ రష్యన్ గడ్డపై నవీన-కాంటియనిజాన్ని నాటిన "లీగల్ మార్క్సిస్టుల"కు వ్యతిరేకంగా ధ్వజమెత్తాడు. ఇ. బెర్న్‌స్టయిన్, సి.ష్మిడ్ట్‌ల నవీన-కాంటియనిజాన్ని "అభివృద్ధి నిరోధక బూర్జువావర్గపు అభివృద్ధి నిరోధక సిద్ధాంతం" అని జి.వి.ప్లెహానొవ్ వర్ణించుతూ రాసిన వ్యాసాలకు (ఈ వ్యాసాలు 1890 సంవత్సరాల అంతంలో విదేశాలలో ప్రచురించబడ్డాయి) లెనిన్ స్వాగతం చెప్పాడు. "భౌతికవాదమూ,

ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదమూ" అనే లెనిన్ గ్రంథంలో (1909) నవీన-కాంటియన్ తత్వశాస్త్రం విస్తృత విమర్శకు పాల్జేయబడింది. నవీన-కాంటి యన్ల స్వకీయగతాత్మక భావవాద తత్వశాస్త్రం ప్రకృతి సమాజాల శాస్త్రీయ గ్రహ ణకు శత్రువని లెనిన్ తన తత్వశాస్త్ర గ్రంథాలలో నిరూపించి, బూర్జువా భావ శాస్త్రంగా దాని వర్గ సారాన్ని బయటపెట్టాడు. వర్తమానకాలంలో, నవీన-కాంటి యన్ భావాలు మార్క్సిజం-లెనినిజంపై తాము సాగించే యుద్ధంలో సామ్రాజ్య వాద అభివృద్ధి నిరోధక తత్వశాస్త్రపు సమర్థకులచే ఉపయోగించబడుతున్నాయి. పుట 237.

111 చూ. కె. మార్క్స్, "పెట్టుబడి", 1 వ సంపుటి. (రెండవ కూర్పుకు మలి పలుకు). పుట 237.

112 దీని తర్వాత అనతికాలంలోనే లెనిన్ "భౌతికవాదమూ, ప్రత్యక్షానుభవయుత విమర్శన వాదమూ" అనే గ్రంథాన్ని రచించాడు (ప్రచురణ: మే 1909). ఈ గ్రంథంలో లెనిన్ బొగ్దానొవ్, తదితర రివిజనిస్టులనూ, వీరి తాత్విక గురువులు అవెనారియస్, మాఖ్‌లనూ వినాశకరమగు విమర్శకు గురిచేశాడు. లెనిన్ గ్రంథం మార్క్సిజం సైద్ధాంతిక ప్రాతిపదికలకు ఒక సమర్థన, ఎంగెల్స్ మరణంనుండి లెనిన్ గ్రంథం వెలువడినంతవరకూ గడచిన కాలంలో విజ్ఞానశాస్త్రమూ, ప్రత్యేకంగా ప్రకృతి శాస్త్రమూ సాధించిన విజయాలకు ఒక భౌతికవాద సూత్రీకరణ. పుట 238.

113 "విప్లవాత్మక సిండికలిజం" — పంథొమ్మిదవ శతాబ్ది అంత్యమందు అనేక పాశ్చాత్య యూరపియన్ దేశాల కార్మికవర్గ ఉద్యమంలో తలెత్తిన ఒక పెట్టీబూర్జువా, అర్ధ-అరాజకవాద ధోరణి.

కార్మికవర్గపు రాజకీయ పార్టీయొక్క ఆవశ్యకతనూ, పార్టీయొక్కా శ్రామిక వర్గ నియంతృత్వంయొక్కా అగ్రగామి పాత్రనూ సిండికలిస్టులు నిరాకరించారు. పెట్టుబడిదారీ విధానాన్ని ట్రేడ్‌యూనియన్లు ("సిండికేట్లు") కూలదోసి, కార్మికుల సాధారణ సమ్మె జరపడం ద్వారానూ విప్లవానికి దిగకుండానూ ఉత్పత్తి నిర్వహణను హస్తగతం చేసుకోవడానికి వాటికి వీలవుతుందని వీరు సమర్థించారు. "అనేక దేశాలలో విప్లవాత్మక సిండికలిజం అవకాశవాదంయొక్క, రిఫార్మిజంయొక్క, పార్లమెంటరీ జడ్డితనంయొక్క తక్షణ, అనివార్య ఫలితము" అని లెనిన్ చూపె ట్టాడు. (V. I. Lenin, Preface to Voinov's (A. V. Lunacharsky) pamphlet. "*Attitude of the Party to Trade Unions.*" [వోయినొవ్ (ఎ.వి.

లునచార్‌స్కి) రాసిన "ట్రేడ్ యూనియన్ల పట్ల పార్టీ వైఖరి" అనే పాంఫ్లెట్‌కు వి.ఐ. లెనిన్ రాసిన పీఠిక] (*Collected Works*, Vol. 13.) పుట 243.

114 చూ. ఎఫ్. ఎంగెల్స్, "ఊహాజగత్తునుండి విజ్ఞాన శాస్త్రంగా సోషలిజం అభివృద్ధి" ఇంగ్లీషు కూర్పుకు ఉపోద్ఘాతం. [*"Socialism: Utopian and Scientific,"* Introduction to the English edition.] పుట 247.

115 ఎఫ్. ఎంగెల్స్ రచించిన ఈ కింది గ్రంథాలను గురించి లెనిన్ ప్రస్తావిస్తున్నాడు: "డ్యూరింగ్ సిద్ధాంత ఖండన" (1878), "లుడ్విగ్ ఫాయెర్‌బాఖ్, మరియు సాంప్రదాయ జర్మన్ తత్వశాస్త్రపు అంతము," "ఊహాజగత్తునుండి విజ్ఞాన శాస్త్రంగా సోషలిజం అభివృద్ధి" 1892 ఇంగ్లీషు కూర్పుకు ఉపోద్ఘాతం. పుట 248.

116 సినోద్ — రష్యన్ ఆర్తడాక్స్ చర్చ్ (రష్యాలో వుండిన ప్రమాణిక చర్చ్)యొక్క ప్రధానాంగం (1721–1917) పుట 259.

117 కె. మార్క్స్ రాసిన "ఫ్రాన్సులో అంతర్యుద్ధం" అనే పాంఫ్లెట్‌కు ఎఫ్. ఎంగెల్స్ రాసిన ఉపోద్ఘాతానికి ఇది వర్తిస్తూంది. పుట 261.

118 దైవనిర్మితం — మార్క్సిజంపై శత్రుత్వం వహించిన ఒక మతతాత్విక ధోరణి; 1905 – 1907 విప్లవం ఓటమిచెందిన తర్వాత స్తొలీపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో మార్క్సిజంతో తెగతెంపులు చేసుకున్న పార్టీ మేధావుల ఒక విభాగంలో ఈ ధోరణి పొడచూపింది.

ఈ "దైవనిర్మితం" వ్యక్తులు (లునచార్‌స్కి, బజారొవ్, వగైరాలు) ఒక కొత్త, "సోషలిస్టు" మతాన్ని బోధించారు, మతంతో మార్క్సిజానికి పొత్తుకుదిర్చేందుకు ప్రయత్నించారు. ఒకప్పుడు మక్సీమ్ గోర్కి "దైవనిర్మితం" వ్యక్తులను అనుసరించాడు. "ప్రొలెతారియ్" పత్రికయొక్క విస్తృతీకరించబడిన సంపాదకవర్గ సభ (1909) ఈ "దైవనిర్మిత" ధోరణిని ఖండించి, "శాస్త్రీయ సోషలిజానికి ఈ విధంగా వక్రభాష్యాలు చెప్పడము"ను తిరస్కరించుతూందని ఒక ప్రత్యేక తీర్మానంలో ఉద్ఘాటించింది.

తన "భౌతికవాదమూ, ప్రత్యక్షానుభవయుత విమర్శనవాదమూ" గ్రంథంలోనూ, 1908 ఫిబ్రవరి-ఏప్రిల్ నెలలలోనూ, 1913 నవంబరు-డిసెంబరు నెలలలోనూ తాను గోర్కి పేర రాసిన లేఖలలోనూ "దైవనిర్మిత" ధోరణియొక్క అభివృద్ధి నిరోధక స్వభావాన్ని లెనిన్ బైటబెట్టాడు. పుట 267.

119 ''వేహి'' [''ప్రధాన శకములు''] – 1909 వసంతంలో మాస్కోలో ప్రచురించబడిన విప్లవప్రతీఘాత లిబరల్ బూర్జువావర్గ ప్రతినిధులు ఎన్. బెర్ద్యాయెవ్, ఎస్. బుల్గాకొవ్, పి. స్త్రూవె, ఎమ్. గెర్షెన్‌జోన్, తదితరులచే రచించబడిన కాడెట్ వ్యాస సంకలనం. రష్యన్ మేధావిస్తరాన్ని గురించి రాసిన వ్యాసాలలో ఈ ''వేహి'' రచయితలు వి.జి. బెలిన్‌స్కి, ఎన్.జి. చెర్నిషేవ్‌స్కితో సహా రష్యన్ ప్రజల అత్యుత్తమ ప్రతినిధుల విప్లవాత్మక-ప్రజాస్వామిక సంప్రదాయాలను అప్రతిష్ఠపాల్జేసి, 1905 విప్లవోద్యమాన్ని తిట్టిపోసి, బూర్జువావర్గాన్ని ''ప్రజల దురాగ్రహం'' నుండి జార్‌ప్రభుత్వం తన ''సన్నీలతోనూ, జైళ్లతోనూ'' రక్షించినందుకు జార్ ప్రభుత్వాన్ని అభినందించారు. నిరంకుశ పరిపాలనకు సేవచేయవలసిందని మేధావి స్తరానికి ఈ రచయితలు విజ్ఞప్తిచేశారు. పుట 268.

120 ''యువకులు'' – జర్మన్ సోషల్-డెమోక్రాట్లమధ్య 1890 లో తలెత్తిన ఒక పెట్టీ బూర్జువా, అర్ధ-అరాజక ప్రతిపక్ష గ్రూపు. ఈ గ్రూపులో ప్రధానంగా యువ రచయితలు, విశ్వవిద్యాలయ విద్యార్థులూ వుండేవారు (ఇందువల్లనే ఈ గ్రూపుకు ఈ పేరు వచ్చింది). పార్టీ సిద్ధాంతకర్తల, నాయకుల పాత్ర తమకే చెందుతుందని వీరు వాదించారు. సోషలిస్టు వ్యతిరేక చట్టం (1878–1890) అంతమొందించబడిన తర్వాత పార్టీ క్రియాకలాపంలో వచ్చిన నూతన పరిస్థితులను వీరు అర్థంచేసుకోలేక, పోరాటంయొక్క చట్టబద్ధమైన రూపాల ఉపయోగాన్ని వీరు తిరస్కరించి, పెట్టీబూర్జువావర్గపు ప్రయోజనాలను కాపాడుతూందనే నేరాన్నీ, అవకాశవాదాన్ని అనుసరించుతూందనే నిందనూ పార్టీపై మోపారు. ''యువకుల'' ప్రతికూలతను ఎఫ్. ఎంగెల్స్ బహిరంగంగా ఖండించాడు.

1891 అక్టోబరులో జర్మన్ సోషల్-డెమోక్రాట్ల ఏర్‌ఫుర్ట్ కాంగ్రెస్ ఈ గ్రూపు నాయకులలో కొందరు పార్టీనుండి వెళ్లగొట్టింది. పుట 276.

121 ''జూబ్రి'' (రష్యను భాషలో ''జూబ్రి'' అనగా అడవిమృగాలు) – భూస్వాముల అభివృద్ధినిరోధకంయొక్క అతివాద కుడి పక్షపు ప్రతినిధులకు రష్యన్ రాజకీయ సారస్వతంలో ప్రయోగించబడిన వ్యంగ్యనామం. పుట 281.

122 ఒత్జొవిజం (వెనక్కి పిలుచుట అనే అర్థంగల ''ఒతొజ్వాత్'' అనే రష్యన్ మాటనుండి వ్యుత్పత్తి) – 1905–1907 విప్లవం ఓటమిచెందిన తర్వాత బోల్‌షెవిక్‌ల లోని ఒక విభాగంలో (బొగ్దానొవ్, అలెక్సిన్‌స్కి, లునచార్‌స్కి, వగైరాలు) తలెత్తిన అవకాశవాద ధోరణి. చట్టబద్ధమైన కార్యకలాప రూపాన్ని ఉపయోగించడానికి

ఒత్జొవీస్తులు వ్యతిరేకించి, స్టేట్ దూమనుండి సోషల్-డెమొక్రాట్ సభ్యులను వెనక్కి పిలిపించేయాల్సిందనీ, ట్రేడ్ యూనియన్లలోనూ, చట్టబద్ధమైన తదితర రాశి ఆర్గనైజేషన్లలోనూ కార్యకలాపాన్ని నిలిపివేయాల్సిందనీ వీరు డిమాండు చేశారు. పుట 283.

123 ''పర్వతమూ,'' ''జిరోండూ'' — పద్దెనిమిదవ శతాబ్ది చరమంలో జరిగిన ఫ్రెంచి బూర్జువా విప్లవకాలంలో బూర్జువావర్గంలోని రెండు రాజకీయ గ్రూపులు. ఆ కాలపు విప్లవాత్మక వర్గమైనట్టి బూర్జువావర్గంయొక్క మరింతగా నిష్కర్షయైన ప్రతినిధులకు ''పార్వతేయులు'' (మోంటనార్డ్లు), లేక ''జాకొబిన్లూ'' అనే పేరు వచ్చింది; నిరంకుశత్వమూ, ఫ్యూడల్ వ్యవస్థలు అంతమొందించబడాలని వీరు కోరారు. వీరితో విభేదించిన ''జిరోండిస్టులు'' విప్లవానికీ విప్లవప్రతీఘాతానికీ మధ్య ఊగిసలాడుతూ, ఏకరాజాధిపత్యంతో రాజీ విధానాన్ని అనుసరించారు.

సోషల్-డెమొక్రాటిక్ ఉద్యమంలోని అవకాశవాద ధోరణికి ''సోషలిస్టు జిరోండ్'' అనే పదాన్నీ, విప్లవాత్మక సోషల్-డెమొక్రాట్లకు ''పర్వతం'' లేక శ్రామికవర్గపు జాకొబిన్లు అనే పదాన్నీ లెనిన్ అన్వయించాడు. పుట 286.

124 జెమ్స్కి అధికారి — జారిస్టు రష్యాలో స్థానిక భూస్వామి-కులీనవంశస్థులనుండి నియమితులైన గ్రామీణ అధికారులు. వీరికి రైతులపై పరిపాలనా, న్యాయశాఖలకు సంబంధించిన అధికారాలూ వుండేవి. పుట 287.

125 లిక్విడేటర్లు — చూ: 97 వ వివరణ.

126 కె. మార్క్సును గురించి విల్హెల్మ్ లీబ్క్నెఖ్ట్ స్మృతులను లెనిన్ ప్రస్తావిస్తున్నాడు. పుట 300.

127 చూ. కె. మార్క్స్ "Konfidentielle Mitteilung" [''రహస్య వర్తమానం.''] పుట 321.

128 చూ. కె. మార్క్స్, ఎఫ్. ఎంగెల్స్, '' 'Neue Rheinische Zeitung' వ్యాసాలు.'' లెనిన్ ఇచ్చిన ఉల్లేఖన ఎఫ్. ఎంగెల్స్ రచించిన "Der Prager Aufstand" [''ప్రాగ్ తిరుగుబాటు''] వ్యాసంనుండి ఉటంకించబడింది. పుట 322.

129 చూ. ఎఫ్. ఎంగెల్స్ పేర 1867 నవంబరు 2 వ తేదీన మార్క్స్ రాసిన లేఖ. పుట 322.

130 చూ. ఎఫ్. ఎంగెల్స్, "Der demokratische Panslawismus" ["ప్రజాస్వామిక పాన్ స్లావిజం"]. పుట 324.

131 త్సిమ్మెర్‌వాల్డ్ వామపక్షపు గ్రూప్ – 1915 సెప్టెంబరు తొలి రోజుల్లో స్విట్జర్లెండ్‌లోని త్సిమ్మెర్‌వాల్డ్ గ్రామంలో సమావేశమైన మొదటి అంతర్జాతీయ సోషలిస్టుల కాన్ఫరెన్స్ లెనిన్‌చే ఏర్పాటుచేయబడింది. యుద్ధానికి వ్యతిరేకమైన అంతర్జాతీయ ఉద్యమం అభివృద్ధిలో "మొదటి అడుగు" అని ఈ కాన్ఫరెన్స్‌ను లెనిన్ అభివర్ణించాడు. లెనిన్ నాయకత్వంకింద వుండిన బోల్‌షెవిక్‌లు ఒక్కరే త్సిమ్మెర్‌వాల్డ్ వామపక్షపు గ్రూప్‌లో సరైనట్టీ, పూర్తిగా సుసంగతమైనట్టీ స్థానాన్ని తీసుకున్నారు. పుట 331.

132 చూ. కె. మార్క్స్, "లూయీ బోనపార్ట్‌యొక్క పద్దెనిమిదవ బ్రూమేర్" గ్రంథం రెండవ కూర్పుకు ఉపోద్ఘాతం. పుట 337.

133 ఆర్గనైజింగ్ కమిటీ – మెన్‌షెవిక్ లిక్విడేటర్లచేతనూ, అన్ని పార్టీ వ్యతిరేక గ్రూపులూ ధోరణుల ప్రతినిధులచేతనూ జరుపబడినట్టి ఆగస్టు కాన్ఫరెన్స్‌చే 1912 లో స్థాపించబడిన మెన్‌షెవిక్‌ల సారథ్యకేంద్రం. పుట 338.

134 యుద్ధ పరిశ్రమ కమిటీలు రష్యాలో సామ్రాజ్యవాద బడా బూర్జువావర్గంచే 1915 లో స్థాపించబడ్డాయి. కార్మికులపై ప్రభావం ప్రసరింపజేయడానికీ, మాతృదేశపు రక్షణభావాన్ని వారిలో పెంపొందించడానికీ బూర్జువావర్గం ఈ కమిటీలకింద ప్రత్యేకపు "కార్మికుల గ్రూపుల"ను ఏర్పాటుచేసింది. యుద్ధసామగ్రిని ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలలో ఉత్పాదకశీలశక్తిని మరింతగా హెచ్చుచేసేందుకు కార్మికులలో ఆందోళన సాగించగల కార్మికుల ప్రతినిధులను ఈ కమిటీలలోకి తీసుకోవాలని బూర్జువావర్గం అభిలషించింది. బూర్జువావర్గంచే ప్రతిపాదించబడిన ఈ బూటకపు దేశభక్తియుత సంస్థలలో మెన్‌షెవిక్‌లు క్రియాశీలమైన పాత్రను తీసుకున్నారు. కార్మికులలోని అధికసంఖ్యాకవర్గపు సహాయంతో బోల్‌షెవిక్‌లు యుద్ధ పరిశ్రమ కమిటీలను విజయవంతంగా బోయ్‌కాట్ చేశారు. పుట 347.

135 ఛెయీద్‌జె గ్రూప్ – నాల్గవ దూమలో ఎన్.ఎస్. ఛెయీద్‌జె నాయకత్వం వహించిన మెన్‌షెవిక్ గ్రూప్. మొదటి ప్రపంచ యుద్ధంలో (1914–1918) దూమలోని మెన్‌షెవిక్ గ్రూప్ మధ్యస్థ స్థానం తీసుకుని, రష్యన్ సోషల్-జాతీయ దురహంకారుల విధానానికి పూర్తిగా అండదండలను ఇచ్చింది. పుట 350.

136 "నాషె దేలొ" ("మన కార్యం") — మెన్‌షెవిక్ మాసపత్రిక; 1914 లో నిలిపివేయ బడినట్టి, రష్యాలోని లిక్విడేటర్ల, సోషల్-జాతీయ దురహంకారుల ప్రధాన వాణి; "నాష జార్య" ("మన ఉషారాగం") స్థానే ఇది 1915 లో పెట్రోగ్రాడ్‌నుండి వెలువడింది.

"గోలొస్ త్రుదా" ("శ్రమ వాణి") — చట బద్ధమైన ఒక మెన్‌షెవిక్ వార్తా పత్రిక; "నాష్ గోలొస్" ("మన వాణి") నిలిపివేయబడిన తరువాత ఇది 1916 లో సమారనుండి వెలువడింది. మూడు ప్రతులు వెలువడ్డాయి. పుట 350–351.

137 "Jugend Internationale" ("యువజన ఇంటర్నేషనల్") — త్సిమ్మర్‌వాల్డ్ వామ పక్షపు గ్రూప్‌ను అనుసరించినట్టి సోషలిస్టు యువజన ఆర్గనైజేషన్ల పత్రిక; 1915 సెప్టెంబరునుండి 1918 మేవరకు జ్యూరిచ్‌నుండి వెలువడింది. పుట 354.

138 "ఇంటర్నాత్సియొనాలె" గ్రూప్ (తదుపరి "స్పార్టకుస్" సంఘం) మొదటి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధం (1914–1918) ప్రజ్వరిల్లినప్పుడు జర్మన్ వామ పక్షపు సోషల్-డెమోక్రాట్లు కె. లీబ్‌క్నెఖ్ట్, ఆర్. లుక్సెంబుర్గ్, ఎఫ్. మేరింగ్, కె. త్సేత్కిన్ తదితరులచే స్థాపించబడింది. 1916 జనవరిలో జరిగిన జర్మన్ వామపక్షపు సోషల్-డెమోక్రాట్ల అఖిలజర్మన్ కాన్ఫరెన్స్‌లో అంతర్జాతీయ సోషల్-డెమోక్రాటిక్ ఉద్యమంయొక్క కర్తవ్యాలపై ఆర్. లుక్సెంబుర్గ్‌చే సంకలనం చేయబడి ప్రతిపాదించబడిన సంగ్రహ సూత్రీకరణలను గ్రూపు ఆమోదించింది. "ఇంటర్నాత్సి యొనాలె" గ్రూప్ ప్రజారాసుల మధ్య విప్లవాత్మక యుద్ధవ్యతిరేక ప్రచారాన్ని సాగించి, జర్మన్ సామ్రాజ్యవాదంయొక్క బందిపోటు విధానాన్నీ, సోషల్-డెమోక్రాటిక్ నాయకుల ద్రోహాన్నీ బట్టబయలు చేసింది. కాని సిద్ధాంతానికీ ఎత్తుగడలకీ సంబంధించిన ప్రధాన సమస్యలపై ఈ గ్రూపు ఘోరమైన తప్పులనుండి బయటపడలేక పోయింది. మార్క్సిస్టు భాష్యానికి అనుగుణ్యమైన జాతులకుగల స్వయంనిర్ణయ హక్కు సూత్రాన్ని (అనగా, విడివడిపోవడమూ, స్వతంత్ర రాజ్యాలుగా రూపొంద డమూ వరకున్నూ వీటితో కలిపిన్నీ స్వయంనిర్ణయం) వీరు నిరాకరించారు; సామ్రాజ్య వాద శకంలో జాతీయ విముక్తి యుద్ధాలు సాధ్యం కావన్నారు; విప్లవాత్మక పార్టీ పాత్రను తక్కువ అంచనా కట్టారు; ఉద్యమంయొక్క అయత్నకృతానికి అత్యధిక మైన విలువను ఇచ్చారు.

ఈ గ్రూపు తప్పులను లెనిన్ తాను రచించిన "యూనియుస్ పాంఫ్లెట్", "శ్రామికవర్గ విప్లవంయొక్క యుద్ధ కార్యక్రమం" అనే పాంఫ్లెట్లలో విమర్శిం

చాడు. 1917 లో "ఇంటర్నాత్సియొనాలె" గ్రూప్ తన ఆర్గనైజేషనల్ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటూనే మధ్యస్థ స్థానాన్ని తీసుకున్న జర్మన్ స్వతంత్ర సోషల్-డెమోక్రాటిక్ పార్టీతో చేరింది. జర్మనీలో 1918 నవంబరు విప్లవం తర్వాత ఈ గ్రూపు స్వతంత్ర పార్టీతో తెగతెంపులు చేసుకుని, ఆదే సంవత్సరం డిసెంబరులో జర్మన్ కమ్యూనిస్టు పార్టీని స్థాపించింది. పుట 355.

139 చూ. ఎఫ్. ఎంగెల్స్,"Internationales aus dem 'Volksstaat'(1871–1875)" ["'ఫోల్క్స్‌స్టాట్' [ప్రజారాజ్యం] పత్రికనుండి అంతర్జాతీయాలు (1871–1875")] సంకలనానికి పీఠిక." పుట 359.

140 చూ. సోర్గె పేర 1886 నవంబరు 29 వ తేదీ ఎఫ్. ఎంగెల్స్ లేఖ. పుట 364.

141 గ్యోతే రచించిన "ఫౌస్ట్" నుండి మెఫిస్టొఫెలెస్ వచనాలను (I వ భాగం, 4 వ రంగం, "ఫౌస్ట్ పఠనమందిరం") లెనిన్ ఉటంకించుతున్నాడు. పుట 367.

142 "ఘనతవహించిన రాజుగారి ప్రతిపక్షం" 1909 జూన్ 19 (జూలై 2) న లార్డ్ మేయర్ ఆఫ్ లండన్ ఇచ్చిన లంచన్ విందులో కాడెట్ నాయకుడు పి. ఎన్. మిలుకోవ్ ఉపయోగించిన పదబంధం. ఈ విందులో ఆతడు ఇలా అన్నాడు: "బడ్జెట్‌ను అదుపులో పెట్టుతూ శాసననిర్మాణ సభ రష్యాలో మనుతూన్నంత కాలమూ రష్యన్ ప్రతిపక్షం ఘనతవహించిన రాజుగారి ప్రతిపక్షంగానే వుంటుందిగాని, ఘనతవహించిన రాజుగారికి ప్రతిపక్షంగా మాత్రం వుండదు" ("రెచ్", నెం. 167, జూన్ 21 (జూలై 4) 1909). పుట 370.

143 "జార్ వుండకూడదు, కార్మికుల ప్రభుత్వం వుండాలి" – తొలిసారిగా 1905 లో పార్వుస్‌చే ముందుకు తీసుకురాబడిన బోల్‌షెవిక్‌వ్యతిరేక నినాదం. శాశ్వత విప్లవం, రైతాంగంలేని విప్లవం, అనే ట్రాట్‌స్కీ "సిద్ధాంతం"యొక్క ప్రాతిపదిక సూత్రాలలో ఒకటి ఈ నినాదం. ప్రజల ఉద్యమంలో శ్రామికవర్గం చోదకపాత్రను తీసుకోవడంతో సోషలిస్టు విప్లవంలోకి ప్రవృద్ధి చెందుతూన్న బూర్జువా-డెమోక్రాటిక్ విప్లవం అనే లెనిన్ సిద్ధాంతానికి ప్రతిగా ఈ నినాదం ప్రతిపాదించబడింది. పుట 370.

144 చూ. కె. మార్క్స్, "ఫ్రాన్సులో అంతర్యుద్ధం. ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ ఎసోసియేషన్ జనరల్ కౌన్సిల్ ప్రసంగం," మరియు, ఈ రచనకు ఎఫ్. ఎంగెల్స్ రాసిన పీఠిక. పుట 370.

145 జి. వి. ప్లెహానొవ్ రచించినట్టి, 1894 లో బెర్లిన్‌లో జర్మన్ భాషలో తొలిసారి ప్రచురించబడినట్టి "అరాజకవాదమూ, సోషలిజమూ" అనే రచన గురించి లెనిన్ ప్రస్తావించుతున్నాడు. పుట 372.

146 చూ. కె. మార్క్స్, "ఫ్రాన్సులో అంతర్యుద్ధం." పుట 381.

147 షైలాక్ – షేక్స్పియర్ రచించిన "వెనిస్ వర్తకుడు" అనే సుఖాంత నాటకంలో ధనికుడైన యూదుని పాత్ర. పుట 390.

148 రష్యన్ రచయిత – ఎన్. జి. పొమ్యలోవ్‌స్కి రచించిన "మతపాఠశాలా రేఖాచిత్రాలు" అనే నవలలో మతపాఠశాలా విద్యార్థుల జీవితం వర్ణించబడింది. పుట 399.

149 పెట్రోగ్రాడ్, మాస్కోలకు ఇది వర్తించుతూంది. పుట 399.

150 కొర్నీలొవ్ ఉదంతం – 1917 ఆగస్టులో సర్వసేనాధిపతి జనరల్ కొర్నీలొవ్ నాయకత్వాన జరిగినట్టి బూర్జువావర్గమూ భూస్వాముల విప్లవప్రతిఘాత తిరుగుబాటుకు ఇది వర్తిస్తూంది. తిరుగుబాటుదార్లు, పెట్రోగ్రాడ్‌ను స్వాధీనం చేసుకోవడమూ, బోల్‌షెవిక్ పార్టీని నాశనం చేయడమూ, సోవియట్లను రద్దుచేయడమూ, మిలిటరీ నియంతృత్వాన్ని దేశంలో నెలకొల్పడమూ, ఏకరాజాధిపత్యాన్ని పునరుద్ధరించడమూ తమ లక్ష్యంగా పెట్టుకున్నారు.

బోల్‌షెవిక్‌ల పార్టీచే నడిపించబడినట్టి కార్మికులూ కర్షకులచే కొర్నీలొవ్ తిరుగుబాటు అణచివేయబడింది. ప్రజారాశి ఒత్తిడికింద తాత్కాలిక ప్రభుత్వానికి కొర్నీలొవ్‌నీ అతని కుమ్మకుదార్లనూ ఆరెస్టు చేసి, వారిని విచారణకు నిలబెట్టవలసినదిగా ఆజ్ఞ మంజూరు చేయక తప్పిందికాదు. విప్లవాన్ని నాశనం చేసివేయడానికి బూర్జువావర్గమూ భూస్వాములూ చేసిన యత్నం విఫలమైపోయింది. కొర్నీలొవ్ తిరుగుబాటు అణచివేయబడిన తర్వాత, బోల్‌షెవిక్ పార్టీ పలుకుబడి ప్రజారాసులలో పెరగజొచ్చింది. సోవియట్ల బోల్‌షెవికీకరణ కాలావధి దేశమంతటా ప్రారంభమైంది. పుట 399.

151 అఖిల రష్యా డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్ రాజ్యాంగయంత్ర అధికారం అనే ప్రశ్నను చర్చించేందుకై మెన్‌షెవిక్‌లచేతనూ సోషలిస్టు-రివల్యూషనరీలచేతనూ సమావిష పరచబడిన ఈ కాన్ఫరెన్స్ 1917 సెప్టెంబరు 14 నుండి సెప్టెంబరు 22 (సెప్టెంబరు 27 – అక్టోబరు 5) వరకు పెట్రోగ్రాడ్‌లో జరిగింది. ఈ కాన్ఫరెన్స్‌కు

1500 డెలిగేట్లు హాజరయారు. కార్మిక, రైతులనుండి ప్రతినిధుల సంఖ్యను తగ్గించేందుకూ, వివిధ పెట్టీబూర్జువా, బూర్జువా ఆర్గనైజేషన్లనుండి ప్రతినిధుల సంఖ్యను హెచ్చించి, తద్వారా తమకు అధికసంఖ్యాకవర్గం లభించేందుకు మెన్‌షెవిక్‌ల, సోషలిస్టు-రివల్యూషనరీల నాయకులు సర్వవిధాలా ప్రయత్నించారు. కాన్ఫరెన్స్ సమావేశకర్తలు ప్రవర్ధమానమవుతూన్న విప్లవంనుండి ప్రజల దృష్టిని మళ్లించేందుకు అభిలషించారు.

మెన్‌షెవిక్‌లనూ సోషలిస్టు-రివల్యూషనరీలనూ బట్టబయలుచేసేందుకుగాను కాన్ఫరెన్స్‌ను ఒక వేదికగా ఉపయోగించుకునే లక్ష్యంతో బోల్‌షెవిక్‌లు కాన్ఫరెన్స్‌లో పాల్గొన్నారు.

ప్రాథమిక పార్లమెంటును (రిపబ్లిక్ తాత్కాలిక కౌన్సిల్) ఏర్పాటుచేసేందుకు డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్ సెప్టెంబరు 19 (అక్టోబరు 1) న నిశ్చయించింది. రష్యాలో పార్లమెంటరీ వ్యవస్థ స్థాపించబడిందనే నమ్మకం కల్గించేందుకు చేసిన ప్రయత్నం ఇదంతానూ. తాత్కాలిక ప్రభుత్వం అనుమతించిన శాసనం ప్రకారం, ప్రాథమిక పార్లమెంటు ప్రభుత్వంయొక్క సమాలోచన సంస్థగా ఉద్దేశించబడింది. ఈ ప్రాథమిక పార్లమెంటులో పాల్గొన్నట్టయితే విప్లవంయొక్క కర్తవ్యాలను ఈ సంస్థ నెరవేర్చగల్గుతుందనే భ్రాంతి వ్యాపించుతుంది కాబట్టి, ఈ ప్రాథమిక పార్లమెంటును బోయ్‌కాట్ చేయాల్సిందని లెనిన్ నిశ్చయంగా ఉద్ఘాటించాడు. లెనిన్ చేసిన ప్రతిపాదనను పార్టీ సెంట్రల్ కమిటీ చర్చించి, ప్రాథమిక పార్ల మెంటులో పాల్గొనడమును సమర్థించిన కామెనెవ్ తదితర లొంగుబాటుదార్ల వ్యతిరేకతను అధిగమించిన తర్వాత, ప్రాథమిక పార్లమెంటునుండి బోల్‌షెవిక్ ప్రతినిధులను వెనక్కి పిలిపించేందుకు నిశ్చయించింది.

అక్టోబరు 7 (20) న, ప్రాథమిక పార్లమెంటు ఆవిష్కరించబడిన రోజున, బోల్‌షెవిక్ ప్రతినిధులు తాము తీసుకున్న స్థానాన్ని వివరించుతూ ఒక ప్రకటనను చదివి, ప్రాథమిక పార్లమెంటునుండి బైటకు వచ్చేశారు. పుట 401.

152 అలెగ్జాంద్రిన్‌స్కి నాటకశాల — ఈ నాటకశాలలో జరిగింది డెమోక్రాటిక్ కాన్ఫరెన్స్.

పీత్రొపావ్‌లొవ్‌స్క్ కోటను — పీటర్ అండ్ పాల్ దుర్గం — వింటర్ పాలెస్‌కు ఎదురుగా నెవా అవతలి గట్టున వుంది. జారిస్టు రోజులలో రాజకీయ ఖైదీలను ఇక్కడ నిర్బంధంలో వుంచేవారు. ఈ దుర్గంలో పెద్ద ఆయుధ సామగ్రి గిడ్డంగి వుండేది, పెట్రోగ్రాడ్‌లో ఇది ఒక ప్రధాన వ్యూహకేంద్రంగా ఏర్పడింది. పుట 404.

153 మిలిటరీ కెడెట్లు — జారిస్టు రష్యాలో సైనిక ఆఫీసర్లను తర్ఫీదుచేసే మిలిటరీ పాఠశాల సభ్యులు. పుట 404.

154 "ఆటవిక డివిజన్" — మొదటి ప్రపంచయుద్ధ కాలంలో (1914–1918) ఉత్తర కకేష్యా ప్రాంతపు పర్వత ప్రజలనుండి రిక్రూట్ చేయబడిన స్వచ్ఛంద సైనికులతో ఏర్పడిన సైనిక డివిజన్. విప్లవ పెట్రోగ్రాడ్పై తాను నడిపించిన సైనిక బలగాలలోని ఒక షాక్ యూనిట్గా ఈ ఆటవిక డివిజన్ను ఉపయోగించేందుకు జనరల్ కొర్నిలొవ్ ప్రయత్నించాడు. పుట 404.

155 వెండే — ఫ్రాన్సులో ఒక ప్రాంతం, పద్ధెనిమిదవ శతాబ్ది అంతమందు జరిగిన ఫ్రెంచి బూర్జువా విప్లవ కాలంలో విప్లవప్రతీఘాతానికి పుట్టిల్లు. విప్లవాత్మక ఫ్రాన్సుకు వ్యతిరేకంగా తమ పోరాటంలో విప్లవప్రతీఘాతకులు కేతలిక్ చర్చియొక్క ప్రబల ప్రభావంకింద వుండినట్టి వెండే ప్రాంతపు వెనుకబడిన రైతులను ఉపయోగించుకున్నారు. పుట 406.

156 "నోవయ జీజ్న్" ("నూతన జీవితం"), "వ్పెర్యోద్" "ముందుకు") — మెన్షెవిక్ పత్రికలు.

"దేలో నరోద" ("ప్రజల కార్యం") — సోషలిస్టు-రివల్యూషనరీ వార్తాపత్రిక. పుట 412.

157 చూ. కె. మార్క్స్, "గోతా కార్యక్రమ విమర్శ" ["Kritik des Gothaer Programms"]. పుట 417.

158 చూ. ఎఫ్. ఎంగెల్స్ 1875 మార్చి 18–28 న ఎ. బేబెల్ పేర రాసిన లేఖ. పుట 422.

159 ఎఫ్. ఎంగెల్స్ రాసిన "Von der Autorität" ["అధికారం గురించి"] అనే వ్యాసాన్ని వి.ఇ. లెనిన్ ఉదాహరించుతున్నాడు. పుట 426.

160 "మిత్రరాజ్య" దేశాలు లేక ఆంటాంట్ — జర్మనీ, ఆస్ట్రియా-హంగేరీ, ఇటలీల సామ్రాజ్యవాద త్రైరాజ్య మిత్రమండలికి ప్రతిగా 1907 లో అంతిమంగా రూపొందినట్టి ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యాల సామ్రాజ్యవాద కూటమి. మొదటి ప్రపంచ యుద్ధంలో (1914–1918) అమెరికా సంయుక్త రాష్ట్రాలు, జపాన్, ఇటలీ, ఇతర రాజ్యాలూ ఆంటాంట్తో చేరాయి. పుట 428.

161 మెన్‌షెవిక్‌లు, కాడెట్లు, సోషలిస్టు-రివల్యూషనరీలతో ఏర్పడిన ఒక విప్లవప్రతీఘాత గూఢచారి ఆర్గనైజేషనుచే పెట్రోగ్రాడ్‌ను వశపరచుటకు పన్నిన కుట్రను గురించి లెనిన్ ప్రస్తావించుతున్నాడు. విదేశ గూఢచారి సేవాశాఖల ఆదేశాలనుసరించి పని చేసినట్టి "జాతీయ కేంద్రం" అనే పేరుకల్గిన సంస్థ ఈ ఆర్గనైజేషన్ను నడిపింది. ఈ ఆర్గనైజేషను వేసిన పథకం ప్రకారం, 1919 జూన్ 13 న క్రాస్నయ గోర్కా కోటలో పితూరీ ప్రారంభమైంది.

తీర రక్షణ బలాలకు చెందిన సైనికులూ, బాల్టిక్ నావికాదళపు యుద్ధనౌకలూ పితూరీని అణచివేసేందుకు పంపబడ్డాయి. దాడి చేసిన సైనికబలాలు సముద్రంనుండీ భూమినుండీ కోటపై విజృంభించాయి. జూన్ 16 న సోవియట్ సైనికబలాలు కోటను ఆక్రమించుకున్నాయి. కుట్రను పన్నిన విప్లవప్రతీఘాతక ఆర్గనైజేషను వెలికి తీయబడి, నాశనం చేయబడింది. పుట 443.

162 బెర్న్ ఇంటర్నేషనల్ – 1919 ఫిబ్రవరిలో బెర్న్‌లో జరిగిన సోషల్-జాతీయ దురహంకారుల, మధ్యస్థ పార్టీల కాన్ఫరెన్స్‌లో రెండవ ఇంటర్నేషనల్ పునరుద్ధరించబడింది. పుట 445.

163 సడోవా యుద్ధం (సడోవా గ్రామం బొహీమియా దేశంలో క్యోనిగ్‌గ్రేట్జ్ నగరానికి సమీపంలో వుంది) 1866 జూలై 3 న జరిగింది; ప్రష్యాయొక్క నిష్కర్షయైన విజయంతోనూ, ఆస్ట్రియా ఓటమితోనూ అంతమైంది. ఆస్ట్రియా-ప్రష్యన్ యుద్ధం తుది ఫలితాన్ని ఇది నిర్ణయించింది. పుట 449.

164 బ్రెస్ట్-లితోవ్స్క్ శాంతి – సోవియట్ రష్యాకీ, జర్మనీ, ఆస్ట్రియా-హంగేరీ, టర్కీ, బల్గేరియాలకూ జరిగిన శాంతి సంధి. ఈ సంధిపై 1918 మార్చి 3 న బ్రెస్ట్-లితోవ్స్క్‌లో సంతకాలు జరిగాయి. ఈ సంధి షరతులు పట్టపగలు నిలువుదోపిడికంటె ఏ విధంగానూ తీసిపోవు; యువక సోవియట్ రిపబ్లిక్ తాత్కాలికంగా బలహీనస్థితిలో వుంది కదా అని చెప్పి, జర్మనీ రష్యాపై ఈ షరతులను విధించింది. జర్మనీలో 1918 నవంబరు విప్లవం తర్వాత ఈ సంధిని సోవియట్ ప్రభుత్వం రద్దుచేసింది. పుట 519.

165 "పోద్ జ్నామెనెమ్ మార్క్సిజ్మ" ("మార్క్సిజం పతాక కింద") – 1922 జనవరినుండి 1944 జూన్‌వరకు మాస్కోనుండి ప్రచురించబడిన తాత్విక, సామాజిక, ఆర్థిక మాసపత్రిక. పుట 521.

166 ''ఎకనమిస్ట్'' – ''రష్యన్ టెక్నికల్ సమాజం''వారి పరిశ్రమ, ఆర్థికశాస్త్ర శాఖ మాసపత్రిక, 1921–1922 లో పెట్రోగ్రాడ్‌నుండి ప్రచురించబడింది.

''రష్యన్ టెక్నికల్ సమాజం'' – 1866 నుండి పెట్రోగ్రాడ్‌లో మనుతూండిన విజ్ఞానశాస్త్రీయ సమాజం; దీనికి ఇతర నగరాలలో శాఖలు వుండేవి. ఈ సమాజం లక్ష్యాలు పరిశ్రమాభివృద్ధిని పెంపొందించడమూ, సాంకేతిక విజ్ఞానాన్ని వ్యాపింపజేయడమూనూ. ఇంజనీర్లూ, తర్ఫీదుపొందిన సాంకేతికులే కాకుండా, ఆఫీసు ఉద్యోగులు, న్యాయవాదులు, వర్తకులు, ఫ్యాక్టరీ యజమానులు వగైరాలు కూడా ఈ సమాజంలో సభ్యులుగా వుండేవారు. అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత ఈ సమాజ సభ్యులలో అనేకులు సోవియట్ ప్రభుత్వంపై శత్రుభావం కల్గి వుండేవారు. ఈ సమాజం 1929 లో మూసివేయబడింది. పుట 529.

# పేర్ల సూచి

కబ్లుకోవ్, నికొలాయ్ అలెక్సేయెవిచ్ (1849–1919)–రష్యన్ అర్థశాస్త్రజ్ఞుడు, గణాంకశాస్త్రవేత్త, లిబరల్ నరోదిజాన్ని సమర్థించాడు; తన రచనలలో ఇతడు సన్నకారు రైతు ఆర్థికవ్యవస్థ యొక్క "స్థిరత" అనే భావాన్ని విశదపరచి, రైతులలో విభేదీకరణను నివారించేందుకు సమర్థత కల్గినదిగా తాను భావించినట్టి గ్రామ ప్రజా సంఘాన్ని సమర్థించాడు. –170.

కమిషాన్స్కి, పి.కె. – సెయింట్ పీటర్స్‌బర్గ పట్టణ న్యాయస్థానపు ప్రాక్యురేటర్; రెండవ స్టేట్ దూమలోని సోషల్-డెమోక్రాటిక్ గ్రూప్‌పై జరిగిన కేసు విచారణలో ప్రాసిక్యూటర్; 1910 లో వియాత్కా గుబేర్నియా గవర్నర్.–227.

కరవూలొవ్, మిహాయీల్ అలెక్సాంద్రొవిచ్ (1878–1917)–రెండవ, నాల్గవ స్టేట్ దూమలలో ప్రతినిధి, రాజరికవాది; అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత తేరెక్ ప్రాంతంలోని విప్లవప్రతీఘాత నాయకులలో ఒకడు.–287.

కాంట్, ఇమ్మాన్యుఎల్ (1724–1804)–ప్రఖ్యాత జర్మన్ తత్త్వవేత్త, పద్దెనిమిదవ శతాబ్ది చరమమూ పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమందలి జర్మన్ భావవాదానికి మూలపురుషుడు.–14, 237, 247, 249, 319.

కాంప్‌హౌసెన్, లూడొల్ఫ్ (1803–1890)–1848 లో ప్రష్యన్ ప్రధానమంత్రి, లిబరల్ బూర్జువావర్గ నాయకుడు, అభివృద్ధి నిరోధకంతో ఒప్పదంపు ద్రోహ విధానాన్ని జరిపించాడు. –166, 168, 169.

కానిట్జ్, ఔగుస్ట్ (1783–1852) –ప్రష్యన్ జనరల్, అభివృద్ధి నిరోధక కులీనవర్గమూ బ్యూరోక్రసీల ప్రతినిధి; కాంప్‌హౌసెన్ మంత్రివర్గంలో 1848 మే–జూన్‌లలో యుద్ధ మంత్రి.–169.

కారుస్, పాల్ (1852–1919) –అమెరికన్ తత్వశాస్త్రజ్ఞుడు; స్వకీయగతాత్మక భావవాది, మర్మవాదీ, విజ్ఞానశాస్త్రంతో మతానికి సామరస్యం కుదిర్చేందుకు ప్రయత్నించాడు, బౌద్ధమతాన్ని ప్రచారంచేశాడు.–256.

కార్నీలియస్, హాన్స్ (1863–1947) –జర్మన్ బూర్జువా తత్వశాస్త్రజ్ఞుడు, స్వకీయగతాత్మక భావవాది; ఇమ్మనెంటిస్టు నవీన తత్వశాస్త్రంతోనూ ప్రాగ్మటిజంతోనూ మాఖిజాన్ని శేషపూరణం చేయనుద్దేశించాడు; మాఖిజం, నవీన-పోసిటివిజం, ఈ రెంటి మధ్య మధ్యవర్తి పాత్రను ప్రధానంగా నిర్వర్తించాడు. –256.

కాబె, ఇటియేన్ (1788–1856) –ఫ్రెంచి పత్రికావ్యాసకర్త, శాంతియుత

సెక్టేరియన్ పొరపాట్లు చేశాడు. మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు ఇతడు సోషల్-జాతీయ దురహంకార స్థానం తీసుకుని, ఫ్రాన్సు దేశపు బూర్జువా ప్రభుత్వంలో ప్రవేశించాడు. –243.

గేర్త్సెన్, అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ (1812–1870) – మహనీయ రష్యన్ విప్లవాత్మక ప్రజాస్వామ్యవాది, భౌతికవాద తత్వవేత్త, రచయిత, పత్రికావ్యాసకర్త. –129.

గేర్త్సెన్‌స్టయిన్, మిహయీల్ యాకొవ్‌లెవిచ్ (1859–1906) – రష్యన్ అర్థశాస్త్రజ్ఞుడూ కాడెట్ పార్టీ నాయకుడూ, ఈ పార్టీ వ్యవసాయక సమస్యపై సిద్ధాంతకర్త.–170.

గ్రావ్, జీన్ (1854–1939) – ఫ్రెంచి పెట్టీబూర్జువా సోషలిస్టు, అరాజకవాద సిద్ధాంతకర్తలలో ఒకడు; మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో (1914–1918) సోషల్-జాతీయ దురహంకారి.–392.

గ్రిమ్, రోబెర్ట్ (1881–1958) – స్విట్జర్లాండ్ సోషల్-డెమొక్రాటిక్ పార్టీ నాయకులలో ఒకడు; మొదటి ప్రపంచయుద్ధకాలంలో మధ్యస్థస్థానం తీసుకున్నాడు; మధ్యస్థస్థాన (II½) ఇంటర్నేషనల్ అగ్గనైజర్లలో ఒకడు. –354.

గ్ర్యూన్, కారల్ (1817–1887) – జర్మన్ పెట్టీబూర్జువా పత్రికావ్యాసకర్త, 1840 ల మధ్య కాలంలోని "వాస్తవిక సోషలిజం" ప్రముఖ ప్రతినిధులలో ఒకడు.–64, 65, 66, 246, 247.

గ్ర్యూన్‌బెర్గ్, కారల్ (1861–1940) – ఆస్ట్రియన్ సోషల్-డెమొక్రాట్, న్యాయవాది, అర్థశాస్త్రజ్ఞుడు, చరిత్రకారుడు. 1911 నుండి 1929 వరకు ఇతడు "Archiv für die Geschichte des Sozialismus und der Arbeiterbewegung" ["సోషలిజం, కార్మికోద్యమ చరిత్రల పురాతన గ్రంథభాండారం"] అనే 14 సంపుటాల గ్రంథాన్ని లైప్జిగ్ నుండి ప్రచురించాడు.–326.

గ్లాడ్‌స్టన్, విలియం ఎవర్ట్ (1809–1898) – ఇంగ్లీషు రాజ్యధురంధరుడూ రాజకీయవేత్త, లిబరల్ పార్టీ నాయకుడు. 1868–1874 లోనూ అటుతర్వాతి సంవత్సరాల్లోనూ ఇతడు ప్రధానమంత్రిగానూ, అనేక లిబరల్ మంత్రిమండలలో సభ్యుడుగానూ వున్నాడు. వలసదేశాల దిగ్విజయ విధానాన్ని ఇతడు కొనసాగించాడు.–305.

గ్వొజ్‌దేవ్, కుజ్‌మా అన్‌తోనొవిచ్ (జననం: 1883) – మెన్‌షెవిక్ లిక్విడేటర్; మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ఇతడు సోషల్-జాతీయ దుర

యుద్ధంలో ఉన్నత అధిష్ఠానవర్గ పదవులను ఆక్రమించాడు; 1918 ఏప్రిల్‌నుండి ఆంటాంట్ సాయుధబలాల సేనాని.—449.

బకూనిన్, మిహాయీల్ అలెక్సాంద్రొవిచ్ (1814–1876) — రష్యన్ విప్లవ కారుడు; నరోదిజం, అరాజకవాదాల భావ శాస్త్రవేత్త, మొదటి ఇంటర్నేషనల్‌లో మార్క్సిజంపట్ల బద్ధవైరి, తన చీలదీత క్రియాపాలకుగాను 1872 హేగ్ కాంగ్రెస్‌లో ఇంటర్నేషనల్‌నుండి వెళ్ల గొట్టబడ్డాడు.—11, 130, 209, 218, 236.

బజారొవ్, వి. (రూద్నెవ్, వ్లదీమిర్ అలెక్సాంద్రొవిచ్) (1874–1939) — రష్యన్ తత్వవేత్త, అర్థశాస్త్రజ్ఞుడు; 1896 నుండి సోషల్-డెమొక్రాటిక్ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు; 1907–1910 అభివృద్ధి నిరోధక కాలంలో బోల్షెవిజంనుండి విడిపోయి, మార్క్సిస్టు తత్వశాస్త్రానికి ఒక మాఖ్ పంథా రివిజనిజాన్ని ప్రతిపాదించాడు. తన జీవితం చరమ సంవత్సరాలలో కల్పనా రచనలనూ, తాత్విక గ్రంథాలనూ అనువదించాడు.—238, 256.

బర్న్స్, జాన్ (1858–1943)— ఇంగ్లీషు రాజకీయవేత్త, మొదట్లో కార్మి కుడు. 1880 లలోని ట్రేడ్‌యూని యన్ నాయకులలో ఇతడు ఒకడు. 1892 లో పార్లమెంటుకు ఎన్నుకో బడ్డాడు; కార్మికవర్గ ప్రయోజనాలకు ద్రోహంచేసి, పెట్టుబడిదార్లతో సహ కారాన్ని గట్టిగా సమర్థించాడు. 1905 నుండి 1914 వరకు బూర్జువా ప్రభుత్వంలో మంత్రి పదవిని ఆక్ర మించాడు. అటుతర్వాత రాజకీయాలలో ఎటువంటి క్రియాశీల పాత్రనూ నిర్వ ర్తించలేదు.—216.

బార్క్లీ, జార్జ్ (1685–1753) — ఇంగ్లీషు తత్వవేత్త, స్వకీయగతాత్మక భావవాదపు ప్రముఖ ప్రతినిధి.—238, 319.

బిస్మార్క్, ఒట్టో (1815–1898) — రాజ్యధురంధరుడు, ప్రష్యా జర్మనీల రాజనీతివేత్త.

1862 లో ఇతడు ప్రష్యన్ మినిస్టర్ ప్రెసిడెంట్ (ప్రధానమంత్రి)గానూ విదేశాంగ మంత్రిగానూ నియమించ బడ్డాడు. జర్మన్ సామ్రాజ్యపు ప్రథమ చాన్సలర్ (1871–1890). ప్రష్యా నాయకత్వంకింద బలప్రయోగంతో జర్మనీ ఏకీకరణాన్ని సాధించాడు. సోషలిస్టు వ్యతిరేక చట్టానికి (1878–1890) కారకుడు.—9, 46, 103, 218, 260, 261, 269, 293, 302.

బిస్సొలాతి, లియోనిడ (1857–1920) — ఇటాలియన్ సోషలిస్టు పార్టీ స్థాపకులలో ఒకడూ, ఆ పార్టీ కుడి పక్షం నాయకుడూనూ; మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో సోషల్-జాతీయ దుర

— రష్యన్ సోషల్-డెమొక్రాట్, మెన్షెవిక్. 1905–1907 విప్లవం ఓటమి తర్వాత లిక్విడేషనిజాన్ని క్రియాశీలంగా బలపరచిన వారిలో ఒకడు. 1917 ఆగస్టులో బోల్షెవిక్ పార్టీలో చేరాడు, అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత అనేక సోవియట్, ఆర్థిక సంస్థలలో పనిచేశాడు. —202, 289–298.

లాసాల్, ఫెర్డినాండ్ (1825–1864) — జర్మన్ పెట్టీబూర్జువా సోషలిస్టు, జనరల్, జర్మన్ వర్కర్స్ ఎసోసియేషన్ (1863) స్థాపకులలో ఒకడు. ఈ ఎసోసియేషన్ స్థాపన కార్మికవర్గ ఉద్యమంలో ఒక ముఖ్యమైన ఘటన; అయినప్పటికీ ఈ ఎసోసియేషన్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన తర్వాత, సంఘాన్ని లాసాల్ అవకాశవాద మార్గంలో నడిపించాడు. లాసాల్‌యొక్క సైద్ధాంతిక, రాజకీయ అభిప్రాయాలను మార్క్స్, ఎంగెల్స్‌లు నిశితంగా విమర్శించారు.—11, 45, 46, 59, 109, 110, 146, 205, 315, 376, 377, 385, 387.

లిక్నేర్, అన్‌తోన్ (జననం: 1848) — ఆస్ట్రియన్ అభివృద్ధి నిరోధక తత్వశాస్త్రజ్ఞుడు, స్వకీయాగతాత్మక భావవాది, ఇమ్మనెంటిస్టుపంథా ప్రతినిధి, ఫిడెయిజం యోధుడు.—257.

లీబ్‌క్నెఖ్ట్, విల్‌హెల్మ్ (1826–1900) — జర్మన్, అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమంలో ప్రముఖ వ్యక్తి, జర్మన్ సోషల్-డెమొక్రాటిక్ పార్టీ స్థాపకులలోనూ నాయకులలోనూ ఒకడు. 1875 మొదలు తన మరణం వరకూ ఈ పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యుడూ, పార్టీ కేంద్ర పత్రిక “Vorwärts” [“ఫోర్‌వేర్ట్స్”] ప్రధాన సంపాదకుడు, మొదటి ఇంటర్నేషనల్ కార్యకలాపంలోనూ, రెండవ ఇంటర్నేషనల్ స్థాపనలోనూ లీబ్‌క్నెఖ్ట్ క్రియాశీలంగా పనిచేశాడు.—46, 59, 94, 206, 209, 210, 215, 294.

లుక్సెంబుర్గ్, రోజా (1871–1919) — జర్మన్, పోలిష్ కార్మికవర్గ ఉద్యమంలోనూ, రెండవ ఇంటర్నేషనల్‌లోనూ ప్రముఖ వ్యక్తి, జర్మన్ కమ్యూనిస్టు పార్టీ స్థాపకులలో ఈమె ఒకరు.—300, 355, 426.

లునచార్‌స్కి, అనతోలి వసీల్యెవిచ్ (1875–1933) — వృత్తి విప్లవకారుడు; తదుపరి ప్రముఖ సోవియట్ రాజ్య ధురంధరుడు.

ఆర్. ఎస్. డి. ఎల్. పి రెండవ కాంగ్రెస్ (1903) తర్వాత బోల్షెవిక్‌లలో చేరాడు. అభివృద్ధి నిరోధక సంవత్సరాలలో (1907–1910) మార్క్సిజాన్ని వదిలిపెట్టి, పార్టీవ్యతిరేక “వ్పెర్యోద్” గ్రూపులో పాల్గొని, మార్క్సిజాన్నీ మతాన్నీ మిళితంచేయడానికి పిలుపు ఇచ్చాడు. లునచార్‌స్కియొక్క పొరపాటు

విప్లవోద్యమంలో చేరాడు; 1901 లో "ఇస్క్రా" అర్గనైజేషనులో చేరాడు; ఆర్. ఎస్.డి.ఎల్.పి రెండవ కాంగ్రెస్‌లో (1903) సెంట్రల్ కమిటీకి, పార్టీ కౌన్సిల్‌కీ ఎన్నుకోబడ్డాడు. అక్టోబరు విప్లవం తర్వాత ప్రభుత్వంలోనూ, పార్టీ వ్యవస్థలోనూ అనేక బాధ్యతాయుత స్థానాలు ఆక్రమించాడు.–150.

వాండెర్‌వెల్డ్, ఏమిల్ (1866–1938) – బెల్జియన్ వర్కర్స్ పార్టీ నాయకుడు, రెండవ సోషలిస్టు ఇంటర్నేషనల్‌యొక్క ఇంటర్నేషనల్ సోషలిస్టు బ్యూరో అధ్యక్షుడు, తీవ్ర అవకాశవాది. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో సోషల్-జాతీయ దురహంకారి, బూర్జువా ప్రభుత్వంలో సభ్యుడు.–243.

వార్డ్, జేమ్స్ (1843–1925) – ఇంగ్లీషు మనశ్శాస్త్రజ్ఞుడూ, స్వకీయగతాత్మక తత్వవేత్త, ఆధ్యాత్మికవాది.–253, 255, 257.

వి. ఐ.—న్ (ఇవాన్‌షిన్, వ్లదీమిర్ పావ్లొవిచ్) (1869–1904) – రష్యన్ సోషల్-డెమోక్రాట్, "అర్థికవాది," "రబోచెయె దేలో" పత్రిక సంపాదకవర్గ సభ్యుడు, ఈ పత్రికకు వ్యాసరచయిత; ఆర్. ఎస్. డి. ఎల్. పి రెండవ కాంగ్రెసు (1903) తర్వాత మెన్‌షెవిక్ అయాడు.–139.

విప్పెర్, రొబెర్ట్ యూర్యెవిచ్ (1859–1954) – సోవియట్ చరిత్రకారుడు, విజ్ఞానశాస్త్ర పరిషత్తు సభ్యుడు. ఇతని గ్రంథాలలో విస్తృతమైన వాస్తవాంశ సామగ్రి వుంది, కాని గ్రంథకర్త పొరపాటు అభిప్రాయాల కారణంగా గ్రంథాల విలువ తగ్గిపోతూంది.–525.

విల్‌హెల్మ్ II (1859–1941)–జర్మన్ చక్రవర్తి, ప్రష్యా రాజు (1888–1918).–331.

విల్లిఖ్, ఔగుస్ట్ (1810–1878) – ప్రష్యన్ ఆఫీసర్, కమ్యూనిస్టు లీగ్ సభ్యుడు, 1849 బాడెన్ తిరుగుబాటులో పాల్గొన్నాడు; 1850 లో కమ్యూనిస్టు లీగ్‌నుండి చీలిపోయినట్టి సెక్టేరియన్ దుందుడుకు గ్రూపు నాయకులలో ఒకడు.–45.

విల్సన్, వుడ్రో (1856–1924) – అమెరికన్ రాజ్య ధురంధరుడు, అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు (1913–1921), ఆ దేశపు కార్మిక వర్గ ఉద్యమాన్ని క్రూరంగా అణచివేశాడు; సోవియట్ వ్యతిరేక సాయుధ వ్యవధాన ప్రారంభకులలోనూ అర్గనైజర్లలోనూ ఒకడు.–428, 429.

వి.వి. (వొరొన్‌త్సోవ్, వసీలి పావ్లొవిచ్) (1847–1918) – రష్యన్ అర్థశాస్త్రజ్ఞుడు, పత్రికావ్యాసకర్త 1880 ల, 1890 ల లిబరల్ నరోదిజం

తాత్మక భావవాది, ఇమ్మనెంట్ అని పిలువబడిన తాత్విక పంథాకు నాయకుడు. –257.

షుల్జె-డెలిట్ష్, హెర్మన్ (1808–1883) – జర్మన్ బూర్జువా అర్థశాస్త్రజ్ఞుడూ రాజకీయవేత్త, 1860 లలో బూర్జువా ప్రోగ్రెసిస్ట్‌ల పార్టీ నాయకులలో ఒకడు, సహకార సంఘాలను నెలకొల్పడం మూలంగా విప్లవ పోరాటంనుండి కార్మికులను మళ్లించేందుకు ప్రయత్నించాడు.–146.

షూబెర్ట్-సోల్డెర్న్, రిఖార్డ్ (1852–1935) – జర్మన్ తత్వశాస్త్రజ్ఞుడు, ఇమ్మనెంట్ తత్వశాస్త్ర పంథా ప్రతినిధి. –257.

షెల్లింగ్, ఫ్రీడ్రిఖ్ విల్‌హెల్మ్ (1775–1854) – జర్మన్ సాంప్రదాయక తత్వశాస్త్రపు ప్రతినిధి, బాహ్యగతాత్మక భావవాది; అటుతర్వాత విజ్ఞానశాస్త్రానికి బహిరంగ శత్రువూ, మత సమర్థకుడూనూ.–246.

షేర్, వి.వి. (జననం: 1883) – రష్యన్ సోషల్-డెమోక్రాట్, మెన్‌షెవిక్. –460.

షైడెమన్, ఫిలిప్ప్ (1865–1939) – జర్మన్ సోషల్-డెమోక్రసీలో తీవ్ర కుడి పక్ష నాయకులలో ఒకడు; మొదటి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధకాలంలో సోషల్-జాతీయ దురహంకారి; 1919 ఫిబ్రవరి–జూన్‌లో బూర్జువా జర్మన్ ప్రభుత్వానికి నాయకుడు; జర్మన్ కార్మికవర్గ ఉద్యమాన్ని 1918–1921 లో క్రూరమైన అణచివేతను అర్గనైజుచేసినవారిలో ఒకడు.–350, 351, 429, 433, 436.

ష్రామ్, కారల్ ఔగుస్ట్ – జర్మన్ సోషల్-డెమోక్రాట్, రిఫార్మిస్టు, మార్క్సిజాన్ని విమర్శించాడు; 1880 లలో పార్టీని విడిచిపెట్టేశాడు.–206–208.

ష్వెగ్లర్, ఆల్‌బెర్ట్ (1819–1857) – జర్మన్ మతశాస్త్రవేత్త, తత్వశాస్త్రజ్ఞుడు, భాషాశాస్త్రజ్ఞుడు, చరిత్రకారుడూనూ.–317.

ష్వెరీన్, మాక్సిమీలియన్ (1804–1872) – ప్రష్యన్ రాజకీయవేత్త, అభివృద్ధి నిరోధక కులీనవర్గ, ఉద్యోగివర్గాల ప్రతినిధి, కాంప్‌హౌసెన్ మంత్రివర్గంలో 1848 లో ప్రవేశించాడు. –169.

ష్వైట్జర్, యోహాన్ బాప్టిస్ట్ (1833–1875) – జర్మనీలో లాసాలియన్ల నాయకులలో ఒకడు, జనరల్ జర్మన్ వర్కర్స్ ఎసోసియేషన్‌కు లాసాల్ తర్వాత అధ్యక్షుడయాడు; ప్రష్యన్ యుంకర్ల నాయకత్వం కింద బిస్మార్క్ యొక్క జర్మనీ ఏకీకరణ విధానాన్ని బలపరచాడు.–59.

సల్తికోవ్-శ్చెద్రీన్, మిహాయిల్ ఎవ్‌గ్రాఫొవిచ్ (1826–1889) – ప్రఖ్యాత రష్యన్ వ్యంగ్య రచయిత, విప్లవాత్మక ప్రజా స్వామ్యవాది.–529.

సిస్‌మొండి, జీన్-షార్ల్-లేనార్ సిమోన్‌డ్ డి (1773–1842) – స్విస్ అర్థశాస్త్రజ్ఞుడు, పెట్టుబడిదారీ విధానాన్ని పెట్టీ బూర్జువా పద్ధతిలో విమర్శించాడు. –337.

సుర్‌కోవ్, ప్యోత్ర్ ఇల్యీచ్ (1876–1946) – రష్యన్ సోషల్-డెమోక్రాట్,బోల్‌షెవిక్, మూడవ దూమకు కొస్త్రోమా గుబేర్నియానుండి ఎన్నుకొన బడిన సభ్యుడు.–259, 270.

సుహానొవ్, ఎన్. (గిమ్మెర్, నికొలాయ్ నికొలాయెవిచ్) (జననం: 1882) – రష్యన్ అర్థశాస్త్రజ్ఞుడూ, పెట్టీ బూర్జువా తరహా పత్రికావ్యాసకర్త, మెన్‌షెవిక్; అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత సోవియట్ ఆర్థిక సంస్థలలోనూ ఆర్గనైజేషన్లలోనూ పనిచేశాడు; 1931 లో అజ్ఞాతవాస మెన్‌షెవిక్ ఆర్గనైజేషను నాయకుడనే నేరంపైన శిక్షించ బడ్డాడు.–518, 519.

సెయింట్-సిమోన్, క్లాడ్-ఆన్రీ (1760–1825) – మహనీయ ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు.–131.

సొరోకిన్, పితిరీమ్ అలెక్సాండ్రొవిచ్ (జననం: 1889) – రష్యన్ బూర్జువా సోషలిస్టు, సోషలిస్టు-రివల్యూషనరీ; 1922 వరకు పెట్రోగ్రాడ్ యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్; 1922 లో విదేశాలకు వలసవెళ్లిపోయాడు; 1930 నుండి హార్వర్డ్ యూనివర్సిటీలో సాంఘికశాస్త్రం ప్రొఫెసర్.–529, 531.

సొంబార్ట్, వెర్నర్ (1863–1941) – జర్మన్ అపభ్రంశపు బూర్జువా అర్థశాస్త్రజ్ఞుడు, జర్మన్ సామ్రాజ్యవాదపు ప్రఖ్యాత భావశాస్త్రవేత్త. తన వృత్తి జీవితం ప్రారంభంలో ఇతడు ''సోషల్-లిబరలిజం'' సిద్ధాంతకర్తలలో ఒకడుగా వుండేవాడు, తదుపరి మార్క్సిజానికి బహిరంగ శత్రువయాడు, పెట్టుబడిదారీ విధానాన్ని అపశ్రుతులులేని ఇంపైన ఆర్థిక వ్యవస్థగా వర్ణించాడు.–194, 226.

సొర్గె,ఫ్రీడ్రిఖ్ (1828–1906)–జర్మన్ సోషలిస్టు, అమెరికన్, అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమంలోనూ సోషలిస్టు ఉద్యమంలోనూ ప్రముఖ వ్యక్తి, మొదటి ఇంటర్నేషనల్‌లో చురుకైన సభ్యులలో ఒకడు; మార్క్స్ ఎంగెల్స్‌ల మిత్రుడూ, సహయోధుడూ.–47, 60, 200, 201, 203, 206, 208, 343.

స్కొబెలెవ్, మత్వేయ్ ఇవానొవిచ్ (1885–1939) – మెన్‌షెవిక్, 1912 లో నాల్గవ స్టేట్ దూమ సభ్యుడు; మొదటి

ప్రపంచ యుద్ధకాలంలో సోషల్-జాతీయ దురహంకారి.—348.

స్టయిన్, లోరెన్జ్ (1815–1890) —జర్మన్ బూర్జువా రాజ్యాంగసిద్ధాంత వేత్త, అపభ్రంశపు అర్థశాస్త్రజ్ఞుడు. ''వర్గాతీత'' ఏకరాజాధిపత్యమనే హేగెల్ ప్రతిపాదిత సనాతన భావవాద సిద్ధాంతాన్ని ఇతడు అనుసరించుతూ, తన ప్రపంచ దృక్పథంలో ఇతడు భావవాదాన్నీ భౌతిక వాదాన్నీ వరణతత్వానుసారంగా మిళితం చేశాడు; సాంఘిక, రాజకీయ జీవితాన్ని విశ్లేషించుటలో భావవాద గతితర్కాన్ని ప్రయుక్తంచేశాడు; తన స్వభావాన్ని అను సరించి ఇతడు బూర్జువావ్యవస్థకై క్షమార్థి.—18.

స్టర్లింగ్, జేమ్స్ (1820–1909) —స్కాట్లండ్ దేశపు తత్వశాస్త్రవేత్త, హేగెల్ తదితరులను గురించి పుస్తకాలు రచించాడు.—60.

స్టిర్‌నర్, మాక్స్ (ష్మిడ్ట్, యోహాన్ కాస్పర్ పెట్టుకున్న మారుపేరు) (1806–1856)—జర్మన్ తత్వ శాస్త్రజ్ఞుడు, బూర్జువా వ్యక్తివాదమూ, అరాజకవాదముల సిద్ధాంతకర్త—302.

స్టైక్‌లోవ్, వై. ఎమ్. (1873–1941) —రష్యన్ సోషల్-డెమోక్రాట్, ఆర్. ఎస్. డి. ఎల్. పి రెండవ కాంగ్రెస్ (1903) తర్వాత బోల్‌షెవిక్‌లతో చేరాడు; 1917 ఫిబ్రవరి బూర్జువా ప్రజాస్వామిక విప్లవం తర్వాత ''మాతృ దేశ విప్లవాత్మక రక్షణ''ను సమర్థించాడు; తదుపరి బోల్‌షెవిక్‌లలో చేరాడు.— 366, 370.

స్తొలీపిన్, ప్యోత్ర్ అర్కాద్‌యెవిచ్ (1862– –1911) జారిస్టు రష్యాలో రాజ్య ధురంధరుడు, బడా భూస్వామి; మంత్రి సభ అధ్యక్షుడూ, అంతరంగిక వ్యవహారాల మంత్రి (1906–1911); విప్లవోద్య మాన్ని కాలరాసేందుకు తీవ్ర అభివృద్ధి నిరోధకాన్ని స్థాపించాడు(1907–1910 కాలపు స్తొలీపిన్ అభివృద్ధి నిరోధకం). –294, 295, 298, 299.

స్పార్టకస్ (మరణం: క్రీ.పూ. 71)—రోమన్ గ్లాడియేటర్ (ప్రాచీన ఖడ్గ యోధుడు), ప్రాచీన రోమ్‌లో జరిగిన బానిస విప్ల వాలలోకల్లా పెద్ద విప్లవానికి (క్రీ. పూ. 73–71) నాయకుడు.—474.

స్పినోజ, బారుఖ్ (1632–1677) —ప్రముఖ డచ్ భౌతికవాద తత్వ వేత్త, నిరీశ్వరవాది.—319.

స్పెక్టేటర్ (నహిమ్‌సోన్, ఎమ్. ఐ.) (జననం: 1880)—రష్యన్ అర్థశాస్త్ర జ్ఞుడూ, పత్రికావ్యాసకర్త, 1899–1921 వరకు బుందిస్ట్; ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధకాలంలో మధ్యస్థవాది; ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై ఒక గ్రంథ పరం పరను రచించాడు.—338.

యన్న స్థాపకులలో ఒకడు. తన రచనలలో ఇతడు శ్రామికవర్గంయొక్క విప్లవాత్మకపు ఎత్తుగడలపై దాడిచేసి, రిఫార్మిజాన్ని బోధించాడు.—141, 147, 206.

హిల్‌క్విట్, మోరిస్ (1869–1933) — అమెరికన్ సోషలిస్టు; మొదట్లో ఇతడు మార్క్సిజాన్ని అనుసరించాడు, తర్వాత రిఫార్మిజంలోకీ అవకాశవాదంలోకీ దిగజారిపోయాడు; రిఫార్మిస్టు స్వభావంకల్గిన సోషలిస్టు పార్టీని అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో స్థాపించినవారిలో ఒకడు (స్థాపన: 1901).—200.

హిల్‌ఫెర్‌డింగ్, రూడాల్ఫ (1877–1941) — జర్మన్ సోషల్-డెమోక్రసీ యొక్క, రెండవ ఇంటర్నేషనల్‌యొక్క అవకాశవాద నాయకులలో ఒకడు. 1910 లో ఇతడు "ఫైనాన్స్ పెట్టుబడి" అనే తన గ్రంథాన్ని ప్రచురించాడు; ఈ గ్రంథంలో గుత్త పెట్టుబడిదారీ విధాన అధ్యయనానికి ఇతోధికంగా సహాయపడుతుంది; అయినప్పటికీ ప్రమాదకరములైన సైద్ధాంతిక హేత్వాభావాలూ, అవకాశవాద భావాలూ అందులో లేకపోలేదు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో హిల్‌ఫెర్‌డింగ్ సెంట్రిస్టు, సోషల్-సామ్రాజ్యవాదులతో ఐక్యతకు పిలుపు ఇచ్చాడు. యుద్ధం తర్వాత ఇతడు తన "ఆర్గనైజ్డ్ పెట్టుబడిదారీ విధానం" అనే సిద్ధాంతాన్ని రూపొందించాడు. 1917 నుండి ఇతడు జర్మన్ ఇండిపెండెంట్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీకి నాయకుడు, సోవియట్ యూనియన్‌కీ, శ్రామికవర్గ నియంతృత్వానికీ బద్ధవైరి.—338, 341, 436, 437.

హెండర్‌సన్, ఆర్థర్ (1863–1935) — ఇంగ్లండులోని లేబర్ పార్టీ, ట్రేడ్ యూనియన్ ఉద్యమం నాయకులలో ఒకడు; మొదటి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధకాలంలో సోషల్-జాతీయ దురహంకారి; అనేక ఇంగ్లీషు ప్రభుత్వాలలో సభ్యుడు.—350.

హెరాక్లిటస్ ఆఫ్ ఎఫీసస్ (సుమారు క్రీ.పూ. 530–470) — ప్రాచీన గ్రీసు దేశపు భౌతికవాద తత్వవేత్త, ప్రాచీన గతితర్కం స్థాపకుడు.—315, 319.

హేగెల్, గియోర్గ్ విల్‌హెల్మ్ ఫ్రీడ్రిఖ్ (1770–1831)—సుప్రసిద్ధ జర్మన్ తత్వవేత్త, భౌతికగతాత్మక భావవాది, జర్మన్ బూర్జువావర్గపు భావశాస్త్రవేత్త. హేగెల్ చేసిన చారిత్రక సేవ గతితార్కిక భౌతికవాదానికి సైద్ధాంతిక మూలాధారంగా ఉపయోగపడిన గతితర్కానికి ఇతడిచ్చిన ప్రగాఢ, సమగ్ర విపులీకరణ. —7, 13–17, 50,51, 71, 130, 152, 236, 237, 247, 249, 315, 317, 318, 528.

హేల్స్, జాన్ (జననం: 1839) — ఇంగ్లీషు ట్రేడ్‌యూనియన్ నాయకుడు, ఇంటర్నేషనల్‌యొక్క బ్రిటిష్ ఫెడరల్ కౌన్సిల్

# లెనిన్‌చే ఉదాహరించబడిన మార్క్స్, ఎంగెల్స్ రచనల సూచి

# ఆకారాది విషయసూచి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B121 |
| పుస్తకం పేరు | మార్క్సెంగెల్స్ మార్క్సిజం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 631 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, A.2, 48B, bci |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | ethasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |